

బమ్మెరపోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

సరళవ్యాఖ్యానసహితం





సంపుటం 5
8,9 స్కంధములు



తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

## సరళ వ్యాఖ్యానసహితం

### ఐదవ సంపుటము

### 8, 9 స్కంధములు


వ్యాఖ్యాతలు

డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద

శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు

డా॥ డి. మీరాస్వామి

శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం

ప్రధాన సంపాదకులు

డా॥ సముద్రాల లక్ష్మణయ్య






తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

2017

**Bammera Potanamatya Praneeta**
**SRI MAHABHAGAVATAMU, with Commentary**
**Volume - V (Skandhas - 8 & 9)**

*Author :* **Potana Mahakavi**

*Commentary by*
**Dr. H.S. Brahmananda *(Skandha - 8)***
**Sri Vaidyam Venkateswaracharyulu *(Skandha - 8)***
**Dr. D. Meeraswamy *(Skandha - 9)***
**Sri Kota Venkata Lakshminarasimham *(Skandha - 9)***

*Edited by*
**Dr. Samudrala Lakshmanaiah**



T.T.D. Religious Publications Series No. 1241

*First Edition :* 2017

*Copies :* 3000

*Published by*
**Dr. D. Sambasiva Rao, I.A.S.,**
Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati.

*D.T.P.*
Publications Division
T.T.D., Tirupati.

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press
Tirupati - 517 507

# ముందుమాట

**భా**రతీయ సనాతన వాఙ్మయంలో అద్భుతమైన ఆధ్యాత్మిక గ్రంథాలు చాలా ఉన్నాయి. అందులో అమూల్యమైన రత్నాల్లాగా శ్రీమద్రామాయణ, శ్రీ మహాభారత, శ్రీమద్భాగవత గ్రంథాలు సంస్కృత వాఙ్మయ ప్రపంచంలో ప్రకాశిస్తున్నాయి.

వాటిల్లో శ్రీమద్రామాయణ మహాకావ్యం ఆదికవి వాల్మీకి మహర్షి ప్రణీతం. కాగా ఇక మిగిలిన భారత భాగవత గ్రంథాలు రెండూ కృష్ణద్వైపాయనుడైన శ్రీవ్యాసమహర్షి రచించినవి.

తి.తి.దేవస్థానం ధార్మిక సాహిత్య ప్రచురణలో భాగంగా ఇప్పటికే సంస్కృత శ్రీమద్రామాయణ కావ్యాన్నీ, తెలుగు కవిత్రయ మహాభారత కావ్యాన్నీ సవ్యాఖ్యానంగా ప్రచురించింది.

అదే వరుసలో పోతన మహాకవి రచించిన తెలుగు భాగవతకావ్యాన్ని కూడా తెలుగువారికి అందించాలన్న సదాశయంతో ప్రముఖ పండితులు డా॥ కరుణశ్రీ గారి ప్రధాన సంపాదకత్వంలో సరళమైన తాత్పర్యంతో పోతన భాగవతగ్రంథాన్ని ఐదుసంపుటాలుగా దేవస్థానం అందించింది. ఈ గ్రంథం పాఠకుల విశేషాదరణకు పాత్రమై పలు ముద్రణలను పొందింది.

ఆ తర్వాత కొందరు పండితుల సలహామేరకు, పాఠకుల అభ్యర్థనలమేరకు, 'కవిత్రయ భారతం' మాదిరిగానే పోతన మహాకవి భాగవతాన్ని కూడా అందరికీ సులభంగా అర్థం అయ్యేట్లు సరళమైనశైలిలో వ్యాఖ్యానాన్ని అందించాలనే లక్ష్యంతో దేవస్థానం ఆ కార్యక్రమాన్ని చేపట్టింది.

ప్రస్తుతం బమ్మెర పోతనగారి భాగవత గ్రంథం, ముప్పైమూడు మంది పండితులు సరళవ్యాఖ్యానాన్ని అందించగా ప్రముఖ సాహితీవేత్తలు డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారి ప్రధానసంపాదకత్వంలో తయారయ్యింది. ఈ వ్యాఖ్యానగ్రంథం తయారీలో కృషిచేసిన దేవస్థానం ప్రచురణల విభాగం ప్రత్యేకాధికారి మరియు పోతన భాగవత వ్యాఖ్యాన పర్యవేక్షకులు, సమన్వయకర్త శ్రీ ప్రయాగ రామకృష్ణ గారికీ, వారి సహాయకులు, ఉపసంపాదకులు డా॥ నొస్సం నరసింహాచార్య గారికీ, ఈ పోతన భాగవత వ్యాఖ్యానగ్రంథ ప్రధాన సంపాదకులు డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారికీ, వ్యాఖ్యాతలకూ, సంపాదకమండలి సభ్యులకూ, సహాయసహకారాలందించినవారికీ, కన్సల్టెంట్లందరికీ, ఈ గ్రంథాన్ని చక్కగా ముద్రింపజేసిన తి.తి.దేవస్థానం ప్రెస్సు వారందరికీ ప్రత్యేకంగా అభినందనలు తెలియజేస్తున్నాను. పోతన పద్యాలకు వ్యాఖ్యానాలనదగిన చక్కనైన బాపుగారి రేఖాచిత్రాలను ఈ గ్రంథ సంపుటాల్లో అక్కడక్కడా పొందుపరుచుటకు అనుమతించిన శ్రీ బాపుగారి కుటుంబ సభ్యులకు ప్రత్యేకంగా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ఈ సరళవ్యాఖ్యాన గ్రంథం ఎనిమిది సంపుటాలుగా, ఆ యా పుటల్లో అక్కడక్కడ ప్రముఖ చిత్రకారులు బాపుగారి బొమ్మల మెరుపులతో సర్వాంగసుందరంగా, శ్రీ హేమలంబి నామసంవత్సరం తెలుగు ఉగాదినాడు తెలుగువారందరికి శ్రీ తిరుమలేశుడు అనుగ్రహిస్తున్న ప్రసాదంగా స్వీకరించగలరని ఆకాంక్షిస్తూ...

*సదా శ్రీవారి సేవలో...*

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

శ్రీరస్తు

# బమ్మెర పోతనామాత్య ప్రణీత శ్రీమహాభాగవత ప్రాజెక్టు పుట్టుపూర్వోత్తరాలు

**వేదకల్పవృక్షవిగళితమై శుక**
**ముఖసుధాద్రవమున మొనసియున్న,**
**భాగవతపురాణఫలరసాస్వాదన**
**పదవి గనుడు రసికభావవిదులు.**

అని భాగవత రచనకు ఉపక్రమించిన సహజకవి పోతనామాత్యుడు భాగవతప్రాశస్త్యాన్ని ఉగ్గడించాడు.

వాల్మీకి విరచితమైన ఆదికావ్యం రామాయణం. “వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా” అన్నట్లు వేదానికి మారురూపంగా అది ప్రసిద్ధి పొందింది. వ్యాసవిరచితమహాభారతాన్ని పంచమవేదంగా (భారతం పంచమో వేదః) భావిస్తారు. సనాతనధర్మానికి అనల్పమైన వ్యాప్తిని గావించిన ఈ మూడుగ్రంథాలు భారతీయ సాహిత్యంలో సాటిలేని మేటిరచనలుగా ప్రసిద్ధి పొందాయి.

తిరుమల తిరుపతి దేవస్థానం హిందూ ధర్మ ప్రచారంకోసం ఆధ్యాత్మికగ్రంథాలను పెద్ద ఎత్తున ప్రచురిస్తోంది. దేశంలో మరే ఇతరదేవస్థానం కూడా ధర్మప్రచారంకోసం గ్రంథముద్రణను ఇంత పెద్ద ఎత్తున చెయ్యడం లేదని చెప్పడం అతిశయోక్తి కాదు. వేదార్థాలను ప్రతిపాదించే వాఙ్మయాన్ని వివిధ భాషల్లో ప్రచురించి ప్రచారం చేయడం తిరుమల తిరుపతి దేవస్థానం తన బాధ్యతగా స్వీకరించింది. అనేకభాషల్లో దేవస్థానం ద్వారా వెలువడుతున్న ధార్మికగ్రంథాలలో రామాయణ, భారత, భాగవతాలు మిక్కిలి ప్రధానమైనవని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

1982లో జరిగిన భక్తకవి పోతన పంచశతాబ్ది జయంతి ఉత్సవాలలో పోతన భాగవతాన్ని తాత్పర్యంతో ముద్రించాలని దేవస్థానం సంకల్పించింది. **కరుణశ్రీ జంధ్యాలపాపయ్యశాస్త్రి** గారి నేతృత్వంలో 15 మంది పండితులు పోతనభాగవతానికి తాత్పర్యాన్ని సమకూర్చారు. తొలిసారిగా 1987లో తాత్పర్యసహిత పోతన భాగవతాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం పాఠకలోకానికి అందించింది.

కవిత్రయవిరచితమహాభారతానికి ప్రసిద్ధపండితులచేత ప్రతిపదార్థతాత్పర్యవిశేషవివరణలు వ్రాయించి ప్రచురించాలన్న సంకల్పం 1983లో తిరుమల తిరుపతి దేవస్థానానికి కలిగింది. ముప్పైమంది పండితులు ఈ పద్ధతిలో భారతానికి వ్యాఖ్యానం రచించారు. 2005వ సంవత్సరంలో మహాభారతం సంపూర్ణంగా సవ్యాఖ్యానంగా వెలువడింది.

ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషవ్యాఖ్యానాలతో కవిత్రయభారతం, తాత్పర్యసహితభాగవతం తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలలో అగ్రశ్రేణికి చెందినవిగా రూపొంది అతివిస్తృతమైన ప్రజాదరణకు పాత్రమైనాయి. వేలకొలది ప్రతులు భక్తులకు, పాఠకులకు అందుతున్నాయి.

1981లో డా॥ పన్నాల రాధాకృష్ణశర్మగారి నేతృత్వంలో వ్యాసవిరచితసంస్కృతభాగవతాన్ని ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతాలను సమన్వయించే మూడువ్యాఖ్యానాలతో పరిష్కరించి ప్రచురించాలని దేవస్థానం నిర్ణయించింది. ఆ నిర్ణయం మేరకు భాగవతం ప్రాజెక్టు ఏర్పాటైంది. **డా॥ రాధాకృష్ణశర్మ, డా॥ ఎన్.సి.వి.నరసింహాచార్యులు, శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ, డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గార్ల నేతృత్వంలో శ్రీధరీయం (అద్వైతం), వీరరాఘవీయం (విశిష్టాద్వైతం), విజయధ్వజీయం (ద్వైతం) అన్న మూడువ్యాఖ్యానాలతో సమగ్రంగా 14 బృహత్ సంపుటాలుగా 2006 నాటికి భాగవతం సిద్ధమయింది.

ఈ పరిష్కరణ కార్యక్రమం ముగియగానే పురాణ ఇతిహాస ప్రాజెక్టు ప్రత్యేకాధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** నాటి తితిదే శ్రీకార్యనిర్వహణాధికారి **శ్రీ ఎ.పి.వి.ఎన్. శర్మ** ఐ.ఏ.ఎస్., గారి వద్దకు వెళ్ళి వ్యాసభాగవత పరిష్కరణ పూర్తి అయిందని విన్నవించారు. అప్పుడు కార్యనిర్వహణాధికారిగారు ఎంతో సంతోషించి “పోతన భాగవతాన్ని తాత్పర్యంతో మాత్రమే ముద్రించగలిగాం. తెలుగు ప్రజలందరికీ ఎంతో ప్రియమైన భాగవతాన్ని కూడా అర్థ తాత్పర్య వివరణలతో సిద్ధం చేస్తే బాగుంటుంది. ఇందుకు తగిన ప్రతిపాదనలను సిద్ధం చెయ్యండి” అని నిర్దేశించారు.

ఈ బృహత్కార్యక్రమం భాగవతప్రాజెక్టుద్వారా కాకుండా కవిత్రయ మహాభారతానికి వ్యాఖ్యానం సమకూర్చడంలో అనుభవం గడించిన సప్తగిరి సంపాదక కార్యాలయం ద్వారానే నిర్వహించడం సముచితంగా ఉంటుందని తెలుపుతూ **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** వ్యాఖ్యాన రచనకు అవసరమైన ప్రతిపాదనలను సిద్ధం చేసి కార్యనిర్వహణాధికారివారికి పంపగా వారు ఆమోదించారు.

**డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారి ప్రతిపాదనలో సారాంశం**

- వ్యాఖ్య సామాన్యులకు కూడా అర్థమయ్యే తీరులో ఉండాలి.
- శిష్టవ్యావహారికభాషను ప్రయోగించాలి.
- వ్యాకరణాదివిశేషాలకు ఎక్కువ ప్రాధాన్యం ఉండరాదు.
- ఆధ్యాత్మిక అంశాలను పరిమితంగా విశేషాంశాలలో చెప్పవచ్చు.
- కార్యనిర్వహణాధికారి వారి అధ్యక్షతన తితిదే ప్రజాసంబంధాధికారి, సప్తగిరి ప్రధాన సంపాదకులు, తితిదే స్థానిక పండితులతో ఒక సంఘాన్ని ఏర్పాటుచేసి వ్యాఖ్యాతలను, సంపాదకమండలిని ఎన్నుకోవాలి.

- వ్యాఖ్యాత లందరితో తిరుపతిలో ఒక కార్యశాలను నిర్వహించి అందరి వ్యాఖ్యానం ఒకే విధంగా ఉండేలా చూడాలి.
- ఇంతకు మునుపు తితిదే ముద్రించిన తాత్పర్యసహిత భాగవతానికి తాత్పర్యం వ్రాసిన పండితులలో సమర్థులైనవారిని ఈ కార్యక్రమంలో వినియోగించుకోవచ్చు.

2007లో కార్యనిర్వహణాధికారి **డా॥ కె.వి.రమణాచారి** ఐ.ఏ.ఎస్., గారి ఆమోదంమేరకు నాటి సప్తగిరి సంపాదకులు **డా॥ సి.శైలకుమార్**, భాగవత ప్రాజెక్టు ప్రధానసంపాదకులుగా **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** గారిని నియమించారు. ఆ తరువాత ఈ బృహత్కార్యాచరణకు సలహాలు, సూచనలు చేసేందుకు కవిత్రయభారత వ్యాఖ్యాననిర్వహణలాగే తొమ్మిదిమందితో కూడిన సలహామండలిని ఏర్పాటు చేశారు. దీనికి తితిదే కార్యనిర్వహణాధికారి గౌరవ సంపాదకులుగా వ్యవహరించారు.

**సలహామండలి**

| | | |
|---|---|---|
| **శ్రీ కార్యనిర్వహణాధికారి** | - | **గౌరవ సంపాదకులు** |
| **శ్రీ ముదివర్తి కొండమాచార్యులు, తిరుపతి** | - | **ప్రధాన సంపాదకులు** |
| **డా॥ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి** | - | **సభ్యులు** |
| **డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, మద్రాసు** | - | **సభ్యులు** |
| **డా॥ శలాక రఘునాథశర్మ, రాజమండ్రి** | - | **సభ్యులు** |
| **ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి** | - | **పదవీ నిమిత్త సభ్యులు** |
| **సప్తగిరి సంపాదకుడు** | - | **సి. శైలకుమార్, కన్వీనర్** |
| **తితిదే ప్రజాసంబంధాధికారి** | - | **విశేష ఆహ్వానితులు** |
| **తితిదే ప్రెస్ మేనేజర్** | - | **విశేష ఆహ్వానితులు** |

ఈ సంపాదక మండలిలోని పండితవర్గమైన **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, డా॥ సముద్రాల లక్ష్మణయ్య, డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, డా॥ శలాక రఘునాథశర్మ** గార్లతో ప్రధాన సంపాదకమండలిని నెలకొల్పారు. ఆ తరువాత కారణాంతరాలవల్ల **డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య** గారి స్థానంలో **డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య** గారు సంపాదక మండలి సభ్యులుగా నియమితులయ్యారు. ఈ ప్రధాన సంపాదక మండలివారు భాగవత

వ్యాఖ్యాన రచనకు ముప్పైమంది పండితులను ఎంపికచేసి ఒక్కొక్కరికి 300 – 350 పద్యగద్యాలకు వ్యాఖ్యాన రచనా బాధ్యతలను అప్పగించారు.

ఆ తరువాత అనుకున్నంత వేగంగా ఈ కార్యక్రమం ముందుకు సాగలేదు.

తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలను, సవ్యాఖ్యాన భాగవతాన్ని త్వరితగతిన వ్యాప్తిలోకి తేవాలన్న ఉద్దేశ్యంతో 2011లో ద్రవిడ విశ్వవిద్యాలయ విశ్రాంత ఉపకులపతి **ఆచార్య రవ్వా శ్రీహరి**గారిని ప్రచురణల విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నియమిస్తూ వీరికి సహాయకులుగా **డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి** గార్లను ప్రచురణల విభాగానికి ఉపసంపాదకులుగా, **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం** గార్లు కన్సల్టెంట్‌లుగా నియమితులయ్యారు.

అప్పటిదాకా మందకొడిగా సాగుతున్న ప్రచురణ కార్యక్రమంతోపాటు వ్యాఖ్యాన రచనా కార్యక్రమం కూడా **ఆచార్య రవ్వా శ్రీహరి** గారి సారథ్యంలో వేగాన్ని పుంజుకున్నది. వ్యాఖ్యాన రచయితలతో నిరంతరం ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ రాయలేమని తెలిపిన వారి భాగాలను వేరే పండితులకు అప్పగిస్తూ 2013నాటికి దాదాపు పండితులందరినుండి భాగవత వ్యాఖ్యానాలను తెప్పించారు. వెనువెంటనే డి.టి.పి. వగైరా పనులుకూడా ముమ్మరంగా సాగాయి. పుటల సంఖ్య ఆధారంగా 12 స్కంధాల భాగవతాన్ని 8 సంపుటాలుగా ముద్రించేందుకు ప్రణాళికలు సిద్ధం చేశారు.

**ఆచార్య రవ్వా శ్రీహరి**గారి తదనంతరం 2014లో ఎడిటర్–ఇన్–చీఫ్‌గా బాధ్యతలు చేపట్టిన పురాణ ఇతిహాస ప్రాజక్టు ప్రత్యేకాధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** ఈ కార్యక్రమాన్ని మరింత వేగవంతం చేశారు. వ్యాఖ్యాన రచనలను పరిష్కరించడానికి, అక్షర దోషాలను తొలగించడానికి మరి కొందరు పండితులు అవసరం కావడంతో అప్పటికే భాగవతం కన్సల్టెంటుగా ఉన్న **డా॥ గల్లా చలపతి** గారితోపాటుగా **డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ కట్టా నరసింహులు** గార్లు భాగవతం ప్రాజెక్టు కన్సల్టెంట్‌లుగా నియమితులయ్యారు. భాగవత స్కంధాలను సంపాదకమండలి పరిష్కరణ స్థాయికి వీరు తీసుకువచ్చారు. 2015 ఏప్రిల్ 15వ తేదీన తితిదే కార్యనిర్వహణాధికారి **డా॥ డి.సాంబశివరావు** ఐ.ఏ.ఎస్., మరియు సంయుక్త కార్యనిర్వహణాధికారి (తిరుపతి) **శ్రీ పోల భాస్కర్** ఐ.ఏ.ఎస్., గార్ల ఆధ్వర్యంలో

**విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**డా॥ శలాక రఘునాథశర్మ**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**గార్లతో కూడిన పోతనభాగవత సంపాదకమండలి తొలి సమావేశం జరిగింది. త్వరితగతిన పరిష్కరణ పూర్తిచేసేందుకు గాను అనుసరించాల్సిన ప్రణాళికను ఈ సమావేశంలో సిద్ధం

చేశారు. ఆ తరువాత **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారి సంయోజకత్వంలో జరిగిన సంపాదక మండలి సమావేశాలలో మూడుస్కంధాల పరిష్కరణ పూర్తిచేసి ముద్రణార్హమైన ప్రతిని సిద్ధం చేశారు. అనివార్యకారణాలవల్ల సంపాదకమండలిలో కొందరు సభ్యులు తదుపరి సమావేశాలకు హాజరు కాలేకపోయారు.

2016లో ప్రచురణల విభాగానికి **శ్రీ ప్రయాగ రామకృష్ణ**గారు ప్రత్యేకాధికారిగా నియమితులయ్యారు. కార్యనిర్వహణాధికారి గారి అమోదం మేరకు వీరు భాగవత పరిష్కరణ కార్యక్రమం త్వరితగతిన పూర్తికావడానికి అంతకు మునుపున్న సంపాదకమండలి స్థానంలో

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య (ప్రధాన సంపాదకులు)**

**శ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ**

**డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

**డా॥ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి**

**డా॥ ధూళిపాళ రామకృష్ణ**

**డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

**డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి**

**డా॥ కె.వి. సుందరాచార్యులు**

**డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ**గార్లతో కొత్త సంపాదకమండలిని ఏర్పాటు చేశారు. అప్పటినుంచి వ్యాఖ్యాన పరిష్కరణ కార్యక్రమం వేగవంతం అయింది. కాగా 2017 ఉగాదినాటికి సవ్యాఖ్యాన భాగవతం ముద్రించబడి ప్రజలకు అందుబాటులోకి రావాలన్న తితిదే సంకల్పాన్ని అనుసరించి పరిష్కరణ కార్యక్రమాన్ని మరింత త్వరగా పూర్తి చేసేందుకుగాను కార్యనిర్వహణాధికారి వారి ఆమోదంమేరకు

**డా॥ నిట్టల సుబ్రహ్మణ్యేశ్వర శాస్త్రి**

**డా॥ మరడాన శ్రీనివాసరావు**

**డా॥ గల్లా చలపతి** గార్లకు సంపాదకమండలిలో స్థానం కల్పించారు. 2016 సెప్టెంబరునుండి పండితులందరితో ప్రతినెలా దాదాపు 20 రోజులపాటు తిరుపతి శ్వేత సమావేశ మందిరంలో సమావేశాలు ఏర్పాటుచేసి పండితులందరి ఆమోదంమేరకు పరిష్కరణ కార్యక్రమాన్ని విజయవంతంగా ముగించి శుద్ధప్రతిని ముద్రణకు పంపేందుకు సిద్ధం చేశారు. ఇలా అనుకున్న సమయానికి శ్రీమహాభాగవతాన్ని ప్రకటించగలిగినందుకు సంతోషిస్తున్నాము.

సామాన్య పాఠకులను దృష్టిలో ఉంచుకుని వ్యాఖ్యానం సరళంగా ఉండాలన్న కార్యనిర్వహణాధికారి, సంయుక్త కార్యనిర్వహణాధికారిగార్ల సూచనలమేరకు వ్యాఖ్యాన రచనలో విస్తృతంగా విశేషాలను వ్రాసిన పండితుల రచనల్లోంచి సంపాదకమండలి సూచనల ప్రకారం అవసరమైన మేరకు మాత్రమే విశేషాలను స్వీకరించడమయింది.

**కృతజ్ఞతలు**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావడానికి అధికారికమైన ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థానముల పాలకమండలి అధ్యక్షులకు మరియు పాలకమండలి సభ్యులందరికీ కృతజ్ఞతలు.

లోగడ తితిదేవస్థానం కార్యనిర్వహణాధికారిగా ఉండి భాగవత ప్రాజెక్టు ప్రారంభానికి కారకులైన **శ్రీ ఎ.పి.వి.ఎన్.శర్మ** ఐ.ఏ.ఎస్., గారికి హృదయపూర్వక ధన్యవాదాలు. అదే పరంపరలో తితిదే కార్యనిర్వహణాధికారులుగా బాధ్యతలు నిర్వహించి భాగవత ప్రాజెక్టుకు సంపూర్ణ సహకారాన్ని అందించిన **డా॥ కె.వి.రమణాచార్య** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఎమ్.జి.గోపాల్** ఐ.ఏ.ఎస్., గార్లకు హృదయపూర్వక ధన్యవాదాలు.

పోతనభాగవతం ముద్రణదశకు చేరుకునేందుకు తగిన సూచనలు, సలహాలు ఇచ్చిన సలహామండలి సభ్యులందరికీ ప్రత్యేక ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన భాగవత ప్రచురణలో ఆసక్తిని కనబరుస్తూ అన్నివిధాలా అందుకు తగిన ప్రోత్సాహాన్ని అందజేసిన గౌరవ శ్రీ కార్యనిర్వహణాధికారి **డా॥ డి.సాంబశివరావు** ఐ.ఏ.ఎస్., గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారి **శ్రీ పోల భాస్కర్** ఐ.ఏ.ఎస్., గారికి మా హృదయపూర్వక నమోవాకాలు.

భాగవత వ్యాఖ్యాన రచనకు అవసరమైన పండితులను ఎన్నుకొని వారికి వ్యాఖ్యాన బాధ్యతలను అప్పగించడంలో కృషిచేసిన నాటి సప్తగిరి ప్రధాన సంపాదకులు **డా॥ సి.శైలకుమార్** గారికి, సంపాదకులు **డా॥ కె.రాధారమణ** (ప్రస్తుత ప్రధాన సంపాదకులు) గార్లకు కృతజ్ఞతలు.

వ్యాఖ్యాతలందరినుండి వ్యాఖ్యాన భాగాలను రప్పించడంలో శ్రమించి, విశేష కృషిచేసిన నాటి ప్రచురణల విభాగం అధికారి **ఆచార్య రవ్వా శ్రీహరి** గారికి, పరిష్కరణ కార్యక్రమాన్ని వేగవంతంచేసిన తదుపరి అధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారికి, కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

పోతన భాగవత పరిష్కరణలో తమ అమూల్య సహాయసహకారాలనందించి శుద్ధప్రతిని తయారు చేయడంలో సహకరించిన **పోతన భాగవత సంపాదకమండలి సభ్యులందరికీ** పేరుపేరునా ధన్యవాదాలు.

ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ అన్నివిధాలా సంపూర్ణ సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగ ఉపసంపాదకులు **డా॥ నొస్సం నరసింహాచార్య** గారికి, పరిష్కరణ, అక్షరదోష సవరణల్లో సహకరించిన కార్యాలయ పండితులు **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, డా॥ గల్లా చలపతి, డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ కట్టా నరసింహులు**గార్లకు, ప్రచురణల విభాగంలో కొంతకాలం ఉపసంపాదకురాలుగా పనిచేసి భాగవత పరిశీలనా కార్యక్రమంలో సహకరించిన **శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి** గారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన పోతన భాగవత ముద్రణకు సంబంధించిన దస్త్రాలను నడపడంలోను, సంపాదకమండలి సమావేశాలను ఏర్పాటు చేయడంలోను సహకరించిన **ప్రచురణల విభాగ కార్యాలయ సిబ్బందికి** నా ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన పోతన భాగవతం ఎనిమిది సంపుటాలలో చివరన ముద్రించిన అకారాదిక్రమ పద్యగద్య సూచికను తయారు చేయడంలో సహకరించిన **శ్రీ వాడపల్లి శేషతల్పశాయి** (ఆంధ్రభారతి.కామ్) గారికి మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాలను అందంగా డి.టి.పి. చేసి చక్కటి వర్ణచిత్రాలతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దడంలో సహకరించిన ప్రచురణల విభాగ కార్యాలయ డి.టి.పి. సిబ్బంది **శ్రీమతి ఎమ్.సుబ్బరత్నమ్మ, శ్రీమతి జె.కరుణ, కుమారి ఎమ్.మానస, శ్రీ ఎమ్.రెడ్డిప్రసాద్** గార్లకు ధన్యవాదాలు.

ఈ గ్రంథంలో ప్రసిద్ధ చిత్రకారులు బాపుగారి అద్భుత వర్ణచిత్రాలను ముద్రించేందుకు అనుమతించిన బాపుగారి కుటుంబసభ్యులకు మా ప్రత్యేకధన్యవాదాలు.

తక్కువ వ్యవధిలో గ్రంథ ముద్రణను పూర్తిచేసి పాఠకులకు అందించేందుకు తోడ్పడిన టిటిడి ముద్రణాలయ ఉపకార్యనిర్వహణాధికారి **శ్రీమతి ఎమ్.గౌతమి** గారికీ, వారి సిబ్బందికీ మా హృదయపూర్వక ధన్యవాదాలు.

*సదా శ్రీవారి సేవలో...*

**ప్రయాగ రామకృష్ణ**
కన్వీనర్
ప్రత్యేకాధికారి, ప్రచురణల విభాగం
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# సంపాదక మండలి

అధ్యక్షులు

**డా॥ డి.సాంబశివరావు,** ఐ.ఏ.ఎస్,

కార్యనిర్వహణాధికారి, తి.తి.దే., తిరుపతి

పర్యవేక్షకులు

**శ్రీ పోల భాస్కర్,** ఐ.ఏ.ఎస్,

సంయుక్త కార్యనిర్వహణాధికారి, తి.తి.దే., తిరుపతి

ప్రధాన సంపాదకులు : **డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

## సభ్యులు

**శ్రీ గరిమెళ్ళ సోమయాజులు శర్మ** | **డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**
**డా॥ ధూళిపాళ రామకృష్ణ** | **డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**
**డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి** | **డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ**
**డా॥ కె.వి.సుందరాచార్యులు** | **డా॥ నిట్టల సుబ్రహ్మణ్యేశ్వర శాస్త్రి**
**డా॥ మరడాన శ్రీనివాసరావు** | **డా॥ గల్లా చలపతి**

కన్వీనర్ : ప్రయాగ రామకృష్ణ, ప్రత్యేకాధికారి, ప్రచురణల విభాగం

కో - కన్వీనర్ : డా॥ నొస్సం నరసింహాచార్య, ఉపసంపాదకులు, ప్రచురణల విభాగం

బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

| వ్యాఖ్యాతలు | స్కంధాలు |
|---|---|
| 1) డా॥ కేసాప్రగడ సత్యనారాయణ | ప్రథమస్కంధము (1-275) |
| 2) డా॥ మల్లెల గురవయ్య | ప్రథమస్కంధము (276-529) |
| 3) డా॥ సముద్రాల లక్ష్మణయ్య | ద్వితీయస్కంధము (1-288) |
| 4) డా॥ కడిమిళ్ళ వరప్రసాద్ | తృతీయస్కంధము (1-388) |
| 5) డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి | తృతీయస్కంధము (389-717) |
| 6) డా॥ గల్లా చలపతి | తృతీయస్కంధము (718-887) |
| 7) డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి | తృతీయస్కంధము (888-1055) |
| 8) డా॥ దావులూరి కృష్ణకుమారి | చతుర్థస్కంధము (1-322) |
| 9) డా॥ ఆర్. అనంతపద్మనాభరావు | చతుర్థస్కంధము (323-636) |
| 10) డా॥ శలాక రఘునాథశర్మ | చతుర్థస్కంధము (637-977) |
| 11) డా॥ కె. సర్వోత్తమరావు | పంచమస్కంధము |
| | ప్రథమాశ్వాసము (1-183) |
| | ద్వితీయాశ్వాసము (1-167) |
| 12) డా॥ జోస్యుల సూర్యప్రకాశరావు | షష్ఠస్కంధము (1-251) |
| 13) డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ | షష్ఠస్కంధము (252-346) |
| 14) డా॥ ఆకురాతి పున్నారావు | షష్ఠస్కంధము (347-440) |
| 15) శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం | షష్ఠస్కంధము (441-530) |
| 16) డా॥ ఆకెళ్ళ విభీషణశర్మ | సప్తమస్కంధము (1-186) |

| | |
|---|---|
| 17) డా॥ ఆకురాతి పున్నారావు | సప్తమస్కంధము (187-482) |
| 18) డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద | అష్టమస్కంధము (1-391) |
| 19) శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు | అష్టమస్కంధము (392-744) |
| 20) డా॥ డి. మీరాస్వామి | నవమస్కంధము (1-364) |
| 21) శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం | నవమస్కంధము (365-737) |
| 22) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య | దశమస్కంధము పూర్వభాగము (1-288) |
| 23) డా॥ ఎ.ఎస్. గోపాలరావు | దశమస్కంధము పూర్వభాగము (289-610) |
| 24) శ్రీ ప్రభల సుబ్రహ్మణ్యశర్మ | దశమస్కంధము పూర్వభాగము (611-912) |
| 25) డా॥ పి. నరసింహారెడ్డి | దశమస్కంధము పూర్వభాగము (913-1188) |
| 26) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు | దశమస్కంధము పూర్వభాగము (1189-1485) |
| 27) డా॥ పి.ఆర్. హరినాథ్ | దశమస్కంధము పూర్వభాగము (1486-1792) |
| 28) డా॥ నాగళ్ళ గురుప్రసాదరావు | దశమస్కంధము ఉత్తరభాగము (1-245) |
| 29) డా॥ ఎన్.వి.ఎస్. రామారావు | దశమస్కంధము ఉత్తరభాగము (246-537) |
| 30) డా॥ కె. మలయవాసిని | దశమస్కంధము ఉత్తరభాగము (538-764) |
| 31) డా॥ కె.జె. కృష్ణమూర్తి | దశమస్కంధము ఉత్తరభాగము (765-1033) |
| 32) డా॥ సంగనభట్ల నరసయ్య | దశమస్కంధము ఉత్తరభాగము (1034-1343) |
| 33) డా॥ గల్లా చలపతి | ఏకాదశస్కంధము (1-127) |
| | ద్వాదశస్కంధము (1-54) |

**పోతన భాగవతప్రాజెక్టు కన్సల్టెంట్స్**

శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం ✻ డా॥ గల్లా చలపతి ✻ డా॥ ముదివేడు ప్రభాకరరావు

శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు ✻ శ్రీ కట్టా నరసింహులు

# సంకేతాక్షర సూచి

| | | | | | |
|---|---|---|---|---|---|
| క. | – | కందం | య. | – | యగణం |
| ఆ. | – | ఆటవెలది | మ. | – | మగణం |
| తే. | – | తేటగీతి | త. | – | తగణం |
| సీ. | – | సీసపద్యం | ర. | – | రగణం |
| ఉ. | – | ఉత్పలమాల | జ. | – | జగణం |
| చ. | – | చంపకమాల | భ. | – | భగణం |
| మత్త. | – | మత్తకోకిల | న. | – | నగణం |
| మ. | – | మత్తేభవిక్రీడితం | స. | – | సగణం |
| శా. | – | శార్దూలవిక్రీడితం | ల. | – | లఘువు |
| శ్లో. | – | శ్లోకం | గ. | – | గురువు |
| వ. | – | వచనం | వ. | – | వగణం |
| అలం. | – | అలంకారం | | | |

| | | |
|---|---|---|
| అవ. | – | అవతారిక |
| తా. | – | తాత్పర్యం |
| ప్రతి. | – | ప్రతిపదార్థం |
| విశే. | – | విశేషార్థం |
| ప్ర.ఆ. | – | ప్రథమాశ్వాసం |
| ద్వి.ఆ. | – | ద్వితీయాశ్వాసం |
| క్రీ.శ. | – | క్రీస్తుశకం |
| సం. | – | సంవత్సరం |
| మొ. | – | మొదలైన |
| ... | – | తరువాతి పద్యం / వచనంతో అన్వయం |



# అష్టమస్కంధ ప్రాశస్త్యం

## అష్టమస్కంధం కన్నయ్య కన్నులు

శ్రీకృష్ణభగవానుడు ద్వాపరయుగం చివరన ఉద్ధవుని ప్రేమపూర్వక అభ్యర్థనమేరకు తన దివ్యతేజస్సును భాగవతంలో నిక్షేపిస్తాడు. అందువల్ల శ్రీభాగవతం శ్రీకృష్ణభగవానుని ప్రత్యక్షవాఙ్మయమూర్తి. శ్రీకృష్ణుని దివ్యమంగళ విగ్రహంగా భాగవతులు భాగవతాన్ని భావిస్తారు. భారతీయ ఆస్తిక జనాలకు భాగవతం కేవలం ఒక పురాణం మాత్రమే కాదు, ఆ 'మహానందాంగనాడింభకు' ని సుందర స్ఫురద్రూపంగాకూడా భాసిస్తుంది. శ్రీకృష్ణపరమాత్ముని పాదాది దివ్యాంగాలు భాగవతంలోని ప్రథమాది ద్వాదశస్కంధాలుగ భాసించాయి. కౌషీతకీసంహిత (25–8) లోని 'పాదాదిజానుపర్యంతం ప్రథమస్కంధ ఈరితః... ఆత్మాతుద్వాదశస్కంధః శ్రీకృష్ణస్యప్రకీర్తితః' అనే శ్లోకాలు కన్నయ్య మేనులోని ఏ ఏ భాగాలు భాగవతంలోని ఏ ఏ స్కంధాలుగా దర్శనమిస్తాయో సువ్యక్తం చేశారు మన మహర్షులు. 'ప్రథమశ్చ ద్వితీయశ్చ చరణౌ ద్వౌ ప్రకీర్తితౌ... ద్వాదశస్సు శిఖోచ్యతే, ఏవం సర్వం భాగవతం శ్రీహరే రంగముచ్యతే' అనే శ్లోకాలు కూడా లభిస్తున్నాయి. అయితే వాటికి ఆకరం మృగ్యం. ఏది ఏమైనా భాగవతం సాక్షాత్కరించిన భగవత్స్వరూపం.

**'అష్టమశ్చక్షుషీ విష్ణోః'** అని కౌషీతకీసంహిత వాక్యం, అంటే అష్టమస్కంధం శ్రీకృష్ణభగవానులవారి కన్నులు అని భావం. 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అన్నారు. 'సప్తమశ్చాష్టమ శ్చైవ బాహూ ద్వౌ పరికీర్తితౌ' అనే శ్లోకపాదం భాగవత సప్తమ, అష్టమస్కంధాలు భగవానుని భుజస్కంధాలు అని చెప్తున్నాయి. భాగవతంలో బహుళప్రచారం పొంది జనప్రియమైన భాగాలలో అష్టమస్కంధం ఒకటి అనడంలో అభిప్రాయభేదం లేదు.

## అష్టమస్కంధంలో ఏం చెప్పారు?

సుప్రసిద్ధమైన బహుళ ప్రచారం పొందిన కథలకు కాణాచి అష్టమస్కంధం. ఈ స్కంధంలో వరుసగా – ప్రవేశిక, గజేంద్రమోక్షణకథ, కూర్మావతారకథ, శివుడు హాలాహలం భక్షించడం, క్షీరసాగరమథనం చేస్తుంటే ఐరావతాదులు జన్మించడం, విష్ణువు మోహినీఅవతారం, దేవాసురయుద్ధం, విష్ణువు మోహినీఅవతారంలో ఈశ్వరుణ్ణి మోహింపజేయడం, వామనచరిత్ర, మత్స్యావతారకథ ఉన్నాయి.

భగవానుని ఏకవింశతి అవతారాలలో అష్టకథలు అష్టమస్కంధంలో ఉన్నాయి. అవి –

**1. కపిలావతారం :** మహావిష్ణువు కపిలుడుగా స్వాయంభువ మనువుకు దేవహూతికి జన్మిస్తాడు. లోకంలో ధర్మం ప్రచారం చేస్తాడు.

**2. యజ్ఞావతారం :** విష్ణువు యజ్ఞుడుగా స్వాయంభువ మనువుకు ఆకూతికి జన్మిస్తాడు, లోకానికి జ్ఞానప్రదానం కావిస్తాడు.

**3. శ్రీహరి :** హరిమేధునికీ హరిణికీ జన్మిస్తాడు శ్రీహరి. గజేంద్రుని కాపాడినవాడు శ్రీహరే.

**4. కూర్మావతారం :** సముద్రమథనం చేయడానికి కూర్మావతారమెత్తి మందర పర్వతాన్ని ధరిస్తాడు భగవానుడు.

**5. ధన్వంతరి :** మహావిష్ణువు వైద్యవిద్యాధిదైవంగా అవతరిస్తాడు. వైద్యవిద్యానిపుణుడు, దేవవైద్యుడు.

**6. మోహినీ అవతారం :** లోకాన్నే మోహింపజేసే రూపం. అమృతాన్ని దేవతలకు పంచడం కోసం మహావిష్ణువు మోహినిగా ఆవిర్భవిస్తాడు. మదనుని జయించిన శివుడికి కూడా మదనతాపం కలిగించిన మోహనరూపం ఇది.

**7. వామనావతారం :** బలిని పాతాళానికి పంపడం, స్వర్గాధిపత్యాన్ని దేవేంద్రునకు కట్టబెట్టడం వామన (త్రివిక్రమ) అవతార ప్రధానకార్యం.

**8. మత్స్యావతారం :** మహావిష్ణువు మత్స్యావతారం దాల్చి హయగ్రీవాసుర సంహారం చేసి వేదాలను ఉద్ధరించాడు.

భగవానుడు లక్ష్యసిద్ధికోసం శరీరాన్ని పెంచిన అవతారాలు రెండు మాత్రమే. అవి రెండూ అష్టస్కంధంలో ఉన్నాయి. ఆ అవతారాలు వామన (త్రివిక్రమ), మత్స్యావతారాలు.

పైన చెప్పినవి కేవలం విష్ణ్వవతార విశేషాలు, కాగా క్షీరసాగరమథనం కథలో మరొక రెండు ప్రధానమైన ఘట్టాలు ప్రాచుర్యం పొందాయి. అవి – శివుడు హాలాహల భక్షణం చేయడం, శ్రీలక్ష్మీమహావిష్ణువుల కల్యాణం.

## ప్రధానకథలు – విశేషాలు

అష్టమస్కంధంలోని ప్రధాన కథలు – గజేంద్రమోక్షణం, సముద్రమథనం, వామనావతారం, మత్స్యావతారం. వీటి ప్రతీక విశేషాలు సంక్షిప్తంగా తెలుసుకుందాం.

**గజేంద్రమోక్షణం :** భగవదవతారాన్ని అనువర్తించే సత్కథలను **'ఈశానుచరితం'** అంటారు. పోతనగారికీ తెలుగువారికీ ప్రియమైన కథలలో గజేంద్రమోక్షం ప్రథమశ్రేణిలో ఉంటుంది. తెలుగునాట ఈ కథ విశేషమైన ప్రచారం పొందింది. మిగతా కథలకన్న గజేంద్రమోక్షానికి ఎందుకంత అగ్రస్థానం లభించింది? దీనికి సమాధానం ఇది 'జీవవేదన' సువ్యక్తం చేసే కథ. భాగవతంలో ఎక్కువగా జీవవేదన ప్రతిబింబించిన కథ గజేంద్రమోక్షమే. సామాన్య సంసారి అయిన జీవుని పరిస్థితికి దగ్గరగా గజేంద్రుని పరిస్థితి ఉంటుంది. జీవుని ఆక్రోశానికి గజేంద్రుడు ప్రతీక. ఈ పరమార్థాన్ని కథలో నిక్షేపించడమే గాక జీవుల జీవితానుభూతిని ఈ రచనలో పోతన చాతుర్యంతో నిర్మించారు. జీవుని జీవితానుభూతికి అద్దం పడుతుందీ కథ.

గజేంద్రమోక్షణ కథ మొత్తం 134 పద్యగద్యాలలో రచించబడింది. అందులోని ఒక పద్యం –

**ఊహ గలంగి జీవనపుటోలమునంబడి పోరుచున్ మహా**
**మోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగ లేక సం**
**దేహముఁ బొందు దేహిక్రియ దీనదశన్ గజముండె భీషణ**
**గ్రాహ దురంతదంతపరిఘట్టితపాదఖురాగ్రశల్యమై.** **– 67**

ఇక్కడ చెప్పిన ఉపమ కేవలం పద్యానికే పరిమితమైందికాదు. పద్యభావం గజేంద్రమోక్షణమంతటా అంతర్వాహినిగా ఉంటుంది. పోతన ప్రతిభావంతమైన కథారచన శిల్పానికి అంతర్వాహినిగా మెరుగులు దిద్దే పద్యం ఇది.

ప్రకృతి ప్రకారం ప్రవర్తించే జీవుని లక్షణాన్ని ఎత్తిచూపడంలో ఈ కథలోని గజేంద్రుని విహారం పేర్కొనదగింది. గజేంద్రుని వనవిహారం తర్వాత పోతన ఒక కాసారాన్ని గురించిన పద్యాన్ని ఇలా చెప్పాడు –

సీ. **తోయజగంధంబు దోఁగిన చల్లని - మెల్లని గాడ్పుల మేనులలరఁ**
**గమలనాళాహార విమలవాక్కలహంస - రవములు సెవుల పండువులు సేయ**
**ఫుల్లదిందీవరాంభోరుహామోదంబు - ఘ్రాణ రంధ్రంబుల గారవింప**
**నిర్మల కల్లోల నిర్గతాసారంబు - వదన గహ్వరముల వాడు దీర్పఁ**

తే. **ద్రిజగ దభినవ సౌభాగ్య దీప్తమైన, విభవ మీక్షణములకును విందుసేయ**
**నరిగి పంచేంద్రియవ్యవహారములను, మఱచి మత్తేభయూథంబు మరుఁగుజొచ్చె. - 44**

మదగజాలకు కాసారాకర్షణం పంచేంద్రియాలకూ ప్రీతికరం. ప్రవృత్తిమార్గ పతితులకు సంసారం పంచేంద్రియ ప్రీతి జనకం. మదేభాలు ఇంద్రియాలకు వశమై కాసారంలో పడ్డాయి. మానవులు కూడా ఇంద్రియలోలురై సంసారంలో పడతారు.

గజరాజును కాసారంలో మకరం పట్టుకుంది. అపుడు గజేంద్రుని బాధ, మొర, కుయ్యి ఇవన్నీ జీవుని వేదనకు ప్రతీకగా కన్పిస్తాయి. ఈ సందర్భాన ఉన్న పద్యాలు బహుళ ప్రచారం పొంది ఆధునిక వర్తమాన కాలంలో కూడా పోతనను తలపిస్తున్నాయి. మచ్చుకు -

శా. **లా వొక్కింతయు లేదు; ధైర్యము విలోలంబయ్యెఁ; బ్రాణంబులున్**
**ఠావుల్ దప్పెను; మూర్ఛవచ్చెఁ; దనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్,**
**నీవే తప్ప నితః పరం బెఱుఁగ; మన్నింపం దగున్ దీనునిన్.**
**రావే యీశ్వర! కావవే వరద!; సంరక్షించు భద్రాత్మకా! - 90**

ఉ. **ఓ కమలాప్త! యో వరద! యో ప్రతిపక్ష విపక్ష దూర! కు**
**య్యో! కవియోగి వంద్యసుగుణోత్తమ! యో శరణగతామరా**
**నోకహ! యోమునీశ్వరమనోహర! యో విమలప్రభావ! రా**
**వే! కరుణింపవే! తలఁపవే! శరణార్థిని నన్నుఁగావవే! - 92**

ఆత్మనివేదనకు శరణాగతికి పై రెండు పద్యాలు ప్రబలోదాహరణలు. **'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ'** అనే గీతావాక్యానికి ప్రతీక **'లావొక్కింతయులేదు'** అనే పద్యం. ఈ పద్యం బహువిధాలుగ (పేరడీలుగా కూడా) ప్రజల్లోకి వెళ్లిందంటే దీనికున్న జనప్రియత్వం ఎంతటిదో అర్థమౌతుంది. పోతన బాల్యంలో శివభక్తుడుగా కనిపిస్తాడు. కాని, ప్రాయం వచ్చిన తరువాత శివకేశవ అభేద దర్శనం పొందిన విష్ణుభక్తుడుగా భాగవత రచనలో కనిపిస్తాడు. నిజమైన భక్తుడు. గొప్ప తాత్త్వికుడు. కనుక ఆయన చేసిన ఈ స్తుతి గజేంద్రునికేగాక ముముక్షువులందరకూ సకల జనాలకూ సోపానం లాంటిది. పై పద్యాలలోని ఆక్రోశం గజేంద్రునిదా!? పోతనదా!? మనదా!? అని ఆశ్చర్యంగా ప్రశ్నించుకుంటే - ఆ కథ చదివేటప్పుడు గజేంద్రునిది, అవి పద్యాలనుకున్నప్పుడు పోతనది, మనన సమయంలో మనది. ఈ పద్యాల్లోని భావం *'జీవునివేదన'* అనడం సుస్పష్టం. ఇవి సర్వ ఆస్తికజన సర్వకాలికస్తుతిగా నిలిచే హృద్యమైన పద్యాలు.

**క్షీరసాగరమథనం :** భాగవతంలోని చాలాకథలలో వాచ్యార్థం చాటున ప్రతీకాత్మకత గర్భితంగా ఉంటుంది. మనస్సు క్షీరసాగరానికి ప్రతీక. మంచీచెడూ సంఘర్షణమే / మనోవేదనమే క్షీరసాగరమథనం. దురాలోచనలు అసురులలాంటివి.

వారికి అమృతం లభించదు. అంటే మంచి జరుగదు. సదాలోచనలు సురలలాంటివి. వారికి దైవ (మోహినీ) సహాయంవల్ల అమృతం లభిస్తుంది. అంటే మంచి జరుగుతుంది. స్థూలంగా ఇదీ క్షీరసాగరమథనం కథలో ప్రతీకాత్మక విశేషం.

**వామనావతార చరిత్ర :** బలి అంటేనే బలం కలవాడని అర్థం. శుక్రాశ్రయం కలవాడు బలి. బలిని అణచివేసి వామనుడు సురలకు సాయం చేస్తాడు. భుజబలాని కన్నా బుద్ధిబలం గొప్పది. మానవుని శారీరక బలం బలిలాంటిది కాగా బుద్ధిబలం వామనుని లాంటిది. సత్త్వరజస్తమోగుణత్రయం మూడడుగుల నేలకు ప్రతీక. బలి, గుణత్రయం అనే మూడడుగుల నేలను విష్ణు (వామన) మూర్తికి సమర్పించి సుతలం (మంచిస్థలం) చేరుకుంటాడు. బలిపై కూడా వామనునికి కరుణ ఉంది. వామనుడు 'ఎవ్వని కరుణింప నిచ్ఛయించితివాని యఖిల విత్తంబు నేనపహరింతు' (661) అంటాడు. బలికి వామనుడు పరోక్షంగా మంచిని చేయాలనుకున్నాడు, చేశాడు. బలిని మొదట సుతలానికి (మంచిస్థలానికి) పంపించాడు వామనుడు (విష్ణువు). ఆ తర్వాత సావర్ణి మనువుకాలంలో బలిచక్రవర్తి దేవేంద్రుడవుతాడు. భగవానుని కరుణవల్ల అసురభావం పోతుంది. ఇదీ వామనావతార కథకు ప్రతీకాత్మక విశేషం.

**మత్స్యావతారకథ :** మత్స్యం నిత్యజాగృతికి ప్రతీక (చేప ఎప్పుడూ కన్నులు తెరచుకొని మెలకువతోనే ఉంటుంది) సత్యసంధతకు సత్యవ్రతుడు ప్రతీక. ఆయన జీవితగమనం అనే ప్రవాహంలో భక్తి అనే నావమీద ప్రయాణిస్తాడు. భగవంతుని నమ్మడం వల్ల ప్రళయం జరిగినా పరిరక్షితుడౌతాడు. వివస్వంతుడు అనే పేరుకలిగి ఏడవ "మనువు" అవుతాడు.

గజేంద్రునికథ జీవవేదనకూ, క్షీరసాగరమథనం కథ మానవమనస్సంఘర్షణకూ, వామనచరిత్రలోని మూడడుగులనేల గుణత్రయానికీ, మత్స్యావతారం నిత్యజాగృతికి ప్రతీకవిశేషాలుగా దర్శనమిస్తాయి.

## అనువాద విశేషాలు

అష్టమస్కంధ అనువాద విశేషాలను స్వల్పంగా ప్రస్తావించుకుందాం - వ్యాసులవారి సంస్కృత భాగవతం అష్టమస్కంధం 24 అధ్యాయాలుగ 593 శ్లోకాలుగ ఉంది. కాగా పోతన భాగవత అష్టమస్కంధం 743 పద్యగద్యాలలో (స్కంధాంతగద్యమినహా) ఉంది.

అష్టమస్కంధంలోని మొదటి అధ్యాయంలోని 33 శ్లోకాలలో వ్యాసులవారు మన్వంతర వర్ణనం చేశారు. ఈ భాగాన్ని పోతనగారు అష్టమస్కంధం 2 వ పద్యం నుండి 16 వ పద్యం వరకు చెప్పారు.

గజేంద్రమోక్షణ కథాభాగాన్ని వ్యాసులవారు 2, 3, 4 అధ్యాయాలలో 33+33+26= వెరసి 92 శ్లోకాలలో చెప్పారు. పోతనగారు ఈ భాగాన్ని 17 వ పద్యంనుండి 137 వ పద్యంవరకు అంటే 120 పద్యగద్యాలలో చెప్పారు. గ్రంథాల లెక్కన (గ్రంథం అంటే 32 అక్షరాలు) సరిపోల్చితే సంస్కృత గజేంద్రమోక్షం కన్నా తెలుగు గజేంద్రమోక్షణకథ నాలుగు భాగాలు పెరిగిందని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తెలిపారు.

సముద్రమథనకథ వ్యాసులవారు సంస్కృతంలో 5 నుండి 12 వ అధ్యాయంవరకు అంటే 8 అధ్యాయాలలో (50+39+46+46+29+57+43+47) 362 శ్లోకాలలో చెప్పారు. పోతన ఈ భాగాన్ని 142 వ వచనం నుండి 408 వ పద్యంవరకు చెప్పారు, అంటే 366 పద్యగద్యాలలో చెప్పారు.

వ్యాసులవారు మన్వంతర వర్ణన, వారి పాలన, వామనావతారచరిత్రలను 15వ అధ్యాయం నుండి 23వ అధ్యాయంవరకు అంటే 9 అధ్యాయాలలో చెప్పారు. ఇందులో (36+62+27+32+43+34+34+36+31) 366 శ్లోకాలున్నాయి. ఈ భాగాన్ని పోతన 436 వ వచనం నుండి 689 వ పద్యం వరకు అంటే 253 గద్యపద్యాలలో అనువదించారు.

సంస్కృతభాగవతం అష్టమస్కంధం 24 వ అధ్యాయం 61 శ్లోకాలతో మత్స్యావతారకథ ఉంది. ఈ భాగాన్ని పోతన 690 వ వచనం నుండి 741వ వచనం వరకు అంటే 51 గద్యపద్యాలలో అనువదించారు.

భాగవతం - సంస్కృత అష్టమస్కంధానికి తెలుగుఅష్టమస్కంధానికి శ్లోక / పద్యగద్యాలకూ గల సంఖ్యాది తారతమ్యం నిరూపితమైంది. దీనివలన సంస్కృత భాగవతంలోని అష్టమస్కంధాన్ని పోతనగారు యథాతథంగ మక్కికి మక్కిగా కాక వివరణాత్మకంగా అనువదించారని సూక్ష్మపరిశీలనంవల్ల తెలుస్తోంది.

**గజేంద్రమోక్షణం** మకరి నుండి తనను కాపాడమని కరిరాజు చేసిన స్తోత్రాన్ని విష్ణువు ఆలించడం మూలంలో ముచ్చటగా మూడు (3-31, 32, 33) శ్లోకాలలో ఉంది. ఈ సందర్భాన పోతన భాగవతంలో పెంచిన పద్యాలు ఇవి-

| | | |
|---|---|---|
| మ. | **అలవైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు** | **- 95** |
| మ. | **సిరికిం జెప్పఁడు; శంఖచక్రయుగముం జేదోయి** | **- 96** |
| వ. | **ఇట్లు భక్తపాలన పరాయణుండును,** | **- 97** |
| మ. | **తన వెంటన్ సిరి, లచ్చివెంటనవరోధ వ్రాతమున్** | **- 98** |
| వ. | **తదనంతరంబు ముఖారవింద మకరంద బిందు** | **- 99** |
| మ. | **తన వేంచేయు పదంబుఁ బేర్కొనఁ; డనాథశ్రీ** | **- 100** |
| వ. | **అని వితర్కింపుచు** | **- 101** |
| శా. | **తాటంకాచలనంబుతో, భుజనటద్ధమ్మిల్లబంధంబుతో** | **- 102** |
| క. | **అడిగెదనని కడువడిఁజను, నడిగిన** | **- 103** |
| సీ. | **నిటలాల కములంట నివుర జుంజుమ్మని** | **- 104** |
| మ. | **వినువీథిం జనుదేరఁ గాంచి రమరుల్** | **- 105** |
| వ. | **అయ్యవసరంబునఁ గుంజరేంద్ర పాలనపారవశ్యంబున** | **- 106** |

మొదలయిన పద్యగద్యాలన్నీ పోతన సొంతంగా కల్పించినవే. వీటిలో నారాయణునికిగల భక్తరక్షణ పరాయణత అభివర్ణితం.

**వామనావతారం :** అదితి గర్భంధరించడాన్ని పోతన సందర్భోచితంగా మిక్కిలి మనోహరంగా చెప్పాడు. ఆ పద్యాలు -

| | | |
|---|---|---|
| క. | **చలచలనై పిదపిదనై, దలలంబై కరుడుగట్టి** | **- 493** |
| క. | **నెలఁతకుఁజూలై నెల రె, న్నెలలై మతిమూఁడునాల్గు** | **- 494** |
| క. | **మహిత తర మేఘమాలా, పిహితాయుత** | **- 495** |

క. తన కదుపున నొక వెఱవున, వనరుహగర్భాండ - 496
వ. అంత నక్కాంతా తిలకంబు - 497
వ. నిలిపెన్ ఱెప్పల విశదిమన్ నేత్రంబులన్ - 498
క. పెట్టుదురు నుదుట భూతిని, బొట్టిడుదురమేన - 499
వ. ఇవ్విధంబున - 500
తే. విశ్వగర్భుండు దనగర్భ వివరమందు - 501

పై పద్యాలన్నీ అమూలకంగా, పోతన సొంతంగా చెప్పినవి.

**మత్స్యావతార కథ**

సంస్కృతమూలంలోని -

శ్లో. ప్రలయ పయసి ధాతుః సుప్త శక్తే ర్ముఖేభ్యః,
శ్రుతిగణ మపనీతం ప్రత్యుపాదాత్తహత్వా.
దితిజమకథయద్యో బ్రహ్మ సత్యవ్రతానాం,
తమ హమఖిలహేతుం జిహ్మ మీనం నతోస్మి (25 అధ్యాయం, 61 శ్లోకం)

పై శ్లోకాన్ని పోతన ఇలా తెలిగించారు -

మ. ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రంజెందు వాణీశు మో
ముల వేదంబులు గొన్న దైత్యునిమృతిం బొందించి సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మము మాటలం దెలిపి సర్వాధారుఁడై మీనమై
జలధిం గ్రుంకుచుఁ దేలుచున్ మెలఁగు రాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్. - 740

మత్స్యనారాయణుడు వేదవిద్యలను ఉద్ధరించిన అవతారం. విద్యాప్రదాత.

## వర్ణనలు

భాగవతం అష్టమస్కంధంలో ఎన్నెన్నో అందమైన వర్ణనలు చోటుచేసుకున్నాయి. వర్ణనానిపుణుడైన వాడే కవి. పోతన వర్ణనలలో భావుకత అలంకారాలు ప్రాసక్రీడావిలాసాలు ఎన్నెన్నో చమత్కారాలు కలిగి ఉంటాయి. లక్ష్మీమాత సౌందర్యాన్ని గజేంద్రమోక్షంలో పోతన ఇలా అభివర్ణించారు -

సీ. నిటలాలకములంట నివుర జుంజుమ్మని - ముఖసరోజమునిండ ముసరుఁ దేంట్లు;
నళులఁ జోఁపఁగఁ జిల్క లల్ల నల్లనఁజేరి - యోష్ఠ బింబద్యుతు లొడియ నుఱుకు;
శుకములఁ దోలఁ జక్షుర్మీనములకు మం - దాకినీ పాఠీన లోకమెసగు;
మీన పంక్తులదాఁట మెయిదీఁగతో రాయ - శంపాలతలు మింట సరణిగట్టు;

తే. శంపలనుజయింపఁజక్రవాకంబులు, కుచయుగంబుఁదాఁకి క్రొవ్వుసూపు;
మెలఁత మొగిలు పిఱిఁది మెఱుఁగుఁదీవయుఁబోలె, జలదవర్ణువెనుకఁజనెడునపుడు. - 104

మేఘం వెంట మెరుపుతీగలా వెళ్ళింది విష్ణువువెంట లక్ష్మీదేవి. ఆ సమయాన ఆమె నొసటిపై వేలాడే ముంగురులను చక్కదిద్దుకొనబోతే పద్మంలాంటి ఆమె ముఖంనిండా తుమ్మెదలు ఝుంఝుమ్మంటూ కమ్ముకున్నాయి. తుమ్మెదలను తోలుతుండగానే దొండపండువంటి ఆమె పెదవులమీద చిలుకలు వాలబోయాయి. ఆ చిలుకల్ని తరుముతుండగానే చేపల్లాంటి ఆమె కన్నుల మీదికి ఆకాశగంగలోని పెనుచేపలు ఎగిరి దుంకాయి. ఆ చేపల్ని తప్పించుకోగానే ఆమె తీగలాంటి శరీరంతో ఒరుసుకోవడానికి మెరుపుతీగలు బారులు తీరాయి. తీగలను అతిక్రమించగానే జక్కవజంటలు ఆమె కుచయుగాన్ని మిడిసిపడుతూ ఎదిరించాయి.

బహుశా తెలుగు కావ్యాల్లో, ప్రబంధాల్లో ఇలా స్త్రీ అవయవాల్ని మనోహరంగా వర్ణించిన కవులను వేళ్లపై లెక్కించవచ్చు. లక్ష్మీదేవి ప్రకృతి స్వరూపిణి కాబట్టి ఈ పోలికలన్నీ చక్కగా అమరుతున్నాయి. పద్మం కన్నా ముఖం, దొండపండు కన్నా ఓష్ఠం, చేపలకన్నా కన్నులు, మెరుపుతీగకన్నా మేనికాంతి, చక్రవాకాలకన్నా స్తనద్వయం ఎంతో అందంగా ఉన్నాయి. ఉపమేయమైన లక్ష్మీమాత సౌందర్యం అతీతమైందని ఈ వర్ణనలోని ధ్వని.

ఇదీ అమ్మలక్ష్మీదేవి వర్ణనం. కాగా ఇక స్వామివారి వర్ణనకు ఒక ఉదాహరణ –

ఈ స్కంధంలో బ్రహ్మ, హరుడు, సురలు దర్శించిన భగవంతుణ్ణి పోతన వర్ణించి మనకు ఇలా సాక్షాత్కరింపజేశారు–

**సీ. హార కిరీట కేయూర కుండలపాద – కటక కాంచీలతా కంకణాది**
**కౌస్తుభోపేతంబుఁ గౌమోదకీశంఖ – చక్రశరాసన సంయుతంబు**
**మరకతశ్యామంబు సరసిజనేత్రంబు – కర్ణాభరణకాంతి గండయుగము**
**గలిత కాంచనవర్ణ కౌశేయ వస్త్రంబు – శ్రీవనమాలికా సేవితంబు**

**ఆ. నై మనోహరంబునై దివ్యసౌభాగ్య, మైన యతని రూపు హర్ష మెసఁగఁ**
**జూచి బ్రహ్మ హరుఁడు సురలును దానును, బొంగి నమ్రుఁడగుచుఁబొగడఁదొడఁగె. – 161**

శ్రీమహావిష్ణువు హారాలూ, కిరీటం, భుజకీర్తులూ, కుండలాలూ, అందెలూ, మొలనూలూ, కంకణాలూ, కౌస్తుభరత్నం, కౌమోదకీగదా, శంఖం, చక్రం, ధనుస్సూ ధరించి ఉన్నాడు. స్వామివారి మేను మరకత మణిలా నల్లగా ఉంది. స్వామివారి కన్నులు పద్మాల్లా ఉన్నాయి – అవి కాంతులీనుతున్నాయి. తళతళలాడే మకరకుండలాల కాంతి చెక్కిళ్లపై ప్రసరిస్తూంది. శ్రీవారు బంగారురంగు పట్టువస్త్రాన్ని ధరించి ఉన్నారు. కంఠాన వైజయంతీమాల ప్రకాశిస్తూ ఉంది. మిక్కిలి అందంగా ఉన్నాడు చక్కనైన స్వామివారు.

బ్రహ్మాదులు దర్శించిన స్వామివారిని పై పద్యంలో వర్ణించి మన మనఃఫలకంపై సాక్షాత్కరింపజేశారు పోతనగారు. విస్తరభీతివల్ల కేవలం లక్ష్మీమాత, మహావిష్ణువు వర్ణనలు మాత్రం ఉదాహృతం. భక్తి శృంగారానికి జోడు కాబట్టి దేవునిసైతం పోతన సింగారం చూపుతోనే చూస్తాడు. ఆ శృంగారాన్ని హృద్యపద్యంగా రచించి మనకూ దర్శింపజేస్తాడు. అలాంటి పద్యాలు అష్టమస్కంధంలో ఉన్నాయి. ఉదాహరణకు ఒక్క పద్యం –

**శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ, దనువుపై, నంసోత్తరీయంబుపైఁ**
**బాదాబ్జంబులపైఁ గపోల తటిపైఁ బాలిండ్లపై నూత్న మ**

**ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీఁదై నా కరంబుంట మేల్**
**గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు నాపాయమే?** **– 592**

సహజపాండిత్యులు పోతనామాత్యులు రచించిన అమూలకమైన పద్యాలలో ఇదొకటి. పోతనగారికి విష్ణువును తలచుకోగానే ఒడలు పులకరిస్తుంది. శ్రీహరిలోని శృంగారాన్ని పోతన భక్తితో దర్శిస్తాడు. శృంగార రహిత శ్రీవిష్ణువు పోతన కంటబడడు. పోతనకు కూడా శ్రీహరి శృంగార రహితంగా దర్శనమివ్వడు. పై పద్యంలో శ్రీదేవి కొప్పు, కొంగు, పాదాలు, కపోలం, పాలిండ్లు చెప్పడంలో క్రమభంగంవలె కనిపిస్తుంది. కానీ ఇందులో ప్రణయ కుపితలయిన మానినుల అనునయం ఉంది. స్త్రీలు పొలయలుకలు పూనినపుడు దగ్గరకు చేరి వారిని మొదట తనవైపు తిప్పుకోవలె. అప్పటికీ పెడమొగమైతే కొంగుపట్టుకొని ఆపవలె. వ్యవహారం అప్పటికీ ఒక కొలికికి రాకపోతే దాసునితప్పు దండంతో సరి. ఆ తర్వాత బుగ్గలు నిమురుతూ ఓదార్చవలె. ఇలా పరిపుష్టినందిన శృంగారం ఈ పద్యంలో పోతన మనకందించారు. ఈ విషయాన్ని కపిలవాయి లింగమూర్తిగారు భాగవత కథాతత్త్వంలో (212–13 పుటలు, 1989 ప్రథమముద్రణ) తెలిపారు.

అష్టమస్కంధంలో పోతనగారి వర్ణనానైపుణ్యానికే గాక ఆయన భావుకతకూ ఉదాహరణగా చాలాపద్యాలున్నాయి. స్థాలీపులాకన్యాయంగా ఒక్క పద్యం –

**మ. రవి బింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై,**
**శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణ కేయూరమై**
**ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర**
**ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్** **– 623**

సంస్కృతమూలంలో ఈ భావం లేదు. అంచెలంచెలుగా వామనుడు / వటుడు పొందిన క్రమపరివర్ధనం ఈ పద్యంలో కనులకు కట్టినట్లు చూపాడు పోతన. పద్యంలో చెప్పదలచుకున్నది వామనుని క్రమ పరివర్ధిత పరిణామం గురించి, అందుకు సూర్యబింబం ఒక ప్రమాణం. ఆ ప్రమాణం స్థిరంగా నిలిచి ఉంది. సూర్యుడు వామనునికి గొడుగుగా, చూడామణిగా, నూపురంగా, పదపీఠంగా మారుతూపోయాడు. ఇది వ్యాసుని కల్పనకాదు. పోతనగారి కవితాత్మలో మెదలిన బంగారు కాంతులీనే బొమ్మ. ఇంతటి భావుకత చోటుచేసుకున్న వర్ణనపద్యాలు చాలా అరుదు.

**శ్లేషవ్యంగ్యచమత్కారాలు**

అష్టమస్కంధంలోని వర్ణనలలో ఉపమలు, ఉత్ప్రేక్షలు, అతిశయోక్తులు, శబ్దగత శ్లేషలు మొదలయిన అలంకారాలు చోటుచేసుకున్నాయి. మచ్చుకు గజేంద్రమోక్షంలోని 50 వచనంలో ఉపమలు, ఉత్ప్రేక్షలు ఒకదానితో ఒకటి పోటీపడుతూ సాగాయి. **'వనగజంబునెగుచు'** (66వ పద్యం) లో అతిశయోక్తి, శబ్దగత శ్లేషాలంకారం ఉంది. ఇక శ్లేషలు వ్యంగ్యాలను కొన్నింటిని సోదాహరణంగా పరిశీలింతం –

పోతన పద్యగద్యాలలోనూ శ్లేష వ్యంగ్య చమత్కారాలను సందర్భోచితంగా రచించడంలో దిట్ట. మచ్చుకు – వామనావతార ఘట్టంలోని వచనంలో స్వర్గనగరాన్ని వర్ణించే సందర్భంలో 447వ వచనంలో –

**'రత్నాకరంబునుం బోలె ననిమిష కౌశికవాహినీవిశ్రుతంబయి, శ్రుతి వాక్యంబునుం బోలె సువృత్తంబయి, వృత్తజాతంబునుం బోలె సదా గురులఘు నియమాభిరామంబయి, రామచంద్రుని తేజంబునుం బోలె నమలాంతరంగ ద్యోతమానంబయి, మానధనుని నడవడియునుంబోలె సన్మార్గభాతి సుందరంబయి,.... గోపతి మూఁపురంబునుం బోలె విచక్షురార్యాలంకృతంబయి'** అనే భాగాలు శ్లేష చమత్కార విలసితాలు. ఇలాంటి వర్ణనలు బాణభట్టు, దండి మొదలయినవారి బాణిలో సాగుతాయి. ఈ వర్ణనలు పోతన పాండితీవైభవాన్ని తెలియచేస్తాయి. శ్లేషకవితాప్రియుల హృదయాలను అలరిస్తాయి.

బలిచక్రవర్తి వామనుని **'వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు?'** (549) అని అడిగినప్పుడు వామనుడు చెప్పిన సమాధానం వ్యంగ్య పూరితంగా భగవత్తత్వాన్ని వ్యక్తం చేస్తుంది. పోతన వ్యంగ్య రచన అద్భుతం, మనోహరం, పాఠకులు కొంచెం ఆలోచిస్తే దానిలోని సామాన్య, విశేష అర్థాలు రెండూ కూడా గోచరిస్తూ ఉంటాయి. మచ్చుకు ఒక పద్యం–

సీ. **ఇదినాకు నెలవని యేరీతిఁబలుకుదు? – నొకచోటనక యెందు నుండనేర్తు;**
**నెవ్వానివాఁడ నంచేమని పలుకుదు? నాయంత వాఁడనై నడవనేర్తు;**
**నీ నడవడి యని యెట్లు వక్కాణింతుఁ – బూని ముప్పోకలఁబోవనేర్తు**
**నది నేర్తు నిది నేర్తు నని యేల చెప్పంగ? – నేరుపులన్నియు నేన నేర్తు**

ఆ. **నొరులుగారు నాకు నొరులకు నే నౌదు, నొంటి వాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు**
**సిరియుఁ దొల్లి గలదు చెప్పెద నాటెంకి, సుజనులందుఁ దఱచుఁ జొచ్చియుందు – 552**

వామనుడు బలివదాన్యతను మెచ్చుకుంటూ పలికిన – **'ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగులు'** – అనే (566వ) పద్యం, శుక్రుడు మూడడుగుల నేలను దానం చేయవద్దన్నప్పుడు బలి పలికిన – **'ఎన్నఁడుం బరువేడఁ బోడఁట! యే కలుండట!'** – అనే (596వ) పద్యం, **'ఇది యేమి వేడితని నీ మది'** – అనే (617వ) పద్యం, **'పుట్టినేర్చుకొనెనొ పుట్టక నేర్చెనో'** – అనే (619వ) పద్యం పోతన వ్యంగ్య చిత్రణకు చక్కని ఉదాహరణలు.

## ఛందోవిశేషాలు

అష్టమస్కంధంలో సంస్కృతచ్ఛందోజాతాలయిన సామాన్యవృత్తభేదాలు 4, విశేషవృత్తభేదాలు 2 ప్రయోగించబడినవి. సామాన్యవృత్తాలు – ఉత్పలమాల, చంపకమాల, శార్దూల విక్రీడితవృత్తం, మత్తేభవిక్రీడితవృత్తం. విశేషవృత్తాలు– మత్తకోకిల, మాలిని.

దేశీయచ్ఛందస్సులోని జాతులు, ఉపజాతులు ప్రయోగించబడ్డాయి. అవి జాతులు – కందాలు, ఉపజాతులు– సీసాలు, ఆటవెలది, తేటగీతి. పద్యాలు మాత్రమేగాక వచనాలు కూడా ఉన్నాయి. కనుక పోతన భాగవత రచన చంపూపద్ధతికి సంబంధించింది.

అష్టమస్కంధంలో పద్యాలు 508+వచనాలు 236; మొత్తం 744 పద్యగద్యాలు.

## సంప్రదాయం

ఇక వరుసగా సంప్రదాయాలు ఆ యా పద్యప్రయోగ విశేషాలు మొదలయినవి తెలుసుకుందాం –

శ్రీకారంతో గ్రంథాన్ని ప్రారంభించడం సంప్రదాయం. పోతనగారు 'శ్రీకైవల్య' అని గ్రంథాన్నేగాక గ్రంథంలోని స్కంధాలను కూడా శ్రీకారంతోనే ప్రారంభించారు. అష్టమస్కంధం "శ్రీమన్నామ" అని ప్రారంభించారు.

భాగవతగ్రంథాన్నీ అందులోని అష్టమస్కంధాన్నీ పోతనగారు మంగళప్రదమైన మగణంతోనే ప్రారంభించడం ప్రస్తుతం స్మరణీయం.

## సంస్కృతచ్ఛందోజాత సామాన్యవృత్తాలు

**ఉత్పలమాల :** గజేంద్రమోక్షంలోని ఉత్పలం భగవదర్పితం. భగవంతునికి పత్రం, పుష్పం, ఫలం, తోయం ఏదో ఒకటి సమర్పించాలని అంటారు. గజేంద్రుడు కరం (తుండం) తో ఒక పుష్పాన్ని భగవానునికి అర్పింపజేశాడు పోతన. అది ఉత్పల (పద్య) పుష్పం. "ఓ కమలాక్ష!" (92) అనే పద్యం. ఇక్కడ ఉత్పల (పద్య) పుష్పమే భగవానునికి అర్పించడంలోని విశేషం. విష్ణువు *'అలవైకుంఠపురం'* లో *'ఉత్పలపర్యంకం'* మీద రమావినోదియై ఉన్నాడు కదా! ఇదీ ఉత్పల రహస్యం. గజేంద్రమోక్షణకథా చిత్రకారులు సైతం ఏనుగు తుండాన ఒక (ఉత్పల) పుష్పాన్ని చిత్రించడం పోతనగారి పద్యప్రయోగ ఔచిత్యాన్ని గ్రహించడంవల్లనే అని భావించవచ్చు.

***చంపకమాల :*** గజేంద్రమోక్షణంలో (53 వ) పద్యం "చంపకమాల" కావడం విశేషం.

చ **పదములఁ బట్టినం దలఁకుఁబాటొకయింతయు లేక శూరతన్**
**మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంత ఘట్టనం**
**జెదరఁగఁ జిమ్మె న మ్మకరిచిప్పలు పాదులు దప్ప నొప్పఱన్**
**వదలి జలగ్రహంబు కరివాలముమూలముఁ జీరెఁ గోఱలన్. – 53**

సరస్సులో చంపకాలు ఉండే అవకాశం లేదు. కనుక ఈ కథలో పోతన్న చంపకమాల వృత్తాలు ఎక్కువగా ప్రయోగించలేదు. 53 వ పద్యం ఒక్కటే ప్రమాద పతితం అయింది. గజరాజుకూడా ప్రమాద పతితుడయ్యే సరోవరంలో పడ్డాడని పోతన ధ్వనింపచేశాడని కొందరు చమత్కరించారు.

***శార్దూల విక్రీడితం :*** సామాన్యార్థం విశేషార్థం సమన్వయపడే పదాలను ప్రయోగించడంలోను అందుకు తగిన పద్యాన్ని ఎంపిక చేసి రచించడంలోను పోతన ప్రవీణుడు. అందుకు కింది శార్దూలం కూడా ఒక సాక్ష్యం–

శా. **ఆశాపాశము దాఁగదున్ నిడుపు; లే దంతంబు రాజేంద్ర! వా**
**రాశిప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు సేకూడియుం**
**గాసింబొందిరిగాక వైన్యగయ భూకాంతాదులు; న్నర్థ కా**
**మాశం బాయఁగ నేర్చిరే మును నిజాశాంతంబులం జూచిరే! – 575**

పై పద్యం వాక్యాలు వామనుడు బలిచక్రవర్తితో అంటాడు. **'ఆశాపాశము తాకదు న్నిడుపు'** – 'ఆశాపాశం' అనే అక్షరాలన్నీ దీర్ఘాలే (నిడువులే) / గురువులే. ఆ దీర్ఘాలకు అంతంలేదు. ఆ శాపాశాలకూ అంతంలేదు. ఆశాపాశాలు

శార్దూలంలా భయంకరమైనవని సూచన. అందుకే శార్దూలవృత్త ప్రయోగం. శా–ర్దూ–లం అనే అక్షరాలు కూడా నిడుపులే. ఇదీ పోతనగారి ఛందః ప్రయోగ మర్మజ్ఞత. ఆశను ఆస అని కూడా అంటారు. ఈ పద్యంలో శ–స ప్రాసప్రయోగం కూడా ఉంది.

*అంత్యానుప్రాసవిలసితమైన శార్దూలవిక్రీడితాలు :* దేహముం, సందోహమున్, దేహమున్, గాహంబున్, ఉత్సాహము, దాహము, మోహము, గ్రాహమున్ (112) పాంచజన్యమున్, సౌజన్యమున్, చైతన్యమున్, రాజన్యమున్, దైన్యమున్, సైన్యమున్ (116)

**మత్తేభవిక్రీడితం :** గజేంద్రమోక్షంలో వాడిన పద్యాలలో మత్తేభాలది తృతీయస్థానం. ఈ కథ మత్తేభానిదే కదా!

**కలభంబుల్ సెరలాడుఁ బల్వలము లాఘ్రాణించి - (35వ పద్యం)**
**ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీరెక్కించి - (47వ పద్యం)**
**పృథుశక్తిన్ గజమా జలగ్రహముతోఁ బెక్కేండ్లు - (70వ పద్యం)**
**అవనీనాథ! గజేంద్రుఁ డామకరితో నాలంబుగావించె - (122వ పద్యం)**

అనే పద్యాలు మత్తేభవిక్రీడితాలు. ఈ పద్యాలలో మత్తేభాలను వర్ణించడం విశేషం, ఇది గూఢముద్రాలంకారం కూడ.

మోహినీవిలాసం – **'ప్రబలోద్యత్కరిణిం గరీంద్రుడు రమింపన్వచ్చు'** (402) అనే పద్యంలో మోహినిని యౌవనంలో గల ఆడ ఏనుగుగా శివుడిని మదించిన మగ ఏనుగుగా పోల్చాడు కవి. మత్తేభవిక్రీడితోపములైన మోహినినీ శివుడినీ మత్తేభవిక్రీడితంలోనే వర్ణించడం కవిగారి ఛందః ప్రయోగ నైపుణ్యానికి తార్కాణం. వామనచరిత్రలోని –

**మ. కనియెం బుణ్యజనౌకమున్ విగతరోగస్వప్న పీడాన్న ఖా**
**దన సంశోకముఁ బుష్పపల్లవ ఫలోద్దామ ద్రుమానీకమున్**
**స్వనితోద్ధూత పతాకముం బ్రవిచరద్వైమానికానీకమున్**
**ఘనగంగాసలిలైకమున్ మఘవయుక్త శ్రీకమున్ నాకమున్ – 446**

కల్హారమున్, ఇందిందిరవారమున్, దుర్వారమున్, కుటీరమున్, సంచారమున్, కాసారమున్ (42).

విష్ణున్, నిరాకరిష్ణు, వర్ధిష్ణు, వర్తిష్ణు, సహిష్ణు, అలంకరిష్ణు, చరిష్ణు, జిష్ణు, రోచిష్ణు (105).

భూమిచక్రము, శుక్రము, నిర్వక్రము, అంధచక్రము, చక్రము (109).

నిశాటంబమున్, కూటంబు, కూటము, ఘోటమున్, కావాటంబున్ (531).

ఇత్యాది మత్తేభవృత్తపద్యాలు అంత్యప్రాసాలంకార హృద్యాలు.

**సంస్కృతచ్ఛందోజాతవిశేషవృత్తాలు**

**మత్తకోకిల :** లక్షణం – ర, స, జ, భ, ర గణాలు. 11వ అక్షరం యతిస్థానం, ప్రాసనియమం ఉంది.

**మాలిని :** లక్షణం – న, న, మ, య, య గణాలు. 9వ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉంది. ఈ స్కంధంలో మాలిని చిట్టచివరి పద్యం (743). గ్రంథాంతాన / స్కంధాంతాన / ఆశ్వాసాంతాన మాలిని ప్రయోగం సంప్రదాయంగా వస్తోంది. ఆ సంప్రదాయాన్ని పాటించారు పోతన.

**మాలిని.**

**దివిజరిపువిదారీ! దేవలోకోపకారీ!**
**భువనభరనివారీ! పుణ్యరక్షానుకారీ!**
**ప్రవిమలశుభమూర్తీ! బంధుపోషప్రవర్తీ!**
**ధవళబహుళకీర్తీ! ధర్మనిత్యానువర్తీ!**

ఈ గ్రంథంలో బలిని అణగదొక్కడం ఉంది. మాలినీలో 'దివిజరిపువిదారీ' అనే పదం ప్రయోగించడం స్మరణీయం. స్కంధంలో క్షీరసాగరమథన సమయాన విష్ణువు మోహినీ అవతారంలో దేవతలకు మాత్రమే అమృతాన్ని పంచి ఉపకారం చేశాడు విష్ణుమూర్తి. ఈ మాలినిలో **'దేవలోకోపకారీ'** అనే సంబోధన ఉండడం ఆ కథను స్మరించడమే. **'రాజధరార్చిత'** అనే పేరు మాలినిలో ఉంది. రాజధరుడు శివుడు. మోహినీ అవతార సందర్భాన శివుడు విష్ణుమూర్తిని స్తుతించడాన్ని (అర్చించడాన్ని) ఈ సంబుద్ధి సూచిస్తుంది. ఇలా అష్టమస్కంధంలోని కథాంశాలకు ప్రతీకగా స్కంధాంతాన ప్రయోగింపబడిన మాలినిపద్యంలో సంబోధనలు ఉండడం విశేషం. మాలిని అంటే మాలను ధరించినది అనికూడ అర్థం. మాలను ధరించిన పద్యవాణితో స్కంధం పూర్తయింది. నిత్యం ధర్మాన్నీ, నీతినీ పాటిస్తూ భగవద్భక్తులు కూడా అలా ఉండాలనే ప్రతీకాత్మకమైన సందేశంతో స్కంధం పూలమాలదాల్చిన మాలినితో సంపూర్ణమయింది.

**దేశీయచ్ఛందోజాతపద్యాలు**

**జాతులు :** సమమాత్రలు కలిగిన గణాలతో ఏర్పడేవి జాతులు. కందపద్యాలు జాతులకు చెందినవే.

**కందం :** నన్నయ మొదలు ప్రబంధకవులదాకా పద్యకావ్య కర్తలందరూ తమగ్రంథాలలో కందాన్నే ఎక్కువగా ప్రయోగించారు. దానికి ప్రధానకారణం ఈ పద్యంలో వరుసగా ఎక్కువ లఘువులు లేదా ఎక్కువ గురువులు గల పేర్లు మొదలయినవి పొదిగేందుకు అనువైన ఛందం కావడమే. సంస్కృత పురాణాలలో 'అనుష్టుప్' ప్రయోగం ఎక్కువగా ఉండడానికి కూడా కారణం ఇదే. పోతనకూడా కందాన్నే అన్ని పద్యాలకన్నా ఎక్కువగా భాగవతంలోనూ అష్టమస్కంధంలోనూ ప్రయోగించాడు.

పోతన సర్వలఘుకందాలు కూడా రచించాడు. ఆ రచన సందర్భోచితంగా కూడా ఉంటుంది. మచ్చుకు–

**క. అడిగెదనని కడువడిఁ జను, నడిగినఁ దనుమగుడ నడుగఁ డని నడయుడుగున్**
**వెడవెడ చిడిముడి తడఁబడ, నడుగిడు, నడుగిడదు జడిమ నడుగిడ నెడలన్ – 103**

లక్ష్మీమాత అడుగులు వేయడం ఈ కందంలో అందంగా చెప్పబడింది. గజేంద్రరక్షణం కోసం వెళ్లిన విష్ణువు వెంట లక్ష్మి తడబడుతూ వెళ్లే సందర్భాన ఈ పద్యం ఉంది. 'డ' కార ప్రాసతో ఉండే ఈ పద్యం భాగవతపాఠకుల కందరకూ బాగా తెలిసిందే.

**క. వెడనెడ నడకలు నడచుచు నెడనెడ నడుగిడగ నడది యిల దిగఁబడఁగా**
**బుడిబుడి నొడువులు నొడువుచుఁ జిడిముడి తడఁబడఁగ వడుగు సేరెన్ రాజున్ - 541**

ఇది వామనుడు నడిచినప్పటి సందర్భాన్ని వర్ణించే కందం.

సర్వలఘుకందాలు మరికొన్ని. అవి – కసిమసగి (146), విడువిడుదని (199), ఎడమకుడిమునుపు (212), అష్టమస్కంధంలో ద్విప్రాస, త్రిప్రాస కందాలు, అంత్యానుప్రాస కందాలూ ఉన్నాయి.

ద్విప్రాసకందాలు – నీరాట, బోరాట, నారాట, ఘోరాట (19), కెంపారె, జంపారె, సొంపారె, పెంపారె (267), శోధించి, సాధించి, రోధించి, బోధించి (327), ఈరాదు, పోరాదు, రారాదు, జారాదు (454), వత్తురె, యిత్తురె, తెత్తురె, యిత్తురె (521), శర్మద, వర్మద, మర్మద, దుర్మద (529), త్రి ప్రాసకందాలు మరికొన్ని – పెట్టుదురు, నెట్టుదురు, కట్టుదురు (499), ఏలితిని, తోలితిని, పోలితిని, చాలితిని (562)

పోతన కందాలు మాకంద రసస్యందాలు. ప్రాసక్రీడా విన్యాస విలసితాలు.

**ఉపజాతులు :** సీసం, తేటగీతి, ఆటవెలది అనే ఉపజాతి పద్యాలను అష్టమస్కంధంలో పోతన వాడాడు.

**సీసం :** పోతనగారి సీసపద్యాలు "మందార మకరంద మాధుర్య" సంభరితాలు. కవితా మకరందాలతో నిండి ఉంటాయి.

**తేటగీతి :** పోతన సీసపద్యాల ఎత్తుగీతులలో తేటగీతులే ఎక్కువగా ఉన్నాయి.

**ఆటవెలది :** పోతనగారి ఆటవెలదులనడక ఆధునికుల ఆటవెలదులకు కూడా విరుపులు నేర్పించింది. వేమనుండి నార్లవారి వరకూ నార్లవారినుండి నేటివరకూ పోతనగారి ఆటవెలదులు వారివారి ఆటవెలదులకు నడకలు నేర్పాయి, నేర్పుతూనే ఉన్నాయి. 'ఒక వింత యొయ్యారముతో ఆంధ్రభాషలో నాటవెలది యడుగుపెట్టినదీ పోతన్నతోనే' అని పుట్టపర్తినారాయణాచార్యులవారు చెప్పారు (ఆంధ్రమహాభార తోపన్యాసములు, పుట 196, 197).

**వాలుగంటి వాఁడి వాలారుఁ జూపుల, శూలిధైర్యమెల్లఁ గోలుపోయి**
**తఱలి యెఱుక లేక మఱచె గుణంబుల, నాలిమఱచె నిజగణాలి మఱచె. - 397**

అనే ఆటవెలది మోహినీవిలాసంలో ఉంది. వాలుగంటి అంటే కత్తిలాంటి కన్నులు గలది అనికూడా అర్థం. పదునైన చూపులు కలది అని భావం. మోహిని జంటవాలుగంటి కాగా శివుడు ముమ్మొనవాలు కాదు అంటే త్రిశూలి. కనుకనే పద్యంలో 'శూలి' పదప్రయోగం జరిగింది. జంటవాలుగంటి పదునుచూపులకు (ముమ్మొనవాలు కాదు) శూలి ధైర్యం కోలుపోయాడన్న మాట. ఇక్కడ మోహిని చూపుల గొప్పదనం చెప్పబడింది. వాలుగంటి, శూలి పదాలు సాభిప్రాయ ప్రయోగాలు. ఇది సర్వతః ప్రాసపద్యం. ప్రాస అంటే ఈటె. ఇవన్నీ కత్తులకు అంటే ప్రాసలకు సంబంధించిన పదాలు. కనునే ఈ ఆటవెలదిని అంటే నాటకమాడే మోహినీ అనే వెలదిని వర్ణించేటప్పుడు సర్వతః ప్రాసకలిగిన ఆటవెలదిని రచించాడు పోతన. ప్రాసక్రీడావిలాసాలకు ఉదాహరించ దగ్గ పద్యాలలో ఈ ఆటవెలది కూడా ఒకటి.

'ఎగురవైచి పట నెడలేమిఁ జేదప్పి' (399) అనే పద్యంలో మోహిని బంతి ఆట ఆడడం వర్ణించబడింది. (బంతి) ఆట ఆడే వెలదిని (మోహినిని) ఆటవెలదిలోనే వర్ణించడం కవిగారి ఛందఃప్రయోగ మర్మజ్ఞతకు చక్కని ఉదాహరణ.

**వచనాలు :** అష్టమస్కంధంలో పెద్దవీ మిక్కిలి చిన్నవీ అన్నీ కలిపి 236 వచనాలున్నాయి. వచనం నడక అక్కడక్కడ బాణుని కాదంబరినీ, రామానుజాచార్యులవారి గద్యత్రయినీ స్ఫురణకు తెస్తుంది. పద్యానికన్నా గద్యం జనరంజకంగా రచించడం కష్టం. గద్యరచన కవులకు నికషం లాంటిది.

పోతన కొన్ని వచనాల ఎత్తుగడలు కందపద్యంలా ఉంటాయి. మరికొన్ని వచనాలు వృత్తగంధుల్లా ఉంటాయి. ఇది పోతనగారికి పద్యాలపై ఉండే మక్కువ వలన, వారి గంటం అలా సాగిందనుకోవచ్చు. ఇలాంటి వాటికి కేవలం రెండు ఉదాహరణాలు –

*'మహనీయ గుణగరిష్ఠుల'* – (2) ఈ వచనం కందపద్యపు ఎత్తుగడవలె ప్రారంభించబడింది.

*'ఇట్లు తపంబు సేయుచు'* – (9). ఈ వచనం ఉత్పలమాలావృత్తగంధివలె ఉంది.

**స్కంధాంతగద్య :** పోతన రచించిన గద్య అన్ని స్కంధాలకు 'ఇది శ్రీపరమేశ్వర... శ్రీభాగవతంబను మహాపురాణంబందు' అనే భాగం ఒకేరీతిగా ఉంది. తర్వాతి భాగంలో ఆయాస్కంధాలలోని కథలవివరాల క్రమం ఉంటుంది. అష్టమస్కంధంలోనూ అలాగే ఉంది. దీనివలన స్కంధంలో ఎక్కడైనా గ్రంథపాతాలు జరిగితే స్థూలంగా గుర్తించే వీలుకూడా ఉంది. అందుకే పూర్వకవులు కొందరు ఈ నియమాన్ని పాటించారు.

**లక్షణశాస్త్ర పరిజ్ఞానం – విషమాక్షర ప్రయోగం**

మాయాభిక్షుడగు వామనుడు రక్షోవల్లభుడయిన బలిని చూసి మొట్టమొదట పలికిన పలుకులు (1) 'ఇతడేదానవ చక్రవర్తి' (543వ పద్యం), (2) 'స్వస్తి జగత్త్రయీ' (545వ పద్యం). ఈ రెండు పద్యాల్లో బలి చక్రవర్తి జీవితం మొత్తం నిబిడీకృతమై ఉంది. ఆ పద్యాలు –

**మ. ఇతడే దానవ చక్రవర్తి సురలోకేంద్రాగ్ని కాలాది ది**
**కృతి గర్వాపనయ ప్రవర్తి, గతలోభస్ఫూర్తి, నానామఖ**
**వ్రతదాన ప్రవణానువర్తి, సుమనోరామా మనోభేదనో**
**ద్ధత చంద్రాతప కీర్తి, సత్య కరుణాధర్మోల్ల సన్మూర్తిదాన్. – 543**

**ఉ. స్వస్తి జగత్త్రయీ భువన శాసన కర్తకు, హాసమాత్ర వి**
**ధ్వస్త నిలింపభర్తకు, నుదార పదవ్యవ హర్తకున్, మునీం**
**ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు, నిర్జరీగళ**
**న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు, దానవలోక భర్తకున్. – 545**

పై పద్యాలలో విషమాక్షర ప్రయోగం ఉంది. మొదటి పద్యం (543)లో ఏడవస్థానంలో 'చ' కారప్రయోగం, రెండవ పద్యం (545) మూడవ స్థానంలో 'జ' కారప్రయోగం ఉంది. 'పురాస్త్రగిరి రుద్రేషు అకచటహ మాతృకా

నింద్యాః' అని లాక్షణిక మతం. పద్యముఖంలో 3,5,7,11 స్థానాలలో 'అ-క-చ-ట-హ' అనే అక్షరాలు ఉండరాదని శాస్త్రం'.

కవిజనాశ్రయం అనే లక్షణ గ్రంథంలో - *'క. హజగడలిడి మూడవచో, నిజముగ నిందించి చెప్ప నీల్గుట యరుదే, భుజగమున కన్న కీడగు'* - అని ఉంది. ఇవన్నీ పూర్వ పరంపరను బట్టి వచ్చినవే.

పోతన కూడా పై పద్యాలలో 'చ' కార 'జ' కార ప్రయోగాలు ఇష్ట పూర్వకంగానే ప్రయోగించి వామనునితో బలిచక్రవర్తిని ఉద్దేశించి చెప్పించాడు.

'స్వస్తి' శబ్ద ప్రయోగం కూడా సాభిప్రాయ ప్రయోగమే. దీనికి యౌగిక లాక్షణిక అర్థాలు రెండూ బలిచక్రవర్తిపట్ల సార్థకమయ్యాయి. 'స్వస్తి' అంటే ఇక అయిపోయిందనే అర్థం రూఢంగా ఉంది. మంగళం పాడాడంటే పని అయిపోయిందని లెక్క. పోతనగారు ప్రయోగించే కొన్ని పదాలు సామాన్యార్థంలో కనిపించినా వాటికి రెండు వైపులా పదునుండే కత్తిలాంటి పదాలవి. పోతన గారికి లాక్షణికశాస్త్రాలలో చెప్పిన విషమాక్షర ప్రయోగ విశేషజ్ఞత ఉందని పై పద్యాలు స్పష్టీకరిస్తున్నాయి.

## విష్ణుపారమ్యం

భాగవతం విష్ణుపారమ్యాన్ని ప్రబోధించే పురాణం. సర్వాంతర్యామిత్వం విష్ణుదేవునికి మాత్రమే వర్తిస్తుందని, స్థితికారకుడుగా, రక్షకుడుగా ఉన్న విష్ణుమూర్తితత్త్వాన్ని ఈ సన్నివేశం నిరూపిస్తోందని మనం గుర్తించవచ్చు.

ఈ అష్టమస్కంధంలో విష్ణుపారమ్యాన్ని చాటే పద్యాలు చాలా ఉన్నాయి. పారమ్య శబ్దానికి పరమోత్కృష్టమైన అనే అర్థం ఉంది. (పారమ్యశబ్దానికి పర్యాయపదనిఘంటువులో (జి.ఎన్.రెడ్డిగారు) 48 పర్యాయపదాలు ఇచ్చారు.)

విష్ణుపారమ్యాన్ని తెలియజేసే గజేంద్రమోక్షణంలోని ఒకటి రెండు పద్యాలను గురించి (విస్తరభీతిచే) సంక్షిప్తంగా ప్రస్తావించుకుందాం -

**క. విశ్వకరు విశ్వదూరుని, విశ్వాత్మకు విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్**
**శాశ్వతు నజు బ్రహ్మ ప్రభు నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్ - 88**

**ఆ.వె. విశ్వమయత లేమి వినియు నూరక యుండి, రంబుజాసనాదు లడ్డు పడక**
**విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు, భక్తియుతున కడ్డుపడఁ దలంచె - 94**

పై రెండు పద్యాల్లో మొదటిది గజరాజు విష్ణువును స్తుతించింది కాగా రెండవ పద్యం బ్రహ్మాదులు విశ్వమంతా నిండి ఉండే గుణం లేనివారు కావటం వల్ల గజరాజు మొర వినిపించినాకూడా సాయపడలేక ఊరక ఉండిపోయారనీ, విశ్వమయుడూ విభుడు విజయశీలి అయిన విష్ణువు గజరాజును కాపాడడానికి నిశ్చయించుకున్నాడని తెలిపే సందర్భాన పోతన చెప్పారు. ఇవి విష్ణువు పారమ్యాన్ని చాటే పద్యాలలో మచ్చుకు మాత్రమే.

విశ్వశబ్దం భగవంతుని సర్వతోముఖమైన పరిపూర్ణతను, తన స్వరూపంతో వ్యాపించడాన్ని తెలుపుతుంది. విశ్వశబ్దం సర్వవ్యాపకానికి పర్యాయమై సమగ్రతను తెలుపుతుంది. రూఢినిబట్టి 'విశతీతి విశ్వం' అనే వ్యుత్పత్తిని బట్టి

చిదచిద్విశిష్టుడైన పరమాత్మయొక్క స్వరూపగుణవిభూతి పరిపూర్ణతను బోధిస్తూ విష్ణుపారమ్యాన్ని తెలుపుతున్నాయి ఈ ఉదాహరణ పద్యాలు. బ్రహ్మాదులుకూడా గజరాజును కాపాడలేక మిన్నకుండడానికి కారణం విష్ణుపారమ్యతను ఆ బ్రహ్మాదులు గుర్తెరిగిన వారు కావడమే.

'పరమపురుషుడు' (88వ పద్యం) ఎవనికంటే మరొక పెద్దవాడు ఉండడో మరొక శ్రేష్ఠుడు ఉండడో వాడే పరమపురుషుడు. పరమశబ్దానికి 'పతిం విశ్వస్య ఆత్మేశ్వరమ్' అని తైత్తిరీయనారాయణవాక్యం. సర్వానికి పురుషుడైన ఆయన తనకుతానే ఈశ్వరుడు కనుకనే ఆతడు పరమపురుషుడు, పరమాత్ముడు. ఇదీ విష్ణుపారమ్యం.

## అష్టమస్కంధం అందించిన సందేశాలు

ఈ స్కంధంలోని ఉపాఖ్యానాలు కథలు సందేశాత్మకాలు. వాటిని సంక్షిప్తంగా తెలుసుకుందాం –

**గజేంద్ర మోక్షణం :** సంపూర్ణ విశ్వాసంతో శరణు పొందిన వారిని భగవంతుడు తనవిధిగా తప్పక కరుణిస్తాడనే సందేశాన్ని అందిస్తూందీ కథ.

**క్షీరసాగరమథనం :** అగాధమైన క్షీరసాగరాన్ని మథించడం కష్టంగా ఉన్నప్పుడు భగవానుడు కూర్మ రూపియై భారంవహించి అమృత ప్రాప్తికి మూల కారకుడౌతాడు. భగవత్కృప ఉంటే అసాధ్యం కూడా సుసాధ్యమౌతుంది.

హాలాహలంసైతం, భక్షించి శివుడు లోకాలను రక్షిస్తాడు. అంటే భగవానుడు తలచుకుంటే ఎంతటి ఘోర ప్రమాదంనుంచైనా కాపాడి తీరుతాడు.

అమృతాన్ని పొందడానికి అమరులు ఎంతగానో శ్రమిస్తారు కానీ జగన్మోహనుడైన విష్ణువుదయ అమరులపై ఉంది. కనుక అమరులే అమృతాన్ని పొందుతారు. దైవ సహకారంలేకుంటే దగ్గరకు వచ్చింది కూడా పొందలేని పరిస్థితి (రాక్షసులకు) ఏర్పడుతుంది.

**వామనావతార చరిత్ర :** ఆపద వస్తుందని తెలిసినాకూడ ఇచ్చిన మాటను నిలబెట్టుకోవాలనే సందేశాన్ని బలిచక్రవర్తికథ అందిస్తుంది.

**మత్స్యావతారకథ :** సత్యవ్రతుడు విష్ణువుకు జలతర్పణ చేసి ప్రళయసముద్రంనుంచి బయటపడి మనువు అవుతాడు. చేపపిల్లను కాపాడిన సత్యవ్రతుని ఆ చేపనే పెద్దదైన తర్వాత ప్రళయ కాలాన కాపాడుతుంది. పరోపకారం వల్ల ప్రాప్తించిన పుణ్యం తప్పక ప్రళయంనుంచైనా కాపాడుతుంది.

ఇలా అష్టమస్కంధంలోని కథలన్నీ సందేశాత్మకంగా ఉన్నాయి.

యథా శక్తిగా అష్టమస్కంధాన్ని పారాయణం చేద్దాం. భాగవత సందేశానుసారంగా ప్రవర్తిద్దాం.

కర్నూలు
భీష్మ ఏకాదశి
తేది : 07-02-2017

ఇట్లు
శ్రీమద్భాగవతదాసుడు
**వైద్యం వేంకటేశ్వరాచార్యులు**

# నవమస్కంధ ప్రాశస్త్యం

**శ్రీరాజిత! మునిపూజిత!**
**వారిధి గర్వాతిరేకవారణబాణా!**
**సూరిత్రాణ! మహోజ్జ్వల,**
**సారయశస్సాంద్ర! రామచంద్ర నరేంద్రా!**

బమ్మెరపోతన భాగవతంలోని నవమస్కంధం ప్రథమపద్యమిది. ప్రతి స్కంధాదిలో పోతన శ్రీరామచంద్రమూర్తినే సంబోధిస్తూ వస్తున్నారు. ఈ పద్యంలోని మొదటి మూడు సంబోధనలు రామాయణ ఘట్టాన్ని తలపిస్తూ ఉన్నాయి. ఈ నవమస్కంధంలో రామకథ ఉంది. స్కంధాలలో తొమ్మిదవది అయినట్లుగానే, శ్రీరామ జననం కూడా తిథుల్లో తొమ్మిదవది ఈ స్కంధంలో 736 గద్యపద్యాలున్నాయి.

మహాకవి పోతన సంస్కృతంలోని వ్యాసభాగవతాన్ని తెలుగుచేస్తూ "శ్రీకైవల్యపదంబుఁజేరుటకునై"... అంటూ శ్రీకారం చుట్టి 'మహానందాంగనాడింభకు'ని మొట్టమొదట ప్రార్థించాడు. భాగవత రచన ద్వారా తాను కైవల్యపదం కోరుకున్నాడు పోతన. సంకల్పశుద్ధితో భాగవతాన్ని పఠించే ప్రతి పాఠకునికీ 'శ్రీకైవల్యపదం' లభిస్తుంది. ఈ పద్యాన్ని విశ్లేషిస్తే ఇందులో ఆరుదళాలు కనిపిస్తాయి. అందులో అయిదవదళం "కేళిలోలవిలసద్ దృగ్జాల సంభూత నానా కంజాత భవాండ కుంభకున్" అన్నది. ఈ ప్రపంచం భగవంతుని కేళీవిలాసం. ఆయన కంటి చూపుల్తోనే బ్రహ్మాండభాండాలన్నీ ఆవిర్భవించాయి. అవన్నీ ఆయన కడుపులో ఉన్నాయి.

శ్రీమన్నారాయణునికి సూర్యచంద్రులిరువురూ రెండు కన్నులు. ఆ కంటిచూపుల్తోనే ఈ సృష్టి జరిగింది. భాగవతంలోని సూర్యచంద్రవంశీయుల గాథలు భగవత్కర్తృత్వాన్ని సూచిస్తూ ఉన్నాయి. సూర్యచంద్రవంశాలకు చెందిన మహాపురుషుల గాథలతో నిండి ఉన్నదే నవమస్కంధం.

సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరం, వంశానుచరితం అని అయిదు లక్షణాలతో పురాణం ఉంటుంది. ఈ భాగవతపురాణంలోని నవమస్కంధం 'వంశానుచరిత' లక్షణం కలిగి ఉంది. సూర్య చంద్రవంశీయుల చరిత్రలతో ఈ స్కంధం మనోహరంగా ఉంటుంది.

## సూర్యవంశం

శ్రీమన్నారాయణుని బొడ్డుతామర నుంచి బ్రహ్మ, ఆయనకు మరీచి, మరీచికి కశ్యపుడు, ఆయనకు సూర్యుడు జన్మించారు. సూర్యుని భార్య సంజ్ఞ. ఈ దంపతులకు వైవస్వతుడు అనే మనువు పుట్టాడు. సూర్యుని నుంచి పరంపరగా విస్తరించింది సూర్యవంశం. ఈ సూర్యవంశంలో సుద్యుమ్నుడు, శర్యాతి, అంబరీషుడు, ఇక్ష్వాకుడు, కకుత్స్థుడు, మాంధాత, పురుకుత్సుడు, త్రిశంకుడు, హరిశ్చంద్రుడు, సగరుడు, భగీరథుడు, రఘువు, శ్రీరాముడు వంటి చక్రవర్తులు విలసిల్లారు. వీరందరు ప్రజారంజక పరిపాలకులుగాను, భగవచ్చింతనా పరాయణులుగాను ఇహపరాలు సాధించారు. ఈ సూర్యవంశంలో ధర్మరక్షణకోసం శ్రీమహావిష్ణువు స్వయంగా కౌసల్యాసుప్రజారాముడయ్యాడు. మర్యాదాపురుషోత్తముడుగా నిలిచాడు.

## చంద్రవంశం

శ్రీమన్నారాయణుని నాభికమలం నుంచి బ్రహ్మ, ఆయనకు అత్రిమహర్షి, అత్రికి చంద్రుడు ఉదయించాడు. చంద్రుడు బ్రహ్మ ఆజ్ఞానుసారం తారామండలానికి, ఓషధులకు ప్రభువయ్యాడు, ఈ చంద్రుని నుంచి చంద్రవంశం ఆరంభమయింది. బృహస్పతిఇల్లాలు తారకూ చంద్రునికీ కలిగినవాడు బుధుడు. బుధునికి పురూరవుడు; ఊర్వశీ పురూరవులకు నహుషుడు జన్మించాడు. నహుషుని కుమారుడు యయాతి. యయాతి చిన్నకొడుకు పూరుడు. పూరునికి నాల్గో తరంవాడు దుష్యంతుడు. ఆయన శకుంతలను వివాహమాడి భరతుణ్ణి కన్నాడు. భరతుని మనుమడు హస్తి. ఈయన పేరుమీద హస్తినాపురం వెలసింది. ఈ హస్తిరాజు కుమారుడు అజమీఢుడు. భరతునికి అయిదోతరంవాడు రంతిదేవుడు. అజమీఢుని మనుమడు సంవరణుడు. తపతీ సంవరణుల కుమారుడు కురువు. కురుక్షేత్రం, కురువంశం ఈయన పేరుమీదనే వచ్చాయి. కురువుకు పదమూడోతరంవాడు శంతనుడు. శంతనునికి భీష్ముడు, చిత్రాంగదవిచిత్రవీర్యులు పుట్టారు. ఈయనకు ధృతరాష్ట్రుడు, పాండురాజు జన్మించారు. పాండురాజుకు పాండవులు, ధృతరాష్ట్రునికి కౌరవులు జన్మించారు. అర్జునుడు, పరీక్షిత్తు, జనమేజయుడు పాండవ వంశంలో ప్రసిద్ధులు.

పురూరవునికి పన్నెండో తరంవాడు విశ్వామిత్రుడు.

యయాతి కుమారుడు యదువు. యదువు నుంచి యదువంశం ఏర్పడింది. ఆహుకుడు, దేవకుడు, ఉగ్రసేనుడు, శూరసేనుడు, వసుదేవుడు యదువంశీయులు. దేవకీ వసుదేవుల తనయుడు శ్రీకృష్ణ పరమాత్మ. ఈ విధంగా చంద్రవంశం విస్తరించింది. సూర్యవంశంలో శ్రీరామచంద్రుడుగా, చంద్రవంశాంతర్గతమైన యదువంశంలో శ్రీకృష్ణుడుగా శ్రీమన్నారాయణుడు జన్మించి ధర్మసంస్థాపనం గావించాడు.

క. **ఎప్పుడు ధర్మక్షయ మగు, నెప్పుడు పాపంబు పొడము నీ లోకములో**
**నప్పుడు విశ్వేశుఁడు హరి, దప్పక విభుఁడయ్యుఁ దన్నుఁ దా సృజియించున్** **(9-726)**

## ఆర్గురు చక్రవర్తులు

సూర్యచంద్రవంశాల్లో ఆరుగురు చక్రవర్తులు పురాణప్రసిద్ధులయ్యారు.

**హరిశ్చంద్రో నలో రాజా పురుకుత్సః పురూరవః**
**సగరః కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః**

హరిశ్చంద్రుడు, నలుడు, పురుకుత్సుడు, పురూరవుడు, సగరుడు, కార్తవీర్యుడు వీరు షట్చక్రవర్తులు. హరిశ్చంద్రుడు, పురుకుత్సుడు, సగరుడు సూర్యవంశీయులు. నలుడు, పురూరవుడు, కార్తవీర్యుడు చంద్రవంశీయులు.

## సూర్యచంద్రవంశాల్లో సుప్రసిద్ధులు

సూర్యచంద్రవంశాల్లో సుప్రసిద్ధులైన కొందర్ని గురించి సంగ్రహపరిచయం.

**1. అంబరీషుడు :** ఏడు దీవులతో కూడిన భూమండలాన్ని ఏకచ్ఛత్రంగా పాలించాడు. హరినామస్మరణం లేకుండా ఏ పనీ చేయడు. అంబరీషుని భక్తికి మెచ్చి హరిచక్రాయుధాన్ని ఆయనకు రక్షగా ఉంచాడు. ఏకాదశీ వ్రతం చేసి

ద్వాదశినాడు పారణ చేస్తున్న అంబరీషునికి అతిథిగా వచ్చిన దుర్వాసుడు ఆలస్యం చేశాడు. సమయం మించి పోతుండగా అంబరీషుడు సలిలపానం చేసి పారణం ముగించాడు. దుర్వాసు డాగ్రహించి కృత్యను ప్రయోగించాడు. హరిచక్రాయుధం కృత్యను దహించి దుర్వాసుని ముప్పు తిప్పలు పెట్టింది. చివరకు అంబరీషుని ప్రార్థనతో చక్రం ఉపశమించింది.

**భగవంతుణ్ణి సర్వత్యాగబుద్ధితో ఆశ్రయిస్తే ఆ భగవంతుడు భాగవతులకు దాస్యం చేస్తాడు** అన్న సత్యం ఈ కథద్వారా తెలుస్తుంది.

**ఆ. నాకు మేలుఁ గోరు నా భక్తుఁ డగువాఁడు, భక్తజనుల కేన పరమగతియు;**
**భక్తుఁడెందుఁ జనినఁ బఱతెంతు వెనువెంట, గోవు వెంటఁ దగులు కోడెభంగి. (9-119)**

అంబరీషు చరిత్రం వింటే లభించే ఫలశ్రుతి ఇది.

**ఈ యంబరీషు చరితము, తీయంబున విన్న జదువ ధీసంపన్నుం**
**డై యుండును భోగపరుం, డై యుండును నరుడు పుణ్యుడై యుండు నృపా!**

**2. హరిశ్చంద్రుడు**

**ఆ. 'వరుణదేవ! నాకు వరవీర గుణములఁ, గొడుకు పుట్టె నేనిఁ గొడుకుఁ బట్టి**
**పశువుఁ జేసి నీవు పరిణమింపఁగ వేల్తుఁ, గొడుకు నీఁ గదయ్య కొసరు లేక! (9-194)**

సంతానం లేని హరిశ్చంద్రుడు వరుణదేవుని వల్ల రోహితుడనే కొడుకును కంటాడు. పుట్టిన వెంటనే హోమపశువుగా సమర్పిస్తానని మాట ఇచ్చాడు. కాని పుత్రవ్యామోహంతో ఏదో ఒక నెపం చెబుతూ దాటవేస్తుంటాడు. పురుడనీ, పాలపండ్లనీ, పడిపండ్లనీ, రణవీరుడు కానిమ్మనీ ఇలాగా! పడిపండ్లు దాటిన వయస్సులో రోహితుడు అడవులకు వెళ్లిపోతాడు. అక్కడ కొన్నేళ్లు గడుపుతాడు. తండ్రికి మహోదర వ్యాధి పట్టుకుంటుంది. రోహితుడు శునశ్శేపుణ్ణి యజ్ఞపశువుగా తెచ్చి తండ్రికి సమర్పిస్తాడు. హరిశ్చంద్రుడు చేసే యాగానికి వసిష్ఠాదులు వస్తారు. ఇంద్రుడు మెచ్చుకొని హరిశ్చంద్రునికి బంగారు రథం బహూకరిస్తాడు.

**తండ్రిమాటను కుమారుడు రోహితుడు నిలబెట్టి హరిశ్చంద్రుని సత్యసంధతను కాపాడతాడు. హోమ ప్రాశస్త్యం, వాగ్దాన నిర్వహణ ఈ కథవల్ల తెలుసుకోదగ్గ అంశాలు.**

భాగవత పురాణ హరిశ్చంద్రుడు వేరు ఇప్పుడు ప్రజల్లో ఉన్న హరిశ్చంద్రుడు వేరు. విశ్వామిత్రునికి అప్పుపడ్డ హరిశ్చంద్రుడు తన సర్వం కోల్పోయి భార్యను అమ్ముకొని కాటికాపరిగా జీవిస్తుంటాడు. కొడుకు లోహితాస్యుని మరణంతో కాటిదగ్గర ముగ్గురు ఒకటౌతారు. కథ సుఖాంతమవుతుంది. శకుంతల కథను కాళిదాసు మార్చినట్టుగా హరిశ్చంద్రుని కథ మార్పుకు లోనైంది.

**3. భగీరథుడు**

సగరుడు తలపెట్టిన యాగంలో అశ్వాన్ని వెతకడానికి వెళ్లిన సగరపుత్రులు నాగలోకంలో కపిలముని చూపుకు బూడిద అయ్యారు. సగరుని మనుమడు అంశుమంతుడు కపిలుణ్ణి ప్రసన్నం చేసుకొని అశ్వాన్ని తీసుకొని వచ్చాడు. అంశుమంతుని మనుమడు భగీరథుడు గంగను మెప్పించి, శివుణ్ణి ఒప్పించి గంగను భూమికి తీసుకువచ్చాడు. సగరుడు తలపెట్టిన యాగం పూర్తికావడానికి అయిదు తరాలు పట్టింది.

భగీరథుని ప్రయత్నంతో అరువదివేల సగరులు స్వర్గానికి వెళ్లారు. స్వర్గం నుండి గంగ నేలకు, నేలనుండి నాగలోకానికి వెళ్లేందుకు అంగీకరిస్తుంది. హరిపాదం నుండి ఉద్భవించిన గంగను శివుడు తన తలమీద మోసేందుకు అంగీకరించాడు,

**ఆ. భక్తవత్సలుండు ఫాలాక్షుఁ డా భగీ, రథుని మెచ్చి నిజశిరంబునందు**
**శౌరిపాదపూతసలిలయై దివి నుండి, ధరకు వచ్చు గంగఁ దాల్చె నపుడు. (9-229)**

**భగీరథుని వల్లనే భారతదేశానికి గంగామాత లభించింది. ఇందుకు సుదీర్ఘమైన ప్రయత్నం సాగింది. ఇలాంటి కఠోరమైన ప్రయత్నాన్ని ఇప్పటికి భగీరథ ప్రయత్నం అంటుంటారు.**

**4. శ్రీరాముడు**

పోతన మహాకవి 'శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలుడై', ఒకానొక చంద్రగ్రహణం సమయంలో గంగకు వెళ్లి పరమేశ్వర ధ్యానంలో కూర్చునాడు. ఆ ధ్యానంలో శ్రీరామచంద్రుడు ప్రత్యక్షమయ్యాడు.

**సీ. మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి నువిద చెంగట నుండ నొప్పువాఁడు**
**చంద్రమండల సుధాసారంబు పోలిక ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు**
**వల్లీయుత తమాల వసుమతీజము భంగి బలువిల్లు మూఁపునఁ బరఁగువాఁడు**
**నీల నగాగ్ర సన్నిహిత భానుని భంగి ఘన కిరీటము దలఁ గలుగువాఁడు.**

**ఆ. పుండరీకయుగముఁ బోలు కన్నులవాఁడు, వెడఁద యురమువాఁడు, విపులభద్ర**
**మూర్తివాఁడు రాజముఖ్యుఁడొక్కరుఁడు నా, కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె. (1-16)**

వ్యాసభాగవతాన్ని తన పేరుమీద తెనుగు సేయుమన్నాడు. పోతన రామాజ్ఞను శిరసావహించాడు. భాగవత రచనకు పూనుకొన్నాడు. పరమేశ్వర ధ్యానంలో కూర్చున్న పోతనకు పరమేశ్వరుడైన శ్రీరామచంద్రుడు కోదండం ధరించి కనిపించాడు. తన పక్క సీతమ్మ ఉన్నది. కోదండం ధర్మనిర్వహణ కోసం, అనపాయిని అయిన సీతమ్మ ధర్మనిర్వహణలో ఆయనకు భాగమైన ధర్మపత్ని, సరిగ్గా ఈ దృశ్యం మళ్లీ నవమస్కంధం రామకథలో దర్శనమిస్తుంది. 105 గద్యపద్యాల్లో సాగిన రామకథ ధర్మసంస్థాపనం కోసమే భాగవత రచనకు ముందే పోతనకు శ్రీరామచంద్రుడు ధర్మప్రవర్తకుడుగా దర్శనమిచ్చాడు. ఇది పోతన రచనాప్రణాళికలోని కీలకం.

శ్రీరాముడు శివధనుస్సును విరిచి సీతను పెండ్లాడాడు. తండ్రిమాట పాటించి అడవులకు వెళ్లాడు.

**క. జనకుఁడు పనిచిన మేలని, జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్**
**జనపతి రాముఁడు విడిచెను, జనపాలారాధ్య ద్విషదసాధ్య నయోధ్యన్. (9-266)**

దుష్టులైన ఖరదూషణులను, పద్నాలుగు వేలమంది రాక్షసుల్ని సంహరించాడు. సేతువు బంధించేందుకు విల్లందుకొని సముద్రుణ్ణి భయపెట్టాడు. రావణసంహారంచేసి అయోధ్యకు వచ్చి సింహాసన మలంకరించాడు.

శ్రీరాముడు యాగం చేసి, సర్వసంపదలూ దానం చేశాడు.

సామ్రాజ్యం చేతిలో ఉన్నా కట్టుబట్టలు తనకు, మెడలో తాళి ఇల్లాలికి మిగిలాయి. ప్రజలకోసం ధర్మపత్నిని మళ్లీ అడవులకు పంపించాడు. ఇవన్నీ శ్రీరామచంద్రుని గొప్పగుణాలు. ధర్మమూ, త్యాగమూ ఈ గుణాలకు మూలం. త్యాగ, ధర్మాలతో కూడిన ప్రజాపాలనమే నిజమైన రాజధర్మం అని, రామరాజ్యం అంటే ఇదే సుమా అని చెబుతుంది రామకథ.

**క. తండ్రిక్రియ రామచంద్రుఁడు, దండ్రుల మఱపించి ప్రజలఁ దా రక్షింపన్**
**దండ్రుల నందఱు మఱచిరి, తండ్రిగదా రామచంద్రధరణిపుఁ డనుచున్. (9-336)**

అడవుల్లోవున్న, అంతఃపురంలోవున్న శ్రీరామచంద్రుడు ధర్మసంస్థాపనమే చేశాడు. పితృవాక్య పరిపాలకుడుగా యుగయుగాలకు ఆదర్శమూర్తిగా నిలిచాడు.

**5. పరశురాముడు**

జమదగ్ని కుమారుడు పరశురాముడు. తండ్రి మాటవిని తల్లిని, సోదరుల్ని సంహరిస్తాడు. తండ్రిని సంతోషపెట్టి తిరిగి తల్లినీ, సోదరుల్నీ బతికించుకొంటాడు.

తమ కామధేనువును మళ్లించుకొనిపోయిన కార్తవీర్యుడిని ఖండించి ఆవును తెస్తాడు. తాను ఇంట లేని సమయంలో కార్తవీర్యుని కొడుకులు జమదగ్నిని తెగవేస్తారు. పరశురాముడు ఇరవై ఒక్కసార్లు భూమిని గాలించి క్షత్రియనిర్మూలనం చేశాడు.

**ఆ. అయ్యపగకు రాముఁ డలయక రాజుల, నిరువదొక్కమాఱు లరసి చంపె;**
**జగతిమీఁద రాజశబ్దంబు లేకుండ, నూడు దీర్పలేని సుతుఁడు సుతుఁడె. (9-487)**

మిథిలలో శివధనుస్సును విరిచిన శ్రీరాముణ్ణి ఎదిరించడానికి వచ్చి భంగపడిపోతాడు. చివరకు మహేంద్రపర్వతం మీదికి తపస్సుకు వెళ్లి ఇప్పటికీ అక్కడే ఉండిపోయాడు.

పరశురాముడు తండ్రి ఆనతి పాటించాడు. తపోధనుడైన తండ్రి తన అమ్మను, అన్నలను తిరిగి బతికిస్తాడన్న నమ్మకంతో వాళ్లని గొడ్డలితో నరికాడు.

**శా. తల్లిన్ భ్రాతల నెల్లఁ జంపు మనుచోఁ దాఁ జంపి రాకున్న బెం**
**పెల్లన్ బోవ శపించుఁ దండ్రి; తన పంపేఁ జేయుడున్ మెచ్చి నా**

**తల్లిన్ భ్రాతల నిచ్చు నిక్కము తపోధన్యాత్మకుం డంచు వే**
**తల్లిన్ భ్రాతలఁ జంపె భార్గవుఁడు లేదా చంపఁజేయాడునే.** **(9-472)**

తన ఆజ్ఞను పాటించిన పరశురామున్ని తండ్రి మెచ్చుకున్నాడు. అమ్మను, అన్నలను ప్రసాదించమని పరశురాముడు వేడుకోగా వాళ్లని బతికించాడు. **పరశురాముడు దారుణమైన తండ్రి కోరికను తీర్చి తిరిగి వారిని బతికించుకొని పాపవిముక్తుడయ్యాడు.**

శ్రీరామశ్రీకృష్ణులే కాదు, పరశురాముడు కూడా దశావతారాల్లో ఒకరు.

## 6. రంతిదేవుడు

రంతిదేవుడు దానధర్మాలు చేసి చేసి ఏమీ లేని వాడయ్యాడు. ఆ రాజు నలబై ఎనిమిది దినాలు ఆహారం లేకపోయినా గుండె దిటవుతో ఉన్నాడు. అయాచితంగా కొద్దిగా ఆహారం, నీరు లభిస్తే ఒక బ్రాహ్మణునికి శూద్రునికీ, కుక్కల్ని పెంచుకొనే వాడికీ పంచి, కొద్దిగా నీరు మిగిలితే అది తాగబోతుండగా ఒక చండాలుడు వచ్చాడు.

ఉ. **అన్నము లేదు, కొన్ని మధురాంబువు లున్నవి.; ద్రావుమన్న; రా**
**వన్న, శరీరధారులకు నాపద వచ్చిన వారియాపదల్**
**గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకంటె నొండు మే**
**లున్నదె? నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడ సుమ్ము పుల్కసా!** **(9-648)**

అంటూ ఆ నీరు వాడి కిచ్చాడు. ఆ వచ్చినవారు రంతిదేవుని పరీక్షించడానికి వచ్చిన బ్రహ్మాదులు. రంతిదేవుడు వారి నేమీకోరలేదు. అయినా అతడు పరమపదం పొందాడు. దాతృత్వం యొక్క ఫలాన్ని బోధిస్తుందీ కథ. అంతేకాదు ఆకలిగొన్న ప్రాణులను ఆదరించి, వారి ఆకలి తీర్చడం కన్న మిన్న అయిన ధర్మం లేదనే సందేశాన్నిస్తూ, ఈ కథ మానవతకు పెద్దపీట వేసింది.

**ఆ రాజర్షిని గొలిచిన, వారెల్లఁ దదీయ యోగవైభవమున శ్రీ**
**నారాయణచింతనులై, చేరిరి యోగీశులగుచు సిద్ధపదంబున్** – ఇది కథాశ్రుతి ఫలం.

## 7. విశ్వామిత్రుడు

పురూరవునికి పన్నెండో తరంవాడైన గాధిరాజు కుమారుడు విశ్వామిత్రుడు. వసిష్ఠునితో వైరం పెంచుకొన్నాడు. రాజ్యాని త్యజించాడు. ఘోరమైన తపస్సు చేశాడు. బ్రహ్మర్షి అనిపించుకొన్నాడు.

హరిశ్చంద్రుని యాగంలో శునశ్శేపుడు బలిపశువౌతాడు. పితృదేవతలు కరుణించి ఆయన్ని వదలుతారు. విశ్వామిత్రుడు శునశ్శేపుణ్ణి తన ఇంటికి తీసుకొనివాస్తాడు. శునశ్శేపుణ్ణి అన్ననుగా మన్నించుడని కొడుకుల్ని అడుగుతాడు. సగంమంది కొడుకులు తిరస్కరిస్తారు. మధుచ్ఛందుడు నుంచి తక్కిన యాభై మంది సోదరులు అన్నగా శునశ్శేపుణ్ణి గౌరవిస్తారు.

సత్యవ్రతుడనే రాజు త్రిశంకుడు. ఈయన గురుశాపంతో చండాలుడౌతాడు. విశ్వామిత్రుణ్ణి ఆశ్రయించి స్వర్గానికి వెళ్తాడు. దేవతలు త్రిశంకువును స్వర్గం నుండి దిగదోస్తారు. విశ్వామిత్రుడు ఆకాశంలో త్రిశంకువును అట్లే నిలుపుతాడు. త్రిశంకువు అక్కడే ఉండిపోతాడు.

**"అమరులు మరలఁ ద్రోయఁ**
**దలక్రిందుగాఁ బడి దైన్యంబుతో రాఁగఁ గౌశికుం డెప్పటి ఘనత మెఱసి**
**నిలిపె నాకసమున; నేఁడు నున్నాఁడు త్రిశంకుఁడు"**

విశ్వామిత్రుడు ఎన్నోసార్లు తన తపస్సును వ్యయంచేసుకొన్నా తన దీక్షను వదల్లేదు. **చిత్తశుద్ధి ఉంటే సాధ్యంకానిదేమీ ఉండదు** అని విశ్వామిత్రుని కథ నిరూపిస్తుంది.

**8. పూరుడు**

యయాతికి దేవయాని, శర్మిష్ఠ యిరువురు భార్యలు. దేవయాని తండ్రి శుక్రాచార్యుడు పెట్టిన నియమం ప్రకారం శర్మిష్ఠను దాసిగా చూడాలి. ఆమెతో సంగమించకూడదు. అయినా యయాతి నియమం తప్పాడు. దేవయానికి యదు తుర్వసులు అని ఇద్దరు కుమారులు, శర్మిష్ఠకు ద్రుహ్యుడు, అనువు, పూరువు అని ముగ్గురు కుమారులు కలిగారు. నియమం మీరినందున యయాతిమీద శుక్రాచార్యుడు కోపించి 'హేయంబైన ముదిమిని పొందెదవు గాక' అని శపించాడు. యయాతి ముదిమిని భరించలేకపోయాడు. విషయసుఖాలు అనుభవించాలనుకున్నాడు. తమ యౌవనాన్ని తనకు ధారపోయుడని కొడుకుల్ని కోరాడు. అందరూ కాదన్నారు. శర్మిష్ఠ చివరి కొడుకు పూరుడు సమ్మతించాడు. తండ్రితో ఇలా అన్నాడు.

క. **మునివృత్తి దయ్య నేటికి, జనపాలక! సుగతిఁ గోరు సత్పురుషులకున్**
**దనుఁ గన్న తండ్రి సెప్పిన, పనిచేసిన సుగతి గొంగుపసిఁడియె కాదే!** **(9-558)**

అని పలికి పూరుడు. తండ్రి ముదిమిని గ్రహించి తన లేతప్రాయాన్ని తండ్రికిచ్చాడు. **శారీరక సుఖాలు అనుభవించవలసిన లేబ్రాయంలో తన యౌవనాన్ని తండ్రికి ధారపోసి హేయమైన ముదుసలి తనాన్ని స్వీకరించి చరిత్రలో ప్రసిద్ధికెక్కాడు.**

**9. కృష్ణుడు**

దేవకీ వసుదేవుల కుమారుడుగా శ్రీకృష్ణుడుగా జన్మించాడు. నవమస్కంధం చివర ఈ పరమాత్మ జననం సూత్రప్రాయంగా పోతన చెప్పారు.

క. **దుష్టజన నిగ్రహంబును, శిష్టజనానుగ్రహంబు సేయుట కొఱకై**
**యష్టమ గర్భమున గుణో, త్కృష్టుఁడు దేవకికి విష్ణుదేవుఁడు పుట్టెన్.** **(9-724)**

భాగవతంలోని దశమస్కంధం భగవానుని లీలామానుషచర్యల కోసమే ప్రత్యేకించబడింది.

## కావ్య చమత్కారాలు

**1. శకటరేఫంతో :** అంశుమంతుని ప్రార్థన అంగీకరించిన కపిలమహర్షి తన దగ్గరున్న అశ్వాన్ని తీసుకు వెళ్లు అన్నాడు. బూడిదగా మారిన సగరులమీద గంగాజలం పారిస్తే శుభమవుతుందన్నాడు. అలా జరిగితే అరువది వేలమంది సగరకుమారులు బతుకుతారు. ఈ సందర్భంగా పోతన కపిలుని చేత ఈ పద్యం చెప్పించాడు.

క. **'గుఱ్ఱము గొనిపో బుద్ధుల, కుఱ్ఱఁడ! మీ తాతయొద్దకున్ నీతండ్రుల్**
**వెఱ్ఱులు నీఱై రదె! యీ, మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభమగున్.'** **(9–215)**

అంశుమంతుని మనుమడు భగీరథుడు. సగరుల్ని బతికించుకొనే మనోరథాన్ని సాధించాడు. గంగమ్మ భగీరథుని వెంట ప్రవహించి వచ్చింది. భగీరథుని పేరులో రథం (శకటం) ఉంది. భగీరథుని రథం (శకటం) వెనుక గంగ పరుగులు పెట్టింది. ఈ పద్యాన్ని పోతన శకటరేఫ – ప్రాసతో నడిపించాడు. బండి 'ఱ' ప్రాస వేసి పోతన అక్షర చమత్కారం చూపించాడు.

**2. ముక్తపదగ్రస్తంతో :** బహుబిందు సందోహంతో జలం ఉంటుంది. ఆ జలం ముందుకు సాగుతూ ఉంటే ప్రవాహమంటాం. జలం ప్రవహిస్తూ పల్లం ఉన్నచోట ఆగి తిరిగి ముందుకు కొనసాగుతూ ఉంటుంది. నేలమీదికి దూకిన గంగ సాగరం వైపు సాగుతూ వెళుతుంది. ప్రవాహం సాగుతూ అక్కడక్కడా పడియగట్టి మళ్లీ ప్రవాహం ముందుకుసాగే తీరును అక్షర చమత్కారం చేశాడు పోతన. ఇందుకోసం ముక్తపదగ్రస్తం స్వీకరించారు.

వ. వెలియేనుఁగు తొండంబుల ననుకరించి పఱచు **వఱద మొగంబులును, వఱద మొగంబుల** పిఱుంద నందంద క్రందుకొని, పొడచూపి, తొలంగు బాలశారదా కుచకుంభంబులకు నగ్గలంబైన **బుగ్గలును, బుగ్గల** సంగడంబునం బారిజాత కుసుమ స్తబకంబుల చెలువంబునుం దెగడు **వెలినురువులును, వెలినురువుల** (9–230)

**3. నీరు తాగడం కాదు; తినడం**

అంబరీషుని ఆతిథ్యానికి అంగీకరించి స్నానానికి వెళ్లిన దుర్వాసుడు ఇంకా రాలేదు. పారణ చేయాలి. సమయం మించిపోతూ ఉంది. బ్రాహ్మణజనులు నీరుతాగి పారణ చేయవచ్చు 'సలిలభక్షణంబు సమ్మతంబు' అన్నారు. నీటిని తాగుతారు కాని తినరు. అంబరీషుణ్ణి సలిలభక్షణం చేయుమన్నారు. ఈ మాట పోతన మాటేకాదు. మూలంలో వ్యాసమహర్షికూడా 'అబ్భక్షణమ్' – అనే చెప్పారు. ఇక్కడ ఇరువురూ గడుసువారే! నీటిని భక్షించి పారణం కానిమ్మన్నారు.

ఆ. **'అతిథి వోయి రామి నధిప! యీ ద్వాదశి, పారణంబు మానఁ బాడి గాదు**
**గుడువకుంటఁ గాదు కుడుచుటయును గాదు, సలిలభక్షణంబు సమ్మతంబు.'** **(9–99)**

**4. ఛందోధ్వని**

భరతుడు రెండోహరిలాగా రాజ్యభారం నిర్వహిస్తున్నాడు. తమరాకపై నీటిబిందువులా వ్యవహరిస్తూ, ఆ పాలన సాగించాడు. ఆయనకు పాలన భారంకాదు, తేలిక. ఆ లఘుత్వాన్ని పద్యఛందస్సు ద్వారా పలికిస్తున్నాడు పోతన

క. **రెండవ హరిక్రియ ధరణీ, మండలభారంబు నిజసమంచితబాహా**
**దండమున నిలిపి తనకును, భండనమున నెదురులేక భరతుం డొప్పెన్. (9-635)**

ఈ పద్యంలో హరిక్రియ ఒక సమాసం. ఊది పలకాలి. ఊది అలా పలికితే గణం మారి ఛందోనియమం దెబ్బతింటుంది. ఇక్కడ ఊది పలుకరాదు. తేలికగా (లఘువు) పలకాలి. అప్పుడు ఛందస్సు కుదురుతుంది. పద్యం నిలుస్తుంది. అదే పోతన చమత్కారం.

**5. మన్మథుడు బాణాలు వేయలేదు, గంటకొట్టాడు**

సౌభరి ఒకముని. చేపలరాజునీ అతని సంసారాన్నీ చూశాడు. తానూ సంసారం చేయాలనుకున్నాడు. మాంధాత నడిగాడు. ఆయనకు ఏబది మంది కుమార్తెలు. స్వయంవరంలో కూతుళ్లను వివాహమాడమన్నాడు. సౌభరి యువకుడుగా మారాడు. మాంధాత తన పుత్రికల్ని చూపించాడు.

చూచిందే తడవుగా సౌభరిని రాకుమార్తెలు అంగీకరించారు. నేను నేనంటూ వరించారు. మదనుడు గంట వాయించడం తడవుగా అమ్మాయిలందరు పొలోమంటూ దూకివచ్చారు. ఇదీ పోతన మాట. పూలబాణాలు గుప్పించడం చదివాం గాని, మదనుడు గంటవాయించడం చదివామా? చదవండీ పద్యం.

ఉ. **'కోమలులార! వీఁడు నలకూబరుఁడో! మరుఁడో! జయంతుడో!**
**యేమతి వచ్చె; వీనిఁ దడ వేల వరింతుము నేమ నేమ' యం**
**చా మునినాథుఁ జూచి చలితాత్మికలై సొరిదిన్ వరించి రా**
**భామిను లందఱుం గుసుమబాణుఁడు గీయని ఘంట వ్రేయఁగన్. (9-177)**

**6. పట్టాభిషిక్తునికి పట్టుబట్టలు సీతమ్మకు మంగళసూత్రం**

అయోధ్యలో శ్రీరామచంద్రునికి పట్టాభిషేకం అయింది. రాముడు యాగాలు నిర్వహించాడు. దానాలు చేశాడు. అప్పటికి తనకు మిగిలిన సంపద కట్టుబట్టలు, తన ఇల్లాలికి తాళిబొట్టు.

తే. **తనదు రెండు పుట్టంబులుఁ దనకు నైన, మెలఁత మంగళసూత్రంబు మినుకుఁ దక్క**
**వినతుఁడై యుండె; నా రాము వితరణంబు, పాండవోత్తమ! యేమని పలుకవచ్చు? (9-342)**

రామయ్య బట్టల విషయం చెప్పిన పోతన సీతమ్మ ఆస్తి సంగతి మరచిపోలేదు. మినుకు మినుకుమంటూ ఆమె మెడలో మెరుస్తున్న మంగళసూత్రం గుర్తు చేస్తున్నాడు. తెలుగు పడుచుల సౌభాగ్యచిహ్నం తాళిబొట్టును పోతన మరచిపోతాడా! ఇప్పుడు సీతమ్మ మెడలోనే కాదు, మునుపు పార్వతీదేవి మెడలోను చూశాడు.

క. **మ్రింగెడు వాఁడు విభుం డని, మ్రింగెడిదియు గరళ మనియు మే లని ప్రజకున్**
**మ్రింగు మనె సర్వమంగళ, మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో! (8-241)**

అంటాడు శివుణ్ణి హాలహలం మింగుమని చెప్పే ఘట్టంలో, అష్టమస్కంధంలో.

**7. గంగ – గౌతమి**

ఈ నవమ స్కంధంలో గంగా గౌతమీ నదులు దర్శనమిస్తాయి. గంగ స్వర్గం నుంచి హిమాలయాల్లోకి దిగి ఉత్తరభారతంలో పయనించి సాగరగమనం చేస్తుంది. గౌతమి దక్షిణ భారతంలో పుట్టి – దక్షిణ భారతంలో పయనించి సాగర గమనం చేస్తుంది.

పోతన గంగను దివినుంచి భువికి తీసుకొని వస్తూ మూలంలో లేని వర్ణన చేశారు. ఆమె నడకను శ్లేషలో వర్ణించారు. ఒక స్థానం నుంచి మరోస్థానానికి వస్తున్నది. తన అందచందాలను తాను ప్రదర్శిస్తూ అప్పటికీ సకల భారతంలో ఉన్న నదుల సోదరీ మణుల్ని పలుకరిస్తూ వస్తున్నదా అన్నట్లు ఆమె నడక సాగించారు. పోతన సరస్వతి, తుంగభద్ర, చంద్రభాగ, సూర్యతనయ, భీమరథ్య ప్రముఖనదులు ఈ శ్లేషలో వినిపిస్తాయి. ఇదొక చమత్కారం. గోదావరి వినిపించలేదే అని పఠితకు సందేహం. ఆ సందేహం శ్రీరామకథా ఘట్టంలో తీరుతుంది. ఆయన అరణ్యావాస సమయంలో గోదావరిని సమీపిస్తాడు. అదిగో అప్పుడీ పద్యం చెప్పారు పోతన.

**ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డట వోయి ముదంబునఁ గాంచె దండకా**
**రణ్యముఁ దాపసోత్తమ శరణ్యము నుద్ధత బర్హిబర్హ లా**
**వణ్యము గౌతమీ విమల వాఃకణ పర్యటన ప్రభూత సా**
**ద్గుణ్యము నుల్లసత్తరు నికుంజ వరేణ్యము నగ్రగణ్యమున్.** **(9–268)**

గోదావరిని ప్రత్యేకంగా వర్ణించారు పోతన. గంగ హరిపాదం నుంచి ప్రవహించి వచ్చింది. హరి రామావతారంలో గోదావరిని స్వయంగా దర్శించాడు. గోదావరి దక్షిణగంగగా పుణ్యవతి అయిన గౌతమి.

**8. చంద్రుడు – మిన్నుముట్టాడు**

తారకు బుధుడు పుట్టాడు. ఈ బుధుడు బృహస్పతివల్ల కలిగాడా! చంద్రునివల్ల కలిగాడా! తార ఆ సందేహాన్ని నివృత్తి చేస్తూ నిజం బయటపెట్టింది. అప్పుడు చంద్రుడు పొందిన ఆనందం ఇలా ఉంది.

**ఆ. బుద్ధిమంతుడైన బుధుఁడు పుత్రుండైన, మేను పెంచి రాజు మిన్ను ముట్టె;**
**బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి, మిన్ను ముట్టకేల మిన్నకుండు?** **(9–386)**

బుద్ధిమంతుడైన తనయుడు కలిగితే తండ్రి ఆకాశం తాకినంత వాడవుతాడు – అంటారు పోతన. మిన్ను ముట్టుట – అనే పదచమత్కారం చేశారిక్కడ. చంద్రుడుండేదే అక్కడ కదా!

## విశేషచ్ఛందస్సులు

పోతన నవమస్కంధంలో ఉత్పలమాలాది సాధారణ ఛందస్సులు కాకుండా కేవలం నాలుగు విశేష ఛ్ఛందస్సుల్ని ఉపయోగించాడు. అవి రెండు మత్తకోకిలలు, మూడు తరలాలు, ఒక్క ఇంద్రవజ్రము. కవులు తాము విశిష్ట ఛందస్సులు ప్రయోగించే సమయంలో సందర్భాన్ని గమనిస్తారు. పోతన కూడా అంతే!

**1. మత్తకోకిల**

దుర్వాసునికి ప్రాణగండం తప్పింది. అంబరీషుని ప్రార్థనతో చక్రం వెనుదిరిగింది. దుర్వాసుడు ఊపిరి పీల్చుకున్నాడు. సంతోషం చెలరేగింది. ఎగిరి గంతులు వేశాడు. దుర్వాసుని నోట మత్తకోకిల పద్యం వెలువడింది. మదించిన కోకిల కుహూరాగంతో పలికినట్లే ఉంది.

**తప్పు లోఁగొని చక్రపావక దాహముం బెడఁబాపి తొ**
**నొప్పునొప్పు భవద్దయారస మో నరేశ్వర! ప్రాణముల్**
**సెప్ప మున్మను వోయి క్రమ్మఱఁ జేరె ధన్యుఁడ నైతి నీ**
**కెప్పుడున్ శుభ మేను గోరెద నింకఁ బోయెద భూవరా! (9–143)**

తన చేతిని తాకినవాడే భర్త అనుకుంది దేవయాని. యయాతి సమ్మతించాడు. అయినా దైవఘటన కాకపోతే నా మనస్సు బ్రాహ్మణకన్యను కోరుకుంటుందా అనుకున్నాడు. అగ్రవర్ణ తనకు ఆలు కాబోతూ ఉంది.

మత్తకోకిలవృత్తమే ఆయన నోటినుంచి పలికించాడు పోతన.

**దైవయోగము గాక విప్రసుతన్ వరించునె నా మనం**
**బే విధంబున నీశ్వరాజ్ఞయు నిట్టిదంచు వరించె ధా**
**త్రీవరుండును దేవయానిని ధీరబుద్ధులకున్ మనో**
**భావ మొక్కటియే ప్రమాణ మభావ్య భావ్య పరీక్షకున్. (9–533)**

**2. తరలం**

ఈ వృత్తం మత్తకోకిల నుంచి విడివడ్డ ఛందస్సు. మొదటి గురువును రెండు లఘువులుగా మారిస్తే మత్తకోకిల తరలం అవుతుంది. ప్రారంభంలో తప్ప తరువాతి పద్యం నడక మత్తకోకిలలాగే ఉంటుంది.

ఇక్ష్వాకు మహారాజింట శ్రాద్ధానికి మాంసం కావాలి. రాజు తన కుమారుడు వికుక్షిని నియోగించాడు. వికుక్షి అడవికి వెళ్లి కుందేలును వేటాడాడు. ఆకలిగా ఉంటే అందులో కొంత ఆరగించి వచ్చాడు. మాంసానికి ఎంగిలి అంటిందని వసిష్ఠుడు గుర్తించాడు. వికుక్షిమీద చిందులు వేశాడు. ఆ చిందు – తరలం వృత్తంలో నడిచింది.

**కులగురుండు వసిష్ఠుఁడంత వికుక్షి కుందెలు దింట లో**
**పల నెఱింగి 'యనర్హ మెంగిలి పైతృకం బొనరింపఁగా**
**వలదు వీఁడు దురాత్మకుం' దన వాని తండ్రియు వానిఁ జెం**
**తలను జేరఁగనీక దేశము దాఁటి పో నడిచెన్ వడిన్. (9–158)**

ఊర్వశి పురూరవుణ్ణి చూచి మన్మథబాణాల ధాటికి వివశురాలయిన సందర్భంలో పోతన మరొక తరల వృత్తాన్ని నడిపించారు. వృషపర్వుని మీద కోపించి శుక్రాచార్యుడు ప్రసన్నుడవుతూ నీ కూతురు వేయిమంది చెలికత్తెలతో నా కూతురికి ఊడిగం చేయాలంటున్న సందర్భంలో పోతన తరలం అందుకున్నాడు.

**"చెలులు లేవురఁ దాను నీ సుత చేటికైవడి నా సుతం గొలుచు చుండినఁ దీఱుఁ గోపము"** అంటూ సందర్భోచితవృత్తం నడిపించాడు.

**3. ఇంద్రవజ్రం**

భగీరథుడు గంగను ప్రార్థిస్తున్నాడు. ఆమె తన తాతల్ని బతికించడానికి దివి నుంచి దిగిరావాలి. ఇందుకు గంగ కఠోరమైన నిర్ణయం తీసుకోవాలి. అలాగే భగీరథుని ప్రయత్నం కూడా కఠోరమయింది. గంగను ప్రార్థించే భగీరథుని నోట పోతన ఇంద్ర వజ్రాన్నే పలికించాడు.

**చెల్లన్ మది న్నిన్ను భజింతు గంగన్, ఫుల్లాంతరంగన్ బహుపుణ్యసంగన్**
**గల్లోల లక్ష్మీజితకాశమల్లిన్, దల్లిన్ సుధీకల్పలతామతల్లిన్. (9-222)**

**4. మాలిని**

పోతన స్కంధాంతంలో ఈ వృత్తం ఉపయోగించాడు. శ్రీరామచంద్రుణ్ణి నమస్కరిస్తూ స్కంధం ముగిస్తూ ఉన్నాడు. ముగింపుగా రామయ్యకు 'మాలిని'ని సమర్పిస్తున్నాడు. ఆ మాలిని ఇది.

**జగదవనవిహారీ! శత్రులోక ప్రహారీ!, సుగుణఘనవిహారీ; సుందరీమానహారీ!**
**విగతకలుషపోషీ! వీరవిద్యాభిలాషీ!, స్వగురుహృదయతోషీ! సర్వదా సత్యభాషీ! (9-736)**

హారం రెండువైపులుగా ఉన్నట్లే అనుప్రాసలు రెండుసగాలు. మొదట సగం అనుప్రాసవేరు, రెండో సగం మరో అనుప్రాస.

## పోలికపద్యాలు

కవికి తనకంటె ముందటి కవుల పద్యాలను పోలిన పద్యాలు తమ రచనల్లో ఉంటాయి. అలాగే - తన తరువాతి కవులు తన పద్యాలను పోలినట్లు పద్యాలు చెబుతూ ఉంటారు. తన పద్యాలను పోలిన పద్యాలు తన రచనలో ఉండడం కూడా ఉంటుంది. పోతన పద్యాలు ఈ రెండు విధాలుగా కనిపిస్తాయి.

**1. తన పద్యాన్ని పోలిన తన పద్యం**

శుకుడు పరీక్షిత్తుతో వైవస్వతమనువంశకథనం చేస్తున్నాడు. ఈ కథనిలా ప్రారంభించాడు.

**ఆ. వినుము, మనువుకులము వేయి నూఱేండ్లును, బరఁగ విస్తరించి పలుకరాదు**
**నాకుఁ దోఁచినంత నరనాథ! వేగంబ, యెఱుకపడఁగఁ బ్రీతి నేర్పరింతు. (9-06)**

ఇలాంటి పద్యాన్ని భాగవతం ప్రారంభంలోనే చూశాం. ఆ పద్యమిది.

**ఆ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు!, శూలికైనఁ దమ్మిచూలికైన!**
**విబుధజనుల వలన విన్నంత కన్నంత, దెలియ వచ్చినంత దేటపఱుతు. (1-19)**

ఈ పద్యం స్వయంగా భాగవతరచన చేస్తూ విన్నవించుకొన్నదే! భావం రచన పెనవేసుకొని నడిచాయి. శుకుడు పోతన ఒకేలాగ మాటాడారు కదా!

**2. తనకంటె ముందటి కవితో పోలిన పద్యం**

నన్నయ ఆంధ్రమహాభారతం ఆదిపర్వం చతుర్థాశ్వాసంలో దుష్యంతుని ఘట్టం ఉంది. అదే ఘట్టం ఈ నవమస్కంధంలో ఉంది. అందులో కణ్వాశ్రమవర్ణన పద్యం ఇలా సాగుతుంది.

సీ. **శ్రవణసుఖంబుగా సామగానంబులు, చదివెడు శుకముల చదువు దగిలి**
**కదలక వినుచుండు కరులయుఁ గరికర, శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు**
**కణముల చల్లని గాడ్పాసపడి దానిఁ, జెంది సుఖంబున్న సింహములయు**
**భూసుర ప్రవరులు భూతబలుల్ దెచ్చి, పెట్టు నీవారాన్న పిండతతులు**

తే. **గడగి భక్షింప నొక్కటఁగలసియాడు, చున్న యెలుకలుఁ బల్లుల యొందు సహజ**
**వైరివర్గంబులయు సహవాసమపుడు, సూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది** **(భారతం 1-4-23)**

ఈ పద్యాన్ని పోలిన పోతన పద్యం. ఇరువురి పద్యాలు ఆశ్రమ ప్రశాంతతను మనకు అందిస్తున్నాయి.

సీ. **ఉరుతర శ్రాంతాహి యుగళంబులకుఁ బింఛ, ముల విసరెడి కేకిముఖ్యములను**
**గరుణతో మదయుక్త కలభంబులకు మేఁత, లిడుచు ముద్దాడు మృగేంద్రములను**
**ఘనమృగాదనములు, గాపుగా లేళ్ళతో, రతులు సాగించు సారంగములను**
**నునుపుగా హోమధేనువుల కంఠంబులు, దువ్వుచు నాడు శార్దూలములను**

తే. **దార కలహించు మూషిక దంపతులకు, మైత్రి నంకించు మార్జాలమల్లములను**
**మతిని జాతివైరంబులు మాని కూడి, కలసి క్రీడించు మృగములఁ గాంచె నతఁడు.** **(9-600)**

**అనుప్రాసల పద్యాలకు పుట్టినిల్లు**

భాగవతంనిండుగా పోతన పద్యాల్లో అనుప్రాసలు కనిపిస్తాయి. సహజసుందరంగా అతికినట్లుంటాయి. చదివేటప్పుడు విసుగు పుట్టించవు. తరువాతి ప్రాసకోసం ఏ పదం ఉపయోగిస్తాడో అని ఉత్కంఠ కలిగించి ఓహో అనిపిస్తాయి.

**1.** అంత్యానుప్రాస

క. భాసుర నిగమ పదోప, **న్యాసుఁడు** సుతపో**విలాసుఁ** దనుపమ యోగా
**భ్యాసుఁడు** రవి**భాసుఁడు** దు, **ర్వాసుఁ** డతిథి యయ్యెఁ దన్నివాసంబునకున్. **(9-95)**

ఈ పద్యంలోని క్రీ గీతలు అంత్యానుప్రాసం.

**2. ముక్తపదగ్రస్తం**

**వ. ఇట్లమ్మహానది... నమ్మహీపాల తిలకంబు తెరువువెంట నంటివచ్చుచు వెలియేనుఁగు తొండంబుల ననుకరించి పఱచు వఱద మొగంబులును, వఱద మొగంబుల పిఱుంద నందంద క్రందుకొని, పొడచూపి, తొలంగు బాలశారదా కుచకుంభంబులకు నగ్గలంబైన బుగ్గలును, బుగ్గల సంగడంబునం బారిజాత కుసుమ స్తబకంబుల చెలువంబునుం దెగడు వెలినురువులును, వెలినురువుల (9-230).**

**3. ద్విప్రాస**

క. మం**తన**ములు సద్గతులకు, పొం**తన**ములు ఘనములైన పుణ్యముల కిదా
నీం**తన**పూర్వమహాఘ ని, కృం**తన**ములు రామనామ కృతి చింతనముల్. **(9-363)**

ఈ పద్యంలో ద్విప్రాసం ఉందని చెప్పవలసి వచ్చినా తక్కిన మూడు పాదాలు చతుష్ప్రాసలో నడిచాయి.

## పలుకు బళ్లు

ఏ కవికైనా తమ రచనల్లో ప్రాంతీయ పదజాలం చోటు చేసుకొంటుంది. అలాంటి పలుకుబళ్లు పోతనలోను కనిపిస్తాయి. అందుకు ఒకటి రెండు ఉదాహరణలు

**1. ఒక మున్నూఱు, ఒక యేనూఱు**

**మ. ఒక మున్నూఱు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షు చాపంబు బా**
**ల కరీంద్రంబు సులీలమైఁ జెఱుకుఁగోలం ద్రుంచు చందంబునన్**
**సకలోర్వీశులుఁ జూడఁగా విఱిచె దోశ్శక్తిన్ విదేహ క్షమా**
**పక గేహంబున సీతకై గుణమణి ప్రస్ఫీతకై లీలతోన్. (9-262)**

**మ. ఒకయేనూఱు కరంబులన్ ధనువు లత్యుల్లాసియై తాల్చి వే**
**ఱొక యేనూట గుణధ్వనుల్ నిగుడ శాతోగ్రాస్త్రముల్ గూర్చి వి**
**ప్ర! కుఠారంబును నిన్నుఁ గూల్తు ననుచున్ భర్జించి పుంఖాను పుం**
**ఖ కఠోరంబుగ నేసె రాజు రయరేఖా ధామునిన్ రామునిన్. (9-454)**

మున్నూఱు, ఏనూఱు - అని బృందంగా చెప్పవలసినపుడు 'ఒక'ను కలిపి - సమాసంచేసి వాడుతారు.

## సూక్తులు

భక్తి జ్ఞానవైరాగ్యాలను, చివర ముక్తిని ప్రసాదిస్తుంది భాగవతం. అలాంటి భాగవతంలో మానవుడు ఐహిక పరాలను సాధించేందుకు ఎన్నో సూక్తుల్ని - పోతనద్వారా మనం వింటాం. అందులో కొన్ని సూక్తులు నవమస్కంధంలోనివి.

**1. హరిచక్రానలకీల కన్యుఁ డొకరుం డడ్డంబు గా నేర్చునే (9-110)**

2. అకలంకస్థితి గొల్చు భక్తులకు లే దడ్డంబు రాజాగ్రణీ! (9–142)

3. బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి
మిన్ను ముట్టకేల మిన్నకుండు? (9–386)

4. అధముఁడైన వాని కా లగుకంటె న,
త్యధికునింట దాసి యగుట మేలు;
హీనుఁ బొంది యోని హింసింపఁగా నేల?
యువతిజనుల కూరకుంట లెస్స. (9–407)

5. తనుఁ గన్న తండ్రి సెప్పిన
పనిచేసిన సుగతి గొంగుపసిఁడియె కాదే! (9–558)

## మెదడులో పదిలం చేసుకోదగ్గ పద్యాలు

తెలుగుభాషలోని మాధుర్యాన్ని అనుభవించడానికి, ఇతరులతో పంచుకోడానికి, ఆ పద్యాల భావాల్ని జీవితాల్లోకి అన్వయం చేసుకోడానికి తెలుగువారు తప్పకుండా కంఠతా ఉంచుకో తగ్గ పద్యాలు భాగవతంలో ఎన్నో ఉన్నాయి. నవమస్కంధంలోని కొన్ని పద్యాల మొదళ్లను ఆయా పద్యాల సంఖ్యతో చూపుతున్నాను.

1. సప్తద్వీపవిశాలభూభరము 81
2. అమరేంద్రాశకుఁ 259
3. పుణ్యుఁడు రామచంద్రుఁడటపోయి 268
4. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు 361
5. అన్నము లేదు, కొన్ని మధురాంబువు 648

## శ్రీరామశ్రీకృష్ణులిద్దర్ని ఒకేలా ఆరాధిస్తారు

పోతన శ్రీమన్నారాయణ కథాప్రపంచవిరచనాకుతూహలంతో ఉన్నాడు. చంద్రగ్రహణ సమయంలో గంగకు వెళ్లాడు. పరమేశ్వరధ్యానంలో కూర్చున్న పోతనకు శ్రీరాముడు దర్శనమిచ్చాడు. భాగవతాన్ని తెలుగు చేయుమన్నాడు. పోతన భాగవతాన్ని తెలుగు చేస్తూ మహానందాంగనాడింభకుని స్తుతితో శ్రీకారం చుట్టాడు. శ్రీకైవల్యం కోరుకున్నాడు. అంకితం మాత్రం శ్రీకృష్ణునికే చేశాడు. షష్ఠ్యంతాలలో ఇది కనిపిస్తుంది. భాగవతాన్ని శ్రీరామునికి వినిపించాడు.

ఈ విధంగా పోతన రామకృష్ణుల్ని ఏకభంగిగా ఆరాధించాడు. నవమ దశమస్కంధాల్లో ఈ ఇరువురిమీద ఒకే విధంగా చెప్పిన రెండు పద్యాలు ఆ సంగతిని మనకు తెలుపుతాయి.

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులన్
విల్లును దాల్చువాఁడు గదు విప్పుగు వక్షమువాఁడు మేలు పైఁ

**జల్లెడువాఁడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులం**
**జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁ డీవుత మా కభీష్టముల్.** **(9-361)**

**ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు గృపారసంబుపై**
**జల్లెడు వాడు మౌళిపరిసర్పితపింఛమువాడు నవ్వురా**
**జిల్లెడు మోమువాడొకడు చెల్వల మానధనంబు దోచెనో**
**మల్లియలార! మీ పొదల మాటున లేడు గదమ్మ చెప్పరే!** **(10-1-1010)**

రెండు పద్యాలలో శైలి, పదబంధాలు, రచనా విధానం ఒకేలా ఉంటాయి. అంతేకాదు. రెండు పద్యాలలో ఎత్తుగడ ఒకే విధంగా ఉన్నది. రాముడూ కృష్ణుడూ ఒక్కడేనని చెప్పడమే మహాకవి పోతన వేసిన 'ఎత్తుగడ' అనిపిస్తుంది మనకు.

నవనవోన్మేష ప్రతిభా సంపన్నుడైన పోతనామాత్యుడు సహజపాండిత్యుడై సద్భక్తుని నేపథ్యంగా చేసుకొని, భాగవత నవమస్కంధం తెలుగువారికి అందించాడు.

తిరుపతి
గురువారం
16-02-2017

ఇట్లు
భాగవత విధేయుడు
**కట్టా నరసింహులు**

# అష్టమస్కంధం - కథాసారం

**ప**రీక్షిత్తు శుకుని ఇలా ప్రశ్నించాడు. మహాత్మా! శ్రీహరి ఏ మనువు కాలంలో ఏ పనిమీద పుట్టాడు? ఆ మనువుల పేర్లేమిటి? వివరించండి అని అడిగితే శుకుడు ఇలా చెప్పసాగాడు.

ఈ కాలంలో పద్నాలుగుమంది మనువులలో ఆరుగురు వెళ్లిపోయారు. మొదటి మనువు స్వాయంభువు. ఆయనకు ఆకూతి, దేవహూతి అని ఇద్దరు కూతుళ్లు. శ్రీహరి వారికి కపిలుడు, యజ్ఞుడు అనే పేర్లతో ధర్మజ్ఞానబోధకోసం పుట్టాడు. కపిలుని చరిత్ర చెప్పాను కదా! ఇక యజ్ఞుని చరిత్ర చెపుతానని మొదలుపెట్టాడు.

శతరూపకు భర్త అయిన స్వాయంభువుడు తపస్సు చేస్తూ ముందుగా భగవంతుని మనసా ధ్యానించాడు. పరమేశ్వరుని ధ్యానిస్తూ ఉపనిషద్వాక్యార్థాలు పలికే మనువును చూసి రాక్షసులు వానిని తినివేయాలని చూశారు. అపుడు యజ్ఞుడనే పేరుగల విష్ణువు ఆ రాక్షసులను తనచక్రంతో సంహరించాడు.

ఇక రెండవ మన్వంతరం విను! ఇందులో స్వారోచిషుడు మనువు. అతనికి ద్యుమంతుడు, సుషేణుడు, రోచిష్మంతుడు మొదలైనవారు కొడుకులయ్యారు. రోచనుడు ఇంద్రుడయ్యాడు. తుషితాదులు దేవతలు. ఊర్జస్తంభుడు మొదలైన ఐదుగురు సప్తర్షులు. వేదశిరుడు తుషితలకు 'విభుడు' అనే పేరుతో శ్రీహరి అవతరించాడు. అతడు 88,000 మంది మునుల అనుగ్రహంతో బ్రహ్మచర్య వ్రతదీక్ష పాటించాడు.

మూడో మనువు ఉత్తముడు. అతడు ప్రియవ్రతుని కొడుకు. అతని కొడుకులు పవనుడు, సృంజయుడు, యజ్ఞహోత్రుడు మొదలైన భూపరిపాలనంచేశారు. వశిష్ఠుని కొడుకులు ప్రమథాదులు సప్తర్షులయ్యారు. సత్యజిత్తు ఇంద్రుడయ్యాడు. సత్యభద్రాదులు దేవతలు - సూనృత, ధర్ములకు సత్యసేనుడు అనేపేర శ్రీహరి పుట్టాడు. సత్యజిత్తుకు అతడు మిత్రుడై రాక్షసులను యక్షులను దండించాడు.

## గజేంద్ర మోక్షణం

ఉత్తముని సోదరుడు తామసుడు నాల్గవ మనువు. కేతుడు, వృషుడు, నరుడు, ఖ్యాతి మొదలైన పదిమంది కొడుకులు రాజులయ్యారు. సత్యకులు, హరివీరులు దేవతలు. త్రిశిఖుడు దేవేంద్రుడు. జ్యోతిర్వ్యోముడు మొదలైనవారు మునులు. హరిణి హరిమేధులకు శ్రీహరి పుట్టాడు. అతడే ముసలికి చిక్కిన ఏనుగును విడిపించాడు. అనగానే శుకుని చూసి రాజు ఇలా అన్నాడు. నీటిలోని మొసలికి, అడవిలోని ఏనుగుకు ఎలా పోరాటంకలిగింది? ఆ కథ అంతా వివరంగా చెప్పు? అని పరీక్షిత్తు శుకుని అడిగాడు. అపుడు శుకుడు పరీక్షిత్తుకు ఇలా చెప్పాడు.

"రాజేంద్రా!" పాలసముద్రంలో 'త్రికూటం' అనే పర్వతం పదివేలయోజనాల ఎత్తు, అంతే పొడవు, వెడల్పులూ కలిగి ఉంది. దీనికి మూడుశిఖరాలు బంగారు, ఇనుము, వెండి శిఖరాలు ఉన్నాయి. రంగురంగుల రత్నాలతో అక్కడి భూమ్యాకాశాలు మెరిసిపోతూ ఉంటాయి. ఆ కొండచరియల్లో దేవతలు విమానాలెక్కి తిరుగుతూ ఉంటారు. ఎన్నో చక్కని పూలచెట్లు ఉన్నాయి. చిలుకలు, కోకిలలు కోలాహలంతో చక్కగా అందంగా ఉంటుంది ఆ ప్రాంతం. అంతేకాదు, ఏనుగులూ, సింహాలూ కూడా ఉంటాయి.

ఒకనాడు కొన్ని ఏనుగులు దప్పికతోవచ్చి నీటిగాలిసోకి కాసారంలో దిగాలి అనుకొన్నాయి. వెంటనే ఏనుగులు గుహలనుండి బయటకు వచ్చాయి. వాటి గాలిసోకి ఇతర జంతువులన్నీ చెల్లా చెదరయ్యాయి. ఏనుగుల గుంపులన్నీ విచ్చలవిడిగా విహరిస్తున్నాయి. అందులో ఒక గజరాజు ఇతరమయిన గుంపులతో విడివడిపోయి తానొక్కడూ తనగుంపుతో వెళ్లుతున్నాడు. తన కరణీసమూహంతో దారితప్పి దాహంవేసి, వెళ్లి వెళ్లి ఒక సరస్సు చూశాడు. దానితో ఆ గుంపుకు పంచేంద్రియ తృప్తి కలిగింది. ఇక ఒళ్లు తెలియక ఆ ఏనుగుల గుంపు ఆ సరసులోకి దిగింది. వాటి విహారానికి దేవతలుకూడా నిశ్చేష్టులయ్యారు. ఇంతలో ఆ గజేంద్రుని ఒక మొసలి పట్టుకొంది. వెంటనే ఏనుగు దానిపట్టు తప్పించుకొని తొండంతో ఆ మొసలిని కొట్టింది. మొసలి చచ్చినట్లు పడిపోయింది. కాని, వెంటనే మళ్లీ ఏనుగు ముందరికాళ్లు పట్టుకొంది. ఏనుగు తన రెండు దంతాలతో మొసలి చిప్పలు కదిలిపోయేటట్లు పొడిచింది. ఇలా కరిమకరాలు రెండూ చెరువునంతటినీ సంక్షుభితం చేశాయి. ఇలా చాలాకాలం ఆహారమూ నిద్రా లేకుండా పోరుతున్నాయి. నీరు తనకు జీవనాధారం కాబట్టి, మొసలికి అంతకంతకూ బలమూ పట్టుదలా పెరిగాయి. గజరాజు కృష్ణపక్షంలో చంద్రునివలె శీతకాలపు సూర్యునివలె తయారయింది. అయినా కరిమకరులు రెండూ పోరాడుతూనే ఉన్నాయి. అలుపూ, సొలుపూ లేకుండా విసిగిపోకుండా ఏనుగూ మొసలీ ఎడతెరపిలేకుండా వెయ్యిఏళ్లు పోరాడాయి.

అపుడు ఏనుగు తన బలాన్నీ, మొసలి బలాన్నీ ఎంచి చూచుకొని "దీనితో నేనికపోరాడలేను అని బాధపడింది. అంతలో పూర్వపుణ్యవశాన దివ్యజ్ఞానం కలిగి ఇలా అనుకొంది.

"ఈశ్వరా! ఈ అడవిలో నేను పదిలక్షకోట్ల ఆడఏనుగులకు అధిపతినై ఉన్నాను. నా మదజలంతో పెరిగిన చందన పుష్పాలనీడలలో ఉండలేక ఈ నీటికి ఆశపడి ఇక్కడకు ఎందుకు వచ్చాను? చాలా భయం కలుగుతోంది కూడా. అంటూ ఈ విధంగా ప్రార్థించింది.

**ఎవ్వనిచేఁజనించు జగమెవ్వని లోపలనుండు లీనమై**
**యెవ్వని యందుడిందు; పరమేశ్వరుడెవ్వడు? మూలకారణం**
**బెవ్వఁడనాది మధ్యలయుఁడెవ్వఁడు సర్వముఁదానయైన వాఁ**
**డెవ్వఁడు వానినాత్మభువు నీశ్వరునే శరణంబు వేడెదన్**

అంటూ ప్రార్థించింది. అలా చాలాసేపు ప్రార్థించాక అసలు ఆ భగవంతుడు ఉన్నాడా! అని అనుమానం వచ్చింది. కొంతసేపు అలా 'అస్తి – నాస్తి' విచికిత్సలకులోనై చివరకు తనమనసులో ఈశ్వరుని నిలుపుకొని ఇలా ప్రార్థించాడు గజరాజు.

**లావొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్**
**ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁదనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్**
**నీవే తప్ప నితః పరంబెఱుగ మన్నింపందగున్ దీనునిన్**
**రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!**

అంటూ శరణార్థియైన తనను రక్షింపుమని వేడుకొన్నాడు. ఆకాశంవైపు చూస్తున్నాడు. ఈ మొర బ్రహ్మాదులు విన్నారు. కాని, వారికి విశ్వమయత లేకవారు విన్నా అడ్డుపడలేదు. విశ్వమయుడైన విష్ణువు అడ్డుపడాలనుకొన్నాడు.

ఎక్కడో దూరంగా వైకుంఠపురం ఉంది. అందులో అంతఃపురం. దాని వెనుక ఒక భవనం. దాని ప్రక్కనే ఒక అమృత సరస్సు. దాని ఒడ్డున చంద్రకాంతమణులు పొదిగి, కలువలు పరిచిన తల్పం. దానిమీద రమాదేవితో వినోదిస్తున్నాడు. ఆ మహావిష్ణువు. ఆయన ఆపన్న ప్రపన్నుడు కదా! ఏనుగు "పాహి పాహి" అన్న మొర విన్నాడు. అంతే – వెంటనే ప్రక్కనున్న లక్ష్మీదేవికి చెప్పలేదు. శంఖచక్రాలు ధరించలేదు, ఏ పరివారాన్నీ పిలువలేదు. గరుత్మంతుని సిద్ధంకమ్మనలేదు. చివరకు జుట్టుకూడ సవరించుకోలేదు, వివాదంతో పట్టుకొన్న లక్ష్మీదేవియొక్క పైటకొంగును కూడా విడువకుండా లేచాడు. అటుఇటూ చూచాడు. ఆకాశాని కెగిరాడు.

తనవెంటనే లక్ష్మీదేవి, ఆమెవెంట అంతఃపురస్త్రీలు వారివెనుక గరుత్మంతుడు, ఆ వెనుక ధనుస్సు, గద, శంఖచక్రాలూ వస్తున్నాయి. ఆ వెనుక నారదుడు, సేనాపతి విష్వక్సేనుడు...ఇలా వైకుంఠంలో ఉన్నవారంతా వస్తున్నారు. లక్ష్మీదేవి పైటకొంగు పట్టుకొని వస్తున్నారు. అపుడు లక్ష్మీదేవి ఇలా అనుకొంది. ఎక్కడికి వెడుతున్నారో! చెప్పడు. ఎవరైనా వేదాలు దొంగిలించారో ఏమో! రాక్షసులు దేవనగరంమీద దండెత్తారేమో! లేకపోతే ఎవరయినా లేదా భక్తులను పట్టుకొని దుర్జనులెవరయినా ఆ హరి ఎక్కడున్నాడు? అని హుంకరిస్తున్నారేమో! అనుకొంటోంది లక్ష్మీదేవి. ఆయన వెనుక ఆమెకూడా నడుస్తోంది. చెవుల తాటంకాలు ఊగిపోతున్నాయి. పైటతొలగిపోతోంది. నుదుటి తిలకం జారిపోతోంది. తన పైటచెంగు విభుని చేతిలో ఉంది. కోటిచంద్రుల కాంతితో మెరిసిపోతోంది. తన స్తనభారంతో నడుము వంగిపోతోంది.

అయినా 'అడుగుదాం' అని వేగంగా ముందుకుపోతోంది. అడిగితే మాత్రం సమాధానం చెపుతాడా! అని ఆగిపోతోంది. ఇలా తొట్రుపాటుతో నడుస్తోంది, అగుతోంది. ఈ దృశ్యమంతా దేవతలంతా చూశారు. "అదుగో! వచ్చేశాడు శ్రీహరి. ప్రక్కన లక్ష్మీదేవి. శంఖధ్వనికూడా వినిపిస్తోంది. చక్రం అదిగో – అదుగో గరుత్మంతుడు – అంతా వచ్చేస్తున్నారు. అంటూ దేవతలంతా **"నమో నారాయణాయ"** అంటూ నిలిచి నమస్కరించారు. అంతలో విష్ణువు తన సుదర్శనచక్రాన్ని మొసలిమీదికి వదిలాడు. అదివచ్చి మొసలి శిరస్సును ఖండించింది. మొసలి పట్టువీడి గజరాజు గ్రహణం విడిచిన చంద్రునివలె ప్రకాశించాడు.

అపుడు శ్రీహరి పాంచజన్యం పూరించాడు. దేవదుందుభులు మ్రోగాయి. పూలజల్లు కురిసింది. అప్సరసలు నాట్యం చేశారు. విష్ణుమూర్తి తనచేతితో గజాన్ని సరసునుండి బయటకు లాగి, శరీరం నిమురుతూ దాని దుఃఖం పోగొట్టాడు. ఏనుగుకూడ మొసలిబారినుండి బయటపడినతర్వాత ఆడఏనుగులతో కరపీడనం చేసింది. వెంటనే మొసలి 'హూహూ' అనే గంధర్వుడు గానూ, గజరాజు ద్రవిడ దేశపు రాజయిన ఇంద్రద్యుమ్నునిగానూ మారిపోయారు.

ఆ ఇంద్రద్యుమ్నుడు పూర్వం అచ్యుతుని ధ్యానిస్తూ ఉండగా అగస్త్యమహాముని వచ్చాడు. ఇంద్రద్యుమ్నుడు లేవలేదు. పూజింపలేదు. వెంటనే అగస్త్యుడు ఇంద్రద్యుమ్నుని ఏనుగుగా జన్మించుమని శపించాడు. "అందుకే విప్రులను అవమానింపరాదు. తామెంత పుణ్యాత్ములయినా సరే! ఆ రాజు గజరాజు అయ్యాడు. భటాదులు

ఏనుగులయ్యారు. ఏనుగయినా శ్రీహరి పాదసేవతో మోక్షం లభించింది. అందుకే సత్కర్మలు చేస్తూ, కమలాక్షుని సేవిస్తూ నియతంగా ఉంటే కర్మలన్నీ శిథిలమైపోతాయికాని విష్ణుభక్తి మాత్రం చెడదు. స్థిరంగా నిలుస్తుంది. విష్ణుసేవాపరాయణులే చెడిపోనివారు.

అప్పుడు చిరునవ్వుతో ఉన్న లక్ష్మీదేవితో విష్ణువిలా అన్నాడు. బాలా! నా వెనుక ఆకాశంలో వస్తూ ఉన్న నీ పైటకొంగు పట్టుకొన్నందుకు నీ మనసులో నన్ను గురించి ఏమనుకొన్నావు? నేనెప్పుడూ అన్నీ తెలుసుకొంటూనే ఉంటాను. నన్ను మరువకుండా మొరపెట్టుకొనేవారిని ఎన్నడూ మరిచిపోను."అన్నాడు. అపుడు లక్ష్మీదేవి "దేవా! మీ పాదాలు ధ్యానిస్తూ మీవెంటే వస్తున్నాను. మీరు దీనరక్షకులని నాకు బాగా తెలుసు" అంది. వెంటనే విష్ణుమూర్తి చిరునవ్వుతోనే ఆలింగనం చేసుకొని సపరివారంగా గరుడుని అధిరోహించి తన సదనానికి వెళ్లిపోయాడు.

ఇలా చెప్పి శుకుడు "రాజా! ఈ కథ విన్నవారికి దోషాలు తొలగి సంపదలు, సంతోషం కలుగుతాయి. మోక్షం సులభమవుతుంది. ఆనందం కలుగుతుంది. అని శ్రీమహావిష్ణువు చెప్పాడు. తెల్లవారుజాముననే లేచి ఏకాగ్రమైన మనస్సుతో ఇది చదివినవారికి నిర్మలగతిని ప్రసాదిస్తానని, మోక్షమరచేతిలోకి వస్తుంది అనీ చెప్పాడు.

ఇలా చెప్పి శుకుడు రాజుతో ఇలా అన్నాడు. తామసుని తమ్ముడైన రైవతుడు ఐదవ మనువయ్యాడు. వానికొడుకులు ప్రతివింధ్యుడు, అర్జునుడు మొదలైనవారు భూమిని పాలించారు. ఆ మన్వంతరంలో హిరణ్యరోముడు, ఊర్ధ్వబాహుడు, వేదశీర్షుడు, మొదలైనవారు సప్తర్షులు. శుభ్రునికీ వికుంఠఅనే ఆయన ధర్మపత్నికీ వైకుంఠుడనే పేరుతో విష్ణువు పుట్టాడు. వైకుంఠం కల్పించాడు. అతనినే రమాదేవి చేపట్టింది. ఆ హరి సద్గుణాలు ఇన్ని అని ఎన్నలేము. చక్షువు కొడుకు చాక్షుషుడు. ఆరో మనువు అయ్యాడు. పురువు, పురుషుడు, సద్యుమ్నుడు మొదలైనవారు అతని కొడుకులు రాజులయ్యారు. ఆప్యుడు మొదలైనవారు దేవతలయ్యారు. హవిష్మదాదులు సప్తర్షులయ్యారు. సంభూతికీ వైరాజుకూ విష్ణువు అజితుడనే పేరుతో పుట్టాడు. తాబేలై సముద్రంలో మందరపర్వతం మోసినవాడు అతడే. అనగానే పరీక్షిత్తు శుకుని ఇలా అడిగాడు.

## క్షీరసాగర మథనం

మునీంద్రా! విష్ణుమూర్తి తాబేలు రూపం ధరించి పాలకడలి ఎందుకు మథించాడు? దేవతలకు అమృతం ఎలా లభించింది? వివరంగా చెప్పుమని అడిగితే శుకుడు పరీక్షిత్తుకు ఇలా చెప్పాడు.

రాక్షసులు దేవతలపై దాడి చేశారు. అపుడు ఇంద్రాదులు బ్రహ్మదగ్గరకు వెళ్లి విషయం చెప్పారు. నిస్తేజులయిన దేవతలను చూసి బ్రహ్మ పరమాత్ముని తలచుకొన్నాడు. అపుడాయన ముఖాలు వికసించాయి. శ్రీహరి దర్శనమిచ్చాడు. బ్రహ్మాదులు విష్ణువును స్తుతించారు. అపుడు విష్ణుమూర్తి ఇలా చెప్పాడు. "దేవతలారా! ఇపుడు మీరు దానవులతో కలిసి జీవించాలి. అమృతంపొందే ప్రయత్నం చేయండి. ఆ అమృతంకోసం పాలకడలిని మథించండి. ముందుగా సముద్రంనుండి విషం పుడుతుంది. అంతటితో భయపడి ఆగిపోకండి. అమృతం పుట్టేవరకూ మథించండి. అని చెప్పి విష్ణువు అంతర్ధానమయ్యాడు. దేవతలు బలిని సేవింపసాగారు. దేవతలను రాక్షసులు చంపబోతుంటే బలివారిని వారించి శాంతపరిచాడు. ఇంద్రుడు కూడ వారితో స్నేహం పాటించాడు. పాలకడలి మథించాలని

ఇరువురిని ప్రోత్సహించాడు. దేవతలూ దానవులూ మందర పర్వతాన్ని పెల్లగించి సముద్రం దగ్గరకు తెచ్చారు. అలా తేవడంలో కొంతమంది నుగ్గునుగ్గు అయ్యారు. కొంతమంది పారిపోయారు. 'శ్రీహరి ఇంకా రాడేమిటి' అని అనుకుంటూ ఉండగానే శ్రీహరి గరుత్మంతునిపై రానే వచ్చాడు. శ్రీహరిని దింపి గరుత్మంతుడు వెళ్లిపోయాడు.

దేవదానవులు వాసుకిని పిల్చి ఆ సర్పరాజును సముద్రమథన కార్యానికి త్రాడుగా కమ్మని ప్రియోక్తులతో ఒప్పించారు. ఇంద్రుడు, దేవతలూ వాసుకి తలవైపు; రాక్షసులు తోకవైపు పట్టుకొని పాలకడలిని మందరపర్వతంతో చిలుకుతున్నారు. అంతలో వాసుకి 'విడవండి విడవండి' అని అరిచాడు. మరుక్షణంలో ఆ పర్వతం సముద్రంలో మునిగిపోతోంది. విధిబలీయం కదా! అంతలో శ్రీహరి తాబేలుగా మారి వాసుకితోపాటు కొండను అవలీలగా పైకెత్తాడు. దేవదానవులంతా పట్టుదలతో పాలకడలి మథిస్తూ ఉంటే హాలహలం అనే విషం పుట్టింది. వెంటనే బ్రహ్మాదులు కైలాసం చేరి శంకరుని శరణువేడారు. దేవతల ప్రార్థనవిని శంకరుడు పార్వతితో "విషం పుట్టిందిట – దాన్ని మ్రింగి దేవతలకు హితం చేస్తాను. చూడు." అన్నాడు. వెంటనే పార్వతీదేవి "మీయిష్టం" అంది.

అపుడు పరీక్షిత్తు శుకుని ఇలా అడిగాడు. లోకహితంకోసం శివుడు 'అలాగే' అన్నాడనుకో. దేవతలూ మ్రింగమన్నారే అనుకో! బ్రహ్మాదులూ 'శంకరా! లే' అన్నారే అనుకో – వీరంతా ఎలా ప్రోత్సహించినా, ఆ ఉమాదేవి ఎలా మ్రింగమంది? అనగానే శుకుడు ఇలా సమాధానం చెప్పాడు. మ్రింగేవాడు విభుడనీ తెలుసు. మ్రింగేది హాలాహలమనీ తెలుసు. అయినా **ప్రజలకు మేలు కలుగుతుందని** పార్వతీదేవి 'మింగండి' అని చెప్పింది. అంటే ఆమె తన మంగళసూత్రాన్ని ఎంతగా నమ్ముకొందో! వెంటనే శివుడు ఆ విషాన్ని నేరేడు పండులా మ్రింగేశాడు. శివునికి ఏమీ కాలేదు. శివునికి తన ఉదరంలో లోకాలున్నాయని తెలుసు. అయినా చిన్న పండురసంలా తన కంఠంలోనే నిలుపుకొన్నాడు. ఆ దృశ్యంచూచి, హరి బ్రహ్మాదులూ, పార్వతీకూడ బాగుంది అని మెచ్చుకొన్నారు. అప్పటినుండి శివుడు కాకోలగ్రీవుడు, నీలకంఠుడు, గరళకంఠుడని పిలువబడ్డాడు. రాక్షసులూ దేవతలూ అలా మథిస్తూ ఉంటే ఆ సముద్రంనుండి కామధేనువు పుట్టింది. అగ్నికార్యాలకు పనికి వస్తుందని దేవమునులు దానిని తీసుకొన్నారు. తరువాత ఉచ్చైశ్రవమనే గుఱ్ఱం పుట్టింది. దాన్ని బలిచక్రవర్తి తీసుకొన్నాడు. తరువాత ఐరావతమనే ఏనుగు పుట్టింది. వెంటనే చంద్రుడు ఉద్భవించాడు. అపుడు మెరుపు తీగవంటి లక్ష్మీదేవి పుట్టింది. తీర్థజలాలతో ఆమెకు స్నానం చేయించాడు. సముద్రుడు నూతనవస్త్ర ద్వయమూ, వైజయంతీమాలను వరుణుడు; కంకణాలను విశ్వకర్మ; సరస్వతి ముత్యాలహారాన్ని, బ్రహ్మపద్మాన్ని ఇచ్చారు. ఆమె చిరునవ్వు లోకులందరి దుఃఖాన్నీ వారిస్తుంది. ఆమె దుర్గాభారతులను ప్రియసఖులుగా భావిస్తుంది. ఆమె విష్ణువును చూసి 'ఇతడే భర్త' అనుకొంటూ పూలదండతో సత్కరించింది. సందట్లో సందడిగా మన్మథుడు వారిని తొందరించాడు. శ్రీహరి లక్ష్మీదేవిని వక్షఃస్థలంమీద ధరించాడు. సముద్రుడు కౌస్తుభరత్నంతో విష్ణువును అలంకరించాడు.

సముద్రంలోనుండి వారుణి అనే కన్యవచ్చింది. శ్రీహరి అనుమతితో ఆమెను రాక్షసులు స్వీకరించారు. ఇంకా ధన్వంతరి అమృత కలశంతో సముద్రంనుండి పైకి వచ్చాడు. వెంటనే రాక్షసులు దాన్ని అపహరించారు. దేవతలు శ్రీహరికి మొరపెట్టారు.

విష్ణుమూర్తి మోహినీ రూపం ధరించాడు. తన సౌందర్యంతో, హావభావాలతో వారిని సమ్మోహపరిచాడు. వారు అమృతం పంచిపెట్టుమని కోరారు. మోహిని వారిని రెండుభాగాలు చేసి కూర్చుండబెట్టి, జాణతనంతో మాట్లాడి, రాక్షసులను వశపరచుకొని 'త్వరగా త్రాగండి' అంటూ దేవతలకు అమృతాన్ని పంచింది. దేవతలంతా సంతోషించారు. గట్టిగా అడిగితే కోప్పడుతుందేమో అని మాట్లాడలేదు దేవతలు. ఇంతలో రాక్షసులు ఆమె చూపులతో కరిగినీరైపోయారు. ఆమెను అడగనుకూడ అడగలేకపోయారు. రాహువు దేవతల్లో చేరి అమృతం త్రాగడం చంద్రసూర్యులు చూశారు. వారు నారాయణునికి సైగ చేశారు. వెంటనే విష్ణువుచక్రంతో రాహువు శిరస్సును ఖండించాడు. బ్రహ్మ వానితలను గ్రహంగా చేశాడు. ఒక్కబొట్టు కూడ మిగలకుండా అమృతాన్నంతా దేవతలకు పంచాడు.

నిజమే! శ్రీహరి పరాఙ్ముఖులు ఏ కోరికలనూ పొందలేరు కదా! వెంటనే శ్రీహరి గరుత్మంతుని ఎక్కి వెళ్లిపోయాడు. దేవదానవసైన్యాలు మోహరించాయి. బలితో ఇంద్రుడు మొదలైనవారంతా రేయింబగళ్లు గమనించకుండా యుద్ధం చేశారు. దేవతలు రాక్షసులచేతికి చిక్కి జనార్దనుని ప్రార్థించారు. జనార్దనుడు మాలి, సుమాలును, సంహరించాడు మాల్యవంతుని నరికాడు.

అపుడు ఇంద్రుడు బలిని చూసి "దాక్కోకు! నవ్వుతా" రంటూ వేళాకోళం చేశాడు. బలి కూడా తిరిగి అవమానించాడు. ఇంద్రుడు వానిని వజ్రాయుధంతో కొట్టాడు. బలి నేలపైపడ్డాడు. వెంటనే ఆతని సఖుడు జంభుడు ఇంద్రుని ఏనుగును కూలబొడిచాడు. వారిద్దరికి మహాయుద్ధం జరిగింది. ఇంద్రుడాయుద్ధంలో పాకాసుర బలాసురులను వజ్రంతో నేలగూల్చాడు. వెంటనే నముచి ఇంద్రునిపై శూలాన్ని విసిరాడు. వస్తున్న శూలంమీదికి వజ్రాయుధం విసిరినా, అది వాని కంఠం తెగవేయలేకపోయింది. వజ్రి ఆశ్చర్యపడుతుంటే దివ్యవాణి ఇలా అంది. "ఇతడు ఆర్ద్రమైన దానితోను, శుష్కమయినదానితోనూ చావడు. మరొకటి ప్రయోగించు" అనగానే ఇంద్రుడు వజ్రాయుధాన్ని నురుగులో ముంచి నముచి తలను తెగనరికాడు. ఇంతలో బ్రహ్మ పంపితే నారదుడు వచ్చాడు. యుద్ధం చాలించారు దేవతలు. చావగా మిగిలిన రాక్షసులు బలిని తీసికొని అస్తగిరి శిఖరానికి చేరారు. చనిపోయిన రాక్షసులను శుక్రుడు మృతసంజీవనితో బ్రతికించాడు.

శుకుడు పరీక్షిత్తుతో ఇంకా ఇలా చెపుతున్నాడు. ఒకనాడు కైలాసంమీద శివుడు కొలువుదీరి ఉన్నాడు. అపుడు "విష్ణువు స్త్రీ రూపం ధరించి రాక్షసులను కనుగప్పి దేవతలకు అమృతం పంచిన విషయం విన్నాడు. వెంటనే ప్రమథగణాలతో విష్ణుమందిరానికి వచ్చాడు. కుశల ప్రశ్నానంతరం శివుడు విష్ణుమూర్తితో ఇలా అన్నాడు". జగదీశా! మాయాయుక్త బ్రహ్మవు. మునులు మోక్షంకోసం నీ పాదాలు సదాకొలుస్తూ ఉంటారు. మోహినివై అమృతాన్ని ఇంద్రాది దేవతలకు ఇచ్చావు. స్త్రీరూపంతో లోకాలను ముంచెత్తడం నీకెంతపని? అనగానే విష్ణువు భావగర్భితంగా ముకుందా! దేవా! నీవు సత్యానంద స్వరూపుడవు. మోక్షార్థులు నిన్నే సేవిస్తారు. ఎన్నో రూపాలతో నిను కొలుస్తారు. అలలు ఎన్ని ఉన్నా సముద్రం ఒకటే – ఈ లోకాలన్నిటికీ బంధం, మోక్షం నీవే! నీ విలాసాలు చాలాసార్లు చూశాం. **నీ స్త్రీ రూపం ఎలా ఉంటుందో చూడాలి" అనగానే శివునితో విష్ణువు ఇలా అన్నాడు. "నీలకంఠా! నీ కోసం నా స్త్రీరూపం చూపిస్తాను** అని మాయమయ్యాడు.

పరమేశ్వరుడు పరిశీలిస్తున్నాడు. మరుక్షణంలో ఒక యువతిని చూశాడు. రెప్పవేయక తదేకదృష్టితో చూడసాగాడు. జారిపోతున్న పైటచెంగును పట్టుకొంది. ఈమె ఎవరా? అని సాకాంక్షగా చూశాడు. ఆమె జగన్మోహన రూపంతో విహరిస్తోంది. శూలి ధైర్యం సడలింది. ఆమె దగ్గరకు చేరాడు శూలి. ఆమె సిగ్గుతో నవ్వుతూ చెట్లచాటుకు చేరింది. శివుడు కూడా వెంట తగిలాడు. సంతోషంతో కౌగిలించాడు. అలా వెళుతూ ఉండగానే అతని వీర్యం నేలబడింది. ఆ చోటంతా వెండి, బంగారుమయమయింది. వెంటనే 'విష్ణుమాయ' అని తెలిసింది. అపుడు హరి, హరునితో ఇలా అన్నాడు. "నా మాయలోపడకుండా మోహితుడవైనప్పటికీ నన్ను గుర్తించావు." అంటూ గౌరవించాడు.

రాజా! ఈ చరిత్రను చదివినవారు అనల్పసుఖాలను పొందుతారు.

అని శుకుడిలా అన్నాడు. ఇపుడు ఏడవమన్వంతరం జరుగుతోంది. వైవస్వతుడు అనే ఈ మనువుకు పదిమంది కుమారులు. వారి పేర్లు. ఇక్ష్వాకుడు, నభగుడు, దృష్టుడు, శర్యాతి, అరిష్యంతుడు, నాభాగుడు, దిష్టుడు, కరూశకుడు, పృషధ్రుడు, వసుమంతుడు అనే పదిమంది రాజులు, పురందరుడు, ఇంద్రుడు, ఆదిత్యులు, మరుత్తులు, అశ్వినులు, వసువులు, రుద్రులు అనే పేర్లు కలవారు దేవతలు. గౌతముడు, కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, జమదగ్ని, భరద్వాజుడు, వసిష్ఠుడు అనేవారు సప్తర్షులు. అందులో **కశ్యపునకు అదితికీ విష్ణువు వామనుడుగా పుట్టాడు.** అందుచేత ఉపేంద్రుడయ్యాడు. ఇప్పటికి ఏడుమన్వంతరాలు చెప్పాను. ఇక రాబోయే మన్వంతరాలను, శ్రీహరి పరాక్రమాన్నీ వివరిస్తాను. అని శుకుడు ఇలా చెప్పసాగాడు.

"రాజా! విశ్వకర్మ కూతుళ్లయిన సంజ్ఞ, ఛాయలు సూర్యునికి భార్యలు కదా! అతనికి **బడబ** అనే భార్యకూడా ఉంది. సంజ్ఞకు యముడు, శ్రాద్ధదేవుడు, యమున పుట్టారు. ఛాయకు తపతి, సావర్ణి, శనైశ్చరుడు పుట్టారు. తపతిని సంవరణుడు పెళ్లి చేసుకొన్నాడు. బడబకు అశ్వినీదేవతలు పుట్టారు. సావర్ణి ఎనిమిదవ మనువు. ఇపుడతడు తపస్సు చేస్తున్నాడు.

**సావర్ణి మన్వంతరంలో** అతని కొడుకులు నిర్మోహుడు, విరజస్కుడు మొదలైనవారు రాజులు. సుతపులు, విరజులు, అమృత ప్రభులు – దేవతలు అవుతారు. **గాలవుడు, దీప్తిమంతుడు, పరశురాముడు, అశ్వత్థామ, కృపుడు, బాదరాయణుడు.** ఋశ్యశృంగుడు – సప్తర్షులవుతారు. వారిపుడు తమ యోగబలాలతో తమ ఆశ్రమాలలో ఉన్నారు. **బలిచక్రవర్తి ఇంద్రుడవుతాడు.** ఇలా చెప్పి శుకుడిలా అన్నాడు.

**పూర్వం బలి స్వర్గం కైవసం చేసుకొంటే హరి వామనరూపంలో వచ్చి దానమడిగాడు. మూడడుగులు దానంచేసి అతడు ఇపుడు సుతలంలో హాయిగా ఉన్నాడు. రాబోయేకాలంలో వేదగుహునికి శ్రీహరి "సార్వభౌముడు"గా పుట్టి రాజవుతాడు. అతడు ఇపుడున్న ఇంద్రుని పదవీచ్యుతునిచేసి ఆస్థానంలో బలిని నిలుపుతాడు. తన ఇంద్రపదవిని దానం చేసినందువల్ల బలి ఇంద్రపదవిని పొందుతాడు. అందుకే రాజా! "దానఫలం ఎన్నటికీ చెడదు"**

తరువాత వరుణపుత్రుడైన దక్షసావర్ణి తొమ్మిదవ మనువు అవుతాడు. అతని కొడుకులు ధృతకేతుడు, దీప్తకేతుడు రాజులవుతారు. పరుడు, మరీచి, గర్గుడు మొదలైనవారు దేవతలుగా, అద్భుతుడు – ఇంద్రుడు అవుతాడు. ద్యుతిమంతుడు మొదలైనవారు ఋషులు అవుతారు. ఉపశ్లోకుని కొడుకు బ్రహ్మసావర్ణి పదవమనువు; అతని కొడుకులు భూరిషేణుడు మొదలైనవారు రాజులవుతారు. హవిష్మంతుడు మొదలైనవారు మునులు; శంభుడు ఇంద్రుడు. విబుద్ధి మొదలైనవారు దేవతలు.

విషూచి విశ్వసృజులకు శ్రీహరి పుట్టి శంభునితో మైత్రి చేస్తాడు. విష్వక్సేనుడనే పేరుతో జగద్రక్షణ చేస్తాడు. రాబోయేకాలంలో ధర్మసావర్ణి పదకొండవ మనువు. అతని కొడుకులు సత్యధర్ముడు మొదలైనవారు పదిమంది రాజులు ఆకాశగమనులు, కామగమనులు, నిర్వాణరుచులు దేవతలవుతారు. వైధృతుడు ఇంద్రుడవుతాడు. అరుణుడు మొదలైనవారు ఋషులవుతారు. పద్మాక్షుడు ధర్మసేతువు అనే పేరుతో సూర్యసుతుడుగా జన్మించి ముల్లోకాలను రక్షిస్తాడు. భద్రసావర్ణి పన్నెండవ మనువు అవుతాడు. అతని కొడుకులు 1. దేవవంతుడు 2. ఉపదేవుడు 3. దేవజ్యేష్ఠుడు మొదలైనవారు రాజులు. ఋతధాముడు అనేవాడు ఇంద్రుడు; హరితుడు మొదలైనవారు ఋషులు అవుతారు. అపుడు విష్ణువు 'స్వధాముడు' అనే పేరు కలిగి సత్యతపుడు, సూనృత అనే దంపతులకు కొడుకుగా పుడతాడు.

తరువాతికాలంలో ఆత్మజ్ఞాని అయిన దేవసావర్ణి పదమూడవ మనువు అవుతాడు. వాని కుమారులు చిత్రసేనుడు, విచిత్రుడు మొదలైనవారు రాజులు; సుకర్ముడు, సుత్రాముడు అనే వారు దేవతలు; దివస్పతి ఇంద్రుడు; నిర్మోహుడు తత్త్వదర్శి మొదలైనవారు ఋషులు అవుతారు. దేవహోత్రుని భార్య బృహతికి **యోగవిభు**డనే పేర విష్ణువు కొడుకుగా పుట్టి దివస్పతిని సుఖపెడతాడు.

ఆ తరువాత ఇంద్రసావర్ణి పదునాల్గవ మనువు అవుతాడు. గంభీరుడు, వసువు మొదలైనవారు మనువు కొడుకులై రాజులవుతారు. పవిత్ర చాక్షుషులనే వారు దేవగణాలు అవుతారు. "శుచి" ఇంద్రుడు. అగ్ని, బాహువు, శుచి, శుక్రుడు, మాగధుడు మొదలైనవారు ఋషులు అవుతారు.

సత్రాయణునకు వితాన అనే భార్యయందు హరి, బృహద్భానుడనే పేర జన్మించి, స్వర్గవాసులు సంతోషించేటట్లు పాలిస్తాడు. రాజా! ఇలా త్రికాలాల్లోనూ పుట్టే పద్నాలుగుమంది మనువులు పాలన పూర్తయ్యేసరికి వేయియుగాలు గడుస్తాయి. అది బ్రహ్మకు **ఒకరోజు** అవుతుంది.

అపుడు పరీక్షిత్తు శుకునితో ఇలా అన్నాడు. ఈ మన్వాదులను ఎవరు నియమిస్తారు? వారికంత వైభవం ఎలాకలిగిందో వివరంగా చెప్పు అనగానే శుకుడు ఇలా చెపుతున్నాడు.

మనువులు, మునులు, సుతులు, ఇంద్రులు, దేవతలు అంతా శ్రీహరి ఆజ్ఞకు లోబడి ఉంటారు. యజ్ఞుడు మొదలైనవారు హరిపౌరుషం రూపుదాల్చినవారు. వారి సాయంతో మనువులు లోకాలను పాలిస్తారు. నాలుగు యుగాలు అయ్యాక మళ్లీ వేదాలను ఋషులు తమ తపోబలంతో దర్శిస్తారు. అపుడు ధర్మం మళ్లీ నాల్గుపాదాల నడుస్తుంది. రాజులంతా చక్కగా పాలిస్తారు. అర్హులను విష్ణువు ఇంద్రాది పదవులలో నియమిస్తాడు. వారు తమకు విహితమైన ధర్మకర్మలాచరిస్తూ ఏలుతూ ఉంటారు. పంటలు చక్కగా పండుతాయి.

విష్ణువే యోగీశుని రూపంలో యోగాన్ని బోధిస్తాడు. మునిరూపంలో కర్మచేస్తాడు. ప్రజాపతి రూపంతో సృష్టిస్తాడు. ఇంద్రుడై రాక్షససంహారం చేస్తాడు. సిద్ధుడై జ్ఞానబోధ చేస్తాడు. కాలుని రూపంలో అంతం చేస్తాడు. వివిధ నామరూపాలు ధరించి, అనేక రీతులతో, అనేకచర్యలతో వెలుగొందుతాడు.

## వామన చరిత్ర

వెంటనే పరీక్షిత్తుతో శుకుడిలా అన్నాడు. "బలిని శ్రీహరి మూడడుగుల నేల అడగడమేమిటి? బలిని ఎందుకు బంధించాడు? నాకు చెప్పండి". అనగానే శుకుడు చెపుతున్నాడు.

ఇంద్రునికి ఓడిపోయి బలి శుక్రుని దయతో విశ్వజిద్యాగం చేశాడు. ఎన్నో శక్తియుక్తులు కలిగాయి. అతడు ఇంద్రునిపై దండెత్తాలని స్వర్గం చేరాడు. అమరావతిని చుట్టుముట్టాడు. ఈ విషయం తెలిసి ఇంద్రుడు బృహస్పతితో ఇలా ఆలోచించారు.

బృహస్పతి ఇలా అన్నాడు. "భార్గవులు వీనికి సంపదలు ఇచ్చారు. ఇపుడు నీవు రాజధానిని విడిచి వెళ్లు" మని సలహా ఇచ్చాడు. దేవతలు అంతా స్వర్గం విడిచి వెళ్లారు. దేవనగరాన్ని బలి స్వాధీనం చేసుకొని చాలాకాలంగా రాజ్యం చేస్తున్నాడు. భృగుడు మొదలైనవారు అతనిచేత నూరు అశ్వమేధాలు చేయించారు. విప్రబలంతో వీనికి ఇంతబలం వచ్చింది. అందుచేత కొంతకాలం ఆగు" అన్నాడు. వెంటనే దేవతలు స్వర్గం విడిచి వెళ్లారు. స్వర్గాన్నంతా బలి ఆక్రమించుకొన్నాడు.

బలి పాలనలో భూమికి 'వసుంధర' పేరు సార్థకమయింది. సురమాత చాలా బాధపడింది. ఇంతలో కశ్యప బ్రహ్మ తన భార్య ఉన్న కుటీరానికి వచ్చి "నీకంతా అనుకూలంగా ఉందా" అని అడిగాడు. అపుడామె భర్తతో ఇలా అంది.

"దితికొడుకులు నా బిడ్డలను గెంటివేసి అమరావతిని ఆక్రమించుకొన్నారు. నీవు ఇద్దరికీ సముడవు. దేవతలను మళ్లీ అమరావతిలో ప్రతిష్ఠించు" అంది. అపుడు కశ్యపప్రజాపతి ఇలా అన్నాడు. ఇదంతా మోహం. విష్ణుమాయ. దీనికి వ్యధచెంద నవసరంలేదు. సరే! దీనికి తగిన ఉపాయం ఇది. శ్రీహరిని సేవించు అన్నాడు. అతడు చెప్పినట్లు అదితి నారాయణుని సేవించింది. నారాయణుడు ప్రత్యక్షమయి ఇలా అన్నాడు. నేను నీకడుపున పుట్టి రాక్షసరాజ్యం హరిస్తాను. నీకు దుఃఖంవద్దు. అన్నాడు.

అదితి కశ్యపుని సేవిస్తోంది. కొంతకాలానికి ఆమె గర్భం ధరించింది. కొన్ని నెలలు గడిచాక బ్రహ్మవచ్చి విష్ణునితో "ప్రభూ! అదితి గర్భంనుండి వెలువడవయ్యా! మా అందరి సంతోషంకోసం త్వరగా వెలువడుస్వామీ!" అని ప్రార్థించాడు.

## వామనమూర్తి ఆవిర్భావం

అపుడు భాద్రపద శుద్ధ ద్వాదశినాడు శ్రవణానక్షత్రంలో మధ్యాహ్నం అభిజిల్లగ్నంలో విష్ణువు పుట్టాడు. అతడందరికీ ఆనందం కలిగించాడు. అదితి కూడ కొడుకునుచూసి ఆనందపరవశ అయింది. పాలిండ్లు చేపుకు వచ్చాయి.

ఆ తరువాత మహర్షులు ఆతనికి ఉపనయనం చేశారు. ఆ సందర్భంలో కుబేరుడు భిక్షాపాత్రనిచ్చాడు. భవాని పూర్ణభిక్ష పెట్టింది.

## బలిదగ్గరకు వామనమూర్తి రావడం

ఉపనయనం చేసికొన్న వటువు సుదూరప్రాంతాలనుండి వచ్చిన విప్రులను "మీకు తెలిసిన 'దానవీరు' డెవరో చెప్పండి అని అడిగాడు. వారు బలిని గూర్చిచెప్పారు. వారి మాటలు విని వటువు (శ్రీహరి) తలిదండ్రుల అనుమతితో బలిచక్రవర్తి దగ్గరకు భిక్షకోసం బయలుదేరాడు. నిజమేమరి. పరోపకార పరాయణులకు యాచనకూడ శరీరాభరణమేగదా! అతడు నర్మదానది దాటి ఉత్తరాన ఉన్న బలియజ్ఞ వాటికను చూశాడు. అపుడందలి సభ్యులు ముచ్చటగొలిపే వటువు చూసి తమలో తాము ఎన్నో విధాల భావించారు. బలి సభామంటపాన్ని వామనుడు చేరాడు. కొంతసేపు ఆ సభలో తిరిగాడు. కొందరితో చర్చించాడు. కొందరితో తర్కించాడు. వెడవెడనడకలు నడుస్తూ రాజును చేరాడు.

'స్వస్తి జగత్త్రయీ భువనశాసనకర్తకు' అంటూ బలిచక్రవర్తిని ఆశీర్వదించాడు. బలి, భృగువంశీయులు సాదరంగా ఆహ్వానించారు. బలి సపత్నీకంగా ఆతని పాదప్రక్షాళనం చేసి ఆ నీటిని నెత్తిన చల్లుకొన్నాడు. వటువుతో "నీవెవరవు? ఏమికావాలి? అంటూ ధార్మికంగా అడిగాడు. విని సంతోషించి ఈశ్వరుడిలా అన్నాడు.

"రాజా! నాకు ఒకచోటు అంటూ ఏదీలేదు. అంతటా ఎక్కడైనా ఉంటాను. ఎవనికీ లోబడినవాడను కాను. నాయంతవాడను నేను. నాకు తోచిన రీతిలో నడుస్తాను. నేర్పులన్నీ నేర్చాను. ఒంటరివాడను. సిరిపూర్వం ఉండేది. తరచు సజ్జనులలో ఉంటాను. మీపూర్వులంతా శూరులు. ప్రహ్లాదాదులు ప్రసిద్ధులే కదా! పూర్వం హిరణ్యకశిపుని ముక్కులోంచి పద్మాక్షుడులోనికి ప్రవేశించాడు. విష్ణువును చూడలేక అంతటా వెదకివేసారి చివరికి "చచ్చిపోయాడు" అనుకొన్నాడు. అటువంటివాడు మీ ప్రపితామహుడు."

"రాజా! నాకు సొమ్ములూ, భవనాలూ అక్కరలేదు. ఒంటరివాడను. ఒకటిరెండు అడుగుల నేల ఇస్తే చాలు. అదే నా పాలిట బ్రహ్మాండం!"

అనగానే బలిచక్రవర్తి ఇలా అన్నాడు. "నీకు యాచించడం కూడా తెలియదు పాపం. అయినా ఇంత తక్కువగా నేను ఎలా ఇస్తాను? అన్నాడు. ఈ మాటకు వటుడు "నాకు గొడుగో, యజ్ఞోపవీతమోకాని భూములెందుకు? స్త్రీలెందుకు? మూడడుగులిస్తే అదే నా పాలిట బ్రహ్మాండం. నాకు ఆశలులేవు. నిత్యసంతోషిని. మూడడుగులిస్తే చాలు" అన్నాడు. అపుడు శుక్రుడు. "ఇతడు వటువుకాదు. విష్ణువు – మూడడుగులతో నిన్నంతా, నీ సంపదంతా ఆక్రమిస్తాడు. ఇవ్వకు – అదీగాక "సర్వనాశనమయ్యేటప్పుడు అసత్యమాడినా తప్పుకాదు" అంతేకాదు స్త్రీలవిషయంలో, వివాహాల్లో, ప్రాణమూ, ధనమూ, మానమూ పోయేటప్పుడూ, గోవులను, విప్రులను రక్షించేటప్పుడు బొంకవచ్చు. దానివల్ల పాపంరాదు. ఇతడెవరోకాదు విష్ణువు. ఈయన మూడడుగుల పేరు చెప్పి బ్రహ్మాండం అంతా ఆక్రమిస్తాడు. కాబట్టి, ముందు ఈయనను ఇక్కడినుండి పంపించు."

అని తనమేలు కోరే గురువు శుక్రాచార్యుని హితోపదేశానికి క్షణమాత్రం కళ్లు మూసుకొని ఆలోచించి బలి ఇలా అన్నాడు. "మహాత్మా! నీవు నిజం చెప్పావు. అయినా ఇస్తానని **చెప్పి పొమ్మనడం** తప్పు. ఎంతోమంది

రాజ్యాలు సంపాదించి పాలించారు. వారు ఏం మూట కట్టుకొని పోయారు? వారి పేరు నిలిచిందా? శిబి మొదలైనవారు యాచకులకోరిక తీర్చినందువల్లనే కదా ప్రజలు ఇప్పటికీ వారిపేరు మరువకుండా స్మరిస్తున్నారు! అదీగాక ఎంతో ఔన్నత్యం కలవాడు మనదగ్గరకు వచ్చి అడుగుతున్నాడుకదా! మూడడుగులు ఇవ్వలేనా? లక్ష్మీదేవి కొప్పుపై ప్రకాశించే చేయి వచ్చినన్ను యాచిస్తోంది. ఏమయినాసరే! ఇస్తాను. ఈ రాజ్యం గీజ్యం శాశ్వతంకాదు. ఏమయినాసరే! నా నాలుక తిరగదు! మేరువు తలక్రిందైనా సరే! ఇస్తాను. ఇలా అంటున్న బలిని చూసి శుక్రాచార్యుడు కోపించి" అయితే నీవు త్వరలోనే 'పదవీభ్రష్టుడ' వవుతావు. అని శాపం ఇచ్చాడు. అయినా బలి అసత్యమాడటానికి ఇష్టపడలేదు. (ఈ సందర్భంలో శుకుడు ఇలా అంటున్నాడు) **ఎన్ని కష్టాలు వచ్చినా మానధనులు మారట తిరుగరు.**

వెంటనే వింధ్యావళి నీళ్లు తెచ్చింది. ముందుగా బలిచక్రవర్తి వామనుని దక్షిణపాదం, తరువాత ఎడమపాదం కడిగి ఆ పవిత్ర జలం తలపై చల్లుకొన్నాడు. ఆచమించి, దేశకాల సహితంగా సంకల్పం చెప్పుకొన్నాడు. "విష్ణుస్వరూపునకు త్రిపాద భూమిని ఇస్తున్నాను" అంటూ ధారపోశాడు. ఆ నీటి ధారపడకుండా శుక్రుడు అడ్డుపడ్డాడు. దాన్ని తెలిసికొని హరి దర్భకొనతో శుక్రుని కంటిని పొడిచాడు. శుక్రుడు ఒంటికంటివాడయ్యాడు. బలి చేసిన దానానికి పదిదిక్కులూ ప్రశంసించాయి.

వామనుడు క్రమంగా బ్రహ్మాండమంతా నిండిపోయాడు. బ్రహ్మాండమంతా తనశరీరానికి ఆచ్ఛాదనగా అయింది. యోగీంద్రులు విష్ణుపాదానికి నమస్కరించి "జన్మధన్యమైనది" అనుకొన్నారు. సభ్యులూ బలిచక్రవర్తీ కూడా స్తోత్రం చేశారు.

తరువాత అతడు వామనుడైపోయాడు. అతనిని చూసి రాక్షసులంతా "ఇతడీ లోకాలన్నీ దేవతలకు ఇద్దామనుకుంటున్నాడు" అనుకొంటూ వామనుని బెదిరిస్తూ యుద్ధానికి సిద్ధమయ్యారు. వెంటనే బలి తనకు శుక్రుడిచ్చిన శాపాన్ని తలచుకొని "మనకు తగినకాలం కాదిది. ఆ కాలం వచ్చినపుడు జయిద్దాం. తప్పుకోండి" అన్నాడు. రాక్షసులు రసాతలానికి వెళ్లిపోయారు. హరి మనసెరిగిన గరుడుడు యాగసుత్యాహస్సున బలిని వరుణపాశాలతో బంధించాడు. అయినా బలిచక్రవర్తిలో దైన్యం కలుగలేదు. ధైర్యం తగ్గలేదు.

అపుడు వటుడు **"నాకు ఈ భూమి ఒక అడుగు, స్వర్గం ఒక అడుగు అయింది. మూడవ అడుగు ఎక్కడ పెట్టను? ఇస్తానన్న దాన్ని ఇవ్వనివాడు నరకానికే పోతాడు"** అన్నాడు. వెంటనే ధైర్యంతో బలి అసత్యం నా నాలుకకురాదు. నీ మూడవ అడుగు "నా నెత్తిపై పెట్టు" అన్నాడు. నేను గురువులు శిక్షిస్తే అవమానపడను. నీవు ఆదిగురువువు. **ఈ శరీరం చంచలం. ఐశ్వర్యం శీఘ్రంగా వెళ్లిపోతుంది. అందుకే మాతాత ప్రహ్లాదుడు నీపాదసేవచేశాడు".** ఇలా అంటూ ఉండగానే ఎదుట ప్రహ్లాదుడు కనిపించాడు. బలి వరుణ పాశబద్ధుడవడంవల్ల అతనికి నమస్కరింపలేకపోయాడు. సిగ్గుతో తలవంచి నమస్కరించాడు. ప్రహ్లాదుడు వామనునికి ఆనందంతో నమస్కరించాడు. ఇలా విన్నవించాడు.

**"తత్త్వం తెలిసినవానికి గర్వంపోతుంది"** అంటూ ఉన్న సమయంలో బలి భార్య వింధ్యావళి వచ్చి "నా భర్త ఆశ్రితులకు ముల్లోకాలూ ఇచ్చాడు. ఇంకా బంధనమెందుకు?" అంటూ ఉండగా బ్రహ్మవచ్చి" ఇతడు దానపరుడేకాని

దండనీయుడుకాడు అన్నాడు. అపుడు భగవంతుడు **"నేను ఎవనిని కరుణించాలని భావిస్తానో వాని ధనమపహరిస్తాను. సంసారమదంతో నన్నూ లోకాన్ని ధిక్కరించేవానిని చాలాకాలం చాలా జన్మలెత్తిస్తాను. ధనాది గర్వం లేనివానిని రక్షిస్తాను. ఈ బలి వైభవంపోయింది. అయినా శుద్ధత వీడలేదు. జ్ఞానియై మాయను జయించాడు. ఇతనిపై నాకు చాలా మెప్పు కలుగుతోంది. ఇతడు సావర్ణిమన్వంతరంలో దేవేంద్రుడవుతాడు. అప్పటిదాకా ఇతనికి ఏ బాధలూ, వ్యాధులూ కలుగవు. సుతలంలో మహావైభవంతో వెలుగొందుతాడు.** అని భగవంతుడింకా ఇలా అన్నాడు. ఇంద్రసేనా! నీవు సుతలంలో ఉండు. అక్కడ కష్టాలూ, దుఃఖాలూ ఉండవు. నీ ఆజ్ఞమీరినవారిని నా చక్రం వచ్చి నరుకుతూ ఉంటుంది. నిన్ను ప్రతిదినమూ రక్షిస్తాను. నన్ను ధ్యానిస్తూ ఉండు. దానితో రాక్షసభావం క్రమంగా తొలగిపోతుంది". అనగానే నీవు నాకు బ్రతికే మార్గమూ ఆజ్ఞాపించి రక్షించావు. నిన్ను తెలిసి పట్టుకొంటే ఆపదలు ఎందుకు కలుగుతాయి?

అని త్రిమూర్తులకు నమస్కరించి బలి సుతలానికి వెళ్లిపోయాడు. అపుడు మనుమని చూసి సంతోషించి ప్రహ్లాదుడు భగవంతునితో ఇలా అన్నాడు.

"అల్పబుద్ధులమయిన మేము నీదయకు పాత్రులమవడం చాలా ఆశ్చర్యం – అంతేకాదు. నీవు భక్తులకు కల్పవృక్షంవలె కోరికలు తీరుస్తావు". ఇలా అంటున్న ప్రహ్లాదుని చూసి పరమపురుషుడు ఇలా అన్నాడు. ప్రహ్లాదా! నీవు నీ మనుమనితో సుతలానికి వెళ్లు. నేను నిన్ను రక్షిస్తాను. అనగానే ప్రహ్లాదుడు బలిని తీసికొని సుతలానికి వెళ్లాడు. తరువాత శుక్రుని జూచి నారాయణుడిలా అన్నాడు". విప్రవర్యా! ఇప్పుడేమి లోటువచ్చింది? ఈ యజ్ఞం సంపూర్ణం చెయ్యి. విప్రదర్శనంతో కర్మలు చక్కబడతాయిగదా" అనగానే శుక్రుడిలా అన్నాడు.

యజ్ఞపురుషా! నీవు కర్మలకు నాథుడవూ, యజ్ఞేశుడవూకూడా! నీవు ప్రత్యక్షంగా తృప్తిపొందావు. ఇంకా లోటేమిటి? ఏ కొరత అయినా నిన్ను స్మరిస్తే తొలగుతుంది కదా! అంటూ యజ్ఞం పూర్తిచేశాడు. ఇలా బలినుండి వామనుడు భూమిని గ్రహించి స్వర్గాన్ని ఇంద్రునికిచ్చాడు. దక్షాదులు వామనుని లోకపాలకులకు రాజుగా నియమించారు. **వేదాలకు, మోక్షానికి ఉపేంద్రుడు ప్రధానుడయ్యాడు.** తరువాత వామనుని బ్రహ్మాదులు ప్రధానుడయ్యాడు. తరువాత వామనుని బ్రహ్మాదులు అమరావతికి తీసుకొనిపోయారు. నిజమే! ఇలా దేవరాజు వామనునివల్ల త్రిలోకసామ్రాజ్యం పొందాడు.

## మత్స్యావతార కథ

మునులు సూతునితో ఇలా అన్నారు. "విమలాత్మా! శ్రీహరి చేప అయిన వృత్తాంతం చెప్పండి. అని అడిగారు. అపుడు సూతుడిలా చెపుతున్నాడు. ఈ విషయమే పరీక్షిత్తుకు శుకుడు చెప్పాడు. ధర్మరక్షణకోసం వేదాలు, విప్రులు, గోవులు, దేవతలు, ధర్మార్థాలను రక్షించడానికి శరీరం ధరిస్తూ ఉంటాడు. అన్నిటా ప్రవేశించినా గుణరహితుడై ఉండేవాడు చేపకావడంతో ఆశ్చర్యమేమీలేదు.

పూర్వం ద్రవిడాధీశుడు సత్యవ్రతుడు సూర్యోపాసనలో జలతర్పణం చేస్తున్నపుడు అతని దోసిలిలోనికి చేపపిల్ల వచ్చింది. అతడు వెంటనే వదలివేశాడు. నీటిలోపడిన అది రాజుతో "జ్ఞాతివధ చేసే చేపలనుండి తప్పించుకొనటానికి

నీ దోసిలిలోనికి వచ్చాను. నన్ను నట్టేట త్రోయకయ్యా!. జాలరులనుండి తప్పించుకోలేను. పెద్ద చేపలనుండి కూడ తప్పుకోలేను. నేను అట్లాచావకుండా నన్ను రక్షించు" అంది. వెంటనే అతడు దాన్ని తన కమండలంలో ఉంచుకొని ఇంటికి తీసుకొనిపోయాడు. అది ఒక్కరాత్రిలో కమండలం నిండిపోయింది. వెంటనే అతడు దాన్ని కలశంలోపెట్టాడు. అదికూడా నిండిపోయింది. వెంటనే ఒక చిన్న మడుగులోనికి, తరువాత పెద్దచెరువులోనికి మార్చాడు. అట్లా దాన్ని ఆ పుణ్యాత్ముడు పెద్దసముద్రంలో విడిచాడు. అపుడాచేప "ఇక్కడ నన్ను పెద్దమొసళ్లు మ్రింగివేస్తాయి. నన్ను పైకి తియ్యి" అంది. అపుడాచేపతో రాజు "ఇలా నీవు పెరిగిపోతున్నావు. మహానుభావా! నాకిపుడు తెలిసింది నీవు నారాయణుడవు. "నీకు నమస్సులు. అసలు నీవు ఈ రూపం ఎందుకు ధరించావు". అని అడిగాడు. అపుడా శ్రీహరి ఇలా అన్నాడు.

"రాజా! నేటికి ఏడవరోజున ముల్లోకాలూ ప్రళయ సముద్రంలో మునిగిపోతాయి. అపుడొకనావ నీ దగ్గరకు వస్తుంది. దానిని పాము ఛిద్రం చేయకుండా ఆ చీకటిలో మత్స్యరూపం దాల్చి తెల్లవారేవరకూ తిరుగుతాను. ఇందుకే నేను మత్స్యరూపం దాల్చాను. నా రూపం పరబ్రహ్మ స్వరూపం అంటూ, సత్యవ్రతుడు చూస్తూ ఉండగానే శ్రీహరి మాయమయ్యాడు. హరిమాటనుబట్టి ఆ రాజర్షి దర్భశయ్యమీద వేచి ఉన్నాడు. కల్పాంత సమయంలో మహావర్షం కురిసింది. సముద్రం దేశాలను ముంచివేసింది. ప్రాణులన్నీ సముద్రంలో కలిసిపోయాయి.

బ్రహ్మ సృష్టించడం విడిచి నిద్రిస్తున్నాడు. అపుడు వేదాలను రాక్షసుడు (హయగ్రీవుడు) దొంగిలించి సముద్రంలో మునిగాడు. అపుడు శ్రీహరి మత్స్యంగా అవతరించాడు. ఆ మత్స్యానికి ఒక కొమ్ము కూడా ఉంది.

పూర్వమే సముద్రం భూమిని ముంచి వేస్తున్నప్పుడు సత్యవ్రతుడు హరిని స్మరిస్తూ ఉండగా నారాయణుడు పంపగా ఒకనావ వచ్చింది. ధైర్యంతో సత్యవ్రతుడు విత్తనాలన్నీ నావపై పెట్టాడు. ఆ నావపై సప్తర్షులు ఎక్కారు. అంతలో ఎదుట నీటిలో మత్స్యాన్ని చూశారు. ఆ మత్స్యాన్ని ఇలా స్తుతించారు.

"ఈశ్వరా! కొందరు ఎన్నో జన్మలెత్తాక దైవయోగంతో పరమేశ్వరుని సేవించి కైవల్యం పొందుతారు. నీవు సూర్యుణ్ణే కన్నులుగా ప్రాణులను చూస్తూ ఉంటావు. మాకు జ్ఞానం కలిగించి సన్మార్గం చూపించు. నీ అనుగ్రహంలో సహస్రాంశం లభించినా చాలు ఇంద్రపదవి లభిస్తుంది. నీవు మాకు గురువువు. మా అజ్ఞానం పోగొట్టి నీలో చేర్చుకో! అని సత్యవ్రతుడు చెప్పాడు. అపుడు శ్రీహరి పురాణసంహిత ఉపదేశించాడు. ఆ పరబ్రహ్మస్వరూపం విని ఆ సత్యవ్రతుడు ఏడవ మనువు అయ్యాడు.

ఈ విధంగా రాత్రి గడిచేవరకూ నారాయణుడు మత్స్యరూపంలో సంచరించి తెల్లవారిన తరువాత హయగ్రీవుని వధించాడు. ఆ తరువాత బ్రహ్మ సృష్టి నిర్మాణానికి ప్రారంభించాడు.

హరి జలచరావతార విశేషాలు విన్నవాడు సిద్ధిపొందుతాడు. ఆ చిన్మూర్తికి నమస్కారం.

**– డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

# నవమస్కంధం - కథాసారం

శ్రీమద్భాగవతాన్ని పరీక్షిన్నరేంద్రునికి శుకయోగీంద్రులవారు చెబుతున్నారు. సూర్యునికి పుట్టిన వైవస్వతమనువు గురించి సూర్యవంశం గురించి వివరించవలసిందని పరీక్షిత్తు అడగగా సూర్యవంశం, చంద్రవంశం, చంద్రవంశంలోనే అంతర్భాగమైన యదువంశం గురించి శుకమహర్షి చెప్పాడు. నవమస్కంధంలోని 737 గద్యపద్యాల్లో ఉన్న కథ ఇదే!

సూర్య సంజ్ఞల కొడుకు వైవస్వతమనువు మూలంకాగా సూర్యవంశం వృద్ధిపొందింది. చంద్రుని కొడుకైన బుధునికి ఇలకు జన్మించిన పురూరవుడు మూలంకాగా చంద్రవంశం వృద్ధిపొందింది. చంద్రవంశంలోని యయాతి కొడుకైన యదువు మూలంకాగా యదువంశం వృద్ధిపొందింది.

### సూర్యవంశం వైవస్వతమనువు

ఆది పురుషుడైన శ్రీహరి నాభికమలంలో బ్రహ్మ జన్మించాడు. బ్రహ్మమానసపుత్రుడు మరీచి. అతనికి కశ్యపుడు కలిగాడు. అదితి కశ్యపులకు సూర్యుడు జన్మించాడు. సూర్యునకూ సంజ్ఞకు శ్రాద్ధదేవుడు పుట్టాడు. ఇతడే వైవస్వతమనువు. ఈ మనువు శ్రద్ధలకు ఇల జన్మించింది. ఈ ఇలయే సుద్యుమ్నునిగా మారుతుంది. సుద్యుమ్నుడు శివుడు నిషేధించిన స్థలానికి వెళ్లి, మళ్లీ స్త్రీ అవుతాడు. స్త్రీ అయిన కాలంలో సుద్యుమ్నుడనే ఆ ఇలకు, బుధునికి పురూరవుడు జన్మిస్తాడు. సుద్యుమ్నుడు అడవులకు వెళ్లి పోతాడు.

వైవస్వతమనువు తపస్సుచేసి విష్ణువిచ్చిన వరం సాధించి ఇక్ష్వాకుడు మొదలైన పదిమంది పుత్రులను పొందాడు. ఈ పదిమందిలో పృషధ్రుడనేవాడు గురువు ఆజ్ఞ ననుసరించి ఆవులను కాచేవాడు. ఆవుల రక్షణలో రాత్రివేళ మందపై పులిపడినట్లుగా భావించి తలనరుకగా ఆవుతల తెగిపడింది. ఆ విధంగా రాజ్యపాలనకు అతడు అర్హత కోల్పోయాడు. తపస్సుచేసుకొంటూ పరబ్రహ్మంలో కలిసిపోయాడు. కవి అనే కొడుకు శ్రీహరిని ధ్యానించి మోక్షాన్ని పొందాడు. కరూశుడు, నృహుడు, నరిష్యంతుడు అనేవారు ఆయా వంశాలకు చెందినవారై ప్రసిద్ధులయ్యారు. వీరే క్షత్రియబ్రాహ్మణ వంశాల వ్యాప్తికి మూలాధారంగా నిలిచారు. కొడుకు నాభాగుడు కర్మవశాన వైశ్యుడైనాడు. అతని కొడుకు హలంధనుడు. ఆ వంశంలో కొన్ని తరాలకు మరుత్తుడు పుట్టాడు. ఆ మరుత్తుడు చక్రవర్తి అయ్యాడు.

చక్రవర్తి మరుత్తుడు గొప్పయాగంచేసి దేవేంద్రాదుల గౌరవాన్ని పొందాడు. ఈ మరుత్తుని వంశంలోనే కొన్నితరాలకు తృణబిందుడు జన్మించాడు. ఈ తృణబిందువుకు అప్సరస అయిన అలంబుసకు ఇలబిల జన్మించింది. ఈ ఇలబిలను విశ్రవసుడుపెళ్లి చేసుకొన్నాడు. వీరికొడుకే కుబేరుడు. (వైశ్రవసుడు).

తృణబిందుని ముగ్గురు కొడుకుల్లో ఒకడు విశాలుడు. ఇతడే వైశాలీనగరాన్ని నిర్మించాడు. మనువు మరో కొడుకు శర్యాతి. శర్యాతికూతురు సుకన్య చ్యవనమహర్షిని పెళ్లి చేసుకొన్నది. ఆ చ్యవనుడు తనకు యౌవనమిచ్చిన అశ్వినీ దేవతలకు సోమభాగాన్ని (యజ్ఞభాగాన్ని) పొందే అర్హత కలిగించాడు.

శర్యాతిరాజు ముగ్గురు కొడుకుల్లో ఆనర్తునికి రైవతుడు జన్మించాడు. ఆ రైవతుడు కుశస్థలి నగరాన్ని నిర్మించి ఆనర్తాది దేశాలను పరిపాలించాడు. రైవతుడు తన కూతురైన రేవతిని బ్రహ్మ సూచన మేరకు కొన్ని యుగాలు గడచిన తర్వాత ద్వాపరంలో బలరామునికిచ్చి పెళ్లిచేశాడు.

ఈ మనువంశంలోని నభగునికి నాభాగుడు జన్మించాడు. నాభాగుడు తనకు చెందాల్సిన ఆస్తిలో వంచింపబడ్డా, తండ్రిప్రేరణతో అంగిరసులు చేసే సత్రయాగంలో పాల్గొని, వారికి వైశ్వదేవసూక్తాలు చెప్పి, యాగానంతరం వారిచ్చిన ధనాన్ని స్వీకరించాడు. ఆ ధనం యాగమంత్రాలలో చెప్పిన ప్రకారంగా రుద్రునికే చెందాలని సమర్పించగా రుద్రుడు ప్రత్యక్షమై నాభాగునికి ఆత్మదర్శనాన్ని బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించాడు. అటువంటి నాభాగుని కొడుకే అంబరీషుడు.

## అంబరీషుని కథ

అంబరీషుడు మహాభాగవతుడు. ఆయనపై బ్రాహ్మణశాపంకూడా పనిచేయలేదు. సప్తద్వీప భూమండలాన్ని పరిపాలిస్తున్నా అపరిమిత ఐశ్వర్యం ఉన్నా, అవన్నీ స్వప్నతుల్యాలని భావించి, తనమనోబుద్ధుల్ని శ్రీమన్నారాయణుని పాదపద్మాలయందే ఉంచిన మహాభక్తుడు అంబరీషుడు. “చిత్తంబు మధురిపు శ్రీపాదములయంద పలుకులు హరిగుణపఠనమంద” (82) ఆయన సంసారవ్యామోహాన్ని తొలగించుకొని పరిశుద్ధాంతరంగుడై, ఏకాంత భక్తి పరవశుడై ఉంటాడు. అందుకే సంతుష్టుడైన శ్రీహరి ఆయన రక్షణకై సుదర్శనచక్రాన్ని నియమించాడు.

అంబరీషుని ధర్మపత్ని పుణ్యశీల. భార్యతో కలిసి అంబరీషుడు ద్వాదశీవ్రతాన్ని చేశాడు.కార్తీకశుద్ధ ఏకాదశినాడు ఉపవాసమున్నాడు. ద్వాదశినాడు స్నానానంతరం నారాయణుని అర్చించాడు. భగవద్భక్తులను సేవించి దానధర్మాలు చేసి, అందరికీ మృష్టాన్నభోజనాలు పెట్టించాడు. ఉపవాసానంతరం ద్వాదశపారణ చేయాలి. తాను ఉపవాసం వదలాలి. అప్పుడు దూర్వాసముని వచ్చాడు. ఆయనకు సకలమర్యాదలు చేసి భోజనానికి ఆహ్వానించాడు. నదిలో స్నానం చేసి వస్తానని దూర్వాసుడు వెళ్లాడు. వెళ్లిన దూర్వాసముని ఎంతకురాలేదు. ద్వాదశి గడియలు దాటక ముందే భోజనం చేయాలి. లేకుంటే వ్రతభంగమవుతుంది.

ధర్మసంకటస్థితి, పండితుల నడిగాడు. అతిథి వెళ్లాడు; ఇంతసేపయింది; ఇంకా రాలేదు. ద్వాదశి పారణం సకాలంలో చేయాలి, అదిముఖ్యం; మంచినీటిని స్వీకరిస్తే చాలు; వ్రతం పాటించి నట్లవుతుంది; అతిథిమర్యాద దక్కుతుంది; ఇది ధర్మసమ్మతమే అన్నారు వారు. అంబరీషుడు నీటిని స్వీకరించి వ్రతాన్ని పాటించాడు.

స్నానం ముగించి వచ్చిన దూర్వాసుడు ఆగ్రహోదగ్రుడయ్యాడు. వీడు విష్ణుభక్తుడుకాడు; ధర్మభ్రష్టుడు; అంటూ రుద్రుడై సిగలోని ఒక జడను పెరికి, దానిని కృత్యగా రూపొందించి అంబరీషునిపైకి ప్రయోగించాడు. కృత్య శూలపాణియై భయంకరంగా అరుస్తూ రాజుపైకి ఉరికింది. రాజు రక్షణకై సిద్ధంగా ఉన్న సుదర్శనచక్రం శ్రీహరి ఆదేశాన్ని అనుసరించి వెనువెంటనే కృత్యను సంహరించింది; దూర్వాసునిపైకి వచ్చింది. దూర్వాసుడు భయకంపితుడై పరుగులు దీస్తూ బ్రహ్మనూ, రుద్రుణ్ణీ విష్ణువునూ వేడుకొన్నాడు.

నేను భక్తపరాధీనుణ్ణి. అస్వతంత్రుణ్ణి; భక్తులయోగక్షేమాలు చూడాల్సినవాణ్ణి. నాది సాధుల హృదయమే. నీవు ఆ దయామయుడైన అంబరీషుణ్ణే శరణువేడుకో అన్నాడు విష్ణుమూర్తి.

ఆ విధంగా దూర్వాసుడు అంబరీషుణ్ణే ఆశ్రయించాడు. అంబరీషుడు ఈ మునిసత్తమునికి శుభం కలుగుగాక అన్నాడు. అతిథియైన దూర్వాసుణ్ణి ఆదరించి మృష్టాన్నభోజనాలతో సంతృప్తుణ్ణి చేశాడు. దూర్వాసుడు రాజు నాశీర్వదించి నిష్క్రమించాడు. అంబరీషుడు ప్రజారంజకంగా రాజ్యాన్ని పాలించాడు. పరమభక్తుడైన అంబరీషుడు రాజ్యభారాన్ని పుత్రులకు అప్పగించి సర్వసంగపరిత్యాగియై, శ్రీహరికటాక్షాన్ని పొంది తపస్సుకోసం అడవికి వెళ్లాడు. ఇలా అంబరీషుని చరిత్ర విన్నా చదివినా బుద్ధిమంతులవుతారు; పుణ్యాత్ములవుతారు.

## ఇక్ష్వాకువంశానుక్రమం మాంధాత తదితరుల కథలు

వైవస్వత మనువు పెద్దకొడుకు ఇక్ష్వాకుడు. సూర్యవంశంలో అపూర్వకీర్తిప్రతిష్ఠ లార్జించి నందువల్ల ఈ వంశానికి ఈయన పేరుకూడా వచ్చింది. **(ఇక్ష్వాకు కులతిలక అని శ్రీరామచంద్రుణ్ణి మనం పిలుచుకోవడానికి కారకు డీయనే)** ఇక్ష్వాకుని పెద్దకొడుకు వికుక్షి. తండ్రికోపానికి గురైనా, తండ్రి తర్వాత రాజ్యపరిపాలకుడయ్యాడు. ఇతని కొడుకు పురంజయుడు రాక్షసుల నోడించడంలో దేవతలకు సహకరించాడు. ఇంద్రుడు ఆబోతుగా మారగా ఆ మూపురంపైకూచొని యుద్ధంచేసినకారణంగా ఇతనికి ఇంద్రవాహనుడనీ, కకుత్‌స్థుడనీ (ఆబోతు నెక్కినవాడనీ) పేర్లు వచ్చాయి. ఈయన తరువాతి వారిని కకుత్‌స్థవంశీయులనీ కాకుత్‌స్థులనీ లోకం పిలిచింది. ఈ వరుసలోనే యవనాశ్వడనే రాజు ప్రసిద్ధిగాంచాడు. యువనాశ్వుడు సంతానం నిమిత్తం ఇంద్రుణ్ణి స్వాగతించి పుత్రకామేష్టి చేశాడు. ఇష్టి అనంతరం సంసిద్ధంచేసిన మంత్రజలం మరునాడుదయమే ఆయన భార్య త్రాగాలి. కాని విధివిలాసం అర్ధరాత్రి దాహంతో యువనాశ్వుడు కలశంలోని జలాన్ని త్రాగాడు. ఇష్టి నిర్వాహకులైన మునులు విధి నిర్ణయమిదే నేమో అనుకొన్నారు. అదే జరిగింది; రాజు గర్భం ధరించాడు. కొంతసేపటికే గర్భం చీల్చుకొని కొడుకు పుట్టాడు. యువనాశ్వుడు దేవతల దయవల్ల మరణించలేదు. తపస్సుచేసి సిద్ధిపొందాడు. బిడ్డడినోట వ్రేలుపెట్టి ఇంద్రుడు పాలుతాగేట్టు చేశాడు. ఆయనే మాంధాత! అయ్యాడు. మాంధాత గొప్పచక్రవర్తి అయ్యాడు. రావణాసురునివంటి పరాక్రమశాలుల నెందరినో ఓడించాడు. ఇంద్రాదులు త్రసదశ్యు డని పిలిచి గౌరవించుకొన్నారు. మాంధాతకు బిందుమతి అనే భార్యవల్ల పురుకుత్సాది ముగ్గురుపుత్రులూ, ఏభైమంది పుత్రికలు పుట్టారు.

సౌభరి అనే మహాతపస్వి ఉన్నాడు. ఒకనాడు నీటిమధ్య తపస్సులో ఉండగా చేపలజంటను చూశాడు. తానూ వివాహం చేసుకోవాలనుకొన్నాడు. అతడు మాంధాత నడిగాడు. తన పుత్రికలు ఒప్పుకొంటే ఇస్తానన్నాడు. సౌభరి తనయోగశక్తి చేత దివ్యమోహనరూపాన్ని పొంది ఏభైమందినీ పెళ్లిచేసుకొన్నాడు. ఆ ఏభైమందితో సంసారసుఖాల్లో తేలియాడాడు. ఎంతోమంది పుత్రుల్నీ కన్నాడు. తపస్సుచేసుకొనే నేను ఇలా ఎందుకు మారిపోయానని చింతించి, వానప్రస్థాన్ని స్వీకరించి ఘోరతపస్సుచేసి పరబ్రహ్మంలో కలిసి పోయాడు. ఆయనభార్యలు భర్త ననుసరించారు.

మాంధాత కొడుకు పురుకుత్సుడు. అతడు తన్నెదిరించిన గంధర్వుల నోడించాడు. ప్రజలకు నాగుల భయంలేకుండా పరిపాలించాడు. అతనివంశంలో కొన్నితరాలకు సత్యవ్రతుడు జన్మించాడు. ఆ సత్యవ్రతుడే త్రిశంకుడని ప్రసిద్ధిగాంచాడు.

## త్రిశంకు-హరిశ్చంద్రుల కథలు

త్రిశంకు స్వర్గం, సత్యహరిశ్చంద్రులు అనే మాటలు అందరికీ తెలుసు. సూర్యవంశం (ఇక్ష్వాకుల్లో) లో ఎప్పుడూ గుర్తుంచుకొనే సంఘటనలు ఈ ఇరువురురాజుల జీవితాల్లో జరిగాయి.

త్రిశంకుడు బొందితో స్వర్గానికి వెళ్లాలనుకొన్నాడు. అటువంటి యజ్ఞానికి వశిష్ఠుడు అతని పుత్రులు అంగీకరించలేదు. అయినా రాజుతన పట్టుదల వదల్లేదు. ఆగ్రహించిన వశిష్ఠుడు రాజును చండాలుడివి కమ్మని శాపమిచ్చాడు. అయినా సత్యవ్రతుడు (త్రిశంకుడు) తన పట్టు వదలకుండా విశ్వామిత్రుణ్ణి ఆశ్రయించాడు. విశ్వామిత్రుడు తన తపఃప్రభావంతో రాజును స్వర్గానికి పంపించాడు. అయితే దేవతలు అందుకంగీకరించక తోసి వేశారు. అలా తలకిందులుగా వస్తున్న రాజును తన ప్రభావంతో విశ్వామిత్రుడు ఆకాశంలోనే నిలిపి అక్కడ స్వర్గాన్ని సృష్టించాడు.

ఆ త్రిశంకుని కొడుకే హరిశ్చంద్రుడు. త్రిశంకునికి ఒకసమున్నత స్థానం కల్పించిన విశ్వామిత్రుడు పరీక్షార్థమన్నట్లుగా హరిశ్చంద్రుణ్ణి అనేకవిధాలుగా బాధించాడు. తన సర్వస్వాన్ని కోల్పోయినా హరిశ్చంద్రుడు అబద్ధమాడలేదు.

హరిశ్చంద్రుడు వరుణదేవుణ్ణి ప్రార్థించాడు. తనకు పుత్రుడు కలిగితే అతణ్ణి బలిపశువును చేసి, హోమం ద్వారా సమర్పిస్తానన్నాడు. రోహితుడనే కొడుకు కలిగాడు. పుత్రప్రేమతో యజ్ఞపశువుగా కొడుకుని సమర్పించలేకపోయాడు. ఈ విషయం తెలిసి రోహితు దరణ్యాలకు వెళ్లిపోయాడు. వరుణుడు ఆగ్రహించిన కారణంగా హరిశ్చంద్రుడు మహోదరవ్యాధిపీడితుడయ్యాడు. రోహితుడు అరణ్యాలనుండి తండ్రిదగ్గరికి రావాలనుకొన్నాడు. కాని ఇంద్రు డితణ్ణి ఆరేళ్లు నిరోధించాడు. చివరికి అజీగర్తుడనే ముని నడిమి కొడుకు ఐన శునశ్శేపునితో రోహితుడు తండ్రి దగ్గరికి వచ్చాడు. శునశ్శేపుడు తనకు మారుగా యాగపశువుగా ఉంటాడని రోహితుడు తండ్రికి సమర్పించాడు. విశ్వామిత్ర, భృగు, జమదగ్ని, వశిష్ఠమునులు యాగం నిర్వహించారు. ఈ యాగానికి వచ్చి ఇంద్రుడు హరిశ్చంద్రునికి బంగారురథం సమర్పించాడు.

హరిశ్చంద్రుని సత్యనిష్ఠకు మెచ్చిన విశ్వామిత్రుడు తత్త్వజ్ఞానాన్ని బోధించాడు. ఆ జ్ఞానం వల్ల హరిశ్చంద్రుడు సకలబంధాలనుండి విముక్తుడయ్యాడు. వాక్కునకు మనస్సునకు అందని ఆత్మస్వరూపంతో కలిసి ప్రకాశించాడు.

## సగరుడు నుండి భగీరథుడు వరకు...

సూర్యవంశంలో హరిశ్చంద్రుని తర్వాత అతని కొడుకు రోహితుడు రాజ్యాన్ని పాలించాడు. అతని తర్వాత ఆరుతరాలకు బాహుకుడు రాజ్యపరిపాలనకు వచ్చాడు. బాహుకుడు శత్రువులతో ఓడిపోయి భార్యతోపాటు

అడవిలో తలదాచుకొన్నాడు. అక్కడే ఆయన మరణించాడు. అతని భార్య సహగమనానికి సిద్ధమయింది. ఆ అరణ్యంలో వారి యోగక్షేమాలు చూచిన ఔర్వముని ఆమెను వారించాడు. ఆమె గర్భవతి అయిన కారణంగా సహగమనం వద్దన్నాడు. ఆమెమీద విషప్రయోగం జరిగింది. ఆ విషంతో పాటే ఆమె సగరుణ్ణి కన్నది. షట్చక్రవర్తులలో కీర్తిగాంచిన సగరుడితడే. తండ్రి కోల్పోయిన రాజ్యాన్ని సాధించాడు.

సగరునికి కేశిని, సుమతి ఇద్దరుభార్యలు – కేశిని పుత్రుడు అసమంజసుడు. సుమతికి అరవైవేలమంది పుత్రులు కలిగారు. ఔర్వమహర్షి ఆజ్ఞానుసారం సగరుడు అనేక అశ్వమేధయాగాలు చేశాడు. ఒక యజ్ఞంలో విడిచిన అశ్వాన్ని ఇంద్రు డపహరించి,నాగలోకంలో తపస్సు చేసుకొంటున్న కపిలమహర్షి ఆశ్రమంలో కట్టేశాడు. యజ్ఞం ఆగిపోయింది. అశ్వాన్వేషణకు సగరపుత్రులు అరవైవేలమంది బయలదేరారు. భూమిని తవ్వుతూ పాతాళం వరకు వెళ్లారు. అక్కడ అశ్వాన్ని చూశారు. ఈ కపటసన్యాసే గుఱ్ఱపు దొంగ అని కేకలు వేస్తూ కపిలునిపై దాడిచేయబోయారు. కపిలమహర్షి కళ్లుతెరవగానే అతని క్రోధాగ్నికి అరవైవేలమంది బూడిదై పోయారు. స్వ పరభేదంలేని సాంఖ్యమతస్థాపకులైన కపిలమహర్షి క్రోధాగ్నికి వారు భస్మం కాలేదనీ, సగరపుత్రులు చేసిన పొరపాట్ల కారణంగానే వారి శరీరంలో పుట్టిన అగ్నే వారిని దహించిందంటారు.

సగరుడు పుత్రులు రాలేదని చింతిస్తున్నాడు. కేశిని కొడుకైన అసమంజసుడు అయోధ్యానగరంలో ఆడుతూపాడుతూ ఉన్నపిల్లలను పట్టుకొని సరయూనదిలో పడవేస్తున్నాడు. తండ్రీ తదితరులు అతణ్ణి మందలించారు. అతడు పూర్వజన్మయోగబలంతో ఆ పిల్లలను బతికించితెచ్చాడు.

ఆ అసమంజసునికొడుకు అంశుమంతుడు, బుద్ధిమంతుడు. తాత సగరుడు మెచ్చినవాడు. తాత ఆజ్ఞమేరకు బయలుదేరి యాగాశ్వాన్ని చూచాడు. బూడిదరాసులనూ చూశాడు. అక్కడే ఉన్న కపిలమహర్షిని స్తుతించాడు. కపిలుడు అంశుమంతుణ్ణి అశీర్వదించి, గుఱ్ఱాన్ని తీసుకుపొమ్మన్నాడు. బూడిదరాసులమీద గంగాజలం ప్రవహిస్తే సగరపుత్రులు సజీవులవుతారని చెప్పాడు.

అంశుమంతుడు కపిలమహర్షికి నమస్కరించి, అశ్వాన్ని తీసుకొనివచ్చి, తాతయైన సగరునికిచ్చి యజ్ఞం పరిపూర్తికి దోహదం చేశాడు. సగరుడు అంశుమంతునికి రాజ్య మప్పగించి, ఔర్వముని ఉపదేశాన్ని పాటించి ఉత్తమగతిని పొందాడు.

సగరపుత్రుల బూడిదపైకి గంగను తెప్పించేందుకు అంశుమంతుడు తపస్సుచేశాడు. సాధ్యంకాలేదు; అతని పుత్రుడు దిలీపుడు ప్రయత్నించాడు. అతనికీ సాధ్యం కాలేదు.

తాత, తండ్రుల, విషయాలు తెలుసుకొన్న భగీరథుడు ఘోరతపస్సు చేశాడు. గంగ ప్రత్యక్షమైంది. దివినుండి భువికి తాను ప్రవహించినప్పుడు, ఆ వేగాన్ని తట్టుకొనేవారు కావాలి అన్నది. భగీరథుడు శివుణ్ణి గూర్చి తపస్సుచేసి, మెప్పించాడు.

**ఆ.వె. భక్తవత్సలుండు ఫాలాక్షు డాభగీ–రథునిమెచ్చి నిజశిరంబునందు**
**శౌరిపాదపూత సలిలయై దివినుండి – ధరకు వచ్చు గంగ దాల్చెనపుడు – 229**

ఆ మహానది అలా శివజటాజూటం నుండి హిమాద్రిమీదుగా భారతభూముల్లో ప్రవహించింది. సగరపుత్రుల బూడిద రాసులను ముంచి ముందుకు సాగింది. అలా భగీరథుని కారణంగా గంగ భాగీరథి అయింది.

భగీరథుని తర్వాత అతని వంశంలో కొన్నాళ్లకు ఋతుపర్ణుడు రాజయ్యాడు. ఇతడు నలచక్రవర్తితో స్నేహం చేసి అతనివల్ల అశ్వవిద్యను నేర్చుకొన్నాడు; నలునికి అక్షవిద్యను నేర్పాడు.

ఋతుపర్ణుని అనంతరం సర్వకాముడు పరిపాలించాడు. ఆ తర్వాత అతనికొడుకు మదయంతి వల్లభుడు సుదాసుడు రాజ్యపరిపాలకుడయ్యాడు.

ఈ సుదాసుడు వేటకై అడవికి వెళ్లాడు. అక్కడ ఒక రాక్షసుణ్ణి సంహరించాడు. అతని తమ్ముడు పగబట్టి వంటవాడిగ సుదాసుని అంతఃపురంలో చేరి, ఒకనాడు అతిథిగా వచ్చిన వశిష్ఠునికి నరమాంసం వండి పెట్టాడు. వశిష్ఠ డాగ్రహించి రాజును శపించాడు. ఆ సుదాసుడు రాక్షసుడయ్యాడు. తన తప్పులేదని వశిష్ఠుణ్ణి శపించడానికి మంత్రజలం చేతపట్టగా ఆయనభార్య మదయంతి వారించింది. ఆ జలాన్ని తనకాళ్లపై చల్లుకొని కల్మాషపాదుడయ్యాడు. రాక్షసుడై వశిష్ఠుని శాపావధి పండ్రెండేళ్లు పూర్తి చేయడానికి అడవుల్లో తిరుగుతున్నాడు.

ఒకరోజు అడవిలో బ్రాహ్మణదంపతులను చూశాడు. రాక్షసభావంతో బ్రాహ్మణుణ్ణి పట్టుకొని తినేందుకు తీసుకొని పోతుండగా, ఆ బ్రాహ్మణుని భార్య మానవజన్మ ఔన్నత్యాన్ని, దానధర్మపరోపకారాల గురించి, సూర్యవంశప్రాశస్త్యాన్ని గురించి విశదీకరించింది. అన్నా! నీకు నేను చెల్లెలిని, దీనురాలను. నా శిరస్సు ఖండించి, నాభర్తను భక్షించు అని వేడుకొన్నది.

కాని రాక్షసరూపి అయిన కల్మాషపాదుడు వినలేదు; ఆ బ్రాహ్మణున్ని భక్షించాడు. అప్పుడాబ్రాహ్మణి" నీవు స్త్రీ సాంగత్యానికి సిద్ధపడినప్పుడు చస్తావు" అని శపించి తనభర్త ఎముకలను పేర్చి, చితిలో కాలిపోయింది.

పండ్రెండేళ్ల తర్వాత కల్మాషపాదుడు సుదాసుడై రాజ్యపరిపాలనచేశాడు. శాపం ఉన్నా గురువైన వశిష్ఠుడు సంతానం కలిగేటట్లు చేసాడు.

మదయంతీ సుదాసుల పుత్రుడు అశ్వకుడు. అతనిపుత్రుడు మూలకుడు. పరశురాముడు రాజులను సంహరించే సమయంలో ఇతణ్ణి స్త్రీలు కవచంలా చుట్టుకొని కాపాడిన కారణంగా నారీకవచుడయ్యాడు. ఇతనికి విశ్వసహుడు, విశ్వసహునికి ఖట్వాంగుడు జన్మించారు. ఆ ఖట్వాంగుడు గొప్పపరిపాలకుడై కీర్తిప్రతిష్ఠ లార్జించాడు. ఎన్నోవరాలు దేవతలవల్ల పొందే అవకాశమున్నా భౌతిక సుఖాలనూ, ధనకనకవస్తువాహనా లన్నిటినీ వదలి నిస్సంగుడై పరబ్రహ్మంలో లీనమయ్యాడు.

ఖట్వాంగుని తర్వాత దీర్ఘబాహువు, రఘువు, పృథుశ్రవుడు, అజుడు, దశరథుడు పరిపాలించారు. ఆ దశరథునికి శ్రీహరి అంశతో నాలుగురూపాలతో శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులు జన్మించారు.

## ఇక్ష్వాకు వంశంలో శ్రీరామచరిత్ర

రావణాది రాక్షసుల బారినుండి సాధుసజ్జనులను కాపాడే సంకల్పంతో బ్రహ్మయొక్క దేవేంద్రాదిదేవతల యొక్క ప్రార్థనలను పురస్కరించుకొని శ్రీమహావిష్ణువు భూలోకంలో దశరథమహారాజుకు పుత్రుడుగా జన్మించాడు.

## శ్రీమహాభాగవత నవమస్కంధ కథాసారం

దశరథుడు విశ్వామిత్రుని కోరికను మన్నించి పంపగా రామలక్ష్మణులు యాగరక్షణార్థమై అతని వెంట వెళ్లారు. తాటకను కూల్చారు. సుబాహుణ్ణి ఇతరరాక్షసులను చంపారు. మారీచుణ్ణి సముద్రతీరం వరకు తరిమికొట్టారు. విశ్వామిత్రుని యాగం పరిసమాప్తమయింది. విశ్వామిత్రుడు శ్రీరామలక్ష్మణులను మిథిలానగరానికి తీసుకొని వెళ్లాడు. అక్కడ రాజులందరూ చూస్తుండగా శ్రీరాముడు శివధనుస్సు నెత్తాడు. అది విరిగి ముక్కలయింది. జనకుడు తన పుత్రిక సీతను శ్రీరామునికిచ్చి వివాహం జరిపించాడు. సీతాదేవి గుణశీలసౌందర్యలావణ్యాలలో శ్రీరామునకు తగిన ధర్మపత్ని.

కల్యాణానంతరం శ్రీరామాదులు తండ్రి దశరథునితో అయోధ్యకు వస్తుండగా పరశురాముడు ఎదురయ్యాడు. ఇరవయ్యొక్కపర్యాయాలు భూమండల మంతా తిరిగి రాజులను సంహరించిన పరశురామునికి శ్రీరాముడు గుణపాఠం నేర్పి పంపించాడు. పరశురాముడు తపస్సుచేసుకోడానికి వెళ్లిపోయాడు.

దశరథుడు కైకేయికి రెండు వరాలిచ్చాడు. తండ్రిమాట నిలబెట్టడానికి శ్రీరాముడు పట్టాభిషేకాన్ని కూడా కాదని భరతుణ్ణి రాజ్యపరిపాలనకు నిలిపి పదునాల్గేండ్లు వనవాసానికి బయలుదేరాడు. సీతాలక్ష్మణు లతణ్ణి అనుసరించారు.

దండకారణ్యంలో శ్రీరాముడు భార్యతో తమ్మునితో ఒక పర్ణశాల నిర్మించుకొని ఉన్నప్పుడు, రావణుని చెల్లెలు శూర్పణఖ శ్రీరాముణ్ణి ఆశించి రాగా లక్ష్మణు డామె ముక్కు కోశాడు. అదివిని దండెత్తివచ్చిన పదునాల్గువేల ఖరదూషణాదులను తన బాణాగ్నితో భస్మం చేశాడు. అది విన్న రావణుడు మోహాంధుడై సీతను అపహరించాలని నిర్ణయించుకొన్నాడు. మారీచుణ్ణి పంపించాడు. బంగారులేడిగా మారీచుడు వచ్చాడు. శ్రీరాముని చేతిలో మరణించాడు. రావణుడు సీత నపహరించుకొని వెళ్లాడు. ఆ అపహరణను అడ్డుకొన్న జటాయువును నరికివేశాడు. రామలక్ష్మణులు సీతాన్వేషణసందర్భంలో ఆ జటాయువుకు పరలోకక్రియలు నిర్వహించి ఋశ్యమూకానికి వెళ్లారు.

సుగ్రీవునితో ఒప్పందం కుదుర్చుకొని రాముడు వాలిని సంహరించాడు. సీతాన్వేషణకు కపులతో పాటు హనుమంతుడూ బయలుదేరాడు. సముద్రాన్ని దాటి లంకలో ప్రవేశించి, రావణపుత్రుడు అక్షకుమారుణ్ణి వధించాడు. అంతేగాక తోకచిచ్చుతో లంకకు చిచ్చుపెట్టి వచ్చాడు. ఆంజనేయునిద్వారా సీతావృత్తాంతాన్ని విన్న రాముడు వానరసేనలతో బయలుదేరి సముద్రం దగ్గరికి వచ్చాడు. ఎగసిపడుతూ దారివ్వని సముద్రానికి బుద్ధి చెప్పాలని రాముడు విల్లమ్ము లందుకొన్నాడు. సముద్రం బీడయింది. సముద్రుడు రాముణ్ణి స్తుతించాడు. తనపై సేతువు కట్టమని ప్రార్థించాడు.

రావణుని తమ్ముడు విభీషణుడు శరణు వేడగా అభయమిచ్చాడు. వానరశ్రేష్ఠులు వారిధిపై సేతునిర్మాణం వేగంగా చేశారు. శ్రీరాముడు సముద్రాన్ని దాటాడు. అతనితో కలిసి లంకానగరాన్ని ముట్టడించాడు. వానరసైన్యం లంక కోటగోడలను, ఇళ్లువాకిళ్లను, యంత్రాలను, గోపురాలను, మకరతోరణాలను విధ్వంసం చేసింది.

రావణుడు పంపగా కుంభ, నికుంభ, ధూమ్రాక్ష, విరూపాక్ష, సురాంతక, దుర్ముఖి, ప్రహస్త, మహాకాయ ముఖ్యరాక్షసులు వచ్చి యుద్ధం చేశారు. సుగ్రీవ, ఆంజనేయ, పనస, గజ, గవయ, గంధమాదన, అంగద,

కుముద, జాంబవంతాదులు వారితో ద్వంద్వయుద్ధంచేసి నేల గూల్చారు. లక్ష్మణుడు అతికాయుణ్ణి సంహరించాడు; శ్రీరాముడు కుంభకర్ణుణ్ణి ఖండించాడు. లక్ష్మణుడు మేఘనాదుణ్ణి కూల్చివేశాడు.

ఇక రామరావణ యుద్ధం జరిగింది. మాతలి తెచ్చిన దేవతారథాన్ని అధిరోహించి రాముడు రావణునితో యుద్ధం చేశాడు. ఆ సందర్భంలో రాముడు బంగారులేడిని పంపడాన్ని, కపటబ్రాహ్మణ వేషం ధరించి సీతను మోస పుచ్చడాన్ని తప్పులుగా ఎత్తిచూపాడు. నీవు చేసిన పాపాలకు యముడు అక్కరలేదు అంటూ భూచరులు, ఖేచరులు అందరూ చూస్తుండగా రావణుణ్ణి సంహరించాడు.

మండోదరీసహితలై రాక్షసస్త్రీలు యుద్ధభూమికి వచ్చి తమతమ భర్తలను గుర్తించి అందరూ రోదించారు. ఇతరుల భార్యలనూ, ఇతరుల ధనాన్నీ కోరేవారు క్షణికసుఖాలకోసం దేనికైనా తెగిస్తారు. వాళ్లు అది పాపంగా భావించరు. మంచిచెడ్డలు ఆలోచించరు. అలాంటివారికి (పరసతులను, పరధనాలను ఆశించేవారికి) ఇహపరాలుండవని మండోదరి దుఃఖించింది.

శ్రీరాముని అనుజ్ఞతో విభీషణుడు రావణునికి అంత్యక్రియలు నిర్వహించాడు. శ్రీరాముడు అశోకవనానికి వెళ్లాడు. ఆ వనంలో కృశించి ప్రాణాలు బిగబట్టుకొని ఉన్న సీతను చూశాడు. సీత దోషి కాదని అగ్నిముఖాన నిరూపించి ఆమెను స్వీకరించాడు. విభీషణుణ్ణి లంకా రాజ్యానికి రాజుగా చేసి కల్పాంతం జీవించుమని దీవించాడు. ఆ తర్వాత హనుమదాదులతో సీతాదేవితో పుష్పకవిమానమెక్కి భరతుడున్న నందిగ్రామానికి వచ్చాడు. భరతుడు పాదుకలు మోసుకొని వచ్చి అన్నగారి పాదపద్మాలకు నమస్కరించాడు. శ్రీరాముడతణ్ణి అక్కున చేర్చుకొని యోగక్షేమాలను విచారించాడు.

ప్రజలందరికీ రాముడు ప్రణమిల్లాడు. శ్రీరాముణ్ణి చూచి ప్రజలు పండుగ చేసుకొంటున్నారు.

సుగ్రీవ, విభీషణ, హనుమంత, భరత, శత్రుఘ్న, లక్ష్మణ, అంగద, జాంబవంతాది మహావీరులెందరో కొలుస్తుండగా సీతారాములు పుష్పక మధిరోహించి అయోధ్యచేరుకొన్నారు. అలంకృత అయోధ్య సీతారాములకు స్వాగతం పలికింది. నగరపౌరులు మంగళవాద్యాలతో ఎదురువెళ్లారు.

అయోధ్యాపౌరులు మేడలెక్కి సీతారామలక్ష్మణాదుల్ని కనులువిప్పార్చిచూచి సంతోషించారు. కౌసల్యాది మాతలు కన్నీళ్లతో సీతారామలక్ష్మణులను తడిపారు. వశిష్ఠాదులు సమంత్రకంగా మంగళస్నానాదులకు పురమాయించారు. రాజోచితవేషభూషలు ధరించిన రామచంద్రుడు, భరతుడు ప్రాధేయపడి అప్పగించిన సింహాసనంపై ఆసీనుడయ్యాడు.

రామచంద్రుడు భూభారాన్ని వహించగా అంతటా ప్రశాంతవాతావరణం నెలకొంది. ప్రకృతి, ప్రజలు దేవతలు నిర్భయంగా ఉన్నారు. కన్నతండ్రులను మరపించే విధంగా శ్రీరాముని పరిపాలన కొనసాగింది. ప్రజలు రాముడే తమతండ్రి అనుకొంటున్నారు. త్రేతాయుగం కృతయుగంగా మారింది. సీతారాములు సుఖంగా ఉన్నారు. శ్రీరాముడు అనేకయజ్ఞాలు చేశాడు.

ఆ శ్రీరామచంద్రుడు రాజర్షిలా వ్యవహరించాడు. ధర్మనిష్ఠలో జీవించాడు. అతడు ఏకపత్నీవ్రతుడు; ధర్మానికి విరోధం కలుగని కోరికలనే తీర్చుకొంటూ, దేశంలో అరిష్టాలు బాలమరణాలు కలుగనివ్వకుండా రాజ్యాన్ని పాలించాడు. అనేక యాగాలు చేశాడు.

తనకున్న సర్వం భూములతోపాటు దానంచేశాడు. ఇల్లాలి తాళిబొట్టు, కట్టుబట్టలు తప్ప ఇంకేమీ లేవు. బ్రహ్మణ్యదేవుడైన శ్రీరామచంద్రునికి దానంచేసిన భూములు మునులందరూ అప్పగించి, శ్రీరాముని దయయే తమకు చాలునని, తమలోని అజ్ఞానాంధకారాన్ని తొలగించడానికి జ్ఞానకాంతులను ప్రసరింప జేయవలసినదని కోరుకొంటూ వినయవినమ్రులై పూజించి వెళ్లిపోయారు. శ్రీరాముడు జనరంజకంగా చాలాకాలం రాజ్యపరిపాలన చేశాడు.

ఒకరోజు రాజ్యంలోని విశేషాలు వినడం కోసం శ్రీరాముడు మారు వేషంలో తిరుగుతున్నాడు. భార్యతో జగడమాడిన అయోధ్యావాసి ఒకడు **"పరాయి వాడింట్లో కాపురం చేసిన చంచలురాలిని వదులుకోకుండా ఏలుకోడానికి నేనేమి ఆవెట్ట రాముడినా"**? అంటూ కేకలువేస్తూండగా రాముడు విన్నాడు. ఆ తర్వాత చారులద్వారాకూడా ఈ విషయాన్నే లోకం కోడై కూస్తున్నదని తెలుసుకొన్నాడు. ఆదమరచి నిద్రిస్తున్న సీతకు ఈ సంగతి యేదీ చెప్పక ఆమెను వాల్మీకి ఆశ్రమంలో దిగబెట్టి రమ్మని ఆజ్ఞాపించాడు.

గర్భవతి అయిన సీతామాత వాల్మీకి ఆశ్రమంలో కుశలవులను కన్నది. వారికి వాల్మీకి జాతకర్మాదులు చేశాడు. ఇక్కడ లక్ష్మణునికి అంగద – చంద్రకేతులు, భరతునికి దక్షుడు – పుష్కలుడు, శత్రుఘ్నునికి సుబాహుడు – శ్రుతసేనుడనే కుమారులు జన్మించారు.

భరతుడు దిగ్విజయంచేసి అయోధ్యను సుసంపన్నం చేశాడు. శత్రుఘ్నుడు లవణాసురుణ్ణి సంహరించి, మధువనంలో మధురాపురాన్ని నిర్మించాడు.

వేదవిద్యల్లో ఆరితేరిన కుశలవులు కొంతకాలానికి వాల్మీకివిరచితరామకథాశ్లోకాలను అనేకసభల్లో గానంచేస్తూ, ఒక రోజు రాముని యజ్ఞశాలకు వెళ్లారు. వారి కథాగానానికి రాముడూ సభాసదులూ సంతసించారు. వారు వాల్మీకిపౌత్రులని రాముడు తెలుసుకొన్నాడు. ఆ మరుసటి రోజు సీతాకుశలవులతో వాల్మీకి వచ్చి శ్రీరాముణ్ణి దర్శించి స్తుతించి సీతమ్మవారిని గురించి ఇలా అన్నాడు.

**ఆ.వె. సీతశుద్ధురాలు, చిత్తవాక్కర్మంబు లందు సత్యమూర్తి యమల చరిత**
**పుణ్యసాధ్వి విడువబోలదు చేకొను రవికులాబ్ధిచంద్ర! రామచంద్ర! (355)**

శ్రీరాముడు కుశలవులను స్వీకరించాడు. నిరాశ అయిన సీత రామచంద్రుని పాదాలను ధ్యానిస్తూ భూమిలోనికి కుంగిపోయింది. తనను అలా వీడిపోవడం తగదంటూ రాముడు దుఃఖించాడు. దుఃఖాన్ని దిగమింగి బ్రహ్మచర్యాన్ని అవలంబించి పదమూడువేల సంవత్సరాలు యజ్ఞయాగాదులు చేస్తూ ధర్మబద్ధంగా పరిపాలన సాగిస్తూ చివరికి తన మొదటి చోటైన పరమపదానికి వెళ్లాడు.

శ్రీరామనామసంస్మరణం సద్గతికి మూలం. అపూర్వపుణ్యాలకు ఆలవాలం. సర్వపాపాల పరిహారం.

ఆ తర్వాత కుశుడు, అతని సంతానం వరుసగా పరిపాలించారు. అలా అనేకతరాలు ఎందరో ఈ దేశాన్ని పరిపాలించారు. ఇందులోని చివరివాడు బృహద్బలుడు. అతడు భారతయుద్ధంలో అభిమన్యునిచేతిలో మరణించాడు.

ఇక్ష్వాకునినుండి బృహద్బలునివరకు ఇదీ ఇంతవరకు నడచినకథ. ఆ తర్వాత శుకయోగీంద్రులు పరీక్షిన్నరేంద్రునితో తదనంతరరాజులచరిత్ర ఇలా వివరించారు.

ఆ బృహద్బలునికి బృహద్రణుడు జన్మించాడు. ఆ విధంగా నురుక్షతుడు, వత్సప్రీతుడు తదితరులు జన్మిస్తారు. అలా దాదాపు ఇరవైతరాలు గడచిపోతాయి. సూర్యవంశంలో చివరివాడు సుమిత్రుడు. అతనితోనే సూర్యవంశం నశిస్తుంది.

ఇక్ష్వాకుని కొడుకు నిమి యాగంచేయాలని వశిష్ఠుణ్ణి అర్థించాడు. వశిష్ఠుడు ఇంద్రుడి యజ్ఞం చేయించడానికి ఒప్పుకున్నాను. ఆ యజ్ఞం అయిన తర్వాత నీ యజ్ఞం చేయిస్తానన్నా నిమి అంగీకరించక, ఇతర ఋత్విక్కుల సహాయంతో యజ్ఞంచేసి, వశిష్ఠుని శాపానికి గురై మరణిస్తాడు. వశిష్ఠుడు నిమి శాపానికి గురై ప్రాణాన్ని త్యజించి, ఊర్వశికి జన్మించాడు. నిమి దేవతాగణాల అనుగ్రహంవల్ల మళ్ళీ జీవించే అవకాశం ఉన్నా జీవించడానికి అంగీకరించలేదు. దేవతలూ ప్రార్థించారు. అయినా అంగీకరించలేదు. అందరికీ నిమి కనిపిస్తాడని దేవతలు వరమిచ్చారు. మునులు నిమి కళేబరాన్ని మథించగా జన్మించిన చిరంజీవికి జనకుడని పేరు పెట్టారు. అతనికే వైదేహుడని, మిథులుడని పేరువచ్చింది. అతను నిర్మించిన నగరం మిథిలగా ప్రసిద్ధికెక్కింది. అతని కొడుకు విదావసుడు. అలా పదునైదుతరాలు గడిచాయి. ఆ వంశంలోనే సీరధ్వజుడు జన్మించాడు. ఆ సీరధ్వజుణ్ణే జనకుడు ఉంటారు. అతను యజ్ఞం చేయడానికి భూమిని దున్నించగా నాగేటిచాలులో సీత దొరికింది.

ఆ సీరధ్వజునికి కుశధ్వజుడు అతనికి ధర్మధ్వజుడు జన్మించారు– అలా బహుళాశ్వుని వరకు ముప్పదియైదుతరాలు గడిచాయి. వీరందరిని మైథిలులనే అంటారు, అందరూ యోగీశ్వరులు, సంసారంబంధాల్లో ఉంటూ కూడా బ్రహ్మానుసంధానం చేస్తూ గడిపిన మహారాజులుగా వీరందరూ కీర్తి గడించారు.

## చంద్రవంశ రాజుల చరిత్ర

ఆ తర్వాత చంద్రవంశరాజులచరిత్ర. పురూరవుడు తదితరుల కథ లిందులో వస్తాయి. బ్రహ్మకు అత్రి, అత్రికి చంద్రుడు ఉదయించారు. తారాచంద్రులకు బుధుడుజన్మించాడు. ఇలకూ బుధునికీ జన్మించినవాడు పురూరవుడు. పురూరవుణ్ణి ఊర్వశి మోహించి మనుష్యరూపంలో భూలోకానికి వచ్చింది. ఉర్వశీపురూరవులు సుఖాలలో మునిగిపోయారు. ఊర్వశి ఒక ఒప్పందంతో పురూరవునితో ఉంటున్నది. ఆ ఒప్పందానికి భంగం కలిగింది, ఊర్వశి మాయమయింది. పురూరవుడు పిచ్చివాడై చెట్టూపుట్టా రాయీ రప్పా తిరిగాడు. సరస్వతీనదీ తీరంలో ఊర్వశిని చూశాడు; ఆమె తిరస్కరించింది.

పురూరవుడు ఊర్వశినే స్మరిస్తూ మూడగ్నులు సృష్టించాడు. ఆహవనీయాది రూపాలతో ఆవిర్భవించిన ఆ అగ్నివల్ల ఊర్వశీపురూరవులకు పుత్రుడు జన్మించాడు. ఆ పురూరవుడు కర్మమార్గం సుగమం చేశాడు. ఆ తర్వాత గంధర్వలోకానికి వెళ్లాడు. ఊర్వశి వల్ల అతనికి ఆరుగురు కొడుకులు పుట్టారు. వారిలో శ్రుతాయువు వంశం

వికసించింది. ఆ వంశంలోనే కొన్ని తరాలకు కుశాంబుడు కలిగాడు. ఆ కుశాంబుని కొడుకే గాధి. గాధిరాజు కూతురు సత్యవతి. ఆమెను ముని ఋచీకునికిచ్చి వివాహం చేశాడు రాజు. ఆ సత్యవతి కొడుకే జమదగ్ని. అతనికొడుకు పరశురాముడు.

## పరశురాముని చరిత్ర

హైహయవంశ రాజుల్లో కార్తవీర్యార్జునుడు అడ్డూ ఆపూ లేక విజృంభించి భూమ్యాకాశాల్లో ఎదురులేక విహరిస్తున్నాడు. తనభుజబలంతో రావణుణ్ణే ఓడించాడు; అవమానించాడు.

ఒకరోజు కార్తవీర్యార్జునుడు వేటకు వెళ్లాడు. అలసిపోయి ఆకలితో జమదగ్నిముని ఆశ్రమానికి వెళ్లాడు. కామధేనువును రప్పించి ముని వారందరికి సుష్టుగా భోజనం పెట్టించాడు. అలాంటి కామధేనువును కార్తవీర్యు డపహరించాడు. ఈ విషయం పరశురామునికి తెలిసింది. ఆ రాజు తన పురానికి చేరక ముందే పరశురాము డడ్డుకొన్నాడు. ఎదిరించిన కార్తవీర్యుని సేనలను ఛిన్నాభిన్నం చేశాడు. అప్పుడు కార్తవీర్యుడే ఎదుర్కొన్నాడు. పరశురాముడతని చేతులను నరికాడు. నేలపడ్డ కార్తవీర్యుణ్ణి గండ్రగొడ్డలితో సంహరించాడు. కార్తవీర్యుని కొడుకులు పదివేలమంది తలోదిక్కుగా పారిపోయారు. పరశురాముడు దూడతోపాటు కామధేనువును ఆశ్రమానికి తోలుకొని వెళ్లాడు. రాజును చంపిన పాపానికి తీర్థయాత్రలు చేయుమన్నాడు తండ్రి జమదగ్ని. తండ్రిమాటను మన్నించి భార్గవరాముడు ఒక ఏడాది పాటు పుణ్యాతీర్థాలను సేవించి తిరిగి వచ్చాడు.

ఒకరోజు జమదగ్ని భార్య రేణుక నీళ్లు తేవడానికి గంగానదికి వెళ్లింది. ఆ నదిలో అప్సరఃస్త్రీలతో జలకాలాడే చిత్రరథుణ్ణి చూస్తూ ఆలస్యం చేసింది. ఇక్కడ జమదగ్ని హోమానికి వేళతప్పింది వచ్చిన భార్యను వధించుమని కొడుకుల నాదేశించాడు జమదగ్ని. వారు అంగీకరించలేదు. పరశురాముణ్ణి ఆదేశించాడు. ఆయన తల్లినీ, అన్నలను సంహరించాడు. తండ్రిని ప్రాధేయపడి తల్లినీ అన్నలనూ బతికించుకొన్నాడు భార్గవరాముడు. తనతండ్రి ఆగ్రహం అనుగ్రహంగా మారుతుందని పరశురామునికి తెలుసు. అందుకే అలా వ్యవరించాడు. ఇది సామాన్యులకు సాధ్యంకాదు. భార్గవరాముడు అవతారపురుషుడు.

ఆ పరశురామునికి భయపడి పారిపోయిన కార్తవీర్యుని కొడుకులు, పరశురాముడూ అన్నలూలేని సమయం చూసి, రేణుక అడ్డ వస్తున్నా లెక్కచేయకుండా జమదగ్ని తలనరికి వెళ్లారు. తల్లి ఇరవైయొక్కమార్లు గుండెబాదుకొంటూ ఏడుస్తూ పరశురాముణ్ణి పిలిచింది.

అన్నలు వచ్చి తండ్రిమరణం తెలుసుకొని విలపించారు. పరశురాముడు తండ్రి కళేబరాన్ని జాగ్రత్తగా చూడుమని చెప్పి, గండ్రగొడ్డలి ధరించి మాహిష్మతీపురానికి వెళ్లి కార్తవీర్యుని కొడుకు లందరినీ సంహరించాడు. అంతటితో ఆగక భూమిమీద రాజశబ్దమే వినబడరాదనే పట్టుదలతో, ఇరవై ఒక్కమారులు రాజులను గాలించి గాలించి చంపాడు. ఆ తర్వాత తండ్రికి ఉత్తరక్రియలు నిర్వహించారు. తనవల్ల తండ్రి సప్తర్షిమండలంలో నిలిచాడు. పరశురాముడు ఈ నాటికీ మహేంద్రపర్వతం మీద తపోమగ్నుడై ఉన్నారు.

ఇక గాధి పుత్రుడు విశ్వామిత్రుడు తపోబలంతో బ్రహ్మర్షి అయ్యాడు. అతని కెందరో పుత్రులు. తలిదండ్రులచేత హరిశ్చంద్రునికి యాగపశువుగా అర్పింపబడ్డ శునశ్శేఫుణ్ణి తన కొడుకుగా తెచ్చుకొన్నాడు. ఇది అంగీకరించని కొందరు విశ్వామిత్ర పుత్రులు తండ్రినీ, సోదరున్నీ విడిచి వెళ్లి పోయిన కారణంగా గోత్రభేదాలేర్పడ్డాయి.

ఆ శునశ్శేఫుడే దేవరాతుడయ్యాడు పురూరవుని కొడుకు ఆయువుకు నహుషుడు జన్మించాడు. ఆ నహుషునికి పదితరాల తర్వాత దీర్ఘతపుడు జన్మించాడు. ఆ దీర్ఘతపునికి ఆయుర్వేదం తెలిసిన ధన్వంతరి శ్రీహరి అంశంలో పుట్టాడు. ఈ వంశంలోనే కొన్ని తరాలకు కువలయాశ్వుడు జన్మించాడు. ఈ వరుసలో ఎందరో ఒకరితర్వాత ఒకరు పరిపాలన చేశారు.

అయితే నహుషుని గురించే చెప్పుకోవాలి. నూరుయజ్ఞాలు చేసి ఇంద్రపదవి సాధించిన నహుషుడు, శచీదేవిని కూడా కోరి, శాపగ్రస్తుడై నేలకూలాడు. ఆ తర్వాత నహుషుని కొడుకు యయాతి రాజయ్యాడు.

## యయాతి చరిత్ర

క్షత్రియుడైన యయాతి శుక్రాచార్యుని కూతురు దేవయానిని, రాక్షస రాజకూతురు శర్మిష్ఠను పెళ్లి చేసుకొన్నాడు. ఈ వివాహాలూ, యయాతి కథ శుకయోగి పరీక్షిత్తుకు వివరంగా చెప్పాడు.

వృషపర్వుని కూతురుశర్మిష్ఠ, శుక్రాచార్యుని కూతురు దేవయానితో కలిసి ఉద్యానవన విహారానికి వెళ్ళింది. అక్కడ సరస్సులో జలక్రీడలాడుతున్నారు. ఆ సమయంలో పార్వతీపరమేశ్వరులు ఆ దారిలో వచ్చారు. హడావుడిలో శర్మిష్ఠ దేవయాని చీర కట్టుకొంది. దేవయాని నిరసన తెలిపింది. శర్మిష్ఠ ఆమెను బావిలో తోయించి వెళ్లిపోయింది. వేటకు వచ్చిన యయాతిమహారాజు దైవవశాన ఆ బావి దగ్గరకు వచ్చారు.

ఆమెకు తనకుడిచేయి సాయంగా అందించి వెలికి తీశాడు. దేవయాని, కచుణ్ణి తాను కామించిన సంగతి చెప్పి, అతడిచ్చిన శాపం కారణంగా తాను బ్రాహ్మణుణ్ణి పెళ్లిచేసుకోవడం కుదరదని, దైవవశాన తనను రక్షించిన యయాతినే భర్తగా కోరుతున్నట్లు చెప్పింది. యయాతి కూడా ఇష్టపడ్డాడు. వెనువెంటనే శర్మిష్ఠ తనను అవమానించిన సంగతి తండ్రికి చెప్పింది. శుక్రుని కోరిక మీద వృషపర్వుడు తన కూతురు శర్మిష్ఠను దాసీజనంతోపాటు దేవయానికి దాసిగా సమర్పించాడు. యయాతి దేవయాని వివాహం జరిగింది. శర్మిష్ఠ దాసిగా దేవయాని సేవలో ఉన్నది. దేవయానికి యదుతుర్వసులనే పుత్రులు కలిగారు.

దాసియైన శర్మిష్ఠకూడా ఒకనాటి ఏకాంతాన యయాతిని కోరింది. యయాతీ ఆమెను కోరుకొన్నాడు. ఆ కారణంగా శర్మిష్ఠకూ ద్రుహ్యువు, అనువు, పూరుడు అనే ముగ్గురు పుత్రులు కలిగారు. ఈ విషయం తెలుసుకొన్న దేవయాని, యయాతి నివారించినా, ప్రాధేయపడ్డా వినకుండా, తండ్రి శుక్రాచార్యునికీ సంగతి చెప్పింది. శుక్రుడాగ్రహించి మాట తప్పిన కాముకునిగా యయాతిని నిందించి శపించాడు. ఆ శాపం కారణంగా యయాతి ముసలివాడయ్యాడు.

ఆ వృద్ధాప్యం తాను భరించలేనని, యదుతుర్వసులు ద్రుహ్యుడు అను కొడుకులను తన ముసలితనం తీసుకుని వారి యౌవనాన్ని తనకిమ్మని అడిగాడు; కొడుకుల యౌవనాన్ని యయాతి కోరినా వారంగీకరించలేదు.

కాని చివరి కొడుకు పూరుడు అంగీకరించాడు. తండ్రిమాట పాటించడం తన ధర్మమన్నాడు. కొడుకు యౌవనాన్ని స్వీకరించి, యయాతి, మన్మథసుఖాలలో తేలియాడుతూ, అనేకయాగాలుచేస్తూ శ్రీహరికి ప్రతీకలిగించాడు. అయితే లౌకికబంధాలలో చిక్కి సతమతమైపోయాడు; విషాదంలో పడ్డాడు.

దేవయానితో ఒక ఇతిహాసం చెబుతానని, తనచరిత్రనే బస్తోపాఖ్యానంగా వివరించాడు. మేకపోతుమేకలకథ చెప్పాడు. పళ్లురాలినా, వెంట్రుకలు నెరిసినా, శరీరం శిథిలమైనా ప్రాణాలమీది తీపి, ఇంద్రియసుఖాలపట్ల కోరికా ఈ రెండూ తగ్గడం లేదన్నాడు. పరమయోగినైనా ఇంద్రియశక్తి కీడు కలిగిస్తుందన్నాడు. తానిక అడవులకు వెళ్లిపోతానని పూరునికి యౌవనాన్ని ఇచ్చి తనముసలి తనాన్ని తీసుకొని, కొడుకులకు ఆయారాజ్యాలిచ్చి సర్వభూమండలానికి అధిపతిగా పూరునికి పట్టాభిషేకం చేశాడు. విషయవాంఛలను గెలిచి పరబ్రహ్మంలో లీనమయ్యాడు. దేవయాని కూడా శ్రీహరిధ్యానంలో నిమగ్నురాలై ముక్తి పదాన్ని చేరుకొన్నది.

## పూరుడూ - చంద్రవంశరాజులు

ఇదే పురూరవుని దగ్గరి నుండి సాగివస్తున్న వంశం. ఈ వంశంలోని వాడే పురుడు. ఈ వంశంలో ఎందరో ధీరులూ తేజస్సంపన్నులూ జన్మించారు. ఈ వంశంలో పది పదిహేనుతరాల తర్వాత రైభ్యుడు పుట్టాడు; ఆ రైభ్యుని కొడుకే దుష్యంతుడు.

ఆ దుష్యంతుడు ఒకరోజు వేటకు వెళ్లాడు. అలసిపోయి కణ్వమహాముని తపోవనానికి చేరుకొని, ఆ వనసౌందర్యాన్ని చూస్తూ మేనకా విశ్వామిత్రుల కూతురు, కణ్వుని పెంపుడుకూతురైన శకుంతలను చూశాడు. గాంధర్వవిధిని వివాహమాడాడు. శకుంతలవల్లనే ఆమె పుట్టుపూర్వోత్తరాలు దుష్యంతునికి తెలిశాయి. దుష్యంతు డామరునాడు తన పట్టణానికి వెళ్లాడు. శకుంతల కొంతకాలానికి కొడుకును కన్నది. ఆ బాలుణ్ణి కణ్వాదు దీవించాడు. ఆ బాలుడు మహాసాహసవంతుడు. కణ్వుడు శకుంతలను దీవించి దుష్యంతుని దగ్గరికి పంపించాడు. దుష్యంతుడు శకుంతలను కుమారుణ్ణి చూచికూడా మాట్లాడలేదు. ఆ సమయంలో ఆకాశవాణి శకుంతల నీభార్య స్వీకరించుమన్నది.

దుష్యంతుడు, శకుంతలనూ కుమారుణ్ణి స్వీకరించాడు; కొంతకాలం రాజ్యపరిపాలన అనంతరం దుష్యంతుడు చనిపోయాడు.

శకుంతలా దుష్యంతుల పుత్రుడు భరతుడు రాజయ్యాడు. ఆ భరతుడు నూటముప్పయిమూడు అశ్వమేధయాగాలు చేసి దేవేంద్రవైభవాన్ని దాటిపోయాడు. అలా ఇరవైయేడేండ్లు భూమండలాన్ని పరిపాలించాడు. కాలాంతరంలో బృహస్పతీ మమతల పుత్రుడు భరద్వాజుణ్ణి పెంచుకొన్నాడు. కొన్ని తరాల తర్వాత ఈ వంశంలో **రంతిదేవుడు** జన్మించాడు.

రంతిదేవుడు రాజైన తర్వాత అపూర్వదానాలు చేశాడు. చివరికి పేదవాడైనా గుండెదిటవు కోల్పోలేదు. నలబైఎనిమిది రోజులు ఆహారం లేకుండానే గడిపాడు. చివరికి లభించిన కొద్దిపాటి ఆహారాన్ని తిందామనుకొనే

వరకు, ఒకబ్రాహ్మణుడు, ఒక శూద్రుడు, కుక్కల్ని పెంచుకొనేవాడు, చివరికి చండాలుడు అడిగారు. అందరికివ్వగా చండాలునికి నీరే మిగిలింది.

ఆ సమయంలో **"అన్నము లేదుకొన్ని మధురాంబువు లున్నవి త్రావుమన్న...**(647) ఆ పురుషోత్తముడే నాకు దిక్కు అని ఆ కాసిన్ని నీళ్లు సమర్పించుకొన్నాడు. అంతే బ్రహ్మాదిదేవతలు ప్రత్యక్ష మయ్యారు. రంతిదేవుడు పరమపదాన్నే కోరుకొన్నాడు.

ఈ వంశంలో తదనంతరం వచ్చినవారిలో కొందరు క్షత్రియులుగానే మిగులగా, మరికొందరు బ్రాహ్మణు లయ్యారు. బ్రహ్మదత్తుడు, విష్వక్సేనుడు తర్వాతి తరాలలో జన్మించారు. ఈ వంశంలో జన్మించిన భర్మ్యాశ్వునికి ఐదుగురు కొడుకులు పుట్టారు. వారు ఐదురాజ్యభాగాలు పరిపాలించిన కారణంగా పాంచాలు రయ్యారు. తరాల తరాల అనంతరం ఈ వంశంలోనే ప్రతీపుడు జన్మించాడు. ఆ ప్రతీపుని కొడుకే శంతనుడు. శంతనుని అగ్రజుడు దేవాపి; అతడు వేదనిందచేసి రాజ్యార్హత కోల్పోయిన కారణంగా శంతనుడు రాజయ్యాడు.

శంతనునికి గంగవల్ల భీష్ముడు జన్మించాడు. దాశకన్యక అయిన సత్యవతి వల్ల చిత్రాంగద, విచిత్రవీర్యులు జన్మించారు. ఇందులో చిత్రాంగదుడు గంధర్వులతో యుద్ధంచేసి మరణించాడు.

సత్యవతి శంతనుణ్ణి వివాహం చేసికోకముందే పరాశరమునివల్ల శ్రీహరి అంశతో పుత్రుణ్ణి కన్నది. ఆ పుత్రుడే వేదవ్యాసమహర్షి. ఈ మహర్షి రచించినదే భాగవతం. ఆయన కొడుకునే నేను. నాకీ భాగవతంచెప్పాడు నేను రహస్యంగా చదువుకొన్నానని శుకయోగీంద్రులు పరీక్షిన్నరేంద్రులకు చెప్పారు.

భీష్ముడు కాశీరాజు కుమార్తెలు అంబిక, అంబాలికలను విచిత్రవీర్యుని వివాహంచేశాడు. విచిత్రవీర్యుడు మరణించాడు. సత్యవతికోరిక మేరకు వ్యాసులవారి వల్ల ధృతరాష్ట్ర, పాండురాజు, విదురులు జన్మించారు.

ధృతరాష్ట్రునికి గాంధారివల్ల వందమందికొడుకులు, దుశ్శల అనే కూతురు జన్మించింది. పాండురాజుకు కుంతివల్ల యుధిష్ఠిర, భీమార్జునులు జన్మించారు. మాద్రివల్ల నకులసహదేవులు జన్మించారు. ఈ అయిదుగురికి ద్రౌపది భార్య అయింది. అందరికీ వేర్వేరుగా వివాహాలు జరిగాయి. అందులో అర్జునుడు సుభద్రను పెళ్లిచేసుకొన్నాడు. వారికి అభిమన్యుడు జన్మించాడు. ఉత్తరాభిమన్యులకు నీవు జన్మించావని పరీక్షిత్తుకు శుకయోగి ఇన్ని వంశాలు వంశానుచరితాలన్నీ వివరించాడు. ఇంకా అనేకవిషయాలు వివరిస్తూ ఇక్ష్వాకు చంద్రవంశాల మహారాజులను గూర్చిచెప్పాడు. యదువంశం పుట్టుపూర్వోత్తరాలనూ ప్రస్తావించాడు.

## యదువంశచరిత్ర

యయాతి పెద్దకొడుకు యదువు. యదుమహారాజుగా కీర్తి గడించాడు. భగవంతుడైన విష్ణుమూర్తి మానవరూపంలో పుట్టింది ఈ వంశంలోనే.

ఈ యదువంశంలోనే కార్తవీర్యుడు పుట్టాడు. పరశురాముని చేతిలో ఇతడు మరణించాడు. పరశురామునిచేతినుండి తప్పించుకొన్న కార్తవీర్యుని కొడుకులలో జయధ్వజుడొకరు. ఆ జయధ్వజునికీ వంశంలో

కొన్ని తరాలకు శశిబిందుడు పుట్టాడు. ఇలా తరతరాలుగా సాగిన ఈ వంశంలోనే, ఎన్నో శాఖలు విస్తరిల్లి, ఒకశాఖలో దేవమీఢుడు జన్మించాడు. ఆ దేవమీఢుణ్ణే శూరుడన్నారు. ఆ శూరునికి మారిషకు పదిమంది కొడుకులు పుట్టారు. అందులో పెద్దకొడుకు వసుదేవుడు. శూరుని పుత్రిక పృథ. కుంతిభోజుని బిడ్డలు లేనందువల్ల పృథను పెంచుకొన్నాడు. ఆమెయే కుంతి. ఆ కుంతికి పాండురాజుకు వివాహం జరిగింది. వారి సంతానమే పాండవులు.

వసుదేవునికి రోహిణి వల్ల బలరామాదులు జన్మించారు. మరికొందరుభార్యల వల్ల కూడా సంతానం కలిగింది. దేవకికి కీర్తిమంతుడు, సుషేణుడు, భద్రసేనుడు, ఋజువు, కవదనుడు, భద్రుడు, సంకర్షణుడు అనే ఏడుగురు కొడుకులు కలిగారు.

ఆ దేవకీదేవికి ఎనిమిదవగర్భంలో భగవంతుడైన విష్ణుదేవుడే దుష్టశిక్షణ శిష్టరక్షణకోసం ఆవిర్భవించాడు. శ్రీహరి పూర్ణావతారమే శ్రీకృష్ణపరమాత్ముడు.

క. **దుష్టజన నిగ్రహంబును, శిష్టజనానుగ్రహంబు సేయుట కొఱకై**
**యష్టమగర్భమున గుణో, త్కృష్టుడు దేవకికి విష్ణుదేవుడు పుట్టెన్. (723)**

ఈలోకంలో ఎప్పుడు ధర్మం నశించి, అధర్మం అతిశయిస్తుందో, అప్పుడు విశ్వేశుడైన శ్రీహరి తాను సర్వవ్యాపకుడై ఉన్నా తన్నుతానే సృష్టించుకొంటారు.

క. **ఎప్పుడు ధర్మక్షయ మగు, నెప్పుడు పాపంబు పొడము నీలోకములో**
**నప్పుడు విశ్వేశుడు హరి, దప్పక విభుడయ్యుఁ దన్నుఁ దాసృజి యించున్. (725)**

ఈ నవమస్కంధంలో సూర్యచంద్రవంశరాజుల చరిత్ర రమణీయంగా వర్ణింపబడింది. పఠితలు దీనిని చదివి కృతార్థులు అగుదురుగాక!

**– డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి**

# విషయసూచిక

## అష్టమస్కంధము



## నవమస్కంధము

పోతన గారి భాగవత పద్యాలు

ఇంతింతై వటుడింతయై మరియు తానింతై నభోవీథిపై నంతై
తోయద మండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై నంతై
చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై నంతై
సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై॥

# అష్టమస్కంధము

శ్రీరస్తు

# శ్రీమహాభాగవతము

## అష్టమస్కంధము

**ఉపక్రమణిక :** 'పురాణం పంచలక్షణమ్' అన్న విషయం ముందు ప్రస్తావించబడింది. సర్గము (ఈశ్వర సృష్టి), విసర్గము (బ్రహ్మసృష్టి) అని సృష్టిని రెండు విధాలుగా భాగవతం వివరించింది. అందుకే భాగవతం ఒకవైపు విజ్ఞాన భాండాగారం, మరొకవైపు ప్రాచీన ఇతిహాస పరంపరను కాపాడిన ఉద్గ్రంథం.

పైన ప్రస్తావించిన సర్గ (సృష్టి) ఈశ్వర కృతం కాబట్టి మరోవిధంగా, నవ విధాలుగా సృష్టి ఎలా విస్తరించిందో చెప్పటం కూడా భాగవతంలో కనిపిస్తుంది. వీటిని 3, 4 స్కంధాలలో చూడవచ్చు.

1) వీటిలో మొదటిది ప్రాకృత – వైకృత సర్గలు (ఈశ్వర–బ్రహ్మ సృష్టులు).

2) రెండవ అంశం – స్థానం – లోక ద్వీపమర్యాదా పాలనం. ఇది 4వ స్కంధంలో ఉంది.

3) మూడవ అంశం – పోషణం – స్వధర్మనిరతులైన భక్తులరక్షణం ఇందులో ఉంది. 6వ స్కంధంలో ఈ అంశముంది.

4) ఊతి – నాల్గవ అంశం – తత్తత్కర్మానుసారమైన వాసన – శుభాశుభ వాసనలు – హిరణ్యకశిపు – ప్రహ్లాదుల కథల ద్వారా నిరూపితాలయ్యాయి.

5) ఐదవ అంశం – (దీనిని వ్యాఖ్యాతగారు సులభంగా విశదీకరించగలరు)

6) ఆరవ అంశం మన్వంతరాలు. ఈ ఎనిమిదవ స్కంధంలో పధ్నాలుగు మంది మనువులను వర్ణించడం చూస్తాము. ప్రతి మన్వంతరంలో మనువు, అతని కొడుకు, ఋషి, దేవేంద్ర విష్ణ్వవతారమూర్తు లారుగురూ ధర్మ ప్రవర్తన పాలనాచరణాలను విడివిడిగా ఎలా చేస్తారో వివరించడం గమనించవచ్చు. అందుచేతనే మన్వంతర లక్షణం 'సద్ధర్మం' అని చెప్పబడింది. ఈ అంశాల్ని ఈ స్కంధంలో పరిశీలించవచ్చు. ఈ పదునాల్గురు మనువులలో నాల్గవ మనువు తామసుడు. కేతువు, వృషుడు మొదలైన వారు పదిమంది అతని కొడుకులు. సత్యసహరి వీర నామములు కల్గిన దేవతలు, త్రిశిఖుడనే పేరున్న ఇంద్రుడు, జ్యోతిర్వ్యోముడు మొదలైన ఋషులు ఆ కాలంలో ఉన్నారు. హరి మేధునికి, హరిణి అనే స్త్రీకి జన్మించాడు. అతడే మొసలిచేత పట్టుబడిన గజేంద్రుని కాపాడినవాడు. ఆ హరి దయాసముద్రుడు. అఖిలలోకేశ్వరుడు. ఈ స్కంధంలోనే క్షీరసాగరమథన గాథ ఉంది. కూర్మావతార గాథ ఇందులోనే వస్తుంది. శివుడు హాలాహల భక్షణం చేసిన సందర్భమూ ఉంది. శ్రీవిష్ణుమూర్తి మోహినీ స్వరూపాన్ని దాల్చి రాక్షసులను వంచించి దేవతలకు అమృతం పంచిన గాథ ఇందులోనే వస్తుంది. దేవాసుర యుద్ధం కూడా ఇందులో వర్ణింపబడింది.

**శ్రీమన్నామ! పయోద, శ్యామ! ధరాభృల్లలామ! జగదభిరామా!**
**రామాజనకామ! మహో, ద్దామ! గుణస్తోమధామ! దశరథరామా!** **1**

**ప్రతిపదార్థం :** శ్రీమత్+నామ= శ్రీమంతమైన పేరు గలవాడా! ('శ్రీ' ని పేరులో గలవాడా!); పయోదశ్యామ= మేఘంలాగా నల్లటి కాంతి గలవాడా!; ధరాభృత్+లలామ= రాజులలో ఆభరణంలాంటి వాడా!; జగదభిరామా= ప్రపంచానికి ప్రియమైనవాడా!; రామాజన= స్త్రీలకు; కామ= మన్మథుడైన రామా!; మహా+ఉద్దామ= మిక్కిలి శక్తికల్గిన వాడా!; గుణస్తోమధామ= సుగుణసముదాయానికి ఆశ్రయమైనవాడా!; దశరథరామా = దశరథనందనుడవైన రామా!.

**తాత్పర్యం :** శ్రీమంతమైన నామం కలవాడా! మేఘంవలే నల్లనైనవాడా! రాజులలో శ్రేష్ఠుడా! జగత్తుకు ప్రియమైనవాడా! స్త్రీలకు మన్మథునివంటివాడా! గొప్ప వైభవం కలవాడా! గుణసమూహాలకు నిలయమైనవాడా! దశరథుని కుమారుడవైన ఓ రామా!

**వ. మహనీయ గుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2**

**ప్రతి :** మహనీయ= గొప్పవైన; గుణగరిష్ఠులు+అగు= గొప్ప గుణాలు కలిగినవారిలో; ఆ మునిశ్రేష్ఠులకు= నైమిశారణ్యంలో తనను ప్రశ్నించిన శౌనకాది మహర్షిశ్రేష్ఠులకు; నిఖిల= అన్ని (అష్టాదశ); పురాణవ్యాఖ్యాన= పురాణాల ప్రవచనం చేయటంలో; వైఖరీ= తగిన శబ్ద పరిష్కార సంపదతో; సమేతుండు+ఐన= కూడిన వాడయినటువంటి; సూతుండు= సూతమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు; అట్లు= ఆవిధంగా (మునుపు చెప్పిన రీతిగా); ప్రాయోపవిష్టుండు+ఐనన్= ప్రాయోపవేశంచేసినవాడు కాగా; పరీక్షిత్+నరేంద్రుండు= పరీక్షిన్మహారాజు; శుకయోగీంద్రున్= శుకమహర్షిని; కనుంగొని= చూసి...

**తా :** నైమిశారణ్యంలో గుమిగూడిన శౌనకాది మహర్షులు నిరంతర పురాణ శ్రవణాదులచేత ఉన్నతమైన సంపదను పొందిన మానవోత్తములు, పురాణ వ్యాఖ్యానం చేయటంలో నిపుణుడు సూతుడు వారిని చూసి ఇలా అన్నాడు. "మహర్షులారా! ఆ విధంగా పరీక్షిత్తు ప్రాయోపవేశం చేసి శుకమహర్షిని చూచి ఇలా అన్నాడు.

**విశే :** వైఖరి – వాక్కు నాల్గు విధాలు. పర–పశ్యంతి–మధ్యమ–వైఖరి. చెవికి వినిపించే శబ్దం వైఖరిది. లోకంలో మనం మాట్లాడేది, వినేది ఈ శబ్దమే. కవికి – వాఖ్యాతకు సముచితమైన శైలీ బంధ సంయుతమైన వాక్సంపద ఉండాలి. అప్పుడే పురాణం చెప్పటంలో ఒక 'ముద్ర' కల్గి ఉంటారు. అలాంటి విశిష్టశైలి సూతమహర్షికి ఉందని అర్థం.

ప్రాయ+ఉపవిష్టుడు= ప్రాయోపవిష్టుడు. ప్రకృష్ట మేతి పుణ్యలోక మనేనేతి ప్రాయః. ప్రకృష్టముగా పుణ్యలోకమును పొందుటకు (ఉపవిష్టుడు) కూర్చున్నవాడు. 'ప్రాయోపవేశనమతి ర్నృపతిర్బభూవ' అని రఘువంశమందు అకారాంత ప్రయోగమున్నది.

**క. వినఁబడియెను స్వాయంభువ, మనువంశము వర్ణధర్మమర్యాదలతో**
**మనుజుల దనుజుల వేల్పుల, జననంబులు స్రష్టలెల్ల జనియించుటయున్. 3**

**ప్రతి :** స్వాయంభువ మను వంశము= స్వాయంభువ మనువు యొక్క వంశం; వర్ణ= ఆయా వర్ణాలకు సంబంధించిన; ధర్మ= ధర్మముల; మర్యాదలతో= నియమాలతో; మనుజుల= ఆ మన్వంతరంలోని మనుష్యుల; దనుజుల= రాక్షసుల; వేల్పుల= దేవతల; జననంబులు= పుట్టుకలూ; స్రష్టలు+యెల్ల= ఆయా యుగాలలో బ్రహ్మలందరూ; జనియించుటయున్= పుట్టుకలూ; వినఁబడియెను= మీరు చెప్పగా మునుపు విన్నాం.

**తా :** ఓ మునీంద్రా! స్వాయంభువ మనువంశాన్ని గురించి ఆ కాలంలోనే జాతిధర్మాల కట్టుబాట్లను గురించి మనుష్యులు, రాక్షసులు, దేవతలు, ఎల్లప్రజాపతులు పుట్టడాన్ని గురించి విన్నాను.

**ఉ. ఏ మనుకాలమందు హరి యీశ్వరుఁడేటికి సంభవించె? నే**
**మేమి యొనర్చె? నమ్మనువులే? రతఁ డే క్రియఁజేయుచున్న వాఁ?**
**దేమి నటించు మీఁద? గత మెయ్యది? సజ్జనులైనవారు ము**
**న్నేమని చెప్పుచుందురు? మునీశ్వర నా కెఱిఁగింపవే దయన్. 4**

**ప్రతి :** ముని+ఈశ్వరా= మునులలో శ్రేష్ఠుడా!; ఏ మనుకాలము+అందున్= ఈ పదునాల్గురు మనువులలో ఏ మనువు కాలంలో; ఈశ్వరుఁడు= పరతత్త్వ రూపుడైన; హరి= ఆ విష్ణువు; ఏటికి సంభవించెన్= ఎందుకు జన్మించాడు?; ఏమి+ఏమి+ ఒనర్చెన్= ఏ యే పనులు చేశాడు?; ఆ+మనువులు+ఏరు= ఆ మనువులు ఎవ్వరు?; అతఁడు= ఆ హరి; ఏ క్రియన్+ చేయుచున్న వాఁడు= ఏ కార్యం చేస్తున్నాడు?; మీఁదన్= తరువాత; ఏమి నటించున్= ఏవిధంగా ప్రవర్తిస్తాడు?; గతము= గడిచిన చరిత్రలో; ఏ+అది= ఏం చేస్తుండేవాడు?; మున్ను= పూర్వయుగాలలో; సత్+జనులు+ఐనవారు= సత్పురుషులైన మహర్షులు; ఏమి+అని+చెప్పుచుందురు= ఆ హరిలీలల్ని ఏమని వివరించారు?; దయన్= కృపతో; నాకున్+ ఎఱిఁగింపవే= నాకు తెలుపుము.

**తా :** ఆ పరతత్త్వ రూపుడైన హరి ఏ మనువు కాలంలో జన్మించాడు? ఏయే పనులు చేశాడు? ఆ మనువులు ఎవ్వరు? ఆయన ఏ ఏ కార్యాలు ఎలా చేస్తున్నాడు? ముందు ఏమి చేయబోతాడు? మునుపు ఏమేం చేశాడు? సత్పురుషులైన మహర్షులు హరి వైభవ లీలల్ని గురించి ఏమి చెప్పారు? దయతో ఈ విషయాలన్నీ తెలుపవలసింది.

**విశే :** ఏవారు= ఎవ్వారు= ఎవ్వరు= ఎవరు; ఏ(వా)రు= ఏరు. తమిళం= యార్.

**వ. అనిన శుకుండిట్లనియె. 5**

**ప్రతి :** అనిన= అని ప్రశ్నించగా; శుకుండు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** అని పరీక్షిత్తు కోరగా శుకమహర్షి ఇలా సమాధానం చెప్పాడు.

**క. ఈ కల్పంబున మనువులు ప్రాకటముగ నార్వురైరి పదునలువురలో;**
**లోకముల జనుల పుట్టువు లాకథితము లయ్యె వరుస నఖిలములు నృపా! 6**

**ప్రతి :** నృపా= ఓరాజా!; ఈ కల్పంబునన్= ఈ శ్వేత వరాహకల్పంలో; పదునలువురలో= పదునాల్గురు మనువులలో; ప్రాకటముగా= ప్రకటంగా; ఆర్వురు= ఆరుగురు; మనువులు+ఐరి= మనువులు అయ్యారు (అంటే జీవించారని అర్థం); వరుసన్= మునుపు వరుసగా; లోకములన్= ఈ భువనాలలో; జనుల పుట్టువులు అఖిలములు= రాజుల, ఋషుల, దైవతాల మొదలైన జనుల యొక్క జన్మలు అన్నింటినీ; వరుసన్= క్రమంగా / వరుసగా; ఆకథితములు+అయ్యెన్= బాగా వివరింపబడ్డాయి.

**తా :** ఓ రాజా! ఈ శ్వేతవరాహ కల్పంలో పదునాల్గురు మనువులలో ఆరుగురు మనువులు జీవించారు. వారి వారి కాలాలలో లోకంలో జనులు ఎలా పుట్టారో వివరిస్తాను విను.

**వ. ప్రథమ మనువైన స్వాయంభువునకు, నాకూతి దేవహూతులను నిరువురు గూఁతులు గలరు. వారికిఁ గ్రమంబునఁ గపిలయజ్ఞ నామంబుల లోకంబులకు ధర్మజ్ఞాన బోధంబు సేయుకొఱకు హరి పుత్త్రత్వంబు నొందె; నందుఁ గపిలుని చరిత్రంబు మున్న చెప్పంబడియె; యజ్ఞుని చరిత్రంబు సెప్పెద వినుము. 7**

**ప్రతి :** ప్రథమ మనువు+ఐన= మొదటి మనువు అయినటువంటి; స్వాయంభువునకున్= స్వాయంభువ మనువుకు (అతని భార్య శతరూపతో); ఆకూతి దేవహూతులు+అను= ఆకూతి, దేవహూతి అన్న పేర్లు గల; ఇరువురు= ఇద్దరు; కూఁతులు= కూతుళ్ళు; కలరు= జన్మించారు; వారికిన్= ఆ ఇద్దరికీ; క్రమంబునన్= వరుసగా; కపిల= (ఆకూతికి) కపిలుడు; యజ్ఞనామంబులన్= దేవహూతికి యజ్ఞుడు అనే పేర్లతో; లోకంబులకున్= భువనాలకు; ధర్మజ్ఞాన బోధంబు+చేయుకొఱకున్= ధర్మాన్ని, జ్ఞానాన్ని బోధించటంకోసం; హరి= శ్రీమహావిష్ణువు తానే స్వయంగా; పుత్త్రత్వంబున్+ పొందెన్= కుమారునిగా పుట్టాడు; అందున్= ఆ ఇరువురిలో; కపిలుని చరిత్రంబు= కపిలుని చరిత్ర; మున్న చెప్పన్+పడియెన్= ముందే వివరించడమయింది; యజ్ఞుని చరిత్రంబు= యజ్ఞుని కథను; చెప్పెదన్= చెబుతాను; వినుము= రాజా! (శ్రద్ధగా) విను!

**తా :** మహారాజా! మొదటి మనువైన స్వాయంభువునికి ఇద్దరు కూతుళ్ళు పుట్టారు. ఆకూతి, దేవహూతి అని వారి పేర్లు. లోకంలో ధర్మప్రచారం చేయడానికి, జ్ఞానబోధ చేయడానికి శ్రీహరి స్వయంగా వారికి కుమారులుగా పుట్టాడు. ఆకూతికి కపిలునిగా, దేవహూతికి యజ్ఞుడుగా హరి తానే జన్మించాడు. ఈ ఇద్దరిలో కపిలుని వృత్తాంతం మునుపు చెప్పాను. యజ్ఞుని కథ ఇప్పుడు చెబుతాను. శ్రద్ధగా విను.

**మ. శతరూపాపతి కామభోగవిరతిన్ సంత్యక్తభూభారుఁడై**
**సతియుం దానును గాన కేఁగి శతవర్షంబుల్ సునందానదిన్**
**వ్రతియై యేకపదస్థుఁడై నియతుఁడై వాచంయమస్ఫూర్తితో**
**గతదోషుండు తపంబు సేసె భువనఖ్యాతంబుగా భూవరా! 8**

**ప్రతి :** భూవరా= ఓ పరీక్షిన్మహారాజా!; శతరూపాపతి= శతరూపకు భర్తయైన స్వాయంభువ మనువు; కామభోగ విరతిన్= కామభోగాలను అనుభవించాలన్న కాంక్ష లేమిచే; సంత్యక్త= వదలిపెట్టబడిన; భూ భారుఁడు+ఐ= రాజ్యభారం కలవాడై (రాజభోగం వదలి); సతియున్+తానును= తన భార్యతో కలిసి; కానకున్+ఏఁగి= అరణ్యానికి వెళ్ళి; సునందానదిన్= సునందా నదీతీరంలో; శతవర్షంబుల్= నూరు సంవత్సరాలు; వ్రతి+ఐ= దీక్ష కల్గినవాడై; ఏకపదస్థుఁడు+ ఐ= ఒక పాదం మీద నిలుచున్నవాడై; నియతుఁడు+ఐ= ఆహార విహార నియమాదులు కలిగినవాడై; వాచంయమస్ఫూర్తితో= వాఙ్నియమం కల్గినవాడై (మౌనియై); గతదోషుండు= దోషాలు లేనివాడై (పాపదూరుడై); భువనఖ్యాతంబుగాన్= (చాలాగొప్పగా) ప్రపంచ ప్రసిద్ధంగా; తపంబు+చేసెన్= తపస్సు చేశాడు.

**తా :** స్వాయంభువ మనువు పెద్దవాడై కామభోగాలపట్ల విరక్తుడై రాజ్యభారాన్ని వదలిపెట్టి తన భార్య శతరూపతో కలిసి సునందానదీ తీరంలో ఉన్న అడవికేగి ఘోరమైన తపస్సు చేశాడు. ఆ తపోదీక్షలో ఎన్నో నియమాలు పాటించాడు. ఒంటికాలి మీద నిలబడి, మౌనవ్రత దీక్ష పూని పాపప్రక్షాళన గావించుకొని వంద సంవత్సరాలు ఇలా గొప్ప తపస్సును సాగించాడు. ఈ తపస్సు విషయం ప్రపంచమంతటా తెలిసిపోయింది.

**వ. ఇట్లు తపంబు సేయుచు స్వాయంభువమనువు దన మనంబులోన. 9**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; తపంబు+చేయుచు= తపస్సు చేసుకుంటూ; స్వాయంభువ మనువు; తన మనంబులోనన్= తన మనస్సులో...

**తా :** ఈ విధంగా తపస్సు చేస్తూ స్వాయంభువ మనువు తన మనస్సులో

**సీ. సృష్టిచే నెవ్వఁడు చేతనపడకుండు? సృష్టి యెవ్వని చేఁతచే జనించు?**
**జగములు నిద్రింప జాగరూకత నొంది యెవ్వఁడు బ్రహ్మాండ మెఱుఁగుచుండు?**
**నాత్మకాధారంబు నఖిలంబు నెవ్వఁడౌ? నెవ్వని నిజధనంబింత వట్టు**
**బొడగాన రాకుండఁబొడగను? నెవ్వఁడే నెవ్వని దృష్టికి నెదురు లేదు?**

**ఆ. జననవృద్ధి విలయ సంగతిఁజెందక, యెవ్వఁడెడపకుండు నెల్లయెడల?**
**దన మహత్త్వసంజ్ఞఁదత్త్వ మెవ్వఁడు దాన, విశ్వరూపుఁడనఁగ విస్తరిల్లు? 10**

**ప్రతి :** ఎవ్వఁడు; సృష్టిచేన్= ఈ సృష్టిచేత; చేతనపడకుండున్= చైతన్యాన్ని పొందడో!; సృష్టి= ఈ సర్వసృష్టీ; ఎవ్వనిచేఁతచేన్= ఎవడియొక్క (క్రియ) వల్ల; జనించున్= పుడుతుందో!; ఎవ్వఁడు= ఎవడైతే; జగములు నిద్రింపన్= ప్రపంచాలన్నీ నిద్రిస్తున్నపుడు; జాగరూకతన్+ఒంది= మేల్కొని ఉండి; బ్రహ్మాండము= ఈ బ్రహ్మాండం మొత్తాన్ని; ఎఱుఁగుచుండున్= తెలుసుకుంటాడో; ఆత్మకున్+ ఆధారంబున్= ఆత్మకు ఆధారం; అఖిలంబున్= అంతా; ఎవ్వఁడు+ఔన్= ఎవడు తానవుతాడో; ఎవ్వని ధనంబు= ఎవ్వని సంపద (వైభవం); ఇంతవట్టు= కొంచెం కూడా; పొడగాన రాకుండన్= కనిపించకుండా; పొడగనున్= కనిపిస్తూ ఉంటుందో!; ఎవ్వఁడేని= అతడెవరో; ఎవ్వని+దృష్టికి= ఎవని చూపునకు; ఎదురులేదు= ప్రతిలేదో! (అతని చూపు దూరనిచోటు లే దన్న అర్థంలో); జనన= పుట్టుక; వృద్ధి= పెంపుదల; విలయ సంగతిన్+చెందక= నాశమనే దశలు పొందకుండా; ఎల్ల యెడలన్= అన్ని దిక్కులలోనూ; ఎవ్వడు+ఎడపకుండున్= ఎవడు ఉంటాడో (అంటే దర్శనమిస్తారో); తన= తనదైన; మహత్త్వసంజ్ఞన్= మహాద్భుతమనే పేరు వల్ల; తత్త్వము+ఎవ్వఁడు= తత్త్వం ఎవడో!; తాను+అ= అతడే స్వయంగా; విశ్వరూపుఁడు+అనఁగన్= విశ్వరూపుడనబడుతూ; విస్తరిల్లున్= వ్యాపిస్తాడో!...

**తా :** ఎవ్వడు ఈ పదార్థ సృష్టిచేత చైతన్యం పొందడో – ఎవని చేష్ట వల్ల ఈ పదార్థజగత్తు సర్వమూ చైతన్యం పొందుతున్నదో, పుడుతున్నదో, ఎవడైతే ఈ సర్వజగత్తూ నిద్రిస్తున్నపుడు తాను మేల్కొని ఉండి ఈ విశ్వం మొత్తాన్ని భావిస్తుంటాడో, తానుగా ఈ ఆత్మకు ఆధారం అవుతున్నాడో, ఎవని వైభవం కొంచెం కూడా కనిపించకుండా, అనుక్షణం కనిపిస్తూ ఉంటుందో, ఎవని చూపునకు ఎదురు లేదో, సృష్టి స్థితి లయము లనే దశలు ఎవ్వని ఉనికిని దాచజాలవో, మహత్త్వ సంజ్ఞ కల్గినందువల్ల ఎవని గురించి ప్రపంచమంతా తెలుసుకోవాలని కుతూహలపడుతుందో, ఎవడు తానే స్వయంగా విశ్వరూపు డనబడుతూ వ్యాపిస్తాడో – అనుకొంటూ

**వ. అని మఱియు నిరహంకృతుండును బుధుండును నిరాశియుఁబరిపూర్ణుండును ననన్య ప్రేరితుండును నృశిక్షాపరుండును నిజమార్గ సంస్థితుండును నిఖిలధర్మ భావనుండునునైన పరమేశ్వరునకు నమస్కరించెద నని యుపనిషదర్థంబులు పలుకుచున్న మనువుం గనుంగొని. 11**

**ప్రతి :** అని= ఈ విధంగా ఆలోచిస్తూ; మఱియున్= ఇంకా; నిరహంకృతుండును= అహంకారం లేనివాడు; బుధుండును= గొప్ప జ్ఞానం కల్గినవాడు; నిరాశియున్= ఆశ లేనివాడును; పరిపూర్ణుండును= 'సంపూర్ణుడు' ను; అనన్య ప్రేరితుండును= ఇతరుల చేత ప్రేరేపింపబడనివాడు; నృశిక్షాపరుండును= మానవులకు శిక్షణ ఇచ్చువాడు; నిజమార్గ= తనదైన స్వతంత్ర మార్గంలో; సంస్థితుండును= చక్కగా అమరి ఉన్నవాడును; నిఖిల ధర్మ భావనుండునున్+ఐన= సకల ధర్మ భావస్ఫూర్తి రూపమైన వాడును – అయినటువంటి; పరమేశ్వరునకున్= భగవంతునికి; నమస్కరించెదన్= నమస్కరిస్తాను; అని= అని ఈ విధంగా; ఉపనిషద్+అర్థంబులు= ఉపనిషత్తులు ప్రతిపాదించిన సారాన్ని; పలుకుచున్న= చెబుతున్న; మనువున్+ కనున్+కొని= మనువును చూచి.

**తా :** అహంకారం లేకుండా, సర్వజ్ఞానాన్ని ఆపోసనపట్టి, పదార్థశూన్యుడుగా, భావమాత్రుడుగా ఉంటూ సర్వపదార్థ రాశిగా భావించే సంపూర్ణుడైన వాడు, ఎవరి గమనం ఎవరి చేత కూడా ప్రేరేపించబడదో (అంటే స్వయం సిద్ధ గమన శైలి ఉన్నవాడని అర్థం), ఎవడు మానవులకు దండనీతిని ప్రసాదించాడో, ఎవని మార్గం అనితర సాధ్యమైనదో, సకల ధర్మ భావనాస్ఫూర్తి ఎవని ధర్మమో, ఆ పరతత్త్వానికి నమస్కరిస్తున్నాను – అని ఈ విధంగా ఉపనిషత్తుల సారాంశాన్ని వచిస్తున్న ఆ మనువును చూసి కరుణపొంది

**క. రక్కసులు దినఁగఁగడఁగిన వెక్కసముగ యజ్ఞనామవిష్ణుఁడు వారిం**
**జక్కడిచెఁజక్రధారల మిక్కుటముగ వేల్పులెల్ల మేలని పొగడన్. 12**

**ప్రతి :** రక్కసులు= రాక్షసులు; వెక్కసముగన్= అధికంగా; తినఁగన్+కడఁగినన్= ఆ మనువును తినడానికి యత్నించగా; వారిన్= ఆ రాక్షసులను; యజ్ఞనామ విష్ణుఁడు= యజ్ఞుడనే పేరుతో అవతరించిన శ్రీమహావిష్ణువు; చక్రధారలన్= సుదర్శనచక్ర ప్రయోగంచేత దాని అంచులతో; వేల్పులు+ఎల్లన్= దేవతలందరూ; మిక్కుటముగన్= అతిశయంగా; మేలు+అని= బాగుబాగని; పొగడన్= ప్రశంసిస్తుండగా; చక్కడిచెన్= వారి విజృంభణను అణగజేశాడు.

**తా :** సమాహితచిత్తుడై తపోనిష్ఠలో ఉన్న ఆ మనువుకు బాహ్యస్మృతి లేదు. అలాంటి పరిస్థితుల్లో రాక్షసులు ఆయన మీదకు ఉరికారు. నరమాంసభక్షణ రాక్షసుల స్వభావం. వీరిని చూచి ముందు చెప్పినట్లుగా విష్ణువు యజ్ఞుడనే పేరుతో అవతరించి ఉన్నాడు. కాబట్టి ఆ యజ్ఞుడు వారిని తన సుదర్శనచక్రధారలతో సంహరించాడు. దేవతలు ప్రశంసించారు.

**వ. ఇది ప్రథమమన్వంతరం; బింక ద్వితీయమన్వంతరంబు వినుము. 13**

**ప్రతి :** ఇది; ప్రథమ మన్వంతరంబు= మొదటి మనువు కాలం; ఇంకన్= తరువాత; ద్వితీయ= రెండవ; మన్వంతరంబు= మనువు కాలం; వినుము.

**తా :** ఇలా మొదటి మన్వంతరం పూర్తి అయింది. ఇక రెండో మన్వంతరం గురించి చెబుతాను విను.

**సీ. స్వారోచిషుండన సప్తార్చిబిడ్డఁడు మనువు, వానికి నా ద్యుమత్సుషేణ**
**రోచిష్మదాదు లారూఢపుత్త్రులు ధాత్రి నేలిరి; రోచనుఁడింద్రుఁడయ్యెఁ;**
**నధికులు తుషితాదు లమరు లూర్జస్తంభ ముఖ్యు లాధ్యులు సప్తమునులు నాఁడు**
**వేదశిరుండను విప్రుని దయితకుఁదుషితకుఁబుత్త్రుఁడై తోయజాక్షుఁ**

**ఆ. దవతరించెను విభుఁడన నశీత్యష్టసహస్రమునులు నధికు లయినవారు;**
**ఘను లనుగ్రహింపఁగౌమారక బ్రహ్మచారి యగుచు నతఁడు సలిపె వ్రతము. 14**

**ప్రతి :** సప్తార్చిబిడ్డఁడు= అగ్నికుమారుడు; స్వారోచిషుండు+అనన్= స్వారోచిషుడు అనే పేరుతో; మనువు= ఈ రెండవ మన్వంతరంలో మనువు అయ్యాడు; వానికిన్+ఆ= అతనికి (తరువాత చెప్పబోయే); ద్యుమత్+సుషేణ+రోచిష్మత్+ఆదులు= ద్యుమంతుడు, సుషేణుడు, రోచిష్మంతుడు మొదలైనవారు; ఆరూఢ పుత్త్రులు= ప్రఖ్యాతులైన కొడుకులు; ధాత్రినేలిరి= (వారు) ఈ భూమిని పరిపాలించారు; రోచనుఁడు= వారిలో రోచిష్మంతుడు; ఇంద్రుఁడు+అయ్యెన్= ఆ మన్వంతరానికి ఇంద్రుడయ్యాడు; అధికులు= మిక్కిలి ప్రభావం కల్గినవారైన; తుషిత+ఆదులు= తుషితుడు మొదలైనవారు; అమరులు= దేవతలయ్యారు; ఆఢ్యులు= పూజ్యులైన; ఊర్జస్తంభముఖ్యులు= ఊర్జస్తంభుడు మొదలైనవారు; నాఁడు= ఆ కాలంలో; సప్తమునులు= సప్త మహర్షులయ్యారు; వేదశిరుండు+అను విప్రుని= వేదశిరుడు అనే బ్రాహ్మణుని; దయితకున్= భార్య అయినటువంటి; తుషితకున్= తుషిత అనే పుణ్యస్త్రీకి; తోయజాక్షుఁడు= పద్మనేత్రుఁడైన శ్రీమహావిష్ణువు; విభుఁడు+అనన్= విభుడు అనే పేరుతో; పుత్రుఁడు+ఐ+అవతరించెను= కొడుకుగా పుట్టాడు; ఘనులు= గొప్పదీక్షాపరులు; అధికులు+ అయినవారు= ఉత్తమ మహర్షులయిన; అశీతి+అష్ట+సహస్రమునులు= ఎనభైఎనిమిదివేలమంది మహర్షులు; అనుగ్రహింపన్= తమ సన్నిధికి వచ్చి అనుగ్రహింపగా; అతఁడు= ఆ విభుడు; కౌమారక బ్రహ్మచారి= కుమారదశలో ఉన్న బ్రహ్మచారిగా (అవివాహితుడుగా); వ్రతము+సలిపెన్= గొప్ప దీర్ఘవ్రతాన్ని చేపట్టాడు.

**తా :** అగ్నిదేవుని కుమారుడు స్వారోచిషుడు. అతడే ఈ రెండవ మన్వంతరంలో మనువు. అతనికి ద్యుమంతుడు, సుషేణుడు, రోచిష్మంతుడు మొదలైన కుమారులు కలిగారు. వారిలో రోచనుడు ఆ మన్వంతరంలో ఇంద్రపదవి పొందాడు. మిక్కిలి ప్రభావం కల్గిన తుషితుడు మొదలైన వారు దేవతలయ్యారు. ఊర్జస్తంభుడు మొదలైనవారు సప్తమహర్షులయ్యారు. వేదశిరుడు అనే బ్రాహ్మణునికి తుషిత అనే భార్య ఉంది. వారికి విష్ణుడు 'విభుడు' అనే పేరుతో కుమారుడుగా జన్మించి బ్రహ్మచర్య వ్రతదీక్ష పొంది 'కౌమారక' దశలోనే 88 వేలమంది మహర్షులు తనకు సహాయకులుగా ఉండగా దీర్ఘవ్రతాన్ని నిర్వహించాడు.

**విశే :** ప్రతి అవతారంలోనూ దుష్టశిక్షణ అన్నది లేదు. ఉదాహరణకు ఈ అవతారంలో తానే దీక్ష వహించి దీర్ఘవ్రతం సాగించాడు విష్ణువు.

సప్తార్చి= ఏడు జ్వాలలు (నాలుకలు) కలవాడు. కాళీ, కరాళీ, మనోజవా, సులోహితా, సుధూమవర్ణా, స్ఫులింగినీ, విశ్వపదా అనేవి ఏడు జ్వాలలు. ఆ జ్వాలలను జిహ్వలుగా చెప్తారు.

**వ. తదనంతరంబ. 15**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత.

**తా :** ఆ తరువాత.

**సీ. మనువు మూఁడవవాఁడు మనుజేంద్ర! యుత్తముండనఁబ్రియవ్రతునకు నాత్మజుండు**
**పాలించె నిల యెల్లఁ బవన సృంజయ యజ్ఞహోత్రాదు లాతని పుత్త్రు లధిక**
**గుణులు వసిష్ఠుని కొడుకులు ప్రమథాదు లైరి; సప్తర్షులు నమరవిభుఁడు**
**సత్యజిత్తనువాఁడు సత్యభద్రాద్యులు సురలు ధర్మునికిని సూనృతకును**

**ఆ. బుట్టి సత్యనియతిఁబురుషోత్తముఁడు సత్యసేనుఁడనఁగ దుష్టశీలయుతుల**
**దనుజయక్షపతుల దండించె సత్యజిన్మిత్రుఁడనఁగ జగము మే లనంగ. 16**

**ప్రతి :** మనుజ+ఇంద్ర= ఓ రాజా!; మనువు మూఁడవ వాఁడు= మూడవ మనువు; ప్రియవ్రతునకున్= ప్రియవ్రతునికి; ఆత్మజుండు= పుత్రుడు; ఉత్తముండు+అనన్= ఉత్తముడనే పేరుతో; ఇల+ఎల్లన్= ఈ భూమినంతా; పాలించెన్= పరిపాలించాడు; ఆతనిపుత్రులు= అతని కుమారులు; పవన, సృంజయ, యజ్ఞహోత్రాదులు= పవనుడు, సృంజయుడు; యజ్ఞహోత్రుడు అనబడేవారు; వసిష్ఠుని కొడుకులు= వసిష్ఠ మహర్షి కుమారులు; అధికగుణులు= గొప్పతపోదీక్షితులైన వారు; ప్రమథాదులు= ప్రమథుడు మొదలైనవారు; సప్తర్షులు+అయిరి= సప్తమహర్షు లయ్యారు; సత్యజిత్తు+అనువాఁడు= సత్యజిత్తు అనే పేరుగలవాడు; అమరవిభుఁడు+అయ్యెన్= ఇంద్రుడయ్యాడు; సత్యభద్ర+ఆద్యులు= సత్యభద్రుడు మొదలైనవారు; సురలు= దేవతలు; ధర్మునికిని= ధర్ముడనే వానికి; సూనృతకును= సూనృత అనే స్త్రీకి; పుట్టి= కుమారుడుగా జన్మించి; పురుషోత్తముఁడు= శ్రీమహావిష్ణువు; సత్యనియతిన్= సత్యవ్రత దీక్షకల్గి; సత్యసేనుఁడనఁగన్= సత్యసేనుడనే పేరుకల్గిన వాడై; దుష్టశీలయుతులన్= దుష్టస్వభావులైన; దనుజ, యక్షపతులన్= రాక్షస, యక్ష నాయకులను; జగము మేలు+అనంగన్= ప్రపంచమంతా మెచ్చుకోగా; సత్యజిత్+మిత్రుఁడు+అనంగన్= సత్యజిత్తుకు మిత్రుడు అనే పేరు సార్థకం కాగా; దండించెన్= శిక్షించాడు.

**తా :** ఇక మూడో మనువు ప్రియవ్రతుని కుమారుడు ఉత్తముడు. అతని పాలనలో జగత్తు సుఖించింది. పవనుడు, సృంజయుడు, యజ్ఞహోత్రుడు మొదలైనవారు అతని కొడుకులు. వసిష్ఠ మహర్షి కొడుకులు ప్రమథుడు మొదలైనవారు సప్తర్షులయ్యారు. సత్యజిత్తు ఇంద్రుడయ్యాడు. సత్యభద్రుడు మొదలైనవారు దేవతలయ్యారు. ధర్ముడు – సూనృత అనే దంపతులకు శ్రీమహావిష్ణువు 'సత్యసేను' డనే పేరుతో కుమారుడుగా జన్మించాడు. దుష్ట స్వభావులైన యక్ష రక్షోగణాలను దండించి సత్యజిత్తు స్నేహితుడనే పేరు పొందాడు. లోకం సత్యసేనుని పరాక్రమాన్ని కీర్తించింది.

## ❖ గజేంద్ర మోక్షణ కథా ప్రారంభము ❖

**వ. చతుర్థమనువు కాలప్రసంగంబు వివరించెద. 17**

**ప్రతి :** చతుర్థ మనువు= నాల్గవ మనువుయొక్క; కాలప్రసంగంబు= కాలసంగతి; వివరించెదన్= వివరిస్తాను;

**తా :** నాల్గవ మనువు కాలంలో జరిగిన విశేషాలను చెబుతాను.

**సీ. మానవాధీశ్వర! మనువు నాలవవాఁడు తామసుండనఁగ నుత్తముని భ్రాత**
**పృథ్వీపతులు కేతువృషనరఖ్యాత్యాదు లతని పుత్త్రులు పద్గు రధికబలులు**
**సత్యకహరివీరసంజ్ఞులు వేల్పులు త్రిశిఖనామమువాఁడు దేవవిభుఁడు**
**మునులు జ్యోతిర్వ్యోమముఖ్యులు; హరి పుట్టె హరిమేధునకుఁబ్రీతి హరిణియందు;**

**ఆ. గ్రాహబద్ధుఁడయిన గజరాజు విడిపించి ప్రాణభయమువలనఁబాపి కాచె**
**హరి దయాసముద్రుఁ డఖిలలోకేశ్వరుఁ డనిన శుకునిఁజూచి యవనివిభుఁడు. 18**

**ప్రతి :** మానవ+అధీశ్వర= రాజా!; మనువు నాలవవాఁడు= నాల్గవ మనువు; ఉత్తముని భ్రాత= ఉత్తముని తమ్ముడు; తామసుండు+అనఁగన్= తామసుడు అని పేరు గలిగినవాడు; అతని పుత్త్రులు= అతని కొడుకులు; కేతు= కేతువు; వృష= వృషుడు; నర= నరుడు; ఖ్యాతి+ఆదులు= ఖ్యాతి మొదలైన పేర్లు గలవారు; పద్గురు= పదిమంది; పృథ్వీపతులు= రాజులు; అధికబలులు= మిక్కిలి బలవంతులు (అయ్యారు); సత్యక= సత్యకులు; హరి= హరులు; వీర= వీరులు; సంజ్ఞులు= అనే పేర్లు కలవారు; వేల్పులు= దేవతలు (అయ్యారు); త్రిశిఖ నామమువాఁడు= త్రిశిఖుడు అని పేరు గలిగిన వాడు; దేవవిభుఁడు= దేవేంద్రుడు (అయ్యాడు); జ్యోతిర్వ్యోమ ముఖ్యులు= జ్యోతిర్వ్యోముడు మొదలైనవారు; మునులు= సప్తమహర్షులు (అయ్యారు); హరిమేధునకున్= హరిమేధుడు అనే వాడికి; హరిణియందు= హరిణి అనే స్త్రీకి; ప్రీతిన్= మిక్కిలి ప్రేమతో (అనుగ్రహంతో); హరిపుట్టెన్= శ్రీ మహావిష్ణువే హరిగా జన్మించాడు (ఆ హరియే); గ్రాహబద్ధుడు+అయిన= మొసలికి చిక్కిన వాడగు; గజరాజున్= గజేంద్రుణ్ణి; విడిపించి= మొసలి పట్టునుండి విడిపించి; ప్రాణభయము వలనన్+పాపి= ప్రాణభయమునుండి కాపాడి; కాచెన్= రక్షించాడు; హరి= సర్వవ్యాపకుడైన ఆ పరమేశ్వరుడు (పరమాత్మ); దయా సముద్రుఁడు= దయాగుణం నిండినవాడు; అఖిల లోక+ఈశ్వరుఁడు= అఖిలలోకాలకూ ప్రభువు; అనినన్= అని చెప్పగా; అవనివిభుఁడు= ఆ రాజు (పరీక్షిత్తు); శుకునిన్+చూచి= శుకమహర్షిని చూచి...

**తా :** ఓ రాజా! ఉత్తముని తమ్ముడైన తామసుడు నాల్గవ మనువయ్యాడు. అతని కొడుకులైన కేతువు, వృషుడు, నరుడు, ఖ్యాతి మొదలైన పదిమంది మహావీరులు రాజులయ్యారు. సత్యకులు, హరులు, వీరులు మొదలైనవారు దేవతలయ్యారు. త్రిశిఖుడు దేవేంద్రుడయ్యాడు. జ్యోతిర్వ్యోముడు మొదలైనవారు సప్తమహర్షులయ్యారు. హరిమేధునికి, హరిణికి కుమారుడుగా శ్రీమహావిష్ణువు హరి అనే పేరుతో అవతరించాడు. ఆ హరియే మొసలికి చిక్కిన గజేంద్రుణ్ణి విడిపించి ప్రాణభయం పోగొట్టాడు. ఆ ప్రభువు సకలలోకాలకు అధిపతి. దయాసాగరుడాయన – అని శుకమహర్షి చెప్పగా పరీక్షిత్తు ఆ గజరాజు – మొసలి కథను వినగోరి

**క. నీరాటవనాటములకుఁబోరాటంబెట్లు గలిగెఁ? బురుషోత్తముచే**
**నారాట మెట్లు మానెను ఘోరాటవిలోని భద్రకుంజరమునకున్. 19**

**ప్రతి :** నీరాట= నీటిలో తిరిగే మొసలికి; వనాటములకున్= అడవిలో తిరిగే ఏనుగుకు (ఈ రెండింటికి); ఎట్లు= ఏ విధంగా; పోరాటంబు= యుద్ధం; కలిగెన్= జరిగింది?; పురుషోత్తముచేన్= శ్రీమహావిష్ణువు చేత; ఘోరాటవిలోని= ఆ ఘోరమైన అడవిలో ఉండిన; భద్రకుంజరమునకున్= శుభలక్షణ లక్షితమైన ఆ గజేంద్రునికి; ఆరాటము= సంకటం; ఎట్లు మానెను= ఏ విధంగా పోయింది.

**తా :** మొసలి నీటిలో తిరుగుతుంది. ఏనుగు అడవిలో తిరుగుతుంది. ఈ రెండూ ఒక దానిని మరొకటి సమీపించవు. అలాంటి వాటి నడుమ యుద్ధం ఎందుకు జరిగింది? ఏదీ ఒక మహత్తర కారణం లేకుండా వీటి మధ్య పోరు అసంభవం. ఈ పోరును పురుషోత్తముడైన హరి ఏ విధంగా తీర్చాడు? గజరాజు బాధ ఎలా తొలగింది? అందులోనూ ఆ అడవిలో ఆ ఏనుగును పురుషోత్తముడు తప్ప ఎవరు కాపాడగలరు.

**క. మునినాథ! యీ కథాస్థితి వినిపింపుము వినఁగ నాకు వేడుక పుట్టెన్;**
**వినియెదఁగర్ణేంద్రియముల పెనుఁబండువు సేయ మనముఁబ్రీతింబొందన్. 20**

**ప్రతి :** మునినాథ= ఓ మునీంద్రా!; ఈ కథాస్థితిన్= ఈ కథ జరిగిన తీరును; వినఁగన్= వినడానికి; నాకున్= నాకు; వేడుకపుట్టెన్= కుతూహలం కలిగింది; వినిపింపుము= దయతో వినిపించు (చెప్పు); కర్ణ+ఇంద్రియముల= చెవులనే ఇంద్రియాలకు; పెనుఁబండువు= పెద్ద పండుగ; చేయన్= చేయునట్లుగా; మనమున్= మనస్సు కూడా; ప్రీతిన్+పొందన్= సంతోషాన్ని పొందేలా; వినియెదన్= వింటాను.

**తా :** ఓ మునీంద్రా! ఈ కథ ఎలా జరిగిందో నాకు తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. దయతో వినిపించండి. ఆ కథలు నా చెవులకు పెద్ద పండుగ ఉండి మనసును కూడా ఆహ్లాదపరుస్తాయి.

**క. ఏ కథలయందుఁబుణ్యశ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే**
**నా కథలు పుణ్యకథలని యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్. 21**

**ప్రతి :** సూరిజనముచేన్= పుణ్యాత్ములైన పండితుల చేత; ఏ కథల+అందున్= ఏ కథలలో; పుణ్యశ్లోకుఁడు= పుణ్యాత్ములచేత కీర్తింపబడు; హరి= శ్రీమహావిష్ణువు; చెప్పఁబడును= వర్ణింపబడుతున్నాడో; ఆ కథలు= అలాంటి పురాణకథలు; పుణ్యకథలు+అని= పాపాన్ని పోగొట్టి పుణ్యాన్ని (ప్రసాదించే పవిత్ర కథలని); పెద్దలు= పండితులు; అతి హర్షమునన్= మిక్కిలి సంతోషంతో; ఆకర్ణింపుదురు= వింటారు.

**తా :** పుణ్యజీవులైన పండితులు ఏ కథలతో మోక్షప్రదాత అయిన శ్రీమహావిష్ణువును వర్ణిస్తారో, ఆ కథలు మోక్షానికి దారి చూపిస్తాయని పండితులు ఎంతో ఆనందంగా వింటారు.

**వ. ఇవ్విధంబునఁబ్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు బాదరాయణి నడిగెనని చెప్పి సభాసదులయిన మునుల నవలోకించి సూతుండు పరమహర్ష సమేతుండై చెప్పె; నట్లు శుకుండు రాజున కిట్లనియె. 22**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ప్రాయోపవిష్టుండు+ఐ= ప్రాయోపవేశ దీక్షలో ఉన్న; పరీక్షిత్+నరేంద్రుండు= పరీక్షిన్మహారాజు!; బాదరాయణిన్= శుక మహర్షిని; అడిగెను+అనిచెప్పి= అడిగాడని చెప్పి; సూతుండు= సూతమహర్షి; సభాసదులు+అయిన మునులన్= సభలో ఉన్న మహర్షులను; అవలోకించి= చూచి; పరమహర్ష సమేతుండు+ఐ= మిక్కిలి సంతోషంతో; చెప్పెన్= చెప్పారు; అట్లు= ఆ విధంగా; శుకుండు= శుకమహర్షి; రాజునకున్= పరీక్షిత్తుకు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** ఇలా ప్రాయోపవేశంలో ఉన్న పరీక్షిత్తు శుకమహర్షిని అడిగాడని సూతుడు సభలో ఉన్నవారికి చెప్పాడు. శుకుడు పరీక్షిత్తుకు గజేంద్రమోక్ష గాథను వినిపించడం ప్రారంభించాడు.

**సీ. రాజేంద్ర! విను సుధారాశిలో నొక పర్వతము త్రికూటంబనఁదనరుచుండు**
**యోజనాయుతమగు నున్నతత్వంబును నంతియ వెడలుపు నతిశయిల్లుఁ;**
**గాంచనాయస్సారకలధౌతమయములై మూఁడు శృంగంబులు మొనసియుండుఁ;**
**దటశృంగబహురత్నధాతుచిత్రితములై దిశలు భూనభములుఁదేజరిల్లు;**

**తే. భూరిభూజలతాకుంజపుంజములును, మ్రోసి పఱతెంచు సెలయేటి మొత్తములును**
**మఱఁగి తిరిగెడు దివ్యవిమానములును, జఱులఁగ్రీడించు కిన్నరచయముఁగలిగి. 23**

**ప్రతి :** రాజ+ఇంద్ర= ఓ పరీక్షిన్మహారాజ!; విను= ఈ కథా ప్రారంభం విను; సుధారాశిలోన్= అమృత సముద్రంలో; త్రికూటంబు+అనన్= త్రికూటమనే పేరున్న; ఒక పర్వతము= ఒక కొండ; తనరుచుండున్= ప్రసిద్ధంగా ఉంది; యోజన+అయుతమగున్= పదివేల ఆమడల; ఉన్నతత్వంబునున్= పొడవును (ఎత్తును); అంతి+అ= అంతే; వెడలుపున్= వెడల్పును; అతిశయిల్లున్= కల్గి ప్రకాశిస్తూ ఉంటుంది (దానికి); కాంచన= బంగారు; అయస్+సార= ఇనుము; కలధౌతమయములు+ఐ= వెండి లోహములతో కూడిన; మూఁడు శృంగంబులు= మూడు శిఖరాలు; మొనసియుండున్= ఎత్తుగా పెరిగి ఉన్నాయి; తట= ఆ కొండచరియలపైనను; శృంగ= శిఖరాలలోనను ఉన్న; బహురత్న= రకరకాల రత్నాల వల్లనూ; ధాతుచిత్రితములు+ఐ= గైరికాది ధాతువుల చేతనూ రంగురంగులుగా ప్రకాశిస్తూ; దిశలు= అన్ని దిక్కులు; భూ+నభములున్= భూమీ, ఆకాశం; తేజరిల్లున్= ప్రకాశిస్తూ ఉంటాయి; భూరిభూజలతా కుంజపుంజములు= పెద్దవైన చెట్లు, తీగలు, పొదల గుంపులు; మ్రోసి= మిక్కిలిగా ధ్వనిచేస్తూ; పఱతెంచు= ప్రవహించేటటువంటి; సెలయేటి మొత్తములును= సెలయేళ్ళ వరుసలు; మరఁగి= అలవాటు చేసుకొని; తిరిగెడు= తిరిగేటటువంటి; దివ్యవిమానములును= దేవతల విమానాలు; చఱులన్= ఆ కొండచరియలలో; క్రీడించు= విహారం చేస్తున్న; కిన్నరచయమున్= కిన్నర సమూహాలు; కలిగి= కల్గి (ప్రకాశిస్తూ ఉంటుందని అర్థం)...

**తా :** ఓ రాజా! క్షీరసాగరంలో త్రికూటమనే అందమైన పర్వతం విరాజిల్లుతూ ఉంది. అది పదివేల ఆమడల పొడవు, అంతే వెడల్పు కల్గి ఉంటుంది. దానికి బంగారు, వెండి, ఇనుములతో ఏర్పడిన మూడు ఎత్తైన శిఖరాలున్నాయి. ఆ కొండ చరియలలో, శిఖరాల్లో ఉండే రత్నాలవల్ల, గైరికాది ధాతువులవల్ల అన్ని దిక్కులు, భూమి, ఆకాశం చిత్రమైన రంగురంగులుగా ప్రకాశిస్తూ ఉంటాయి. ఆ కొండలో పెద్దపెద్ద చెట్లు, తీగలు, పొదలు, మోగుతూ పారే సెలయేరులు, అలవాటుగా తిరుగాడే దేవతల విమానాలు కనిపిస్తాయి. ఆ కొండ చరియలలో కిన్నరులు విహారాలు చేస్తుంటారు.

**వ. అది మఱియును మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాత కామ్రాతక సరళ పనస బదరీ వకుళ వంజుల వట కుటజ కుంద కురవక కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సిందువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీ మధూక తాల తక్కోల తమాల హింతాల రసాల సాల ప్రియాళు బిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశు పాశోక పలాశ నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మల్లికామతల్లికా ప్రముఖ నిరంతర వసంతసమయ సౌభాగ్య సంపదంకురిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత లలిత విటప విటపి వీరున్నివహాలంకృతంబును, మణివాలుకానేక విమల పులినతరంగిణీ సంగత విచిత్ర విద్రుమలతా మహోద్యాన శుక పిక నికర నిశిత సమంచిత చంచూపుట నిర్దళిత శాఖిశాఖాంతర పరిపక్వ ఫలరంధ్రప్రవర్షిత రసప్రవాహ బహుళంబును, గనకమయ సలిల కాసార కాంచన కుముద కహ్లార కమల పరిమళ మిళిత కబళాహార సంతతాంగీకార భార పరిశ్రాంత కాంతా సమాలింగిత కుమార మత్త మధుకర విటసముదయ సమీపసంచార సముదంచిత శకుంత కలహంస కారండవ జలకుక్కుట చక్రవాక బక బలాక కోయష్టిక ముఖర జలవిహంగ విసర వివిధ కోలాహల బధిరీభూత భూ నభోఽంతరాళంబును, దుహినకరకాంత మరకత కమలరాగ వజ్రవైదూర్య నీల గోమేధిక పుష్యరాగ మనోహర కనక కలధౌత మయానేక శిఖరతట దరీవిహరమాణ విద్యాధర విబుధ సిద్ధ చారణ గరుడ గంధర్వ కిన్నర కింపురుష మిథున సంతత సరససల్లాప సంగీత ప్రసంగ మంగళాయతనంబును గంధగజ గవయ గండభేరుండ ఖడ్గ కంఠీరవ శరభ**

**శార్దూల శశ చమర శల్య భల్ల సారంగ సాలావృక వరాహ మహిష మర్కట మహోరగ మార్జాలాది నిఖిల మృగనాథ సమూహ సమర సన్నాహ సంరంభ సంచకిత శరణాగత శమన కింకరంబునై యొప్పు నప్పర్వత సమీపంబునందు. 24**

**ప్రతి :** అది= ఆ త్రికూట పర్వతం; మఱియును= ఇంకా; మాతులుంగ= మాదీఫలం, లవంగ= లవంగం; లుంగ= పుల్ల మాదీఫలం; చూత= మామిడి; కేతకీ= మొగలి; భల్లాతక= జీడి; ఆమ్రాతక= అంబాళం; సరళ= తెల్ల తెగడ; పనస= పనస; బదరీ= రేగు; వకుళ= పొగడ; వంజుల= పుబ్బ; వట= మర్రి; కుటజ= కొండమల్లె; కుంద= మొల్ల; కురవక= ఎర్ర గోరంట; కురంటక= తుమ్మ; కోవిదార= కోవిదారం; ఖర్జూర= ఖర్జూరం; నారికేళ= నారికేళం (కొబ్బరి); సిందువార= వావిలి; చందన= చందనం; పిచుమంద= వేము; మందార= మందారం; జంబూ= నేరేడు; జంబీర= నిమ్మ; మాధవీ= పూలగురివెంద; మధూక= ఇప్ప; తాల= తాడి; తక్కోల= తక్కోలం; తమాల= కానుగ; హింతాల= గిరకతాడి; రసాల= తీయమామిడి; సాల= మద్ది; ప్రియాళు= మోరటి; బిల్వ= మారేడు; ఆమలక= ఉసిరిక (నెల్లి); క్రముక= పోక (వక్క); కదంబ= కడిమి; కరవీర= గన్నేరు; కదళీ= అరటి; కపిత్థ= వెలగ; కాంచన= ఉమ్మెత్త; కందరాళ= కలజువ్వి; శిరీష= దిరిసెన; శింశుప= ఇరుగుడు; అశోక= అశోకం; పలాశ= మోదుగు; నాగ= పొన్న; పున్నాగ= సురపొన్న; చంపక= సంపెంగ; శతపత్ర= తామర; మరువక= మరువం; మల్లికామతల్లికా= శ్రేష్ఠమైన మల్లె; ప్రముఖ= మొదలైన (వాటితో); నిరంతర= ఎల్లప్పుడూ; వసంతసమయ= వసంత ఋతువు యొక్క; సౌభాగ్య= గరిమచేత; సంపత్+అంకురిత= సమృద్ధంగా మొలకెత్తుతున్న; పల్లవిత= చిగుర్లు వేస్తున్న; కోరకిత= మొగ్గ తొడుగుతున్న; కుసుమిత= వికసించిన; ఫలిత= పండిన; లలిత= సుకుమారములైన; విటప= కొమ్మలతోనిండిన; విటపి= చెట్లతో; వీరుద్+నివహ+అలంకృతంబును= పొదల సముదాయాలతో కూడి ప్రకాశిస్తున్నవీ; మణివాలుకా= ముత్యాల చిప్పలతో కూడిన అనేకములైన ఇసుక తిన్నెలతో కూడిన; అనేక= ఎన్నో; విమల= పవిత్రమైన; పులినతరంగిణీ= నదీ తీరములలో, సంగత= కూడిన; విచిత్ర విద్రుమలతా మహోద్యాన= చిత్ర విచిత్రములైన చెట్లతో, తీగలతో కూడిన గొప్పఉద్యానవనాలతో కూడి; శుక= చిలుకలు; పిక= కోయిలలు; నికర= సమూహములు; నిశిత= వాడియైన; చంచూపుట= ముక్కుపుటములతో; సమంచిత= కూడి (వాటిచేత); నిర్దళిత= చీల్చబడిన; శాఖిశాఖాంతర= చెట్లకొమ్మలతో (రెమ్మలతో); పరిపక్వ= పండిన; ఫలరంధ్ర= పండ్ల రంధ్రాలనుండి; ప్రవర్షిత= ధారగా పడుతున్న; రసప్రవాహ బహుళంబును= ఫల రసాల ధారలు మిక్కుటంగా కల్గినవీ; కనకమయ= బంగారు వన్నెగల; సలిల= నీటితో కూడిన; కాసార= సరస్సులతో కూడి; (వాటిలో); కాంచన= బంగారు కాంతి గల్గిన; కుముద= తెల్ల కలువలు; కహ్లార= ఎర్ర కలువలు; కమల= తామరలు (వ్యాపింపచేస్తున్న); పరిమళ= సువాసనలతో; మిళిత= కూడిన; కబళ+ఆహార= గ్రాసంగా మకరందమనే ఆసవాన్ని; సంతత+అంగీకార= నిరంతరం త్రాగుతూ ఉండటం వల్ల; భార= మదభారంచేత; పరిశ్రాంత= అలసిన; కాంతా సమాలింగిత= ఆడు తుమ్మెదలచే కౌగిలింపబడిన; కుమార= వయస్సులో ఉన్న; మత్త= మదించిన; మధుకర విటసముదయ= మగ తుమ్మెదలనే విటుల సమూహంయొక్క; సమీప= సమీపాననే; సంచార సముదంచిత= అందంగా తిరుగుతూ ఉండే; శకుంత= భాసపక్షులూ; కలహంస= కలహంసలు; కారండవ= కారండవ పక్షులు; జలకుక్కుట= నీటికోళ్ళు; చక్రవాక= (చక్రవాక) జక్కవ పక్షులు; బక= కొంగలు; బలాక= కొక్కెరలు; కోయష్టిక= చీకు కొక్కెరలు; ముఖర= రొదచేసే; జలవిహంగ= జలంలో విహరించే పక్షులు; విసర= వ్యాపింపజేసే; వివిధ కోలాహల= రకరకాల శబ్దాల గగ్గోలుచేత; బధిరీభూత= చెవుడు పడేలా అవుతున్న; భూ+నభస్+అంతరాళంబును= భూమి, ఆకాశాల నడుమ ఉండే ప్రదేశం (కల్గినది); తుహినకరకాంత= మంచు కిరణాలు కల్గిన చంద్రుని పేరిటి – చంద్ర

కాంతమణులు; మరకత= పచ్చలు; కమలరాగ= కెంపులు; వజ్ర= వజ్రాలు; వైదూర్య= వైడూర్యాలు; నీల= నీలాలు; గోమేధిక= గోమేధికాలు; పుష్యరాగ= పుష్యరాగాలు; మనోహర= మనోహరంగా నిండివున్నాయి; కనక= బంగారు; కలధౌత= వెండి – వీటితో; మయ= నిండిన; అనేక= లెక్కకు మిక్కిలి; శిఖర= గోపురాలు (కొండకొనలు) (వాటియొక్క); దరీ= గుహలలో; విహరమాణ= విహరిస్తున్న; విద్యాధర= విద్యాధరులు; విబుధ= దేవతలు; సిద్ధ= సిద్ధులు; చారణ= చారణులు; గరుడ= గరుడులు; గంధర్వ= గంధర్వులు; కిన్నర= కిన్నరులు; కింపురుష= కింపురుషులు; మిథున= దంపతులతో; సంగీత ప్రసంగ= సంగీతం పాడుతూ ఉండటం చేత; మంగళాయతనంబును= శుభప్రదంగా ఉండేదియు; గంధగజ= మదించిన ఏనుగులు; గవయ= గురుపోతులు; గండభేరుండ= గండభేరుండాలు; ఖడ్గ= ఖడ్గమృగాలు; కంఠీరవ= సింహాలు; శరభ= శరభ మృగాలు; శార్దూల= పులులు; శశ= కుందేళ్ళు; చమర= చమరీ మృగాలు; శల్య= ముళ్ళపందులు; భల్ల= ఎలుగుబంట్లు; సారంగ= జింకలు; సాలావృక= తోడేళ్ళు; వరాహ= అడవి పందులు; మహిష= అడవి దున్నలు; మర్కట= కోతులు; మహా+ఉరగ= పెద్దపెద్ద సర్పాలు; మార్జాల+ఆది= అడవి పిల్లులు మొదలైన; నిఖిల= చాలా రకాలైన; మృగనాథ= మృగపతుల; సమూహ= గుంపులయొక్క; సమర సన్నాహ సంరంభ= పోరాటాలతో కూడిన ఉద్రిక్త వాతావరణంచేత; సంచకిత= భయపడిన; శరణాగత= శరణు జొచ్చేటటువంటి; శమన కింకరంబును+ఐ= యమభటుల సమూహం కల్గినదియు; అయి; ఒప్పు= ప్రకాశించు; ఆ పర్వత సమీపంబునందు= ఆ పర్వత సమీపంలో...

**తా :** ఆ త్రికూట పర్వతం నిండా మాదీఫలం, లవంగం, పుల్ల మాదీఫలం, మామిడి, మొగలి, జీడి, అంబాళం, తెల్ల తెగడ, పనస, రేగు, పొగడ, పుబ్బ, మర్రి, కొండమల్లె, మొల్ల, ఎర్ర గోరంట; తుమ్మ, కోవిదారం, ఖర్జూరం, కొబ్బెర, వావిలి, చందనం, వేము, మందారం, నేరేడు, నిమ్మ, పూలగురివెంద, ఇప్ప, తాడి, తక్కోలం, కానుగ, గిరకతాడి, రసాలం, మద్ది, మోరటి, మారేడు, ఉసిరిక, పోక, కడిమి, గన్నేరు, అరటి, వెలగ, ఉమ్మెత్త, కలజువ్వి, దిరిసెన, ఇరుగుడు, అశోకం, మోదుగు, పొన్న, సురపొన్న, సంపెంగ, తామెర, మరువం, మంచిమల్లె మొదలైనవి ఉండేవి. నిరంతరం వసంత ఋతువు అక్కడ కొలువు తీరినట్టుగా కొమ్మలు రెమ్మలు చిగుళ్ళతో, మొలకలతో, పూలతో, పండ్లతో అద్భుతంగా కనిపిస్తుండేది. ఆ తోటలలో ముత్యాల చిప్పలతో కూడిన ఇసుకతిన్నెలు కుప్పలుతెప్పలుగా ఉండేవి.

ఆ చెట్ల కొమ్మలమీద చిలుకలు, కోయిలలు గుమిగూడి వాడియైన తమ ముక్కుపుటాలతో పండిన పండ్లను పొడుస్తుండగా, ఆ పండ్ల రంధ్రాలనుండి నిరంతరం ధారగా పళ్ళరసం కాలువలుగా పారుతూ కనిపించేది.

ఆ కొలనులోని నీళ్ళు బంగారు వన్నెతో మిరుమిట్లు గొలుపుతూ ఉండేవి. ఆ నీటిలో బంగారు కాంతి గల తెల్లకలువలు, ఎర్రకలువలు, తామరలు విస్తరించి ఉండేవి. సువాసనను గుబాళిస్తున్న ఆ పూలలోని మకరందాన్ని తనివితీరా నిరంతరం తాగుతూ మదించిన గండు తుమ్మెదలు తమ ప్రియురాండ్రతో విహరిస్తూ కనిపించేవి. వాటి పక్కనే శకుంత పక్షులు, కలహంసలు, కారండవ పక్షులు, నీటికోళ్ళు, చక్రవాకాలు, కొంగలు, కొక్కెరలు, చీకుకొక్కెరలు అందంగా తిరుగాడుతూ కనిపించేవి. ఆ పక్షులు చేసే ధ్వనులు భూమికి ఆకాశానికి మధ్యగల ప్రాంతాన్ని చెవుడు పడేలా చేసేది. ఆ కొండలో చంద్రకాంతమణులు, మరకతాలు, వజ్రాలు, వైదూర్యాలు, నీలాలు, గోమేధికాలు, పుష్యరాగాలు మిక్కిలి మనోహరంగా నిండి ఉండేవి. బంగారు, వెండి శిఖరాలున్న ఆ కొండ చరియల్లో విద్యాధరులు, దేవతలు, సిద్ధులు, చారణులు, గరుడులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు తమతమ ప్రియురాండ్లతో కలిసి జంటలు జంటలుగా క్రీడిస్తూ ఉండేవారు. వారు సరస సంభాషణలు చేస్తూ, చాలా అందంగా పాడుతూ ఉండగా ఆ ప్రాంతమంతా మంగళప్రదంగా ప్రకాశిస్తూ ఉండేది. ఆ కొండలో మదపుటేనుగులు, గురుపోతులు, గండభేరుండాలు, ఖడ్గమృగాలు, సింహాలు, శరభాలు,

పులులు, కుందేళ్ళు, చమరీమృగాలు, ముండ్లపందులు, కోతులు, పెద్దపెద్ద పాములు, అడవి పిల్లులు తిరుగుతుండేవి. ఆ పోరాటాల సంరంభాన్ని చూసి యమభటులు కూడా భయపడి 'శరణు' వేడుతూ ఉండేవారు.

**విశే :** ఈ పర్వతంలోని వృక్షాలు, జంతువులు, పక్షులు, పుష్ప ఫలాల వర్ణన దాదాపు అంతా మూలభాగవతంలో ఉన్నదే. అదనంగా ఒక అంశం మూలంలో ఉంది.

**తస్య ద్రోణ్యాం భగవతో వరుణస్య మహాత్మనః**
**ఉద్యానమృతుమన్నామ ఆక్రీడం సురయోషితామ్ ॥**

ఆ కొండ లోయలో వరుణదేవుని ఉద్యానవనముంది. ఋతుమత్ – అని దానిపేరు. సర్వ ఋతువుల లక్షణాలు నిరంతరంగా కనిపించే దివ్య ఉద్యానవనమది. అందులో దేవతాస్త్రీలు విహరిస్తారని మూలం వివరిస్తోంది.

పురాణాలలోని ప్రకృతి వర్ణన ఈనాటి మనకు చాలా వివరాల్ని అందిస్తుంది. చాలా చెట్లపేర్లు, పూలపేర్లు, జంతుపక్షుల పేర్లు ఈనాడు మనకు పరిచయంలేని కారణంగా ఒకప్పటి ప్రకృతి వైవిధ్యం (బయో – డైవర్సిటి) ఎంత విస్తారమైనదో ఈ వర్ణనద్వారా మనం అర్థం చేసుకోవచ్చు.

**క. భిల్లీ భిల్ల లులాయక, భల్లుక ఫణి ఖడ్గ గవయ వలిముఖ చమరీ**
**ఝిల్లీహరిశరభకకిటి, మల్లాద్భుతకాకఘూకమయమగు నడవిన్. 25**

**ప్రతి :** భిల్లీ= చెంచెతలు; భిల్ల= చెంచులు; లులాయక= అడవి దున్నలు; భల్లుక= ఎలుగుబంట్లు; ఫణి= పాములు; ఖడ్గ= ఖడ్గమృగాలు; గవయ= గురుపోతులు; వలిముఖ= గంద్రంగులు; చమరీ= చమరీ మృగాలు; ఝిల్లీ= పావురాలు; హరి= కోతులు; శరభక= శరభ మృగాలు; కిటి= అడవి పందులు; మల్ల= వీరిలో శ్రేష్ఠములతో; అద్భుత= అబ్బురమైన; కాక= కాకులు; ఘూక= గుడ్లగూబలు; మయము+అగు= వీటితో నిండిన; అడవిన్= ఆ అడవిలో.

**తా :** ఆ త్రికూట పర్వత సమీపంలోని అడవిలో చెంచెతలు, చెంచులు, తిరుగుతూ ఉండేవారు. క్రూరమృగాలయిన అడవి దున్నలు, ఎలుగుబంట్లు, పాములు, ఖడ్గమృగాలు, గురుపోతులు, గంద్రంగులు, చమరీమృగాలు, పావురాలు, అడవికోతులు, శరభమృగాలు, అడవిపందులు మొదలైనవి కొట్లాడుతుండగా ఎక్కడ చూసినా కాకులు, గుడ్లగూబలు సంచరిస్తూ ఉండేవి. అలాంటిది ఆ అడవి.

**విశే :** మూలంలో ఉద్యానవనంలాగా కనిపించే 'వరుణ' వనాన్ని తరువాతి కథతో అన్వయం బాగా కుదరడానికి ఈ అడవిని పోతనగారు స్వకపోలవర్ణనగా పెంచారు.

**శా. అన్యాలోకనభీకరంబులు జితాశానేకపానీకముల్**
**వన్యేభంబులు గొన్ని మత్తతనులై వ్రజ్యావిహారాగతో**
**దన్యత్వంబున భూరిభూధరదరీద్వారంబులందుండి సౌ**
**జన్యక్రీడల నీరుగాలివడి కాసారావగాహార్థమై. 26**

**ప్రతి :** కొన్ని వన్య+ఇభంబులు= అడవి ఏనుగులు కొన్ని; మత్తతనులు+ఐ= మదించిన దేహాలు కల్గినవై; అన్య+ఆలోకన= ఇతర మృగాలకు కన్నెత్తి చూడటానికి కూడా; భీకరంబులు= భయంకరమైనవి; జిత+ఆశా+అనేకప+అనీకముల్= ఈ

అడవి ఏనుగులు దిగ్గజాలను సైతం మించిపోగల పరాక్రమం కల్గినవి (అవి వీటిముందు ఓడిపోతాయని అర్థం); భూరి= పెద్దవయిన; భూధరదరీ= కొండ గుహలో; ద్వారంబులందుండి= ద్వారాలనుండి (ఆ గుహలలోనుండి); ప్రవ్యావిహార+ఆగత+ ఉదన్యత్వంబునన్= సరదాగా తిరగటంచేత దప్పికగొని; సౌజన్య క్రీడలన్= సరదాగా చెర్లాటలు ఆడుకోవటం వల్ల అలసిపోయి; నీరుగాలివడి= దప్పిక కావడం వల్ల; చల్లటిగాలి కావాల్సిరావటం వల్ల నీటిగాలి వచ్చేవైపుగా; కాసార= నీటి మడుగులలో; అవగాహార్థము+ఐ= మునగాలన్న కోరికతో (బయలుదేరాయి).

**తా :** ఆ అడవిలో కొన్ని ఏనుగులు మదించిన తమ దేహాలతో అన్య మృగాలకు కన్నెత్తి చూడ శక్యంగాని విధంగా ఉంటాయి. భయంకరమైన తమ పరాక్రమంలో దిగ్గజాలను కూడా మించిపోతాయి. అలాంటి ఆ ఏనుగుల గుంపు ఒకటి అలా సరదాగా చెర్లాటలు ఆడుకుంటూ తిరగాలని బయలుదేరి, తిరిగి తిరిగి, ఆడి ఆడి, అలసిపోయి దప్పిక చేత నీటిమడుగుల్లో దిగుదామన్న కోరికతో నీటిగాలి వచ్చేవైపు నడక సాగించాయి.

**ఆ. అంధకార మెల్ల నద్రిగుహాంతర వీథులందుఁబగలు వెఱచి డాఁగి**
**యెదరు వేచి సంధ్య నినుఁడు వృద్ధత నున్న వెడలె ననఁగ గుహలు వెడలెఁగరులు. 27**

**ప్రతి :** కరులు= ఆ ఏనుగులు; పగలు= పగటిపూట; అంధకారము+ఎల్లన్= చీకటి అంతా; అద్రి గుహా+అంతర వీథులందు+అ= కొండ గుహలలోనే; వెఱచి= భయంతో; డాఁగి= దాగుకొని ఉండి; ఎదరు వేచి= సమయం కోసం కాచుకొని ఉండి; సంధ్యన్= సాయంకాల సమయంలో; ఇనుఁడు= సూర్యుడు; వృద్ధతన్+ఉన్నన్= (శక్తి) సన్నగిల్లి ఉండగా; వెడలెన్+అనఁగన్= బయలుదేరాయా అన్నట్టు; గుహలు+వెడలెన్= గుహలలోనుండి బయటపడ్డాయి.

**తా :** ఆ అడవి ఏనుగులు ఎంత నల్లగా ఉన్నాయంటే పగటిపూటంతా సూర్యుని వెలుతురుకు భయపడి కొండగుహల్లో దాక్కొని ఉండి సాయంకాలం కాగానే సూర్యుని వెలుతురు శక్తి సన్నగిల్లిన సమయం చూసుకొని చీకట్లు గుహల్లో నుండి బయటికి వచ్చాయా అన్నట్టుగా ఉంది.

**విశే :** ఒకవైపు అడవి ఏనుగులు నల్లటి కాంతిని వివరిస్తూ ఈ పద్యం, మనోహరమైన ఉపమానంతో సూర్యుడు 'వృద్ధుడు' కావటమనే పలుకుబడిని పరిచయం చేస్తోంది. ఉదయాన సూర్యుడు బాలుడు, మధ్యాహ్నసమయంలో యువకుడు, సాయంకాలాన వృద్ధుడు. శత్రువు బలహీనపడటం చూచి వాడి శత్రువు విజృంభిస్తాడు. అది ఈ పద్యంలోని లోకనీతి. కవితాచమత్కృతి.

**క. తలఁగవు కొండలకైనను, మలఁగవు సింగములకైన, మార్కొను కడిమిం;**
**గలఁగవు పిడుగులకైనను, నిల బలసంపన్న వృత్తి నేనుఁగుగున్నల్. 28**

**ప్రతి :** ఏనుగుగున్నల్= గున్న ఏనుగులు; ఇలన్= భూమిమీద; బలసంపన్న వృత్తి= బలసంపదచేత; కొండలకైనను= కొండలకైనా; తలఁగవు= భయపడి పక్కకు పోవు; మార్కొను కడిమిన్= ఎదుర్కొనే పరాక్రమంతో; సింగములకున్+ఐనన్= సింహములను చూచి కూడా; మలఁగవు= వెనక్కి తిరగవు; పిడుగులకు+ఐనను= పిడుగులు పడినా; కలఁగవు= భయపడవు.

**తా :** పెద్ద ఏనుగులే కావు – గున్నఏనుగులు కూడా పరాక్రమంలో పెద్ద వాటికి ఏమీ తీసిపోవు. వాటి బలసంపత్తి అలాంటిది. కొండలను చూసి కూడా పక్కకు పోవు. ఢీకొంటాయి. సింహాలను చూచి కూడా వెనక్కి తిరగవు. ఎదిరిస్తాయి. పిడుగులు పడినా భయపడవు. లెక్క చేయకుండా ముందుకు సాగిపోతాయి.

**సీ. పులుల మొత్తంబులు పొదరిండ్లలోఁదూఱు ఘోరభల్లూకముల్ గుహలు సొచ్చు;**
**భూదారములు నేల బొఱియలలో డాఁగు; హరిదంతముల కేఁగు హరిణచయము;**
**మడువుల జొరఁబాఱు మహిషసంఘంబులు; గండశైలంబులఁ గపులు ప్రాఁకు;**
**వల్మీకములు సొచ్చు వనభుజంగంబులు; నీలకంఠంబులు నింగి కెగయు;**

**తే. వెఱచి చమరీమృగంబులు విసరు వాల, చామరంబుల విహరణశ్రమము వాయ**
**భయదపరిహేల విహరించు భద్రకరుల, గాలివాటినమాత్రన జాలిఁబొంది. 29**

**ప్రతి :** భయద= భయాన్ని పుట్టించే; పరిహేలన్= లీలతో; విహరించు= విహరిస్తూ ఉన్న; భద్రకరుల= ఆ మదపుటేనుగుల; గాలి+పాటిన మాత్రన= గాలి సోకినంత మాత్రంచేత; జాలిన్+పొంది= భయపడి; పులుల మొత్తంబులు= పులుల సమూహాలు; పొదరిండ్లలోన్+తూఱున్= పొదరిండ్లలోకి దూర్తాయి; ఘోరభల్లూకముల్= భయంకరమైన ఎలుగుబంట్లు; గుహలు+చొచ్చున్= గుహలలోకి జొరబడతాయి; భూదారములు= అడవి పందులు; నేల బొఱియలలోన్ డాఁగున్= నేలలోని గోతులలో దాక్కుంటాయి; హరిణచయము= జింకల సముదాయం; హరిత్+అంతములకున్+ఏగున్= దిగంతాలకు పరిగెత్తుతాయి; మహిష సంఘంబులు= అడవి దున్నలగుంపు; మడువులన్+చొరన్+పాఱున్= నీటి మడుగులలోకి జొరబడతాయి; కపులు= కోతులు; గండశైలంబులన్+ప్రాఁకున్= కొండలలో బండలమీదికి ప్రాకిపోతాయి; వనభుజంగంబులు= అడవిలోని పాములు; వల్మీకములు+చొచ్చున్= పుట్టలలోకి వెళ్ళిపోతాయి; నీలకంఠంబులు= నెమలులు; నింగికిన్+ఎగయున్= ఆకాశంలోకి ఎగుర్తాయి; చమరీమృగంబులు= చమరీమృగాలు (సవరపు మెకములు); వెఱచి= మిక్కిలి భయపడి; వాలచామరంబులన్= తమతోక లనే విసనకర్రలతో; విహరణశ్రమము+పాయన్= ఆ గజరాజుల వనవిహార శ్రమపోయేలా; విసరున్= విసరుతాయి.

**తా :** ఆ అడవి ఏనుగులు అతిభయంకరంగా విహరించడం ప్రారంభించగానే వాటి ధాటికి భయపడి పులులన్నీ పొదరిండ్లలోకి దూర్తాయి. ఎలుగుబంట్లు గుహల్లోకి చొరబడతాయి. అడవి పందులు గోతుల్లోకి చేరిపోతాయి. జింకలు దిక్కుల కొసలకు పరుగెత్తుతాయి. అడవి దున్నలు నీటిమడుగుల్లో దాక్కుంటాయి. కోతులు కొండల పైని బండల మీదికి ఎగబాకుతాయి. పాములు పుట్టల్లోకి ఒదిగిపోతాయి. నెమళ్ళు ఆకాశంలోకి ఎగిరిపోతాయి. చమరీమృగాలు తమ కుచ్చుతోకలతో ఆ ఏనుగుల అలసట పోయేలా విసరుతాయి.

**క. మదగజదానామోదము గదలని తమకములఁద్రావి కడుపులు నిండన్**
**బొదలుచుఁదుమ్మెదకొదమల కదుపులు ఝుంఝుమ్మటంచు గానముసేసెన్. 30**

**ప్రతి :** తుమ్మెద కొదమల కదుపులు= పడుచు తుమ్మెదల సమూహాలు; మదగజ+దాన+ఆమోదమున్= ఆ మదగజాల నుండి జాలువారే మదజల సుగంధాన్ని; కదలని= ఎడతెగని; తమకములన్= మిక్కిలి ఆసక్తితో; కడుపులు+నిండన్= కడుపులు నిండేలా; త్రావి= త్రాగి; పొదలుచున్= సంతోషంతో తిరుగుతూ; ఝం+ఝం+అటంచున్= ఝుంకార ధ్వనితో; గానము+చేసెన్= పాటలు పాడాయి.

**తా :** ఆ మదగజాల నుండి జాలువారుతున్న చెమట సుగంధపరిమళ భరితమైనది. వాటిని త్రాగటం, తుమ్మెదలకు చాలా ఇష్టమైన పని. పడుచు తుమ్మెదల గుంపులు ఆ మదజలాన్ని తనివితీరా మిక్కిలి ఆసక్తితో కడుపుల నిండా తాగి సంతోషంతో తిరుగుతూ ఝుంఝుమ్మని పాటలు పాడుతున్నాయి.

**విశే :** తుమ్మెదలు ఏనుగుల శరీరం నుండి స్రవించే మదజలాన్ని ఆశించి చేరుతాయి అన్నది ప్రసిద్ధమైన విషయమే. ఇది కేవలం కవి సమయమే కాదు. అడవిజీవితం తెలిసినవారికి బాగా పరిచయం ఉంటుంది.

'ఝుంఝుం' – అన్నది తెలుగువారి మాట. 'ఝుంకార' మని సంస్కృతంలో అంటారు.

**క. తేఁటి యొకటి యొరు ప్రియకును మాటికి మాటికిని నాగమదజలగంధం**
**బేటి? కని, తన్నుఁబొందెడి బోటికి నందిచ్చు నిండు బోటుఁదనమునన్. 31**

**ప్రతి :** తేఁటి+ఒకటి= ఒక గండుతుమ్మెద; ఒరు ప్రియకును= మరొకని ఆడ తుమ్మెదకు; మాటికిమాటికిని= మరలమరల; ఏటికిన్+అని= అందివ్వడం ఎందుకని; నిండు పోటుతనమునన్= నిండైన మగటిమితో; తన్ను బొందెఁ= తనను పొందే; బోటికి= ఆడు తుమ్మెదకు; నాగమదజలగంధంబు= ఏనుగుల మదజల సువాసనను; అందిచ్చున్= అందించింది.

**తా :** ఒక గండు తుమ్మెద తన ప్రియురాలైన ఆడ తుమ్మెదకు మాటిమాటికి గజ మదజల సుగంధాన్ని ఎందుకు ఇవ్వాలని ఆలోచించి తనను సమీపించిన ఆడు తుమ్మెదకు నిండు మగతనాన్నంతా ఆ మదజలగంధం అందించింది.

**విశే :** ఆడు తుమ్మెదలు మగ తుమ్మెదల వద్దనున్న గజమదజలంలోని సువాసన చేత ఆకర్షింపబడుతున్నాయని ఇందులోని విశేషం. జంతు పరిశోధనల్లో కూడా ఈ అంశంమీద ప్రస్తావన ఉంది. మహాకవులు తమ దివ్య దర్శనంతో ఇలాంటి శాస్త్రీయరహస్యాన్ని తమ కావ్యాల్లో దాచిపెట్టారు.

నిండుబోటుఁతనము – వంటివి అందమైనప పద బంధాలు. 'మగఁటిమి' – అన్న మాటకు వివరణ ఇది. పోటు మగడు – వంటి మాటల్లో ఈ అర్థాన్ని చూడవచ్చు.

**క. అంగీకృతరంగన్మాతంగీ మదగంధ మగుచుఁదద్దయు వేడ్కన్**
**సంగీతవిశేషంబుల భృంగీగణ మొప్పె ప్రానుపెట్టెడి మాడ్కిన్. 32**

**ప్రతి :** భృంగీగణము= ఆడ తుమ్మెదల సమూహం; అంగీకృత= అంగీకరింపబడిన (ఆస్వాదించిన); రంగత్+మాతంగీ+మద గంధము+అగుచున్= పొంగుతున్న ఆడుమదగజాల జలగంధము కల్గినదై; తద్దయున్+వేడ్కన్= మిక్కిలి వేడుకతో; ప్రానుపెట్టెడి మాడ్కిన్= ప్రాన్పడిన తీరుగా (కదలిక లేకుండా); సంగీత విశేషంబులన్= సంగీతధ్వని విశేషాలతో (రకరకాల ధ్వనులు చేస్తూ); ఒప్పెన్= ఒప్పింది.

**తా :** మదగజాల నుండి స్రవించే జలధారల సుగంధాలను ఎంతో ఇష్టంగా ఆస్వాదిస్తూ ఆడ తుమ్మెదల గుంపులు ఆ మత్తులో కదలిక లేకుండా స్తబ్దమై పోయాయి. కాని ఝుంకారాన్ని వదలకుండా తిరగసాగాయి.

**క. వల్లభలు పాటి మునుపడ వల్లభ మని ముసరి రేని వారణదానం**
**బొల్లక మధుకరవల్లభు లుల్లంబులఁబొందిరెల్ల యుల్లాసంబుల్. 33**

**ప్రతి :** వల్లభలు= ఆడ తుమ్మెదలు; మునుపడన్+పాటి= ముందు ముందుగా ఆత్రపడి పారిపోయి; వల్లభము+అని= మిక్కిలి ప్రియమైనది అని; ముసరిరి+ఏని= ఆ ఏనుగుల మదజలానికి ఆకర్షింపబడి ముసురుకొన్నచో; మధుకరవల్లభులు= మగ తుమ్మెదలు; వారణదానంబు+ఒల్లక= ఆ ఏనుగుల మదజలాన్ని ఇష్టపడక; ఉల్లంబులన్= హృదయాలలో; ఎల్లన్= అన్నీ; ఉల్లాసంబుల్= ఉల్లాసాన్ని; పొందిరి= పొందాయి.

**తా :** ఆడుతుమ్మెదలు ఏనుగుల మదజలం ప్రియమైనదని భావించి దానిపై గుంపుగాపోయి ముసరగా, మగ తుమ్మెదలు మదజలంపై అపేక్ష వీడి ఆడుతుమ్మెదలతో ఎల్ల ఉల్లాసాలు పొందాయి.

**వ. అప్పుడు. 34**

**తా :** ఆ సమయంలో (ఆ ఏనుగుల గుంపులు ఎలా విజృంభించాయో తరువాతి పద్యంలో కవి వర్ణిస్తున్నాడు).

**మ. కలభంబుల్ సెరలాడుఁబల్వలము లాఘ్రాణించి మట్టాడుచున్**
**ఫలభూజంబుల రాయుచుంజివురుజొంపంబుల్ వడిన్ మేయుచుం**
**బులులంగాఱెనుపోతులన్ మృగములంబోనీక శిక్షించుచుం**
**గొలఁకుల్ సొచ్చి కలంచుచున్ గిరులపై గొబ్బిళ్లు గోరాడుచున్. 35**

**ప్రతి :** కలభంబుల్= గున్నఏనుగులు; పల్వలములు= నీటిగుంటలు; ఆఘ్రాణించి= వాసన చూసి; మట్టాడుచున్= తొక్కుతూ; (ఇంకా) ఫల భూజంబులన్= పండ్లతో కూడిన చెట్లను; రాయుచున్= రాచుకుంటూ; చివురు జొంపంబుల్= చివురు గుంపులను; వడిన్+మేయుచున్= గబగబా తింటూ; పులులన్= పులులను; కాఱు+ఎనుపోతులన్= నల్ల దున్నపోతులను; మృగములన్= జింకలను; పోనీక= తప్పించుకొని పోకుండా; శిక్షించుచున్= దండిస్తూ; కొలఁకుల్+చొచ్చి= నీటి మడుగుల్లోకి దూరి; కలంచుచున్= కలచివేస్తూ (కలగుండు పెడుతూ); గిరులపైనన్= కొండలమీద; గొబ్బిళ్ళు= వినోద క్రీడల్ని; కోరాడుచున్= ఆడుతూ; చెరలాడున్= చెర్లాడుతున్నాయి.

**తా :** ఇక గున్న ఏనుగులు కూడా విజృంభించసాగాయి. నీటిగుంటలను వాసన చూస్తూ తొక్కుతూ, పండ్లతో కూడిన చెట్లను రాచుకుంటూ, చిగుళ్ళను గబగబాతింటూ, పులుల్ని, ఎనుబోతుల్ని, జింకల్ని, అటూఇటూ పోనీక నిలువరిస్తూ, నీటిమడుగుల్లోకి చొరబడి నీటిని కలగుండు పెడుతూ; కొండలపైన గుండ్రంగా తిరుగుతూ వినోదిస్తూ చెర్లాడుతున్నాయి.

**క. తొండంబుల మదజలవృత గండంబులఁ గుంభములను ఘట్టన సేయం**
**గొండలు దలక్రిందై పడు, బెండుపడున్ దిశలు, చూచి బెగడున్ జగముల్. 36**

**ప్రతి :** తొండంబులన్= ఆ మద గజాలు తమ తొండాలతో; మదజలవృత గండంబులన్= మదజలం నిండిన చెక్కిళ్ళతో; కుంభములను= కుంభస్థలాలను; ఘట్టన+చేయన్= ఢీ కొనగా; కొండలు= కొండలుకూడా; తలక్రిందై పడున్= తలకిందులవుతున్నాయి; దిశలు= దిక్కులు; బెండుపడున్= బద్దలవుతున్నాయి; జగముల్= లోకాలు; చూచి= దీన్నిచూసి; బెగడున్= భయపడుతున్నాయి.

**తా :** ఆ మదగజాలు తమ తొండాలతో, మదజలం నిండిన తమ చెక్కిళ్ళతో, కుంభస్థలాలతో కొండల్ని ఢీ కొట్టేవి. ఆ ఘట్టనంతో కొండలు తలకిందులై పడేవి. దిక్కులు ఆ శబ్దానికి బద్దలైపోయేవి. దీన్ని చూసి అన్నిలోకాలూ గడగడలాడేవి.

**క. ఎక్కడఁజూచిన లెక్కకు నెక్కువయై యడవి నడచు నిభయూథములో**
**నొక్క కరినాథుఁ డెడతెగి చిక్కె నొక కరేణుకోటి సేవింపంగన్. 37**

**ప్రతి :** ఎక్కడన్+చూచినన్= ఎక్కడ చూచినా; లెక్కకున్+ఎక్కువ+ఐ= లెక్కకు మిక్కుటంగా; అడవిన్= అడవిలో; నడచున్= తిరుగాడుతున్న; ఇభయూథములోన్= ఏనుగుల గుంపులో; ఒక్క కరినాథుడు= ఒక గజేంద్రుడు (ఆడ ఏనుగుల గుంపుకు

అధిపతి); కరేణుకోటి= కొన్ని ఆడ ఏనుగులు; సేవింపంగన్= అతనిని సేవిస్తూ వెంటవస్తుండగా; ఎడతెగి= దారితప్పి; చిక్కెన్= వెనుకపడ్డాడు (ఒంటరి వా డయ్యాడు).

**తా :** అలా ఎక్కడ పడితే అక్కడ తిరుగాడుతున్న ఏనుగుల సమూహంలో ఒక్క గజేంద్రుడు కొన్ని ఆడ ఏనుగులు తన వెంట సేవిస్తూ వస్తుండగా దారితప్పి వెనుకబడి ఒంటరివాడయ్యాడు.

**వ. ఇట్లు వెనుక ముందట నుభయ పార్శ్వంబులcదృషార్దితంబులై యరుగుదెంచు నేనుంగు గములం గానక తెఱంగు దప్పి తొలంగుడుపడి యీశ్వరాయత్తంబైన చిత్తంబు సంవిత్తంబు గాకుండుటంజేసి తానును దన కరేణుసముదయంబును నొక్క తెరువై పోవుచు. 38**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వెనుకన్+ముందటన్= ముందు వెనుకల; ఉభయపార్శ్వంబులన్= ఇరువైపులా (అన్నివైపులా అని అర్థం); తృషా+ఆర్దితంబులు+ఐ= దప్పికతో పీడింపబడి; అరుగుదెంచు ఏనుంగు గములన్= వస్తున్న ఏనుగుల గుంపులను; కానక= చూడక; తెఱంగు+తప్పి= దారితప్పి; తొలంగుడుపడి= పక్కదారిపట్టి; ఈశ్వరాయత్తంబు+ఐన= దైవాధీనమైన; చిత్తంబు= చిత్తం; సంవిత్తంబు+కాకుండుటన్+చేసి= తెలివిడిలో లేని కారణంగా; తానును= తానూ; తన కరేణు సముదయంబును= తన ఆడ ఏనుగుల గుంపూ; ఒక్క తెరువు+ఐ= వేరేదారి గుండా; పోవుచున్= వెళ్తూ...

**తా :** ఆ గజరాజు తనకు అన్నివైపులా (ముందు, వెనుక, ఇరుపక్కలా) దప్పికతో అలిసి పోయి వస్తున్న ఏనుగుల గుంపును పట్టించుకోకుండా, భగవంతుని సంకల్పంచేత తెలివికోల్పోయి, ఆ గుంపునుండి వేరుపడి, దారి తప్పిపోయాడు. తాను, తన ఆడ ఏనుగుల గుంపుతో మరోదారిలో ముందుకు సాగిపోయాడు.

**సీ. పల్వలంబుల లేcతపచ్చిక మచ్చికcజెలుల కందిచ్చు నచ్చికము లేక;**
**ఇవురుజొంపములcగ్రొవ్వెలయు పూcగొమ్మలcబ్రాణవల్లభలకుcబాలువెట్టు,**
**ఘనదానశీతలకర్ణతాళంబుల దయితల చెమటార్చుcదనువు లరసి;**
**మృదువుగాcగొమ్ముల మెల్లన గళములు నివురుచుcబ్రేమతో నెఱపు వలపు;**

**తే. పిఱుcదుచక్కట్ల దగ్గఱి ప్రేమతోడ, డాసి మూర్కొని దివికిcదొండంబు సాcచు**
**వెద వివేకించుcగ్రీడించు విశ్రమించు, మత్తమాతంగమల్లంబు మహిమతోడ; 39**

**ప్రతి :** మత్తమాతంగ మల్లంబు= మదించిన గజయోధుడు; పల్వలంబులన్= నీటిగుంటల పక్కన; లేcతపచ్చికన్= లేత పచ్చికను; చెలులకున్= తన ప్రియురాండ్లకు (ఆడ ఏనుగులకు); మచ్చికన్= ప్రేమతో; అచ్చికము లేక= కొరతలేకుండా, దండిగా; అందిచ్చు= అందిస్తోంది; ఇవురుజొంపములన్= చిగుళ్ళ గుత్తులను; క్రొవ్వు+ఎలయు= సారవంతమైన; పూcగొమ్మలన్= అధికంగా పూసిన పూగొమ్మలను; ప్రాణవల్లభలకున్= ఇష్టసఖులకు; పాలు+పెట్టున్= పంచిపెడుతోంది; ఘనదానశీతల= గొప్పదైన మదజలంతో చల్లబడిన; కర్ణతాళంబులన్= విసనకర్రల వంటి తన చెవులతో; దయితల= ప్రియురాండ్ల (ఆడ ఏనుగుల); తనువులు+అరసి= దేహాలను సమీపించి; చెమట+ఆర్చున్= చెమటలు పోగొడుతోంది; మృదువుగాన్= మెత్తగా; కొమ్ములన్= తన దంతాలతో; మెల్లన= మెల్లగా; గళములు నివురుచున్= వాటి మెడలను గోకుతూ; ప్రేమతోన్= మిక్కిలి అనురాగంతో; వలపు నెఱపున్= ప్రేమను చూపుతుంది; పిఱుcదు చక్కట్లన్= వెనుక వైపు;

డగ్గఱి= దగ్గరికి పోయి; ప్రేమతోడన్= ప్రేమతో; డాసి= సమీపించి; మూర్కొని= వాసనచూసి; వెద= ఎదను (ఋతుసమయాన్ని); వివేకించున్= గుర్తిస్తుంది; దివికిన్= ఆకాశంలోకి; తొండంబున్= తన తొండాన్ని; చాఁచున్= చాస్తుంది (పైకెత్తుతుంది); క్రీడించున్= వాటితో ఆడుతుంది; విశ్రమించున్= విశ్రమిస్తుంది (ఇలా వాటితో క్రీడిస్తోంది అని అర్థం).

**తా :** బల్లిదుడైన ఆ గజరాజు తన ప్రియురాండ్రకు నీటిగుంటల పక్కన ఉంటే లేత పచ్చికను మచ్చికతో అందిస్తోంది. చిగుళ్ళ గుత్తులను, పూలకొమ్మలను కోసి అందరికీ పంచిపెడుతోంది. మదజలంతో తడిసిన విసనకర్రల వంటి తన చెవులతో వాటి చెమటల్ని పోగొడుతోంది. తన దంతాలతో వాటి మెడలను గోకుచూ భార్యల వెనుకవైపు చేరి మూచూచి, ఋతుసమయాన్ని గుర్తిస్తూ, క్రీడిస్తూ, తొండాన్ని ఆకాశంలోకి చాస్తూ, విశ్రమిస్తూ విలాసంగా ఆడుకొంటున్నది.

**సీ. తన కుంభముల పూర్ణతకు డిగ్గి యువతుల కుచములు పయ్యెదకొంగు లీఁగఁ**
**దన యానగంభీరతకుఁజాల కబలల యానంబు లందెల నండగొనఁగఁ**
**దన కరశ్రీఁగని తలఁగి బాలల చిఱు దొడలు మేఖలదీప్తిఁదోడు పిలువఁ**
**దన దంతరుచికోడి తరుణుల నగవులు ముఖచంద్రదీప్తుల ముసుఁగు దిగువఁ**

**తే. దనదు లావణ్యరూపంబుఁదలఁచి చూడ, నంజనాభ్రము కపిలాదిహరిదిభేంద్ర**
**దయిత లందఱుఁదనవెంటఁదగిలి నడువఁ, గుంభివిభుఁడొప్పె నొప్పులకుప్పవోలె. 40**

**ప్రతి :** తన కుంభముల – తన కుంభాలయొక్క; పూర్ణతకు= నిండుదనానికి; డిగ్గి= తగ్గి (సమానం కాకపోవటం వల్ల); యువతుల= స్త్రీల యొక్క; కుచములు= తమ కుచాలు (స్తనాలు); పయ్యెదకొంగులు+ఈఁగన్= పైటకొంగుల మాటున ప్రవేశించాయి; తన యానగంభీరతకున్= తన నడకలోని గాంభీర్యానికి; చాలక= సరిపోక; అబలల యానంబులు= స్త్రీల నడకలు; అందెలన్+అండ+కొనఁగన్= అందెల సహాయాన్ని ఆశ్రయించగా; తన కరశ్రీన్+కని= తన తొండముయొక్క బలిమిని చూసి; తలఁగి= తగ్గి; బాలల చిఱు తొడలు= స్త్రీల సన్నని తొడలు; మేఖలదీప్తిన్= ఒడ్డాణాల డాబుసరిని; తోడుపిలువన్= తోడుగా పిలుచుకోగా; (తెచ్చుకున్నాయి); తన దంత రుచికిన్+ఓడి= తన దంతాల తెల్లదనానికి ఓడిపోయి; తరుణుల నగవులు= స్త్రీల నవ్వులు; ముఖచంద్ర దీప్తులన్= ముఖచంద్రుని కాంతుల యొక్క; ముసుగున్+తిగువన్= ముసుగును వేసుకోగా; తనదు లావణ్య రూపంబున్+తలఁచి+చూడన్= తన మనోహరమైన శరీరాన్ని మనసారా చూడగోరి; అంజనాభ్రము కపిలాది హరి దిభేంద్రదయితలు+అందఱున్= అంజన, అభ్రమువు, కపిల మొదలైన దిగ్గజాల భార్యలందరూ; తన వెంటన్= తన వెంట; తగిలి నడువన్= ప్రేమతో నడిచి రాగా; కుంభివిభుఁడు= ఆ గజేంద్రుడు; ఒప్పులకుప్ప+పోలెన్= ఒప్పుల కుప్పలాగా (అందగాడుగా); ఒప్పెన్= ప్రకాశించాడు.

**తా :** ఆ గజరాజు యొక్క కుంభస్థలాల నిండుదనాన్ని చూసి ఓడిపోయిన స్త్రీల స్తనాలు పైటకొంగుచాటున చేరాయి. అతని నడకలు ఠీవికి సరిపోక స్త్రీల నడకలు అందెలను ఆశ్రయించాయి. అతని తొండం యొక్క శోభని చూసి స్త్రీల చిన్న తొడలు ఒడ్డాణాల డాబుసరిని తోడు తెచ్చుకున్నాయి. ఆ గజరాజు దంతాల తెల్లదనానికి సరిపోవటం లేదని స్త్రీల దంతాల ముఖమనే చంద్రుని కాంతిని ముసుగుగా వేసుకున్నాయి. అతడి మనోహరమైన శరీరాన్ని మనసారా చూడగోరి అంజన, అభ్రమువు, కపిల మొదలైన దిగ్గజాల భార్యలందరూ తనవెంట మనసుపడిరాగా అందాల సొగసుగాడు ప్రకాశించాడు.

**విశే :** దిగ్గజాలు ఎనిమిది – 1) ఐరావతం 2) పుండరీకం 3) వామనం 4) కుముదం 5) అంజనం 6) పుష్పదంతం 7) సార్వభౌమం 8) సుప్రతీకం. వారి భార్యల పేర్లు 1) అభ్రమువు 2) కపిల 3) పింగళ 4) అనుపమ 5) తామ్రపర్ణి 6) శుభ్రదంతి 7) అంగన 8) అంజనావతి.

**వ. మఱియు నానాగహన విహరణ మహిమతో మదగజేంద్రంబు మార్గంబుఁదప్పి పిపాసా పరాయత్త చిత్తంబున మత్తకరేణువుల మొత్తంబునుం దానునుం జని చని. 41**

**ప్రతి :** మఱియున్= ఇంకా; మద గజేంద్రంబు= మదించిన ఆ గజరాజు; నానాగహన= పెక్కు అడవులలో; విహరణ= విహరించిన; మహిమతో= గరిమతో (గొప్పతనంతో); మార్గంబున్+తప్పి= దారితప్పి; పిపాసా పరాయత్త చిత్తంబునన్= దప్పికకు మిక్కిలి లోబడిన మనస్సుతో; మత్తకరేణువుల మొత్తంబునున్= ఆడ ఏనుగుల సమూహంతోపాటు; తానునున్+చని+చని= తాను కూడా వెళ్ళి, వెళ్ళి...

**తా :** ఇంకా ఆ గజరాజు ఎన్నో అడవులలో ఇలా విహరించి విహరించి ఆ మత్తులో పడి దారితప్పి దప్పికతో అతని మనస్సు స్వాధీనం తప్పి పోగా; ఆడ ఏనుగులతో పాటు తాను కూడా ఎటుబడితే అటు నీటి ఆదరువు కోసం చూస్తూ ప్రయాణం సాగించాడు.

**మ. అటఁగాంచెం గరిణీవిభుండు నవపుల్లాంభోజకల్హారమున్**
**నటదిందిందిరవారముం గమఠమీనగ్రాహదుర్వారమున్**
**వటహింతాలరసాలసాలసుమనోవల్లీకుటీతీరముం**
**జటులోద్ధూతమరాళచక్రబకసంచారంబుఁగాసారమున్. 42**

**ప్రతి :** కరిణీవిభుండు= ఆ గజరాజు (ఆడ ఏనుగుల భర్త); అటన్= ఆ సమీపంలో; నవపుల్ల+అంభోజకల్హారమున్= అప్పుడే విచ్చుకున్న తామరలు, కలువలు ఉన్నటువంటిదీ; నటత్+ఇందిందిర+వారమున్= ఆడుతున్న తుమ్మెదల సముదాయం కల్గినదీ; కమఠ= తాబేలు; మీన= చేప; గ్రాహ= మొసలి మొదలైన క్రూర జంతువులచే; దుర్వారమున్= మిక్కిలిగా నీటి అలజడితో భయంకరంగా ఉన్నదీ; వట= మఱ్ఱి; హింతాల= తాడి; రసాల= మామిడి; సాల= మద్ది; సుమనస్+వల్లీకుటీ తీరమున్= పూలతీగలు, పొదరింఢ్లు కల్గిన ఒడ్డుతో కూడినదీ; చటుల+ఉద్ధూత= మిక్కిలిగా ఎగరగొట్టబడుతున్న; మరాళ= హంస; చక్ర= చక్రవాకం; బక= కొంగ మొదలైన జలపక్షుల; సంచారంబున్= సంచారం కలదీ; ఐన; కాసారమున్= మడుగును; కాంచెన్= చూశాడు.

**తా :** గజరాజు ఆ సమీపంలోనే ఒక నీటిమడుగు చూశాడు. అందులో అప్పుడే విచ్చుకున్న తామరలు – కలువలు ఉన్నాయి. వాటిలో తుమ్మెదలు ఆడుతున్నాయి. తాబేళ్ళు, చేపలు, మొసళ్ళు భయంకరంగా నీటిని ఎగజిమ్ముతూ తిరుగుతున్నాయి. హంసలు, కొంగలు, చక్రవాకాలు అందులో బాగా తిరుగుతున్నాయి. ఆ మడుగు గట్టున మఱ్ఱి, తాడి, మామిడి, మద్ది చెట్లతోపాటు పూలతీగలు, పొదరింఢ్లు ఉన్నాయి. అలాంటి మనోహరమైన సరస్సును చూశాడు.

**విశే :** సాధారణంగా కమలాలు వికసించే సమయంలో కలువలు ముడుచుకొంటాయి. అందుకే కమలాలకు మిత్రునిగా సూర్యుని, కలువల మిత్రుడుగా చంద్రుని చెబుతారు.

ఇక్కడ పోతనగారు అప్పుడు విచ్చుకొంటున్న కమలాలు, కలువలు – రెండూ ఆ సరస్సులో ఉన్నాయని చెబుతున్నారు. అది క్షీరసాగరంలోని త్రికూటపర్వత సానువుల్లోని అడవిలో ఒక మడుగు. కాబట్టి ఈ విశేషవర్ణన ఆ దివ్యభూమికి సంబంధించినదే.

గజ లక్షణం ఏమిటంటే చెట్లు, పూల తీగలు, పొదరిండ్లు – వీటిని చూడగానే రెచ్చిపోవటం. అందుకే దప్పికతోపాటు తమ విహారానికి అనుకూలంగా ఉన్న ఆ మడుగును గజరాజు చూసి అదే తమకు తగిన చోటని భావించాడు. అందుకే ఈ వర్ణన.

**వ. ఇట్లనన్యపురుషసంచారంబై నిష్కళంకంబైన యప్పంకజాకరంబుఁబొడగని. 43**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అనన్యపురుష సంచారంబు+ఐ= ఇతర మానవ సంచారంలేని; నిష్కళకంబు+ఐన= నిర్మలంగా ఉన్న; ఆ+పంకజ+ఆకరంబున్+పొడగని= ఆ పద్మసరోవరాన్ని చూసి...

**తా :** ఇతరులెవరూ కనిపించడం లేదు. మనుష్యజంతుసంచారమేదీ లేని చోటని అర్థం.

**సీ. తోయజగంధంబు దోఁగిన చల్లని మెల్లని గాడ్పుల మేను లలరఁ**
**గమలనాళాహారవిమలవాక్కలహంస రవములు సెవులపండువులు సేయ**
**ఫుల్లదిందీవరాంభోరుహామోదంబు ఘ్రాణరంధ్రంబుల గారవింప**
**నిర్మలకల్లోలనిర్గతాసారంబు వదనగహ్వరముల వాడు దేర్పఁ**

**తే. త్రిజగదభినవసౌభాగ్య దీప్తమైన, విభవ మీక్షణములకును విందు సేయ**
**నరిగి పంచేంద్రియవ్యవహారములను, మఱచి మత్తేభయూథంబు మడుఁగుఁజొచ్చె. 44**

**ప్రతి :** మత్తేభయూథంబు= మదించిన ఆ ఏనుగుల గుంపు; తోయజగంధంబు+తోఁగిన= పద్మగంధంతో కూడిన; చల్లని మెల్లని గాడ్పులన్= చల్లని పిల్లగాలులచేత; మేనులు+అలరన్= శరీరాలు హాయిని పొందగా; కమల+నాళ+ఆహార= తామర తూండ్లను ఆహారంగా కల్గిన; విమలవాక్+కలహంస+రవములు= మధురమైన శబ్దాలు చేసే ఆ రాయంచల ధ్వనులు; చెవుల పండువులు+జేయన్= చెవులకు పండుగ కూర్చుతుండగా; ఫుల్లత్+ఇందీవర+అంభోరుహ+ఆమోదంబు= విరిసిన తామరల, కలువల వాసన; ఘ్రాణరంధ్రంబులన్= ముక్కులను; గారవింపన్= సువాసనతో గౌరవిస్తుండగా; నిర్మల+కల్లోల+నిర్గతాసారంబు= నిర్మలమైన ఆ మడుగులోని అలల వల్ల పుట్టిన నీటి తుంపరలు; వదన గహ్వరముల= గుహలవంటి తమ నోళ్ళయొక్క; వాడు+తేర్పన్= దప్పికను తీర్చగా; త్రిజగత్+అభినవ+సౌభాగ్య+దీప్తము+ఐన= మూడు లోకాలలోనూ సరికొత్త సొగసుతో ప్రకాశిస్తున్న; విభవము= ఆ మడుగు యొక్క శోభ; ఈ క్షణములకున్= నేత్రాలకు; విందు+చేయన్= విందుచేస్తుండగా; అరిగి= ఆ మడుగును సమీపించి; పంచేంద్రియ+వ్యవహారములను= పంచేంద్రియ వ్యాపారాలను; మఱచి= మరచిపోయి; మడుఁగున్+చొచ్చెన్= మడుగులోకి దిగింది. (ఆ ఏనుగులన్నీ ఒకసారిగా దిగాయని అర్థం)

**తా :** మదించిన ఆ ఏనుగుల శరీరాలకు పద్మ గంధంతో కూడిన చల్లని పిల్లగాలులు హాయిని కూర్చాయి. తామర తూండ్లు తింటూ మధురశబ్దాలు చేసే ఆ మడుగులోని రాయంచల గొంతుకలు వాటి చెవులకు విందు గూర్చాయి. విరిసిన తామరల, కలువల వాసనలు ముక్కులకు తృప్తిని కలిగించాయి. నిర్మలమైన అలలతోడి నీటితుంపరలు గుహలవంటి ఆ

ఏనుగుల నోళ్ళలో పడి దప్పికను తీరుస్తున్నాయి. ముల్లోకాలలోను ఇలాంటి సరస్సు లేదన్నట్టుగా శోభిస్తున్న ఆ సరస్సు వాటి నేత్రాలకు విందు సమకూరుస్తూంది. ఆ మడుగును సమీపించగానే ఏనుగులన్నీ తమ ఇంద్రియ వ్యాపారాలను మరచిపోయాయి. మడుగులోకి ఒక్కసారిగా దిగబడ్డాయి.

**క. తొండంబులఁబూరించుచు గండంబులఁజల్లుకొనుచు గళగళరవముల్**
**మెండుకొన వలుఁదకడుపులు నిండన్ వేదండకోటి నీరుంద్రావెన్. 45**

**ప్రతి :** వేదండకోటి= ఆ ఏనుగుల సమూహం; తొండంబులన్+నీరున్+పూరించుచున్= తొండాలతో నీళ్లు నింపుకొని; గండంబులన్= చెక్కిళ్ళపైన; చల్లుకొనుచున్= చల్లుకొంటూ; గళగళరవముల్= గళగళమనే శబ్దాలు; మెండుకొనన్= ఎక్కువ కాగా; వలుఁదకడుపులు= లావు కడుపులు; నిండన్= నిండేలా; త్రావెన్= త్రాగాయి.

**తా :** ఆ ఏనుగుల గుంపు తొండాలలో నీళ్ళు బాగా నింపుకొని, సరదాగా చెక్కిళ్ళపైన చల్లుకొని, గళగళమని శబ్దాలు మెండుగా జేస్తూ, తమ పెద్ద కడుపులు నిండేలా బాగా నీళ్ళు తాగాయి.

**వ. అప్పుడు. 46**

**తా :** ఆ సమయంలో.

**మ. ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీరెక్కించి పూరించి చం**
**డభమార్గంబున కెత్తి నిక్కివడి నుద్దాడించి పింజింప నా**
**రభటిన్ నీరములోన బెల్లెగసి నక్రగ్రాహ పాఠీనముల్**
**నభమం దాడెడు మీనకర్కటములన్ బట్టెన్ సురల్ ప్రాన్పడన్. 47**

**ప్రతి :** ఇభలోకేంద్రుఁడు= గజరాజు; హస్త రంధ్రములన్= తొండం రంధ్రాలలోకి; నీరు+ఎక్కించి= బాగా నీళ్ళు పీల్చి; పూరించి= నింపి, చండభ మార్గంబునకున్+ఎత్తి= తొండాన్ని పైకి లేపి (చండభ – ఆకాశం); నిక్కి= బాగా నిక్కి; వడిన్= వేగంగా; ఉద్దాడించి= అటునిటు కదిలించి; పింజింపన్= నీళ్ళు చిమ్మగా; ఆరభటిన్= ఆ మోతతో; నీరములోనన్= నీటిలో నుండి; పెల్లు+ఎగసి= పైకెగిరి; నక్ర= నల్ల మొసళ్ళు; గ్రాహ= మొసళ్ళు, పాఠీనముల్= చేపలు; నభమందున్= ఆకాశంలో; ఆడెడు= చరించేటువంటి; మీనకర్కటములన్= చేప, ఎండ్రకాయలను (మీన, కటకరాశులను); సురల్= దేవతలు; ప్రాన్పడన్= నివ్వెరపోతుండగా; పట్టెన్= పట్టుకొన్నాయి.

**తా :** ఇంకా ఆ గజరాజు తన తొండంలోని నీళ్ళు బాగా పీల్చినాడు. మునిగాళ్ళపైన నిక్కి నుంచుని వేగంగా కదిలించి నీటిని పైకి ఆకాశంలోకి చిమ్మినాడు. ఆ మోతతో నీటిలో నుండి పైకి ఎగిరిన నల్ల మొసళ్ళు, మొసళ్ళు, చేపలు ఆకాశంలో తిరిగేటువంటి మీన కర్కాటకములను పట్టుకోబోతున్నాయి. ఈ దృశ్యాన్ని చూచి దేవతలు ఆశ్చర్య చకితులయ్యారు.

**వ. మఱియు నగ్గజేంద్రంబు నిరర్గళవిహారంబున. 48**

**ప్రతి :** మఱియున్= ఇంకా; ఆ+గజేంద్రంబు= ఆ గజరాజు; నిరర్గళ= ఎడతెరిపి లేని (అడ్డులేని); విహారంబునన్= విహారంలో...

**తా :** ఇంకా ఆ గజరాజు అడ్డు లేకుండా విహరించసాగాడు.

**సీ. కరిణీకరోజ్ఝితకంకణచ్ఛటఁదోఁగి సెలయేటి నీలాద్రి చెలువుఁ దెగడు**
**హస్తినీహస్తవిన్యస్తపద్మంబుల వేయిగన్నులవాని వెరవు సూపుఁ**
**గలభసముత్కీర్ణకల్హారరజమునఁ గనకాచలేంద్రంబు ఘనతఁదాల్చుఁ**
**గుంజరీపరిచితకుముదకాండంబుల ఫణిరాజమండనప్రభ వహించు**

**ఆ. మదకరేణుముక్తమౌక్తికశుక్తుల, మెఱుఁగు మొగిలుతోడ మేలమాడు**
**నెదురులేని గరిమ నిభరాజమల్లంబు, వనజగేహకేళి వ్రాలునపుడు.** **49**

**ప్రతి :** ఎదురులేని గరిమన్= అడ్డులేని వైభవంతో; ఇభరాజ మల్లంబు= గజరాజయోధుడు; వనజగేహకేళిన్= పద్మాల మడుగులో విహరించడానికి; వ్రాలునపుడు= చొరబడినపుడు (ఎలా ఉన్నారంటే); కరిణీ కరోజ్ఝిత= ఆడ ఏనుగుల తొండాలచేత చల్లబడిన; కంకణచ్ఛటన్+తోఁగి= (కం=నీళ్ళు – కణ=కణములు) నీటి ధారలు – వీటిచేత తడిసి; సెలయేటి= సెలయేళ్ళతో కూడిన; నీల+అద్రిన్= నీల గిరివలె; తెగడున్= తక్కువ చేస్తాడు (మించిపోయాడు); హస్తినీ హస్త= ఆడ ఏనుగుల తొండాలచేత; విన్యస్త= ఉంచబడిన; పద్మంబులన్= తామరలచేత; వేయికన్నులవాని= ఇంద్రుని; వెరవు+చూపున్= వైభవాన్ని ప్రదర్శించాడు; కలభ+సమ్+ఉత్కీర్ణ= గున్న ఏనుగులచే చల్లబడిన; కల్హారరజమునన్= కలువల పుప్పొడి చేత; కనక+అచలేంద్రంబు= బంగారు పర్వతం యొక్క; ఘనతన్+తాల్చున్= వైభవాన్ని ధరించాడు; కుంజరీపరిచిత= ఆడ ఏనుగులు అలంకరించిన; కుముద కాండంబులన్= కలువతూండ్ల చేత; ఫణిరాజ= శ్రేష్ఠమైన సర్పాలే; మండన= అలంకారాలుగా గలిగిన శివుడియొక్క; ప్రభన్= కాంతిని; వహించున్= ప్రకాశించాడు; మద కరేణు= మదించిన ఆడ ఏనుగుల చేత; ముక్త= విసరబడిన; మౌక్తిక+శుక్తులన్= ముత్యపుచిప్పల చేత; మెఱుఁగు= మెరుపు తీగలతో కూడిన; మొగిలుతోడన్= మేఘాలతో; మేలమాడున్= పరిహాసం చేశాడు.

**తా :** ఆ పద్మాల సరస్సులో అడ్డు లేకుండా విహరిస్తున్న గజరాజు పైన ఆడ ఏనుగులు తమ తొండాలతో నీళ్ళు చల్లాయి. ఆ నీటి బిందువులతో తడిసిన అతడు సెలయేళ్ళతో కూడిన నీలాద్రిలాగా ప్రకాశించాడు.

ఆడ ఏనుగులు అతని శరీరం నిండా పద్మాలు అలంకరించాయి. వాటితో గజరాజు వేయికన్నులున్న దేవేంద్రుడిలాగా విలసిల్లినాడు.

గున్న ఏనుగులు ఇంకా అతనిపై కలువ పుప్పొడి చల్లగా అతను బంగారు కొండలాగా వెలిగిపోయాడు.

మళ్ళీ ఆ ఆడ ఏనుగులు కలువతూండ్లతో తమ నాథుని అలంకరించారు. దానితో సర్పాలను ధరించిన శివుడిలాగా గజరాజు కొత్త శోభను సంతరించుకొన్నాడు. అతనిపై ముత్యాలచిప్పలను భార్యలు విసరగా వాటితో మెరుపు తీగలలోని మేఘాలను మించి పోయి గజేంద్రుడు కొత్త కాంతులు చిమ్మాడు (నల్లటి శరీరం ఏనుగుది – కనుక మేఘం; ముత్యాలచిప్పలు మెరుపు తీగలు)

**వ. మఱియు నా సరోవరలక్ష్మి మదగజేంద్ర వివిధ విహారవ్యాకులిత నూతన లక్ష్మీవిభవయై యనంగ విద్యానిరూఢ పల్లవ ప్రబంధపరికంపిత శరీరాలంకార యగు కుసుమకోమలియునుంబోలె వ్యాకీర్ణ చికురమత్తమధుకరనికరయు, విగతరస వదనకమలయు, నిజస్థాన చలిత కుచరథాంగయుగళయు, లంపటిత జఘనపులినతలయునై యుండె; నంత.** **50**

**ప్రతి :** మఱియున్= ఇంకా; ఆ సరోవర లక్ష్మి= ఆ సరోవరమనే లక్ష్మికి; మద గజేంద్ర= మదించిన ఆ గజరాజు చేసిన; వివిధ= అనేకాలైన; విహారవ్యాకులిత= సంచారాలవల్ల నలిగిపోయిన; నూతన= ఒక కొత్త; లక్ష్మీ విభవ+ఐ= సొగసు కలదియై; అనంగ విద్యానిరూఢ= అనంగ విద్యలో నేర్పరియైన; పల్లవ+ప్రబంధ+పరికంపిత= విటునిచేత మాటిమాటికి కౌగిలించు కోవటంవల్ల కంపించిపోతున్న; శరీర+అలంకార+అగు= శరీరం, అలంకారాలు కల్గిన; కుసుమ కోమలియున్+పోలెన్= పూవువంటి కోమలమైన స్త్రీలాగా; వ్యాకీర్ణ= చెదిరిన; చికుర= వెంట్రుకలనెడి; మత్తమధుకర నికరయున్= మదించిన తుమ్మెదల సమూహం కల్గిన దానిలాగా; విగత రస= వాడిపోయిన; వదన కమలయున్= ముఖమనెడి కమలము కలదానిలాగా; నిజస్థాన+చలిత= తన స్థానాలనుండి జారిపోయిన; కుచ+రథాంగ+యుగళయున్= స్తనాలనేటటువంటి చక్రవాక యుగళం కల్గినదిగా; లంపటిత= అలిసి నలిగిపోయిన; జఘన+పులిన+తలయున్+ఐ= పిఱుదులనేటటువంటి ఇసుక తిన్నెలు కల్గినదిగా; ఉండెన్= నీరసపడిపోయి కనిపించింది.

**తా :** గజరాజు చేసిన ఆ విశేషమైన సంచారాల వల్ల ఆ సరస్సు అందచందాలు మాసిపోయి ఒక కొత్త సొగసును సంతరించుకొంది. గడుసువాడైన విటునితో రతిక్రీడలో కౌగిళ్ళలో పడి నలిగిపోయి కంపిస్తున్న కుసుమ సుకుమారిలాగా ఒప్పింది. మదించిన తుమ్మెదలు చెదిరిన ముంగురుల్లాగా; శుష్కించి పోయిన పద్మాలు ముఖంలాగా; తమ స్థానాల నుండి జారిపోయిన చక్రవాకాలు స్తనాల్లాగా; నలిగిన ఇసుక తిన్నెలు అలసి సొలసిన పిఱుదుల్లాగా నీరసపడిపోయి కనిపించాయి.

**సీ. భుగభుగాయితభూరిబుద్బుదచ్ఛటలతోఁగదలుచు దివికి భంగంబు లెగయ;**
**భువనభయంకరఫూత్కారరవమున ఘోరనక్రగ్రాహకోటి బెగడ,**
**వాలవిక్షేపదుర్వారఝుంఝానిలవశమున ఘుమఘుమావర్త మదరఁ**
**గల్లోలజాలసంఘట్టనంబులఁదటీ తరులు మూలములతో ధరణిఁగూల,**

**తే. సరసిలోనుండి పొడగని సంభ్రమించి, యుదరి కుప్పించి లంఘించి హుంకరించి**
**భానుఁగబళించి పట్టు స్వర్భానుపగిది, నొక్క మకరేంద్రుఁడిభరాజు నొడిసి పట్టె. 51**

**ప్రతి :** భుగభుగాయిత= భుగభుగమనే; భూరి= పెద్దవైన; బుద్బుద+ఛటలతోన్= చప్పుళ్ళతోడి నీటి బుడగల సముదాయంతో; కదలుచున్= కదులుతూ; దివికిన్= ఆకాశానికి; భంగంబులు+ఎగయన్= ఎగిరేవిధంగా; భువన+భయంకర= లోకానికి భయం కలిగేలా; ఫూత్కార రవమునన్= ఫూత్కార శబ్దం చేస్తూ; ఘోర+నక్ర+గ్రాహ+ కోటి+బెగడన్= భయంకరమైన నల్ల మొసళ్ళు, మొసళ్ళు వీటి సముదాయం భయపడేలా; కుప్పించి= ఒక ఉదుటున (లంఘించి); వాలవిక్షేప= తోక ఝాడించటం వల్ల; దుర్వార= అడ్డుకోజాలని; ఝుంఝా+అనిలవశమునన్= ప్రళయకాలంలోని ఉద్ధృతమైన సుడిగాలి వల్ల; ఘుమఘుమ+ఆవర్తము+అదరన్= ఘుం ఘుం అనేటటువంటి శబ్దాలతోడి సుడిగుండం ఏర్పడేటట్లుగా; లంఘించి= ఎగిరి; కల్లోలజాల= అలల సమూహం యొక్క; సంఘట్టనంబులన్= తాకిడిచేత; తటీతరులు= గట్టుపైని చెట్లు; మూలములతోన్+ధరణిన్+ కూలన్= వేళ్ళతో సహా నేలపై పడిపోయేలా; హుంకరించి= భయంకరమైన హుంకారం చేసి; సరసిలోనుండి= ఆ సరస్సులో నుండి; పొడగని= తటుక్కున కనిపించి; సంభ్రమించి= సంభ్రమం పుట్టేలా పైకి వచ్చి; భానున్= సూర్యుని; కబళించి+పట్టు= కబళించి పట్టుకొనే; స్వర్భానుపగిదిన్= రాహువులాగా; ఒక్క మకర+ఇంద్రుఁడు= ఒక మకర రాజు; ఇభరాజున్= ఆ గజేంద్రుని; ఒడిసి పట్టెన్= ఒడుపు తెలిసి పట్టుకున్నాడు.

**తా :** ఇలాగ గజరాజు క్రీడిస్తున్న సమయంలో ఉన్నట్టుండి భుగభుగమనే చప్పుళ్ళతో పెద్ద పెద్ద బుడగలు పుట్టి ఆకాశానికి ఎగిరే విధంగా ఆ సరస్సులో నుండి ఒక పెద్ద మొసలి పైకెగిసింది.

లోకమంతా భయపడే విధంగా ఫూత్కార శబ్దాలు చేస్తూ ఆ సరస్సులోని ఇతరములైన మొసళ్ళు, చేపలు అదిరిపోయేలా ఒక ఉదుటున అది పైకి లంఘించింది.

తన తోకను ఒకసారి ఝాడించి, ప్రళయ కాలంలోని సుడిగాలి లాంటి ఝంఝను సృష్టించి సరస్సులో సుడిగుండాలు సృష్టిస్తూ పైకి ఎగిరింది.

ఆ అలల తాకిడికి గుట్టమీద ఉన్న చెట్లు వేళ్ళతో సహా నేలపై పడిపోయే విధంగా భయంకరమైన హుంకారం చేస్తూ అది గగుర్పాటు కల్గిస్తూ ఆకసంలోకి లేచి కిందపడుతూ ఒక్క ఉదుటున ఒడుపు తెలిసి ఆ గజరాజును పళ్ళతో కరిచి పట్టింది.

**క. వడిఁదప్పించి కరీంద్రుఁడు, నిడుదకరం బెత్తి వ్రేయ నీరాటంబున్**
**బొడ వడఁగినట్లు జలములఁబడి కడువడిఁబట్టెఁబూర్వపదయుగళంబున్. 52**

**ప్రతి :** కరి+ఇంద్రుఁడు= గజేంద్రుడు; వడిన్= వేగంగా; తప్పించి= ఆ మొసలి పట్టును తప్పించుకొని; నిడుదకరంబు+ఎత్తి= తన పొడవైన తొండంతో పైకి ఎత్తి; వ్రేయన్= కొట్టగా; నీరాటంబున్= ఆ మొసలి కూడా; పొడవు+అడఁగినట్లు= చనిపోయినట్టు; జలములన్+పడి= నీళ్ళలో పడి; కడువడిన్= మిక్కిలి వేగంగా; పూర్వపదయుగళంబున్= ముందరికాళ్ళను; పట్టెన్= పట్టుకొంది.

**తా :** ఆ గజేంద్రుడు వేగంగానే ఆ మొసలి పట్టును తప్పించుకొని తన పొడవైన తొండం పైకెత్తి మొసలిపై ఒక దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బతో ఆ మొసలి చచ్చినట్టు నీళ్ళలో పడి వెంటనే తేరుకొని అతివేగంగా ఆ ఏనుగు ముందరి కాళ్ళను పట్టుకొంది.

**విశే :** పొడవడగు = చనిపోవు అనే అర్థంలో ఇది ఒక జాతీయం.

**చ పదములఁబట్టినం దలఁకుఁబా టొకయింతయు లేక శూరతన్**
**మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంత ఘట్టనం**
**జెదరఁగఁజిమ్మె నమ్మకరిచిప్పలు పాదులు దప్ప నొప్పఅన్**
**వదలి జలగ్రహంబు కరివాలముమూలముఁ జీరెఁగోఅలన్. 53**

**ప్రతి :** ధృతిమంతుఁడు= ధైర్యం గల్గినవాడగు; మద గజవల్లభుండు= ఆ గజరాజు; పదములన్+పట్టినన్= తన కాళ్ళను మొసలి పట్టుకోగానే; తలఁకుఁబాటు= భయం; ఒక+ఇంతయున్+లేక= ఒకింత కూడా లేకుండా; శూరతన్= పరాక్రమంతో; దంత+యుగ+అంత+ఘట్టనన్= తన రెండు దంతాల మొనలతో బలంగా మోది; ఆ+మకరి= ఆ మొసలియొక్క; చిప్పలు+పాదులు= బొరుసుల కింది భాగాలు; తప్పన్+ఒప్పఅన్= కదిలిపోయేలా చిట్లిపోయేలా; చెదరఁగన్= చెదరిపోయే విధంగా; చిమ్మెన్= పొడిచాడు; జలగ్రహంబు= ఆ మొసలి కూడా; వదలి= ఏనుగు పాదాలు విడిచిపెట్టి; కరి+వాలము+ మూలమున్= ఏనుగు తోకయొక్క మొదటిభాగాన్ని; కోఅలన్= కోఅపండ్లతో; చీరెన్= కరిచింది.

**తా :** ఆ గజేంద్రుడు ఎంతో ధైర్యవంతుడు. ఏ మాత్రం భయం లేకుండా తన దంతాల మొనలతో ఆ మొసలి బొరుసుల కింది భాగాలు కదిలిపోయేలా చిట్లిపోయేలా పొడిచాడు; ఆ మొసలి కూడా కాళ్ళను వదలిపెట్టి ఏనుగుతోక మూలాన్ని కరిచింది.

**క. కరిఁదిగుచు మకరి సరసికిఁగరి దరికిని మకరిఁదిగుచు గరకరి బెరయన్**
**గరికి మకరి మకరికిఁగరి భర మనుచును నతలకుతలభటు లదరిపడన్. 54**

**ప్రతి :** అతలకుతల భటులు= అతల, కుతల లోకాలలోని భటులు; కరికిమకరి= ఏనుగుకు మొసలి; మకరికికరి= మొసలికి ఏనుగు; భరము+అనుచున్= బరువైనది అనుకొంటూ; అదరిపడన్= బెదరగా; కరకరి, బెరయన్= ద్వేషం పెరుగగా; మకరికరిన్= మొసలి ఏనుగును; సరసికిన్+తిగుచున్= మడుగులోనికి ఈడ్చుతోంది; కరిమకరిన్= ఏనుగు మొసలిని; దరికిన్= గట్టుకు; తిగుచున్= ఈడ్చుతోంది.

**తా :** మొసలి ఏనుగును మడుగులోకి లాగింది. ఏనుగు మొసలిని గట్టువైపు ఈడ్చింది. పరస్పరం ద్వేషం పెంచుకొని పోరాడుతుండగా, ఏనుగు కన్నా మొసలి, మొసలి కన్నా ఏనుగు – బలంగా కనిపిస్తున్నాయే అంటూ అతల, కుతల లోకాలలోని వీరులు బెదరిపోయారు.

**విశే :** అతల–కుతల–సుతల–వితల–తలాతల–రసాతల–పాతాల లోకాలు అధోలోకాలు ఏడు.

**వ. ఇట్లు కరిమకరంబులు రెండును నొండొండ సముద్దండదండంబులై తలపడి నిఖిల లోకాలోకన భీకరంబులై, యన్యోన్యవిజయశ్రీ వశీకరంబులై, సంక్షోభిత కమలాకరంబులై, హరి హరియును, గిరి గిరియునుం దాఁకి పిఱుతివియక పెనంగు తెఱంగున నీరాటం బయిన పోరాటంబునం బట్టుచు వెలికి లోనికిం దిగుచుచుఁ గొలంకు గలంకంబందఁ గడువడి నిట్టట్టు పడి తడఁబడక బుడబుడాను కారంబులై బుగులు బుగుల్లను చప్పుళ్లతో నురువులు గట్టుచు జలంబు లుప్పరం బెగయం జప్పరించుచుఁ దప్పక వదనగహ్వరంబుల నప్పళింపుచు నిశితనితాంత దురంతదంత కుంతంబుల నింతింతలు దునియలయి నెప్పళంబునం బునుక చిప్పలు గుదుళ్ళు దప్పి రక్తంబులు గ్రమ్ముదేర హుమ్మని యొక్కుమ్మడిం జిమ్ముచు నితరేతర సమాకర్షణంబులం గదలక పదంబుల మొదలిపట్టు వదలక కుదురై వర్తించుచుఁ బరిభ్రమణ వేగంబున జలంబులం దిరుగుచు మకర కమఠ కర్కట గండక మండూకాది సలిల నిలయంబుల ప్రాణంబులు క్షీణంబులుగా నొండొంటిం దాఁకు రభసంబున నిక్కలువడ ప్రక్కం ద్రొక్కుచు మెండుచెడి బెండువడి నాఁచు గుల్లచిప్పతండంబులం బరస్పర తాడనంబులకు నడ్డంబుగా నొడ్డుచు నోలమాసగొనక గెలుపుఁ దలంపులు బెట్టిదంబులై రెట్టింప నహోరాత్రంబులుం బోలెఁ గ్రమక్రమ విజృంభమాణంబులై బహుకాల కలహ విహారంబులై నిర్గతనిద్రాహారంబులై, యవక్రపరాక్రమఘోరంబులై పోరుచున్న సమయంబున. 55**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కరి మకరబులు రెండును= ఆ ఏనుగూ, ఆ మొసలీ; ఒండు+ఒండు+అ= ఒక దానితో ఒకటి; సముత్+దండ= విజృంభించిన; దండంబులు+ఐ= శరీరాలు కలవై (ఒకదాన్ని మించాలని – శిక్షించాలని మరొకటి); తలపడి= ఢీకొని; నిఖిల= సర్వ; లోక+ఆలోకన+భీకరంబులు+ఐ= సకల లోకాలకూ చూడడానికి భయాన్ని

కల్గిస్తూ; అన్యోన్య= ఒకదాన్ని మరొకటి; విజయశ్రీ+వశీకరంబులు+ఐ= గెలుపు సిరికి లోబడి (లేదా జయించాలని); సంక్షోభిత= కలచివేయబడిన; కమలాకరంబులు+ఐ= సరస్సు కలవియై; హరి= సింహం; హరియును= సింహాన్ని; గిరి= కొండ; గిరియును= ఇంకో కొండను; తాఁకి= ఎదుర్కొని; పిఱు+తివియక= వెనుదీయకుండా; పెనంగు+తెఱంగునన్= పెనుగులాడే విధంగా; నీరాటంబయిన పోరాటంబునన్+పట్టుచున్= నీళ్ళలో జరిగే పోరాటమందు ఒకదాన్ని ఒకటి ఆక్రమిస్తూ; వెలికిన్+లోనికిన్+ తిగుచుచున్= బయటికి, లోపలికి లాగుతూ; కొలంకు= ఆ సరస్సు; కలంకంబు+అందన్= కలుషితంకాగా; కడువడిన్= మిక్కిలి వేగంతో; ఇట్టట్టు+పడి= ఇటూఅటూ పడుతూ; తడఁబడక= తొట్రుపడకుండా (పోరాడాయి); బుడబుడ+ అనుకారంబులు+ఐ= బుడ బుడమనే ధ్వనులు పుట్టిస్తూ; బుగులు+బుగుల్లు+అను+చప్పుళ్ళతో= బుగులు, బుగులు అనే శబ్దాలతో; నురువులు+కట్టుచున్= నురుగులు పుట్టిస్తూ; జలంబులు= నీళ్ళు; ఉప్పరంబు= ఆకాశానికి; ఎగయన్= ఎగసిపడగా; చప్పరించుచున్= ఆ నీటిని చప్పరిస్తూ; తప్పక= నిరంతరమూ; వదన గహ్వరంబులన్= గుహలవంటి తమ నోళ్ళను; అప్పళింపుచున్= తెరుస్తూ మూస్తూ; నిశిత= వాడియైన; నితాంత= మిక్కిలి; దురంత= భయంకరమైన; దంత+కుంతంబులన్= కోరలు అనే బల్లెములతో; ఇంతింతలు= ఇంతింతగా (చిన్నచిన్నవిగా); తునియలయి= ముక్కలై; నెప్పళంబునన్= వేగంగా; పునుక+చిప్పలు= తల పుర్రెలు; కుదుళ్ళు తప్పి= అమరికలు తప్పి; రక్తంబులు= రక్తాలు; క్రమ్ము+తేరన్= చిప్పిలగా; హుమ్మని= హుంకారంతో; ఒక్కుమ్మడిన్= ఒక్కసారిగా; చిమ్ముచున్= చిమ్ముతూ; ఇతర+ఇతర= ఒకదానినొకటి; సమాకర్షణంబులన్= లాగటం చేత; కదలక= చలించక; పదంబుల మొదలిపట్టు= కాళ్ళ మొదటి పట్టును; వదలక= వీడకుండా; కుదురై= కుదురుగా; వర్తించుచున్= నిలదొక్కుకుంటూ; పరిభ్రమణ+వేగంబునన్= వడివడిగా పరిభ్రమించుటతో; జలంబులన్= ఆ నీటిలో; తిరుగుచున్= భ్రమిస్తూ; మకర= మొసళ్ళు; కమఠ= తాబేళ్ళు; కర్కట= ఎండ్రకాయలు; గండక= చేపలు; మండూక+ఆది= కప్పలు మొదలైన; సలిల నిలయంబుల+ప్రాణంబులు= నీటిలో నివసించే జంతువుల ప్రాణాలు; క్షీణంబులుగాన్= నశించునట్లు కాగా, ఒండొంటిన్= ఒకదాన్ని మరొకటి; తాఁకు+రభసంబునన్= తాకేటటువంటి వేగంతో; ఇక్కలు+వదన్= తమ నివాస స్థానాలనుండి భ్రంశమయ్యే విధంగా; ప్రక్కన్+త్రొక్కుచున్= అణగదొక్కుతూ; మెండు+చెడి= బలం కోల్పోయి; బెండు+పడి= నీరసపడి; నాఁచు= నాచును; గుల్లచిప్పతండంబులన్= కప్పచిప్పలను; పరస్పర తాడనంబులకున్= ఒకదాన్ని ఒకటి దెబ్బకొట్టడానికి; అడ్డంబుగాన్+ ఒడ్డుచున్= అడ్డంగా పడవేస్తూ; ఓలము+ఆస+కొనక= శరీరంపైన ఆశ వదలిపెట్టి; గెలుపున్+తలంపులు= గెలవాలనే ఆశలు; బెట్టిదంబులై= ఎక్కువై; రెట్టింపన్= రెండింతలు కాగా; అహోరాత్రంబులు+పోలెన్= రాత్రింబవళ్ళు లాగా; క్రమక్రమ= ఒకదాని తరువాత మరొకటి; విజృంభమాణంబులు+ఐ= విజృంభించినవియై; బహుకాల= చాలాకాలం; కలహ+విహారంబులు+ఐ= పోరాటంలో విహరించునవి; నిర్గత= పోయిన; నిద్రాహారంబులు+ఐ= నిద్ర, ఆహారం కల్గినవై; అవక్ర= మొక్కపోని; పరాక్రమ+ఘోరంబులు+ఐ= విక్రమంతో భయంకరములై చెలరేగి; పోరుచున్న= పోరాడుతున్న; సమయంబునన్= సమయంలో...

**తా :** ఈ విధంగా ఆ ఏనుగూ, మొసలీ రెండూ ఒకదానితో ఒకటి విజృంభించిన శరీరాలు కలవై ఒకదాన్ని మరొకటి మించాలని ఢీకొన్నాయి. అన్నిలోకాలూ వీటి పోరాటాన్ని చూచి భయపడిపోయాయి. వాటికి ఒకదాన్ని మరొకటి ఓడించాలన్న పట్టుదల తప్ప మరేమీ లేకపోయింది. ఈ అలజడితో సరస్సులోని నీరంతా కలుషితమైపోయి గొప్ప సంక్షోభం ఏర్పడింది. సింహాన్ని మరో సింహం, కొండను మరో కొండ వెనుదీయకుండా ఎదిరించినట్లు నీళ్ళలో అవి రెండూ పెనుగులాడుతూ, ఒకదాన్ని మరొకటి ఆక్రమిస్తూ పోరాడాయి. ఒకటి లోపలికి లాగితే మరొకటి బయటికి లాగుతూ ఆ కొలనును మలినపరచాయి. మిక్కిలి వేగంతో అటుబడి ఇటుబడి తొట్రుపాటు లేకుండా పోరాడాయి. బుడబుడమని, బుగులు

బుగుల్లని శబ్దాలు పుట్టగా నురుగులు గట్టి నీళ్ళు పైకి ఎగిశాయి. ఆ నీటి తుంపరల్ని చప్పరిస్తూ నిరంతరమూ తమ గుహలవంటి నోళ్ళను తెరుస్తూ మూస్తూ వాడివై, మిక్కిలి భీకరములయిన తమ దంతాలతో ఒకటి మరోదాన్ని ముట్టెలతో తాకుతూ తలలు చిన్న చిన్న ముక్కలుగా అయ్యేటట్టు అమరికలు తప్పి నెత్తురు చిప్పిల్లే విధంగా హుమ్మంటూ వాడి పండ్లతో పొడుచుకుంటున్నాయి. ఒకదానిని మరొకటి లాగేటప్పుడు కాళ్ళమొదళ్ళలోని తమ పట్టును వదలకుండా దృఢంగా నిలదొక్కుకున్నాయి. వాటి పరిభ్రమణ వేగానికి సరస్సులోని నీళ్ళు సుళ్ళు తిరిగాయి. ఆ నీటిలోని మొసళ్ళు, తాబేళ్ళు, ఎండ్రకాయలు, చేపలు, కప్పలు మొదలైన నీటి జంతువుల ప్రాణాలు గాలిలో కలిశాయి. బింకంతో మొసలి, ఏనుగూ ఒకదాన్ని మరొకటి అణగదొక్కి చీకాకుపరిచాయి. బలం కోల్పోయి బాగా అలసిపోయాయి. పరస్పరం దెబ్బలు తప్పుకోడానికి అక్కడ దొరికిన నాచును, కప్పచిప్పలను అడ్డంగా పడవేయసాగాయి. రెండింటికీ శరీరాలపైన ఆశ విడిచి గెలిచి తీరాలనే పట్టుదలతో పోరాడాయి. రాత్రింబవళ్ళలాగా ఒకదాని తరువాత మరొకటి పరాక్రమించటం మొదలుపెట్టి, పోరాటమనే ఆటలో పడి నిద్రాహారాలు మాని మొక్కపోని పరాక్రమంతో ఘోరంగా చెలరేగి చాలాకాలం అవి పోరాడుతూ ఉండిపోయాయి.

**క. జవమును జలమును బలమును వివిధములుగఁబోరు కరటివీరతకు భువిన్**
**దివి మకరమీన కర్కట నివహము లొక్కటన మిత్రనిలయముఁబొందెన్. 56**

**ప్రతి :** జవమును= వేగం; చలమును= పట్టుదల; బలమును= శక్తి (కల్గి); వివిధములుగన్= ఎన్నో రీతులు అగునట్లుగా; భువిన్= ఈ నేలపైన; పోరు= పోరాడుతున్న; కరటి= ఏనుగుయొక్క; వీరతకున్= పరాక్రమానికి; దివిన్= ఆకాశంలోని; మకర; మీన; కర్కట= మకర, మీన, కర్కటములు అనే రాశులయొక్క; నివహములు= సమూహములు; ఒక్కటన= ఒక్కసారిగా; మిత్ర నిలయమున్= సూర్యమండలాన్ని; పొందెన్= చేరాయి.

**తా :** వేగం, పట్టుదల, శక్తి కల్గిన గజేంద్రుడు ఈ భూమి మీద ఎన్నో విధాలుగా మకరంతో పోరాడుతుండగా, ఆకాశంలోని మకర, మీన, కర్కట రాశి సముదాయం ఒక్కసారిగా భీతి పొంది సూర్యమండలంలోకి దూరాయి.

**విశే :** మేషం, వృషభం, మిథునం, కటకం, సింహం, కన్య, తుల, వృశ్చికం, ధనుస్సు, మకరం, కుంభం, మీనం అన్నవి పండ్రెండు రాశులు. వీటికి కేంద్రం సూర్యుడు.

**శా. ఆటోపంబునఁజిమ్ము ఱొమ్మగల వజ్రాభీలదంతంబులం**
**దాటించున్ మెడఁజుట్టిపట్టి హరి దోర్దండాభశుండాహతిన్**
**నీటన్ మాటికి మాటికిందిగువఁగా నీరాటమున్ నీటి పో**
**రాటన్నోటమిపాటుఁజూపుట కరణ్యాటంబు వాచాటమై. 57**

**ప్రతి :** నీరాటమున్= మొసలి కూడా; నీటన్= నీటిలోకి; మాటిమాటికిన్= మాటిమాటికి; తిగువగాన్= (తనను) ఈడుస్తూ ఉండగా; అరణ్యాటంబు= ఏనుగు; నీటిపోరాటన్= నీటి పోరాటంలో; ఓటమిపాటుచూపుటకున్= అపజయం పొందుతున్న తన స్థితికి; వాచాటమై= గగ్గోలు పెడుతూ; వజ్రాభీల దంతంబులన్= వజ్రాయుధం లాంటి భయంకరమైన తన దంతాలతో; ఆటోపంబునన్= పరాక్రమంతో; ఱొమ్ము+అగలన్= మొసలియొక్క రొమ్ము పగిలేటట్లు; చిమ్మున్= పొడిచింది; హరి= ఇంద్రునియొక్క; దోః+దండ= భుజా దండంతో సమానమైన; శుండా+ఆహతిన్= తొండం దెబ్బతో; మెడన్+చుట్టి+పట్టి= మొసలి మెడను చుట్టి పట్టి; దాటించున్= విసిరిపారవేశాడు.

**తా :** నీటిలోకి మళ్లీమళ్ళీ ఈడుస్తున్న ఆ మొసలిని ఓడించడానికి ఎంతో శ్రమించి ఏనుగుల రాజు గగ్గోలు చేశాడు. వజ్రాయుధంలాంటి తన బలమైన దంతాలతో దాని రొమ్ము పగిలేటట్టుగా పొడిచాడు. ఇంద్రునిభుజం వంటి తన తొండంతో దాని మెడ చుట్టి పట్టి విసిరిపారేశాడు.

**వ. అప్పుడు. 58**

**ప్రతి :** ఆ సమయంలో...

**తా :** ఆ సమయంలో

**ఆ. మకరితోడఁబోరు మాతంగవిభుని నొక్కరుని డించి పోవఁగాళ్ళు రాక**
**కోరి చూచుచుండెఁగుంజరీయూథంబు మగలు దగులు గారె మగువలకును. 59**

**ప్రతి :** మకరితోడన్+పోరు= ఆ మొసలితో పోరాడుతున్న; మాతంగవిభునిన్= గజేంద్రుని; ఒక్కరుని= ఒంటరిగా; డించిపోవన్= వదలివేసి వెళ్ళడానికి; కాళ్ళురాక= మనసు ఒప్పక (కాళ్ళాడక); కుంజరీయూథంబు= ఆడ ఏనుగుల సమూహం; కోరి= ఆత్రంగా; చూచుచుండెన్= చూస్తూ నిలబడిపోయింది (ఎందుకంటే); మగువలకును= భార్యలకు; మగలు= భర్తలు; తగులు+కారె= విడరానివారు కదా!

**తా :** అలా ఆ మొసలితో పోరాడుతున్న గజరాజును ఒంటరిగా వదలివెళ్ళి పోవడానికి మనసొప్పక ఆడ ఏనుగులు ఆత్రంగా అలాగే చూస్తూ నిలబడిపోయాయి. ఎందుకంటే భార్యాభర్తల అనుబంధం విడదీయరానిది కదా!

**వ. అంత. 60**

**తా :** అప్పుడు ఏమయిందంటే.

**ఆ. జీవనంబు దనకు జీవనంబై యుంట నలవుఁజలము నంతకంత కెక్కి**
**మకర మొప్పె డస్సె మత్తేభమల్లంబు బహుళపక్షశీతభానుపగిది. 61**

**ప్రతి :** జీవనంబు= నీళ్ళు; తనకు జీవనంబు+ఐ+ఉంటన్= తనకు బతుకు తెరువుగావటం వల్ల; అలవున్= బలము; చలమున్= పట్టుదల; అంతకంతకు+ఎక్కి= అంతకంతకూ అధికమై; మకరము+ఒప్పెన్= మొసలి విజృంభించింది; మత్తేభమల్లంబు= యోధుడైన ఈ గజరాజు; బహుళపక్ష= కృష్ణపక్షంలోని; శీతభాను పగిదిన్= చంద్రుడిలాగా; డస్సెన్= అలసిపోయాడు.

**తా :** ఇలా పోరాడగా పోరాడగా నీటిలో ఉన్న మొసలికి జీవనాధారం నీరే కాబట్టి దాని బలం, పట్టుదల అంతకంతకూ పెరిగాయి. ఎవరికైనా స్థానబలం గొప్పదికదా! నేలపై తిరిగే గజరాజు యోధుడే అయినా నీటిలో అతని 'శక్తి' చాలలేదు. కృష్ణపక్షంలోని చంద్రకాంతి తరిగి పోయినట్టుగా అతని బలం సన్నగిల్లి అలసిపోయాడు.

**మ. ఉఱుకుంగుంభయుగంబుపై హరిక్రియన్ హుమ్మంచుఁబాదంబులన్**
**నెఱయుంగంఠము వెన్నుదన్ను; నెగయున్ హేలాగతిన్, వాలముం**
**జఱచున్; నుగ్గుగఁదాఁకు: ముంచు; మునుఁగున్; శల్యంబులున్ దంతముల్**
**విఱుగన్ వ్రేయుచుఁబొంచి పొంచి కదియున్ వేదండయూథోత్తమున్. 62**

**ప్రతి :** ఆ మొసలి విజృంభించి; హరిక్రియన్= సింహం లాగా; హుమ్మంచున్= హుంకారం చేసి; కుంభయుగంబుపైన్= కుంభస్థలం మీదికి; ఉఱుకున్= ఉరుకుతుంది; పాదమ్ములన్= పాదాలను; నెఱయున్= ఆక్రమిస్తుంది; కంఠమున్+వెన్నున్+తన్నున్= మెడను, వీపును తన్నుతుంది; హేలాగతిన్= అవలీలగా; ఎగయున్= పైకెగురుతుంది; వాలమున్= (దాని) తోకను; చఱచున్= చరుస్తుంది; నుగ్గుగన్+తాఁకున్= నలిగిపోయేటట్టు ఢీ కొడుతుంది; ముంచున్= నీటిలో ముంచింది; మునుఁగున్= తానూ మునుగుతుంది; శల్యంబులున్= ఎముకలు; దంతముల్= పండ్లు; విఱుగన్+వ్రేయుచున్= విరిగిపోయేలా కొడుతూ; వేదండయూథోత్తమున్= గజయూథపతిని; పొంచి పొంచి= నక్కి నక్కి; కదియున్= పైబడుతుంది.

**తా :** ఇక మొసలి విజృంభించింది. సింగంలాగా హుంకరించి దాని కుంభస్థలం మీదికి ఒక్క ఉదుటున ఉరికింది. పాదాలను ఆక్రమించింది. మెడను, వీపును చరిచింది. సులువుగా పైకెగసి దాని తోకపై ఒక దెబ్బకొట్టింది. నలిగిపోయేట్టు ఢీ కొట్టింది. ఎముకలు, దంతాలు విరిగిపోయేలా కొట్టింది. అంతటి ఏనుగునూ నీళ్ళలో ముంచివేసింది. తానూ మునిగింది. నక్కి నక్కి ఒక్కసారిగా ఆ ఏనుగుపైన పడుతోంది.

**మ. పొడగానంబడకుండ డాఁగు వెలికింబోవంగఁదా నడ్డమై**
**పొడచూపుం జరణంబులంబెనఁగొనుంబోరాక రారాక బె**
**గ్గడిలంగూలఁగఁదాఁచు లేచుతఱి నుద్ఘాటించు లంఘించుఁ బ**
**ల్విడిఁజీరు ందలఁగున్ మలంగు నొడియున్ వేధించుఁగ్రోధించుచున్. 63**

**ప్రతి :** (ఆ మొసలి); పొడ+కానన్+పడకుండన్= దాని ఉనికి కనిపించకుండా; డాఁగున్= నీటిలో దాగుతుంది; వెలికిన్+పోవంగన్= బయటికి పోతూ ఉండగా; తాను+అడ్డము+ఐ= తాను అడ్డంగా; పొడ+చూపున్= కనిపిస్తుంది; చరణంబులన్= దాని కాళ్ళను; పెనఁగొనున్= పెనవేసుకొంటుంది; పోరాకన్+రారాకన్= ముందుకు పోనీకుండా వెనక్కి రానీకుండా; బెగ్గడిలన్= భయపడునట్లుగా; కూలఁగన్= కూలిపోయేలాగా; తాఁచున్= తన్నుతుంది; లేచుతఱిన్= లేచే సమయంలో; ఉద్ఘాటించున్+లంఘించున్= ఒడలు ఝాడించి పైకెగురుతుంది; బల్విడిన్= వేగంగా (శౌర్యంతో); చీరున్= చీలుస్తుంది; తలఁగున్= పక్కకు పోతుంది; మలంగున్= వెనక్కిపోతుంది; ఒడియున్= మళ్ళీ పట్టుకొంటుంది; క్రోధించుచున్ వేధించున్= కోపిస్తూ బాధపెడుతుంది.

**తా :** ఆ మొసలి కనిపించకుండా గుట్టుగా నీటిలో దాగుతూ ఉండి ఏనుగు గట్టుకు వెళ్ళేటప్పుడు అడ్డంగా కనిపిస్తుంది. దానికాళ్ళను పెనవేసుకొని బంధిస్తుంది. ముందుకు పోనీక వెనక్కిరానీక భయంతో కూలిపోయేలా తోకతో కొడుతుంది. లేస్తే ఒళ్ళు ఝాడించి పైకెగురుతుంది; శౌర్యంతో చీలుస్తుంది. పక్కకు వెళ్ళిపోతుంది. వెనక్కి మరలిపోతుంది. మళ్ళీవచ్చి పట్టుకొంటుంది. కోపిస్తూ బాధపెడుతుంది.

**వ. ఇట్లు విస్మితనక్రచక్రంబు నిర్వక్రవిక్రమంబున నల్పహృదయజ్ఞాన దీపంబు నతిక్రమించు మహామాయాంధకారంబునుంబోలె నంతకంతకు నుత్సాహ కలహ సన్నాహ బహువిధ జలావగాహం బయిన గ్రాహంబు మహాసాహసంబున. 64**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విస్మితనక్రచక్రంబు= ఆశ్చర్యపడిన ఇతర మొసళ్ళ సముదాయంకలది; నిర్వక్రవిక్రమంబునన్= అవక్రపరాక్రమంతో; అల్పహృదయ జ్ఞానదీపంబున్= అల్పహృదయునియొక్క జ్ఞానదీపాన్ని; అతిక్రమించు= అతిశయించే;

మహా మాయాంధకారంబునున్+పోలెన్= గొప్పమాయ అనే చీకటి లాగా; అంతకంతకున్= అంతకంతకు; ఉత్సాహ= ఉత్సాహంతో; కలహ+సన్నాహ= కలహించే ప్రయత్నంతో; బహువిధ= అనేక విధాలుగా; జల+అవగాహంబు+ అయిన= నీటిలో మునిగి తేలే సామర్థ్యం కల్గినది ఐన; గ్రాహంబు= ఆ మకరం; మహాసాహసంబునన్= మిక్కిలి సాహసంతో...

**తా :** ఈ విధంగా అవక్ర పరాక్రమంతో (ఆ మొసలి) తన జాతి మొసళ్ళనన్నిటినీ ఆశ్చర్యచకితుల్ని చేస్తూ మహామాయ అనే పెను చీకటి అల్ప హృదయునియొక్క జ్ఞానదీపాన్ని కప్పివేసిన రీతిగా రానురాను ఉత్సహిస్తూ, కలహ ప్రయత్నాలు చేస్తూ, అనేక విధాలుగా నీటిలో మునగడంలో తేలడంలో సామర్థ్యం కల్గిన ఆ మకరం మిక్కిలి సాహసం

**శా. పాదద్వంద్వము నేలమోపి పవనున్ బంధించి పంచేంద్రియో**
**న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మాఱాకు హత్తించి ని**
**ష్ఖేదబ్రహ్మపదావలంబనరతిం గ్రీడించు యోగీంద్రు మ**
**ర్యాదన్ నక్రము విక్రమించెఁగరిపాదాక్రాంతినిర్వక్రమై. 65**

**ప్రతి :** పాదద్వంద్వము నేలమోపి= రెండు కాళ్ళను నేలమీద గట్టిగా నొక్కిపట్టి (మోపి); పవనున్+బంధించి= గాలిని బిగబట్టి; పంచేంద్రియ+ఉన్మాదంబున్+పరిమార్చి= పంచేంద్రియాల వ్యామోహాన్ని అణగించి; బుద్ధిలతకున్= బుద్ధి అనే తీగకు; మాఱాకున్+హత్తించి= మారాకును తొడిగి; నిస్+ఖేద= ఖేదంలేని (నిరంతరానంద స్వరూపమైన); బ్రహ్మపద+అవలంబనరతిన్= బ్రహ్మపదాన్ని ఆశ్రయించుటలోని ఆసక్తితో; క్రీడించు= ఆనందించేటటువంటి; యోగీంద్రు మర్యాదన్= యోగీంద్రుడిలాగా; కరిపాదాక్రాంతి నిర్వక్రము+ఐ= ఆ గజేంద్రుని పాదాలను ఆక్రమించుటయందు, దీక్ష వక్రింపనిదై; విక్రమించెన్= పరాక్రమం చూపింది.

**తా :** ఆ మొసలి రెండు కాళ్ళను నేలపై దృఢంగా ఆనించింది. ఊపిరి బిగబట్టి పంచేంద్రియాల వ్యామోహాన్ని అణగించింది. బుద్ధి అనే తీగకు మారాకు తొడిగి, ఆనంద స్వరూపమైన పరమాత్మ స్థానాన్ని ఆశ్రయించి ఆనందించే పరమయోగి పుంగవుడిలాగా ఆ ఏనుగు పాదాలను కదలకుండా వదలకుండా గట్టిగా పట్టుకొని తన పరాక్రమం చూపింది.

**విశే :** యోగులు రెండు పాదాలు నేలపై నిలిపి ఉచ్ఛ్వాసనిశ్వాసాలను నియమించి అయిదు జ్ఞానేంద్రియాల వ్యామోహాన్ని అరికడతారు. తద్వారా బుద్ధికి వికాసం కలిగిస్తారు. అలా దుఃఖరహితమైన బ్రహ్మపదాన్ని ఆశ్రయించి ఆనందిస్తారు. ఈ స్థితిని మకరంతో సమన్వయిస్తూ సాగిన పద్యమిది.

**ఆ. వనగజంబు నెగుచు వనచారిఁబొడగని వనగజంబ కాన వజ్రిగజము**
**వెల్ల నై సురేంద్రు వేచి సుధాంధులుఁబట్టఁబట్టనీక బయలు ప్రాఁకె. 66**

**ప్రతి :** వనగజంబున్+ఎగుచు= ఆ అడవి ఏనుగును బాధిస్తున్న; వనచారిన్= నీటిలో చరించే మొసలిని, పొడగని= చూచి; వనగజంబ కాన= నీటి నుండి పుట్టింది కావటం వల్ల; వజ్రిగజము= ఇంద్రుడి ఏనుగైన ఐరావతం; వెల్లను+ఐ= తెల్లబోయినదై; సురేంద్రు+వేచి= దేవేంద్రుని పడదోచి; సుధాంధులు= అమృతపానం చేసే దేవతలు; పట్టన్= పట్టుకోవడానికి రాగా; పట్టనీక= పట్టుకోవడానికి అవకాశం ఇవ్వకుండా; బయలు ప్రాఁకెన్= ఆకాశంలో పరుగెత్తింది.

**తా :** గజేంద్రుని బాధిస్తున్న మొసలిని చూచి స్వర్గంలో ఉండే ఐరావతమే తెల్లబోయింది. అది దేవేంద్రుని కింద పడదోసి దేవతలు పట్టుకోడానికి రాగా దొరక్కుండా ఆకాశంలో పరుగెత్తింది.

**ఉ. ఊహ గలంగి జీవనపుటోలమునంబడి పోరుచున్ మహా**
**మోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగలేక సం**
**దేహముఁబొందు దేహిక్రియ దీనదశన్ గజ ముండె భీషణ**
**గ్రాహదురంతదంతపరిఘట్టితపాదఖురాగ్రశల్యమై. 67**

**ప్రతి :** ఊహ= తన ఆలోచన; కలంగి= కలతచెంది; జీవనపుటోలమునన్= జీవనమనే మరుగు ప్రదేశంలో; పడి= పడిపోయి; మహా మోహలతా నిబద్ధపదమున్= మహామోహమనే తీగతో కట్టివేయబడిన తన పాదాన్ని; విడిపించుకొనంగ లేక= విడిపించుకోలేక; సందేహమున్+పొందు= సందేహానికి గురైన; దేహిక్రియన్= జీవుడి తీరుగా; దీనదశన్= దీనమైన దశలో; భీషణ= భయంకరమైన; గ్రాహ= మొసలి యొక్క; దురంత+దంత= వాడి కోరలచే; పరిఘట్టిత= గట్టిగా కరవబడిన; పాద+ఖుర+అగ్ర+శల్యమై= కాలి గిట్టల అగ్రములు కలదై; పోరుచున్= పోరాడుతూ; గజము+ఉండెన్= ఏనుగు ఉండిపోయింది.

**తా :** ఆ గజేంద్రుడు ఊహ తలకిందై కలత చెందాడు. బతుకు మరుగులో పడి, మహామోహమనే తీగతో కట్టివేయబడ్డ తన పాదాన్ని విడిపించుకోలేని స్థితిలో సందేహస్థితిలో దీనంగా భయంకరమైన మొసలి యొక్క వాడి కోరలకు చిక్కి కరవబడి గాయమైన కాలిగిట్టలతో, ఇంకా పోరాడుతూనే ఉన్నాడు.

**విశే :** సంసారంలో ఉన్న జీవుడు జీవనమనే గహన ప్రదేశంలో చిక్కుకుంటాడు. మోహలతాబంధనాన్ని విడిపించుకోలేడు. పలు సంశయాలకు పాత్రమవుతాడు. అట్టివాని దీనదశతో ఇక్కడ గజేంద్రుని దీనావస్థ పోల్చబడింది.

**వ. ఇవ్విధంబున. 68**

**ప్రతి :** ఈ విధంగా (పోరాడుతుండగా).

**క. అలయక సొలయక వేసట, నొలయక కరి మకరితోడ నుద్దండత రా**
**త్రులు సంధ్యలు దివసంబులు, సలిపెం బో రొక్కవేయి సంవత్సరముల్. 69**

**ప్రతి :** కరి= ఆ గజేంద్రుడు; మకరితోడన్= మొసలితో; అలయక= అలసిపోకుండా; సొలయక= స్రుక్కిపోకుండా; వేసటన్+ఒలయక= విసుగుచెందకుండా; రాత్రులు= రాత్రుళ్ళు; సంధ్యలు= ఉభయ సంధ్యలు; దివసంబులు= పగళ్ళు; ఒక్క వేయిసంవత్సరముల్= వేయి సంవత్సరాలపాటు; పోరు= యుద్ధం; సలిపెన్= చేశాడు.

**తా :** ఆ గజేంద్రుడు ఆ మొసలితో అలసిపోకుండా, స్రుక్కిపోకుండా, విసుగులేకుండా, పగళ్ళు, సంజలు, రాత్రులు – ఎడ తెరిపిలేకుండా వేయి సంవత్సరాలపాటు పోరు సాగించాడు.

**మ. పృథుశక్తిన్ గజ మా జలగ్రహముతోఁబెక్కేండ్లు పోరాడి సం**
**శిథిలంబై తన లావు వైరిబలముం జింతించి మిథ్యామనో**
**రథమింకేటికి? దీని గెల్వ సరి పోరంజాలరా దంచు స**
**వ్యథమై యిట్లనుఁబూర్వపుణ్యఫలదివ్యజ్ఞానసంపత్తితోన్; 70**

**ప్రతి :** పృథుశక్తిన్= గొప్ప బలంతో; గజము= ఆ గజేంద్రుడు; ఆ జలగ్రహముతో= ఆ మొసలితో; పెక్కేండ్లు పోరాడి= అనేక సంవత్సరాలు పోరుసల్పి; సంశిథిలంబు+ఐ= బాగా చితికిపోయి; తనలావున్= తన బలాన్ని; వైరిబలమున్= శత్రువుయొక్క బలాన్ని; చింతించి= ఆలోచించి; ఇంక+మిథ్యామనోరథము+ఏటికి= ఇంకా అడియాస ఎందుకు?; దీని గెల్వన్+సరిపోరన్+చాలరాదు+అంచున్= దీనిని ఓడించడానికి సరిగా పోరడానికి నాకు సాధ్యం కాదని అనుకొంటూ; సవ్యథము+ఐ= దుఃఖపడుతూ; పూర్వపుణ్యఫల= పూర్వజన్మంలో చేసిన పుణ్యఫలమైన; దివ్యజ్ఞానసంపత్తితోన్= అసాధారణమైన జ్ఞానసంపదతో; ఇట్లు+అనున్= ఈ విధంగా అనుకొన్నది.

**తా :** గొప్పబలంతో గజరాజు ఆ మకరరాజుతో పలు సంవత్సరాలు పోరాడి బాగా చితికిపోయాడు. తన బలాన్ని, మొసలి బలాన్ని పోల్చి చూచుకొని ఇలా ఆలోచించాడు. ఇంకా దీన్ని గెలవాలన్న అడియాస కూడదు. దీనితో సమంగా పోరాడే శక్తి నాలో లేదు; అనుకొంటూ పూర్వజన్మలో చేసిన పుణ్యకర్మ ఫలమైన దివ్యజ్ఞానం స్ఫురించగా ఈ విధంగా అనుకొన్నాడు.

**విశే :** భగవంతుడు చరాచర జగత్తుకంతా ప్రభువు. మనుష్యులకే కాక ఆ దేవుడు పశుపక్ష్యాదులకు తన అపారమైన అనుగ్రహం చూపుతాడు. అందువల్లనే క్లిష్టదశలో ఉన్న గజేంద్రునికి పూర్వపుణ్యఫలమైన దివ్యజ్ఞానం సిద్ధించింది. అదే అతనికి తరుణోపాయం అయింది.

**శా. ఏ రూపంబున దీనిగెల్తు? నిట మీఁదేవేల్పుఁజింతింతు? నె**
**వ్వారింజీరుదు? నెవ్వరడ్డ? మిఁక ని వ్వారిప్రచారోత్తమున్**
**వారింపందగువార లెవ్వ? రఖిలవ్యాపారపారాయణుల్**
**లేరే! మ్రొక్కెద దిక్కుమాలిన మొఱాలింపంబ్రపుణ్యాత్మకుల్. 71**

**ప్రతి :** ఏ రూపంబునన్= ఏ విధంగా; దీనిన్+గెల్తున్= దీన్ని గెలవగలను?; ఇటమీఁదన్= ఇకపై; ఏ వేల్పున్+చింతింతున్= ఏ దేవుని ప్రార్థించాలి?; ఎవ్వారిన్+చీరుదున్= ఎవరిని పిలిచేది?; ఎవ్వరడ్డము+ఇకన్= ఇక నన్ను ఎవరు కాపాడుతారు?; ఈ+వారి ప్రచార+ఉత్తమున్= ఈ దొడ్డ మొసలిని; వారింపన్+తగువారలు+ఎవ్వరు?= అడ్డగించే వారెవరున్నారు?; అఖిల వ్యాపారపారాయణుల్= అన్ని కార్యాలలోనూ దిట్టలయినవారు; ప్రపుణ్యాత్మకుల్= గొప్ప పుణ్యంచేసిన మహానుభావులు; దిక్కుమాలిన మొఱ= దిక్కులేనివారి మొరను; ఆలింపన్+లేరే= విని సాయపడేవారు లేరా!; మ్రొక్కెదన్= అలాంటివారికి నమస్కరిస్తాను.

**తా :** ఏ విధంగా ఈ మొసలిని గెలవగలను?ఇకపైన ఏ దేవుని ప్రార్థించేది? ఎవరిని రక్షించమని పిలిచేది? దొడ్డదైన ఈ మొసలి పరాక్రమాన్ని అడ్డగించేవారు ఎవరూ లేరా! అన్ని కార్యాలను సాధించేవారు, పుణ్యాత్ములైన మహానుభావులు ఎవరూ దిక్కులేని ఈ నా మొరను ఆలకించేవారు లేరా! ఉంటే వారికి నమస్కరిస్తాను.

**విశే :** తాను శక్తిహీనుడనని గుర్తించటమే తరించడానికి మొదటిమెట్టు. శరణాగతికి మూల మీ భావనే.

**శా. నానానేకపయూథముల్ వనములోనంబెద్దకాలంబు స**
**న్మానింపన్ దశలక్షకోటికరిణీనాథుండనై యుండి మ**
**ద్దానాంభఃపరిపుష్టచందనలతాంతచ్ఛాయలందుండ లే**
**కీ నీరాశ నిటేల వచ్చితి, భయం బెట్లో కదే యీశ్వరా! 72**

**ప్రతి :** నానా+అనేకప+యూథముల్= పెక్కు ఏనుగుల సమూహాలు; పెద్దకాలంబు= చాలాకాలంగా; సన్మానింపన్= గౌరవించగా; దశలక్షకోటి= పది లక్షల కోట్ల; కరిణీనాథుండను+ఐ= ఆడ ఏనుగులకు అధినాథుడుగా; వనములోనన్= ఈ అడవిలో; ఉండి= సుఖంగా జీవించి; మత్= నాయొక్క; దాన+అంభః+పరిపుష్ట= దాన జలధారలచే పెంపుగా పెరిగిన; చందనలతా= చందన లతలచేత; అంత= అందమైన; ఛాయలన్= నీడల్లో; ఉండలేక= ఉండకుండా; ఈ నీరాశన్= ఈ నీళ్ళపై ఆశతో; ఇటు+ఏల వచ్చితిన్?= ఇక్కడికి ఎందుకు వచ్చాను; భయంబు= భయమవుతోంది; ఈశ్వరా= భగవంతుడా!; ఎట్లో కదే= నాగతి ఏమవుతుందో?

**తా :** ఈ అడవిలో చాలాకాలంగా పెక్కు ఏనుగుల సమూహాలు నన్ను గౌరవిస్తూ వస్తున్నాయి. పది లక్షల కోట్ల ఆడ ఏనుగులకు అధినాథుడుగా ఉన్నాను. నా దాన జలధారలతో ఏపుగా పెరిగిన ఈ మంచి గంధపు చెట్ల నీడల్లో హాయిగా ఉండకుండా ఈ నీరాశ ఎందుకు పుట్టాలి? ఈ మడుగుకే ఎందుకు రావాలి! భయం పుడుతోంది. భగవంతుడా! ఇక నా గతి ఏమవుతుందో?

**ఉ. ఎవ్వనిచే జనించు జగ; మెవ్వని లోపల నుండు లీనమై;**
**యెవ్వనియందు డిందుఁ; బరమేశ్వరుఁడెవ్వఁడు; మూలకారణం**
**బెవ్వఁ; డనాదిమధ్యలయుఁడెవ్వఁడు; సర్వముఁదానయైన వాఁ**
**డెవ్వఁడు; వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్. 73**

**ప్రతి :** ఎవ్వనిచేన్+జగము+జనించున్= ఎవ్వనివల్ల ఈ జగత్తంతా పుడుతుందో; ఎవ్వని లోపలన్+లీనమై+ఉండున్= ఎవ్వనిలోపల అణగి ఉంటుందో; ఎవ్వని యందున్+డిందున్= ఎవ్వనిలో చివరికి లీనమైపోతుందో; ఎవ్వఁడు+ పరమేశ్వరుఁడు= ఎవ్వడు పరమాత్ముడో; ఎవ్వఁడు+మూలకారణంబు= ఈ విశ్వానికి మూలకారణం ఎవడో; అనాది మధ్యలయుఁడు+ఎవ్వఁడు= ఎవనికి పుట్టుక, పెరుగుదల, నాశనం ఉండదో; ఎవ్వఁడు+సర్వము+తానయైనవాఁడు= ఎవడు అన్నీ తానేయై ఉంటాడో; ఆత్మభవున్+వానిన్= తనంతట తానుగా ప్రభవించే అతనిని; ఈశ్వరునే= ప్రభువైన సర్వ నియామకుణ్ణే; శరణంబు+వేఁడెదన్= శరణు కోరుతాను.

**తా :** ఈ జగత్తంతా ఎవనివల్ల పుడుతోందో; ఎవని లోపల అణగి ఉంటుందో; ఎవనిలో లీనమై పోతోందో; ఎవడు పరమాత్ముడో, ఈ విశ్వానికి మూలకారణం ఎవడో, ఎవనికి పుట్టుక, పెరుగుదల, వినాశం, ఉండవో, ఎవడు అన్నీ తానే యై ఉంటాడో, తనంతట తానుగా ఎవడు పుడతాడో, ప్రభువైన ఆ విశ్వనియామకుణ్ణి శరణు కోరుతాను.

**విశే :** ఈ పద్యం విశ్వజనీనమైన ప్రార్థనగా ప్రసిద్ధమైనది. వ్యాసభగవానుడు వ్రాసిన ఈ క్రింది శ్లోకం దీనికి మూలం.

**యస్మిన్నిదం యతశ్చేదం – యేనేదం య ఇదం స్వయమ్**
**యోఽస్మాత్పరస్మాచ్చ పరః – తం ప్రపద్యే స్వయంభువమ్ (8-3-3)**

**యతోవా ఇమాని భూతాని జాయంతే –** ఇత్యాది శ్రుతి కూడా ఇక్కడ అనుసంధింపదగి ఉన్నది.

**క. ఒకపరి జగములు వెలి నిడి యొకపరి లోపలికిఁగొనుచు నుభయముఁదానై**
**సకలార్థసాక్షి యగు నయ్యకలంకుని నాత్మమూలు నర్థిఁదలంతున్. 74**

**ప్రతి :** ఒకపరి= ఒకసారి; జగములు+వెలిన్+ఇడి= లోకాలను బయటికి తీసిపెట్టి; ఒకపరి= ఇంకొకసారి; లోపలికిన్+ కొనుచున్= లోపలికి లాగుకొంటూ; ఉభయమున్+తాను+ఐ= అంతర్బహిర్జగత్తులు (బయటికి వచ్చినవి, లోపలికి పోయినవి)– ఈ రెండూ తానై; సకల+అర్థ+సాక్షి+అగు= అన్నింటికీ సాక్షీభూతుడగు – చూస్తూ ఉన్నటువంటి; ఆ+అకలంకునిన్= ఆ శుద్ధసత్త్వుని; ఆత్మమూలున్= ఆత్మలకు మూలమైన ఆ పరమాత్ముని; అర్థిన్= జిజ్ఞాసతో, తలంతున్= ధ్యానిస్తాను.

**తా :** ఒకసారి ఈ లోకాలను సృష్టిస్తాడు. ఇంకోసారి తనయందు లీనం చేసుకొంటాడు. అదీ ఇదీ రెండూ తానే. అన్నిటినీ చూస్తూ ఉంటాడు. కాని దేనిచేత మలినపడని శుద్ధసత్త్వుడాయన. ఆత్మలకు మూలమైన పరమాత్మ స్వరూపం తనది. అతనినే ధ్యానిస్తాను.

**క. లోకంబులు లోకేశులు లోకస్థులుఁదెగిన తుది నలోకంబగు పెం**
**జీఁకటి కవ్వల నెవ్వం డేకాకృతి వెలుఁగు నతనినే సేవింతున్. 75**

**ప్రతి :** లోకంబులు= ఈ లోకాలూ; లోకేశులు= లోకపాలకులూ; లోకస్థులున్= లోకాలలో ఉండేవారూ; తెగిన తుదిన్= అందరూ నశించిన అనంతరం కూడా; అలోకంబు+అగు= లోకరహితమయిన; పెన్+చీఁకటికిన్= కారుచీకట్లకు; అవ్వలన్= అవతల; ఎవ్వండు= ఏ పరమాత్ముడైతే; ఏకాకృతిన్= ఏకాకారంతో; వెలుఁగున్= ప్రకాశిస్తుంటాడో; అతనిన్+ఏ= అతనినే; సేవింతున్= సేవిస్తాను.

**తా :** ఈ లోకాలు, లోకపాలకులు, లోకాలలో ఉండేవారు అందరూ నశించిన తరువాత కూడా లోకరహితమైన కారుచీకట్లకు ఆవల అఖండతేజోరూపంగా నిత్యం ఎవడు ప్రకాశిస్తూ ఉంటాడో ఆ పరమాత్మను భావించి సేవిస్తాను.

**క. నర్తకునిభంగిఁబెక్కగు, మూర్తులతో నెవ్వఁడాడు? మునులు దివిజులుం**
**గీర్తింప నేర రెవ్వని, వర్తన మొరు లెఱుఁగ రట్టి వాని నుతింతున్. 76**

**ప్రతి :** ఎవ్వఁడు= ఏ దేవదేవుడు; నర్తకుని భంగిన్= నటుని లాగా; పెక్కు+అగు+మూర్తులతోన్= అనేక రూపాలతో; ఆడున్= నటిస్తాడో; మునులున్= ఋషులు; దివిజులున్= దేవతలు; ఎవ్వనిన్= ఎవ్వనిని; కీర్తింపన్+నేరరు= పొగడజాలరో; ఎవ్వని వర్తనము= ఎవని ప్రవర్తన; ఒరులు+ఎఱుఁగరు= ఇతరులు గ్రహించలేరో; అట్టివానిన్= అట్టి పరమ పురుషుని; నుతింతున్= స్తోత్రం చేస్తాను.

**తా :** ఏ దేవుడు నటుడిలాగా పెక్కు రూపాలతో నటిస్తాడో, ఋషులు, దేవతలు ఎవనిని స్తుతింపజాలరో, ఎవని ప్రవర్తన ఇతరులకు అగోచరంగా ఉంటుందో, అలాంటి పరమపురుషుని స్తుతిస్తాను.

**ఆ. ముక్తసంగులైన మునులు దిదృక్షులు, సర్వభూతహితులు సాధుచిత్తు**
**లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని, దివ్యపదము వాఁడు దిక్కు నాకు. 77**

**ప్రతి :** ముక్తసంగులు+ఐన= ప్రపంచంలోని అన్నిబంధాలను వీడిన; మునులు; దిదృక్షులు= భగవంతుని చూడాలని కోరేవారు; సర్వభూత హితులు= అన్ని ప్రాణులకు మేలు కోరేవారు; సాధుచిత్తులు= మంచి మనస్సు కలవారు; అసదృశ= సాటిలేని; వ్రత+ఆఢ్యులు+ఐ= వ్రతములు చేస్తూ; ఎవ్వని= ఎవ్వనియొక్క; దివ్యపదము= దివ్యపాదము; కొల్తురు= సేవిస్తారో; వాడు= ఆ దేవుడా; నాకున్ దిక్కు= నాకు దిక్కు (అగుగాక!)

**తా :** ప్రపంచంలోని అన్ని బంధాలను వదిలి వేసిన ఋషులు, భగవద్దర్శనం కోరే పుణ్యాత్ములు, సకల ప్రాణుల మేలు కోరే సాధువులు, మంచి మనస్సున్నవారు, సాటిలేని వ్రతాలు ఆచరిస్తూ ఎవనిని అర్చిస్తారో ఆ దివ్య పదస్థానీయుడైన పరమపురుషుడే నాకు దిక్కు. అతడే నన్ను కాపాడుగాక!

**సీ. భవము దోషంబు రూపంబుఁగర్మంబు నాహ్వయమును గుణము లెవ్వనికి లేక**
**జగములఁగలిగించు సమయించు కొఱకునై నిజమాయ నెవ్వఁడిన్నియును దాల్చు**
**నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ కిద్ధరూపికి రూపహీనునకును**
**జిత్రచారునికి సాక్షికి నాత్మరుచికినిఁబరమాత్మునకుఁబరబ్రహ్మమునకు**

**ఆ. మాటలను నెఱుకల మనములఁజేరంగఁ, గాని శుచికి సత్త్వగమ్యుఁడగుచు**
**నిపుణుఁడైనవాని నిష్కర్మతకు మెచ్చు, వాని కే నొనర్తు వందనములు. 78**

**ప్రతి :** ఎవ్వనికిన్= ఎవనికి; భవము= పుట్టుక; దోషంబు= పాపం; రూపంబు= రూపం; కర్మంబు= కర్మ; ఆహ్వయము= నామం; గుణములు= గుణాలు; లేక= లేకుండానే; నిజమాయన్= తన మాయాశక్తిచేత; జగములన్= ఈ లోకాలను; కలిగించు+సమయించు+కొఱకునై= పుట్టించడానికి, నశింపచేయడానికి; ఇన్నియునున్+తాల్చున్= పుట్టుక మొదలైన వాటిని ధరిస్తున్నాడు. ఆ పరేశునికిన్= ఆ పరమేశ్వరునికి (సార్వభౌమునికి); అనంత శక్తికిన్= అనంతమైన శక్తి సామర్థ్యాలున్న వానికి; బ్రహ్మకు= సకల సృష్టికర్తకు; ఇద్ధరూపికిన్= ప్రకాశకునిమూర్తికి; రూపహీనునకున్= రూపం లేనివానికి; చిత్రచారునికిన్= చిత్రమైన ప్రవర్తన శీలం కలవానికి; సాక్షికిన్= సకల జగత్ సాక్షీభూతునికి; ఆత్మరుచికిన్= ఆత్మకాంతి కల వానికి; పరమాత్మునకున్= ఆత్మలకు మూలమైన వానికి; పరబ్రహ్మమునకున్= ఆ పరతత్త్వానికి; మాటలను= మాటలచేత; ఎఱుకలన్= భిన్నజ్ఞానాలతో; మనములన్= మనస్సులతో; చేరంగన్+కాని= సమీపించడానికి సాధ్యంకాని; శుచికిన్= పరిశుద్ధునికి; సత్త్వగమ్యుఁడు+అగుచున్= కేవలం సత్త్వగుణంతో దరిచేరదగిన వానికి; నిపుణుడు+ఐన+వాని= నేర్పరిగల సాధకుని యొక్క; నిష్కర్మతకున్= ఫలాపేక్షరహితమైన కర్మరాహిత్యానికి; మెచ్చువానికిన్= మెచ్చుకొనే వానికి; ఏను= నేను; వందనములు= నమస్సులు; ఒనర్తున్= చేస్తాను.

**తా :** ఎవరు పుట్టుక, పాపం, రూపం, కర్మ, నామ గుణాలు లేనివాడైనా లోకాలను సృష్టించడానికి, నశింపచేయడానికి ఆత్మ మాయాశక్తితో వీటినన్నింటినీ పొందుతున్నాడో, ఆ సార్వభౌమునికి, అనంతశక్తిమంతునికి, సకలసృష్టి కర్తకు, పుణ్యమూర్తికి, రూపాతీతునికి, చిత్రప్రవర్తన శీలం గలవానికి, సకల సాక్షిభూతునికి, ఆత్మకాంతితో ప్రకాశించే వానికి, ఆత్మమూలునికి, పరతత్త్వానికి, మాటలకు, ఊహలకు, జ్ఞానానికి అందనివానికి, పరిశుద్ధునికి, కేవలం సత్త్వగుణంతో సమీపించగలవానికి, ఫలాపేక్ష రహితంగా కర్మను చేసే నేర్పరిని అభినందించే వానికి, నేను నమస్కరిస్తాను.

**సీ. శాంతున కపవర్గసౌఖ్యసంవేదికి నిర్వాణభర్తకు నిర్విశేషు**
**నకు, ఘోరునకు గూఢునకు గుణధర్మికి సౌమ్యున కధికవిజ్ఞానమయున**
**కఖిలేంద్రియద్రష్ట కధ్యక్షునకు బహుక్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి**
**మూలప్రకృతి కాత్మమూలున కఖిలేంద్రియజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి**

**అ. నెఱి నసత్య మనెడి నీడతో వెలుఁగుచు, నుండు నెక్కటికి మహోత్తరునకు**
**నిఖిలకారణునకు, నిష్కారణునకు నమస్కరింతు నన్ను మనుచుకొఱకు. 79**

**ప్రతి :** శాంతునకున్= శాంతస్వరూపునికి; అపవర్గసౌఖ్య సంవేదికిన్= మోక్షసుఖాన్ని ఎలా ప్రసాదించాలో తెలిసినవానికి; నిర్వాణభర్తకున్= మోక్షస్థాన అధిపతికి; నిర్విశేషునకున్= స్వపరభేద రహితునికి; ఘోరునకున్= ఘోరంగా దుష్టులను శిక్షించేవానికి; గూఢునకున్= పరమ గుహ్యమైన యోగమూర్తికి (సంసారబద్ధులకు అందనివానికి); గుణధర్మికిన్= గుణాలనే ధర్మంగా కలవానికి (గుణాలే అతని స్వరూపాన్ని చెబుతాయని అర్థం); సౌమ్యునకున్= సౌమ్యస్వభావునికి; అధిక విజ్ఞాన మయునకున్= విశేషమైన జ్ఞానం కలిగినవానికి; అఖిలేంద్రియద్రష్టకున్= అన్ని ఇంద్రియాల వ్యాపారాలనూ చూచేవానికి; అధ్యక్షునకున్= అన్నిటినీ చేసే ప్రభువుకు; బహుక్షేత్రజ్ఞునకున్= సర్వజ్ఞునికి; దయాసింధుమతికిన్= దయారసానికి సముద్రం లాంటివానికి; మూలప్రకృతికిన్= అన్నింటికీ మూలతత్త్వమైనవానికి; ఆత్మమూలునకున్= ఆత్మకు ఆధారమైనవానికి; అఖిలేంద్రియ జ్ఞాపకునకున్= అన్ని ఇంద్రియాలను జ్ఞాపకం చేసేవానికి (వాటివాటి పనులను గుర్తు చేసేవాడు); దుఃఖాంతకృతికిన్= దుఃఖాన్ని పోగొట్టేవానికి; నెఱిన్= నిండుగా; అసత్యము+అనెడి+నీడతోన్+వెలుఁగుచున్= మాయ అనే నీడతో ప్రకాశిస్తూ; ఉండు+ఎక్కటికిన్= ఉండేటటువంటి ఒంటరివానికి (ఏకాంత స్వరూపునికి); మహోత్తరునకున్= మిక్కిలి గొప్పవానికి; నిఖిల కారణునకున్= అన్నిటికీ కారణమైన వానికి; నిష్కారణునకున్= ఏ కారణము లేనివానికి; నన్నున్+మనుచు కొఱకున్= నన్ను కాపాడుమంటూ; నమస్కరింతున్= నమస్కరిస్తాను.

**తా :** పరమాత్ముడు శాంతస్వరూపం గలవాడు. మోక్షమార్గ ప్రదాత. మోక్షస్థానానికి (వైకుంఠానికి) అధిపతి. స్వపరభేదం లేనివాడు. దుష్టులకు ఘోరస్వరూపంతో దర్శనమిస్తాడు. అతని తత్త్వం చాలా నిగూఢమైనది. గుణాలద్వారా అతని ధర్మాన్ని గుర్తించగలం (రూపాలద్వారా కాదని అర్థం); సౌమ్యస్వభావుడాయన. అతని జ్ఞానం అతీతమైనది. అఖిలేంద్రియ వ్యాపారాలను చూస్తాడాయన. అన్నిటినీ గమనిస్తుంటాడు. సర్వజ్ఞు డా ప్రభువు. దయామయుడు. సర్వానికీ మూలమతడే. ఆత్మకు ఆధారమూ అతడే. ఇంద్రియ జ్ఞాపకుడు ఆయనే. దుఃఖాలను ఉపశమింపచేసేవాడూ ఆయనే. నిండుగా మాయ అనే నీడతో పాటు ప్రకాశిస్తుంటాడు. ఏకాంతమూర్తి ఆయన. అతనికన్నా ఉత్కృష్టులు ఎవరూ లేరు. అన్నిటికీ కారణభూతుడతడే. అతని ఉనికికి మాత్రం ఏకారణమూ లేదు. అలాంటి ప్రభువును నన్ను కాపాడుమని నమస్కరిస్తాను.

**విశే :** విష్ణుసహస్రనామంలో ఈ లక్షణాలన్నిటినీ వ్యాసమహర్షి వివరించి ఉన్నాడు. విష్ణునామాలన్నీ గుణవాచకాలే. అంచేత ఆయన 'గుణధర్మి!' ఇంద్రియాలను నియమిస్తాడు – కాబట్టే **'ఉపేంద్రు'** డని అంటారు. **'గూఢ'** తత్త్వం కాబట్టే భగవద్రహస్యాన్ని **'రాజగుహ్య'** యోగమన్నారు. **'నిష్కారణతత్త్వం'** – అనగా భగవంతుని ఉనికిని తర్కంతో నిరూపించలేమని అర్థం. అందుకే **'నామమీయమానా'** (తర్కంతో ఊహించలేము) అని అన్నారు. అందుకే వ్యాసభగవానుడు **'నిష్కారణాయాద్భుత కారణాయ'** (8–3–15) అని ఆ కారణం కాని కారణం ఒక 'మహాద్భుత' మన్నాడు. భగవంతుడు ఈ అద్భుతానికి వ్యక్తీకృతి.

**క. యోగాగ్నిదగ్ధకర్ములు యోగీశ్వరు లే మహాత్ము నొం డెఱుఁగక స**
**ద్యోగవిభాసితమనముల బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్. 80**

**ప్రతి :** యోగీశ్వరులు= పరమశ్రేష్ఠులైన యోగులు; యోగ+అగ్ని= యోగమనే అగ్నిలో; దగ్ధకర్ములు= కర్మలను కాల్చివేసిన వారై; ఒండు+ఎఱుఁగక= ఇతర విషయాల్ని దేనినీ తలచకుండా; సద్యోగ= బాగుగా కుదిరిన యోగం చేత; విభాసిత

మనములన్= ప్రకాశిస్తున్న మనస్సుల్లో; ఏ మహాత్మున్= ఏ మహాదేవుని; బాగుగన్= చక్కగా; వీక్షింతురు= చూస్తారో; అట్టి పరమున్= అలాంటి ప్రభువును; భజింతున్= సేవిస్తాను.

**తా :** యోగీంద్రులు యోగమనే అగ్నిలో తమ కర్మలను కాల్చివేసి, ఇంకాదేనినీ తలుచుకోకుండా ఏకాగ్రతలో బాగా కుదిరిన యోగంచేత ప్రకాశిస్తున్న మనస్సుల్లో ఏ దేవదేవుని సదా చూస్తుంటారో, ఆ పరమపురుషుణ్ణి నేను సేవిస్తాను.

**సీ. సర్వాగమామ్నాయజలధికి నపవర్గ మయునికి నుత్తమమందిరునకు**
**సకలగుణారణిచ్ఛన్నబోధాగ్నికిఁదనయంత రాజిల్లు ధన్యమతికి**
**గుణలయోద్దీపితగురుమానసునకు సంవర్తితకర్మనిర్వర్తితునకు**
**దిశ లేని నాబోఁటి పశువుల పాపంబు లడఁచువానికి సమస్తాంతరాత్ముఁ**

**ఆ. డై వెలుంగువాని కచ్ఛిన్నునకు భగ, వంతునకుఁదనూజపశునివేశ**
**దారసక్తు లయినవారి కందఁగరాని, వాని కాచరింతు వందనములు. 81**

**ప్రతి :** సర్వాగమ+ఆమ్నాయ జలధికిన్= సర్వ ఆగమాలకూ – వేదాలకూ సముద్రంవంటి వానికి; అపవర్గమయునికిన్= మోక్షస్వరూపునికి; ఉత్తమమందిరునకున్= ఉత్తమ గుణాలకు నిలయమైనవానికి; సకలగుణ+అరణి+ఛన్న+బోధ+అగ్నికిన్= అరణి కొయ్యలో దాగిన అగ్నిలాగా గుణాలలో 'బోధ' (జ్ఞాన) రూపంగా ప్రకాశించేవానికి; తనయంతన్ రాజిల్లు ధన్యమతికిన్= తనంత తానుగా ప్రకాశించే గొప్ప మనసున్న ప్రభువుకు; గుణలయ+ఉద్దీపిత+గురుమానసునకున్= గుణములు లయించటంచేత (గుణముల క్షోభచేత) ఉద్దీప్తమైన జగత్కర్మగల ఉన్నత మనస్కునికి; సంవర్తిత+కర్మ నిర్వర్తితునకున్= కర్మలనుండి నివృత్తి పొందినవారిలో బాగా ప్రవర్తించేవానికి; దిశలేని= దిక్కులేని; నాబోఁటి= నావంటి; పశువుల పాపంబులు+అడఁచువానికిన్= జంతువుల (జీవరాశులు) పాపాలను పోగొట్టేవానికి; సమస్త+అంతరాత్ముఁడై+ వెలుంగు వానికిన్= అందరిలోనూ అంతరాత్మగా వెలిగేవానికి; అచ్ఛిన్నునకున్= అవ్యయునికి (నాశం లేనివానికి); భగవంతునకున్= పూజింపదగ్గ భగవద్రూపునికి; తనూజ+పశు+నివేశ+దార+సక్తులైన వారికిన్= పుత్ర, పశు, గృహ భార్యలలో ఆసక్తికలవారికి; అందఁగ రానివానికిన్= పొందజాలని వానికి; వందనములు= నమస్కారాలు; ఆచరింతున్= ఆచరిస్తాను.

**తా :** పరమాత్ముడు అన్ని ఆగమాలకు వేదాలకూ సముద్రంలాంటివాడు. మోక్షస్వరూపుడాయన. ఉత్తమ గుణాలకు ఆలవాలం. సృష్టి, లయాలలో రెండింటా ప్రవర్తించేవాడు ఆయనే (గుణాల విధ్వంసంచేత సృష్టించి, కార్యాలలోని నిరాసక్తత చేత లయింపచేసే తత్త్వమున్న వాడు); దిక్కులేని నాలాంటి జంతువుల పాపాలను పోగొట్టే వాడాయనే.అందరిలోనూ అంతరాత్మగా వెలిగే వాడూ అతడే. అవ్యయుడు, పూజింపదగ్గ భగవద్రూపుడు కూడా ఆయనే. భార్యాపుత్ర పశు ఆలయాలమీద ఆసక్తిలో మునిగిన వారికి ఎప్పుడూ ఆయన లభించడు. అలాంటి ఆ మహానుభావునికి నమస్కారాలు.

**వ. మఱియును. 82**

**తా :** అని ఇంకా ఇలా ఆలోచించాడు.

**సీ. వరధర్మకామార్థవర్జితకాములై విబుధు లెవ్వాని సేవించి యిష్ట**
**గతిఁబొందుదురు? చేరి కాంక్షించువారి కవ్యయదేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ?**

**ముక్తాత్ములెవ్వని మునుకొని చింతింతు? రానందవార్ధిమగ్నాంతరంగు**
**లేకాంతు లెవ్వని నేమియుఁగోరక భద్రచరిత్రంబుఁబాడుచుందు?**

**ఆ. రా మహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మ, యోగగమ్యుఁబూర్ణు నున్నతాత్ము**
**బ్రహ్మమైన వానిఁబరుని నతీంద్రియు, నీశు స్థూలు సూక్ష్ము నే భజింతు. 83**

**ప్రతి :** విబుధులు= పండితులు; ఎవ్వాని+సేవించి= ఎవనిని సేవించడం ద్వారా; వర= శ్రేష్ఠమైన; ధర్మకామార్థ వర్జిత కాములు+ఐ= ధర్మార్థ కామాలమీద ఆశలు విడిచినవారై; ఇష్టగతిన్= వారు కోరిన వరాన్ని; పొందుదురు= పొందుతారో; ఎవ్వాఁడు= ఎవడైతే; కరుణన్= కరుణతో; చేరి= తనను సమీపించి (శరణుపొంది); కాంక్షించువారికిన్= కోరినవారికి; అవ్యయ దేహమున్+ఇచ్చున్= నాశనం లేని శరీరాన్ని ప్రసాదిస్తాడో; ముక్త+ఆత్ములు= బంధాలనుండి విమోచనం పొందిన పుణ్యాత్ములు; ఎవ్వనిన్= ఎవ్వనికి; మునుకొని= ప్రయత్నపూర్వకంగా; చింతింతురు= చింతిస్తారో (ధ్యానిస్తారో); ఆనందవార్ధి+మగ్న+అంతరంగులు+ఏకాంతులు= ఆనంద సముద్రంలో మునిగిన హృదయాలు కల్గిన అంతరంగ భక్తులు; ఏమియున్+కోరక= ఏమీ ఆశించకుండా; ఎవ్వని= ఎవనియొక్క, భద్రచరిత్రంబున్+పాడుచుందురు= పవిత్ర చరిత్రను పాడుతుంటారో; ఆ మహేశున్= ఆ మహాదేవుని (ఆ సార్వభౌముని); ఆద్యున్= అందరికన్నా మొదటి వానిని; అవ్యక్తున్= కంటికి కానరాని వానిని; అధ్యాత్మ యోగగమ్యున్= అధ్యాత్మ యోగంచేత మాత్రమే పొందదగిన వానిని; పూర్ణున్= పరిపూర్ణుని; ఉన్నతాత్మున్= మహోన్నతుని (మహాత్ముని); బ్రహ్మమైనవానిన్= పరబ్రహ్మ స్వరూపుని; పరునిన్= సర్వశ్రేష్ఠుని; అతి+ఇంద్రియున్= ఇంద్రియాలకు అతీతుని; ఈశున్= అన్నిటికీ ప్రభువైనవానిని; స్థూలున్+సూక్ష్మున్= స్థూలంగానూ, సూక్ష్మంగానూ రెండు విధాలా కనిపించేవానిని; ఏన్= నేను; భజింతున్= సేవిస్తాను.

**తా :** ఎవనిని సేవించడం ద్వారా ధర్మార్థకామాలను విసర్జించి పండితులు తాము కోరిన వరాలను పొందుతారో; ఎవడు తనను సమీపించిన అంకిత భక్తులకు నాశనంలేని శరీరాన్ని ప్రసాదిస్తాడో; బంధ విముక్తులు నిరంతరం పూనుకొని ఎవరిని ధ్యానిస్తూ ఉంటారో, ఆనంద సముద్రంలో మునిగి ఉండే అంతరంగ భక్తులు (స్వామివారి నుండి) ఏమీ ఆశించకుండా ఎవని దివ్యభవ్య చరిత్రను ప్రేమతో గానం చేస్తుంటారో; ఆ మహాదేవుడే ఇన్నింటికీ ఆద్యుడు. కంటికి కాని రానివాడైనా అన్నిటికీ ప్రభువతడే. అధ్యాత్మ యోగంచేత మాత్రమే అతనిని పొందగలం. అతడు పరిపూర్ణుడు. మహోన్నతాత్ముడు. పరబ్రహ్మ స్వరూపుడాయన. అతడే సర్వశ్రేష్ఠుడు. ఇంద్రియాతీతుడు అతడే. బ్రహ్మాండనాయకుడతడే. స్థూలసూక్ష్మ రూపాలతో వెలిగే ఏకైక తత్త్వం ఆయనే. అతనినే నేను సేవిస్తాను.

**వ. అని మఱియు నిట్లని వితర్కించె. 84**

**ప్రతి :** అని; మఱియున్; ఇట్లు+అని= ఈ విధంగా; వితర్కించెన్= భావించెను.

**తా :** ఇంకా ఈ విధంగా భావించడం మొదలు పెట్టాడు.

**సీ. పావకుండర్చుల భానుండు దీప్తుల నెబ్భంగి నిగిడింతు రెట్లడంతు**
**రా క్రియ నాత్మకరావళిచేత బ్రహ్మాదుల వేల్పుల నఖిలజంతు**
**గణముల జగముల ఘననామరూపభేదములతో మెఱయించి తగ నడంచు**
**నెవ్వఁడు మనము బుద్ధీంద్రియమ్ములుఁదానయై గుణసంప్రవాహంబు బఱపు**

**తే. స్త్రీనపుంసకపురుషమూర్తియును గాక, తిర్యగమరనరాదిమూర్తియును గాక**
**కర్మగుణభేదసదసత్ప్రకాశి గాక, వెనుక నన్నియుఁదా నగు విభుఁదలంతు. 85**

**ప్రతి :** పావకుండు= అగ్ని; అర్చులన్= జ్వాలలను; భానుండు= సూర్యుడు; దీప్తులన్= వెలుగులను; ఏ+భంగిన్= ఏ విధంగా; నిగిడింతురు= ప్రసరింపచేస్తారో; ఎట్లు+అడంతురు= ఎలా శమింపచేస్తారో, ఆ క్రియన్= ఆ విధంగానే; ఆత్మ+కర+ఆవళిచేతన్= ఆత్మ కిరణాలచేత; బ్రహ్మాదులన్+వేల్పులన్= బ్రహ్మాది దేవతలను; అఖిల జంతుగణములన్= అన్ని జీవసముదాయాలను; జగములన్= లోకాలను; ఘన నామరూపభేదములతోన్= నానా నామ, రూపభేదాలతో; మెఱయించి= ప్రకాశితం చేసి (పుట్టించి); ఎవ్వఁడు= ఏ దేవుడు; తగన్+అడంచున్= సముచితంగా లయింపచేస్తున్నాడో; మనమున్= మనస్సు; బుద్ధి+ఇంద్రియమ్ములున్= బుద్ధీ, ఇంద్రియాలూ; తానయై= తానే అయి; గుణ సంప్రవాహంబున్+ పఱపున్= గుణప్రవర్తనమును; స్త్రీ నపుంసక పురుషమూర్తియునున్+కాక= స్త్రీ, పురుష, నపుంసక భేదాలలో ఏదీ కాకుండా; తిర్యక్+అమర+నర+ఆది మూర్తియునుగాక= నర సుర జంతుస్వరూపాలలో ఏదీకాక; కరుణగుణభేద= కర్మల, గుణముల భేదాలకు; సత్, అసత్= ఉండుట, లేకుండుటను; ప్రకాశి= బయలుపరచువాడు; కాక= కాకుండగా; వెనుకన్+అన్నియున్+తాను+అగు= కానీ తరువాత అన్నీ తానే అయి ప్రకాశించే; విభున్= ప్రభువును; తలంతున్= ధ్యానిస్తాను.

**తా :** అగ్ని జ్వాలలను, సూర్యుడు వెలుగులను ప్రసరింపజేసి మరలా శమింపచేసే విధంగా; ఎవరు తన కిరణాలచేత బ్రహ్మాది దేవతలను, జీవ సముదాయాలను, లోకాలను, నానా రూప నామభేదాలతో పుట్టించి తరువాత తానే తగిన విధంగా లయింప చేస్తున్నాడో, మనస్సూ, బుద్ధీ, ఇంద్రియాలూ తానే అయి ఎవడు గుణ ప్రవాహరూపంలో ప్రవర్తిస్తాడో, ఎవడు స్త్రీ నపుంసక భేదాలకూ నరసురజంతు రూపాలకూ గుణ కర్మభావాలకూ అతీతంగా ఉంటూ; ఉన్నదీ – లేనిదీ అయిన రెండింటినీ బయటికి తెలియకుండా ఉంచి – తరువాత అన్నీ అయి ప్రకాశించే అట్టి పరంధాముని నేను ధ్యానిస్తాను.

**క. కలఁడందురు దీనుల యెడఁ, గలఁడందురు పరమయోగిగణములపాలం**
**గలఁడందు రన్నిదిశలను గలఁడు కలండనెడు వాఁడు గలఁడో లేఁడో! 86**

**ప్రతి :** దీనుల+ఎడన్+కలఁడు+అందురు= ఆ భగవంతుడు దీనుల పాలిట ఉన్నాడని అంటారు; పరమయోగి గణములపాలన్= ఉత్తమ యోగుల సమీపంలో; కలఁడు+అందురు= ఉన్నాడని అంటారు; అన్నిదిశలను= దశ దిక్కులలోనూ, కలఁడు+అందురు= ఉన్నాడని అంటారు; కలఁడు+కలండు+అనెడు+వాఁడు= 'ఉన్నాడు, ఉన్నా' దనబడుతున్న వాడు; కలఁడో లేఁడో= ఉన్నాడో, లేడో – (అన్న సందేహం కలుగుతోంది).

**తా :** దీనులను కాపాడటానికి భగవంతుడు ఎప్పుడూ సిద్ధంగా ఉంటాడని అంటారే. ఉత్తమ యోగుల సమీపంలో నిరంతరం ఉంటాడని అంటారే. అన్ని దిశలలోనూ ఉన్నాడంటారే. అలా ఉన్నాడు, ఉన్నాడు – అని చెప్పబడుతున్నవాడు ఉన్నాడో లేడో – అనే సందేహం కలుగుతోంది.

**సీ. కలుగఁడే నాపాలికలిమి సందేహింపఁగలిమిలేములు లేక కలుగువాఁడు;**
**నా కడ్డపడ రాఁడె నలి నసాధువులచేఁబడిన సాధుల కడ్డపడెడువాఁడు**
**చూడఁడే నా పాటుఁజూపులఁ జూడక చూచువారలఁగృపఁజూచువాఁడు;**
**లీలతో నా మొఱాలింపఁడే మొఱఁగుల మొఱ లెఱుంగుచుఁదన్ను మొఱఁగువాఁడు;**

**తే. అఖిలరూపముల్ దన రూపమైనవాఁడు, నాదిమధ్యాంతములు లేక యడరువాఁడు**
**భక్తజనముల దీనుల పాలివాఁడు, వినఁడె చూడఁడె తలపఁడె వేగ రాఁడె! 87**

**ప్రతి :** నాపాలి కలిమి సందేహింపన్= నాయెడ భగవంతుడున్నాడో లేడో అని సందేహిస్తుండగా; కలిమిలేములు లేక కలుగువాడు= ఒకప్పుడున్నాడు, ఒకప్పుడు లేడను విభాగంలేక ఎల్లప్పుడూ ఉండినట్టి భగవంతుడు; కలుగఁడు+ఏ= కలుగువాడు; అసాధువులచేన్= దుర్మార్గులచేత; పడిన= చిక్కుకున్న; సాధులకున్= సన్మార్గులకు; నలిన్= బాగుగా; అడ్డపడెడువాఁడు= రక్షించేవాడు; నాకున్+అడ్డపడరాఁడు+ఎ= సాయపడడానికి రాడా? చూపులన్= నేత్రాలతో మాత్రమే; చూడక= చూడకుండా; చూచువారలన్= అంతరింద్రియాలతో నిరంతరం దర్శించేవారిని; కృపన్= దయతో; చూచువాఁడు= సంరక్షించేవాడు, నాపాటున్= నా కష్టాన్ని; చూడఁడు+ఏ= చూడకుండా ఉంటాడా? మొఱఁగుల= దీనులయొక్క (మొరపెట్టేవారి యొక్క); మొఱలెఱుంగుచున్= మొరలు వింటూ; తన్ను= తనను తాను; మొఱఁగువాఁడు= దాచుకొనేవాడు; లీలతో= సులువుగా; నా మొఱ+ఆలింపఁడు+ఏ= నా విన్నపం వినడా? అఖిల రూపముల్= అన్నిరూపాలూ; తన రూపమైన వాఁడు= తన రూపమే అయినవాడు; ఆదిమధ్యాంతములు లేక= ఆదిమధ్యాంతాలు లేకుండా; అడరువాఁడు= వ్యాపించి ఉన్నవాడు; భక్త జనముల, దీనుల పాలివాఁడు= భక్తులను, దీనుల్ని రక్షించేవాడు (వారి పక్షమే ఆయన); వినఁడు+ఎ= నా మొర వినడా!; చూడఁడు+ఎ= నా దుస్థితి చూడడా!; తలపఁడు+ఎ= నన్ను గురించి తలపడా!; వేగరాఁడు+ఎ= వెంటనే రాడా!

**తా :** కలిమిలేమి చూడకుండా సాక్షాత్కరించే దేవుడు నేడు నా పాలిట ఉన్నాడా అని సందేహిస్తుండగా సాక్షాత్కరించడా! (నా సందేహం తీరిపోవునట్లు) దుష్టులచేత సాధువులు బాధింపబడుతున్నపుడు వారికి తప్పక అడ్డు పడుతాడే – నాకు రక్షణగా రాకుంటాడా!; నేత్రాలతో మాత్రమే కాక, అంతర్జగత్తులో ఆయననే దర్శించే వారిని కాపాడే ఆ ప్రభువు నా కష్టాన్ని చూడకుండా ఉంటాడా! దీనుల మొరలు వింటూ తన్ను తాను మరిచిపోయే ఆ దయాళువు నా మొరను సులువుగా వినకుండా ఉంటాడా! అన్ని రూపాలు అతనివే. ఆయనకు ఆదిమధ్యాంతాలు లేవు. అంతటా ఆయనే వ్యాపించి ఉన్నాడు. భక్తులకు, దిక్కులేని వారికీ ఆయనే దిక్కు. నా మొరను వినడా! నా స్థితిని చూడడా! నన్ను రక్షింప తలపడా! నన్ను కాపాడటానికి వేగంగా రాడా! – (తప్పక వస్తాడన్న భావన పెరుగుతోంది)

**క. విశ్వకరు విశ్వదూరుని, విశ్వాత్మకు విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్**
**శాశ్వతు నజు బ్రహ్మ ప్రభు నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్. 88**

**ప్రతి :** విశ్వకరున్= లోకాన్ని సృష్టించేవానిని; విశ్వదూరునిన్= లోకానికి దూరంగా ఉండేవానిని; విశ్వాత్మకున్= లోకానికి అంతరాత్మ అయినవానిని; విశ్వవేద్యున్= లోకంచేత తెలియదగ్గవాడు – అయిన వానిని; విశ్వున్= లోకమే తానైన వానిని; అవిశ్వున్= లోకాతీతుడుగా ఉన్నవానిని; శాశ్వతున్= ఎల్లపుడూ ఉండే సత్పురుషుని; అజున్= పుట్టుక లేనివానిని; బ్రహ్మన్= అన్నిటినీ కల్పించేవానిని; ప్రభున్= అధినాయకుని; పరమపురుషున్= పురుషోత్తముని; నేను భజియింతున్= నేను ఆరాధిస్తాను.

**తా :** లోకాన్ని సృష్టించి లోకానికి దూరంగా ఉంటూ; అంతరాత్ముడై, లోకం చేత తెలియదగినవాడు, లోకమే తాను అయికూడా లోకాతీతుడుగా ఉండేవాడు; శాశ్వతుడు; పుట్టుక లేకుండా అన్నిటినీ పుట్టించే వాడు; జగదీశ్వరుడు, పురుషోత్తముడు అయిన (శ్రీమన్నారాయణుని) పరమాత్ముని నేను ఆరాధిస్తాను.

**వ. అని పలికి తన మనంబున నగ్గజేంద్రు డీశ్వరసన్నిధానంబు కల్పించుకొని యిట్లనియె. 89**

**ప్రతి :** అని పలికి= అని అంటూ; తన మనంబునన్= తన మనస్సులో; ఆ+గజేంద్రుఁడు, ఈశ్వర సన్నిధానంబు= పరమేశ్వరుని ఉనికిని; కల్పించుకొని= నెలకొల్పుకొని; ఇట్లనియెన్= ఇలా ప్రార్థించాడు.

**తా :** ఈ విధంగా అంటూ; ఆ గజేంద్రుడు అక్కడికక్కడే భగవత్సన్నిధిని తన మనస్సులో కల్పించుకొని ఇలా ప్రార్థించాడు.

**శా. లా వొక్కింతయు లేదు; ధైర్యము విలోలంబయ్యెఁ; బ్రాణంబులున్**
**ఠావుల్ దప్పెను; మూర్ఛ వచ్చెఁ; దనువున్ డస్సెస్, శ్రమంబయ్యెడిన్,**
**నీవే తప్ప నితఃపరంబెఱుఁగ; మన్నింపందగున్ దీనునిన్,**
**రావే యీశ్వర! కావవే వరద!; సంరక్షింపు భద్రాత్మకా! 90**

**ప్రతి :** లావు= నా శరీరంలోని బలం; ఒక్క+ఇంతయు లేదు= కొంచెం కూడా మిగులలేదు; ధైర్యము= ధైర్యం; విలోలంబు+అయ్యెన్= జారిపోయింది; ప్రాణంబులున్= నా పంచప్రాణాలు కూడా, ఠావుల్+తప్పెను= తమచోట్ల నుండి కదలిపోతున్నాయి; మూర్ఛ వచ్చెన్= మూర్ఛ వస్తున్నది; తనువున్= శరీరం కూడా; డస్సెస్= అలసిపోయింది; శ్రమంబు+అయ్యెడిన్= అలసట అధికమయింది; నీవేతప్ప= నీవు తప్ప; ఇతఃపరంబు+ఎఱుఁగన్= మరో దిక్కు నాకు తెలియదు; దీనునిన్= నేను దీనుడినయ్యాను; మన్నింపన్+తగున్= క్షమించదగినవాడను; ఈశ్వరా= ఓ దేవాధిదేవా! రావు+ఏ= రావయ్యా!; వరదా= కోరిన వరాలిచ్చే దొరా!; కావవు+ఏ= రక్షించవయ్యా; భద్ర+ఆత్మకా= పుణ్యాత్ముడా; సంరక్షింపు(ము)= కాపాడవయ్యా!

**తా :** భగవంతుడా! ఇక నా దేహంలో ఏ శక్తీ లేదు. ధైర్యం సన్నగిల్లిపోయింది. పంచప్రాణాలు సడలిపోతున్నాయి. మూర్ఛ వస్తోంది. శరీరం డస్సిపోయింది. బాగా అలసిపోయాను. నీవు తప్ప మరో దిక్కు నాకు లేదు. ఈ దీనుని క్షమించి ఆదుకో! దేవాధిదేవా! రావయ్యా! కోరిన వరాలిచ్చే దొరా. రక్షించవయ్యా!, పుణ్యాత్ముడా! నన్ను కాపాడవయ్యా!

**క. విను దఁట జీవుల మాటలు చను దఁట చనరానిచోట్ల శరణార్థుల కో**
**యను దఁట పిలిచిన సర్వముఁగను దఁట సందేహ మయ్యెఁగరుణావార్ధీ! 91**

**ప్రతి :** కరుణావార్ధీ= ఓ దయాసముద్రుడా!; జీవుల మాటలు= ప్రాణుల మాటలు; వినుదు(వు)+అఁట= వింటావట; చనరాని చోట్ల= వెళ్ళడానికి వీలుకాని చోట్లకు; చనుదు(వు)+అఁట= వెళ్తావట; శరణార్థులకున్= శరణు అని వచ్చినవారికి; పిలిచినన్= పిలువగానే; ఓ+అనుదు+అఁట= ఓ అని బదులిస్తావట; సర్వమున్= అన్నిటినీ; కనుదు+అఁట= చూస్తావట కదా!; సందేహము+అయ్యెన్= ఇదంతా నిజమేనా! (అని సందేహం కలుగుతోంది).

**తా :** ఓ దయాసాగరా! ప్రాణులందరి మాటలూ వింటావంటారు. నీవు ప్రవేశించరాని చోటే లేదంటారు. శరణార్థులు పిలవగానే వెంటనే 'ఇదిగో' అని సమాధానమిస్తావంటారు. అన్నిటిని చూస్తూ ఉంటావట గదా! శాస్త్రాలు చెప్పే ఇవన్నీ నిజమేనా! అనే సందేహం కలుగుతోందయ్యా!

**ఉ. ఓ కమలాప్త! యో వరద! యో ప్రతిపక్షవిపక్షదూర! కు**
**య్యో! కవియోగివంద్య సుగుణోత్తమ! యో శరణాగతామరా**

**నోకహ! యో మునీశ్వరమనోహర! యో విమలప్రభావ! రా**
**వే! కరుణింపవే! తలఁపవే! శరణార్థిని నన్నుఁగావవే! 92**

**ప్రతి :** ఓ కమల+ఆప్త= ఓ లక్ష్మీవల్లభుడా!; ఓ వరద= వరాలిచ్చే స్వామీ; ఓ ప్రతిపక్షవిపక్షదూర= స్వపర భేదాలు లేనివాడా!; కుయ్యో= అయ్యో!; కవి యోగివంద్య= కవులచేత యోగులచేత నమస్కరింపదగినవాడా!; సుగుణోత్తమ= ఉత్తమగుణాలు కలవాడా!; ఓ శరణాగత+అమర+ అనోకహ= శరణాగతులకు కల్పవృక్షంవంటి వాడా!; ఓ మునీశ్వర మనోహర= మునీంద్రులకు ప్రియమైనవాడా; ఓ విమలప్రభావ= నిర్మలమైన మహిమ కలవాడా!; రావు+ఏ= రావా!; కరుణింపవు+ఏ= కరుణ చూపవా!; తలఁపవు+ ఏ= నన్ను గురించి పట్టించుకోవా!; శరణార్థిని= శరణుగోరి వచ్చినవాడనగు; నన్నున్+కానవు+ఏ= నన్ను రక్షించవా!

**తా :** ఓ లక్ష్మీవల్లభా! వరాలిచ్చే దొరా! స్వపరభేదాలు లేనివాడా! అయ్యో! నా బాధ ఏమని చెప్పను! కవులు యోగులు చేసే స్తుతులు అందుకొంటావే. నీవు ఉత్తమ గుణాలు కల్గినవాడివే. శరణుగోరిన వారిని అభిమానిస్తావే! నీ మహిమ చాలా నిర్మలమైనదే. రారాదా! కరుణ చూపరాదా! నన్ను గురించి పట్టించుకోరాదా! శరణు అంటున్నానయ్యా! నన్ను రక్షించవా! (రక్షించుస్వామీ అని ప్రాధేయపడ్డాడు)

**వ. అని పలికి మఱియు నరక్షిత రక్షకుండైన యీశ్వరుం డాపన్నుండైన నన్నుం గాచుఁ గాక యని నింగి నిక్కి చూచుచు నిట్టూర్పులు నిగిడించుచు బయ లాలకించుచు న గ్గజేంద్రుండు మొఱ సేయుచున్న సమయంబున. 93**

**ప్రతి :** అని పలికి= ఈ విధంగా ప్రార్థించి; మఱియున్= ఇంకా; అరక్షిత= రక్షణలేని వానికి; రక్షకుండైన= రక్షణ ఇచ్చెడి; ఈశ్వరుండు= భగవంతుడు; ఆపన్నుండైన= ఆపదలో ఉన్న; నన్నున్+కాచున్+కాక= నన్ను కాపాడుగాక! అని; నింగి= ఆకాశం వైపు; నిక్కి చూచుచున్= నిక్కిచూస్తూ; నిడు+ఊర్పులు= పొడవైన నిశ్వాసాలు; నిగిడించుచున్= వదలుతూ; బయలు+ఆలకించుచున్= ఆకాశానికి చెవులప్పగించి వింటూ; ఆ+గజేంద్రుండు; మొఱ+చేయుచున్న+సమయంబునన్= ఆర్తనాదం చేస్తున్న సమయంలో.

**తా :** ఈ విధంగా ప్రార్థించి ఇంకా ఏ రక్షణా లేనివానికి రక్షణ నిచ్చేటటువంటి భగవంతుడే ఆపదలో ఉన్న నన్ను ఇప్పుడు కాపాడుగాక! అని ఆకాశంవైపు నిక్కిచూస్తూ, నిట్టూర్పులు విడుస్తూ, అంతటా చెవులు అప్పగించి, ఘోరంగా ఆక్రోశిస్తున్న సమయంలో

**ఆ. విశ్వమయత లేమి వినియు నూరక యుండి రంబుజాసనాదు లడ్డపడక**
**విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు భక్తియుతున కడ్డపడఁదలంచె. 94**

**ప్రతి :** విశ్వమయత లేమిన్= విశ్వమంతా నిండి ఉండే గుణం లేకపోవటం చేత; వినియున్= ఈ గజేంద్రుని ఆక్రోశం విని కూడా; అంబుజ+ఆసన+ఆదులు= బ్రహ్మ మొదలైన దేవతలు; అడ్డపడక= సాయపడలేక; ఊరక+ఉండిరి= ఊరికే ఉండిపోయారు; విశ్వమయుఁడు= విశ్వమంతటా వ్యాపించి ఉండేవాడు; విభుఁడు= ప్రభువు; విష్ణుండు= సర్వవ్యాపి; జిష్ణుండు= విజయశీలి అయిన శ్రీమన్నారాయణుడు; భక్తియుతునకున్= భక్తుడైన గజరాజుకు; అడ్డపడన్+తలంచెన్= సాయంగా రావాలని నిశ్చయించుకొన్నాడు.

**తా :** గజరాజు చేసిన ఈ మొరను బ్రహ్మాది దేవతలందరూ విన్నారు. కాని వారికి విశ్వమంతటా వ్యాపించే లక్షణం లేనందున ఊరికే ఏ సాయమూ చేయలేక ఉండిపోయారు. విశ్వమయుడు, ప్రభువు, సర్వవ్యాపి, సర్వత్ర విజయమే పొందే శ్రీమన్నారాయణుడు ఆ భక్తునికి సాయంగా రాదలిచాడు.

**విశే :** భాగవతం విష్ణుపారమ్యాన్ని ప్రకటించే గ్రంథం. అందువల్లనే గజేంద్రుడు మొరవిన్న అతని రక్షణకై ఇతర దేవతలు ముందుకు రాలేదని, విష్ణువు ఒక్కడే ఆ పని చేయగలిగాడని ఇక్కడ చెప్పడమయింది.

**మ. అల వైకుంఠపురంబులో నగరిలో నా మూలసౌధంబు దా**
**పల మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో**
**త్పలపర్యంకరమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి**
**హ్వలనాగేంద్రము 'పాహి పాహి' యనఁగుయ్యాలించి సంరంభియై. 95**

**ప్రతి :** ఆ సమయంలో; అల= అక్కడ ఎక్కడో; వైకుంఠపురంబులోన్= వైకుంఠపురంలో; నగరిలోన్= అంతఃపురంలో; ఆ= ఆ; మూలసౌధంబు+దాపల= ప్రధానమైన మేడ ఎడమ పక్కన; మందారవన+అంతర+అమృత+సరస్ ప్రాంత= మందారవనంలోని అమృత సరస్సు ప్రాంతంలో; ఇందుకాంత+ఉపల+ఉత్పల+పర్యంక= చంద్రకాంత శిలల అరుగుపై కలువల చేత అమర్చిన పాన్పుమీద; రమావినోది+అగు= లక్ష్మీదేవితో వినోదిస్తున్న; ఆపన్న ప్రసన్నుండు= ఆపదల్లో ఉన్నవారిని ప్రసన్నతతో రక్షించే శ్రీమహావిష్ణువు; విహ్వల= భయంతో స్వాధీనం తప్పిన; నాగేంద్రము= గజేంద్రము; పాహి పాహి= కాపాడు, కాపాడు; అనన్= అనగానే; కుయ్యి= మొర; ఆలించి= విని; సంరంభి+ఐ= సంరంభంతో (ఉత్సాహ వేగాలతో)...

**తా :** ఆ సమయంలో ఎక్కడో వైకుంఠంలో అంతఃపురంలో ప్రధానమైన మేడ ఎడమ పక్కన ఉన్న మందారవనంలోని 'అమృత' సరస్సున్న ప్రాంతంలో చంద్రకాంత శిలల అరుగుపై కలువలతో కూర్చిన పాన్పుమీద లక్ష్మీదేవితో వినోదిస్తున్నవాడై ఉండగా; భయంతో స్వాధీనం తప్పిపోయిన గజేంద్రుడు 'కాపాడు! కాపాడు!' అని మొరపెట్టగానే ఆ 'కుయ్యి' విని, దాన్ని కాపాడటానికి ఉత్సాహంతో, వేగంతో (సంరక్షణ కార్యాన్ని చేపట్టాడు).

**మ. సిరికింజెప్పఁడు; శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే**
**పరివారంబును జీరఁడభ్రగపతింబన్నింపఁడాకర్ణికాం**
**తరధమ్మిల్లముఁజక్క నొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో**
**పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై. 96**

**ప్రతి :** గజప్రాణ+అవన+ఉత్సాహి+ఐ= ఆ ఏనుగు ప్రాణాల్ని కాపాడాలన్న ఉత్సాహంతో; (స్వామి); సిరికిన్+చెప్పఁడు= లక్ష్మీదేవికి ఒక మాట కూడా చెప్పలేదు; శంఖచక్రయుగమున్= శంఖ చక్రాలను రెండింటిని; చేదోయిన్= చేతులలోకి; సంధింపఁడు= తీసుకోలేదు; ఏ పరివారంబునున్= ఏ సేవకులనూ; చీరఁడు= పిలవలేదు; అభ్రగపతిన్= గరుత్మంతుని; పన్నింపఁడు= (వాహనంగా) సిద్ధపరుచుకోలేదు; ఆకర్ణిక+అంతర= చెవిలోని తామర దుద్దు వరకు జారిన; ధమ్మిల్లమున్= జట్టుముడిని; చక్కన్+ఒత్తఁడు= చక్కదిద్దుకోలేదు; వివాదప్రోత్థిత= ప్రణయ కలహంతో లాగిపట్టుకోబడిన; శ్రీకుచ+ఉపరి+ చేలాంచలము+ఐనన్+వీడఁడు= లక్ష్మీదేవి కుచములపై గల పైటకొంగును కూడా వదిలిపెట్టలేదు.

**తా :** గజరాజు ప్రాణాలను కాపాడాలన్న ఉత్సాహంలో శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవికి ఒక మాటా చెప్పలేదు. శంఖచక్రాలను ధరించలేదు. సేవకులెవర్నీ పిలవలేదు. వాహనాన్ని సిద్ధం చేయుమనలేదు. చెవిలోని తామర దుద్దులదాకా జారిన జుట్టు ముడిని చక్కదిద్దుకోలేదు; ప్రణయంతో వెళ్లిపోతున్న లక్ష్మీదేవి పైట కొంగును కూడా వదిలిపెట్టలేదు.

**విశే :** వ్యాస భాగవతంలో గజేంద్రుని మొరవిని భగవంతుడు గరుడుని అధీష్టించి వచ్చునట్టు వర్ణింపబడి ఉండగా, పోతన భగవంతుని భక్తరక్షణతత్పరత్యములు నొక్కివక్కాణించుటకు వాహనాదులనపేక్షింపకనే తనకు తానుగా వచ్చినాడని వర్ణించినాడు.

**వ. ఇట్లు భక్తజన పాలన పరాయణుండును, నిఖిల జంతుహృదయారవింద సదన సంస్థితుండును నగు నారాయణుండు కరి కులేంద్ర విజ్ఞాపిత నానావిధ దీనాలాపంబు లాకర్ణించి లక్ష్మీకాంతా వినోదంబులం దగులు సాలించి సంభ్రమించి దిశలు నిరీక్షించి గజేంద్రరక్షాపరత్వంబు నంగీకరించి నిజపరికరంబు మరల నవధరించి గగనంబున కుద్గమించి వేంచేయునప్పుడు; 97**

**ప్రతి :** ఇట్లు= ఈవిధంగా; భక్త జనపాలన పరాయణుండును= భక్తులను కాపాడటంలో దీక్ష ఉన్నవాడును; నిఖిల= సకల; జంతుహృదయారవింద= అన్ని ప్రాణుల హృదయారవిందాలనే; సదన సంస్థితుండును= గృహాలలో నివసించే వాడును; అగు+నారాయణుండు= అయినటువంటి శ్రీమహావిష్ణువు; కరి+కుల+ఇంద్ర= ఏనుగుల వంశంలో శ్రేష్ఠుడైన గజరాజు చేత; విజ్ఞాపిత= విన్నవింపబడిన; నానావిధ= అనేక విధములైన; దీనాలాపంబులు= దీనమైన మొరలను; ఆకర్ణించి= విని; లక్ష్మీకాంతా వినోదంబులన్= ప్రియురాలైన లక్ష్మీదేవితో సరస సల్లాపాలయందలి; తగులు+చాలించి= ఆసక్తిని ఆపి; సంభ్రమించి= వేగిరపడి; దిశలు నిరీక్షించి= అన్ని దిక్కులూ గాలించి; గజేంద్ర= గజేంద్రుని; రక్షా పరత్వంబున్= దీక్షగా రక్షించడానికి; అంగీకరించి= నిర్ణయించుకొని; నిజ పరికరంబు= తన ఆయుధసామగ్రి (శంఖచక్రగదా శార్ఙ్గములను), మరల= మళ్ళీ, అవధరించి= స్మరించి; గగనంబునకున్= ఆకసానికి; ఉద్గమించి= ఎగిరి; వేంచేయునప్పుడు= వస్తున్న సమయంలో...

**తా :** భక్తులను కాపాడటంలో దీక్ష కల్గిన వాడు, సకల ప్రాణుల హృదయాలనే కమలాలలో నిరంతరం నివసించేవాడు, అయిన శ్రీమహావిష్ణువు గజరాజు విన్నవించిన నానావిధ వినతులను విని, తన ప్రియురాలైన లక్ష్మీదేవితో సరససల్లాపాలు చాలించి, వేగిరపడి, అన్ని దిక్కులూ పరికించి, గజేంద్రుని రక్షించటమే పనిగా నిర్ణయించుకొని తన ఆయుధ సామగ్రిని స్మరించుకొని వస్తున్నప్పుడు

**మ. తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతమున్, దాని వె
న్కను బక్షీంద్రుఁడు, వాని పొంతను ధనుఃకౌమోదకీ శంఖ చ
క్ర నికాయంబును, నారదుండు, ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్. 98**

**ప్రతి :** తనవెంటన్ సిరి= (అలా స్వామి బయలుదేరగానే) ఆయన వెంబడి లక్ష్మీదేవి; లచ్చివెంటన్+అవరోధవ్రాతమున్= లక్ష్మి వెంట అంతఃపుర స్త్రీల సమూహం; దాని వెన్కను= దాని వెంబడి; పక్షీంద్రుఁడు= గరుత్మంతుడు; వాని పొంతను= అతని సమీపంలో; ధనుఃకౌమోదకీ శంఖచక్ర నికాయంబును= శంఖచక్ర గదా శార్ఙ్గముల మొత్తం; నారదుండు=

నారదమహర్షి; ధ్వజినీ కాంతుండు= సేనాపతి విష్వక్సేనుడు; రాన్= రాగా; వైకుంఠపురంబునన్= వైకుంఠపురంలో; కలుగువారు= ఉన్నవారు; ఆబాలగోపాలమున్= అందరూ; ఒయ్యనన్= వరుసగా; వచ్చిరి= వచ్చారు.

**తా :** అలా స్వామి బయలుదేరగానే లక్ష్మీదేవి, ఆమె వెంట అంతఃపుర స్త్రీలు, వారి వెంట గరుత్మంతుడు, ఆయన ననుసరించి శంకచక్రాదులగు ఆయుధ సమూహం; నారదమహర్షి, సేనాపతి విష్వక్సేనుడు రాగా, వైకుంఠంలోని అందరూ వారివెంట వరుసగా బయలుదేరి వచ్చారు.

**వ. తదనంతరంబ ముఖారవింద మకరంద బిందు సందోహ పరిష్యందనానందదిందిందిర యగు నయ్యిందిరాదేవి గోవిందకరారవిందసమాకృష్యమాణసంవ్యానచేలాంచలయై పోవుచు. 99**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; ముఖారవింద= పద్మంలాంటి తన ముఖమునుండి చిందుతున్న; మకరందబిందుసందోహ= తీయని మకరంద బిందు సముదాయంయొక్క; పరిష్యందన= కారుటచేత; ఆనందత్+ఇందిందిర+ అగు= ఆనందిస్తున్న తుమ్మెదలు కల్గిన; ఆ+ఇందిరాదేవి= ఆ లక్ష్మీదేవి; గోవింద= గోవిందుని; కర+అరవింద= తామరలవంటి చేతిచేత; సమ్+అకృష్యమాణ= బాగా పట్టుకొని లాగబడుతున్న; సంవ్యాన+చేలాంచల+ఐ= చలిస్తున్న పైట చెరగు కల్గినదై; పోవుచున్= వెన్నంటి పోతూ...

**తా :** ముఖపద్మంయొక్క తేనె బిందువుల సమూహం కారుటచే ఆనందించు తుమ్మెదలు కలిగిన ఆ లక్ష్మీదేవి శ్రీహరియొక్క కరపద్మంచేత లాగబడుతున్న పైటకొంగు కలదై వెళ్తూ

**మ. తన వేంచేయు పదంబుఁబేర్కొనఁ; డనాథస్త్రీజనాలాపముల్**
**వినెనో, ముచ్చులు ముచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్,**
**దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో, భక్తులం**
**గని చక్రాయుధుఁడేఁడి చూపుఁడని ధిక్కారించిరో దుర్జనుల్. 100**

**ప్రతి :** తన= తనయొక్క; వేంచేయు పదంబు= వెళ్తున్న చోటును; పేర్కొనఁడు= చెప్పడు; అనాథ స్త్రీ జనాలాపముల్ వినెనో= దిక్కులేని స్త్రీల రోదనలేమైనా విన్నాడో ఏమో!; ఖలుల్= దుర్మార్గులైన; ముచ్చులు= దొంగలు; వేద ప్రపంచంబులన్= వేదాలను; ముచ్చిలించిరి+ఒ= మళ్ళీ దొంగిలించారో ఏమో; దనుజానీకము= రాక్షస సమూహం; దేవతానగరిపైన్= దేవతల రాజధాని అమరావతిపైన; దండెత్తెను+ఓ= దండెత్తిందో ఏమో!; దుర్జనుల్= దుష్టులు; భక్తులన్+కని= భక్తులను చూచి; చక్రాయుధుఁడు+ఏఁడి+చూపుఁడు+అని= చక్రాయుధుడైన హరి ఎక్కడరా చూపండి అని; ధిక్కారించిరో= ధిక్కరించారో (బెదిరించారో) ఏమో!...

**తా :** స్వామివారు తాను వెళ్తున్న చోటు ఏదో చెప్పడు. దిక్కులేక అలమటిస్తున్న ఏ స్త్రీల రోదనలు విన్నాడో! రాక్షసులు మళ్ళీ వేదాలను దొంగిలించారో ఏమో!; మళ్ళీ రాక్షసులు అమరావతిపై దండెత్తారో ఏమో! 'హరి ఎక్కడరా చూపండి' అంటూ భక్తులను ఏ దుర్మార్గులు దండిస్తున్నారో!

**విశే :** సోమకాసురుడు వేదాలను దొంగిలించాడు (మత్స్యావతార కథ)

భూదేవి మొరపెడితేనే అవతారాలు దాల్చాడు (రామాది అవతారాలు).

ప్రహ్లాదుని హిరణ్యకశిపుడు బెదిరించింది హరిని చూపుమనే! ఇలాంటి గాథలలో పూర్వాపరాలు ఎలా ఉన్నా పోతనగారి లక్ష్మీదేవి శ్రీనివాసుని ఇల్లాలు కాబట్టి ఆమె త్రికాలాలలోని కథల్ని చెప్పుకోవటంలో ఆశ్చర్యం ఏమీలేదు.

**వ. అని వితర్కించుచు. 101**

**ప్రతి :** అని; వితర్కించుచున్= పరిపరి విధాలుగా ఆలోచిస్తూ...

**తా :** అని పరిపరివిధాలుగా ఆలోచిస్తూ (ఆయన వెంట వెళ్తోంది).

**శా. తాటంకాచలనంబుతో, భుజనటద్ధమ్మిల్లబంధంబుతో,**
**శాటీముక్తకుచంబుతో, నదృఢచంచత్కాంచితో, శీర్ణ లా**
**లాటాలేపముతో, మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ,**
**గోటీందుప్రభతో, నురోజభరసంకోచద్వలగ్నంబుతోన్. 102**

**ప్రతి :** తాటంకాచలనంబుతోన్= కదలాడుతున్న కమ్మలతో; భుజనటత్= భుజాల మీద కదులుతున్న; ధమ్మిల్ల బంధంబుతోన్= కొప్పుముడితో; శాటీముక్త= వస్త్రం (పైట) జారిపోయిన; కుచంబుతో= స్తనయుగ్మంతోన్; అదృఢచంచత్= వదులై కదలాడుతున్న; కాంచితోన్= ఒడ్డాణంతో; శీర్ణ= చెదిరిపోయిన; లాలాట+ఆలేపముతోన్= నుదుట పూసుకొన్న పూతతో; మనోహర= ప్రియుడి యొక్క; కరాలగ్న+ఉత్తరీయంబుతోన్= చేతిలో పట్టుబడిన పైట కొంగుతో; ఉరోజభర= స్తనభారం చేత; సంకోచత్+వలగ్నంబుతోన్= సంకోచం పొందుతున్న నడుముతో; కోటీందుప్రభతో= కోటి చంద్రుల (ముఖ) కాంతితో (ముఖంతో మొగుడి వెంట పరుగెడుతోంది)...

**తా :** స్వామి పరుగులు తీస్తుండగా ఆయనవెంట వెళ్తూ ఉన్న లక్ష్మీదేవి చెవిపోగులు కదలాడసాగినాయి. భుజాలమీద కొప్పుముడి చిందులాడుతోంది. స్తనయుగ్మం మీద ఉన్న పైటకొంగు జారిపోతూంది. ఒడ్డాణం వదులయిపోయింది. నుదుటిపూత చెరిగిపోయింది. పైటకొంగు మాత్రం ఇంకా తన ప్రియుడి చేతిలోనే ఉండిపోయింది. స్తనభారం చేత నడుము చిక్కిపోయింది. కాని కోటి చంద్రుల కాంతితో ముఖం మాత్రం ప్రకాశిస్తూనే ఉంది.

**క. అడిగెద నని కడు వడిఁజను నడిగినఁదను మగుడ నుడుగఁడని నడ యుడుగున్**
**వెడవెడ చిడిముడి తడఁబడ నడు గిడు; నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్. 103**

**ప్రతి :** అడిగెదను+అని= ఎక్కడికి వెళ్తున్నారని అడుగుదామనుకొని; కడువడిన్+చనున్= మిక్కిలి వేగంగా వెళ్తుంది; అడిగినన్= అలా అడిగినా; తను= తాను; మగుడన్= మళ్ళీ; నుడుగఁడు+అని= మారుమాటాడడని (తెలిసింది) కాబట్టి; నడ= నడకను; ఉడుగున్= చాలిస్తుంది; వెడవెడన్= మెల్లగా; చిడిముడి= కలత; తడఁబడన్= తడబడుతూ; జడిమన్= నెమ్మదిగా; అడుగిడున్+ఎడలన్= అడుగువేయు సమయంలో; జడిమన్= జడత్వంతో; అడుగిడదు= కాలు మోపదు.

**తా :** భర్తను ఎక్కడికి వెళ్తున్నారండీ! అని అడగాలనుకొని మిక్కిలి వేగంగా వెళ్తుంది. కాని ఆయన మారుమాటలాడడని తెలిసినది కాబట్టి నడకను చాలించి ఆలోచనలో పడుతుంది. తొట్రుపాటుతో నెమ్మదిగా ఒక అడుగు ముందుకు వేస్తుంది. అలా నడిచేప్పుడు జడత్వంతో అడుగు ముందుకు మోపదు.

**సీ. నిటలాలకము లంట నివుర జుంజుమ్మని ముఖసరోజము నిండ ముసరుఁదేంట్లు;**
**నళులఁజోఁపఁగఁజిల్క లల్ల నల్లనఁజేరి యోష్ఠబింబద్యుతు లొడియ నుఱుకు;**
**శుకములఁదోలఁజక్షుర్మీనములకు మందాకినీపాఠీనలోక మెగుచు;**
**మీనపంక్తుల దాఁట మెయిదీఁగతో రాయ శంపాలతలు మింట సరణి గట్టు;**

**ఆ. శంపలను జయింపఁజక్రవాకంబులు, కుచయుగంబుఁదాఁకి క్రొవ్వుసూపు;**
**మెలఁత మొగిలు పిఱిఁది మెఱుఁగుఁదీవయుఁబోలె, జలదవర్ణు వెనుకఁజనెడు నపుడు. 104**

**ప్రతి :** మెలఁత= ఆ స్త్రీ (లక్ష్మీదేవి); మొగిలు పిఱిఁది= మేఘం వెంట; మెఱుఁగు దీవయున్+పోలెన్= మెరుపుతీగలాగా; జలదవర్ణు వెనుకన్= మేఘశ్యాముని వెంట; చనెడు+అపుడు= వెళ్తున్న సమయంలో; నిటల+అలకములు= నొసటి ముంగురులను; అంటనివురన్= (తలకు) అంటు కొనేటట్లు నిమురబోతే; జుంజుమ్మని= జుంజుం అని మిక్కిలిగా రొదచేస్తూ; ముఖ సరోజము నిండన్= ముఖమనే పద్మం నిండా; తేంట్లు= తుమ్మెదలు; ముసరున్= ముసురుకొన్నాయి; అళులన్= తుమ్మెదలను; చోఁపఁగన్= తోలగా; అల్లనన్+అల్లనన్= నెమ్మదిగా; చేరి= ఆమెను సమీపించి; ఓష్ఠబింబద్యుతులు+ ఒడియన్+ఉఱుకున్= దొండపండు కాంతులలో ప్రకాశిస్తున్న పెదవులను పట్టుకోవటానికి పరుగెత్తి వచ్చాయి; శుకములన్= చిలుకలను; తోలన్= తోలుతూ ఉండగానే; చక్షుర్మీనములకున్= చేపల వంటి ఆమె కన్నులకోసం; మందాకినీ= ఆకాశగంగలోని; పాఠీనలోకము= పెద్దపెద్దచేపలు; ఎగుచున్= ఎగిసి దుమికాయి; మీనపంక్తులన్+దాటన్= ఆ చేపల్ని తప్పించుకోగానే; మెయిదీఁగతో రాయన్= తీగవంటి ఆమె శరీరంతో రాసుకోవడానికి; శంపాలతలు= మెరుపుతీగలు; మింటన్= ఆకాశంలో; సరణిగట్టున్= బారులు తీరాయి; శంపలను జయింపన్= ఆ మెరుపు తీగల్ని అతిక్రమించగానే; చక్రవాకంబులు= చక్రవాక పక్షులు; కుచయుగంబున్+దాఁకి= స్తనయుగ్మాన్ని తాకి; క్రొవ్వు+చూపున్= మిడిసిపడ్డాయి.

**తా :** (లక్ష్మీదేవి సొగసుచేత ఆమె నడక ముందుకు సాగటంలో ఎన్నో ఆటంకాలు వచ్చాయి. అందుకే నెమ్మదిగా వెళ్తోంది) మేఘశ్యాముని వెంట బయలుదేరి వస్తున్న ఆమె సొగసు మేఘం వెంబడే తళుక్కుమనే మెరుపు తీగచందంగా ఉంది. అలా వెళ్తున్నపుడు నొసటి మీద ముంగురుల్ని సవరించుకోగానే ఆమె ముఖపద్మం మీద తుమ్మెదలు ముసురుకొన్నాయి. ఆ తుమ్మెదల్ని తోలుతుండగానే దొండపండు కాంతితో ప్రకాశిస్తున్న ఆమె పెదవుల్ని చిలుకలు సమీపించాయి. ఆ చిలుకల బారినుండి తప్పించుకోగానే చేపలవంటి తన కన్నులకోసం – కండ్లనే చేపలనుకొని ఆకాశగంగలోని పెనుచేపలు ఎగిసిపడ్డాయి. వాటిని తోలి తప్పించుకోగా, తీగవంటి ఆమె శరీరంతో రాసుకుని ధన్యం కావటానికి మెరుపుతీగలు ఆకాశంలో బారులుతీరాయి. ఆ తీగల్ని అతిక్రమించి ముందుకు సాగగా చక్రవాకాలు ఆమె స్తనయుగ్మాన్ని తాకి మిడిసిపడ్డాయి.

**మ. వినువీథింజనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ సురారాతి జీ**
**వనసంపత్తి నిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు యోగీంద్ర హృ**
**ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృందప్రాభవాలంకరి**
**ష్ణు నవోఢోల్లసదిందిరాపరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్. 105**

**ప్రతి :** సుర+అరాతి+జీవన సంపత్తి= దేవతల శత్రువులైన రాక్షసుల జీవన సంపదను; నిరాకరిష్ణున్= తొలగదోసే వానిని; కరుణావర్ధిష్ణున్= నిండుదయతో వృద్ధి పొందేవానిని; యోగీంద్ర+హృద్+వన+వర్తిష్ణున్= పరమ యోగుల

హృదయాలనే వనంలో ఉండేవానిని; భక్తజనబృంద ప్రాభవాలంకరిష్ణున్= భక్తుల సముదాయపు గొప్పదనానికి శోభ కలిగించేవానిని; సహిష్ణున్= ఓరిమి కలవానిని; నవ+ఊఢా+ఉల్లసత్+ఇందిరా+పరిచరిష్ణున్= కొత్త పెండ్లికూతురుగా శోభించే లక్ష్మీదేవికి సేవలు చేసేవానిని; జిష్ణున్= నిరంతర జయశీలం కలవానిని; రోచిష్ణునిన్= కాంతితో వెలిగే వాడైన; విష్ణున్= విష్ణుదేవుని; అమరుల్= దేవతలు; వినువీథిన్= ఆకాశమార్గంలో; చనుదేరన్= రాగా; కాంచిరి= చూశారు.

**తా :** రాక్షసుల జీవితాలనే సంపత్తిని నశింపచేసేవాడు; నిరంతరం కరుణతో వర్ధిల్లేవాడు పరమయోగి జనహృదయాలనే వనంలో ఉండేవాడు; భక్తుల గొప్పదనాన్ని శోభిల్లజేసేవాడు, కొత్త పెండ్లికూతురగు లక్ష్మీదేవికి సేవలు చేసేవాడు, జయశీలుడు, తేజోమయుడు అయిన శ్రీమహావిష్ణువు ఆకాశమార్గంలో వస్తుండగా దేవతలు చూశారు.

**వ. ఇట్లు పొడగని. 106**

**ప్రతి :** ఇట్లు; పొడగని= చూచి.

**తా :** ఇలా చూచి.

**మ. చనుదెంచెన్ ఘనుఁడల్లవాఁడె! హరి పజ్జంగంటిరే లక్ష్మి? శం**
**ఖ నినాదంబదె; చక్రమల్లదె; భుజంగధ్వంసియున్ వాఁడె; క్ర**
**న్నన నేతెంచె నటంచు వేల్పులు నమో నారాయణాయేతి ని**
**స్వనులై మ్రొక్కిరి మింట హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్. 107**

**ప్రతి :** అల్ల= అదిగో; ఘనుఁడు= గొప్పవాడైన; హరి= విష్ణువు; వాఁడె= ఆయనే!; చనుదెంచెన్= వచ్చాడు; కంటిరి+ఏ= చూశారా! పజ్జన్= ఆయన పక్కలోనే; లక్ష్మి= లక్ష్మీదేవికూడా ఉంది; శంఖ నినాదంబు+అదె= అదిగో స్వామివారి శంఖ ధ్వని; చక్రము+అల్లది+ఎ= అదిగో స్వామివారి సుదర్శన చక్రం; భుజంగ ధ్వంసియున్+వాఁడె= గరుడుడు వాడదిగో; క్రన్ననన్= వేగంగా; ఏతెంచెన్= వచ్చాడు; అటంచున్= అంటూ; వేల్పులు= దేవతలు; నమో నారాయణాయ+ఇతి+ నిస్వనులు+ఐ= నమోనారాయణాయ అనే శబ్దాలు గలవారై; (స్తోత్రంతో); మింటన్= ఆకాశంలోనే; హస్తి= గజరాజు యొక్క; దురవస్థావక్రికిన్= దురవస్థను బాపడానికి వస్తున్న; చక్రికిన్= చక్రాయుధునికి; మ్రొక్కిరి= నమస్కరించారు.

**తా :** గజరాజు ఆపదను తొలగించడానికి పరుగున వెళ్తున్న స్వామివారిని, పరివారాన్ని చూచిన దేవతలు : "అదిగదిగో! మహావిష్ణువు వచ్చాడు. పక్కలోనే లక్ష్మీదేవి కూడా – చూశారా! అదే శంఖధ్వని. అల్లదిగో సుదర్శన చక్రం. అదిగో గరుత్మంతుడు కూడా వస్తున్నాడు" అంటూ ఆకాశంలోనే 'నమోనారాయణాయ' అన్న స్తోత్రం పఠిస్తూ ఆ వేడుకను చూశారు.

**విశే :** నారాయణాయ= నారాయణునికి; నమః= నమస్కారం; 'ఓం నమోనారాయణాయ' – అన్నది అష్టాక్షరీ మంత్రం. విష్ణుభక్తులకు తారక మంత్రమిదే.

**వ. అయ్యవసరంబునం గుంజరేంద్రపాలన పారవశ్యంబున దేవతానమస్కారంబు లంగీకరింపక మనస్స మాన సంచారుండై పోయి పోయి కొంతదూరంబున శింశుమార చక్రంబునుం బోలె గురుమకరకుళీర మీన మిథునంబై, కిన్నరేంద్రుని భాండాగారంబునుంబోలె స్వచ్ఛ వరకచ్ఛపంబై, భాగ్యవంతుని**

**భాగధేయంబునుం బోలె సరాగజీవనంబై, వైకుంతంబునుంబోలె శంఖచక్ర కమలాలంకృతంబై, సంసార చక్రంబునుం బోలె ద్వంద్వసంకుల పంక సంకీర్ణంబై యొప్పు నప్పంకజాకరంబుఁబొడగని. 108**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; కుంజర+ఇంద్ర+పాలన+పారవశ్యంబునన్= గజేంద్రుడిని కాపాడాలన్న తొందరలో; దేవతా నమస్కారంబులు= దేవతలు పెట్టిన నమస్కారాలను; అంగీకరింపక= ఒప్పుకోక; మనస్సమాన= మనస్సుతో సమానమైన (వేగంతో); సంచారుండై+పోయి+పోయి= పయనించి వెళ్ళి వెళ్ళి; కొంత దూరంబునన్= సమీపంలో; శింశుమార చక్రంబునున్+పోలెన్= శింశుమార చక్రంలాగా; గురు మకర= పెద్దమొసళ్ళు; కుళీర= ఎండ్రకాయలు; మీన మిథునంబు+ఐ= చేపల జంటలు కలదై (గురు= బృహస్పతి; మకర= మకరరాశి; కుళీర= కర్కాటక రాశి; మీన= మీనరాశి; మిథున= మిథునరాశి కలదై); కిన్నరేంద్రుని= యక్షకిన్నరాధిపుడైన కుబేరుని; భాండాగారంబునున్+ పోలెన్= ధనాగారంలాగా; స్వచ్ఛ= శ్రేష్ఠమైన; వరకచ్ఛపంబు+ఐ= తాబేళ్ళు కలిగినదై (స్వచ్ఛ= శ్రేష్ఠమైన; కచ్ఛప= కచ్ఛప నిధి గలదై); భాగ్యవంతుని= అదృష్టవంతుని; భాగధేయంబునున్+పోలెన్= భాగ్యంవలె; సరాగ= అనురాగమనే; జీవనంబు+ఐ= నీరుకల్గినదై; వైకుంతంబునున్+పోలెన్= వైకుంతంలోలాగా; శంఖ= శంఖాలు; చక్ర= చక్రవాకాలు; కమల= తామరలు (వీటిచేత); అలంకృతంబు+ఐ= అలంకరించబడినదై (సరాగ= అనురాగపూర్ణమైన; జీవనంబుగలదై= జీవితం గలదై); సంసార చక్రంబునున్+పోలెన్= సంసారమనే చక్రంలాగా; (ద్వంద్వ= శీతోష్ణాది ద్వంద్వములు; పంక= కిల్బిషంతో కూడినదై) ద్వంద్వ+సంకుల+పంక+సంకీర్ణంబు+ఐ= సుఖదుఃఖాల వంటి ఎడతెగని బురదతో కూడినదై; ఒప్పు=ప్రకాశించే; ఆ+పంకజాకరంబున్= ఆ పద్మసరస్సును; పొడగని= చూచి...

**తా :** గజేంద్రుని కాపాడాలన్న తొందరలో ఉన్న స్వామివారు దేవతల నమస్కారాలను స్వీకరించలేదు. మనోవేగంతో ముందుకు సాగిపోయి సమీపంలోనే కరి మకరులు పోరుతున్న ఆ సరస్సును చూశారు. దానిలో శింశుమార చక్రంలో లాగా గొప్ప మొసళ్ళు, ఎండ్రకాయలు, చేపల జంటలు ఉన్నాయి. కుబేరుని కచ్ఛపమనే ధనాగారంలో లాగా శ్రేష్ఠమైన తాబేళ్ళు ఉండినాయి. అదృష్టవంతుడి భాగ్యం లాగా అనురాగమనే నీరుంది. వైకుంతంలో లాగానే శంఖాలు, చక్రాలు, కమలాలు ఉన్నాయి. సంసారచక్రంలో లాగానే సుఖదుఃఖాలవంటి ద్వంద్వాలనే బురద నిండి ఉంది. ఆ సరస్సును చూశాడు.

**విశే : శింశుమారచక్రం :** జ్యోతిశ్చక్రానికి సంబంధించిన ఖగోళవిశేషం. మొసలి, ఎండ్రకాయ, చేపల జంటల్లాగా నక్షత్రాలు కనిపించే ఒక విచిత్రసన్నివేశం. దీన్ని 'జ్యోతిర్మండలం' అని అంటారు. దీన్ని ఉపాసించటం ఉంది.

**తాబేలు :** కుబేరుని ధనాగారానికి 'కచ్ఛప' మని పేరు. అందుకే తాబేలును, చేపను (మత్స్య), మకరాన్ని ధనం కోరేవారు అర్చించే సంప్రదాయం ఉంది.

**వైకుంతంతో పోలికలు :** కమల (లక్ష్మి), శంఖం (స్వామివారి పాంచజన్యం), చక్రం (సుదర్శనం) – సరస్సులో శంఖాలు, చక్రవాకాలు, పద్మాలు.

**సంసారచక్రం :** చక్రనేమి క్రమంలో పునర్జన్మం, మరణం – ఇలా సాగిపోయే ఈ గమనంలో సుఖదుఃఖాలు, మానావమానాలు – ఎడతెగని ద్వంద్వాలు – వీటిలోనే మనిషి తగులుకొంటాడు – అందుకే 'పంక' (బురద) మని అనటం. పంకశబ్దం పాపాన్ని కూడా బోధిస్తుంది.

**మ. కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁబంపె స**
**త్వరితాకంపితభూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా**
**పరిభూతాంబరశుక్రమున్ బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం**
**తరనిర్వక్రముఁబాలితాఖిలసుధాంధశ్చక్రముంజక్రమున్. 109**

**ప్రతి :** కరుణాసింధుఁడు= దయాసముద్రుడైన; శౌరి= హరి; వారిచరమున్= మొసలిని; ఖండింపఁగాన్ = చంపడానికి; పాలిత+అఖిల+సుధాంధస్+చక్రము= పాలింపబడిన సమస్త దేవతా సముదాయం కలదియు; సత్వరితా కంపిత భూమిచక్రము= వేగంచేత కంపింపజేయబడిన భూచక్రం కలదియు; మహా+ఉద్యత్+విస్ఫులింగ+ఛటా= మిక్కిలి పైకి లేస్తున్న అగ్ని కణాల సమూహంతో; పరిభూత+అంబర+శుక్రమున్= పరాభవింపబడిన ఆకాశమందలి చుక్కలు కలది; బహువిధ= నానా; బ్రహ్మాండ+భాండ+ఛటాంతర+నిర్వక్రమున్= బ్రహ్మాండభాండాల కాంతి సముదాయాలతో నిండి ఎప్పటికీ తప్పిపోని గమనం కలిగినదియు (ఎదురులేనిది); ఐన; చక్రమున్= సుదర్శనచక్రాన్ని; పంపెన్= ప్రయోగించాడు;

**తా :** దయాసముద్రుడైన శ్రీహరి మొసలిని చంపడానికి సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. అది దేవతల్ని కాపాడేటటువంటి చక్రం. భూవలయాన్ని తన వేగంతో కంపింపచేయగల శక్తి కలిగినది. దాని అంచుల నుండి పుట్టే అగ్ని కణాలతో ఆకాశంలోని చుక్కల్ని పరాభవించునది. బ్రహ్మాండభాండాల వెలుగుల నడుమ ఎదురులేని సంచారం కలది.

**విశే :** అంబరశుక్రము – పాలపుంత – నక్షత్రమండలకాంతి అనికూడా అంటారు.

**వ. ఇట్లు పంచిన. 110**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా, పంచినన్= ప్రయోగించగా.

**తా :** ఈ విధంగా చక్రాన్ని ప్రయోగించగా.

**శా. అంభోజాకరమధ్యనూతననలిన్యాలింగనక్రీడనా**
**రంభుండైన వెలుంగుఱేని చెలువారన్ వచ్చి నీటన్ గుభుల్**
**గుంభధ్వానముతోఁగొలంకును గలంకుంబొందఁగాఁజొచ్చి దు**
**ష్టాంభోవర్తి వసించు చక్కటికి డాయంబోయి హృద్వేగమై. 111**

**ప్రతి :** (ఆ చక్రాయుధం); అంభోజాకర మధ్య= ఆ సరస్సు మధ్యన; నూతన= అప్పుడే విచ్చుకొంటున్న; నలినీ+ ఆలింగన+క్రీడన+ఆరంభుండు+ఐ= పద్మినిని ఆలింగన చేసుకోవటమనే క్రీడను ప్రారంభించిన; వెలుంగుఱేని చెలువారన్= సూర్యునిలాగా; వచ్చి; నీటన్= ఆ నీటిలో; గుభుల్+గుంభధ్వానముతోన్= గుభుల్లు గుభుల్లుమనే కుంభశబ్దంతో; కొలంకును= ఆ సరస్సును; కలంకన్+పొందఁగాన్= కలతపొందేలా (కలచివేసి); చొచ్చి= లోపలికి చొచ్చుకుపోయి; దుష్ట+అంభోవర్తి= దుర్మార్గమైన ఆ నీటి జంతువు మొసలి; వసించు= ఉన్నటువంటి; చక్కటికి= చోటుకు; డాయన్+పోయి= సమీపంగా వెళ్ళి; హృద్వేగము+ఐ= మనోవేగంతో...

**తా :** శ్రీహరి ప్రయోగించిన చక్రాయుధం అత్యంతవేగంతో సరస్సులోకి చొచ్చుకుపోయి అప్పుడే వికసిస్తున్న పద్మాలను కౌగిలించుకోవడానికి వచ్చిన సూర్యబింబంలాగా భాసించింది. నీటిని కలచివేసి 'గుభుల్లు గుభుల్లు' మనే ధ్వనులు పుట్టించింది. ఆ దుర్మార్గమైన మొసలి ఉండే చోటును సమీపించింది.

**శా. భీమంబై తలఁద్రుంచి ప్రాణములఁబాపెంజక్ర మాశుక్రియన్**
**హేమక్ష్మాధరదేహముంజకితవన్యేభేంద్రసందోహముం**
**గామక్రోధనగేహమున్ గరటి రక్తస్రావగాహంబు ని**
**స్సీమోత్సాహము వీతదాహము జయశ్రీమోహమున్ గ్రాహమున్. 112**

**ప్రతి :** చక్రము= ఆ సుదర్శన చక్రం; భీమంబు+ఐ= భయంకరమై; ఆశు క్రియన్= రివ్వున; తలన్+త్రుంచి= తలను నరికి; హేమక్ష్మాధర దేహమున్= మేరు పర్వతంలాంటి మెరిసిపోయే శరీరం కలిగినదీ; చకితవన్య+ఇభ+ఇంద్ర+ సందోహమున్= భయపెట్టబడిన శ్రేష్ఠమైన అడవి ఏనుగుల సముదాయం కలదీ; కామక్రోధన గేహమున్= కామక్రోధాల నిలయమైనదీ; కరటి రక్తస్రావ గాహంబున్= గజరాజు రక్తధారలతో మునిగినదీ; నిస్సీమోత్సాహమున్= అంతులేని ఉత్సాహం కల్గినదీ; వీత దాహమున్= దప్పిక లేనిదీ (అంటే అలసట లేనిదీ); జయశ్రీ మోహమున్= గెలుపుపై ఆశకలదీ; ఐన; గ్రాహమున్= అలాంటి మొసలిని; ప్రాణములన్+పాపెన్= ప్రాణాల్ని తీసింది.

**తా :** చక్రాయుధం రివ్వున పోయి అతిభయంకరంగా మొసలి తలను నరికి దాన్ని చంపివేసింది. దాని దేహం మేరు పర్వతంలా మెరిసిపోతోంది. అది అడవి ఏనుగులకు సైతం భయాన్ని పుట్టించే పరాక్రమం కలిగినది. కామ క్రోధాలతో నిండినది. గజరాజు రక్తధారలతో తడిపినది. అంతులేని ఉత్సాహంతో అలసట లేకుండా గెలుపుపై మనస్సు నిలుపుకొని పోరాడుతూనే ఉంది. అలాంటి మొసలిని చక్రం చంపివేసింది.

**వ. ఇట్లు నిమిషస్పర్శనంబున సుదర్శనంబు మకరి తలఁద్రుంచు నవసరంబున. 113**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; నిమిష స్పర్శనంబునన్= ఒక నిమిషం పాటు తాకగానే; సుదర్శనంబు= ఆ చక్రం; మకరి తలన్= ఆ మొసలి తలను; త్రుంచు+అవసరంబునన్= నరికే సమయంలో.

**తా :** ఇలా ఒక రెప్పపాటులో ఆ చక్రం ఆ మొసలి తలను నరికివేసింది. ఆ సమయంలో

**క. మకర మొకటి రవిఁజొచ్చెను, మకరము మఱియొకటి ధనదు మాటున డాఁగెన్;**
**మకరాలయమునఁదిరిగెడు, మకరంబులు కూర్మరాజు మఱువున కరిగెన్. 114**

**ప్రతి :** మకరము+ఒకటి= ఒక మకరం (రాశిచక్రంలోని మకరం); రవిన్+చొచ్చెను= సూర్యుని చాటుకుపోయింది; మకరము+మఱియొకటి= ఇంకో మకరము (మకరము అను నిధి); ధనదు+మాటునన్+డాఁగెన్= కుబేరుని రక్షణలోకి వెళ్ళిపోయింది; మకరాలయమునన్+తిరిగెడు= సముద్రంలో తిరుగాడే; మకరంబులు= మొసళ్ళు; కూర్మరాజు= ఆదికూర్మం; మఱువునకున్= చాటుకు; అరిగెన్= వెళ్ళిపోయాయి.

**తా :** ఇలా మొసలిని చక్రం చంపడాన్ని చూచి జగత్తులోని మొసళ్ళన్నీ భీతి పొందాయి. దిక్కున్న చోటుకుపోయాయి. సూర్యునిచాటులో రాశిచక్రంలోని మొసలి; కుబేరుని సన్నిధిలో మరోమొసలి (మకరనిధి); ఆదికూర్మం చెంత సముద్రంలోని మొసళ్ళు దాక్కున్నాయి.

**మ. తమముంబాసిన రోహిణీవిభుక్రియన్ దర్పించి సంసార దుః**
**ఖము వీడ్కొన్న విరక్తచిత్తునిగతిన్ గ్రాహంబు పట్టూడ్చి పా**

**దము లల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె సం**
**భ్రమదాశాకరిణీకరోజ్ఝితసుధాంభస్స్నానవిశ్రాంతుఁడై. 115**

**ప్రతి :** తమమున్+పాసిన= చీకటి నుండి వెలువడిన; రోహిణీ విభుక్రియన్= రోహిణీ కాంతుడయిన చంద్రుడిలాగా; దర్పించి= (గర్వించి) ప్రకాశించి; సంసార దుఃఖము+వీడ్కొన్న= సంసారబంధాల నుండి ముక్తుడైన; విరక్త చిత్తుని గతిన్= విరాగి లాగా (సన్యాసిలాగా); గ్రాహంబుపట్టు+ఊడ్చి= మొసలి పట్టు విడిపించుకొని; పాదములు+అల్లార్చి= పాదాలు సడలించి; కరేణుకావిభుఁడు= ఆడ ఏనుగులకు అధినాథుడైన గజరాజు; సంభ్రమత్= సంభ్రమంకల; ఆశా+కరిణీ= ఆడ దిగ్గజాలయొక్క; కర+ఉజ్ఝిత= తొండాలతో చిమ్మబడిన; సుధాంభస్+స్నాన= అమృతజలంలోని స్నానంతో; విశ్రాంతుఁడు+ఐ= అలసట తీర్చుకొని; సౌందర్యంబుతోన్+ఒప్పెన్= నిజసౌందర్యంతో ప్రకాశించాడు.

**తా :** ఆ మొసలిపట్టు నుండి విడువడిన గజరాజు ఉత్సాహంతో కాళ్ళు కదిలించాడు. కారుచీకటి నుండి వెలువడిన చంద్రుడిలాగా, సంసార బంధాలనుండి విముక్తి పొందిన సంసారిలాగా (విరక్తునిలాగా) కనిపించాడు. ఆదరంతో ఆడ దిగ్గజాలు తమ తొండాలతో అమృతజలంతో గజరాజును అభిషేకించాయి. ఆ జలాలలో స్నానంచేసి గజేంద్రుడు అలసట తీర్చుకొని నిజ సౌందర్యంతో ప్రకాశించాడు.

**శా. పూరించెన్ హరి పాంచజన్యముఁగృపాంభోరాశి సౌజన్యమున్**
**భూరిధ్వానచలాచలీకృతమహాభూతప్రచైతన్యమున్**
**సారోదారసితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్**
**దూరీభూతవిపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్. 116**

**ప్రతి :** (ఆ సమయంలో); హరి= శ్రీహరి; కృపా+అంభోరాశి+సౌజన్యమున్= దయా సముద్రంవంటి సౌజన్యం కల్గిందీ; భూరిధ్వాన= పెద్దధ్వనితో; చలాచలీకృత= సంచలింపబడిన; మహాభూత= పంచమహాభూతాల, ప్రచైతన్యమున్= చైతన్యాన్ని కల్గిందీ; సార+ఉదార= సారంచే ఉదారమై; సితప్రభా= శుభ్రమైన కాంతిచేత; చకిత= వెరపు పుట్టిన; పర్జన్యాది రాజన్యమున్= ఇంద్రాది దేవతా ప్రభువులను కల్గిందీ; దూరీభూత= దూరం చేయబడిన; విపన్న దైన్యమును= దీనుల దుఃఖాన్ని కల్గిందీ; నిర్ధూత= పారదోలబడిన; ద్విషత్+సైన్యమున్= శత్రుసైన్యం కల్గినదీ అయినటువంటి; పాంచజన్యమున్= పాంచజన్యాన్ని; పూరించెన్= పూరించాడు.

**తా :** అంత శ్రీహరి విజయ సూచకంగా పాంచజన్యమనే తన శంఖాన్ని పూరించాడు. ఆ శంఖం దయాగుణానికి సముద్రం లాంటి ఔదార్యం కల్గింది. తన అద్భుతమైన ధ్వనిచేత పంచభూతాల ప్రకృష్ట చైతన్యాన్ని కదిలించి పారవేయగల్గింది. మిక్కిలి శుభ్రమైన తన తెల్లదనం చేత ఇంద్రాది దేవతలకు కూడా వెరపు పుట్టించగల్గింది. దీన జనుల కష్టాలను దూరం చేస్తుంది. శత్రుసైన్యాన్ని (రాక్షసుల్ని) పారదోలుతుంది.

**మ. మొరసెన్ నిర్జరదుందుభుల్; జలరుహామోదంబులై వాయువుల్**
**దిరిగెం; బువ్వుల వానజల్లు గురిసెన్; దేవాంగనాలాస్యముల్**
**పరఁగెన్; దిక్కులయందు జీవజయశబ్దధ్వానముల్ నిండె, సా**
**గర ముప్పొంగెఁదరంగచుంబితనభోగంగాముఖాంభోజమై. 117**

**ప్రతి :** నిర్జర దుందుభుల్= దేవతల దుందుభులు; మొరసెన్= మ్రోగాయి; జలరుహ+ఆమోదంబులు+ఐ= పద్మాల సువాసనలు కలవియై; వాయువుల్+తిరిగెన్= వాయువులు వీచాయి; పువ్వుల వానజల్లు= పూలవాన; కురిసెన్= కురిసింది; దేవాంగనాలాస్యముల్= అప్సరసల నాట్యాలు; పరఁగెన్= ఒప్పాయి; దిక్కులయందున్= అన్నివైపులా; జీవజయ శబ్దధ్వానముల్= జీవ జయ (జీవించు జయించు) అనే ధ్వానాలు; నిండెన్= వ్యాపించాయి; సాగరము= సముద్రుడు; తరంగ= తన తరంగాలతో; చుంబిత= ముద్దు పెట్టుకోబడిన; నభోగంగా ముఖ+అంభోజము+ఐ= ఆకాశగంగ యొక్క ముఖమనే పద్మం (కలవాడై); ఉప్పొంగెన్= ఉప్పొంగాడు.

**తా :** పాంచజన్యం మ్రోగగానే దేవతల నగారాలు మ్రోగాయి. పద్మాల సువాసనలు నిండిన గాలులు వీచాయి. పూలవాన జల్లులు కురిశాయి. దేవతా స్త్రీలు (అచ్చర లేమలు) నృత్యం చేశారు. జీవ, జయ అనే ధ్వానాలు అన్ని దిక్కులా ప్రతిఫలించాయి. సముద్రుడు తన తరంగాలతో ఆకాశగంగ ముఖపద్మాన్ని ముద్దాడి ఒప్పొనాడు (ఉప్పొంగాడు).

**క. నిడుద యగు కేల గజమును, మడువున వెడలంగఁదిగిచి మదజలరేఖల్**
**దుడుచుచు మెల్లన పుడుకుచు నుడిపెన్ విష్ణుండు దుఃఖ మూర్వీనాథా! 118**

**ప్రతి :** ఉర్వీనాథా= ఓ పరీక్షిన్మహారాజా!; విష్ణుండు= శ్రీమహావిష్ణువు; నిడుద యగు కేలన్= తన పొడవైన చేయి చాచి; గజమును= గజరాజును; మడువునన్+వెడలంగన్= మడుగులో నుండి బయటపడేలా; తిగిచి= లాగి; మదజలరేఖల్= మద ధారల చారలను; తుడుచుచున్= తుడుస్తూ; మెల్లనన్= నెమ్మదిగా; పుడుకుచున్= నిమురుతూ; దుఃఖము= ఆ గజరాజు దుఃఖాన్ని; ఉడిపెన్= పోగొట్టాడు.

**తా :** ఓ రాజా! ఆ తరువాత విష్ణుదేవుడు తన పొడవైన హస్తాన్ని సాచి గజరాజును మడుగులో నుండి బయటికి లాగాడు. దాని దేహం మీద మదజలరేఖలను తుడిచాడు. నెమ్మదిగా దాని దేహాన్ని నిమిరాడు. దాని దుఃఖాన్ని పోగొట్టాడు.

**క. శ్రీహరి కరసంస్పర్శను దేహము దాహంబు మాని ధృతిఁగరిణీ సం**
**దోహంబుఁదాను గజపతి మోహనఘీంకారశబ్దములతో నొప్పెన్. 119**

**ప్రతి :** శ్రీహరి= శ్రీమహావిష్ణువు యొక్క, కర సంస్పర్శను= హస్త సంస్పర్శవల్ల (తాకగానే); దేహము దాహంబు= శరీర తాపమంతా; మాని= పోయి; ధృతిన్= మునుపటి శక్తిని ధైర్యాన్ని పొంది; కరిణీ సందోహంబున్+తానున్= తన ఆడ ఏనుగుల సమూహంతో సహా; గజపతి= గజేంద్రుడు; మోహన= సొంపైన; ఘీంకార శబ్దములతోన్= ఘీంకారాలతో; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తా :** అలా శ్రీహరి తనను చేతితో బాగాతాకి లాలించగానే గజేంద్రుడి శరీరంలోని తాపమంతా చల్లబడింది. అతడు మునుపటి శక్తిని, ధైర్యాన్ని పొందాడు. తన ఆడ ఏనుగుల సమూహంతో కలసి సొంపుగా ఘీంకారం చేశాడు.

**క. కరమున మెల్లన నివురుచుఁగర మనురాగమున మెఱసి కలయంబడుచుం**
**గరి హరికతమున బ్రదుకుచుఁగరపీడన మాచరించెఁగరిణుల మరలన్. 120**

**ప్రతి :** కరి= ఆ గజేంద్రుడు ఈ విధంగా; హరికతమునన్= హరి (కరుణ) వల్ల; బ్రదుకుచున్= మళ్ళీ బ్రతుకును పొంది; కరిణులన్= తన ఆడ ఏనుగులను; కరము= మిక్కిలి; అనురాగమునన్= ప్రేమతో; మెఱసి= ప్రకాశిస్తూ; కలయన్+బడుచున్=

కలిసి తిరుగుతూ; మరలన్= మళ్ళీ; కరమునన్= తొండంతో; మెల్లనన్= నెమ్మదిగా; నివురుచున్= వాటిని నిమురుతూ (తాకుతూ); కరపీడనము ఆచరించెన్= వాటి తొండాలను తన తొండంతో చుట్టిపట్టుకొన్నాడు (అది ప్రేయసీప్రియుల కరపీడనం లాగా ఉంది);

**తా :** శ్రీహరి దయవల్ల మళ్ళీ ప్రాణం పోసుకొన్న గజరాజు మరలా తన ఏనుగుల్ని చేరుకొని కలయ తిరిగాడు. మళ్ళీ మునుపటిలాగానే తొండంతో వాటిని మెల్లగా నిమిరాడు. వాటి తొండాలను తన తొండంతో పెనవేసుకొని పట్టుకొన్నాడు.

**విశే :** పశుప్రవృత్తిలోని అద్భుతమైన రహస్యం ఒకటి ఇక్కడ ఉంది. మనిషి విషయం ఇంతే. మళ్ళీ బ్రతుకు కల్గగానే ఆడ ఏనుగుల్ని కలుసుకొని మునుపటి లాగానే ఉండగోరినాడు గజరాజు. ఇదే ఈ కథకు చక్కని ముగింపు.

**సీ. జననాథ! దేవలశాపవిముక్తుఁడై పటుతరగ్రాహరూపంబు మాని**
**ఘనుఁడు హూహూనామగంధర్వుఁడప్పుడు దన తొంటి నిర్మలతనువుఁదాల్చి**
**హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి తవిలి కీర్తించి గీతములు పాడి**
**యా దేవు కృప నొంది యందంద మఱియును వినతశిరస్కుఁడై వేడ్కతోడ**

**ఆ. దళితపాపుఁడగుచుఁదనలోకమున కేగె, నపుడు శౌరి కేల నంటి తడవ**
**హస్తిలోకనాథుఁడజ్ఞాన రహితుఁడై, విష్ణురూపుఁడగుచు వెలుఁగుచుండె. 121**

**ప్రతి :** (ఈ కథనంతా చెప్పి శుకమహర్షి పరీక్షిత్తుకు గజేంద్రుని పూర్వవృత్తాంతం వివరించాడు. దీనికి ముందు ఆ మొసలి పూర్వజన్మను గురించి ఇలా చెప్పారు.)

జననాథ= ఓ రాజా; హూహూ నామగంధర్వుఁడు= హూహూ అనే పేరుగల గంధర్వుడు; దేవల= దేవలుడనే మునియొక్క; శాప= శాపం చేత; విముక్తుడు+ఐ= విడవబడినవాడై; పటుతర= గొప్పదైన; గ్రాహరూపంబు= మొసలి రూపాన్ని; మాని= వీడి; ఘనుఁడు= ఆ మహనీయుడు; అప్పుడు; తన= తనయొక్క; తొంటి నిర్మల తనువున్+తాల్చి= నిర్మలమైన తన పూర్వ రూపాన్ని పొంది; హరికిన్+అవ్యయునకున్= అవ్యయుడైన శ్రీహరికి; అతిభక్తితోన్= మిక్కిలిభక్తితో; మ్రొక్కి= నమస్కరించి; తవిలి= మిక్కిలి ఆసక్తితో; కీర్తించి= స్వామిని స్తుతించి; గీతములు పాడి= కీర్తనలు పాడి (గంధర్వులు గానవిద్యలో నిష్ణాతులు); ఆ దేవు కృపన్+ఒంది= ఆ దేవుని దయను పొంది, అందంద=అక్కడే మరల మరల; వినత శిరస్కుఁడు+ఐ= తలవంచి నమస్కరిస్తూ; వేడ్కతోడన్= సంతోషంతో; దళితపాపుఁడు+అగుచున్= పాపాలు పోగొట్టుకొన్నవాడై; తన లోకమునకున్+ఏగెన్= తన లోకానికి వెళ్ళిపోయాడు; అపుడు; శౌరి= విష్ణువు; కేలన్+అంటి+తడవన్= స్వామివారు తాకి నిమరగా (ఆ పుణ్యంవల్ల); హస్తిలోకనాథుఁడు= గజరాజు; అజ్ఞానరహితుఁడు+ఐ= అజ్ఞానం తొలగినవాడై; విష్ణురూపుఁ డగుచున్= విష్ణు సారూప్యాన్ని పొందినవాడై; వెలుగుచుండెన్= ప్రకాశించాడు.

**తా :** రాజా! గొప్పదైన ఆ మొసలి పూర్వజన్మలో 'హూహూ' అన్న పేరుగల గంధర్వుడు. దేవలుడు అనే ముని పెట్టిన శాపంవల్ల మొసలిగా మారి దుర్భర జీవితం గడిపి, గజేంద్రుడికి 'విమోచనం' కాగానే, తన పూర్వ గంధర్వరూపాన్ని పొందాడు. అవ్యయుడైన శ్రీహరికి అతిభక్తియుక్తుడై నమస్కరించి ఆసక్తితో స్వామివారిని స్తుతిస్తూ ఎన్నో గీతాలు పాడాడు. ఆ దేవుని కృపను పొంది, మాటిమాటికి నమస్కరిస్తూ పాపాలు పోగొట్టుకొని సంతోషంగా తన లోకానికి వెళ్ళిపోయాడు. గజరాజు కూడా శ్రీహరి హస్త స్పర్శ ప్రభావంచేత అజ్ఞానం పోయి పుణ్యం పొంది శ్రీహరిసారూప్యం పొందాడు.

**విశే :** గజేంద్రుడు భగవదనుగ్రహం వల్ల భగవత్సారూప్యమనే మోక్షస్థితిని పొందాడు.

**మ. అవనీనాథ! గజేంద్రుఁడా మకరితో నాలంబు గావించె మున్**
**ద్రవిళాధీశుఁడతండు పుణ్యతముఁడింద్రద్యుమ్ననాముండు వై**
**ష్ణవముఖ్యుండు గృహీతమౌననియతిన్ సర్వాత్ము నారాయణున్**
**సవిశేషంబుగఁబూజ సేసెను మహాశైలాగ్రభాగంబునన్. 122**

**ప్రతి :** అవనీనాథ= ఓ రాజా!; గజేంద్రుఁడు; ఆ మకరితోన్; ఆలంబు= యుద్ధం; కావించెన్= చేశాడు; అతండు= ఆ గజరాజు; మున్= పూర్వంలో; పుణ్యతముఁడు= పుణ్యాత్ముడైన; ద్రవిళ+అధి+ఈశుఁడు= ద్రవిడ దేశాన్ని పరిపాలించినవాడు; ఇంద్రద్యుమ్ననాముండు= ఇంద్రద్యుమ్నుడు అన్న పేరుగలవాడు; వైష్ణవముఖ్యుండు= విష్ణుభక్తులలో ప్రముఖుడు; గృహీత= గ్రహించబడిన; మౌననియతిన్= మౌనవ్రతంలో; సర్వాత్మున్= సర్వాత్ముడైన; నారాయణున్= శ్రీమన్నారాయణుని; మహాశైలాగ్ర భాగంబునన్= ఒక పర్వతం మీద; సవిశేషంబుగన్= విశేషంగా; పూజ+చేసెను= పూజలు చేశాడు.

**తా :** ఓ రాజా! మొసలితో ఇంత ఘోరయుద్ధం చేసిన గజరాజు పూర్వజన్మలో ఇంద్రద్యుమ్నుడు అనే పేరు గలిగిన ద్రవిడ దేశాధిపతి. చాలా పుణ్యాత్ముడాయన. వైష్ణవభక్తులలో ప్రముఖుడుగా పేరు పొందినవాడు. మౌనవ్రతం పూని ఒక పర్వత శిఖరం మీద శ్రీహరి సన్నిధిని ఏర్పాటుచేసుకొని విశేషంగా పూజలు చేస్తూ ఉండేవాడు.

**మ. ఒకనాఁడా నృపుఁడచ్యుతున్ మనములో నూహించుచున్ మౌనియై**
**యకలంకస్థితి నున్నచోఁగలశజుండచ్చోటికిన్ వచ్చి లే**
**వక పూజింపక యున్న మౌనిఁగని నవ్యక్రోధుఁడై మూఢ! లు**
**బ్ధ! కరీంద్రోత్తమ యోనిఁబుట్టు' మని శాపం బిచ్చె భూవల్లభా! 123**

**ప్రతి :** భూవల్లభా = ఓ రాజా!; ఒకనాఁడు; ఆ నృపుఁడు= ఆ రాజు; అచ్యుతున్= అచ్యుతుడైన శ్రీహరిని; మనములోన్+ ఊహించుచున్= మనస్సులో ధ్యానిస్తూ; మౌనియై= మౌనవ్రతం పాటిస్తూ; అకలంకస్థితిన్= నిశ్చలంగా; ఉన్నచోన్= ఉండగా; కలశజుండు= అగస్త్య మహర్షి; ఆ+చోటికిన్= ఆ పర్వతాగ్రంలోని ఆశ్రమానికి; వచ్చి; లేవక, పూజింపక+ ఉన్న= లేచి పూజ చేయకుండా మైమరపులో ఉన్న; మౌనిన్+కని= ఆ మునిని చూచి; నవ్యక్రోధుఁడై= వెంటనే కోపం పుట్టగా; మూఢ= ఓరీ మూర్ఖుడా!; లుబ్ధ= లుబ్ధుడా!; కరీంద్రోత్తమయోనిన్= పెద్ద ఏనుగు జాతిలో; పుట్టుమని= జన్మించుమని; శాపంబు+ఇచ్చెన్= శాపమిచ్చాడు.

**తా :** ఓ రాజా! ఒకరోజు ఆ రాజు మౌనవ్రతం దాల్చి అచ్యుతుడైన శ్రీహరిని మనస్సులో ధ్యానిస్తూ నిశ్చలంగా ఉండగా, ఆ చోటికి వచ్చిన అగస్త్యమహర్షి తన్నుచూచి లేచి నమస్కరించి పూజించని ఆ రాజును చూచి కోపం తెచ్చుకొని 'ఓయి మూర్ఖుడా! లుబ్ధుడా! పెద్ద యేనుగు జాతిలో జన్మించు' అని శాపమిచ్చాడు.

**క. మునిపతి నవమానించిన ఘనుఁడింద్రద్యుమ్నవిభుఁడు గౌంజరయోనిం**
**జననంబందెను; విప్రులఁగని యవమానింపఁదగదు ఘనపుణ్యులకున్. 124**

**ప్రతి :** మునిపతిన్= శ్రేష్ఠుడైన అగస్త్యమునిని; అవమానించిన; ఘనుఁడు= విష్ణుభక్తులలో ఘనుడైన; ఇంద్రద్యుమ్న విభుఁడు= ఇంద్రద్యుమ్నుడనే రాజు; కౌంజర యోనిన్= ఏనుగుల జాతిలో (కుంజర – కౌంజర); జననంబు+అందెను=

పుట్టాడు; విప్రులన్= తపోధనులైన బ్రాహ్మణులను; కని= చూచి; అవమానింపన్= అవమానించడం; ఘన పుణ్యులకున్= గొప్ప పుణ్యాత్ములకు కూడా; తగదు= కూడదు.

**తా :** శ్రేష్ఠుడైన అగస్త్యమహర్షిని పూజించకుండా అవమానించి విష్ణుభక్తులలో శ్రేష్ఠుడైన ఇంద్రద్యుమ్నుడు ఏనుగుల జాతిలో పుట్టాడు. ఇది అంతే. ఎంత గొప్ప పుణ్యాత్ములకైనా తపోధనులైన బ్రాహ్మణులను అవమానించడం తగని పని.

**క. కరినాథుఁడయ్యె నాతఁడు కరులైరి భటాదులెల్ల; గజముగ నయ్యున్**
**హరిచరణసేవకతమునఁగరివరునకు నధికముక్తి గలిగె మహాత్మా! 125**

**ప్రతి :** మహాత్మా= ఓ పుణ్యాత్ముడైన రాజా!; ఆతఁడు= ఆ ఇంద్రద్యుమ్నుడు; కరినాథుఁడయ్యెన్= గజరాజు అయ్యాడు; భటాదులు+ఎల్లన్= అతని సేవకులు మున్నగువారంతా; కరులు+ఐరి= ఏనుగులుగా పుట్టారు; గజముగన్+అయ్యున్= ఏనుగుగా పుట్టినా; హరిచరణసేవ కతమునన్= పూర్వజన్మలో హరిసేవ చేసినందువల్ల; కరివరునకున్= ఆ గజరాజుకు; అధికముక్తి= శ్రేష్ఠమైన (సారూప్యరూపమైన) మోక్షం; కలిగెన్= కల్గింది.

**తా :** ఓ రాజా! ఆ విధంగా ఇంద్రద్యుమ్నుడు గజరాజు జన్మ పొందాడు. అతని సేవకులు, మున్నగువారందరూ ఏనుగులుగా పుట్టారు. ఏనుగుగా పుట్టినా పూర్వజన్మలో చేసిన హరిపూజాఫలంగా ఆ గజేంద్రునికి సారూప్యపదవి లభించింది.

**ఆ. కర్మతంత్రుఁడగుచుఁగమలాక్షుఁగొల్చుచు, నుభయనియతవృత్తి నుండెనేనిఁ**
**జెడును గర్మమెల్ల శిథిలమై మెల్లన, ప్రబలమైన విష్ణుభక్తి సెడదు. 126**

**ప్రతి :** కర్మతంత్రుఁడు+అగుచున్= తన స్వధర్మమైన నిత్య కర్మలను చేస్తూ; కమలాక్షున్+కొల్చుచున్= విష్ణువును సేవిస్తూ; ఉభయనియత వృత్తిన్+ఉండెనేని= ఈ రెండు నియమాలను చక్కగా పాటిస్తే; మెల్లన= నెమ్మదిగా; కర్మమెల్ల= పాపాలన్నీ (సంచిత ప్రారబ్ధ కర్మలన్నీ); శిథిలము+ఐ= నశించి; చెడును= పోతాయి; (కాని) ప్రబలమైన= మిక్కిలి శక్తిగల; విష్ణుభక్తి; చెడదు= ఎప్పటికీ పోదు (వృద్ధి పొందుతూనే ఉంటుంది).

**తా :** భక్తుడు తన నిత్యకృత్యాలు నిర్వర్తిస్తూ విష్ణువును సేవించాలి. ఈ రెండు నియమాలను చక్కగా పాటిస్తే క్రమంగా పాపాలన్నీ పోతాయి. విష్ణుభక్తిలో ఆసక్తి ఎప్పటికీ పోదు.

**క. చెడుఁగరులు హరులు ధనములు జెడుదురు నిజసతులు సుతులుఁజెడు చెనఁటులకుం;**
**జెడక మనునట్టి గుణులకుఁ, జెడని పదార్థములు విష్ణుసేవానిరతుల్. 127**

**ప్రతి :** చెడుచెనఁటులకున్= దైవబలం లేని దుర్జనులకు; కరులు= ఏనుగులు; హరులు= గుర్రాలు; ధనములు= సంపదలూ; చెడున్= నశిస్తాయి; నిజసతులు= తమ భార్యలు; సుతులున్= పిల్లలు; చెడుదురు= నశిస్తారు; చెడక= చెడిపోకుండా; మనునట్టి= బ్రతికేటటువంటి; గుణులకున్= సద్గుణవంతులకు; విష్ణుసేవానిరతుల్= విష్ణుభక్తిలోని ఆసక్తి, శ్రద్ధ; చెడని పదార్థములు= ఎప్పటికీ చెడిపోని అంశాలు.

**తా :** దైవబలం లేని దుర్జనులకు ఏనుగులు, గుర్రాలు, ఎంత సంపదా ఉన్నా నశిస్తాయి. వారి ఆలుబిడ్డలూ నశిస్తారు. గుణవంతులైన వారు సన్మార్గంచేత చెడిపోకుండా బ్రతుకుతారు. అంతేకాక వారికి విష్ణువులో ఉన్న భక్తి, శ్రద్ధ క్రమంగా పెరుగుతాయి తప్ప, ఎన్నటికీ నశించవు.

**వ. అప్పుడు జగజ్జనకుండగు నప్పరమేశ్వరుండు దరహసిత ముఖకమల యగు నక్కమల కిట్లనియె. 128**

**ప్రతి :** అప్పుడు; జగజ్జనకుండు= జగత్తుకు తండ్రి అయినటువంటి; ఆ+పరమేశ్వరుండు= ఆ పరమాత్ముడు; దరహసిత= నవ్వుతున్న (చిరునవ్వుతోడి); ముఖ కమలయగున్= ముఖపద్మం కల్గిన; ఆ+కమలకున్= ఆ లక్ష్మీదేవికి, ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** అప్పుడు లోకానికి తండ్రి అయిన ఆ పరమాత్ముడు చిరునవ్వుతో కూడిన ముఖపద్మంతో ప్రకాశిస్తున్న లక్ష్మీదేవికి ఇలా చెప్పాడు.

**క. 'బాలా! నా వెనువెంటను హేలన్ వినువీథినుండి యేతెంచుచు నీ**
**చేలాంచలంబుఁబట్టుట కాలో నేమంటి నన్ను నంభోజముఖీ! 129**

**ప్రతి :** బాలా= ఓ చిన్నదానా!; అంభోజముఖీ= తామరవంటి మోమున్నదానా!; నా వెనువెంటను= నా వెంబడి; వినువీథినుండి+ ఏతెంచుచున్= ఆకాశంలో వస్తూ ఉండి; నీ చేలాంచలమున్+పట్టుటకున్= నీ పైట చెరగును చేతిలో విడువకుండా పట్టుకుని ఉన్నందుకు; ఆలోన్+ఏమంటివి+నన్ను= ఆ లోపల నన్ను గురించి ఏమనుకున్నావు (చెప్పు!).

**తా :** తామర వంటి ముఖం కల్గిన ఓ చిన్నదానా! నా వెంబడి ఆకాశంలో వస్తూ ఉండిన సమయంలో నా చేతిలో వదలకుండా నీపైట కొంగును అలాగే పట్టుకొని ఉండినందుకు మనస్సులో నన్ను గురించి ఏమనుకొన్నావో (చెప్పవా!)

**క. ఎఱుఁగుదు తెఱవా యెప్పుడు మఱవను సకలంబు నన్ను మఱచిన యెడలన్**
**మఱతు నని యెఱిఁగి మొఱఁగక మఱవక మొఱ యిడిర యేని మఱి యన్యములన్. 130**

**ప్రతి :** తెఱవా= ఓ మగువా; సకలంబు= అన్నింటిని; ఎఱుఁగుదు= తెలుసుకోగలను (ఎరుగుదును); నన్ను+మఱచిన ఎడలన్= నన్ను మరచిపోతే; మఱతును+అని+ఎఱిఁగి= నేను మరచిపోతానని తెలిసి; అన్యములన్= ఇతరులను (ఇతరమైన వాటిని); మొఱఁగక= ఆశ్రయించక (స్తుతించక); మఱువక= నన్ను మరవకుండా; మొఱ+ఇడిర+ఏనిన్= మొరపెట్టుకొంటే; ఎప్పుడున్+మఱవను= అలా స్మరించేవారిని ఎప్పుడూ మరిచిపోను.

**తా :** ఓ మగువా! నాకు అన్నీ తెలుసు. (నీ మనస్సులో ఉన్నదికూడా); నన్ను ఎవరు మరిచి పోతారో వారిని నేను కూడా మరచిపోతాను. ఇతరులను ఆశ్రయించి స్తుతించకుండా నన్ను ఎవరు మరువకుండా స్తుతిస్తారో, ఆశ్రయిస్తారో వారిని నేనూ ఎప్పుడూ మరవను.

**వ. అని పలికిన నరవిందమందిర యయిన న య్యిందిరాదేవి మందస్మిత చంద్రికా సుందర వదనారవింద యగుచు ముకుందున కిట్లనియె. 131**

**ప్రతి :** అని పలికినన్= అని చెప్పగా; అరవిందమందిర= పద్మంలో నివసించే లక్ష్మి; మందస్మిత= చిరునవ్వు అనెడి; చంద్రికా= వెన్నెలచేత; సుందర= అందమైన; వదనారవింద యగుచున్= ముఖపద్మం కల్గింది అవుతూ; ముకుందునకున్= మహావిష్ణువుకు; ఇట్లు+అనియెన్= ఇలా అంది.

**తా :** అని చెప్పగా, చిరునవ్వు చిందే ముఖారవిందంతో ఆ లక్ష్మీదేవి విష్ణువుతో ఇలా అన్నది.

**క. దేవా! దేవర యడుగులు, భావంబున నిలిపి కొలుచు పని నా పని గా**
**కో వల్లభ! యే మనియెద, నీ వెంటను వచ్చుచుంటి నిఖిలాధిపతీ! 132**

**ప్రతి :** దేవా= ప్రభూ!; దేవర+అడుగులు= ప్రభువైన నీ పాదాలను; భావంబునన్= మనస్సులో; నిలిపి= ఉంచుకొని; కొలుచు పని= పూజించడమే; నా పని= నా ధర్మం; కాక= అంచేత (ఇది తప్పు); ఓ వల్లభ= ఓ నాథా; ఏమి+అని యెదన్= ఏమంటాను?; నిఖిల+అధిపతీ= సమస్తానికీ అధిపతివి నీవు – (అలాంటి ఓ స్వామీ!); నీ వెంటను వచ్చుచుంటిన్= నీ వెంటనే వస్తూ ఉంటిని.

**తా :** స్వామీ! నీవు సర్వానికీ అధిపతివి. నాకు నాథుడవు. నీ పాదాలను మనస్సులో ఉంచుకొని పూజించడమే నా ధర్మం. అంచేత ఏమంటాను? ఏమనకుండా నే నీ వెంట వచ్చాను. (అంతేకదా!) అన్నది.

**విశే :** నవ విధ భక్తిమార్గాలలో అంఘ్రిసేవన (పాదసేవనం) వల్ల తరించిన భక్తురాలుగా లక్ష్మీదేవిని చెబుతారు. (తదంఘ్రిభజనే లక్ష్మీ – అన్నారు). ఆ విధంగా శ్రీనివాసునికి అత్యంత అనుకూలవతి లక్ష్మి – ఆయన హృదయం సంపూర్ణంగా ఎరిగి ఆయనను అనుసరించి ప్రతి అవతారంలోనూ తానూ పుట్టి స్వామిని అనుసరించి సేవించింది. అందుకే ఆమెను అనపాయిని (వదలనిది) అంటారు.

**క. దీనుల కుయ్యాలింపను దీనుల రక్షింప మేలు దీవనఁబొందన్**
**దీనావన! నీ కొప్పును దీనపరాధీన! దేవదేవ! మహేశా! 133**

**ప్రతి :** దీన+అవనా= దీనులను రక్షించేవాడా!; దీనపరాధీన= దీనులకు పరాధీనుడా!; దేవదేవ= దేవాధిదేవా!; మహేశా= మహాప్రభూ!; దీనుల= దీనులయొక్క; కుయ్యాలింపను= మొరను ప్రీతితో వినటానికి; దీనుల రక్షింపన్= దీనుల్ని కాపాడటానికి; మేలు దీవనన్+పొందన్= మంచిమంచి దీవనలు అందుకోవటమూ; నీకున్+ఒప్పును= నీకే తగినది.

**తా :** దీనరక్షకా! దీనబంధూ! దీనపరాధీనా! జగత్ప్రభూ! దేవాధిదేవా! నిన్ను ఏమని పొగడగలమయ్యా! దీనుల మొరను ప్రీతితో విని వారిని రక్షించడమూ, మంచి మంచి దీవనలు (మంగళాశాసనాలు) పొందడం నీకే తగును.

**వ. అని మఱియును సముచిత సంభాషణంబుల నంకించుచున్న య ప్పరమ వైష్ణవీరత్నంబును సాదర సరస సల్లాప మందహాస పూర్వకంబుగా నాలింగనంబు గావించి సపరివారుండై గరుడ గంధర్వ సిద్ధ విబుధగణ జేగీయమానుండై గరుడారూఢుం డగుచు నిజసదనంబునకుం జనియె; నని చెప్పి శుకయోగీంద్రుం డిట్లనియె. 134**

**ప్రతి :** అని; మఱియును; సముచిత= తగినట్టి; సంభాషణంబులన్= మాటలతో; అంకించుచున్న= స్వామిని స్తుతిస్తున్న; ఆ+పరమ= ఆ గొప్ప; వైష్ణవీరత్నంబును= విష్ణుభక్తురాండ్లలో శ్రేష్ఠురాలైన లక్ష్మీదేవిని; సాదర సరస సల్లాప మందహాస పూర్వకంబుగాన్= ఆదరంతో, సరసంగా, చిరునవ్వుతో, పరిహాసపూర్వకంగా; ఆలింగనంబు+కావించి= కౌగిలించుకొని; సపరివారుండై= పరివార సమేతంగా; గరుడ, గంధర్వ, సిద్ధ, విబుధగణ= దేవతా గణములచేత; జేగీయమానుండై= జయజయధ్వానాలు చేయబడుతున్నవాడై; గరుడ+ఆరూఢుండు+అగుచున్= గరుడ వాహనాన్ని అధిరోహించి, నిజసదనంబునకున్= తన చోటైన వైకుంఠానికి; చనియెన్= వెళ్ళాడు; అని చెప్పి; శుకయోగీంద్రుడు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** పై విధంగా అని, ఇంకా లక్ష్మీదేవి ఎన్నో రీతుల స్వామివారిని స్తుతించింది. ఆ పరమ విష్ణుభక్తురాలిని స్వామివారు ఆదరంతో దగ్గరికి తీసుకొని, ఇంపైన మాటలతో, పరిహాసంతో, చిరునవ్వుతో ఆలింగనం చేసుకున్నారు. సపరివారంగా, గరుడ, గంధర్వ, దేవగణాలు 'జయజయ' ధ్వానాలు చేస్తుండగా, గరుడ వాహనమెక్కి తన స్థానమయిన వైకుంఠానికి చేరుకున్నారు – అని చెప్పి పరీక్షిత్తుతో శుకుడు ఇలా అన్నాడు.

**సీ. నరనాథ! నీకును నాచేత వివరింపఁబడిన యీ కృష్ణానుభావమైన**
**గజరాజమోక్షణకథ వినువారికి యశము లిచ్చును గల్మషాపహంబు;**
**దుస్స్వప్ననాశంబు దుఃఖసంహారంబుఁ; బ్రొద్దున మేల్కాంచి పూతవృత్తి**
**నిత్యంబుఁబఠియించు నిర్మలాత్మకులైన విప్రులకును బహువిభవ మమరు;**

**తే. సంపదలు గల్గుఁ; బీడలు శాంతిఁబొందు; సుఖము సిద్ధించు; వర్ధిలు శోభనములు;**
**మోక్ష మఱచేతిదై యుండు; ముదము చేరు, ననుచు విష్ణుండు ప్రీతుఁడై యానతిచ్చె. 135**

**ప్రతి :** నరనాథా= రాజా!; నీకును= నీకోసం; నాచేత; వివరింపఁబడిన; ఈ కృష్ణానుభావము+ఐన= విష్ణుస్వరూపుడైన కృష్ణానుభావరూపమైన మహిమ గల; గజరాజ మోక్షణకథ; వినువారికిన్; యశములిచ్చును= కీర్తిని కలిగిస్తుంది; కల్మష+అపహంబు= పాపాలను నశింపజేస్తుంది; ప్రొద్దునన్= ఉదయాన్నే; మేల్కాంచి= నిదురలేచి; పూతవృత్తిన్= నిర్మలమైన మనస్సుతో; నిత్యంబున్= ప్రతి నిత్యమూ; పఠియించు= ఈ కథ చదివేటటువంటి; నిర్మలాత్మకులు+ఐన= మంచి మనస్సు గల; విప్రులకును= బ్రాహ్మణులకు; బహు విభవము= గొప్పవైభవం (గొప్పదనం); అమరు; సంపదలున్= సంపదలూ; కల్గున్= కల్గుతాయి; పీడలు= ఆపదలు; శాంతిన్+పొందున్= నశిస్తాయి; సుఖము= సుఖం; సిద్ధించున్= కలుగుతుంది; శోభనములు= శుభాలు; వర్ధిలున్= వర్ధిల్లుతాయి; మోక్షము+అఱచేతిది+ఐ+ఉండున్= మోక్షం సులభంగా సిద్ధిస్తుంది; ముదము చేరున్= సంతోషం సమకూరుతుంది; అనుచున్= అంటూ; విష్ణుండు= శ్రీమహావిష్ణువు; ఆనతిచ్చెన్= సెలవిచ్చాడు.

**తా :** నేను నీకు వివరించిన గజేంద్ర మోక్ష గాథను వినేవారు కీర్తిమంతులవుతారు. పాపాలు నశిస్తాయి. చెడ్డకలలు రావు. దుఃఖాలు రావు. ఎవరు ప్రతిరోజూ ఉదయం పవిత్రమైన నియమంతో నిర్మలమైన మనస్సుతో ఈ కథను చదువుతారో అలాంటి వారికి (జ్ఞానులకు) సంపద కల్గుతుంది. వైభవం సిద్ధిస్తుంది. ఆపదలు రావు. శుభాలు వృద్ధిపొందుతాయి. మోక్షం సులభంగా సిద్ధిస్తుంది. సంతోషంగా ఉంటారు – అని విష్ణువు సెలవిచ్చాడు. (ఇది ఫలశ్రుతి)

**వ. అని మఱియు నప్పరమేశ్వరుం డిట్లని యానతిచ్చె; నెవ్వరేని నపరరాత్రంబున మేల్కాంచి సమాహిత మనస్కులయి నన్నును నిన్నును నీ సరోవరంబును శ్వేతద్వీపంబున నాకుం బ్రియంబైన సుధాసాగరంబును హేమ నగంబును నిగ్గిరి కందర కాననంబులను వేత్రకీచక వేణులతాగుల్మ సురపాదపంబులను నేనును, బ్రహ్మయు, ఫాలలోచనుండును నివసించియుండు నక్కొండ శిఖరంబులను గౌమోదకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను శ్రీదేవిని శేష గరుడ వాసుకి ప్రహ్లాద నారదాదిఋషులను మత్స్య కూర్మ వరాహాద్యవతారంబులను దదవతార కృతకార్యంబులను సూర్యసోమపావకులను బ్రణవంబును ధర్మతపస్సత్యంబులను వేదంబును వేదాంగంబులను శాస్త్రంబులను గో భూసుర సాధు పతివ్రతా జనంబులను జంద్రకాశ్యపజాయా సముదయంబును గౌరీగంగా సరస్వతీ కాళిందీ సునందా ప్రముఖ పుణ్యతరంగిణీ**

**నిచయంబును నమరులను నమర తరువులను నైరావతంబును నమృతంబును ధ్రువుని బ్రహ్మర్షినివహంబును బుణ్య శ్లోకులయిన మానవులను సమాహిత చిత్తులై తలంచు వారలకుఁబ్రాణావసాన కాలంబున మదీయంబగు విమలగతి నిత్తునని హృషీకేశుండు నిర్దేశించి శంఖంబు పూరించి సకలామరవందిత చరణారవిందుండై విహగపరివృఢవాహనుండై వేంచేసె; విబుధానీకంబు సంతోషించెనని చెప్పి శుకుండు రాజున కిట్లనియె.136**

**ప్రతి :** అని; మఱియున్= ఇంకా; పరమేశ్వరుండు= ఆ దేవదేవుడు; ఇట్లని ఆనతిచ్చెన్= ఇలా సెలవిచ్చాడు; ఎవ్వరు+ఏని= ఎవరైనా సరే; అపర రాత్రంబునన్= తెల్లవారుజాముననే; మేల్కాంచి= మేలుకొని; సమాహిత= ప్రశాంతమైన; మనస్కులయి= మనసు కలవారై; నన్నును= నన్ను; నిన్నునున్= (నిన్ను) గజరాజును; ఈ సరోవరంబును= ఈ సరోవరాన్ని; శ్వేతద్వీపంబునన్+ శ్వేతద్వీపంలో; నాకున్+ప్రియంబు+అయిన= నాకిష్టమయిన; సుధాసాగరంబును= క్షీరసాగరాన్ని; హేమనగంబును= త్రికూట పర్వతాన్ని; ఈ+గిరి+కాననంబులను= ఈ కొండలోని గుహలను, అడవులను; వేత్రకీచక+వేణు+లతాగుల్మ+ సురపాదపంబులను= పేము, వెదురు, పొదలతో కూడిన కల్పవృక్షాలను; నేనును= నేనూ; బ్రహ్మయున్= బ్రహ్మ; ఫాలలోచనుండును= శివుడును; నివసించి ఉండు= ఉండేటటువంటి; ఆ+కొండశిఖరంబులను= ఆ కొండ శిఖరాలను; కౌమోదకీ (గద); కౌస్తుభ (మణి); సుదర్శన (చక్ర); పాంచజన్యంబులను (శంఖం); శ్రీదేవిని, శేష, గరుడ, వాసుకి, ప్రహ్లాద, నారదాది ఋషులను; మత్స్య కూర్మ వరాహాది+అవతారంబులను= స్వామివారి మత్స్య, కూర్మ, వరాహాది అవతారాలను; తద్+అవతార+కృతకార్యంబులను= ఆయా అవతారాలలో నేను చేసిన అతిమానుష కార్యాలను; సూర్య; సోమ; పావకు (అగ్ని) లను; ప్రణవంబును= ఓంకారాన్ని; ధర్మతపస్సత్యంబులను= ధర్మాన్ని, తపస్సును, సత్యాన్ని; వేదంబును= అఖండ వేదరాశిని; వేదాంగంబులను= శిక్ష, వ్యాకరణం లాంటి ఆరు వేదాంగాలను; శాస్త్రంబులను= విధి విధానాలను తెలిపే ధర్మశాస్త్రాదులను; గో= ఆవు; భూసుర= బ్రాహ్మణ; సాధు= సత్పురుషులు; పతివ్రతా జనంబులను= పతివ్రతలను; చంద్రకాశ్యపజాయా సముదయంబును= చంద్రుని భార్యలనూ, కాశ్యపుని భార్యలను; గౌరీ గంగా సరస్వతీ కాళిందీ సునందా ప్రముఖ పుణ్యతరంగిణీ నిచయంబును= గౌరీదేవిని, గంగను, సరస్వతిని, కాళింది, సునంద మొదలైన పుణ్యనదీ సముదాయాన్నీ; అమరులను= దేవతలను; అమర తరువులను= దేవతా వృక్షాలైన కల్పవృక్ష పారిజాతాదులను; ఐరావతంబును= ఐరావతాన్ని; అమృతంబును; ధ్రువుని= నక్షత్రమండల రూపంలో ప్రకాశిస్తున్న ధ్రువుని; బ్రహ్మర్షి నివహంబును= వశిష్ఠ విశ్వామిత్రాది బ్రహ్మర్షి సముదాయాన్ని; పుణ్యశ్లోకులు+అయిన= పుణ్యాత్ములయిన; మానవులను= మానవుల్నీ; సమాహిత చిత్తులు+ఐ= శాంతచిత్తులై (యోగనిష్ఠులై); తలంచు వారలకున్= ధ్యానించేవారికి; ప్రాణ+అవసాన కాలంబునన్= చనిపోయే సమయంలో; మదీయంబు+అగు= నాదైన; విమలగతిన్= నిర్మలమైన రక్షణను; ఇత్తునని= ప్రసాదిస్తానని; హృషీకేశుండు= ఇంద్రియాలకు అధిపతి అయిన మహావిష్ణువు; నిర్దేశించి= ఆనతిచ్చి; శంఖంబు పూరించి= శంఖం పూరించాడు; సకల+అమర+వందిత= సర్వదేవతల చేత నమస్కరింపబడిన; చరణారవిందుఁడు+ఐ= పాదపద్మాలు కల్గినవాడై; విహగపరివృఢ= పక్షిరాజైన గరుత్మంతుడు; వాహనుండు+ఐ= వాహనం కలవాడై; వేంచేసెన్= పయనించాడు; విబుధ+ఆనీకంబు= దేవతల సమూహం; సంతోషించెన్+ అనిచెప్పి= సంతోషించిందని చెప్పి; శుకుండు రాజునకిట్లు+ అనియెన్= శుకుడు పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

**తా :** (మరి ఇంకా ఫలశ్రుతి వాక్యాలుగా శ్రీమహావిష్ణువు ఇలా సెలవిచ్చాడు) 'ఇంతేకాదు. తెల్లవారుజామునే లేచి ప్రశాంతమైన మనస్సుతో విష్ణువును, గజరాజును, పద్మసరస్సును, శ్వేతద్వీపాన్ని, క్షీరసాగరాన్ని, త్రికూట పర్వతంలోని గుహలను, అడవులను, పేము, వెదురు, పొదలతో కూడిన కల్పవృక్షాలను, విష్ణువు, బ్రహ్మ, శివుడు నివసించే త్రికూట

శిఖరాలను, కౌమోదకి, కౌస్తుభం, సుందర్శనం, పాంచజన్యం – శ్రీలక్ష్మి, ఆదిశేషుడు, గరుడుడు, వాసుకి, ప్రహ్లాదుడు, నారదుడు వీరిని; మత్స్యకూర్మవరాహాది అవతారాలను; ఆ అవతారాలలో విష్ణువు చేసిన అతిమానుష కార్యాలను; సూర్యచంద్ర అగ్నులను, ఓంకారాన్ని, ధర్మాన్ని, తపస్సును, సత్యాన్ని, వేదాన్ని, వేదాంగాలను, శాస్త్రాలను, గోబ్రాహ్మణులను, సాధువులను, పతివ్రతలను, చంద్రుడి భార్యలను (27 నక్షత్రాలను); కశ్యపుని భార్యలను (వినత, కద్రువ, అదితి,దితి); గౌరిని, గంగా, సరస్వతి, యమున, సునంద మొదలైన పుణ్యనదులను, దేవతలను, దేవతా వృక్షాలను, ఐరావతాన్ని, అమృతాన్ని, ధ్రువుని, బ్రహ్మర్షులను, పుణ్యాత్ములైన మానవులను, తలచువారు; మరణించే సమయంలో నిర్మలమైన విష్ణువు రక్షణ పొందుతారని కూడా విష్ణువు చెప్పాడు. శంఖం పూరించాడు. దేవతలంతా స్వామిపాదపద్మాలకు నమస్కరించగా అందుకొని గరుడవాహనం అధిరోహించి స్వామి పయనించాడు. దేవతలందరూ సంతోషించారు – అని చెప్పి శుకుడు పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

**క. గజరాజమోక్షణంబును నిజముగఁబఠియించునట్టి నియతాత్ములకున్**
**గజరాజవరదుఁడిచ్చును గజతురగస్యందనములుఁగైవల్యంబున్. 137**

**ప్రతి :** గజరాజ వరదుఁడు= శ్రీమహావిష్ణువు; గజరాజ మోక్షణంబును= గజేంద్రమోక్షణమనే ఈ కథను; నిజముగన్= శ్రద్ధతో; పఠియించునట్టి= చదివే; నియతాత్ములకున్= భక్తులకు; గజ, తురగ, స్యందనములున్= ఏనుగులు, గుర్రాలు, రథాలు మొదలైన వైభవాలనూ; కైవల్యంబున్= ముక్తిని; ఇచ్చును= ప్రసాదిస్తాడు.

**తా :** ఈ గజేంద్ర మోక్షణ గాథను శ్రద్ధతో చదివే భక్తులకు శ్రీమహావిష్ణువు ఏనుగులు, గుర్రాలు, రథాలు మొదలుగా గల భోగాలను, చివరికి ముక్తిని (ఇహపరాలను) ప్రసాదిస్తాడు.

**విశే :** విష్ణుదేవాలయాలలో అర్చనసమయంలో పంచస్తవాలను పఠించడం ఆనవాయితీ.

1) విష్ణుసహస్రనామం 2) భీష్మసూక్తం 3) గజేంద్రమోక్షణం 4) భగవద్గీత 5) మనుస్మృతి.

**క. తామసుతమ్ముఁడు రైవత, నామకుఁడై వెలసె మనువు; నలువురమీఁదన్**
**భూమికిఁబ్రతివింధ్యార్జున, నామాదులు నృపులు మనువునందనులు నృపా. 138**

**ప్రతి :** నృపా= రాజా!; తామసు తమ్ముఁడు= తామస మనువు తమ్ముడైన; రైవత నామకుఁడు+ఐ= రైవతుడనే పేరుతో; మనువు; నలువుర మీఁదన్= ఐదవవానిగా; వెలసెన్= వెలసినాడు; మనువు నందనులు= మనువు కుమారులు; ప్రతివింధ్య, అర్జున నామాదులు= ప్రతివింధ్యుడు, అర్జునుడు మొదలైనవారు; భూమికిన్= ఈ భూలోకానికి; నృపులు= రాజులు.

**తా :** ఓ రాజా! తామస మనువు తమ్ముడు రైవతుడు ఐదవ మనువు అయ్యాడు. అతని కొడుకులైన ప్రతివింధ్యుడు, అర్జునుడు మొదలైనవారు భూలోకానికి రాజులయ్యారు.

**సీ. మునులు హిరణ్యరోముఁడు నూర్ధ్వబాహుండు వేదశీర్షుండను వీరు మొదలు**
**నమరులు భూతరయాదులు శుభ్రుని పత్ని వికుంఠాఖ్య పరమసాధ్వి;**
**యా యిద్దఱకుఁబుత్త్రుఁడై తన కళలతో వైకుంఠుఁడనఁబుట్టి వారిజాక్షుఁ**
**దవనిపై వైకుంఠ మనియెడి లోకంబుఁగల్పించె నెల్ల లోకములు మ్రొక్క;**

**తే. రమ యెదుర్కోలు సేకొనె రాజముఖ్య!, తదనుభావంబు గుణములుఁదలఁపఁదరమె?**
**యీ ధరారేణుపటలంబు నెఱుఁగవచ్చుఁ, గాని రాదయ్య హరిగుణగణము సంఖ్య. 139**

**ప్రతి :** రాజముఖ్య= ఓ పరీక్షిన్మహారాజా! ఈ మనువు కాలంలో; హిరణ్యరోముడు, ఊర్ధ్వబాహుడు, వేదశీర్షుడు; వీరు మొదలు= మొదలైనవారు; మునులు= మునులయ్యారు (సప్తర్షులు); భూతరయాదులు= భూతరయుడు మొదలైనవారు; అమరులు= దేవతలయ్యారు; వికుంఠాఖ్య= వికుంఠ అనే పేరు కల; పరమసాధ్వి= ఆమె గొప్ప పతివ్రత; శుభ్రుని పత్ని= శుభ్రుని భార్య; ఈ యిద్దఱకున్= ఈ యిరువురికీ; పుత్త్రుఁడై= కుమారుడై; తన కళలతో= ఆత్మ తేజంతో; వైకుంఠుఁ డనన్+పుట్టి= వైకుంఠుడు అనే పేరుతో జన్మించి; వారిజాక్షుఁడు= ఆ మహావిష్ణువు; ఎల్ల లోకములు మ్రొక్కన్= అన్ని లోకాలవారూ గౌరవించగా; అవనిపైన్= ఈ లోకాలలో, వైకుంఠమని యెడి= వైకుంఠమనే పేరున్న; లోకంబున్+కల్పించెన్= లోకాన్ని సృష్టించాడు; రమ= లక్ష్మీదేవి; ఎదుర్కోలు+చేకొనెన్= ఆయనను స్వయంగా పెండ్లాడింది; తద్+అనుభావంబున్= ఆయన మహిమను; గుణములున్= కల్యాణగుణాలను; తలపన్+తరమె= ఊహించడానికి సాధ్యపడుతుందా!; ఈ+ధరారేణు+పటలంబున్= ఈ భూమిలోని ధూళి కణాల సంఖ్యను; ఎఱుఁగవచ్చున్+కాని= తెలుసుకోగలం కాని; హరిగుణ గణము సంఖ్య= వైకుంఠుని గుణములను గురించి సమగ్రంగా తెలుసుకోవడం; రాదయ్య= సాధ్యం కాదు.

**తా :** ఓ రాజా! ఈ మనువు కాలంలో హిరణ్యరోముడు, ఊర్ధ్వబాహుడు, వేదశీర్షుడు మొదలైనవారు సప్తర్షులయ్యారు. భూతరయుడు మొదలైనవారు దేవతలయ్యారు. శుభ్రుడు – వికుంఠ అనే పుణ్యదంపతులకు ఆత్మతేజంతో శ్రీమహావిష్ణువు వైకుంఠుడనే పేరుతో అవతరించాడు. సర్వలోకాలలోని వారూ నమస్కరించగా వైకుంఠమనే లోకాన్ని కల్పించాడు. లక్ష్మీదేవి స్వయంగా వరించి ఆయనను పెళ్ళాడింది. ఆయన మహిమను, కల్యాణగుణాలను ఊహించడానికి సాధ్యపడుతుందా? ఈ భూమి మీది ధూళికణాలను లెక్కించవచ్చునేమో కాని హరి గుణగణాలను లెక్కించటం సాధ్యం కాదు.

**వ. తదనంతరంబు. 140**

**తా :** ఆ తరువాత.

**సీ. చక్షుస్తనూజుండు చాక్షుషుండను వీరుఁడాఱవ మనువయ్యె నవనినాథ!**
**భూమీశ్వరులు పురుపురుష సుద్యుమ్నాదు లాతని నందను; లమరవిభుఁడు**
**మంత్రద్యుమాఖ్యుఁడమర్త్యు లాప్యాదికులాహవిష్మద్వీరకాదిఘనులు**
**మునులందు విభుఁడు సంభూతికి వైరాజునకుఁబుట్టి యజితుఁడు నాఁగ నొప్పె**

**ఆ. నతఁడ కాఁడె కూర్మమై మందరాద్రిని, నుదధిజలములోన నుండి మోచె;**
**నతఁడు సువ్వె దివిజు లర్థింప నమృతాబ్ధిఁ, ద్రచ్చి యిచ్చె నా సుధారసంబు. 141**

**ప్రతి :** అవనినాథ= ఓ రాజా! చక్షుస్+తనూజుండు= చక్షువు కొడుకు; చాక్షుషుఁడు+అను+వీరుఁడు= చాక్షుషుడు అనే వీరుడు; ఆఱవ మనువు+అయ్యెన్= ఆరవ మనువు అయ్యాడు; పురుః+పురుష+సుద్యుమ్న+ఆదులు= పురువు, పురుషుడు, సుద్యుమ్నుడు మొదలైనవారు; ఆతని నందనులు= అతని కొడుకులు; భూమీశ్వరులు= రాజులయ్యారు; మంత్రద్యుమ+ ఆఖ్యుఁడు= మంత్రద్యుముడు అనే పేరుగలవాడు; అమరవిభుఁడు= ఇంద్రుడయ్యాడు; ఆప్యాదికులు= ఆప్యుడు మొదలైనవారు; అమర్త్యులు= దేవతలు అయ్యారు; హవిష్మత్+వీరక+ఆదిఘనులు= ఆ హవిష్మంతుడు, వీరకుడు మొదలైనవారు; మునులు=

సప్తర్షులయ్యారు; విభుఁడు= శ్రీమహావిష్ణువు; సంభూతికి= సంభూతి అనే స్త్రీకి; వైరాజునకున్= వైరాజుకు; పుట్టి= జన్మించి; అజితుఁడు+నాఁగన్= అజితుడు అనే పేరుతో; ఒప్పెన్= ప్రకాశించాడు; కూర్మము+ఐ= తాబేలై; అతఁడు+కాఁడె= అతనే కదా; మందరాద్రిని= మందర పర్వతాన్ని; ఉదధి జలములోన నుండి= సముద్రంలో ఉండి; మోచెన్= మోసినాడు; దివిజులు+అర్థింపన్= దేవతలు వేడగా; అమృతాబ్ధిన్+త్రచ్చి= అమృత సముద్రాన్ని (క్షీరసాగరాన్ని) చిలికి, అతఁడు+సువ్వె= అతనే కదా!; ఆ సుధారసంబున్= ఆ అమృతాన్ని; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తా :** చక్షువు కుమారుడు మహావీరుడైన చాక్షుషుడు ఆరవ మనువయ్యాడు. పురువు, పురుషుడు, సుద్యుమ్నుడు మొదలైన అతని కుమారులు రాజులయ్యారు. మంత్రద్యుముడు ఇంద్రుడయ్యాడు; ఆప్యులు మొదలైనవారు దేవతలయ్యారు. హవిష్మంతుడు, వీరకరుడు మొదలైనవారు సప్తర్షులయ్యారు. శ్రీమహావిష్ణువే సంభూతి అనే స్త్రీకి, వైరాజు అనే పురుషునికీ కుమారుడుగా 'అజితుడు' అనే పేరుతో జన్మించాడు. అతనే కూర్మరూపాన్ని ధరించి సముద్రంలో పడిపోకుండా మందరపర్వతాన్ని మోశాడు. అతనే దేవతల కోరిక మేరకు క్షీరసముద్రాన్నీ చిలికి అమృతాన్ని వారికి ఇచ్చాడు.

## ❖ క్షీరసాగర మథన కథా ప్రారంభము ❖

**వ. అని పలికినం బరీక్షిన్నరేంద్రుండు మునీంద్రున కిట్లనియె. 142**

**ప్రతి :** అని; పలికినన్= పలుకగా; పరీక్షిన్నరేంద్రుండు= పరీక్షిత్తు; మునీంద్రునకున్= శుకమహర్షితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని పలుకగా పరీక్షిత్తు శుకమహర్షితో ఇలా అన్నాడు.

**మ. విను; ము న్నేటికిఁద్రచ్చె పాలకడలిన్ విష్ణుండు? కూర్మాకృతిన్**
**వనధింజొచ్చి య దెట్లు మోచె బలుకవ్వంబైన శైలంబు? దే**
**వ నికాయంబమృతంబు నెట్లు వడసెన్? వారాశి నేమేమి సం**
**జనితంబయ్యె? మునీంద్ర! చోద్యము గదా సర్వంబుఁజెప్పంగదే! 143**

**ప్రతి :** మునీంద్ర= ఓ శుకమహర్షీ; వినుము= నా ప్రశ్నల్ని వినండి; మున్ను= పూర్వం; విష్ణుండు= శ్రీమహావిష్ణువు; పాలకడలిన్= క్షీరసాగరాన్ని; ఏటికిన్= ఎందుకు; త్రచ్చెన్= చిలికాడు?; కూర్మ+ఆకృతిన్= తాబేలు రూపుపొంది; వనధిన్+చొచ్చి= సముద్రాన్ని ప్రవేశించి; బలుకవ్వంబైన శైలంబున్= పెద్ద కవ్వంగా ఉండిన మందర పర్వతాన్ని; అది+ఎట్లు+మోచెన్= అదెలా మోశాడు?; దేవనికాయంబు= దేవతల సమూహం; అమృతంబున్= అమృతాన్ని; ఎట్లు+వడసెన్= ఎలా పొందారు?; వారాశిన్= సముద్రంలో; ఏమేమి; సంజనితంబు+అయ్యెన్= పుట్టాయి; చోద్యము+కదా!=ఇదంతా ఆశ్చర్యంగా లేదూ!; సర్వంబున్= అన్నింటినీ; చెప్పంగదు+ఏ= దయతో చెప్పండి.

**తా :** ఓ మహర్షీ! నామనవి వినండి. శ్రీమహావిష్ణువు క్షీరసాగరాన్ని ఎందుకు మథించాడు? కూర్మరూపం ధరించి సముద్రంలో ప్రవేశించి కవ్వంగా వాడబడుతూ ఉండిన అంత పెద్ద మందర పర్వతాన్ని ఎలా మోశాడు? దేవతలకు అమృతం ఎలా లభించింది? సముద్రంలో ఏమేమి పుట్టాయి? అంతా ఆశ్చర్యంగా ఉంది. దయతో నాకు ఆ వివరాల్ని చెప్పండి.

**క. అప్పటినుండి బుధోత్తమ! చెప్పెదు భగవత్కథావిశేషంబులు నా**
**కెప్పుడుఁదనివి జనింపదు సెప్పఁగదే చెవులు నిండ శ్రీహరికథలన్. 144**

**ప్రతి :** బుధ+ఉత్తమ= ఉత్తమ పండితుడయిన శుకమహర్షీ!; అప్పటి నుండి= ఎన్నో రోజుల నుండి (భాగవతం ప్రారంభించి నప్పటి నుండి); భగవత్+కథా+విశేషంబులు= భగవంతునికి సంబంధించిన ఎన్నో విశేషాలు; చెప్పెదు= చెబుతూ వచ్చావు; నాకున్+ఎప్పుడున్+తనివి+జనింపదు= నాకు ఎప్పుడూ తృప్తి కల్గలేదు. (చాలనిపించలేదు); చెవులు నిండన్= చెవులు నిండేటట్లు; శ్రీహరికథలన్= శ్రీమహావిష్ణువు కథలను; చెప్పన్+కదే= దయచేసి చెప్పండి.

**తా :** ఓ పండితోత్తముడైన శుకమహర్షీ! ఇప్పటివరకు ఎన్నో భగవంతుని కథల్ని చెప్పారు. ఎంత విన్నా నాకు సంతృప్తి కావడం లేదు. ఇంకా వినాలని ఉంది. నా చెవులనిండుగా శ్రీమహావిష్ణు కథలను ఇంకా వినిపించు.

**వ. అని మఱియు నడుగం బడినవాఁడై యతని నభినందించి హరిప్రసంగంబు సెప్ప నుపక్రమించె నని సూతుండు ద్విజుల కిట్లనియె; నట్లు శుకుండు రాజుంజూచి. 145**

**ప్రతి :** అని; మఱియు= ఇంకా; అడుగన్+పడినవాఁడు+ఐ= వివరించుమని పరీక్షిత్తు అడుగగా; అతనిన్+అభినందించి= శుకుడు అతని ప్రశ్నలకు సంతోషించి; హరి ప్రసంగంబున్= విష్ణు గాథలను; చెప్పన్= చెప్పడానికి; ఉపక్రమించెన్= ప్రారంభించాడు; అని; సూతుడు; ద్విజులకున్= శౌనకాది మునులకు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు; అట్లు= ఆ విధంగా; శుకుండు; రాజున్+చూచి= పరీక్షిత్తును (చూసి ఇలా చెప్పాడు)...

**తా :** ఈ విధంగా పరీక్షిత్తు అడగ్గా శుకమహర్షి సంతోషించి విష్ణుకథలు చెప్పడానికి ఉపక్రమించాడు అని సూతుడు శౌనకాదిమునులతో ఇలా అన్నాడు – ఈ విధంగా శుకుడు పరీక్షిత్తును చూచి

**క. కసి మసఁగి యసుర విసరము లసిలతికల సురల నెగువ నసువులు వెడలం**
**బసఁజెడిరి; పడిరి; కెడసిరి యసమసమరవిలసనముల ననువెడలి నృపా! 146**

**ప్రతి :** నృపా= రాజా!; కసి మసఁగి= ద్వేషం పెరిగి; అసుర విసరములు= రాక్షస సమూహములు; అసి లతికలన్= తీగలవంటి కత్తులతోనే; సురలన్= దేవతలను; అసువులు= ప్రాణాలు; ఎగువన్+వెడలన్= పైకి పోయేలా వేయగా; (ఆ దేవతలు) అసమ+సమర+విలసనములన్= సాటిలేని యుద్ధవిజృంభణలచేత; అనువు+ఎడలి= ఉపాయం లేక; పసన్+ చెడిరి= శక్తి కోల్పోయారు; పడిరి= ఓడిపోయారు; కెడసిరి= నశించారు.

**తా :** శుకుడు ఇలా చెప్పాడు : "రాజా! రాక్షసులు కసి పెంచుకొని అతి సుకుమారమైన ఆయుధాలతోనే దేవతల ప్రాణాలు తీశారు. వీరి యుద్ధ విజృంభణకు తాళలేక వారిని ఎలా జయించాలో తెలియక దేవతలు శక్తి కోల్పోయారు. ఓడిపోయారు. చాలామంది చనిపోయారు.

**క. సురపతి వరుణాదులతో సురముఖ్యులు గొంద ఱరిగి సురశైలముపై**
**సురనుతుఁడగు నజుఁగని యా సుర దుష్కృతిఁజెప్పి రపుడు సొలయుచు నతులై. 147**

**ప్రతి :** అపుడు= ఆ సమయంలో; సురముఖ్యులు= దేవతలలో ప్రముఖులు; కొందఱు; సురపతి వరుణ+ఆదులతో= ఇంద్రుడు, వరుణుడు మొదలైన దిక్పాలకులతో; అరిగి= వెళ్ళి; సురశైలముపైన= మేరుపర్వతంపైన; సురనుతుఁడగు=

సురలచేత ప్రార్థింపబడిన; అజున్+కని= బ్రహ్మదేవుని చూచి; ఆసుర దుష్కృతిన్= రాక్షసుల దుండగాలను; నతులు+ఐ= నమస్కరిస్తూ; సొలయుచున్= బాధపడుతూ; చెప్పిరి= విన్నవించారు.

**తా :** ఆ సమయంలో కొందరు దేవముఖ్యులు ఇంద్రుడు, వరుణుడు, అగ్ని మొదలైన దిక్పాలకులతో, కలిసి మేరు పర్వతంమీద ఉన్న బ్రహ్మదేవుని దర్శించారు. దేవతలు బ్రహ్మదేవుని ఎన్నో విధాలుగా స్తుతించారు. ఎంతో బాధతో దేవతలందరూ రాక్షసుల దుర్మార్గాలను ఇలా విన్నవించారు.

**క. దుర్వాసు శాపవశమున నిర్వీర్యత జగములెల్ల నిశ్శ్రీకములై**
**పర్వతరిపుతోఁగూడ నపర్వము లయి యుండె హతసుపర్వావళులై. 148**

**ప్రతి :** దుర్వాసు శాపవశమునన్= దుర్వాస మహర్షి శాపంవల్ల; జగములెల్లన్= అన్ని లోకాలూ; నిశ్శ్రీకములు+ఐ= శ్రీని పోగొట్టుకున్నవై (పౌరుషం, వైభవం అన్నీ శ్రీలో భాగమే); పర్వతరిపుతోన్+కూడన్= పర్వతాల రెక్కలు ఖండించిన ఇంద్రుడితో సహా; హతసుపర్వావళులు+ఐ= చంపబడిన దేవతల సమూహములు గలవై; అపర్వములు+అయి+ఉండెన్= వేడుకలు పోగొట్టుకొని ఉన్నారు.

**తా :** దుర్వాసుని శాపంవల్ల ఇంద్రునితోపాటు సంపదలు లేనివయ్యాయి. పలువురు దేవతలు మరణించారు. వేడుకలు లేక శోభలేనివయ్యాయి.

**ఆ. నెలవు వెడలి వచ్చి నిస్తేజులై నట్టి వేల్పుగములఁ జూచి వేల్పుఁబెద్ద**
**పరమపురుషుఁదలఁచి ప్రణతుఁడై సంఫుల్లపద్మవదనుఁడగుచుఁబలికెఁదెలియ. 149**

**ప్రతి :** నెలవు= వారి వారి స్థానాలను; వెడలివచ్చి= వదలివచ్చి; నిస్తేజులు+ఐనట్టి= కాంతి విహీనులై ఉన్న; వేల్పుగములన్= దేవతాసమూహాన్ని; వేల్పుఁబెద్ద= దేవతలలో పెద్దవాడైన బ్రహ్మదేవుడు; చూచి; పరమపురుషున్= పరమాత్ముని; తలఁచి= ధ్యానించి; ప్రణతుఁడు+ఐ= నమస్కరించి; సంఫుల్ల= వికసించిన; పద్మవదనుఁడు+అగుచున్= పద్మం లాంటి ముఖం కల్గినవాడు అవుతూ; తెలియన్+పలికెన్= ఇలా తెలియజేశాడు.

**తా :** వారివారి స్థానాలు వదలివచ్చి కాంతి విహీనులై కనిపిస్తున్న దేవతలను చూసి, బ్రహ్మదేవుడు పరమాత్ముడైన శ్రీమహావిష్ణువును ధ్యానించి నమస్కరించుకొని, వికసించిన ముఖంతో ఇలా వారికి తెలియజేశాడు.

**క. ఏనును మీరును గాలము, మానవ తిర్యగ్లతాద్రుమ స్వేదజముల్**
**మానుగ నెవ్వని కళలము, వానికి మ్రొక్కెదము గాక వగవఁగ నేలా? 150**

**ప్రతి :** ఏనును= నేనూ; మీరును= మీరూ; కాలమున్= కాలమూ; మానవ= మానవులు; తిర్యక్= జంతువులు, పక్షులు; లతాద్రుమ= తీగలు, చెట్లు; స్వేదజముల్= చెమట నుండి పుట్టే సూక్ష్మజీవులు; మానుగన్= తగినట్టు; ఎవ్వని= ఏ పరమాత్ముని; కళలము= తేజోరూపాలమో; వానికిన్= ఆ భగవంతునికి; మ్రొక్కెదము+కాక= నమస్కారం చేద్దాం; వగవఁగన్= దుఃఖం పొందడం; ఏల= ఎందుకు?

**తా :** నేను, మీరు, ఈ కాలమూ, మానవులు, పక్షులు, జంతువులు, తీగలు, చెట్లు, చెమట నుండి పుట్టే సూక్ష్మజీవులు, ఏ పరమాత్ముని తేజోరూపాలుగా జన్మించామో; ఆ భగవంతునికి నమస్కరిద్దాం. అంతే తప్ప దీనికి ఏడవటం ఎందుకు?

**క. వధ్యుండు రక్షణీయుఁడు సాధ్యుఁడు మాన్యుఁడని లేని సర్గత్రాణా**
**వధ్యాదు లొనర్చు నతం డాధ్యంత విధానమునకు నర్హుఁడు మనకున్. 151**

**ప్రతి :** వధ్యుండు= చంపదగినవాడు; రక్షణీయుఁడు= కాపాడదగినవాడు; సాధ్యుఁడు= కష్టపెట్టదగినవాడు; మాన్యుఁడు= గౌరవించదగినవాడు; అని; లేని; సర్గత్రాణ+అవధి+ఆదులు= సృష్టి, స్థితి, లయాదులను; ఒనర్చున్+అతండు= జరిపేటటువంటి ఆ భగవంతుడే; ఆధి+అంత విధానమునకున్= మనోవ్యాధుల నిర్మూలన విధికి; మనకున్= మనకు; అర్హుఁడు= తగినవాడు (శరణు కోరదగినవాడు).

**తా :** చంపదగినవాడు, రక్షింపదగ్గవాడు, కష్టపెట్టదగ్గవాడు, గౌరవింపదగ్గవాడు – అనే తేడాలు లేని ఆ భగవంతుడు మాత్రమే సృష్టి, రక్షణ, లయ – అనే మూడు వ్యాపారాలను జరుపుతాడు. కాబట్టి మన చింతలు తీర్చుటకు ఆ పరమాత్ముడే తగినవాడు. (అతనినే శరణు వేడుకుందాం)

**క. వరదునిఁబరమ జగద్గురు, గరుణాపరతంత్రు మనము గనుఁగొన దుఃఖ**
**జ్వరములు సెడునని సురలకు సరసిజజని చెప్పి యజితు సదనంబునకున్. 152**

**ప్రతి :** వరదునిన్= వరాలను ఇచ్చేవాడు; పరమ జగద్గురున్= లోకోత్తరుడైన జగద్గురుని; కరుణాపరతంత్రున్= దయామయుడైన వానిని; మనము; కనుఁగొనన్= దర్శిస్తే; దుఃఖ+జ్వరములు= దుఃఖాలు అనే రోగాలు; చెడునని= నశిస్తాయని, సరసిజజని= బ్రహ్మ; చెప్పి; అజితు సదనంబునకున్= అజితునిగా అవతరించిన శ్రీమహావిష్ణువున్న చోటికి...

**తా :** వరప్రదాత, లోకగురువు, దయామయుడు అయిన పరమాత్ముని మనం దర్శిస్తే మన దుఃఖ జ్వరాలు అన్నీ శమిస్తాయి అని వారికి విశ్వాసం కల్పించి బ్రహ్మదేవుడు వారందరితో కలిసి 'అజిత' భగవానుని నివాసానికి వెళ్ళాడు.

**వ. తానును దేవతాసమూహంబును నతిరయంబునం జని వినయంబునం గానంబడని య విభు నుద్దేశించి దైవికంబులగు వచనంబుల నియతేంద్రియుండై యిట్లని స్తుతియించె. 153**

**ప్రతి :** (బ్రహ్మదేవుడు); తానును; దేవతాసమూహంబును= దేవతలతోకలిసి; అతిరయంబునన్= త్వరగా; చని= వెళ్ళి; కానంబడని= అదృశ్యరూపుడుగా ఉన్న; ఆ+విభున్= ఆ ప్రభువును; ఉద్దేశించి= గురించి; దైవికంబులు+అగు= దివ్యమైన (వేద); వచనంబులన్= మంత్రాలతో; నియత+ఇంద్రియుండు+ఐ= ఏకాగ్ర చిత్తంతో; ఇట్లు+అని= ఈ విధంగా; వినయంబునన్= వినయంతో; స్తుతియించెన్= స్తుతించాడు.

**తా :** బ్రహ్మదేవుడు దేవతలతో కలిసి త్వరగా అజిత భగవానుని నివాసం చేరి, అదృశ్యరూపుడుగా ఉన్న ఆ ప్రభువును దివ్యమైన వేదమంత్రాలతో ఇలా స్తుతించాడు.

**సీ. ఎవ్వని మాయకు నింతయు మోహించుఁదటిమి యెవ్వని మాయ దాఁట రాదు;**
**తన మాయ నెవ్వఁడింతయు గెల్చినట్టివాఁడెవ్వనిఁబొడగాన రెట్టిమునులు,**
**సర్వభూతములకు సమవృత్తి నెవ్వఁడు చరియించుఁదనచేత జనితమయిన,**
**ధరణి పాదములు చిత్తము సోముఁ డగ్ని ముఖంబు గన్నులు సోమకమలహితులు,**

**తే. చెవులు దిక్కులు, రేతంబు సిద్ధజలము, మూఁడు మూర్తుల పుట్టిల్లు, మొదలి నెలవు**
**గర్భ మఖిలంబు, మూర్ధంబు గగన మగుచు, మలయు నెవ్వఁడు వాని నమస్కరింతు. 154**

**ప్రతి :** ఇంతయున్= ఈ సమస్తమూ; ఎవ్వని మాయకున్= ఎవని మాయవల్ల; మోహించున్= మోహంలో మునిగిపోతుందో; తఱిమి= మీదు మిక్కిలి; ఎవ్వని మాయ= ఎవని మాయ; దాఁట రాదు= దాటడానికి సాధ్యం కాదో; తనమాయన్= తన మాయచేత; ఎవ్వఁడు+ఇంతయున్= ఎవరు ఇంతటినీ; గెల్చినట్టివాఁడు= గెలిచినవాడో; ఎవ్వనిన్= ఎవనిని; ఎట్టిమునులు= ఎంతగొప్ప ఋషులైనా; పొడగానరు= చూడజాలరో; సర్వభూతములకున్= సకల భూతాల విషయంలోనూ; ఎవ్వఁడు= ఎవడైతే; సమవృత్తిన్= సమానంగా; చరియించున్= చరిస్తాడో; తనచేత జనితమయిన= అతని నుండి పుట్టిన; ధరణి పాదములు= భూమే అతని పాదాలు; సోముఁడు చిత్తము= చంద్రుడు మనస్సు; అగ్ని ముఖంబు= అగ్ని ముఖం; కన్నులు సోమకమలహితులు= చంద్రుడు, సూర్యుడు, కన్నులు; చెవులు దిక్కులు= దిక్కులు చెవులు; రేతంబు సిద్ధజలము= వీర్యం జలం; అతడు; మూఁడు మూర్తుల పుట్టిల్లు= త్రిమూర్తులకు మూలం; మొదలి నెలవు గర్భము= అన్నింటినీ నిలుపుకొన్నది అతని కడుపు; మూర్ధంబు గగనము= తలే ఆకాశం; అగుచున్= కాగా; ఎవ్వఁడు మలయున్= ఎవడు ప్రవర్తిస్తాడో (ఉంటాడో); వానిన్= అతనికి; నమస్కరింతున్= నమస్కరిస్తాను.

**తా :** ఈ సమస్త జగత్తూ ఎవని మాయవల్ల మోహంలో మునిగిపోతుందో – ఎవని మాయదాట రానిదో; ఎవరు తన మాయచేత జగత్తు అంతా గెల్చుకున్నాడో, ఎవనిని మహాఋషులు కూడా చూడలేరో, సకలభూతాల విషయంలోనూ ఎవరు సమంగా ప్రవర్తిస్తారో, అలాంటి పరమాత్మ నుండే ఈ జగత్తు ఏర్పడింది. భూమి అతని పాదాలు. చంద్రుడు మనస్సు. అగ్ని ముఖం. కన్నులు సూర్యచంద్రులు. చెవులు దిక్కులు. వీర్యం జలం. త్రిమూర్తులకు మూలమితడే. అతని గర్భంలో జగత్తంతా దాగి ఉంది. ఆకాశమే అతని తల – ఇలా ప్రకాశించే ఆ పరమాత్మునికి నమస్కరిస్తాను.

**వ. మఱియు నెవ్వని బలంబున మహేంద్రుండును, బ్రసాదంబున దేవతలును, గోపంబున రుద్రుండును, బౌరుషంబున విరించియు, నింద్రియంబుల వలన వేదంబులును మునులును, మేఢ్రంబునఁ బ్రజాపతియును, వక్షంబున లక్ష్మియు, ఛాయ వలనఁ బితృదేవతలును, స్తనంబుల వలన ధర్మంబును, బృష్ఠంబుల వలన నధర్మంబును, శిరంబు వలన నాకంబును, విహారంబు వలన నప్సరోజనంబులును, గుహ్యంబువలన బ్రహ్మంబును, ముఖంబు వలన విప్రులును, భుజంబుల వలన రాజులును (బలంబును,) నూరువుల వలన వైశ్యులును (నైపుణ్యంబును,) బదంబుల వలన శూద్రులును, (నవేదంబును) నధరంబువలన లోభంబును, నుపరిరదచ్ఛదంబు వలనఁబ్రీతియు, నాసాపుటంబువలన ద్యుతియు, స్పర్శంబునఁ గామంబును, భ్రూయుగళంబున యమంబును, బక్ష్మంబున గాలంబును సంభవించె; నెవ్వని యోగమాయా విహితంబులు ద్రవ్యవయః కర్మగుణ విశేషంబులు; చతుర్విధభూత సర్గం బెవ్వని యాత్మతంత్రం; బెవ్వని వలన సిద్ధించి లోకంబులును లోకపాలురును బ్రదుకు చుందురు, పెరుఁగుచుందురు; దివిజులకు నాయువు బలంబునై, జగంబులకు నీశుండై, ప్రజలకుఁప్రజనుండై, బ్రజావన క్రియాకాండ నిమిత్త సంభవుండగు జాతవేదుండై, యంతస్సముద్రంబున ధాతు సంఘాతంబులం బ్రపంచించుచు బ్రహ్మమయుండై, ముక్తికి ద్వారంబై, యమృత, మృత్యు స్వరూపుండై, చరాచర ప్రాణులకు ప్రాణంబై యోజస్సహోబల**

**వాయురూపంబులైన ప్రాణేంద్రియాత్మ శరీర నికేతనుండై పరమ మహాభూతి యగు న ప్పరమేశ్వరుండు మాకుంబ్రసన్నుండగుంగాక! యని మఱియును. 155**

**ప్రతి :** మఱియున్= ఇంకా; ఎవ్వని బలంబున= ఎవని బలంచేత; మహేంద్రుండును= ఇంద్రుడు; ప్రసాదంబునన్= అనుగ్రహంచేత; దేవతలు= సురలు; కోపంబునన్= కోపంచేత; రుద్రుండును= రుద్రుడు; పౌరుషంబునన్= పౌరుషం చేత; విరించియున్= బ్రహ్మదేవుడు; ఇంద్రియంబుల వలనన్= అవయవాలనుండి; వేదంబులును= వేదాలు; మునులును= మునులు; మేఢ్రంబునన్= పురుషావయవం నుండి; ప్రజాపతియును= ప్రజాపతి; వక్షంబునన్= వక్షంనుండి; లక్ష్మియు= లక్ష్మీదేవి; ఛాయవలనన్= నీడ నుండి; పితృదేవతలును= పితృదేవతలు; స్తనంబులవలనన్= రొమ్ములనుండి; ధర్మంబును= ధర్మం; పృష్ఠంబులవలనన్= వీపునుండి; అధర్మంబును= అధర్మం; శిరంబువలనన్= తలనుండి, నాకంబును= స్వర్గం; విహాసంబువలనన్= నవ్వునుండి; అప్సరస్+జనంబులును= అప్సరసలు; గుహ్యంబు వలనన్= గుహ్యావయం నుండి; బ్రహ్మంబును= బ్రహ్మము (దీన్నే పైన పౌరుషమనీ అన్నాడు); ముఖంబువలనన్= ముఖంనుండి; విప్రులును= బ్రాహ్మణులు; భుజంబులవలనన్= భుజాలనుండి; రాజులును= క్షత్రియులు (బలం); ఊరువులవలనన్= తొడలనుండి; వైశ్యులును (నైపుణ్యంబును= నేర్పరితనం= వాణిజ్యానికి కావాల్సిన యుక్తి); పదంబులవలనన్= పాదాలనుండి; శూద్రులును= శూద్రులు (అవేదంబును= వేదరాహిత్యం); అధరంబువలనన్= క్రింది పెదవినుండి; లోభంబును= లోభగుణం; ఉపరిరదచ్ఛదంబువలనన్= పై పెదవినుండి; ప్రీతియున్= ప్రేమ; నాసాపుటంబు వలనన్= ముక్కుపుటాల నుండి; ద్యుతియున్= కాంతి; స్పర్శంబునన్= స్పర్శవల్ల; కామంబును= కామం; భ్రూయుగళంబునన్= కనుబొమల నుండి; యమంబును= ప్రాణాలు తీసే కాలధర్మం (యముని లక్షణం); పక్షంబునన్= పక్కనుండి; కాలంబునున్= కాలం; సంభవించెన్= పుట్టాయి; ద్రవ్య వయః కర్మ, గుణ విశేషంబులు= ద్రవ్యం, కర్మలు, గుణ విశేషాలు; ఎవ్వని యోగమాయా విహితంబులు= ఎవని యోగమాయచేత ఏర్పడుతున్నాయో; ఎవ్వని ఆత్మతంత్రంబు= ఎవని ఆత్మతంత్రం (స్వయం= నిర్మాణ చాతుర్యం); చతుర్విధభూత సర్గంబు= జరాయుజ, ఉద్భిజ, స్వేదజ, అండజాలనే నాలుగు విధాల జీవరాశుల కదిమూలమో; ఎవ్వని వలనన్ సిద్ధించి= ఎవనివలన పుట్టి; లోకంబులును, లోకపాలురును బ్రదుకుచుందురు= లోకాలు, లోకపాలకులు జీవిస్తున్నారో; పెరుఁగుచుందురు= వృద్ధిపొందుతున్నారో; దివిజులకున్= దేవతలకు; ఆయువు= ఆయుస్సు; బలంబును+ఐ= బలమూ తానే అయి; జగంబులకున్+ఈశుండు+ఐ= లోకాలకు ప్రభువై; ప్రజలకున్+ప్రజనుండు+ఐ= ప్రజలను పుట్టించే వాడై; ప్రజావన= ప్రజలను రక్షించే; క్రియాకాండ+నిమిత్త= కర్మకాండల కోసం; సంభవుండగున్= పుట్టిన; జాతవేదుండు+ఐ= అగ్ని దేవుడై; అంతస్సముద్రంబునన్= సముద్రంలో; ధాతుసంఘాతంబులన్= రత్నరాసులను; ఇతర ధాతువులను; ప్రపంచించుచున్= పుట్టిస్తూ; బ్రహ్మమయుండు+ఐ= సకల సృష్టిని నింపుకొని, ముక్తికిన్+ద్వారంబై= ముక్తిద్వారమై; అమృత+మృత్యు+స్వరూపుండు+ఐ= చావు, బ్రతుకులు – రెండూ తన రూపాలై; చరాచర ప్రాణులకున్= కదిలేవి, కదలనివి – అయిన సకల జీవరాసులకు; ప్రాణంబు+ఐ= ప్రాణదాతలై; ఓజస్+సహః+బల+వాయు+ రూపంబులు+ఐన= తేజస్సు, మనోబలం, బలం, వాయువు రూపాలతో; ప్రాణ+ఇంద్రియ+ఆత్మ+ శరీర+నికేతనుండు+ ఐ= ప్రాణుల అవయవాలలో, ఆత్మలో, శరీరంలో నిండి ఉన్నవాడై; పరమ మహాభూతి+అగు= మిక్కిలి ఉత్కృష్టమైన 'విభూతి' (ప్రకాశించే ధర్మం) అయినటువంటి; ఆ+పరమేశ్వరుండు= ఆ పరమశక్తిమంతుడు; మాకున్+ప్రసన్నుండు+ అగుంగాక= మాపై దయచూపును గాక; అని మఱియును= అని ఇంకా (ప్రస్తుతించాడు)...

**తా :** ఏ పరమాత్ముని బలంచేత ఇంద్రుడు, అనుగ్రహంచేత దేవతలు, కోపం వల్ల రుద్రుడు, పౌరుషంచేత బ్రహ్మ, అవయవాల నుండి వేదాలు, మునులు, పురుషావయవం నుండి ప్రజాపతి, వక్షస్థలం నుండి లక్ష్మీదేవి; నీడ నుండి

పితృదేవతలు; రొమ్మునుండి ధర్మం; వీపు నుండి అధర్మం; తలనుండి స్వర్గం, నవ్వునుండి అప్సరసలు, గుహ్యావయవం నుండి బ్రహ్మ; ముఖంనుండి బ్రాహ్మణులు, భుజాలనుండి రాజులు, తొడలనుండి వైశ్యులు; పాదాలనుండి శూద్రులు; క్రింది పెదవినుండి లోభం, పైపెదవినుండి ప్రేమ; ముకుపుటాల నుండి కాంతి, స్పర్శవల్ల కామం, కనుబొమలనుండి కాలధర్మం, పక్కనుండి కాలం పుట్టాయి. అతని యోగమాయనుండే ద్రవ్యం, కర్మలు, గుణ విశేషాలు ప్రభవించాయి. నాలుగు విధాలైన జీవరాసుల పుట్టుక అతని స్వయం నిర్మాణ చాతుర్యమే; లోకాలు, లోకపాలకులు అతనినుండే పుట్టి వృద్ధి పొందుతుంటారు. దేవతలకు ఆయుస్సు, బలమూ ఆయనే. ప్రజలను పుట్టించి, వారి రక్షణం కోసం పుట్టిన యజ్ఞయాగాదుల కోసం జన్మించిన అగ్ని దేవుడూ ఆయనే. సముద్రంలోని ధాతుసమూహమంతా ఆయన సృష్టే. సకల సృష్టీ ఆయనలోనే నిండి ఉంది. ముక్తికి ద్వారమూ అతనే. చావు బ్రతుకు రెండూ అతని రూపాలే. చరాచరప్రాణి సంఘానికి చైతన్యదాత ఆయనే. తేజస్సు, మనోబలం, బలం, వాయురూపాలతో, ప్రాణుల అవయవాలలో, ఆత్మలో, శరీరంలో నిండి ఉండి – అంతటా వ్యాపించిన మహా 'విభూతి' స్వరూపం ఆయనదే. ఆ పరమశక్తియుతుడు మాపై దయజూపు గాక!

**క. మొదల జల మిడిన భూజము, దుది నడుమను జల్లఁదనము దొరఁకొను మాడ్కిన్**
**మొదలను హరికిని మ్రొక్కిన, ముద మొందుదు మెల్ల వేల్పుమూఁకలు నేమున్. 156**

**ప్రతి :** మొదలన్= చెట్టు మొదట్లో; జలము+ఇడినన్= నీరుపోస్తే; భూజము= చెట్టు; తుదిన్+నడుమను= కొమ్మలలోనూ, నడుమను; చల్లఁదనమున్= చల్లదనాన్ని; దొరఁకొను మాడ్కిన్= పొందునట్లు; హరికిని= శ్రీహరికి; మొదలను= తొలుత; మ్రొక్కినన్= నమస్కరిస్తే; ఎల్లవేల్పు మూఁకలున్= సకల దేవతా సమూహములును; ఏమున్= మేమూ (బ్రహ్మ – నేను అన్న అర్థంలో); ముదము+ఒందుదుము= సంతోషపడతాము.

**తా :** చెట్టుకు పాదులో నీళ్ళుపోస్తే చిటారుకొమ్మలలోనూ, కాండంలోనూ (చివరికి వేళ్ళలో కూడా) చల్లదనం పొంది ఆనందిస్తుంది. అలాగే విష్ణుదేవునికి మొదట నమస్కరిస్తే సకలదేవతలు, నేను (బ్రహ్మ) సంతోషిస్తాము.

**విశే :** మంత్రాలను 'హరిఃఓమ్' అని ప్రారంభించడంలోని అర్థం ఇదే. పూజానంతరం 'సర్వం శ్రీకృష్ణార్పణమస్తు' అనటంలోని రహస్యమూ ఇదే. శ్రీహరి సకలదేవతారూపుడు.

'సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' అని అనటంలోని వివేకం ఇదే. నదులన్నీ సముద్రంలో కలిసిన విధంగా దేవతలందరికీ చేసిన పూజలు ఆ మహానారాయణ తత్త్వానికే చివరికి చెందుతాయి.

**క. ఆపన్నులగు దిదృక్షుల, కో పుణ్య! భవన్ముఖాబ్జ మొయ్యన తటితోఁ**
**బ్రాపింపఁజేయు సంపద నో పరమదయానివాస! యుజ్జ్వలతేజా! 157**

**ప్రతి :** ఓ పరమదయానివాస= ఉత్తమమైన దయకు నిలయమైనవాడా!; ఉజ్జ్వల తేజా= గొప్ప తేజస్సు కలవాడా!; ఓ పుణ్య= ఓ పుణ్యాత్ముడా!; ఆపన్నులగు= ఆపదలో ఉన్న; దిదృక్షులకు= నిన్ను చూడాలన్న కోరికతో ఉన్న (మాకు); భవత్+ముఖాబ్జము= నీ ముఖ కమలం; ఒయ్యనన్= సకాలంలో; తటితోన్= సమయ మెరిగి; సంపద= ఐశ్వర్యాన్ని; ప్రాపింపఁజేయున్= సమకూరుస్తుంది (నీ ముఖ కమలాన్ని చూపించు)

**తా :** ఓ దయానిలయా! తేజోరూపా! పుణ్యాత్మా! ఆపదలో ఉన్నవారూ, నిన్ను చూడాలని తపించేవారూ నీ ముఖ కమలాన్ని చూడగానే తక్షణమే సమయమెరిగి సంపదలను పొందుతారు. నీ ముఖ దర్శనం కల్గించు స్వామీ!

**వ. అని యిట్లు దేవగణసమేతుండై యనేక విధంబులం గీర్తించుచు నున్న పరమేష్ఠియందుఁగరుణించి దయాగరిష్ఠుండగు విశ్వగర్భుం డావిర్భవించె. 158**

**ప్రతి :** ఇట్లు; దేవగణ సమేతుండు+ఐ= దేవగణాలతో కూడి; అనేక విధంబులన్= అనేక విధాలుగా; కీర్తించుచున్+ఉన్న= కీర్తిస్తున్న; పరమేష్ఠి+అందున్= బ్రహ్మదేవుని పట్ల; కరుణించి; దయాగరిష్ఠుండు అగు= దయాగుణం గలవారిలో శ్రేష్ఠుడైన; విశ్వగర్భుండు= పరమాత్ముడు; ఆవిర్భవించెన్= ఉదయించాడు.

**తా :** అని ఈ విధంగా దేవగణాలతో కూడి అనేక విధాలుగా కీర్తిస్తున్న ఆ బ్రహ్మదేవుని కరుణించి మిక్కిలి దయాగుణం కల్గిన వారిలో శ్రేష్ఠుడైన విశ్వగర్భుడు (పరమాత్ముడు) అక్కడ ఉదయించాడు (కనిపించాడు)

**మ. ఒక వేయర్కులు గూడిగట్టి కరువై యుద్యత్ప్రభాభూతితో**
**నొకరూపై చనుదెంచు మాడ్కి హరి దా నొప్పారె; నా వేలుపుల్**
**వికలాలోకనులై, విషణ్ణమతులై; విభ్రాంతులై మ్రోలఁగా**
**నక శంకించిరి కొంత ప్రొద్దు; విభుఁగానంబోలునే వారికిన్? 159**

**ప్రతి :** ఒక వేయి+అర్కులు= ఒక వేయిమంది సూర్యులు; కూడిగట్టి= ఒకచోట కలిసి; కరువై= పోత పోసిన విధంగా; ఉద్యత్+ప్రభాభూతితోన్= పైకెగసే కాంతిప్రభా వైభవంతో (ఆ వేయి సూర్యుల కాంతి); ఒకరూపు+ఐ= ఒక్క రూపంగా; చనుదెంచు మాడ్కిన్= వచ్చే విధంగా; హరి+తాన్+ఒప్పారెన్= హరి తాను ప్రకాశించాడు; ఆ వేలుపుల్= ఆ దేవతలు; వికల+ఆలోకనులు+ఐ= చెదరిన చూపు గలవారై; విషణ్ణమతులు+ఐ= విషాదము పొందిన మనస్సు కలవారై; విభ్రాంతులు+ఐ= భ్రాంతికి వశులై; మ్రోలన్+కానక= ఎదురుగా ఉన్నది చూడలేక; కొంత ప్రొద్దు= ఒకింతసేపు; శంకించిరి= సందేహించారు; విభున్= జగత్ ప్రభువును; కానన్= చూడడానికి; వారికిన్+పోలునే= వారికి సాధ్యమా!

**తా :** వేయి సూర్యులకాంతి ఒకచోట చేర్చి పోతపోసినట్టు, ఆ కాంతులన్నీ ఒకేసారి వచ్చినట్టు హరి అక్కడ ప్రత్యక్షం కాగా దేవతల చూపులు చెదిరిపోయాయి. విషాదం పొందారు. తేరిపార చూడటానికి సాహసించలేదు. కొంతసేపు అలాగే ఉండిపోయారు. ఆ తేజోరూపాన్ని చూడటానికి వాళ్ళకు సాధ్యమా!

**వ. అప్పుడు. 160**

**తా :** ఆ సమయంలో.

**సీ. హారకిరీటకేయూరకుండలపాదకటకకాంచీలతాకంకణాది**
**కౌస్తుభోపేతంబుఁగౌమోదకీశంఖచక్రశరాసనసంయుతంబు**
**మరకతశ్యామంబు సరసిజనేత్రంబుఁగర్ణాభరణకాంతిగండయుగము**
**గలితకాంచనవర్ణకౌశేయవస్త్రంబు శ్రీ వనమాలికాసేవితంబు**

**ఆ. నై మనోహరంబునై దివ్యసౌభాగ్య, మైన యతని రూపు హర్ష మెసఁగఁ**
**జూచి బ్రహ్మ హరుఁడు సురలును దానును, బొంగి నమ్రుఁడగుచుఁబొగడఁదొడఁగె. 161**

**ప్రతి :** హార కిరీట కేయూర కుండల పాదకటక కాంచీలతా కంకణాది కౌస్తుభోపేతంబున్= హారాలు, కిరీటం, బాజుబందీలు, కుండలాలు, కాలి అందెలు, మొలనూలు, కంకణాలు, కౌస్తుభమణి మొదలైన వాటితో కూడినదీ; కౌమోదకీ శంఖ చక్ర శరాసన సంయుతంబు= కౌమోదకి అనే గద, పాంచజన్యమనే శంఖం, సుదర్శనమనే చక్రంతోకూడినదీ; మరకతశ్యామంబు= శార్ఙ్గమనే ధనుస్సు, మరకతంవలె నల్లనైనదీ; సరసిజ నేత్రంబున్= కమలాల వంటి కన్నులుగలదీ; కర్ణాభరణ కాంతి గండయుగమున్= కుండలాల వల్ల ప్రకాశిస్తున్న చెక్కిళ్ళు కలదీ; కలితకాంచనవర్ణ కౌశేయవస్త్రంబున్= బంగారురంగు పట్టు వస్త్రం కలదీ; శ్రీ వనమాలికా సేవితంబును+ఐ= వనమాలతో సేవింపబడినదీ; మనోహరంబును= మిక్కిలి అందమైనదీ; ఐ; దివ్యసౌభాగ్యమైన= దివ్య సౌభాగ్యం కల; అతని రూపున్= అతని రూపాన్ని; బ్రహ్మ, హరుఁడు, సురలును, తానునున్= శివుడు, దేవతలతో పాటు బ్రహ్మదేవుడు తానుకూడా; చూచి= దర్శించి; పొంగి= సంతోషించి; హర్షమెసఁగన్= సంతోషం అతిశయించగా; నమ్రుఁడు+అగుచున్= వినతుడగుచు; పొగఁడన్= స్తోత్రంచేయడానికి; తొడఁగెన్= ప్రారంభించాడు.

**తా :** ఆ సమయంలో శ్రీమన్నారాయణుడు దివ్యమైన హారాలతో, కిరీటంతో భుజకీర్తులతో, కాలి అందెలతో, మొలనూలుతో, కంకణాలతో, కౌస్తుభమణినితో, శంఖ చక్ర గదాది ఆయుధాలతో దర్శనమిచ్చాడు. మరకతం లాంటి అతని దేహం, పద్మాలవంటి కన్నులు, కుండలాల కాంతితో మెరుస్తున్న చెక్కిళ్లతో, బంగారురంగు పట్టువస్త్రంతో, కంఠంలో వనమాలతో మిక్కిలి సుందరంగా ప్రకాశిస్తున్న దివ్యసౌభాగ్య రూపుడైన ఆ స్వామివారిని రుద్రాది దేవతలతోపాటు బ్రహ్మ తాను కూడా దర్శించి సంతోషంతో పొంగిపోయాడు. వినయంతో ఈ విధంగా స్వామివారిని స్తుతించటానికి పూనుకొన్నాడు.

**విశే :** 'వనమాల' అంటే వైజయంతి మాల అని కొందరు అంటారు. కాబట్టి తులసీమాలనే వనమాల అనటం సంప్రదాయంగా ఉంది.

**క. జననస్థితిలయదూరుని మునినుతు నిర్వాణసుఖసముద్రుని సుగుణుం**
**దనుతనునిఁబృథుల పృథులుని ననఘాత్ము మహానుభావు నభినందింతున్. 162**

**ప్రతి :** జనన+స్థితి+లయదూరునిన్= సృష్టి, స్థితి, లయాలకు అతీతమైన వానిని; ముని= ఋషులచేత; నుతున్= కీర్తింపబడుతున్నవానిని; నిర్వాణ సుఖసముద్రునిన్= మోక్ష సౌఖ్యానికి సముద్రంలాంటి వానిని; సుగుణున్= సద్గుణరాశిని; తనుతనునిన్= సూక్ష్మానికి సూక్షమైన వానిని; పృథులపృథులునిన్= గొప్పవాటి కంటె గొప్పవానిని; అనఘాత్మున్= పుణ్యాత్ముని; మహానుభావున్= గొప్ప అనుభావం కల్గినవానిని; అభినందింతున్= ప్రస్తుతి చేస్తాను.

**తా :** సృష్టి స్థితి లయములు లేనివానిని, ఋషులచేత నిరంతరం పొగడబడేవానిని; మోక్షసౌఖ్యసముద్రుని, చిన్నవాటికన్నా చిన్నవాడును; గొప్పవాటికన్నా గొప్పవాడుగా ప్రకాశించే ఆ పుణ్యాత్ముని, మహానుభావుని ప్రస్తుతిస్తాను.

**విశే :** మూలంలో ఇలా ఉంది.

**అజాతజన్మస్థితిసంయమాయాగుణా నిర్వాణసుఖార్ణవాయ**
**అణోరణిమ్నేఽ పరిగణ్యధామ్నే మహానుభావాయ నమో నమస్తే (8-6-8)**

(సృష్టి స్థితి లయము లేనివాడు. గుణాలు లేనివాడు. మోక్షసముద్రుడు, అణువుకన్నా అణువైనవాడు, కొలబద్దలేని స్వరూపం కల్గినవాడు, గొప్ప ప్రభావం కలవాడు – అయిన నీకు నమస్కారాలు)

– తనుతనునిన్ (తను=సూక్ష్మ) పృథుల పృథులునిన్ (పృథు=పెద్ద) ఇలా స్థూల సూక్ష్మ – రూపాలు రెండూ భగవంతునివే అని పోతనగారు స్పష్టం చేశారు.

**క. పురుషోత్తమ! నీ రూపము పరమశ్రేయంబు భువనపంక్తుల కెల్లన్**
**స్థిరవైదికయోగంబున వరుసను మీ యంద కానవచ్చెను మాకున్. 163**

**ప్రతి :** పురుషోత్తమ= ఓ పురుషోత్తమా!, భువనపంక్తులకెల్లన్= అన్ని లోకాలలోనూ; నీ రూపము; పరమశ్రేయంబు= గొప్పశ్రేయస్సును కలిగించేది; (ఆ రూపం); స్థిరవైదిక యోగంబునన్= శాశ్వతమైన వేదసంబంధంచేత; వరుసను= క్రమంగా; మాకున్= మాకు; మీ+అందు+అ= మీలోనే; కానవచ్చెను= కన్పిస్తున్నది.

**తా :** ఓ పురుషోత్తముడా! అన్ని లోకాలలోనూ నీ రూపం పరమశ్రేష్ఠమైంది. ఆ రూపం శాశ్వతమైన వేదసంబంధం కూడి మాకు మీయందే కనిపిస్తున్నది.

**క. మొదలును నీలోఁదోఁచెను దుదియును నటఁదోఁచె; నడుము దోఁచెను; నీవే**
**మొదలు నడుము దుది సృష్టికిఁగదియఁగ ఘటమునకు మన్ను గతియగు మాడ్కిన్. 164**

**ప్రతి :** కదియఁగన్= కలవటానికి; ఘటమునకున్= కుండకు; మన్ను= మట్టి; గతియగు మాడ్కిన్= ఆధారమైన తీరుగా; మొదలు నడుము తుది సృష్టికిన్= అలాగే ఈ సృష్టికి; నీవే= నువ్వే; మొదలును= మొదలు; నీలోన్= నీలోనే; తోఁచెను= అగుపిస్తోంది; తుదియునున్+అటన్=తోచెన్= తుదికూడా అక్కడే కనిపిస్తోంది; నడుము+తోఁచెను= మధ్యభాగం కూడా కనిపిస్తోంది.

**తా :** కుండకు మట్టి ఎలా ఆధారమవుతున్నదో అలాగే నువ్వు ఈ సృష్టికి ఆది మధ్యాంతాలు అవుతున్నావు. నీ విశ్వరూపంలో ఇవన్నీ కనిపిస్తున్నాయి అని అర్థం.

**క. నీ మాయచేత విశ్వము, వేమాఱు సృజింతు వనుచు విష్ణుఁడ వనుచున్**
**ధీమంతులు గుణపదవిని, నేమంబున సగుణుఁడైన నినుఁగాంతు రొగిన్. 165**

**ప్రతి :** నీ మాయచేతన్= నీ మాయతో; విశ్వమున్= ఈ ప్రపంచాన్ని; వేమాఱు= పలుమార్లు; సృజింతువనుచున్= సృష్టిస్తావని; విష్ణుఁడవు+అనుచున్= అన్నిచోట్లా నిండి ఉంటానని; ధీమంతులు= వైదిక జ్ఞానమున్న పండితులు; గుణ పదవిని= గుణ మార్గంలో; నేమంబునన్= నియమంతో; సగుణుఁడైన నినున్= సగుణుడివైన నిన్ను; ఒగిన్= క్రమంగా; కాంతురు= చూస్తారు.

**తా :** నీవు నీ యోగమాయతో ఈ ప్రపంచాన్ని పలుమార్లు సృష్టించి అంతటా నీవే నిండి ఉంటావని వైదిక రహస్యం తెలిసిన పరమయోగులు గుణాతీతుడైన నీ అవతార మహిమను సగుణరూపంతో 'విష్ణువు' గా కనుగొంటారు.

**ఆ. అన్న మవనియందు నమృతంబు గోవులయందు వహ్ని సమిధలందు నమర**
**యోగవశతఁబొందు నోజను బుద్ధిచే నగుణు నిన్నుఁగాంతు రాత్మవిదులు. 166**

**ప్రతి :** అవనియందున్= ఈ భూమిలో; అన్నము= ఆహారాన్ని; గోవులయందున్= ఆవులలో; అమృతంబున్= పాలను; సమిధలందున్= కట్టెలందు; వహ్నిన్= అగ్నిని; (ఎలా గుర్తిస్తారో అలాగ) అమరన్+యోగవశతన్= తగిన యోగ దర్శనంతో; పొందు+ఓజను= పొందేవిధంగా; ఆత్మవిదులు= ఆత్మజ్ఞానం కలవారు; బుద్ధిచేన్= బుద్ధితో; అగుణున్= గుణాతీతుడైన; నిన్నున్= విశ్వరూపుడవైన నిన్ను; కాంతురు= చూస్తారు.

**తా :** ఈ భూమిలో అన్నాన్ని; గోవులలో పాలను; కట్టెలలో అగ్నిని; ఎలా పొందుతారో అలాగే యోగమార్గంలో ఆత్మజ్ఞానవిదులు బుద్ధిచేత నిన్ను ఈ విశ్వంలో చూస్తారు.

**విశే :** అన్నం 'భూమిలో' కనిపించదు. 'పాలు' ఆవులో కనిపించవు, అలాగే 'అగ్ని' కట్టెలలో కనిపించదు. 'బుద్ధి' ద్వారా (వివేకం) వీటిలో 'గుణ' రూపంగా ఇవి పరిణామంలో బయట పడుతున్నాయని జ్ఞానులు గుర్తిస్తారు. భగవత్ తత్త్వమూ అంతే. విశ్వంద్వారా 'ఆత్మ' స్వరూపాన్ని ఇలాగే గుర్తిస్తాం.

కట్టెను మథిస్తేనే నిప్పు పుడుతుంది; భూమిలో వ్యవసాయం చేస్తేనే ఆహారం పుడుతుంది. అలాగే ఆవుకు గడ్డివేసి పితికితేనే పాలు వస్తాయి – ఈ ప్రయత్నాలవంటిదే భగవంతుని గుర్తించడానికి గుణప్రకృతుల రూపంలో పనిచేస్తున్న 'కర్త' మరొకటి ఉందని గుర్తించడం కూడా. దానికి 'యోగమే' సాధనం.

**మత్త. పట్టులేక బహుప్రకార విపన్న చిత్తులమైతి; మే**
**మెట్టకేలకు నిన్నుఁగంటి మభీప్సితార్థము వచ్చుఁ; బె**
**న్వెట్టయైన దవానలంబున వేఁగు నేనుఁగు మొత్తముల్**
**నిట్టనేర్చిన గంగలోపల నీరు గాంచిన చాడ్పునన్. 167**

**ప్రతి :** ఏము= మేము; పట్టులేక= దిక్కులేక (ఆశ్రయంలేక); బహుప్రకార= చాలావిధాలుగా; విపన్న= ఆపదలకు గురియైన; చిత్తులము= మనస్సులు కలవారము; ఐతిమి= అయ్యాము; ఎట్టకేలకున్= చిట్టచివరికి; నిన్నున్+కంటిమి= నిన్ను దర్శించాము; అభి+ఈప్సిత+అర్థము వచ్చున్= ఇక మా కోరిక నెరవేరుతుంది; (ఎలాగంటే); పెన్+వెట్ట+ఐన= మిక్కిలి వేడిమితో కూడిన; దవానలంబునన్= కార్చిచ్చులో; వేఁగు= కాలిపోతున్న; ఏనుఁగు మొత్తముల్= ఏనుగుల సమూహాలు; నిట్టన్+ఏర్చిన= పైకి ఉప్పొంగుతున్న; గంగలోపల= నదిలోని; నీరు+కాంచిన= నీళ్ళను చూసిన; చాడ్పునన్= విధంగా – (ఉందని అర్థం).

**తా :** మేము ఏ ఆశ్రయమూ లేక చాలా విధాలుగా క్రుంగిపోయాము. చిట్టచివరికి నిన్ను దర్శించాము. ఇక మా కష్టాలు తీరినట్టే. మా కోరిక తప్పక నెరవేరుతుంది. ఇప్పటి మా పరిస్థితి ఎలా ఉందంటే – మిక్కిలి వేడిమితో కూడిన కార్చిచ్చులో కాలిపోతున్న ఏనుగుల గుంపు ఉప్పొంగుతున్న నదిలోని నీటిని చూసినట్టుగా సంతోషంగా ఉంది.

**విశే :** ఇంతకు మునుపు వర్ణించినట్టు స్వామి దయాసముద్రుడు. ఆ దయాగుణమే ఇక్కడ గంగానది. రాక్షసుల బాధలు కార్చిచ్చు. ఇంత గంభీరమైన 'ఉపమా' సామగ్రిని పోతనగారు యథామూలంగా గ్రహించి భాగవతాన్ని రామాయణ భారతాలతో సదృశంగా తీర్చిదిద్దారు.

**మత్త. నీకు నే మని విన్నవింతుము! నీవు సర్వమయుండవై**
**లోకమెల్లను నిండియుండఁగ లోకలోచన! నీ పదా**
**లోకనంబు శుభంబు మాకును లోకపాలకు లేను నీ**
**నాకవాసులు నీవ వహ్నిఁదనర్చు కేతుతతిక్రియన్. 168**

**ప్రతి :** లోకలోచన= ప్రపంచాన్నంతా చూస్తున్న విశ్వసాక్షీ!; నీకున్+ఏమని+విన్నవింతుము= నీకు ఏమని మనవి చేసుకోగలం; నీవు+సర్వమయుండవు+ఐ= నీవు అన్నిరూపాలలోనూ ప్రకాశిస్తూ; లోకమెల్లనున్= లోకమంతా; నిండి+ఉండఁ

గన్= నిండి ఉండగా; నీ పద+ఆలోకనంబును= నీ పాదదర్శనం; మాకును= మాకు కూడా; శుభంబు= శుభాన్ని కల్గిస్తుంది; వహ్నిన్= అగ్నిలో; తనర్చు= ఉండే; కేతుతతిక్రియన్= నిప్పురవ్వల సమూహం (విస్ఫులింగాలు) లాగా; ఏనున్= నేను; లోకపాలకులు= లోకపాలకులు; ఈ నాకవాసులు= ఈ దేవతలు; నీవు+అ= నీ లోని అంశాలమే. (ఇది ఎలాంటిదంటే)

**తా :** ఓ విశ్వసాక్షీ! నీకు మేము కొత్తగా చెప్పవలసింది ఏముంది! నీకు తెలుసుగదా! లోకాన్ని అంతటినీ నిరంతరం చూస్తూ ఉంటావు నీవు. నీ పాదదర్శనం మాకు శుభాల్ని కల్గిస్తుంది. అగ్నిలోని విస్ఫులింగాలలాగా నేను, లోకపాలకులు, ఈ దేవతలు – అందరం నీలోని అంశాలమే.

**వ. అని కమలసంభవప్రముఖులు వినుతి సేసి రని చెప్పి నరేంద్రునకు శుకుండిట్లనియె. 169**

**ప్రతి :** అని= ఈవిధంగా; కమల సంభవ ప్రముఖులు= బ్రహ్మ మొదలైన దేవతలు; వినుతి+చేసిరి+అని+చెప్పి= ప్రస్తుతి చేశారని చెప్పి; నరేంద్రునకున్= పరీక్షిత్తుకు; శుకుండు= శుకుడు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** ఈ విధంగా బ్రహ్మాదులు స్వామివారికి విన్నపం చేశారని చెప్పి శుకుడు పరీక్షిత్తుతో ఇలా చెప్పాడు.

**శా. ఈ రీతింజతురాననాదినుతుఁడై యేపార జీమూత గం**
**భీరంబైన రవంబునం బలికె సంప్రీతాత్ముఁడై యీశ్వరుం**
**డారోమాంచితకాయులన్ నవవిముక్తాపాయులం బ్రేయులం**
**బ్రారబ్ధోగ్రమహార్ణవోన్మథనవాంఛానల్పులన్ వేల్పులన్. 170**

**ప్రతి :** ఈ రీతిన్= ఈ విధంగా; చతుర్+ఆననాదినుతుఁడు+ఐ= బ్రహ్మాది దేవతలచేత స్తుతింపబడినవాడై; ఈశ్వరుండు; సంప్రీతాత్ముఁడై= ప్రీతి చెందినవాడై; ఆ రోమాంచితకాయులన్= నిలువెల్ల పులకరించిన శరీరాలు కలవారు; నవ+విముక్త+అపాయులన్= అప్పుడే కష్టాలనుండి గట్టెక్కినవారు; ప్రేయులన్= ప్రేమ పాత్రులును; ప్రారబ్ధ+ఉగ్ర+ మహార్ణవ+ఉన్మథన= ప్రారబ్ధమనే భయంకరమైన మహాసముద్రాన్ని చిలకడంలోని; వాంఛా= కోరికతో; అనల్పులన్= అధికులు అయిన; (అలాంటి) వేల్పులన్= దేవతలను; (గాంచి); ఏపారన్= నిండుగా; జీమూత గంభీరంబు+ఐన= మేఘంతో సమానమైన గాంభీర్యం గల; రవంబునన్= కంఠధ్వనితో; పలికెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా బ్రహ్మాది దేవతలు స్తుతించగా, సంతోషించిన వాడై, పులకరించిన శరీరాలు కలిగినవారు; అప్పుడే కష్టాల నుండి గట్టెక్కిన వారు ప్రేమపాత్రులు, ప్రారబ్ధమనే భయంకరమైన సముద్రాన్ని చిలకడానికి, కోరికతో ఉన్న దేవతలను చూచి, నిండుగా మేఘ గంభీర స్వరంతో ఇలా అన్నాడు.

**విశే :** క్షీరసాగరమథన కథాసారాంశాన్ని అంతా ఈ పద్యంలోని ఒక మాటలో ఇమిడ్చి పోతనగారు నిరూపించారు. ఆ అంశమే 'ప్రారబ్ధమనే' 'సముద్రం' చిలకడమనేది. రాక్షసులు, దేవతలు చిలికింది క్షీరసాగరాన్ని కాదు. తమతమ ప్రారబ్ధాలనే. దానికి అనుగుణమైన ఫలితాన్ని పొందారు.

**క. ఓ నలువ! యో సురేశ్వర! యో నిటలతటాక్ష! యో సురోత్తములారా!**
**దానవులతోడ నిప్పుడు మానుగఁబోరామి గలిగి మనుటే యొప్పున్. 171**

**ప్రతి :** ఓ నలువ= చతుర్ముఖుడవైన ఓ బ్రహ్మదేవా!; ఓ సురేశ్వర= ఓ దేవేంద్రా!; ఓ నిటలతటాక్ష= నుదుటిభాగంలో కన్ను గల్గిన ఓ రుద్రా!; ఓ సురోత్తములారా= ఓ దేవతోత్తములారా!; దానవులతోడన్= దానవులతో; ఇప్పుడు= ఈ సమయంలో; మానుగన్= తగినట్టు (ఉచితానుచితాలు ఎరిగి); పోరామి+కలిగి= స్నేహం కలిగి; మనుట+ఏ= బ్రతకడమే; ఒప్పున్= తగును.

**తా :** ఓ బ్రహ్మ! ఓ ఇంద్రా! ఓ రుద్రా! ఓ దేవతోత్తములారా! దానవులతో ఈ సమయంలో పోరాటం లేకుండా స్నేహంతో బ్రతకటమే తగినపని.

**వ. అది యెట్లంటిరేని. 172**

**ప్రతి :** అది; ఎట్లంటిరి+ఏని= ఏ విధంగా అంటే.

**తా :** అది ఎలాగంటే (ముందు చెబుతున్నాడు).

**క. ఎప్పుడు దనకును సత్త్వము, సొప్పుడు నందాఁక రిపులఁజూచియుఁ దనమైఁ**
**గప్పికొని యుండవలయును, నొప్పుగ నహి మూషకమున కొదిగిన భంగిన్. 173**

**ప్రతి :** ఎప్పుడు= ఎప్పుడు; తనకును= తనకు కూడా; సత్త్వము+చొప్పుడున్= బలం కలుగుతుందో; అందాఁక= అంతవరకు; రిపులన్= శత్రువులను; చూచియున్= గమనిస్తున్నాకూడా; ఒప్పుగన్= తగిన రీతిలో (జాగ్రత్తగా); అహి= పాము; మూషికమునకున్= ఎలుక ఉందని తెలిసి కూడా; ఒదిగిన భంగిన్= దాగుకొని ఉన్న విధంగా; తనమైన్= తన శరీరాన్ని (తమ ఉనికిని); కప్పికొని+ఉండవలయును= సంరక్షించుకోవాలి.

**తా :** తనకు ఎప్పటికి బలం సిద్ధిస్తుందో (అనువు దొరుకుతుందో) అందాకా శత్రువును చూస్తూ కూడా ఎలుక గమనించకుండా పాము ఎలా దాక్కుని ఉండి ఒక్కసారి పైన పడుతుందో; అలాగే తమ ఉనికిని సంరక్షించుకోవాలి.

**క. అమృతోత్పాదనయత్నము, విమలమతింజేయు టొప్పు; వేల్పులు వినుఁడీ,**
**యమృతంబుఁద్రావి జంతువు లమృతగతిన్ బ్రదుకుచుండు నాయుర్వృద్ధిన్. 174**

**ప్రతి :** వేల్పులు= ఓ దేవతలారా; వినుఁడు= జాగ్రత్తగా వినండి; విమల మతిన్= నిర్మలమైన మనస్సుతో; అమృతోత్పాదన యత్నము= అమృతాన్ని పుట్టించే ప్రయత్నం; చేయుట+ఒప్పున్= చేయడం తగినపని; అమృతంబున్+త్రావి= అమృతం తాగి; జంతువులు= ప్రాణులు; ఆయుర్వృద్ధిన్= ఆయుస్సు పెరుగుదలతో; అమృతగతిన్= మరణంలేని రీతిగా; బ్రదుకుచుండున్= జీవిస్తారు (మరణముండదు).

**తా :** దేవతలారా! ఒక మార్గం ఉంది. తొలుత అమృతాన్ని ఉత్పాదనం చేయటానికి ప్రయత్నించటం తగినపని. ఎందుకంటే అమృతం తాగిన ప్రాణులకు దీర్ఘాయుస్సు కలిగి మృతిలేని రీతిగా బ్రతుకగలుగుతారు (మరణాన్నే జయిస్తారు).

**సీ. పాలమున్నీటిలోపల సర్వతృణలతౌషధములు దెప్పించి చాల వైచి**
**మందరశైలంబు మంథానముగఁజేసి తనర వాసుకిఁదరిత్రాడు సేసి**
**నా సహాయతచేత నలి నందఱును మీరు తరువుఁడు వేగ మతంద్రు లగుచు;**
**ఫలము మీఁదయ్యెడు బహుళదుఃఖంబులఁబడుదురు దైత్యులు పాపమతులు;**

**ఆ. అలసటయును లేక యఖిలార్థములుఁగల్గు, విషధిలోన నొక్క విషము పుట్టుఁ;**
**గలఁగి వెఱవవలదు; కామరోషంబులు, వస్తుచయమునందు వలదు చేయ. 175**

**ప్రతి :** పాలమున్నీటి లోపలన్= క్షీరసముద్రంలో; సర్వ= అన్నివిధాలైన; తృణ+లత+ఔషధములు+తెప్పించి= తృణాలను (గరికవంటివి), లతలను (సోమలతల్లాంటివి), ఔషధములను (ఓషధులు మందుమొక్కలు) సంగ్రహించి; చాల+వైచి= చాలా అధికమైన మొత్తంలో వేసి; మందరశైలంబున్= మందర పర్వతాన్ని; మంథానముగన్+చేసి= కవ్వంగాచేసుకొని; తనరన్= తగినట్టు; వాసుకిన్= వాసుకిని; తరిత్రాడు= కవ్వపుతాడులాగా; చేసి= చేసుకొని; నా సహాయత చేతన్= నా సహాయంతో; నలిన్+అందఱును+మీరు= మీరందరూ బాగా; వేగన్= శీఘ్రంగా (ఆలస్యం చేయకుండా); అతంద్రులు+ అగుచున్= జాగ్రత్తగా; తరువుఁడు= చిలకండి; ఫలము= దీనిఫలం; మీఁదయ్యెడున్= మీదట సిద్ధిస్తుంది; దైత్యులు= రాక్షసులు; పాపమతులు= పాపచింతన కల్గినవారు కాబట్టి; బహుళదుఃఖంబులన్= చాలా కష్టాలలో; పడుదురు= పడతారు (చాలా ఇబ్బందులు ఎదుర్కొంటారు); అలసటయును లేక= శ్రమించకుండానే; అఖిల+అర్థములున్+కల్గున్= మీ కోరికలన్నీ తీరుతాయి (సంపదలు గలుగుతాయి); విషధిలోనన్= జలధిలో; ఒక్క విషము పుట్టున్= ఒక విషం పుడుతుంది; కలఁగి= మనసుచెడి; వెఱవన్+వలదు= భయపడకండి; వస్తుచయమునందున్= పుట్టే వస్తుసముదాయంలో (వస్తువుల్ని పంచుకోవటంలో); కామరోషంబులు= కోరికా కినుకా; చేయన్+వలదు= ప్రదర్శించకండి.

**తా :** స్వామి పాలసముద్రం ఎలా చిలకాలో చెబుతున్నాడు. "క్షీరసముద్రంలో అన్నివిధాలైన తృణాలను, లతలను, ఓషధులను దండిగా సంపాదించి వేయండి. మందర పర్వతాన్ని కవ్వంగా, వాసుకిని కవ్వపు తాడుగా సిద్ధం చేసుకొని, వెంటనే, నా సహాయంతో మీరందరూ (రాక్ష సులతో కలిసి అని) జాగ్రత్తగా చిలకండి. మీదట దాని ఫలితం లభిస్తుంది. పాపచింతన కల్గిన దానవులు చాలా దుఃఖాల పాలవుతారు. మీరు ఇబ్బంది పడకుండానే అన్ని సంపదలూ పొందుతారు. సముద్రంలో విషం పుడుతుంది. మనసులు వికలం చేసుకొని భయపడి పారిపోకండి. ఎన్నో వస్తువులు పుడతాయి. వాటికోసం కోరికలూ కినుకలూ వద్దు.

**వ. అని యాదేశించి. 176**

**తా :** అని ఆదేశించిన వాడై (విష్ణువు ఏం చేశాడో తరువాతి పద్యంతో అన్వయం)

**క. అంతాదిరహితుఁడచ్యుతుఁడంతర్ధానంబు నొందె; నజఫాలాక్షుల్**
**సంతోషంబునఁదమ తమ కాంతాలయములకుఁజనిరి గౌరవ మొప్పన్. 177**

**ప్రతి :** అంతాది రహితుఁడు= ఆద్యంతాలు లేనివాడు; అచ్యుతుఁడు= నాశం లేనివాడు అయిన శ్రీహరి; అంతర్ధానంబున్+ ఒందెన్= మాయమయ్యాడు; అజఫాలాక్షుల్= బ్రహ్మరుద్రులు; సంతోషంబునన్= సంతోషంగా; తమతమ= తమతమ; కాంతాలయములకున్= భార్యలున్నచోటికి (తమ ఇండ్లకు); గౌరవమొప్పన్= దేవతలంతా నమస్కరిస్తుండగా; చనిరి= వెళ్ళారు.

**తా :** ఆద్యంతరహితుడు, నాశరహితుడు అయిన శ్రీమహావిష్ణువు ఈ విధంగా వారిని ఆజ్ఞాపించి మాయమయ్యాడు. అంత బ్రహ్మ, రుద్రుడు దేవతలను వీడ్కొని తమతమ స్వస్థానాలకు వెళ్ళిపోయారు.

**క. కయ్యంబు సేయ నొల్లక నెయ్యంబున నతులు వెట్టి నిర్జరనికరం**
**బియ్యప్పనములు వెట్టుచుఁదియ్యంబునఁగొల్చె బలిని దేవద్వేషిన్. 178**

**ప్రతి :** కయ్యంబుసేయన్+ఒల్లక= యుద్ధం చేయటానికి ఇష్టపడక; నిర్జర నికరంబు= దేవతాసమూహం; నెయ్యంబునన్= స్నేహంతో; నతులు+పెట్టి= వినయంగా నమస్కారాలు చేస్తూ; ఇయ్య+అప్పనములు+పెట్టుచున్= ఇవ్వదగిన కానుకలు పెడుతూ (చేస్తూ); తియ్యంబునన్= అనుకూలంగా; దేవద్వేషిన్= దేవతలద్వేషి (రాక్షసుడైన); బలినిన్= బలి చక్రవర్తిని; కొల్చెన్= సేవించారు.

**తా :** ఇక దేవతలు యుద్ధం చేయటానికి ఇష్టపడక బలి చక్రవర్తిని చేరి స్నేహంగా ఉంటూ నమస్కారాలు పెడుతూ; కానుక లిస్తూ, అతడు దేవద్వేషి అని తెలిసినా, వాడికి అనుకూలంగా ఉంటూ సేవలు చేశారు.

**క. పసచెడి తనకును వశమై సుసరపుగతిఁగొల్చుచున్న సురసంఘములన్**
**గసిమసఁగి చంపఁబూనిన నసురుల వారించె బలియు నతినయయుక్తిన్. 179**

**ప్రతి :** పసచెడి= బలహీనులై; తనకును వశము+ఐ= తనకు వశవర్తులై; సుసరపుగతిన్= తగినట్లుగా; కొల్చుచున్న= సేవిస్తున్న; సురసంఘములన్= దేవతలను; కసిమసఁగి= ద్వేషించి; చంపన్+పూనిన= చంపడానికి ముందుకు వచ్చిన; అసురులన్= రాక్షసులను; బలియున్= బలి; అతినయ యుక్తిన్= రాజనీతి సారం తెలిసినవాడు కాబట్టి నేర్పుతో; వారించెన్= వద్దన్నాడు.

**తా :** ఇలా బలహీనులుగా తనకు వశవర్తులుగా మంచితనం నటిస్తూ సేవిస్తున్న దేవతల్ని, కసి పెరిగి రాక్షసులు చంపేద్దామని ముందుకు రాగా, రాజనీతి తెలిసిన బలిచక్రవర్తి నేర్పుతో వారిని వారించాడు.

**వ. అట్లు వారించి వైరోచని రాక్షససముదయంబున కిట్లనియె. 180**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; వారించి; వైరోచని= బలిచక్రవర్తి (ప్రహ్లాదుని కొడుకు విరోచనుడు; అతని కొడుకు బలి – కాబట్టి వైరోచని); రాక్షస సముదయంబునకున్= రాక్షస సమూహంతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ విధంగా చంపడానికి సిద్ధమైన రక్కసిమూకను నివారిస్తూ బలి చక్రవర్తి ఇలా చెప్పాడు.

**క. పగవారు శరణు చొచ్చిన, మగతనములు నెఱపఁదగునె మగవారలకున్**
**దగు సమయ మెఱుఁగవలదే, మగఁటిమిఁబాటింప వలద మర్త్యులతోడన్. 181**

**ప్రతి :** పగవారు= శత్రువులు; శరణు+చొచ్చినన్= శరణు కోరితే; మగవారలకున్= ధీరులకు; మగతనములు= పౌరుషాన్ని, నెఱపన్+తగునె= చూపించవచ్చునా!; తగు= తగిన; సమయము+ఎఱుఁగన్+వలదే= తగిన సమయం కోసం వేచి గుర్తించాలి కదా!; అమర్త్యులతోడన్= దేవతలతో; మగఁటిమిన్= పరాక్రమాన్ని; పాటింపన్+వలదు= చూపించరాదు.

**తా :** శత్రువులు శరణు వేడినప్పుడు ధీరులైనవారు తమ పరాక్రమం చూపరాదు. సమయాన్ని గమనించాలి. అందుచేత దేవతలపైన ఇప్పుడు మనం పరాక్రమం చూపరాదు.

**వ. అని పలికి కొలువు కూటంబున నసుర నికర పరివృతుండై నిఖిల లోక రాజ్యలక్ష్మీ సహితుండై యఖిల విబుధ వీర విజయాహంకార నిజాలంకారుండై సుఖంబునం గొలువున్న విరోచన నందనుం గని శచీవిభుం డుత్తమ సచివుండునుం బోలె సాంత్వన వచనంబుల శాంతిం బొందించి పురుషోత్తమ శిక్షితంబైన నీతిమార్గంబున శంబరునికిం బ్రియంబు సెప్పి, యరిష్టనేమి ననునయించి, త్రిపురవాసులగు దానవుల**

**నొడంబఱిచి, జంభుని సమ్మతంబు సేకొని, హయగ్రీవుని విగ్రహంబు మాన్చి, నముచి తారక బాణాదులతో సఖ్యంబు నెఱపి, విప్రచిత్తికిం బొత్తు హత్తించి, శకుని విరోచన ప్రహేతులకుఁ బోరామి సూపి, మయ మాలి సుమాలి ప్రముఖులకు మైత్రి యెఱింగించి; కుంభనికుంభులకు సౌజన్యంబు గైకొలిపి, పౌలోమ కాలకేయ నివాత కవచాదులయెడ బాంధవంబు ప్రకటించి, వజ్రదంష్ట్రికి వశుండై, యితర దానవ దైత్యసమూహంబు వలన నతిస్నేహంబు సంపాదించి, మనకు నక్క చెలియండ్ర బిడ్డలకు నొడ్డారంబు లేమిటికి? నేక కార్యపరత్వంబున నడ్డంబు లేక బ్రదుకుద; మన్యోన్య విరోధంబు లేల? తొల్లి యన్యోన్యవిరోధంబున నలంగితి; మిది మొదలు దనుజ దివిజ సముదయంబులకు రాజు విరోచన నందనుండ; మనమందఱ మతని పంపు సేయంగలవార; ముభయ కులంబును వర్ధిల్లునట్టి యుపాయం బెఱింగింతునని యమృతజలధిమథన ప్రారంభ కథనంబు దెలియం జెప్ప; నట్లు సురాసుర యూథంబులు బలారాతిబలి ప్రముఖంబులై పరమోద్యోగంబున సుధాసంపాదనాయత్త చిత్తులై యైకమత్యంబు నొంది యమంద గమనంబున మందరనగంబునకుంజని. 182**

**ప్రతి :** అని పలికి; కొలువుకూటంబునన్= సభలో (ఆస్థానం); అసుర నికర= రాక్షస సమూహాలచేత; పరివృతుండు+ఐ= చుట్టబడినవాడై; నిఖిలలోక రాజ్యలక్ష్మీ సహితుండు+ఐ= అన్ని లోకాల రాజ్యాలను గెలుచుకొన్న వైభవంతో; అఖిల విబుధ వీర= సకల దేవతా వీరులను; విజయాహంకార= జయించిన అహంకారమే; నిజాలంకారుఁడు+ఐ= తనకు అలంకారం కాగా; సుఖంబునన్= సుఖంగా; కొలువున్న= సభతీర్చిన; విరోచన నందనున్+కని= బలినిచూచి; శచీవిభుండు= శచీదేవి భర్త ఇంద్రుడు; ఉత్తమ సచివుండునుంబోలెన్= మంచి మంత్రిలాగా; సాంత్వన వచనంబులన్= ఓదార్పు మాటలతో; శాంతిన్+పొందించి= శాంతి కలిగించి; పురుషోత్తమ= శ్రీహరిచేత; శిక్షితంబు+ఐన= బోధింపబడిన; నీతి మార్గంబునన్= నీతి పద్ధతిని అనుసరిస్తూ; శంబరునికిన్= శంబరాసురునికి; ప్రియంబు+చెప్పి= మంచిమాటలు చెప్పి; అరిష్టనేమిన్+ అనునయించి= అరిష్టనేమిని ఓదార్చి; త్రిపురవాసులగు దానవులన్= త్రిపురాలలో నివసించే రాక్షసులను; ఒడంబఱిచి= ఒప్పించి; జంభుని= జంభుడనే రాక్షసుని; సమ్మతంబు+చేకొని= సమ్మతిని గ్రహించి; హయగ్రీవుని= హయగ్రీవుడనే రాక్షసుని; విగ్రహంబు మాన్చి= కోపం పోయేలాచేసి; (యుద్ధయత్నం వలదని చెప్పి); నముచి, తారక, బాణాదులతోన్= నముచి, తారకుడు, బాణుడు మొదలైనవారిలో; సఖ్యంబునెఱపి= స్నేహం చేసి; విప్రచిత్తికిన్= విప్రచిత్తికి; పొత్తుహత్తించి= స్నేహం పుట్టించి (కౌగిలించుకొని); శకుని విరోచన ప్రహేతులకుఁ బోరామి సూపి, మయ మాలి సుమాలి ప్రముఖులకు మైత్రి ఎఱింగించి= శకుని, విరోచనుడు, ప్రహేతులకు తాము పోరాడడానికి రాలేదని తెలిపి, మయ, మాలి, సుమాలి మొదలైనవారికి తమ స్నేహభావాన్ని తెలిపి; కుంభనికుంభులకున్= కుంభునికి, నికుంభునికి; సౌజన్యంబున్+కైకొలిపి= మిత్రహస్తాన్ని అందించి; పౌలోమ, కాలకేతు, నివాతకవచాదుల యెడన్= పౌలోమ, కాలకేతు, నినాతకవచుల విషయంలో; బాంధవంబు ప్రకటించి= బంధుత్వం కలుపుకొని; వజ్రదంష్ట్రికిన్+వశుండై= వజ్రదంష్ట్రికి లోబడినవాడై; ఇతర దానవ దైత్య సమూహంబువలనన్= ఇతర దానవుల, దైత్యుల సమూహాలతో; అతిస్నేహంబు సంపాదించి; (ఇలా అన్నాడు) మనకున్= మనకు; అక్క చెలియండ్ర బిడ్డలకున్= అక్కచెల్లెండ్ల పిల్లలకు (నడుమ); ఒడ్డారంబులు+ ఏమిటికిన్= పగలు ఎందుకు?; ఏక కార్యపరత్వంబునన్= ఒకే లక్ష్యసిద్ధికోసం కలిసికట్టుగా పనిచేసి; అడ్డంబు లేక బ్రదుకుదము= మనకు ఎదురు లేకుండా బ్రదుకుదాం; అన్యోన్య విరోధంబులు+ఏల= మనలో ఒకరికొకరు శత్రుత్వం సాధించటం ఎందుకు?;

తొల్లి= ముందు; అన్యోన్య విరోధంబునన్+నలంగితిమి= ఒకరిపై ఒకరు విరోధం కల్గి ఇబ్బంది పడ్డాము; ఇది మొదలు= ఇక ముందు; దనుజ దివిజ సముదయంబులకున్= రాక్షస దేవతా సముదాయానికంతా; రాజు, విరోచన నందనుండు+అ= బలిచక్రవర్తే; మనమందఱము= మన మందరం; అతని పంపు+చేయంగలవారము= అతని ఆజ్ఞను పాటిస్తాం. (కలిసి అతని ఆజ్ఞను పాటిద్దాం); ఉభయకులంబును= మన రెండు వంశాలు; వర్ధిల్లునట్టి= వృద్ధిపొందేటటు వంటి; ఉపాయంబు+ఎఱింగింతునని= ఉపాయం తెలుపుతానని చెప్పి; అమృత జలధి మథన ప్రారంభ కథనంబున్= క్షీర సాగరమథనం ఎలా ప్రారంభించాలో; తెలియన్+చెప్పన్= తెలిసేలా చెప్పగా; అట్లు= ఆ విధంగా; సురాసుర యూథంబులు= దేవతలు, రాక్షసులు; బలారాతి= ఇంద్రుడు; బలి= బలిచక్రవర్తి; ప్రముఖంబులై= నాయకులుగా కలిగినవాడై; పరమోద్యోగంబునన్= గొప్ప పూనికతో; సుధాసంపాదన+ఆయత్తచిత్తులై= అమృతాన్ని సంపాదించాలన్న కోరికకు బద్ధులై; ఐకమత్యంబున్+ఒంది= ఐకమత్యాన్ని పొంది; అమంద గమనంబునన్= త్వరితగతిని; మందరనగంబునకున్+చని= మందర పర్వతం దగ్గరికి వెళ్ళి...

**తా :** కొలువుకూటంలో రాక్షసులంతా బలిచక్రవర్తిని చుట్టుముట్టి సేవిస్తుండగా; ఆ బలి అన్ని లోకాల రాజ్యాలను గెలుచుకున్న వైభవంతో, సకల దేవతా వీరుల్ని జయించానన్న అహంకారంతో సుఖంగా కొలువుతీర్చి సంతోషపడుతుండినాడు. అప్పుడు ఇంద్రుడు మంచి మంత్రిలాగా బలిని చూచి ఓదార్పుమాటలు చెప్పి అతనికి శాంతి కల్గించాడు. శ్రీహరి బోధించిన నీతి మార్గాన్ని అనుసరించి అక్కడ చేరిన రాక్షస ప్రముఖులైన శంబరుడు, అరిష్టనేమి, త్రిపురాసురులు; జంభుడు, హయగ్రీవుడు, నముచి, తారకుడు, బాణుడు, విప్రచిత్తి, శకుని, విరోచనుడు, ప్రహేతి, మయుడు, మాలి, సుమాలి, కుంభుడు, నికుంభుడు, పౌలోముడు, కాలకేయులు, నివాతకవచులు, వజ్రదంష్ట్రి మొదలైన వారిలో ఒక్కొక్కరిని ఒక్కోవిధంగా స్నేహం ప్రకటించి వశుల్ని చేసుకొని ఇలా అన్నాడు. "అక్కా చెల్లెండ్ల సంతానమైన మనమధ్య పగ తగదు. కలిసికట్టుగా ఒకే లక్ష్యసిద్ధికోసం పనిచేసి ఎదురులేకుండా బ్రదుకుదాం. మనలో ఒకరి నొకరు ద్వేషించుకోవటం ఎందుకు? ముందు ఇలా విరోధం పెట్టుకునే చాలా ఇబ్బందులు పడ్డాం. ఇకముందు దేవతలకు, రాక్షసులకు బలిచక్రవర్తే రాజు. అందరం కలిసి అతని ఆజ్ఞను పాటిద్దాం. మన రెండు వంశాలు వృద్ధిపొందే ఉపాయం చెబుతానని క్షీరసాగర మథనం ఎలా చేయాలో తెలియజెప్పాడు. ఆ తరువాత దేవతలు రాక్షసులు ఇంద్రుని, బలిని నాయకులుగా గ్రహించి గొప్ప పూనికతో అమృతాన్ని సంపాదించాలని నిశ్చయించుకొని, ఐకమత్యంతో, త్వరితగతిన, మందరపర్వతం దగ్గరికి వెళ్ళారు.

**సీ. వాసవు వర్ధకి వాఁడిగాఁజఱచిన కుద్దాలముఖములఁగొంత ద్రవ్వి**
**ముసలాగ్రములు చొన్పి మొదలి పాఁతగలించి దీర్ఘపాశంబులదిండు సుట్టి**
**పెకలించి బాహులఁబీడించి కదలించి పెల్లార్చి తమ తమ పేరువాడి**
**పెఱికి మీఁదికి నెత్తి పృథులహస్తంబులఁదలల భుజంబులఁదరలకుండ**

**తే. నాని మెల్లన కుఱుతప్పటడుగు లిడుచు, భార మధికంబు మఱవక పట్టుఁడనుచు**
**మందరనగంబుఁదెచ్చి రమందగతిని, దేవదైత్యులు జలరాశి తెరువు వట్టి. 183**

**ప్రతి :** వాసవు+వర్ధకి= ఇంద్రుడి వడ్రంగి (శిల్పి) (త్వష్ట అనబడే వాడు); వాఁడిగాన్+చఱచిన= వాడిగా పదునుపెట్టిన; కుద్దాలముఖములన్= గునపములతో; కొంత+త్రవ్వి= కొంచెం తవ్వి; ముసల+అగ్రములు= రోకండ్ల చివర్లను; చొన్పి= లోపలికి చొప్పించి; మొదలి+పాఁతగలించి= అడుగున - దిగబడిపోయిన కొండను కదిలించి; దీర్ఘ పాశంబులన్+దిండుసుట్టి=

పొదవాటి తాళ్ళతో దిండుగా బిగించి; పెకలించి= ఆ పర్వతాన్ని పెకలించి; బాహులన్+పీడించి= బాహువులతో కుళ్ళగించి; కదలించి= కదలించి; పెల్లు+అర్చి= గావుకేకలు వేస్తూ; తమతమ పేరువాడి= తమతమ బిరుదులు ప్రకటిస్తూ; పెఱికి= ఆ పర్వతాన్ని పెకలించి; మీఁదికిన్+ఎత్తి= పైకి ఎత్తి; పృథుల హస్తంబులన్+తలలన్+భుజంబులన్+తరలకుండన్= బలమైన చేతులతో, తలలతో, భుజాలతోనూ జారకుండా ఆ కొండను; ఆని= ఆన్చి ఎత్తుకొని; మెల్లన= నెమ్మదిగా; కుఱు= చిన్నవైన; తప్పటడుగులు; ఇడుచున్= వేస్తూ; భారము+అధికంబు= బరువు చాలావుంది; మఱవక+పట్టుఁడు+అనుచున్= జాగ్రత్తగా పట్టండి అంటూ; అమందగతిని= గబగబా; మందరనగంబున్=తెచ్చి= మందరపర్వతాన్ని తెచ్చి; దేవదైత్యులు= దేవతలు, రాక్షసులు; జలరాశి+తెరువు+పట్టి= సముద్రం దారి పట్టి...

**తా :** దేవతలు రాక్షసులు దేవతల శిల్పి త్వష్ట పదునుపెట్టిన గునపాలతో (తవ్వుగోలలతో) కొంత తవ్వారు. రోకండ్లను లోనికి చొప్పించి అడుగున దిగబడిన కొండను కదిల్చారు. పొడుగాటి తాళ్ళతో బిగించి కట్టారు. ఆ కొండను మెల్లగా కుళ్ళగించి, చేతులతో గట్టిగా పట్టి కదిలించారు. తమ తమ పేర్లు, బిరుదులు ప్రకటిస్తూ, బిగ్గరగా కేకలు వేస్తూ, కొండను ఊడబెరికి పైకి ఎత్తుకొని బలమైన తమ చేతులతో, తలలతో, భుజాలతో కొండ జారకుండా ఆన్చి పట్టుకున్నారు. మెల్లగా కదులుతూ తప్పటడుగులు వేస్తూ 'బరువు ఎక్కువగా ఉంది, జాగ్రత్తగా పట్టండి' అంటూ గబగబా ఆ కొండను సముద్రం వైపుకు మోసుకొని తీసుకువచ్చారు.

**క. మందరము మోవనోపమి నందఱపైఁబడియె నదియు నతిచోద్యముగాఁ;**
**గొందఱు నేలం గలిసిరి కొందరు నుగ్గైరి; చనిరి కొందరు భీతిన్. 184**

**ప్రతి :** మందరము మోవనోపమిన్= మందరపర్వతాన్ని మోయలేక పోవటం వల్ల; అదియున్= ఆ మందరం; అతిచోద్యముగాన్= అత్యాశ్చర్యకరంగా; అందఱపైన్+పడియెన్= అందరిపైనా పడింది; కొందఱు నేలన్=+కలిసిరి= కొందరు భూమిమీద పడి చనిపోయారు; కొందరు నుగ్గు+ఐరి= కొందరు పొడిపొడి అయ్యారు. కొందరు భీతిన్+చనిరి= కొందరు భయంతో పరిగెత్తారు.

**తా :** దేవదానవులు ఆ మందరపర్వతాన్ని మోయలేకపోవటంచేత అది ఆశ్చర్యకరంగా అందరిమీదా పడిపోయింది. కొందరు భూమిమీద పడి చనిపోయారు. కొందరు నుగ్గునుగ్గయ్యారు. కొందరు భయంతో పరిగెత్తారు.

**క. ఏలా హరికడ కేఁగితి, మేలా దొరఁకొంటి, మధికహేలనశైలో**
**న్మూలనము సేసి తెచ్చితి, మేలా, పెక్కంద్రు మడిసి రేలా నడుమన్? 185**

**ప్రతి :** హరికడకున్= హరి దగ్గరికి; ఏలా+ఏఁగితిమి= ఎందుకు వెళ్ళాము; ఏలా+దొరఁకొంటిమి= ఈ ప్రయత్నం ఎందుకు చేశాము?; అధిక+హేలనన్+శైల+ఉన్మూలనము+చేసి+తెచ్చితిమి= ఎంతో ప్రేమతో పర్వతాన్ని ఊడబెరికి తెచ్చాము?; ఏలా+నడుమన్+పెక్కంద్రు+మడిసిరి= ఎందుకింత మంది మధ్యలోనే చనిపోయారు?

**తా :** శ్రీహరి దగ్గరికి ఎందుకు వెళ్ళాము? ఆయన మాట మీద ఈ పనికి ఎందుకు పూనుకొన్నాము? ఎందుకింత పెద్ద పర్వతాన్ని లీలగా ఊడబెరికి తెచ్చాము? ఎందుకింత మంది మధ్యలో చనిపోయారు? ఇదంతా మన ప్రారబ్ధం కాక మరేమిటి?

**క. ఏఁటికి మముఁబని పంచెను? నేఁటికి మనఁబోఁటివారి కింతలు పను? లిం**
**కేఁటికి రాఁడు రమేశ్వరుఁ? డేఁటి కుపేక్షించె? మఱవనేఁటికి మనలన్? 186**

**ప్రతి :** ఏంటికిన్+మమున్+పని పంచెను= ఎందుకు ఆయన మనకీ పని పెట్టాడు?; ఏంటికిన్+మనంబోటి వారికిన్+ ఇంతలు పనులు=మనలాంటి వారికి ఇంతలేసి పనులేల?; ఇంకన్+ఏంటికి+రాండు+రమేశ్వరుండు= ఆ శ్రీపతి మనకు సహాయంగా ఎందుకింకా రాలేదు?; ఏంటికిన్+ఉపేక్షించెన్= ఎందుకు నిర్లక్ష్యం చేస్తున్నాడు; మఱవన్+ఏంటికిన్+మనలన్= మనల్ని ఎందుకు మరచిపోయాడు.

**తా :** ఆయన మనకు ఈ పని ఎందుకు పెట్టాడు? మన బోటివారికి ఇంతలేసి పెద్ద పనులు ఎందుకు? (ఊరికే ఉండక అని); ఇంకా ఆ శ్రీపతి మనకు సహాయంగా రాలేదేమిటి? ఎందుకు నిర్లక్ష్యం చేస్తున్నాడు. ఎందుకు మనల్ని మరచిపోయాడు?

**వ. అని కులకుధర పతనజన్యంబు దైన్యంబు సహింపనోపక పలవించుచున్న దివిజ దితిజుల భయంబు మనంబున నెఱింగి సకలవ్యాపకుండగు హరి తత్సమీపంబున. 187**

**ప్రతి :** అని; కులకుధర= కులపర్వతం (మందరం) యొక్క; పతన= పడిపోవటం వల్ల; జన్యంబు= పుట్టిన; దైన్యంబున్= దైన్యభావాన్ని; సహింపన్+ఓపక= సహింపజాలక; పలవించుచున్న= దుఃఖిస్తున్న; దివిజ= దేవతల; దితిజుల= దానవుల; భయంబున్= భయాన్ని; సకల వ్యాపకుండగు హరి= అందరిలోనూ వ్యాపించి ఉండే శ్రీహరి; మనంబునన్+ఎఱింగి= మనసులో గుర్తించిన వాడై; తత్సమీపంబునన్= వారి సమీపంలో...

**తా :** ఆ మందరపర్వతం పడిపోవటం వల్ల పుట్టిన కష్టాన్ని ఓర్చుకోలేక దుఃఖిస్తున్న దేవదానవుల భయాన్ని, అందరిలోనూ వ్యాపించి ఉండే ఆ శ్రీహరి మనసులో గుర్తించినవాడై వారి సమీపంలో ప్రత్యక్షమయ్యాడు.

**మ. గరుడారోహకుండై గదాదిధరుండై కారుణ్యసంయుక్తుండై**
**హరికోటిప్రభతో నొహో వెఱవకుండంచుంబ్రదీపించి త**
**ద్గిరింగేలన్ నలువొందంగందుకము మాడ్కింబట్టి క్రీడించుచున్**
**గరుణాలోకసుధన్ సురాసురుల ప్రాణంబుల్ సమర్థించుచున్. 188**

**ప్రతి :** గరుడారోహకుండు+ఐ= గరుడ వాహనాన్ని అధిరోహించి; గదాదిధరుండు+ఐ= గదాది ఆయుధాలను ధరించినవాడై; కారుణ్య సంయుక్తుండు+ఐ= కరుణతో కూడినవాడై; హరి కోటి ప్రభతో= కోటి సూర్యులకాంతితో; ప్రదీపించి= ప్రత్యక్షమై; ఒహో వెఱవకుండు+అంచున్= 'ఓహో! భయపడకండి' అంటూ; తద్గిరిన్= ఆ కొండను; నలువొందన్=నేర్పుతో; కేలన్= చేతితో; కందుకము మాడ్కిన్= బంతిలాగా; పట్టి= పట్టుకొని; క్రీడించుచున్= ఆడుకొంటూ; సురాసురుల= దేవదానవుల; ప్రాణంబుల్= ప్రాణాలను; కరుణా+ఆలోకసుధన్= దయామృతం నింపిన చూపులతో; సమర్థించుచున్= కాపాడుతూ...

**తా :** శ్రీహరి గరుడునిపై కూర్చొని, దయతో, కోటిసూర్యుల కాంతితో ప్రకాశిస్తూ, గదాద్యాయుధాలు ధరించి వారి ముందు ప్రత్యక్షమై 'అరే! ఎందుకు భయపడతారు?' అంటూ లీలగా ఒక చేతితో బంతిలాగా ఆ కొండను తీసుకొని ఆడుకోవటం ప్రారంభించాడు. దయామృతం నిండిన చూపులతో వారిని కాపాడాడు.

**క. వారలు గొలువంగ హరియును, వారాన్నిధి కరుగు మనంగ వసుధాధరమున్**
**వారిజనయనునింగొంచు న, వారిత గతింజనియె విహగవల్లభుండఱుతన్. 189**

**ప్రతి :** వారలు+కొలువఁగన్= సురాసురులందరూ సేవిస్తుండగా; హరియును= శ్రీహరి; వారాన్నిధికిన్= క్షీరసముద్ర ప్రాంతానికి; అరుగుము+అనఁగన్= వెళ్ళు అని చెప్పగానే; వసుధాధరమున్+వారిజ నయనునిన్= ఆ కొండను, శ్రీహరిని; అఱుతన్= మెడమీద (మూపుపై); కొంచున్= ఉంచుకొని; అవారిత గతిన్= శీఘ్రంగా; చనియెన్= వెళ్ళాడు.

**తా :** దేవదానవులు శ్రీహరిని సేవిస్తుండగా; 'క్షీరసముద్రానికి తీసుకుపో' అని స్వామివారు సెలవివ్వగానే గరుత్మంతుడు తనమూపుపై స్వామిని, ఆ పర్వతాన్ని అవలీలగా ధరించి అతి శీఘ్రంగా పాలకడలి దగ్గరికి ఎగిరిపోయాడు.

**క. చని జలరాశితటంబున వనజాక్షుని గిరిని డించి వందనములు స**
**ద్వినుతులు సేసి ఖగేంద్రుఁడు పనివినియెను భక్తి నాత్మభవనంబునకున్. 190**

**ప్రతి :** చని= వెళ్ళి; జలరాశి తటంబునన్= సముద్ర తీరంలో; వనజాక్షునిన్+గిరినిన్+డించి= హరిని గిరిని అక్కడ దించి; ఖగేంద్రుఁడు= ఆ గరుత్మంతుడు; వందనములు+సద్వినుతులు+చేసి= నమస్కరించి; స్తుతించి; భక్తిన్= భక్తితో; ఆత్మభవనంబునకున్= తన నివాసానికి; పని వినియెను= వెళ్ళిపోయాడు.

**తా :** వెళ్ళి హరిని గిరిని ఆ సముద్రతీరంలో దించి, స్వామికి నమస్కరించి ఎన్నో విధాలుగా స్తుతించి గరుత్మంతుడు తన నివాసానికి వెళ్ళిపోయాడు.

**వ. అప్పుడు. 191**

**తా :** ఆ సమయంలో...

**సీ. భూనాథ! వినవయ్య భోగీంద్రు వాసుకిఁబిలిపించి యతనికిఁబ్రియము సెప్పి**
**ఫలభాగ మీ నొడఁబడి సమ్మతునిఁజేసి మెల్లన చేతుల మేను నివిరి**
**'నీవ కా కెవ్వరు నేర్తు? రీ పని కియ్య కొ'మ్మని యతని కైకోలు వడసి**
**కవ్వంపుఁగొండ నిష్కంటకంబుగఁజేసి ఘర్షించి యతని భోగంబు జుట్టి**

**ఆ. కడఁగి యమృత జలధిఁగలశంబు గావించి, త్రచ్చు నవసరమునఁదలఁపు లమర**
**బద్ధవస్త్రకేశభారులై యా రెండు, గములవారు తరువఁగదిసి రచట. 192**

**ప్రతి :** ఓ భూనాథ= ఓ రాజా; వినవయ్య= తరువాతి కథను విను; భోగి+ఇంద్రున్= సర్పాలలో శ్రేష్ఠుడైన; వాసుకిన్+పిలిపించి= వాసుకిని పిలిపించి; అతనికిన్+ప్రియము+చెప్పి= అతనితో ప్రియంగా మాట్లాడి; ఫలభాగము+ఈన్+ఒడఁబడి+సమ్మతునిన్+చేసి= ఫలభాగమివ్వడానికి అంగీకరించి, అతనిని ఒప్పించి; మెల్లనన్= నెమ్మదిగా; చేతులన్= తమ చేతులతో; మేను నివిరి= అతని దేహాన్ని నిమిరి (ప్రేమ సూచకంగా); 'నీవ కాక= నీవు తప్ప; ఈ పనికిన్+ఎవ్వరు నేర్తురు= ఈ పనికి ఎవరు సమర్థులు; ఇయ్యకొమ్మని= ఒప్పుకో అని; అతని+కైకోలు+వడసి= అతని ఆమోదాన్ని పొంది; కవ్వంపుఁకొండన్= ఆ మందరగిరిని; నిష్కంటకంబుగన్+చేసి= ముళ్లపొదలు మొదలైన వాటిని తీసివేసి; ఘర్షించి= చదునుచేసి; అతని భోగంబున్+చుట్టి= అతని పడగను పట్టుకొని శరీరాన్ని కొండకు చుట్టి; కడఁగి= పూనికతో; అమృత జలధిన్= క్షీరసాగారాన్ని; కలశంబు+కావించి= కుండలాగా చేసి; త్రచ్చు+అవసరమునన్= చిలికే సమయంలో; తలఁపులు+అమరన్= బాగా ఆలోచించి; బద్ధ+వస్త్ర+కేశ+భారులై= వస్త్రాలు ఎగగట్టి జుట్లు ముడివేసుకొని; ఆ రెండు గములవారు= ఆ రెండు గుంపులవారు; అచటన్= అక్కడ; తరువన్+కదిసిరి= చిలకటం ప్రారంభించారు.

**తా :** ఓ రాజా! ఆ తరువాత దేవాసురులు సర్పరాజైన వాసుకిని పిలిపించారు. అతనితో మంచిమాటలు మాట్లాడి; అమృతంలో నీకూ భాగమిస్తామని చెప్పి, అతనిని ఒప్పించి; తమ చేతులతో నెమ్మదిగా ఆ వాసుకి శరీరాన్ని నిమిరి (పాము కాబట్టి); 'నీవు తప్ప ఈ పనికి ఎవరయ్యా తగినవారు? ఒప్పుకో' అని అతనిని ఒప్పించి, మందరపర్వతాన్ని బాగా చదునుగా చేసి, వాసుకి పడగల్ని పట్టుకొని శరీరాన్ని ఆ కొండకు చుట్టారు. అమృత సముద్రాన్ని కలశంగా తీర్చారు. బాగా ఆలోచించి పంచెలుపైకి ఎగగట్టి; జుట్లు ముడివేసుకొని, ఆ రెండు గుంపులవారు కలిసి చిలకటం ప్రారంభించారు.

**వ. తదనంతరంబ. 193**

**ప్రతి :** తదనంతరంబు+అ= ఆ తర్వాత...

**తా :** ఆ తరువాత

**క. హరియును దేవానీకము నురగేంద్రుని తలలు పట్ట నుద్యోగింపన్**
**హరిమాయాపరవశులై సురవిమతులు గూడి పలుకఁజొచ్చిరి కడిమిన్. 194**

**ప్రతి :** హరియునున్= హరి; దేవానీకమున్= దేవతల సమూహం; ఉరగేంద్రుని తలలు పట్టన్= వాసుకి పడగలను పట్టుకోవడానికి; ఉద్యోగింపన్= సిద్ధపడగా; హరిమాయా పరవశులు+ఐ= హరిమాయ చేత మోహితులై; సురవిమతులు కూడి= సురద్వేషులైన రాక్షసులు ఒకటై; కడిమిన్= అతిశయంతో; పలుకన్+చొచ్చిరి= ఇలా మాట్లాడసాగారు.

**తా :** శ్రీహరి, దేవతలు ఆ వాసుకి పడగల్ని పట్టుకోవడానికి సిద్ధపడుతుండగా, రాక్షసులంతా చేరి అతిశయంతో ఇలా మాట్లాడసాగారు.

**మత్త. స్వచ్ఛమైన ఫణంబు మీరలు చక్కఁబట్టి మథింపఁగాఁ**
**బుచ్ఛ మేటికి మాకుఁబట్టఁగ? బూరుషత్వము గల్గి మే**
**మచ్ఛమైన తపోబలాఢ్యయనాన్వయంబుల వారమై**
**యిచ్ఛయింతుమె తుచ్ఛవృత్తికి?నిండు మాకు ఫణాగ్రముల్. 195**

**ప్రతి :** మీరలు= మీరంతా; స్వచ్ఛము+ఐన= స్వచ్ఛంగా ఉండే; ఫణంబున్= పడగలను; చక్కన్+పట్టి= చక్కగా పట్టుకొని; మథింపఁగాన్= చిలుకుతుండగా; మాకున్= మాకు; పుచ్ఛము= తోక; పట్టఁగన్+ఏఁటికిన్= పట్టుకోవడం ఎందుకు?; మేము= మేముకూడా; పూరుషత్వము+కల్గి= పౌరుషం కలిగి; అచ్ఛమైన= గొప్పదయిన; తపోబలాఢ్యయనాన్వయంబుల వారము+ఐ= తపస్సు, బలము, చదువు, కులము కలిగిన వాళ్ళమై ఉండి; తుచ్ఛవృత్తికిన్= ఈ నీచమైన పనికి; ఇచ్ఛయింతుము+ఎ= ఇష్టపడతామా!; మాకున్= మాకు; ఫణాగ్రముల్= పడగలు; ఇందు= ఇవ్వండి.

**తా :** "మీరంతా స్వచ్ఛంగా ఉండే పడగల్ని పట్టుకొని చిలుకుతుంటే మేము తోకను పట్టుకోవడమా! మేము కూడా (మీలాగా) పౌరుషం కలవారమే. మీలాగా మేమూ తపస్సు, బలము, చదువు, పౌరుషం కలిగిన వాళ్ళమై ఉండి నీచమైన ఈ పనికి (తోకను పట్టుకోవడానికి) ఏల ఒప్పుకుంటాం? మాకు పడగలే ఇవ్వండి" అన్నారు

**వ. అని పలుకు దనుజులంజూచి. 196**

**ప్రతి :** అని; పలుకు= పలికిన; దనుజులన్= రాక్షసులను; చూచి.

**తా :** అని పలుకు రాక్షసులను చూసి (విష్ణువు ఏమి చేశాడో తరువాతి పద్యంలో ఉంది).

**క. విస్మయముఁబొంది దానవ, ఘస్మరుఁడహిఫణము విడువ గైకొని యసురుల్**
**విస్మితముఖులై యార్చి ర విస్మితముగఁగొనిరి సురలు వీఁకందోఁకన్. 197**

**ప్రతి :** దానవ ఘస్మరుఁడు= దానవ నాశకుడు (శ్రీహరి); విస్మయమున్+పొంది= ఆశ్చర్యంతో; అహిఫణమున్+విడువన్= వాసుకి పడగను వదిలి వేయగా; అసురుల్= రాక్షసులు; కైకొని= గ్రహించినవారై; విస్మితముఖులు+ఐ= నవ్వుతూ; ఆర్చిరి= కేకలు పెట్టారు; సురలు= దేవతలు; అవిస్మితముగన్= విస్మయం లేకుండా; వీఁకన్= దైన్యం/ధైర్యంతో; తోఁకన్= తోకను; కొనిరి= పట్టుకున్నారు.

**తా :** శ్రీహరి ఆశ్చర్యంగా వారిని చూసి సరే అలాగే అంటూ పడగను వదిలివేశాడు. రాక్షసులు నవ్వుతూ గెలిచినట్టు కేకలు పెట్టారు. దేవతలు వినయంగా తోకను పట్టుకున్నారు.

**వ. ఇట్లు సమాకర్షణ స్థానభాగ నిర్ణయంబు లేర్పఱచుకొని దేవతలు పుచ్ఛంబును, బూర్వదేవతలు ఫణంబులుం బట్టి పయోరాశి మధ్యంబునం బర్వతంబు వెట్టి పరమాయత్త చిత్తులై యమృతార్థంబు ద్రచ్చుచున్న సమయంబున. 198**

**ప్రతి :** ఇట్లు; సమాకర్షణ+స్థానభాగ+నిర్ణయంబులు= ఎవరెవరు ఎక్కడెక్కడ నిలబడి లాగాలో నిర్ణయం చేసుకొని; దేవతలు పుచ్ఛంబును= తోకను; పూర్వదేవతలు= రాక్షసులు; ఫణంబులున్= పడగలను; పట్టి; పయోరాశి మధ్యంబునన్= క్షీరసాగరమధ్యలో; పర్వతంబు+పెట్టి= పర్వతాన్ని ఉంచి; పరమ+ఆయత్త+చిత్తులు+ఐ= మిక్కిలి దృఢమైన సంకల్పంతో; అమృత+అర్థంబు= అమృతంకోసం; ద్రచ్చుచున్న సమయంబునన్= చిలుకుతున్న సమయంలో...

**తా :** ఇలా ఎవరెవరు ఏయే చోట నిలబడి లాగాలో నిర్ణయం చేసుకొని, దేవతలు తోకను, రాక్షసులు పడగలను పట్టుకొని, ఆ క్షీరసాగరం మధ్యలో పర్వతాన్ని ఉంచి, మిక్కిలి పూనికతో, అమృతం కోసం చిలుకసాగారు.

**విశే :** 'పూర్వదేవతలు' అంటే దేవతలకన్నా పూర్వులు, పెద్దవారు అనే అర్థం. 'కశ్యపనందనాః' (8-7-5) అని మూలంలో ఉన్నది. కశ్యపప్రజాపతికి దితితో దైత్యులు, అదితితో దేవతలు జన్మించారు. పెద్దవారు కాబట్టి పూర్వదేవతలు అయ్యారు.

**క. విడువిడుఁడని ఫణి పలుకఁగఁగడుభరమున మొదలఁగుదురు గలుగమిఁవెడఁగై**
**బుడ బుడ రవమున నఖిలము వడ వడ వడఁకఁగ మహాద్రి వనధి మునింగెన్. 199**

**ప్రతి :** విడు+విడుఁడు+అని= వదలండి, వదలండి అని; ఫణి= వాసుకి; పలుకఁగన్= అనగా; కడు భరమునన్= మిక్కిలి బరువుగా కావటం వల్ల; మొదలన్= అడుగున; కుదురు+కలుగమిన్= ఆధారం లేకపోవటం వల్ల; వెడఁగు+ఐ= జడత్వము కలిగినదై, అధిక భారమై; బుడబుడరవమునన్= బుడబుడమని ధ్వని చేస్తూ; అఖిలమున్= సమస్తమూ; వడవడ వడఁకఁ గన్= గడగడవణకి పోతుండగా; మహా+అద్రి= ఆ మందరం; వనధిన్= సముద్రంలో; మునింగెన్= మునిగిపోయింది.

**తా :** ఆ సమయంలో వాసుకి గట్టిగా 'వదలండి వదలండి' అని కేకపెట్టాడు. అడుగున ఏ ఆధారమూ (కుదురు) లేకుండా ఉంచటం చేత, అధిక భారానికి ఆ పర్వతం బుడబుడమని ధ్వనిచేస్తూ సముద్రంలో మునిగిపోయింది. దాన్ని చూచి సమస్తమూ గడగడ వణకి పోసాగారు.

**ఉ. గౌరవమైన భారమునఁగవ్వపుఁగొండ ధరింపలేక దో**
**స్సారవిహీనులై యుభయ సైనికులుం గడు సిగ్గుతో నకూ**
**పారతటంబునం బడిరి పౌరుషముంజెడి పాండవేయ! యె**
**వ్వారికి నేరఁబోలు బలవంతపుదైవము నాక్రమింపఁగన్? 200**

**ప్రతి :** పాండవేయ= ఓ పరీక్షిన్మహారాజా!; గౌరవమైన= మిక్కిలి; భారమునన్= బరువువల్ల; కవ్వపున్+కొండన్= ఆ మందరపర్వతాన్ని; ధరింపలేక= మోయలేక; దోస్+సార+విహీనులు+ఐ= భుజబలాలు కోల్పోయినవారై (బలం చాలక); ఉభయ సైనికులున్= దేవదానవ వీరులంతా; పౌరుషమున్+చెడి= పౌరుషం తగ్గిపోయి; కడుసిగ్గుతోన్= మిక్కిలి సిగ్గుపడి; అకూపార తటంబునన్= సముద్రతీరంలో; పడిరి= పడ్డారు; బలవంతపు దైవమున్= ప్రబలమైన విధిని; ఆక్రమింపఁగన్= దాటడానికి; ఎవ్వారికిన్+నేరన్+పోలున్= ఎవరికి సాధ్యమవుతుంది?

**తా :** దాని బరువు చాలా ఎక్కువ కావటం చేత బలవంతులే అయినా దేవదానవుల బలం ఆ పనికి చాలలేదు. వారు పౌరుషహీనులయ్యారు. చాల సిగ్గుపడ్డారు. బలహీనులై సముద్రతీరాన పడిపోయారు. ప్రబలమైన విధిని దాటడానికి ఎవరికీ సాధ్యం కాదు కదా!

**క. వననిధి జలములలోపల, మునిఁగెడి గిరిఁజూచి దుఃఖమునఁజింతాబ్ధిన్**
**మునిఁగెడి వేల్పులఁగనుఁగొని, వనజాక్షుఁడు వార్ధినడుమ వారలు సూడన్. 201**

**ప్రతి :** వనజాక్షుఁడు= కమలాలవంటి కన్నులుగల ఆ శ్రీహరి; వననిధి జలముల లోపలన్= ఆ సముద్రజలాలలో; మునిఁగెడి= మునిగిపోతున్న; గిరిన్+చూచి= కొండను చూసి; దుఃఖమునన్= బాధలో; చింతాబ్ధిన్= చింతాసాగరంలో; మునిఁగెడి వేల్పులన్+కనుఁగొని= మునిగిపోతున్న దేవతల్ని చూసి; వార్ధినడుమన్= సముద్రమధ్యంలో; వారలు+చూడన్= వారందరూ చూస్తుండగా.

**తా :** శ్రీహరి అలా సముద్రజలాల్లో మునిగిపోతున్న ఆ కొండనూ, చింతాసాగరంలో మునిగిపోతున్న దేవతల్ని చూసి, సముద్రమధ్యంలో వారందరూ చూస్తుండగా

## ❖ కూర్మావతార కథా ప్రారంభము ❖

**సీ. సవరనై లక్షయోజనముల వెడలుపై కడుఁగఠోరమునైన కర్పరమును**
**నదనైన బ్రహ్మాండమైన నాహారించు ఘనతరంబగు ముఖగహ్వరంబు**
**సకల చరాచర జంతురాసుల నెల్ల మ్రింగి లోఁగొనునట్టి మేటి కడుపు**
**విశ్వంబుపై వేఱు విశ్వంబు పైఁబడ్డ నాఁగినఁగదలనియట్టి కాళ్ళు**

**తే. వెలికి లోనికిఁజనుదెంచు విపుల తుండ, మంబుజంబులఁబోలెడు నక్షియుగము**
**సుందరంబుగ విష్ణుండు సురలతోడి, కూర్మి చెలువొంద నొక మహాకూర్మమయ్యె. 202**

**ప్రతి :** సవరనై= చదునైనదిగా; లక్షయోజనముల= లక్ష ఆమడల; వెడలుపు+ఐ= వెడల్పు కలిగినదై; కడుఁగఠోరమున్+ఐన= మిక్కిలి కఠినమైన; కర్పరమును= గట్టి డిప్ప; అదనైన బ్రహ్మాండమైనన్+ఆహారించు= తగిన సమయం వస్తే బ్రహ్మాండాన్ని

అంతా మ్రింగగల; ఘనతరంబగు= చాలాపెద్దదైన; ముఖగహ్వరంబు= గుహలాంటి నోరు; సకల చరాచరజంతురాసుల నెల్లన్= లోకంలోని చరాచర జీవరాసులన్నింటినీ; మ్రింగి లోఁగొనునట్టి= లోపలికి మింగి వేయగల్గిన; మేటి కడుపున్= పెద్ద పొట్ట; విశ్వంబుపైన్= ఈ ప్రపంచం మీద; వేఱు విశ్వంబు పైఁ బడ్డన్= మరో ప్రపంచం పడినా; ఆఁగినన్= అలాగే నిలిచిన; కదలని+అట్టికాళ్ళు= కదలనటువంటి కాళ్ళు; వెలికి+లోనికిన్+చనుదెంచు విపులతుండము= బయటికి లోపలికి వచ్చిపోయే పెద్దమూతి; అంబుజంబులన్+పోలెడున్+అక్షియుగము= తామరల్లాంటి కన్నుల జంటయు; సురలతోడి కూర్మిచెలువొందన్= దేవతల మీది ప్రేమ వెల్లడికాగా; సుందరంబుగన్= చాలా అందంగా ఉండగా; విష్ణుండు= శ్రీహరి; ఒక మహాకూర్మము+అయ్యెన్= ఒక పెద్దతాబేలు రూపాన్ని పొందాడు.

**తా :** విష్ణుదేవుడు దేవతలపైన ప్రేమ వెల్లడికాగా, ఒక మహాకూర్మరూపాన్ని ధరించాడు. అది లక్షయోజనాల వెడల్పు కల్గి, మిక్కిలి కఠినమైన డిప్ప కల్గినది. సమయం వస్తే బ్రహ్మాండాన్ని అంతా తినివేయగల పెద్ద గుహలాంటి నోరు దానికి ఉంది. సకల చరాచర జీవరాసులన్నింటినీ తనలో ఇముడ్చుకోగల పెద్ద పొట్ట ఉంది. ప్రపంచంమీద మరో ప్రపంచం పడి ఆగినా కదలని పెద్ద పెద్ద కాళ్ళున్నాయి. లోనికీ బయటకీ వచ్చిపోయే పెద్ద మూతి ఉంది. తామరల్లాంటి కన్నుల జంట ఉంది.

**విశే :** కులపర్వతాలు చాలా పెద్ద ఆకారం కల్గినవి. అందుకే స్వామి లక్ష యోజనాల వెడల్పుగల మరొక ద్వీపమా అన్నట్టు ఆ కొండ కిందికి దూరి దాన్ని మోయడానికి సిద్ధపడ్డాడు. ఇలా సమయాన్ని బట్టి తన స్వరూపాన్ని నిర్ణయించుకోవటమే 'స్వేచ్ఛ'. స్వామివారి అవతారాలన్నీ ఇలా శత్రుసంహారానికి, భక్తరక్షణకు కావలసిన రూపాన్ని యథేచ్ఛగా పొందుతాయి.

**మ. కమఠంబై జలరాశిఁజొచ్చి లఘుముక్తాశుక్తిచందంబునన్**
**నమదద్రీంద్రము నెత్తె వాసుకి మహానాగంబుతో లీలతో**
**నమరేంద్రాదులు మౌళికంపములతో నౌ నౌఁగదే! బాపురే!**
**కమలాక్షా! శరణంబు భూదిశలు నాకాశంబునున్ మ్రోయఁగన్. 203**

**ప్రతి :** శ్రీహరి; కమఠంబు+ఐ= తాబేలుగా; జలరాశిన్+చొచ్చి= ఆ సముద్రంలో ప్రవేశించి; లఘుముక్తాశుక్తి= తేలికైన ముత్తెపుచిప్ప; చందంబునన్= విధంగా; నమత్+అద్రి+ఇంద్రమున్= అణగిపోయి ఉన్న మందరపర్వతాన్ని (శ్రేష్ఠమైన పర్వతాన్ని); వాసుకి మహానాగంబుతోన్= మహాసర్పమైన వాసుకితో పాటు; (దానిని చూసి); అమర+ఇంద్ర+ఆదులు= దేవేంద్రుడు మొదలైన దేవతలు; మౌళికంపములతోన్= తలలు ఊపుతూ; ఔను+ఔన్+కదే= బాగుంది, బాగుంది కదా!; బాపురే= అమ్మ బాబోయి!; కమలాక్షా= ఓ హరీ; శరణంచు= శరణు అంటూ; భూదిశలు= భూమి, దిక్కులు; ఆకాశంబునున్= ఆకాశమంతటా; మ్రోయఁగన్= మారుమోగగా; లీలతోన్+ఎత్తెన్= సులభంగా పైకి లేవదీశాడు.

**తా :** తాబేలుగా మారిన శ్రీహరి సముద్రంలోకి తేలికైన ఒక ముత్తెపు చిప్పలాగా ప్రవేశించాడు. అవలీలగా అడుగున ఉన్న మందరపర్వతాన్ని, మహాసర్పమైన వాసుకిని ఒకేసారి పైకెత్తాడు. దీన్ని చూసి ఇంద్రాది దేవతలు తలలు ఊపుతూ "బాగు! బాగు! అమ్మ బాబోయి! శ్రీహరీ! నీకే శరణు" అంటూ నమస్కారాలు పెడుతూ జయజయధ్వానాలు చేశారు. ఆ ధ్వనులు భూమిలో, దిక్కులలో, ఆకాశంలో మారుమోగాయి.

**వ. ఇవ్విధంబున. 204**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** ఈ విధంగా

**క.** **తరిగాంఁడ్రలోన నొకఁడఁట, తరికడవకుఁగుదురు నాఁక త్రాడఁట చేరుల్;**
**దరి గవ్వంబును దా నఁట హరి హరి! హరిచిత్రలీల హరియే యెఱుఁగున్. 205**

**ప్రతి :** తరిగాంఁడ్రలోనన్= చిలికేవారిలో; ఒకఁడు+అఁట= ఒకడంట; తరి కడవకున్+కుదురున్= మజ్జిగ కడవకు కుదురూ; ఆఁక+త్రాడు+అఁట= అడ్డగించే తాడుకూడానంట; చేరుల్= చిలికేతాడూ ఆయనేనట; తరి+కవ్వంబునున్+తానఁట= చిలికే కవ్వం కూడా అతడేనంట; హరిహరి!= ఆహా!; (అహోహో!) హరి చిత్రలీల= శ్రీహరి యొక్క విచిత్రమైన లీల; హరియే+ఎఱుఁగున్= హరికే తెలుసు.

**తా :** శ్రీహరి చిలికేవారిలో తానూ ఒకడయ్యాడు. సముద్రమనే మజ్జిగ కడవకు కుదురు తానే కవ్వమూ తానే – రాట కట్టేతాడూ కవ్వపు తాడూ తానే. ఆహోహ్; శ్రీమహావిష్ణువు లీలలు అతనికే తెలుసు.

**విశే :** మునుపు వివరించినట్లు పోతనగారికి శబ్దానుప్రాస పట్ల మక్కువ ఎక్కువ. తరి= తరుచు (క్రియ) మజ్జిగ కుండ (చిలుకు) చిలికే కవ్వం; ఈ మూడు అర్థాలను చమత్కారంగా వాడుకోవటం ఆయనకు ఇష్టం.

ఆఁకత్రాడు – అంటే కవ్వాన్ని తగిలించడానికి రాటకు కట్టేతాడు

చేరులు – కవ్వానికి కట్టేతాడు

హరి అనంతరూపాలు కల్గినవాడు కాబట్టి అన్నిటా ఆయనే ఉన్నాడన్న విషయాన్ని 'తరి' శబ్దాన్ని ఆధారంగా చమత్కరిస్తున్నాడు కవి.

**ఆ.** **జలధిఁగడవ సేయ శైలంబుఁగవ్వంబు, సేయ భోగిఁద్రాడుసేయఁదరువ**
**సిరియు సుధయుఁబడయ శ్రీవల్లభుఁడు దక్క నొరుఁడు శక్తిమంతుఁడొకఁడు గలఁడె? 206**

**ప్రతి :** జలధిన్+కడవ+చేయన్= సముద్రాన్ని కడవగా చేయుటకు; శైలంబున్+కవ్వంబు+చేయన్= పర్వతాన్ని కవ్వంగా చేయుటకు; భోగిన్= పామును (వాసుకిని); త్రాడుచేయన్= త్రాడుగా చేయుటకు; తరువన్= చిలకడానికీ; సిరియున్+సుధయున్+పడయన్= శ్రీని, అమృతాన్ని పొందడానికీ; ఒకఁడు= ఒక్క; శ్రీవల్లభుఁడు+తక్కన్= శ్రీమహావిష్ణువు తప్ప; శక్తిమంతుఁడు+ఒకఁడు= ఇంకొక శక్తిమంతుడు; కలఁడె= ఉన్నాడా?

**తా :** సముద్రాన్ని కడవగా, పర్వతాన్ని కవ్వంగా చేసి చిలకడానికి; లక్ష్మిని, అమృతాన్ని సంపాదించడానికి ఒక్క శ్రీమహావిష్ణువు తప్ప మరొక శక్తిమంతుడు ఉన్నాడా!

**ఆ.** **గొల్లవారి బ్రదుకు గొఱఁతన వచ్చునే, గొల్లరీతిఁబాలకుప్పఁద్రచ్చి**
**గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుండు చేటు లేని మందు సిరియుఁగనిరి. 207**

**ప్రతి :** గొల్లవారిబ్రదుకు= గొల్లల బతుకు; కొఱఁత+అనవచ్చునే= తక్కువది అని చెప్పగలమా; గొల్లరీతిన్= గొల్లవారిలాగా; పాలకుప్పన్+త్రచ్చి= పాలసముద్రాన్ని చిలికి; సురలు= దేవతలు; గొల్లలైరి= గొల్లవారయ్యారు; విష్ణుండు= శ్రీమహావిష్ణువు; గొల్లయ్యెన్= గొల్ల అయ్యాడు; చేటులేని మందున్= మృత్యువులేని ఔషధం – అమృతాన్ని; సిరియున్= లక్ష్మిని; కనిరి= పొందారు.

**తా :** గొల్లల బ్రతుకు తక్కువైందేమీ కాదు. ఎందుకంటే పాలసముద్రాన్ని గొల్లల లాగానే దేవతలు, హరి చిలికారు. అంచేత దేవతలూ గొల్లలయ్యారు. శ్రీహరి తానూ గొల్ల అయ్యాడు. అమృతాన్ని దేవతలు; లక్ష్మిని శ్రీహరి పొందారు.

**వ. ఇట్లు సురాసుర యూథంబులు హరిసనాథంబులయి కవచంబులు నెట్టంబులు వెట్టికొని, పుట్టంబులు పిరిచుట్టు సుట్టికొని, కరంబులు కరంబుల నప్పళించుచు, భుజంబులు భుజంబుల నొరయుచు, లెండు లెండు దరువఁదొడంగుండు రండని యమందగతిం బెరుఁగుం ద్రచ్చు మందగొల్లల చందంబున మహార్ణవమధ్యంబున మంథాయమాన మందర మహీధర విలగ్నభోగి భోగాద్యంతంబులం గరంబులం దెమల్చుచుఁ, బెనుబొబ్బలం బ్రహ్మాండ కటాహంబు నిర్భరంబయి గుబ్బుగుబ్బని యురలు కొండకవ్వంబుగుత్తి జిఱ జిఱం దిరుగు వేగంబున ఛటచ్ఛటాయమానంబులయి బుగులు బుగుళ్ళను చప్పు ళ్లుప్పరం బెగసి లెక్కకు మిక్కిలి చుక్కల కొమ్మల చెక్కుల నిక్కలువడు మిసిమి గల మీఁది మీఁగడపాల తేటనిగ్గుఁదుంపరల పరంపరల వలన నిజకరక్రమ క్రమాకర్షణ పరిభ్రాంత ఫణి ఫణాగర్భ సముద్భూత నిర్భర విష కీలి కీలజాలంబుల నప్పటప్పటికి నుప్పతిల్లిన దప్పిం గొండొక మందగతిం జెందక యకూపార వేలాతట కుటజ కుసుమగుచ్ఛ పిచ్ఛిల స్వచ్ఛ మకరంద సుగంధి గంధవహావహనంబునం గ్రొంజెమట నీటి పెను వఱదగము లొడళ్ల నిగుర నొండొరులం బరిహసించుచుఁబేరువాడి విలసించుచు, మేలువే లని యుగ్గడించుచు, గాదు కాదని భంగించుచు, నిచ్చ మెచ్చని మచ్చరంబు వలన వనధి వలమాన వైశాఖ వసుంధరాధర పరివర్తన సముజ్జనిత ఘుమఘుమారావంబును, మథనగుణాయమాన మహాహీంద్రప్రముఖ ముహుర్ముహురుచ్చలిత భూరి ఘోర ఫూత్కార ఘోషంబును, గులకుధర పరిక్షేపణ క్షోభిత సముల్లంఘన సమాకులితంబులై వెఱచఱచి గుబురుగుబురులై యొరలు కమఠ కర్కట కాకోదర మకర తిమితిమింగిల మరాళచక్రవాక బలాహకభేక సారసానీకంబుల మొఱలునుం గూడికొని ముప్పిరిగొని, దనుజ దివిజ భటాట్టహాస తర్జన గర్జన ధ్వనులు నలుపురియై మొత్తినట్లైన దశదిగంతభిత్తులును, బేఁటెత్తి పెల్లగిలం ద్రుళ్ళుచుఁ గికురు పొడుచుచు నొకఁడొకనికంటె వడియునుం, గడుపునుం గలుగఁద్రచ్చుచుఁబంతంబు లిచ్చుచు సుధాజననంబుఁజింతించుచు నూతనపదార్థంబులకు నెదుళ్లు సూచుచు నెంతదడవు ద్రత్తమని హరి నడుగుచు నెడపడని తమకంబుల నంతకంతకు మురువు డింపక త్రచ్చు సమయంబున. 208**

**ప్రతి :** ఇట్లు; సురాసురయూథంబులు= దేవదానవ సముదాయం; హరిసనాథంబులు+అయి= శ్రీహరి సహాయంతో; కవచంబులన్= తగిన కవచాలు; నెట్టంబులు= దట్టీలు; పెట్టికొని= ధరించి; పుట్టంబులు= పంచెలను; పిరిచుట్టు+చుట్టికొని= తలలపై మెలిపెట్టి చుట్టుకొని; కరంబులు కరంబులన్ అప్పళించుచు= చేతులు చేతులు చరుచుకొంటూ; భుజంబులు భుజంబుల నొరయుచు= భుజాలు భుజాలు రాసుకుంటూ; లెండు లెండు= 'లేవండి లేవండి'; తరువన్+తొడంగుండు+ రండు+అని= 'చిలుకడానికి మొదలుపెట్టండి, రండి' అంటూ (హెచ్చరిస్తూ); అమందగతిన్= శీఘ్రంగా; పెరుఁగున్+త్రచ్చు= పెరుగు చిలికే; మందగొల్లల చందంబునన్= గొల్లపల్లెలోని గోపాలకుల్లాగా; మహార్ణవమధ్యంబునన్= క్షీరసాగర మధ్యంలో; మంథాయమాన= కవ్వంగా ఉన్న; మందర మహీధర= మందరపర్వతానికి; విలగ్న= చుట్టబడిన; భోగి= పాము (వాసుకి యొక్క); భోగ+ఆద్యంతంబులన్= మొదలు, చివరలలో (తలా తోకలను); కరంబులన్+తెమల్చుచున్= చేతుల్ని ఊచుతూ;

పెనుబొబ్బలన్= పెద్ద అరుపులతో; బ్రహ్మాండకటాహంబు= బ్రహ్మాండం కప్పు; నిర్భరంబయి= నిండిపోయి; గుబ్బుగుబ్బని+ఉరలు= గుబ్బుగుబ్బుమని తిరిగే; కొండ కవ్వంబు గుత్తి= కొండ అనే కవ్వం గుత్తి; జిఱ జిఱన్+తిరుగు వేగంబునన్= గిరగిరమంటూ తిరిగే వేగానికి; ఛట+ఛటాయమానంబులయి= చిటచిటలాడుతూ; బుగులు బుగుల్లను= బుగులు బుగులుమనెడి; చప్పుళ్లు= శబ్దాలు; ఉప్పరంబు+ఎగసి= ఆకాశం నిండి; లెక్కకు మిక్కిలి= లెక్కకుమించిన; చుక్కల కొమ్మల చెక్కులన్+ఇక్కలు+పడు= చుక్కలనెడి స్త్రీల చెక్కులలో ప్రతిఫలించే; మిసిమిగల= కాంతిగల; మీఁది మీఁగడపాల= పైకి తేరిన మీగడపాల; తేఁటనిగ్గు+తుంపరల పరంపరలవలన= స్వచ్ఛమైన నీటి తుంపరల సముదాయంచేత; నిజకరక్రమక్రమాకర్షణ= తమ చేతుల చేత క్రమక్రమంగా లాగటం వల్ల; పరిభ్రాంత= తిరుగుతున్న; ఫణిఫణాగర్భ= ఆ వాసుకి పడగలలో నుండి; సముద్భూత= పుట్టిన; నిర్భర= నిండిన; విషకీలి కీలజాలంబులన్= విషాగ్ని మంటల వల్ల; అప్పటప్పటికి= అప్పటికప్పుడు; ఉప్పతిల్లిన= పుట్టిన; దప్పిన్= దప్పికచేత; కొండొక మందగతిన్+చెందక= ఏ మాత్రం అలసట పొందక (వదలక); అకూపార= సముద్ర; వేలాతట= గట్టుమీద తీరంలో; కుటజ కుసుమగుచ్ఛ= కొండమల్లె పూల గుత్తులనుంచి; పిచ్ఛిల= పేరిన; స్వచ్ఛమకరంద= స్వచ్ఛమైన మకరందం యొక్క; సుగంధి గంధవహ+ఆవహనంబునన్= సుగంధాలను మోసుకువచ్చే గాలులయొక్క స్పర్శచేత; క్రొంజెమట+నీటి+పెను+వఱదగములు= అప్పటికప్పుడు పుట్టిన చిరుచెమటల ప్రవాహాలు; ఒడళ్ళన్+ఇగురన్= శరీరాల్లో ఇంకిపోగా; ఒండొరులన్= ఒకరినొకరు; పరిహసించుచున్= గేలిచేస్తూ; పేరువాడి విలసించుచున్= గొప్పలు చెప్పుకుంటూ; మేలుమేలని ఉగ్గడించుచున్= భళీభళీ అంటూ; కాదు కాదని భంగించుచున్= అలా కాదు ఇలా అంటూ; ఇచ్చమెచ్చని మచ్చరంబు వలనన్= అసూయతో పోటీపడి; వనధి+వలమాన+వైశాఖ+వసుంధరాధర= సముద్రంలో అటు ఇటువైపుల తిరుగుతున్న కవ్వమైనపర్వతం యొక్క; పరివర్తన= తిరుగుళ్ళవల్ల; సముజ్జనిత= బయటకి పుట్టుకొని వచ్చిన; ఘుమఘుమారావంబును= ఘుంఘుం అనే శబ్దమూ; మథనగుణాయమాన= కవ్వపుతాడైన; మహా+అహీంద్ర+ప్రముఖ= ఆ వాసుకి అనే మహాసర్పం నోటినుండి; ముహుః+ముహుః+ఉచ్చలిత= మాటిమాటికి చేయబడుతున్న; భూరిఘోరఫూత్కార ఘోషంబును= మిక్కిలి పెద్దదైన భయంకరమైన ఫూత్కార శబ్దమూ (బుసబుసలు); కులకుధర= కులపర్వతంయొక్క; పరిక్షేపణ= తిరగడం వల్ల; క్షోభిత= కలగుండు పడిన; సముల్లంఘన సమాకులితంబులు+ఐ= బాగా ఎగరటానికి వీలుకాక భయపడినవై; వెఱచఱచి గుబురు గుబురులు+ఐ= భయపడి గుంపులు గుంపులుగా; ఒరలు= పక్కలకు ఒదిగిపోతున్న; కమఠ= తాబేళ్ళు; కర్కట= ఎండ్రకాయలు; కాకోదర= పాములు; మకర= మొసళ్ళు; తిమి= పెద్దచేపలు; తిమింగలాలు= అంతకంటే పెద్దచేపలు; మరాళ= హంసలు; చక్రవాక= చక్రవాక పక్షులు; బలాహక= కొంగలు; భేక= కప్పలు; సారస= బెగ్గురు పక్షులు; అనీకంబులు= వీటి గుంపుల; మొఱలునున్= ఆర్తనాదాలూ; కూడికొని= కలిసి పోయి; ముప్పిరిగొని= మూడింతలుకాగా; దనుజ+దివిజ+భట+అట్టహాస= సురాసురవీరులు చేస్తున్న అట్టహాసాలు; తర్జన= హెచ్చరికలు; గర్జన+ధ్వనులు= గర్జనలు (కేకలు); నలుపురి+ఐ= నాలుగింతలు కాగా; మొత్తినట్లు+అయిన= మోదినట్టుకాగా; దశదిగంత భిత్తులును= పది దిక్కుల గోడలు; పేఁటెత్తి= పేట్లు వారి (పగుళ్ళు వచ్చి); పెల్లగిలన్+త్రుళ్ళుచున్= పగిలిపోవునట్లుగా సంతోషిస్తూ; కికురు పొడుచుచున్= ఒకరినొకరు మోసగించుకొంటూ; ఒకఁడు+ఒకనికంటెన్= ఒకడినిమించి ఇంకొకడు; వడియునున్= వేగమూ; కడుపునున్= ఈర్ష్యా; కలుగన్= కలుగగా; త్రచ్చుచున్= చిలుకుతూ; పంతంబు లిచ్చుచున్= పౌరుషంతో మాట్లాడుతూ; సుధాజననంబున్+చింతించుచున్= అమృతం ఎప్పుడు పుడుతుందా అని ఎదురుచూస్తూ; నూతన పదార్థంబులకున్+ఎదుళ్లు+చూచుచున్= కొత్త వస్తువులు ఏవి వస్తాయా అని ఎదురు చూస్తూ; ఎంత తడవు+త్రత్తము+అని= ఇంకా ఎంతసేపు చిలుకుదాం అని;

హరిన్+అడుగుచున్= శ్రీహరిని అడుగుతూ; ఎడపడని తమకంబులన్= ఎడతెగని ఆశలతో; అంతకంతకు= మించిన ఆశతో; మురువు డింపక= పట్టినపట్టు వదలకుండా; త్రచ్చు సమయంబునన్= చిలుకుతుండగా...

**తా :** ఈ విధంగా విష్ణువు సహాయంతో సముద్ర మథనం ప్రారంభించిన దేవతలు రాక్షసులు కవచాలు ధరించారు. దట్టీలు కట్టుకొన్నారు. బట్టల్ని పిరిచుట్లు చుట్టుకున్నారు. చేతులు చేతులు చరుచుకున్నారు. భుజాలు భుజాలూ రాసుకున్నారు – "లేవండి. లేవండి. రండి. చిలకటం మొదలు పెట్టండి" అంటూ హెచ్చరికలు చేసారు. వేగంగా పెరుగు చిలికే గొల్లపల్లె గోపాలకుల్లాగా సముద్రం నడుమ కవ్వంగా ఉండే మందర పర్వతానికి తాడైన పాము తలా తోకా పట్టుకొని మథింపసాగారు. వారి పెద్ద పెద్ద కేకలతో బ్రహ్మాండం నిండిపోయింది. గుబగుబమని శబ్దిస్తూ కవ్వపు కొండ గిరగిరమని తిరుగుతుండగా; దాని వేగానికి 'భుగభుగ' మనే శబ్దాలు ఆకాశం నిండాయి. లెక్కకు మిక్కిలిగా ఉన్న చుక్కలతో ప్రతిఫలిస్తూ ఆ పాలమీగడ తేటలోని కాంతి నిండిన తుంపరల పరంపరలు పైకి ఎగిరాయి. తమ చేతుల్తో గట్టిగా పట్టుకొని క్రమక్రమంగా లాగుతున్న తిరుగుతున్న ఆ వాసుకి పడగలలో నుండి పుట్టిన భయంకరమైన విషాగ్ని కీలలవల్ల వారికి దాహం వేసింది. అయినా పట్టు వదలకుండా వారు మథనం కొనసాగించారు. సముద్రతీరంలోని కొండమల్లెపూల గుత్తులనుండి వెదజల్లబడుతున్న స్వచ్ఛమైన మకరందాల గుబాళింపును మోసుకువస్తున్న పిల్లగాలులు వారి దేహాలపై పట్టిన చెమటల్ని తాకగానే ఆ చెమటలు ఇగిరిపోయాయి. ఒకరినొకరు పరిహసించుకొంటూ, గొప్పలు చెప్పుకొంటూ, భళిభళీ అని మెచ్చుకుంటూ, ఇలాకాదు అలా అని అంటూ; అసూయాగ్రస్తులై ఒకరిమీద ఒకరు స్పర్థతో సముద్రంలో అటూ ఇటూ ఊగుతున్న మందరపర్వతం యొక్క భ్రమణం వల్ల పుట్టిన ఘుంఘుం అనే శబ్దమూ; ఆ వాసుకి నోటినుండి బయట పడుతున్న భయంకరమైన బుసబుసలు; పెద్దదైన ఆ పర్వతాన్ని సముద్రంలో ఉంచి చిలకటం వల్ల గుంపులు గుంపులుగా ఒదిగిపోతూ, పైకి ఎగరడానికి వీలుకాక భయపడిన తాబేళ్ళు, ఎండ్రకాయలు, పాములు, మొసళ్ళు, పెద్దచేపలు, తిమింగలాలు, హంసలు, చక్రవాకాలు, కొంగలు, కప్పలు, బెగ్గురుపక్షులు చేస్తున్న ఆర్తనాదాలూ, కలిసి మూడింతలుకాగా; సురాసురవీరులు చేస్తున్న అట్టహాసాలు, గర్జనలు, పెడబొబ్బలు నాల్గింతలు కాగా, పది దిక్కుల గోడలు మొత్తినట్లు పేట్లురేగి రాలిపోయాయి. ఒకడిని మించి మరొకడు వేగంగా చిలుకుతూ అసూయతో పౌరుషాలు పలుకుతున్నారు. అమృతం కోసం ఉబలాట పడసాగారు. కొత్త వస్తువుల పుట్టుక కోసం ఎదురుచూస్తున్నారు. 'ఇంకా ఎంతసేపు చిలుకుదాం' అని శ్రీహరిని అడిగారు. ఎడతెగని ఆశతో పట్టినపట్టు వదలకుండా మథింపసాగారు.

**క. అప్పాలవెల్లిలోపల, నప్పటి కప్పటికి మందరాగము దిరుగం**
**జప్పుడు నిండె నజాండము, సెప్పెడి దే మజుని చెవులు సిందఱగొనియెన్. 209**

**ప్రతి :** ఆ+పాలవెల్లి లోపలన్= ఆ క్షీరసాగరంలో; అప్పటికిన్+అప్పటికిన్= నిరంతరంగా; మందర+అగము= మందరపర్వతం; తిరుగన్= గిరగిరమని తిరుగుతుండగా; చప్పుడు= ఆ ధ్వని; అజాండము+నిండెన్= బ్రహ్మాండమంతా నిండిపోయింది; చెప్పెడిదేమి?= ఇక ఏం చెప్పాలి!; అజుని+చెవులు+చిందఱ+కొనియెన్= బ్రహ్మదేవుడి చెవులు గింగురుమన్నాయి.

**తా :** ఆ క్షీరసాగరంలో అలా నిరంతరం గిరగిరమంటూ ఆ పర్వతం తిరగగా తిరగగా ఆ శబ్దం బ్రహ్మాండ భాండమంతా నిండిపోయింది. బ్రహ్మదేవుడి చెవులు కూడా గింగురుమన్నాయి. ఇంక ఏం చెప్పాలి?

**వ. అంత నప్పయోరాశిమధ్యంబున. 210**

**ప్రతి :** అంతన్= అప్పుడు; ఆ+పయోరాశి= ఆ సముద్రం; మధ్యంబునన్= మధ్యలో...

**తా :** ఆ సమయంలో ఆ సముద్రం మధ్యలో

**క. ఎడమఁగుడి మునుపు దిరుగుచుఁగుడి నెడమను వెనుకఁదిరుగుఁ గులగిరి గడలిం**
**గడ లెడల సురలు నసురులుఁదొడి తొడి ఫణి ఫణము మొదలుఁదుదియును దిగువన్. 211**

**ప్రతి :** సురలున్+అసురులున్= దేవతలు రాక్షసులు, కడలు+ఎడలన్= దిక్కులు మార్చుకొని; తొడితొడి= శీఘ్రంగా; ఫణిఫణమున్= పాము పడగను; తుదియునున్= తోకను; తిగువన్= పట్టుకొని లాగగా; కులగిరి= ఆ పర్వతం; మునుపు= ముందు (మొదట); ఎడమన్+కుడిన్= ఎడమ వైపునుండి కుడి వైపునకు; వెనుకన్= ఆ తరువాత; కుడిన్+ఎడమను= కుడి నుండి ఎడమ వైపునకు; తిరుగున్= తిరుగుతుంది; (అప్పుడు)...

**తా :** సర్పరాజు తోక తల పట్టుకొని దేవతలు రాక్షసులు చోట్లు మారుతూ తొందర తొందరగా లాగుతూండగా మంధరపర్వతం సముద్రంలో ఎడమనుండి కుడికి తరువాత కుడినుండి ఎడమకు తిరుగసాగింది.

**క. వడిగొని కులగిరిఁదరువఁగ, జడనిధి ఖగమకరకమఠఝషఫణిగణముల్**
**సుడివడుఁదడఁబడుఁ గెలఁకులఁబడు భయపడి నెగసి బయలఁబడు నురలిపడున్. 212**

**ప్రతి :** జడనిధిన్= ఆ సముద్రంలో (జలం=జడం) ఉండేటటువంటి; ఖగ= పక్షులు; మకర= మొసళ్ళు; కమఠ= తాబేళ్ళు; ఝష= చేపలు; ఫణిగణముల్= పాముల గుంపులు; (ఇలా); వడిగొని= పూనికతో శీఘ్రంగా; కులగిరిన్= కులపర్వతాన్ని ఉంచి; తరువఁగన్= చిలకగా; సుడివడున్= సుళ్ళుపడి చీకాకుపడ్డాయి; తడఁబడున్= తొట్రుపడ్డాయి; కెలఁకులన్+పడున్= బయటపడ్డాయి; భయపడి= భయపడిపోయి; నెగసి= పైకి లేచి; బయలన్+ పడున్= గట్టుమీద పడతాయి; ఉరలిపడున్= పొర్లిపడుతున్నాయి.

**తా :** అలా ఆ పర్వతాన్ని ఉంచి సముద్రాన్ని చిలకగా అందులో ఉన్న పక్షులు, తాబేళ్ళు, మొసళ్లు, పాములు సుళ్ళుపడి చీకాకు పడ్డాయి. తొట్రుపడ్డాయి. గట్లపై పడ్డాయి. ఎగిరి బయటపడ్డాయి. పొర్లిపడుతున్నాయి.

**క. అమరాసురకరవిపరి, భ్రమణధరాధరవరేంద్ర భ్రమణంబును దాఁ**
**గమఠేంద్రు వీఁపు తీఁటను శమియింపఁగఁజాలదయ్యె జగతీనాథా! 213**

**ప్రతి :** జగతీనాథా= ఓ రాజా!; అమర+అసుర= దేవతల రాక్షసుల యొక్క; కరవిపరి భ్రమణ= చేతులచేత తిప్పబడుతున్న; ధరాధరవర+ఇంద్ర= పర్వతాలలో శ్రేష్ఠమైన మందరపర్వతం యొక్క; భ్రమణంబును= రాపిడి; తాన్= అది; కమఠేంద్రు వీఁపు తీఁటను= తాబేలు యొక్క వీపు దురదను; శమియింపఁగన్+చాలదు+అయ్యెన్= పోగొట్టలేకపోయింది.

**తా :** ఓ రాజా! అలా దేవతలు, రాక్షసులు తమ తమ చేతుల్తో తిప్పడం వల్ల తిరుగుతున్న ఆ మందరపర్వతం పుట్టించిన రాపిడివల్ల ఆ కూర్మరాజు వీపు దురద ఏమాత్రం తగ్గలేదు.

**వ. తదనంతరంబ. 214**

**ప్రతి :** తదనంతరంబు+అ= ఆ తరువాత...

**తా :** ఆ తరువాత

క. ఆలోల జలధి లోపల నాలో నహి విడిచి సురలు నసురులుఁబఱవం
గీలా కోలాహలమై హాలాహల విషము పుట్టె నవనీనాథా! **215**

**ప్రతి :** అవనీనాథా= ఓ రాజా!; ఆలోన్= అంతలోనే; సురలున్+అసురులున్= దేవతలు రాక్షసులు; అహిన్+విడిచి; వాసుకిని వదలిపెట్టి; పఱవన్= పరుగెత్తిపోవునట్లుగా; ఆలోల= అల్లకల్లోలమైన; జలధిలోపలన్= సముద్రంలో నుండి; కీలాకోలాహలము+ఐ= అగ్నిజ్వాలల కోలాహలంలో; హాలాహలవిషము పుట్టెన్= హాలాహలమనే విషం పుట్టింది; (ఎలా పుట్టిందంటే)

**తా :** అంతలోనే, అల్లకల్లోలమైన ఆ సముద్రంలోనుండి హాలాహలమనే విషం కోలాహలమైన అగ్ని జ్వాలలతో బయటపడింది. దాన్ని చూసి భయపడి సురాసురులు వాసుకిని వదలిపెట్టి పారిపోయారు.

వ. అదియునుం బ్రళయకాలాభీల ఫాలలోచన లోచనానల శతంబు చందంబున నమందంబై విలయ దహన సహస్రంబు కైవడి వడియై, కడపటి పట్టపగలింటి వెలుంగుల లక్ష తెఱంగున దుర్లక్షితంబై, తుదిరేయి వెలింగిన మొగిలు గముల వలనుం బడు బలు పిడుగుల వడువున బెడిదంబై, పంచభూతంబులుం దేజోరూపంబులైన చాడ్పున దుస్సహంబై, భుగ భుగాయమానంబులైన పొగలును, జిటజిటాయమానంబులైన విస్ఫులింగంబులును, ధగధగాయ మానంబులైన నెఱమంటలును గలిగి మహార్ణవ మధ్యంబున మందర నగం బమంథరంబుగం దిరుగునెడ జనియించి పటపటాయమానంబై నింగికిం బొంగి, దిశలకుం గేలుసాఁచి బయళ్లు ప్రబ్బికొని, తరిగవ్వంపుఁగొండ నండ గొనక, నిగిడి కడల నలుగడలకుం బఱచి, దరుల కుతికి, సురాసుర సముదయంబులన్ దరికొని, గిరివర గుహాగహ్వరంబుల సుడివడక, కులశిఖరి శిఖరంబుల నెరగలివడి, గహనంబుల దహించి, కుంజ మంజరీ పుంజంబుల భస్మంబు సేసి, జనపదంబు లేర్చి, నదీ నదంబు లెరియించి, దిక్కుంభి కుంభములు నిక్కలు వడ నిక్కి, తరణితారామండలంబులపై మిట్టించి, మహర్లోకంబు దరికొని, యుపరిలోకంబునకు మాఱు గొనలిడి. సుడివడి, ముసరుకొని, బ్రహ్మాండ గోళంబు చిటిలిపడన్ దాఁటి పాతాళాది లోకంబులను వ్రేళ్లువాఱి, సర్వలోకాధికంబై శక్యంబు గాక యెక్కడఁ జూచినం దానయై, కురంగంబు క్రియం గ్రేళ్లుఱుకుచు భుజంగంబు విధంబున నొడియుచు, సింగంబుభంగి లంఘించుచు, విహంగంబు పగిది నెగయుచు, మాతంగంబు పోలికి నిలువంబడుచు, నిట్లు హాలాహల దహనంబు జగంబులం గోలాహలంబు సేయుచున్న సమయంబున, మెలకు సెగల మిడుక జాలక నీఱైన దేవతలును, నేలంగూలిన రక్కసులును, డుల్లిన తారకలును గీటడంగిన కిన్నర మిథునంబులును, గమరిన గంధర్వ విమానంబులును, జీకాకుపడిన సిద్ధ చయంబులును, జిక్కుపడిన గ్రహంబులును, జిందఱవందఱ లయిన పర్ణాశ్రమంబులును, నిగిరిపోయిన నదులును, నింకిన సముద్రంబులును, గాలిన కాననంబులును, బొగిలిన పురంబులును బొనుఁగు పడిన పురుషులును బొక్కిపడిన పుణ్యాంగనా జనంబులును, బగిలిపడిన పర్వతంబులును, భస్మంబులైన ప్రాణి సంఘంబులును, వేఁగిన లోకంబులును, వివశలైన దిశలును, నొద్ద గెడవులైన భూజ చయంబులును, నఱవఱలైన భూములునునై, యకాల విలయకాలంబై తోఁచుచున్న సమయంబున. **216**

**ప్రతి :** అదియునున్= ఆ విషం; ప్రళయకాల+ఆభీల= ప్రళయకాలంలోని భయంకరమైన; ఫాలలోచన= నుదుట నేత్రం కల్గిన రుద్రుని యొక్క; లోచన+అనల+శతంబు+చందంబునన్= కంటినుండి పుట్టిన అగ్నికి నూరురెట్లుగా; అమందంబు+ఐ= గాఢమై; విలయ+దహన+సహస్రంబుకైవడి= కల్పాంతకాలంలో పుట్టే అగ్నికి వెయ్యిరెట్లు అధికంగా; కడపటి+పట్ట+ పగలింటి+వెలుంగుల= ప్రళయకాలం నాటి సూర్యుని వెల్తురుకు; లక్ష తెఱంగునన్= లక్షరెట్లు అధికంగా; దుర్లక్షితంబు+ఐ= తేరిపారి చూడటానికి వీలులేనిదై; తుదిరేయి వెలింగిన= ప్రళయరాత్రిలో వెలిగే; మొగిలు గముల వలనుంబడు= మేఘాల సమూహాలనుండి వెలువడే; పలు పిడుగుల వడువునన్= అనేకములైన పిడుగుల్లాగా; బెడిదంబై= భయంకరమైనదై; పంచభూతంబులున్+తేజోరూపంబులైన చాడ్పునన్= పంచభూతాలు తేజోరూపాన్ని పొందిన విధంగా; భుగభుగాయ మానంబులైన పొగలునున్= భుగభుగమనే పొగలతో; చిటచిటాయమానంబులైన= చిటచిటమనే శబ్దాలతో కూడిన; విస్ఫులింగములును= నిప్పుకణాలతో; ధగధగాయమానంబులు+ఐన= ధగధగ మండుతున్న; నెఱమంటలును+ కలిగి= పెద్దపెద్ద మంటలతో; మహార్ణవమధ్యంబునన్= మహాసముద్రం నడుమ; మందరనగంబు= మందరపర్వతం; అమంథరంబుగన్+తిరుగునెడన్= అతివేగంగా తిరుగుతున్నపుడు; జనియించి= పుట్టి; పటపటాయమానంబు+ఐ= పటపటమంటూ; నింగికిన్+పొంగి= ఆకాశానికి ఎగిసి; దిశలకున్= దిక్కులవైపు; కేలు+చాఁచి= చేయిచాచి (వ్యాపించి); బయళ్ళు= బయళ్ళలో; ప్రబ్బికొని= నిండి; తరిగవ్వంపు కొండన్+అండన్+కొనక= మందరపర్వతాన్ని అతిక్రమించి; నిగిడి= నిక్కి; కడల నలుగడలకున్+పఱచి= సముద్రంలో నాలుగువైపులా పాకి; దరులకున్+ఉరికి= గట్లకు లంఘించి; సురాసుర సముదయంబులన్= దేవతల్ని రాక్షసుల్ని; దరికొని= సమీపించి (వేడి తగిలించి); గిరివర= కొండలలోని; గుహా గహ్వరంబులన్= గవులలో; సుడి+పడక= సుళ్ళుపడి ఆగిపోక; కులశిఖరి శిఖరంబులన్= సప్త కులపర్వతాల శిఖరాలను; ఎరగలివడి= దహించి; గహనంబులన్+దహించి= అడవులను కాల్చి; కుంజ+మంజరీ+పుంజంబులన్+ భస్మంబు+చేసి= పొదరిండ్ల లోని పూలగుత్తులను కాల్చి బూడిదచేసి; జనపదంబులు+ఏర్చి= పల్లెల్ని కాల్చి, నదీనదంబులు+ఎరియించి= నదీనదాలను నాశనం చేసి; దిక్కుంభి కుంభములును= (అష్ట) దిగ్గజాల కుంభస్థలాలు; ఇక్కలు+పడ+నిక్కి= అదిరిపోయేలా వాటిపైకి ప్రాకి; తరణి+తారా+మండలంబులపైన్+మిట్టించి= సూర్యనక్షత్ర గోళాలపైన ఎక్కి (అణగదొక్కి); మహర్లోకంబు+దరికొని= మహర్లోకాన్ని సమీపించి; ఉపరిలోకంబునకు+మాఱు+కొనలిడి= పై లోకానికి తీగలుగా వ్యాపించి; సుడి+పడి= చుట్టుకొని; ముసరుకొని= వ్యాపించి; బ్రహ్మాండగోళంబు చిటిలి పడన్= బ్రహ్మాండం చిట్లిపోయేలా; దాఁటి= విస్తరించి; పాతాళాది లోకంబులను= పాతాళాది లోకాలలో; వ్రేళ్ళువాఱి= వేళ్ళుపాకి; సర్వలోకాధికంబు+ఐ= అన్ని లోకాలలోనూ అతిశయించి; శక్యంబుగాక= నియంత్రించడానికి వీలుకానిదై; ఎక్కడన్+చూచినన్+తానయై= ఎక్కడ చూసినా కనిపిస్తూ; కురంగంబు క్రియన్= జింకలాగా; క్రేళ్ళుఱుకుచున్= గంతులువేస్తూ; భుజంగంబు విధంబునన్= పాములాగా; ఒడియుచున్= పాకుతూ; సింగంబుభంగిన్= సింహంలాగా; లంఘించుచున్= దూకుతూ; విహంగంబు+పగిదిన్+ఎగయుచున్= పక్షిలాగా ఎగురుతూ; మాతంగంబు పోలికి= ఏనుగులాగా; నిలువంబడుచున్= ఆగిపోతూ (కదలకుండా వ్యాపించి) (లోకాన్నంతా కాల్చివేసిందని అర్థం); ఇట్లు= ఈ విధంగా; హాలాహల దహనంబు= హాలాహలం మంట; జగంబులన్= లోకాలను; కోలాహలంబు+చేయుచున్న సమయంబునన్= అతలాకుతలం చేస్తున్న సమయంలో; మెలకుసెగలన్= ఆ పెనుమంటల వేడికి; మిడుకన్+చాలక= తట్టుకోలేక; నీఱు+ఐన= బూడిదైన; దేవతలును; నేలన్+కూలిన= కాలి రాలిన; రక్కసులును= రాక్షసులును; దుల్లిన= రాలిపోయిన; తారకలును= నక్షత్రాలు; కీటు+అడంగిన= రూపుమాసిన; కిన్నర మిథునంబులును= కిన్నర దంపతులు; కమరిన= కాలిపోయిన; గంధర్వ విమానంబులును= గంధర్వుల విమానాలు; చీకాకుపడిన= చీకాకుపడ్డ; సిద్ధచయంబులును= సిద్ధుల సమూహాలు; చిక్కుపడిన= సంకటంలోపడ్డ;

గ్రహంబులును= గ్రహాలు; చిందఱవందఱలు+అయిన= చెల్లా చెదరైన; పర్ణాశ్రమంబులును= తాటాకు గుడిసెలు (ఋషులని); ఇగిరిపోయిన= ఎండిపోయినట్టి; నదులును= నదులు; ఆ వేడికి నదుల్లోని నీరు ఇంకిపోయిందని అర్థం); ఇంకిన సముద్రంబులును= ఇంకిపోయిన సముద్రాలు; కాలిన కాననంబులును= కాలిపోయిన అడవులు; పొగిలిన= ఏడుస్తున్న; పురంబులును= పట్టణాలు; పొనఁగు పడిన పురుషులును= వెత పొంది నిస్తేజులైన పురుషులు; పొక్కిపడిన= ఏడుస్తున్న; పుణ్యంగనా జనంబులును= పుణ్యస్త్రీలు; పగిలిపడిన= పగిలి బద్దలయిన; పర్వతంబులును= కొండలు; భస్మంబులైన ప్రాణి సంఘంబులును= బూడిదై పోయిన జీవరాసులు; వేఁగిన= కాలిన; లోకంబులును= లోకాలు; వివశలైన= దీనావస్థలో కలత చెందిన; దిశలును= దిక్కులు; ఒడ్డగెడవులు+ఐన= తలకిందులైన; భూజచయంబులును=చెట్లు; అఱవఱలు+ఐన= ముక్కలు చెక్కలైన; భూములునున్+ఐ= భూములు కలవై; అకాల విలయకాలంబు+ఐ= అకాలంలో ప్రళయకాలమై; తోఁచుచున్న సమయంబున= అనిపిస్తున్న సమయంలో...

**తా :** అలా పుట్టిన హాలాహలం ప్రళయకాలంలో రుద్రుని నేత్రాగ్నికి నూరు రెట్లు భయంకరంగా ఉంది. కల్పాంతంలో పుట్టే అగ్నికి వెయ్యింతలు తీవ్రంగా; ప్రళయకాల సూర్యాగ్నికి లక్ష రెట్లు అధికంగా తేరిచూడరానిదిగా ఉంది. ప్రళయరాత్రిలో మెరిసే మేఘాల నుండి కురిసే పిడుగుల్లాగా భయంకరంగా ఉంది. భగభగమని పంచభూతాలు ఒక్కసారిగా మండినట్టుంది. భుగభుగ మనే పొగలతో ఛటఛటమనే నిప్పుకణాలతో, ధగధగమనే పెనుమంటతో ఫటఫటమంటూ ఆ మహావిషాగ్ని ఆకాశానికి ఎగిసింది. దిక్కులన్నిటా వ్యాపించింది. పైకి బయళ్ళలోకి ఎగిసి పడింది. మందరపర్వతాన్ని దాటిపోయి సముద్రంలో నాలుగువైపులా అలుముకొని, గట్లను దాటుకొని, దేవదానవులకు తగిలి; కొండగుహలలో చిక్కుపడిపోక ఎత్తయిన కులపర్వత శిఖరాలలో నిప్పులు చెరిగింది. అడవుల్ని తగలబెట్టింది. పొదరిండ్లలోని పూల గుత్తుల్ని బూడిదచేసింది. గ్రామాలను బూడిద చేసింది. నదీనదాలను నాశనంచేసింది. దిగ్గజాల కుంభస్థలాలపైకి సోకింది. సూర్యగోళాన్ని నక్షత్రాలను అణగదొక్కింది. మహర్లోకాన్ని మసిచేసింది. పై లోకాలకు తీగలు సాగిపోయింది. చుట్టుముట్టుకొని కమ్ముకొని బ్రహ్మాండం పేలిపోయేలా విస్తరించింది. పాతాళలోకంలో వేళ్ళు పాకింది.

దాన్ని ఆపడానికి ఎవరికి చేతగాని తీరులో లోకాలలో అన్నింటా తానే అన్నట్టు వ్యాపించింది. జింకలాగా గెంతింది. పాములాగా పాకింది. సింహంలాగా దూకింది. పక్షిలాగా ఎగిరిపోయింది. ఏనుగులాగా కదలకుండా నిలబడింది. లోకాలలో గగ్గోలు పుట్టించింది. ఆ పెనుమంటల వేడిమికి తట్టుకోలేక దేవతలు కొందరు భస్మమయ్యారు. రాక్షసులు కాలి నేలరాలారు. చుక్కలు రాలిపోయాయి. కిన్నర దంపతులు రూపు మాసిపోయారు. గంధర్వుల విమానాలు కాలిపోయాయి. సిద్ధుల గుంపులు చెదరిపోయాయి. గ్రహాలు సంకటంలో పడ్డాయి. ఋషుల తాటాకు గుడిసెలు కాలిపోయాయి. నదులు ఇగిరిపోయాయి. సముద్రాలు ఇంకిపోయాయి. అడవులు మాడి మసి అయ్యాయి. పట్టణాలు బావురుమన్నాయి. పురుషులు చొక్కిపోయారు. పుణ్యస్త్రీలు పొగిలి పొగిలి ఏడ్చారు. కొండలు బద్దలయ్యాయి. జీవరాసులన్నీ మాడి బూడిదయ్యాయి. లోకాలన్నీ వేడిమితో వేగిపోయాయి. దిక్కులు కలత పొందాయి. చెట్లు తలకిందులయ్యాయి. నేలలు ముక్కలు చెక్కలయ్యాయి; అకాలంలో ప్రళయం వచ్చి పడ్డట్టు అయింది.

**క. ఒడ్డారించి విషంబున, కడ్డము చనుదెంచి కావ నధికులు లేమిన్**
**గొడ్డేటి బ్రమంది రా లన, బిడ్డన నెడలేక జనులు పృథ్వీనాథా! 217**

**ప్రతి :** పృథ్వీనాథా= రాజా!; విషంబునకున్= ఆ మహా విషాగ్నికి; అడ్డము+చనుదెంచి= అడ్డంగా వెళ్ళి (అడ్డగించి); ఒడ్డారించి= నిలువరించి; కావన్= కాపాడే; అధికులు+లేమిన్= మహనీయులు లేకపోవటం వల్ల; జనులు= ప్రజలు;

ఆలు+అనన్= పెండ్లామని; బిడ్డ+అనన్= బిడ్డ అని; ఎడలేక= తేడా లేకుండా; గొడ్డు+ఏఱి= కట్ట కట్టుకొని; మ్రందిరి= చనిపోయారు.

**తా :** ఆ మహావిషాగ్నికి అడ్డంపోయి, నిలువరించి దాని బారినుండి జగత్తును కాపాడే మహనీయులెవరూ లేకపోయారు. ఆలుబిడ్డలనే తేడా లేకుండా అందరూ చచ్చిపోయారు.

**వ. అప్పుడు. 218**

ప్రతి : ఆ సమయంలో...

**మ. చని కైలాసముఁజొచ్చి శంకరుని వాసద్వారముంజేరి యీ**
**సున దౌవారికు లడ్డపడ్డఁదల మంచుంజొచ్చి 'కుయ్యో! మొఱో!**
**విను మాలింపుము; చిత్తగింపుము; దయన్ వీక్షింపు' మం చంబుజా**
**ననముఖ్యుల్ గని రార్తరక్షణకళాసంరంభునిన్ శంభునిన్. 219**

ప్రతి : అంబుజానన ముఖ్యుల్= బ్రహ్మాది దేవతలు; చని= వెళ్ళి; కైలాసమున్+చొచ్చి= కైలాసంలో ప్రవేశించి; శంకరుని= ఈశ్వరుని; వాసద్వారమున్+చేరి= మందిర ద్వారం చేరి; ఈశుని= ఈశ్వరుని; దౌవారికులు= ద్వారపాలకులు; అడ్డపడ్డన్= అడ్డుపడగా; తలమంచున్+చొచ్చి= తొలగండి అంటూ లోపలికి వెళ్ళి; 'కుయ్యో! మొఱో!'= శరణు, శరణు (దిక్కులేని వారమని అర్థం); వినుము+ఆలింపుము= స్వామీ మా మొరవిను; చిత్తగింపుము= మనసులో నిల్పుకో; దయన్ వీక్షింపుము= దయతో మమ్మల్ని చూడు; అంచున్= అంటూ; ఆర్తరక్షణ కళాసంరంభునిన్= ఆర్తులను రక్షించాలనే వేగిరపాటు కల; శంభునిన్= పరమేశ్వరుని; కనిరి= చూశారు.

**తా :** అప్పుడు బ్రహ్మాది దేవతలంతా కైలాసానికి వెళ్ళారు. ఆ మహేశుని మందిరం ముందు చేరారు. ద్వారపాలకులు అడ్డగించగా తొలగండని చెప్పిలోనికి వెళ్ళారు. దుఃఖంలో ఉన్న భక్తుల్ని ఆదుకోవడంలో వేగిరపడే ఆ లీలా మహిమాన్వితమైన పరమేశ్వరునితో "స్వామీ! శరణు! శరణు! మా మొఱ విను. మనస్సులో మామీద కృప గల్గి మా మనవిని చేకొనవయ్యా! దయతో చూడవయ్యా!' అంటూ ఆయన్ని చూశారు.

**క. వారలు దీనత వచ్చుటఁగూరిమితో నెఱిఁగి దక్షుకూఁతురు దానుం**
**బేరోలగమున నుండి దయా, రతుఁడై చంద్రచూడుఁడవసర మిచ్చెన్. 220**

ప్రతి : చంద్రచూడుఁడు= చంద్రుని తలమీద ధరించిన ఈశ్వరుడు; తానున్= తానూ; దక్షుకూఁతురు= సతీదేవి; పేరోలగమునన్+ఉండి= ప్రమథగణాలతో కూడిన నిండు సభలో ఉండి; వారలు= దేవతలు; దీనతన్+వచ్చుటన్+కూరిమి తోన్+ఎఱిఁగి= దీనులై రావటాన్ని ప్రేమతో గుర్తించి; దయారతుఁడు+ఐ= దయాగుణం కలవాడై; అవసరము+ఇచ్చెన్= (కోరినవిధంగా) దర్శనం ఇచ్చాడు; అవసరము= కాలము (సమయమిచ్చాడు)

**తా :** దయామయుడైన శివుడు ఆ సమయంలో దక్షుని కుమార్తె సతీదేవితో కైలాసంలో ప్రమథగణాలతో కూడిన నిండు సభలో ఉన్నాడు. అయినా దేవతలు దీనులుగా రావడాన్ని గ్రహించి స్వామి వారికి వెంటనే దర్శనం ఇచ్చాడు.

**వ. అప్పుడు భోగిభూషణునకు సాష్టాంగ దండప్రణామంబులు గావించి ప్రజాపతి ముఖ్యు లిట్లని స్తుతియించిరి. 221**

**ప్రతి :** అప్పుడు; భోగిభూషణునకు= నాగభూషణుడైన శివునికి; సాష్టాంగ దండప్రణామంబులు+కావించి= సాష్టాంగపడి; ప్రజాపతి ముఖ్యులు= ప్రజాపతి మున్నగువారు; ఇట్లు+అని= ఈవిధంగా; స్తుతియించిరి= ప్రార్థించారు.

**తా :** అపుడు ప్రజాపతులు శివునికి సాష్టాంగపడి స్తుతులతో ఇలా ప్రార్థించారు.

**సీ. భూతాత్మ! భూతేశ! భూత భావనరూప! దేవ! మహాదేవ! దేవవంద్య!**
**యీ లోకముల కెల్ల నీశ్వరుండవు నీవు; బంధమోక్షములకుఁబ్రభుఁడ వీవ;**
**యార్తశరణ్యుండవగు గురుండవు నిన్నుఁగోరి భజింతురు కుశలమతులు;**
**సకలసృష్టిస్థితిసంహారకర్తవై బ్రహ్మవిష్ణుశివాఖ్య బరఁగు దీవు;**

**ఆ. పరమ గుహ్య మయిన బ్రహ్మంబు సదసత్త, మంబు నీవ; శక్తిమయుఁడ వీవ**
**శబ్దయోని వీవ; జగదంతరాత్మవు నీవ, ప్రాణ మరయ నిఖిలమునకు. 222**

**ప్రతి :** భూత+ఆత్మ= సకల ప్రాణులకూ ఆత్మరూపమైన వాడా!; భూత+ఈశ= సకల భూతాలకూ అధిపతీ!; భూత భావనరూప= భూతాలను సంకల్పమాత్రంతో సృష్టించే అధికారీ!; దేవ= ఓ స్వామీ!; మహాదేవ= దేవతలలో శ్రేష్ఠుడా!; దేవవంద్య= దేవతలచేత నమస్కరింపదగిన వాడా!; ఈ లోకములకున్+ఎల్లన్= ఈ సకలలోకాలకూ; ఈశ్వరుండవు నీవు= ప్రభువు నీవే; బంధమోక్షములకున్= బంధానికి, మోక్షానికి; ప్రభుఁడవు+ఈవ= నాథుడు నీవే!; ఆర్త= ఆర్తులకు; శరణ్యుండవు+అగు= రక్షించేవాడవగు; గురుండవు= తండ్రివి; కుశలమతులు= బుద్ధిమంతులు; నిన్నున్+కోరి+భజింతురు= నిన్ను ప్రీతితో పూజిస్తారు. సకల= సకలభూతాల; సృష్టి, స్థితి, సంహారకర్తవు+ఐ= సృష్టి, స్థితి, సంహారాలకు కర్తగా; బ్రహ్మవిష్ణు శివాఖ్యన్= బ్రహ్మ, విష్ణువు, శివుడు అనే పేర్లతో; పరఁగుదు+ఈవు= పిలువబడుతున్నావు; పరమగుహ్యము+ అయిన= అతి రహస్యమయిన (తెలుసుకోవడానికి కాని); బ్రహ్మంబు= బ్రహ్మతత్త్వం (పరతత్త్వం); సత్+అసత్+తమంబు= సత్తుకు, అసత్తుకు అతీతమైన తత్త్వం; నీవు+అ= నీవే; శక్తిమయుఁడవు+ఈవ= శక్తితో కూడిన వాడివి నీవే; శబ్దయోనివి+ఈవ= శబ్దానికి జన్మస్థానం నీవే; జగత్+అంతరాత్మవు= ప్రపంచానికి అంతరాత్మ కూడా (నీవే); అరయన్= పరిశీలించగా; నిఖిలమునకున్= అన్నింటికిని; ప్రాణము+నీవు+అ= ప్రాణం నీవే.

**తా :** ఓ భూతాత్మా! భూతేశా! భూతభావన రూపా! దేవా! మహాదేవా! దేవవంద్యా! నీకు నమస్కారం. ఈ లోకాలకు అన్నింటికి ప్రభువు నీవే. బంధ మోక్షాలు రెండూ నీ వల్లనే కలుగుతాయి. ఆర్తులకు శరణు గోరదగ్గ తండ్రివి నీవే. బుద్ధిమంతులు నీపై ఆసక్తితో పూజిస్తారు. సకల జగత్తును సృష్టించి – పోషించి – నశింపచేస్తావు. నీవే బ్రహ్మ – విష్ణు శివులన్న పేర్లతో వ్యాపించి ఉన్నావు. అతి రహస్యమైన బ్రహ్మతత్త్వం నీవే. నీవు సదసత్తులకు అతీతమైన వాడివి. నీవు శక్తిమంతుడివి. శబ్ద బ్రహ్మవు నీవే. జగదంతరాత్మ నీవే. సకల జగత్తుకు ప్రాణాధారం నీవే.

**క. నీయంద సంభవించును, నీయంద వసించి యుండు నిఖిలజగములున్**
**నీయంద లయముఁబొందును, నీ యుదరము సర్వభూతనిలయము రుద్రా! 223**

**ప్రతి :** రుద్రా= పరమేశ్వరా!; నిఖిల జగములున్= సకల ప్రపంచాలూ; నీ+అందు+అ= నీలోనే; సంభవించును= పుడతాయి; నీ+అందు+అ= నీలోనే; వసించి+ఉండున్= నివసిస్తాయి; నీ+అందు+అ= నీలోనే; లయమున్+పొందును= లయిస్తాయి; నీ+ఉదరము= నీ బొజ్జ; సర్వభూతనిలయము= సకల భూతరాశికీ ఆశ్రయం.

**తా :** పరమేశ్వరా! అన్ని లోకాలూ నీలోనే పుడతాయి.నీలోనే నివసిస్తాయి. నీలోనే నశిస్తాయి. నీ ఉదరం సకల భూతరాశికీ నివాసం.

**సీ.** **అగ్నిముఖంబు; పరాపరాత్మక మాత్మ; కాలంబు గతి; రత్నగర్భ పదము;**
**శ్వసనంబు నీ యూర్పు; రసన జలేశుండు; దిశలు కర్ణంబులు; దివము నాభి;**
**సూర్యుండు గన్నులు; శుక్లంబు సలిలంబు; జఠరంబు జలధులు; చదలు శిరము;**
**సర్వౌషధులు రోమచయములు; శల్యంబు లద్రులు; మానస మమృతకరుఁడు;**

**తే.** **ఛందములు ధాతువులు ధర్మసమితి హృదయ;, మాస్యపంచక ముపనిషదాహ్వయంబు;**
**నయిన నీ రూపు పరతత్త్వమై శివాఖ్య, మై స్వయం జ్యోతియై యొప్పు నాద్య మగుచు. 224**

**ప్రతి :** స్వామీ!; అగ్నిముఖంబు= అగ్నియే నీ ముఖం; పరాపరాత్మకమాత్మ= జీవాత్మ పరమాత్మల కలయికే నీ ఆత్మ; కాలంబుగతి= కాలమే నీ పాదం (నడక); రత్నగర్భ పదము= భూమే నీ పాదం; శ్వసనంబు నీ యూర్పు = వాయువే నీ ఊపిరి; రసన జలేశుండు= వరుణుండే నీ నాలుక; దిశలు కర్ణంబులు= దిక్కులే చెవులు; దివము నాభి= స్వర్గమే నీ నాభి; సూర్యుడు+కన్నులు= సూర్యుడే నీ దృష్టి; శుక్లంబు సలిలంబు= నీరే నీ వీర్యం; జఠరంబు జలధులు= సముద్రాలే నీ గర్భం; చదలు శిరము= ఆకాశమే నీ శిరస్సు; సర్వ+ఔషధులు+రోమచయములు= ఓషధులన్నీ నీ రోమాలు (వెంట్రుకలు); శల్యంబులద్రులు= పర్వతాలే ఎముకలు; మానసమమృత కరుఁడు= చంద్రుడే నీ మనస్సు; ఛందములు ధాతువులు= వేదాలే నీ ధాతువులు; ధర్మసమితి హృదయము= ధర్మశాస్త్రాలు నీ హృదయం; ఆస్యపంచకము= నీ ఐదు ముఖాలే; ఉపనిషద్+ఆహ్వయంబు= ఉపనిషత్తులు; అయిన= ఈ విధంగా ఉన్న; నీ రూపు= నీ రూపం; పరతత్త్వము+ఐ= పరతత్త్వమై; శివ+ఆఖ్యము+ఐ= శివుడనే పేరుతో; స్వయంజ్యోతి+ఐ= స్వయంప్రకాశం కల్గి; ఆద్యము+అగుచున్= మొదటిదై (అన్నింటికి మూలమై); ఒప్పున్= ప్రకాశిస్తుంది.

**తా :** పరమేశా! నీ ముఖమే అగ్ని. జీవాత్మ పరమాత్మల కలయికే నీ ఆత్మ. కాలమే నీగతి. భూమే నీ (పాదం); వాయువే నీ శ్వాస; వరుణుడే నీ నాలుక; దిక్కులే చెవులు; స్వర్గమే నాభి. సూర్యుడే నీ దృష్టి. నీరే నీ వీర్యం. సముద్రాలే నీ గర్భం. ఆకాశమే శిరస్సు. ఓషధులే వెంట్రుకలు. పర్వతాలే ఎముకలు, చంద్రుడే మనస్సు. వేదాలే నీ ధాతువులు. ధర్మశాస్త్రమే నీ హృదయం. ఉపనిషత్తులే నీ ఐదు ముఖాలు. నీ రూపం పరతత్త్వం. స్వయంజ్యోతివి నీవు. సకలానికీ మూలం నీవే.

**విశే :** శివుడికి ఐదు ముఖాలు. 1. సద్యోజాతముఖం, 2. తత్పురుష ముఖం, 3. వామదేవ ముఖం, 4.అఘోర ముఖం, 5. ఈశాన ముఖం

**క.** **కొందఱు గలఁడందురు నినుఁ; గొందఱు లేఁడందు రతఁడు గుణి గాఁడనుచుం**
**గొందఱు; గలఁడని లేఁడని కొందల మందుదురు నిన్నుఁగూర్చి మహేశా! 225**

**ప్రతి :** మహేశా= ఓ మహాదేవా!; కొందఱు= కొంతమంది; నినున్= నిన్ను; కలఁడు+అందురు= ఉన్నాడు అంటారు; కొందఱు= ఇంకొంతమంది; లేఁడు+అందురు= లేడంటారు; కొందఱు= మరికొంతమంది; అతఁడు= ఈశ్వరుడు; గుణి+ కాఁడు+అనుచున్= నిర్గుణుడు అంటూ; కొందఱు= కొంతమంది+అయితే; కలఁడు+అని+లేఁడు+అని= ఉన్నాడని లేడని; నిన్నున్+కూర్చి= నీ విషయంగా; కొందలము+అందుదురు= సందేహం పొందువారు.

**తా :** ఓ మహాదేవా! కొందరు నీ వున్నావంటారు. కొందరు లేవంటారు. కొందరు నీవు నిర్గుణుడివంటారు. మరికొంతమంది నీ వున్నావో లేవో అని సందేహపడుతుంటారు.

**విశే :** 'కలడో లేడో' అని గజేంద్రుడు పడ్డ సందేహం విష్ణువు విషయంలోనే కాదు – శివుడి విషయంలోనూ అంతే.

**సీ. తలఁపఁ బ్రాణేంద్రియ ద్రవ్యగుణ స్వభావుఁడవు, కాలక్రతువులును నీవ;**
**సత్యంబు ధర్మ మక్షరము ఋతంబును, నీవు ముఖ్యుండవు నిఖిలమునకు**
**ఛందోమయుండవు సత్త్వరజస్తమ, శ్చక్షుండవై యుందు సర్వరూప**
**కామ పురాధ్వర కాలగరాది భూతద్రోహభయము చోద్యంబు గాదు;**

**తే. లీలలోచనవహ్ని స్ఫులింగ శిఖల, నంతకాదులఁగాల్చిన యట్టి నీకు**
**రాజఖండావతంస! పురాణ పురుష!, దీనరక్షక! కరుణాత్మ! దేవ దేవ! 226**

**ప్రతి :** దేవదేవ= దేవాధిదేవా!; దీన రక్షక= ఆర్తులను కాపాడే వాడా!; పురాణపురుష= ఆదిపురుషా!; రాజఖండ+అవతంస= చంద్రఖండాన్ని (నెలవంకను) శిరస్సున ధరించినవాడా!; సర్వరూప= అన్నీ తన రూపాలైనవాడు; తలఁపన్= బాగా ఆలోచిస్తే (వివేకంతో చూస్తే); ప్రాణ+ఇంద్రియ+ ద్రవ్య+గుణ+స్వభావుడఁవు+కాలక్రతువులును+నీవు+అ= ప్రాణులు, ఇంద్రియాలు, ద్రవ్యగుణాలు, నీ స్వభావంలోనివే, కాలంక్రతువు కూడా నీవే; సత్యంబు= సత్యం; ధర్మము= ధర్మం; అక్షరము= అక్షరం; ఋతంబును= ఋతం – (నీవే); నిఖిలమునకున్= అన్నింటికీ; నీవు ముఖ్యుండవు= నీవే ఆధారానివి; ఛందోమయుండవు= వేదస్వరూపుడివి నీవే; సత్త్వ, రజస్తమస్+చక్షుండవు+ఐ+ఉందు (వు)= సత్త్వం, రజస్సు, తమస్సు నీకు నేత్రాలు గలవాడవై ఉందువు; లీలన్= అలవోకగా; లోచనవహ్నిస్ఫులింగ శిఖలన్= నీ కంటిలోని అగ్ని యొక్క మంటలతో; అంతకాదులన్= యమాదులనే; కాల్చిన+అట్టి నీకున్= కాల్చేసిన నీకు; కామ= మన్మథుడు; పుర+అధ్వర= త్రిపురాసురులు, దక్షయజ్ఞం; కాలగరాది= కాలకూటవిషం మొదలైన; భూతద్రోహ భయము= ప్రాణాంతకాలనుండి భయము; చోద్యంబు గాదు= ప్రస్తావింపదగినదే కాదు.

**తా :** దేవాధిదేవా! దీనరక్షకా! పురాణపురుషా! చంద్రచూడా! సర్వరూపా! ఆలోచిస్తే ప్రాణం, ఇంద్రియాలు, ద్రవ్యగుణాలు అన్నీ నీ స్వభావంలోనే ఉన్నాయి. కాలమూ, యజ్ఞమూ నీవే. సత్యమూ, ధర్మమూ, ఓంకారమూ, మోక్షమూ నీవే – అన్నింటికీ ఆధారం నీవే. నీవే వేద రూపుడివి. సత్త్వరజస్తమో గుణాలు నీకు నేత్రాలు. నుదుటి కంటి మంటతో యమాదులనే అవలీలగా కాల్చిన నీకు; మన్మథుడు కాని, త్రిపురాసురులు కాని, కాలకూటం కాని ఒక లెక్కలోనివి కావు. ఇవేవీ నీకు హాని కల్గజేయవు.

**ఆ. మూఁడు మూర్తులకును మూఁడు లోకములకు, మూఁడు కాలములకు మూల మగుచు**
**భేద మగుచుఁదుది నభేదమై యొప్పారు, బ్రహ్మ మనఁగ నీవ ఫాలనయన! 227**

**ప్రతి :** ఫాలనయన= ఓ ఫాలనేత్రా!; మూఁడు మూర్తులకు= ముగ్గురు మూర్తులకు (త్రిమూర్తులు= బ్రహ్మ–విష్ణు–మహేశ్వరులు); మూఁడు లోకములకున్= ముల్లోకాలకు (స్వర్గ, మర్త్య, పాతాళాలకు); మూఁడు కాలములకున్= మూడు కాలాలకు (భూత, భవిష్యద్వర్తమానాలకు) – మూలమగుచున్= మూలమై; భేదమగుచున్= మొదట భేదంతో కనిపించినా; తుదిన్= చివరికి; అభేదమై+ఒప్పారు= అభిన్నంగా ప్రకాశించే; బ్రహ్మమనఁగన్= పరబ్రహ్మ తత్త్వం; నీవు+అ= నీవే.

**తా :** ఓ ఫాలనేత్రా! త్రిమూర్తులకూ, త్రిలోకాలకూ, త్రికాలాలకూ మూలం నీవే. మొదట భేదాలతో కనిపించి తుదకు అభిన్నంగా ఏకమాత్రంగా ప్రకాశించే పరబ్రహ్మతత్త్వం నీవే.

**క. సదసత్తత్త్వ చరాచర సదనం బగు నిన్నుఁబొగడ జలజభవాదుల్**
**పెదవులు గదలుప వెఱతురు వదలక నినుఁబొగడ నెంతవారము దేవా! 228**

**ప్రతి :** దేవా!; సత్+అసత్+తత్త్వ+చరాచర+సదనంబు+అగు+నిన్నున్= సదసద్రూపమైన ఈ చరాచర ప్రపంచానికి ఆలవాలం నీవే. అలాంటి నిన్ను; పొగడన్= కీర్తించడానికి; జలజభవ+ఆదుల్= బ్రహ్మాదులుకూడా; పెదవులు+కదలుప వెఱతురు= పెదవి విప్పడానికి భయపడతారు; వదలక= పట్టుబట్టి; నినున్+పొగడన్= నిన్ను కీర్తించడానికి; ఎంతవారము= మేము ఎంతటి వాళ్ళం!

**తా :** ఓ స్వామీ! సదసద్రూపమైన ఈ సకల చరాచరజగత్తు నీలోనే ఉంది. బ్రహ్మాదులు కూడా నిన్ను స్తుతించడానికి భయపడి పెదవులు విప్పరు. అలాంటప్పుడు మేము నిన్ను పట్టుబట్టి స్తుతించడానికి ఎంతటి వాళ్ళం?

**మత్త. బాహుశక్తి సురాసురుల్ చని పాలవెల్లి మథింప హా**
**లాహలంబు జనించె నేరి కలంఘ్యు మై భువనంబు గో**
**లాహలంబుగఁజేసి చిచ్చును లాగముంగొని ప్రాణి సం**
**దోహమున్ బ్రదికింపవే? దయ దొంగలింపఁగ నీశ్వరా! 229**

**ప్రతి :** ఈశ్వరా= పరమేశ్వరా!; సురాసురుల్= దేవతలు, రాక్షసులు; చని= వెళ్ళి; పాలవెల్లిన్= పాలసముద్రాన్ని; బాహుశక్తిన్+మథింపన్= బాహుశక్తితో చిలకగా; హాలాహలంబు= హాలాహలమనే విషం; జనించెన్= పుట్టి; ఏరికిన్+అలంఘ్యము+ఐ= ఎవ్వరికి ఎదిరింపజాలక; భువనంబున్+కోలాహలంబుగన్+చేసి= ప్రపంచాన్నంతా కోలాహలంగాచేసి; (హింసిస్తోంది); చిచ్చును= ఈ అగ్నిని; లాగమున్+కొని= అవలీలగా గ్రహించి; దయ+తొంగలింపఁగన్= దయాగుణం ప్రసరించగా; ప్రాణి సందోహమున్+బ్రదికింపవే= ప్రాణులను కాపాడు ప్రభూ!

**తా :** పరమేశ్వరా! దేవతలు, రాక్షసులు తమ బాహుబలంతో పాలసముద్రాన్ని చిలుకగా అందులో నుండి హాలాహలమనే విషం పుట్టి ప్రపంచాన్నంతా కోలాహలం చేస్తోంది. దాన్ని ఎవరూ ఆపలేకుండా ఉన్నారు. నీవు దయతో దాన్ని అవలీలగా పరిగ్రహించి ప్రాణికోటిని కాపాడవా ప్రభూ!

**క. లంపటము నివారింపను సంపదఁగృపసేయ జయము సంపాదింపం**
**జంపెడివారి వధింపను సొంపారఁగ నీక చెల్లు సోమార్ధధరా! 230**

**ప్రతి :** సోమార్ధధరా= అర్ధచంద్రుని శిరస్సున ధరించిన ఈశ్వరా!; లంపటము నివారింపను= కష్టాన్ని తొలగించడానికి; సంపదన్+కృపసేయన్= సంపదను ఇవ్వడానికి; జయము సంపాదింపన్= విజయాన్ని ప్రసాదించడానికి; చంపెడివారిన్+వధింపను= క్రూరుల్ని నాశనం చేయడానికి; సొంపారఁగన్= చక్కగా; నీకు+అ+చెల్లు; నీకే చెల్లును.

**తా :** పరమేశ్వరా! లోకుల కష్టాల్ని తొలగించడానికి, ఐశ్వర్యాన్ని, విజయాన్ని ప్రసాదించడానికి, క్రూరుల్ని నాశనం చేయడానికి చక్కగా నీవే తగినవాడివి.

**క. నీకంటె నొం డెఱుంగము; నీకంటెంబరులు గావ నేరరు జగముల్;**
**నీకంటె నొడయఁడెవ్వఁడు, లోకంబుల కెల్ల నిఖిలలోకస్తుత్యా! 231**

**ప్రతి :** నిఖిలలోక స్తుత్యా= నిఖిల లోకాలచేత స్తుతింపదగిన ఓ ఈశ్వరా!; నీకంటెన్= నీకన్నా; ఒండు= మరొకటి; ఎఱుంగము= మాకు తెలియదు; నీకంటెన్= నీకన్నా; పరులు= ఇతరులు; జగముల్= లోకాలను; కావన్+నేరరు= రక్షింపజాలరు; లోకంబులకెల్లన్= లోకాలకన్నింటికీ; నీకంటెన్= నీకన్నా; ఒడయఁడు= ప్రభువు; ఎవ్వఁడు= ఎవరున్నారు?

**తా :** నీకన్నా మాకు ఇంకోటి తెలియదు. నీకన్నా గొప్పగా లోకాల్ని రక్షించగలవారూ ఎవరూ లేరు. లోకాలన్నిటికీ ప్రభువు నీవే. ఇతరులెవరున్నారు?

**వ. అని మఱియు నభినందించుచున్న ప్రజాపతి ముఖ్యులం గని సకలభూత సముండగు నద్దేవుండు దన ప్రియసతి కిట్లనియె. 232**

**ప్రతి :** అని; మఱియున్; అభినందించుచున్న= ప్రస్తుతిస్తున్న; ప్రజాపతి ముఖ్యులన్+కని= ప్రజాపతులు మొదలగు వారిని చూచి; సకలభూతసముండు+అగున్= సకలభూత సమవర్తి అయిన; ఆ+దేవుండు= ఆ స్వామి; తన ప్రియసతికిన్+ఇట్లు+ అనియెన్= (తనభార్య సతీదేవితో) ఇలా అన్నాడు.

**తా :** ఇలా స్తుతిస్తున్న దేవతల్ని చూసి, సకలభూత సమవర్తి అయిన శివుడు తన సతితో ఇలా అన్నాడు.

## ✤ శివుండు దేవప్రార్థితుండై హాలాహలమును బానము సేయుట ✤

**క. కంటే జగముల దుఃఖము, వింటే జలజనితవిషము వేఁడిమి; ప్రభువై**
**యుంటకు నార్తుల యాపద, గెంటించుట ఫలము; దానఁగీర్తి మృగాక్షీ! 233**

**ప్రతి :** మృగ+అక్షీ= జింక కన్నులవంటి బెదురు చూపులుగల దానా (ఓ పార్వతీ); జగముల దుఃఖము= లోకాలు పడుతున్న దుఃఖాన్ని; కంటి+ఏ= చూశావా!; జలజనిత= నీటిలో పుట్టిన; విషము వేఁడిమి వింటి+ఏ= విషం పుట్టించిన మహాగ్నిని గురించి విన్నావా!; ప్రభువు+ఐ+ఉంటకున్= రాజుగా (ప్రభువుగా) ఉన్నందుకు; ఆర్తుల+ఆపదన్= ఆర్తుల ఆపదల్ని; గెంటించుట ఫలము= తొలగించటమే తగిన పని; దానన్+కీర్తి= దానివల్ల కీర్తి వస్తుంది.

**తా :** పార్వతీ! లోకాలు పడుతున్న దుఃఖాన్ని చూస్తున్నావా! సముద్రంలో పుట్టిన హాలాహలం సృష్టించిన విషాగ్నిని గురించి వింటున్నావా! ప్రభువైనవాడు ఆర్తుల బాధల్ని పోగొట్టాలి. అది ప్రభువుల లక్షణం. దీనివల్ల కీర్తికూడా లభిస్తుంది.

**క. ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన, ప్రాణుల రక్షింపవలయుఁబ్రభువుల కెల్లం;**
**బ్రాణుల కిత్తురు సాధులు, ప్రాణంబులు నిమిషభంగురము లని మగువా! 234**

**ప్రతి :** మగువా= ఓ వనితా (పార్వతీ!); ప్రాణేచ్ఛన్+వచ్చి+చొచ్చినన్= ప్రాణభయంతో ఆశ్రయించివస్తే; ప్రభువులకున్+ఎల్లన్= ప్రభువులంతా; ప్రాణులన్+రక్షింపవలయున్= ప్రాణుల్ని ఆ ఆపదనుండి కాపాడాలి; నిమిషభంగురములు= క్షణభంగురాలు; (బుద్బుదప్రాయాలు) అని (తెలిసి); సాధులు= సాధువులైనవారు; ప్రాణంబులు= ప్రాణాలు; ప్రాణులకిత్తురు= తమ ప్రాణాల్నే (ఆర్తులకోసం) ఇస్తారు.

**తా :** మగువా! ప్రాణభయంతో ఆశ్రయం కోరివచ్చిన ప్రాణులను కాపాడటం ప్రభువుల కర్తవ్యం. ప్రాణాలు నీటి బుడగల్లాగా క్షణభంగురాలు. కనుకనే ఉత్తములు ఇతరుల్ని కాపాడటానికి తమ ప్రాణాలను సమర్పించడానికి వెనుదీయరు. సులభంగా ప్రాణదానం చేస్తారు.

**క. పరహితము సేయు నెవ్వఁడు, పరమహితుండగును భూతపంచకమునకుం**
**బరహితమె పరమధర్మము, పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ! 235**

**ప్రతి :** పర్వ+ఇందుముఖీ= పూర్ణచంద్రాననా!; పరహితమున్= పరులకు మేలును; ఎవ్వఁడు+చేయున్= ఎవడు చేస్తాడో; (వాడు); భూతపంచకమునకున్= పంచభూతాలకూ; పరమహితుండు+అగును= పరమాప్తుడవుతాడు; పరహితము+ఎ= ఇతరులకు మేలు కూర్చడమే; పరమధర్మము= గొప్పధర్మము; పరహితునకున్= ఇతరులకు మేలు చేసేవాడికి; ఎదురులేదు= తిరుగులేదు.

**తా :** ఇతరులకు ఎవడు మేలు చేస్తాడో వాడు పంచభూతాలకు పరమాప్తుడు అవుతాడు. పరహితసాధనమే పరమధర్మం. పరహితునికి ఈ లోకంలో అసాధ్యమైనది ఏదీ ఉండదు.

**క. హరి మది నానందించిన, హరిణాక్షి! జగంబులెల్ల నానందించున్**
**హరియును జగములు మెచ్చఁగ, గరళము వారించు టొప్పుఁగమలదళాక్షీ! 236**

**ప్రతి :** కమలదళ+అక్షీ= పద్మదళనేత్రవైన పార్వతీ!; హరి మదిన్+ఆనందించినన్= హరి తనమనస్సులో ఆనందిస్తే; జగంబులెల్లన్+ఆనందించున్= ప్రపంచమంతా ఆనందిస్తుంది; హరియును; జగములు, మెచ్చఁగన్= హరీ, జగత్తూ ప్రశంసించే విధంగా; గరళమున్= విషాన్ని; వారించుట+ఒప్పున్= అదుపు చేయడమే మంచి పని.

**తా :** ఓ కమలాక్షీ! హరి సంతోషిస్తే అన్ని లోకాలూ సంతసిస్తాయి. కనుక హరీ, జగత్తూ సంతోషపడేలా ఈ విషాన్ని అదుపు చేయటమే మంచి పని.

**విశే :** శివ – విష్ణు పారమ్యాన్ని – పరస్పర సంబంధాన్ని బోధించే ఘట్టమిది. ఇక్కడ విష్ణు ప్రసక్తి ఎందుకు? విష్ణువుకు తృప్తి కల్గించటం కోసం శివుడు హాలాహలాన్ని శిక్షిస్తానంటున్నారు. వారి హృదయాలు ఒకదానిపట్ల మరొకటి అంత ఆకర్షణ కల్గినవి – అని అర్థం.

**క. శిక్షింతు హాలహలమును భక్షింతును మధుర సూక్ష్మ ఫలరసముక్రియన్**
**రక్షింతుఁబ్రాణికోట్లను వీక్షింపుము నీవు నేఁడు వికచాబ్జముఖీ! 237**

**ప్రతి :** వికచ+అబ్జముఖీ= వికసించిన పద్మంలాంటి ముఖం కల్గిన పార్వతీ!; శిక్షింతున్+హాలాహలమును= హాలాహలాన్ని దండిస్తాను; మధుర సూక్ష్మఫల రసము క్రియన్= తియ్యని చిన్నిఫలరసం లాగా; భక్షింతును= ఆరగిస్తాను; ప్రాణికోట్లను= ప్రాణిసమూహాన్ని; రక్షింతున్= కాపాడుతాను; నీవు నేఁడు వీక్షింపుము= ఇప్పుడే నీవు చూద్దువుగాని!

**తా :** పద్మముఖీ! ఇప్పుడే హాలాహలాన్ని దండిస్తాను. తియ్యని చిన్నపండు రసాన్ని తాగినట్టు తాగేస్తాను. జీవలోకాన్నంతటినీ కాపాడుతాను. నీవు చూస్తూ ఉండు.

**వ. అని పలికిన ప్రాణవల్లభునకు వల్లభ 'దేవా! దేవర చిత్తంబుకొలంది నవధరింతురు గాక!' యని పలికె నని చెప్పిన యమ్మునీంద్రునకు నరేంద్రుం డిట్లనియె. 238**

**ప్రతి :** అని; పలికిన; ప్రాణవల్లభునకున్= ప్రాణేశ్వరునికి; వల్లభ= ప్రియురాలయిన సతీదేవి; దేవా= ఓ ప్రభూ; దేవరచిత్తంబు కొలఁది= మీ చిత్తం వచ్చినట్టు; అవధరింతురుగాక= నిశ్చయించుకోండి; అని, పలికెన్+అని= చెప్పిందని; ఆ+మునీంద్రునకున్= ఆ శుకమహర్షితో; నర+ఇంద్రుడు= పరీక్షిత్తు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** అని శివుడు పలుకగా సతీదేవి 'స్వామీ! మీ మనస్సుకు తగినట్టు నిర్ణయించుకోవచ్చు' అని పలికింది – అని చెప్పగా శుకమహర్షిని పరీక్షిత్తు ఇలా అడిగాడు.

**మ. అమరన్ లోకహితార్థమంచు నభవుండౌఁగాక యం చాడెఁబో**
**యమరుల్ భీతిని మ్రింగవే యనిరి వో యంభోజగర్భాదులుం**
**దముఁగావన్ హర! లెమ్ము లెమ్మనిరి వో తాఁజూచి కన్గంట న**
**య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానలజ్వాలలన్. 239**

**ప్రతి :** అమరన్= సముచితంగా తగినట్టు; లోకహితార్థము+అంచున్= లోకానికి మేలు కలుగుతుందని; అభవుండు= శివుడు; ఔన్+కాక+అంచున్+ఆడెఁబో= 'ఔను' (సరే!) అన్నాడనుకో; భీతిన్= ప్రాణభీతితో; అమరుల్= దేవతలు; మ్రింగుము+ఏ= స్వామీ! మింగవేమిటి!; అనిరి+పో= అన్నారనుకో; అంభోజ గర్భాదులున్= బ్రహ్మాదులుకూడా; తమున్+కావన్= తమను కాపాడటానికి; హర+లెమ్ము+లెమ్ము+అనిరి+పో= శివా! లేలే! అని అన్నారే అనుకో!; కన్గంటన్= కన్నులారా; తాన్+చూచి= తానిదంతా చూస్తుండి; ఆ+ఉమ= ఆ ఉమాదేవి; ప్రాణేశ్వరున్= తన భర్తను; ఆ+ఉగ్రానల+ జ్వాలలన్= ఆ హాలాహల విషాగ్ని జ్వాలలను; ఎట్లు+మ్రింగుమనె= ఎలా మింగుమని చెప్పింది! (ఏ భార్యా ఇలా ప్రవర్తించదు కదా!)

**తా :** ఆ సమయానికి తగినట్టు లోకానికి మేలు కలుగుతుందని శివుడు 'సరే' అన్నాడనుకో. భయంతో దేవతలు 'స్వామీ! ఈ విషాన్ని మింగివేయండి' అని కోరారే అనుకో. బ్రహ్మాదులు తమను కాపాడమని 'శివా!' లే – లే –' అని అన్నారే అనుకో. ఇదంతా కన్నులారా చూసికూడా తన భర్తను ఈ భయంకర విషాగ్ని జ్వాలలను తినండి అని ఆ ఉమాదేవి ఎలా చెప్పింది? (ఇది విడ్డూరంగా ఉందే) అని పరీక్షిత్తు ప్రశ్న.

**విశే :** దక్షుని కూతురు సతి. హిమవంతుని కూతురు 'ఉమ'. 'సతి' అవతారమే 'ఉమ' కాబట్టి ఈ సందర్భంలో పోతన గారు 'ఉమ' అని అంటున్నారు. కోరిచేసుకున్న వాడు కాబట్టి ప్రాణేశ్వరుడు.

**వ. అనిన శుకుండిట్లనియె. 240**

**ప్రతి :** అనినన్; శుకుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అని పరీక్షిత్తు అడుగగా శుకుడు ఇలా చెప్పాడు.

**క. మ్రింగెడువాఁడు విభుం డని, మ్రింగెడిదియు గరళ మనియు మే లని ప్రజకున్**
**మ్రింగు మనె సర్వమంగళ, మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో! 241**

**ప్రతి :** మ్రింగెడు వాఁడు= తింటున్నవాడు; విభుండు+అని= భర్తే అని; మ్రింగెడిదియున్= తింటున్నది; గరళమనియున్= విషమనీ; ప్రజకున్+మేలు+అని= లోకానికి మంచిదని (తెలిసి); సర్వమంగళ= పార్వతీదేవి; మ్రింగుము+అనెన్= మింగివేయండి అని చెప్పింది; మంగళసూత్రంబున్= తన మంగళసూత్రాన్ని; మదిన్= మనస్సులో; ఎంత నమ్మినదో= ఎంతగా నమ్ముకొన్నదో!

**తా :** తింటున్నవాడు తన భర్త అని, తింటున్నది విషమని, తింటే లోకానికి మేలవుతుందని తెలిసిన పార్వతి 'మింగివేయండి' (పరవాలేదు) అన్నది. ఆ తల్లికి ఆ స్వామి కట్టిన మంగళసూత్రం మీద ఎంత నమ్మకమో!

**విశే :** పార్వతికి 'సర్వమంగళ' అని పేరు. వధువులు భర్తల ప్రాణరక్షణార్థం మంగళగౌరీ వ్రతం చేస్తారు. ఈ కథే దీనికి మూలం.

**మ. తనచుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ బొబ్బిడన్**
**ఘనగంభీరరవంబుతో శివుఁడు లోకద్రోహి! హుం పోకు ర**
**మ్మని కెంగేలఁదెమల్చి కూర్చి కడిగా నంకించి జంబూఫలం**
**బన సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్. 242**

**ప్రతి :** తనచుట్టున్= తన చుట్టూ (చేరి); సురసంఘముల్= దేవతా సమూహాలు; జయజయధ్వానంబులన్= జయజయధ్వనులతో; బొబ్బ+ఇడన్= కేకలు వేయగా; ఘన గంభీరరవంబుతోన్= గొప్పదయిన గంభీరమయిన ధ్వనితో; శివుఁడు; లోకద్రోహి= ఓ లోకద్రోహీ!; హుం!+పోకు+రమ్ము+అని= 'పోవద్దు, రా, రా!' అంటూ; కెంగేలన్= తన ఎర్రని చేతితో; తెమల్చి= పట్టుకొని; కూర్చి= ఒక చోట చేర్చుకొని; కడిగాన్+అంకించి= ముద్దగా చేసుకొని; జంబూఫలంబు+అనన్= నేరేడు పండు అన్నట్టు; సర్వంకషమున్= అంతటా వ్యాపించిన; మహావిషమున్= ఆ గొప్పవిషాన్ని; హేలాగతిన్= విలాసంగా; ఆహారించెన్= ఆరగించాడు.

**తా :** తనచుట్టూ దేవతలంతా మూగి జయజయధ్వానాలతో పెద్దగా కేకలు వేస్తుండగా, గంభీరమైన కంఠధ్వనితో హుంకరిస్తూ 'ఒరే! లోకద్రోహీ! ఎక్కడికి పోతావు రా!' అంటూ తన ఎర్రని చేతులతో సర్వత్రా వ్యాపించిన ఆ విషాగ్నిని ఒకచోట చేర్చుకుని ఒక ముద్దలాగా మార్చుకొని నేరేడు పండును తిన్నంత సులభంగా విలాసంగా ఆరగించాడు.

**వ. అ య్యవిరళ మహాగరళ దహన పాన సమయంబున. 243**

**ప్రతి :** ఆ+అవిరళ= ప్రచండంగా అంతటా వ్యాపించిన; మహాగరళ= మహా విషమనే; దహన= అగ్నిని; పాన సమయంబునన్= తాగే సమయంలో...

**తా :** ఆ ప్రచండ విషాన్ని శివుడు ఆరగిస్తున్న సమయంలో

**మ. కదలంబాఱవు పాఁప పేరు; లొడలన్ ఘర్మాంబుజాలంబు వు**
**ట్టదు; నేత్రంబులు నెఱ్ఱగావు; నిజజూటాచంద్రుఁడుంగందఁడున్;**
**వదనాంభోజము వాడ; దా విషము నాహ్వానించుచో డాయుచోఁ**
**బదిలుండై కడి సేయుచోఁదిగుచుచో భక్షించుచో మ్రింగుచోన్. 244**

**ప్రతి :** పాము+పేరులు= సర్పహారాలు; కదలన్+పాఱవు= కదలలేదు; ఒడలన్= ఒంటిలో; ఘర్మ+అంబుజాలంబు+ పుట్టదు= చెమట బిందువులు పుట్టలేదు; నేత్రంబులున్+ఎఱ్ఱగావు= కళ్ళు ఎఱ్రబడలేదు; నిజజూటా= తన జటలోని; చంద్రుఁడున్+కందఁడున్= చంద్రుడు కందిపోలేదు; వదన+అంభోజము= ముఖమనెడి పద్మం; వాడదు= వాడిపోలేదు; ఆ విషమున్+ఆహ్వానించుచోన్= ఆ విషాన్ని రమ్మన్నపుడు (సర్పాలు కదలలేదు); డాయుచోన్= సమీపిస్తున్నపుడు (చెమట పట్టలేదు); పదిలుండై= నిర్భయుడై; కడి+చేయుచోన్= ముద్దచేస్తున్నపుడు (కళ్ళు ఎఱ్రబడలేదు, చంద్రుడు కందిపోలేదు); తిగుచుచోన్+భక్షించుచోన్+మ్రింగుచోన్= నోటిలో తీసికొని తిని మింగేటప్పుడు (వదనం ఎండిపోలేదు).

**తా :** ఆ మహావిషాగ్నిని రమ్మని పిలిచినపుడు ఆ వేడికి పాములు కదలి పారిపోలేదు. సమీపిస్తున్నపుడు ఆ మహాదేవుని దివ్యదేహానికి చెమట కూడా పట్టలేదు. దాన్ని నిమ్మళంగా ముద్దగా చేస్తున్నపుడు ఆ విషప్రభావంతో కళ్ళు ఎఱ్రబడలేదు; చంద్రుడు కందిపోలేదు. దాన్ని నోట్లో వేసుకొని, తిని మింగినపుడు నోరు ఎండిపోలేదు.

**క. ఉదరము లోకంబులకును సదనం బగు టెఱిఁగి శివుఁడు చటులవిషాగ్నిం**
**గుదురుకొనఁగంఠబిలమునఁబదిలంబుగ నిలిపె సూక్ష్మఫలరసము క్రియన్. 245**

**ప్రతి :** శివుఁడు= మహేశ్వరుడు; ఉదరము= తన కడుపు; లోకంబులకును= సకల ప్రపంచానికి; సదనంబు+అగుట+ ఎఱిఁగి= నిలయం (చోటు) అన్నది గుర్తించి; చటుల విష+అగ్నిన్= భయంకరమైన ఆ విషాగ్నిని; కుదురుకొనన్= చక్కగా ఒకచోట నిలిచేలా; కంఠ బిలమునన్= గొంతులో (గొంతు అనే గుంతలో); పదిలంబుగన్= జాగ్రత్తగా; సూక్ష్మ ఫలరసము క్రియన్= చిన్న పండు రసంలాగా; నిలిపెన్= నిల్పాడు.

**తా :** తన కడుపులో అన్ని లోకాలూ ఉంటాయని శివుడు స్మరించుకొని, తాగితే లోపలున్న లోకాలు భస్మమై పోతాయని, లోపలికి పోకుండా తన గొంతులోనే జాగ్రత్తగా కదిలి పొర్లిపోకుండా నిలుపుకొన్నాడు.

**క. మెచ్చిన మచ్చిక కలిగిన, నిచ్చిన నీవచ్చుఁగాక యిచ్చ నొరులకుం**
**జిచ్చుఁగడిగొనఁగ వచ్చునె, చిచ్చఱచూ పచ్చుపడిన శివునకుఁదక్కన్. 246**

**ప్రతి :** మెచ్చినన్= మెచ్చినపుడు; మచ్చిక కలిగినన్= స్నేహం కల్గినపుడు; ఇచ్చన్= తమకు ఇష్టం వచ్చినట్టు; ఇచ్చినన్+ఈ వచ్చున్+కాక= ఏదైనా ఇస్తే ఇవ్వవచ్చును గాక!; చిచ్చఱ చూపు+అచ్చుపడిన= అగ్ని నేత్రం అమరి ఉన్న; శివునకున్+తక్కన్= శివుడికి తప్ప; ఒరులకున్= ఇతరులకు; చిచ్చున్= అగ్గిని; కడిగొనఁగన్= ముద్దగా చేసి తినడానికి; వచ్చును+ఏ= సాధ్యమా!

**తా :** ఇతరులపై ప్రేమ పుట్టినపుడు, మెచ్చుకొన్నపుడు, తమకు ఇష్టం వచ్చినట్టు ఏదైనా ఈవచ్చు – కాని అగ్నిని ముద్దగా చేసి తినటానికి త్రినేత్రుడైన – చిచ్చర కన్నుగల ఒక్క శివుడికి తప్ప ఇతరులకు సాధ్యమవుతుందా!

**ఆ. హరుఁడు గళమునందు హాలాహలము వెట్టఁగప్పు గలిగి తొడవు కరణి నొప్పె;**
**సాధురక్షణంబు సజ్జనులకు నెన్న, భూషణంబు గాదె భూవరేంద్ర! 247**

**ప్రతి :** భూవరేంద్ర= ఓ రాజా!; హరుఁడు= శివుడు; గళమునందున్= గొంతులో; హాలాహలము+పెట్టన్= విషాన్ని నిలుపుకోగా; కప్పు+కలిగి= నల్లదనం ఏర్పడి; తొడవు+కరణిన్+ఒప్పెన్= అలంకారంలాగా అమరింది; సాధు రక్షణంబు= సాధువుల్ని కాపాడటం; ఎన్నన్= ఆలోచిస్తే; సజ్జనులకున్= మంచివారికి; భూషణంబు+కాదు+ఎ= అలంకారమే కదా!

**తా :** శివుడు తన గొంతులో ఆ విషాన్ని నిలుపుకోగా నల్లదనం ఏర్పడి అదీ ఒక అలంకారమయింది. సత్పురుషులకు సాధుసంరక్షణమే ఒక పెద్ద అలంకారం కదా!

**వ. తదనంతరంబ. 248**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= ఆ వెంటనే...

**తా :** ఆ తరువాత ఏమయిందంటే

**క. గరళంబుఁగంఠబిలమున హరుఁడు ధరించుటకు మెచ్చి యౌ నౌ ననుచున్**
**హరియు విరించియు నుమయును సురనాథుఁడుఁబొగడి రంత సుస్థిరమతితోన్. 249**

**ప్రతి :** అంతన్= ఆ పిమ్మట; హరుఁడు= శివుడు; కంఠబిలమునన్= గొంతులో; గరళంబున్= విషాన్ని; ధరించుటకున్+మెచ్చి= నిలపడాన్ని చూసి మెచ్చి; ఔను+ఔను+అనుచున్= మేలుమేలు అని; ప్రశంసిస్తూ; అంతన్= ఆ సమయంలో; హరియున్= శ్రీమహావిష్ణువు; విరించియున్= బ్రహ్మదేవుడు; ఉమయును= పార్వతీదేవియు; సురనాథుఁడున్= ఇంద్రుడూ; సుస్థిరమతితోన్= సుస్థిరమైనమతితో; మనసారా; పొగడిరి= పొగిడారు.

**తా :** మహేశ్వరుడు ఆ విధంగా గొంతులో ఆ మహావిషాగ్నిని ధరించటం చూసి విష్ణువు, బ్రహ్మ, పార్వతీదేవి, మహేంద్రుడు అందరూ మనసారా 'మేలుమేలు' అంటూ ప్రశంసించారు.

**క. హాలాహలభక్షణకథ హేలాగతి విన్న వ్రాయ నెలమిఁబఠింపన్**
**వ్యాళానలవృశ్చికముల పాలై చెడ రెట్టి జనులు భయవిరహితులై. 250**

**ప్రతి :** హాలాహల భక్షణ కథన్= ఈ హాలాహల భక్షణ గాథను; హేలాగతిన్= సంతోషంగా (లీలగా అర్థం చేసుకొని చదివినా చాలని అర్థం); విన్నన్= వినినా; వ్రాయన్= రాసినా; ఎలమిన్= ఇష్టంతో; పఠింపన్= చదివినా; వ్యాళ= పాములు; అనల= అగ్ని; వృశ్చికముల= తేళ్ళు; పాలై= వాటి బారినపడి; ఎట్టిజనులు= ఎలాంటివారైనా సరే; భయవిరహితులు+ఐ= భయం పొందకుండా (ఉంటారు); చెడరు= నశించరు (చావరు).

**తా :** ఈ హాలాహల భక్షణ కథను లీలగా విలాసంగా విన్నా, రాసినా, ఇష్టంతో చదివినా, పాములవల్ల, తేళ్ళవల్ల ఆపదలు పొందకుండా ఉంటారు. అగ్నివల్ల కూడా బాధపడరు.

**వ. మఱియు నా రత్నాకరంబు సురాసురులు ద్రచ్చునెడ. 251**

**ప్రతి :** మఱియున్= ఇంకా; సురాసురులు= దేవతలు, రాక్షసులు; ఆ రత్నాకరంబున్= ఆ సముద్రాన్ని; త్రచ్చున్+ఎడన్= చిలుకుతున్న సమయంలో...

**తా :** అనంతరం దేవాసురులు ఆ సముద్రాన్ని చిలకడం కొనసాగించారు.

## ✤ పాలకడలిం దరుచునెడ నైరావతాదులు జనించుట ✤

**క. తెల్లని మేనును నమృతము జిల్లున జల్లించు పొదుఁగు శితశృంగములుం**
**బెల్లుగ నర్థుల కోర్కులు వెల్లిగొలుపు మొదవు పాలవెల్లిం బుట్టెన్. 252**

**ప్రతి :** తెల్లనిమేనును= తెల్లటిదేహం; అమృతము+జిల్లునన్+చల్లించు= అమృతాన్ని జిల్లని కార్చగల; పొదుఁగున్= పొదుగూ; శితశృంగములున్= వాడియైన కొమ్ములూ; పెల్లుగన్= మిక్కిలిగా; అర్థులకోర్కులు= కోరిన వారి కోరికలు; వెల్లిగొలుపున్= కురిపించే; మొదవు= ఆవు; పాలవెల్లిన్= పాలసముద్రంలో; పుట్టెన్= పుట్టింది.

**తా :** ఇలా సముద్రాన్ని చిలుకుతుండగా పాలసముద్రంలో నుండి మొదట కామధేనువు పుట్టింది. అది తెల్లటి శరీరమూ; పాలను జిల్లుమంటూ ధారగా కార్చగల పొదుగునూ చక్కని కొమ్ముల్నీ కల్గి ఉంది; కోరినవారి కోరికలను తీర్చే వేల్పుటావు అది.

**ఆ. అగ్నిహోత్రి యనుచు నా సురభిని దేవ మునులు పుచ్చికొనిరి మున్నెఱింగి**
**విబుధసంఘములకు వెరవుతో నధ్వర హవులు వెట్టుకొఱకు నవనినాథ! 253**

**ప్రతి :** అవనినాథ= ఓ రాజా!; ఆ సురభిని= ఆ కామధేనువును; అగ్నిహోత్రి+అనుచున్= అగ్నిహోత్రానికి (హోమకార్యాలకు) తగిందని; దేవమునులు; మున్ను+ఎఱింగి= ముందుగానే గుర్తించి; విబుధ సంఘములకున్= దేవతల సముదాయానికి; వెరవుతో= నేర్పుతో (తగినట్టు); అధ్వరహవులు= యాగహవిస్సులు; పెట్టుకొఱకున్= సమర్పించడానికి; పుచ్చికొనిరి= గ్రహించారు.

**తా :** ఆ కామధేనువు హోమకార్యాలకు తగిందని ముందుగానే గుర్తించిన దేవమునులు, దేవతలకు తగిన విధంగా యాగహవిస్సులు సమర్పించడానికి కావలసిన (పాలు, పెరుగు, నెయ్యి – గోమూత్రం – పేడ – ఇత్యాది పంచగవ్యాన్ని) సామగ్రిని సమకూరుస్తుందని గ్రహించారు.

**వ. మఱియు నా జలరాశియందు. 254**

**ప్రతి :** మఱియున్= ఇంకనూ; ఆ జలరాశియందు= ఆ సముద్రంలో...

**తా :** ఇంకా ఆ సముద్రంలో

**క. సచ్చంద్రపాండురంబై యుచ్చైశ్శ్రవ మనఁగఁదురగ మొగి జనియించెం**
**బుచ్చి కొనియె బలి దైత్యుం డిచ్చఁగొనం డయ్యె నింద్రుఁడీశ్వరశిక్షన్. 255**

**ప్రతి :** ఒగిన్= వరుసగా; సత్+చంద్ర+పాండురంబు+ఐ= చక్కని చంద్రకాంతితో తెల్లనై; ఉచ్చైశ్శ్రవము+అనఁగన్= ఉచ్చైశ్రవం అనే పేరుతో; తురగము+జనియించెన్= గుర్రం పుట్టింది; బలిదైత్యుండు= బలి అనే దైత్యచక్రవర్తి; పుచ్చికొనియెన్= దాన్ని గ్రహించాడు; ఇంద్రుఁడు= మహేంద్రుడు; ఈశ్వర శిక్షన్= ముందే విష్ణువు చెప్పిన రీతిగా; ఇచ్చఁ+కొనండు+అయ్యెన్= దాన్ని గ్రహించడానికి ఇష్టపడలేదు.

**తా :** తరువాత స్వచ్ఛమైన తెల్లని చంద్రకాంతితో ఉచ్చైశ్రవమనబడే గుర్రం సముద్రంలోంచి పుట్టింది. దాన్ని దైత్యచక్రవర్తి బలి గ్రహించాడు. మునుపు విష్ణువు బోధించి ఉండటం వల్ల 'కామరోషాలకు' పోకూడదని ఇంద్రుడు దాన్ని గ్రహించలేదు.

**క. ఒఱ పగు నురమును బిఱుఁదును, నెఱిఁదోకయు ముఖము సిరియు నిర్మలఖురముల్**
**కుఱుచ చెవులుఁదెలిగన్నులుఁదఱచగు కందంబుఁజూడఁదగు నా హరికిన్. 256**

**ప్రతి :** ఆ హరికిన్= ఆ గుఱ్ఱానికి; ఒఱపగు+ఉరమునున్= అందమైన రొమ్ము; పిఱుఁదును= చిక్కనైన పిరుదు; నెఱిన్+ తోకయున్= చక్కని తోకా; ముఖము సిరియున్= లక్షణమైన కాంతులీనే ముఖమూ; నిర్మలఖురముల్= స్వచ్ఛమైన గిట్టలు; కుఱుచ చెవులున్= పొట్టి చెవులు; తెలి+కన్నులున్= శుభ్రమైన కన్నులు; తఱచగు కందంబున్= నిగనిగలాడే మూపు కలిగి; చూడన్+తగున్= చూడటానికి ముచ్చటగా ఉంది.

**తా :** ఆ గుఱ్ఱానికి అందమైన రొమ్ము, చిక్కనైన పిరుదు, చక్కని తోకా, లక్షణమైన కాంతులీనే ముఖమూ, స్వచ్ఛమైన గిట్టలు, కురుచైన చెవులు, శుభ్రమైన కన్నులు, నిగనిగలాడే మూపు కలిగి చూడ ముచ్చటగా ఉంది.

**వ. అంత న ప్పాలకుప్పయందు. 257**

**ప్రతి :** అంతన్= అంతలో; ఆ+పాలకుప్ప+అందున్= ఆ పాలకడలియందు...

**తా :** అంతలో ఆ క్షీరసాగరంలో

**క. దంతచతుష్టాహతి శైలాంతంబులు విఱిగి పడఁగ నవదాత కుభృ**
**త్కాంతంబగు నైరావతదంతావళ ముద్భవించె ధరణీనాథా! 258**

**ప్రతి :** ధరణీనాథా= రాజా!; దంత+చతుష్టాహతిన్= తన నాలుగు దంతాల దెబ్బతో; శైలాంతంబులు= కొండశిఖరాలు కూడ; విఱిగి పడఁగన్= విరిగిపడిపోయేలా చేయగల; అవదాత= తెల్లనైన; కుభృత్+కాంతంబు+అగు= పర్వతంవలె అందమైనదగు (వెండికొండ వలె); ఐరావత+దంతావళము= ఐరావతమనే ఏనుగు; ఉద్భవించెన్= పుట్టింది.

**తా :** తరవాత ఆ పాలసముద్రంలో ఐరావతమనే ఏనుగు జన్మించింది. దానికి నాలుగు దంతాలున్నాయి. వాటిలో కొండల శిఖరాల్ని కూడా కూల్చివేయగల ఆ గజరాజు వెండి కొండలా అతిమనోహరంగా విరాజిల్లుతూ ఉంది.

**క. తడలేని నడపు, వడి గల యొడలును, బెను నిడుదకరము, నురుకుంభములున్**
**బెడఁగై యువతుల మురిపపు నడకలకున్ మూలగురు వనన్ గజ మొప్పెన్. 259**

**ప్రతి :** తడలేని నడపు వడిగల= తడబాటులేని నడక, వేగం ఉన్న; ఒడలును= శరీరం; పెను నిడుదకరమున్= పెద్దదైన పొడవైన తొండం; ఉరుకుంభములున్= పెద్ద కుంభస్థలం; బెడఁగు+ఐ= అతిశయించి; యువతుల+మురిపపు+నడకలకున్= ప్రాయపు ఆడవారి కులుకు నడకలకు; మూల గురువు+అనన్= ఒజ్జబంతి అనేవిధంగా; గజము+ఒప్పెన్= ఆ ఏనుగు ప్రకాశించింది.

**తా :** ఆ ఐరావతం గొప్ప అతిశయమైన సౌందర్యం తడబాటులేని వేగం గల నడక; పెద్దకుంభస్థలం, పొడవైన పెద్ద తొండం కలిగి, ప్రాయపు ఆడవారి కులుకునడకలకు ఒజ్జబంతి అనే తీరుగా ప్రకాశించింది.

**వ. మఱియు నత్తరంగిణీవల్లభు మథించు నయ్యెడ. 260**

**ప్రతి :** మఱియున్= ఇంకనూ; ఆ+తరంగిణీ వల్లభు= నదుల వల్లభుని (సముద్రాన్ని); మథించు= చిలికే; ఆ+యెడన్= ఆ సమయంలో...

**తా :** ఇంకా ఆ సముద్రాన్ని మథిస్తున్న సమయంలో

**ఆ. ఎల్ల ఋతువులందు నెలరారి పరువమై యింద్రు విరులతోఁట కేపు దెచ్చి**
**కోరి వచ్చువారి కోర్కుల నీనెడు వేల్పుమ్రాను బాలవెల్లిఁబుట్టె. 261**

**ప్రతి :** ఎల్ల ఋతువులందున్= అన్ని ఋతువులలోనూ; ఎలరారి= విరబూసి; పరువము+ఐ= ప్రాయం గలదై; ఇంద్రువిరులతోఁటకున్= మహేంద్రుని నందనవనానికి; ఏపు+తెచ్చి= ఇంపును కూర్చేటటువంటిది; కోరివచ్చువారి= అర్థులయొక్క; కోర్కులన్+ఈనెడు= కోర్కెలు నెరవేర్చే; వేల్పుమ్రాను= కల్పవృక్షం; పాలవెల్లిన్= క్షీరసాగరంలో; పుట్టెన్= పుట్టింది.

**తా :** ఆ తరువాత ఆ సముద్రంలో కల్పవృక్షం పుట్టింది. అది అన్ని ఋతువులలోనూ విరబూసి రాలిపోని పూలతో అలరారుతూ ఇంద్రుని నందనవనానికి శోభగూర్చేది, కోరినవారి కోర్కెలు నెరవేర్చేది.

**వ. మఱియునుం గొండకవ్వంబునం గడలి మథింప నప్సరోజనంబు జనించె; నంత. 262**

**ప్రతి :** మఱియునున్= ఇంకనూ; కొండ కవ్వంబునం= మందరపర్వతంతో; కడలి= సముద్రాన్ని; మథింపన్= చిలకగా; అప్సరస్+జనంబు= అప్సరసలు; జనించెన్= పుట్టారు; అంతన్= ఆ తరువాత...

**తా :** ఇంకా మందర పర్వతం సాయంతో ఆ సముద్రాన్ని చిలకగా అప్సరసలు పుట్టారు.

**క. క్రొక్కారు మెఱుఁగుమేనులు, గ్రిక్కిరిసిన చన్నుగవలుఁగ్రిస్సిన నడుముల్**
**పిక్కటిలి యున్న తుఱుములుఁజక్కని చూపులును దివిజసతులకు నొప్పెన్. 263**

**ప్రతి :** క్రొక్కారు మెఱుఁగు మేనులు= వాన కాలంలోని మెరుపు తీగల వంటి శరీరాలు; క్రిక్కిరిసిన చన్నుగవలు=చిక్కని చక్కని స్తనాలు; క్రిస్సిన నడుముల్= సన్ననైన నడుములు; పిక్కటిలి+ఉన్న+తుఱుములున్= నిండైన కొప్పులు; చక్కని చూపులును= అందమైన చూపులు; దివిజసతులకున్+ఒప్పెన్= ఆ అప్సరసలకు అమరి ఉన్నాయి.

**తా :** ఆ అప్సరసల దేహాలు వాన కాలంలోని మెరపుతీగల్లా ఉన్నాయి. చిక్కని చక్కని స్తనాలు, సన్ననైన నడుములు, నిండైన కొప్పులు, అందమైన చూపులు వారికి అమరి ఉన్నాయి.

**వ. మఱియు నా రత్నాకరంబు నందు సుధాకరుం డుద్భవించి, విరించి యనుమతంబునఁదన యథాస్థానంబునం బ్రవర్తించుచుండె; నంత. 264**

**ప్రతి :** మఱియున్= ఇంకా; ఆ+రత్నాకరంబు నందున్= ఆ సముద్రంలో; సుధాకరుండు= చంద్రుడు (అమృత కిరణాలు కల్గినవాడు); ఉద్భవించి= పుట్టి; విరించి అనుమతంబునన్= బ్రహ్మదేవుని అనుమతితో; తన యథాస్థానంబునన్= తన తొలిస్థానంలోనే; ప్రవర్తించుచుండెన్= నిలిచి ఉన్నాడు; అంతన్= అప్పుడు...

**తా :** ఇంకా ఆ సముద్రంలో చంద్రుడు పుట్టాడు. బ్రహ్మ అనుమతితో తన తొలిస్థానానికి వెళ్ళిపోయి అక్కడ నిలిచాడు.

**విశే :** సూర్యచంద్రులు ఇప్పటివారు కారు. సృష్ట్యాది నుంచి ప్రవర్తిస్తున్నవారే. కనుకనే చంద్రుడు తన లోకానికి వెళ్ళిపోయాడని చెప్పటం. అంటే దూర్వాసుని శాపం వల్ల సంపదలో భాగంగా చంద్రుడూ సముద్రంలోకి వెళ్ళిపోయాడని సాంకేతికార్థం.

**క. తొలుకారుమెఱుఁగుకైవడిఁదళ తళ మని మేను మెఱయ ధగ ధగ మనుచున్**
**గలుముల నీనెడు చూపులఁజెలువంబుల మొదలి టెంకి సిరి పుట్టె నృపా! 265**

**ప్రతి :** నృపా= ఓ రాజా!; తొలుకారుమెఱుఁగుకైవడి= వర్షారంభకాలంలో పుట్టే కొత్త మెఋపు తీగలాగా; తళతళమని మేను మెఱయన్= తళతళమని మెరిసే శరీరంతో; ధగధగమనుచున్= ధగధగలాడుతూ; కలుములన్+ఈనెడు+చూపులన్= సంపదలను పుట్టించే చూపులతో; చెలువంబుల= అందచందాలకు; మొదలి టెంకి= పెన్నిధి (మూలధనమైన); సిరి= శ్రీదేవి; పుట్టెన్= పుట్టింది.

**తా :** తరువాత ఆ సముద్రంలో నుండి తళతళమని మెరుస్తున్న శరీరంతో; ధగధగలాడుతూ సంపదల్ని వర్షించే చూపులతో, అందచందాల పెన్నిధి అయిన శ్రీమహాలక్ష్మి పుట్టింది.

**విశే :** మూలంలో 'సాక్షాత్ శ్రీరమా భగవత్ పరా' అని వ్యాసుడు అన్నారు (8–8–8). పుట్టినది శ్రీహరిని రంజింపచేసే శ్రీదేవి. ఆమె భగవంతుని యందు పరిపూర్ణమైన అనురాగం కల్గింది– అని అర్థం. ఈ విషయాన్ని ఇలా ప్రారంభంలో పోతన చెప్పలేదు. ఈ ఘట్టాన్ని ఎంతో వర్ణించి కావ్యసౌందర్యాన్ని ఆపాదించారు. శ్రీసూక్తంలో లక్ష్మి 'హిరణ్యవర్ణ' అని చెప్పబడింది. అదే ఈ కాంతిశోభ.

**సీ. పాలమున్నీటి లోపలి మీఁది మీఁగడ, మిసిమి జిడ్డునఁజేసి మేను వడసి**
**క్రొక్కారు మెఋఁగుల కొనల తళుక్కుల మేనిచే గలనిగ్గు మెఋఁగు సేసి**
**నాడునాఁటికిఁబ్రోది నవకంపుఁదీవల నునుబోద నెయ్యంబు నూలుకొలిపి**
**క్రొవ్వారు కెందమ్మి కొలఁకులఁబ్రొద్దునఁబొలసిన వలపులఁబ్రోది వెట్టి**

**తే. పసిఁడి చంపక దామంబు బాగుఁగూర్చి, వాలు క్రొన్నెల చెలువున వాఁడి దీర్చి**
**జాణతనమునఁజేతుల జడ్డు విడిచి, నలువ యీ కొమ్మ నొగిఁజేసినాఁడు నేఁడు. 266**

**ప్రతి :** నలువ= బ్రహ్మ; జాణతనమునన్= నేర్పరితనంతో; చేతుల; జడ్డువిడిచి= అలసత్వాన్ని విడిచిపెట్టి; పాలమున్నీటి లోపలి= పాలసముద్రంలోని; మీఁది మీఁగడ= పై తెట్టుకట్టిన మీగడ యొక్క; మిసిమి+జిడ్డునన్+చేసి= మిసమిసలతో; మేను+పడసి= మేను పొందేలా; క్రొక్కారు= వర్షారంభ సమయంలో; మెఋఁగుల కొనల తళుక్కుల మేనిచేన్= మెరిసే మెరుపు తీగల అంచులలోని సరికొత్త కాంతులతోడి దేహంచేత; కలనిగ్గు+మెఋఁగు+చేసి= మిక్కిలి కాంతి ప్రకాశాలుండేలా; నాఁడు+నాఁటికిన్= నిత్యనూతనంగా (ప్రతిరోజూ); నవకంపున్+తీవలన్+ప్రోది= కోమలమైన తీగల చెలువంతో కలిపి; నునుఁ బోద నెయ్యంబు నూలుకొలిపి= లేత కాండములతో స్నేహమును కుదిర్చి; క్రొవ్వారు= బాగా విరిసిన; కెందమ్మి+కొలఁకులన్= ఎర్ర తామరలున్న కొలనులో; ప్రొద్దునన్+పొలసిన= ఉదయాననే వెదజల్లే; వలపులన్+ప్రోది+పెట్టి= సువాసనలతో కలిసి; పసిఁడి= బంగారు; చంపక= సంపెంగ; దామంబు+బాగున్+కూర్చి= దండలయొక్క అందాన్ని చేర్చి; వాలు+క్రొన్నెల+ చెలువునన్+వాఁడి+తీర్చి= బాలచంద్రుని సొగసుతో పదునువెట్టి; ఈ కొమ్మను= ఈ స్త్రీని; నేఁడు= ఈ రోజు; ఒగిన్+చేసినాడు= క్రమంగా తయారుచేశాడు.

**తా :** బ్రహ్మదేవుడు అలసత్వం వీడి పాలసముద్రం పైన తేలిన మీగడ మిసమిసలతో ఈమె దేహాన్ని నేర్పుగా తీర్చిదిద్దాడు. వర్షాకాలంలోని తొలి మెరుపుల అంచులలోని సరికొత్త కాంతిరేఖలతో మెరుగు పెట్టి; కోమలమైన తీగల నున్నటి చెలువంతో నిత్యమూ చెలిమిచేయించి; విరిసిన ఎర్రతామరల కొలనులో ఉదయాననే వెదజల్లే సువాసనలతో కలిపి, బంగారు సంపెంగల దండ అందాన్ని సమకూర్చి; బాలచంద్రుని సొగసుతో పదును పెట్టి ఈ అందాలరాశిని సృష్టించాడా అన్నట్టు లక్ష్మీదేవి ఒప్పారింది.

**క. కెంపారెడు నధరంబును, జంపారెడి నడుము సతికి శంపారుచులన్**
**సొంపారు మోముఁగన్నులుఁబెంపారుచు నొప్పుగొప్పుఁబిఱుఁదును గుచముల్. 267**

**ప్రతి :** సతికిన్= ఆ లక్ష్మీదేవికి; కెంపారెడు+అధరంబును= ఎఱ్ఱబారిన పెదవి; జంపారెడి నడుమున్= సన్నబారిన నడుము; శంపారుచులన్= మెరపు తీగల కాంతులతో; సొంపారు మోమున్+కన్నులున్= ప్రకాశించే ముఖము, కన్నులు; పెంపారుచున్+ఒప్పు+కొప్పున్+పిఱుఁదునున్+కుచముల్= సమృద్ధంగా ఉన్న కొప్పు; పిఱుదులు; కుచములు (అమరాయి).

**తా :** ఆ తల్లికి ఎఱ్ఱని పెదవి, సన్నబారిన నడుము, మెరపు కాంతులతో ప్రకాశించే ముఖము, కన్నులు; సమృద్ధంగా ఉన్న కొప్పు, పిరుదులు, కుచాలు అమరి ఉన్నాయి.

**వ. అని జనులు పొగడు చుండ. 268**

**ప్రతి :** అని= అంటూ; జనులు= ప్రజలు; పొగడుచుండన్= పొగడుతుండగా...

**తా :** అని జనులందరూ పొగడుతూ ఉండగా

**సీ. తరుణికి మంగళస్నానంబు సేయింత మని పెట్టె నింద్రుఁడనర్ఘమైన**
**మణిమయపీఠంబు; మంగళవతులైన వేలుపుగరితలు విమలతోయ**
**పూర్ణంబులై యున్న పుణ్యాహకలశంబు లిడిరి వల్లవముల నిచ్చె భూమి;**
**గడిమి గోవులు పంచగవ్యంబులను నిచ్చె మలసి వసంతుఁడు మధు వొసంగె;**

**తే. మునులు కల్పంబుఁజెప్పిరి మొగిలుగములు, పణవగోముఖకాహళపటహమురజ**
**శంఖవల్లకీవేణునిస్వనము లిచ్చెఁ, బాడి రాడిరి గంధర్వపతులు సతులు. 269**

**ప్రతి :** తరుణికిన్= లక్ష్మీదేవికి; మంగళస్నానంబు= మంగళస్నానం; చేయింతము+అని= చేయిద్దామని; ఇంద్రుఁడు= మహేంద్రుడు; అనర్ఘమైన= వెలలేని; మణిమయ పీఠంబున్= మణులతో కూడిన పీఠాన్ని; పెట్టెన్= సిద్ధంగా తెచ్చిపెట్టాడు; మంగళవతులైన వేలుపు గరితలు= సుమంగళులైన దేవతాకాంతలు; విమలతోయ పూర్ణంబులు+ఐ+ఉన్న= నిర్మలమైన నీటితో నిండిన; పుణ్యాహకలశంబులు+ఇడిరి= పుణ్యకలశాలు (కుండలు) తెచ్చిఉంచారు; భూమి= భూదేవి; పల్లవములను+ఇచ్చెన్= చిగుళ్ళ నిచ్చింది (పంచపల్లవాలను పూజలో వాడుతారు); కడిమిన్+గోవులు= సమృద్ధిగా గోవులు; పంచగవ్యంబులనున్+ఇచ్చెన్= పంచగవ్య సామగ్రిని తెచ్చి ఇచ్చాయి; మలసి వసంతుఁడు= ఉత్సహించిన వాడైన వసంతుడు; మధువు+ఒసంగెన్= తేనె సిద్ధం చేశాడు; మునులు= దేవమునులు; కల్పంబున్+చెప్పిరి= సంకల్పం చెప్పారు; మొగిలుగములు= మేఘ సమూహాలు; పణవ= పణవ వాద్యాల యొక్క; గోముఖ= గోముఖాలయొక్క; కాహళ= బాకాలయొక్క; పటహ= తప్పెటలయొక్క; మురజ= మద్దెలలయొక్క; శంఖ= శంఖముల యొక్క; వల్లకీ= ఒక విధమైన వీణలయొక్క; వేణు= వేణువులయొక్క; నిస్వనములు+ఇచ్చెన్= ధ్వనులను ఇచ్చాయి; గంధర్వపతులు, సతులు= గంధర్వ పురుషులు, వారి భార్యలు; పాడిరి+ఆడిరి= పాడారు, ఆడారు.

**తా :** అప్పుడే ప్రభవించిన లక్ష్మీదేవికి మంగళస్నానం చేయించడానికి సంకల్పించి ఇంద్రుడు అమూల్యమైన రత్నమయపీఠం సమకూర్చాడు. సుమంగళులైన దేవకాంతలు పుణ్యాహ స్నానానికి నదీతీర్థాలను కడవలతో నింపి తెచ్చారు. భూదేవి

పంచపల్లవాలను ఇచ్చింది. గోవులు పంచగవ్యాలను సిద్ధం చేశాయి. మేఘాలు పణవాలు, గోముఖాలు, బాకాలు, తప్పెటలు, మృదంగాలు, శంఖాలు, వీణెలు, ప్లిలనగోవులూ పుట్టించే శబ్దాలను అనుకరిస్తూ గర్జించాయి. గంధర్వులు పాడగా, గంధర్వకాంతలు నృత్యం చేశారు.

**విశే :** ఇంద్రాదులు క్షీరసాగరమథనాన్ని సంకల్పించడానికి 'సంపద' సముద్రంలో కలిసిపోవటం మొదటి కారణం. రాక్షసులచేత దేవతలు చనిపోతూ ఉండటం రెండవ కారణం. అందువల్ల లక్ష్మి ఆవిర్భవించగానే వారి సంపదలన్నీ తిరిగి వచ్చినట్టే – అందుకే సముద్రంలో పడి ఉండిన దోషప్రాయశ్చిత్తం కోసం 'పుణ్యాహవాచనం' ఇంద్రుడు సంకల్పించాడు. దానికి ముందు మంగళస్నానం కావాలి. ముత్తయిదువను పీఠం మీదనే అభిషేకించాలి. కనుక అమూల్యమైన రత్నపీఠం సిద్ధం చేశారు.

లక్ష్మీపూజలో పంచపల్లవాల ప్రసక్తి ఉంది. రావి, మర్రి, మామిడి, మేడి, జువ్వి అనేవి పంచ పల్లవాలు. పంచ పల్లవాలను కలశంలో నిక్షిప్తం చేసి పూజించటం సంప్రదాయం.

పంచగవ్యం – ఆవుకు సంబంధించిన ఐదు వస్తువులు (గవ్యం= గోసంబంధం ఉన్నది) – పాలు, పెరుగు, నెయ్యి, పేడ, మూత్రం – వీటిని మిశ్రమం చేస్తే 'పంచగవ్య' మంటారు. శుచిత్వ సిద్ధికోసం పంచగవ్య ప్రాయశ్చిత్తం చేసుకొంటారు. యజ్ఞం ముందు ఈ ప్రాయశ్చిత్తం తప్పకుండా ఉంటుంది.

**క. పండితసూక్తుల తోడుతఁదుండంబులు సాఁచి తీర్థతోయములెల్లం**
**గుండముల ముంచి దిగ్వేదండంబులు జలక మార్చెఁదరుణీమణికిన్. 270**

**ప్రతి :** పండిత సూక్తుల తోడుతన్= బ్రహ్మాదులైన దేవమునుల వేదమంత్రాలతో; దిక్+వేదండంబులు= దిగ్గజాలు; తుండంబులు సాఁచి= తొండాలను సాచి; తీర్థ తోయములెల్లన్= తీర్థ జలాలన్నింటిని; కుండములన్+ముంచి= కుండలతో ముంచి; తరుణీమణికిన్= లక్ష్మీదేవికి; జలకము+ఆర్చెన్= స్నానం చేయించాయి.

**తా :** దేవమునులు వేదమంత్రాలు చదువుతుండగా, దిగ్గజాలు పుణ్యతీర్థాలలోని పవిత్రజలాలను తమ తొండాలు సాచి కుండలతో గ్రహించి అమ్మవారికి అభిషేకం చేశాయి.

**సీ. కట్టంగఁబచ్చని పట్టుఁబుట్టముదోయి ముదితకుఁదెచ్చి సముద్రుఁడిచ్చె**
**మత్తాళినికరంబు మధువాన మూఁగిన వైజయంతీమాల వరుణుఁడిచ్చెఁ**
**గాంచనకేయూరకంకణకింకిణీకటకాదులను విశ్వకర్మ యిచ్చె**
**భారతి యొక మంచి తారహారము నిచ్చెఁబాణిపద్మము నిచ్చెఁపద్మభవుఁడు**

**తే. కుండలివ్రజంబు గుండలముల నిచ్చె, శ్రుతులు భద్రమైన నుతులు సేసె**
**నెల్ల లోకములకు నేలిక సానివై, బ్రదికె దనుచు దిశలు పలికె నధిప! 271**

**ప్రతి :** అధిప= ఓ రాజా; కట్టంగన్= కట్టుకోవడానికి; పచ్చని పట్టున్+పుట్టము+దోయిన్= బంగారు పట్టువస్త్రాల జతను; ముదితకున్= లక్ష్మీదేవికి; సముద్రుఁడు+తెచ్చి+ఇచ్చెన్= సముద్రుడు తెచ్చి ఇచ్చాడు; వరుణుఁడు= వరుణదేవుడు; మత్త+అళి నికరంబు= మదించిన తుమ్మెదల సమూహం; మధువానన్+మూఁగిన= మకరందం తాగడానికి ముసిరిన;

వైజయంతీమాలన్= వైజయంతీ మాలికను; ఇచ్చెన్= ఇచ్చాడు; విశ్వకర్మ= దేవతా శిల్పియైన విశ్వకర్మ; కాంచన= బంగారుతో చేసిన; కేయూర= బాహుపురులను (బాజుబందీలు); కంకణ= గాజులు; కింకిణీ= గజ్జెలు; కటకాదులు= కడియాలు మొదలైన నగలను; ఇచ్చెన్= ఇచ్చాడు; భారతి= సరస్వతీదేవి; ఒక; మంచితారహారమునిచ్చెన్= మంచి ముత్యాలహారాన్ని ఇచ్చింది; పద్మభవుఁడు= బ్రహ్మ; పాణిపద్మమున్+ఇచ్చెన్= చేతిలో ధరించే లీలా కమలాన్ని ఇచ్చాడు; కుండలి వ్రజంబు= నాగుల సమూహం; కుండలములన్+ఇచ్చెన్= కుండలాలు ఇచ్చింది; శ్రుతులు= వేదాలు; భద్రము+ఐన= మంగళప్రదమైన; నుతులు= స్తుతులు; చేసెన్= చేశాయి; దిశలు= దిక్కులన్నీ; ఎల్లలోకములకున్= అన్నిలోకాలకూ; ఏలికసానివి+ఐ= మహారాజ్ఞివై; బ్రదికెదు+అనుచున్= బతుకుతావు అంటూ; పలికెన్= ఆశీర్వదించాయి.

**తా :** సముద్రుడు లక్ష్మీదేవికి ధరించడానికి పట్టుబట్టల జతను సమర్పించాడు. వరుణుడు తుమ్మెదలు మూగిన వైజయంతీమాలను ఇచ్చాడు. విశ్వకర్మ అమ్మవారికి బంగారుతో చేసిన బాజుబందీలు, గాజులు, గజ్జెలు, కడియాలు సమర్పించాడు. సరస్వతీదేవి మంచిముత్యాల హారాన్ని ఇచ్చింది. వేదాలు మంగళప్రదమైన మంత్రాలను సమర్పించాయి. దిక్కులన్నీ కలిసి 'అన్ని లోకాలకూ మహారాజ్ఞిగా జీవిస్తావు' అని దీవించాయి.

**వ. మఱియును. 272**

**తా :** ఇంకనూ

**సీ. పలుకుల నమృతంబు చిలుక నెవ్వానితో భాషించె వాఁడెపో బ్రహ్మయనఁగ**
**నెలయించి కెంగేల నెవ్వని వరియించె వాఁడె లోకములకు వల్లభుండు**
**మెయిదీఁగ నెవ్వని మేనితోఁగదియించె వాఁడెపో పరమసర్వజ్ఞమూర్తి**
**నెలఁతుక యెప్పుడు నివసించు నేయింట నాయిల్లు పరమగు నమృతపదము**

**ఆ. నింతి చూపు వాఱె నెచ్చోటి కచ్చోటు, జిష్ణుధనదధర్మజీవితంబు**
**గొమ్మ పిన్ననగవు గురుతరదుఃఖ ని, వారణంబు సృష్టికారణంబు. 273**

**ప్రతి :** పలుకులన్= మాటలలో; అమృతంబు చిలుకన్= అమృతం ఒలికిస్తూ; ఎవ్వానితోన్= ఎవ్వనితో; (ఈమె); భాషించెన్= మాట్లాడుతుందో; బ్రహ్మ+అనఁగన్= బ్రహ్మదేవుడంటే; వాఁడె+పో= అతడే; ఎలయించి= ఊరించి; కెంగేలన్= తన ఎఱ్ఱని చేతులతో; ఎవ్వనిన్+వరియించెన్= ఎవడిని వరిస్తుందో; వాఁడె= అతడే; లోకములకున్= అన్నిలోకాలకూ; వల్లభుండు= చక్రవర్తి; మెయిదీఁగన్= తన తీగవంటి దేహాన్ని; ఎవ్వని మేనితోన్+కదియించెన్= ఎవడి దేహంతో చేరుస్తుందో; వాఁడె+పో= అతడే; పరమ సర్వజ్ఞమూర్తి= శ్రేష్ఠుడైన సర్వజ్ఞుడు; నెలఁతుక= ఈ స్త్రీ; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; ఏ ఇంటన్+నివసించున్= ఏ ఇంట్లో నివసిస్తుందో; ఆ+ఇల్లు= ఆ ఇల్లే; పరము+అగు= శ్రేష్ఠమైన; అమృతపదము= ఉన్నతస్థానం (విష్ణుపరంగా వైకుంఠం); ఇంతిచూపు= ఈ స్త్రీ చూపులు; ఎచ్చోటికిన్+పాఱెన్= ఎక్కడికి ప్రసరిస్తాయో; ఆ+చోటు= ఆ చోటు; జిష్ణు= ఇంద్రునికి; ధనద= కుబేరునికి; ధర్మ= యమధర్మునికీ; జీవితంబు= ఆలవాలం; కొమ్మ= ఈ స్త్రీయొక్క; పిన్ననగవు= చిరునవ్వు; గురుతర= గొప్ప; దుఃఖనివారణంబు= దుఃఖాన్ని పోగొడుతుంది; సృష్టికారణంబు= సృష్టికి కారణం.

**తా :** (ఈ లక్ష్మీదేవి వైభవం ఎలా ఉందంటే) అమృతం ఒలుకుతూ ఈమె ఎవరితో మాట్లాడుతుందో వాడు బ్రహ్మదేవుడు. ఎవరిని తన ఎఱ్ఱని చేతులతో వరిస్తుందో వాడు ఈ ప్రపంచానికి చక్రవర్తి. తీగవంటి తన దేహాన్ని ఎవరితో చేరుస్తుందో

వాడు సర్వజ్ఞుడు. ఎవని ఇంట ఈమె ఎల్లప్పుడూ నివసిస్తుందో వాడి ఇల్లు వైకుంఠమే. ఈ స్త్రీ చూపులు ఎక్కడ ప్రసరిస్తాయో ఆ చోటు ఇంద్రుడికీ, కుబేరుడికీ, యమధర్మరాజుకూ నివాసమవుతుంది. ఈ మగువ చిరునవ్వు గొప్పదుఃఖాన్ని కూడా నశింపచేస్తుంది. సకలసృష్టినీ ఈమె వెలిగిస్తుంది.

**విశే :** లోకమంతా ఈమెను గురించి ఇలా అనుకొంటోందని కవి చెబుతున్నాడు. ధనమున్నవాడు అన్నీ చేయగలుగుతాడు (బ్రహ్మ). అన్నిటికీ అధికారి అవుతాడు (విష్ణువు); అన్నీ తెలిసినవాడని లోకం అంటుంది (శివుడు – సర్వజ్ఞుడని శివుడికే పేరు). ఎవడిని ఆమె కూడుతుందో వాడి చోటు పరమపదమే (వైకుంఠమే). యమునికి నిలయం (ధర్మం) : ఇంద్రుడు (వైభవం) కుబేరుడు (ధనం) – ఈమె లక్షణాలు. డబ్బు దుఃఖాన్ని మరిపిస్తుంది. చివరికి సృష్టిలోని కళాకాంతులన్నీ 'ధన' మూలం కల్గినవే. (ధనమూల మిదం జగత్)

**వ. మఱియు నక్కొమ్మ నెమ్మనంబున. 274**

**ప్రతి :** మఱియు= ఇంకనూ; ఆ+కొమ్మ= ఆ స్త్రీ (లక్ష్మీదేవి); నెర+మనంబున= తన మనస్సునందు.

**తా :** ఇంకా ఆ స్త్రీ తన మనస్సులో ఇలా అనుకొంటోంది.

**సీ. భావించి యొకమాటు బ్రహ్మాండ మంతయు నాటల బొమ్మరిల్లని తలంచుఁ**
**బోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ దన యింటిలో దొంతులని తలంచు**
**బాటించి యొకమాటు బ్రహ్మాది సురులను దన యింటిలో బొమ్మలని తలంచుఁ**
**గొనకొని యొకమాటు కుంభినీచక్రంబు నలవడ బొమ్మపీఁటని తలంచు.**

**ఆ. సొలసి యొక్కమాటు సూర్యేందురోచుల, నచటి దీపకళిక లని తలంచు**
**భామ యొక్కమాటు భారతీదుర్గల, నాత్మసఖు లటంచు నాదరించు. 275**

**ప్రతి :** భామ= లక్ష్మీదేవి; భావించి= ఆలోచించి; ఒకమాటు= ఒకసారి; బ్రహ్మాండము+అంతయున్= బ్రహ్మాండాన్ని అంతా; ఆటల బొమ్మరిల్లు+అని= ఆడుకొనే బొమ్మరిల్లుగా; తలంచున్= భావిస్తుంది; పోలించి= పోల్చిచూసుకొని; ఒక మాటు= మరోసారి; భువనంబులు+అన్నియున్= లోకాలన్నింటినీ; తన ఇంటిలో= తన ఇంటిలోని; దొంతులని+తలంచున్= దొంతులు అని అనుకొంటుంది; పాటించి= గుర్తించి; ఒకమాటు= ఇంకోసారి; బ్రహ్మాది సురులను= బ్రహ్మాది దేవతలను; తన ఇంటిలో= తన ఇంటిలోని; బొమ్మలని తలంచున్= బొమ్మలుగా భావిస్తుంది; కొనకొని= ప్రయత్నించి; ఒకమాటు= ఇంకొకసారి; కుంభినీచక్రంబున్= భూమండలాన్ని; అలవడన్= తగినట్టుగా; బొమ్మపీట+అని= బొమ్మలకొలువని; తలంచున్= అనుకొంటుంది; సొలసి ఒక్కమాటు= పారవశ్యంతో ఒక్కొక్కసారి; సూర్యేందు రోచులన్= సూర్యచంద్రుల కాంతులను; అచటి= తన ఇంటిలోని; దీపకళికలని= చిరుదీపాలుగా; తలంచున్= అనుకొంటుంది; ఒక్కమాటు= ఇంకోసారి; భారతీదుర్గలన్= సరస్వతిని, పార్వతిని; ఆత్మసఖులటంచున్= ఇష్టసఖులుగా; ఆదరించున్= మన్నిస్తుంది.

**తా :** ఆ లక్ష్మీదేవి తన మనస్సులో ఈ బ్రహ్మాండాన్ని బొమ్మరిల్లుగా ఒకసారి భావించేది. ఆమెకు లోకాలన్నీ తన ఇంటిలోని దొంతుల్లాగా కనిపించేవి. బ్రహ్మాది దేవతలు తన ఇంటిలోని ఆటబొమ్మలుగా భాసించేవారు. భూమండల మంతా ఒక బొమ్మలకొలువు లాగా కనిపించేది. ఆమె కంటికి సూర్యచంద్రులు చిరుదీపా లనిపించేవారు. సరస్వతి పార్వతులు ఆమెకు ఇష్టసఖు లనిపించేవారు.

**వ. తదనంతరంబ. 276**

**ప్రతి :** తదనంతరంబు+అ= ఆ తరువాత...

**తా :** ఆ తరువాత

**ఆ. చంచరీకనికరఝుంకారనినదంబు, దనరు నుత్పలముల దండఁబట్టి**
**మేఘకోటి నడిమి మెఱుఁగుఁబుత్తడిమాడ్కి, సురల నడుమ నిలిచె సుందరాంగి. 277**

**ప్రతి :** చంచరీకనికర= తుమ్మెదల సముదాయం యొక్క; ఝుంకార నినదంబు= ఝుంకారనాదం; తనరు= ఒప్పేటటువంటి; ఉత్పలముల దండన్+వట్టి= కలువపూల దండను చేతబట్టి; మేఘకోటి నడిమి= మేఘసమూహం మధ్యనుండే; మెఱుఁగున్ పుత్తడి మాడ్కిన్= మెరుగుపెట్టిన బంగారు వన్నెతో; సురలనడుమన్= దేవతలమధ్య; సుందరాంగి= ఆ అందగత్తె అయిన లక్ష్మీదేవి; నిలిచెన్= నిలిచింది.

**తా :** తుమ్మెదల ఝుంకారంతో కూడిన కలువపూలదండను చేతబట్టి మేఘ సమూహం మధ్యలో ప్రకాశించే మెరుపు తీగలాగా బంగారు కాంతులీనుతూ దేవతలమధ్య ఆ అందగత్తె నిలిచింది.

**క. ఆ కన్నులు నా చన్నులు, నా కురు లా పిఱుఁదు నడుము నాముఖ మా న**
**వ్యాకారముఁగని వేల్పులు, చీకాకునఁబడిరి కలఁగి శ్రీహరి దక్కన్. 278**

**ప్రతి :** ఆ కన్నులు; ఆ చన్నులు= స్తనాలు; ఆ కురులు= ఆ వెంద్రుకలు; ఆ పిఱుఁదులు; నడుమున్; ఆ ముఖము; ఆ నవ్య+ఆకారమున్= ఆ కొంగ్రొత్త రూపాన్ని; కని= చూసి; శ్రీహరి దక్కన్= శ్రీహరితప్పా; (తక్కిన); వేల్పులు= దేవతలందరూ; కలఁగి= అధైర్యవంతులై; చీకాకునన్+పడిరి= అయోమయంలో పడ్డారు.

**తా :** లక్ష్మీదేవి సౌందర్యం అపురూపమైంది. ఆమె కన్నులు, స్తనాలు, వెంద్రుకలు, పిఱుదులు, ఆ ముఖము, ఆ కొంగ్రొత్త రూపాన్నిచూసి శ్రీమహావిష్ణువు తప్ప తక్కిన దేవతలందరూ ధైర్యం సడలిపోయి అయోమయంలో పడ్డారు.

**వ. అట్లు నిలిచి దశ దిశలం బరివేష్టించియున్న యక్ష రక్షస్సిద్ధసాధ్య దివిజ గరుడ గంధర్వ చారణ ప్రముఖ నిఖిల యూథంబులం గనుంగొని య ప్పురాణ ప్రౌఢకన్యకారత్నంబు దనమనంబున నిట్లని వితర్కించె. 279**

**ప్రతి :** అట్లు నిలిచి= ఆ విధంగా నిలబడి; దశదిశలన్= అన్నివైపులా; పరివేష్టించి+ఉన్న= తనను చుట్టుకొని ఉన్న; యక్ష= యక్ష; రక్షః= రాక్షస; సిద్ధ; సాధ్య; దివిజ= దేవతా; గరుడ; గంధర్వ; చారణ; ప్రముఖ= మొదలైన; నిఖిల యూథంబులన్= సకల సమూహాన్ని; కనుంగొని= చూచి; ఆ+పురాణ= ఆ ఆదిమ; ప్రౌఢ+కన్యకారత్నంబు= ప్రౌఢురాలైన కన్యకామణి; తన మనంబునన్= తన మనస్సులో; ఇట్లు+అని= ఈ విధంగా; వితర్కించెన్= ఆలోచించింది.

**తా :** ఆ విధంగా నిలబడి, తనచుట్టూ అన్నివైపులా ఉన్న యక్షులు, రాక్షసులు, సిద్ధులు, సాధ్యులు, దేవతలు, గరుడులు, గంధర్వులు, చారణులు మొదలైన వారినందరినీ చూసి ఆ ప్రౌఢురాలైన ఆదిమ కన్యారత్నం తన మనస్సులో ఇలా అనుకొన్నది.

**సీ. ఐదువనై యుండ నలవడ దొక చోట నొకచోట సవతితో నోర్వరాదు**
**తగ నొకచోట సంతత వైభవంబు గా దొకచోట వేఁడిమి నుండఁబోల**
**దొకచోటఁగరుణ లే దొక్కింత వెదకిన నొకచోట దగ్గఱియుండ బెట్ట**
**నెఱయంగ నొకచోట నిలుకడ చాలదు చర్చింప నొకచోట జడత గలదు.**

**ఆ. కొన్ని చోట్లు కామగుణగరిష్ఠంబులు, క్రోధసంయుతములు గొన్ని యెడలు**
**గొన్ని మోహలోభకుంఠితంబులు గొన్ని, ప్రమదమత్సరానుభావకములు. 280**

**ప్రతి :** ఒకచోట; ఐదువనై+ఉండన్+అలవడదు= ముత్తయిదువగా ఉండడానికి వీలుండదు; ఒకచోట; సవతితోన్+ఓర్వరాదు= సవతితో భరించటం కష్టం; తగన్+ఒకచోట= మరోచోటలోనైతే; సంతత వైభవంబు+కాదు= వైభవం ఎల్లప్పుడూ ఉండదు; ఒకచోట; వేఁడిమి= వెచ్చదనం; ఉండన్=పోలదు= ఉండడానికి వీలుగా ఉండదు; ఒకచోటన్; వెదకినన్= ఎంతవెదికినా; కరుణ= దయ; ఒక్కింత+లేదు= ఒకింత కూడా ఉండదు; ఒకచోట; దగ్గఱి+ఉండన్+బెట్ట= దగ్గరగా ఉండటానికి తీక్షత; నెఱయంగన్+ఒకచోటన్= ఒప్పుగా మరోచోట; నిలుకడ+చాలదు= నిలుకడే ఉండదు; చర్చింపన్= ఆలోచిస్తే; ఒకచోటన్= ఇంకోచోట; జడత+కలదు= జడత్వం కనిపిస్తుంది (బిగుసుకుపోతారని అర్థం); కొన్నిచోట్లు; కామగుణ గరిష్ఠంబులు= కామగుణమే ప్రధానంగా కనిపిస్తాయి; కొన్ని+యెడలు= కొన్నచోట్లు; క్రోధసంయుతములు= క్రోధంతో నిండి ఉంటాయి; కొన్ని (చోట్లు); మోహలోభ కుంఠితంబులు= మోహంతో, లోభంతో కూడి అసమగ్రంగా ఉంటాయి; కొన్ని ప్రమద మత్సరానుభావకములు= కొన్నిచోట్లు మిక్కిలి మదం, మాత్సర్యంతో నిండి ఉంటాయి.

**తా :** ఒకచోట సుమంగళిగా ఉండటానికి వీలుండదు. మరోచోట సవతిపోరు, ఇంకోచోట నిత్యవైభవం ఉండదు. ఒకచోట వేడిమి ఉండనీయదు. ఇంకొకచోట 'కరుణ' అన్నమాటే కనిపించదు (దయచూపరు). ఇంకోచోట దగ్గరికి పోవడానికే వీలుండదు. ఇంకోచోట నిలకడ ఉండదు. ఇంకోస్థలంలో భరించరాని అలసత్వం. కొన్నిచోట్ల 'కామం' తప్పా మరోటి ఏమీ కనిపించదు. కొన్నిచోట్ల క్రోధమే ప్రధానం. ఇంకొన్నిచోట్లు మోహ లోభాలతోటి అసమగ్రంగా ఉంటాయి. ఇంకా కొన్నిచోట్లు మదమాత్సర్యాలే నిండి ఉంటాయి. (ఇలాంటి చోట్ల నేను ఉండగలనా! అని ఆలోచిస్తున్నది).

**వ. అని సకలసత్పురుషజననవర్తనంబు మానసించి పరిహరించి. 281**

**ప్రతి :** అని; సకల సత్పురుష; జనన వర్తనంబు= నడతలను; మానసించి= తలంచి; పరిహరించి= వదలిపెట్టి.

**తా :** అని అలాంటిచోట్ల కనిపించిన గొప్పగొప్పవారి నడతల్ని ఆలోచించి వారిని వదిలిపెట్టండి.

**సీ. అమర ముత్తైదువనై యుండ వచ్చును వరుసకు సవతు లెవ్వరును లేరు**
**వెలయంగ నశ్రాంతవిభవ మీతని యిల్లు శృంగారచందనశీతలుండు**
**గలఁగఁడెన్నఁడు శుద్ధకారుణ్యమయమూర్తి విమలుండు గదిసి సేవింపవచ్చు**
**నెఱి నాడి తిరుగఁడు నిలుకడ గలవాఁడు సకలకార్యములందు జడత లేదు;**

**ఆ. సాధురక్షకుండు షడ్వర్గరహితుండు, నాథుఁడయ్యె నేని నడప నోపు**
**నితఁడె భర్త యనుచు నింతి సరోజాక్షుఁ, బుష్పదామకమునఁబూజసేసె. 282**

**ప్రతి :** (విష్ణువును గాంచి); అమరన్= తగినట్టుగా; ముత్తైదువను+ఐ+ఉండవచ్చును= ఇతనివద్ద నిరంతర సౌభాగ్యవతిగా ఉండవచ్చు; వరుసకున్= వంతుకు వచ్చే; సవతులు= సపత్నులు; ఎవ్వరును లేరు= ఎవరూ లేరు; వెలయంగన్= ప్రకాశించే; అశ్రాంత విభవము= ఎడతెగని సంపద; ఈతని+ఇల్లు= ఇతని మందిరం; శృంగార+చందన+శీతలుండు= అందగాడు చందనంలా చల్లనివాడు; కలఁగఁడు+ఎన్నఁడున్= ఎప్పుడూ కలత పొందడు; శుద్ధ కారుణ్యమయ మూర్తి= సంపూర్ణ దయామయుడు; విమలుండు= పరిశుద్ధుడీయన; కదిసి సేవింపవచ్చున్= సమీపించి సేవించవచ్చు; నెఱిన్+ఆడి+తిరుగఁడు= ఆడినమాట తప్పడు; నిలుకడ+కలవాఁడు= స్థిరత్వం ఉన్నవాడు (తాబేలు పని తీరే దీనికి నిదర్శనం); సకల కార్యములందున్= అన్ని పనులలోనూ; జడత లేదు= ఆలస్యం చేయడు; సాధురక్షకుండు= సజ్జనుల్ని కాపాడేవాడు; షడ్వర్గ రహితుండు= కామ క్రోధాది అరిషడ్వర్గాన్ని జయించినవాడు; నాథుఁడు+అయ్యెను+ఏనిన్= ఇతడు భర్త అయితే; నడపన్+ఓపున్= జీవితాన్ని ఆనందంగా గడపవచ్చు (హాయిగా జీవించవచ్చు); ఇతఁడె భర్త+అనుచున్= ఇతడే నాకు తగిన భర్త అని; ఇంతి= ఆ లక్ష్మీదేవి; సరోజాక్షున్= కమలపత్రాక్షుడైన శ్రీమహావిష్ణువును; పుష్పదామకమునన్= పూలదండతో; పూజ+చేసెన్= అర్చించింది.

**తా :** ఇతనివద్దనైతే సౌభాగ్యవతిగా ఉండవచ్చు. వంతుకు వచ్చే సవతులు ఉండరు. ఇతని మందిరం ఎడతెగని సంపదకు నిలయం. ఇతడు అందగాడు. మీదు మిక్కిలి చందనంలాగా చల్లగా ఉంటాడు. ఎప్పుడూ కలత పొందడు (దుఃఖించడు); ఇతడు సంపూర్ణ దయామయుడు. అత్యంత పరిశుద్ధుడు. ఇతనిని సమీపించి సేవించవచ్చు. ఇతడు ఆడినమాట తప్పడు. ఇతనికి స్థిరత్వముంది. ఏ పనిలోనూ ఆలస్యం చేయడు. సజ్జనుల్ని కాపాడే గొప్ప గుణముంది. కామక్రోధాదులితనిలో లేవు. ఇతడు భర్త అయితే హాయిగా జీవించవచ్చు. ఇతడే నాకు తగిన భర్త – అని అనుకొంటూ లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువు మెడలో పూలమాల వేసి పూజించింది.

**క. ఇందీవరదామమున ముకుందునిఁబూజించి తనకుఁగూడి వసింపన్**
**మందిరముగఁదద్వక్షము నంద సలజ్జాసుదృష్టి నాలోకించెన్. 283**

**ప్రతి :** ఇందీవరదామమునన్= కలువపూలమాలతో; ముకుందునిన్+పూజించి= విష్ణువును పూజించి; తనకున్+కూడివసింపన్= తాను అతనితో కూడి నివసించడానికి; మందిరముగన్= నివాసంగా; తద్వక్షమునందు+అ= శ్రీమహావిష్ణువు వక్షః స్థలంమీదనే; సలజ్జాసుదృష్టిన్= సిగ్గుతో కూడిన చూపుతో; ఆలోకించెన్= చూచింది.

**తా :** అలా కలువ పూలమాలతో ముకుందుని పూజించి ఆయన విశాల వక్షఃస్థలాన్నే ఆమె సిగ్గుతో కూడిన చూపులతో చూస్తూ నిలబడింది.

**ఆ. మోహరుచులవలన ముద్దియ తలయెత్తు సిగ్గువలన బాల శిరము వంచు**
**నింతి వెఱఁగువలన నెత్తదు వంపదు తనదు ముఖము ప్రాణదయితుఁజూచి. 284**

**ప్రతి :** ప్రాణదయితున్+చూచి= ప్రాణసఖుడైన శ్రీమహావిష్ణువును చూడటం వల్ల; మోహ రుచుల వలనన్= విష్ణువుమీది ప్రేమ అతిశయించి; ముద్దియ= ఆమె; తలఎత్తున్= తలపైకెత్తింది; సిగ్గువలనన్= సిగ్గుతో; బాల= ఆమె; శిరము వంచున్= తల వాల్చింది; ఇంతి= ఆమె; వెఱఁగు వలనన్= ఆశ్చర్యంతో, తొట్రుపాటుతో; తనదు ముఖము; ఎత్తదు వంపదు= తల ఎత్తదు, వంచదు; (ఎందుకంటే)

**తా :** విష్ణువు మీది ప్రేమ పెల్లుబికి మోహంతో ఆయన్ని చూడటానికి తల పైకెత్తింది. మళ్ళీ సిగ్గుతో తల వాల్చుకొంది. ఆ మహాపురుషుని, ప్రాణవల్లభుని చూచిన ఆశ్చర్యంతో తొట్రుపడి ముఖం వంచలేదు. పైకెత్తలేదు.

**క. హరి సూచిన సిరి సూడదు సిరి సూచిన హరియుఁజూడ సిగ్గును బొందున్**
**హరియును సిరియును దమలో సరిచూపులఁజూడ మరుఁడు సందడివెట్టెన్. 285**

**ప్రతి :** హరి చూచినన్= హరిచూస్తే; సిరి+చూడదు= లక్ష్మిచూడదు; సిరిచూచినన్= ఆమె చూస్తే; హరియున్+చూడన్= హరిచూడటానికి; సిగ్గును+పొందున్= సిగ్గు పడతాడు; హరియును సిరియునున్= హరి, సిరి ఇద్దరూ; తమలో= తమలో తాము; సరిచూపులన్+చూడన్= ఒకరినొకరు సరిగా చూచుకోగా! అని; మరుఁడు= మన్మథుడు; సందడి+పెట్టెన్= తొందరపెట్టాడు.

**తా :** విష్ణువు చూస్తే లక్ష్మి సిగ్గుతో ఆయనను చూడదు. లక్ష్మిచూస్తే కొత్తవరుడైన విష్ణువు సిగ్గుపడి ఆమెను చూడదు. కానీ ఒకరినొకరు సరిగా చూచుకోగానే మన్మథుడు తొందరపెట్టాడు.

**చ. జగముల తండ్రియై తనరు శౌరి జగంబుల తల్లి నిందిరం**
**దగ నురమందుఁదాల్చె నటఁ; దత్కరుణారసదృష్టిచేఁబ్రజల్**
**మగుడఁగఁదొంటి భంగి నతిమంగళసాధిపతిత్వసంపదన్**
**నెగడిన లోకముల్ గని; రనేకశుభంబులఁబొంది రత్తఱిన్. 286**

**ప్రతి :** జగముల తండ్రియై+తనరు= లోకాలకన్నింటికీ తండ్రిగా ప్రకాశించే; శౌరి= విష్ణువు; జగంబుల తల్లిన్= జగన్మాత అయినటువంటి; ఇందిరన్= లక్ష్మీదేవిని; తగన్= సముచితంగా; ఉరమందున్+దాల్చెన్= వక్షఃస్థలంలో ధరించాడు; అటన్= ఆ పిమ్మట; తత్కరుణారసదృష్టిచేన్= ఆమె కరుణారసం నిండిన చూపులవల్ల; ప్రజల్= ప్రజలందరు; మగుడఁ గన్= మరల; తొంటి భంగిన్= మునుపటిలాగా; అతిమంగళ సాధిపతిత్వ సంపదన్= మంగళాతిశయం, అధిపతిని కలిగియుండుట అను సంపదచేత; నెగడిన లోకముల్= శోభిల్లిన లోకాలను; కనిరి= చూశారు; అత్తఱిన్= ఆ సమయంలో; అనేక శుభంబులన్= పెక్కు మంగళంబులను; పొందిరి= పొందారు.

**తా :** జగత్తుకు తండ్రియైన శ్రీమహావిష్ణువు జగన్మాతయైన శ్రీమహాలక్ష్మిని తన వక్షఃస్థలంపై చేర్చుకొన్నాడు. ఆమె కరుణారస దృష్టిచేత ప్రజలు మునుపటిలాగా మంగళాతిశయము, అధిపతిని కలిగియుండుట అను సంపదచేత ప్రకాశించే లోకాలను చూశారు. అప్పుడు అనేక శుభాలు పొందారు.

**వ. అట మున్న యబ్ధిరాజు దనయందు నున్న యమూల్యం బయిన కౌస్తుభంబు పేరిట యనర్ఘ మణి రాజంబు న య్యంబుజాక్షునకు సమర్పించిన దానిం దన వక్షస్థలంబున ధరియించె; నప్పు డయ్యాదిలక్ష్మియు శ్రీవత్సకౌస్తుభ వైజయంతీ వనమాలికా తారహారాద్యలంకృతంబైన పుండరీకాక్షు వక్షస్థలంబున వసియించె; నయ్యవసరంబున. 287**

**ప్రతి :** అట= అక్కడ; మున్న= ముందుగా; అబ్ధిరాజు= సముద్రుడు; తనయందున్+ఉన్న= తనలో నిక్షిప్తంగా ఉన్న; అమూల్యంబయిన= అమూల్యమైన; కౌస్తుభంబు పేరిట= కౌస్తుభమనే పేరున్న; అనర్ఘ= అమూల్యమైన; మణిరాజంబున్=

రత్నాన్ని; ఆ+అంబుజాక్షునకున్+సమర్పించినన్= ఆ కమలాక్షుడయిన విష్ణువుకు సమర్పించగా; దానిన్+తన+వక్షఃస్థలంబునన్+ధరియించెన్= దాన్ని తన వక్షంలో ధరించాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+ఆదిలక్ష్మియున్= ఆ ఆదిలక్ష్మి; శ్రీవత్స, కౌస్తుభ, వైజయంతీ, వనమాలికా, తారహారాద్యలంకృతంబైన= శ్రీవత్సం, కౌస్తుభం, వైజయంతీ మాలిక, వనమాల, ముత్యాలహారం మొదలైన అలంకారాలతో కూడిన; పుండరీకాక్షు+వక్షఃస్థలంబునన్= విష్ణువు వక్షఃస్థలంలో; వసియించెన్= నివసించింది; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** అప్పుడు ముందుగా తన అల్లునికి సముద్రుడు (మామగారు – లక్ష్మి సముద్రం నుంచి పుట్టింది కాబట్టి ఆయన కూతురు) కౌస్తుభమనే అమూల్యమైన రత్నాన్ని కానుకగా ఇచ్చాడు. దానిని శ్రీమహావిష్ణువు వక్షఃస్థలంపైన ధరించాడు. అప్పుడు లక్ష్మీదేవి శ్రీవత్సం (పుట్టుమచ్చ); కౌస్తుభం; వైజయంతిమాల, వనమాల, ముత్యాల సరాదులలో శోభిస్తున్న స్వామివారి ఎదపై నివసించసాగింది.

**శా.** **మ్రోసెన్ శంఖమృదంగవేణురవముల్ మున్నాడి; పెంజీఁకటుల్**
**వాసెన్, నర్తనగానలీలల సురల్ భాసిల్లి; రార్యుల్ జగ**
**ద్వాసుల్ విష్ణుని బ్రహ్మదేవముఖరుల్ దల్లింగమంత్రంబులం**
**బ్రాసక్తిన్ వినుతించి రుల్లసితపుష్ప శ్రేణి వర్షించుచున్.** **288**

**ప్రతి :** మున్నాడి= ముందుగా; శంఖ, మృదంగ, వేణురవముల్; మ్రోసెన్= మోగాయి; పెన్+చీఁకటుల్= పెనుచీకట్లు; పాసెన్= తొలిగిపోయాయి; సురల్= దేవతలు; నర్తన, గానలీలలన్ భాసిల్లిరి= ఆటపాటలతో ప్రకాశించారు; జగద్వాసుల్= నిఖిలజగంలో నివసించేటటువంటి; ఆర్యుల్= పూజ్యులు; బ్రహ్మదేవముఖరుల్= బ్రహ్మాది దేవతలు; తల్లింగ మంత్రంబులన్= ఆ విష్ణువును సూచించే వైదిక మంత్రాలతో; ప్ర+ఆసక్తిన్= మిక్కిలి శ్రద్ధతో; ఉల్లసిత= సంతోషంతో; పుష్పశ్రేణిన్= పూలజల్లును; వర్షించుచున్= కురిపిస్తూ; విష్ణుని; వినుతించిరి= స్తుతించారు.

**తా :** ఆటా పాటా వేడుకలతో దేవతలు విలసిల్లారు. సర్వలోక పూజ్యులు బ్రహ్మాది దేవతలు విష్ణునామాంకిత మంత్రాలతో స్తుతిస్తూ పుష్పవర్షం కురిపించారు.

**క.** **ఆ పాలవెల్లి కూఁతురు, దీపుల చూపులను దోఁగి తిలకింపఁబ్రజల్**
**చేపట్టిరి సంపదలను, బ్రాపించెను మేలు; జగము బ్రదికె నరేంద్రా!** **289**

**ప్రతి :** నరేంద్ర= ఓ రాజా!; ఆ పాలవెల్లి కూఁతురు= ఆ క్షీరసాగరుని కూతురైన లక్ష్మీదేవి; తీపులచూపులను= తియ్యటి చూపులతో; తోఁగి= మునిగి; తిలకింపన్= చూడగా; ప్రజల్= సకల జనులు; సంపదలను+చేపట్టిరి= మళ్ళీ సంపదల్ని పొందారు; మేలు+ప్రాపించెను= అందరికీ మేలు చేకూరింది; జగము= ప్రపంచం; బ్రదికెన్= మళ్ళీ కొత్త ప్రాణాన్ని పోసుకొన్నది.

**తా :** ఆ సముద్రరాజ తనయ తన చల్లని చూపులతో ప్రజల్ని చూడగానే దానితో ప్రజలకు వైభవమూ శుభమూ చేకూరాయి. లోకం సుఖించింది. జగత్తుకు మళ్ళీ జీవం వచ్చింది.

**విశే :** 'ధనమూలమిదం జగత్' అంటే అర్థం ఇదే. ధనహీనుడు మృతప్రాయుడని అర్థం.

**క. పాలేటిరాచకన్నియ మేలారెడు చూపులేక మిడు మిడు కంచుం**
**జాలిం బురపురఁబొక్కుచుఁదూలిరి రక్కసులు కీడు దోఁచిన నధిపా! 290**

**ప్రతి :** అధిపా= రాజా!; పాలేటి+రాచ+కన్నియ= సముద్ర రాజతనయ; (యొక్క); మేలు+ఆరెడు= శుభంకూర్చే; చూపులేక= దృష్టి తమ మీద పడక; రక్కసులు= రాక్షసులు; కీడుతోఁచినన్= తమకు అశుభ సూచన కాగా; మిడుమిడుకంచున్= మిణుకుమిణుకుమని కాంతిని కోల్పోయి; జాలిన్= దుఃఖంతో; పురపురన్= తహతహలాడుతూ; పొక్కుచున్= ఏడుస్తూ (విచారిస్తూ); తూలిరి= వశం తప్పారు; (కిందపడ్డారు).

**తా :** ఆ లక్ష్మీదేవిశుభదృష్టి తమపై పడకపోవడాన్ని రాక్షసులు అశుభ సూచకంగా భావించారు. మిణుకుమిణుకుమనే తీరులో కాంతివిహీనులై, దుఃఖంతో తహతహలాడుతూ చిన్నబోయారు.

**క. వారిధిఁదరువఁగ నంతట, వారుణి యన నొక్క కన్య వచ్చిన నసురుల్**
**వారిజలోచను సమ్మతి, వారై కైకొనిరి దాని వారిజనేత్రన్. 291**

**ప్రతి :** వారిధిన్= సముద్రాన్ని; తరువఁగన్= చిలకగా; అంతటన్= అప్పుడు; వారుణి+అనన్= వారుణి అనే పేరుగల; ఒక్క కన్య వచ్చినన్= ఒక కన్యపుట్టగా; వారిజలోచను సమ్మతిన్= కమలాక్షుడైన శ్రీహరి సమ్మతితో; అసురుల్= రాక్షసులు; దానిన్+వారిజనేత్రన్= కమలాల వంటి కన్నులున్న ఆ స్త్రీని; వారై కైకొనిరి= వారే గ్రహించారు.

**తా :** ఇక సముద్రాన్ని మళ్ళీ చిలకటం ప్రారంభించగా 'వారుణి' అనే పేరుతో ఒక కన్య బయల్పడింది. శ్రీహరి సమ్మతితో ఆ కమలాక్షిని రాక్షసులు తామే కోరుకొని గ్రహించారు (ఎవరూ అడ్డు చెప్పలేదు).

**వ. మఱియుందరువందరువ నప్పయోరాశియందు. 292**

**ప్రతి :** మఱియున్= ఇంకా; తరువన్+తరువన్= చిలకగా చిలకగా; ఆ+పయోరాశియందు= ఆ సముద్రంలో...

**తా :** ఇంకా సముద్రాన్ని చిలుకుతూ పోగా పోగా ఆ సముద్రంలో

**సీ. తరుణుండు దీర్ఘదోర్దండుండు గంబుకంధరుఁడు పీతాంబరధారి స్రగ్వి**
**లాలితభూషణాలంకృతుం డరుణాక్షుఁడున్నతోరస్కుఁడత్యుత్తముండు**
**నీలకుంచితకేశనివహుండు జలధరశ్యాముండు మృగరాజసత్త్వశాలి**
**మణికుండలుఁడు రత్నమంజీరుఁడచ్యుతు నంశాంశసంభవుండమలమూర్తి**

**ఆ. భూరియాగభాగభోక్త ధన్వంతరి, యనఁగ నమృతకలశహస్తుఁడగుచు**
**నిఖిలవైద్యశాస్త్రనిపుణుఁడాయుర్వేది, వేల్పువెజ్జు కడలి వెడలి వచ్చె. 293**

**ప్రతి :** అమృతకలశహస్తుఁడు+అగుచున్= అమృతకలశాన్ని చేతబట్టిన వాడై; ధన్వంతరి+అనఁగన్= ధన్వంతరి అనే పేరున్న; నిఖిలవైద్యశాస్త్ర నిపుణుఁడు= అన్ని వైద్యశాస్త్రాలు తెలిసినవాడు; ఆయుర్వేది= ఆయుర్వేదంలో దిట్ట; వేల్పువెజ్జు= దేవతల వైద్యుడు; తరుణుండు= మంచి ప్రాయంలో ఉన్నవాడు; దీర్ఘ+దోస్+దండుండు= ఆజానుబాహుడు; కంబు+ కంధరుఁడు= శంఖంవంటి కంఠం ఉన్నవాడు; పీతాంబరధారి= పచ్చటి వస్త్రం ధరించినవాడు; స్రగ్వి= పూలమాల

ధరించినవాడు; లాలిత భూషణ+అలంకృతుండు= మెరిసే బంగారు నగలచే అలంకరింపబడినవాడు; అరుణ+అక్షుఁడు= ఎర్రని కన్నులు కలవాడు; ఉన్నత+ఉరస్కుఁడు= ఎత్తైన రొమ్ము కలవాడు; అత్యుత్తముండు= సర్వశ్రేష్ఠుడు (తన వైద్యవిద్యవల్ల); నీలకుంచిత కేశనివహుండు= ముడిచిన నల్లవెంద్రుకలున్నవాడు; జలధరశ్యాముండు= మేఘమువలె శ్యామ వర్ణమున్నవాడు; మృగరాజ సత్త్వశాలి= సింహంలాంటి పరాక్రమం ఉన్నవాడు; మణికుండలుఁడు= మణులు పొందిన కుండలాలున్నవాడు; రత్నమంజీరుఁడు= రత్నాలు పొదిగిన అందెలున్నవాడు; అచ్యుతునంశాంశసంభవుండు= శ్రీహరి అంశంలో అంశమైన పుట్టుక గలవాడు; అమలమూర్తి= స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నవాడు; భూరి యాగభాగభోక్త= పవిత్రమైన యజ్ఞభాగంలో పెద్దభాగాన్ని పొందే యోగ్యత ఉన్నవాడు; కడలిన్+వెడలి= సముద్రంనుండి వెడలి; వచ్చెన్= బయటకి వచ్చాడు.

**తా :** ఆ తరువాత సముద్రంలో నుండి అమృత కలశాన్ని చేతబట్టి ధన్వంతరి అనే పేరున్న ఆయుర్వేద వైద్యుడు బయటకి వచ్చాడు. అతనికి ఆయుర్వేదాది సకలవైద్య శాస్త్రాలూ తెలుసు. దేవతలకు వైద్యుడాయన. అతని ఆకారం స్వచ్ఛంగా ఉంది. మంచి ప్రాయంలో ఉన్నాడు. ఆజానుబాహువులున్న వాడు. అతని కంఠం శంఖం లాగా ఉంది. పచ్చని పట్టు వస్త్రాన్ని ధరించాడు. పూలమాలతో శోభిస్తున్నాడు. మెరుస్తున్న బంగారు నగలలో ప్రకాశిస్తున్నాడు. అతని కండ్లు ఎర్రగా ఉన్నాయి. రొమ్ము ఉన్నతంగా ఉంది. అతడు సర్వశ్రేష్ఠుడుగా అనిపిస్తున్నాడు. అతనికి నల్లటి కేశపాశం ఉంది. నీలమేఘవర్ణంతో విరాజిల్లుతున్నాడు. సింహంలాంటి పరాక్రమంతో శోభిల్లుతున్నాడు. అతనికి మణులు పొదిగిన కుండలాలు, రత్నాలు పొదిగిన అందెలున్నాయి. శ్రీహరి అంశంలో అంశమైన దివ్యమైన పుట్టుక అతనిది. పవిత్రమైన యాగంలో పెద్ద భాగాన్ని పొందే యోగ్యత ఉన్నవాడు. అలాంటి దివ్యపురుషుడు ఉద్భవించాడు.

**విశే :** ఆయుర్వేదం మనిషిని సుదీర్ఘకాలం యౌవనలక్షణాలతో జరామరణాలకు దూరంగా ఉంచడానికి ఉద్దేశించింది.

ధన్వంతరి విష్ణువు – అంశలో – అంశ అన్న విషయం తెలుసుకోదగినది.

వేదం – అనంతమైన విభాగాలు కల్గి ఉంది. అందులో భాగమే ఆయుర్వేదం. అందుకే ఆయనకు కూడా ఇతర దైవతాలతోపాటు యజ్ఞహవిస్సులో పెద్ద (భూరి) భాగం ఉందని అర్థం.

**వ. తదనంతరంబ. 294**

**ప్రతి :** తదనంతరంబు+అ= ఆ తరువాత...

**తా :** ఆ తరువాత

**ఆ. అతనిచేత నున్న యమృతకుంభము సూచి కెరలు వొడిచి సురలఁగికురువెట్టి**
**పుచ్చికొనిరి యసురపుంగవు లెల్లను మాఱులేని బలిమి మానవేంద్ర! 295**

**ప్రతి :** మానవ+ఇంద్ర= ఓ రాజా!; అతనిచేతన్+ఉన్న= ఆ ధన్వంతరి చేతిలో ఉన్న; అమృతకుంభము+చూచి= అమృత కలశాన్ని చూసి; కెరలు+పొడిచి= విజృంభించిన వారై; సురలన్+కికురు+పెట్టి= దేవతల్ని మోసపుచ్చి; అసురపుంగవులెల్లనున్= రాక్షస శ్రేష్ఠులందరూ; మాఱులేని బలిమిన్= ఎదురులేని బలంతో; పుచ్చికొనిరి= లాగుకున్నారు.

**తా :** రాక్షసశ్రేష్ఠులు ఆ ధన్వంతరి చేతిలో ఉన్న అమృత కలశాన్ని చూసి, సాటిలేని బలంతో చెలరేగి, దేవతల్ని మోసగించి ఆయన చేతుల్లోంచి ఆ కలశాన్ని లాక్కున్నారు.

**వ. వెండియు. 296**

**తా :** అటు పిమ్మట.

**ఆ. చావులేని మందు చక్కఁగ మన కబ్బె, ననుచుఁగడవ నసురు లాఁచికొనిన**
**వెఱచి సురలు హరికి మొఱలు వెట్టిరి సుధా, పూర్ణఘటము వోయెఁబోయె ననుచు. 297**

**ప్రతి :** చావులేని మందు= చావు రానివ్వని మందు; చక్కఁగన్= సులభంగా; మనకున్+అబ్బెన్+అనుచున్= మనకు దొరికింది అంటూ; అసురులు= రాక్షసులు; కడవను+ఆఁచి కొనినన్= అమృతకలశాన్ని (వాళ్ళు) లాక్కుపోగా; సురలు= దేవతలు; వెఱచి= భయపడి; సుధాపూర్ణ ఘటము= అమృత కలశం; పోయెన్+పోయెన్+అనుచున్= పోయింది, పోయింది, అంటూ; హరికిన్= శ్రీహరికి; మొఱలు+పెట్టిరి= మొరపెట్టుకొన్నారు.

**తా :** చావును తప్పించుకునే మందు చక్కగా మనకు దొరికింది చాలులే అనుకొంటూ రాక్షసులు అతని చేతిలో నుండి అమృత కలశాన్ని లాక్కుపోగా; భయపడి పోయిన దేవతలు "అమృతం కలశం పోయింది. పోయింది అయ్యో!" అంటూ శ్రీహరికి మొరపెట్టుకొన్నారు.

## ❖ శ్రీ విష్ణుమూర్తి మోహినీస్వరూపంబు నొందుట ❖

**వ. ఇట్లు శరణాగతులైన వేల్పుల దైన్యంబు వొడగని భృత్యజన కామదుండగు న ప్పరమేశ్వరుండు 'మీరలు దుఃఖింప వలవ దేను నా మాయాబలంబునం జేసి మీ యర్థంబు మరల సాధించెద' నని పలికెఁ; దత్సమయంబున నయ్యమృత పూరంబు నేమ త్రావుద' మని తమకించు దైత్యదానవ జనంబుల లోపల నమంగళంబగు కలి సంభవించిన కతంబునఁ బ్రబలులగు రక్కసులు విలోకించి సత్త్రయాగంబు నందు నడచు చందంబునఁ దుల్యప్రయాస హేతువులగు సురలును సుధాభాగంబున కర్హు లగుదురు గావునఁబంచి కుడుచుట కర్తవ్యం; బిది సనాతనంబగు ధర్మం బగుటం జేసి యియ్యమృత కుంభంబు విడువుం దని దుర్బలులగు నిశాచరులు జాతమత్సరులై ప్రబలు లైన తమవారల వారించుచున్న సమయంబున. 298**

**ప్రతి :** ఇట్లు; శరణాగతులు+ఐన= శరణు పొందివచ్చిన; వేల్పుల= దేవతల; దైన్యంబు= దీనస్థితిని; పొడగని= చూసి; భృత్యజన= దాసజనుల; కామదుండు+అగు+ఆ+పరమేశ్వరుండు= కోరికలు తీర్చే ఆ పరమాత్మ; మీరలు= మీరు; దుఃఖింప+వలవదు= దుఃఖించకండి; ఏను= నేను; నా మాయాబలంబునన్+చేసి= నా మాయాబలంతో; మీ అర్థంబు= మీ కోరిక (అమృతప్రాప్తి); మరలన్= మళ్ళీ; సాధించెదన్+అని+పలికెన్= సాధిస్తానని చెప్పాడు; తత్సమయంబునన్= ఆ సమయంలో; ఆ+అమృతపూరంబున్+ఏమ+త్రావుదము= ఆ అమృతసారాన్ని మనమే తాగుదాం; అని; తమకించు= కోరికతో ఉన్న; దైత్య దానవ జనంబుల లోపలన్= దైత్యదానవులలో; అమంగళంబగు కలి= అమంగళకరమైన కలహం; సంభవించిన కతంబునన్= కలిగిన దానివల్ల; ప్రబలులగు రక్కసులు= బలవంతులైన బలి మొదలైన రాక్షసులు; విలోకించి= చూచి; సత్త్ర యాగంబునందు= గొప్పయజ్ఞాలలో; నడచు చందంబునన్= జరిగే విధంగా; తుల్యప్రయాస హేతువులగు= సమానంగా మనతోపాటు శ్రమించినవారైన; సురలునున్= దేవతలుకూడా; సుధాభాగంబునకున్= అమృతంలో భాగం పొందడానికి; అర్హులగుదురు కావునన్= అర్హులు అవుతారు కాబట్టి; పంచికుడుచుట కర్తవ్యంబు= పంచుకొని తాగటం

తగిన పని; ఇది సనాతనంబగు ధర్మంబు= ఇది సనాతనమైన ధర్మం; అగుటన్+చేసి= కావడంవల్ల; ఈ+అమృతకుంభంబు= ఈ అమృతకలశాన్ని; విడువుండు+అని= వదలండి అని; దుర్బలులగు నిశాచరులు= బలహీనులైన రాక్షసులు; జాతమత్సరులు+ఐ= మాత్సర్యం కల్గి; ప్రబలులు+ఐన= బలవంతులైన; తమవారలన్= తమ గుంపులోని వారిని; వారించుచున్న సమయంబునన్= వారిస్తున్న సమయంలో...

**తా :** అలా శరణాగతులైన దేవతల దురవస్థను చూసి, దాసజనుల కోరికలు నెరవేర్చే ఆ పరమేశ్వరుడైన శ్రీమహావిష్ణువు వారిలో "మీరు దుఃఖపడవద్దు. నేను నా మాయా బలంతో మీకు అమృతాన్ని మళ్ళీ సాధించిపెడతాను అని అన్నాడు. ఆ సమయంలో ఈ అమృతరసాన్ని మనమే తాగేద్దాం అని రాక్షసులు తమలో తాము కలహించుకోవడం ప్రారంభించారు. వారిలో బలవంతులైన వారు ఈ విషయంలో అసూయ పడ్డారు. మనమే తాగేద్దాం అని వారి భావన. కాని వారిలో దుర్బలులైన వాళ్ళు కొందరున్నారు. వారు తమకు అమృతం రానివ్వరేమో అనే మాత్సర్యం పుట్టి ధర్మసూక్ష్మాన్ని లేవనెత్తారు. "దీర్ఘ సత్త్రయాగాలు జరిగేటప్పుడు పాటించే విధానాన్నే ఇప్పుడూ పాటిద్దాము. యాగం లాంటి ఈ సాగరమథనంలో మనతోపాటు సమానంగా శ్రమించిన దేవతలకు ఈ అమృతంలో భాగం ఇవ్వడం మన కర్తవ్యం. ఇది సనాతన ధర్మం. అంచేత అమృతకలశాన్ని వదలండి, వదలండి" అంటూ నిరసన తెలిపారు.

**ఆ. ఒకని చేత నుండ నొకఁడు బలిష్ఠుఁడై, పుచ్చికొనిన వాని బొదుగఁబట్టి**
**యంతకంటె నధికుఁడమృత కుంభమునెత్తి, కొంచుఁబాఱెఁబరులు గుయ్యిడంగ. 299**

**ప్రతి :** ఒకనిచేతన్= ఒకరిచేతిలో; అమృతకుంభము; ఉండన్= ఉండగా; ఒకఁడు బలిష్ఠుఁడు+ఐ= ఇంకొకడు ఇంకా బలిష్ఠుడై; పుచ్చికొనినన్= లాక్కుపోగా; వానిన్+బొదుగన్+పట్టి= వాడిని చిక్కపట్టుకొని; అంతకంటెన్+అధికుఁడు= వాడికంటే మరో బలవంతుడు; (దానిని) ఎత్తికొంచున్= ఎత్తుకొని; పరులు కుయ్యి+ఇడన్+కన్= ఇతరులు కేకలు వేస్తుండగా; పాఱెన్= పరిగెత్తాడు.

**తా :** ఒకడి చేతిలో ఉన్న అమృతకలశాన్ని ఇంకో బలవంతుడు లాగుకొన్నాడు. వాడి కన్నా బలవంతుడు ఇంకొకడు వాడిని చిక్కపట్టుకొని ఆ కలశాన్ని ఎత్తుకొని పరిగెత్తాడు. తక్కిన వాళ్ళు కేకలు వేయడం ప్రారంభించారు.

**వ. అంత. 300**

**ప్రతి :** అంతన్= ఆ సమయంలో...

**సీ. మెత్తని యడుగుల మెఱుఁగారు జానువు లరఁటి కంబముల దోయైన తొడలు**
**ఘనమగు జఘనంబుఁగడు లేఁత నడుమును బల్లవారుణకాంతి పాణియుగముఁ**
**గడు దొడ్డపాలిండ్లుఁగంబుకంఠంబును బింబాధరముఁజంద్రబింబముఖముఁ**
**దెలిగన్నుఁగవయును నళికుంతలంబును బాలేందుసన్నిభఫాలతలము**

**తే. నమరఁగుండల కేయూరహారకంక, ణాదు లేపార మంజీరనాద మొప్ప**
**నల్ల నవ్వులఁబద్మదళాక్షుఁడసుర, పతుల నడఁగింప నాఁడురూపంబుఁదాల్చి. 301**

**ప్రతి :** పద్మదళాక్షుఁడు= పద్మపత్ర నేత్రుడైన శ్రీమహావిష్ణువు; అసురపతులన్= ఆ రాక్షసనాయకులను; అడఁగింపన్= అణచివేయడానికి; అల్ల+నవ్వులన్= నెమ్మదిగా తనలో తాను నవ్వుకొంటూ; ఆఁడు రూపంబున్+తాల్చి= ఆడు రూపాన్ని

ధరించి; (ఆ రూపం ఎలా ఉందంటే); మెత్తని అడుగులన్= మెత్తని అడుగులు (పాదాలు), మెఱుఁగు+ఆరు= నిగనిగలాడే; జానువులు= మోకాళ్ళు; అరఁటికంబముల+దోయి+ఐనతొడలు= అరటి బోదెల జంటలాంటి తొడలు; ఘనమగు= పెద్దవైన; జఘనంబున్= పిరుదులూ; కడు లేఁత నడుమును= మిక్కిలి సన్నని నడుమూ; పల్లవ+అరుణకాంతి+ పాణియుగము= చిగురుటాకులవంటి ఎర్రని చేతులు; కడుదొడ్డపాలిండ్లు= పెద్దవైన వక్షోజాలు; కంబుకంఠంబునున్= శంఖంలాంటి కంఠం; బింబాధరమున్= దొండపండులాంటి పెదవి; చంద్రబింబ ముఖమున్= చంద్రబింబం లాంటి ముఖమూ; తెలి+కన్నుఁగవయును= వెలుగులీనే కన్నులు; అళికుంతలంబును= తుమ్మెదల వంటి శిరోజాలు; బాలేందుసన్నిభ ఫాలతలమున్= నెలవంక వంటి నుదురూ; అమరన్= ఒప్పగా; కుండల= కుండలాలతో; కేయూర= బాహుపురులతో; హార= సరాలు; కంకణాదులు= గాజులు మొదలైన ఆభరణాలతో; ఏ పారన్= మించి ప్రకాశించగా; మంజీరనాదము+ ఒప్పన్= కాలి అందెల గజ్జెలు సవ్వడి చేస్తుండగా (స్త్రీ రూపాన్ని ధరించి ప్రత్యక్షమయ్యాడు)...

**తా :** శ్రీమహావిష్ణువు తనలో తాను నవ్వుకొంటూ అసురుల్ని అణచివేయడానికి జగన్మోహనమైన స్త్రీ రూపాన్ని ధరించి ప్రత్యక్షమయ్యాడు. ఆ మాయామోహినికి మెత్తని అడుగులు, నిగనిగలాడే మోకాళ్ళు, అరటి బోదెల్లాంటి తొడలు, పెద్దవైన పిరుదులు, మిక్కిలి సన్నని నడుము; చిగురుటాకుల వంటి లేత (ఎర్రని) చేతులు; పెద్దవైన వక్షోజాలు; శంఖంలాంటి కంఠం; దొండపండు వంటి పెదవి, చంద్రబింబం లాంటి ముఖం, వెలుగులు చిమ్ముతున్న కన్నులు, తుమ్మెదల బారువంటి వెంద్రుకలు; నెలవంకవంటి నుదురు ఒప్పగా, కర్ణాభరణాలతో, బాహుపురులతో, వివిధ రత్నహారాలతో, గాజులతో, కాలి అందెల సవ్వడితో అందరినీ మోహింపచేస్తూ ఆమె వారిమధ్యకు వచ్చింది.

**విశే :** ఈ రూపం ఎందుకు స్వామి ధరించాడన్నది ముఖ్యమైన ప్రశ్న. మూలంలో ఇలా ఉంది.

> **ఏతస్మిన్నంతరే విష్ణుః సర్వోపాయవిదీశ్వరః**
> **యోషిద్రూపమనిర్దేశ్యం దధార పరమాద్భుతమ్ (8-8-41)**

(అంతలో సర్వోపాయ విదుదు - (తెలిసినవాడు) అయిన శ్రీమహావిష్ణువు కలహించుకొంటున్న రాక్షసులమధ్య వర్ణించడానికి వీలుకాని పరమాద్భుత స్త్రీ రూపాన్ని పొందాడు)

అమృతాన్ని దేవతలకే పంచాలి అంటే రాక్షసుల్ని మాయామోహంలో పడవేయక తప్పదు. అందుకే దేవతారక్షకుడైన స్వామి ఈ 'మోహినీ' రూపాన్ని దాల్చాడు. ఎవరిని చూస్తే బుద్ధి పనిచెయ్యకుండా కొయ్యబారిపోతుందో - ఆ రూపలక్షణం 'మోహనం'.

**వ. అ య్యవసరంబున జగన్మోహనాకారంబున. 302**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; జగత్+మోహన+ఆకారంబునన్= జగత్తును మోహింపజేసే రూపంతో...

**తా :** ఆ సమయంలో స్వామి జగన్మోహనమైన రూపంతో.

**సీ. పాలిండ్లపై నున్న పయ్యెద జాఱించు జాఱించి మెల్లనఁజక్క నొత్తుఁ**
**దళుకు దళ్కను గండఫలకంబు లొలయించు నొలయించి కెంగేల నుజ్జగించుఁ**
**గడుమెఱుంగులు వాఱు కడకన్ను లల్లార్చు నల్లార్చి ఱెప్పల నండ గొలుపు**
**సవరని దరహాసచంద్రికఁజిలికించుఁజిలికించి కెమ్మోవిఁజిక్కువఱచు**

**తే. దళితధమ్మిల్లకుసుమగంధమ్ము నెఱపుఁ, గంకణాదిఝణంకృతుల్ గడలుకొలుపు**
**నొడలి కాంతులు పట్టులే కులుకఁబాఱు, సన్న వలిపంపుఁబయ్యెద చౌకళింప. 303**

**ప్రతి :** పాలిండ్లపై నున్న= వక్షోజాలపైనున్న; పయ్యెదన్+జాఱించున్= పైటను జారవిడుస్తుంది; జాఱించి= అలా జార్చి; మెల్లనన్= నెమ్మదిగా (సుతారంగా); చక్కనొత్తున్= చక్క జేసుకుంటుంది; తళుకు+తళ్కను= తళతళలాడే తన; గండఫలకంబున్+ కెంగేలన్+ఒలయించున్= చెక్కిళ్ళపై చేతులతో రాసుకొంటుంది; ఒలయించి= అలా రాసుకొని; ఉజ్జగించున్= వదిలిపెడ్తుంది; కడు మెఱుంగులు+పాఱు= జిగేలు మనిపిస్తూ కాంతులు ప్రసరించే; కడకన్నులు= కడకంటి చూపులను; అల్లార్చున్= ప్రసరింపజేస్తుంది; అల్లార్చి= అలాచేసి; ఱెప్పలన్+అండన్+కొలుపున్= రెప్పలు మూస్తుంది; సవరని= అందమైన; దరహాసచంద్రికన్= చిరునవ్వు అనే వెన్నెలను; చిలికించున్= వ్యాపింపజేస్తుంది; చిలికించి= అలా వ్యాపింపజేసి; కెమ్మోవిన్+చిక్కుపఱచున్= ఎర్రని పెదవిని మెలిక పెడుతుంది; దళిత= వికసించిన; ధమ్మిల్ల+కుసుమ+ గంధమ్మున్= కొప్పులోని పూల సువాసనను; నెఱపున్= నలుగడలా వ్యాపింపజేస్తుంది; కంకణాది= కడియాలు, గజ్జెలు మొదలైనవాటి యొక్క; ఝణంకృతుల్= గణగణమనే శబ్దాలను (అందెల గలగలల్ని); కడలు+కొలుపున్= దిక్కులకు వ్యాపింపజేస్తుంది; సన్నవలిపంపున్+పయ్యెద= పల్చగా ఉన్న తెల్లని పైట; చౌకళింపన్= ఎగురగా; ఒడలి కాంతులు= తన దేహకాంతులు; పట్టులేకన్= నిలుకడ లేకుండ; ఉలుకన్+పాఱున్= వ్యాపించాయి.

**తా :** తన వక్షోజాలమీద ఉన్న పైటను జారుస్తుంది. అలా జార్చి సుతారంగా చక్కజేసుకొంటుంది. తళతళలాడే తన చెక్కిళ్ళను చేతులలో తాకుతుంది. తాకి వెంటనే వదిలిపెడుతుంది. జిగేలుమనిపించే కడగంటి చూపుల్ని ప్రసరింపజేసి వెంటనే రెప్పలు మూస్తుంది. చిరునవ్వులనే వెన్నెలను చిలికిస్తుంది. వెంటనే తన ఎర్రని పెదవిని మెలికపెడుతుంది. వికసించిన తన కొప్పులోని పూల గుబాళింపును నలుగడలా వ్యాపింపజేస్తుంది. కడియాల గలగలల్ని, అందెల మువ్వల సవ్వడిని దిక్కులకు వ్యాపింపజేస్తుంది. సన్నగా ఉన్న తెల్లటి పైట ఎగురగా తన మేనికాంతులు ఒకచోట నిలువకుండా అందరిమీద వ్యాపించాయి.

**వ. ఇవ్విధంబున నక్కపట యువతీరత్నంబు జగన్మోహనదేవతయునుం బోలె నెమ్మొగంబు తావికి మత్తిల్లిన తేఁటి మొత్తంబులం గెలిచి చిగురు జొంపంబుల నెడగలుగ జడియుచు మురియుచుండ రాక్షసవరులు గనుంగొని. 304**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ విధంగా; ఆ+కపట+యువతీరత్నంబు= ఆ మాయలమారి జవరాలు; జగత్+మోహన+ దేవతయునున్+పోలెన్= ప్రపంచాన్ని మోహింపచేసే దేవతలాగా; నెఱ+మొగంబు తావికిన్= పద్మంలాంటి తన ముఖంలోని సుగంధానికి; మత్తిల్లిన; తేఁటి మొత్తంబులన్+గెలిచి= తుమ్మెదల్ని అదిలిస్తూ; చిగురు జొంపంబులన్= చిగురాకు పొదరిండ్లలో; ఎడగలుగన్+జడియుచున్= దూరదూరంగా తిరుగుతూ; మురియుచుండన్= సంతోషిస్తుండగా (వినోదిస్తుండగా); రాక్షసవరులు= రాక్షసవీరులు; కనుంగొని= చూచి...

**తా :** ఈ విధంగా ఆ కపటవనిత జగత్తును మోహింపజేసే దేవతలాగా తన ముఖంలోని సుగంధాన్ని ఆశించివచ్చిన తుమ్మెదల్ని అదిలిస్తూ, చిగురాకు పొదరిండ్లలో దూరదూరంగా తిరుగుతూ వినోదిస్తుండగా రాక్షసవీరులు ఆమెను చూచి

**సీ. అవ్వుఁగదే లావణ్య, మవ్వుఁగదే మాధుర్య మవ్వుఁగదే సతి నవయౌవనాంగి!**
**యెటనుండి వచ్చితి? వేమి యిచ్ఛించెదు? నీ నామ మెయ్యది నీరజాక్షి?**

**యమరగంధర్వసిద్ధాసురచారణ మనుజకన్యలకు నీ మహిమ గలదె?**
**ప్రాణచిత్తేంద్రియపరిణామదాయియై నిర్మించెఁబో విధి నిన్నుఁగరుణ,**

**తే. వనిత! గశ్యపు సంతతి వార మేము, భ్రాతలము సురలకు నిద్ధపౌరుషలము**
**జ్ఞాతులకు మాకు నేకార్థసంగతులకుఁ, బాలు దీరని యర్థంబు పంచి యిమ్ము. 305**

**ప్రతి :** వనిత= ఓ అమ్మాయీ!; ఎటనుండి వచ్చితివి= ఎక్కడి నుంచి వచ్చావు (నీవు ఏ లోకానికి చెందినదానివని ప్రశ్న); ఏమి+ఇచ్చించెదు= ఏమి కావాలి నీకు?; నీరజాక్షి= తామరలవంటి కన్నులు గలదానా!; నీ నామము+ఏ+అది= నీ పేరు ఏమిటి?; అవుఁగదే లావణ్యము= నీ లావణ్యం చాలా బాగుంది; అవుఁగదే మాధుర్యము= నీ రూపంలోని తియ్యందనానికి జవాబులేదు; అవుఁగదే సతి నవయౌవనాంగి= నీ నవయౌవనంలోని అవయవాలకు సరిలేదు; (వహ్వా! అని మెచ్చుకొన్నారు); అమరగంధర్వ సిద్ధాసుర చారణమనుజ కన్యలకున్= దేవతలలోకాని, గంధర్వులలోకాని, సిద్ధులలో, రాక్షసులలో, చారణులలోకాని, మనుష్యులలో కాని పుట్టిన కన్యలకు; నీ మహిమ+కలదె= నీ గొప్పతనం (అందం) ఉన్నదా?; ప్రాణ+చిత్త+ఇంద్రియ+పరిణామ+దాయియై= ప్రాణాలను, చిత్తాన్ని, ఇంద్రియాలను వికారంపొందించే విధంగా; విధి= ఆ బ్రహ్మదేవుడు; కరుణన్= దయతో; నిన్నున్+నిర్మించెన్+పో= నిన్ను సృష్టించాడు కాబోలు!; ఏము= మేము; కశ్యపు సంతతివారము= కశ్యపప్రజాపతి కుమారులము; సురలకున్+భ్రాతలము= దేవతలకు సోదరులము; ఇద్ధపౌరుషలము= స్వచ్ఛమైన పరాక్రమం గలవారము; ఏకార్థ సంగతులకున్= ఒకే ప్రయోజనంకోసం ఇక్కడ చేరిన; మాకున్+జ్ఞాతులకున్= మాకు, మా దాయాదులకు; పాలు+తీరని+అర్థంబున్= మాలో మాకు పంపకాలు తెగని ఈ పదార్థాన్ని, పంచి+ఇమ్ము= పంచిపెట్టు.

**తా :** ఓ వనితా! నీవు ఏ లోకంనుండి వచ్చావు? మా నుండి నీకు ఏం కావాలి? నీ పేరేమిటి? నీ లావణ్యం ఓహో! నీ రూపం అతిమధురం. నవయౌవనంలో ఉన్న నీ అవయవాలకు జోహారు! అవును! ఇంత అందమేమిటో నీకు! దేవతలలో, గంధర్వులలో, సిద్ధులలో, రాక్షసులలో, మనుష్యులలో ఏ కన్యకైనా నీ సౌందర్యగరిమ ఉందా! ప్రాణాలను, చిత్తాన్ని, ఇంద్రియాలను వికారాలకు గురి చేసేలా నీ మీద ప్రత్యేకమైన ప్రీతిలో బ్రహ్మ నిన్ను మలిచాడు కాబోలు! ఇక మేమంటావా! కశ్యపప్రజాపతి కుమారులం. వరుసకు దేవతలకు సోదరులం. స్వచ్ఛమైన పరాక్రమశాలులం. ఒక ప్రయోజనం కొరకు మేము మా దాయాదులు ఇక్కడ చేరాం. మాలో మాకు పంపకాలు తెగని ఈ పదార్థాన్ని పంచిపెట్టు.

**క. సభయై యుండెద మిందఱ, మభయంబున వచ్చు కొలఁది నమృతంబును నీ**
**విభరాజగమన! తప్పక, విభజింపు విపక్షపక్షవిరహితమతివై. 306**

**ప్రతి :** ఇభరాజగమన= గజగమనా!; ఇందఱము= మేమందరం (దేవతలతో కలిసి); సభయై+ఉండెదము= సభగా ఒకచోట బారులు తీరి కూర్చుంటాము; నీవు; అభయంబునన్= నిర్భయంగా (నిస్సంకోచంగా); విపక్ష= శత్రువులని; పక్ష= మిత్రులని (పరాయి–తన భేదం); విరహితమతివి+ఐ= పాటించని మనస్సు గలవానివై; అమృతంబును= ఈ అమృతాన్ని; వచ్చుకొలఁది= నీకు సముచితమనిపించిన తీరులో; తప్పక= ఉభయులకూ తప్పకుండా వచ్చేలా; విభజింపు= పంచిపెట్టు.

**తా :** ఓ గజగమనా! మేము, దేవతలం అందరం కలసి బారులుగా సభతీర్చి కూర్చుంటాము. 'నీవు నీవారు – పరాయివారు' అనే తేడా పాటించని మనస్సుతో ఏ మాత్రం సంకోచం లేకుండా నీకు సముచితమనిపించిన విధంగా, ఉభయులకూ సరిగా అమృతం అందేలా పంచిపెట్టు.

**వ. అని మందలించిన దైత్యులం గని మాయాయువతి రూపుండగు హరి తన వాఁడి వాలు చూపు టంపఱలవలన వారల తాలుముల నగలించి చిఱునగవు లెగయ మొగమెత్తి యిట్లనియె. 307**

**ప్రతి :** అని; మందలించిన= హెచ్చరించిన; దైత్యులన్+కని= రాక్షసుల్ని చూసి; మాయాయువతి రూపంబగు హరి= మోహినీ రూపంలోని శ్రీహరి; తన= తన యొక్క; వాఁడి+వాలు+చూపుటంపఱలవలనన్= తీక్ష్ణమైన వాలుచూపులనే బాణాలతో; వారల= వారియొక్క; తాలుములన్= ఓర్పును; అగలించి= చీకాకుచేసి; చిఱునగవులు+ఎగయన్= చిరునవ్వులు చిలుకగా; మొగము+ఎత్తి= ముఖం పైకెత్తి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా రాక్షసులు గదమాయించినట్టు అభ్యర్థించగా; మోహినీ రూపంలో ఉన్న శ్రీహరి అందమైన తన తీక్షణమైన వాలుచూపుల బాణాలతో వారి ఓర్పును సడలించి, పైకి చిరునవ్వొకటి నవ్వి, మొగం పైకెత్తి ఇలా అన్నాడు.

**విశే :** మూలంలో ఈ మాయావి 'నవ్వు' ఎలా ఉందో వ్యాసుడు చెప్పాడు.

**'ప్రహస్య రుచిరాపాంగైర్నిరీక్షన్నిదమబ్రవీత్' (8-9-8)**

**క. సుందరులగు పురుషులఁగని పొందెడు నాయందు నిజము పుట్టునె మీకున్?**
**బృందారకరిపులారా! చెందరు కామినుల విశ్వసింపరు పెద్దల్. 308**

**ప్రతి :** బృందారకరిపులారా= దేవతల శత్రువులారా!; సుందరులు+అగు= అందంగా ఉన్న; పురుషులన్+కని= మగవారిని చూసి; పొందెడు నాయందున్= వారిని పొందేటటువంటి నాకు; మీకున్= మీలాంటి వీరులకు; నిజము= నమ్మకం (ఇది నిజంగా ధర్మబద్ధంగా పంచుతుందనే నమ్మకం); పుట్టునె= కలుగుతుందా!; పెద్దల్= పెద్దవారు (ఉన్నత వంశీయులు); కామినులన్= అందగత్తెలైనవారిని; విశ్వసింపరు= నమ్మరు; చెందరు= దగ్గరికి చేరరు.

**తా :** దేవతలకు శత్రువులైన ఓ రాక్షసులారా! నేను ఇష్టం వచ్చినట్టు తిరిగేదాన్ని. నాకు నచ్చిన మగవాళ్ళ పొందు పొందేదాన్ని. అలాంటి నాపైన మీలాంటి వీరులకు నమ్మకం కుదిరేనా! పెద్దలైనవారు నాలాంటి వారిని నమ్మరు. దగ్గరికి చేర్చరు.

**క. పలుకులు మధురసధారలు దలఁపులు నానాప్రకారదావానలముల్**
**సెలుములు సాలావృకములు చెలువల నమ్ముటలు వేదసిద్ధాంతములే! 309**

**ప్రతి :** పలుకులు= అందగత్తెల మాటలు; మధురసధారలు= తేనెల ప్రవాహాలు; తలఁపులు= ఆలోచనలు; నానాప్రకార= వివిధాలైన; దావ+ఆనలముల్= కార్చిచ్చులు; చెలుములు= స్నేహాలు; సాలావృకములు= తోడేళ్ళు; చెలువలన్= ఇలాంటి స్త్రీలను, నమ్ముటలు= నమ్మడాలు; వేదసిద్ధాంతములు+ఏ= వేదాలు అంగీకరిస్తాయా!

**తా :** అందగత్తెలు తేనెల ఊటల్లా మాట్లాడతారు. కాని వారి ఆలోచనలు కార్చిచ్చుల్లా ఉంటాయి. వారి స్నేహాలు తోడేళ్ళ చెలిమిలాంటిది. ఇలాంటి స్త్రీలను నమ్మవచ్చని వేదాలు చెబుతాయా! (చెప్పవు – వేదసమ్మతం కాదు)

**క. నా నేర్చుకొలఁది మీకును మానుగ విభజించి యిత్తు; మానుఁడు శంకన్**
**గానిండనవుడు నిచ్చిరి దానవు లమృతంపుఁగడవఁదరుణీమణికిన్. 310**

**ప్రతి :** నా నేర్చుకొలఁది= నా శక్తివంచనలేకుండా; మానుగన్= చక్కగా; విభజించి మీకును+ఇత్తున్= అమృతాన్ని విభజించి పంచిపెడతాను; కానిండు= తెండి; శంకన్+మానుఁడు= ఏ అనుమానమూ పెట్టుకోకండి; అనవుడున్= అని ఆమె చెప్పగా; దానవులు= రాక్షసులు; తరుణీమణికిన్= ఆ స్త్రీ రత్నానికి; అమృతంపున్+కడవన్= అమృత కలశాన్ని; ఇచ్చిరి= ఇచ్చారు.

**తా :** 'అలాగే! నా శక్తివంచన లేకుండా, చక్కగా పంచిపెడతాను లెండి. ఏ అనుమానం పెట్టుకోకండి' అని మోహిని చెప్పగానే, రాక్షసులు ఆమెకు అమృత కలశాన్ని ఇచ్చారు.

**క. ఆ శాంతాలోకనములు, నా శీతలభాషణములు నా లాలితముల్**
**రాశిపరంపర లగుచుం, బాశములై వారి నోళ్ళు బంధించె నృపా! 311**

**ప్రతి :** నృపా= రాజా!; ఆ శాంత+ఆలోకనములు= ఆ చల్లనిచూపులు; ఆ శీతల భాషణములు= ఆ చల్లని పలుకులు; ఆ లాలితముల్= ఆ బుజ్జగింపులు; రాశి పరంపరలు+అగుచున్= దొంతర దొంతరలై; పాశములు+ఐ= తాళ్ళలాగా; వారినోళ్ళు= వారి నోళ్ళను; బంధించెన్= బంధించివేశాయి.

**తా :** ఆ చల్లని చూపులు, చల్లని మాటలు, ఆ బుజ్జగింపులు, దొంతర దొంతరలుగా తాళ్ళతో కట్టినట్టుగా వారి నోళ్ళను మూసివేశాయి.

**వ. ఇట్లు సుధాకలశంబు కేల నందుకొని మందస్మిత భాషణంబుల సుందరీ రూపుం దగు ముకుందుండు 'మేలు గీ డనక నేను బంచి యిచ్చిన తెఱంగున నంగీకరించుట కర్తవ్యం' బనవుడు 'నగుంగాక' యని సురాసుర దైత్యదానవ సమూహం బుపవసించి కృతస్నానులై హోమంబు లాచరించి విప్రులకు గోభూహిరణ్యాది దానంబులు సేసి తదాశీః ప్రవచనంబును గైకొని ధవళపరిధానులై గంధమాల్య ధూపదీపాలంకృతం బగు కనకరత్న శాలా మధ్యంబునఁ బ్రాగగ్రకుశ పీఠంబులం బూర్వ దిశాభిముఖులై పంక్తులు గొని యున్న సమయంబున. 312**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సుధాకలశంబు= అమృతకలశాన్ని; కేలన్= చేతితో; అందుకొని= తీసుకొని; మందస్మిత భాషణంబులన్= చిరునవ్వు చిందే మాటలతో; సుందరీ రూపుండు+అగు ముకుందుండు= స్త్రీ రూపంతో ఉన్న శ్రీమహావిష్ణువు; మేలు+కీడు+అనక= మంచి-చెడు అనకుండా; నేను+పంచి+ఇచ్చిన తెఱంగునన్= నేను పంచిపెట్టే పద్ధతితో; అంగీకరించుట కర్తవ్యంబు= ఒప్పుకోవాలి; అనవుడు= అని చెప్పగా; 'అగున్+కాక'+అని= అలాగే కానిమ్మని; సురాసుర= దేవతలు, రాక్షసులు; దైత్య దానవ సమూహంబు= దితి కుమారులు దైత్యులు, దనువు కుమారులు దానవులందరూ; ఉపవసించి= ఉపవాసంచేసి; కృతస్నానులు+ఐ= స్నానం చేసినవారై; హోమంబులు+ఆచరించి= అగ్నిహోత్రం చేసి; విప్రులకున్= బ్రాహ్మణులకు; గో, భూ, హిరణ్యాది దానంబులు+చేసి= గోవుల్ని, భూముల్ని, బంగారును దానాలుచేసి; తద్+ఆశీః+ప్రవచనంబునున్+కైకొని= వారి ఆశీర్వాద వచనాలను గ్రహించి; ధవళ పరిధానులు+ఐ= తెల్లటి వస్త్రాలను ధరించి; గంధమాల్య= గంధంతో, పూలమాలలతో; ధూపదీప+అలంకృతంబు+అగు= ధూపదీపాలతో శోభాయమానంగా ఉన్న; కనకరత్నశాలా మధ్యంబునన్= రత్నాలు తాపిన బంగారు మండపం నడుమ; ప్రాక్+అగ్ర+కుశ పీఠంబులన్= తూర్పుగా కొనలున్న దర్భాసనాల్లో; పూర్వ దిశాభిముఖులు+ఐ= తూర్పుముఖంగా ఉన్నవారై; పంక్తులు+కొని= బారులుతీరి; ఉన్న సమయంబునన్= కూర్చుని ఉన్న సమయంలో...

**తా :** అలా ఆ మోహినీ రూపంలో ఉన్న శ్రీమహావిష్ణువు అమృతకలశాన్ని తన చేతిలోకి తీసుకొని చిరునవ్వు చిందే పలుకులతో "నేను పంచిపెట్టే విధంగా మంచి-చెడు అనకుండా మీరు అంగీకరించాలి" అని వారితో చెప్పగా వారుకూడా 'అలాగే కానిమ్మ' అన్నారు. తరువాత సురాసురులు, దైత్యదానవులు అందరూ ఉపవాసంచేసి, స్నానాలు పూర్తిచేసి, అగ్నికార్యం నిర్వహించి, బ్రాహ్మణులకు గో భూ హిరణ్యదానాలు చేసి, వారి ఆశీర్వచనాలను గ్రహించి, తెల్లటి వస్త్రాలు ధరించి, రత్నాలు తాపిన బంగారు సభామంటపంలో చేరారు. ఆ మండపం గంధమాల్యాలతో, ధూప దీపాలతో శోభాయమానంగా ఉంది. అందులో వారు తూర్పుముఖంగా కొసలున్న దర్భాసనాల మీద తూర్పుముఖంగా బారులు తీర్చి కూర్చున్నారు.

**క. శ్రోణీభరకుచయుగభర, వేణీభరములను దస్సి వివిధాభరణ**
**క్వాణ యయి యువిద వచ్చెను, బాణిసరోజమున నమృతభాండముఁగొంచున్. 313**

**ప్రతి :** ఉవిద= ఆ మోహిని; పాణి సరోజమునన్= పద్మంవంటి తన హస్తంతో; అమృతభాండమున్+కొంచున్= అమృతకలశాన్ని పట్టుకొని; శ్రోణీభర= కటి భారం; కుచయుగభర= స్తనయుగ్మభారం; వేణీభరములను= శిరోజభారం – ఈ మూడు భారాలచేత; దస్సి= అలసిపోయి; వివిధాభరణ క్వాణ+అయి= ధరించిన వివిధములైన ఆభరణముల గలగలలతో (డాబుసరిగా); వచ్చెను= సభా మండపంలోకి అడుగు పెట్టింది.

**తా :** ఆ మోహినీ దేవి పద్మంవంటి తన హస్తంలో అమృతకలశాన్ని పట్టుకొని, కటిభారంతో; కుచభారంతో; శిరోజభారంతో అలసిపోయి, తాను ధరించిన ఆభరణాల గలగల ధ్వనులతో ఒయ్యారంగా సభామండపంలోకి అడుగుపెట్టింది.

**క. భాసురకుండలభాసిత, నాసాముఖకర్ణగండనయనాంచలయై**
**శ్రీసతి యగు సతిఁగని, దేవాసురయూథంబు మోహ మందె నరేంద్రా! 314**

**ప్రతి :** నరేంద్రా= ఓ రాజా!; ఆమె; భాసుర కుండల భాసిత= ప్రకాశిస్తున్న కుండలాలచేత తళతళలాడుతున్న; నాసా= ముక్కు; ముఖ= ముఖము; కర్ణ= చెవులు; గండ= చెక్కిళ్ళు; నయనాంచల+ఐ= కనుగొనలు కలిగినదై; శ్రీసతి+అగు= శ్రీదేవికి సాటి అయిన; సతిన్+కని= ఆ మగువను చూసి; దేవాసుర యూథంబు= దేవాసుర సమూహం; మోహము+అందెన్= మోహాన్ని పొందింది.

**తా :** ఆమె కర్ణాభరణాలు ధరించింది. అవి ప్రకాశిస్తుండగా వాటి తళతళల చేత ఆమె ముక్కు, ముఖము, చెవులు, చెక్కిళ్ళు, కనుగొనలు ధగధగలాడుతున్నాయి. ఆమెను చూస్తే లక్ష్మీదేవికి సాటిగా కనిపిస్తోంది. ఆమె అందచందాలు చూసి దేవాసురులు మోహంలో మునిగిపోయారు.

**విశే :** ఎంత మోహినీ అవతారం దాల్చినా విష్ణువు తన దివ్యప్రభావాన్ని దాచుకోలేకపోయారు.

శ్రీసతియను సతి; శ్రీసతి= లక్ష్మీదేవి; అగు= అయిన; సతి= మరోస్త్రీ – ఇది మామూలు అర్థం. మూలంలో చూస్తే 'శ్రీసతి' అనే మాట వెనుక పోతనగారు భావించింది పరదేవతా రూపిణినే అని స్పష్టంగా చెప్పవచ్చు.

**వ. అప్పుడు. 315**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**క. 'అసురుల కమృతము వోయుట వొసఁగదు పాములకుఁబాలు వోసినమాడ్కిన్**
**దొసఁగగు నంచును వేఱొక దెసఁగూర్చుండంగఁబెట్టె దేవాహితులన్. 316**

**ప్రతి :** ఆమె; అసురులకున్= రాక్షసులకు; అమృతము+పోయుట= అమృతం పోయటం; పొసఁగదు= కుదరదు (సమంజసం కాదు); అలాచేస్తే; పాములకున్= సర్పాలకు; పాలు+పోసినమాడ్కిన్= పాలుపోసిన చందాన; దొసఁగు+అగున్= దోషమవుతుంది; అంచును= అనుకొంటూ; దేవ+అహితులన్= దేవతల శత్రువుల్ని (రాక్షసుల్ని); వేఱొకదెసన్= మరొక దిక్కున; కూర్చుండంగన్+పెట్టెన్= మరోవైపు కూర్చోబెట్టింది.

**తా :** ఆమె ఇలా ఆలోచించింది. 'ఈ రాక్షసులకు అమృతం పోయటం పాములకు పాలు పోయటంలాంటిది. ఆపదను కల్గిస్తుంది. 'అంచేత అలా జేయరాదు' అనుకొని రాక్షసుల్ని ప్రత్యేకంగా మరోవైపు కూర్చోబెట్టింది.

**వ. ఇట్లు రెండు పంక్తులుగా నేర్పరించి. 317**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; రెండు; పంక్తులుగాన్= వరుసలుగా; ఏర్పరించి= విభాగించి.

**తా :** ఈ విధంగా వారిని రెండు పంక్తులలో వేరువేరుగా కూర్చోబెట్టింది.

**సీ. వేగిరపడకుఁడీ వినుఁడు దానవులార! తడవుసేయక వత్తు దైత్యులార!**
**యటు సక్కఁగూర్చుండుఁడని కన్ను లల్లార్చి చనుఁగవ పయ్యెద జాఱఁదిగిచి**
**వదినె మఱందుల వావులు కల్పించి మర్మంబు లెడలించి మఱుఁగు సేసి**
**మెల్లని నగవుల మేనులు మఱపించి కదు జాణ మాటలఁగాకుపఱచి**

**ఆ. యసురవరుల నెల్ల నడకించి సురలను, దడవు సేయవలదు; ద్రావుఁడనుచు**
**వచ్చుకొలఁది నమృతవారి విభాగించెఁ, దరుణి దివిజు లెల్లఁదనిసి పొగడ. 318**

**ప్రతి :** దానవులార= రాక్షసులారా; వేగిరపడకుఁడు+ఈ= తొందర పడకండి; వినుఁడు= నేను చెప్పేది జాగ్రత్తగా వినండి; దైత్యులారా= దితి కుమారులారా!; తడవు+చేయక= ఆలస్యం చేయకుండా; వత్తున్= ఇదిగో వచ్చేస్తున్నాను; అటు+చక్కన్+ కూర్చుండుఁడు+అని= ఆ వైపు కూర్చోండి అని; కన్నులు+అల్చార్చి= కన్నులు అటూ ఇటూ తిప్పుతూ; చనుఁగవ+పయ్యెద= చన్నులపైని పైటను; జాఱన్+తిగిచి= జారదీసి; వదినె మఱందుల= వదిన అయినట్టు వారు మరుదులైనట్టు; వావులు కల్పించి= వరుసలు కల్పించి; మర్మంబులు+ఎడలించి= మర్మస్థానాల మరుగు తొలగించి; మఱుఁగు+చేసి= మళ్ళీ కప్పివేసి; మెల్లని నగవులన్= చిరునవ్వులతో; మేనులు మఱపించి= శరీరాలు మరిచిపోయేలాచేసి; కడుజాణ మాటలన్= మిక్కిలి జాణమాటలతో; కాకుపఱచి= చీకాకుపరచి; అసురవరులన్+ఎల్లన్= ఆ రాక్షసులనంతా; అడకించి= లొంగదీసుకొని; సురలను= దేవతల్ని; తడవు+చేయవలదు= ఆసల్యం చేయకండి; త్రావుఁడు+అనుచున్= తాగండి అంటూ; వచ్చుకొలఁ దిన్= నేర్పుతో; అమృతవారిన్= అమృతజలాన్ని; తరుణి= ఆ మోహిని; దివిజులు+ఎల్లన్= దేవతలందరూ; తనిసి= తృప్తిచెంది; పొగడన్= ప్రశంసిస్తుండగా; విభాగించెన్= పంచివేసింది.

**తా :** 'రాక్షసులారా! తొందరపడకండి. వినండి, ఇప్పుడే వచ్చేస్తాను. అటువైపు నిమ్మళంగా కూర్చోండి; అంటూ కన్నులు అల్లార్చింది. చనుగవ మీది పయ్యెదను జారవిడిచింది. వదిన మరుదుల వరుసలు కల్పించి వారిని వంచించింది.

మర్మస్థానాల మరుగులు తీసి మళ్ళీ కప్పుకొన్నది. చిరునవ్వులతో మైమరిపించింది. నెరజాణలాగా మాట్లాడి వారిని లొంగదీసుకొంది. వారు మాట్లాడే స్థితిలో లేరు. దేవతల్ని 'ఆలస్యం చేయకుండా తాగండి' అని నేర్పుతో అమృతజలాల్ని ఇవ్వగా దానితో దేవతలంతా తృప్తిపడి పొగడుతుండగా ఆ మోహినీదేవి వారికే పంచివేసింది.

**వ. ఆ య్యవసరంబున. 319**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** ఆ సమయంలో

**సీ. మనకు వేల్పులకును మందట లేకుండఁబంచి పెట్టెద నని పడఁతి పూనెఁ**
**దానేల తప్పును? దప్పదు తరళాక్షి గాక రమ్మనుచును గడఁకఁబిల్వ**
**మఱుమాట లాడదో మఱి చూడకుండునో చనుఁగవఁగప్పునో చాలు ననుచు**
**నొండాడఁగలఁగుచు నొక్కింత సొలయునో మనయెడఁగందునో మగువ యనుచు**

**ఆ. నెలఁత చూడ్కిగముల నీరై కరంగుచుఁ, బ్రణయభంగభీతిబద్ధులగుచు**
**నూరకుండ్రు గాని 'యువిద! తే తెమ్మ'ని, యడుగఁజాల రప్పు డసురవరులు. 320**

**ప్రతి :** మనకున్= మనకు; వేల్పులకున్= దేవతలకూ; మందట= మేరలు; లేకుండన్= లేకుండా; పంచిపెట్టెదన్+అని= పంచి ఇస్తానని; పడఁతి= ఈ స్త్రీ; పూనెన్= పూనుకొన్నది; (అలాంటప్పుడు); తాను+ఏలతప్పును?= తను ఎందుకు తప్పుకుంటుంది?; తరళాక్షి= చలించే కన్నులు గల ఆ స్త్రీ; తప్పదు= పంచక తప్పదు; కాక= అయితే; కడఁకన్= మనం సాహసంతో; రమ్మనుచును+పిల్వన్= రమ్మని పిలిస్తే; మఱుమాటలు+ఆడదో= బదులు పలకదేమో!; మఱి+చూడకుండునో= తిరిగి చూడకుండా వెళ్ళిపోతుందేమో!; చనుఁగవన్+కప్పునో= చన్నులమీది పైటను కప్పుకొంటుందో ఏమో; చాలుననుచున్= వీళ్లతో ఇంక చాలులే అనుకొని; ఒందు+ఆడన్= మరోమాట కలిపితే (మాట్లాడితే); కలఁగుచున్= భయపడి; ఒక్కింత+ సొలయునో= ఒకింత ముడుచుకు పోతుందేమో; మగువ= ఆ స్త్రీ; మన+ఎడన్= మన విషయంలో; కందునో= బాధ పడుతుందేమో!; అనుచున్= అనుకొంటూ; నెలఁత= ఆ జవరాలి; చూడ్కిగములన్= చూపుల సముదాయంతో; నీరై+కరంగుచున్= నీరు లాగా కరిగిపోతూ; ప్రణయభంగభీతిన్= ఆమెకు తమపైన ప్రేమ తగ్గిపోతుందేమో అని భయపడి; బద్ధులు+అగుచున్= కట్టుబడినవారై; ఊరకుండ్రు+కాని= ఊరక ఉన్నారు కాని; అసురవరులు= ఆ రాక్షస శ్రేష్ఠులు; అప్పుడు= ఆ సమయంలో; 'ఉవిద= ఓ మగువా!'; తే+తెమ్ము (తెమ్ము+తెమ్ము)= తొందరగా తీసుకురా!; అని; అడుగన్+చాలరు= అడగలేక పోయారు.

**తా :** ఆ రాక్షసులు ఇలా ఆలోచించసాగారు. 'ఈమె మనకూ దేవతలకూ గొడవలేకుండా పంచిపెడతానని చెప్పి ఈ పనికి పూనుకొన్నది. ఆ పనిచేయకుండా తప్పుతుందా! తప్పదు. తప్పించుకోదు. కానీ మనం సాహసించి రమ్మని పిలిస్తే మారు పలకదేమో! తిరిగి చూడకుండా వెళ్ళిపోతుందేమో!; చనుదోయిపైన పైట మళ్ళీ వేసేసుకొంటుందేమో; మనతో ఇక చాలనుకొంటుందేమో! మరోమాట కలిపి మాట్లాడితే భయపడి వెనుదిరిగి పోతుందేమో! మనపై కోపగిస్తుందేమో! మనల్ని విశ్వసించదేమో! అనుకొంటూ ఆమె చూపులకు వాళ్ళు కరిగిపోయారు. మాట్లాడి బెదిరిస్తే తమపై ఆమె ప్రేమ ఎక్కడ భంగపడుతుందో అని మిన్నకుండిపోయారు తప్పా 'మగువా! తొందరగా తీసుకురా' అంటూ అడగలేకపోయారు.

**వ. అప్పుడు. 321**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**మ. అమరవ్రాతములోనఁజొచ్చి దివిజుండై రాహు పీయూషపా**
**నము సేయంగని చంద్రభాస్కరులు సన్నల్ సేయ నారాయణుం**
**డమరారాతిశిరంబు చక్రహతిఁదున్మాడెన్ సుధాసిక్తమై**
**యమరత్వంబును జెందె మూర్ధము దదన్యాంగంబు నేలంబడెన్. 322**

**ప్రతి :** అమరవ్రాతములోనన్= దేవతల గుంపులోనికి; చొచ్చి= ప్రవేశించి; దివిజుండు+ఐ= దేవతగా గుర్తింపబడుతూ; రాహు= రాహువు; పీయూష పానము= అమృతపానం; చేయన్+కని= చేయడాన్నిచూసి; చంద్ర భాస్కరులు= చంద్రుడు, సూర్యుడు; సన్నల్+చేయన్= సైగ చేయగా; నారాయణుండు= శ్రీహరి; అమర+అరాతి+శిరంబున్= ఆ రాక్షసుని శిరస్సును; చక్రహతిన్= చక్రప్రయోగంతో; తునుము+ఆడెన్= నరికాడు; (అప్పుడు అతని); మూర్ధము= రాహువుతల; సుధాసిక్తము+ఐ= అమృతంతో తడిసినందువల్ల; అమరత్వంబును+చెందెన్= మరణం లేనిదయింది; తద్+అన్య+అంగంబు= రాహువు మిగిలిన దేహభాగం (మొండెం); నేలన్+పడెన్= నేలమీద పడిపోయింది.

**తా :** ఇంత జాగ్రత్తగా శ్రీహరి పంచుతున్నా కూడా రాహువు అనే అసురజాతికి చెందినవాడు దేవతల గుంపులోకి చొరబడి, దేవతల్లాగానే అమృతపానం చేయడం సూర్యచంద్రులు చూశారు. నారాయణునికి సైగచేశారు. వెంటనే శ్రీహరి సుదర్శన చక్రం ప్రయోగించి వాడి తలను ఛేదించాడు. అమృతంతో తడిసిన అతడి తల మృత్యువు లేనిదయింది. మిగిలిన మొండెం నేలమీద పడిపోయింది.

**విశే :** 'సింహిక' అనే అమరకాంతకు జన్మించినవాడు 'రాహువు'. ఇతనికి 'స్వర్భాను'వనిపేరు (చూ.మూలం 8-9-24). అందుకే 'అర్ధకాయుడని' పేరు పొందాడు.

**అర్ధకాయం మహావీరం చంద్రాదిత్యవిమర్దనమ్**
**సింహికాగర్భసంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్** – అని వ్యాసుడు చేసిన రాహుస్తుతి.

మొండానికి కేతువని పేరుందని కొందరంటారు – కాని కేతువును 'ఛాయా' (రాహువు నీడగా) గ్రహంగా చెప్పడమే శాస్త్రీయమని పెద్దలంటారు.

**పలాశపుష్పసంకాశం తారకాగ్రహమస్తకమ్**
**రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహమ్ –** అని కేతు గ్రహస్తుతి. అయినా సుర (అమృతం) స్పర్శవల్ల రాహు-కేతువులు నవగ్రహాలలో స్థానం పొందారు.

**ఆ. అజుఁడు వాని శిరము నంబరవీథిని, గ్రహము సేసి పెట్టి గారవించె;**
**వాఁడు పర్వములను వైరంబు దప్పక భానుచంద్రములను బట్టుచుండు. 323**

**ప్రతి :** అజుఁడు= బ్రహ్మదేవుడు; వానిశిరమున్= రాహువు శిరస్సును; అంబర వీథిని= ఆకాశంలో; గ్రహము+చేసి+పెట్టి+ గారవించెన్= ఒక గ్రహంగా నిలిపి ఉంచి గౌరవించాడు; వాఁడు= ఆ రాహువు; పర్వములను= అమావాస్య, పూర్ణిమ

దినములలో; వైరంబు+తప్పక= శత్రుత్వాన్ని వీడకుండ; భాను+చంద్రములనున్= సూర్యచంద్రులను; పట్టుచుండున్= మింగుతూంటాడు.

**తా :** అప్పుడు బ్రహ్మదేవుడు ఆ శిరస్సును గ్రహించి అంబరవీథిలో రాహుగ్రహంగా నిలిపాడు. ఆ రాహువే తన శత్రుత్వాన్ని వదలకుండా అమావాస్యనాడు సూర్యుని, పూర్ణిమనాడు చంద్రుని – ఆయా పర్వదినాలలో మింగుతూంటాడు. వాటినే సూర్యచంద్రగ్రహణ 'పర్వ' దినాలంటారు.

**విశే :** గ్రహసంబంధమైన పుణ్యదినం 'పర్వం'. సంక్రాంతి (మంకర) ఉగాది (సూర్య) లాగా అమావాస్య / పూర్ణిమలూ పర్వదినాలే.

**క. ఒక బొట్టుఁ జిక్కకుండఁగ, సకలసుధారసము నమరసంఘంబులకుం**
**బ్రకటించి పోసి హరి దన, సుకరాకృతిఁ దాల్చె నసురశూరులు బెగడన్ 324**

**ప్రతి :** హరి= (ఆ విధంగా) శ్రీహరి; ఒక బొట్టున్+చిక్కకుండఁగన్= రాక్షసులకు ఒక చుక్కకూడా దొరకకుండా; అమర సంఘంబులకున్= దేవతా సమూహానికి; సకలసుధారసమున్= అమృతాన్నంతటినీ; ప్రకటించి పోసి= బాహాటంగా పోసి; అసురశూరులు= రాక్షసవీరులు; బెగడన్= భయపడగా; తన; సుకర+ఆకృతిన్= దివ్యమంగళాకారాన్ని; తాల్చెన్= ధరించాడు.

**తా :** ఈ విధంగా శ్రీహరి ఒక చుక్క కూడా రాక్షసులకు చిక్కకుండా అమృతాన్ని అంతా బాహాటంగానే దేవతలకు పోశాడు. తరువాత తన మొదటి దివ్యమంగళ విష్ణురూపాన్ని ధరించాడు. దీన్ని చూస్తున్న రాక్షసవీరులు భయపడ్డారు.

**మ. అమరుల్ రక్కసులుం బ్రయాసబలసత్త్వార్థాభిమానంబులన్**
**సములై లబ్ధవికల్పు లైరి యమరుల్ సంశ్రేయముం బొంది ర**
**య్యమరారుల్ బహుదుఃఖముల్ గనిరి తా మత్యంతదోర్గర్వులై;**
**కమలాక్షున్ శరణంబు వేఁడని జనుల్ గల్యాణసంయుక్తులే? 325**

**ప్రతి :** అమరుల్= దేవతలు; రక్కసులున్= రాక్షసులు; ప్రయాస= శ్రమలో; బల= బలంలో; సత్త్వ= శక్తిలో; అర్థ= ధనంలో; అభిమానంబులన్= ఆత్మగౌరవంలో; సములు+ఐ= సములే అయినా; (అసురులు); లబ్ధ వికల్పులు+ఐరి= (ఫలితాలు) వికల్పంగా పొందారు; అమరుల్+సంశ్రేయమున్+ పొందిరి= దేవతలు మిక్కిలి శ్రేయస్సును పొందారు; ఆ+అమర+అరుల్= ఆ దేవతా శత్రువులు (రాక్షసులు); తాము; అతి+అంత= మిక్కిలి; దోః+గర్వులై= బాహు బలగర్వితులై; బహుదుఃఖముల్+కనిరి= చాలా కష్టాలుపడ్డారు; (అంచేత); కమల+అక్షున్= శ్రీహరిని; శరణంబు వేఁడని= శరణము కోరని; జనుల్= జనులు; కల్యాణ సంయుక్తులు+ఏ= శుభాలతో కూడగలరా!

**తా :** దేవతలు రాక్షసులు శ్రమలో, బలంలో, శక్తిసామర్థ్యాలలో, ధనసంపదల్లో, ఆత్మగౌరవంలో అన్నింటా సములే. కాని వారివారికి లభించిన ఫలితాలు మాత్రం వేరయ్యాయి. దేవతలు శ్రేయస్సును పొంది ధన్యులయ్యారు. తమ భుజబల గర్వంతో మిడిసిపడిన రాక్షసులు ఎన్నో కష్టాలు చవిచూశారు. అంచేత విష్ణుదేవుని శరణుపొందని వారు శుభాన్ని పొందజాలరు.

## ✤ దేవాసురయుద్ధము ✤

క. దానవు లమృతము ద్రావం బూని పయోరాశిఁ ద్రచ్చి పొగిలిన మాడ్కిన్
శ్రీనాథపరాఙ్ముఖులగు, హీనులు వొందంగఁ జాల రిష్టార్థంబుల్. **326**

**ప్రతి :** దానవులు= రాక్షసులు; అమృతమున్+త్రావన్+పూని= అమృతాన్ని తాగాలని ప్రయత్నించి; పయస్+రాశిన్+త్రచ్చి= క్షీరసాగరాన్ని మథించి; పొగిలిన మాడ్కిన్= దుఃఖపడిన తీరుగా; శ్రీనాథ=విష్ణువునందు; పరాక్+ముఖులగు= విముఖులైనవారు; హీనులు= బుద్ధిహీనులు; ఇష్ట+అర్థంబుల్= తాముకోరిన సంపదల్ని; పొందంగన్+ చాలరు= పొందజాలరు.

**తా :** రాక్షసులు అమృతం త్రాగటంకోసం ప్రయత్నించి పాలకడలిని మథించి చివరికి దుఃఖం పాలైన రీతిగా విష్ణుభక్తి లేని బుద్ధిహీనులు తాముకోరిన సంపదల్ని (శ్రేయస్సును) ఎన్నటికీ పొందజాలరు.

క. శోధించి జలధి నమృతము, సాధించి నిలింపవైరి చక్షుర్గతులన్
రోధించి సురల కిడి హరి, బోధించి ఖగేంద్రు నెక్కి పోయె నరేంద్రా! **327**

**ప్రతి :** నర+ఇంద్రా= రాజా; హరి= శ్రీహరి; జలధిన్+శోధించి= సముద్రాన్ని చిలికి; అమృతము సాధించి= అమృతాన్ని సంపాదించి; నిలింపవైరి+చక్షుస్+గతులన్= రాక్షసుల కనుచూపులను; రోధించి= అడ్డగించి (కన్నుగప్పి); సురలకున్+ఇడి= దేవతలకే పంచిపెట్టి; బోధించి= వారికి కొన్ని హెచ్చరికలు చేసి; ఖగ+ఇంద్రున్+ఎక్కి= గరుడుని అధిరోహించి; పోయెన్= వెళ్ళిపోయాడు.

**తా :** రాజా! ఆ విధంగా శ్రీహరి సముద్రాన్ని మథించి, అమృతాన్ని సంపాదించి, రాక్షసుల కన్నుగప్పి, దేవతలకే అమృతాన్ని పంచి, వారికి కొన్ని హెచ్చరికలు చేసి, గరుత్మంతుని అధిరోహించి వెళ్ళిపోయాడు.

క. శుద్ధముగ సురల కమృతము, సిద్ధించిన నసురవరులు సిడిముడిపడుచున్
గ్రుద్ధులు నానాయుధ సన్నద్ధులు నయి యుద్ధమునకు నడచిరి బలిమిన్. **328**

**ప్రతి :** శుద్ధముగన్= సంపూర్ణంగా; సురలకున్= దేవతలకు; అమృతము; సిద్ధించినన్= సమకూడినందువల్ల; అసురవరులు= రాక్షస శ్రేష్ఠులు; చిడిముడి+పడుచున్= కోపతాపాలు పడుతూ; క్రుద్ధులు= క్రోధం కలిగినవారు; నానాయుధ+సన్నద్ధులున్+ అయి= అనేక విధాల ఆయుధాలతో సంసిద్ధులై; బలిమిన్= బలంతో; యుద్ధమునకున్+నడచిరి= యుద్ధానికి బయలుదేరారు.

**తా :** అమృతం సంపూర్ణంగా దేవతలకే సమకూరినందువల్ల దైత్యులు, కోపతాపాలు పొంది, అతిక్రుద్ధులై నానా విధములైన ఆయుధాలతో సంసిద్ధులై వీరుల బలంతో కూడినవారై యుద్ధానికి బయలుదేరారు.

క. ధన్యులు వైరోచని శత, మన్యుప్రముఖులు మదాభిమానులు దమలో
నన్యోన్యరణము బాణా, సిన్యాసంబులను బేర్చి చేసిరి కడిమిన్. **329**

**ప్రతి :** ధన్యులు= పుణ్యులు / భాగ్యవంతులు; వైరోచని= విరోచనుని కుమారుడు బలి; శతమన్యు= దేవేంద్రుడు; ప్రముఖులు= మొదలైనవారు – (సురాసురులు); మద్+అభిమానులు= మదంతో, ఆత్మప్రత్యయంతో నిండినవారు; తమలోన్= తమలోతాము; అన్యోన్యరణము= ఒకరితో ఒకరు యుద్ధం; బాణ+అసి+న్యాసంబులను+పేర్చి= బాణాలతో, కత్తులతో విజృంభించి; కడిమిన్= పట్టుదలతో; చేసిరి= చేశారు.

**తా :** భాగ్యవంతులైన బలి, భగవదనుగ్రహం పొందిన ఇంద్రుడు, తక్కిన దేవాసురులు, మదంతో, ఆత్మాభిమానంతో బాణాలు, కత్తులు సమకూర్చుకొని తమలోతాము (ఒకరు మరొకరితో) పట్టుదలతో యుద్ధం చేయటం ప్రారంభించారు.

**మ. అరుదై కామగమై మయాసురకృతంబై లోకితాలోక్యమై**
**వరశస్త్రాస్త్రసమేతమై తరళమై వైహాయసంబై మహా**
**సురయోధాన్వితమైన యానమున సంశోభిల్లెఁబూర్ణేందు సు**
**స్థిరకాంతిన్ బలి చామరధ్వజచమూదీప్తస్థితిన్ ముందటన్. 330**

**ప్రతి :** అరుదు+ఐ= అపురూపమైనదై (ఆశ్చర్యం కల్గించే); కామగము+ఐ= ఇష్టాన్ని అనుసరించి పయనించేదై (కామగమనం కల్గినదై); మయాసురకృతంబు+ఐ= మయునిచే నిర్మింపబడినదై; లోకిత= చూడబడిన; అలోక్యమై= చూడదగిన వస్తువు గలదై; వరశస్త్ర+అస్త్ర సమేతము+ఐ= గొప్ప శస్త్రాస్త్రాలతో కూడినదై; తరళము+ఐ= ప్రకాశించునదై; వైహాయసంబు+ఐ= ఆకాశంలో తిరిగేది అయి; మహా+అసుర= గొప్పరాక్షస; యోధ+అన్వితమైన= భటులతో కూడిన; యానమునన్= దివ్యరథంలో; బలి= బలి చక్రవర్తి; పూర్ణ+ఇందు సుస్థిరకాంతిన్= పూర్ణచంద్రుడిలాంటి దివ్యప్రకాశంతో; చామర= వింజామరలతో; ధ్వజ= జండాలతో; ముందటన్= ముందు; చమూ+దీప్త+స్థితిన్= (దానవ) సైన్యాలతో ప్రకాశించినస్థితితో; సంశోభిల్లెన్= మిక్కిలిగా ప్రకాశించాడు.

**తా :** ఆ బలిచక్రవర్తి పూర్ణచంద్రుని వంటి దివ్యప్రకాశంతో తన రథంపై బయలుదేరాడు. ఆ రథం చాలా అపురూపమైనది. మయుడు నిర్మించినదది. కనిపించీ కనిపించకుండా చూడదగిన వస్తువులను చూచునదై ఆశ్చర్యకరంగా ఆకాశమార్గంలో పయనిస్తుంది. గొప్పశస్త్రాస్త్రాలు ఆ రథంలో సమకూర్చబడి ఉన్నాయి. గొప్ప రాక్షస భటులు దాన్ని రక్షిస్తుంటారు. చామరాలతో, ధ్వజాలతో దానవ సైన్యాలు ముందు వెళ్తుండగా ఆ కాంతిలో బలి చక్రవర్తి మిక్కిలిగా ప్రకాశించాడు.

**వ. మఱియు నముచి శంబర బాణ ద్విమూర్ధ కాలనాభ శకుని జంభాయోముఖ ప్రహేతి హేతి భూత సంత్రాస హయగ్రీవ కపిలేల్వ లోత్కల మేఘదుందుభి మయ త్రిపురాధిప విప్రచిత్తి విరోచన వజ్రదంష్ట్ర తార కారిష్టారిష్టనేమి శుంభ నిశుంభ శంకుశిరః ప్రముఖులును, పౌలోమ కాలకేయులును, నివాత కవచ ప్రభృతులును, దక్కిన దండ యోధులునుం గూడికొని యరదంబులం దురంగంబుల మాతంగంబుల హరిణంబుల హరి కిరి కీట జలచరంబులను, శరభ మహిష గవయ ఖడ్గ గండభేరుండ చమరీ జంబుక శార్దూల గోవృషాది మృగంబులను, గంక గృధ్ర కాక కుక్కుట బక శ్యేన హంసాది విహంగంబులను, దిమి తిమింగిలాది జలచరంబులను, నరులను, నసుర సుర నికర వికృతి విగ్రహరూపంబులగు జంతువులను నారోహించి, తమకు నడియాలంబులగు గొడుగులు జోడుఁగైదువులు పక్కెరలు బొమిడికంబులు మొదలగు పోటు ముట్లాయితంబుగఁ గైకొని వేఱు వేఱ మొనలై విరోచననందనుండగు బలిముందట నిలువంబడిరి; దేవేంద్రుండును నైరావతారూఢుఁడై వైశ్వానర వరుణవాయు దండధరా ద్యనేక నిర్జరవాహినీ సందోహంబును, దాను నెదురుపడి పిఱు తివియక మోహరించె; నట్లు సంరంభసన్నాహ సముత్సాహంబుల రెండు దెఱంగుల వారునుం బోరాడు వేడుకల మీఁటగు మాటల సందడించుచున్న సమయంబున, 331**

**ప్రతి :** మఱియున్= ఇంకా; నముచి, శంబర, బాణ, ద్విమూర్ధ, కాలనాభ, శకుని, జంభ, అయోముఖ, ప్రహేతి, హేతి, భూత సంత్రాస, హయగ్రీవ, కపిల, ఇల్వల, ఉత్కల, మేఘదుందుభి, మయ, త్రిపురాధిప (త్రిపురా సురులు); విప్రచిత్తి, విరోచన, వజ్రదంష్ట్ర, తారక, అరిష్ట, అరిష్టనేమి, శుంభ, నిశుంభ, శంకుశిరః; ప్రముఖులును= మొదలైనవారు, పౌలోమ కాలకేయులును= పౌలోముడు, కాలకేయుడు; నివాతకవచ; ప్రభృతులును= మొదలైనవారు; తక్కిన= మిగిలిన; దండయోధులునున్= మహావీరులు; కూడికొని= కలిసి; అరదంబులన్= రథాలను; తురంగంబులన్= గుఱ్ఱాలను; మాతంగంబులన్= ఏనుగులను; హరిణంబులన్= జింకలను; హరి= సింహాలను; కిరి= పందులను; కీట= కీటకాలను; జలచరంబులను= నీటి జంతువులను; శరభ= శరభాలను; మహిష= దున్నపోతులను; గవయ= గురుపోతులను; ఖడ్గ= ఖడ్గమృగాలను, జంబుక= నక్కలను, శార్దూల= పులులను; గోవృషాది= ఆవులు, ఎద్దులు మొదలైన; మృగంబులను= జంతువుల్ని; కంక= రాబందులను; గృధ్ర= గద్దలను; కాక= కాకులను; కుక్కుట= కోడిపుంజుల్ని; బక= కొంగలను; శ్యేన= డేగలను; హంసాది= హంసలు మొదలైన; విహంగంబులను= పక్షులను; తిమి= తిములు, తిమింగిలాది= తిమింగిలాలు మొదలైన; జలచరంబులను= నీటి జంతువులను; నరులను= మనుష్యులను; అసుర= రాక్షస; సుర= దేవతా; నికర= సముదాయాల; వికృతి విగ్రహ రూపంబులగు జంతువులను= వికారమైన ఆకారాలలో కూడి ఉన్న జంతువుల్ని, ఆరోహించి= ఎక్కి; తమకున్= తమకు; అడియాలంబులు+అగు= సంకేతాలయిన; గొడుగులు; జోడుఁగైదువులు= కవచాలు, ఖడ్గాలు; పక్కెరలు= ఏనుగులకు, గుఱ్ఱాలకు వేసే తొడుగు కవచాలు; బొమిడికంబులు= శిరస్త్రాణాలు; మొదలగు; పోటుముట్లు= యుద్ధ సామగ్రిని (ఆయుధాలను); ఆయితంబుగన్= చక్కగా; కైకొని= ధరించి; వేఱు+వేఱమొనలై= వేరువేరుగా గుంపులుగా దళాలుగా ఏర్పడి; విరోచన నందనుండగు= విరోచనుడి కుమారుడైన; బలిముందటన్= బలిముందు; నిలువంబడిరి= నిలబడ్డారు; దేవేంద్రుండును; ఐరావత+ఆరూఢుడై= ఐరావతం ఎక్కినవాడై; వైశ్వానర= అగ్ని; వరుణ= వరుణదేవుడు; వాయు= వాయువు; దండధరాది+అనేక= యముడు మొదలైన అనేక; నిర్జరవాహినీ సందోహంబునున్= దేవతల సైన్యసముదాయంతో; తాను= ఇంద్రుడు; ఎదురుపడి= ఎదుర్కొని; పిఱుతివియక= వెనుదీయకుండా; మోహరించెన్= సైన్యాన్ని నిల్పినాడు; అట్లు= ఆవిధంగా; సంరంభ= వేగిరపాటుతో; సన్నాహ= సైన్యాన్ని స్థిరపరచటంతో; సమ్+ ఉత్సాహంబులన్= మిక్కిలి సమరోత్సాహంతో; రెండు తెఱంగులవారునున్= రెండు సమూహాలవారూ; పోరాడు వేడుకలన్= యుద్ధంచేసే సంబరంలో; మీఁటగు+మాటలన్= వాడి మాటలతో; సందడించుచున్న సమయంబునన్= ఆక్షేపించుకొంటున్న సమయంలో...

**తా :** ఇంకా నముచి, శంబరుడు, బాణుడు, ద్విమూర్థుడు, కాలనాభుడు, శకుని, జంభుడు, అయోముఖుడు; ప్రహేతి, హేతి, భూత సంత్రాసుడు, హయగ్రీవుడు, కపాలుడు, ఇల్వలుడు, ఉత్కలుడు, మేఘదుందుభి, మయుడు, త్రిపురాసురులు, విప్రచిత్తి, విరోచనుడు, వజ్రదంష్ట్రుడు, తారకుడు, అరిష్టుడు, అరిష్టనేమి, శుంభుడు, నిశుంభుడు, శంకుశిరుడు మొదలైన వారంతా ఒక గుంపుగా నిలబడ్డారు. పౌలోముడు, కాలకేయుడు, నివాతకవచులు మొదలైన మహావీరులు మహాదళంగా నిలబడ్డారు. వీరంతా రథాలను, గుఱ్ఱాలను, ఏనుగులను, జింకలను, సింహాలను, పందులను, కీటకాలను, నీటి జంతువుల్ని, శరభాలను, దున్నపోతులను, గురుపోతులను, ఖడ్గమృగాలను, గండభేరుండాలను, చమరీమృగాలను, నక్కలను, పులులను, ఎద్దులను, వాహనాలుగా చేసుకొన్నారు. ఇంకా రాబందులను, గద్దలను, కాకులను, కోడిపుంజులను, కొంగలను, హంస మొదలైన పక్షులను కూడా ఎక్కారు. తిమి తిమింగలాది నీటి జంతువులను, మనుష్యులను, రాక్షస, దేవతా రూపాలలో ఉన్న జంతువులను కొంతమంది అధిరోహించారు. తమకు సంకేతాలయిన గొడుగులను,

కవచఖడ్గాలను, ఏనుగులకు, గుర్రాలకు వేసే పై తొడుగులను, శిరస్త్రాణాలను ధరించి వేరువేరుదళాలుగా సిద్ధపడి బలిచక్రవర్తి ముందు నిలిచారు. దేవేంద్రుడు ఐరావతాన్ని అధిరోహించి వచ్చాడు. అతనికి సహాయంగా వచ్చిన అగ్ని, వరుణ, వాయు, యమాది దేవతలు సైన్యంతో కూడి ఇంద్రుడు బలిని వెనుదీయని పరాక్రమంతో ఎదిరించాడు. ఆ విధంగా ఉభయ సైన్యాలవారూ యుద్ధానికి సన్నద్ధులవుతూ, యుద్ధంచేయాలని సంబరపడుతూ, వేగిరపడుతూ, వాడివాడిమాటలతో ఒకరినొకరు ఆక్షేపించుకొంటున్న సమయంలో

**సీ. వజ్రదంష్ట్రాంచితవ్యజనంబులును బర్హ చామరంబులు సితచ్ఛత్రములును**
**జిత్రవర్ణధ్వజచేలంబులును వాత చలితోత్తరోష్ణీషజాలములును**
**జప్పుళ్ల నెసఁగు భూషణ కంకణంబులుఁ జండాంశురోచుల శస్త్రములును**
**వివిధఖేటకములు వీరమాలికలును బాణపూర్ణములైన తూణములును**

**ఆ. నిండి పెచ్చురేఁగి నిర్జరాసురవీర, సైన్యయుగ్మకంబు సాల నొప్పె**
**గ్రాహతతులతోడఁగలహంబునకు వచ్చు, సాగరముల భంగి జనవరేణ్య! 332**

**ప్రతి :** జనవరేణ్య= ఓ రాజా; వజ్రదంష్ట్ర+అంచిత+వ్యజనంబులును= వజ్రాలవంటి కఠినమైన కోరలు గల్గి దండాలచేత అలంకరింపబడిన ఆలవట్టాలు (విసనకర్రలు); బర్హచామరంబులు= నెమలిపింఛములతో అలంకరింపబడిన వింజామరలు; సితచ్ఛత్రములును= వెల్లగొడుగులు (తెల్లని గొడుగులు); చిత్ర వర్ణ ధ్వజచేలంబులును= సొగసైన రంగురంగుల జెండాల గుడ్డలు; వాత+చలిత+ఉత్తర+ఉష్ణీష జాలములును= గాలికి కదలాడే పై తలపాగాల గుడ్డలు; చప్పుళ్ళన్+ఎసఁగుభూషణ కంకణంబులున్= గలగలమని ధ్వనించే కంకణాది ఆభరణాలు; చండ+అంశు+రోచుల+శస్త్రములును= సూర్యుని కాంతి వంటి కాంతితో ధగధగలాడే శస్త్రాలు; వివిధ ఖేటకములు= రకరకాల డాళ్ళు; వీర మాలికలును= వీరులకు వేసే హారాలు; బాణపూర్ణములైన తూణములును= అమ్ములతో నిండిన పొదులు; నిండి= వీటితో కూడి; పెచ్చురేఁగి= విజృంభించి; నిర్జర+అసుర+వీర+సైన్య+యుగ్మకంబు= దేవదానవుల వీరులైన ఉభయసైన్యాలూ; గ్రాహతతులతోడన్= మొసళ్ళతో నిండి; కలహంబునకున్+వచ్చు= పోరాడడానికి వచ్చిన; సాగరములభంగిన్= రెండు సముద్రాలలాగా; చాలన్+ఒప్పెన్= మిక్కిలి ప్రకాశించాయి.

**తా :** ఓ రాజా! వజ్రదంష్ట్రలవంటి దండాలు కల్గిన ఆలవట్టాలు, నెమలిపురులతో అలంకరింపబడిన వింజామరలు, తెల్లగొడుగులు, సొగసైన రంగురంగుల జెండాలు, గాలికి రెపరెపలాడే తలపాగాలు, గలగలమని ధ్వనించే కంకణాది ఆభరణాలు, ధగధగలాడే శస్త్రాలు, రకరకాల డాలులు, హారాలు, నిండిన అంపపొదులు; వీటితోకూడి దేవదానవుల వీరసైన్యాలు రెండూ ఒక్కసారిగా విజృంభించాయి – ఇది ఎలా ఉందంటే మొసళ్ళతో నిండిన రెండు సముద్రాలు ఒకదానిపై ఒకటి పడ్డట్టు ఉంది.

**క. భేరీభాంకారంబులు వారణఘీంకారములును వరహరిహేషల్**
**భూరిరథనేమిరవములు ఘోరములై పెల్లగించెఁగులశైలములన్. 333**

**ప్రతి :** భేరీభాంకారంబులు= భేరీవాద్యాలనుండి పుట్టిన భాంకారాలు; వారణ= ఏనుగులయొక్క; ఘీంకారములును= ఘీంకారాలు; వర= శ్రేష్ఠములైన; హరి= గుర్రాల; హేషల్= సకిలింతలూ; భూరి= పెద్దదైన; రథనేమి= రథచక్రాల;

రవములు= శబ్దాలు; ఘోరములు+ఐ= మిక్కిలి భయంకరంగా ఉన్నవై; కులశైలములన్= సప్తకులపర్వతాలను; పెల్లగించెన్= తలక్రిందులు చేశాయి.

**తా :** దేవాసుర సంగ్రామంలో భేరీభాంకారాలు, ఏనుగుల ఘీంకారాలు, గుర్రాల సకిలింతలు, రథచక్రాల సవ్వడులు – అన్నీ కలిసి భయంకరమైన శబ్దాల్ని పుట్టించాయి – ఆ ధ్వనులతో కులపర్వతాలు తలకిందులయ్యాయి.

**వ.** **ఇ వ్విధంబున నుభయబలంబులును మోహరించి బలితో నింద్రుండును, దారకునితో గుహుండును, హేతితో వరుణుండును, బ్రహేతితో మిత్రుండును, గాలనాభునితో యముండును, మయునితో విశ్వకర్మయు, శంబరునితోఁద్వష్టయు, విరోచనునితో సవితయు, నముచితోఁబరాజితుండును, వృషపర్వునితో నశ్వినీ దేవతలును, బలిసుతబాణాది పుత్త్రశతంబుతో సూర్యుండును, రాహువుతో సోముండును, బులోమునితో ననిలుండును, శుంభ నిశుంభులతో భద్రకాళీదేవియు, జంభునితో వృషాకపియును, మహిషునితో విభావసుండును, నిల్వల వాతాపులతో బ్రహ్మపుత్త్రులును, దుర్మర్షణునితోఁగామదేవుండును, నుత్కలునితో మాతృకా గణంబును, శుక్రునితో బృహస్పతియు, నరకునితో శనైశ్చరుండును, నివాతకవచులతో మరుత్తులును, గాలేయులతో వసువులు నమరులును, పౌలోములతో విశ్వేదేవగణంబును, గ్రోధవశులతో రుద్రులును, నివ్విధంబునం గలసి పెనంగి ద్వంద్వ యుద్ధంబు సేయుచు మఱియు రథికులు రథికులను, పదాతులు పదాతులను, వాహనారూఢులు వాహనారూఢులను దాఁకి సింహనాదంబులు సేయుచు, నట్టహాసంబు లిచ్చుచు నాహ్వానంబు లొసంగుచు, నన్యోన్య తిరస్కారంబులు సేయుచు, బాహునాదంబుల విజృంభించుచుఁ, బెనుబొబ్బల నుబ్బిరేఁగుచు, హుంకరించుచు, నహంకరించుచు, ధనుర్గుణంబులం దంకరించుచు, శరంబుల నాఁటించుచుఁ, బరశువుల నఱకుచుఁ, జక్రంబులం జెక్కుచు, శక్తులం దునుముచుఁ, గశలం బెట్టుచుఁ, గుఠారంబులఁబొడుచుచు, గదల నడచుచుఁ, గరంబులఁ బొడుచుచుఁ, గరవాలంబుల వ్రేయుచుఁబట్టిసంబుల నొంచుచుఁ, బ్రాసంబులం ద్రెంచుచుఁ, బాశంబులం గట్టుచుఁ, బరిఘంబుల మొత్తుచు, ముసలంబుల మోఁదుచు, ముద్గరంబులఁజదుపుచు, ముష్టివలయంబుల ఘట్టించుచుఁ, దోమరంబుల నుఱుముచు, శూలంబులఁజిమ్ముచు, నఖంబులం జీరుచుఁ, దరుశైలంబుల ఱువ్వుచు, నుల్ముకంబులం జూఁడుచు నిట్లు బహువిధంబులం గలహవిహారంబులు సలుపు నవసరంబున భిన్నంబులైన శిరంబులును, విచ్ఛిన్నంబులైన కపాలంబులును, వికలంబులైన కపోలంబులును, జిక్కువడిన కేశబంధంబులును, భగ్నంబులైన దంతంబులును, గృత్తంబులైన భుజంబులును, ఖండితంబులైన కరంబులును, విదళితంబులైన మధ్యంబులును, వికృతంబులైన వదనబింబంబులును, వికలంబులైన నయనంబులును, వికీర్ణంబులైన కర్ణంబులును, విశీర్ణంబులైన నాసికలును, విఱిగి పడిన యూరుదేశంబులును, విసంధులైన పదంబులును, జిరిఁగిన కంకటంబులును, రాలిన భూషణంబులును, వ్రాలిన కేతనంబులును, గూలిన ఛత్రంబులును, మ్రొగ్గిన గజంబులును, నుగ్గయిన రథంబులును, నుఱుమైన హయంబులును, జిందఱవందఱలైన భటసమూహంబులును, నొఱలెడు కొఱప్రాణంబులును, బొరలెడు మేనులును,**

**నుబ్బియాడెడు భూతంబులును, బాఱెడు రక్తప్రవాహంబులును, గట్టలు గొన్న మాంసంబులును, నెగసి తిరిగెడి కళేబరంబులును, గలకలంబులు సేయు కంక గృధ్రాది విహంగంబులు నయి యొప్పు న ప్పో రతిఘోరంబయ్యె నప్పుడు. 334**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ విధంగా; ఉభయబలంబులును= దేవదానవ సైన్యాలు రెండూ; మోహరించి= ఎదుర్కొని (నతరువాత); బలితోన్+ఇంద్రుండునున్= బలితో ఇంద్రుడు; తారకునితోన్+గుహుండును= తారకునితో కుమారస్వామి; హేతితో వరుణుండును= హేతితో వరుణుడు; ప్రహేతితో మిత్రుండును= ప్రహేతితో మిత్రుడు; కాలనాభునితో యముండును= కాలనాభునితో యముడు; మయునితో విశ్వకర్మయున్= మయునితో విశ్వకర్మ; శంబరునితోన్+త్వష్టయున్= శంబరునితో త్వష్ట; విరోచనునితో సవితయున్= విరోచనునితో సవిత; నముచితోఁ బరాజితుండును= నముచితో పరాజితుడు; వృషపర్వునితోన్+అశ్వినీ దేవతలును= వృషపర్వునితో అశ్వినీదేవతలు; బలిసుత బాణాది పుత్ర శతంబుతో సూర్యుండును= బాణుడు మొదలైన నూరుమంది బలి కుమారులతో సూర్యుడు; రాహువుతో సోముండును= రాహువుతో చంద్రుడు; పులోమునితోన్+అనిలుండును= పులోమునితో వాయువు; శుంభనిశుంభులతో భద్రకాళీ దేవియున్= శుంభ నిశుంభులతో భద్రకాళి, జంభునితో వృషాకపియును= జంభునితో వృషాకపి; మహిషునితో విభావసుండును= మహిషునితో విభావసుడు; ఇల్వల వాతాపులతో బ్రహ్మపుత్రులును= ఇల్వలుడు, వాతాపి అనే వారితో బ్రహ్మపుత్రులు; దుర్మర్షునితో+ కామదేవుండును= దుర్మర్షునితో మన్మథుడు; ఉత్కలునితోన్+మాతృకాగణంబును= ఉత్కలునితో సప్తమాతృకలు; శుక్రునితోన్+బృహస్పతియున్= శుక్రునితో బృహస్పతి; నరకునితోన్+శనైశ్చరుండును= నరకునితో శనైశ్చరుడు; నివాతకవచులతోన్+మరుత్తులును= నివాతకవచులతో మరుత్తులు; కాలేయులతోన్+వసువులున్+అమరులను= కాలేయులతో వసువులు, దేవతలు; పౌలోములతోన్+విశ్వేదేవగణంబును= పౌలోములతో విశ్వేదేవుల సమూహము; క్రోధవశులతోన్+రుద్రులును= క్రోధవశులతో రుద్రులు; ఈ విధంబునన్= ఈ విధంగా; కలసిపెనంగి= కలసి పోరాడుతూ; ద్వంద్వయుద్ధంబు+చేయుచున్= ద్వంద్వయుద్ధం చేస్తూ; మఱియున్= ఇంకా; రథికులు+రథికులును= రథికులు, రథికులనూ; పదాతులు+పదాతులను= కాలిబంట్లు, కాలిబంట్లనూ; వాహనారూఢులు+వాహనారూఢులను= వాహనాల వారు, వాహనాల వారిని; తాఁకి= ఎదుర్కొని; సింహనాదంబులు+చేయుచున్= సింహనాదాలు చేస్తూ; అట్టహాసంబులు+ఇచ్చుచున్= బిగ్గరగా నవ్వుతూ; ఆహ్వానంబులు+ఒసంగుచున్= ఒకరినొకరు యుద్ధానికి పిలుస్తూ; అన్యోన్య తిరస్కారంబులు+చేయుచున్= ఒకరినొకరు ధిక్కరిస్తూ; బాహునాదంబులన్+విజృంభించుచున్= బాహువులు అప్పళిస్తూ చెలరేగుతూ; పెనుబొబ్బలన్+ ఉబ్బిరేగుచున్= గావుకేకలతో ఉప్పొంగిపోతూ; హుంకరించుచున్= హుంకారాలు చేస్తూ; అహంకరించుచున్= 'నేను' 'నేను' అని గర్విస్తూ; ధనుర్గుణంబులన్+టంకరించుచున్= ధనుష్టంకారాలు చేస్తూ (అల్లెత్రాటి ధ్వనిని టంకారమంటారు); శరంబులన్+నాఁటించుచున్=బాణాలు నాటుతూ; పరశువులన్+నఱుకుచున్= గొడ్డళ్ళతో నరుకుతూ; చక్రంబులన్+ చెక్కుచున్= చక్రాలతో ఖండిస్తూ; శక్తులన్+తునుముచున్= శక్తులతో ముక్కలుచేస్తూ; కశలన్+పెట్టుచున్= కొరడాలతో కొడుతూ; కుఠారంబులన్+పొడుచుచున్= గొడ్డళ్ళతో పొడుస్తూ; గదలన్+అడచుచున్= గదలతో మోదుతూ; కరంబులన్+ పొడుచుచున్= చేతులతో గుద్దుతూ; కరవాలంబులన్= కత్తులతో; వ్రేయుచున్= నరుకుతూ; పట్టిసంబులన్+నొంచుచున్= అడ్డకత్తులతో నొప్పిస్తూ; ప్రాసంబులన్= ఈటెలతో; త్రెంచుచున్= తెగవేస్తూ, పాశంబులన్+కట్టుచున్= తాళ్ళతో కట్టేస్తూ; పరిఘంబులన్+మోఁదుచున్= ఇనుపకట్ల గుదియలతో మోదుతూ; ముసలంబుల మోఁదుచు= రోకళ్లతో దంచుతూ; ముద్గరంబులన్+చదుపుచున్= సమ్మెటలతో బాదుతూ; ముష్టివలయంబులన్= పిడికిళ్ళతో చుట్టూరా; ఘట్టించుచున్=

గుద్దుతూ; తోమరంబులన్= చిల్లకోలలతో; నుఱుముచున్= పిండిచేస్తూ; శూలంబులన్= శూలాలతో; చిమ్ముచున్= కుమ్ముతూ; నఖంబులన్= గోళ్ళతో; చీరుచున్= చీల్చుతూ; తరు+శైలంబులన్= చెట్లను, కొండల్ని; ఱువ్వుచున్= విసురుతూ; ఉల్కకంబులన్= కొరవులతో; చూఁడుచున్= కాలుస్తూ; ఇట్లు; బహువిధంబులన్= అనేక విధాలుగా; కలహవిహారంబులు= పోరాటములు; సలుపున్+అవసరంబునన్= చేస్తున్న సమయంలో; భిన్నంబులైన శిరంబులును= పగిలిన తలలు; విచ్ఛిన్నంబులైన+కపాలంబులును= బద్దలయిన పుర్రెలు; వికలంబులయిన కపోలంబులును= చీలిపోయిన చెక్కిళ్ళు; చిక్కు+పడిన+కేశ బంధంబులున్= చిక్కుపడిపోయిన కొప్పులు; భగ్నంబులైన దంతంబులును= విరిగిపోయిన పండ్లు (దంతాలు); కృత్తంబులయిన+భుజంబులును= నరకబడిన భుజాలు; ఖండితంబులైన కరంబులును= తెగిపడిన చేతులు; విదళితంబులు+ఐన+మధ్యంబులును= విరిగిన నడుములు; వికృతంబులైన వదన బింబంబులును= నుజ్జునుజ్జుగా అయిన ముఖాలు; వికలంబులైన+నయనంబులును= లొట్టలుపోయిన కన్నులు; వికీర్ణంబులైన కర్ణంబులును= ముక్కలయి విరిగిపడిన చెవులు; విశీర్ణంబులైన నాసికలును= తెగిన ముక్కులు; విఱిగిపడిన+ఊరుదేశంబులును= విరిగిపడిపోయిన తొడలు; విసంధులయిన పదంబులును= ఊడిపోయిన కాళ్ళు; చిరిఁగిన కంకటంబులును= చిరిగిపోయిన కవచాలు; రాలిన భూషణంబులును= కింద రాలిపడిన ఆభరణాలు; వ్రాలిన కేతనంబులును= వాలిపోయిన కేతనాలు; కూడిన ఛత్రంబులును= కూలిపోయిన గొడుగులు; మ్రొగ్గిన గజంబులును= కుంగినేలబడిన ఏనుగులు; నుగ్గయిన రథంబులును= నుగ్గునుగ్గయిన రథాలు; నుఱుమైన హయంబులును= తుక్కుతుక్కయిన గుర్రాలు; చిందఱవందఱలయిన భట సమూహంబును= చెల్లాచెదరయిన సైన్యసమూహాలు; ఒఱలెడుకొఱ ప్రాణంబులును= కొట్టుకొంటున్న కొనప్రాణాలు; పొరలెడు మేనులును= పొర్లాడుతున్న సైనికుల శరీరాలు, జంతువుల శరీరాలు; ఉబ్బి+ఆడెడు+భూతంబులును= చిందులు తొక్కుతున్న పిశాచాలు; పాఱెడు రక్తప్రవాహంబులును= పారుతున్న రక్తపుటేర్లు; కట్టలు కొన్న మాంసంబులును= రాశులుగా పోగులు పడిన మాంసఖండాలు; ఎగసి తిరిగెడి కళేబరంబులును; ఎగిరిపడుతున్న పీనుగులు; కలకలంబులు+చేయు+కంక+గృధ్రాది+ విహంగంబులున్+అయి= పెద్దరొద చేస్తున్న రాబందులు, గద్దలు మొదలైన పక్షులతో; ఒప్పు= భయంకరంగా కనిపిస్తున్న; ఆ+పోరు= ఆ యుద్ధం; అతి+ఘోరంబు+అయ్యెన్= అతి దారుణంగా ఉంది. అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఈ విధంగా దేవదానవ సైన్యాలు రెండూ గుమికూడాయి. అప్పుడు బలితో ఇంద్రుడు; తారకునితో కుమారస్వామి; హేతితో వరుణుడు. ప్రహేతితో మిత్రుడు, కాలనాభునితో యముడు, మయునితో విశ్వకర్మ, శంబరునితో త్వష్ట, విరోచనునితో సవిత; నముచితో పరాజితుడు; వృషపర్వునితో అశ్వినీ దేవతలు; బాణుడు మొదలైన నూరుమంది బలి కుమారులతో సూర్యుడు, రాహువుతో చంద్రుడు, పులోమునితో వాయువు, శుంభనిశుంభులతో భద్రకాళి; జంభునితో వృషాకపి; మహిషునితో విభావసుడు; ఇల్వలుడు వాతాపులతో బ్రహ్మపుత్రులు; దుర్మర్షునితో మన్మథుడు; ఉత్కలునితో సప్తమాతృకలు; శుక్రునితో బృహస్పతి, నరకునితో శనైశ్చరుడు; నివాతకవచులతో మరుత్తులు; కాలేయులతో వసువులు, అమరులు; పౌలోములతో విశ్వేదేవులు, క్రోధవశులతో రుద్రులు; ఈ విధంగా కలిసి పోరాడుతూ, ద్వంద్వయుద్ధం చేస్తూ విజృంభించారు. రథికులు రథికులతో, కాలిబంట్లు కాలిబంట్లతో, ఆయా వాహనాలలోనివారు, వాహనాలవారితో; సింహనాదాలు చేస్తూ, బిగ్గరగా నవ్వుతూ, ఒకరినొకరు యుద్ధానికి పిలుస్తూ, బాహువులు అప్పళిస్తూ చెలరేగుతూ, గావు కేకలతో ఉబ్బిపోతూ, హుంకారాలు చేస్తూ, గర్విస్తూ, ధనుష్టంకారాలు చేస్తూ, బాణాలు నాటుతూ, గొడ్డళ్ళతో నరుకుతూ; చక్రాలతో ఖండిస్తూ, శక్తులతో ముక్కలు చేస్తూ, కొరడాలతో కొడుతూ; గొడ్డళ్ళతో పొడుస్తూ, గదలతో మోదుతూ, చేతులతో గుద్దుతూ, కత్తులతో నరుకుతూ, అడ్డకత్తులతో నొప్పిస్తూ, ఈటెలతో తెగవేస్తూ, తాళ్ళతో కట్టివేస్తూ, ఇనుప గుదియలతో మొత్తుతూ, రోకళ్ళతో దంచుతూ,

సమ్మెటలతో బాదుతూ, పిడికిళ్ళు బిగించి గుద్దుతూ, తోమరాలతో పిండిచేస్తూ, శూలాలతో కుమ్ముతూ, గోళ్ళతో చీలుస్తూ, చెట్లను కొండల్నీ విసురుతూ, కొరవులతో కాలుస్తూ ఇలా అనేక విధాలుగా పోరాటాలు సాగించారు. ఆ సమయంలో యుద్ధభూమిలో అంతటా పగిలిన తలలు, బద్దలైన పుర్రెలు, చీలికలయిన చెక్కిళ్ళు; చిక్కులు పడిన కొప్పులు; విరిగిపోయిన పండ్లు, నరకబడిన భుజాలు, లొట్టలుపోయిన కన్నులు; విరిగిపడిపోయిన చెవులు, తెగిపోయిన ముక్కులు, విరిగిపడిపోయిన తొడలు, ఊడిపోయిన కాళ్ళు, చిరిగిపోయిన కవచాలు, రాలిపోయిన ఆభరణాలు, కిందికి వాలిపోయిన జండాలు, కూలిపోయిన గొడుగులు, కుంగినేలబడిన ఏనుగులు, నుగ్గునుగ్గయిన రథాలు, తుక్కుతుక్కయిన గుర్రాలు, చెల్లాచెదరై పడిపోయిన సైన్యసమూహం; కొట్టుకొంటున్న కొనప్రాణాలు, పొర్లాడుతున్న శరీరాలు, శవాలనుచూసి ఉబ్బి ఆడుతున్న పిశాచాలు, పారుతున్న రక్తపుటేర్లు, రాశులుగా పోగులు పడ్డ మాంసఖండాలు; ఎగిసిపడుతున్న పీనుగులు, వాటికోసం మూగి హోరుమని రొదచేస్తున్న రాబందులు, గద్దలు – వీటితో రణరంగం అతిఘోరంగా కనిపించింది.

**శా. నాకాధీశుఁబదింట; మూఁట గజమున్, నాల్గింట గుఱ్ఱంబుల**
**న్నేకాస్త్రంబున సారథిం జొనిపె, దైత్యేంద్రుండు వీఁకన్ వియ**
**ల్లోకాధీశుఁడు ద్రుంచి యన్నిటిని దోడ్తో నన్నిభల్లంబులన్**
**రాకుండన్ రిపువర్గముందునిమె గీర్వాణారి యగ్గింపఁగన్. 335**

**ప్రతి :** దైత్య+ఇంద్రుడు= బలిచక్రవర్తి; నాకాధీశున్= ఇంద్రుని; పదింటన్= పదిబాణాలతో; మూఁటన్= మూడు బాణాలతో; గజమున్= ఐరావతాన్ని; నాల్గింటన్= నాలుగు బాణాలతో; గుఱ్ఱంబులన్= గుర్రాలను; ఏకాస్త్రంబునన్= ఒకే ఒక బాణంతో; సారథిన్= సారథిని; చొనిపెన్= కొట్టాడు; వియత్+లోకాధీశుఁడు= స్వర్గాధీశుడు (ఇంద్రుడు); వీఁకన్= వెంటనే; అన్నిఁటినిన్+త్రుంచి= అన్నింటిని తుంచి పారవేసి; తోడ్తోన్= ఆ వెంటనే; అన్ని+భల్లంబులన్= సమాన సంఖ్యలోని బాణాలతో; రిపువర్గమున్= దేవతల శత్రువు బలిచక్రవర్తి; గీర్వాణ+అరి= బలిచక్రవర్తి; అగ్గింపఁగన్= మెచ్చుకొంటుండగా; తునిమెన్= ఖండించాడు.

**తా :** ఇంకా ఆ యుద్ధంలో బలిచక్రవర్తి దేవేంద్రునిపై పదిబాణాలు వేశాడు. మూడు బాణాలతో ఐరావతాన్ని కొట్టాడు. గుర్రాలపై నాల్గు బాణాలు వేశాడు. సారథిని ఒకబాణంతో కొట్టాడు. ఇంద్రుడు కూడా విజృంభించి వెంటనే అన్ని బాణాలను అన్నేసి బాణాలతో నరికివేశాడు. దీన్నిచూసి ఇంద్రుడిని బలిచక్రవర్తి అభినందించాడు.

**సీ. తన తూపులన్నియుఁ దరమిడి శక్రుండు నఱికిన జోదు విన్ననువు మెఱసి**
**బలి మహాశక్తిచేఁ బట్టిన నదియును నతఁడు ఖండించె నత్యద్భుతముగ;**
**మఱి ప్రాసశూల తోమరములు గైకొన్నఁదోడ్తోడ నవియును దునిమివైచె;**
**నంతటఁబోక యెయ్యది వాఁడు సంధించెఁ దొడరి తా నదియును దుమురు సేసె;**

**ఆ. నసురభర్త విరథుఁడై తన పగఱకుఁ, గానఁబడక వివిధ కపట వృత్తి**
**నేర్పు మెఱసి మాయ నిర్మించె, మింటను వేల్పుగములు సూచి వెఱఁగు పడఁగ. 336**

**ప్రతి :** తన తూపులన్నియున్= తన బాణాలన్నిటినీ; తరమిడి= వరుసబెట్టి; శక్రుండు= ఇంద్రుడు, నఱికినన్= ఖండించి వేయగా; జోదు= వీరుడైన బలి; విన్ననువు మెఱసి= ఉపాయం స్ఫురించి; బలి= బలిచక్రవర్తి; మహాశక్తిన్+చేఁబట్టినన్=

గొప్పదైన శక్త్యాయుధాన్ని చేతిలో పట్టుకోగా; అదియును= దాన్నికూడా; అతఁడు= ఇంద్రుడు; అత్యద్భుతముగన్= ఆశ్చర్యంగా; ఖండించెన్= నరికి పారేశాడు; మఱి= తరువాత; ప్రాసశూల తోమరములు+కైకొన్నన్= ఈటెను, శూలాన్ని, తోమరాన్ని అందుకోగా; తోడ్తోడన్= వెంటనే; అవియునున్= వాటినికూడా; తునిమి వైచెన్= ఖండించివేశాడు; అంతటన్+పోక= అంతటితో ఆగకుండా; ఏ+అయ్యది= ఏ ఆయుధాన్ని; వాఁడు సంధించెన్= వాడు (బలి) సంధించాడో; తాన్+తొడరి= ఇంద్రుడు విజృంభించి; అదియునున్+తుమురు+చేసెన్= దానిని కూడా తునకలుగా చేశాడు; అసురభర్త= బలిచక్రవర్తి; విరథుఁడై= రథం పోగొట్టుకొని; తన పగఱకున్= తన శత్రువులకు; కానఁబడక= కనిపించకుండా; వివిధ కపటవృత్తిన్= వివిధములైన కపటోపాయాలను వాడి; నేర్పుమెఱసి= నేర్పుచూపి; వేల్పుగములు= దేవతా సమూహాలు; చూచి= (దీన్ని) చూసి; వెఱఁగుపడఁగన్= భయపడగా; మింటన్= ఆకాశంలో; మాయ నిర్మించెన్= మాయను సృష్టించాడు.

**తా :** తన బాణాలన్నింటినీ వరుసపెట్టి ఇంద్రుడు ఖండించి వేయగా, వీరుడైన బలిచక్రవర్తికి ఉపాయం స్ఫురించి, బలవత్తరమైన శక్త్యాయుధం చేతపట్టాడు. దాన్నికూడా ఇంద్రుడు ఆశ్చర్యకరంగా త్రుంచివేశాడు. తరువాత బలిచక్రవర్తి ఈటె, బల్లెం, తోమరాలను చేతబట్టి ప్రయోగించాడు. వాటినిగూడా ఇంద్రుడు ఖండించి వేశాడు. అంతటితో ఆగక, ఏయే ఆయుధాల్ని బలి ప్రయోగించినా పూనుకొని వాటిని వెంటనే తునాతునకలు చేసివేశాడు. చివరికి బలిచక్రవర్తి రథం కూడా పోగొట్టుకున్నాడు. దానితో కపటోపాయంతో నేర్పుగా ఆకాశంలో ఒకమాయను సృష్టించాడు. దీన్నిచూసి దేవతలు భయపడి పోయారు.

**వ. ఇట్లు దానవేంద్రుని మాయావిశేషవిధానంబున సురానీకంబులపైఁ బర్వతంబులు వడియె; దావాగ్ని దందహ్యమాన తరువర్షంబులు గురిసె; సటంక శిఖర నికరశిలాసారంబులు గప్పె; మహోరగ దందశూకంబులు గఱచె; వృశ్చికంబులు మీటె; వారాహ వ్యాఘ్ర సింహంబులు గదిసి విదళింపం దొరఁకొనియె; వనగజంబులు మట్టి మల్లాడం జొచ్చె; శూలహస్తులు దిగంబరులునై రండు రండని బలురక్కసులు శతసహస్రసంఖ్యలు ఛేదనచ్ఛేదన భాషణంబులు సేయం దొడంగిరి; వికృత వదనులు గదాదండధారులు నాలంబిత కేశ భారులునై యనేక రాక్షస వీరులు 'పోనీకు పోనీకుఁడు; తునుము తునుముం'దని వెనుతగిలిరి; పరుష గంభీర నిర్ఘాత సమేతంబులయిన జీమూత సంఘాతంబులు వాతాహతంబులై యుప్పతిల్లి నిప్పుల కుప్పలు మంటల ప్రోవులం గురిసె; మహాపవన విజృంభితంబైన కార్చిచ్చు ప్రళయానలంబు చందంబునం దరికొనియెఁ, బ్రచండ ఝుంఝూనిల ప్రేరిత సముత్తుంగ తరంగావర్తభీషణంబయిన మహార్ణవంబు సెలియలికట్ట దాఁటి వెల్లి విరిసి నట్లమేయంబై యుండె; నా సమయంబునం బ్రళయకాలంబునుం బోలె మిన్ను మన్నును, రేయుంబగలని యెఱుంగ రా దయ్యె; నయ్యవసరంబున. 337**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; దానవ+ఇంద్రుని= బలిచక్రవర్తియొక్క; మాయావిశేష విధానంబునన్= విశేషమైన మాయాప్రయోగం (ఇంద్రజాలంకాదు) వల్ల; సురానీకంబులపైన్= దేవతాసంఘాలపైన, పర్వతంబులు+పడియెన్= పర్వతాలు పడ్డాయి; దావాగ్ని= కార్చిచ్చుతో; దందహ్యమాన= కాలిపోతున్న; తరువర్షంబులు+కురిసెన్= చెట్లు వాన చినుకులలా రాలిపోయాయి (వర్షంలాగా); సటంక+శిఖర+నికర+శిలాసారంబులు+కప్పెన్= సానువులతో సహా కొండ శిఖరాల సమూహం విరిగి ముక్కలై కిందపడి నేలను కప్పివేశాయి; మహోరగదందశూకంబులు+కఱచె= గొప్పగొప్ప నాగుబాములు

వంటి విషజంతువులు పైనబడి కరిచాయి; వృశ్చికంబులు మీటెన్= తేళ్ళు కుట్టాయి; వారాహ= పందులు; వ్యాఘ్ర= పులులు; సింహంబులు+కదిసి= సింహాలు పైనబడి; విదళింపన్+దొరకొనియెన్= చీల్చడానికి మొదలుపెట్టాయి; వనగజంబులు= అడవి ఏనుగులు; మట్టి మల్లాడన్+చొచ్చెన్= (సైన్యాన్ని) మీదబడి పడదొక్కాయి; శూలహస్తులు= శూలాలు ధరించిన వారు; దిగంబరులును+ఐ= దిస్సమొలలతో; పలురక్కసులు= మహారాక్షసులు; శతసహస్రసంఖ్యలు= లక్షల సంఖ్యలో; రండు+రండు+అని= రండి, రండి అంటూ; ఛేదన, భేదన= కోస్తామని; భాషణంబులు+ చేయన్+తొడంగిరి= కేకలు వేయటం మొదలుపెట్టారు; వికృతవదనులు= వికారమైన ముఖాలుగలవారు; గదాదండధారులు= గదలు ధరించినవారు; ఆలంబిత కేశభారులును+ఐ= వేలాడుతున్న పెద్ద శిరోజాలతో; అనేక రాక్షసవీరులు= చాలామంది రాక్షసవీరులు; పోనీకు+పోనీకుఁడు= పోనీకండి, పోనీకండి; తునుము+తునుముండు+అని= 'నరకండి' 'నరకండి' అంటూ; వెనుతగిలిరి= వెన్నంటి తరిమారు; పరుష= మిక్కిలి పరుషమైన; గంభీర= గంభీరమైన; నిర్ఘాత= పిడుగులతో; సమేతంబులు+అయిన= కూడిన; జీమూత సంఘాతంబులు= మేఘసమూహాలు; వాత+ఆహతంబులై+ఉప్పతిల్లి= గాలికి చెలరేగి; నిప్పుల+కుప్పలు+ మంటల+ప్రోవులన్+కురిసెన్= నిప్పుల కుప్పల్ని, మంటల రాసుల్ని కురిపించాయి; మహాపవన= పెనుగాలులవల్ల; విజృంభితంబు+ఐ= విజృంభించిన; కార్చిచ్చు= దావాగ్ని; ప్రళయానలంబు= ప్రళయాగ్ని; చందంబునన్= వలె; దరికొనియెన్= చుట్టుముట్టింది; ప్రచండ= భయంకరమైన; ఝంఝ+అనిల= తుఫాను గాలివల్ల; ప్రేరిత= ప్రేరేపింపబడిన; సముత్తుంగతరంగ= ఎగిసిపడుతున్న అలలతో; ఆవర్తభీషణంబు+అయిన= సుడిగుండాలతో; మహార్ణవంబు= భయంకరమైన సముద్రం; చెలియలికట్ట+దాఁటి= చెలియలి కట్టనుదాటి; వెల్లి విరిసినట్లు= ప్రవహించినట్టు; అమేయంబు+ఐ= కంటికి ఆనకుండా; ఉండెన్= అయిపోయింది; (మేయం= కొలవదగింది – ఇక్కడ చూడదగింది); ఆ సమయంబునన్= ఆ సమయంలో; ప్రళయకాలంబునున్+పోలెన్= ప్రళయకాలంలో లాగా; మిన్నుమన్నును= నింగీ నేలా; రేయున్+పగలని= రాత్రింబవళ్ళని; ఎఱుంగన్+రాదు+అయ్యెన్= తెలుసుకోవటం అసాధ్యమయిపోయింది; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** ఈ విధంగా బలి ప్రయోగించిన విశేషమైన మాయవల్ల దేవతలపైన ఉన్నట్టుండి పర్వతాలు పడ్డాయి. కార్చిచ్చుతో మండుతున్న చెట్లు భస్మమై వర్షంలాగా రాలిపోయాయి. కొండశిఖరాలు విరిగి ముక్కలై రాళ్ళవర్షంతో నేల మూతబడి పోయింది. గొప్ప గొప్ప సర్పాలు పైనబడి కరిచాయి. తేళ్ళు కుట్టాయి. అడవి పందులు, పులులు, సింహాలు ఒక్కసారిగా దాడిచేసి దేవతల్ని చీల్చిపారవేయడం ప్రారంభించాయి. అడవి ఏనుగులు సురల్ని తొక్కి పారవేశాయి. శూలాలు ధరించిన దిగంబరులైన రాక్షసులు లక్షలాదిమంది, దేవతల్ని 'రండిరా! రండి' అంటూ; 'నరుకుతాం'; 'కోస్తాం' అంటూ కేకలు వేయటం మొదలు పెట్టారు. వికారపుముఖాలతో, గదలపట్టుకొని వేలాడుతున్న జులపాలతో చాలామంది రాక్షసవీరులు 'పోనీకండి! పోనీకండి!' 'నరకండి! నరకండి!' అంటూ దేవతల్ని వెన్నంటి తరిమారు. చెవులు తూట్లుపడేలా ఉన్న శబ్దాలతోటి పిడుగులతో కూడిన మేఘసమూహాలు గాలికి చెలరేగి నిప్పుల కుప్పల్ని, మంటల రాసుల్ని కురిపించాయి. పెనుగాలుల వల్ల విజృంభించిన దావాగ్ని ప్రళయాగ్నిలాగా చుట్టుముట్టింది. ప్రచండమైన తుఫాను చెలరేగి ఎగిసిపడుతున్న అలలతో, భయంకరమైన సుడిగుండాలతో సముద్రం చెలియలికట్టను దాటి చెలరేగి ప్రవహిస్తోందా అన్నట్టు కంటికి ఆనకుండా అయిపోయింది. ఆ సమయంలో ప్రళయకాలంలోలాగానే ఇది నేల అది నింగి అని, ఇప్పుడు రాత్రి అప్పుడు పగలని కూడా తెలియకుండా అంతా అయోమయంగా తయారయింది.

**క.** **ఆ యసురేంద్రుని బహుతర, మాయాజాలంబులకును మా తెఱుఁగక వ**
**జ్రాయుధముఖరాదిత్యు ల, పాయంబునుఁబొంది చిక్కువడిరి నరేంద్రా! 338**

**ప్రతి :** నరేంద్రా= రాజా!; ఆ+అసురేంద్రుని= బలి చక్రవర్తియొక్క; బహుతర= నానావిధములైన; మాయాజాలంబులకున్= మాయాజాలాలకు; మాఱు+ఎఱుఁగక= విరుగుడు తెలియక; వజ్రాయుధ+ముఖర+ఆదిత్యులు= ఇంద్రుడు నేతగా గల అదితి సంతానం (దేవతలు); అపాయంబునున్+పొంది= అపాయాల పాలై; చిక్కు+పడిరి= చిక్కులలో పడ్డారు.

**తా :** రాజా! ఆ బలిచక్రవర్తి పన్నిన నానావిధాలైన మాయాజాలాలకు విరుగుడు తెలియని అదితి పుత్రులైన ఇంద్రాది దేవతలు ఎన్నో అపాయాల పాలై చిక్కులలో పడి దీనులయ్యారు.

**వ. అప్పుడు. 339**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**క. ఇయ్యసురులచేఁ జిక్కితి, మెయ్యది దెరు? వెందుఁజొత్తు? మిటు వొలయఁగదే**
**యయ్యా! దేవ! జనార్దన!, కుయ్యో! మొఱ్ఱో! యటంచుఁ గూయిడి రమరుల్. 340**

**ప్రతి :** అమరుల్= దేవతలు; దేవ= ఓ పరమాత్మ; జనార్దన= జనార్దనా!; ఈ+అసురులచేన్+చిక్కితిమి= ఈ రాక్షసుల చేతుల్లో చిక్కుకున్నాం; తెరువు+ఎయ్యది= ఇకదారి ఏది?; ఎందున్+చొత్తుము= ఎక్కడికి పోవాలి?; ఇటు+పొలయన్+కదే అయ్యా!= ఇక్కడికి రాకూడదా స్వామీ!; కుయ్యో, మొఱ్ఱో అటంచున్= కుయ్యో! మొఱ్ఱో! అంటూ; కూయిడిరి= మొరపెట్టు కున్నారు.

**తా :** అప్పుడు దేవతలు "స్వామీ! జనార్దనా! ఈ రాక్షసుల చేతిలో పడ్డామే. ఇక మాకుదారి ఏది? ఎక్కడికి పోవాలి? నీవైనా ఇక్కడికి రాకూడదా స్వామీ! కుయ్యో! మొర్రో" – అంటూ విష్ణువుకు మొరపెట్టుకొన్నారు.

**వ. అట్లు మొఱయిడు నవసరంబున. 341**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; మొఱయిడు= మొరపెట్టుకొనే; అవసరంబునన్= సమయంలో...

**తా :** ఆ విధంగా మొరపెట్టుకొంటున్నప్పుడు.

**మ. విహగేంద్రాశ్వనిరూఢుఁడై మణిరమావిభ్రాజితోరస్కుఁడై**
**బహుశస్త్రాస్త్రరథాంగసంకలితుఁడై భాస్వత్కిరీటాది దు**
**స్సహుఁడై నవ్యపిశంగచేలధరుఁడై సంఫుల్లపద్మాక్షుఁడై**
**విహితాలంకృతితోడ మాధవుఁడు దా వేంచేసె నచ్చోటికిన్. 342**

**ప్రతి :** మాధవుఁడు= విష్ణువు; విహగ+ఇంద్ర+అశ్వ+నిరూఢుఁడు+ఐ= పక్షులలో రాజైన గరుత్మంతుని వాహనంలో కూర్చున్నవాడై; మణి= కౌస్తుభంచేత; రమా= లక్ష్మీదేవిచేత; విభ్రాజిత= ప్రకాశిస్తున్న; ఉరస్కుఁడు+ఐ= వక్షస్థలం కలవాడై; బహుశస్త్ర+అస్త్ర+రథాంగ+సంకలితుఁడై= నానావిధాల ఆయుధాలతో, చక్రంతో కూడినవాడై; భాస్వత్= ప్రకాశిస్తున్న; కిరీటాది= కిరీటాదులచేత; దుస్సహుఁడు+ఐ= భరించరానంత కాంతిమంతుడై; నవ్య= కొత్తదైన; పిశంగచేల ధరుఁడై= పచ్చటి పట్టువస్త్రాన్ని ధరించినవాడై; సంఫుల్ల= బాగా వికసించిన; పద్మాక్షుఁడు+ఐ= పద్మాలవంటి కన్నులు కలవాడై; విహిత= ఒప్పిన; అలంకృతితోడన్= అలంకారాలతో; అచ్చోటికిన్= ఆ దేవతలున్న చోటికి; తాన్+వేంచేసెన్= తాను వచ్చాడు.

**తా :** ఆ సమయంలో విష్ణువు గరుడవాహనారూఢుడై వక్షఃస్థలంలో కౌస్తుభమణి, రమామణి ప్రకాశిస్తుండగా, నానావిధాలైన ఆయుధాలను, చక్రాన్ని ధరించి, కిరీటకేయూరాదుల చేత మిక్కిలిగా ప్రకాశిస్తూ, కొత్తదైన పచ్చని పట్టుపీతాంబరాన్ని ధరించి, వికసించిన పద్మాలవంటి పెద్ద నేత్రాలతో; మిరుమిట్లు కొల్పుతున్న వైభవంతో దేవతలున్న ఆ చోటికి వచ్చాడు.

**చ. అసురులమాయ లన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చినంతటన్**
**గసిబిసియై నిరర్థమయి గ్రక్కునఁ బోయెను; నిద్రనొంది సం**
**తసమున మేలుకొన్నగతిఁ దాల్చి చెలంగిరి వేల్పులందఱుం**
**బస సెడ కేల యుండు హరిపాదపరిష్కృతిసేయ నాపదల్? 343**

**ప్రతి :** అసురుల= రాక్షసుల; మాయలు+అన్నియును= మాయలన్నీ; అబ్జదళాక్షుఁడు= విష్ణువు (పద్మదళనేత్రుడు); వచ్చినంతటన్= రాగానే; కసిబిసియై= వెలవెలబోయి; నిరర్థమయి= వ్యర్థములై; గ్రక్కునన్+పోయెను= వెంటనే అదృశ్యమయ్యాయి; నిద్రన్+ఒంది= నిద్రపోయి; సంతసమునన్= హాయిగా; మేలుకొన్నగతిన్+తాల్చి= మేల్కొన్న విధంగా; వేల్పులు+అందఱున్= దేవతలంతా; చెలంగిరి= ప్రకాశించారు; హరిపాద= శ్రీహరిపాదాలను; పరిష్కృతి+చేయన్= పూజిస్తే; ఆపదల్= ఆపదలు; పస+చెడక+ఏల+ఉండున్= శక్తిని కోల్పోకుండా ఎందుకుంటాయి? ఎందుకు దూరంకావు.

**తా :** శ్రీమహావిష్ణువు అక్కడ ప్రత్యక్షం కాగానే అప్పటివరకు పనిచేసిన రాక్షసమాయలన్నీ వెలవెలబోయి వ్యర్థాలై ఒక క్షణంలో అదృశ్యాలయ్యాయి. దేవతలంతా నిద్రపోయి మేల్కొన్నవారిలాగా హాయిగా పైకి లేచారు. తమ దివ్యకాంతులతో మళ్ళీ ప్రకాశించారు. అంతేమరి. శ్రీహరిపాదాలను పూజచేస్తే ఆపదలు దూరం కాకుండా ఉంటాయా? ఉండవు.

**వ. అయ్యెడ. 344**

**ప్రతి :** ఆ+ఎడన్= ఆ సమయంలో.

**ఆ. కాలనేమి ఘోరకంఠీరవము నెక్కి, తార్క్ష్య శిరము శూలధారఁబొడువ**
**నతని పోటుముట్టు హరి కేల నంకించి, దానఁజావఁబొడిచె దానవునిని. 345**

**ప్రతి :** కాలనేమి= కాలనేమి అనే రాక్షసుడు; ఘోర= భయంకరమైన; కంఠీరవమున్+ఎక్కి= సింహాన్ని అధిరోహించి; తార్క్ష్యునిశిరమున్= గరుత్మంతుని తలను; శూలధారన్+పొడువన్= వాడిబల్లెంతో పొడవగా; అతని పోటుముట్టున్= ఆ బల్లెమునే; హరి= శ్రీహరి; కేలన్= చేతిలో; అంకించి= ఇరికించుకొని; దానన్= దానితోనే; దానవుని= ఆ రాక్షసుని; చావన్+పొడిచెన్= చావపొడిచాడు.

**తా :** కాలనేమి అనే రాక్షసుడు గరుడవాహనం మీద గల స్వామికెదురుగా సింహాన్ని అధిరోహించి వచ్చి తలపడ్డాడు. తన చేతిలోని వాడిబల్లెంతో గరుడుని తలమీద పొడిచాడు. స్వామి అతని ఆయుధాన్ని చేతిలోకి చిక్కించుకొని దానితోనే ఆ దానవుణ్ణి చావపొడిచాడు.

**క. పదపడి మాలిసుమాలులు, బెదరించినఁ దలలు ద్రుంచెఁ బృథుచక్రహతిన్**
**గదఁగొని గరుడుని ఱెక్కలు, సెదరించిన మాల్యవంతు శిరమున్ ద్రేసెన్. 346**

**ప్రతి :** పదపడి= ఆ తరువాత; మాలి, సుమాలులు; బెదిరించినన్= విష్ణువును బెదిరించగా; పృథు= గొప్పదైన; చక్రహతిన్= సుదర్శనంయొక్క దెబ్బతో; తలలు+త్రుంచెన్= వారిద్దరి తలల్ని ఖండించాడు; గదన్+కొని= గదతో; గరుడుని+ఱెక్కలు+ చెదరించినన్= గరుడుని రెక్కలు చెదరగొట్టగా; మాల్యవంతు= మాల్యవంతుని; శిరమున్ వ్రేసెన్= శిరస్సును ఖండించాడు.

**తా :** ఆ తరువాత మాలి, సుమాలి అనే దైత్యులు విష్ణువును బెదిరించగా శ్రీహరి చక్రాయుధంతో వారిద్దరినీ ఖండించాడు. మాల్యవంతుడు గదతో గరుడుని రెక్కలు చెదరగొట్టాడు. వాడిపై స్వామి చక్రాన్ని ప్రయోగించి వాని శిరస్సును ఖండించివేశాడు.

**వ. ఇట్లు పరమపురుషుండగు హరి కరుణాపరత్వంబునఁ బ్రత్యుపలబ్ధమనస్కులైన వరుణవాయువాసవ ప్రముఖులు పూర్వంబున నెవ్వ రెవ్వరితోఁ గయ్యంబు సేయుదురు, వారు వారలం దలపడి నొప్పించి; ర య్యవసరంబున. 347**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పరమపురుషుండు+అగు+హరి= పరమపురుషుడైన హరి; కరుణా పరత్వంబునన్= దయాగుణం చేత; ప్రతి+ఉపలబ్ధ+మనస్కులు+ఐన= మరలా పొందిన చైతన్యం కలవారైన; వరుణ, వాయు, వాసవ ప్రముఖులు= వరుణుడు, వాయువు, ఇంద్రుడు మొదలైనవారు; పూర్వంబునన్= మునుపు; ఎవ్వరెవ్వరితోన్= ఎవడు ఎవరితో; కయ్యంబు+ చేయుదురు= యుద్ధంచేస్తూ ఉండినారో; వారు; వారలన్= వారినే; తలపడి= ఎదుర్కొని; నొప్పించిరి= గాయపరచారు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** భగవంతుడైన శ్రీహరి దయాగుణంచేత, మరలా పొందిన చైతన్యం గలవారైన వరుణుడు, వాయువు, ఇంద్రుడు మొదలైన దేవతా ప్రముఖులు మునుపు ఎవరెవరితో యుద్ధం చేస్తూ ఉన్నారో, వారి వారినే ఎదుర్కొని నొప్పించారు.

**క. బాహుబలంబున నింద్రుఁడు, సాహసమున బలిని గెలువ సమకట్టి సము**
**త్సాహమున వజ్ర మెత్తిన, హాహా నినదంబు సేసి రఖిలజనంబుల్. 348**

**ప్రతి :** ఇంద్రుఁడు= మహేంద్రుడు; బాహుబలంబునన్= మిక్కిలి భుజబలంతో; సాహసమునన్= సాహసంతో; బలినిన్+ గెలువన్+సమకట్టి= బలిని గెలిచితీరాలనే సంకల్పంతో పూనుకొని; సముత్సాహమునన్= మిక్కిలి ఉత్సాహంతో; వజ్రము+ఎత్తినన్= వజ్రాయుధాన్ని పైకెత్తగా; అఖిల జనంబుల్= అక్కడి జనమంతా (రాక్షసులంతా); హాహానినదంబు+ చేసిరి= హాహాకారాలు చేశారు.

**తా :** అప్పుడు మహేంద్రుడు బాహుబలాన్ని కూడదీసుకొని సాహసంతో ఎలాగైనా బలిని గెలిచితీరాలన్న పూనికతో మిక్కిలి ఉత్సాహంతో వజ్రాయుధాన్ని పైకెత్తాడు. దీన్నిచూచిన అక్కడి రాక్షసులంతా హాహాకారాలు చేశారు.

**వ. ఇట్లు సముద్యత భిదుర హస్తుండై యింద్రుండు దన పురోభాగంబునం బరాక్రమించుచున్న విరోచన నందను ఉపలక్షించి యిట్లనియె. 349**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సముద్యత= పైకి ఎత్తిన; భిదురహస్తుఁడు+ఐ= వజ్రాయుధహస్తుడై, ఇంద్రుడు; తన; పురోభాగంబునన్= ముందు; పరాక్రమించుచున్న; విరోచన నందనున్= బలిచక్రవర్తిని; ఉపలక్షించి= చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇంద్రుడు పైకెత్తిన వజ్రహస్తంతో తన ఎదుట పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్న బలి చక్రవర్తితో ఇలా అన్నాడు.

**మ. 'జగతిన్ వైరి మొఱంగి గెల్చుటదియున్ శౌర్యంబె? ధైర్యంబె?తా**
**మగవాఁడయ్యునుఁ దన్నుఁ దా నెఱిఁగి సామర్థ్యంబునుం గల్గియున్**
**బగవానిం గని డాఁగెనేని మెయి సూపంజాలఁడేనిం గటా!**
**నగరే బంధులు? దిట్టరే బుధులు? గన్యల్ గూర్తురే? దానవా! 350**

**ప్రతి :** దానవా!= ఒరే బలీ!; జగతిన్= లోకంలో; వైరిన్+మొఱంగి= వైరికి కనిపించకుండా (మాయతో); గెల్చుట+అదియున్= గెలవటం కూడా; శౌర్యంబు+ఎ= పరాక్రమమేనా?, ధైర్యంబు+ఎ= అది ధైర్యమనిపించు కొంటుందా?; తాన్+మగవాడు+ అయ్యును= తాను మగవాడైకూడా; తన్నున్+తాను+ఎఱిఁగి= తనను తాను తెలుసుకొని; సామర్థ్యంబున్+కల్గియున్= శక్తిసామర్థ్యాలు ఉండికూడా; పగవానిన్+కని= శత్రువును చూచి; డాఁగెన్+ఏనిన్= దాక్కుంటే; మెయిన్+చూపన్+ చాలఁడు+ఏనిన్= శరీరాన్ని చూపకుండా ఉంటే; బంధులు= బంధువులు; నగరే= నవ్వరా?; బుధులు= పండితులు; తిట్టరే= తిట్టరా?; కన్యల్+కూర్తురు+ఏ= కన్యలు ఇష్టపడతారా?

**తా :** ఒరే బలీ! శత్రువుకు కనిపించకుండా యుద్ధంచేసి గెలవడంకూడా ఒక పరాక్రమమేనా? దీన్ని ధైర్యమంటారా? మగవాడై, తన బలాబలాలు తెలుసుకొని, శక్తిసామర్థ్యాలు ఉండికూడా శత్రువు ఎదుట పడకుండా మాయవేషాలు వేస్తే బంధువులు నవ్వరా? పండితులు తిట్టరా? కనీసం ఆడవారు కూడా మెచ్చుకొంటారా? (మెచ్చుకోరు).

**శా. మాయల్ సేయఁగ రాదు పో; నగవులే మాతోడి పోరాటముల్?**
**దాయా! చిక్కితి; వ్రక్కలించెదఁ గనద్దంభోళిధారాహతిన్;**
**నీ యిష్టార్థము నెల్లఁ జూడుము వెసన్ నీ వారలం గూడుకో**
**నీ యాటోపము నిర్జరేంద్రుఁ డడఁచున్ నేఁ డాజిలో దుర్మతీ! 351**

**ప్రతి :** దాయా= ఓరీ శత్రువా; చిక్కితి(వి)= ఇప్పుడు చిక్కావు (ఇవ్వాళ నీవు నానుండి తప్పించుకోలేవు); మాయల్+ చేయఁగ రాదుపో= ఇక మాయలు పన్నడానికి వీలులేదు పో!; మాతోడి పోరాటముల్= మాతో యుద్ధాలు; నగవులు+ఏ= నవ్వులాటలే?; కనత్= ప్రకాశించే; దంభోళి ధారాహతిన్= వజ్రాయుధపు అంచు దెబ్బతో; వ్రక్కలించెదన్= నిన్ను ముక్కలు చేస్తాను; వెసన్= తొందరగా; నీ ఇష్ట+అర్థమున్+ఎల్లన్+చూడుము= నీ కోరికలు తీర్చుకో!; నీవారలన్ కూడుకో= నీ వారిని కలుసుకో; నిర్జర+ఇంద్రుఁడు= ఈ దేవేంద్రుడు; నేఁడు= ఈరోజు; ఆజిన్= ఈ పోరులో; నీ ఆటోపమున్= నీ గర్వాన్ని; అడఁచున్= అణచి పారేస్తాడు.

**తా :** 'ఓరి శత్రువా! బలీ! ఇవాళ నీవు నానుండి తప్పించుకోలేవు. ఇక మాయలు పన్నలేవు. మాతో యుద్ధం అంటే నవ్వులాట కాదు. తళతళలాడుతున్న ఈ వజ్రాయుధంతో నిన్ను ముక్కలు చేస్తాను. తొందరగా నీ కోరికలు ఏవైనా ఉంటే తీర్చుకో. నీవారిని కలుసుకో. ఈ రోజు యుద్ధంలో నీ గర్వాన్ని పూర్తిగా అణచిపారేస్తాను చూడు!' – అని ఇంద్రుడు బలిచక్రవర్తితో అన్నాడు.

**వ. అని యుపాలంభించిన విని విరోచననందనుం డిట్లనియె. 352**

**ప్రతి :** అని; ఉపాలంభించినన్= నిందించగా; విని; విరోచన నందనుండు= బలిచక్రవర్తి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇలా ఇంద్రుడు నిందిస్తుండగా బలిచక్రవర్తి విని ఇలా అన్నాడు.

**శా. నీవే పోటరివే? సురేంద్ర! తెగడన్ నీకేల? గెల్పోటముల్**
**లేవే? యెవ్వరిపాలఁబోయినవి? మేల్గీడుల్ విరించ్యాదులుం**
**ద్రోవంజాలుదు రెవ్విధానమున సంతోషింప శోకింప నా**
**దైవం బేమి? కరస్థలామలకమే! దర్పోక్తులుం బాడియే? 353**

**ప్రతి :** సుర+ఇంద్ర= ఓ ఇంద్రా; నీవే పోటరివే?= నీవు ఒక్కడివేనా మగవాడివి?; తెగడన్+నీకున్+ఏల= నువ్వా నిందించేది?; గెల్పు+ఓటముల్ లేవే= జయాపజయాలు లేవా?; మేల్+కీడుల్= మేలు, కీడు, ఎవ్వరిపాలన్+పోయినవి? ఎవ్వరు తప్పించుకోగలిగారు (ఎవరికి రాలేదు?); విరించ+ఆదులున్= బ్రహ్మాదులు కూడా; ఏ+విధానమునన్= ఏ విధంగా; సంతోషింపన్+శోకింపన్= సంతోషపడటాన్ని; శోకించటాన్ని; త్రోవన్+చాలుదురు= తప్పించుకోగలరు; ఆ దైవంబు= ఆ దైవం; కరస్థల+అమలకమే+ఏమి= అది చేతిలోని ఉసిరికా ఏమిటి?; దర్ప+ఉక్తులున్+పాడియే= ఇంత గర్వంగా మాట్లాడటం న్యాయంగా ఉందా?

**తా :** ఓ ఇంద్రా! చాలించు. నీవు ఒకడివేనా మగవాడివి. నువ్వా నిందించేది? జయాపజయాలు అందరికీ వస్తాయి (నీకు మాత్రం రాలేదా!); ఎవ్వరు తప్పించుకోగలిగారు? బ్రహ్మాదులు కూడా సుఖదుఃఖాలను ఏ విధంగా తప్పించుకోగలిగారు? ఆ దైవం మన అరచేతిలోని ఉసిరికకాయా ఏమిటి? ఇంత గర్వంగా మాట్లాడటం న్యాయంగా ఉందా?' అని అడిగాడు.

**ఆ. జయము లపజయములు సంపద, లాపద లనిలచలితదీపికాంచలములు**
**చంద్రకళలు మేఘచయములు దరఁగలు మెఱుఁగు లమరవర్య! మిట్టిపడకు. 354**

**ప్రతి :** అమరవర్య= దేవతలలో శ్రేష్ఠుడా!; జయములు+అపజయములు= గెలుపులు, ఓటములు; సంపదలు+ఆపదలు; అనిల+చలిత+ దీపికా+అంచలములు= గాలిచేత చలించేటటువంటి దీపాల్లాంటివి; చంద్రకళలు= కృష్ణపక్షంలో తరగిపోయి శుక్లపక్షంలో వృద్ధిపొందే చంద్రకళలవంటివి; మేఘచయములు= దూదిపింజల్లా ఎగిరిపోయే మేఘాలవంటివి; తరఁగలు= నీటితరగలు - జలప్రవాహంలో కొట్టుకుపోతుంటాయి; మెఱుఁగులు= మెరుపుతీగలాంటివి - క్షణంలో మాయమవుతాయి; మిడిసిపడకు= మిడిసిపడవద్దు.

**తా :** ఇంద్రా! జయాపజయాలు, సంపదలు, ఆపదలు, గాలిలో పెట్టిన దీపాల్లాంటివి. ఉంటాయి-పోతాయి. చంద్రుడి కళల్లాంటివి - తరుగుతాయి - పెరుగుతాయి. మేఘాల్లాంటివి - దైవానుకూలం లేకపోతే ఎగిరిపోతాయి; నీటితరగల్లాగా కొట్టుకుపోతాయి. మెరుపు తీగల్లాగా క్షణంలో మాయమవుతాయి. అంచేత మిడిసిపడవద్దు. (అంటూ యుద్ధమూ చేశాడు; సూటిపోటిమాటలూ అన్నాడు)

**వ. అని యి ట్లాక్షేపించి. 355**

**ప్రతి :** అని; ఇట్లు= ఈ విధంగా; ఆక్షేపించి= ఎత్తి పొడిచి.

**తా :** అని ఇట్లు ఆక్షేపించినవాడై.

**క. వీరుఁడు దానవనాథుఁడు, నారసముల నింద్రుమేన నాఁటించి మహా**
**ఘోరాయుధకల్పములగు, శూరాలాపములు సెవులఁజొనిపెన్ మరలన్. 356**

**ప్రతి :** వీరుఁడు; దానవనాథుఁడు= రాక్షసరాజైన బలి; ఇంద్రుమేనన్= ఇంద్రుడిశరీరంలో; నారసములన్+నాఁటించి= బాణాలు ప్రయోగించి; మహాఘోర+ఆయుధ కల్పములు+అగు= మహాఘోరమైన బాణాల్లాంటి; శూర+ఆలాపములు= సూటి పోటిమాటలు; మరలన్= మళ్ళీ; చెవులన్+చొనిపెన్= చెవుల్లోకి చొప్పించాడు.

**తా :** బలి ఇంద్రుడిదేహంలోకి వాడి బాణాలు గుచ్చాడు. మహాఘోరమైన బాణాలవంటి సూటి పోటి మాటలతో బాధించాడు. ఇంద్రుని బాధించాడు.

**వ. ఇట్లు తథ్యవాదియైన బలిచే నిరాకృతుండై. 357**

**ప్రతి :** ఇట్లు; తథ్యవాది= సత్యవాది అయిన; బలిచేన్= బలిచేత; నిరాకృతుడు+ఐ= నిరాకరింపబడినవాడై.

**తా :** ఇలా సత్యవాది అయిన బలిచేత ఇంద్రుడు తిరస్కరింపబడినవాడై

**క. శత్రువు నాక్షేపంబునఁ, దోత్రాహతగజము భంగిఁ ద్రుళ్ళుచు బలి నా**
**వృత్రారి వీచి వైచిన, గోత్రాకృతి నతఁడు నేలఁగూలె నరేంద్రా! 358**

**ప్రతి :** నర+ఇంద్రా= ఓ రాజా!; ఆ వృత్ర+అరి= వృత్రాసురుణ్ణి వజ్రాయుధంతో చంపిన ఇంద్రుడు; శత్రువున్+ఆక్షేపంబునన్= శత్రువుయొక్క ఆక్షేపణ చేత; తోత్ర+ఆహత= అంకుశంతో పొడవబడ్డ; గజము+భంగిన్= ఏనుగులాగా; త్రుళ్ళుచున్= త్రుళ్ళిపడి; బలిన్= బలిని; వీచి= వజ్రాయుధం విసరి; వైచినన్= కొట్టగా; అతఁడు= బలి; గోత్ర+ఆకృతిన్= కొండలాగా; నేలన్+కూలెన్= నేలపై బడ్డాడు.

**తా :** శత్రువు ఇలా ఆక్షేపించగా ఇంద్రుడు అంకుశంతో పొడవబడిన ఏనుగులాగా త్రుళ్ళిపడ్డాడు. వృత్రాసురుణ్ణి చంపిన ఆ వజ్రాయుధం విసిరి బలిచక్రవర్తిని కొట్టాడు. బలిచక్రవర్తి ఒక పెద్దకొండలాగా నేలమీద పడ్డాడు.

**క. చెలికానిపాటు గనుఁగొని, బలిసఖుఁడగు జంభుఁ డతులబాహాశక్తిం**
**జెలితనము సాల నెఱపుచు, నిలు నిలుమని వీఁకఁ దాఁకె నిర్జరనాథున్. 359**

**ప్రతి :** బలిసఖుఁడు+అగు= బలిచక్రవర్తి సఖుడైన; జంభుఁడు= జంభుడనే రాక్షసుడు; చెలికాని పాటున్+కనుఁగొని= చెలికాడైన బలిచక్రవర్తి పడిపోవటం చూచి; అతులబాహాశక్తిన్= మిక్కిలి బాహుపరాక్రమంతో; చెలితనము+చాల+నెఱపుచున్= స్నేహాన్ని మిక్కిలిగా ప్రకటిస్తూ; నిలు నిలుము+అని= నిలు నిలు అంటూ; నిర్జరనాథున్= ఇంద్రుడిని, వీఁకన్= ఉత్సాహంతో; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తా :** బలిస్నేహితుడైన జంభుడు అనే రాక్షసుడు తన మిత్రుడు నేలమీద పడిపోవటం చూశాడు. తన స్నేహాన్ని ప్రకటిస్తూ అమితమైన బాహుపరాక్రమంతో ఇంద్రుడిని ఎదుర్కొన్నాడు.

**క. పంచాననవాహనుఁడై, చంచద్గద జంభుఁ డెత్తి శైలారిని దాఁ**
**కించి సురేభంబును నొప్పించి, విజృంభించి యార్చి పేర్చెం గడిమిన్. 360**

**ప్రతి :** జంభుడు; పంచ+ఆనన+వాహనుండు+ఐ= సింహంపై కూర్చుని; చంచత్+గదన్= తళతళలాడుతున్న తన గదను; ఎత్తి= పైకెత్తి; శైల+అరిన్= పర్వతాల శత్రువైన ఇంద్రుడిని; తాఁకించి= కొట్టి, సుర+ఇభంబునున్= ఐరావతాన్ని; నొప్పించి= నొప్పి తగిలేలా ఒక దెబ్బకొట్టి; విజృంభించి; ఆర్చి= కేకవేస్తూ; కడిమిన్+పేర్చెన్= మిక్కిలిగా పొంగిపోయాడు.

**తా :** జంభుడు సింహాన్ని అధిరోహించి తళతళలాడుతున్న గదను పైకెత్తి, పర్వతాలకు శత్రువైన ఇంద్రుడిని కొట్టి, ఐరావతాన్ని ఒక్కదెబ్బ కొట్టి నొప్పించి, విజృంభించి, కేకలువేస్తూ పొంగిపోయాడు.

**క. వీఁక సెడి ఘనగదాహతిఁ, దోఁకయుఁ గదలింపలేక దుస్సహపీడన్**
**మోఁకరిలఁబడియె నేలను, సోఁకోర్వక దిగ్గజంబు సుడిసుడిగొంచున్. 361**

**ప్రతి :** ఘనగదా+ఆహతిన్= ఆ గొప్పగదాఘాతానికి; దిక్+గజము= ఐరావతం; వీఁక+చెడి= ఉత్సాహం కోల్పోయి (వేగంతగ్గి); దుస్సహపీడన్= సహింపరాని నొప్పితో; తోఁకయున్+కదిలింప లేక= తోక కూడా కదిలించలేకుండా; సోఁకున్+ఓర్వక= బాధను తట్టుకోలేక; సుడిసుడిగొంచున్= గిరగిర తిరుగుతూ; నేలను= నేలమీద; మోఁకరిలన్+పడియెన్= ముందుకు వంగి నేలమీద పడిపోయింది.

**తా :** క్రూరమైన ఆ జంభుని గదాఘాతానికి దిగ్గజమైన ఐరావతంకూడా దిమ్మతిరిగి పోయింది. దుస్సహమైన నొప్పితో, తోకను కూడా కదిలించ లేకపోయింది. బాధను తట్టుకోలేక గిరగిర తిరుగుతూ మోకాళ్ళపై ముందుకు వంగి పక్కకు పడిపోయింది.

**వ. అయ్యెడ. 362**

**ప్రతి :** ఆ+ఎడన్= ఆ సమయంలో.

**క. సారథి వేయుహయంబుల, తే రాయితపఱచి తేర దేవేంద్రుఁడు దా**
**నారోహించెను దైత్యుఁ, డుదారత మాతలిని శూలధారంబొడిచెన్. 363**

**ప్రతి :** సారథి= దేవేంద్రుని సారథి అయిన మాతలి; వేయుహయంబుల తేరు= వేయిగుర్రాలను పూన్చిన రథాన్ని; ఆయతపఱచి తేరన్= సిద్ధం చేసి తీసుకురాగా; దేవ+ఇంద్రుఁడు; ఆరోహించెను= ఎక్కాడు; దైత్యుఁడు= ఆ జంభుడు; ఉదారతన్= మర్యాదచూపుతోనే; శూలధారన్= శూలపు పదునైనమొనతో; మాతలిని పొడిచెన్= మాతలిని పొడిచాడు.

**తా :** దేవేంద్రుని సారథి వెంటనే వేయిగుర్రాలు పూన్చిన రథాన్ని సిద్ధం చేయగా దానిపై ఇంద్రుడు కూర్చున్నాడు. ఏ కారణం లేకుండానే జంభుడు శూలంతో మాతలిని పొడిచాడు.

**ఆ. శూలనిహతి నొంది స్రుక్కక యార్చిన, సూతు వెఱకు మంచు సురవిభుండు**
**వాని శిరముఁ దునిమె వజ్రఘాతంబున, దైత్యసేన లెల్లఁ దల్ల డిల్ల. 364**

**ప్రతి :** శూలనిహతిన్+ఒంది= శూలం దెబ్బతిని కూడా; స్రుక్కక= తల్లడిల్లిపోకుండా; ఆర్చినన్= కేకలువేయగా (అరవగా); సుర విభుండు= ఇంద్రుడు; వెఱకుము+అంచున్= భయపడవద్దు అంటూ; వజ్రఘాతంబునన్= వజ్రాయుధం దెబ్బతో; దైత్యసేన లెల్లన్= రాక్షసమూకలన్నీ; తల్లడిల్లన్= తల్లడిల్లిపోగా; వాని శిరమున్+తునిమెన్= వాని శిరస్సును నరికి పారవేశాడు.

**తా :** జంభాసురుని బల్లెందెబ్బతినికూడా మాతలి తల్లడిల్లి పోకుండా అరిచాడు. అది విని 'భయపడకు' అంటూ ఇంద్రుడు వజ్రాయుధంతో వాడి తలను నరికేశాడు. దాన్నిచూచి రాక్షసమూకలు తల్లడిల్లిపోయాయి.

**చ. చని సురనాథుచేఁ గలన జంభుఁడు సచ్చుట నారదుండు సె**
**ప్పిన విని వానిభ్రాతలు గభీరబలాధికుఁడా బలుండు పా**

క నముచు లాపురందరునిఁగాంచి ఖరోక్తులఁ దూలనాడుచున్
ఘనజలధారలన్ నగముఁ గప్పిన చాడ్పునఁ గప్పిరమ్ములన్. **365**

**ప్రతి :** నారదుఁడు= నారదమహర్షి; చని= వెళ్ళి; సురనాథుచేన్= ఇంద్రుడిచేత; కలనన్= యుద్ధంలో; జంభుడు+చచ్చుట= జంభుడు చనిపోవటం; చెప్పినన్= చెప్పగా; విని; వాని భ్రాతలు= వాని సోదరులు; గభీర బల+అధికుఁడు+ఆ+బలుండు= మిక్కిలి బలవంతుడైన బలుడు; పాక నముచులు= పాకుడు నముచి అనేవారు; ఆ పురందరునిన్+కాంచి= రణరంగానికి వచ్చి ఆ ఇంద్రుని చూచి; ఖరోక్తులన్= పోటుమాటలతో; తూలనాడుచున్= నిందిస్తూ; ఘన జలధారలన్= గొప్పవైన వర్షధారలచేత; నగమున్+కప్పిన+చాడ్పునన్= కొండను కప్పివేసినట్టుగా; అమ్ములన్= బాణాలతో; కప్పిరి= కప్పివేశారు.

**తా :** యుద్ధంలో జంభుడు చనిపోయిన విషయాన్ని నారదమహర్షి వెళ్ళి చెప్పగా, అతని సోదరులు, బలుడు, పాకుడు, నముచి అనే వారు విని, వెంటనే క్రుద్ధులై రణరంగంలోకి చొరబడి ఇంద్రుణ్ణి పోటుమాటలతో నిందించి, కొండను మేఘాలు వర్షధారలతో నింపివేసినట్టు బాణాలతో కప్పివేశారు.

సీ. విబుధలోకేంద్రుని వేయుగుఱ్ఱంబుల నన్ని కోలల బలుఁ డదర నేసె
నిన్నూట మాతలి నిన్నూట రథమును నా రీతి నింద్రు ప్రత్యంగకమును
వేధించెఁ; బాకుండు వింట వాఁడస్త్రంబు లేయుట దొడుగుట యెఱుఁగరాదు;
కనకపుంఖంబుల కాండంబు లొకపది యేనింట నముచియు నేసి యార్చె;

ఆ. బలిమి నిట్లు ముగురు పగవాని రథసూత, సహితు ముంచి రస్త్రజాలములను
వనజలోకసఖుని వానకాలంబున, మొగిలుగములు మునుఁగ మూఁగినట్లు **366**

**ప్రతి :** బలుఁడు= బలాసురుడు; విబుధలోక+ఇంద్రుని= దేవలోక ప్రభువైన ఇంద్రుని; వేయుగుఱ్ఱంబులన్= వెయ్యిగుర్రాలను; అన్నికోలలన్= అన్ని బాణాలతో (వేయి బాణాలతో); అదరన్+ఏసెన్= అదిరిపోయేలా కొట్టాడు; ఇన్నూటన్+రథమును= రెండువందల బాణాలతో రథాన్ని; ఆరీతిన్= ఇన్నూరు బాణాలతోనే; ఇంద్రు ప్రతి+అంగకమును= ఇంద్రుడి ప్రతి అవయవాన్నీ; వేధించెన్= బాధించాడు; పాకుండు= పాకుడనే వాడు; వాఁడు= తాను; వింటన్= వింటితో; అస్త్రంబులు= బాణాలు; వేయుట+తొడుగుట+ఎఱుఁగరాదు= ప్రయోగించడం, ఎక్కుపెట్టడం తెలియడంలేదు; నముచియున్= నముచి అనే వాడుకూడా; కనకపుంఖంబుల కాండంబులు= బంగారు పిళ్ళు కలిగిన బాణాలు; ఒకపది+ఏనింటన్= పదిహేను (బాణాలతో); ఏసి= కొట్టి; ఆర్చెన్= అరచాడు; బలిమిన్= బలవంతుడై; ఇట్లు; ముగురు= ఆ ముగ్గురూ; పగవానిన్= ఇంద్రుని; రథసూత సహితున్= రథంలోని సూతునితో కూడిన వాడిని; వానకాలంబునన్= వర్షాకాలంలో; వనజ సఖునిన్= సూర్యుని; మొగిలు గములు= మేఘసమూహాలు; మునుఁగన్+మూఁగినట్లు= కనిపించకుండా కప్పివేసినట్టు; అస్త్రజాలములను= అస్త్రసమూహాలతో; ముంచిరి= కప్పివేశారు.

**తా :** బలాసురుడు ఇంద్రుని వేయి గుర్రాలను వేయి బాణాలతో అదరగొట్టాడు. ఇన్నూరు బాణాలతో రథాన్ని, సారథిని, ఇంద్రుడి ప్రతి అవయవాన్నీ బాధించాడు. పాకుడు ధనుస్సుతో బాణాల్ని ఎక్కుపెట్టడం, ప్రయోగించడం గుర్తించలేనంత వేగంగా విజృంభించాడు. నముచి బంగారుపిళ్ళు కలిగిన పదిహేను బాణాలతో కొట్టి అరిచాడు. ఇలా ముగ్గురు సోదరులు రథంలోని సూతునితో కూడిన ఇంద్రుడిని బాణాలతో కప్పివేశారు. అది ఎలా ఉందంటే వర్షాకాలంలో మేఘసమూహాలు సూర్యబింబాన్ని కప్పివేసినట్టుంది.

**వ. అయ్యవసరంబున. 367**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**మ. అమరారాతుల బాణజాలముల పాలై పోయితే చెల్లరే**
**యమరాధీశ్వర! యంచు భిన్నతరులై యంభోధిలోఁ జంచల**
**త్వమునం గ్రుంకు వణిగ్జనంబుల క్రియన్ దైత్యాధిపవ్యూహ మ**
**ధ్యమునం జిక్కిరి వేల్పు లందఱు విపద్ధ్వానంబులం జేయుచున్. 368**

**ప్రతి :** అమర+అరాతుల= రాక్షసుల; బాణజాలముల పాలై+పోయితే= బాణ సముదాయాల పాలైపోయావా; చెల్లరే= అయ్యో; అమర+అధి+ఈశ్వర= ఇంద్రా; అంచున్= అంటూ; విపత్+ధ్వానంబులన్+చేయుచున్= ఆర్తనాదాలుచేస్తూ; వేల్పులందఱున్= దేవతలందరూ; భిన్నతరులు+ఐ= విరిగిపోయిన నావ కలవారై, నిరాశ్రయులై; అంబోధిలోన్= సముద్రంలో; చంచలత్వమునన్= ఊగిపోతున్నటువంటి లేదా భయంతో అదలిపోతున్న; వణిక్+జనంబులక్రియన్= వర్తకులలాగా; దైత్య+అధిప= రాక్షసులయొక్క; వ్యూహ మధ్యమునన్+చిక్కిరి= వ్యూహంమధ్యలో చిక్కుకున్నాడు.

**తా :** "అయ్యో! ఇంద్రా! అన్యాయంగా రాక్షసుల బాణాలకు బలి అయిపోయారా" అంటూ దేవతలు ఆర్తనాదాలు చేస్తూ అందరూ నిరాశ్రయులై అసురుల సేనల మధ్య (వ్యూహం – మొగ్గరం) చిక్కుకొన్నారు. సముద్రంలో పగిలిన నావలో చిక్కుపడిపోయిన వర్తకుల్లాగా హాహాకారాలు చేస్తున్నారు.

**శా. 'ఓహో దేవతలార! కుయ్యిడకుఁ; డే నున్నాఁడ' నంచంబు భృ**
**ద్వాహుండాశరబద్ధపంజరము నంతం జించి తేజంబునన్**
**వాహోపేతరథంబుతోడ వెలికిన్ వచ్చెన్ నిశాంతోల్లస**
**న్మాహాత్మ్యంబునఁ దూర్పునంబొడుచు నా మార్తాండుచందంబునన్. 369**

**ప్రతి :** అంబుభృత్+వాహుండు= మేఘనాథుడు (వర్షాధిపతి – ఇంద్రుడు); ఓహో దేవతలార= ఓ దేవతలారా; కుయ్యి+ఇడకుఁడు= భయపడకండి; ఏను+ఉన్నాను= నేనున్నాను; అంచున్= అంటూ; ఆ శరబద్ధ పంజరమున్= ఆ బాణాలతో కూడిన పంజరాన్ని (కప్పిన బాణాలను తొలగించుకొని); చించి= చీల్చుకొని; తేజంబునన్= మిక్కిలి పరాక్రమంతో; వాహ+ఉపేత+రథంబుతోడన్= గుర్రాలతో కూడిన రథంతో కూడి; నిశ+అంత+ఉల్లసత్+మాహాత్మ్యంబునన్= ఉదయం కాగానే బయటపడే కాంతి మహిమతో; తూర్పునన్+పొడుచు= తూర్పున ఉదయించే; ఆ మార్తాండు+చందంబునన్= ఆ సూర్యుడిలాగా; వెలికిన్+వచ్చెన్= బయటపడ్డాడు.

**తా :** అప్పుడు దేవేంద్రుడు "ఓ దేవతలారా! భయపడకండి. నేనున్నాను" అంటూ ఆ బాణాలతో కూడిన పంజరాన్ని గుర్రాలతో కూడిన రథంతో చీల్చుకొని బయటపడ్డాడు. ఉదయం కాగానే కొత్తకాంతులతో వెలిగే సూర్యుడి లాగా ప్రకాశించాడు.

**వ. ఇట్లు వెలువడి. 370**

**ప్రతి :** ఇట్లు+వెలువడి= ఇలా బయటపడి.

**చ. విఱిగిన సేనఁ గాంచి సురవీరుఁ 'డొహో!' యని బిట్టు చీరి క్ర**
**మ్మఱఁ బురికొల్పి పాకబలమస్తకముల్ నిశితాస్త్రధారలన్**
**నెఱసిన తీక్ష్ణవజ్రమున నేలకు వ్రాల్చెను వానిచుట్టముల్**
**వెఱచిరి; తచ్చమూపతులు విహ్వలులై చెడి పాఱి రార్తితోన్. 371**

**ప్రతి :** సురవీరుఁడు= ఇంద్రుడు; విఱిగిన+సేనన్+కాంచి= చెల్లాచెదిరిపోయిన సేనను చూచి; ఓహో! అని; బిట్టు= బిగ్గరగా; చీరి= పిలిచి; క్రమ్మఱన్+పురికొల్పి= మళ్ళీ యుద్ధానికి ప్రేరేపించి; పాకబల మస్తకముల్= పాకుని, బలుని తలలను; నిశిత+అస్త్రధారలన్= వాడిబాణాలతోనూ; నెఱిసిన+తీక్ష్ణవజ్రమునన్= ప్రకాశిస్తున్న తీక్ష్ణమైన వజ్రాయుధంతోనూ; నేలకున్+వ్రాల్చెను= నేలగూల్చాడు; వానిచుట్టముల్= వానిబంధువులు; వెఱచిరి= భయపడిపోయారు; తత్+చమూపతులు= వాని సేనానాయకులు; విహ్వలులై= కంపితులై; చెడి= దుఃఖిస్తూ; ఆర్తితోన్= దీనత్వంతో; పాఱిరి= పారిపోయారు.

**తా :** ఇంద్రుడు చెల్లాచెదరై పారిపోతున్న దేవ సైన్యాన్ని చూచి 'ఓహో! భయపడకండి యుద్ధం చేయండి' అని బిగ్గరగా పిలుస్తూ వారిని మళ్ళీ యుద్ధానికి పురికొలిపాడు. వాడిబాణాలతో, తన వజ్రాయుధంతో బలుడితలను, పాకుడితలను – నేలకూల్చాడు. దీన్నిచూచి అతని బంధువులు గడగడలాడిపోయారు. అతని సేనానాయకులు దుఃఖిస్తూ దీనులై పారిపోయారు.

**వ. అప్పుడు నముచి నిలువంబడి. 372**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; నముచి; నిలువంబడి= నిల్చి.

**తా :** ఆ సమయంలో నముచి యుద్ధరంగంలో నిలబడ్డాడు.

**మ. తన చుట్టంబులఁ జంపె వీఁడనుచు నుద్యత్క్రోధశోకాత్ముఁడై**
**కనకాంతంబును నశ్మసారమయమున్ ఘంటాసమేతంబునై**
**జనదృగ్దుస్సహమైన శూలము నొగిన్ సారించి వైచెన్ సురేం**
**ద్రునిపై 'దీన హతుండ వౌ' దని మృగేంద్రుం బోలి గర్జించుచున్. 373**

**ప్రతి :** (నముచి); తన చుట్టంబులన్+చంపెన్+వీఁడు+అనుచున్= ఈ ఇంద్రుడు తన బంధువులు చంపాడంటూ; ఉద్యత్+క్రోధ+శోక+ఆత్ముడు+ఐ= పొంగుతున్న కోపం, దుఃఖం కలవాడై; కనక+అంతంబునున్= బంగారు పిడి కల్గింది; ఘంటాసమేతంబును+ఐ= గంటలు కల్గింది; అశ్మసారమయమున్= ఇనుము (లోహం) తో చేయబడింది; జనదృక్+దుస్+సహమైన= జనులకు చూడటానికి భయంకరంగా కనిపిస్తున్న; శూలమున్+ఒగిన్+సారించి= శూలాన్ని లీలగా పైకెత్తి; మృగ+ఇంద్రున్+పోలి= సింహంలాగా; గర్జించుచున్= గర్జిస్తూ; 'దీనన్+హతుండవు+ఓ' అని= దీనిచేత నీవు చస్తావు చూడు; అని; సుర+ఇంద్రునిపై= ఇంద్రునిపై; వైచెన్= విసిరివేశాడు.

**తా :** తన బంధువుల్ని చంపినవాడు వీడే అని ఇంద్రుడిపైన నముచి మండిపడుతూ ఒకవైపు కోపం మరోవైపు దుఃఖం పొంగివస్తుండగా, బంగారు పిడి కల్గినదీ, గంటలు కలదీ, ఇనుముతో చేయబడినది, చూడడానికి శక్యంకానిది అయిన శూలాన్ని పట్టి సింహంలాగా గర్జించి 'దీనితో నీవు చస్తావు చూడు' అంటూ సురేంద్రునిపై దాన్ని విసిరివేశాడు.

**శా. ఆకాశంబున వచ్చుశూలమును జంభారాతి ఖండించి నా**
**నా కాండంబుల వాని కంఠము దెగ న్దంభోళియున్ వైచె న**

**స్తోకేంద్రాయుధమున్ సురారిగళముం ద్రుంపంగ లేదయ్యెఁ; వాఁ**
**డాకంపింపక నిల్చె దేవవిభుఁ డత్యాశ్చర్యముం బొందఁగన్. 374**

**ప్రతి :** ఆకాశంబునన్= ఆకసంలో; వచ్చు= తనవైపు వస్తున్న; శూలమును= నముచి ప్రయోగించిన శూలాన్ని; జంభ+అరాతి= జంభాసురుని శత్రువైన ఇంద్రుడు; నానాకాండంబులన్= అనేక బాణాలచేత; ఖండించి= ముక్కలుచేసి, వాని కంఠము+తెగన్= వాని కంఠం ఖండించడానికి; దంభోళియున్+వైచెన్= వజ్రాయుధాన్ని కూడా ప్రయోగించాడు; అస్తోక+ఇంద్ర+ఆయుధమున్= గొప్పదైన ఆ వజ్రాయుధం కూడా; సుర+అరిగళమున్= ఆ రాక్షసుని గొంతును; త్రుంపంగ లేదు+అయ్యెన్= నరకలేకపోయింది; దేవ విభుఁడు= ఇంద్రుడు; ఆశ్చర్యమున్ పొందఁగన్= ఆశ్చర్యపడగా; వాఁడు+ఆకంపింపక+నిల్చెన్= వాడు కదలకుండా నిలబడ్డాడు.

**తా :** ఆకాశంలో నముచి ప్రయోగించిన శూలం తనవైపు వస్తుండగా ఇంద్రుడు దాన్ని అనేక బాణాలతో ఖండించాడు. నముచి కంఠాన్ని ఖండించడానికి వజ్రాయుధాన్నే ప్రయోగించాడు. అది వాడి తలను నరకలేకపోయింది. వాడేమో కదలను కూడా లేదు. అలా చలించకుండా ఉన్న వాడిని చూచి ఇంద్రుడు ఆశ్చర్యపడ్డాడు.

**వ. ఇట్లు నిలిచి యున్న నముచిం గనుంగొని వజ్రంబు ప్రతిహతం బగుటకు శంకించి బలభేది దన మనంబున. 375**

**ప్రతి :** ఇట్లు; నిలిచియున్న; నముచిన్+కనుగొని= నముచిని చూచి; వజ్రంబు= వజ్రాయుధం; ప్రతిహతంబు+అగుటకున్= వ్యర్థమయినందుకు; శంకించి= సందేహించి; బలభేది= బలాసురుణ్ణి చంపిన ఇంద్రుడు; తన మనంబునన్= తన మనస్సులో ఇలా అనుకున్నాడు.

**తా :** ఇలా నిలబడిన నముచిని చూచి, తన వజ్రాయుధం వ్యర్థమయిపోయినందుకు సందేహించి బలభేది అయిన ఇంద్రుడు తన మనస్సులో ఇలా అనుకున్నాడు.

**సీ. 'కొండలఱెక్కలు ఖండించి వైచుచో వజ్రమెన్నఁడు నింత వాఁడి సెడదు**
**వృత్రాసురాదుల విదళించుచో నిది దిరుగ దెన్నఁడు పనిఁదీర్చికాని**
**యింద్రుండఁగానొకో యేను దంభోళియుఁ గాదొకో యిది ప్రయోగంబు సెడెనొ**
**దనుజాధముఁడు మొనతాఁకుఁ దప్పించెనో భిదురంబు నేఁడేల బెండువడియె!'**

**ఆ. ననుచు వజ్రి వగవ నార్ద్ర శుష్కంబులం, జావకుండఁ దపము సలిపె నీతఁ**
**డితర మెద్ది యైన నింద్ర! ప్రయోగింపు, వైళ' మనుచు దివ్యవాణి పలికె. 376**

**ప్రతి :** కొండల= పర్వతాల; ఱెక్కలు= రెక్కల్ని; ఖండించి వైచుచోన్= ఖండించిన సందర్భంలో; వజ్రము+ఎన్నఁడున్= వజ్రాయుధం ఏనాడూ; ఇంత= ఈ విధంగా; వాఁడి+చెడదు= వాడితనాన్ని కోల్పోలేదు; వృత్ర+అసుర+ఆదులన్= వృత్రుడు మొదలైన రాక్షసులను; విదళించుచోన్= చంపే సమయంలో; ఇది= ఈ ఆయుధం; ఎన్నఁడున్= ఏనాడూ; పనిన్+తీర్చికాని= పని పూర్తిచేసికాని; తిరుగదు= తిరిగిరాలేదు; ఇంద్రుడన్+కాను+ఒకో= నేను ఇంద్రుడినే కానా!; ఇది= ఈ ఆయుధం; దంభోళియున్+కాదు+ఒకో= వజ్రాయుధమేకాదా!; ప్రయోగంబు+చెడెను+ఒ= లేదా

ఉపయోగించటంలో ఏదైనా తప్పు జరిగిందా!; దనుజ+అధముఁడు= ఈ రాక్షసాధముడు; మొనతాఁకున్+తప్పించెను+ఓ= దీని వాదర తెగకుండా ఏమైనా మాయను ప్రయోగించాడా?; భిదురంబు= ఈ వజ్రం; నేఁడు+ఏల= ఈరోజు ఎందుకు; బెండు+పడియెన్= శక్తి కోల్పోయింది; అనుచున్= అనుకుంటూ; వజ్రి= వజ్రాయుధం కల్గిన ఇంద్రుడు; వగవన్= శోకించగా; దివ్యవాణి= ఆకాశవాణి; ఆర్ద్ర శుష్కంబులన్+చావకుండన్= తడి వస్తువుతోకాని, పొడి వస్తువుతోకాని చావకుండా; ఈతఁడు= వీడు; తపము+సలిపెన్= తపస్సుచేశాడు; ఇంద్ర= ఓ ఇంద్రా! ఇతరము+ఎద్ది+ఐనన్= వేరే ఏదైనా; వైళమ+ ప్రయోగింపుము= వేగంగా ప్రయోగించు; అనుచున్= అంటూ; పలికెన్= పలికింది.

**తా :** పర్వతాల రెక్కలను ఖండించే సమయంలో కూడా ఈ వజ్రాయుధం వాడి ఎప్పుడూ తగ్గలేదు. వృత్రాసురుడు మొదలైనవారిని చంపినప్పుడు కూడా ఈ ఆయుధం తనపని పూర్తిచేసికాని తిరిగి రాలేదు. ఇదేమి ఇవాళ ఇలా జరిగింది! నేను ఇంద్రుడినే కానా? లేక ఇది వజ్రాయుధంకాదా? లేదా ప్రయోగించటంలో ఏదైనా పొరపాటు జరిగిందా! ఈ మాయావి దీని వాదర తెగకుండా ఏదైనా ప్రయోగం చేశాడా! ఈరోజు ఈ వజ్రాయుధం ఎందుకిలా శక్తి హీనమయిపోయింది? అని ఇంద్రుడు శోకించగా 'దివ్యవాణి' "ఈ రాక్షసుడు తడివస్తువుచేత, పొడివస్తువుచేత చావులేకుండా వరం పొందాడు. అంచేత ఇంద్రా! నీవు వేరే ఒక వస్తువును ఆయుధంగా త్వరగా ప్రయోగించు" అని ఆదేశించింది.

**వ. ఇట్లాదేశించిన దివ్యవాణి పలుకు లాకర్ణించి పురందరుండు. 377**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ఆదేశించిన; దివ్యవాణి పలుకులు= అశరీరవాణి వాక్కులు; ఆకర్ణించి= విని; పురందరుండు= ఇంద్రుడు.

**తా :** ఇలా ఆదేశించిన దివ్యవాణి పలుకులు విని ఇంద్రుడు.

**ఆ. ఆత్మబుద్ధిఁ దలఁచి యార్ద్రంబు శుష్కంబు గాని సాధనంబు ఫేన మనుచు**
**నది యమర్చి దాన నమరులు మెచ్చంగ నముచి శిరముఁ ద్రుంచె నాకవిభుఁడు. 378**

**ప్రతి :** ఆత్మబుద్ధిన్+తలఁచి= స్వబుద్ధితో ఆలోచించి; ఆర్ద్రంబు= తడియైనదీ; శుష్కంబు= పొడియైనదీ; కాని; సాధనంబు= ఆయుధం; ఫేనము+అనుచున్= 'నురుగు' ఒకటే అని నిశ్చయించుకొని; అది= దానిని; అమర్చి= ఆయుధంగా కూర్చుకొని; దానన్= దానితోనే, అమరులు= దేవతలు; మెచ్చంగన్= మెచ్చుకొనేవిధంగా; నాకవిభుఁడు= ఇంద్రుడు; నముచిశిరమున్= నముచితలను; త్రుంచెన్= నరికాడు.

**తా :** ఇంద్రుడు స్వబుద్ధితో పొడియైన, తడియైన కాని వస్తువేది అని ఆలోచించి, దివ్యస్ఫురణతో, అలాంటి వస్తువు 'ఫేనమే' (నురుగు) అని నిశ్చయించుకొని, దానినే ఆయుధంగా అమర్చుకొని ప్రయోగించి నముచిశిరస్సును భేదించాడు. దీన్ని చూచి దేవతలందరూ సంతోషించారు.

**వ. అ య్యవసరంబున. 379**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**సీ. పురుహూతు నగ్గించి పుష్పాంజలులు సేసి మునులు దీవించిరి ముదము తోడ**
**గంధర్వముఖ్యులు ఘనులు విశ్వావసుఁడును బరావసుఁడు నింపెనయఁ బాడి**

రమరాంగనాజను లాడిరి; దేవతా దుందుభులును మ్రోసె దురములోన
వాయు వహ్ని కృతాంత వరుణాదులును బ్రతిద్వంద్వుల గెల్చి రుద్దండవృత్తి

**తే.** నల్పమృగముల సింహంబు లట్ల తోలి, రమరవర్యులు దనుజుల నదటు వాయ
నజుఁడు పుత్తేర నారదుఁ డరుగు దెంచె, దైత్యహరణంబు వారింప ధరణినాథ! **380**

**ప్రతి :** ధరణినాథ= ఓ రాజా!; మునులు= మహర్షులు; పురుహూతున్+అగ్గించి= ఇంద్రుని పొగడి; ముదముతోన్= సంతోషంతో; పుష్ప+అంజలులు+చేసి+దీవించిరి= దోసిళ్ళతో పూలుచల్లి దీవించారు; గంధర్వముఖ్యులు= గంధర్వులలో ముఖ్యులు; ఘనులు= గొప్ప సంగీతవేత్తలయిన; విశ్వావసుఁడును+పరావసుఁడును= విశ్వావసుడు, పరావసుడు అనేవారు; ఇంపు+ఎనయన్= మిక్కిలి రమణీయంగా; పాడిరి= పాటలు పాడారు; అమర+అంగనాజనులు+ఆడిరి= అప్సరసలు నాట్యం చేశారు; దేవతాదుందుభులునున్+మ్రోసెన్= దేవదుందుభులు మోగాయి; దురములోనన్= యుద్ధంలో; వాయు, వహ్ని కృతాంత, వరుణాదులునున్= వాయువు, అగ్ని, యముడు, వరుణుడు మొదలైనవారు; ప్రతిద్వంద్వులన్= శత్రువుల్ని; ఉద్దండవృత్తిన్= మిక్కిలి పరాక్రమంతో; గెల్చిరి= గెలిచారు; అల్పమృగములన్= నీచ జంతువుల్ని; సింహంబులట్ల= సింహాలలాగా; అమరవర్యులు= దేవతలు; దనుజులన్= రాక్షసుల్ని; అదటు+పాయన్= భయంలేకుండా; తోలిరి= తోలిపారేశారు (తరిమివేశారు); అజుఁడు= బ్రహ్మదేవుడు; పుచ్చు+తేరన్= పంపించగా; నారదుఁడు= నారదమహర్షి; దైత్యహరణంబు వారింపన్= దైత్యుల్ని చంపడాన్ని ఆపివేయడానికి; అరుగు+తెంచెన్= వచ్చాడు.

**తా :** ఓ రాజా! అలా నముచి చావగా, మహర్షులు ఇంద్రుని సమయస్ఫూర్తిని, పరాక్రమాన్ని ప్రశంసించి దోసిళ్ళతో పూలుచల్లి ఆశీర్వదించారు. గంధర్వులలో ప్రముఖులైన గాయకులు విశ్వావసుడు, పరావసుడు కమనీయంగా పాటలుపాడారు. అమరకాంతలు నాట్యమాడారు. దేవదుందుభులు మోగాయి. వాయువు, వహ్ని, యముడు, వరుణుడు విజృంభించి రాక్షసుల్ని యుద్ధంలో ఓడించారు. తక్కిన దేవతలు మిగిలిన రక్కసిమూకల్ని సింహాలు చిల్లర జంతువుల్ని తరిమివేసినట్టు నిర్భయంగా తోలి పారేశారు. బ్రహ్మదేవుడు పంపించగా నారదమహర్షి రాక్షసుల్ని చంపడాన్ని ఆపటానికి అక్కడికి వచ్చాడు.

**వ.** వచ్చి సురలకు నారదుం డిట్లనియె. **381**

**తా :** వచ్చి దేవతలతో నారదు డిలా అన్నాడు.

**శా.** సిద్ధించెన్ సురలార! మీ కమృతమున్; శ్రీనాథసంప్రాప్తులై
వృద్ధిం బొందితి రెల్లవారలును; విద్వేషుల్ మృతిం బొంది రీ
యుద్ధం బేటికి? నింకఁ జాలుఁ; బనిలేదో హో పురే;' యంచు సం
బద్ధాలాపము లాడి మాన్చె సురలం బాండవ్యవంశాగ్రణీ! **382**

**ప్రతి :** పాండవ్యవంశ+అగ్రణీ= పరీక్షిన్మహారాజా!; ఓహో సురలార!= ఓ దేవతలారా! పురే= బాగుబాగు (బాపురే అనే మాటలో ఉన్నది ఇదే); బాగావుంది; ఇంకన్+చాలు= ఇకచాలును; మీకున్= మీకు కావాల్సిన; అమృతమున్+సిద్ధించెన్= అమృతం సిద్ధించింది; శ్రీనాథసంప్రాప్తులై= శ్రీహరిని ఆశ్రయించినవారై; ఎల్లవారలునున్= అందరూ; వృద్ధిన్+పొందితిరి=

బాగా అభ్యుదయం పొందారు; విద్వేషుల్= శత్రువులు; మృతిన్+పొందిరి= చనిపోయారు; ఈ యుద్ధంబు+ఏటికిన్?= ఇంక యుద్ధం ఎందుకు? ఇంకన్+చాలు= ఇకచాలు; పనిలేదు+ఓ= అవసరంలేదు; అంచున్= అంటూ; సంబద్ధ= సముచితములైన; ఆలాపములాడి= మాటలు మాట్లాడి; సురలన్= దేవతల్ని; మాన్చెన్= యుద్ధంనుండి వారించాడు.

**తా :** "ఓహో దేవతలారా! బాగుందయ్యా! మీకు అమృతం సిద్ధించింది. శ్రీహరిని ఆశ్రయించి కావలసింది సాధించి బాగుపడ్డారు. శత్రువులూ నశించారు. ఇంకా ఈ యుద్ధం ఎందుకు? అవసరంలేదు". అంటూ సముచితమైన మాటలతో వారిని ఒప్పించి యుద్ధం నుండి విరమింప చేశాడు.

**వ. ఇట్లు నారదవచననియుక్తులై రాక్షసులతోడి సంగ్రామంబు సాలించి సకలదేవముఖ్యులును త్రివిష్టపంబునకుం జనిరి; హతశేషులైన దైత్యదానవులు విపన్నుండైన బలిం దోడ్కొని పశ్చిమశిఖరిశిఖరంబుఁ జేరిరి; విధ్వంసమానకంధరులై వినష్టదేహులగు యామినీచరుల నెల్లను శుక్రుండు మృతసంజీవనియైన తనవిద్య పెంపునం జేసి బ్రదికించె; బలియును భార్గవానుగ్రహంబున విగతశరీరవేదనుండై పరాజితుండయ్యును లోకతత్త్వవిచక్షణుండగుటం జేసి దుఃఖింపక యుండె నని చెప్పి రాజునకు శుకుండిట్లనియె. 383**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా, నారదవచన నియుక్తులు+ఐ= నారదమహర్షి వచనాలచేత ఆదేశింపబడ్డవారై; రాక్షసులతోడి సంగ్రామంబున్= రాక్షసులతో యుద్ధాన్ని; చాలించి; సకలదేవ ప్రముఖులును= సకలదేవతాముఖ్యులూ; త్రివిష్టపమునకున్+చనిరి= స్వర్గానికి వెళ్ళిపోయారు; హతశేషులు+ఐన= చావకుండా ఇంకా మిగిలిన; దైత్యదానవులు= రాక్షసులు; విపన్నుండు+ఐన= ఆపదలో ఉన్న; బలిన్+తోడ్కొని= బలిచక్రవర్తిని పిలుచుకొని; పశ్చిమశిఖరి+శిఖరంబున్+చేరిరి= పడమటికొండశిఖరాన్ని చేరారు; విధ్వంసమాన కంధరులు+ఐ= తెగినగొంతులుకలవారై; వినష్టదేహులగు= మరణించిన; యామినీచరులన్+ఎల్లను= రాక్షసుల్ని అందర్నీ; శుక్రుండు= రాక్షసగురువు శుక్రాచార్యుడు; మృతసంజీవని+ఐన= మృతసంజీవని అయిన; తన విద్యపెంపునన్+చేసి= తనకు తెలిసిన విద్య పెంపుతో; బ్రదికించెన్= బ్రతికించాడు; బలియునున్= బలిచక్రవర్తికూడా; భార్గవ+అనుగ్రహంబునన్= గురువైన శుక్రుని దయచేత; విగతశరీర వేదనుండు+ఐ= శరీరవేదనను పోగొట్టుకున్నవాడై; పరాజితుండు+అయ్యును= ఓడిపోయినా కూడా; లోకతత్త్వ విచక్షణుండు+అగుటన్+చేసి= లోకం పోకడ తెలిసినవాడు కాబట్టి; దుఃఖింపక+ఉండెన్+అని= దుఃఖపడలేదు అని; చెప్పి; రాజునకున్= పరీక్షిత్తుతో; శుకుండు= శుకుడు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** ఇలా నారదమహర్షిచేత ఆదేశింపబడ్డ వారై సకలదేవతాప్రముఖులూ స్వర్గానికి వెళ్ళిపోయారు. ఇంకా మిగిలిన దైత్యదానవులు ఆపత్తులో ఉన్న బలిచక్రవర్తిని తీసుకొని పడమటి కొండ శిఖరాన్ని చేరారు. అక్కడ ఉన్న శుక్రాచార్యులవారు తెగిన గొంతులతో మరణించిన రాక్షసులందర్నీ తనకు తెలిసిన మృతసంజీవనీ విద్యతో బ్రతికించారు. బలిచక్రవర్తి కూడా శుక్రునిదయవల్ల శరీరవేదనను పోగొట్టుకొన్నవాడై బ్రతికి; ఓడిపోయినా లోకం పోకడ తెలిసినవాడు కాబట్టి దుఃఖపడకుండా ఉండిపోయాడు – అని చెప్పి శుకమహర్షి రాజుతో ఇంకా ఇలా చెప్పాడు.

**విశే :** మృతసంజీవని – ఒక మంత్రప్రయోగం (కృత్య). దానితో శుక్రుడు రాక్షసుల్ని బ్రతికించడం ప్రారంభించాడు. చివరికి ఆ విద్యనుకూడా కచుని పంపి దేవతలు గ్రహించారు. (మహాభారతంలో ఈ కథ ఉంది).

**సీ. కైలాసగిరిమీఁద ఖండేందుభూషణుఁ డొకనాఁడు గొలువున నున్నవేళ**
**నంగనయై విష్ణుఁ డసురుల వంచించి, సురలకు నమృతంబు సూఱ లిడుట**
**విని దేవియును దాను వృషభేంద్రగమనుఁడై కడువేడ్క భూతసంఘములు గొలువ**
**మధుసూదనుండున్న మందిరంబున కేగి పురుషోత్తముని చేతఁ బూజ వడసి**

**తే. తాను గూర్చుండి పూజించె దనుజవైరిఁ, గుశలమే మీకు మాకును గుశల మనుచు**
**మధురభాషల హరిమీఁద మైత్రి నెఱపి, హరుఁడు పద్మాక్షుఁ జూచి యిట్లనియెఁ బ్రీతి. 384**

**ప్రతి :** ఖండేందుభూషణుఁడు= చంద్రకళాధరుడైన శివుడు; కైలాసగిరి మీఁదన్= కైలాసపర్వతం మీద; ఒకనాఁడు; కొలువున్నవేళన్= ప్రమథగణాలతో కొలువుతీరి ఉండగా; అంగనయై= స్త్రీ వేషం ధరించి; విష్ణుఁడు; అసురులన్+వంచించి= రాక్షసులను వంచించి; సురలకున్= దేవతలకు; అమృతంబు+చూఱలు+ఇడుట= అమృతాన్ని కొల్లగొట్టి ఇచ్చేయటం; విని; దేవియును= పార్వతిదేవి; తాను= తానూ; వృషభ+ఇంద్రగమనుఁడు+ఐ= నందీశ్వరునిపై అధిరోహించి; కడువేడ్కన్= మిక్కిలి వేడుకతో; భూత సంఘంబులు+కొలువన్= సకల భూతగణాలూ సేవిస్తుండగా; మధుసూదనుండున్న= విష్ణువు ఉన్నటువంటి; మందిరంబునకున్+ఏగి= మందిరానికి వెళ్ళి; పురుష+ఉత్తమున్+చేతన్= విష్ణువుచేత; పూజ+పడసి= ఆతిథ్యం గ్రహించి; తానుకూర్చుండి= తాను ఆసీనుడై; దనుజవైరిన్+పూజించెన్= శ్రీమహావిష్ణువును అర్చించాడు; కుశలమే మీకున్= మీకు కుశలమా అని అడిగి; మాకును+కుశలము+అనుచున్= మేము క్షేమమే నని తెలిపి; మధురభాషలన్= తీయని మాటలతో; హరిమీఁద మైత్రినెఱపి= హరిమీద చనువుచూపి; హరుఁడు+పద్మాక్షున్+చూచి= హరుడు హరిని చూచి; ప్రీతిన్= ప్రేమతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** శివుడు ఒకనాడు కైలాస శిఖరంమీద ప్రమథగణాలతో కొలువుతీరినాడు. శ్రీమహావిష్ణువు మోహినీరూపంతో రాక్షసుల్ని మోసగించి దేవతలకే అమృతాన్ని కొల్లగొట్టి పంచేశాడన్న వార్త విన్నాడు.

అపుడు పార్వతీదేవితో పాటు నందీశ్వరుణ్ణి అధిరోహించి భూతగణాలు సేవిస్తుండగా శివుడు విష్ణువున్న చోటికి బయలుదేరాడు. విష్ణువు శివునికి అతిథిమర్యాదలు చేశాడు. శివుడు ఆసనం అధిరోహించి మరలా విష్ణువును పూజించాడు. విష్ణువు క్షేమాన్ని అడిగి, తాము క్షేమంగా ఉన్న విషయం తెలిపి తియ్యని మాటలతో శివుడు మాట్లాడుతూ, చనువుతో విష్ణువును చూచి ఇలా అన్నాడు.

**సీ. దేవ! జగన్మయ! దేవేశ! జగదీశ! కాలజగద్వ్యాపకస్వరూప!**
**యఖిలభావములకు నాత్మయు హేతువు నైన యీశ్వరుఁడ వాద్యంతములును**
**మధ్యంబు బయలును మఱి లోపలయు లేక పూర్ణమై యమృతమై భూరిసత్య**
**మానందచిన్మాత్ర మవికార మాద్య మనన్య మశోకంబు నగుణ మఖిల**

**తే. సంభవస్థితిలయముల దంభకంబు, నైన బ్రహ్మంబు నీవ; నీ యంఘ్రియుగము**
**నుభయసంగవిసృష్టులై యున్న మునులు, గోరి కైవల్యకాములై కొల్తు రెపుడు. 385**

**ప్రతి :** దేవ= దేవదేవా!; జగత్+మయ= ప్రపంచమంతానిండిన ఓ వాసుదేవా!; జగత్+ఈశ= జగదీశ్వరా!; కాలజగత్+ వ్యాపక+స్వరూప= ఎల్లకాలాలలోను జగత్తంతటా వ్యాపించి ఉండే స్వరూపం గలవాడా! అఖిలభావములకున్= అన్ని

భావాలకూ; ఆత్మయున్= మూలము; హేతువున్+ఐన= కారణమయిన; ఈశ్వరుఁడవు= ప్రభుడవు నీవు; ఆది+ అంతములును+మధ్యంబున్= ఆదిమధ్యాంతాలు; బయలును మఱి లోపలయున్= లోపల, వెలుపలా అనేతేడా; లేక; పూర్ణమై= పూర్ణతత్త్వమై; అమృతమై= నశించనిదై; భూరిసత్యము= పరిపూర్ణ సత్యస్వరూపం; ఆనంద+చిత్+మాత్రము= ఆనందంతో కూడిన చైతన్యరూపమైన జ్ఞానం; అవికారము= వికారము (పరిణామంలేనిది) లేనిది; ఆద్యము= అన్నింటికీ మొదలుగా గలది; అనన్యము= రెండవది లేనిది; అశోకము= దుఃఖములేనిది; అగుణము= ఏ గుణాలూ లేనిది; అఖిల= అన్నింటి; సంభవ స్థితి లయములు= అన్నిటి పుట్టుక, మనుగడ, నాశము; దంభకంబున్+ఐన= కల్పించే కారణమయిన; బ్రహ్మంబు= బ్రహ్మతత్త్వం; నీవ; నీ అంఘ్రియుగమున్= నీ పాదాలను; కైవల్యకాములు+ఐ= మోక్షంకోరి; ఉభయసంగ విసృష్టులు+ఐ= అహంకార మమకారాలను వీడి; కోరి= పూనికతో; మునులు= మహర్షులు; ఎపుడున్+కొల్తురు= సదా సేవిస్తారు.

**తా :** దేవదేవా! వాసుదేవా! జగదీశ్వరా! ఎల్లకాలాలలోనూ జగత్తునంతా వ్యాపించి ఉండే స్వరూపం నీది. అఖిల భావాలకూ ఆధారం, కారణం నీవే. నీవు ఈశ్వరుడివి. ఆది మధ్యాంతరహితుడివి. లోపల, వెలుపలా అన్న తేడా నీకు లేదు. నీ తత్త్వం నాశనం లేనిది. నీవు పరిపూర్ణ సత్యస్వరూపుడివి. ఆనందంతో కూడిన చైతన్యస్వరూపమైన జ్ఞానమే నీ స్వరూపం. నీ తత్త్వం పరిణామాలకు లొంగనిది. అన్నింటికీ మూలమైనది. రెండవది లేనిది. నీ స్వరూపంలో దుఃఖం లేదు. గుణాలు లేనిది. అన్నింటి పుట్టుక, మనుగడ నాశనాలను కల్పించే కారణమయిన పరతత్త్వం నీవే. కైవల్యం కోరేటటువంటి మహర్షులు అహంకార మమకారాలను జయించి పూనికతో నిన్ను సదా ఉపాసిస్తారు.

**సీ. భావించి కొందఱు బ్రహ్మంబు నీ వని తలపోసి కొందఱు ధర్మ మనియుఁ**
**జర్చించి కొందఱు సదసదీశ్వరుఁ డని సరవిఁగొందఱు శక్తిసహితుఁ డనియుఁ**
**జింతించి కొందఱు చిరతరుండవ్యయుఁ డాత్మతంత్రుఁడు పరుండధికుఁ డనియుఁ**
**దొడరి యూహింతురు తుది నద్వయద్వయ సదసద్విశిష్టసంశ్రయుఁడ వీవు;**

**తే. తలఁప నొక్కింత వస్తుభేదంబు గలదె, కంకణాదులు పసిఁడి యొక్కటియ కాదె?**
**కడలు పెక్కైన వార్ధి యొక్కటియ కాదె? భేద మంచును నిను వికల్పింపవలదు. 386**

**ప్రతి :** కొందఱు= కొంతమంది; బ్రహ్మంబు నీవు+అని= నీవు బ్రహ్మమని; భావించి= తలచి, కొందఱు= ఇంకొంతమంది; ధర్మమనియు= ధర్మమని; కొందరు చర్చించి= కొందరు మీమాంసచేసి; సత్+అసత్+ఈశ్వరుఁడని= సత్ అసత్తులకంటె పరుడైనవాడివని; సరవిన్+కొందరు+శక్తి సహితుఁడనియున్= మరి కొందరు శక్తితో కూడినవాడవని; చింతించి కొందఱు= కొందరు భావించి; చిరతరుండు= శాశ్వతుడు; అవ్యయుఁడు= నాశనం లేనివాడు; ఆత్మతంత్రుఁడు= స్వతంత్రుడు; పరుండు= అన్నింటికీ ఆవల ఉండేవాడు; అధికుఁడనియున్= సర్వోత్కృష్టుడని; తొడరి+ఊహింతురు= పూనికతో విశ్లేషించి ఊహిస్తారు; తుదిన్= చివరికి; అద్వయద్వయ= ఏకానికీ, అనేకానికీ; సత్+అసత్+విశిష్ట= ఉన్నదానితో లేనిదానితో కూడినవాటికి; సంశ్రయుఁడవు= ఆధారభూతుడవు; నీవు; తలఁపన్= ఆలోచించగా; ఒక్కింత= కొంచెమైనా; వస్తుభేదంబుగలదె= వస్తువు భిన్నంగా ఉందా?; కంకణాదులు= కంకణాలు మొదలైన బంగారునగలు; పసిఁడి= బంగారం; ఒక్కటియ+కాదె= ఒక్కటే కదా!; కడలు= అలలు; పెక్కైన= అనేకమైనా; వార్ధి= సముద్రం; ఒక్కటియకాదె= ఒకటే కదా!, భేదమంచును= పైకి భేదాలు కనిపిస్తున్నా; నిన్ను= నీ తత్త్వాన్ని; వికల్పింపవలదు= తేడాలున్నదిగా చెప్పరాదు.

**తా :** స్వామీ! నీవు ఎవరో చెప్పటం దుస్సాధ్యమయిన సంగతి. కొందరు నిన్ను పరబ్రహ్మమంటారు. మరికొందరు ధర్మమే నీ రూపమంటారు. సత్ అసత్తులకన్నా అతీతం నీ రూపమని కొందరు చెబుతారు. కొందరు నిన్ను శక్తి సహితుడంటారు. నీ తత్త్వం శాశ్వతమని, నీకు నాశనం లేనిదని, నీవు స్వతంత్రుడివని, అన్నింటికీ ఆవల ఉండేవాడివని, సర్వోత్కృష్టుడవని నిన్ను వర్ణిస్తారు. చివరకి ఏకానికీ అనేకానికీ, సత్తుకు అసత్తుకు – రెండింటికీ ఆధారం నీవేనంటారు. అంచేత బాగా మీమాంసచేస్తే ప్రపంచమంతటా నీవే ఉన్నావు. నీవు లేని, నీవు కాని వస్తువులేదు. కంకణాదులు, బంగారు ఒకటేకదా! అలలు ఎన్ని ఉన్నా సముద్రం ఒకటేకదా! అందువల్ల పైకి ఎన్ని తేడాలున్నా నీ తత్త్వాన్ని తేడాలున్నదానిగా చెప్పజాలము.

**సీ.** **యద్విలాసము మరీచ్యాదు లెఱుంగరు; నిత్యుఁడనై యున్న నేను నెఱుఁగ**
**యన్మాయ నంధులై యమరాసురాదులు వనరెద రఁట; యున్న వారలెంత?**
**యే రూపమునఁ బొంద కేపారుదువు నీవు; రూపివై సకలంబు రూపుసేయ**
**రక్షింపఁ జెఱుపఁ గారణమైన సచరాచరాఖ్యమై విలసిల్లు దంబరమున**

**తే.** **ననిలుఁ డే రీతి విహరించునట్ల నీవు, గలసి వర్తింతు సర్వాత్మకత్వ మొప్ప;**
**జగములకు నెల్ల బంధమోక్షములు నీవ, నీవ సర్వంబుఁ దలపోయ నీరజాక్ష!** **387**

**ప్రతి :** నీరజ+అక్ష= పద్మాక్షా!; యద్+విలాసము= ఎవని విలాసం; (లీల); మరీచి+ఆదులు+ఎఱుంగరు= మరీచ్యాదిమహర్షులు కూడా తెలుసుకోలేరో; నిత్యుఁడను+ఐ+ఉన్న= నీతో పాటు నిత్యుడిగా ఉన్న; నేనున్= నేనూ; ఎఱుఁగన్= తెలుసుకోలేను; యత్+మాయన్= ఎవని మాయచేత; అంధులు+ఐ= గుడ్డివార్తె; అమర+అసుర+ఆదులు= దేవతలు, రాక్షసులు మొదలైన అందరూ; వనరెదరు+అఁట= కష్టపడుతారట; ఉన్నవారలు+ఎంత?= తక్కిన వారి విషయం ఏమి చెప్పాలి?; ఏ రూపమునన్+పొందక= ఏ ఒక్కరూపంలోనూ ఉండక; (అనేకరూపాలలో); ఏపారుదువు నీవు= ఒప్పుదువు; రూపివి+ఐ= రూపాన్ని ధరించి; సకలంబు= సకలాన్నీ; రూపుసేయన్= పుట్టించడానికి; రక్షింపన్= కాపాడటానికి; చెఱుపన్= నాశనం చేయడానికి; కారణము+ఐన= కారణభూతమైన; సచర+అచర+ఆఖ్యము+ఐ= చరాచర రూపమే పేరుగా కల్గి; విలసిల్లుదు= ప్రకాశిస్తావు (చరాచర జగత్తులో అంతటా వ్యాపిస్తావు); అంబరమునన్= ఆకాశంలో; అనిలుఁడు+ఏరీతిన్+విహరించున్= వాయువు ఏ విధంగా సంచరిస్తాడో; అట్లు+అ= అలా; నీవు; వర్తింతువు= ప్రవర్తిస్తావు; సర్వ+ఆత్మకత్వము+ఒప్పన్= అన్నింటా ఆత్మగా ఉండి; జగములకున్+ఎల్లన్= ప్రపంచానికంతటికీ; బంధ మోక్షములు నీవే= బంధమూ, మోక్షమూ నీవే!; తలపోయన్= బాగావిచారిస్తే; సర్వంబు= సర్వము; నీవు+అ= నీవే.

**తా :** ఓ పద్మాక్షా! నీ లీలను మరీచి మొదలైన మహర్షులుకూడా తెలుసుకోలేరు. నీతోపాటు నిత్యంగా ఉన్న నేనూ ఎరుగను. నీ మాయచేత గుడ్డివార్తె దేవతలు, రాక్షసులు మొదలైన వారే కష్టాలపాలు అవుతారు – అంటే ఇతరుల విషయం (మానవాదుల విషయం) చెప్పడం ఎందుకు? ఏ ఒక్కరూపంలోనే కాకుండా అన్ని రూపాలలోనూ నీవు వ్యాపించి ఉంటావు. సకలజగత్తును సృష్టించి, పాలించి, నశింపచేసేటటువంటి చరాచరరూపమైన కారణంగా అన్నింటా నీవే విక్రమిస్తావు. ఆకాశంలో వాయువు ఎలా వ్యాపిస్తాడో అలాగే నీవు అన్నింటా వ్యాపించి ఉన్నావు. జగత్తుకు బంధమూ, మోక్షమూ నీవే కల్పిస్తావు. బాగా విచారిస్తే నీవే అంతా. (నీవుకానిది ఏదీ లేదని తెలుసుకొన్నానని అర్థం).

**మ.** **ఘనతన్ నీ మగపోఁడుముల్ పలుమఱుంగన్నారఁ గన్నార; మే**
**నిను విన్నారము; చూడ మెన్నఁ డును మున్ నీ యాఁడు చందంబు; మో**

**హినివై దైత్యులఁ గన్నుఁబ్రామి యమృతంబింద్రాదిదేవాళి కి**
**చ్చిన నీ రూపముఁ జూపుమా! కుతుకముంజిత్తంబునంబుట్టెడిన్. 388**

**ప్రతి :** స్వామీ! ఘనతన్= మహిమతోకూడిన; నీ మగపోఁడుముల్= నీ మగసోయగాలను; పలుమఱున్= చాలాసార్లు; కన్నారన్= కళ్ళారా; కన్నారము= చూశాం; ఏన్ నినున్+విన్నారము= విన్నాముకూడా; మున్= మునుపు; ఎన్నఁడును= ఎప్పుడూ; నీ+ఆఁడు+చందంబున్= నీ స్త్రీరూపాన్ని; చూడము= చూడలేదు; మోహినివి+ఐ= మోహినీ రూపాన్ని ధరించి; దైత్యులన్+కన్నున్+ప్రామి= రాక్షసుల కన్నుగప్పి; అమృతంబు= అమృతాన్ని; ఇంద్రాది దేవ+ఆళికిన్+ఇచ్చిన= ఇంద్రాది దేవతలకిచ్చిన; నీ రూపమున్= నీ రూపాన్ని; చూపుమా= చూపించు; చిత్తంబునన్= నామనస్సులో; కుతుకమున్+పుట్టెడిన్= కుతూహలం కలుగుతోంది.

**తా :** స్వామీ! మహిమతోకూడిన నీ పురుషసౌందర్యాన్ని ఎన్నోసార్లు కళ్ళారాచూశాము. ఇతరులు చెప్పగా విన్నాముకూడా. కాని మునుపెన్నడూ నీ స్త్రీరూపాన్ని చూడలేదు. మోహినీ రూపాన్ని ధరించి రాక్షసుల కన్నుగప్పి అమృతాన్ని ఇంద్రాదిదేవతలకు పంచిన ఆ రూపాన్ని చూడాలని నా మనస్సు ఉబలాటపడుతోంది.

**విశే :** 'విన్నాము' అంటే నారదాది మహర్షులు వర్ణించగా ఎన్నోసార్లు విన్నామని అర్థం. ఆ రూపాన్ని చూడగోరే వచ్చామని కూడా శివుడు అంటాడు (చూ.మూలం. 8-12-13).

**క. మగవాఁడ వై జగంబులఁ, దగిలిచి చిక్కులను బెట్టు దంటకు నీకున్**
**మగువతనంబున జగములఁ, దగులము బొందింప నెంతతడవు ముకుందా! 389**

**ప్రతి :** ముకుందా!= ఓ మోక్షప్రదాతా నారాయణా!; మగవాఁడ+ఐ= మగవాడవేఐ; జగంబులన్= లోకాలను; తగిలిచి= నీ ఆకర్షణలో ఇరికించి; చిక్కులన్+పెట్టుదంటకన్= చిక్కుల్లో పడదోసే నేర్పరికి; నీకున్= నీకు; మగువతనంబునన్= ఆడరూపంలో; జగములన్= లోకాలను; తగులమున్+పొందింపన్= కట్టి పడవేయటానికి; ఎంత తడవు= ఎంతసేపు కావాలి స్వామీ!

**తా :** ముకుందా! మగవాడుగానే లోకాల్ని ఇట్లా నీ వ్యూహంలోకి ఆకర్షించి చిక్కులో పడతోస్తావే! – అలాంటప్పుడు ఆడరూపాన్ని పొంది ప్రపంచాన్ని కట్టిపడవేయడానికి నీకు ఎంతసేపు పడుతుందయ్యా!

**విశే :** అంటే ముందు చెప్పినట్టు (మూలంలోలాగా) స్వామిరూపాన్ని చూడాలని వచ్చాననే అర్థం ఈ మాటలో ఉంది.

**వ. అని పలుకుచున్న శూలపాణిచే నపేక్షితుండై విష్ణుండు భావగంభీరమగు నవ్వు నివ్వటిల్ల నవ్వామ దేవున కిట్లనియె. 390**

**ప్రతి :** అని; పలుకుచున్న; శూలపాణిచేన్= శివునిచేత; అపేక్షితుండు+ఐ= కోరబడినవాడై; విష్ణుండు; భావగంభీరంబు+అగు= భావంతో నిండిన; నవ్వు; నివ్వటిల్లన్= పొటమరించగా; ఆ+వామదేవునకు= ఆ శివునకు; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ విధంగా శివుని చేత కోరబడినవాడై భావగర్భితంగా నవ్వుతూ విష్ణువు ఇలా అన్నాడు.

**శా. 'శ్రీకంఠా! నిను నీవ యేమఱకుమీ చిత్తంబు రంజించెదన్**
**నాకద్వేషుల డాఁగురించుటకునై నాఁడేను గైకొన్న కాం**
**తాకారంబు జగన్నిమజ్జనము నీవై చూచెదేఁజూపెదం**
**గైకో నర్హము లండ్రు కాముకులు సంకల్పప్రభూతార్థముల్'. 391**

**ప్రతి :** శ్రీకంఠా= విషకంఠా!; నిను= నిన్ను; నీవు+అ+ఏమఱుకుమీ= నీవే మరచిపోకుండా ఉండాలిసుమా!; చిత్తంబు= నీ మనస్సును; రంజించెదన్= సంతోష పెడతాను (స్త్రీ రూపాన్ని ధరిస్తాను); నాకద్వేషులన్= రాక్షసుల్ని; డాఁగురించుటకును+ఐ= మోసగించడానికి; నాఁడు+ఏను= ఆరోజు నేను; కైకొన్న= స్వీకరించిన; కాంతాకారంబు= స్త్రీ ఆకారం (మోహినీరూపం); జగత్+నిమజ్జనము= లోకాన్ని ముంచివేసేది (అంటే ఎవరైనా మోసపోతారని అర్థం); నీవై+చూచెదేన్+చూపెదన్= నీవై నీవు చూస్తానంటేనే చూపెడతాను; కాముకులు= కోరికలు కలవారు; సంకల్ప= మనసులో; ప్రభూత= పుట్టిన; అర్థముల్= కోరికలు; కైకోన్= తీర్చుకోవటం కోసం; అర్హములండ్రు= తగినవి అంటారు (తీర్చుకోవటం తప్పుకాదులే! అని అర్థం).

**తా :** శ్రీకంఠా! నిన్ను నీవు మరచిపోకుండా ఉండాలి సుమా! (అందుకే ముందు 'నవ్వాడు'). నీ మనస్సుకు సంతోషం కల్గిస్తాను. నాడు రాక్షసుల్ని మోసగించి అమృతాన్ని రక్షించుకోవడానికి ధరించిన ఆ ఆకారం – మోహినీరూపం లోకాన్ని ముంచి వేసేటటువంటిది. నీవై నీవు చూస్తానంటే చూపెడతాను. అయినా కోరికలు పుట్టినపుడు వాటిని తీర్చుకోవటం తప్పేమీ కాదని అంటారు కదా!

## ❖ శ్రీహరి తన మోహినీ రూపంబుచే నీశ్వరుని మోహింపఁజేయుట ❖

**వ. అని పలికి, కమలలోచనుం డంతర్హితుండయ్యె; నయ్యుమా సహితుం డయిన భవుండు విష్ణుండెటు వోయెనో యెందుఁజొచ్చెనోయని దిశదిశలం గలయ నవలోకించుచుండం దన పురోభాగంబున. 392**

**ప్రతి :** అని= పైవిధంగా; పలికి= చెప్పి; కమలలోచనుండు= పద్మములవంటి కన్నులుగల హరి; అంతర్హితుండు+అయ్యెన్= అదృశ్యమైనాడు; ఆ+ఉమా సహితుండు+అయిన= ఆ పార్వతీదేవితో కూడిన; భవుండు= శివుడు; విష్ణుండు= హరి; ఎటు+పోయెనో= ఎక్కడికి వెళ్లినాడో; ఎందున్= ఎక్కడ; చొచ్చెను+ఓ= ప్రవేశించాడో; అని= అనుకుంటూ; దిశదిశలన్= అన్ని దిక్కులా; కలయన్+అవలోకించుచుండన్= అంతటాచూస్తుండగ; తన= తన (శివుని)యొక్క; పురోభాగంబునన్= ఎదుట.

**తా :** పై విధంగా చెప్పి విష్ణువు మాయమైనాడు. పార్వతీసమేతుడైన శివుడు 'హరి ఎక్కడకు వెళ్ళినాడో! ఎక్కడ ఉన్నాడో!' అనుకుంటూ పదిదిక్కులా అంతటా చూస్తుండగా తన (శివుని) ఎదుట.

**సీ. ఒక యెలదోఁటలో నొకవీథి నొక నీడఁ గుచకుంభములమీఁది కొంగు దొలఁగఁ**
**గబరికాబంధంబు గంపింప నుదుటిపైఁ జికురజాలంబులు సిక్కువడఁగ**
**ననుమానమై మధ్యమల్లాడఁజెక్కులఁ గర్ణకుండలకాంతి గంతు లిడఁగ**
**నారోహభరమున నడుగులు దడఁబడఁ దృగ్దీప్తిసంఘంబు దిశలఁగప్ప**

**తే. వామకరమున జాఱిన వలువఁబట్టి, కనకనూపురయుగళంబు గల్లనంగఁ**
**గంకణంబుల ఝణఝణత్కార మెసఁగ, బంతిచే నాడు ప్రాయంపుటింతిఁగనియె. 393**

**ప్రతి :** ఒక= ఒక్క; ఎల+తోఁటలోన్= విహారవనంలో; ఒకవీథిన్= ఒక చెట్లవరుసలోని; ఒక నీడన్= ఒక చెట్టునీడలో; కుచకుంభముల మీఁది= కడవలవంటి చనులపైనగల; కొంగు= పైట; తొలఁగన్= తొలగిపోగా; కబరికాబంధంబు= కొప్పుముడి; కంపింపన్= చలింపగా; నుదుటిపైన్= నొసటిమీద; చికురజాలంబులు= ముంగురుల యొక్క గుంపులు; చిక్కు+పడఁగన్= చిక్కుపడగా; అనుమానము+ఐ= ఉన్నదో లేదో అనే సందేహం కలదై; మధ్యము= నడుము; అల్లాడన్= కదలాడగా; చెక్కులన్= చెంపలపై; కర్ణకుండలకాంతి= చెవుల యందలి కమ్మలయొక్క వెలుగు; గంతులు+ఇడఁగన్= చిందులాడగా; ఆరోహ= పిరుదులయొక్క; భరమునన్= బరువుతో; అడుగులు= చరణములు; తడబడన్= తొట్రుపడగా; దృక్= చూపుల; దీప్తి= కాంతులయొక్క; సంఘంబు= గుంపు; దిశలన్= దిక్కులను; కప్పన్= కప్పివేయగా; జాఱిన= జారిపోయిన; వలువన్= చీరను; వామ కరమునన్= ఎడమచేతితో; పట్టి= పట్టుకొని; కనకనూపుర= బంగారు కాలి అందియలయొక్క; యుగళంబు= జంట; గల్లు+అనంగన్= గలగలమని శబ్దించగా; కంకణంబుల= చేతిగాజులయొక్క; ఝుణఝుణత్కారము= ఝుణఝుణమను శబ్దాలు; ఎసఁగన్= అతిశయిల్లగా; బంతిచేన్= పుట్టచెండుతో; ఆడు= ఆడుకొంటూఉన్న; ప్రాయంపు+ఇంతిన్= వయసులోగల చెలువను; కనియెన్= చూచెను.

**తా :** ఒక ఉద్యానవనంలోని చెట్లవరుసలో ఒకానొక చెట్టునీడలో, స్తనకలశాలపైనగల పైట తొలగిపోగా, కొప్పుముడి కదలాడగా, నొసటిపై ముంగురులగుంపులు ముసురుకొనగా, ఉన్నదా లేదా అని సందేహించేటట్లున్న నడుము కదలాడగా, చెక్కిళ్లపై చెవులకమ్మల వెలుగులు చిందులాడగా, పిరుదుల బరువుతో అడుగులు తొట్రుపడగా, చూపుల వెలుగుల గుంపులు దిక్కులను కప్పివేయగా, జారిపోయిన చీర ఎడమచేతితో పట్టుకొని, బంగారు అందియల జంట గలగలమని శబ్దించగా, చేతిగాజుల ఝుణఝుణమనే శబ్దాలు అతిశయిల్లగా, పుట్టచెండుతో ఆడుకొంటూ ఉన్న చెలువను చూచెను.

**విశే :** శివుడు దర్శించిన మోహినీరూపం తీరిచిదిద్ది అలంకరించుకొన్న రూపం కాదు. బంతి ఆటలో చెదరిన సహజ సుందరరూపం.

**వ. కని, మున్ను మగువ మరగి సగమయిన మగవాఁ డమ్మగువ వయో రూప గుణ విలాసంబులు దన్ను నూరింపం గనుఱెప్ప వ్రేయక తప్పక చూచి మెత్తనయిన చిత్తంబున. 394**

**ప్రతి :** కని= ఆ విధంగా చూచి; మున్ను= అదివరకే; మగువ= చెలువ; మరగి= వలపుతో; సగమయిన= సగమువాడయిన; మగవాఁడు= శివుడు; ఆ+మగువ= ఆ లలనయొక్క; వయో రూప గుణ స్వభావ విలాసంబులున్= ప్రాయమూ, రూపమూ(అందమూ), స్వభావమూ, విలాసాలు; తన్నున్= తనను (శివుని); ఊరింపన్= బాగా ఆకట్టుకొనగా; కనుఱెప్పవ్రేయక= కనురెప్పవేయక; తప్పక= ఎడతెరపిలేకుండ; చూచి= కని; మెత్తనయిన= మెత్తబడిన; చిత్తంబునన్= మనస్సుతో...

**తా :** ఆ విధంగా చూచి అదివరకే మగువవలపుతో సగమయిన శివుడు ఆ మగువ ప్రాయమూ, అందమూ, స్వభావమూ, విలాసాలూ తనను బాగా ఆకట్టుకొనగా గుడ్లప్పగించి ఎడతెరపి లేకుండ చూచి మెత్తబడిన చిత్తంతో

**శా. 'ఈ కాంతాజనరత్న మెవ్వరిదొకో? యీ యాఁడురూపంబు ము**
**న్నే కల్పంబులయందుఁ గాన; మఱుఁ డీ యింతిన్ సృజింపంగఁ దా**
**లేకుంటెల్ల నిజంబు, వల్లభత నీ లీలావతిం జేరఁగా**
**నే కాంతుండు గలండొ క్రీడలకు నా కీ యింతి సిద్ధించునే?' 395**

**ప్రతి :** ఈ= ఈ కనిపించే; కాంతాజన రత్నము= నారీజనమణి; ఎవ్వరిది+ఒకో= ఎవ్వరిదోకదా!; ఈ+ఆదురూపంబు= ఈ స్త్రీ రూపాన్ని; మున్ను= మునుపు; ఏ కల్పంబుల+అందున్= ఏకల్పంలోనూ; కానము= చూడము; అజుఁడు= బ్రహ్మ, ఈ+ఇంతిన్= ఈ నెలతను; తా+సృజింపంగన్= తానుసృజించ; లేక+ఉంట+ఎల్లన్= లేకపోవడమంతా; నిజంబు= నిక్కువము; వల్లభతన్= ఇల్లాలుగా; ఈ లీలావతిన్= ఈ సుందరాంగిని; చేరఁగాన్= పొందగలిగే; ఏ కాంతుండు కలండు+ఒ= అదృష్టవంతుడెవడో!; క్రీడలకున్= విహారాలకు; నాకు+ఈ+ఇంతి= నాకీచెలువ; సిద్ధించును+ఏ= లభిస్తుందా?

**తా :** 'ఈ కనిపించే అన్నులమిన్న ఎవరిదోకదా! ఈ అందమైన నెలతను మునుపు ఏ కల్పంలోనూ చూడలేదు. ఈమెను బ్రహ్మ సృష్టించలేదనడం నిజం. ఇల్లాలుగా ఈ వయ్యారిని పొందగలిగే అదృష్టవంతుడెవడో! విహారాలకు నా కీ చెలువ లభిస్తుందా!' అనుకొన్నాడు శివుడు.

**వ.** **అని మఱియుం జెఱకువిలుతుని కోలలు మేరమీఱి దఱుమ నెఱబిరుదు వెఱఁగుపడం దెఱవ దుఱిమిన తుఱుము బిగిముడి వదలి కదలి భుజముల మెడల నదరి చెదరిన కురులు నొసలి మృగమద తిలకంపుటసలు మసల, విసవిస నగు మొగము మెఱుంగులు దశదిశలం బసలు కొలుపఁ, జిఱునగవు మెఱయ నునుఁ జెమటం దడంబడి పులకరములు గులకరములు గొన, హృదయానందఁకందంబగు కందుకంబు గరారవిందంబునం దమర్చి, యక్కునం జేర్చి, చెక్కున హత్తించి, చుబుకంబు మోపి, చూచుకంబులం గదియించి, నఖంబుల మీటుచు, మెల్లమెల్లన గెల్లాడు కరకమలంబులఁ గనక మణివలయంబులు ఝణఝణయనం గుచకలశంబు లొండొంటి నొరయ, నెడమఁ గుడినిం దడంబడఁ గ్రమ్మన నెగురఁ జిమ్ముచు, నెగురఁ జిమ్మి తనకుఁ దానె కొన్ని చిన్ని పన్నిదంబులు సేసికొని బడుగునడుము బెడఁకి వడ వడ వడంకి నఱితి సరులు గలయం బడఁ దిరుగుచుఁ దిరుగునెడఁ బెనఁకువలుగొనఁ జెవుల తొడవుల రుచులు గటముల నటనములు సలుపఁ, బవిరి తిరిగి యొడియుచు, నొడిసి కెలంకులం జడియుచు, జడిసి జడనుపడక వలువ నెలవు వదలి దిగంబడం, గటిస్థలంబునఁ గాంచీ కనకమణి కింకిణులు మొరయఁ, జరణ కటకమ్ములు గల్లు గల్లు మనం, గరకంకణ మణి గణములు మెఱయ, మితి దప్పిన మోహాతిరేకం బుప్పొంగ వెనుకొని యుఱికి పట్టుచుఁ, బట్టి పుడమిం బడవైచి, పాటు వెంటనే మింటికెగసినం గెంటక కరంబునం గరంబు దిరంబయి పలుమఱు నెగయ నడుచుచు, నెగయు నెడం దిగంబడు తఱిని నీలంపు మెఱుంగు నిగ్గు సోగపగ్గంబుల వలలు వైచిరాఁ దిగిచిన పగిది వెనుకొనంగ, విలోకన జాలంబులు నిగిడించుచు, మగిడించుచుఁ, గర లాఘవంబున నొకటి, పది, నూఱు, వేయు సేసి నేర్పులు వాటించుచు, నరుణ చరణకమల రుచుల నుదయ శిఖరి శిఖర తరణి కరణి సేయుచు, ముఖచంద్ర చంద్రికలఁ జంద్రమండలంబులు గావించుచు, నెడ నెడ నురోజ దుర్గ నిర్గతచేలాంచలంబుఁ జక్క నొత్తుచుఁ గపోలఫలకాలోల ఘర్మజలబిందు బృందంబులు నఖాంకురంబుల నొనరించుచు, నధరబింబారుణ సంభ్రాంత సమాగత రాజకీరంబులం జోపుచు, ముఖసరోజ పరిమళాసక్త మత్తమధుపంబుల నివారించుచు, మందగమనాభ్యాస కుతూహలాయత్తమరాళ యుగ్మంబులకుం దలంగుచు, విలాస వీక్షణానందిత మయూర మిథునంబులకు నెడఁగలుగుచుఁ, బొదరిండ్ల యీఱములకుం బోక మలంగుచుఁ, గరకిసల యాస్వాద**

**కాముక కలకంఠ దంపతులకు దూరమగుచుఁ, దీఁగె యుయ్యెలల నూఁగుచు; మాధవీ మండపంబు లెక్కుచుఁ, గుసుమరేణు పటలంబుల గుబ్బళ్లు ద్రాఁకుచుఁ, మకరందస్యంద బిందుబృందంబు నుత్తరించుచుఁ, గృతక శైలంబుల నారోహించుచుఁ బల్లవ పీఠంబులం బరిశ్రమంబు పుచ్చుచు, లతాసౌధభాగంబులఁ బొడసూపుచు, నున్నత కేతకీ స్తంభంబుల నొరగుచుఁ, బుష్పదళ రచిత వాతాయనంబులం దొంగిచూచుచుఁ, గమల కాండ పాలికల నాలంబించుచుఁ, జంపక దేహళి మధ్యంబుల నిలువంబడుచుఁ; గదళికాపత్ర కవాటంబున నుద్ఘాటించుచుఁ, బరాగ నిర్మిత సాలభంజికా నివహంబుల నాదరించుచు, మణికుట్టిమంబుల మురియుచుఁ, జంద్రకాంత వేదికల నెలయుచు, రత్నపంజర శారికా నివహంబులకుం జదువులు సెప్పుచుఁ, గోరిన క్రియం జూచుచుఁ, జూచినక్రియ మెచ్చుచు, మెచ్చిన క్రియ వెఱఁగుపడుచు, వెఱఁగుపడిన క్రియ మఱచుచు, మఱవక యేకాంతం బగు నవ్వనాంతంబున ననంతవిభ్రమంబుల జగన్మోహినియై విహరించుచు నున్న సమయంబున.** **396**

**ప్రతి :** అని మఱియున్= ఈ ప్రకారంగా ఇంకా; చెఱకు విలుతుని= మన్మథుని; కోలలు= బాణాలు; మేరమీఱి= హద్దుదాటి; తఱుమన్= వెంటాడగా; నెఱబిరుదు= (కామహారి అనే) పెద్ద బిరుదుగల శివుడు; వెఱఁగుపడన్= అచ్చెరువొందునట్లు; తెఱవ= మోహిని; తుఱిమిన= ముడుచుకొన్న; తుఱుము= కొప్పు; బిగిముడి= బిగుతైనముడి; వదలి= సడలి; కదలి= చలించి; భుజములన్= బాహువులపైన; మెడలన్= మెడలపైన; అదరి= త్రుళ్లి, చెదరిన కురులు= చెదిరిన ముంగురులు; నొసలి= నుదుటిమీది; మృగమద= కస్తూరి; తిలకంపు= బొట్టు; అసలుమసలన్= (బురదగా మారగా) కరిగిపోగా; విసవిస= ప్రసరించేటట్లు; నగు మొగము= నవ్వు మొగము యొక్క; మెఱుంగులు= కాంతులు; దశదిశలన్= పది (అన్ని) దిక్కులా; పసలు కొలుపన్= వ్యాపించగా; చిఱునగవు= చిన్నినవ్వు; మెఱయన్= తళుక్కుమనగా; నును= లేత; చెమటన్= చెమటతో; తడంబడి= తొట్రుబడుతూ; పులకరములు= పులకలు; గులకరములు+కొనన్= అందంగా మొలకలెత్తగా; హృదయ= మనస్సునకు; ఆనంద కందంబు+అగు= సంతోషానికి మూలమైన; కందుకంబు= బంతిని; కర+అరవిందంబు+అందున్= కేలుదామరయందు; అమర్చి= అందుకొని; అక్కునన్= ఎదపై; చేర్చి= ఉంచుకొని; చెక్కునన్= చెక్కిలిపై; హత్తించి= చేర్చి; చుబుకంబు= గడ్డం; మోపి= తాకించి; చూచుకంబులన్= చనుమొనలకు; కదియించి= ఆనించుకొని; నఖంబులన్= గోళ్లతో; మీటుచున్= మీటుతూ; మెల్లమెల్లనన్= అల్లనల్లన; గెల్లాడు= కదిలించు; కరకమలంబులన్= పద్మములవంటి చేతుల; కనకమణివలయంబులు= బంగారు రవ్వల గాజులు; ఝుణఝుణయనన్= ఝుణఝుణ అని శబ్దించగా; కుచకలశంబులు= స్తనకుంభాలు; ఒండు+ఒంటిన్= ఒకదానితో ఒక్కటి; ఒరయన్= రాచుకొనగా; ఎడమన్+కుడిన్= కుడిఎడమలకు; తడంబడన్= తొట్రువడగా; క్రమ్మనన్= తొందరతొందరగా; ఎగురజిమ్ముచున్= పైకి ఎగురవేస్తూ; ఎగురన్+చిమ్మి= ఎగజిమ్మి; తనకున్+తానె= తనంతకు తానె; కొన్ని= కొలది; చిన్ని= చిన్న; పన్నిదంబులు= పందెములు; చేసికొని= వేసికొని; బడుగు= సన్నని; నడుము; బెడఁకి= చలించి; వడవడ వడంకి= వడవడ అని (ధ్వన్యనుకరణం) వణకి; అఱతి= మెడలోని; సరులు= దండలు; కలయంబడన్= చిక్కుపడేటట్లు; తిరుగుచున్= తిరుగాడుచు; తిరుగునెడన్= అలా తిరిగేటప్పుడు; పెనఁకువలు+కొనన్= మెలివడునట్లుగ; చెవుల= కర్ణ; తొడవుల= భూషల; రుచులున్= కాంతులు; కటకములన్= చెక్కిళ్లపై; నటనములు= చిందులు; సలుపన్= ఆడగా; బవిరి తిరిగి= గుండ్రంగా తిరుగుతూ; ఒడియుచున్= (బంతిని) పైకి ఎగిరి పట్టుకొంటూ; ఒడిసి= ఒడియుచు; కెలంకులన్= ప్రక్కలకు; జడియుచున్= కదలుతూ;

జడిసి= చలించి; జడనుపడకన్= ఆలస్యంచేయక (వెంటనే); వలువ= పైట; నెలవు= (తన) తావు; వదలి= తప్పి; దిగంబడన్= జారిపోగా; కటిస్థలంబునన్= నడుమున; కాంచీకనకమణి కింకిణులు= ఒడ్డాణం, బంగారు మువ్వల చిరుగజ్జెలు; మొరయున్= మ్రోగగా; చరణకటమ్ములు= కాలి అందియలు; గల్లుగల్లుమనన్= గల్లుగల్లుమనగా; కరకంకణ= చేతి మురువుల; మణిగణంబులు= రవ్వలగుంపు; మెఱయన్= ప్రకాశించగా; మితి+తప్పిన= హద్దుమీరిన; మోహ+ అతిరేకంబు= ఎక్కువ మక్కువ; ఉప్పొంగన్= పెల్లుబుకగా; ఉఱికి= పరుగెత్తి; పట్టుచున్= (బంతిని) పట్టుకొంటూ; పట్టి= పట్టుకొని; పుడమిన్= నేలపై; పడవైచి= పారవేస్తూ; పాటు+వెంటన్+ఏ= అలా పడినవెంటనే; మింటికి+ఎగసినన్= పైకిఎగిరినపుడు; గెంటక= తోయకుండ; కరంబునన్= (ఒక) చేతిని; కరంబునన్= (మరొక) చేతితో; తిరంబయి= చేర్చి; పలుమఱున్= పలుసార్లు; ఎగయ= ఎగురవేస్తూ; నడుచుచున్= నడుచుకొంటూ; ఎగయునెడన్= (బంతి) పైకి ఎగిరినపుడు; దిగంబడు తఱిని= కిందకు పడేటప్పుడూ; నీలంపు= నల్లని; మెఱుంగు= తళుకైన; నిగ్గు= అందమైన; సోగ= చూపులు అనే; పగ్గంబులన్= పగ్గాలతో; వలలువైచి= వలలుపన్ని; రాఁదిగిచి= లాగి పట్టుకొన్న; పగిది= మాదిరి; వెనుకొనంగన్= వెంటాడుతూ; విలోకన= చూపుల; జాలంబులు= గుంపులు; నిగిడించుచున్= వ్యాపింపచేస్తూ; మగిడించుచున్= తిరుగుతూ; కరలాఘవంబునన్= చేతివాటంగా; ఒకటి; పది; నూఱు; వేయు+చేసి= వేయిగా చేస్తూ; నేర్పులు= నైపుణ్యం; పాటించుచున్= అనుసరిస్తూ; అరుణ చరణ కమల రుచులన్= ఎర్రని అడుగుదమ్ముల కాంతులను; ఉదయశిఖరి= తూరుపుకొండ నుండి ఉదయించే; తరణి= సూర్యుని; కరణి= వలె; చేయుచున్= (మోహిని) స్ఫురింపచేస్తూ; ముఖచంద్ర= మోముచందురుని; చంద్రికలన్= వెన్నెల వెలుగులతో; చంద్రమండలంబులు= చందురుని మండలాలను; కావించుచున్= సృజిస్తూ; ఎడనెడన్= అప్పుడప్పుడూ; ఉరోజదుర్గ= చనుకొండలనుండి; నిర్గత= జారిపోయిన; చేల+అంచలంబున్= పైటకొసను; చక్కనొత్తుచున్= సవరించుకొంటూ; కపోల ఫలక= చెక్కిళ్ల పై; ఆలోల= చిందే; ఘర్మ జల బిందు బృందంబు= చెమట నీటి బొట్లగుంపులు; నఖ+అంకురంబులన్= గోళ్లకొనలతో; ఒనరించుచున్= తొలగిస్తూ; అధర బింబ+అరుణ సంభ్రమ సమాగత రాజకీరంబులన్= పెదవిని దొండపండు ఎరుపుగా భ్రమపడి వచ్చిన రాచిలుకల; చోపుచున్= తోలుచు; ముఖసరోజ= కమలమువంటి ముఖంలోని; పరిమళ= సువాసనకు; ఆసక్త= కోరి(మూగిన); మత్త మధుపంబులన్= మత్తిల్లిన తుమ్మెదలను; నివారించుచున్= అదలించుచు; మందగమన= మెల్లని (అందమైన) నడకను; అభ్యాస= నేర్చుకొనే; కుతూహల= కుతుకంతో; ఆయత్త= వచ్చే; మరాళ యుగ్మంబులకున్= అంచ జంటలను; తలంకుచున్= గెంటుతూ; విలాస వీక్షణ+ఆనందిత మయూర మిథునంబులకున్= సొగసైన చూపుల కోసం ముచ్చటగా వచ్చిన నెమళ్ల జంటలకు; ఎడఁగలుగుచు= దూరంగా ఉంటూ; పొదరిండ్ల+ఈరములకున్= పొదరిండ్ల తీగగుంపులకు; పోక= వెళ్లక; మలంగుచున్= వెనుతిరుగుచు; కరకిసలయ= చేతులను చిగుళ్లనుకొని; ఆస్వాద= మెసవే; కాముక= ఇచ్చగల; కలకంఠ= కోకిల; దంపతులకున్= జంటలకు; దూరమగుచున్= దవ్వుగా ఉంటూ; తీగె= తీగ; ఉయ్యెలలన్= ఉయ్యాలలపై; ఊగుచున్= ఊగాడుతూ; మాధవీమంటపంబులు= పూలగురువెంద పందిరులుగల మండపాలు; ఎక్కుచున్= అధిరోహిస్తూ; కుసుమరేణు= పుప్పొడి; పటలంబుల=గుంపుల; గుబ్బళ్లు= గుట్టలను; ప్రాకుచున్= ఎక్కుతూ; మకరంద స్యంద బిందు బృందంబులన్= పూలనుండి కారుతున్న మకరందాన్ని; ఉత్తరించుచున్= దాటుకొంటూ; కృతక= (క్రీడించుటకు) కృత్రిమ; శైలంబులన్= పర్వతాలను; ఆరోహించుచున్= (విహారంగా) ఎక్కుతూ; పల్లవ= చిగురుటాకుల; పీఠంబులన్= పీటలపై; పరిశ్రమంబు= అలసట; పుచ్చుచున్= తీర్చుకొంటూ; లతా= తీగలల్లుకున్న; సౌధభాగంబులన్= ఇండ్లలోని (ఆయా) తావులలో; పొడసూపుచున్= (దాగుడుమూతలాటలో) కనబడుతూ; ఉన్నత= ఎత్తైన; కేతకీ= మొగలి; స్తంభంబుల= బోదెలకు; ఒరగుచున్= ఆనుకుంటూ; పుష్ప= పూల; దళ= రేకులతో; రచిత= తయారైన; వాతాయనంబులన్= గవాక్షాలలో; తొంగిచూచుచున్= ఎదుటివారికి కనపడకుండానక్కిచూస్తూ; కమలకాండ

పాలికలన్= లేత తామర మొక్కలను; ఆలంబించుచున్= పట్టుకొంటూ; చంపక= సంపెంగ (పొదల); దేహళి= గడపలలో; నిలువంబడుచున్= నిలబడుతూ; కదళికా పత్ర కవాటంబునన్= అరటిఆకు తలుపులను; ఉద్ఘాటించుచున్= తెరుస్తూ; పరాగ= పుప్పొడిచే; నిర్మిత= చేయబడిన; సాలభంజికా= బొమ్మల; నివహంబులన్= గుంపులను; ఆదరించుచున్= మన్నిస్తూ; మణికుట్టిమంబులన్= రత్నాల కట్టడపునేలపై; మురియుచున్= కులుకుగానడచుచు; మురియు= నడుచునప్పటి కులుకు; చంద్రకాంత= చలువరాతి; వేదికలన్= తిన్నియల; ఎలయుచున్= చేరుతూ; రత్నపంజర= రతనాలపంజరములలోని; శారికానివహంబులకున్= గోరువంకలగుంపులకు; చదువులు= పలుకులు; చెప్పుచున్= నేర్పుతూ; కోరిన= ఇష్టమున్న; క్రియన్= విధంగా; చూచుచున్= చూస్తూ; చూచిన క్రియన్= కనినట్లుగానే; మెచ్చుచున్= మెచ్చుకొంటూ; మెచ్చినక్రియన్= మెచ్చినదానిపై; వెఱఁగుపడుచున్= ఆశ్చర్యపడుతూ; వెఱఁగుపడినక్రియన్= అచ్చెరువొందినక్రియను; మఱచుచున్= మైమరుస్తూ; మఱవక= మరచిపోకుండా; ఏకాంతంబగు= రహస్యంబగు; ఆ+వన+అంతంబునన్= ఆతోటలో; అనంత= అంతులేని; విభ్రమంబులన్= విలాసాలతో; జగన్మోహినియై= జగత్తునే మోహింపచేయునదై; విహరించుచున్+ఉన్న= విహరిస్తూ ఉన్న; సమయంబునన్= వేళలో.

**తా :** ఈ ప్రకారంగా మన్మథుని బాణాలు హద్దుదాటి వేటాడగా (కామహారి అనే) శివుని పెద్దబిరుదు వ్యర్థమై పోయేటట్లు మోహిని ముడిచిన కొప్పుముడి ఊడిపోయింది. కురులు భుజాలపైన మెడలపైన చెల్లా చెదరయి కదలాడినాయి. ఆమె నొసటి మీది కస్తూరిబొట్టు కరిగిపోయింది. అందమైన మోమువెలుగులు అన్ని దిక్కుల ప్రసరించాయి. చిరునవ్వులు చిందులాడుతున్నాయి. లేత చెమటలతో తొట్రుపడుతూ పులకలు మొలకలెత్తినాయి. మనసునకు ముదాన్ని కలిగించే బంతిని అందమైన చేతులతో అందుకొన్నది. ఆ బంతిని ఎదకు ఆనించుకుంది, చెక్కిలిపై చేర్చుకుంది, చిబుకానికి తాకించుకుంది, చనుమొనలపై అదిమి పట్టుకుంది, గోరులతో మీటింది. అందమైన చేతులలోని మెల్లమెల్లగా కదలాడే మేలిమి బంగారుకంకణాలు ఝణఝణ ధ్వని చేయగా కుచకలశాలు ఒకదానితో ఒకటి ఒరుసుకొనగా కుడి ఎడమలకు త్రుళ్లిపడేటట్లు చెండును ఒయ్యారంగా పైకెగురవేసింది. తనకు తానే చిన్ని చిన్ని పందాలు కట్టింది. సన్నని నడుము కదలాడేటట్లు మెడలోని హారాలు చిక్కుపడేటట్లు తిరుగులాడింది. అలా సంచరించేటప్పుడు చెవుల కమ్మల వెలుగులు చెక్కిళ్లపై చిందులాడినాయి. ఆమె గుండ్రంగా తిరుగుతూ పుట్టచెండును పట్టుకొని పక్కలకు కదలుతోంది. అప్పుడు ఆమె పైటచెంగు జారిపోయింది. ఒడ్డాణంలోని బంగారు చిరుగంటలు మ్రోగినాయి. కాలిఅందెలు గల్లుగల్లుమన్నాయి. చేతిమురువుల రతనాలు తళుక్కుమన్నాయి. ఆమె వెనువెంట పరుగెత్తి బంతిని పట్టుకొంటూ, పట్టుకొన్న బంతిని నేలపై చరస్తూ, అది పై కెగిరినపుడు రెండు చేతులూ చేర్చి చాలసార్లు కొట్టుకున్నది. బంతి ఎగిరేటప్పుడు, పడేటప్పుడు పొడవైన వలలు వేసి లాగుతున్నట్లు సోగచూపులు వ్యాపింపచేస్తున్నది. చెండును కొడుతూ ఒకటినుండి వేయిదాకా నేర్పుతో లెక్కపెడుతోంది. మోహిని ఎర్రతామరలవంటి తన కాలి ఎర్రనివెలుగులతో తూరుపుకొండపైని సూరీడును గుర్తుకు చేస్తుంది. అందమైన ఆమె మోము చందురుని వెన్నెల వెలుగులతో చంద్రమండలాలను కల్పిస్తుంది. అప్పుడప్పుడు కుచకలశాల మిట్టపల్లాలనుండి జారిపోయిన పైటకొంగును సరిచేసుకుంటున్నది. చెక్కిళ్ళపై చిందే చెమటబొట్లను కొనగోళ్లతో ఎగజిమ్ముతున్నది. ఎర్రని పెదవిని దొండపండుగా భ్రమించి వచ్చిన రాచిలుకలను అదలిస్తున్నది. పద్మం వంటి ముఖంలోని పరిమళాలకోసం మూగిన కొదమ తుమ్మెదలను అదలిస్తున్నది. అందమైన మందగమనం నేర్చుకోవటానికి వచ్చిన రాజహంసల జంటను గెంటుతున్నది. సోగచూపులకోసం ముచ్చటపడి వచ్చిన నెమళ్లజంటలకు దూరంగా వెళుతున్నది. పొదరిండ్ల దగ్గరకు వెళ్లకుండ చిగురులవంటి చేతులకు మనసుపడి వచ్చిన కోయిలజంటలకు దూరమౌతోంది. తీగల ఉయ్యాలపై ఊగుతూ పూల గురివెంద గుబురులపై ఎక్కుతూ, పుప్పొడి గుట్టలను దాటుతూ, మకరందాల మడుగులు గడుస్తూ, క్రీడా

పర్వతాలపై విహరిస్తూ, చిగురుటాకుల పీటలపై సేదతీర్చుకుంటూ, తీగ ఇండ్లలో దాగుడు మూతలాడుతూ, మొగలిబోదెలకు ఆనుకొంటూ, పూలరేకుల గవాక్షాలలో తొంగిచూస్తూ, మెట్టతామరల మొక్కలను తాకుతూ, సంపెంగ పొదలగడపలలో నిలబడుతూ, అరటాకుల ద్వారాలు తెరుస్తూ, కమ్మ పుప్పొడి బొమ్మలను బుజ్జగిస్తూ, రతనాలబాటలపై విహరిస్తూ, చలువరాతి తిన్నియలను సమీపిస్తూ, రత్న పంజరాలలోని గోరువంకలకు పలుకులు నేర్పుతూ, ఇచ్చవచ్చిన దానిని చూస్తూ, చూచిన దానిని మెచ్చుకుంటూ, మెచ్చుకొన్న దానిపై అచ్చెరువు కనబరుస్తూ, మైమరుస్తూ, మైమరపిస్తూ, ఆ వాల్గంటి ఒంటరిగా ఆ తోటలో అంతులేని అందచందాలతో జగన్మోహినియై విహారం సాగించింది.

**ఆ. వాలుఁగంటి వాఁడి వాలారుఁజూపుల, శూలి ధైర్యమెల్లఁగోలుపోయి**
**తఱలి యెఱుకలేక మఱచె గుణంబుల, నాలి మఱచె నిజగణాలి మఱచె. 397**

**ప్రతి :** వాలు+కంటి= వాలుగ చేపవంటి కనులుగల మోహిని; వాఁడి= పదునైన; వాలారున్= ఇంపైన; చూపులన్= చూపులవల్ల; శూలి= (త్రిశూలముగల) శివుడు; ధైర్యమెల్లన్= ధీరత్వాన్నంతా (నిగ్రహాన్ని); కోలుపోయి= పోగొట్టుకొని; తఱలి= చలించి; ఎఱుక లేక= స్మరణదప్పి; గుణంబులన్= గుణాలను; మఱచెన్= మరచిపోయినాడు; ఆలిన్= పెళ్లాన్నీ; మఱచెన్= మరచినాడు; నిజగణ+ఆలి= తన (ప్రమథ) గణాలసముదాయాన్నీ, మఱచెన్= విస్మరించినాడు.

**తా :** మోహిని వాలుచూపులపదనుచేత శంకరుని ధైర్యం సడలిపోయింది. అతడు తనను తాను మరచినాడు. తన అనుచరులనూ మరచినాడు. చివరకు 'అర్ధాంగి'ని కూడా మరచిపోయినాడు.

**విశే :** వాలుఁగంటి= కత్తిలావాడియైన కన్నులు కలది. పదునైన చూపులు కత్తిలాంటి కన్నులకుంటాయి. మోహిని జంటవాలుగంటి కాగా శివుడు ముమ్మొనవాలుకాడు. అంటే త్రిశూలం కలవాడు. కనుకనే పద్యంలో 'శూలి' అనే పదం ప్రయోగించబడింది. జంటవాలుగంటి పదును చూపులకు ముమ్మొనవాలుకాని (శూలి) ధైర్యం కోలుపోయిందన్నమాట. మోహిని చూపులయొక్క గొప్పదనం చెప్పబడిందిక్కడ. 'వాలుగంటి', 'శూలి' పదాలు సాభిప్రాయ ప్రయోగాలు. ఇది సర్వతః ప్రాసపద్యం. ప్రాస అంటేకూడా కత్తి అని అర్థం. (జంట) వాలుగంటి, శూలి (ముమ్మొనవాలుకాడు) ఇవన్నీ కత్తులకు అంటే ప్రాసలకు సంబంధించిన పదాలు. అందుకే ఇది సర్వతః ప్రాస పద్యం. పోతనగారి ప్రాసక్రీడావిలాసాలకు ఉదాహరించదగ్గ పద్యాలలో ఈ ఆటవెలది ఒకటి.

**వ. అప్పుడు. 398**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయాన

**తా :** ఆ సమయాన.

**ఆ. ఎగురవైచి పట్ట నెడలేమిఁ జే దప్పి, వ్రాలు బంతిఁగొనఁగ వచ్చు నెడను**
**బడఁతి వలువ వీడి పడియె మారుతహతిఁ, జంద్రధరుని మనము సంచలింప. 399**

**ప్రతి :** ఎగురవైచి= బంతిని ఎగురవేసి; పట్టన్= పట్టుకోవడానికి; ఎడలేమిన్= వ్యవధానం లేకపోవడంవల్ల; చే+తప్పి= చేతికి చిక్కక / జారిపోయి; వ్రాలు= పడిపోవు; బంతిన్= పుట్టచెండును; కొనఁగన్= తీసుకోవడానికి; వచ్చునెడను= వస్తుండగా; మారుతహతిన్= గాలితాకిడికి; పడఁతి= మోహినియొక్క; వలువ= చీర; వీడిపడియెన్= ఊడిపడింది; చంద్రధరుని= చందురుని తలపై ధరించిన శివుని; మనము= మనస్సు; సంచలింపన్= మిక్కిలి కంపించగా.

**తా :** మోహిని బంతిని ఎగురవేసింది. దానిని పట్టుకోవడానికి వ్యవధానం లేకపోవటంచే అది చేతికి చిక్కక జారిపోయింది. దానిని తీసుకోవడానికి వస్తుండగా గాలి తాకిడికి ఆమె చీర ఊడిపోయింది. అప్పుడు శివుని మనస్సు కంపించిపోయింది.

**మ. రుచిరాపాంగిని వస్త్రబంధనపరన్ రోమాంచవిభ్రాజితం**
**గుచభారానమితం, గరద్వయపుటీగూఢీకృతాంగిం, జల**
**త్కచబంధం, గని మన్మథాతురత నాకంపించి శంభుండు ల**
**జ్జ చలింపం, దన కాంత సూడఁ, గదిసెంజంద్రాస్య కేల్దమ్మికిన్. 400**

**ప్రతి :** రుచిర+అపాంగిని= వెలుగులీను కడకంటి చూపుదానిని; వస్త్రబంధనపరన్= చీరను కట్టుకొంటున్నదానిని; రోమాంచవిభ్రాజితన్= పులకించిన మేనుతో ప్రకాశిస్తున్నదానిని, కుచభార+ఆనమితన్= చనుల బరువుతో వంగినదానిని; కరద్వయపుటీ గూఢీ కృత+అంగిన్= రెండు చేతుల కలయికతో కప్పుకున్న అంగము కలదానిని; చలత్+కచబంధన్= కదలాడు కొప్పుముడి కలదానిని; కని= చూచి; శంభుండు= శివుడు; మన్మథ+ఆతురతన్= కామావేశంతో; ఆకంపించి= పూర్తిగా చలించి; లజ్జ చలింపన్= సిగ్గుతో చలించగా; తన కాంత= తన భార్య; చూడన్= చూస్తున్నా కూడా; చంద్ర+ఆస్య= చందురునివంటి మోముగల మోహినియొక్క; కేల్+తమ్మికిన్= కరకమలాన్ని పట్టుకోవడానికి; కదిసెన్= ముందుకు వెళ్ళినాడు.

**తా :** కడగంటి కాంతులదానిని, చీరకట్టుకొనడానికి ప్రయత్నిస్తున్న దానిని, చనులబరువుతో వంగినదానిని, రెండు చేతులతో దాచుకొన్న అంగం కలదానిని, కొప్పుముడి వీడి వ్రేలాడుతున్నదానిని, ఆ మోహినిని చూచి శివుడు కామావేశంతో చలించినాడు. సిగ్గుపడి తన భార్య చూస్తున్నా కూడా చందురునివంటి మోముగల ఆ మోహిని కేలుదామరను పట్టుకోవడానికి ముందుకు వెళ్లినాడు.

**ఆ. పదము సేరవచ్చు ఫాలాక్షుఁ బొడగని, చీరవీడి పడిన సిగ్గుతోడ**
**మగువ నగుచుఁదరుల మాటున డాఁగెను, వేల్పుఱేఁడు నబల వెంటఁ బడియె. 401**

**ప్రతి :** పదము= అడుగుదూరం; చేరవచ్చు= సమీపిస్తున్న; ఫాల+అక్షున్= నొసటకన్నుగల శివుని; పొడగని= చూచి; చీర= వలువ; వీడి= ఊడి; పడినన్= పడిపోగా; సిగ్గుతోడన్= బిడియంతో; మగువ= మోహిని; నగుచున్= నవ్వుతూ; తరుల= చెట్ల; మాటునన్= చాటున; డాగెను= దాగింది; వేల్పుఱేడు= (ముక్కంటి) దైవరాట్టు; అబల= మోహినియొక్క; వెంటన్+పడియెన్= వెంటబడినాడు.

**తా :** అడుగుదూరంలో సమీపిస్తున్న శివుని చూచింది మోహిని. చీర ఊడి పడిపోయిన సిగ్గుతో నవ్వుతూ చెట్లచాటున దాగింది. ముక్కంటి ఆ వాల్గంటి వెంటపడినాడు.

**మ. ప్రబలోద్యత్కరిణిం గరీంద్రుఁడు రమింపన్ వచ్చు లీలన్ శివుం**
**డబలా! పోకుము; పోకుమీ యనుచు డాయంబాఱి కెంగేలఁ ద**
**త్కబరీబంధము వట్టి సంభ్రమముతోఁగౌఁగిళ్ల నోలార్చె నం**
**త బహిఃప్రక్రియ నెట్టకేనిఁగదియందద్బాహునిర్ముక్తయై. 402**

**ప్రతి :** ప్రబల= మిక్కిలిబలం కలిగిన అంటే యౌవనంలోఉన్న; ఉద్యత్= ప్రకాశిస్తున్న; కరిణిన్= ఆడుఏనుగుతో; కరి+ఇంద్రుడు= (మదించిన) మగఏనుగు; రమింపన్= క్రీడించడానికి; వచ్చు= వెంటాడివచ్చు; లీలన్= విధంగా; శివుఁడు= పరమేశ్వరుడు; అబలా= బేలా!; పోకుము= పోవద్దు; పోకుమీ= పోవద్దూ; అనుచున్= అంటూ; డాయన్= దగ్గరకు; పాఱి= పరుగెత్తి; కెంపు+కేలన్= ఎర్రనిచేతితో; తత్= ఆ మోహిని; కబరీబంధమున్= కొప్పుముడిని; పట్టి= పట్టుకొని; సంభ్రమముతోన్= వేగిరపాటుతో; కౌఁగిళ్లన్= కౌగిళ్ళలో; ఓలార్చెన్= పరవశింపచేసినాడు; బహిః+ప్రక్రియన్+ఎట్టకేని= ఎట్టకేలకు రతిక్రీడకు పూనుకోబోయినాడు; అంతన్= అంతలో ఆమె; తత్= ఆ శివుని; బాహు నిర్ముక్తయై= బాహుబంధం నుంచి విడివడి...

**తా :** యౌవనంలో ఉన్న ఆడుఏనుగును కామోద్రేకంతో చేరవచ్చు మదించిన మగఏనుగువలె, శివుడు మోహినివెంటపడి 'బేలా! పోవద్దు, పోవద్దు' అంటూ దగ్గరకు పరుగెత్తి తనచేతితో ఆమె కొప్పును పట్టుకొని, ఆత్రంతో కౌగిలించుకొని రతిక్రీడకు పూనుకోబోయినాడు. మోహిని శివుని కౌగిలినుండి వదలించుకొని

**సీ. వీడి వెన్నున నాడు వేణీభరంబుతో జఘనభారాగతశ్రాంతితోడ**
**మాయావధూటియై మఱలిచూచుచుఁ బాఱు విష్ణునద్భుతకర్ము వెంటఁదగిలి**
**యీశాను మరల జయించె మరుండనఁ గరిణి వెన్నను కరి కరణిఁదాల్చి**
**కొండలు నేఱులుఁగొలఁకులు వనములు దాఁటి శంభుఁడు సనందన్మహాత్ము**

**తే. నిర్మలామోఘవీర్యంబు నేలమీఁదఁ బడిన చోటెల్ల వెండియుఁబైఁడి యయ్యె**
**ధరణి వీర్యంబు వడఁదన్నుఁదా నెఱింగి దేవ మాయాజడత్వంబు దెలిసె హరుఁడు. 403**

**ప్రతి :** వీడి= ఊడిపోయి; వెన్నునన్= వీపున; ఆడు= నాట్యమాడు; వేణీ భరంబుతోన్= జడబరువుతో; జఘన= పిరుదుల; భార= బరువువల్ల; ఆగత= పొందిన; శ్రాంతితోడన్= అలసటతో; మాయావధూటియై= మాయా మోహినీరూపాన్ని తాలిచి; మఱలి= తిరిగి; చూచుచున్= చూస్తూ; పాఱు= పరుగెత్తే; విష్ణున్= హరిని; అద్భుతకర్మున్= అద్భుతలీలుని; వెంటన్+తగిలి= వెంబడించి; ఈశాను= శివుని; మరల= తిరిగీ; జయించెన్= గెలిచెను; మరుండు+అనన్= మన్మథుడనగా; కరిణి= ఆడ ఏనుగు; వెన్+చను= వెంబడివెళ్లు; కరి= మగ ఏనుగు; కరణిన్= వలె; తాల్చి= కవిసి; కొండలున్= గిరులును; ఏఱులున్= నదులూ; కొలఁకులు= కొలనులు; వనములు= అడవులు; దాఁటి= తరించి; శంభుఁడు= హరుడు; చనన్= వెళ్లగా; తద్+మహాత్ము= ఆ మహాత్ముని (హరుని); నిర్మల= స్వచ్ఛమైన; అమోఘ= అమోఘమైన; వీర్యంబు= తేజస్సు; నేలమీఁదన్= భూమిపైన; పడినచోటు+ఎల్లన్= పడిన తావంతటా; వెండియున్= రజతమూ; పైఁడి= అపరంజీ; అయ్యెన్= అయ్యింది; ధరణిన్= భూమిమీద; వీర్యంబు+పడన్= తేజస్సు పడగానే; తన్నున్+తాను+ఎఱింగి= తన్నుతాను తెలిసికొని; దేవ= పరమాత్ముని; మాయా= మాయవలన కలిగిన; జడత్వంబున్= మైమరపును; హరుఁడు+తెలిసెన్= శివుడు తెలిసికొన్నాడు.

**తా :** మోహిని జడకట్టువీడి (ఆమె) వీపుపై వ్రేలాడు తున్నది. పిరుదుల బరువు వలన అలసిపోతూ ఉన్నది. మరల మరల కవ్వింపుగా వెనుదిరిగి చూస్తున్నది. విభ్రమాలు ప్రదర్శించే జగన్మోహినివెంట ఆడఏనుగు వెంట మగమదపుటేనుగు వలె శివుడు పరుగెత్తినాడు. అది – మన్మథుడు మరల శివుని జయించెనా అనిపించింది. అలా పరుగెత్తుతూ కొండలు అడవులు, సెలయేరులు, సరస్సులు దాటి వెళ్లనపుడు శివుని అమోఘమైన వీర్యం స్ఖలనమై నేలపై పడింది. అది పడిన

తావెల్లా భూమిపై వెండీ బంగారం అయింది. వీర్యం పతనమైన వెంటనే శివుడు తనంతకు తాను తెలివి తెచ్చుకున్నాడు. ఇదంతా విష్ణుదేవుని మాయవలన కలిగిన మోహమని గ్రహించినాడు.

**విశే :** మూలంలోని 11వ అధ్యా-31, 32,34 మూడు శ్లోకాలు పై సీసపద్యంగా అనూదితమైనవి. శంభుని వీర్యం స్ఖలితమైన తావులు రజత స్వర్ణ ధాతువులకు ఆలవాలమని తెలుస్తున్నది.

**క. జగదాత్మకుఁడగు శంభుఁడు, మగిడెను హరి నెఱిఁగి తనదు మాహాత్మ్యమునన్**
**విగతత్రపుఁడై నిలిచెను, మగువతనంబుడిగి హరియు మగవాఁడయ్యెన్. 404**

**ప్రతి :** జగత్+ఆత్మకుడు+అగు= జగత్తును ఆత్మగా కలిగినవాడయిన; శంభుఁడు= శివుడు; తనదు= తనయొక్క; మాహాత్మ్యమునన్= మహిమవల్ల; హరిన్+ఎఱిఁగి= విష్ణు (మాయ) నెరిగి; మగిడెను= వెనుదిరిగినాడు; హరియున్= హరికూడా; విగతత్రపుఁడై= సిగ్గు విడిచినవాడై; మగువతనంబు+ఉడిగి= స్త్రీ రూపాన్ని విడిచిపెట్టి; మగవాడు+అయ్యెన్= (పరమపురుషుడయినాడు) మగవాడుగ మారిపోయినాడు.

**తా :** జగదాత్మకుడయిన శివుడు తన మహిమవల్ల విష్ణుమాయను తెలుసుకొని వెనుదిరిగినాడు. హరికూడా సిగ్గువిడిచినవాడై స్త్రీ రూపాన్ని విడిచిపెట్టి మగవాడుగ మారిపోయినాడు.

**విశే :** మోహినీ రూపంలో స్త్రీ సహజమైన సిగ్గుకూడా హరికి ఉండేది. మోహినీ రూపంతో పాటు ఆ సిగ్గునుకూడా హరి వదలినాడు. పరమపురుషుడు నిర్వికారుడు కదా!

**ఆ. కాము గెలువవచ్చుఁగాలారి గావచ్చు,మృత్యుజయము గలిగి మెఱయవచ్చు**
**నాఁడువారి చూపుటంపఱ గెలువంగ, వశము గాదు త్రిపురవైరి కైన. 405**

**ప్రతి :** కామున్= మన్మథుని; గెలువవచ్చున్= జయించవచ్చు; కాల+అరి= యమునికి శత్రువు, కావచ్చు, (యముడిని ధిక్కరించవచ్చు); మృత్యుజయము+కలిగి= చావును జయించి; మెఱయవచ్చున్= వెలుగొందవచ్చు; ఆడువారి= మగువల; చూపుటంపఱన్= చూపుల తూపులను; గెలువంగన్= జయించగా; త్రిపురవైరికి+ఐనన్= త్రిపురాసురులను జయించిన శివునికైన; వశము+కాదు= శక్యంకాదు.

**తా :** మదనుని జయించవచ్చు. యముడిని ధిక్కరించవచ్చు. మృత్యుంజయుడు కావచ్చు. కానీ ఆడువారి చూపులు అనే బాణాలను జయించడం త్రిపురవైరి అయిన శివునికికూడా సాధ్యం కాదు.

**విశే :** శివుడు కాముని గెలిచినాడు, యముడిని ధిక్కరించినాడు, మృత్యుంజయుడైనాడు. అయినా – మోహిని చూపుల తూపులను జయించటానికి సాధ్యం కాలేదు. భాగవతంలోని మోహినీవిలాసం అంతా చదివితే తెలియవచ్చే సారాంశపద్యం ఇది. ఈ పద్యంలో 'ఆడువారి చూపుటంపఱగెలువంగ వశముగాదు' అనేది సిద్ధాంతం.

తెలుగులో తక్కెళ్లపాటి లింగనకవి వ్రాసిన 'జగన్మోహినీవిలాసము' విష్ణువుయొక్క మోహినీ అవతారాన్ని గూర్చి వ్రాసినదే!

**వ. ఇట్లు పురుషాకారంబు వహించిన హరి హరున కిట్లనియె. 406**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగ; పురుష+ఆకారంబు= (పరమ) పురుషుని (నిజ) రూపాన్ని; వహించిన= ధరించిన; హరి= విష్ణువు; హరునకు= శివునితో; ఇట్లు+అనియెన్= ఇట్లన్నాడు.

**తా :** ఈ విధంగా మోహినీరూపాన్ని చాలించిన విష్ణువు శివునితో ఇలా అన్నాడు.

**సీ. 'నిఖిలదేవోత్తమ! నీ వొక్కరుఁడు దక్క నెవ్వఁడు నా మాయ నెఱుఁగ నేర్చు?**
**మానినియైన నా మాయచే మునుఁగక ధృతిమోహితుండవై తెలిసి తీవు**
**కాలరూపంబునఁగాలంబుతోడ నాయందును నీ మాయ యధివసించు**
**నీ మాయ నన్ను జయింప నేరదు నిజ మకృతాత్ములకు నెల్ల ననుపలభ్య**

**తే. మిపుడు నీ నిష్ఠపెంపున నెఱిఁగి' తనుచు, సత్కరించిన సఖ్యంబు సాల నెఱపి**
**దక్షతనయ గణంబులుఁదన్నుఁగొలువ, భవుఁడు విచ్చేసెఁదగ నిజభవనమునకు. 407**

**ప్రతి :** నిఖిల దేవ+ఉత్తమ= అందరు వేల్పులలో శ్రేష్ఠుడా!; నీవు; ఒక్కరుఁడవు= ఒక్కడవు; తక్కన్= తప్ప; ఎవ్వఁడు= ఎవరుకూడా; నామాయన్= నాలీలను; తెలియన్= తెలియగా; నేర్చు= నేర్చును?; మానిని+ఐన= మోహినిగా మారిన; నా= నాయొక్క; మాయచేన్= లీలలో; మునుఁగక= మునిగిపోక; ధృతి= ధైర్యంతో; మోహితుండవు+ఐ= మాయలో చిక్కికూడా; తెలిసితి+ఈవు= తెలుసుకున్నావు; కాలరూపంబునన్= కాలస్వరూపాన; కాలంబుతోడన్= కాలంతోపాటు; నీమాయ= నీలీల; నాయందునున్= నాలో కూడా; అధివసించున్= చేరుతుంది; ఈ మాయ= ఈ లీల; నన్ను; జయింపనేరదు= గెలువలేదు; నిజము= నిక్కము; అకృతాత్ములకున్= అల్పజ్ఞులకు; ఎల్లన్= అందరకూ; అనుపలభ్యము= దొరకనిది; ఇపుడు= ఇప్పుడు; నీ= నీయొక్క; నిష్ఠ= శ్రద్ధ; పెంపునన్= పాలనంవల్ల; ఎఱిగితి(వి)+అనుచు= ఎరిగితివంటూ; సత్కరించినన్= గౌరవించగా; సఖ్యంబున్= స్నేహాన్ని; చాలనెఱపి= బాగా ప్రకటించి; దక్షతనయ= సతీదేవి; గణంబులు= ప్రమథగణాలు; తన్నున్= తనను (శివుని), కొలువన్= సేవింపగా; భవుఁడు= శివుడు; తగన్= యుక్తరీతిగా; నిజభవనమునకున్= సొంతనివాసానికి; విచ్చేసెన్= వెళ్ళినాడు.

**తా :** 'సకలదైవత శ్రేష్ఠా! నీవొక్కడవు తప్ప నా మాయను ఇంకెవ్వడు తెలుసుకొనలేడు. మోహినీరూపాన్ని ధరించిన నామాయలోపడి మోసపోక ధైర్యంతో పొరపాటును తెలుసుకున్నావు. ఈ మాయ కాలస్వరూపమై కాలంతోపాటు నాయందు అధివసించి ఉంటుంది. ఈ మాయ నన్ను గెలువలేదు. అల్పజ్ఞులు తెలుసుకొనలేని నామాయను నీవు తెలుసుకున్నావు' అంటూ విష్ణువు శివుని గౌరవించినాడు. స్నేహభావంతో శివుడు సంతోషించి సతీదేవితో ప్రమథగణాల సేవలందుకొంటూ తన నివాసానికి వెళ్ళినాడు.

**శా. పారావారముఁద్రచ్చుచో గిరిసముద్వాహార్థమై కచ్ఛపా**
**కారుండైన రమేశువర్తనము నాకర్ణింపఁగీర్తింప సం**
**సారాంభోనిధిలో మునుంగు కుజనుల్ సంశ్రేయముంబొంది వి**
**స్తారోదారసుఖంబుఁజెందుదురు తథ్యంబింతయున్ భూవరా! 408**

**ప్రతి :** భూవరా= పరీక్షిన్మహారాజా!; పారావారమున్= కడలిని; త్రచ్చుచో= మథించేటప్పుడు, గిరి= (మునిగిపోతున్న) మందర పర్వతాన్ని; సముద్వాహార్థమై= చక్కగా ఎత్తటం కోసం; కచ్ఛప+ఆకారుండైన= తాబేలు రూపాన్ని ధరించిన;

రమా+ఈశ (రమేశు)= హరియొక్క; వర్తనమున్= చరిత్రను; ఆకర్ణింపన్= వినినా; కీర్తింపన్= కీర్తించినా; సంసార+ అంభోనిధిలోన్= సంసారమనే సముద్రంలో; మునుంగు= మునిగిపోయే; కుజనుల్= అల్పజనాలు; సంశ్రేయమున్= గొప్పమేలును; పొంది= అంది; విస్తార= విస్తృతమైన, (విశేషమైన); ఉదార= గొప్ప; సుఖంబున్= సౌఖ్యాన్ని; చెందుదురు= పొందుతారు; ఇంతయున్= ఇదంతాకూడా; తథ్యంబు= నిక్కము.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! పాలసముద్రాన్ని చిలికేటప్పుడు కుంగిపోతున్న మందర పర్వతాన్ని మోసి చక్కగా నిలబెట్టేందుకు కూర్మరూపం ధరించిన విష్ణులీలలను కీర్తించినా, విన్నా శ్రేయస్సు కలుగుతుంది. సంసారసముద్రంలో మునిగి ఉండి పాపంతో బతుకుతున్న జనాలు కూర్మావతార విశేషాలు వినినా, కీర్తించినా చక్కని మేలును సౌఖ్యాన్ని పొందుతారు.

**మ. ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి పీయూషముం**
**జలితాపన్నులకున్ సురోత్తములకుం జక్కన్ విభాగించి ని**
**ర్మలరేఖన్ విలసిల్లు శ్రీ విభునిఁ దన్మాయావధూరూపముం**
**దలఁతున్ మ్రొక్కుదు నాత్మలోన దురితధ్వాంతార్కరూపంబుగన్. 409**

**ప్రతి :** దైత్యులను= రాక్షసులను; ఎలమిన్= వికాసవంతమైన; ఆడురూపమునన్= సుందరిరూపంతో; మోహింపించి= వలపింప చేసి; చలిత+ఆపన్నులకున్= ఆపదలతో అల్లాడుతున్న; సుర+ఉత్తములకున్= దేవవరులకు; పీయూషమున్= సుధను; చక్కన్= మేలైన రీతిలో; విభాగించి= పంచి; నిర్మల= స్వచ్ఛమైన; రేఖన్= శరీరసౌష్ఠవంతో (దివ్యమైన రూపంతో); విలసిల్లు= ప్రకాశించే; శ్రీవిభునిన్= శ్రీపతిని; తన= తనయొక్క; మాయావధూరూపమున్=లీలామోహినీ అవతారాన్ని; ఆత్మలోనన్= హృదయంలో; దురిత ధ్వాంత+అర్క రూపంబుగన్= పాపమనే చీకట్లను పోగొట్టే సూర్యునివలె భావించి; తలంతున్= స్మరింతును; మ్రొక్కుదున్= నమస్కరిస్తాను.

**తా :** వికాసవంతమైన సుందరి (మోహిని) రూపంతో రాక్షసులను మోసగించి (మోహించి) ఆపదలతో వణకిపోతున్న దేవతలకు (శ్రీహరి) చక్కని పద్ధతిలో అమృతాన్ని పంచాడు. స్వచ్ఛమైన శరీర సౌష్ఠవంతో, దివ్యతేజస్సుతో ప్రకాశిస్తూ లీలామోహినీ అవతారాన్ని ధరించిన శ్రీపతిని పాపపు చీకట్లను రూపుమాపే సూర్యుని స్వరూపంగా భావించి హృదయంలో స్మరిస్తాను నమస్కరిస్తాను.

**వ. అని చెప్పి శుకుండిట్లనియె. 410**

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా; చెప్పి= పలికి; శుకుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పినాడు.

**తే. నరవరాధీశ! యిప్పుడు నడుచుచున్న, వాఁడు సప్తమమనువు వైవస్వతుండు**
**శ్రాద్ధదేవుం డనందగు జనవరేణ్య!, పదురు నందను లతనికిఁబ్రకటబలులు. 411**

**ప్రతి :** నరవర+అధీశ= ఓ రాజశ్రేష్ఠా!; ఇప్పుడు= వర్తమానంలో; నడుచుచున్నవాడు= ప్రవర్తిస్తున్నట్టివాడు; సప్తమ= ఏడవ; మనువు; వైవస్వతుండు= వైవస్వతుడనేవాడు; శ్రాద్ధదేవుఁడు+అనందగున్= ఆయనను శ్రాద్ధదేవుడని అంటారు; జనవరేణ్య= రాజ తిలకా!; అతనికిన్= ఆయనకు; ప్రకట= ప్రసిద్ధులైన; బలులు= బలవంతులయిన; పదురు= పదిమంది; నందనులు= కుమారులు.

**తా :** ఓ రాజా! ప్రస్తుత మన్వంతరాన్ని ఏడవమనువైన వైవస్వతుడు నిర్వహిస్తున్నాడు. ఆయనను శ్రాద్ధదేవుడని అంటారు. ఆయనకు ప్రసిద్ధులైన, మహాబలవంతులయిన పదిమంది కుమారులున్నారు.

**వ. వార లిక్ష్వాకుండును, నభగుండును, ధృష్టుండును, శర్యాతియు, నరిష్యంతుండును, నాభాగుండును, దిష్టుండును, గరూశకుండును, బృషద్ధ్రుండును, వసుమంతుండును నను వారు పదుగురు రాజులు; పురందరుండను వాఁడింద్రుం; డాదిత్య మరుదశ్వి వసు రుద్ర సంజ్ఞలు గలవారు దేవతలు; గౌతమ కశ్యపాత్రి విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ వసిష్ఠ లనువారు సప్తర్షులయి యున్నవా; రందుఁ గశ్యపున కదితి గర్భంబున విష్ణుండు వామనరూపుండై జనియించి యింద్రావరజుం డయ్యె; నిప్పు డేడు మన్వంతరంబులు సెప్పంబడియె; రాఁగల మన్వంతరంబులును శ్రీహరి పరాక్రమంబునుం జెప్పెద; దత్తావధానుండవై విను మని శుకుం డిట్లనియె. 412**

**ప్రతి :** వారలు= ఆ వైవస్వత మనువు కుమారులు; ఇక్ష్వాకుండును= ఇక్ష్వాకుడూ; నభగుండును= నభగుడనే పేరుగల రాజు; ధృష్టుండును= ధృష్టుడూ; శర్యాతియు= శర్యాతీ; నరిష్యంతుండును= నరిష్యంతుడూ; నాభాగుండును= నాభాగుడునూ (నభగునికుమారుడు నాభాగుడు); దిష్టుండును= దిష్టుడూ; కరూశకుండును= కరూశకుడూ; పృషద్ధ్రుండును= పృషద్ధ్రుడూ; వసుమంతుండును= వసుమంతుడూ; అనువారు= అనేవారలు; పదుగురు= పదిమంది; రాజులు= రాజులైనారు; పురందరుండనువాడు= పురందరుడు అనేవాడు; ఇంద్రుండు= ఇంద్రుడైనాడు; ఆదిత్య= ఆదిత్యులూ; మరుత్= మరుత్తులూ; అశ్వి= అశ్వినులూ; వసు= వసువులూ; రుద్ర= రుద్రులూ; సంజ్ఞలు= (అనే) గుర్తులు; కలవారు= ఉన్నవారు; దేవతలు= వేలుపులూ; గౌతమ= గౌతముడూ; కశ్యప= కశ్యపుడూ; అత్రి= అత్రీ; విశ్వామిత్ర= విశ్వామిత్రుడూ; జమదగ్ని= జమదగ్నీ; భరద్వాజ= భరద్వాజుడూ; వసిష్ఠులనువారు= వసిష్ఠుడూ అనేవారు; సప్తర్షులయి= ఏడుగురు ఋషులై; ఉన్నవారు= ఉన్నారు; అందున్= అందులో (వారిలో); కశ్యపునకు= కశ్యపునికి; అదితి= అదితి అనే భార్య; గర్భంబునన్= కడుపున; విష్ణుండు= విష్ణువు; వామన రూపుండై= పొట్టి రూపంలో; జనియించి= పుట్టి; ఇంద్ర+అవరజుండు+అయ్యెన్= ఇంద్రునికి తమ్ముడైనాడు; ఇప్పుడు= ఇంతవరకూ; ఏడు= సప్త; మన్వంతరంబులు= మన్వంతరములను గురించి; చెప్పంబడియెన్= చెప్పబడినది; రాగల= రాబోయే; మన్వంతరంబులును= మన్వంతరాలను గురించి; శ్రీహరి= మహావిష్ణువు; పరాక్రమంబున్= శౌర్యాన్నిగురించి; చెప్పెద= చెపుతాను; దత్త+అవధానుండవై= హెచ్చరిక కలవాడవై; వినుమని= ఆకర్ణించుమని; శుకుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** వారు ఇక్ష్వాకుడు, నభగుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, నాభాగుడు, దిష్టుడు, కరూశకుడు, పృషద్ధ్రుడు, వసుమంతుడు, అనేవారు. ఈ పదిమందీ రాజులైనారు. పురందరుడనేవాడు ఇంద్రుడైనాడు. ఆదిత్యులూ, మరుత్తులూ, అశ్వినులూ, రుద్రులూ, వసువులూ అనేవారు దేవతలైనారు. గౌతముడూ, కశ్యపుడూ, అత్రీ, విశ్వామిత్రుడూ, జమదగ్నీ, భరద్వాజుడూ, వసిష్ఠుడూ అనేవారు సప్తర్షులైనారు. వారిలో కశ్యపునికి అదితి అనే భార్యయందు విష్ణుమూర్తి వామనమూర్తియై జన్మించి ఉపేంద్రుడు (ఇంద్రుని తమ్ముడు) అయినాడు. ఇంతవరకు ఏడు మన్వంతరాలను గురించి చెప్పినాను. ఇక రాబోవు మన్వంతరాలను గురించి విష్ణువు పరాక్రమాన్ని గురించి వివరిస్తాను. శ్రద్ధగా విను అని శుకుడు ఇలా అన్నాడు.

**విశే :** చాలామంది వ్యక్తులపేర్లు చకచకా చెప్పాలి. కనుక పద్యంలో కన్న వచనంలో చెప్పటమే సుగమంగా ఉంటుందని ఈ వచనం సువ్యక్తం చేస్తుంది.

**సీ. జననాథ! సంజ్ఞయు ఛాయయు ననువారు గల రర్కునకు విశ్వకర్మతనయ**
**లిరువురు వల్లభ లిటమున్న చెప్పితిఁ బరఁగుఁదృతీయయు బడబ యనఁగ**
**సంజ్ఞకు యముఁడును శ్రాద్ధదేవుండును యమునయుఁ బుట్టిరి హర్ష మెసఁగ;**
**ఛాయకుఁ దపతియు సావర్ణియును శనైశ్చరుఁడును గలిగిరి; సంవరణుఁడు**

**తే. దపతి నాలిగఁ గైకొనెఁ దా వరించె, నశ్వియుగళంబు బడబకు నవతరించె;**
**వచ్చు నష్టమవసుపు సావర్ణి; వాఁడు, తపము సేయుచు నున్నాఁడు ధరణినాథ! 413**

**ప్రతి :** జననాథ= రాజా!; సంజ్ఞయున్= సంజ్ఞాదేవి; ఛాయయున్= ఛాయాదేవి; అనువారు= అనెడిపేర్లుగల; విశ్వకర్మతనయ లిరువురు= విశ్వకర్మయొక్క పుత్రిక లిద్దరు; అర్కునకున్= సూర్యునికి; వల్లభలు= భార్యలని; ఇట మున్న= ఇంతకు ముందే; చెప్పితిన్= చెప్పినాను; తృతీయయున్= మూడవభార్య కూడా; బడబయనఁగన్= బడబాదేవి అనేపేరుకలది; పరఁగున్= ఒప్పారుతోంది; సంజ్ఞకున్= సంజ్ఞాదేవికి; యముఁడును= యమధర్మరాజును; శ్రాద్ధదేవుండును= శ్రాద్ధదేవుడనేపేరు కలవాడును; యమునయు= యమునాదేవి(నది)యు; హర్షమెసఁగన్= ఆనందం కలిగే విధంగా; పుట్టిరి= జన్మించినారు; ఛాయకున్= ఛాయాదేవికి; తపతియున్= తపతి (అనేకూతురు); సావర్ణియును= సావర్ణీ; శనైశ్చరుఁడును= శని (మందుడు) అనే కుమారుడు; కలిగిరి= పుట్టినారు; సంవరణుఁడు= సంవరణుడనేరాజు; తపతిన్= తపతీ దేవిని; ఆలిగన్= భార్యగా; తా వరించెన్= తాను వరించి; కైకొనెన్= చేపట్టినాడు; బడబకున్= బడబ అనే (అశ్వముఖముగల) భార్యకు; అశ్వియుగళంబు= అశ్వినీ దేవతలిద్దరూ; అవతరించెన్= పుట్టినారు; వచ్చున్= రాబోవునట్టి; అష్టమవసువు= ఎనిమిదవ మనువుగ; సావర్ణి= సావర్ణి అనేవాడు; ధరణీనాథ= రాజా!; అందుకై= దానికోసం; వాడు= ఆ సావర్ణి; తపమున్+చేయుచున్నాడు= తపస్సు చేస్తున్నాడు.

**తా :** ఓ రాజా! సూర్యునికి సంజ్ఞాదేవి, ఛాయాదేవి అనే భార్యలున్నారు. వారు విశ్వకర్మ కుమార్తెలు. ఇంతకు ముందే ఈ విషయం చెప్పినాను. వారిద్దరేకాక 'బడబ' అనే భార్యకూడా ఉంది. సంజ్ఞాదేవికి యముడు, శ్రాద్ధదేవుడు, యమునాదేవి పుట్టినారు. ఛాయకు సావర్ణి, శనైశ్చరుడు, తపతీదేవి పుట్టినారు. తపతీ దేవిని సంవరణుడు పెళ్ళాడినాడు. బడబకు అశ్వినీ దేవత లిద్దరు పుట్టినారు. రాబోయే కాలంలో సావర్ణి ఎనిమిదవమనువు అవుతాడు. అతడు ప్రస్తుతం తపస్సు చేస్తున్నాడు.

**క. ఒకపరి సూచిన వెండియు, నొకపరి సూడంగ లేకయుండు సిరులకై**
**యొక నొకని చేటు వేళకు, నొకఁడొక్కఁడు మనువుఁగాచి యుండు నరేంద్రా! 414**

**ప్రతి :** నరేంద్రా= ఓ రాజా!; ఒకపరి= ఒకపర్యాయం; చూచినన్= కనబడగా; వెండియున్= తదుపరి; ఒకపరి= ఒకసారి; చూడంగ లేకయుండు= కనిపించకుండా ఉండు; సిరులకై= సంపదలకోసం; ఒకనొకని= ఒక్కొకని; చేటువేళకున్= దిగిపోయే సమయానికి; ఒకడు+ఒక్కడు మనువు= ఒక్కొక్క మనువు; కాచియుండున్= కాచుకొని ఉంటాడు.

**తా :** ఓ రాజా! ఒక పర్యాయం కనిపించి మరొక పర్యాయం కనిపించక మాయమయ్యే సిరులకోసం ఒక్కొక్క మనువు దిగిపోయే సమయానికి ఒక్కొక్కమనువు కాచుకొని ఉంటాడు.

**విశే :** భౌతికమైన సిరిసంపదలు ఎంత చంచలమూ, అశాశ్వతమైనవో! భౌతికమైన ఉన్నత పదవులు కూడ చంచలమూ, అశాశ్వతమైనవని అంతరార్థం! ఈ చిన్ని కందపద్యం లోకనీతిని, రీతిని అద్దం పడుతున్నది. 'చేటువేళ' అనే పదబంధం

అత్యంత సాభిప్రాయం. జీవితము ఒక కాలపరిమితికి ఎలా లోబడినదో, ఉన్నత పదవులు కూడ ఒక కాలపరిమితికి లోబడినవేనన్న పరమార్థమిందులో దాగి ఉన్నది. ఈ లోకంలో ఏదీ శాశ్వతంకాదు. ఆఖరికి బ్రహ్మపదవికూడ శాశ్వతంకాదు. ఇది తెలిసి ప్రవర్తించేవాడే నిజమైన బుద్ధిమంతుడు.

**వ. సూర్యసావర్ణి మన్వంతరంబున నతని తనయులు నిర్మోహవిరజస్కాద్యులు రాజులును, సుతపో విరజోమృత ప్రభులను వారు దేవతలును గాఁగలరు; గాలవుండును, దీప్తిమంతుండును, బరశురాముండును, ద్రోణపుత్త్రుండగు నశ్వత్థామయుఁ, గృపుండును, మజ్జనకుండగు బాదరాయణుండును, ఋష్యశృంగుండును సప్తర్షు లయ్యెదరు; వార లిప్పుడు దమతమ యోగబలంబుల నిజాశ్రమ మండలంబులం జరియించు చున్నవారు; విరోచన నందనుండగు బలి యింద్రుం డయ్యెడు నని చెప్పి శుకుం డిట్లనియె. 415**

**ప్రతి :** సూర్యసావర్ణి మన్వంతరంబునన్= సూర్యసావర్ణి పరిపాలించే (ఎనిమిదవ) మన్వంతరంలో; అతని తనయులు= ఆయన కొడుకులు; నిర్మోహవిరజస్క+ఆద్యులు= నిర్మోహుడు విరజస్కుడు మొదలయినవారు; రాజులును= రాజులు; సుతపో విరజోమృత ప్రభులనువారు= సుతపులు, విరజులు, అమృతప్రభువులు అనేవారు; దేవతలును కాగలరు= దేవతలవుతారు; గాలవుండును= గాలవుడూ; దీప్తిమంతుండును= దీప్తిమంతుడనేవాడూ; పరశురాముండును= పరశురాముడనేవాడూ; ద్రోణపుత్రుండగు అశ్వత్థామయును= ద్రోణుని కొడుకగు అశ్వత్థామయును; కృపుండును= కృపుడూ; మత్+జనకుండగు= నా తండ్రియగు; బాదరాయణుండును= వ్యాసుడూ; ఋష్యశృంగుండును= ఋష్యశృంగుడూ; సప్తర్షులయ్యెదరు= ఏడుగురు ఋషులవుతారు; వారలు= వారు; ఇప్పుడున్= ఈ సమయాన; తమ తమ= వారివారియొక్క; యోగబలంబులన్= యోగబలాలతో; నిజ+ఆశ్రమ= తమ ఆశ్రమాల; మండలంబులన్= గుంపులందు; చరియించుచున్నవారు= వర్తిస్తున్నారు; విరోచననందనుండు+అగు= విరోచనుడనువాని కొడుకగు; బలి= బలిచక్రవర్తి; ఇంద్రుండయ్యెడున్= ఇంద్రుడు కాగలడు; అని= అంటూ; చెప్పి= పలికి; శుకుండు= శుకముని; ఇట్లు+అనియెన్= ఈ విధంగ చెప్పినాడు.

**తా :** సూర్య సావర్ణి పరిపాలించే ఎనిమిదవ మన్వంతరంలో ఆయన కుమారులైన నిర్మోహుడు, విరజస్కుడు మొదలయినవారు రాజులవుతారు. సుతపులు, విరజులు, అమృతప్రభులు దేవతలవుతారు. గాలవుడు, దీప్తిమంతుడు, పరశురాముడు, ద్రోణుని కొడుకైన అశ్వత్థామ, కృపుడు, వ్యాసుడు, ఋష్యశృంగుడు సప్తర్షులవుతారు. ఇప్పుడు వారు తమ తమ యోగబలాలతో తమ ఆశ్రమాలలో ఉన్నారు. విరోచనుని కొడుకైన బలిచక్రవర్తి ఇంద్రుడవుతాడు.

**సీ. బలి మున్ను నాకంబు బలిమిమైఁ జేకొన్న వామనుండై హరి వచ్చి వేఁడఁ**
**బాదత్రయంబిచ్చి భగవన్నిబద్ధుఁడై సురమందిరముకంటె సుభగమైన**
**సుతలలోకంబున సుస్థితి నున్నాఁడు వెతలేక యటమీఁద వేదగుహికి**
**నా సరస్వతికిఁదా నట సార్వభౌముండు నాఁ బ్రభువయి హరి నాకవిభునిఁ**

**ఆ. బద విహీనుఁజేసి బలిఁ దెచ్చి నిలుపును, బలియు నిర్జరేంద్రు పదము నొందు;**
**నింద్రపదము హరికి నిచ్చిన కతమున, దానఫలము సెడదు ధరణినాథ! 416**

**ప్రతి :** ధరణినాథ= ఓ రాజా!; బలి= బలిచక్రవర్తి; మున్ను= పూర్వం; నాకంబున్= స్వర్గలోకాన్ని; బలిమిమైన్= బలవంతంగా; చేకొన్నన్= స్వాధీనం చేసుకోగా; వామనుండై= వామనరూపంతో; హరివచ్చి వేడన్= విష్ణువు వచ్చి అడుగగా; పాదత్రయంబున్=

మూడడుగుల నేలను; ఇచ్చి= ఒసగి; భగవత్+నిబద్ధుఁడై= భగవంతునిచే బందీయై; సురమందిరము కంటెన్= అమరావతికన్న; సుభగమైన= సొగసైన; సుతలలోకంబునన్= రసాతల లోకంలో; సుస్థితిన్+ఉన్నాడు= సుస్థిరంగా ఉన్నాడు; వెతలేకన్= బాధలేక; అటమీఁదన్= ఆ తర్వాత; వేదగుహికిన్= వేదగుహిఅనేవానికి; ఆ సరస్వతికిన్= ఆ సరస్వతికీ; తాన్= తను; అట= అక్కడ; సార్వభౌముండు+నాన్= సార్వభౌముడనే పేరుతో; ప్రభువయి= అధినాథుడై; హరి= విష్ణువు; నాక విభునిన్= దేవేంద్రుని; పదవిహీనున్+చేసి= పదవినుండి తొలగించి; బలిన్= బలిచక్రవర్తిని; తెచ్చి= తోడ్కొని వచ్చి; నిలుపును= నిలుపుతాడు; బలియున్= బలిచక్రవర్తికూడా; నిర్జరేంద్రు పదమున్= ఇంద్రుని పదవిని; పొందున్= పొందుతాడు; ఇంద్రపదమున్= ఇంద్రపదవిని; హరికిన్= విష్ణువునకు; ఇచ్చిన కతమునన్= ఒసగిన కారణంగా; దానఫలము= దానం చేసిన ఫలితం; చెడదు= చెడిపోదు.

**తా :** ఓ రాజా! పూర్వం బలిచక్రవర్తి బలవంతుడై స్వర్గలోకాన్ని వశం చేసుకోగా శ్రీహరి వామనుడుగా వెళ్ళి ఆయనను మూడడుగులనేలను దానమడిగినాడు. దానమిచ్చిన బలిచక్రవర్తిని త్రివిక్రముడు బద్ధుని చేసినాడు. తరువాత బలికి అమరావతికంటె అందమైన పాతాళలోకాన్ని ఇచ్చినాడు. దానిలో బలి సుఖంగా ఉన్నాడు. ఆ తర్వాత విష్ణువు వేదగుహికీ సరస్వతికీ "సార్వభౌముడు" అనే పేరుతో జన్మిస్తాడు, ఇంద్రుని పదవినుండి తొలగిస్తాడు. ఆ పదవిలో బలిచక్రవర్తిని నెలకొలుపుతాడు. విష్ణువు నుండి బలి ఇంద్రపదవిని పొందినప్పటికి అతడు మొదట విష్ణువునకు దానం చేసిన పుణ్యం చెడదు.

**వ. అట మీఁదటి కాలంబున వరుణ నందనుండగు దక్షసావర్ణి తొమ్మిదవ మను వయ్యెడు; అతని కొడుకులు ధృతకేతు, దీప్తకేతు ప్రముఖులు రాజులును, బర మరీచి గర్గాదులు నిర్జరులును, నద్భుతుం డనువాఁ డింద్రుండును, ద్యుతిమత్ప్రభృతు లగు వారలు ఋషులును నయ్యెద రందు. 417**

**ప్రతి :** అట మీఁదటి కాలంబునన్= ఆ తర్వాతి కాలాన; వరుణనందనుండగు= వరుణుని కొడుకైన; దక్షసావర్ణి= దక్షసావర్ణి అనేవాడు; తొమ్మిదవ మనువయ్యెడున్= తొమ్మిదవ మనువవుతాడు; అతని కొడుకులు= ఆయన కుమారులు; ధృతకేతు= ధృతకేతుడు; దీప్తకేతు= దీప్తకేతుడు; ప్రముఖులు= మొదలయినవారు; రాజులును= రాజులు; పర= పరుడు; మరీచి= మరీచిఅనువాడు; గర్గ+ఆదులు= గర్గుడు మొదలగువారు; నిర్జరులును= దేవతలు; అద్భుతుండనువాడు= అద్భుతుడు అనేవాడు; ఇంద్రుడును= ఇంద్రుడు; ద్యుతిమత్= ద్యుతిమంతుడు; ప్రభృతులగువారలు= మొదలయినవారు; ఋషులును= సప్తఋషులు; అయ్యెదరు= అవుతారు; అందున్= అందులో.

**తా :** ఆ తర్వాతి కాలంలో వరుణుని కొడుకైన దక్షసావర్ణి తొమ్మిదవ మనువు అవుతాడు. అతని కొడుకులయిన ధృతకేతువు, దీప్తకేతువు మొదలయినవారు రాజు లవుతారు. పరుడూ, మరీచులూ, గర్గుడూ మొదలయినవారు దేవత లవుతారు. అద్భుతుడు అనేవాడు ఇంద్రు డవుతాడు. ద్యుతిమంతుడు మొదలయినవారు సప్తఋషులు అవుతారు.

**ఆ. దనుజహరణుఁడంబుధార కాయుష్మంతు, నకు జనించి రక్షణంబు సేయ**
**మూఁడు లోకములను మోదంబుతో నేలు, నద్భుతాఖ్యు నొప్పు నమరవిభుఁడు. 418**

**ప్రతి :** దనుజహరణుఁడు= రాక్షసహారి అయిన విష్ణువు; అంబుధారకున్= అంబుధార(అనేస్త్రీకి)కు; ఆయుష్మంతునకున్= ఆయుష్మంతుడనేవానికి; జనించి= పుట్టి; రక్షణంబు+చేయన్= కాపాడగా; మూడులోకములను= ముల్లోకాలను;

మోదంబుతోన్= సంతోషంగా; అద్భుత+ఆఖ్యన్= అద్భుతుడు అనే పేరుతో; ఒప్పున్= ఒప్పాడు; అమరవిభుడు= ఇంద్రుడు; ఏలున్= పాలిస్తాడు.

**తా :** విష్ణువు ఆయుష్మంతునికీ అంబుధారకు జన్మిస్తాడు. అతని రక్షణలో దేవేంద్రుడైన అద్భుతుడు మూడు లోకాలను సంతోషంగా పరిపాలిస్తాడు.

**వ. మఱియు నుపశ్లోక సుతుండగు బ్రహ్మసావర్ణి దశమ మనువయ్యెడిఁ; దత్పుత్రులు భూరిషేణాదులు భూపతులును, హవిష్మత్ప్రముఖులు మునులును, శంభుండను వాఁ డింద్రుండును, విబుద్ధ్యాదులు నిర్జరులును నయ్యెద; రందు. 419**

**ప్రతి :** మఱియున్= ఆ తర్వాత; ఉపశ్లోకసుతుండగు= ఉపశ్లోకుని కొడుకయిన; బ్రహ్మసావర్ణి= బ్రహ్మసావర్ణి అనేవాడు; దశమ మనువయ్యెడిన్= పదవమనువు అవుతాడు; తత్+పుత్రులు= ఆతని కొడుకులు; భూరిషేణాదులు= భూరిషేణుడు మొదలయినవారు; భూపతులును= రాజులూ; హవిష్మత్+ప్రముఖులు= హవిష్మంతుడు మొదలగువారు; మునులును= మునులూ; శంభుండనువాడు= శంభుడనేవాడు; ఇంద్రుండును= ఇంద్రుడూ; విబుద్ధి+ఆదులు= విబుద్ధి మొదలయినవారు; నిర్జరులును= దేవతలూ; అయ్యెదరు= అవుతారు; అందున్= వారిలో.

**తా :** ఓ రాజా! ఆ పిమ్మట ఉపశ్లోకుని కుమారుడైన బ్రహ్మసావర్ణి పదవ మనువు అవుతాడు. ఆయన కొడుకులైన భూరిషేణుడు మొదలయినవారు రాజులవుతారు. హవిష్మంతుడు మొదలయినవారు సప్తర్షులవుతారు. శంభుడనేవాడు ఇంద్రుడవుతాడు. విబుద్ధి మొదలయినవారు దేవతలవుతారు.

**ఆ. విశ్వసృజుని యింట విభుఁడు విషూచికి, సంభవించు నంశసహితుఁడగుచుఁ**
**చెలిమి శంభుతోడఁ జేయు విష్వక్సేనుఁ, డనఁగ జగముఁగాచు నవనినాథ! 420**

**ప్రతి :** అవనినాథ= ఓ రాజా!; విశ్వసృజునియింటన్= విశ్వసృజుడనేవాని ఇంట్లో; విషూచికి= విషూచినామధేయకు; విభుఁడు= హరి; అంశసహితుఁడగుచున్= అంశతో కూడినవాడై; విష్వక్సేనుఁడనఁగన్= విష్వక్సేనుడనేపేరుతో; సంభవించున్= జన్మిస్తాడు; శంభుతోడన్= శంభునితో; చెలిమి= స్నేహాన్ని; చేయున్= చేస్తాడు; జగమున్= లోకాన్ని; కాచున్= కాపాడుతాడు.

**తా :** విష్ణువు విశ్వసృజునికీ విషూచికీ 'విష్వక్సేనుడు' అనే పేరుతో జన్మించి శంభునికి స్నేహితుడై లోకాన్ని కాపాడుతాడు.

**వ. మఱియుం దదాగమిష్యత్కాలంబున ధర్మసావర్ణి పదునొకండవ మను వయ్యెడి; మను తనూజులు సత్యధర్మాదులు పదుండ్రు ధరణి పతులును; విహంగమ కామగమన నిర్వాణరుచు లనువారు సురలును, వైధృతుండనువాఁడింద్రుండును, నరుణాదులు ఋషులును నయ్యెద; రందు. 421**

**ప్రతి :** మఱియున్= మరియూ; తద్+ఆగమిష్యత్+కాలంబునన్= ఆ తరువాత వచ్చే కాలంలో; ధర్మసావర్ణి= ధర్మసావర్ణి అనే వాడు; పదునొకొండవ= పదకొండవ; మనువు+అయ్యెడిన్= మనువు అవుతాడు; మనుతనూజులు= మనువు తనయులు; సత్యధర్మ+ఆదులు= సత్యధర్ముడు మొదలయినవారు; పదుండ్రున్= పదిమందీ; ధరణిపతులును= రాజులూ; విహంగమ= విహంగముడూ; కామగమన= కామగమనుడు; నిర్వాణరుచులనువారు= నిర్వాణరుచులు అనేవారూ; సురలును=

దేవగణములూ; వైధృతుండనువాఁడు= వైధృతుండనే పేరుగలవాడు; ఇంద్రుండును= ఇంద్రుడూ; వరుణాదులు= వరుణుడూ మొదలయినవారు; ఋషులును= సప్తర్షులునూ; అయ్యెదరు= అవుతారు; అందున్= వారిలో.

**తా :** ఆ పిమ్మట వచ్చే కాలంలో ధర్మసావర్ణి పదకొండవమనువు అవుతాడు. ఆయన కుమారులయిన సత్యధర్ముడు మొదలయినవారు పదిమందీ రాజులవుతారు. విహంగములు, కామగమనులు, నిర్వాణరుచులు దేవతలవుతారు. వైధృతుడనేవాడు ఇంద్రుడవుతాడు. అరుణుడు మొదలయినవారు సప్తర్షులవుతారు.

**ఆ. అంబుజాతనేత్రుఁ డా సూర్యసూనుఁడై, ధర్మసేతు వనఁగఁదగ జనించి**
**వైభవాఢ్యుఁడగుచు వైధృతుఁడలరంగఁ, గరుణఁ ద్రిజగములను గావఁగలఁడు. 422**

**ప్రతి :** అంబుజాత నేత్రుఁడు= కమలాక్షుడగు విష్ణువు; ఆ సూర్యసూనుఁడై= ఆ సూర్యునికి కొడుకయి; ధర్మసేతువనఁగన్= ధర్మసేతువు అనే పేరుతో; తగన్+జనించి= తగిన విధంగాపుట్టి; వైభవాఢ్యుఁ డగుచున్= వైభవసంపన్నుడై; వైధృతుఁడు= వైధృతుడనువాడు; అలరంగన్= సంతోషించేటట్లు; కరుణన్= దయతో; త్రిజగములను= ముల్లోకాలనూ; కావఁగలఁడు= కాపాడగలడు.

**తా :** విష్ణువు 'ధర్మసేతువు' అనే పేరుతో సూర్యుని కుమారునిగా జన్మిస్తాడు. ఆయన మహిమలతో సంపన్నుడై వైధృతుడు సంతోషించేటట్లు మూడు లోకాలను కరుణతో కాపాడుతాడు.

**వ. మఱియుఁ దద్భవిష్యత్సమయంబున భద్రసావర్ణి పండ్రెండవమను వయ్యెడి; నతని నందనులు దేవవ దుపదేవ దేవ జ్యేష్ఠాదులు వసుధాధిపతులును, ఋతధాముం డనువాఁ డింద్రుండును, హరితాదులు వేల్పులును, దపోమూర్తి తప ఆగ్నీధ్రకాదులు ఋషులును నయ్యెద; రందు. 423**

**ప్రతి :** మఱియున్= వెండియు; తద్+భవిష్యత్+సమయంబునన్= ఆ తరువాత రాబోయే కాలాన; భద్రసావర్ణి= భద్రసావర్ణి అనువాడు; పండ్రెండవ మనువయ్యెడిన్= పన్నెండవ మనువు అవుతాడు; అతని= ఆయనయొక్క; నందనులు= కొడుకులు; దేవవత్= దేవవంతుడు; ఉపదేవ= ఉపదేవుడు; దేవజ్యేష్ఠాదులు= దేవజ్యేష్ఠుడూ మొదలయినవారు; వసుధాధిపతులును= రాజులూ; ఋతధాముండనువాడు= ఋతధాముడు అనేవాడు; ఇంద్రుండును= ఇంద్రుడూ; హరితాదులు= హరితుడు మొదలగువారు; వేల్పులును= దేవతలూ; తపోమూర్తి తప ఆగ్నీధ్రకాదులు= తపోమూర్తి తపస్వి ఆగ్నీధ్రకుడు మొదలయినవారు; ఋషులును= సప్తర్షులూ; అయ్యెదరు= అవుతారు; అందున్= వారిలో.

**తా :** ఓ రాజా! ఆ పిమ్మట రాబోయేకాలంలో భద్రసావర్ణి పన్నెండవ మనువు అవుతాడు. అతని కొడుకులయిన దేవవంతుడు, ఉపదేవుడు, దేవజ్యేష్ఠుడు మొదలయినవారు రాజులవుతారు. ఋతధాముడనేవాడు ఇంద్రుడవుతాడు. హరితులు మొదలయినవారు దేవతలవుతారు. తపోమూర్తి, తపస్వి, అగ్నీధ్రకుడు మొదలయినవారు సప్తర్షులవుతారు.

**విశే :** తప ఆగ్నీధ్ర అనే పాఠం వ్యాకరణరీత్యా సరిపోతుంది. (తవ అగ్నీధ్ర పాఠం సరికాదు)

పోతన భాగవతముద్రిత ప్రతులన్నింటిలో **ఋతుధాముడనే** ఉన్నది. ఈ పాఠం సరికాదు. సంస్కృతమూలంలో **ఋతధాముడని** ఉన్నది. దీనికి ప్రమాణం వాల్మీకిరామాయణం.

**ఆ. జలజలోచనుండు సత్యతపస్సూనృ, తలకు సంభవించుఁదనయుఁడగుచు**
**ధరణిఁగాచు నంచితస్వధామాఖ్యుఁడై, మనువు సంతసింప మానవేంద్ర! 424**

**ప్రతి :** మానవేంద్ర= ఓ రాజా!; జలజలోచనుండు= కమలాక్షుడగు హరి; సత్యతపస్సూనృతలకు= సత్యతపునికీ సూనృతకూ; తనయుఁడగుచున్= కొడుకుగా; సంభవించున్= జన్మిస్తాడు; అంచిత= మంచిదైన; స్వధామ+ఆఖ్యుఁడై= స్వధాముడనే పేరుతో; మనువుసంతసింపన్= మనువు సంతోషించేటట్లు; ధరణిన్= భూమిని; కాచున్= కాపాడుతాడు.

**తా :** ఆ కాలాన విష్ణువు సత్యతపునికి సూనృతకు 'స్వధాముడు' అనే పేరుతో జన్మిస్తాడు. మనువు సంతోషించేటట్లు లోకాన్ని రక్షిస్తాడు.

**వ. మఱియుం దదేష్యత్కాలంబున నాత్మవంతుండగు దేవసావర్ణి పదుమూఁడవ మనువయ్యెడి; మనుకుమారకులు చిత్రసేన విచిత్రాదులు జగతీనాయకులును, సుకర్మ సుత్రామ సంజ్ఞలు గలవారు బృందారకులును, దివస్పతి యను వాఁ డింద్రుండును, నిర్మోహ తత్త్వదర్శాద్యులు ఋషులును నయ్యెద; రందు. 425**

**ప్రతి :** మఱియున్= వెండియు; తద్+ఏష్యత్+కాలంబునన్= ఆ తరువాతికాలంలో; ఆత్మవంతుండగు= ఆత్మవంతుడయిన; దేవసావర్ణి= దేవసావర్ణి అనేవాడు; పదమూడవమనువయ్యెడిన్= పదమూడవ మనువు అవుతాడు; మనుకుమారకులు= మనువుకొడుకులు; చిత్రసేన విచిత్రాదులు= చిత్రసేనుడూ విచిత్రుడూ మొదలయినవారు; జగతీనాయకులును= రాజులూ; సుకర్మసుత్రామసంజ్ఞలుగలవారు= సుకర్ముడు సుత్రాముడు (మొదలయిన) పేర్లుకలవారు; బృందారకులును= దేవతలూ; దివస్పతియనువాడు= దివస్పతి అనేవాడు, ఇంద్రుదును= దేవేంద్రుడూ; నిర్మోహతత్త్వదర్శాద్యులు= నిర్మోహుడు తత్త్వదర్శుడూ మొదలయినవారు; ఋషులును= సప్తర్షులూ; అయ్యెదరు= అవుతారు; అందున్= వారిలో...

**తా :** ఓ రాజా! ఆ తరువాతి కాలంలో దేవసావర్ణి పదమూడవ మనువు అవుతాడు. అతని కొడుకులయిన చిత్రసేనుడూ విచిత్రుడూ మొదలయినవారు రాజులవుతారు. సుకర్ములూ సుత్రాములూ దేవతలవుతారు. దివస్పతి అనేవాడు ఇంద్రుడవుతాడు. నిర్మోహుడూ తత్త్వదర్శుడూ మొదలయినవారు సప్తర్షులవుతారు.

**ఆ. ధరణి దేవహోత్ర దయితకు బృహతికి, యోగవిభుఁడు నాఁగ నుద్భవించి**
**వనజనేత్రుఁడా దివస్పతి కెంతయు, సౌఖ్యమాచరించు జగతినాథ! 426**

**ప్రతి :** జగతినాథ= రాజా!; ధరణిన్= లోకంలో; వనజనేత్రుఁడు= కమలాక్షుడగు హరి; దేవహోత్ర దయితకున్= దేవహోత్రుని భార్యకు; బృహతికిన్= బృహతి అనే ఆమెకు; యోగవిభుఁడు నాఁగన్= యోగవిభుడు అనే పేరుతో; ఉద్భవించి= పుట్టి; దివస్పతిన్= ఇంద్రునికి; ఎంతయున్= మిక్కిలి; సౌఖ్యము= సుఖాన్ని; ఆచరించు= కలిగిస్తాడు.

**తా :** ఓ రాజా! విష్ణువు దేవహోతకూ బృహతికీ 'యోగవిభుడు' అనే పేరుతో జన్మిస్తాడు. ఇంద్రునికి చాలా సాయం చేస్తాడు.

**వ. మఱియు నట వచ్చుకాలంబున నింద్రసావర్ణి పదునాల్గవ మను వయ్యెడి; మను నందను లురు గంభీరవస్వాదులు రాజులును, బవిత్రచాక్షుష లనువారు దేవగణంబులును, శుచి యనువాఁ డింద్రుండును, నగ్ని బాహు శుచి శుక్ర మాగధాదులు ఋషులును నయ్యెద; రందు. 427**

**ప్రతి :** మఱియున్= వెండియు; అట వచ్చుకాలంబునన్= ఆ తర్వాత వచ్చేకాలాన; ఇంద్రసావర్ణి= ఇంద్రసావర్ణి అనేవాడు; పదునాల్గవ= పద్నాలుగవ; మనువు+అయ్యెడిన్= మనువు అవుతాడు; మనునందనులు= మనువు కొడుకులు; ఉరుగంభీర+

వసువు+ఆదులు= ఉరుగంభీరుడు, వసువు, మొదలయినవారు; పవిత్ర చాక్షుషులు+అనువారు= పవిత్రులూ చాక్షుషులూ అనేవారు; దేవగణంబులును= వేల్పుతండముగను; శుచియనువాఁడింద్రుండును= శుచి అనేవాడు ఇంద్రునిగాను; అగ్ని బాహు శుచి శుక్ర మాగధాదులు= అగ్ని, బాహువు, శుచి, శుక్రుడు, మగధుడు మొదలయినవారు; ఋషులును= సప్తర్షులుగాను; అయ్యెదరు= అవుతారు; అందున్= వారిలో...

**తా :** ఆ పిమ్మట వచ్చేకాలంలో ఇంద్రసావర్ణి పదునాలుగవ మనువు అవుతాడు. అతని కుమారులు ఉరుగంభీరుడు, వసువు మొదలయినవారు రాజులవుతారు. పవిత్రులు, చాక్షుషులు దేవతలవుతారు. శుచి అనేవాడు ఇంద్రుడవుతాడు. అగ్ని, బాహువు, శుచి, శుక్రుడు, మాగధుడు మొదలయినవారు సప్తర్షులవుతారు. ఇంకా

**తే.** **తనర సత్త్రాయణునకు వితానయందు, భవము నొందెడి హరి బృహద్భానుఁ డనఁగ**
**విస్తరించుఁ గ్రియాతంతు విసరములను, నాకవాసులు ముదమంద నరవరేణ్య! 428**

**ప్రతి :** నరవరేణ్య= ఓ రాజా!; హరి= విష్ణువు; సత్త్రాయణునకున్= సత్త్రాయణుడు అనేవానికి; వితానయందున్= వితాన అనే ఆమెకు; తనరన్= ఒప్పిదంగా; బృహత్ భానుఁడు+అనఁగన్= బృహద్భానుడు అనే పేరుతో; భవమునొందెడిన్= పుడుతారు; నాకవాసులు= స్వర్గవాసులయిన దేవతలు; ముదమందన్= సంతోషించేటట్లు; క్రియాతంతు= క్రియాకలాపాల; విసరములను= సముదాయాన్ని; విస్తరించున్= విస్తరిస్తాడు.

**తా :** ఆ కాలాన విష్ణువు సత్త్రాయణునకు వితానకు 'బృహద్భానుడు' అనే పేరుతో జన్మిస్తాడు. దేవతలు సంతోషించేటట్లు క్రియాకలాపాలను విస్తరిస్తాడు.

**క.** **జగతీశ! త్రికాలములను, బొగడొందు మనుప్రకారములు సెప్పఁబడెం;**
**దగఁబదునలువురు మనువులుఁ, దెగ యుగములు వేయు నడవ దివ మజున కగున్. 429**

**ప్రతి :** జగతీశ= రాజా!; త్రికాలములను= మూడు కాలాలలోకూడా; పొగడొందు= ప్రఖ్యాతిపొందిన; మనుప్రకారములు= మనువుల విధానం; చెప్పఁబడెన్= చెప్పబడినవి; తగన్= యుక్తంగా; పదునలువురు మనువులు= పదునాలుగుమంది మనువులు; తెగన్= అంతరించి; యుగములు వేయి నడువన్= వేయియుగాలు గడిస్తే; అజునకున్= బ్రహ్మకు; దివము+అగున్= (ఒక) దినమవుతుంది.

**తా :** ఓ రాజా! మూడుకాలాల్లోనూ ప్రఖ్యాతి పొందే మనువుల విధానాన్ని చెప్పినాను. పదునాలుగుమంది మనువులు అంతరించి వెయ్యియుగాలు గడిస్తే బ్రహ్మకు ఒక దినం అవుతుంది.

**వ.** **అనినఁబరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 430**

**ప్రతి :** అనినన్= అనిపలుకగా; పరీక్షిత్+నరేంద్రుండు= పరీక్షిత్తు రాజశ్రేష్ఠుడు; శుకయోగీంద్రునకున్= శుకమునీంద్రునితో; ఇట్లనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని శుకుడు చెప్పగా పరీక్షిన్నరేంద్రుడు ఇలా అన్నాడు.

**ఆ.** **ఈ పదంబులందు నీ మను ప్రముఖుల, నెవ్వ రనుపువార? లేమి కతన**
**నధికవిభవులైరి? హరి యేల జనియించె?, నెఱుఁగఁబలుకు నాకు నిద్ధచరిత! 431**

**ప్రతి :** ఇద్ధచరిత= ప్రకాశించే చరిత్రకలవాడా!; ఈ పదంబులందున్= ఈ పదవులలో; ఈ మనుప్రముఖులన్= ఈ ప్రముఖులైన మనువులను; ఎవ్వరు= ఏవారు; అనుపువారలు= పంపువారు (నియమించువారు); ఏమికతనన్= ఎందువలనవారు; అధిక విభవులైరి?= మిక్కిలి వైభవం కలవారైరి?; హరి= విష్ణువు; ఏలన్= ఎందుకు; జనియించెన్= పుట్టెను; నాకున్+ఎఱుఁగన్= నాకు తెలిసేటట్లు; పలుకు= చెప్పుము.

**తా :** ఓ శుభచరితా! ఈ పదవులలో మనువులను ఎవరు నియమిస్తారు? ఎందువల్ల వారు గొప్ప వైభవాన్ని పొందారు? ఆ మన్వంతరాలలో ఎందుకు విష్ణువు జన్మిస్తాడు? నాకు తెలిసేటట్లు చెప్పు.

**వ. అనినం బారాశర్యకుమారుం డిట్లనియె. 432**

**ప్రతి :** అనినన్= అని అడిగిన; పారాశర్యకుమారుండు= పారాశర్యుని (వ్యాసుని) కొడుకయినశుకుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** అని అడిగిన పరీక్షిత్తుతో శుకుడిలా అన్నాడు.

**సీ. మనువులు మునులును మనుసుతు లింద్రులు నమరులు హరియాజ్ఞ నడఁగువారు**
**యజ్ఞాదు లందఱు హరిపౌరుషాకృతు లా మనువులు దత్సహాయశక్తి**
**జగముల నడపుదు రొగి నాల్గుయుగముల కడపటఁ గాలసంగ్రస్తమైన**
**నిగమచయంబును నిజతపోబలముల మరలఁగాంతురు ఋషివరులు; దొంటి**

**తే. పగిది ధర్మంబు నాలుగు పాదములును, గలిగి వర్తిల్లు; మనువులు గమలనేత్రు**
**నాజ్ఞఁ దిరుగుదు; రేలుదు రవనిపతులు, జగతి భాగించి తమ తమ సమయములను. 433**

**ప్రతి :** మనువులు= మనువులూ; మునులును= ఋషులూ; మనుసుతులు= మనువుల కొడుకులూ; ఇంద్రులున్= దేవేంద్రులూ; అమరులు= వేల్పులు; హరియాజ్ఞన్= విష్ణుమూర్తి ఆనతికి; అడఁగువారు= లోబడినవారు; యజ్ఞాదులందఱు= యజ్ఞుడు మొదలయినవారందరూ; హరి= విష్ణువుయొక్క; పౌరుషాకృతులు= పురుషరూపం కలవారు; ఆ మనువులు= ఆ మనువులందరూ; తత్+సహాయ శక్తిన్= అతని సహాయబలంతో; జగములన్= లోకాలను; నడుపుదురు= పాలిస్తారు; ఒగిన్= క్రమంగా; నాల్గుయుగములన్= నాలుగు యుగాల; కడపటన్= చివరన; కాల= కాలంచేత; సంగ్రస్తమైన= మ్రింగివేయబడిన; నిగమచయంబును= వేదసముచ్చయాన్ని; నిజతపోబలములన్= సొంత తపశ్శక్తిచే; ఋషివరులు= మునిశ్రేష్ఠులు; మరలన్= తిరిగి; కాంతురు= దర్శిస్తారు; తొంటిపగిదిన్= పూర్వంవలె; ధర్మంబు= ధర్మం; నాలుగుపాదములును కలిగి= నాలుగు పాదాలూకలిగి; వర్తిల్లున్= నడుస్తుంది; మనువులున్= మనువులు; కమలనేత్రునాజ్ఞన్= కమలాక్షుడగు హరి ఆనతిమేరకు; తిరుగుదురు= ప్రవర్తిల్లుతారు; అవనిపతులు= భూపాలకులు; జగతిన్= లోకాన్ని; భాగించి= పంచుకొని; తమ తమ సమయములను= తమ తమ కాలాలలో; ఏలుదురు= పాలిస్తారు.

**తా :** మనువులు, మునులు, మనువుల తనయులు, ఇంద్రుడు, దేవతలు విష్ణుమూర్తి ఆనతికి లోబడి ఉంటారు. యజ్ఞుడు మొదలయినవారు విష్ణుదేవుని అంశంతో రూపుదాలుస్తారు. అతని సహాయంవల్ల మనువులు లోకాన్ని పాలిస్తారు. క్రమంగా నాలుగుయుగాల చివర వేదాలను కాలం మింగి వేస్తుంది. పుణ్యాత్ములయిన మునులు తమ తపశ్శక్తివల్ల మళ్లీ వేదాలను

దర్శిస్తారు. పూర్వం వలె ధర్మం నాలుగు పాదాలతో నడుస్తుంది. విష్ణువు ఆజ్ఞ చెల్లుబడి అవుతుంది. తమ తమ కాలాలలో రాజులు లోకాన్ని పంచుకొని పరిపాలిస్తారు.

**వ. మఱియుఁ బ్రాప్తులయిన వారల నింద్రపదంబులను, బహుప్రకారంబుల దేవపదంబులను, హరి ప్రతిష్ఠించుచుండు; వారలు విహితకర్మంబుల జగత్త్రయంబునుం బరిపాలింతురు; లోకంబులు సువృష్టులై యుండును. 434**

**ప్రతి :** మఱియున్= వెండియు; ప్రాప్తులయినవారలన్= ప్రాప్తంకలిగినవారిని; ఇంద్రపదంబులను= ఇంద్రపదవులలోనూ; బహుప్రకారంబుల= పెక్కువిధాలయిన; దేవపదంబులను= దేవతల పదవులలోను; హరి= విష్ణువు; ప్రతిష్ఠించుచుండున్= నెలకొలుపుతుంటాడు; వారలు= వారు; విహితకర్మంబులన్= నిర్ణయించబడిన నియమాలతో; జగత్త్రయంబునున్= ముల్లోకాలను; పరిపాలింతురు= ఏలుతారు; లోకంబులు= లోకాలు; సువృష్టులై= సుభిక్షంగా; ఉండును= ఉంటాయి.

**తా :** విష్ణుమూర్తి ప్రాప్తమున్నవారిని ఇంద్రపదవులలోను, పెక్కు విధాలయిన దేవతల పదవులలోను నియమిస్తాడు. వారు తమకు నిర్ణయించబడిన నియమాలతో ముల్లోకాలను పాలిస్తారు. లోకాలు సుభిక్షంగా ఉంటాయి.

**సీ. యోగీశరూపుఁడై యోగంబుఁజూపుచు మౌని రూపమునఁగర్మంబుఁదాల్చి**
**సర్గంబు సేయుఁ బ్రజాపతిరూపుఁడై యింద్రుఁడై దైత్యుల నేపడంచు**
**జ్ఞానంబు నెఱిఁగించుఁజతుర సిద్ధాకృతిఁ గాలరూపమునఁబాకంబు సేయుఁ**
**నానావిధములైన నామరూపంబులఁ గర్మలోచనులకుఁగానఁబడఁడు**

**ఆ. చనిన రూపములను జనురూపముల నింకఁ, జనఁగనున్న రూపచయము నతఁడు**
**వివిధుఁడై యనేకవృత్తుల వెలిఁగించు, విష్ణుఁడవ్యయుండు విమలచరిత! 435**

**ప్రతి :** విమలచరిత!= నిర్మలమైన చరిత్ర కలవాడా!; విష్ణుఁడు+అవ్యయుండు= అవ్యయుడైన విష్ణువు; యోగీశరూపుఁడై= యోగీంద్రునిరూపంతో; యోగంబున్= యోగమును; చూపుచున్= ఎరుకపరుస్తూ; మౌనిరూపమునన్= ముని రూపంతో; కర్మంబున్= కర్మానుష్ఠానాన్ని; తాల్చి= ధరించి (తెలిపి); ప్రజాపతి రూపుఁడై= ప్రజాపతి (బ్రహ్మ) రూపంతో; సర్గంబున్= సృష్టిని; చేయున్= చేస్తాడు; ఇంద్రుఁడై= దేవేంద్రుడయి; దైత్యులన్= దితి సూనులగు రాక్షసులయొక్క; ఏఁపున్= గర్వాన్ని; అడంచున్= అణగిస్తాడు; చతుర= నిపుణత కలిగిన; సిద్ధాకృతిన్= సిద్ధస్వరూపంతో; జ్ఞానంబున్= జ్ఞానాన్ని; ఎఱిగించున్= ఉపదేశిస్తాడు; కాలరూపమునన్= కాలస్వరూపంతో; పాకంబు+చేయున్= కడతేరుస్తాడు; నానావిధములైన= అనేక విధాలయిన; నామరూపంబులన్= పేర్లు, ఆకారాలతో; కర్మలోచనులకున్= విషయాసక్తులయిన కనులుగలవారికి; కానఁ బడఁడు= కనిపించడు; ఇంకన్= ఇకమీదట; చనిన= పోయిన; రూపములను= ఆకారాలను; చనురూపములను= చనుచున్న రూపాలను; చనఁగనున్న రూపచయమును= రాబోయేరూప సముదాయాన్ని; అతఁడు= ఆ భగవానుడు; వివిధుఁడై= పెక్కురై; అనేకవృత్తులన్= పెక్కురీతుల వేర్వేరు రూపాలతో; వెలిగించున్= వెలిగిస్తాడు (వెలుగుతాడు).

**తా :** ఓ నిర్మల చరితుడా! శాశ్వతుడైన విష్ణువు యోగీంద్రుని రూపంతో యోగం బోధిస్తాడు. మౌనిరూపంతో కర్మానుష్ఠానాన్ని బోధిస్తాడు. ప్రజాపతి రూపంతో సృష్టిచేస్తాడు. ఇంద్రుడై రాక్షసుల పొగరును అణచివేస్తాడు. సిద్ధరూపంతో జ్ఞానోపదేశం చేస్తాడు. కాలస్వరూపంతో కడతేరుస్తాడు. అవ్యయుడైన ఆ శ్రీపతి పెక్కుపేర్లతో అనేక రూపాలతో ఉంటాడు. అతడు

విషయాసక్తుల కంటికి కనిపించడు. అతడు జరిగిన, జరుగుతున్న, జరుగబోయే కాలాలలో అనేక విధాలుగా వేరువేరు రూపాలతో వెలుగొందుతాడు.

## ✤ వామనచరిత్ర కథాప్రారంభము ✤

**వ. అనిన భూవరుం డిట్లనియె. 436**

**ప్రతి :** అనినన్= ఇట్లు చెప్పగా; భూవరుండు= రాజు (పరీక్షిత్తు); ఇట్లు+అనియెన్= ఈ క్రింది విధంగా పలికెను.

**తా :** పై విధంగా చెప్పిన శుకునితో పరీక్షిత్తు ఇలా అన్నాడు.

**మ. బలి నంభోరుహనేత్రుఁ డేమికొఱకై పాదత్రయిన్ వేఁడె? ని**
**శ్చలుఁడుం బూర్ణుఁడు లబ్ధకాముఁడు రమాసంపన్నుఁడై తాఁ బర**
**స్థలికిన్ దీనునిమాడ్కి నేల చనియెం? దప్పేమియున్ లేక ని**
**ష్కలుషున్ బంధన మేల చేసెను? వినం గౌతూహలంబయ్యెడిన్. 437**

**ప్రతి :** బలిన్= బలిచక్రవర్తిని; అంభోరుహనేత్రుఁడు= పద్మాక్షుడు (హరి); ఏమికొఱకై= ఎందునిమిత్తము; పాదత్రయిన్= మూడడుగులను (మూడడుగుల ప్రదేశమును), వేఁడెన్?= కోరెను?; నిశ్చలుఁడున్= నిర్వికారుడును; పూర్ణుఁడున్= (అంతట) నిండినవాడును; లబ్ధ= పొందబడిన; కాముఁడున్= కోరికలుగలవాడును; రమాసంపన్నుఁడై= లక్ష్మిగలవాడై; తాన్= తాను; పరస్థలికిన్= ఇతరుని యొద్దకు; దీనునిమాడ్కిన్= దీనునివలె; ఏలచనియెన్?= ఎందుకుపోయెను?; తప్పు+ఏమియున్= నేరమింతయునుకూడ; లేక= లేకుండ; నిష్కలుషున్= పాపములేనివానిని (పుణ్యాత్ముని); ఏల= ఎందుకు; బంధనముచేసెను?= బంధించెను?; వినన్= (నాకు) వినగా; కౌతూహలంబు= సంతోషం; అయ్యెడిన్= అవుతుంది.

**తా :** హరి బలిచక్రవర్తిని ఎందుకొరకు మూడడుగుల భూమిని యాచించినాడు? విష్ణువు పూర్ణపురుషుడు, పూర్ణకాముడు, నిర్వికారుడు, లక్ష్మీదేవితో కూడినవాడు. అటువంటివాడు బలిచక్రవర్తి వద్దకు దీనునివలె ఎందుకు పోయినాడు? తప్పేమీలేని నిష్కలుషుడైన బలిని ఎందుకు బంధించినాడు? ఈ కథ వినాలని కుతూహలంగా ఉంది.

**విశే :** రమాసంపన్నుడైన విష్ణువు యాచకుడుగా వెళ్ళటం ఒక వింత. మూడడుగులనేలను యాచనచేసి పుచ్చుకొని దాత అయిన బలిని బంధించడంలో వంచన కనిపిస్తుంది. జగత్త్రయోన్నత న్యాయపీఠమైన విష్ణువు నిరపరాధిని దండించటం ఏమి? బలిచక్రవర్తి కథలో ఈ సందేహాలు జిజ్ఞాసువులకు తప్పక కలుగుతాయి. దీనికి సమాధానంగానే బలి– వామనమూర్తుల కథాగమనం జరుగుతుంది.

**వ. అనిన శుకుండిట్లనియె. 438**

**ప్రతి :** అనినన్= పై విధంగా పలుకగా; శుకుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పెను.

**తా :** పై విధంగా పలుకగా శుకముని ఈ విధంగా చెప్పాడు.

**సీ. పురుహూతుచే నొచ్చి పోయి భార్గవులచే బలి యెట్టకేలకు బ్రదికి, వారి**
**చిత్తంబురాఁ గొల్చి శిష్యుఁడై వర్తింప, వారు నాతని భక్తివలన మెచ్చి**

**విశ్వజిద్యాగంబు విధితోడఁజేయింప భవ్యకాంచనపట్టబద్ధరథము**
**నర్కువాజులఁబోలు హరులఁ గంఠీరవధ్వజము మహాదివ్యధనువుఁబూర్ణ**

**తే. తూణయుగళంబుఁ గవచంబుఁదొలుత హోమ, పావకుండిచ్చె; నమ్లానపద్మమాలఁ**
**గలుషహరుఁడగు తన తాత కరుణ నొసఁగె;, సోమసంకాశశంఖంబు శుక్రుఁడిచ్చె. 439**

**ప్రతి :** బలి= బలిచక్రవర్తి; పురుహూతుచేన్= ఇంద్రునిచేత; నొచ్చి= నొప్పింపబడి; పోయి= పారిపోయి; భార్గవులచేన్= శుక్రాచార్యునిచే; ఎట్టకేలకున్= అతికష్టమున; బ్రదికి= జీవించి; వారి= ఆ శుక్రాచార్యులయొక్క; చిత్తంబురాన్= దయవచ్చునట్లు; కొల్చి= సేవించి; శిష్యుండై= ఛాత్రుడై; వర్తింపన్= మసలగా; వారును= ఆ గురువులు; ఆతని= అతని (బలిచక్రవర్తియొక్క); భక్తివలనన్= భక్తికి; మెచ్చి= మెచ్చుకొని; విశ్వజిత్+యాగంబునన్= ప్రపంచములను జయించునట్టి యజ్ఞమును; విధితోడన్= శాస్త్రప్రకారం; చేయింపన్= చేయించుటకు; భవ్య= మంగళప్రదమయిన; కాంచన= బంగారపు; పట్ట= పట్టముచే; బద్ధ= కట్టబడిన; రథమున్= తేరును; అర్కు= సూర్యునియొక్క; వాజులన్+పోలు= గుర్రములను బోలినట్టి; హరులన్= గుర్రములును; కంఠీరవధ్వజమున్= సింహపతాకమును; మహా= గొప్పదైన; దివ్య= దేవతాసంబంధమైన; ధనువున్= వింటిని; పూర్ణ= బాణములతో నిండిన; తూణయుగళంబున్= అమ్ముల పొదుల జంటయును; కవచంబున్= మైమరువును; తొలుతన్= మొదట; హోమపావకుండు= హోమాగ్నిహోత్రుడు; ఇచ్చెన్= ఒసగెను; కలుషహరుఁడు+అగు= పాపరహితుడైన; తన తాత= తన పితామహుడు (ప్రహ్లాదుడు); అమ్లాన= వాడని; పద్మమాలన్= తామరపూవులదండను; కరుణన్= దయతో; ఒసఁగెన్= ఇచ్చెను; సోమసంకాశ= చంద్రునితో సమానమైన; శంఖంబున్= శంఖమును; శుక్రుడు= శుక్రాచార్యులు; ఇచ్చెన్= ఇచ్చెను.

**తా :** బలిచక్రవర్తి ఇంద్రునిచేతిలో ఓడిపోయి శుక్రాచార్యుని అనుగ్రహంచే తేరుకొన్నాడు. శుక్రునికి దయకలిగేటట్లు శిష్యుడై సేవించినాడు. బలి భక్తికి శుక్రుడు మెచ్చుకున్నాడు. బలిచేత నియమపూర్వకంగా విశ్వజిద్యాగాన్ని చేయించినాడు. బలిచక్రవర్తికి బంగారు పట్టముచే ఒప్పు రథమూ; సూర్యుని గుర్రాలతో సమానమగు గుర్రాలను, సింహపతాకాన్నీ, దివ్యధనువునూ, అంబులపొదులజంటను, కవచమును మొదట హోమపావకుడిచ్చినాడు. తర్వాత తన తాతగారు ప్రహ్లాదుడు వాడిపోని తామరపూవులదండను, శుక్రుడు చంద్రునివంటి తెల్లని శంఖాన్ని ఇచ్చినారు.

**వ. ఇవ్విధంబున. 440**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఇట్లు

**తా :** ఈ విధంగా

**క. పాణియు, రథియుఁగృపాణియుఁ, దూణియు, ధన్వియును స్రగ్వి తురగియు దేహ**
**త్రాణియు ధిక్కృతవిమత, ప్రాణియు మణికనకవలయపాణియు నగుచున్. 441**

**ప్రతి :** పాణియున్= బాణములుగలవాడు; రథియున్= రథముగలవాడును; కృపాణియున్= ఖడ్గముగలవాడును; తూణియున్= అంబులపొదులు గలవాడును; ధన్వియును= ధనువుగలవాడును; స్రగ్వి= పుష్పమాలగలవాడును; తురగియున్= గుర్రము గలవాడును; దేహత్రాణియున్= కవచముగలవాడును; ధిక్కృత= తిరస్కరించబడిన; విమతప్రాణియు= శత్రుప్రాణులు

గలవాడును; మణికనకవలయ= మణులుచెక్కిన, బంగారుమురుగులుగల; పాణియు= హస్తములు గలవాడును; అగుచున్= అగుచు.

**తా :** బలిచక్రవర్తి బాణాలూ, రథమూ, ఖడ్గమూ, అంబులపొదీ, విల్లూ, పూలదండా, గుర్రమూ, కవచమూ, రత్నఖచితసువర్ణ కంకణాలూ సాధించినాడు.

**మ. పలుదానంబుల విప్రులందనిపి తద్భద్రోక్తులంబొంది పె**
**ద్దలకున్ మ్రొక్కి విశిష్టదేవతల నంతర్భక్తిఁబూజించి, ని**
**ర్మలుఁబ్రహ్లాదునిఁజీరి నమ్రశిరుఁడై రాజద్రథారూఢుఁడై**
**వెలిఁగెన్ దానవభర్త శైలశిఖరోద్వేల్లద్దవాగ్నిప్రభన్. 442**

**ప్రతి :** దానవభర్త= రాక్షసరాజగు బలిచక్రవర్తి; పలుదానంబులన్= బహువిధదానములచే; విప్రులన్= బ్రాహ్మణులను; తనిపి= తృప్తిపరచి; తద్= ఆబ్రాహ్మణులయొక్క; భద్ర= మంగళప్రదములయిన; ఉక్తులన్= మాటలను (అనగా దీవనలను అనుట); పొంది; పెద్దలకున్= వృద్ధులకు; మ్రొక్కి= నమస్కరించి; విశిష్టదేవతలన్= మిక్కిలి ప్రసిద్ధులగు దేవతలను (ఇష్టదేవతలను); అంతర్భక్తిన్= హృదయపూర్వకమయిన భక్తితో; పూజించి= పూజచేసి; నిర్మలున్= నిర్మల చరిత్రుడైన; ప్రహ్లాదునిన్+చీరి= ప్రహ్లాదుని పిలిపించుకొని; నమ్రశిరుఁడై= వంచిన శిరస్సు కలవాడై; రాజత్= ప్రకాశమానమయిన; రథ= తేరునందు; ఆరూఢుఁడై= కూర్చుండినవాడై; శైలశిఖర= పర్వత శిఖరమున; ఉద్వేల్లత్= మిక్కిలి వ్యాపించిన; దవాగ్నిప్రభన్= కార్చిచ్చువలె; వెలిఁగెన్= ప్రకాశించెను.

**తా :** బలిచక్రవర్తి బ్రాహ్మణులకు పలురకములైన దానాలిచ్చి, వారి ఆశీస్సులను పొందినాడు. పెద్దలకు నమస్కరించినాడు, విశిష్టదేవతలను నిండు భక్తితో పూజించినాడు. నిర్మలచరిత్రుడైన ప్రహ్లాదుని పిలిపించుకొని నమ్రశిరస్కుడై నమస్కరించినాడు. దివ్యకాంతులతో తేజరిల్లు రథమునెక్కి, పర్వతశిఖరముపై ప్రజ్వరిల్లుతున్న దావాగ్నివలె జాజ్వల్యమానుడైనాడు (ప్రకాశించాడు).

**క. దండితమృత్యుకృతాంతులు, ఖండితసురసిద్ధసాధ్యగంధర్వాదుల్**
**పిండితదిశు లమరాహిత, దండాధీశ్వరులు సములు దన్నుంగొలువన్. 443**

**ప్రతి :** దండిత= దండింపబడిన; మృత్యు= మృత్యుదేవతయును; కృత+అంతులు= యముడినే ధిక్కరింపగలవారు కాలాంతకులు; ఖండిత= త్రుంపబడిన; సుర= దేవతలు; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; గంధర్వ= గంధర్వులు; ఆదుల్= మొదలుగా గలవారును; పిండిత= చూర్ణంగా చేయబడిన; దిశులు= దిక్కులుగలవారును; (అయిన) అమర+అహిత= దేవవైరులగు రాక్షస; దండాధీశ్వరులు= దండనాయకులు (సేనాధిపతులు); సములు= సమానులయినవారు; తన్నున్= తనను; కొలువన్= సేవింపగా.

**తా :** బలిచక్రవర్తితో సమానమైన బలముగల దైత్యసేనాధిపతులు ఆయనముందు వినమ్రులై నిలిచినారు. వారు మృత్యుదేవతయైన, యముడినే దండింపగల ఉద్దండులు. దేవతలూ, సిద్ధులూ, సాధ్యులూ, గంధర్వులూ మొదలయినవారిని భంగపరచినవారు. దిక్కులను పిండిగొట్టగలిగినవారు.

**క. చూపుల గగనము మ్రింగుచు, నేపున దివిభువియు నాత లీతల సేయన్**
**రూపించుచు దనుజేంద్రుఁడు, ప్రాపించెను దివిజనగరపథము నరేంద్రా! 444**

**ప్రతి :** నరేంద్రా= రాజా!; దనుజ+ఇంద్రుఁడు= (రాక్షసరాజు) బలి; చూపులన్= చూపులతో; గగనమున్= ఆకాశమును; మ్రింగుచున్= కబళించుచు; దివి భువియున్= స్వర్గలోకమును భూలోకమును; ఏపునన్= అతిశయముతో; ఆతల ఈతలచేయన్= ఆ వైపునది ఈ వైపున, ఈ వైపున ఆవైపున పెట్టుటకు; రూపించుచున్= ప్రయత్నిస్తూ; దివిజనగర= అమరనగరముయొక్క; పథమున్= మార్గమును; ప్రాపించెన్= పొందాడు (పట్టెను).

**తా :** పరీక్షిన్నరేంద్రా! బలిచక్రవర్తి తన చూపులతో ఆకాశాన్ని మింగుతూ, నింగినీ నేలనూ తలకిందులుగా చేయడానికి ప్రయత్నిస్తూ దేవతల రాజధానినగరానికి బయలుదేరినాడు.

**వ. ఇట్లు బలవంతుండగు బలి సురేంద్రుని సాధింప సమకట్టి దండగమనంబు సేసి, నిడుద పయనంబులం జని చని. 445**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా, బలవంతుడు+అగు= బల్లిదుడైన; బలి= బలిచక్రవర్తి; సురేంద్రుని= దేవేంద్రుని; సాధింపన్= జయించుటకు; సమకట్టి= ప్రయత్నించి; దండగమనంబు= దండయాత్ర; చేసి= ఒనర్చి; నిడుదపయనంబులన్= దీర్ఘ ప్రయాణములతో; చని చని= నడచి నడచి.

**తా :** ఈ విధంగా బలశాలియైన బలిచక్రవర్తి దేవేంద్రుని జయించి పగతీర్చు కోవటానికి వేగంగా దీర్ఘమైన ప్రయాణం సాగించి.

**మ. కనియెం బుణ్యజనౌకమున్ విగతరోగస్వప్నపీడాన్న ఖా**
**దనసంశోకముఁ బుష్పపల్లవఫలోద్దామద్రుమానీకమున్**
**స్వనితోద్ధూత పతాకముం బ్రవిచరద్వైమానికానీకమున్**
**ఘనగంగాసలిలైకమున్ మఘవయుక్తశ్రీకమున్ నాకమున్. 446**

**ప్రతి :** పుణ్యజన= పుణ్యాత్ములకు; ఓకమున్= నివాసస్థానమైనదియు; విగత= పోయిన; రోగ= రోగములును; స్వప్న= నిద్రయు; పీడ= బాధయు; అన్నఖాదన= అన్నము తినుటయు; సంశోకమున్= దుఃఖముగలదియు; పుష్ప= పూవులచేతను; పల్లవ= చిగుళ్ళచేతను; ఫల= పండ్లచేతను; ఉద్దామ= ఆధికమైన; ద్రుమ= చెట్లయొక్క; అనీకమున్= గుంపుగలదియు; స్వనిత= ఉరుములచేత; ఉద్ధూత= ఎగురగొట్టబడిన; పతాకమున్= జెండాలుగలదియు; ప్రవిచరత్= మిక్కిలిగా సంచరించుచున్న; వైమానిక= విమానస్థులయొక్క; అనీకమున్= సముదాయము కలదియు; ఘన= గొప్పదియగు; గంగా సలిలైకమున్= గంగాజలమయమైనదియు; మఘవ= ఇంద్రునితో; యుక్త= కూడుకొనిన; శ్రీకమున్= లక్ష్మిగలదియు, అగు; నాకమున్= స్వర్గమును; కనియెన్= చూచెను.

**తా :** పుణ్యాత్ములు నివసించుటకు తగినదీ, వ్యాధులనూ, నిద్రనూ, బాధనూ, అన్నం తినటం మొదలయిన దుఃఖాలను బాపునదీ, పూలచేత చిగుళ్లచేత పండ్లచేత గొప్పవయిన చెట్లగుంపులచే ఒప్పునదీ, ఎగురుతున్న జెండాలుకలదీ, సంచరిస్తున్న విమానస్థులగుంపు కలదీ, ఇంద్ర వైభవము కలదీ అగు స్వర్గాన్ని చూచెను. అది దేవేంద్రుని రాజధాని – అమరావతి.

**వ. కని రక్కసులఱేఁడు వెక్కసంబై చాల్పుగల వేల్పులనెలవు దఱియం జొచ్చి, చెచ్చెర ముందటికిం జని చని, ముందట నెడపడక మొనమోసి యిగురుచు చిగురు తలిరాకు జొంపంబునన మొగుడు మొగ్గ యరవిరి**

నెఱవిరి గుత్తి పిందె పూఁప దోరగాయ పండుగెలల తండంబుల వ్రేఁగు లాఁగలేక మూఁగి వీఁగి వ్రేఁకలగు వ్రాఁకుల ప్రోకలకుఁ బేఁట లగు పెందోఁటలును, దోఁటల గాటంబులై నివ్వటిల్లు మవ్వంపుఁ గ్రొవ్విరులకుఁ గవలు వివ్వక కసిమసలు గలిగి ముసరు కొసరి పూని పోని తేనియ లాని విసరు గలిగి మసరు కవిసి క్రొవ్వి రిమ్మగొని జుమ్మెజుమ్మనుచు జంజాటించు తేఁటి దాఁటులును, దాఁటు వడక నాఁటుకొని కూడి జోడు వీడక క్రొమ్మావుల కమ్మని కొమ్మల నిమ్మల ముసరి పసిమిగల కిసలయమ్ములు వొసగంగ మెసంగి కిసరువడక కసరు సెడి బిట్టు రట్టడితనంబు మించి కరాళించు కోయిలల మొత్తంబులును, మొత్తంబులై చిత్తంబులు మత్తంబులుగఁ దత్తఱంబునం దియ్యని పండ్లకుఁ గయ్యంబులు నేసి చయ్యన నెసరేఁగి, బేసంబులు గాసంబులు గొని వాసికెక్కి పలుబాసలాడు బహుప్రకారంబులగు కీరంబులును, గీరంబులకు సరిగడచి మింటనంట నెగసి పెట్టలం బట్టి చీరి యిట్టట్టుఁ జనక నెట్టుకొని నెలవుల వ్రాలుచు నింపుగల రవమ్ములు గలుగు కలరవమ్ములును, గలరవమ్ము లలరం గొలంకుల కెలంకులఁ గడంకలఁ బ్రియల నిడుకొని క్రమ్మి దొమ్మి సేసి యెలదమ్మి తూఁడుల వాఁడులగు చంచువులం జించి మెక్కి చొక్కి మిక్కిలి కలఁకలం బడుచు నలబలంబులు సేయు కలహంసంబులును, హంసరుచి జనిత వికసనముల వికవిక నగుచుం బసగలిగి మిసమిస మెఱచు పసిడి కెందమ్ము లిందిరా మందిరమ్ముల చందంబులుగ నందమ్ములగు కొలంకులును, కొలంకుల కరళ్ళఁ దడిసి వడవడ వడంకుచు నల్లిబిల్లులు గొని సాఁగిన తీగెయిండ్ల గండ్ల యీఱములం దోరములు సెడి పలువిరుల కమ్మవలపుల వ్రేఁగునం దూఱలేక యాడిగిలం బడు గాడ్పులును, గాడ్పుల వలననెగసి గగనమున విరిసి పలువన్నెలం జెన్నగు మేలుకట్టుఁ బుట్టంబుల తెఱంగున దట్టంబులయిన కుసుమ పరాగంబులును, బరాగంబుల సరాగంబులగు వాఁగు వ్రంతల చెంతల గుంపులుగొని గఱిక జొంపంబులు లంపుదిని మంపులుగొని పెల్లు నెమర్లు వెట్టుచు నొదుఁగుల పొదుఁగులు గదల వాడల వాడల జాడలం బరుగులిడు దూడల క్రీడల వేడుకం గూడుకొని యిండ్ల వాకిండ్లకుం జేరి పౌరుల కోరికల కనుసారిక లగుచు నమృతంబు గురియు కామధేనువులును, గామధేనువులకు నిలువ నీడ లగుచు నడిగిన జనమ్ములకు ధనమ్ములు ఘనమ్ముగఁ బుడుకు కల్పతరువులును, కల్పతరువుల పల్లవ మంజరులఁ గుంజరులకు విఱచి యిచ్చుచు, మచ్చికల కలిమి నిచ్చ మెచ్చుచుఁ గృతకగిరుల చఱుల సిరుల నదరు పదఁతుల నడలకు గురువు లగుచు మెఱయు మురువుల నొత్తరించు మత్తేభంబులును, నిభంబుల సరస నొరసికొని వరుసఁ బరుసఁదనము లెడలి సుకరములగు మకరతోరణస్తంభంబులును, తోరణస్తంభంబుల చేరువ నిలిచి చెఱకు విలుతుం డొఱ వెఱికిన బెడిదములగు నవకంపు మెఱుఁగుం జిగురు టడిదముల తెఱంగున నిలుకడ సంపదలు గలుగు శంపల సొంపునం గరచరణాది శాఖలు గల చంద్రరేఖల పోఁడిమిని వాహిని గల మోహినీ విద్యల గ్రద్దనఁ జూపులకుం దీపు లొదవించుచు మర్మకర్మంబు వశంబు లరయు యశంబులు గలిగి యనూనంబు లగు విమానంబు లెక్కి చచ్చి వచ్చిన సచ్చరిత్రులకుం జెచ్చెర నెదురు చని తూకొని తోకొని పోవు రంభాది కుంభికుంభకుచల కలకలంబులును, గలహంస కారండవ కోక సారసబృంద సుందర సుందరియు, నిందీవరారవింద నందదిందిందిరయు, నభంగయు నగు గంగ నింగికిం బొంగెనో యని మిగుల దిగులువడఁ బొగడ్తల కెక్కిన యగడ్తలును, నగడ్తల మిన్నేటి తేటనీట నీటులీను పాటి

సూటి చల్లులాటలు మేటి కూటువలు గొనుచు నేచిన ఖేచర కన్యకావారంబులును, వారవనితానుపూజిత రాజిత దేహళీ పాటవంబులగు గోపుర కనక కవాటంబులును, గవాట వేదికాఘటిత మణిగణ కిరణోదారంబు లగు నింద్రనీల స్తంభ గంభీరతలును, గంభీర విమల కమల రాగ పాలికా మాలికా వారంబులగు చతుర్ద్వారంబులును, ద్వార దేశంబుల చావిళ్ళం గావళ్లుండి ప్రొద్దువోక రక్కసుల వేల్పుల కయ్యంబులు నెయ్యంబులు సెప్పికొనుచున్న యస్త్ర శస్త్రధారులు శూరులు నయిన మహాద్వారపాలక వీరులును, వీరరస జలధివేలోదారంబులయి శుద్ధస్ఫటికబద్ధ మహోత్తానంబులగు సోపాన సుభగాకారంబులును, సుభగాకార ప్రదీప్రంబులగు వజ్రమహారజత వప్రంబులును, వప్రోపరి వజ్రకుడ్య శిరోభాగ చంద్రకాంత తరుణ హిమకరకిరణ ముఖరంబు లగు సాలశిఖరంబులును; శిఖర స్తోమధామ నికృత్తతారకంబులును, దారతార మణి శిలా కఠోరంబు లగుచు మిగుల గరిత యగు నగరిసిరి మీఱ నమరు మొగిలు వొడగని నిలుకడలకు నలువ నడిగికొని పడసిన పసిండి తెరలు వలువల బెడంగునం దోరంబులగు ప్రాకారంబులును,బ్రాకార కాంచనాంచిత యుద్ధసన్నద్ధ మహోఖర్వ గంధర్వ వాహినీ పాలకంబులగు మరక తాట్టాలకంబులును, నట్టాలకోత్తుంగ వజ్రమయస్తంభోదంచనంబులును, బరభట ప్రాణవంచనంబులు సముదంచనంబులు నగు దంచనంబులును, దంచనంబుల తుదను రథంబుల యిరుసులు నొరసికొనం, గోట యీవలి యావలి తివియని దివియల కరణి రుచిరము లగుచుఁ బచరించు నహిమకర హిమకర మండలంబులును, హిమకర మండలంబు నిద్దంపు టద్దంబని మూఁగి తొంగి చూచుచు నళిక ఫలకంబులఁ గులకములు గొను నలకములం దరపి తిలకములం దెఱఁగు పఱచుకొని సమయముల వెనుక నొదిగి కదిసి ముకురంబులం బ్రతిఫలితులైన పతు లితర సతుల రతుల కనుమతులని కనుకనిన్ మరలి నీడ తలంగినం గలంగి చని కాంతలకు సొలయు ముగుదలకు నేకాంతంబులై గగన సముత్సేధంబులైన రాజసౌధంబులును, సౌధంబుల సీమల ముత్తియంపు సరులతోడి నిబ్బరపు గుబ్బచన్నులు చెన్నులం బ్రక్కలం జుక్కపదవులుండ మండిత సౌధ శిఖరంబులకు శృంగారంబులయిన భృంగారంబులును, భృంగారశయన జాలక డోలికా శ్రేణికాది విశేషరమ్యంబులైన హర్మ్యంబులును, హర్మ్యకనక గవాక్షరంధ్ర నిర్గత కర్పూర కుంకుమాగరు ధూపధూమంబులును, ధూమంబులు జీమూత స్తోమంబులని ప్రేమంబు లుబ్బ గొబ్బునం దబ్బాటు పబ్బంబు లబ్బెనని మరులుగొని పురుల వన్నియల సిరులు సరులు గొనం గుటవిటపములఁ దటపెట నటించుచుఁ బలుకులు విసిరి కికురువొడుచు వలతేని మఱుఁగు చదువుల టీక లనం గేకలిడు నెమిళ్లును, నెమిళ్ల పురుల నారలు నారులగు రతనంపు విండ్ల నినదంబులను తలంపుం దోఁకలు వడసి వీఁకలు మెఱసి మూఁకలు గొని దివికెగిరి రవికిం గవిసిన రాహువు క్రియం దివిఁ దడంబడు పడగలును, బడగలును గొడుగులును దమకు నాలంబులకు నడియాలంబులుగఁ దోరంబులైన సారంబుల బీరంబులు మెఱసి బెబ్బులుల గబ్బునం గరుల సిరుల సింగంబుల భంగుల శరభంబుల రభసంబుల ధూమకేతువుల రీతుల వైరిం జీరికిం గొనక శంకలుడిగి అంకెలిడుచు లంకెలై లెక్కకు మిక్కిలి యగుచు రక్కసుల చక్కటి యెక్కటి కయ్యముల దయ్యము లెఱుంగం దిరుగు వీరభట కదంబంబులును, గదంబకరవాల శూలాదుల మెఱుంగులు మెఱపుల తెఱంగుల దిశల చెఱంగులం దుఱంగలింప నేమి నినదంబులు

దళములగు నుఱుములుగ నడమొగిళ్ళ పెల్లునం బ్రవర్షిత రథికమనోరథంబులగు రథంబుల గములును గములుగొని గమనవేగముల వలన హరిహరుల నగి గాలిం జాలింబడ గేలికొని ఘనంబులగు మనంబులం దెగడి నెగడు సురంగంబులగు తురంగంబులును, రంగదుత్తుంగ విశద మదకలకరటి కటతట జనిత మదసలిల కణగణ విగళిత దళశతనయన భుజ సరళ మిళిత లలిత నిఖిల దిగధిపతి శుభకరకర కనకకటకఘటిత మణిసముదయ సముదిత రేణువర్గ దుర్గమంబు లయిన నిర్వక్రమార్గంబులును, మార్గస్థలోపరి గతాగత శతశతాయుతానేక గణనాతీత రోహణాచల తట విరాజమానంబులగు విమానంబులును, విమాన విహరమాణ సుందర సుందరీ సందోహ సంవాదిత భూరిభేరీ వీణా పణవ మృదంగ కాహళ శంఖాది వాదనా నూన గాన సాహిత్య నృత్య విశేషంబులును, విశేషరత్న సంఘటిత శృంగార శృంగాటక వాటికాదేహ దేహళీ ప్రదీపంబులును, దీపాయమాన మానిత సభామండప ఖచిత రుచిర చింతారత్నంబులునుం గలిగి రత్నాకరంబునుం బోలె ననిమిషకౌశిక వాహినీ విశ్రుతంబయి, శ్రుతివాక్యంబునుం బోలె నకల్మష సువర్ణప్రభూతంబయి, భూతపతి కంఠంబునుం బోలె భోగిరాజకాంతంబయి, కాంతాకుచంబునుం బోలె సువృత్తంబయి, వృత్తజాతంబునుం బోలె సదా గురులఘు నియమాభిరామంబయి, రామచంద్రుని తేజంబునుం బోలె ఖర దూషణాది దోషాచరానుపలబ్ధంబయి, లబ్ధవర్ణు చరిత్రంబునుం బోలె నమలాంతరంగ ద్యోతమానంబయి, మానధనుని నడవడియునుం బోలె సన్మార్గభాతి సుందరంబయి, సుందరోద్యానంబునుం బోలె రంభాంచితాశోక పున్నాగంబయి పున్నాగంబునుం బోలె సురభి సుమనో విశేషంబయి, శేషాహిమస్తంబునుం బోలె నున్నతక్షమావిశారదంబయి, శారదసముదయంబునుంబోలె ధవళ జీమూత ప్రకాశితంబయి, సితేతరాజిన దానంబును బోలె సరసతిలోత్తమంబై, యుత్తమ పురుష వచనంబునుం బోలె ననేక సుధారస ప్రవర్షంబై, వర్షాదియునుం బోలె నుల్లసదింద్ర గోపంబయి, గోపతి మూఁపురంబునుం బోలె విచక్షురార్యాలంకృతంబయి, కృతార్థం బయిన యమరావతీ నామనగరంబు సేరం జని కోటచుట్టునుం బట్టు గలుగ బలంబులఁ జలంబున విడియం బంచి పొంచి మార్గంబు లెల్ల నరికట్టుకొని యేమఱక యుండె; నంత. **447**

ప్రతి : కని= చూచి; రక్కసులఱేఁడు= రాక్షసరాజు; వెక్కసంబై= అధికమై; చాల్పుగల= వరుసగలిగిన; వేల్పుల= దేవతలయొక్క; నెలవున్= నివాసమును; దఱియన్= సమీపింపగా; చొచ్చి= ప్రవేశించి; చెచ్చెరన్= వేగంగా; ముందటికిన్= ముందునకు; చనిచని= వెళ్ళివెళ్ళి; ముందటన్= ఆపైని; ఎడపడక= ఎడములేక; మొనన్= కొనను; మోసి= ఆనించి; ఇగురుచు= చిగురువెట్టుచున్న; చిగురు= చిగిర్చిన; తలిరు+ఆకుజొంపంబు= లేతాకు గుబురునందు; నన= పూవు; మొగుడుమొగ్గ= ముకుళితమగు మొగ్గ; అరవిరి= సగమువికసించినపూల; నెఱవిరి= నిండుగావికసించినపూల; గుత్తి= గుత్తుల యొక్క; పిందె= పిందెలయొక్క; పూప= లేతకాయలయొక్క; దోరగాయ= ముదిరిన కాయలయొక్క; పండు= పండ్లయొక్క; గెలలతండంబుల= గెలల సమూహంయొక్క; వ్రేఁగులు= బరువులు; ఆగలేక= మోయజాలక; మూఁగి= గుంపులయి; వీఁగి= చలించి; వ్రేఁకలు+అగు= బరువులయిన; మ్రాఁకుల= చెట్లయొక్క; ప్రోకలకున్= ప్రోగులకు; పేఁటలు+అగు= పట్టలయిన; పెందోటలును= పెద్దతోటలును; తోఁటలన్= ఆ తోటలందు; గాటంబులై= దట్టములై; నివ్వటిల్లు= ఒప్పుచున్న;

మవ్వంపు= కోమలములగు; క్రొవ్విరులకున్= క్రొత్తపుష్పములకు; కవలు= జంటలు; వివ్వక= విడువక; కసిమసలుగలిగి= విజృంభించి; ముసరి= మూగి; కొసరి= కోరి; పూని= ప్రయత్నించి; పోనితేనియలు= ఇష్టమైనతేనెలు; ఆని= త్రాగి; విసరుగలిగి= రెక్కలను కదల్చుచు; మసరుకవిసి= ఆవేశము దెచ్చుకొని; క్రొవ్వి= బలిసి; రిమ్మకొని= ఉన్మాదమును చెంది; జుమ్మజుమ్మ+అనుచు= జుమ్మజుమ్మని; జంజాటించు= రొదచేసే; తేటిదాఁటులును= తుమ్మెదలబారులును; దాఁటుపడక= ఉల్లంఘనముపొందక; నాఁటుకొని= స్థిరపడి; కూడి= చేరి; జోదువీడక= జతవిడువక; క్రొమ్మావుల= క్రొత్తమామిడిచెట్లయొక్క; కమ్మని= సువాసనగల; కొమ్మలన్= శాఖలయందు; ఇమ్ములన్= చక్కగా; ముసరి= చుట్టుకొని; పసిమిగల= నూతనకాంతిగల; కిసలయమ్ములు= చిగుళ్లు; పొసంగన్= ఒప్పునట్లు; మెసంగి= తిని; కిసరువడక= కోపం చెందక; కసరుసెడి= చలనంలేక; బిట్టు= అధికమయిన; రట్టడితనంబులు= నింద్యమైనపనులు; అలమి= చుట్టుకొని; మించి= మితిమీరి; కరాళించు= కూయునట్టి; కోయిలల= పికములయొక్క; మొత్తంబులును= గుంపులును; మొత్తంబులై= సంఘములుగా గూడి; చిత్తంబులన్= హృదయాలలో; మత్తంబులుగన్= మదించినవై; తత్తఱంబునన్= తొట్రుపాటుతో; తియ్యని పండ్లకున్= మధురఫలాలకు; కయ్యంబులు+చేసి= పోట్లాడి, (మూగి); చయ్యనన్= వేగంగా; ఎసరేఁగి= విజృంభించి; పేసంబులు= పేసెములు (పండ్లలోని గుజ్జు); గాసంబులు= (గ్రాస) ఆహారములుగా; కొని= సేవించి; వాసికెక్కి= ప్రసిద్ధికెక్కి; పలుబాసలు+ఆడు= అనేకములగు పలుకులు పలికే; బహుప్రకారంబులగు= అనేకవిధములయిన; కీరంబులును= చిలుకలును; కీరంబులకున్= చిలుకలకు; సరిగడచి= అతిక్రమించి; మింటన్= ఆకాశాన్ని; అంటన్= తాకునట్లు; ఎగసి= లేచి; పెట్టలన్= ఆడు పులుగులను; పట్టి= పట్టుకొని; చీరి= పిలిచి; ఇట్టు+అట్టు= ఇటునటు; చనక= పోక; నెట్టుకొని= అతిశయించి; నెలవులన్= ఉనికిపట్లయందు; వ్రాలుచున్= దిగుచు; ఇంపుగల= చక్కని; రవమ్ములుగలుగు= ధ్వనులుగల; కలరవమ్ములును= పావురములును; కల+రవమ్ములు= అవ్యక్త మధుర ధ్వనులు; అలరన్= ఒప్పునట్లు; కొలంకుల= కొలనులయొక్క; కెలంకులన్= పార్శ్వాలలో; ప్రియలన్= ఇష్టమైన ఆడుపిట్టలను; ఇడుకొని= పెట్టుకొని; క్రమ్మి= చుట్టుకొని; దొమ్మి+చేసి= కలహించి; ఎలదమ్మితూఁడులన్= లేతతామరతూండ్లను; వాఁడులు+అగు= నిశితములైన (వాడిగల); చంచువులన్= ముక్కులచే; చించి= చీల్చి; మెక్కి= తిని; చొక్కి= సొమ్మసిలి; మిక్కిలి= ఎక్కువ; కలకలంబడుచున్= తొట్రుపాటు చెందుతూ; అలబలంబులు= కలకలములు; చేయు= ఒనర్చునట్టి; కలహంసంబులును= రాజహంసలును; హంస= అంచలయొక్క; రుచి= కాంతిచే; జనిత= పుట్టిన; వికసనములన్= ప్రకాశములచే; వికవికనగుచున్= పకపక నవ్వుతూ; పసగలిగి= మెరుగుగలిగి; మిసమిస= కోమలములై; మెఱచు= మెరయుచున్న; పసిడి కెందమ్ములు= బంగారపుఎఱ్ఱదామరలు; ఇందిరా= లక్ష్మియొక్క; మందిరమ్ముల= గృహాల; చందంబులుగన్= విధాలుగా; అందమ్ములు+అగు= చక్కనయిన; కొలంకులును= సరస్సులును; కొలంకుల కరళ్ళన్= సరస్సులకెరటాలచే; తడిసి= నాని; వడవడ వడంకుచున్= వడవడవణకుతూ; అల్లిబిల్లులుగొని= చిక్కుచిక్కులుగా; సాఁగిన= ప్రాకిన; తీఁగెయిండ్ల= లతామందిరముల యొక్క; గండ్ల= గంతలుగల; ఈరములన్= పొదలయందు; తోరములు+చెడి= ఆధిక్యతలుచెడి; పలువిరుల= అనేక పుష్పాలయొక్క; కమ్మవలపుల= కమ్మనయిన పరిమళములయొక్క; వ్రేఁగునన్= భారముచే; తూఱలేక= లోపలికి చొరలేక; ఈడిగిలంబడు= చతికిలబడునట్టి; గాడ్పులును= వాయువులును; గాడ్పులవలనన్= వాయువులచే; ఎగసి= ఎగిరి; గగనమునన్= ఆకసమునందు; విరిసి= విడిపోయిన; పలువన్నెలన్= అనేకవిధములయిన వర్ణములతో; చెన్నగు= ఒప్పుచున్న; మేలుకట్టుఁబుట్టంబుల= మేలు కట్టుబట్టల; తెఱంగునన్= విధముగా; దట్టంబులు+అయిన= దళములయిన; కుసుమపరాగంబులును= పుప్పొడులును; పరాగంబులన్= పుప్పొడులచే; సరాగంబులు+అగు= ఒద్దికలు కలవియైన (రక్తిమముతో కూడినవగు); వాఁగు= ఏరులయొక్క; ప్రంతల= పల్లపు ప్రాంతాల (ఏరుల); చెంతలన్= చేరువలలో; గుంపులుగొని= మందలుగాజేరి; గఱిక జొంపంబులు= గరిక

చివుళ్లయొక్క; లంపు= దొంగమేత; తిని= మేసి; మంపులుగొని= మత్తులెక్కి; పెల్లునెమర్లు= ఎక్కువగా నెమరులు; పెట్టుచున్= పెట్టుచు (నెమరు వేసికొంటూ); ఒదుగుల= సమృద్ధములగు; పొదుగులు= పాలిండ్లు; కదలన్= చలించుచుండగా; వాడలవాడల= వీధులవీధులయొక్క; జాడలన్= మార్గములలో; పరుగులిడు= పరుగులెత్తుచున్న; దూడల= లేగలయొక్క; క్రీడల= ఆటలయొక్క; వేడుకలన్= వినోదములను; కూడుకొని= చేరుకొని; ఇండ్లవాకిళ్లకున్+చేరి= ఇండ్లవాకిళ్ల దగ్గరకు చేరుకొని; పౌరుల= పురజనులయొక్క; కోరికలకున్= వాంఛలకు; అనుసారికలు+అగుచున్= అనుసరించినవి (కూడుకొనినవి)యై; అమృతంబున్= సుధను (పాలను); కురియు= వర్షించునట్టి (ఇచ్చునట్టి); కామధేనువులును=కోరికలను దీర్చునట్టి ఆ యావులును; కామధేనువులకున్= గోవులకు; నిలువన్= ఉండుటకు; నీడలు+అగుచున్= ఉనికిపట్లగుచు; అడిగిన= కోరిన; జనమ్ములకున్= మనుజులకు; ధనమ్ములు= ద్రవ్యములు; ఘనమ్ముగన్= ఎక్కువగా; పుడుకు= దానముచేయునట్టి; కల్పతరువులును= కల్పవృక్షములును; కల్పతరువుల= కల్పవృక్షములయొక్క; పల్లవమంజరులన్= చిగుళ్లగుత్తులను; కుంజరులకున్= ఆడు ఏనుగులకు; విఱచి= త్రెంచి; ఇచ్చుచున్= ఒసంగుచు; మచ్చికలకలిమిన్= స్నేహసౌభాగ్యమును; ఇచ్చన్= ఇష్టంతో; మెచ్చుచున్= మెచ్చుకొనుచు; కృతకగిరుల= కేళికై కల్పింపబడిన పర్వతముల; చఱుల= చఱియలయొక్క; సిరులన్= సంపదలచే; అదరు= ప్రకాశించునట్టి; పడఁతుల= ఆఁడు ఏనుగులయొక్క; నడలకున్= నడకలకు; గురువులు+అగుచు= ఉపాధ్యాయులగుచు; మెఱయు= ప్రకాశించునట్టి; మురువులన్= అందములను; ఒత్తరించు= ఆక్రమించునట్టి; మత్తేభంబులును= మదగజంబులును; ఇభంబుల= ఏనుగులయొక్క; సరసన్= దగ్గర; ఒరసికొని= ఒత్తుకొని; వరుసన్= క్రమముగా; పరుసందనములు= కఠినత్వములు; ఎడలి= నశించి; సుకరములగు= చక్కగా అమర్చబడిన; మకరతోరణస్తంభంబులును= మొసలిరూపమేర్పడజేసిన తోరణముగట్టు స్తంభములును; తోరణస్తంభముల= అట్టికంబములయొక్క; చేరువన్+నిలిచి= సమీపమందు నిలిచి; చెఱకువిలుతుండు= మన్మథుడు; ఒరవెఱికిన= ఒరనుండితీసిన; బెడిదములు+అగు= భయంకరము లయినట్టి; నవకంపు= నూతనములయిన; మెఱుఁగున్+చిగురుటడిదములతెఱంగునన్= కాంతిగల చిగురుకత్తుల విధముగా; నిలుకడ= స్థిరమైన; సంపదలు+కలుగు= సంపత్తులుగల; శంపలసొంపునన్= మెరుపుల విధముగా; కర= హస్తములు; చరణ= పాదములు; ఆది= మొదలయిన; శాఖలుగల= కొమ్మలుగలిగినట్టి; చంద్రరేఖలపోఁడిమిని= చంద్రకళలతీరున; వాహినిగల= (రూపుదాల్చిన) వాగ్ధోరణిగల; మోహినీవిద్యల= మోహినీవిద్యలవలె; గ్రద్దనన్= వేగంగా; చూపులకున్= దృష్టులకు; తీపులు= తియ్యదనములు (హాయిని); ఒదవించుచున్= కలిగిస్తూ; మర్మకర్మంబు= రహస్యపు పనులయొక్క; వశంబులు= అధీనతలను; అరయు= విచారించు; యశంబులుగలిగి= కీర్తులుగలిగి; న+ఊనంబులగు= అధికములగు; విమానంబులెక్కి= విమానములనధిష్ఠించి, చచ్చి= మృతినిచెంది; వచ్చిన; సత్+ చరిత్రులకున్= యోగ్యమయిన చరిత్రలుగలవారికి; చెచ్చెరన్= శీఘ్రముగా; ఎదురుచని= ఎదురుగాపోయి; తూకొని= ఎత్తుకొని; తోకొనిపోవు= వెంటనిడుకొనిచను; రంభాది= రంభమొదలయిన; కుంభికుంభకుచల= ఏనుగు కుంభస్థలములవంటి స్తనములుగల స్త్రీలయొక్క (అప్సరసలయొక్క); కలకలంబులును= అవ్యక్తమధుర ధ్వనులును; కలహంస= రాజహంసల; కారండవ= కన్నెలేడిపిల్లల; కోక= చక్రవాకముల; సారస= బెగ్గురుపక్షుల; బృంద= సముదాయముయొక్క; సుందర= చక్కదనముకల్గిన; సుందరియు= అందముగలదియు; ఇందీవర= నల్లగలువలచేతను; అరవింద= పద్మములచేతను; నందత్= ఆనందించే; ఇందిందిరయున్= తుమ్మెదలుగలదియు; అభంగము= అడ్డులేనిదియును; సభంగయున్= కెరటములతో కూడినదియును; అగు; గంగ= గంగాజలము; నింగికిన్= ఆకాశముమీదికి; పొంగెను+ఓ+అని= పొంగెనేమోయని; మిగులన్= మిక్కిలి; దిగులుపడన్= ఖేదమునొందగా; పొగడ్తలకు= స్తోత్రములకు; ఎక్కిన= పాత్రములయిన; అగడ్తలును= పరిఘలును; అగడ్తల= అగడ్తలయొక్క; మిన్నేటి= ఆకాశగంగానదియందలి; తేటనీటన్= నిర్మలమైన నీటియందు; నీటులు=

అందములు; ఈనుపాటి= ప్రసవించునంతటి; సూటి= నిబ్బరమగు; చల్లులాటలు= జలక్రీడలు; మేటికూటువలు= పెద్దగుంపులు; కొనుచున్= కూడుకొనుచు; ఏచిన= అతిశయించిన; ఖేచరకన్యకా= దేవకన్యకలయొక్క; వారంబులును= సముదాయములును; వారవనితా= గణికాంగనలచే; అనుపూజిత= చక్కగాపూజింపబడి; రాజిత= ప్రకాశింపచేయబడిన; దేహళీ= గడపలచే; పాటవంబులు+అగు= పటుత్వముగలవియైన; గోపుర= గోపురములయొక్క; కనక కవాటంబులును= బంగారుతలుపులును; కవాటవేదికా= తలుపుతిన్నెలయందు; ఘటిత= కూర్పబడిన; మణిగణ= రత్నసముదాయములయొక్క; కిరణ= అంశుజాలములచే (కాంతులచే); ఉదారంబులు+అగు= ఉన్నతములయిన; ఇంద్రనీలస్తంభ= హరినీల నిర్మితములగు స్తంభములయొక్క; గంభీరతలును= గాంభీర్యములును; గంభీర= లోతైన; విమల= నిర్మలమయిన; కమలరాగ= పద్మరాగమణులయొక్క; పాలికా= మూకుడుల; మాలికా= వరుసలయొక్క; వారంబులగు= సముదాయములుగలవియగు; చతుర్+ద్వారంబులును= నాలుగు గుమ్మములుగల మందిరములును (చక్కని దువారములును); ద్వార దేశంబులన్= ద్వారప్రదేశములయందును; చావిళ్లన్= చావిడులయందును; కావళ్లుండి= రక్షకులుగా నుండి; ప్రొద్దు+పోక= కాలము జరుగక; రక్కసుల= రాక్షసులయొక్క; వేల్పుల= దేవతలయొక్క; కయ్యంబులు= యుద్ధములు; నెయ్యంబులన్= ప్రేమములతో; చెప్పికొనుచున్న= వక్కాణించుకొనుచున్న; అస్త్రశస్త్రధారులు= అస్త్రములుశస్త్రములు ధరించినవారును; శూరులున్= పరాక్రమవంతులును; అయిన; మహాద్వారపాలకవీరులును= ఘనులును శౌర్యవంతులును అగు ద్వారపాలకులును; వీరరసజలధి= వీరరసమనే సముద్రమునకు; వేలా+ఉదారంబులు+అయి= చెలియలికట్టలు కడచినవయి; శుద్ధ= స్వచ్ఛమైన; స్ఫటిక= పటికపురాళ్లచే; బద్ధ= కట్టబడిన; మహా+ఉత్తానంబులు+అగు= మిగుల ఎత్తు అయిన; సోపాన= మెట్లయొక్క; సుభగాకారంబును= చక్కనియాకారములు గలవియు; సుభగాకార= చక్కనియాకారముగల; ప్రదీప్రంబులగు= మిక్కిలి ప్రకాశించే; వజ్రమహారజత= వజ్రములచేత, బంగారముచేత తయారైన; వప్రంబులును= కోటబురుజులును; వప్ర+ఉపరి= కోటబురుజులమీదనున్న; వజ్రకుడ్య= వజ్రపుగోడలయొక్క; శిరోభాగ= మీది ప్రదేశమందలి; చంద్రకాంత= చంద్రకాంతశిలలయొక్క; తరుణ= లేతనయిన; హిమకర= చంద్రునియొక్క; కిరణ= సమూహములచే; ముఖరంబులు+అగు= వెల్లివిరిసిన; సాలశిఖరంబులును= బురుజులయొక్క శిఖరములును; శిఖర= కోటకొమ్మలయొక్క; స్తోమ= సముదాయపు; ధామ= కాంతిచే, నికృత్త= మసకబారిన, తారకంబులు= నక్షత్రములు; ఉదార= మిక్కిలి; తార= మెరిసే; మణిశిలా= వజ్రపురాళ్లు; కఠోరంబులు+అగుచున్= కఠినమయినవై; మిగులన్= మిక్కిలి; గరితయగు= ఇల్లాలగు; నగరిసిరిన్= పురలక్ష్మిని; మీఱన్= అతిశయించునట్లు; అమరు= ఒప్పునట్టి; మొగులు+పొడగని= మబ్బునుజూచి; నిలుకడలకున్= నివాసములకు; నలువన్= బ్రహ్మను; అడిగికొని= యాచించి; పడసిన= పొందిన; పసిఁడి= బంగారపు; తెరలు= పరదాలయొక్క; వలువల= బట్టలయొక్క; బెడంగునన్= అందముతో; తోరంబులగు= అధికములయిన; ప్రాకారంబులును= వరణంబులును (మేడలకూ, గుళ్లకూ, చుట్టూ ఉండేగోడలు); ప్రాకార= ప్రాకారములయందలి; కాంచన= బంగారముచే; అంచిత= ఒప్పుచున్న; యుద్ధ= సంగరమునకు; సన్నద్ధ= లెస్సగా కూర్పబడిన; మహా= గొప్పవియు; అఖర్వ= ఉన్నతములయిన; గంధర్వవాహినీ= గంధర్వసేనలకు; పాలకంబులు+అగు= పాలించునవియగు; మరకత= మరకతమణులచే నిర్మించబడిన; అట్టాలకంబులును= కోటబురుజులును; అట్టాలక= కోటబురుజులమీద; ఉత్తుంగ= ఎత్తయిన; వజ్రమయ= వజ్రములచే నిండిన; స్తంభ= స్తంభములచే; ఉదంచనంబులును= విజృంభించునవియు; పరభట= శత్రుభటులయొక్క; ప్రాణ= ప్రాణములను; వంచనంబులు= వంచించునవియు; సముదంచనంబులున్= ఒప్పుచున్నవియు; అగు= అగునట్టి; దంచనంబులును= పెద్దఫిరంగులును; దంచనంబుల= ఫిరంగులయొక్క; తుదను= కొసలను; రథంబుల= తేరులయొక్క; ఇరుసులున్= ఇరుసులును; ఒరసికొనన్= రాపాడగా; కోట= దుర్గముయొక్క; ఈవలి+ఆవలి= ఈవైపున ఆవైపున ఉన్న;

తివియని= ఆర్పని; దివియలకరణిన్= దీపాలవలె; రుచిరములగుచున్= ప్రకాశమానములై; పచరించు= ప్రవర్తించు; అహిమకర= సూర్యునియొక్క; హిమకర= చంద్రునియొక్క; మండలంబులును= బింబములును; హిమకరమండలంబు= చంద్రబింబమును; నిద్దంపు+అద్దంబు+అని= నున్ననైన అద్దమని; మూఁగి= చేరి; తొంగిచూచుచున్= వ్రాలి కనుచు; అళికఫలకంబులన్= నొసళ్లయందు; కులకములు+కొను= లంకెలులంకెలగు; అలకములన్= ముంగురులచే; తరపి= అడగిన; తిలకములన్= బొట్టులను; తెఱఁగుపఱుచుకొని= చక్కగా దిద్దికొని; సమయములన్= వేళలయందు; వెనుకనొదిగి= వెనుకదాగి; కదిసి= దగ్గర చేరి; ముకురంబులన్= అద్దములయందు; ప్రతిఫలితులైన= ప్రతిఫలించిన ఆకారముకలవారగు; పతులు= భర్తలు; ఇతరసతుల= పరస్త్రీలయొక్క; రతులకు+అనుమతులు+అని= కేళులకు ఇష్టపడినవారని; కనుకనిన్= సంభ్రమముతో; మరలి= తిరిగి; నీడతలంగినన్= చాయ మాటువడగా; కలంగి= కలతనొంది; చని= వెళ్ళి; కాంతులకున్= భర్తలకు; పొలయు= పరవశించే; ముగుదలకున్= ముద్దరాండ్రకు; ఏకాంతంబులై= రహస్యములై; గగనసముత్సేధంబులు= ఆకాశమువరకు పెరిగినవి; ఐన= అయినట్టి; రాజసౌధంబులును= రాజులమేడలును; సౌధంబులసీమలన్= మేడల సరిహద్దు స్థలములందు; ముత్తియంపుసరులతోడి= ముత్యాల సరములతోకూడిన; నిబ్బరపు= తిన్ననయిన; గుబ్బచన్నులు= గుండ్రములైన స్తనములయొక్క; చెన్నులన్= అందముతో; ప్రక్కలన్= పార్శ్వములయందు; చుక్కపదవులు+ఉండన్= నక్షత్రములగుంపులుండగా; మండిత= అలంకరించబడిన; సౌధశిఖరంబులకున్= మేడలపైభాగానగల శిఖరాలకు; శృంగారంబులు+అయిన= అలంకారములయిన; భృంగారంబులును= బంగారుగిండియలును; భృంగార= బంగారంతో చేసిన; శయన= శయ్యలు; జాలక= కిటికీలు; డోలికా= ఊయ్యెలలు; శ్రేణికా= నిచ్చెనలు; ఆది= మొదలయినవానిచే; విశేషరమ్యంబులు+అయిన= మిక్కిలి మనోహరములయిన; హర్మ్యంబులును= మేడలును; హర్మ్య= మందిరములయొక్క; కనకగవాక్ష= బంగారు కిటికీలయొక్క; రంధ్ర= కన్నములనుండి; నిర్గత= బయలువెడలిన; కర్పూర= కప్పురములయొక్క; కుంకుమ= కుంకుమయొక్క; అగరుధూప= అగరుధూపములయొక్క; ధూమంబులును= పొగలును; ధూమంబులు= పొగలు; జీమూత= మేఘములయొక్క; స్తోమంబులు+అని= సమూహములని; ప్రేమంబులుబ్బన్= ఇష్టములు ఉప్పతిల్లుచుండగా; గొబ్బునన్= శీఘ్రముగా; డబ్బాటు పబ్బంబులు= హఠాత్తుగా వచ్చిన పండుగలు; అబ్బెను+అని= లభించెనని; మరులుగొని= మమతలజెంది; పురుల= పింఛములయొక్క; వన్నియల= రంగులయొక్క; సిరులు= సంపదలు; సరులుగొనన్= దండలుగట్టగా; కుట= చెట్లయొక్క; విటపములన్= చిగిర్చిన కొమ్మలయందు; తటపెట= తటపెటయను ధ్వనులతో; నటించుచున్= ఆడుచు; పలుకులు= మాటలు; విరిసి= వికసించి; కికురువొడుచు= వంచించునట్టి; వలఱేని= మన్మథునియొక్క; మఱుఁగు చదువుల= మన్మథ రహస్య విద్యలయొక్క; టీకలు+అనన్= వ్యాఖ్యలనునట్లు; కేకలిడు= కేకలువెట్టునట్టి; నెమిళ్లును= మయూరములును; నెమిళ్ల= మయూరములయొక్క; పురులనారలు= పింఛములయొక్క పీచులు; నారులు+అగు=అల్లెత్రాడులగునట్టి; రతనంపువిండ్ల= రత్నధనుస్సులయొక్క; నినదంబులను= ధ్వనులను; తలంపుందోఁకలు= వాంఛలనేవాలములు; పడసి= పొంది; వీఁకలుమెఱసి= ధైర్యములొప్పు; మూఁకలుగొని= గుంపులుగాగూడి; దివికెగరి= ఆకాశము మీదికి లంఘించి; రవికిన్= సూర్యుని; కవిసిన= పట్టుకొనబోయిన; రాహువుక్రియన్= రాహుగ్రహమువలె; దివిన్= ఆకాశమందు; తడంబడు= తొట్రుబడుచున్న; పడగలును= జెండాలును; గొడుగులును= ఛత్రములును; తమకున్= తమకు; ఆలంబులకున్= యుద్ధములకు; అడియాలంబులుగన్= చిహ్నములుగా (గురుతులుగ); తోరంబులైన= అధికములయిన; సారంబుల= శక్తులయొక్క; బీరంబులు= పౌరుషంబులు; మెఱసి= ప్రకాశించి; బెబ్బులుల గబ్బునన్= పెద్దపులుల మదముతో; కరులసిరులన్= గజసంపదతో; సింగంబుల భంగులన్= సింహముల రీతులతో; శరభంబుల రభసంబులన్= శరభముల (మీగండ్లమెకముల) యొక్క వేగములతో; ధూమకేతువుల రీతులన్= తోక్కచుక్కల

విధములతో; వైరిన్= శత్రువును; చీరికిన్+కొనక= లక్ష్యపెట్టక; శంకలు+ఉడిగి= సందేహాలు మాని; అంకెలు+ఇడుచు= రంకెలు వేయుచు; లంకెలై= గొలుసుగాచేరి; లెక్కకున్= లెక్కించుటకు; మిక్కిలి+అగుచు= అధికమవుతూ; రక్కసుల= రాక్షసులయొక్క; చక్కటి= సరియైన; ఎక్కటికయ్యములన్= ఒంటరి పోరులతో (అసహాయయుద్ధం); దయ్యములు= భూతములు; ఎఱుంగన్= ఎరుగునట్లు; తిరుగు= సంచరించునట్టి; వీరభటకదంబంబులును= పౌరుషశాలులైనభటుల యొక్క గుంపులు; కదంబ= మిశ్రములైన; కరవాల= కత్తులయొక్క; శూల+ఆదుల= శూలములు మొదలయినవానియొక్క; మెఱుంగులు= కాంతులు; మెఱపులతెఱంగులన్= మెరపులరీతులుగా; దిశల= దిక్కులయొక్క; చెఱంగులన్= అంచులలో; తుఱంగలియపన్= ప్రకాశింపగా; నేమినినదంబులు= చక్రపు టంచులయొక్క ధ్వనులు; దళములగు= దట్టములయిన; ఉఱుములుగన్= ఉరుములుగా; నడమొగిళ్ల= నడచు నట్టి మేఘములయొక్క; పెల్లునన్= అతిశయముతో; ప్రవర్షిత= మిక్కిలివర్షింపబడిన; రథిక= రథికులయొక్క; మనోరథంబులు+అగు= కోరికలనే; రథంబులగములును= తేరుల వరుసలు; గములుగొని= పంక్తులు దీరిచి; గమనవేగములవలనన్= నడకయొక్కవేగమువలన; హరిహరులన్= సూర్యుని గుర్రములను; నగి= పరిహసించి; గాలిన్= వాయువును; జాలిన్+పడన్= జాలిపడునట్లు; గేలికొని= పరిహాసముచేసి; ఘనంబులగు= అతిశయముగలవియై; మనంబులన్= మనస్సులను (మనోవేగమును); తెగడి= నిందించి; నెగడు= వృద్ధిపొందునట్టి; సురంగంబులు+అగు= యోగ్యమయిన యుద్ధరంగములు గలవియైన; తురంగంబులును= గుర్రములును; రంగత్= ప్రకాశమానములయిన; ఉత్తుంగ= ఎత్తయిన; విశద= విశాలములయిన; మద= మదించిన; కలకరటి= భద్రగజములయొక్క; కట= చెక్కిళ్లయొక్క; తట= ప్రదేశములయందు; జనిత= పుట్టిన; మదసలిల= మదోదకముయొక్క; కణగణ= బిందుసమూహముచే; విగళిత= మిక్కిలి జారినదియగు; దశశతనయన= సహస్రాక్షుడగు ఇంద్రునియొక్క; భుజ= బాహువులయందు; సరళ= తిన్నగా; మిళిత= కూడుకొనిన; లలిత= సుందరమయిన; నిఖిల= సమస్తమయిన; దిక్+అధిపతి= దిక్పాలురయొక్క; శుభకర= మంగళప్రదమయిన; కర= హస్తములయందలి; కనకకటక= బంగారు మురుగులయందు; ఘటిత= కూర్చబడిన; మణిసముదయ= మణులయొక్క సముదాయముచే; సముదిత= ఉదయించిన; రేణువర్గ= పరాగసముదాయముచే; దుర్గమంబులు= దాట శక్యముగానివి; అయిన= అయినట్టి; నిర్వక్ర= తిన్ననయిన; మార్గంబులును= బాటలును; మార్గస్థల= దారులప్రదేశములకు; ఉపరి= పయిభాగములయందు; గత+ఆగత= పోబడు–రాబడునట్టి (పోయేవచ్చే); శతశత= వందలకొలది; అయుత= వేలకొలదియు; అనేక= అనేకములయినవియు; గణన+అతీత= లెక్కకు మించినవియు; రోహణ+అచల= రోహణ అనే పేరుగల పర్వతముయొక్క; తట= చరియలనుండి; విరాజమానంబులగు= ప్రకాశమానములయిన; విమానంబులును= అంతరిక్షమునసంచరించు నట్టిరథములును; విమాన= విమానములయందు; విహరమాణ= తిరుగుచున్న; సుందర= అందమైన పురుషులయొక్క; సుందరీ= అందమైన స్త్రీలయొక్క; సందోహ= సమూహములచే; సంవాదిత= లెస్సగా మ్రోగింపబడిన; భూరి= గొప్పవగు; భేరీ= భేరులయొక్క; వీణా= వీణలయొక్కయు; పణవ= తప్పెటలయొక్కయు; మృదంగ= మద్దెలల యొక్కయు; కాహళ= బాకాల యొక్కయు; శంఖ+ఆది= శంఖములు మొదలయినవాని యొక్కయు; వాదన= ధ్వనితోకూడిన; అనూన= ఘనమయిన; గాన సాహిత్య= సంగీతముతో కూడిన; పాండిత్యముయొక్క; నృత్య= నర్తనముయొక్క; విశేషంబులును= అతిశయములును; విశేష= ఘనమైన; రత్న= మణులచే; సంఘటిత= కూర్చబడిన; శృంగార= అందమయిన; శృంగాటక= చవుకములయొక్క; వాటికాదేహ= ఇండ్లవరుసలలోపల; దేహళీ= గుమ్మములయందున్న; ప్రదీపంబులును= దివ్వెలును; దీపాయమాన= దీపికలుగా చేయబడిన; మానిత= మన్నింపబడెడు; సభామంటప= కొలువుకూటములయందు; ఖచిత= చెక్కబడిన;

రుచిర= కాంతిమంతములయిన; చింతారత్నంబులునున్= చింతామణులును; కలిగి= కలదియై; **ఇక్కడ నుండి శ్లేషార్థాలతో వర్ణన చేయబడినది,** రత్నాకరంబునుంబోలెన్= సముద్రమువలె; అనిమిష= దేవతలచేతను, చేపలచేతను; కౌశిక= ఇంద్రునిచేత; వాహినీ= సేనలచేత; కౌశికవాహినీ= కౌశికనదీప్రవాహముచేతను; విశ్రుతంబయి= ప్రఖ్యాతిని కాంచినదయి; శ్రుతివాక్యంబునున్+పోలెన్= వేదవాక్యమువలె; అకల్మష= కలుషరహితమైన; సువర్ణ= బంగారముచే, మంచివంశములచే; ప్రభూతంబయి= అధికమయి; భూతపతికంఠంబునున్+పోలెన్= ఈశ్వరుని కుత్తుకవలె; భోగిరాజ= ఆదిశేషునిచేత, ఐశ్వర్యవంతులగు రాజులచేతను; కాంతంబు+అయి= ప్రకాశించుచున్నదియై; కాంతాకుచంబునున్పోలెన్= స్త్రీయొక్క స్తనమువలె; సువృత్తంబయి= వంచివట్రువకలదియు, మంచినడవడికలదియునై; వృత్తజాతంబునుంబోలెన్= వృత్తసముదాయమువలె; సదా= ఎల్లప్పుడు; గురు= గురువులయొక్కయు, అధికుల యొక్కయు; లఘు= లఘువులయొక్కయు, అల్పులయొక్కయు; నియమ= ఏర్పాటుచే; అభిరామంబు+అయి= మనోహరమయి; రామచంద్రుని తేజంబునున్+పోలె= శ్రీరాముని శౌర్యమువలె; ఖర= ఖరుడు; దూషణ= దూషణుడు; ఆది= మొదలయిన; దోషాచర= రాక్షసులకు; అనుపలబ్ధము= తెలియబడనిది, అయి/ఖర= తీక్ష్ణమయిన; దూషణాది= నిందించుట మొదలుగాగల; దోషాచర= పాపాత్ములకు; అనుపలబ్ధంబయి= పొందబడనిదియై; లబ్ధవర్ణుచరిత్రంబునున్+పోలెన్= పండితుని చరిత్రమువలె; అమల= స్వచ్ఛమైన; అంతరంగ= హృదయంతో; ద్యోతమానంబయి= ప్రకాశించుచున్నదియై; మానధనుని నడవడియునున్+పోలె= గౌరవమే ధనముగాగలవాని ప్రవర్తనమువలె; సన్మార్గభాతి= ఆకాశమార్గరీతిని / సత్పురుషులదారిని; సుందరంబయి= అందముకలదై; సుందర+ఉద్యానంబునున్+పోలెన్= మనోహరమయిన ఉద్యానవనము వలె; రంభా= రంభచేతను / అరటిచెట్లచేతను; అంచిత= ఒప్పునదియు; అశోక= అశోకవృక్షములుగలదియు; పున్నాగ= పొన్నచెట్లు గలదియు / దుఃఖములులేని పురుషశ్రేష్ఠులు కలదియు; పున్నాగంబునుంబోలెన్= పొన్నచెట్టువలె; సురభి= పరిమళముతోకూడిన; సుమనస్= పుష్పములచే; విశేషంబులు= అతిశయించినదయి / సురభి= కామధేనువుచేతను; సుమనస్= దేవతలచేతను; విశేషంబయి= ఆధిక్యతను గాంచినదయి; శేష+అహి= ఆదిశేషువుయొక్క; మస్తంబునున్+పోలెన్= శిరస్సువలె; ఉన్నత= మిక్కిలివంచబడినదియు; క్షమా= భూమిచేత; విశారదంబు+అయి= ఒప్పినట్టిదయి; / ఉన్నత= అధికమయిన; క్షమా= ఓర్పుయొక్క; విశారదంబయి= పాండిత్యముకలదియై; శారదసముదయంబునున్+పోలెన్= శరత్కాలోత్పత్తివలె; ధవళ= తెల్లనయిన; జీమూత= మేఘములచే; ప్రకాశితంబు+అయి= ప్రకాశింపబడినదయి / ధవళ జీమూత= తెల్లని మేఘాలచే; ప్రకాశితంబయి= ప్రకాశింపబడినదయి; సితేతర+అజినదానంబునున్+పోలెన్= కృష్ణాజినదానమువలె; సరస= చక్కని; తిలోత్తమంబు+ఐ= తిలోత్తమగలదియై (అప్సరస) / మంచి నువ్వులుగలదియై; ఉత్తమ పురుషవచనంబునున్+పోలెన్= సత్పురుషునివాక్యమువలె; అనేక= బహువిధములయిన; సుధారస= అమృతరసముయొక్క; ప్రవర్షంబు+ఐ= ప్రకృష్టమయిన వర్షముకలదియై; వర్షాదియునున్+పోలెన్= వర్షప్రారంభమువలె; ఉల్లసత్= ప్రకాశించుచున్న; ఇంద్రగోపంబు+అయి= = మహేంద్రుని పాలనముగలదై; గోపతిమూంపురంబునున్+పోలెన్= శివుని ఆబోతు (నంది) మూపురమువలె; విచక్షుః= ఈశ్వరునిచేతను; ఆర్యా= పార్వతిచేతను; అలంకృతంబు+ఐ= అలంకారముచేయబడినదై / విచక్షు= ఇంద్రునిచేతను; ఆర్య= బృహస్పతి మొదలయినవారి చేతను; అలంకృతంబు+ఐ= శృంగారింపబడినదై; కృతార్థంబయిన= ధన్యంబయిన; అమరావతీనామనగరంబునన్= అమరావతియను పేరుగల పట్టణమున;చేరన్+చని= చేరబోయి; కోటచుట్టునున్= కోటనలు దిక్కులను; పట్టుగలుగ= సత్త్వముగలిగిన; బలంబులన్+సేనలను; చలంబునన్= మత్సరముతో; విడియన్+పంచి= నిలువబంపి; పొంచి= డాగి; మార్గంబులు+ఎల్లన్= దారులన్నియును; అరికట్టుకొని= అడ్డగించుకొని; ఏమఱక= పరాకులేక; ఉండెన్= ఉండెను; అంతన్= అంతట.

**తా :** బలిచక్రవర్తి చాలా విశాలమైన దేవతలపట్టణాన్ని సమీపిస్తూ వేగంగా ముందుకు సాగినాడు. తొలుత పెద్దతోటలు కనిపించినాయి. ఆ తోటలలోని చెట్లు ఎప్పుడూ అందంగా పొటమరించే చిగుళ్లతో, రెమ్మలతో, మొగ్గలతో, అరవిచ్చిన విరులతో, విరబూసిన పూలగుత్తులతో, పిందెలతో, లేతకాయలతో, దోరగాయలతో, పండ్లగెలలతో నిండి బరువెక్కి వంగి ఉన్నాయి.

దట్టమయిన ఆ తోటలలో తుమ్మెదలగుంపుల జంటలు వదలక సొగసైన కొత్తపూలతో నిండి ఉన్న పూతేనియను కొసరి కొసరి తాగి బలిసి కైపెక్కి జుంజుమ్మని సంతోషంతో విహారంచేస్తున్నాయి. కోయిలగుంపులు జంటబాయక కలసిమెలసి గున్నమామిడి చెట్ల కొమ్మలలో ముసరి సొంపుగా చిగురుటాకులు మెక్కి ఉత్సాహంతో గానం చేస్తున్నాయి. చిలుకల గుంపులు మత్తెక్కి త్వరపడుతూ పోరాడుతూ చెలరేగి నేర్పుతో తియ్యని పండ్లుతిని కలకలధ్వనులు సలుపుతున్నాయి. పావురాలు చిలుకలనుమించి ఆకసానికి ఎగురుతూ ఆడపావురాలను దగ్గరకు పిలుస్తూ అటూ ఇటూ పోనీయక అడ్డుకొంటూ తమ నెలవులపై వ్రాలి ఇంపుగా గుబాళిస్తున్నాయి.

రాజహంసలు అందమైన సరస్సులవద్ద ఉత్సాహంగా ఆడ హంసలతో కలిసి తమ వాడిముక్కులతో లేత తామరతూడులు చీల్చి తిని సంతోషంతో సవ్వడి చేస్తున్నాయి. అందమైన ఆ సరస్సులు హంసల కాంతికంటె అధికంగా మిలమిలమెరుస్తూ సిరికి నెలవులవంటి బంగారుతామరలతో విరాజిల్లుతున్నాయి. ఆ సరస్సుల అలలలో తడిసిపోయి వడవడ వణకుతూ అల్లిబిల్లిగా అల్లుకొని నేలవ్రాలిన దట్టమైన తీగల సందులలో జొరబడి ఇంపైన పూలవాసనలతో బరువెక్కి లోపలకు దూరలేక చల్లగాలులు చతికిలపడుతున్నాయి. ఆ గాలులతో కలిసి పై కెగిరిన పుప్పొడులు ఆకసంలో నిండి రంగురంగుల మేలుకట్టు చాందినీలను సృష్టిస్తున్నాయి.

పుప్పొడి రంగులతో కలిసిన కాలువల గట్లమీద ఇచ్చ వచ్చినట్లుగా పచ్చిక గుబురులు మేస్తూ మైమరచి నెమరువేస్తూ తమ పెద్దపొదుగులు కదలిస్తూ కామధేనువులు నడచి వస్తున్నాయి. వాటి దూడలు వాడవాడలలో చెంగుచెంగునదూకి ఆడుకుంటూ తల్లుల వెంట వెళ్లుతున్నాయి. కామధేనువులు దూడలతోకూడి ఇండ్ల వాకిండ్లు చేరి పౌరులు కోరినన్ని పాలు కురుస్తున్నాయి. కోరినవారి కోరికలు తీర్చే కల్పవృక్షాలు ఆ కామధేనువులకు నిలువ నీడనిస్తున్నాయి. ఆ కల్పవృక్షాల చిగుళ్ళనూ పూలగుత్తులనూ కోసి మదపుటేనుగులు ఆడఏనుగులకు ప్రేమతో ఇచ్చి సంతోషాన్ని కలుగజేస్తున్నాయి. ఆ మదపుటేనుగులు క్రీడాపర్వతాల సొగసుతో ఒప్పారుతున్నాయి. అవి పడుచులకు నడకలు నేర్పు ఒజ్జలై మురువుగా నడుస్తున్నాయి. ఆ ఏనుగుల శరీరాలు రాచుకోవడం వల్ల కరకుతనం పోయి నున్నబడుతున్న మకరతోరణ స్తంభాలు కనువిందు కలిగిస్తున్నాయి.

మకరతోరణాల స్తంభాల వద్ద రంభ మొదలయిన అప్సరసలు నిలబడి ఉన్నారు. వారు మన్మథుడు ఒరలోనుండి తీసిన పదునుకత్తులవలె మెరుస్తున్నారు, నిలుకడగల మెరుపుతీగలవలె ఉన్నారు. కాళ్ళూ చేతులూ మొదలయిన అవయవాలు కలిగిన నెలవంకవలె ఉన్నారు. రూపుదాల్చిన మోహినీ విద్యలవలె చూపులకు హాయి కలిగిస్తూ శృంగార రహస్యాలు తెలుసుకోవటంలో పేరుగాంచినవారై, విమానాలపై స్వర్గలోకానికి వచ్చే పుణ్యాత్ములకు త్వరగా ఎదురుపోయి కొందరిని సగౌరవంగా వాహనాలపై ఎత్తుకొని/మోసుకుంటూ మరి కొందరని తోడ్కొని పోతున్నారు.

ఆ నగరానికి చుట్టూ అందమైన అగడ్తలు ఉన్నాయి. ఆ అగడ్తల నీటిలో అంచలూ రాయంచలూ, చక్రవాకాలూ, బెగ్గురు పక్షులూ విహారం చేస్తుంటాయి. అందలి కలువలలోనూ, కమలాలలోనూ తుమ్మెదలు సంతోషంతో సంచరిస్తుంటాయి.

ఆ అగడ్తలు అడ్డులేని తరంగాలుగల గంగానది ఆకాశానికి పొంగినట్లు వెరగు కలిగిస్తుంటాయి దేవకన్యలు గుంపులు గుంపులుగాచేరి వాటిలోని తేటనీటిలో అందంగా హాయిగా జలకా లాడుకొంటుంటారు.

ఆ నగరం ముంగిలిలో భద్రమైన బంగారు తలుపులుగల పెద్దగోపురా లున్నాయి. ఆ గోపురాల గడపలను అక్కడి దేవవేశ్యలు పూజిస్తుంటారు. ఆ ద్వారాల ప్రక్కన అరుగులపైన రత్నకాంతులు వెదజల్లే ఇంద్రనీలాలస్తంభాలు ఉన్నాయి. ఆ నాలుగు ద్వారాలకూ పద్మరాగాల మాలలు వ్రేలాడుతున్నాయి. ఆ ద్వారాల దగ్గర ఉన్న చావిళ్ళలో పరాక్రమ వంతులయిన ద్వారపాలకులు ఆయుధాలు ధరించి మెలకువతో కాపలాకాస్తున్నారు. వారు దేవదానవుల యుద్ధాల ముచ్చటలు ముచ్చటించుకుంటుంటారు. అచ్చటి ఎత్తైన మెట్ల వరుసలు వీరరస సముద్రపు చెలియలికట్టల వంటి అచ్చమైన పాలరాళ్ళతో కట్టబడి ఉన్నాయి. అక్కడి కోటలు అత్యంత శోభాయమానమై వజ్రాలతోనూ వెండితోనూ నిర్మించబడి ఉన్నాయి. ఆ కోటల పైభాగాలు చంద్రుని కిరణాలు వెల్లివిరిసే తెల్లని అద్దాలవలె ఉన్నాయి. వాటికాంతులు చుక్కలను ధిక్కరిస్తుంటాయి. ఆ నగరలక్ష్మి ప్రాయంతో నిండిన యువతివలె మేఘాలను చూస్తూ బ్రహ్మను ప్రార్థించి సంపాదించిన బంగారు పరదాలవలె పెద్ద పెద్ద వెండి ప్రాకారాలు ప్రకాశవంతాలై ఉన్నాయి. ఆ ప్రాకారాలపై మరకతమణులతో నిర్మించిన బురుజులున్నాయి. కోట్ల కొలది గంధర్వ సైనికులు రణసన్నద్ధులై వాటిని కాపాడుతుంటారు. ఆ బురుజులపై ఎత్తైన వజ్రాల స్తంభాలున్నాయి. వాటిమీద శత్రువీరుల ప్రాణాలు తీసే ఫిరంగులు అమర్చబడి ఉన్నాయి. వాటికి ఇరువైపులా రథాల ఇరుసులు రాచుకొంటూ ఆరిపోని దీపాలవలె సూర్యచంద్ర మండలాలు ప్రకాశిస్తుంటాయి.

ఆ నగరంలోని మేడలు ఆకాశా న్నంటుతుంటాయి. అందలి సుందరీమణులు చంద్రబింబాన్ని నిగ్గుటద్దంగా తలచి తొంగి చూస్తూ తమ నొసటిపైని వ్రేలాడే ముంగురులను సరిదిద్దుకొని తిలకాలను అలంకరించుకొంటుంటారు. అప్పుడు వారి వెనుక వైపుగా వచ్చిన వారి ప్రియుల ప్రతిబింబాలు కనిపించగానే తమ భర్తలు ఇతరస్త్రీలను వలచి వారికి వశులైనారని భ్రమించి తత్తరపాటుతో వెనుదిరిగి అంతలో ప్రతిబింబాలు మాసిపోగానే ఆ స్త్రీలు ఏకాంతంగా తమ ప్రియులకోసం నిరీక్షిస్తుంటారు. ముత్యాల హారాలతో కూడిన ఆ ముద్దుగుమ్మల గుబ్బచన్నుల సొగసుతో ప్రక్కల చుక్కలు మెరుస్తుండగా ఆ మేడల శిఖరాలను సింగారిస్తూ బంగారు కలశాలు ప్రకాశిస్తున్నాయి. ఆ మేడలలోపల బంగారు మయములైన పరుపులూ కిటికీలు ఉయ్యాలలూ మెట్లూ మొదలైనవి ఎంతో మనోహరంగా ప్రకాశిస్తున్నాయి.

ఆ మేడల బంగారు కిటికీల సందులగుండా కర్పూరమూ కుంకుమపువ్వూ సాంబ్రాణి సువాసనల పొగలు వస్తుంటాయి. ఆ పొగలను మేఘాలని భ్రమపడిన నెమళ్లు అనుకోకుండా తమకు పండుగ వచ్చిందని ఆనందంతో తమ రంగురంగుల పింఛాలు విప్పి చెట్లకొమ్మలపై నాట్యాలు చేస్తుంటాయి. అవి మన్మథుని శృంగారవిద్యలకు టీకల విధంగా కేకలు వేస్తుంటాయి. అప్పుడు నెమళ్ల పింఛాలను అల్లెత్రాళ్లుగానూ, వాటికేకలను ధనుష్టంకారాలుగానూ భావించి వెంటనే సూర్యుని పైకి ఉరికే రాహువువలె జెండాలు ఆకాశానికి ఎగురుతున్నాయి. జెండాలు గొడుగులూ తమ యుద్ధ లక్షణాలుగా అవక్రపరాక్రమంతో విజృంభించి పెద్దపులులవలె, ఏనుగులవలె, సింగాలవలె, శరభాలవలె, తోకచుక్కలవలె శత్రువులను లెక్కచేయకుండా కేకలు వేస్తూ గుములు గుములై వీరసైనిక సమూహాలు రాక్షసులతో ద్వంద్వయుద్ధాలు చేయటం కోసం దుముకుతున్నారు.

ఖడ్గాలూ శూలాలూ మొదలయిన ఆయుధాలు తళతళమెరుస్తూ దిక్కుల చివరివరకూ వ్యాపించగా చక్రాల ధ్వనులు ఉరుములవలె ధ్వనింపగా వీరుల శరవర్షాలతో మేఘాలవలె ఒప్పుతున్న తేరులు వెలుగొందుతున్నాయి. ఆ తేరులకు

సూర్యునిగుర్రాలను వాయువునూ మనస్సునూ మీరిన వేగంతో పరుగెత్తగల గుర్రాలు పూన్చబడి ఉన్నాయి. ఆ నగరంలో ఎత్తైన తెల్లని మదపుటేనుగులున్నాయి. వాటి చెక్కిళ్ళ మీది మదజలబిందువుల సమూహాలు వేయికళ్ళవేలుపురేని (ఇంద్రుని) ఔదార్యవిశేషాలను లెక్కకడుతున్నట్లు ఉంటాయి. ఇంద్రుణ్ణి సందర్శించటానికి గుమికూడిన సమస్త దిక్పాలకుల శుభకరాలైన చేతుల బంగారు మురువులనుండి రాలిన ధూళికణాలతో ఆ పట్టణంలోని వీధులన్నీ నిండి ఉన్నాయి. ఆ దారులకు పై భాగాలలో లక్షల విమానాలు రాకపోకలు జరుపుతూ ఉంటాయి. అవి రోహణ పర్వతం చరియలవలె వెలుగులను వెదజల్లుతుంటాయి. ఆ విమానాలలో తమ ప్రియులతో విహరించే అందగత్తెలు భేరీ వీణా పణవమూ మద్దెలా బాకా శంఖం మొదలయినవాటిని మ్రోగిస్తూ వాటికి తగినట్లు పాటలు పాడుతూ నాట్యాలు చేస్తుంటారు. ఆ నగరంలోని చతుష్పథాలలోని గృహ పరంపరల ముంగిళ్ళలో పెద్దపెద్ద రత్నదీపాలు వెలుగుతుంటాయి. దేదీప్యమానాలైన సభామంటపాలలో చింతామణులు ప్రకాశిస్తుంటాయి.

*స్వర్గ నగరం సముద్రంలా అనిమిషకౌశిక వాహినీవిశ్రుతమై ఉన్నది (చేపలతోనూ నదులతోనూ పేరెన్నికగన్నది/ దేవతలతో ఇంద్రునితో ఆకాశగంగతో పేరెన్నికగన్నది). ఆ నగరం వేదవాక్యంలా ఆకల్మషసువర్ణ ప్రభూతమై ఉన్నది (పవిత్రమైన అక్షరాలతో నిండినది / నిర్మలమైన బంగారంతో అతిశయించినది). ఆ పురం శివుని కంఠం మాదిరిగా భోగిరాజకాంతమై ఉన్నది (సర్పరాజుతో ప్రకాశిస్తున్నది / ధనవంతులయిన ప్రభువులతో ఒప్పుతున్నది). ఆ పట్టణం జవరాలి వక్షోజం వలె సువృత్తమై ఉన్నది (గుండ్రముగానున్నది / మంచి చరిత్రకలిగినది). ఆ నగరం శ్రీరామచంద్రుని తేజస్సువలె ఖరదూషణాది దోషాచరులకు చేరరానిదై ఉన్నది (ఖరుడు, దూషణుడు మొదలయిన రాక్షసులకు చేరటానికి శక్యంకానిది / కఠినమైన నిందలు మొదలగు దోషములు ఆచరించువారికి పొంద శక్యంకానిది). ఆ పురం విద్వాంసుని చరిత్రవలె అమలాంతరంగ ద్యోతమానమైనది (స్వచ్ఛమైన హృదయాలకు స్ఫురించేది / నిర్మల మనస్కులయిన పుణ్యాత్ములతో ప్రకాశించేది).

ఆ నగరం అభిమానవంతుని ప్రవర్తనం వలె సన్మార్గభాతి సుందరమైనది (మంచిమార్గంలో మిక్కిలిచక్కగా ప్రకాశించేది/ ఆకాశమార్గమందలి చుక్కలతో మిక్కిలి చక్కనైనది). ఆ పట్టణం అందమైన ఉద్యానవనం వలె రంభాంచితాశోకపున్నాగమైనది (అరటి చెట్లతో కూడిన అశోకవృక్షాలు పున్నాగ వృక్షాలు కలది / రంభతో కూడి ఆనందంగా ఉన్న పురుషశ్రేష్ఠులు కలది). ఆ పురం సురపొన్నవృక్షంవలె సురభిమనో విశేషమైనది (సుగంధంతోకూడిన పుష్పాలతో అతిశయించినది / కామధేనువులతోను దేవతలతోను నిండినది). ఆ నగరం ఆదిశేషుని శిరస్సువలె ఉన్నత క్షమావిశారదమైనది (మహోన్నతమైన భూమండలం కలది / విశేషమైన క్షమాగుణంతో ఒప్పారుతున్నది). ఆ పట్టణం శరత్కాలం మాదిరిగా ధవళజీమూతప్రకాశితమైనది (తెల్లని మేఘాలతో విరాజిల్లునది / తెల్లని కొండలతో ప్రకాశించునది). ఆ నగరం కృష్ణాజిన దానంవలె సరస తిలోత్తమమైనది. (మంచి నువ్వులతో ఒప్పారినది / సరసురాలైన తిలోత్తమతో ఒప్పారినది). ఆ పురం ఉత్తమపురుషుని వాక్కు వలె అనేక సుధారస ప్రవర్షమైనది (అఖండమైన తియ్యదనాన్ని వర్షించేది / అఖండమైన అమృతవర్షాన్ని వర్షించేది).

ఆ పట్టణం వర్షఋతువు ప్రారంభంవలె ఉల్లసదింద్రగోపమైనది (ప్రకాశించే ఆరుద్రపురుగులు గలది/ ప్రకాశించే ఇంద్రునిచేత రక్షింపబడేది). ఆ నగరం నందీశ్వరుని మూపురంవలె విచక్షు రార్యాలంకృతమైనది (శివపార్వతులతో అలంకరింపబడినది / వేల్పుపెద్దలతో విరాజిల్లునది). ఈ విధంగా ఐశ్వర్యవంతమై పరమధన్యమైన ఆ అమరావతీ నగరానికి చేరి బలిచక్రవర్తి పట్టణం కోటను చుట్టుముట్టడానికి సైన్యాలకు ఆజ్ఞ ఇచ్చినాడు. అన్ని దారులనూ అరికట్టి గట్టి పట్టుదలతో ఉన్నాడు.

**విశే :** అమరావతీ నగరవర్ణనం రెండేసి అర్థాలుగ శ్లేషతో సాగింది. ఇలాంటి వర్ణనలు బాణభట్టు, దండి మొదలయినవారి బాణిలో సాగును.

**క. మాయరు; నగవులకును; గను, మూయరు కాలంబుకతన ముదియరు ఖలులన్**
**డాయరు పుణ్యజనంబులఁ, బాయరు సురరాజు వీటి ప్రమదాజనముల్. 448**

**ప్రతి :** సురరాజువీటి= అమరావతి అనే పేరుగల ఇంద్రపట్టణమందలి; ప్రమదాజనముల్= స్త్రీలు; మాయరు= మలినము చెందరు; నగవులకునున్= నవ్వులాటలకయినను; కనుమూయరు= నేత్రములు మోడ్చరు; కాలంబుకతనన్= వయస్సు చేతనయినను; ముదియరు= ముసలితనమును పొందరు; ఖలులన్= దుర్మార్గులను; డాయరు= చేరరు; పుణ్యజనంబులన్= పుణ్యాత్ములను; పాయరు= విడువరు.

**తా :** అమరావతీ పురాన ఉండే స్త్రీలకు మలినంపొందుట, కన్నులార్చుట, ముసలితనం పొందుట, దుర్మార్గులను చేరుట, పుణ్యాత్ములను విడుచుట అనేవి లేవు.

**వ. అప్పుడు. 449**

**క. దుర్భరదానవశంఖా, విర్భూతధ్వనులు నిండి విబుధేంద్రవధూ**
**గర్భములు పగిలి లోపలి, యర్భకతతు లావు రనుచు నాక్రోశించెన్. 450**

**ప్రతి :** దుర్భర= భరింపశక్యముకాని; దానవ= రాక్షసులయొక్క; శంఖ= శంఖములనుండి; ఆవిర్భూత= పుట్టిన; ధ్వనులు= శబ్దాలు; నిండి; విబుధ+ఇంద్ర వధూ= దేవతలయొక్క, ఇంద్రుని యొక్క స్త్రీల; గర్భములు= కడుపులు; పగిలి= బ్రద్దలయి; లోపలి= ఆ గర్భములయందుండునట్టి; అర్భకతతులు= శిశుసముదాయములు; ఆవురనుచున్= ఆవురుమని; ఆక్రోశించెన్= రోదనముచేసెను.

**తా :** దానవనాథులు చేసిన శంఖారావములు భయంకరంగా వినిపించటంచే దేవతాస్త్రీల గర్భాలు పగిలి ఆ గర్భాలలోని శిశువులు భయంతో రోదించినారు.

**వ. అంత. 451**

**సీ. బలి వచ్చి విడియుట బలభేది వీక్షించి గట్టిగాఁగోటకుఁగాఁపు వెట్టి**
**దేవవీరులుఁదాను దేవతామంత్రిని రప్పించి సురవైరి రాకఁజెప్పి**
**ప్రళయానలునిభంగి భాసిల్లుచున్నాఁడు ఘోరరాక్షసులను గూడినాఁడు**
**మన కోడి చని నేఁడు మరల వీఁడేతెంచె నే తపంబున వీని కింత వచ్చె?**

**ఆ. నీ దురాత్మకునకు నెవ్వఁడు దోడయ్యె?, నింక వీని గెల్వ నేది త్రోవ?**
**యేమి సేయువార? మెక్కడి మగఁటిమి?, నెదురు మోహరింప నెవ్వఁడోపు? 452**

**ప్రతి :** బలి= బలిచక్రవర్తి; వచ్చి; విడియుట= విడిది చేయుట (ముట్టడించుట); బలభేది= ఇంద్రుడు; వీక్షించి= చూచి; గట్టిగాన్= దృఢముగా; కోటకున్= దుర్గమునకు; కాఁపు+పెట్టి= కాపలా ఏర్పాటుచేసి; దేవవీరులున్= పరాక్రమవంతులగు

దేవతలును; తానున్= తానును; దేవతామంత్రిని= బృహస్పతిని; రప్పించి= పిలిపించి; సురవైరిరాకన్= బలిచక్రవర్తి ఆగమనమును; చెప్పి; ప్రళయ= ప్రళయకాలమందలి; అనలునిభంగిన్= అగ్నిహోత్రునివలె; భాసిల్లుచు+ఉన్నాడు= వెలుగుతూ ఉన్నాడు; ఘోరరాక్షసులను= భయంకరులైన రక్కసులను; కూడినాడు= కూడి ఉన్నాడు; మనకు+ఓడి= మనతో పరాజయంపొంది; చని= పారిపోయి; నేఁడు= ఇప్పుడు; మరలన్= తిరుగ; వీఁడు= ఈతడు; ఏతెంచెన్= వచ్చాడు; వీనికిన్= ఈబలికి; ఏతపంబునన్= ఏతపస్సుచే; ఇంతవచ్చెన్= ఇంతబలముకలిగెను?; ఈ దురాత్మకునకున్= ఈ దుష్టచిత్తునకు; ఎవ్వడు= ఏ బలవంతుడు; తోడయ్యెన్= సహాయమైనాడు?; ఇంకన్= ఇంకమీదట; వీనిన్= వీనిని; గెల్వన్= గెలుచుటకు; ఏదిత్రోవ?= మార్గమెద్ది?; ఏమి+చేయువారము= మనమేమి చేయుదము; ఎక్కడిమగఁటిమి= ఎక్కడి పౌరుషం?; ఎదురు మోహరింపన్= దండెత్తి ఎదుర్కొనుటకు; ఎవ్వఁడు+ఓపున్= ఎవడు సమర్థుడు?

**తా :** బలిచక్రవర్తి అమరావతిని ముట్టడించటాన్ని గమనించిన ఇంద్రుడు కోటకు బలమైన కాపలా పెట్టించినాడు. సేనాధిపతులతో సమాలోచన ప్రారంభించినాడు. దేవగురువు మంత్రియు అగు బృహస్పతిని పిలిపించినాడు. దండయాత్రనుగురించి వివరించినాడు. 'వాడు (బలి) ప్రళయాగ్నివలె మండిపడుతున్నాడు. బలవంతులైన రాక్షసులతో కూడి ఉన్నాడు. మనతో ఓడిపోయి మరల ఇప్పుడు వచ్చినాడు. ఏ తపస్సుచేత వీడికి ఇంతటి బలం వచ్చింది? ఈ దురాత్మునికి ఎవడు సహకారి అయినాడు? వీడిని గెలవడానికి దారి ఏది? ఏమి చేద్దాము? వీడిని ఎదిరించి నిలువగల వీరుడు ఎవడు' అని పలికినాడు.

**క. మ్రింగెడు నాకాశంబును, బొంగెడు నమరాద్రికంటెఁబొడువై వీఁడున్**
**మ్రింగెడుఁగాలాంతకు క్రియ, భంగించును మరలఁబడ్డఁబంకజగర్భున్. 453**

**ప్రతి :** వీఁడున్= ఈ బలిచక్రవర్తి; ఆకాశంబును= ఆకసమును; మ్రింగెడున్= కబళిస్తాడు; అమరాద్రికంటెన్= (దేవగిరి) మేరువుకన్నను; పొడువై= పొడుగుగలవాడై (ధీరుడై); పొంగెడున్= విర్రవీగుతున్నాడు; కాలాంతకు క్రియన్= కాలయమునివలె; మ్రింగెడున్= మ్రింగును; మరలఁబడ్డన్= తిరుగబడినయెడల; పంకజగర్భున్= బ్రహ్మదేవునినైనను; భంగించున్= భంగపరుస్తాడు.

**తా :** ఈ బలిచక్రవర్తి మేరుపర్వతానికన్నా ఎత్తుగా విజృంభిస్తూ ఆకాశాన్ని మింగేటట్లున్నాడు. లోకాలను మింగివేసే కాలాంతకునివలె ఉన్నాడు. ఎదిరిస్తే వీడు బ్రహ్మనుకూడా భంగపరుస్తాడు.

**క. ఈరాదు రాజ్యమెల్లను, బోరాదు రణంబు సేయఁ; బోయితి మేనిన్**
**రారాదు; దనుజుచేతను, జారా; దిటమీఁద నేమి జాడ మహాత్మా!" 454**

**ప్రతి :** మహాత్మా= ఓ గురువర్యా (బృహస్పతీ!); రాజ్యము+ఎల్లను= మనరాజ్యమంతయు; ఈరాదు= ఈయకూడదు; రణంబు+చేయన్= యుద్ధముచేయుటకు; పోరాదు= వెళ్లకూడదు; పోయితిమి+ఏనిన్= వెళ్లితిమా; దనుజుచేతను= ఆ రాక్షసుని చేతినుండి; రారాదు= రాలేము; చారాదు= చావకూడదు; ఇటమీఁదన్= ఇంక మీదట; ఏమిజాడ= దారి ఏది?

**తా :** "ఓ గురువర్యా! రాజ్యమంతాకూడా బలిచక్రవర్తికి ఈయలేము. యుద్ధం చేయటానికీ పోలేము, పోతే వాడి నుండి తప్పించుకొనలేము. చూచి చూచి చావలేము. ఇక మీదట ఏది దారి?"

**వ. అనిన సురరాజునకు నాచార్యుం డిట్లనియె. 455**

**ప్రతి :** అనినన్= అనిపలుకగా; సురరాజునకున్= దేవేంద్రునితో; ఆచార్యుండు= దేవగురువు (బృహస్పతి); ఇట్లు+అనియెన్= ఈ విధముగా పలికెను.

**తా :** అని పలికిన దేవేంద్రునితో బృహస్పతి ఇలా అన్నాడు.

**సీ. 'వినవయ్య దేవేంద్ర! వీనికి సంపద బ్రహ్మావాదులు భృగుప్రవరు లర్థి**
**నిచ్చిరి రాక్షసు నెదురను నిలువంగ హరి యీశ్వరుఁడు దక్క నన్యజనులు**
**నీవును నీ సముల్ నీకంటె నధికులుఁ జాలరు; రాజ్యంబు సాలు; నీకు**
**విడిచిపోవుట నీతి విబుధనివాసంబు; విమతులు నలఁగెడు వేళ సూచి**

**తే. మరలి మఱునాఁడు వచ్చుట మా మతంబు;, విప్రబలమున వీనికి వృద్ధి వచ్చె**
**వారిఁగైకొన కిటమీఁద వాఁడి సెడును;, దలఁగు మందాఁక రిపు పేరు దడవవలదు. 456**

**ప్రతి :** దేవేంద్ర= ఓ దేవేంద్రుడా!; వినవయ్య= వినుమయా!; వీనికిన్= ఈ బలికి; సంపదన్= సంపత్తును; బ్రహ్మావాదులు= వేదాంతవేత్తలయిన; భృగుప్రవరులు= శుక్రాచార్యులు, అర్థిన్= కోరికతో; ఇచ్చిరి= ఒసగిరి; రాక్షసునెదురన్= రక్కసునిముందు; నిలువంగన్= నిల్చుటకు; హరి= విష్ణువు; ఈశ్వరుడున్= శివుడును; తక్కన్= తప్పించి; అన్యజనులున్= ఇతరులునూ; నీవును= నీవూ; నీ సముల్= నీతో సమానమైనవారునూ; నీకంటెన్= నీకన్నను; అధికులున్= గొప్పవారును; చాలరు= సమర్థులుకారు; నీకున్= నీకు; రాజ్యంబు+చాలు= రాజ్యంచేయటం చాలు; విబుధనివాసంబున్= దేవలోకమును; విడిచి= వదలి; పోవుట= వెళ్లుట; నీతి= న్యాయము (మంచిది); విమతులు= శత్రువులు; నలఁగెడువేళన్= ఓడిపోయిన సమయమును; చూచి= పరిశీలించి; మరలి= తిరుగ; మఱునాఁడు= రెండవదినమున; వచ్చుట= ప్రవేశించుట; మామతంబు= మా అభిప్రాయము; విప్రబలమునన్= వేదపండితులైన విప్రుల వాగ్బలముచే; వీనికిన్= ఈ బలికి; వృద్ధివచ్చెన్= అభివృద్ధికలిగింది; వారిన్= ఆ రాక్షసులను; కైకొనక= సమ్మతించకపోతే (చేరదీయని యెడల); ఇటమీఁదన్= ఇంకమీదట; వాఁడిచెడును= పౌరుషముపోవును; రిపుపేరున్= శత్రునామమును; తడవవలదు= స్మరింపగూడదు; అందాకన్= అప్పటివరకు; తలఁగుము= తొలగిపొమ్ము.

**తా :** ఓ ఇంద్రా! వినుము. భృగుప్రవరులు బలికి బలసంపదను సమకూర్చినారు. ఈ రాక్షసుని ఎదుట నిల్చుటకు హరిహరులకుతప్ప ఇతరులకును, నీకును, నీకన్నా అధికులకును శక్యంకాదు. నీవు ఇప్పుడు రాజ్యాన్ని విడిచిపోవటమే మంచిది. విరోధులకు కష్టాలు వచ్చినపుడు పసిగట్టి మరల అమరావతికి చేరటం మేలని నా అభిప్రాయం. వేదపండితులైన విప్రుల వాగ్బలముచే వీడికి ఇంతటి శక్తి సమకూరింది. ఇకపై వీడు బ్రాహ్మణులను గౌరవించడు. అందువల్ల వీని పరాక్రమం సన్నగిల్లుతుంది. అంతవరకు శత్రునామం కూడా స్మరింపక తొలగిపోవటం మేలు.

**క. పరు గెలువవలయు నొండెను, సరిపోరఁగ వలయు నొండెఁ జావలె నొండెన్**
**సరి గెలుపు మృతియు దొరకమి, సరసంబుగ మున్న తొలఁగి చనవలె నొండెన్. 457**

**ప్రతి :** పరున్= శత్రువును; గెలువవలయున్+ఒండెను= జయించటమో; సరిన్= సమానంగా; పోరవలయున్+ఒండెన్= కలహించటమో; చావలె+నొండెన్= చావటమో; సరి= సరియైనది; గెలుపున్= జయమును; మృతియున్= చావును;

దొరకమిన్= లభింపకున్నచో; సరసంబుగన్= చక్కగా; మున్న= ముందే; తొలఁగిచనవలెన్ ఒండెన్= తప్పించుకొని పారిపోవటమో (చేయాలి)

**తా :** విరోధిని జయించటమో, సమానంగా పోట్లాడటమో, చావటమో జరగాలి. జయించటమో, చావులేని పక్షంలో పారిపోవటమో మంచిది.

**విశే :** పరిస్థితులు అనుకూలించనప్పుడు ఉన్న వాటినే పట్టుకొనిఱ్రేలాడటం వివేకం కాదు. అహంకారం పనిచేయదు. పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడు తప్పుకోవటం మంచిదనే నీతిని ఈ పద్యం బోధిస్తుంది.

**వ. అనినఁ గార్యకాల ప్రదర్శియగు బృహస్పతి వచనంబులు విని కామరూపులై దివిజులు త్రివిష్టపంబు విడిచి తమ తమ పొందుపట్లకుం జనిరి; బలియునుం బ్రతిభట వివర్జిత యగు దేవధాని నధిష్ఠించి జగత్త్రయంబునుం దనవశంబు సేసికొని విశ్వవిజయుండై పెద్దకాలంబు రాజ్యంబు సేయుచుండె; శిష్యవత్సలులగు భృగ్వాదు లతనిచేత శతాశ్వమేధంబులు సేయించిరి; తత్కాలంబున. 458**

**ప్రతి :** అనినన్= అనిపలుకగా; కార్యకాలప్రదర్శియగు= కార్యమును సమయమును తెలుపునట్టి వాడయిన; బృహస్పతివచనంబులున్= గురువాక్యమును; విని= ఆలించి; కామరూపులై= ఇష్టమయిన ఆకారమును పొందినవారయి; దివిజులు= దేవతలు; త్రివిష్టపంబున్= స్వర్గమును; విడిచి= వదలి; తమతమ= తమతమయొక్క; పొందుపట్లకున్= నివాస స్థలములకు; చనిరి= వెడలిపోయిరి; బలియున్= బలిచక్రవర్తియును; ప్రతిభట= శత్రువీరులచే; వివర్జితయగు= విడిచిపెట్టబడిన; దేవధానిన్= దేవరాజధానిని; అధిష్ఠించి= ఆశ్రయించి; జగత్త్రయంబునున్= మూడులోకాల్నీ; తనవశంబు= స్వాధీనం; చేసికొని= ఉంచుకొని; విశ్వవిజయుండయి= ప్రపంచమును జయించినవాడయి; పెద్దకాలంబు= చాలాకాలము; రాజ్యంబు+చేయుచుండెన్= రాజ్యపాలనం చేస్తుండెను; శిష్యవత్సలులు= శిష్యులయందు వాత్సల్యంకలవారు; అగు= అయిన; భృగు+ఆదులు= శుక్రాచార్యులు మొదలయినవారు, అతనిచేతన్= ఆ బలిచక్రవర్తిచేత; శత+అశ్వమేధంబులు= నూరు అశ్వమేధయాగాలను; చేయించిరి= ఒనర్పించిరి; తద్+కాలంబునన్= ఆ సమయాన.

**తా :** దేవగురువైన బృహస్పతి ఏపని చేయాలో ఎప్పుడు చేయాలో చక్కగా దర్శింపగలిగినవాడు. ఇంద్రాదిదేవతలకు సమయోచిత కర్తవ్యాన్ని బోధించినాడు. ఆయన చేసిన ఉపదేశము విన్న దేవతలు తమకు ఇష్టమైన రూపాలు ధరించి అనుకూలమైన తావులకు వెళ్లిపోయినారు. అప్పుడు శత్రువులు విడిచిపెట్టిన అమరావతిని బలి ఆక్రమించినాడు. బలి మూడులోకాలను తనవశం చేసికొని విశ్వవిజయుడై చాలాకాలం రాజ్యం చేసినాడు. శుక్రాచార్యుడు మొదలయిన దానవవాత్సల్యం కలవారు అతనిచేత నూరు అశ్వమేధయాగాలను చేయించినారు.

**శా. అర్థుల్ వేఁడరు; దాతలుంజెడరు; సర్వారంభముల్ పండుఁ; బ్ర**
**త్యర్థుల్ లేరు; మహోత్సవంబులను దేవాగారముల్ వొల్చుఁ; బూ**
**ర్ణార్థుల్ విప్రులు; వర్షముల్ గురియుఁ గాలార్హంబులై ధాత్రికిన్**
**సార్థంబయ్యె వసుంధరాత్వ మసురేంద్రాధీశు రాజ్యంబునన్. 459**

**ప్రతి :** అసురేంద్ర+అధీశు= రాక్షసరాజయినబలిచక్రవర్తియొక్క; రాజ్యంబునన్= రాజ్యంలో; అర్థుల్= యాచకులు; వేఁడరు= కోరరు; దాతలున్; చెడరు= నశింపరు; సర్వ+ఆరంభముల్= అన్నిప్రయత్నాలును; పండున్= ఫలించును (నెరవేరును);

ప్రత్యర్థుల్= విరోధులు; లేరు= కాన్పింపరు; దేవ+అగారముల్/ఆగారముల్= దేవాలయాలు; మహోత్సవంబులను= గొప్పపండుగలతో (తిరునాళులతో); పొల్చున్= ప్రకాశించును; విప్రులు= వేద పండితులు; పూర్ణ+అర్థుల్= కోరికలు నెరవేరినవారు అనగా అపరిగ్రహులు అని అర్థం. ఎటువంటి దానమిచ్చినా స్వీకరింపనివారు; ధాత్రికిన్= భూమికి; కాల+అర్హంబులై= సమయానుకూలములై; వర్షముల్= వానలు; కురియున్= వర్షించును; వసుంధరాత్వము= (భూమికి) వసువును ధరించినది (ధనముకలది) అనేమాట; సార్థంబయ్యెన్= అర్థయుక్తమైనది.

**తా :** బలిచక్రవర్తి పాలనలో యాచించే దుస్థితి ఎవ్వరికీ లేదు. దానమిచ్చే దాతకు లోటులేదు. ప్రయత్నాలన్నీ ఫలిస్తున్నాయి. ఎవ్వరికీ శత్రువులు లేరు. దేవాలయాలలో మహోత్సవాలు వేడుకలు జరిగేవి. వేదవేత్తలైన బ్రాహ్మణుల కెటువంటి కోరికలు లేవు. వారు సంపూర్ణ మనోరథసిద్ధి గలవారు. సకాలానికి సరియైన వానలు పుష్కలంగా కురిసేవి. భూమికి 'వసుంధర' (బంగారును ధరించేది) అనే పేరు సార్థకమైనది.

**వ. అంత. 460**

**సీ. తన తనూజుల ప్రోలు దనుజులు గొనుటయు వేల్పు లెల్లను డాఁగ వెడలుటయును**
**భావించి సురమాత పరితాపమునఁబొంది వగ ననాథాకృతి వనరుచుండ**
**నా యమ్మ పెనిమిటి యగు కశ్యపబ్రహ్మ మఱియొకనాఁడు సమాధి మాని**
**తన కుటుంబినియున్న ధామంబునకు నేగి నాతిచే విహితార్చనములు వడసి**

**ఆ. వంది వ్రాలి కంది వాడిన యిల్లాలి, వదనవారిజంబు వడుపుఁజూచి**
**చేరఁదిగిచి మగువచిబుకంబు పుడుకుచు, వారిజాక్షి! యేల వగచె దనుచు. 461**

**ప్రతి :** సురమాత= దేవతలతల్లియగు అదితి; తన తనూజుల ప్రోలున్= తన కుమారులయొక్క పట్టణమును; దనుజులు= రాక్షసులు; కొనుటయున్= ఆక్రమించుకోవడం; వేల్పులు+ఎల్లన్= దేవతలందరు; డాఁగన్= దాగుకొనుటకు; వెడలుటయును= తరలి పోవుటయును; భావించి= ఆలోచించి; పరితాపమున్+పొంది= దుఃఖపడి; వగన్= విచారముతో; అనాథాకృతిన్= అనాథలవలె; వనరుచున్+ఉండన్= బాధపడుతూ ఉండగా; ఆయమ్మపెనిమిటి అగు= అదితిమగడైన; కశ్యపబ్రహ్మ= కశ్యపప్రజాపతి; మఱియొకనాఁడు= ఒకానొకదినమున; సమాధిన్మాని= తపమునువిడిచి; తనకుటుంబిని+ఉన్న= తనభార్య ఉండిన; ధామంబునకున్= ఇంటికి; ఏగి= పోయి; నాతిచేన్= ఆమెచే; విహిత+అర్చనములు= ఇష్టములగు పూజలు; పడసి= పొంది; వంది= విచారించి; వ్రాలి= మూర్ఛిల్లి; కంది= దుఃఖించి; వాడినయిల్లాలి= వడలిపోయిన భార్యయొక్క; వదనవారిజంబువడుపున్= ముఖపద్మముయొక్క కృశత్వాన్ని; చూచి= కని; చేరన్+తిగిచి= చేరదీసుకొని; మగువచిబుకంబున్= భార్యయొక్క గడ్డాన్ని; పుడుకుచున్= అంటుచు; వారిజాక్షి= ఓ పద్మనయనా!; ఏల వగచెదు?= ఎందుకు విచారిస్తావు?; అనుచున్= అంటూ...

**తా :** బలిచక్రవర్తి చేతిలో దేవతలంతా ఓటమి చెంది పారిపోయి అజ్ఞాతంగా ఎక్కడో దాగినారని తెలిసిన దేవమాత అదితి దుఃఖంతో అనాథవలె కుమిలిపోతూ ఉంది. ఒకనాడు ఆమె భర్తయగు కశ్యపప్రజాపతి తపస్సును విరమించి ఆమెవద్దకు వచ్చాడు. ఆమె భర్తకు చేయవలసిన సేవలన్నీ చేసింది. ఆమె ముఖము విచారముతో కందిపోవటాన్ని గమనించిన కశ్యపుడు ప్రేమగా ఆమె చిబుకాన్ని పట్టుకొని బుజ్జగిస్తూ ఏల ఏడ్చెదవంటూ

**వ. అ మ్మహాత్ముండిట్లనియె. 462**

**ప్రతి :** ఆ+మహాత్ముండు= ఆ తపఃప్రభావశాలి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**మ. 'తెఱవా! విప్రులు పూర్ణులే? చెలఁగునే దేవార్చనాచారముల్?**
**తతితో వేలుతురే గృహస్థులు? సుతుల్ ధర్మానుసంధానులే?**
**నెఱి నభ్యాగత కోటి కన్న మిడుదే? నీరంబునుంబోయుదే?**
**మఱ లే కర్థుల దాసులన్ సుజనులన్ మన్నింపుదే? పైదలీ? 463**

**ప్రతి :** తెఱవా= ఓ ఇంతీ!; పైదలీ= ఓ కాంతా!; విప్రులు= వేదవేత్తలైన బ్రాహ్మణులు; పూర్ణులే?= ఏ లోటూ లేకుండా నిండుగా ఉన్నారా?; దేవార్చన+ఆచారముల్= దేవతాపూజలు మొదలయిన ఆచారాలు; చెలఁగునే= సరిగా జరుగుతున్నవి కదా!; గృహస్థులు= గృహస్థధర్మమున ఉన్నవారందరూ; తతితోన్= సమయము తప్పకుండా; వేలుతురే= అగ్నిహోత్రాది కృత్యములను చేస్తున్నారా?; సుతుల్= కుమారులు; ధర్మానుసంధానులే= ధర్మము తప్పకుండ నడుస్తున్నారా?; నెఱిన్= నిండుగా; అభ్యాగతకోటికిన్= అభ్యాగతులైవచ్చినవారికి (అతిథులకు); అన్నము+ఇడుదే?= అన్నముపెట్టుచుంటివా?; నీరంబునున్= ఉదకమును; పోయుదే?= పోస్తున్నావా?; అర్థులన్= యాచకులను; దాసులన్= సేవకులను; సుజనులన్= సత్పురుషులను; మఱలేక= పరాకులేకుండా; మన్నింపుదే?= గౌరవిస్తున్నావా?

**తా :** ఓ ఇంతీ! వేదములు చదివిన బ్రాహ్మణులు ఏ లోటులేక సుఖంగా ఉన్నారా? దేవతార్చనాది ఆచారాలు జరుగుతున్నాయా? గృహస్థులు ప్రతిదినము చేయవలసిన అగ్ని హోత్రాదికర్మములను సమయముతప్పకుండా చేస్తున్నారా? కుమారులు ధర్మము తప్పకుండా నడుస్తూ ఉన్నారా? అభ్యాగతులకు అన్నపానాదులు సరిగా ఇచ్చుచుంటివా? యాచకులను, సేవకులను, సుజనులను, పరాకులేకుండా గౌరవించుచుంటివా?

**ఆ. అన్నమైనఁ దక్రమైనఁ దోయంబైన, శాకమైనఁ దనకు జరుగుకొలఁది**
**నతిథిజనులకడ్డ మాడక యిడరేని, లేమ! వారు కలిగి లేనివారు. 464**

**ప్రతి :** లేమ= ఓ అబలా!; అన్నమైనన్= ఆహారమయినను; తక్రమైనన్= మజ్జిగయయినను; తోయంబైనన్= నీళ్లయినను; శాకమైనన్= కూరయైనను; తనకున్= తనకు; జరుగుకొలఁదిన్= (సాగినంత) ఈయదగినంత; అతిథులకున్= అతిథులుగా వచ్చినవారికి; అడ్డమాడక= లేదనిచెప్పక; ఇడరు+ఏని= ఈయకున్నయెడల; వారు= అట్టివారు; కలిగి= ఉండియు; లేనివారు= దరిద్రులు.

**తా :** అన్నంకానీ, మజ్జిగకానీ, నీళ్లుకానీ, కూరకానీ, తమకు ఉన్నంతలో అతిథులకు లేదనకుండా పెట్టాలి. అలా పెట్టనివారు ఎంత ధనవంతులైనా పేదవారే!

**వ. మఱియు. 465**

**ఆ. నెలఁత! విష్ణునకును నిఖిలదేవాత్మున, కాననంబు శిఖియు నవనిసురులు**
**వారు దనియఁదనియు వనజాతలోచనుఁ, డతఁడు దనియ జగము లన్ని దనియు. 466**

**ప్రతి :** నెలంత! = ఓ కాంతా!; నిఖిల దేవ+ఆత్మునకున్= సమస్త దేవతాస్వరూపుడయిన; విష్ణునకునున్= హరికి; ఆననంబు= ముఖము; శిఖియున్= అగ్నిహోత్రమును; అవనిసురులు= భూ దేవతలైన బ్రాహ్మణులు; వారుతనియన్= వారు (అగ్నిహోత్రుడు, బ్రాహ్మణులు) తృప్తి పొందినచో; వనజాతలోచనుండు= పద్మాక్షుడగుహరి; తనియున్= తృప్తిపొందును; అతండు తనియన్= ఆ హరి తృప్తిపొందినచో; జగములన్ని= సర్వలోకాలు; తనియున్= తృప్తిపొందును.

**తా :** విష్ణువుకు ముఖము అగ్ని మరియు బ్రాహ్మణులు. కనుక అగ్ని బ్రాహ్మణులు తృప్తిపొందితే విష్ణువుకూడా తృప్తిని పొందుతాడు. విష్ణువు తృప్తిపడితే సమస్తలోకాలూ కూడా తృప్తిపడతాయి.

**క. బిడ్డలు వెఱతురె నీ కఱ, గొడ్డంబులు సేయ కెల్ల కోడండ్రును మా**
**ఱొడ్డారింపక నడతురె, యెడ్డము గాకున్నదే మృగేక్షణ; యింటన్! 467**

**ప్రతి :** మృగ+ఈక్షణ= లేడిచూపులవంటి చూపులుగల ఓ అదితీ!; ఇంటన్= గృహమందు; బిడ్డలు= కొడుకులు; నీకున్+ అఱగొడ్డంబులుసేయక= నీకు మనసు నొప్పించునట్టి మాటలు చెప్పక; వెఱతురె= భయంతోఉంటారా; ఎల్లకోడండ్రును= కోడండ్లందరూ; మాఱు+ఒడ్డారింపక= కోపపడినా తిరిగి ద్వేషింపక; (గయ్యాళితనంతో ఎదురు పలుకకుండా) నడుతురె= ప్రవర్తిస్తున్నారా; ఇంటన్= ఇంటిలో; ఎడ్డము కాక ఉన్నదే= ఏ అడ్డను (ఇబ్బందీ) లేకున్నదా!

**తా :** నీ కుమారులు నీవంటే భయభక్తులతో ఉంటున్నారా? నీ కోడండ్లందరూ నీకు ఎదురుచెప్పి ఇబ్బందిపెట్టక ప్రవర్తిస్తున్నారా? ఇంటిలో ఏ ఇబ్బందీ లేదుకదా?

**వ. అని పలికినం బతికి సతి యిట్లనియె. 468**

**ప్రతి :** అని పలికినన్= అట్లు అడుగగా; పతికిన్= పెనిమిటితో; సతి= భార్య; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పెను.

**తా :** ఈ విధంగా అడిగిన కశ్యపప్రజాపతితో అదితి ఇలా అన్నది.

**ఉ. ప్రేమ యొకింత లేక దితిబిడ్డలు బిడ్డలబిడ్డలున్ మహా**
**భీమబలాఢ్యులై తనదు బిడ్డల నందఱందోలి సాహసా**
**క్రామితవైరులయ్యు నమరావతి నేలుచు నున్నవారు; నీ**
**కే మని విన్నవింతు? హృదయేశ్వర! మేలు దలంచి చూడవే! 469**

**ప్రతి :** హృదయేశ్వర! = ఓ ప్రాణనాథా!; ప్రేమ= కూర్మి; ఒకింతలేక= ఇంచుకయు లేనిదై; దితి బిడ్డలు= దితి కొడుకులును; బిడ్డలబిడ్డలున్= మనుమలును; మహా= ఎక్కువయిన; భీమ= భయంకరమైన; బలాఢ్యులైన= బలవంతులయిన; తనదు బిడ్డలనందఱన్= నా బిడ్డల నందరను; తోలి= పారద్రోలి; సాహస= శౌర్యముతో; ఆక్రామిత= ఆక్రమించబడిన; వైరులు= విరోధులు; అయ్యున్= అయి; అమరావతిన్= దేవతల రాజధానిని; ఏలుచున్= పాలిస్తూ; ఉన్నవారు= ఉన్నారు; నీకు+ ఏమని+విన్నవింతున్= తమరికి ఏమి విజ్ఞాపన చేసుకొందును; మేలున్+తలంచి= మంచినాలోచించి; చూడవే= చూడు.

**తా :** హృదయేశ్వరా! కొంచెంకూడా ప్రేమలేక దితి కుమారులూ, మనుమలూ గొప్పబలంతో దేవతలనందరిని పారదోలి సాహసంతో విరోధులై అమరావతిని ఆక్రమించి ఏలుతున్నారు. నీకేమని చెప్పుదును? మేలు కలిగేటట్లు ఆలోచించి చూడు.

**క. అక్కాచెల్లెండ్రయ్యును, దక్కదు నాతోడి పోరు; దానును దితియున్**
**రక్కసులు సురల మొత్తఁగ, నక్కట! వలదనదు చూచు నౌనౌ ననుచున్. 470**

**ప్రతి :** అక్కాచెల్లెండ్రు+అయ్యును= నేను అక్కను తాను చెల్లెలు అయిఉన్నా; తానును+దితియున్= ఆ దితికూడా; నాతోడిపోరు= నాతో కలహాన్ని; తక్కదు= మానదు; రక్కసులు= రాక్షసులు; సురలన్= దేవతలను; మొత్తంగన్= కొట్టగా (బాధపెట్టగా); అక్కట= అయ్యయ్యో!; వలదు+అనదు= వద్దని చెప్పదు; ఔను+ఔను+అనుచున్= తగును తగు నని మెచ్చుకుంటూ; చూచున్= చూచుచుండును.

**తా :** అక్కచెల్లెండ్లమై యున్నను దితి నాతో కలహాన్ని మానదు. రాక్షసులు దేవతలను మొత్తుచుండగా చూచి తగదని వారింపదు. బాగు బాగు అంటూ మెచ్చుకొంటుంది.

**సీ. ఎండకన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు పలుపంచలను జాలిఁబడియె నేఁడు**
**త్రిభువనసామ్రాజ్యవిభవంబుఁ గోల్పోయి దేవేంద్రుఁ డడవులఁదిరిగె నేఁడు**
**గలిమి గారాబుబిడ్డలు జయంతాదులు శబరార్భకులవెంటఁ జనిరి నేఁడు**
**నమరుల కాధారమగు నమరావతి యసురుల కాటపట్టయ్యె నేఁడు**

**ఆ. బలి జగముల నెల్ల బలియుచునున్నాఁడు, వాని గెలువరాదు వాసవునకు**
**యాగభాగమెల్ల నతఁడాహరించుచుఁ, గడఁగి సురల కొక్క కడియు నీఁడు 471**

**ప్రతి :** ఎండకన్ను+ఎఱుఁగని= ఎండఅంటే ఎట్టిదో తెలియని అంతఃపురస్త్రీ; ఇంద్రుని ఇల్లాలు= ఇంద్రుని భార్య (శచీదేవి); పలుపంచలను= అందరిఇండ్ల పంచలకుచేరి; నేఁడు= ఇప్పుడు; జాలిన్+పడియెన్= దైన్యమును పొందుతున్నది; త్రిభువన= మూడులోకాలయొక్క; సామ్రాజ్య= చక్రవర్తిత్వముయొక్క; విభవంబున్= వైభవాన్ని; కోల్పోయి= పోగొట్టుకొని; నేఁడు= ఇప్పుడు; దేవేంద్రుడు= మహేంద్రుడు; అడవులన్+తిరిగెన్= అడవులలో సంచరిస్తున్నాడు; కలిమిన్= భాగ్యమున్న కాలాన; గారాబుబిడ్డలు= ముద్దుబిడ్డలయిన; జయంతాదులు= జయంతుడు మొదలయిన మనుమలు; నేఁడు= ఇప్పుడు; శబర+అర్భకులవెంటన్= బోయపిల్లలతోగూడా; చనిరి= వెళ్లిరి; అమరులకు= దేవతలకు; ఆధారము+అగు= ఆధారమయినట్టి; అమరావతి= ఇంద్రలోకము; నేఁడు; అసురులకు= రాక్షసులకు; ఆటపట్టు+అయ్యెన్= ఆడుకొనునట్టి తావయ్యెను; బలి= బలిచక్రవర్తి; జగములనెల్లన్= అన్నిలోకాలలో; బలియుచున్+ఉన్నాడు= ప్రబలుతూ ఉన్నాడు; వాసవునకున్= ఇంద్రునకు; వానిన్= వానిని; గెలువరాదు= గెలిచే శక్తి లేదు; యాగభాగము+ఎల్లన్= యజ్ఞాలలోని హవిర్భాగాలనన్నింటి; కడఁగి= ప్రయత్నించి; అతఁడు= బలిచక్రవర్తి; ఆహరించుచున్= తింటూ; ఒక్క కడియున్= ఒక్కముద్దకూడా; సురలకు= దేవతలకు; ఈఁడు= ఇవ్వడు.

**తా :** ఎండ అంటే ఎట్టిదో ఎరుగని సుకుమారియైన ఇంద్రుని ఇల్లాలు శచీదేవి దీనత్వంతో పరులపంచల పడింది. మూడులోకములను పాలించు దేవేంద్రుడు అడవుల పాలయినాడు. ఇంద్రుని ముద్దుబిడ్డలు జయంతుడు మొదలయినవారు చెంచుపిల్లల వెంటపోయినారు. దేవతలకు ఆధారంగా ఉండే అమరావతీపట్టణం రాక్షసులకు ఉనికిపట్టయినది. జగములన్నింటను బలి ప్రబలుతున్నాడు. ఇంద్రుడు వానిని గెలువలేడు. అతడే యజ్ఞభాగమంతాకూడా తింటున్నాడు. ఒక్క ముద్దకూడా దేవతలకీయడు.

**క. ప్రజలకు నెల్లను సముఁడవు, ప్రజలను గడుపారఁగన్న బ్రహ్మవు నయ్యుం**
**ప్రజలందు దుష్టమతులను, నిజముగ శిక్షింపవలదె నీవు? మహాత్మా! 472**

**ప్రతి :** మహాత్మా= ఓ మహానుభావా!; ప్రజలకున్+ఎల్లను= ప్రజలందరికిని; సముఁడవు= సమానమయినవాడవు; ప్రజలను= జనులను; కడుపారన్= కడుపు తనియునట్లు; కన్నబ్రహ్మయున్= కనిన బ్రహ్మదేవుడవు; అయ్యున్= అయిఉండి కూడా; ప్రజలందున్= నీ బిడ్డలందున్న; దుష్టమతులను= దుర్బుద్ధులను; నిజముగన్= సత్యముగ; నీవు+ శిక్షింపవలదే?= దండింపవలదా?

**తా :** మహాత్మా! నీవు కొడుకులకందరికి సమానుడవు. కడుపారగా బిడ్డలకన్న బ్రహ్మదేవుడవు. అయినాకూడా నీ సంతానంలోని దుష్టులను నిజంగా దండించవలదా?

**మ. సురలన్ సభ్యుల నార్తులన్ విరథులన్ శోకంబు వారించి ని**
**ర్జరధానిన్ నిలుపంగ రాత్రిచరులన్ శాసింప సత్కార్య మే**
**వెర వేరీతి ఘటిల్లు నట్టి క్రమమున్ వేగంబ చింతింపవే?**
**కరుణాలోకసుధాఝరిం దనుపవే? కల్యాణసంధాయకా! 473**

**ప్రతి :** కల్యాణసంధాయకా= మంగళప్రదుడా!; సభ్యులన్= సభలోని జనులు; ఆర్తులన్= బాధపడినవారిని; విరథులన్= వాహనరహితులును; (అయిన) సురలన్= దేవతలను; శోకంబు+వారించి= దుఃఖాన్ని పోగొట్టి; నిర్జరధానిన్= దేవరాజ్యమును; నిలుపంగన్= నిలుపుటయు; రాత్రిచరులన్= రాక్షసులను; శాసింపన్= శిక్షించుటయు; సత్కార్యము= మంచిపని; ఈ వెరవు= ఈ ఉపాయము; ఏరీతిన్ ఘటిల్లును= ఏ విధంగా నెరవేరునో; అట్టి క్రమమున్= ఆ రీతిని; వేగంబ= శీఘ్రమే; చింతింపవే= ఆలోచింపుము; కరుణా+ఆలోక= దయతోగూడినచూపులనెడు; సుధాఝరిన్= అమృత ప్రవాహముచే; తనుపవే= తృప్తినొందింపుము.

**తా :** మంగళప్రదుడా! ఉత్తములైన వేల్పులు కష్టాలపాలైనారు. సంపదలు కోల్పోయినారు. వారి దుఃఖాన్ని తొలగించు. వారిని అమరావతిలో నెలకొల్పడం, రాక్షసులను శిక్షించడం చేయదగిన మంచిపని. ఈ సత్కార్యం సిద్ధించే మార్గాన్ని ఆలోచించు. నీ కరుణామృత ప్రవాహంతో మమ్ములను తృప్తిపరచు.

**వ. అనిన మనోవల్లభ పలుకు లాకర్ణించి ముహూర్తమాత్రంబు చింతించి విజ్ఞానదృష్టి నవలంబించి భావికాల కార్యంబు విచారించి కశ్యపబ్రహ్మ యిట్లనియె. 474**

**ప్రతి :** అనిన= అలా పలికిన; మనోవల్లభపలుకులు= ప్రాణనాయిక మాటలు; ఆకర్ణించి= విని; ముహూర్తమాత్రంబు= రెండుఘడియలకాలము; చింతించి= ఆలోచించి; విజ్ఞానదృష్టిన్= దివ్యదృష్టిని; అవలంబించి= పూని; భావికాల= రాబోవుకాలముయొక్క; కార్యంబున్= పనిని; విచారించి= చింతించి; కశ్యపబ్రహ్మ= కశ్యపప్రజాపతి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికెను.

**తా :** అలా పలికిన తన ఇల్లాలి మాటలు విని కశ్యపప్రజాపతి కొంచెం సేపు చింతించి, జ్ఞాన దృష్టితో రాబోయేకాలంలోని సంగతులను తెలుసుకుని ఇలా అన్నాడు.

**మ. 'జనకుండెవ్వడు? జాతుఁడెవ్వఁడు? జనిస్థానంబు లెచ్చోటు? సం**
**జననంబెయ్యది? మేను లే కొలఁది? సంసారంబు లే రూపముల్?**
**వినుమా యింతయు విష్ణుమాయ దలఁపన్ వే తేమియున్ లేదు; మో**
**హనిబద్ధంబు నిదాన మింతటికి జాయా! విన్నఁబో నేటికిన్? 475**

**ప్రతి :** జాయా= ఓ ఇల్లాలా! (అదితికి సంబోధన); జనకుండు+ఎవ్వఁడు= తండ్రిఎవడు; జాతుఁడు+ఎవ్వఁడు= పుట్టిన (కొడుకు) ఎవ్వడు; జనిస్థానంబులు= జన్మస్థానాలు; ఏ+చోటు= ఎక్కడ; సంజననంబు+ఎయ్యది= పుట్టుక ఏది; మేనులు= శరీరాలు; ఏ కొలఁది= ఏ పరిమితి గలవి(ఏ పాటివి); సంసారంబులు= సంసారాలు; ఏరూపముల్= ఎట్టివి; వినుమా= వినవలయునుజుమీ; ఇంతయున్= ఇదియంతయును; విష్ణుమాయ= ఆ భగవంతుడగు హరియొక్కమాయ; తలఁపన్= ఆలోచింపగా; వేరేమియున్+లేదు= మరియింకనేదియును లేదు; ఇంతటికిన్= దీనికంతకు; మోహనిబద్ధంబు= మోహబంధనము (మోహమున గట్టబడుట); నిదానము= మూలకారణము; విన్నబోన్+ఏటికిన్= వివర్ణతనొందనేల!

**తా :** ఓ ఇల్లాలా! తండ్రి ఎవడు? కొడుకెవడు? పుట్టిన చోటులేవి? పుట్టుకకు కారణమేది? శరీరాలెలా ఉంటాయి? సంసారాలు ఎట్టివి? వినుము! ఇదంతా భగవంతుడగు హరిమాయ. మరేమీలేదు. దీని కంతటికీ మోహబంధం మూలకారణం. దిగులు పడకు.

**వ. అగు; నయిననుం గాలోచితకార్యంబు సెప్పెద. 476**

**ప్రతి :** అగున్= అవును; అయినన్= అయినప్పటికిని; కాల+ఉచిత= సమయానుకూలమయిన; కార్యంబున్= పనిని; చెప్పెదన్= వచించెదను.

**తా :** ఐనప్పటికీ ఇప్పటికి తగిన కార్యాన్ని చెపుతాను విను.

**మ. భగవంతుం బరముం జనార్దనుఁ గృపాపారీణు సర్వాత్మకున్**
**జగదీశున్ హరిసేవ సేయు; మతఁడున్ సంతుష్టినింబొంది నీ**
**కగు నిష్టార్థము లెల్ల నిచ్చు; నిఖిలార్థావాప్తి సేకూరెడిన్;**
**భగవత్సేవలఁబొందరాదె బహుసౌభాగ్యంబులం బ్రేయసీ'! 477**

**ప్రతి :** ప్రేయసీ= ఓ ప్రియురాలా!; భగవంతున్= భగవంతుని; పరమున్= ఉత్కృష్టుని; జనార్దనున్= జనార్దనుని; కృపాపారీణున్= దయయందు పారముముట్టినవానిని; సర్వాత్మకున్= అన్నిటియందుండు వానిని; జగదీశున్= జగములకునాథుని; హరిన్= విష్ణుమూర్తిని; సేవచేయుము= కొలువుము; అతఁడున్= ఆ హరియు; సంతుష్టినిన్+పొంది= సంతృప్తి పొంది; నీకు+అగు+ఇష్టార్థములు+ఎల్లన్= నీవు కోరిన కోరికలన్నింటినీ; ఇచ్చున్= ఒసగును; నిఖిల= సమస్తమయిన; అర్థ= ప్రయోజనములయొక్క; అవాప్తి= పొందుట; చేకూరెడిన్= ప్రాప్తించును; భగవత్సేవలన్= భగవదర్చనలవలన; బహుసౌభాగ్యంబులన్= సమస్త వైభవాలను; పొందరాదె= పొందరాదా?

**తా :** ప్రియురాలా! భగవానుడూ, పురుషోత్తముడూ, జనార్దనుడూ, దయావారిధీ, సర్వాంతర్యామీ, జగదీశ్వరుడూ అయిన హరిని ఆరాధించు. ఆయన ప్రసన్నుడై నీకోరికలను నెరవేరుస్తాడు. ప్రయోజనం చేకూరుతుంది. భగవంతుని సేవించి సకలసౌభాగ్యాలను పొందవచ్చుకదా!

**వ. అనిన గృహస్థునకు గృహిణి యిట్లనియె. 478**

**ప్రతి :** అనినన్= అట్లు పలికిన; గృహస్థునకున్= మగనితో; గృహిణి= భార్య; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పెను.

**తా :** అలా పలికిన కశ్యపునిమాటలను విని అదితి ఈ విధంగా అంది.

**క. 'నారాయణుఁబరమేశ్వరు, నేరీతి దలంతు? మంత్ర మెయ్యది? విహితా**
**చారంబు లేప్రకారము?, లారాధన కాలమెద్ది? యానతి యీవే.' 479**

**ప్రతి :** నారాయణున్= నారాయణమూర్తిని; పరమేశ్వరున్= దేవదేవుని; ఏరీతిన్= ఏవిధంగా; తలంతున్= తలతును?; మంత్రము+ఎయ్యది= మంత్రమేది?; విహిత+ఆచారంబులు= నిర్ణయింపబడిన ఆచారాలు; ఏ ప్రకారములు= ఎట్టివి?; ఆరాధనకాలము= పూజించువేళ; ఎద్ది= ఏది; ఆనతి+ఈవే= సెలవిమ్ము.

**తా :** నారాయణమూర్తిని ఏ విధంగా ధ్యానించాలి? ధ్యానానికి తగిన మంత్రమేది? దాని నియమాలేవి? పూజించవలసిన కాలమేది. చెప్పండి స్వామీ!

**వ. అనినఁ గశ్యపప్రజాపతి సతికిఁ బయోభక్షణం బను వ్రతంబుపదేశించి తత్కాలంబును, దన్మంత్రంబును, దద్విధానంబును, దదుపవాస దాన భోజన ప్రకారంబులును నెఱింగించిన నదితియును ఫాల్గుణ మాసంబు శుక్లపక్షంబునఁ బ్రథమ దివసంబునన్ దొరఁకొని పండ్రెండు దినంబులు హరిసమర్పణంబుగా వ్రతంబుసేసి వ్రతాంతంబున నియతయై యున్న యెడఁ జతుర్బాహుండును, బీతవాసుండును, శంఖచక్రగదా ధరుండునునై, నేత్రంబుల కగోచరుండైన నారాయణదేవుండు ప్రత్యక్షంబైనం గనుంగొని. 480**

**ప్రతి :** అనినన్= అట్లు అదితి వచించగా; కశ్యపప్రజాపతి; సతికిన్= భార్యకు; పయోభక్షణంబు= పన్నెండురోజులు పాలను మాత్రమే త్రాగడం అనే నియమంగల; అను వ్రతంబు= అనే వ్రతాన్ని; ఉపదేశించి= చెప్పి; తత్+కాలంబును= ఆ సమయాన్ని; తత్+మంత్రంబును= ఆ మంత్రాన్ని; తత్+విధానంబును= ఆ ప్రకారాన్ని; తత్= ఆ వ్రతానికి చేయవలసిన; ఉపవాస= ఉపవాసమూ; దాన= దానముచే; భోజన= భుజించటం; ప్రకారంబులును= వీటి విధానాలను; ఎఱింగించినన్= చెప్పగా; అదితియును; ఫాల్గుణమాసంబునన్= ఫాల్గుణం అనే పేరుగల నెలలోని; శుక్లపక్షంబునన్= శుద్ధపక్షమున; ప్రథమదివసంబునన్= మొదటి దినమున (పాడ్యమినాడు); దొరకొని= ప్రారంభించి; పండ్రెండుదినంబులు= పన్నెండురోజులు; హరి సమర్పణంబుగాన్= విష్ణుసమర్పణంగా; వ్రతంబున్= నోమును; చేసి= ఒనరించి; వ్రతాంతంబునన్= వ్రతము సమాప్తినొందిన తర్వాత; నియతమై= నియమం కలిగి; ఉన్నయెడన్= ఉన్నసమయాన; చతుర్బాహుండును= నాలుగుభుజములు కలవాడును; పీతవాసుండును= పచ్చని వస్త్రంగలవాడును; శంఖ చక్ర గదా ధరుండును+ఐ= శంఖం చక్రం గద ధరించినవాడై; నేత్రంబులకు= కనులకు; అగోచరుండు+ఐన= కనపడని; నారాయణదేవుండు= నారాయణభగవానుడు; ప్రత్యక్షంబు+ఐనన్= ప్రసన్నుడుకాగా; కనుంగొని= దర్శించి...

**తా :** పై విధంగా అడిగిన అదితికి కశ్యపుడు 'పయోభక్షణం' అనే పాలతోచేసే వ్రతాన్ని ఉపదేశించినాడు. అందుకు తగిన కాలాన్నీ, మంత్రాన్నీ, నియమాన్నీ, వ్రతకాలంలో పాటించవలసిన ఉపాసనా విధినీ, దాన భోజనాది విధానాలనూ బోధించినాడు. అదితి ఫాల్గుణమాసం శుక్లపక్షం మొదటిదినాన ఆ వ్రతాన్ని మొదలు పెట్టినది. పన్నెండు దినాలు

యథావిధిగా భగవంతుని పూజించినది. వ్రతం అయిపోగానే నియమవంతురాలయిన ఆమెకు విష్ణుదేవుడు ప్రత్యక్షమైనాడు. ఆయన చతుర్బాహుడు. శంఖాన్నీ చక్రాన్నీ గదను ధరించి ఉన్నాడు. పచ్చని పట్టువస్త్రాన్ని కట్టుకొని ఉన్నాడు. కన్నులకు కానరాని భగవంతుడు ఆమె కన్నుల ఎదుట సాక్షాత్కరించినాడు. ఆమె ఆ దేవుని దర్శించింది.

**విశే :** ఇక్కడ పయోవ్రతమంటే పాలతో చేసే వ్రతం తప్పా నీటితో చేసే వ్రతం కాదు.

**క. కన్నుల సంతోషాశ్రులు, చన్నులపైఁ బఱవఁబులకజాలము లెసఁగన్**
**సన్నతులును సన్నుతులును, నున్నతరుచిఁజేసి నిటల యుక్తాంజలియై. 481**

**ప్రతి :** కన్నుల= నేత్రములనుండి పొడమిన; సంతోష+అశ్రులు= ఆనంద బాష్పములు; చన్నులపైన్= స్తనములమీద; పఱవన్= ప్రవహింపగా; పులకజాలములు= రోమాంచముల సముదాయములు; ఎసఁగన్= ఒప్పగా; ఉన్నతరుచిన్= మిక్కిలి కాంతితో; నిటల= నుదుటియందు; యుక్త+అంజలి+ఐ= చేర్చబడిన దోసిలి కలదియై; సన్నతులును= వినయంతో కూడిన నమస్కారములను; సన్నుతులును= స్తోత్రములను; చేసి= కావించి...

**తా :** సంతోష బాష్పాలు చనుకట్టుపయిన పడి గగురుపాటుకల దేహంతో నెన్నుదుట దోసిలియొగ్గి నమస్కారములు, స్తోత్రములు చేసి

**క. చూపుల శ్రీపతిరూపము, నాపోవక త్రావి త్రావి హర్షోద్ధతయై**
**వాపుచ్చి మంద మధురా, లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్. 482**

**ప్రతి :** చూపులన్= దృష్టులచే; శ్రీపతి రూపమున్= హరియొక్క ఆకారమును; ఆపోవక= తృప్తినొందక; త్రావి త్రావి= ఎంతగానో పానము చేసి; హర్ష+ఉద్ధతయై= నిండు సంతోషము కలదై; వాపుచ్చి= నోరువిప్పి; మంద= నెమ్మదియైన(మృదువైన); మధుర= తీయనైన; ఆలాపంబులన్= మాటలతో; అదితి= కశ్యపునిభార్య; లక్ష్మీనాథున్= హరిని; పొగడెన్= స్తోత్రము చేసెను.

**తా :** అదితి హరిరూపాన్ని చూపులతో తనివితీరా త్రాగింది. చాల సంతోషంతో మైమరచి ఆ స్వామివారిని మృదువైన తీయనిమాటలతో ఇలా నుతించింది.

**సీ. 'యజ్ఞేశ! విశ్వంభరాచ్యుత! శ్రవణ మంగళనామధేయ! లోకస్వరూప!**
**యాపన్నభక్తజనార్తివిఖండన! దీనలోకాధార! తీర్థపాద!**
**విశ్వోద్భవస్థితి విలయకారణభూత! సంతతానంద! శశ్వద్విలాస!**
**యాయువు దేహంబు ననుపమలక్ష్మియు వసుధయు దివముఁద్రివర్గములును**

**తే. వైదికజ్ఞానయుక్తియు వైరిజయము, నిన్నుఁగొలువని నరులకు నెఱయఁగలదె?**
**వినుతమందార! గుణహార! వేదసార!, ప్రణతవత్సల! పద్మాక్ష! పరమపురుష! 483**

**ప్రతి :** వినుతమందార= కొనియాడినవారికి కల్పవృక్షంవంటివాడా!; గుణహార= సుగుణములతో మనోహరమైనవాడా!; వేదసార= వేదాలకు సారమైనవాడా!; ప్రణతవత్సల= నమస్కరించువారి పై వాత్సల్యము చూపువాడా!; పద్మ+అక్ష=

పద్మములవంటి కనులు కలవాడా!; పరమపురుష= పురుషోత్తమా!; యజ్ఞ+ఈశ= జన్నములకు ఱేడా!; విశ్వంభర= ప్రపంచమును భరించునట్టివాడా!; అచ్యుత= నాశనములేనివాడా!; మంగళ= శుభప్రదమైన; నామధేయ= పేరుగలవాడా!; లోకస్వరూప= లోకమే ఆకారముగా కలవాడా!; ఆపన్న= కష్టములలో ఉన్న; భక్తజన= భక్తులయొక్క; ఆర్తి= దుఃఖమును; విఖండన= తెగగోయువాడా!; దీనలోక= దీనులగు జనులకు; ఆధారా= ఆధారమైనవాడా!; తీర్థపాద= విష్ణుమూర్తీ! గంగానది పుట్టినది విష్ణుపాదాలక్రింద కనుక పరమపవిత్రము; విశ్వ= ప్రపంచముయొక్క; ఉద్భవ= పుట్టుకకు; స్థితి= పెరుగుటకు / ఉండుటకు; విలయ= నశించుటకు; కారణ భూత!= హేతువయినవాడా!; సంతత= మిక్కిలి ఎడతెగని; ఆనంద= సంతోషముకలవాడా!; శశ్వత్= ఎల్లప్పుడూ; విలాస= క్రీడ కలవాడా!; ఆయువున్= ఆయుర్దాయమును; దేహంబున్= శరీరమును; అనుపమ= సాటిలేని; లక్ష్మియున్= సంపదయు; వసుధయున్= భూమియు; దివమున్= ఆకాశమును లేక స్వర్గమును; త్రివర్గములును= ధర్మార్థకామములును (సత్త్వరజస్తమములని కూడా చెప్పవచ్చు); వైదిక జ్ఞానయుక్తియు= వేదసంబంధమయిన జ్ఞానముయొక్క కూడిక; వైరిజయమున్= శత్రువిజయమును; నిన్నున్= నిన్ను; కొలువని= సేవింపని; నరులకున్= మనుజులకు; నెఱయన్ కలదె?= నిండుగా కలుగునా!

**తా :** యజ్ఞేశ్వరా! విశ్వంభరా! అచ్యుతా! ఈలోకాలన్నీ నీ స్వరూపమే. నీ పేరు చెవులార విన్నవారికి శుభాలు చేకూరుతాయి. ఆపన్నులగు భక్తులకు దుఃఖాలను పోగొట్టేవాడవు. నీ పాదాలు లోకాలను తరింప చేస్తాయి. ఈ విశ్వము పుట్టుకకు నిలబడుటకు అంతమగుటకు నీవే కారణం. పరిమితి లేని ఆనందమే విలాసంగా కలవాడవు. నిన్ను స్తోత్రం చేసినవారికి కల్పవృక్షంవలె కోరినవి సమకూరుస్తావు. సృష్టిలోని గుణాలన్నీ నీ కంఠసీమలో హారాలై మెరుస్తుంటాయి. సర్వవేదాలసారం నీవే. నిన్ను చక్కగా స్తోత్రం చేసిన వారిని వాత్సల్యంతో కటాక్షిస్తావు. పద్మాక్షా! పరమపురుషా! ఆయువు, శరీరం చక్కగా ఉండటం, వైభవం, రాజ్యం, స్వర్గం, ధర్మం, అర్థం, కామం, వైదికజ్ఞానం, శత్రువిజయం అనేవి నిన్ను సేవించని నరులకు లభించటం సాధ్యంకాదు.

**ఆ. అసురవరులు సురల నదలించి బెదరించి, నాక మేలుచున్ననాఁటనుండి**
**కన్నకడుపు గాన కంటఁగూరుకు రాదు, కడుపుఁ బొక్కు మాన్పి కావవయ్య' 484**

**ప్రతి :** అసురవరులు= రాక్షసశ్రేష్ఠులు; సురలన్= దేవతలను; అదలించి= తోలి; బెదరించి= భయపెట్టి; నాకము+ఏలుచు+ ఉన్న+నాఁటనుండి= స్వర్గమును పరిపాలించుచున్నప్పటినుండి; కన్నకడుపుగాన= వారిన కన్నదాని నగుటవలన; కంటన్= కంటియందు; కూరుకురాదు= నిద్రరాదు; కడుపుఁబొక్కున్= గర్భశోకమును; మాన్పి= పోగొట్టి; కావవయ్య!= రక్షింపుమయ్య!

**తా :** దైత్యశ్రేష్ఠులు దేవతలను భయపెట్టి పారదోలి స్వర్గాన్ని పరిపాలిస్తున్నప్పటినుండి కూడా నా కంటికి నిద్ర కరువైంది. నా గర్భశోకాన్ని మానిపి రక్షించవయ్యా!

**వ. అనిన విని దరహసితవదనుండయి యాశ్రితకామధేనువైన యప్పరమేశ్వరుం డిట్లనియె. 485**

**ప్రతి :** అనినన్= అలా అదితి పలుకగా; విని= ఆలించి; దరహసిత వదనుండై= చిరునగవుతోకూడిన మొగము కలవాడయి; ఆశ్రిత= అండనుకోరినవారికి; కామధేనువయిన= సకలమైన కోరికలను తీర్చే దేవతల గోవైన; ఆ+పరమేశ్వరుండు= ఆ పరాత్పరుడగు హరి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పెను.

**తా :** అని పలికిన అదితి మాటలు విని శ్రీహరి చిరునవ్వు చిందించినాడు. ఆశ్రయించినవారికి కామధేనువయిన ఆ పరమాత్ముడు అదితితో ఇలా అన్నాడు.

**శా. నీ కోడండ్రును, నీ కుమారవరులున్, నీ నాథుఁడున్, నీవు సం**
**శ్లోకింపన్ సతులుం బతుల్ మిగుల సమ్మోదింప రాత్రించరుల్**
**శోకింపన్ భవదీయగర్భమునఁదేజోమూర్తి జన్మించెదన్**
**నాకున్ వేడుక పుట్ట నీ సుతుఁడనై నర్తించి వర్తింపఁగాన్. 486**

**ప్రతి :** నీ కోడండ్రును= నీ కోడళ్లు; నీ కుమారవరులున్= నీ పుత్ర రత్నాలూ; నీ నాథుఁడున్= నీ భర్తా; నీవున్= నీవునూ; సంశ్లోకింపన్= మిక్కిలి శ్లాఘింపగా; సతులున్= భార్యలును; పతుల్= భర్తలును; మిగులన్= మిక్కిలి; సమ్మోదింపన్= సంతోషించునట్లు; రాత్రించరుల్= రక్కసులు; శోకింపన్= దుఃఖించునట్లు; భవదీయగర్భమునన్= నీ కడుపునందు; తేజస్+మూర్తిన్= తేజస్సుతో కూడిన ఆకారంతో; నీ సుతుఁడనై= నీకు కుమారుడనై; నర్తించి= ఆడుకొంటూ; వర్తింపగాన్= ప్రవర్తించడానికి; నాకున్= నాకు; వేడుకపుట్టన్= సంతోషం కలుగగా; జన్మించెదన్= పుడతాను.

**తా :** నీ కోడళ్ళూ, నీ కొడుకులూ; నీ మగడూ; నీవూ మిక్కిలి పొగడేటట్లు, భార్యాభర్తలు చాలా సంతోషించేటట్లు, రాక్షసులు దుఃఖించేటట్లు, నీ కడుపున తేజశ్శాలినై జన్మిస్తాను. నీ కుమారుడనై తిరుగుతూ ఆడుకోవాలని నాకూ వేడుకగా ఉంది.

**మ. బలిమిన్ దైత్యులఁజంపరాదు వినయోపాయంబునంగాని; సం**
**చలనంబొందకు; నేను నీ నియతికిన్ సద్భక్తికిన్ మెచ్చితిన్;**
**బలివిద్వేషియు నా నిలింపగణమున్ బౌలోమియున్ మెచ్చ దై**
**త్యుల రాజ్యంబు హరింతు, నింద్రునికి నిత్తున్; దుఃఖ మింకేటికిన్? 487**

**ప్రతి :** దైత్యులన్= రాక్షసులను; బలిమిన్= బలముచే; చంపరాదు= చంపవీలుకాదు; వినయ= నమ్రతతోకూడిన; ఉపాయంబునన్+కాని= ఆలోచన చేతనేగానీ; సంచలనంబు+ఒందకు= భయపడకు; నీనియతికిన్= నీనిష్ఠకు; సద్భక్తికిన్= గొప్ప భక్తికిని; నేను+మెచ్చితిన్= నేను మెచ్చుకొంటిని; బలి విద్వేషియు= ఇంద్రుడును; నిలింపగణమున్= దేవసమూహమును; పౌలోమియున్= శచీదేవియు; మెచ్చన్= మెచ్చుకొనేటట్లు; దైత్యుల రాజ్యంబు హరింతున్= రాక్షసులు పాలించు స్వర్గమును అపహరింతును; ఇంద్రునకున్= దేవేంద్రునకు; ఇత్తున్= ఇచ్చెదను; దుఃఖము= విచారము; ఇంక+ఏటికిన్?= ఇక ఎందులకు?

**తా :** సహనంతో కూడిన ఉపాయంతో తప్ప, బలాన్ని ప్రదర్శించి రాక్షసులను చంపడానికి వీలులేదు. నీ నియతినీ భక్తినీ నేను మెచ్చుకున్నాను. ఇంద్రుడూ, దేవగణమూ, శచీదేవీ మెచ్చుకొనే విధంగా స్వర్గాన్ని రాక్షసులనుండి అపహరించి ఇంద్రునికిస్తాను. ఇంక విచారమెందుకు?

**క. నీ రమణుని సేవింపుము, నా రూపము మానసించి నలి నీ గర్భా**
**గారంబు వచ్చి చొచ్చెద, గారామునఁబెంపవమ్మ కరుణన్ నన్నున్. 488**

**ప్రతి :** నా రూపమున్= నా ఆకారాన్ని; మానసించి= మనస్సునపెట్టుకొని; నీ రమణుని= నీ పెనిమిటిని; సేవింపుము= భజింపుము; నలిన్= చక్కగా; వచ్చి; నీ గర్భ+అగారంబునన్= నీ కడుపు అనే ఇంటియందు; చొచ్చెదన్= ప్రవేశించెదను; నన్నున్= నన్ను; కరుణన్= దయతో; గారామునన్= ప్రేమతో; పెంపవమ్మ= పెంచుముతల్లీ.

**తా :** నా రూపాన్ని మనసులో పెట్టుకొని నీ భర్తను సేవించు. నేను నీ గర్భంలో ప్రవేశిస్తాను. నన్ను దయతో ప్రేమతో పెంచుము తల్లీ!

**క. ఏలింతు దివము సురలను, బాలింతు మహేంద్రయువతి భాగ్యశ్రీలం**
**దూలింతు దానవుల ని, ర్మూలింతు రిపుప్రియాంగముల భూషణముల్! 489**

**ప్రతి :** సురలను= దేవతలచే; దివమున్= స్వర్గరాజ్యాన్ని; ఏలింతున్= పాలింపచేసెదను; మహేంద్రయువతి= దేవేంద్రుని భార్యయొక్క; భాగ్యశ్రీలన్= సౌభాగ్యాలను; పాలింతును= కాపాడుదును; దానవులన్= రక్కసులను; తూలింతున్= ఎగుర గొట్టెదను; రిపు= శత్రువుల; ప్రియా= భార్యలయొక్క; అంగముల= శరీరములయందలి; భూషణముల్= అలంకారములను; నిర్మూలింతున్= నాశనం చేస్తాను.

**తా :** దేవతలచే స్వర్గాన్ని ఏలిస్తాను. శచీదేవి సౌభాగ్యాలను కాపాడుతాను. రాక్షసులను అధికారంనుంచి తొలగిస్తాను. వారి ఇల్లాండ్ర సొమ్మును ఊడదీయిస్తాను.

**వ. అని యిట్లు భక్తజన పరతంత్రుండగు పురాణపురుషుం డాన తిచ్చి తిరోహితుం డయ్యె; న య్యదితియుఁ గృతకృత్యయై సంతోషంబునఁ దన మనోవల్లభుండగు కశ్యపు నాశ్రయించి సేవించుచుండె; నంత నొక్కదినంబున. 490**

**ప్రతి :** అని= పలికి; ఇట్లు= ఈ విధముగా; భక్తజన పరతంత్రుండగు= భక్తజనులయందు ప్రేమగలవాడయిన; పురాణపురుషుండు= ఆదిపురుషుడైన శ్రీహరి; ఆనతిచ్చి= సెలవిచ్చి; తిరోహితుండు+అయ్యెన్= అంతర్హితుడైనాడు; ఆ+అదితియు= ఆ అదితియును; కృతకృత్య+ఐ= కృతార్థురాలయి; సంతోషంబునన్= ఆనందముతో; తన మనస్+ వల్లభుండు+అగు= తననాథుడయిన; కశ్యపున్= కశ్యపప్రజాపతిని; ఆశ్రయించి= చేరి; సేవించుచుండెన్= కొలుచుచుండెను; అంతన్= అంతట; ఒక్కదినంబునన్= ఒకనాడు...

**తా :** ఈ విధంగా భక్త పరాధీనుడయిన పురాణపురుషుడు (విష్ణువు) సెలవిచ్చి మాయమయ్యెను. అదితి సంకల్పము నెరవేరెను. ఆమె సంతోషముతో తన భర్తయగు కశ్యపుని ఆశ్రయించి ప్రేమతో సేవిస్తూ ఉండగా అటు తర్వాత ఒకనాడు

**ఆ. ఘనసమాధినుండి కశ్యపుఁడచ్యుతు, నంశ మాత్మ నొలయ నదితియందుఁ**
**దనదు వీర్య మధికతరము సేర్చెను గాలి, శిఖిని దారువందుఁజేర్చినట్లు 491**

**ప్రతి :** కశ్యపుఁడు= కశ్యపబ్రహ్మ; ఘనసమాధిన్+ఉండి= గొప్పతపస్సులో ఉన్నవాడై; అచ్యుతునంశము= విష్ణుమూర్తియొక్క అంశము; ఆత్మన్= తనచిత్తమందు; ఒలయన్= ప్రవేశించ; ఆదితియందున్= భార్య అయిన అదితియందు; తనదు వీర్యము= తనయొక్కవీర్యమును; అధికతరము= మిక్కిలి ఎక్కువగా; గాలి= వాయువు; శిఖిని= అగ్నిని; దారువందున్= కర్రయందు; చేర్చినట్లు= చేర్చినవిధంగా; చేర్చెను= ప్రవేశ పెట్టెను.

**తా :** కశ్యపుడు సమాధిలో ఉండి హరి అంశము తనయందు ప్రవేశించగా అదితియందు అధికమగు తన వీర్యాన్ని 'గాలి అగ్నిని కర్రయందు చేర్చినట్లు' చేర్చినాడు.

**వ. ఇట్లు కశ్యప చిరతర తపస్సంభృత వీర్య ప్రతిష్ఠిత గర్భయై సురలతల్లి యుల్లంబున నుల్లసిల్లుచు నుండె; నంత. 492**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కశ్యప= కశ్యపునియొక్క; చిరతర= చాలాకాలంనుంచి చేస్తున్న; తపః= తపస్సుచే; సంభృత= చక్కగా భరింపబడిన; వీర్య= వీర్యముచే; ప్రతిష్ఠిత= నిలుపబడిన; గర్భయై= గర్భముకలదియై; సురలతల్లి= దేవమాత అదితి; ఉల్లంబునన్= మనస్సులో; ఉల్లసిల్లుచున్= సంతోషిస్తూ; ఉండెన్= ఉండెను; అంతన్= అటుపిమ్మట.

**తా :** రాజా! పై విధంగా కశ్యపుడు చాలాకాలంగా మహాతపస్సు చేసి విశేషంగా సంపాదించిన వీర్యంవల్ల అదితి గర్భాన్ని ధరించింది. ఆమె మనస్సు చాలా ఉల్లాసాన్ని పొందింది.

**క. చలచలనై పిదపిదనై, గలలంబై కరుదు గట్టి గళనాళముతోఁ**
**దల యేర్పడి గర్భంబై, నెలమసలం జీరచిక్కె నెలఁతకు నధిపా! 493**

**ప్రతి :** అధిపా= రాజా!; నెలమసలన్= నెలతప్పగానే; చలచలనై= ద్రవరూపముకలదై; పిదపిదనై= మృదుత్వము కలదై; కలలంబై= పిండమై; కరుడుగట్టి= గడ్డగట్టి; గళనాళముతోన్= కంఠనాళముతో; తలయేర్పడి= శిరస్సు రూపొంది; నెలఁతకున్= ఆ చిన్నదానికి (అదితికి); గర్భంబై= గర్భమునిలిచి; నెలమసలన్= నెలనిండగా; చీరచిక్కెన్= చీర చిన్నదాయెను అనగా గర్భము పెరిగింది.

**తా :** ఒకనెల గడిచింది. అదితి కడుపులో క్రమక్రమంగా ద్రవరూపమూ, మెత్తనిరూపమూ, గడ్డకట్టి పిండరూపమూ ఏర్పడింది. నెల తప్పింది. గొంతుతోపాటు తల ఏర్పడి గర్భం నిలిచింది.

**విశే : 'చీరచిక్కుట'** అనే ప్రయోగం గర్భధారణకు పర్యాయపదంగా ప్రయోగించటం పూర్వకవులలో కనిపిస్తుంది.

**క. నెలఁతకుఁజూలై నెల రె, న్నెలలై మఱి మూఁడు నాల్గు నెలలై వరుసన్**
**నెల లంత కంత కెక్కఁగ, నెలలును డగ్గఱియె నసురనిర్మూలతకున్. 494**

**ప్రతి :** నెలఁతకున్= ఆ స్త్రీకి (అదితికి); చూలై= గర్భమై; నెల= ఒకమాసం; రెన్నెలలై= రెండుమాసములై; మఱి= మరియు; మూడునాల్గునెలలై= మూడును నాలుగుమాసాలై; వరుసన్= క్రమంగా; నెలలు= మాసములు; అంతకంతకు= క్రమక్రమముగా; ఎక్కఁగన్= పెరుగగా; అసుర= దనుజులయొక్క; నిర్మూలతకున్= నాశనమునకు; నెలలును= మాసములును; డగ్గఱియెన్= సమీపించెను.

**తా :** అదితికి గర్భమై ఒకటి రెండు మూడు నాలుగు నెలలు గడచినవి. క్రమంగా నెలలు పెరిగినాయి. రాక్షసనాశనానికి కూడా నెలలు సమీపించినాయి.

**క. మహితతరమేఘమాలా, పిహితాయుతచండభానుబింబప్రభతో**
**విహితాంగంబులఁ గశ్యపు, గృహిణీగర్భమున శిశువు గ్రీడించె నృపా! 495**

**ప్రతి :** నృపా= రాజా!; మహితతర= మహత్తరమయిన; మేఘమాలా= మబ్బుగుంపుచే; పిహిత= కప్పబడిన; అయుత= పదివేల; చండ= తీక్ష్ణమయిన; భానుబింబ= సూర్యబింబముయొక్క; ప్రభతోన్= కాంతితో; విహిత+అంగంబులన్= విధింపబడిన అవయవములతో; కశ్యపు గృహిణీ గర్భమునన్= కశ్యప ప్రజాపతి భార్య అయిన అదితియొక్క కడుపున; శిశువు= బిడ్డ; క్రీడించెన్= ఆటలాడెను.

**తా :** రాజా! అదితి కడుపులో అవయవాలతోకూడిన ఆ శిశువు గొప్ప మేఘాలు కప్పిన పదివేల సూర్యబింబాల వెలుగుతో కదలాడసాగినాడు.

**క. తన కడుపున నొక వెఱవున, వనరుహగర్భాండభాండవనధిచయంబుల్**
**గొనకొని జగముల నిడుకొని, తనుగతిఁగడు నడఁగి మడఁగి తనరెన్ బెడఁగై. 496**

**ప్రతి :** తన కడుపునన్= తన గర్భమందు; ఒక వెఱవున= ఒక మరుగునందు; వనరుహగర్భాండభాండ= బ్రహ్మాండభాండాలను; వనధిచయంబుల్= సముద్రాలను; జగములన్= మూడులోకములను; కొనకొని= యత్నించి; ఇడుకొని= ఇముడ్చుకొని; తనుగతిన్= సూక్ష్మరూపాన; కడున్= మిక్కిలి; అడఁగి= అణగి; మడఁగి= ముడుచుకొని; బెడఁగై= అందముగా; తనరెన్= ఒప్పుచున్నాడు.

**తా :** అదితి గర్భంలో ఆ శిశువు బ్రహ్మాండభాండాన్నీ సముద్రాలనూ సమస్తలోకాలనూ తన కడుపులో ఇముడ్చుకొని సన్ననైన చిన్నని ఆకారంతో అందంగా అణగి మణగి ఉన్నాడు.

**వ. అంత నక్కాంతాతిలకంబు క్రమక్రమంబున. 497**

**ప్రతి :** అంతన్= తరువాత; ఆ+కాంతాతిలకంబు= ఆ స్త్రీ రత్నము; క్రమక్రమంబునన్= వరుసగా.

**మ. నిలిపెన్ ఱెప్పల బృందిమన్ విశదిమన్ నేత్రంబులం, జూచుకం**
**బుల నాకాళిమ, మేఖలం ద్రఢిమ నెమ్మో మారఁగా బాండిమన్**
**బలిమిం జన్నుల, శ్రోణిపాళిగరిమ, న్మధ్యంబునన్ బృంహిమన్**
**లలితాత్మన్ లఘిమన్, మహామహిమ మేనన్ గర్భదుర్వారయై. 498**

**ప్రతి :** ఱెప్పలన్= కనురెప్పలయందు; బృందిమన్= మనోజ్ఞత్వాన్ని; నేత్రంబులన్= కన్నులందు; విశదిమన్= ధావళ్యాన్ని; చూచుకంబులన్= కుచాగ్రాలందు; ఆకాళిమన్= అంతటను నీలిమను (నలుపును); మేఖలన్= ఎనిమిదిపేటల మొలనూలునందు (ఒడ్డాణమందు); ద్రఢిమన్= బిగువును; నెర+మోము+ఆరఁగాన్= నిండుమొగమునందొప్పునట్లు; పాండిమన్= తెల్లదనాన్ని; చన్నులన్= స్తనాలయందు; బలిమిన్= బలాన్ని; శ్రోణిపాళిన్= పిరుదులందు; గరిమన్= విరివిని; మధ్యంబునన్= నడుమునందు; బృంహిమన్= ఘనత్వాన్ని; లలిత= మనోహరమైన; ఆత్మన్= మనస్సునందు; లఘిమన్= తేలికదనమును; మేనన్= శరీరమందు; మహామహిమన్= గొప్పమహత్త్వాన్ని; గర్భ= కడుపునకు; దుర్వారమై= వారింపశక్యముకానిదై; నిలిపెన్= నెలకొల్పెను.

**తా :** అదితికి క్రమంగా గర్భలక్షణాలు స్పష్టంగా కనిపించసాగినవి. ఆమె కనురెప్పలు అందంగా ఒప్పినాయి. కన్నులు నిర్మలంగా ఉన్నాయి. చనుమొనలు నల్లబడినాయి. ఒడ్డాణం బిగువైంది. ముఖం తెల్లబడింది. వక్షోజాలు గట్టిపడినాయి. పిరుదులు బరువెక్కినాయి. నడుము విస్తరించింది. మనస్సు తేలికపడింది. దేహం మహత్త్వాన్ని పొందింది.

**క. పెట్టుదురు నుదుట భూతిని, బొట్టిడుదురు మేనఁ బట్టుఁబుట్టపుదోయిం**
**బెట్టుదురు వేల్పులమ్మకుఁ, గట్టుదురు సురక్ష పడఁతి గర్భంబునకున్. 499**

**ప్రతి :** వేల్పుల+అమ్మకున్= దేవతల తల్లియగు అదితికి; నుదుటన్= నొసటియందు; భూతిని= భస్మమును; పెట్టుదురు= ఉంచెదరు; బొట్టు+ఇడుదురు= తిలకము దిద్దుదురు; మేనన్= శరీరమునందు; పట్టుఁబుట్టపుదోయిన్= పట్టుబట్టలజతను; పెట్టుదురు= ధరింపజేయుదురు; పడఁతి గర్భంబునకున్= ఆ చిన్నదాని కడుపునకు; సురక్ష= మంచిరక్షణమును కావించు యోగ్యమైన బంధనమును; కడతారు.

**తా :** (ముత్తైదువలు) అదితి నుదుట విభూతిని పెట్టినారు. తిలకం దిద్దినారు. పట్టుబట్టల జతను కట్టించినారు. గర్భానికి రక్ష కట్టినారు.

**వ. ఇ వ్విధంబున. 500**

**ప్రతి :** ఈ+విధంబున= ఈ విధంగా.

**తే. విశ్వగర్భుఁడు దన గర్భవివరమందుఁ, బూఁటపూఁటకుఁ బూర్ణుఁడై పొటకరింప**
**వ్రేకఁ జూలాలితనమున వేల్పుఁబెద్ద, పొలఁతి కంతట నీళ్లాడు ప్రొద్దు లయ్యె. 501**

**ప్రతి :** విశ్వగర్భుఁడు= ప్రపంచమంతా బొజ్జలో ఉంచుకొన్న హరి; తన= తనయొక్క; గర్భ వివరమందున్= గర్భరంధ్రమందు; పూఁటపూఁటకున్= దిన దినమూ; పూర్ణుఁడై= నిండినవాడై; పొటకరింపన్= అతిశయించగా; వ్రేఁక= భారమయిన; చూలాలితనమునన్= కడుపుతో ఉండటంచేత; వేల్పుఁబెద్ద పొలఁతికిన్= కశ్యపబ్రహ్మ భార్య అదితికి; అంతటన్= అంతలో; నీళ్లాడు= ప్రసవించే; ప్రొద్దులు+అయ్యెన్= వేళలు సమీపించినాయి.

**తా :** అదితి గర్భంలో విశ్వగర్భుడైన భగవంతుడు పూట పూటకూ పెరిగినాడు. గర్భం బరువెక్కింది. ఆమె నీళ్లాడే సమయం దగ్గరపడింది.

**వ. తదనంతరంబునఁ జతురాననుం డరుగుదెంచి యదితి గర్భపరిభ్రమ విభ్రముం డగు న ప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతియించె. 502**

**ప్రతి :** తద్+అనంతరంబునన్= అటుపిమ్మట; చతుర్+ఆననుండు= నాలుగుమొగములుగల బ్రహ్మదేవుడు; అరుగుదెంచి= వచ్చి; అదితిగర్భ= అదితియొక్క గర్భమున; పరిభ్రమ= అంతటను తిరుగుటచేత; విభ్రముండగు= మిక్కిలి భ్రాంతిని కలిగియున్నవాడగు; ఆ+పరమేశ్వరున్= ఆ పరాత్పరుని; ఉద్దేశించి= గురించి; ఇట్లు+అని= ఈ విధంగా; స్తుతియించెన్= స్తోత్రం చేసినాడు.

**తా :** ఆ సమయంలో బ్రహ్మదేవుడు అదితిగర్భంలో కదలాడే భగవంతునుద్దేశించి ఈ విధంగా స్తోత్రం చేసినాడు.

**సీ. 'త్రిభువన జయరూథ! దేవ! యురుక్రమ! పృథులాత్మ! శిపివిష్ట! పృశ్నిగర్భ!**
**ప్రీతత్రిణాభ! త్రిపృష్ఠ! జగంబుల, కాద్యంత మధ్యంబు లరయ నీవ!**
**జంగమస్థావర జననాది హేతువు నీవ; కాలంబవై నిఖిల మాత్మ**
**లోపల ధరియింతు లోనిజంతుల నెల్ల, స్రోతంబులోఁగొను సుందరతను;**

**తే. బ్రహ్మలకు నెల్ల సంభవ భవన మీవ; దివమునకుఁ బాసి దుర్దశ దిక్కులేక**
**శోకవార్ధి మునింగిన సురలకెల్లఁ, దేల నాధార మగుచున్న తెప్పవీవ. 503**

**ప్రతి :** త్రిభువన+జయ+రూఢ!= మూడు లోకములను జయించిన గొప్పవాడా!; దేవ!; ఉరుక్రమ= పెద్దపెద్ద అంగలువేస్తూ నడిచేవాడా!; శిపివిష్ట= ప్రాణులయందు అంతర్యామియైనట్టివాడా!; పృశ్నిగర్భ= 'పృశ్ని' యొక్క పుత్రుడైనట్టివాడా!; ప్రీతత్రిణాభ= ప్రీతితో ముల్లోకాలు నాభియందు గలవాడా!; త్రిపృష్ఠ!= ముల్లోకాలకు అతీతుడైనట్టివాడా!; పృథుల+ఆత్మ!= విశాలమైన మనస్సుకలవాడా!; జగంబులకున్= ప్రపంచములకు; ఆద్యంతమధ్యంబులు= మొదలు చివర నడిమిభాగములు; అరయన్= విచారించగా; నీవ= నీవే; జంగమ= కదలునట్టి; స్థావర= కదలనట్టి (వానికి); జనన= జన్మలకు; ఆదిహేతువు= మూలకారణము; నీవ= నీవే; కాలంబవై= కాలరూపుడవై; నిఖిలమున్= సర్వమును; ఆత్మలోపలన్= మనస్సులో; ధరియింతు= వహించెదవు; లోనిజంతులనెల్లన్= నీ ఉదరమునందున్న జంతువులన్నిటిని; స్రోతంబులోన్+కొను= ఇంద్రియశక్తిలోనికి గ్రహించు; సుందరతను= సౌందర్యముతో; బ్రహ్మలకునెల్లన్= అందరు బ్రహ్మలకు; సంభవభవనము= పుట్టినిల్లు; ఈవ= నీవే; దివమునకున్+పాసి= స్వర్గమును విడిచి; దుర్దశన్= కష్టదశచే; దిక్కులేక= దెసచెడి; శోకవార్ధిన్= దుఃఖసముద్రంలో; మునింగిన= మునిగిపోయిన; సురలకెల్లన్= దేవతలకందరికిని; తేలన్= తేలుటకు; ఆధారమగుచున్న= సహాయభూతుడగునట్టి; తెప్పవు= పడవవు; నీవ= నీవే.

**తా :** అదితిగర్భంలో వర్ధిల్లుతున్న స్వామీ! నీవు మూడులోకాలను జయించగలవాడవు. ఓ దేవ! పెద్దపెద్ద అంగలువేస్తూ నడిచే సామర్థ్యం గలవాడివి. రెండడుగులతోనే భూమ్యాకాశాలు కొలిచినవాడివి. విశాలమైన హృదయం గలవాడివి. ప్రాణులయందు అంతర్యామియైనట్టి వాడివి. 'పృశ్ని' యొక్క పుత్రుడవైనట్టివాడివి. ప్రీతితో ముల్లోకాలను నాభియందు గలవాడివి. ముల్లోకాలకు అతీతుడైనవాడివి. ఈ లోకాలకు ఆదిమధ్యాంతాలు నీవే. చరాచర ప్రపంచం పుట్టడానికి కారణం నీవే. కాలస్వరూపుడవై సమస్తమూ నీలోపలనే ధరిస్తావు. ప్రవాహం ప్రాణికోటిని ధరించినట్లు సమస్త జీవులనూ నీలోనే నిలుపుకొంటావు. సృష్టికర్తలైన బ్రహ్మలకు పుట్టినిల్లు నీవే. స్వర్గలోకాన్ని పోగొట్టుకొని దేవతలు కష్టాలకడలిలో మునిగిపోయినారు. వారిని రక్షించి గట్టుకు చేర్చే తెప్పవు నీవే.

**క. విచ్చేయు మదితి గర్భము, చెచ్చెర వెలువడి మహాత్మ! చిరకాలంబున్**
**విచ్చలవిడి లే కమరులు, ముచ్చటపడి యున్నవారు ముదమందింపన్. 504**

**ప్రతి :** మహాత్మ= ఓ మహానుభావా!; అమరులు= దేవతలు; విచ్చలవిడిలేక= స్వేచ్ఛలేనివారై; చిరకాలంబున్= చాలా కాలమునుండి; ముచ్చటపడియున్నవారు= సంతోషమును కోరుచున్నారు; ముదము+అందింపన్= వారికి సంతోషము కలుగచేయుటకు; అదితి గర్భమున్= అదితికడుపునుండి; చెచ్చెర= వెంటనే; వెలువడి= బయలుపడి; విచ్చేయుము= రమ్ము.

**తా :** మహాత్మా! దేవతలు చాలాకాలం నుంచీ స్వేచ్ఛలేక సంతోషంగా ఉండాలని ఆరాటపడుతున్నారు. వారికి ఆనందం కలిగించేటందుకు అదితిగర్భంనుండి బయలుదేరి రావయ్యా!

## ❖ వామనమూర్త్యావిర్భావఘట్టము ❖

**వ. అని యిట్లు కమలసంభవుండు వినుతిసేయు నయ్యవసరంబున. 505**

**ప్రతి :** అని= అట్లు పలికి; ఇట్లు= ఈ విధంగా; కమలసంభవుండు= బ్రహ్మ; వినుతిసేయు= స్తోత్రము చేయుచున్న; ఆ+అవసరంబునన్= ఆ సమయాన

**మ. రవి మధ్యాహ్నమునం జరింప గ్రహతారాచంద్రభద్రస్థితిన్**
**శ్రవణద్వాదశినాఁడు శ్రోణ నభిజిత్సంజ్ఞాతలగ్నంబునన్**
**భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్**
**దివిజాధీశ్వరుమాతకుం బరమపాతివ్రత్యవిఖ్యాతకున్. 506**

**ప్రతి :** రవి= సూర్యుడు; మధ్యాహ్నమునన్= పగటినడుమ; చరింపన్= నడచుచుండగా; గ్రహ= గ్రహములు; తారా= నక్షత్రం; చంద్ర= చంద్రుడును; భద్రస్థితిన్= శుభప్రదమయినచోటునందుండగా; శ్రవణద్వాదశినాడు= శ్రవణనక్షత్రంతో కూడిన ద్వాదశి తిథియందు; శ్రోణన్= చంద్రుడు శ్రవణంలో ఉండగా; అభిజిత్ సంజ్ఞాత= అభిజిత్ అనే పేరుగల; లగ్నంబునన్= లగ్నమందు; పుణ్యవ్రత+ఉపేతకున్= పుణ్యవ్రతాలు చేసిన దానికి; దివిజ+అధీశ్వరుమాతకున్= ఇంద్రుని తల్లియైన అదితికి; వామన గతిన్= పొట్టివాడుగ; భువన+అధీశుఁడు= లోకాధిపతి; పుట్టెన్= జన్మించెను.

**తా :** మట్టమధ్యాహ్నం – గ్రహాలు, నక్షత్రం, చంద్రుడు శుభప్రదమైన చోట ఉండగా అభిజిల్లగ్నాన శ్రవణద్వాదశిని వ్రతశీల పతివ్రత అగు అదితికి వామనుడై హరి జన్మించినాడు.

**విశే :** పగలు పదునాలుగు గడియలమీద రెండు గడియల కాలంతో కూడిన లగ్నం అభిజిత్ లగ్నం.

**వ. మఱియు న ద్దేవుండు శంఖచక్రగదా కమల కలిత చతుర్భుజుండును, బిశంగవర్ణవస్త్రుండును, మకర కుండల మండిత గండ భాగుండును, శ్రీవత్సవక్షుండును, నలిన చక్షుండును, నిరంతర శ్రీవిరాజిత రోలంబ కదంబాలంబిత వనమాలికా పరిష్కృతుండును, మణీకనక కాంచీవలయాంగద కిరీటహార నూపురాలంకృతుండును, కమనీయ కంఠ కౌస్తుభాభరణుండును, నిఖిలజన మనోహరుండునునై యవతరించిన సమయంబున. 507**

**ప్రతి :** మఱియున్= వెండియు; ఆ+దేవుండు= ఆ భగవంతుడు; శంఖ చక్ర గదా కమల= శంఖముతోను చక్రముతోను గదతోను పద్మముతోను; కలిత= కూడుకొనిన; చతుర్భుజుండును= నాలుగు బాహువులు కలవాడును; పిశంగవర్ణ= కపిలవర్ణముగల; వస్త్రుండు= బట్టలు కలవాడును; మకరకుండల= మొసలిముఖమువలె చెక్కబడిన పోగులచే; మండిత= అలంకరించబడిన; గండభాగుండును= చెక్కిళ్లుగలవాడును; శ్రీవత్స= శ్రీవత్సమను చిహ్నముగల; వక్షుండును= వక్షముకలవాడును; నలినచక్షుండును= పద్మములవంటి నేత్రములు కలవాడును; నిరంతర= ఎడతెగని; శ్రీ= లక్ష్మిచే; విరాజిత= ప్రకాశింపచేయబడుచున్న; రోలంబ= తుమ్మెదలయొక్క; కదంబ= సమూహంచే; విలంబిత= మిక్కిలి వ్రేలుచున్న; వనమాలికా= వనమాలచేత; పరిష్కృతుండును= అలంకరించబడినవాడును; మణీ కనక= మణులు తాపిన బంగారు; కాంచీవలయ= మొలనూలుచేతను; అంగద= బాహుపురులచేతను; కిరీట= కిరీటముచేతను; హార= హారములచేతను; నూపుర= అందెలచేతను; అలంకృతుండును= అలంకరింపబడినవాడును; కమనీయ= మనోహరమయిన; కంఠ= మెడలో; కౌస్తుభ= కౌస్తుభమను మాణిక్యమును; ఆభరణుండును= భూషణముగా కలవాడును; నిఖిలజన= జనులందరియొక్క; మనోహరుండును+ఐ= మనస్సులను హరించువాడును అయి; అవతరించిన= పుట్టినట్టి; సమయంబునన్= సమయంలో (వామనావతారమెత్తినపుడు).

**తా :** వామనుడు పుట్టినపుడు ఆయనకు నాలుగు చేతులూ ఆ చేతులలో శంఖమూ, చక్రమూ, గదా, పద్మమూ ఉన్నాయి. కపిలవర్ణంగల వస్త్రమూ, మకరకుండలాలతో మెరిసే చెక్కిళ్ళు, రొమ్ముపై శ్రీవత్సమూ, కమలాలవంటి కన్నులూ కలిగి

ఉన్నాడు. తుమ్మెదలు మూగిన అందమైన వనమాల మెడలో కదలుతున్నది. రత్నాలుకూర్చిన బంగారు ఒడ్డాణం, బాహుపురులూ, కిరీటమూ, హారాలూ, కాలి అందెలూ కాంతులు వెదజల్లుతున్నాయి. కమనీయమైన కంఠభాగాన కౌస్తుభమణి మెరుస్తున్నది. ఆయన రూపం అందరి మనసులనూ ఆకర్షిస్తున్నది.

**శా. చింతంబాసిరి యక్షతార్క్ష్యసుమనస్సిద్ధోరగాధీశ్వరుల్**
**సంతోషించిరి సాధ్యచారణమునీశబ్రహ్మవిద్యాధరుల్**
**గాంతిం జెందిరి భానుచంద్రములు; రంగద్గీతవాద్యంబులన్**
**గంతుల్ వైచిరి మింటఁగింపురుషులున్ గంధర్వులుంగిన్నరుల్. 508**

**ప్రతి :** యక్ష= జక్కులును; తార్క్ష్య= గరుడులును; సుమనస్= దేవతలును; సిద్ధ= సిద్ధులును; ఉరగ+అధీశ్వరుల్= నాగాధీశులును; చింతన్= దుఃఖమును; పాసిరి= విడిచిరి; సాధ్య= సాధ్యులును; చారణ= చారణులును; మునీశ= ఋషులును; బ్రహ్మ= ఋత్విజులును; విద్యాధరుల్= విద్యాధరులును; సంతోషించిరి= మోదమందిరి; భానుచంద్రములు= సూర్యచంద్రులు; కాంతిన్+చెందిరి= ప్రకాశించిరి; కింపురుషులున్= కింపురుషులును; గంధర్వులున్= గంధర్వులును; కిన్నరుల్= కిన్నరులును; రంగత్= ప్రకాశమానమయిన; గీత= సంగీతములచేతను; వాద్యంబులన్= వాద్యములచేతను; మింటన్= ఆకాశంలో; గంతుల్వైచిరి= నృత్యములు చేసిరి.

**తా :** వామనుడు పుట్టగానే యక్షులు, గరుడులు, దేవతలు, సిద్ధులు, నాగపతులు దుఃఖాన్ని వదలినారు. సాధ్యులూ, చారణులూ, ఋషులునూ, ఋత్విజులూ, విద్యాధరులూ సంతోషించినారు. సూర్యచంద్రులు కాంతులు విరజిమ్మినారు. కింపురుషులూ, గంధర్వులూ, కిన్నరులూ పాటలతో వాద్యాలు మోగిస్తూ ఆకాశంలో నాట్యాలు చేసినారు.

**క. దిక్కుల కావిరి వాసెను, నెక్కువ నిర్మలత నొందె నేడు పయోధుల్**
**నిక్కమెయి నిలిచె ధరణియుఁ, జుక్కల త్రోవయును విప్రసుర సేవ్యములై. 509**

**ప్రతి :** దిక్కుల= దిశలలో; కావిరి= చీకటి; పాసెను= పోయెను; ఏడుపయోధుల్= సప్తసముద్రాలూ; ఎక్కువ= అధికమయిన; నిర్మలతన్= స్వచ్ఛతను; ఒందెన్= పొందెను; ధరణియున్= భూమియును; చుక్కలత్రోవయును= ఆకాశమును; విప్ర= బ్రాహ్మణులచేతను; సుర= దేవతలచేతను; సేవ్యములై= సేవింపబడినవై; నిక్కమెయిన్= నిశ్చయంగా; నిలిచెన్= నిలచెను.

**తా :** దిశల చీకటి పోయింది. సప్తసముద్రాలూ చాలా నిర్మలంగా అయినాయి. భూమి బ్రాహ్మణులచేత, ఆకాశం దేవతలచేత సేవించబడింది.

**క. ముంపుగొని విరుల వానల, జొంపంబులు గురియ సురలు, సుమనోమధువుల్**
**తుంపర లెగయఁబరాగపు, రొంపుల భూభాగ మతినిరూషిత మయ్యెన్. 510**

**ప్రతి :** సురలు= దేవతలు; ముంపుగొని= గుంపుగా; విరులవానల= పుష్పవర్షాలయొక్క; జొంపంబులు= ఎడతెగనిధారలు; కురియన్= కురిపింపగా; సుమనోమధువుల్= పూలతేనె; తుంపరలు= బిందువులు; ఎగయన్= రేగగా; పరాగపురొంపులన్= పుప్పొడియొక్క బురదలచేత; భూభాగము= భూమిభాగము; అతి= ఎక్కువగా; నిరూషితము= కప్పబడినది; అయ్యెన్= ఆయెను.

**తా :** దేవతలు గుంపుగా పూలవానలను కురిపించినారు. పూలతేనియలు తుంపరలుగా రేగినవి. పుప్పొడిబురదచే భూభాగమంతా ఎక్కువగా కప్పబడింది.

**వ. తదనంతరంబ. 511**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= ఆ తర్వాత...

**ఆ. ఈ మహానుభావుఁడె ట్లింత కాలంబు, నుదరమందు నిలిచి యుండె ననుచు**
**నదితి వెఱఁగుపడియె నానంద జయశబ్ద, ములను గశ్యపుండు మొగి నుతించె. 512**

**ప్రతి :** ఈ మహానుభావుఁడు= ఈ మహాత్ముడు; ఇంతకాలంబున్= ఇంతకాలమూ; ఉదరమందున్= గర్భంలో; ఎట్లు= ఏ విధంగా; నిలిచి ఉండెన్= నిలిచి ఉన్నాడు; అనుచున్= అనిపలుకుతూ; అదితి వెఱగుపడియెన్= అదితి ఆశ్చర్యాన్ని పొందింది; ఆనంద= సంతోషంతోకూడిన; జయశబ్దములను= మంగళకరమైన మాటలతో; కశ్యపుండు= కశ్యపప్రజాపతి; మొగిన్= పూనికతో; నుతించెన్= స్తోత్రం చేసెను.

**తా :** 'ఈ మహానుభావుడు ఇంతకాలం నా కడుపులో ఎలా ఉన్నాడా' అని అదితి ఆశ్చర్యపడింది. కశ్యపుడు ఆనందంతో కూడిన జయజయ శబ్దాలతో స్వామిని సంస్తుతించినాడు.

**వ. అంత నవ్విభుండు సాయుధ సాలంకారంబగు తన దివ్యరూపంబు నుజ్జగించి రూపాంతరం బంగీకరించి కపటవటుని చందంబున నుపనయన వయస్కుండైన వామన బాలకుండై దల్లి ముందటఁ గుమార సముచితా లాపంబు లాడుచుఁగ్రీడించు సమయంబున నదితియుం దన యవలోకనపరిణామపారవశ్యంబున. 513**

**ప్రతి :** అంతన్= అంతట; ఆ+విభుండు= ఆ వామనమూర్తి; సాయుధ= ఆయుధములతోకూడినదీ; సాలంకారంబు= అలంకారంతో కూడినదీ; అగు= అయినట్టి; తన= తనయొక్క; దివ్యరూపంబున్= దేవసంబంధమైన ఆకారాన్ని; ఉజ్జగించి= విడిచిపెట్టి; రూపాంతరంబు= మరొక ఆకారాన్ని; అంగీకరించి= పూని; కపటవటునిచందంబునన్= వేషధారియగు బ్రహ్మచారివలె; ఉపనయనవయస్కుండు= వడుగునకు తగిన ప్రాయము గలవాడు; ఐన= అయినట్టి; వామన= పొట్టి; బాలకుండై= పిల్లవాడై; తల్లిముందటన్= జనని దగ్గర; కుమార= చిన్నపిల్లవానికి; సముచిత= ఒప్పిన; ఆలాపంబులు= ప్రసంగాలు (మాటలు); ఆడుచున్= పలుకుచు; క్రీడించు= ఆడునట్టి; సమయంబునన్= సమయంలో; అదితియున్= తల్లి అయిన అదితికూడా; తన+అవలోకన= తాను చూచుటతో; పరిణామ= మార్పు కనిపించుటచేత; పారవశ్యంబునన్= పరవశత్వంచే...

**తా :** ఆ తర్వాత వామనుడు ఆయుధాలూ అలంకారాలూ కలిగిన తన దివ్యరూపాన్ని వదలి కపటవటునిగా మారురూపాన్ని ధరించినాడు. పొట్టిపిల్లవాడై వడుగు చేయదగిన వయసు కలవాడైనాడు. మారురూపం పొందిన ఆ కొడుకును చూచి అదితి ఆనందంతో పరవశించింది.

**ఆ. నన్నుఁగన్న తండ్రి! నా పాలిదైవమ!, నా తపఃఫలంబ? నా కుమార!**
**నాదు చిన్నివడుగ! నా కులదీపక!, రాఁగదయ్య! భాగ్యరాశి వగుచు. 514**

**ప్రతి :** నన్ను గన్నతండ్రి= నన్ను కన్నట్టి నాన్నా!; నాపాలిదైవమ= నాపాలిటి దేవుడా!; నా తపఃఫలంబ!= నా తపస్సునకు ఫలమైనవాడా!; నా కుమార!= నా కొడుకా!; నాదు చిన్ని వడుగ= నా బ్రహ్మచారిపాపడా!; నా కులదీపక= నా వంశాన్ని ప్రకాశింపచేసేవాడా!; భాగ్యరాశివి+అగుచున్= నా సంపదలకుప్పవై; రాఁగదయ్య= రావయ్యా!

**తా :** "ననుగన్న తండ్రీ! నా పాలి దేవుడా! నా తపములపంటా! నా కొడుకా! నా వడుగుపాపా! నా వంశాన్ని ప్రకాశింపచేసేవాడా! నా సంపదలకుప్పా! రావయ్యా!" అంటూ అదితి వామనుని పిలిచింది.

**క. అన్నా రమ్మని దగ్గఱఁ, చన్నుల పా లేఱువాఱ సంశ్లేషిణియై**
**చిన్నారి మొగము నివురుచుఁ, గన్నారంజూచెఁగన్నకడుపై యుంటన్. 515**

**ప్రతి :** అన్నా= నాయనా!; రమ్మని= రమ్ము అని దగ్గరకు పిలిచి; దగ్గఱన్= చేరువకురాగా; చన్నులపాలు= స్తనాలయందలిపాలు; ఏఱువాఱన్= నదివలె ప్రవహించగా; సంశ్లేషిణియై= కౌగిలించుకొన్నదై; చిన్నారి మొగమున్= ముద్దుమోమును; నివురుచున్= తడుముతూ; కన్నకడుపు+ఐ+ఉంటన్= కనినట్టికడుపై ఉండటంచే (తన గర్భవాసం నుంచి పుట్టిన వాడు కావటంచే); కన్నారన్= నేత్రాలు తనిసేటట్లు; చూచెన్= తిలకించెను.

**తా :** నాన్నా! దగ్గరకు రా! అని అదితి వామనుని పిలిచింది. బిడ్డ చేరువకు రాగానే ఆమె చనుబాలు జాలువారినవి. అక్కున చేర్చుకుంది. అతని చిన్నారి మొగాన్ని తడిమింది. కన్నులారా చూచింది.

**క. పురు డీ బోటికి నిందిర, పురు డంబిక గాక యొరులు పురుడే? యనుచున్**
**బురుటాలికిఁబది దినముల, పురుడు ప్రవర్తించి రెలమిఁబుణ్యపు గరితల్. 516**

**ప్రతి :** ఎలమిన్= సంతోషంతో; పుణ్యపుగరితల్= పుణ్యస్త్రీలు; ఈ బోటికిన్= ఈ చిన్నదానికి (అదితికి); ఇందిర= లక్ష్మి; పురుడు= సమానం; అంబిక= పార్వతి; పురుడు= సమానం; కాక= అంతేకానీ; ఒరులు= ఇతరస్త్రీలు; పురుడే?=సమానమా? (కాదు అనటం); అనుచున్= అని పలుకుతూ; పదిదినముల పురుడు= పదిదినాలలో జరిపే జాతాశౌచాదికాన్ని; ప్రవర్తించిరి= జరిపించినారు.

**తా :** 'ఈ అదితికి లక్ష్మీ పార్వతులే సమానమైనవారు. ఇతరులు సరికారు' అంటూ పుణ్యాంగనలు బాలెంతరాలుకు పదిరోజులు పురుడు జరిపినారు.

**వ. అంత న బ్బాలునకు సంతసంబున మహర్షులు గశ్యపప్రజాపతిం బురస్కరించుకొని సముచితో పనయన కర్మకలాపంబులు సేయించిరి; సవిత సావిత్రి నుపదేశించె; బృహస్పతి యజ్ఞోపవీతంబును, గశ్యపుండు ముంజియుఁ, గౌపీనం బదితియు, ధరణి గృష్ణాజినంబును, దండంబు వనస్పతియగు సోముండును, గగనాధిష్ఠాన దేవత ఛత్రంబును, గమండలువు బ్రహ్మయు, సరస్వతి యక్షమాలికయు, సప్తర్షులు గుశపవిత్రంబులు నిచ్చిరి, మఱియును. 517**

**ప్రతి :** అంతన్= అంతట; ఆ+బాలునకు= ఆ పిల్లవాడగు వామనునికి; సంతసంబునన్= సంతోషంతో; మహర్షులు= మునీంద్రులు; కశ్యపప్రజాపతిన్= కశ్యపబ్రహ్మను; పురస్కరించుకొని= ముందుంచుకొని; సముచిత= యోగ్యమైన; ఉపనయన= వడుగుయొక్క; కర్మ కలాపంబులు= కార్యాలు; చేయించిరి= జరిపించినారు; సవిత= సూర్యుడు; సావిత్రిన్=

గాయత్రీమంత్రాన్ని; ఉపదేశించెన్= (చెప్పినాడు), ఉపదేశంచేసినాడు; బృహస్పతి= దేవగురువు; యజ్ఞోపవీతంబును= జన్నిదాన్ని; కశ్యపుండు= తండ్రి అయిన కశ్యపప్రజాపతి; ముంజియున్= ముంజి అనే దర్భలతోచేసిన మొలతాడును; కౌపీనంబు= గోచిని; అదితియు= తల్లియును; ధరణి= భూదేవి; కృష్ణ+అజినంబును= నల్లజింకచర్మాన్ని; దండంబున్= దండాన్ని; వనస్పతియగు= ఓషధీశుడైన; సోముండును= చంద్రుడూ; గగన+అధిష్ఠానదేవత= అనంతమగు ఆకాశదేవత; ఛత్రంబును= గొడుగును; కమండలువున్= కమండలాన్ని; బ్రహ్మయు= బ్రహ్మదేవుడూ; సరస్వతి= శారదాదేవి; అక్షమాలికయు= జపమాలికనూ; సప్త+ఋషులు= మహర్షులేడుగురు; కుశ పవిత్రంబులున్= పవిత్రమైన దర్భలనూ; ఇచ్చిరి= ఒసగిరి; మఱియును= అంతేకాక.

**తా :** ఆ తర్వాత వామనునికి వడుగు చేయటానికై కశ్యపప్రజాపతిని ముందుంచుకొని మునీంద్రులు తగిన కార్యకలాపాలు చేసినారు. వామనునికి సూర్యుడు గాయత్రీ మంత్రాన్ని ఉపదేశించినాడు. బృహస్పతి జన్నిదాన్నీ, కశ్యపుడు ముంజదర్భల మొలతాడునూ, అదితి కౌపీనాన్నీ, భూదేవి నల్లనిజింకచర్మాన్నీ, చంద్రుడు దండాన్నీ, ఆకాశం గొడుగునూ, బ్రహ్మ కమండలాన్నీ, సరస్వతీదేవి జపమాలికనూ; సప్తర్షులు పవిత్రమైన దర్భలనూ ఇచ్చినారు.

**క. భిక్షాపాత్రిక నిచ్చెను, యక్షేశుఁడు వామనునకు; నక్షయ మనుచున్**
**సాక్షాత్కరించి పెట్టెను, భిక్షునకు భవాని పూర్ణభిక్ష నరేంద్రా! 518**

**ప్రతి :** నరేంద్రా= రాజా!; యక్ష+ఈశుఁడు= యక్షులకు రాజయిన కుబేరుడు; వామనునకున్= వామనమూర్తికి; భిక్షాపాత్రికన్= బిచ్చమెత్తుకొను పాత్రను; ఇచ్చెను= ఒసగెను; భవాని= పార్వతి; భిక్షునకున్= వామన వటువునకు; సాక్షాత్కరించి= ప్రత్యక్షమై; అక్షయమనుచున్= శాశ్వతం అంటూ; పూర్ణభిక్షన్= సంపూర్ణమైన బిచ్చాన్ని; పెట్టెను= పెట్టింది.

**తా :** పరీక్షిన్మహారాజా! కుబేరుడు వామనునికి భిక్షాపాత్రను ఇచ్చినాడు. పార్వతీదేవి 'అక్షయం' అంటూ ఆ వటునికి పూర్ణభిక్షను పెట్టింది.

**క. శుద్ధబ్రహ్మర్షి సమా, రాద్ధుండై విహితమంత్రరాజిఁ జదువుచుం**
**బ్రోద్ధంబగు ననలంబున, వృద్ధాచారమున వటుఁడు వేల్చెం గడఁకన్. 519**

**ప్రతి :** శుద్ధబ్రహ్మర్షి= పరిశుద్ధులయిన బ్రహ్మర్షులచే; సమారాద్ధుండై= పూజింపబడినవాడై; విహిత= పెద్దలచే చెప్పబడిన; మంత్రరాజిన్= మంత్రసముదాయాన్ని; చదువుచున్= పఠిస్తూ; ప్రోద్ధంబగు= బాగా చెలరేగి వెలుగుతున్న; అనలంబునన్= అగ్నిహోత్రమందు; వృద్ధ+ఆచారమునన్= పెద్దలచే చేయబడినట్టి ఆచారము చొప్పున; కడఁకన్= పూనికతో; వటుఁడు= బ్రహ్మచారి; వేల్చెన్= హోమంచేసినాడు.

**తా :** పరిశుద్ధులయిన బ్రహ్మర్షులచే పూజించబడినవాడై మంత్రాలను చదువుతూ ప్రశస్తమయిన అగ్నిహోత్రాన పూర్వాచారాన్ని అనుసరించి వటుడు హోమం చేసినాడు.

## ❖ బలిచక్రవర్తి కడకు వామనమూర్తి యేతెంచుట ❖

**వ. ఇట్లు కృతకృత్యుండైన మాయామాణవకుండు దేశాంతరసమాగతులగు బ్రాహ్మణులం గొందఱ నవలోకించి యిట్లనియె. 520**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కృతకృత్యుండైన= చేయబడిన పనిగలవాడైన; (ఉపనయనం పూర్తి అయిన) మాయామాణవకుండు= కపట బ్రహ్మచారి; దేశాంతర= ఇతరదేశాలనుండి; సమాగతులగు= వచ్చిన; బ్రాహ్మణులన్= విప్రులను; కొందఱన్= కొంతమందిని; అవలోకించి= చూచి; ఇట్లనియెన్= ఈ విధంగా పలికినాడు.

**తా :** ఈ విధంగా ఉపనయనం పూర్తి అయిన తర్వాత మాయాబ్రహ్మచారి ఇతరదేశాలనుండి వచ్చిన కొందరు బ్రాహ్మణులను చూచి ఇలా అడిగినాడు.

**క. వత్తురె విప్రులు? వేఁడఁగ, నిత్తురె దాతలును వేడ్క నిష్టార్థములం?**
**దెత్తురె మీరును సంపద?, లిత్తెఱఁగున దానవీరుఁడెవ్వఁడొ చెపుఁడా? 521**

**ప్రతి :** వేఁడఁగన్= యాచించేటందుకు; విప్రులు= బ్రాహ్మణులు; వత్తురె?= వస్తున్నారా?; దాతలును= దానం చేసేవారు; వేడ్కన్= వేడుకతో; ఇష్ట+అర్థములన్= కోరినవాటిని; ఇత్తురె= ఇస్తారా; మీరును= మీరు కూడా; సంపదలు= సిరులు; తెత్తురె= తెచ్చుకుంటున్నారా?; ఈ+తెఱఁగునన్= ఈ విధంగా; దానవీరుఁడు= దానంచేయటంలో వీరత్వంకలవాడు; ఎవ్వఁడొ చెపుఁడా= ఎవ్వడో చెప్పండి.

**తా :** దానాలు తీసుకోవటానికి బ్రాహ్మణులు దాతలదగ్గరకు పోతున్నారా? వారు కోరిన సంపదల్ని దాతలు ఇస్తున్నారా? మీరున్నూ అలా సంపదలు తెచ్చుకుంటున్నారా? ఈ విధంగా అర్థులకు అడిగింది ఇచ్చే దానవీరుడు ఎవడో చెప్పండి?

**వ. అనిన నఖిలదేశీయులగు భూసురు లిట్లనిరి. 522**

**ప్రతి :** అనినన్= అలా పలుకగా; అఖిలదేశీయులు+అగు= సకలదేశవాసులగు; భూసురులు= బ్రాహ్మణులు; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పినారు.

**మ. 'కలరున్ దాతలు; నిత్తురుం ధనములుం; గామ్యార్థముల్ గొంచు వి**
**ప్రులు నేతెంతురు; గాని యీవిని బలింబోలన్ వదాన్యుండు లేఁ**
**డలఘుండై యొనరించె నధ్వరశతం బా భార్గవానుజ్ఞచే;**
**బలి వేఁడం బడయంగ వచ్చు బహుసంపల్లాభముల్ వామనా! 523**

**ప్రతి :** వామనా= ఓ వామనుడా!; దాతలున్= దానంచేసేవారు; కలరున్= ఉన్నారు కదా; ధనములన్= ద్రవ్యాలను; ఇత్తురున్= ఇస్తారు; విప్రులున్= బ్రాహ్మణులు; కామ్య+అర్థముల్= కోరినకోరికలను; కొంచు= తీసికొంటూ (నెరవేర్చుకొని); ఏతెంతురు= వస్తుంటారు; కాని; ఈవిని= దాతృత్వమందు; బలిన్= బలిచక్రవర్తిని; పోలన్= పోలుటకు; వదాన్యుండు= మిక్కిలిగా ఇచ్చేదాత; లేఁడు= కనిపించదు; ఆ+భార్గవ= ఆ శుక్రాచార్యునియొక్క; అనుజ్ఞచేన్= ఆజ్ఞతో; అధ్వరశతంబు= నూరుయజ్ఞాలు; ఒనరించెన్= చేసినాడు; బహు+సంపద్+లాభముల్= అనేకవిధాలయిన భాగ్యలాభాలను; బలిన్= బలిచక్రవర్తిని; వేఁడన్= కోరిన యెడల; పడయంగన్+వచ్చున్= పొందవచ్చు.

**తా :** వామనా! దానం చేసేవారూ ఉన్నారు. ధనాన్ని గ్రహించేవారూ ఉన్నారు. బ్రాహ్మణులు తమ కోర్కెలను నెరవేర్చుకుంటున్నారు. కాని, దాతలలో బలిచక్రవర్తికి సమానమైనవాడులేడు. ఆయన శుక్రాచార్యులు చెప్పినట్లు నూరు యజ్ఞాలు చేసినాడు. అతనిని అడిగితే సకలభాగ్యాలూ పొందవచ్చు.

**విశే : అధ్వర శతము :** నూరుయజ్ఞాలు గురువైన శుక్రాచార్యుని ఆశీస్సులతో చేసినవాడు బలిచక్రవర్తి, నూరుయజ్ఞాలు చేసినవాణ్ణి 'శతమఖుడు' అంటారు. ఇంద్రునికి శతమఖుడని పేరు. బలి ఇంద్రుణ్ణి ఓడించి దేవలోకాన్ని ఆక్రమించడానికి కారణం అతడు 'శతమఖుడు' కావడమే.

**వ. అని తెలియం జెప్పిన బ్రాహ్మణుల వచనంబు లాలకించి లోకంబులకుం బ్రీతి పుట్టింపc బయనంబై లాభవచనంబులు గైకొనుచుcదల్లిదండ్రుల వీడ్కొని శుభముహూర్తంబునం గదలి. 524**

**ప్రతి :** అని= ఈ విధంగా; తెలియన్+చెప్పినన్= ఎరుకపరచిన; బ్రాహ్మణుల వచనంబులు= విప్రవాక్యాలు; ఆలకించి= విని; లోకంబులకున్= ప్రపంచాలకు; ప్రీతిపుట్టింపన్= ప్రియం కలిగించగా; పయనంబు+ఐ= ప్రయాణమై; లాభ వచనంబులు= లాభపుమాటలు; కైకొనుచున్= అంగీకరిస్తూ; తల్లిదండ్రులన్= జననీ జనకులను; వీడ్కొని= విడిచిపెట్టి; శుభ= మంగళప్రదమైన; ముహూర్తంబునన్= మూహూర్తంలో; కదలి= కదలి...

**తా :** ఈ విధంగా తెలియచెప్పిన బ్రాహ్మణుల మాటలు విని లోకాలకు మేలుచేసేటందుకై లాభపుమాటలు అంగీకరిస్తూ, తల్లిదండ్రుల ఆనతి పొంది ఒక శుభముహూర్తాన వామనుడు బయలుదేరి.

**క. ప్రక్షీణదివిజవల్లభ, రక్షాపరతంత్రుcడగుచు రాజీవాక్షుం**
**డా క్షణమున బలి యింటికి, భిక్షాగమనంబు సేసెcబేదతికముతోన్. 525**

**ప్రతి :** రాజీవ+అక్షుండు= పద్మములవంటి కన్నులుగల వామనుడు; ప్రక్షీణ= మిక్కిలి చెడిపోయిన (హీనత్వాన్ని పొందిన); దివిజవల్లభ= ఇంద్రునియొక్క; రక్షా= రక్షణమందు; పరతంత్రుcడు+అగుచున్= ఆసక్తి కలవాడై; పేదతికముతోన్= బీదతనంతో; ఆ క్షణమునన్= ఆ క్షణంలోనే; బలియింటికిన్= బలిచక్రవర్తి మందిరానికి; భిక్షాగమనంబున్+చేసెన్= భిక్షార్థిగా వెళ్లడానికి సంకల్పించాడు.

**తా :** వామనమూర్తి బాగా హీనత్వాన్ని పొందిన ఇంద్రుని రక్షించేటందుకు ఆసక్తికలవాడయినాడు. వెంటనే పేదవానివలె దానం కోసం బలిచక్రవర్తి మందిరానికి వెళ్లడానికి సంకల్పించాడు.

**క. హరి హరి! సిరి యురమునc గల, హరి హరిహయుకొఱకు దనుజు నడుగంజనియెం;**
**బరహితరతి మతియుతులగు, దొరలకు నడుగుటయు నొడలితొడవగుcబుడమిన్. 526**

**ప్రతి :** హరిహరి= అయ్యయ్యో!; సిరి= లక్ష్మీదేవి; ఉరమునన్+కల= ఎదపై ఉన్న; హరి= విష్ణుమూర్తియైన వామనుడు; హరిహయుకొఱకున్= ఇంద్రునికోసం; దనుజున్= రాక్షసుని; అడుగన్= యాచించేటందుకు; చనియెన్= వెళ్లినాడు; పరహిత= ఇతరులకు మేలుచేయడంలో; రతి= ఆసక్తిగల; మతియుతులగు= బుద్ధికల; దొరలకున్= గొప్పవారికి; పుడమిన్= భూమియందు; అడుగుటలున్= యాచించుటలు కూడా; ఒడలితొడవగున్= శరీరానికి భూష అవుతుంది.

**తా :** అయ్యయ్యో! లక్ష్మీదేవిని తన వక్షఃస్థలాన కలిగినవాడు విష్ణువు. అయినా ఇంద్రుని కోసం రాక్షసుని (బలిచక్రవర్తిని) బిచ్చమడగటానికి వెళ్ళినాడు. ఇతరులకు మేలుచేయాలన్న బుద్ధిగల గొప్పవారికి భూమిమీద యాచించటంకూడా ఒక అలంకారం వంటిదే.

**క. సర్వప్రపంచగురుభర, నిర్వాహకుఁడగుటఁజేసి నెఱిఁజనుదేరన్**
**ఖర్వుని వ్రేఁగు సహింపక, యుర్వీస్థలి గ్రుంగె; మ్రొగ్గె నురగేంద్రుండున్. 527**

**ప్రతి :** సర్వప్రపంచ= సకలలోకములయొక్క; గురుభర= గొప్పబరువును; నిర్వాహకుఁడు= వహించేవాడు; అగుటన్+చేసి= అయిన కారణాన; నెఱిన్= నిండుదనంతో; చనుదేరన్= పోతూ ఉండగా; ఖర్వుని= వామనునియొక్క; వ్రేఁగున్= భారాన్ని; సహింపక= భరించలేక; ఉర్వీస్థలి= భూతలం; క్రుంగెన్= క్రుంగిపోయింది; ఉరగ+ఇంద్రుండున్= ఆదిశేషుడుకూడా (భూమిని మోస్తూ కింద ఉండటంవల్ల); మ్రొగ్గెన్= వంగిపోయినాడు.

**తా :** సకలలోకభారాన్నీ వహించే (విష్ణువగు) వామనుడు వెళుతున్నప్పుడు ఆయన బరువును మోయలేక భూమి క్రుంగి పోయింది. (భూమిని మోస్తున్న) ఆదిశేషుడుకూడా వంగిపోయినాడు.

**వ. ఇట్లు సని చని. 528**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; చని చని= ముందుకు వెళ్లి వెళ్లి.

**క. శర్మద, యమదండక్షత, వర్మద, నతికఠినముక్తివనితాచేతో**
**మర్మద, నంబునివారిత, దుర్మద, నర్మదఁ దరించెఁద్రోవన్ వటుఁడున్. 529**

**ప్రతి :** త్రోవన్= మార్గమందు; వటుఁడున్= వామనుడు; శర్మదన్= సుఖాలనిచ్చేదీ; యమదండ= యమునిదండంవల్ల కలుగబోయే; క్షత= దెబ్బలకు; వర్మద= శరీరాన్ని కాపాడే కవచం అయ్యేదీ; అతికఠిన= పొందశక్యంకాని; ముక్తివనితా= ముక్తికాంతయొక్క; చేతస్= చిత్తముయొక్క; మర్మదన్= మర్మాలను ఇచ్చేది (రహస్యాలను తెలిపేది); అంబు= ఉదకంచే; నివారిత= పోగొట్టబడిన; దుర్మదన్= మదం(దోషం)కలది అయిన; నర్మదన్= నర్మదానదిని; తరించెన్= దాటెను.

**తా :** వామనుడు ప్రయాణం చేస్తూ నర్మదానదిని దాటినాడు. ఆ నది శుభాలు కలిగించేది. యముని దండ ఘాతాలను తగులకుండా కవచంలా కాపాడేది. ముక్తికాంత మనసులోని గుట్టును తెలిపేది. తన నీళ్ళతో దోషాలను నివారించేది.

**వ. దాఁటి తత్ప్రవాహంబున కుత్తరతటంబునందు. 530**

**ప్రతి :** దాఁటి= తరించి; తద్+ప్రవాహంబునకున్= ఆ నదికి; ఉత్తరతటంబునందున్= ఉత్తరంగా ఉన్న ఒడ్డున.

**విశే :** వామనుడు నర్మదానదిని దాటి ఉత్తరతీరాన ప్రవేశించినాడు. కనుక అదితికశ్యపుల ఆశ్రమం నర్మదకు దక్షిణాన ఉంటుందనుకొనవచ్చు. ప్రాచీనభూగోళశాస్త్రాన్ని పరిశోధించేవారికి ఇదొక ఆధారంగా నిలుస్తుంది.

**శా. చండస్ఫూర్తి వటుండు గాంచె బహుధాజల్పన్నిశాటంబు, ను**
**ద్దండాహూతమునీభ్యబిభ్యదమృతాంధస్సిద్ధకూటంబు, వే**
**దండాశ్వధ్వజినీకవాటము, మహోద్యద్ధూమసంఛన్న మా**
**ర్తాండస్యందనఘోటమున్, బలిమఖాంతర్వేదికావాటమున్. 531**

**ప్రతి :** బహుధా= పలువిధాలుగా; జల్పత్= ప్రేలుచున్న; నిశాటంబున్= రాక్షసులుకలదీ; ఉద్దండ= అధికంగా; ఆహూత= పిలువబడిన; ముని+ఇభ్య= మునిశ్రేష్ఠులకు; బిభ్యత్= భయపడిన; అమృత+అంధస్= అమృతమే ఆహారముగా గల

దేవతల; సిద్ధ= సిద్ధుల; కూటంబున్= సముదాయం కలదీ; వేదండ= ఏనుగులు; అశ్వ= గుఱ్ఱాలు; ధ్వజినీ= జెండాలు కల; కవాటమున్= తలుపులుకలదీ; మహా+ఉద్యత్= మిక్కిలిగా పైకెగయుచున్న; ధూమ= పొగచే; సంఛన్న= కప్పబడిన; మార్తాండ= సూర్యునియొక్క; స్యందన= రథమునకు పూన్చిన; ఘోటమున్= గుఱ్ఱాలుకలదీ; అయిన; బలి= బలిచక్రవర్తియొక్క; మఖ= యజ్ఞమునందలి; అంతస్= లోపలఉన్న; వేదికా= అరుగులయొక్క; వాటమున్= భాగాలుకలదానినీ; చండస్ఫూర్తి= మహాతేజశ్శాలి అయిన; వటుండు= బ్రహ్మచారి; కాంచెన్= చూచినాడు.

**తా :** మంచితేజస్సుగల వామనుడు బలిచక్రవర్తి యాగశాలను చూచినాడు. అక్కడ దనుజులు అనేక విధాలుగ పెద్దగా ప్రేలాపన చేస్తున్నారు. ఆ యజ్ఞంలో పాల్గొన్న ఉద్దండులైన మునులను చూచి దేవతలూ సిద్ధులూ భయపడుతున్నారు. ఆ స్థలానికి ముందువైపు ద్వారంలో ఏనుగులూ, గుఱ్ఱాలూ, సైన్యాలూ నిండి ఉన్నాయి. అక్కడి యజ్ఞకుండాల పొగలతో సూర్యుని రథం గుఱ్ఱాలు పూర్తిగా కప్పబడిపోతున్నాయి.

**వ. కని దానవేంద్రుని హయమేధవాటి దఱియంజొచ్చు నయ్యవసరంబున. 532**

**ప్రతి :** కని= చూచి; దానవేంద్రుని= బలిచక్రవర్తియొక్క; హయమేధవాటిన్= అశ్వమేధవాటికను; తఱియన్+చొచ్చు= సమీపించే; ఆ+అవసరంబునన్= ఆ సమయమందు...

**తా :** అలా వామనుడు బలిచక్రవర్తి చేస్తున్న అశ్వమేధ యజ్ఞవాటికను సమీపిస్తున్న సమయాన

**శా. శంభుండో హరియో పయోజభవుఁడో చండాశుఁడో వహ్నియో**
**దంభాకారత వచ్చెఁగాక, ధరణిన్ ధాత్రీసురుండెవ్వఁ డీ**
**శుంభద్ద్యోతనుఁ డీ మనోజ్ఞతనుఁడంచున్ విస్మయభ్రాంతులై**
**సంభాషించిరి బ్రహ్మచారిఁగని తత్సభ్యుల్ రహస్యంబుగన్. 533**

**ప్రతి :** శంభుడు+ఓ= శివుడో; హరి+ఓ= విష్ణుమూర్తియో; పయోజభవుఁడు+ఓ= కమలసంభవుడైన బ్రహ్మయో; చండాశుఁడు+ఓ= సూర్యుడో; వహ్ని+ఓ= అగ్నిహోత్రుడో; దంభ+ఆకారతన్= మాయవేషంతో; వచ్చెన్+కాక= వచ్చిఉంటాడు; ధరణిన్= భూమియందు; ధాత్రీసురుండు= బ్రాహ్మణుడు; ఎవ్వఁడు= ఎవడు; ఈ శుంభత్+ద్యోతనుఁడు= ఈ ప్రకాశించే శరీరం కలవాడు; అంచున్= అనుచు; విస్మయ= అద్భుతంచేత; భ్రాంతులై= భ్రాంతిపొందినవారై; తద్+సభ్యుల్= ఆ సభలో ఉన్నవారు; బ్రహ్మచారిన్+కని= వటునిచూచి; రహస్యంగా= చాటుమాటుగా; సంభాషించిరి= మాట్లాడుకున్నారు.

**తా :** 'శివుడో విష్ణువో బ్రహ్మదేవుడో సూర్యుడో అగ్నిహోత్రుడో మాయావేషంతో వచ్చి ఉంటాడు. కాని, ఈ భూమిమీద బ్రాహ్మణుడెవ్వడూ ఇంత ప్రకాశంగా అందంగా ఉండడు'. అంటూ ఆశ్చర్యంతో భ్రాంతిచెంది అక్కడివారు వామనుని చూచి చాటుమాటుగా సంభాషించుకున్నారు.

**క. గుజగుజలు వోవువారును, గజిబిజిఁబడువారుఁ జాలఁగలకలపడుచున్**
**గజిబిజి యైరి సభాస్థలిఁ, బ్రజ లెల్లను బొట్టివడుగు బాపని రాకన్. 534**

**ప్రతి :** పొట్టి= వామనుడైన; వడుగుపాపనిరాకన్= బ్రహ్మచారి బాలకుడు రావటంచే; గుజగుజలుపోవువారును= గుసగుసలాడుకొనేవారు; గజిబిజిన్+పడువారు= కలత పొందేవారు; చాలన్= ఎక్కువగా; కలకలపడుచున్= తొట్రుపడుతూ; సభాస్థలిన్= సభాస్థలమందు; ప్రజలెల్లను= ఉన్నవారందరూ; గజిబిజియైరి, కలవరపడినారు.

**తా :** వామనుడగు బ్రహ్మచారిరాకకు గుసగుసలాడుకొంటూ, కలత పొందుతూ, ఎక్కువగా తొట్రుపడుతూ సభలో ఉన్న వారంతా కలవరపడినారు.

**వ. ఆ సమయంబున బలిసభామండపంబుఁదఱియంజొచ్చి. 535**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఆ (తరిని) వేళ; బలి= బలిచక్రవర్తియొక్క; సభామండపంబున్= సభామండపమును; తఱియన్+చొచ్చి= సమీపించి...

**తా :** ఆ సమయంలో బలిచక్రవర్తి సభామంటపాన్ని చేరి

**సీ. చవులుగాఁ జెవులకు సామగానంబులు సదువు నుద్గాతల చదువు వినుచు**
**మంత్రతంత్రార్థసంబంధభావములు పే ర్కొనెడి హోతలతోడఁగూడికొనుచు**
**హోమకుండంబులం దున్న త్రేతాగ్నుల వెలిఁగించు యాజక వితతిఁగనుచు**
**దక్షులై బహువిధాధ్వరవిధానంబులు సెప్పెడు సభ్యులఁజేరఁజనుచుఁ**

**తే. బెట్టు గోరెడు వేడుక పట్టుపఱుప, నదితిపుట్టువు లచ్చికి నాటపట్టు**
**గోరి చరియించె సభలోనఁగొంతదడవు, పుట్టు వెన్నఁడు నెఱుఁగని పొట్టివడుగు. 536**

**ప్రతి :** చెవులకున్= కర్ణాలకు; చవులుగాన్= రుచిగా; సామగానంబులు= సామవేదగానాలు; చదువు= పఠిస్తున్న; ఉద్గాతల= యజ్ఞమందు సామవేద మంత్రాలతో గానం చేసేవారు; చదువున్= గానాన్ని; వినుచున్= ఆలకిస్తూ; మంత్ర= మంత్రాలకు అనుగుణమైన; తంత్ర= తంత్రాలయొక్క; (యాజ్ఞిక క్రియాకలాపాలు జరిపించేవారి యొక్క); అర్థ= ప్రయోజనానికి; సంబంధ= సంబంధించిన (చేరిన); భావములు= అభిప్రాయాలు; పేర్కొనెడి= వచించునట్టి; హోతలతోడన్= ఋగ్వేద మంత్రాలతో హోమకాలంలో ఆ యా దేవతలను ఆహ్వానించి ఆవాహనము చేయించే ఋత్విక్కులతో; కూడికొనుచున్= దగ్గరకు వెళుతూ; హోమకుండంబులందు= హవిస్సులను హోమం చేసే అగ్నికుండములందు; ఉన్న= ఉన్నట్టి; త్రేతాగ్నులన్= మూడు అగ్నులను (గార్హపత్యం, దక్షిణాగ్ని, ఆహవనీయం అనేవి త్రేతాగ్నులు); వెలిగించు= ప్రజ్వలింపచేయునట్టి; యాజక వితతిన్= యాజ్ఞికులయొక్క గుంపును (ఋత్విక్కులను); కనుచున్= చూస్తూ; దక్షులై= సమర్థులై; బహువిధ= అనేక విధాలయిన; అధ్వర= వైదికమార్గనిష్ఠను కలిగించే యజ్ఞాలయొక్క; విధానంబులు= పద్ధతులను; చెప్పెడు= చెపుతున్న; సభ్యులన్= సామాజికులను; చేరన్= సమీపించునట్లు; చనుచున్= పోవుచు; పెట్టు= దానాన్ని; కోరెడువేడుకన్= యాచించునట్టి సంతోషంతో; పట్టుపఱుపన్= హత్తుకొనగా; అదితిపుట్టువు= అదితి బిడ్డ; లచ్చికిన్= లక్ష్మికి; ఆటపట్టు= కేళీస్థానమైన వామనుడు; కోరి= వాంఛించి; సభలోనన్= సభయందు; కొంతతడవు= కొంచెంసేపు; పుట్టువు= జన్మం; ఎన్నఁడున్ ఎఱుఁగని= ఎప్పుడూ తెలియని; పొట్టివడుగు= వామనుడైన బ్రహ్మచారి; చరియించెన్= సంచరించినాడు.

**తా :** చెవులకు ఇంపుగా సామవేదం పఠించే ఉద్గాతల గానాలు విన్నాడు. మంత్రతంత్రాలను వివరిస్తూ హోమం చేసే హోతలను కలుసుకొన్నాడు. హోమకుండంలో త్రేతాగ్నులను ప్రజ్వలింపచేసే ఋత్విజులను చూచినాడు. యోగ విధులను నేర్పుగా పేర్కొంటున్న సభాపతులను సమీపించినాడు. ఆ సభను బాగా ఆకర్షించాలని కొంతసేపు వామనుడు ఆ సభలో తిరుగాడినాడు. ఇదంతా చేసిన వామనుడైన విష్ణువునకు పుట్టుకే లేదు. ఆయన అదితికొడుకుగా పుట్టినాడు. లక్ష్మికి ఆటపట్టైనవాడు, వామనుడు.

**వ. మఱియును. 537**

**ప్రతి :** మఱియును= అంతేగాక

**క. వెఱచుచు వంగుచు వ్రాలుచు, నతిముఱి గుబురులకుఁజనుచు హరి హరి యనుచున్**
**మఱుఁగుచు నులుకుచు దిఱదిఱఁ, గుఱుమట్టపుఁబొట్టివడుగు గొంత నటించెన్. 538**

**ప్రతి :** వెఱచుచున్= భయపడుతూ; వంగుచున్= వంగుతూ; వ్రాలుచున్= ప్రక్కకు వంగుతూ; అతిముఱిన్= సంభ్రమముగా; గుబురులకున్= గుంపుల దగ్గరకు; చనుచున్= వెళ్లుతూ; హరిహరియనుచున్= హరినామసంకీర్తనం చేస్తూ; మఱుంగుచున్= చాటగుచూ; ఉలుకుచున్= ఉలికిపడుతూ; దిఱదిఱన్= దిరదిరయని; కుఱుమట్టపు= పొట్టివాడైన; పొట్టివడుగు= వామనుడైన బ్రహ్మచారి; కొంత నటించెన్= కొంతసేపు నటించాడు.

**తా :** భయపడుతూ, వంగుతూ, పడుతూ, తొట్రుపాటుతో జనాలగుంపుల దగ్గరకుపోతూ, హరినామసంకీర్తనం చేస్తూ చాటునకు పోతూ, ఉలికిపడుతూ వామనుడు కొంతసేపు అక్కడ నటించాడు.

**క. కొందఱతోఁజర్చించును, గొందఱతో జటలు సెప్పు, గోష్ఠిం జేయుం**
**గొందఱతోఁ దర్కించును, గొందఱతో ముచ్చటాడుఁ; గొందఱ నవ్వున్. 539**

**ప్రతి :** కొందఱతోన్= కొంతమందితో; చర్చించును= చర్చచేయును; కొందఱతోన్= కొంతమందితో; జటలు+చెప్పున్= జటపనసలుచెప్పును; గోష్ఠిన్= ప్రసంగాన్ని; చేయున్= కావించును; కొందఱతోన్= కొంతమందితో; తర్కించును= వాదం చేయును; కొందఱతో= కొంతమందితో; ముచ్చటాడున్= సరదాగా మాట్లాడును; కొందఱన్= కొందరిని చూచి; నవ్వున్= నవ్వుతాడు.

**తా :** వామనుడు కొందరితో చర్చలు చేస్తాడు, కొందరితో వేదానికి సంబంధించిన జటపనసలను చెప్తాడు. కొందరితో ప్రసంగిస్తాడు. కొందరితో వాదిస్తాడు. కొందరితో సరదాగా మాట్లాడుతాడు. కొందరిని చూచి నవ్వుతాడు.

**విశే :** క్రమ – జటా – ఘనా మొదలైనవి వేదాన్ని పఠించే పద్ధతులు. 'పనస' అంటే యజుర్వేద సంహిత భాగంలో ఉండే ఒక విభాగం పేరు.

**వ. మఱియు ననేకవిధంబుల నందఱకు నన్నిరూపులై వినోదించుచు. 540**

**ప్రతి :** మఱియున్= ఇంకా; అనేకవిధంబులన్= పలురీతులుగా; అందఱకున్= అందరికీ; అన్నిరూపులై= అన్ని రూపాలు కలవాడై; వినోదించుచున్= ఆనందిస్తూ.

**తా :** అంతేకాక అందరితోనూ అనేకవిధాలుగా వ్యవహరిస్తూ ఆనందించసాగినాడు.

**క. వెడవెడ నడకలు నడచుచు, నెడనెడ నడు గిడఁగ నదరి యిల దిగఁబడఁగా**
**బుడి బుడి నొడువులు నొడువుచుఁ, జిడిముడి తడఁబడఁగ వడుగు సేరెన్ రాజున్. 541**

**ప్రతి :** వెడవెడ నడకలు= తప్పటడుగులు; నడచుచున్= నడుస్తూ; ఎడనెడన్= అక్కడక్కడ; అడుగిడఁగన్= పాదంపెట్టగా; అదరి= చలించి; ఇల= భూమి; దిగఁబడఁగాన్= కుంగిపోతుంటే; బుడిబుడి= తొట్రుపాటుతోకూడిన; నొడువులు=

మాటలు; నొడువుచున్= పలుకుతూ; చిడిముడిన్= తొందరతో; తడఁబడఁగన్= కాళ్లు తొట్రిల్లగా; రాజున్= బలిచక్రవర్తిని; వడుగు= బ్రహ్మచారి; చేరెన్= సమీపించెను.

**తా :** చిన్ని నడకలు నడుస్తూ, అడుగులు వేసినపుడల్లా భూమి చలించి కుంగిపోతుండగా, తొట్రుపాటుతో కూడిన మాటలు మాట్లాడుతూ వామనుడు బలిచక్రవర్తిని సమీపించినాడు.

**వ. ఇట్లు దగ్గఱి మాయాభిక్షుండు రక్షోవల్లభుంజూచి యిట్లనియె. 542**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; దగ్గఱి= సమీపించి; మాయాభిక్షుండు= మాయబిచ్చగాడు (వామనుడు); రక్షస్+వల్లభున్= దానవరాజగు బలిని; చూచి= కనుగొని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**మ. ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్ని కాలాది ది**
**క్పతిగర్వాపనయప్రవర్తి, గతలోభస్ఫూర్తి, నానామఖ**
**వ్రతదానప్రవణానువర్తి, సుమనోరామామనోభేదనో**
**ద్ధతచంద్రాతపకీర్తి, సత్యకరుణాధర్మోల్లసన్మూర్తి దాన్. 543**

**ప్రతి :** సురలోక+ఇంద్ర= ఇంద్రుడు; అగ్ని= అగ్నిహోత్రుడు; కాల= కాలుడనబడే యముడు; ఆది= మొదలయిన; దిక్పతి= దిక్పాలకులయొక్క; గర్వ= గర్వాన్ని; అపనయ= పోగొట్టే; ప్రవర్తి= వర్తనం కలవాడు; గత= పోయిన; లోభస్ఫూర్తి= లుబ్ధత్వముయొక్క అతిశయంకలవాడు; నానా= బహువిధాలయిన; మఖ= యజ్ఞాలయందు; వ్రత= నియమాలయందు; దాన= దానాలయందు; ప్రవణ= ఆసక్తితో; అనువర్తి= కూడినవాడు; సుమనస్= దేవతలయొక్క; రామా= స్త్రీలయొక్క; మనస్= మనస్సులను; భేదన= భేదించుట(కలతపరచుట)యందు; ఉద్ధత= ఎక్కువయిన; చంద్ర+ఆతప= వెన్నెలవంటి; కీర్తి= యశస్సుకలవాడు; సత్య= సత్యంతో; కరుణా= దయతో; ధర్మ= న్యాయంతో; ఉల్లసత్= ప్రకాశించే; మూర్తి= ఆకారం కలవాడు; దానవచక్రవర్తి= రాక్షససార్వభౌముడు; తాన్= తాను; ఇతఁడే= ఇతడే కదా!

**తా :** ఇతడే దానవచక్రవర్తి! దేవేంద్రుడూ అగ్నీ యముడూ మొదలయిన దిక్పాలకుల గర్వాన్ని తొలగించిన మొనగాడు ఇతడే! అత్యాశలేని నిండైన హృదయం కలవాడు ఇతడే! అనేకవిధాల యజ్ఞాల పుణ్యకార్యాలలో ప్రీతితో దానం చేసేవాడు ఇతడే! దేవతాస్త్రీల మనస్సులను కలవరపెట్టే వెన్నెలవంటి కీర్తికలవాడు ఇతడే! ఇతడే సత్యంతో దయతో ధర్మంతో ప్రకాశించే స్వరూపం కలవాడు.

**వ. అని కుశపవిత్రాక్షతసంయుతంబగు దక్షిణహస్తంబు సాఁచి యిట్లనియె. 544**

**ప్రతి :** అని= ఈ విధంగా పలికి; కుశపవిత్ర= దర్భలతో పవిత్రమైన; అక్షత= అక్షతలతో; సంయుతంబు+అగు= కూడుకొనియున్న; దక్షిణహస్తంబు= కుడిచేయి; చాఁచి= ముందుకుచాపి; ఇట్లనియె= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ విధంగా పలికి కుశపవిత్రంతోనూ అక్షతలతోనూ కుడి చెయ్యి ముందుకు చాపి ఇలా అన్నాడు.

**ఉ. స్వస్తి జగత్త్రయీభువనశాసనకర్తకు, హాసమాత్ర వి**
**ధ్వస్తనిలింపభర్తకు, నుదారపదవ్యవహర్తకున్, మునీం**

**ప్రస్తుతమంగళాధ్వరవిధానవిహర్తకు, నిర్జరీగళ**
**న్యస్తసువర్ణసూత్రపరిహర్తకు, దానవలోకభర్తకున్. 545**

**ప్రతి :** జగత్+త్రయీ= మూడులోకాలను; భువన= సమస్త భువనాలను; శాసనకర్తకున్= శాసించేవానికి; హాసమాత్ర= ఒక చిరునవ్వుచేతనే; విధ్వస్త= ధ్వంసం చేయబడిన; నిలింపభర్తకున్= ఇంద్రుడు కలవానికి; ఉదార= ఘనమైన; పద= పదములతో; వ్యవహర్తకున్= వ్యవహరించే వానికి; మునీంద్ర= మునీశ్వరులచేత; స్తుత= కొనియాడబడిన; మంగళ= శుభప్రదమయిన; అధ్వర= యజ్ఞాలయొక్క; విధాన= ఏర్పాటులయందు; విహర్తకున్= విహరించేవానికి; నిర్జరీ= దేవతాస్త్రీలయొక్క; గళ= కంఠాలయందు; న్యస్త= కట్టబడిన; సువర్ణసూత్ర= బంగారు మంగళసూత్రాలను; పరిహర్తకున్= విసర్జింపచేయువానికి; దానవలోక= రాక్షసజనానికి; భర్తకున్= ప్రభువయినవానికి; సు+అస్తి= స్వస్తి, శుభం కలుగుగాక!, మంగళమగుగాక!

**తా :** ముల్లోకాలనూ శాసించగలవానికీ, నవ్వుకుంటూ అవలీలగా ఇంద్రుడిని జయించగలవానికీ, గొప్ప ఉన్నత పదములతో మెలిగేవానికీ, మునీంద్రుల పొగడ్తలనుపొందిన శుభకరమైన యాగకార్యాలలో విహరించేవానికీ, దేవతాస్త్రీల మెడలలోని బంగారుమంగళసూత్రాలను తొలగించేవానికీ, సమస్త రాక్షసలోక సార్వభౌమునికీ (నీకు) మంగళం.

**వ. అని దీవించి కరచరణాద్యవయవంబులు ధరించిన వేదరాశియుం బోలె ముందట నకుటిలుండును, జటిలుండును, సదండచ్ఛత్త్రుండును, గక్షాలంబిత భిక్షాపాత్రుండును, గరకలిత జలకమండలుండును, మనోహర చంద్రవదన మండలుండును, మాయావాదన నటుండును నగు వటువుం గని దినకర కిరణ పిహితంబులైన గ్రహంబుల చందంబునఁ దిరోహితులై భృగువులు గూర్చున్న యెడల లేచి సేమం బడిగి తియ్యని మాటల నాదరించిరి, బలియును నమస్కరించి తన గద్దియ నునిచి, పాదంబులు దుడిచి తన ప్రాణవల్లభ పసిండిగిండి నుదకంబులు వోయ వడుగుంగొమరుని చరణంబులు గడిగి తడియొత్తి తత్సమయంబున. 546**

**ప్రతి :** అని= పూర్వోక్తవిధంగా; దీవించి= ఆశీర్వదించి; కర= హస్తములు; చరణ= పాదములు; ఆది= మొదలయిన; అవయవంబులు= అంగములను; ధరియించిన= తాల్చిన; వేదరాశియునున్+పోలెన్= వేదములప్రోవువలె; ముందటన్= ముందు; అకుటిలుండును= కుటిలము లేనివాడూ; జటిలుండును= మునియు; సదండ+ఛత్రుండును= దండమును గొడుగును గలవాడూ; కక్షా= చంకయందు; లంబిత= వ్రేలాడుచున్న; భిక్షాపాత్రుండును= భిక్షాపాత్రముకలవాడూ; కర= హస్తమున; కలిత= కూడుకొనిన; జలకమండలుండును= జలకుండిక కలవాడూ; మనోహర= అందమయిన; చంద్రవదనమండలుండును= చంద్రబింబమువంటి మోముగలవాడూ; మాయావాదన= దంభవాదముతో; నటుండును= నటించువాడూ; అగు= అయిన; వటునిన్= బ్రహ్మచారిని; కని= చూచి; దినకరకిరణ= సూర్యకిరణాలతో; పిహితంబులు+ఐన= కప్పబడినవైన; గ్రహంబుల= గ్రహములయొక్క; చందంబునన్= విధంగా; తిరోహితులై= మరుగుపడినవారై; భృగువులు= భృగువంశజాతులగు బ్రాహ్మణులు; కూర్చున్నయెడలన్= కూర్చున్న సమయమందు; లేచి; సేమంబు+అడిగి= కుశలమడిగి; తియ్యనిమాటలన్= మధురములగు వాక్యములతో; ఆదరించిరి= గౌరవించిరి; బలియును= బలిచక్రవర్తియు; నమస్కరించి= వందనముచేసి; తనగద్దియున్= తన ఉచితాసనమున; ఉనిచి= కూర్చుండబెట్టి; పాదంబులు+తుడిచి= చరణములను

తుడిచి; తన ప్రాణవల్లభ= తన ప్రియురాలు (వింధ్యావళి); పసిండిగిండిన్= బంగారుకలశంతో; ఉదకంబులు= నీళ్లు; పోయన్= పోయగా; వడుగుం+గొమరుని= బ్రహ్మచారి బాలకునియొక్క; చరణంబులు= పాదములు; కడిగి= శుభ్రపరచి; తడి+ఒత్తి= తడిని బట్టచే తుడిచి; తత్+సమయంబునన్= (ఆ వేళ) అత్తరిని...

**తా :** ఆ విధంగా ఆశీర్వదించిన వామనుడు కరచరణాలతో మానవాకారాన్ని ధరించిన వేదరాశివలె బలిచక్రవర్తిముందు నిలబడినాడు. వంపులు లేకుండా జడలుగట్టిన జుట్టూ, దండమూ, గొడుగూ, కమండలమూ ధరించి ఉన్నాడు. ఆయన చంకలో భిక్షాపాత్ర వ్రేలాడుతూ ఉంది. అతని ముఖం చంద్రబింబంవలె అందంగా ఉంది. అప్పుడు ఆయన కొన్ని చతురోక్తులచే నటించినాడు. సూర్యుని కిరణాలతో కప్పబడిన ఇతరగ్రహాలు వెలవెలపోయినట్లు ఆ బ్రహ్మచారి ముందు భృగువంశపు బ్రాహ్మణులు మరుగున పడిపోయినారు. వారు లేచి నిలబడి వామనుని క్షేమాన్ని అడిగి మధురవాక్కులతో గౌరవించినారు. బలిచక్రవర్తికూడా ఆయనకు మ్రొక్కి ఆసనంపై కూర్చొన బెట్టినాడు. తన ఇల్లాలగు వింధ్యావళి బంగారుకలశంతో నీళ్ళుపోయగా బలి వడుగు అడుగులను కడిగి తుడిచినాడు.

**విశే :** 'దినకరకిరణపిహితంబులైన గ్రహంబుల చందంబునన్' అని పై వచనంలో ఒకచోట చెప్పబడింది. బృహస్పతి, శుక్రుడు, బుధుడు మొదలయిన శుభగ్రహాలు కూడా సూర్యునితో సమాగమంలో ఉన్నపుడు తమ ప్రభావాన్ని పూర్తిగా కోల్పోతాయి. సూర్యకిరణాల ప్రభావం మిగతా గ్రహాల కిరణాలను నిస్తేజం చేస్తుంది. జ్యోతిశ్శాస్త్రంలో దీనిని మౌఢ్యము అంటారు. గురు, శుక్ర గ్రహాలకు సంబంధించి గురుమౌఢ్యం, శుక్రమౌఢ్యం అంటారు. అలాగే వామనుని తేజస్సునకు భృగ్వాదులు తిరోహితులయినారని గ్రహించవచ్చు.

**ఆ. వటుని పాదశౌచవారి శిరంబునఁ, బరమభద్ర మనుచు బలి వహించె**
**నే జలము గిరీశుఁడిందుజూటుఁడు దేవ, దేవుఁడుద్వహించె ధృతి శిరమున. 547**

**ప్రతి :** ఏ జలమున్= ఏ (నీటిని) గంగను; గిరీశుఁడు= కైలాసపతియగు; ఇందుజూటుఁడు= చంద్రుని జడలందు తాల్చిన శివుడు; దేవదేవుఁడు= పరమేశ్వరుడు; ధృతిన్= ధైర్యముతో; శిరమునన్= తలమీద; ఉద్వహించెన్= తాల్చెనో (అలాగే); బలి= బలిచక్రవర్తి, వటుని= బ్రహ్మచారియొక్క; పాదశౌచవారిన్= కాళ్ళు కడిగిన నీటిని; పరమభద్రమనుచున్= మిక్కిలిమంగళ ప్రదమని; శిరమునన్= తలమీద; వహించెన్= తాల్చెను.

**తా :** గంగను శివుడు జటాజూటంలో ధరించినట్లు, బ్రహ్మచారికాళ్ళుకడిగిన ఉదకాన్ని మంగళప్రదమని బలిచక్రవర్తి తన శిరస్సున చల్లుకొన్నాడు.

**వ. మఱియు నయ్యజమానుండభ్యాగతున కిట్లనియె. 548**

**ప్రతి :** మఱియున్= మరలా; ఆ+యజమానుండు= ఆ యాగము చేస్తున్న బలిచక్రవర్తి; అభ్యాగతునకున్= అతిథియై వచ్చిన వామనునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికినాడు.

**తా :** బలి మళ్లీ వామనునితో ఇలా అన్నాడు.

**మ. వడుగా! యెవ్వరివాఁడ? వెవ్వఁడవు? సంవాసస్థలం బెయ్య? ది**
**య్యెడకున్ నీ వరుదెంచుటన్ సఫల మయ్యెన్ వంశమున్ జన్మముం;**

**గడు ధన్యాత్ముఁడనైతి, నీ మఖము యోగ్యంబయ్యెఁ; నా కోరికల్**
**గడతేఱెన్! సుహుతంబులయ్యె శిఖులుం గల్యాణ మిక్కాలమున్. 549**

**ప్రతి :** వడుగా= ఓ బ్రహ్మచారీ!; ఎవ్వరివాఁడవు= ఎవ్వరిపిల్లవాడవు; ఎవ్వఁడవు= నీవెవడవు?; సంవాసస్థలంబు= నివాసస్థలము; ఏ+అది= ఏది; ఈ+ఎడకున్= ఇచ్చటికి; నీవు+అరుదెంచుటన్= నీవు వచ్చుటచే; వంశమున్= మాకులమూ; జన్మమున్= నా పుట్టుకా; సఫలమయ్యెన్= ఫలించినవైనాయి; కడున్= మిక్కిలి; ధన్యాత్ముఁడన్+ఐతిన్= పుణ్యాత్ముడనైతిని; ఈ మఖము= నేను చేసే ఈ యజ్ఞం; యోగ్యంబు+అయ్యెన్= యోగ్యమయినదయ్యెను; నా కోరికల్= నావాంఛలు; కడతేఱెన్= నెరవేరినాయి; శిఖులున్= అగ్నిహోత్రములు; సుహుతంబులయ్యెన్= చక్కగా వేల్వబడినవి; ఈ+కాలమున్= ఈ సమయం; (నాకు) కల్యాణము= మంగళప్రదము (అయింది).

**తా :** ఓ బ్రహ్మచారీ! నీవెవ్వరి వాడవు? ఎవ్వడవు? నివాసస్థలమేది? నీవిక్కడికి రావడంవల్ల నా వంశం, నా జన్మం సఫలమైనాయి. మిగులధన్యుడనైతిని. ఈ యజ్ఞం పవిత్రమైంది. నా కోరికలు నెరవేరినాయి. అగ్నిహోత్రాలు బాగా వేల్వబడినాయి. ఈ కాలం చాలా మంగళప్రదమైంది.

**మ. వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో**
**హరులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో**
**కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో**
**ధరణీఖండమొ కాక యే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా! 550**

**ప్రతి :** ధాత్రీ+సుర+ఇంద్ర+ఉత్తమా= బ్రాహ్మణశ్రేష్ఠుడా!; వరచేలంబులు+ఒ= మంచివస్త్రాలో; మాడలు+ఓ= బంగారునాణాలో; ఫలములు+ఓ= పండ్లో; వన్యంబులు+ఓ= వనసంబంధమైనవో; గోవులు+ఓ= ఆవులో; హరులు+ఓ= గుర్రాలో; రత్నములు+ఓ= మణులో; రథంబులు+ఒ= తేరులో; విమృష్టాన్నంబులు+ఓ= షడ్రసోపేతమైన మంచి విందు భోజనాలో; కన్యలు+ఓ= కన్నియలో; కరులు+ఓ= ఏనుగులో; కాంచనము+ఓ= బంగారమో; నికేతనములు+ఓ= ఇండ్లో; గ్రామంబులు+ఓ= గ్రామాలో; భూములు+ఓ= మాన్యాలో; ధరణీఖండము+ఒ= భూభాగమో; కాక= ఇవేకాక; ఏమి+అడిగెదో= ఏమికోరుతావో!

**తా :** ఓ బ్రాహ్మణోత్తమా! నీకేమి కావాలి? మేలిమివస్త్రాలా? రూకలా? పండ్లా? అడవిసంపదలా? ఆవులా? గుర్రాలా? రత్నాలా? రథాలా? మంచి భోజనాలా? కన్యలా? ఏనుగులా? బంగారమా? భవనాలా? గ్రామాలా? భూములా? భూభాగమా? ఇవిగాక ఇంకా ఏమైనా కావాలా?

**విశే :** 'మాడ' అంటే 'వరాహా'లో సగం. రూకల్లో విశేషం .

**వ. అని ధర్మయుక్తంబుగాఁబలికిన వైరోచని వచనంబులు విని సంతోషించి యీశ్వరుండిట్లనియె. 551**

**ప్రతి :** అని; ధర్మయుక్తంబుగాన్= న్యాయంతో; పలికిన= పలికినట్టి; వైరోచనివచనంబులు= విరోచనుని కొడుకగు బలిచక్రవర్తి మాటలు; విని= ఆలకించి; సంతోషించి; ఈశ్వరుండు= భగవంతుడయిన వామనుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికినాడు.

**తా :** ఇలా ధర్మప్రకారంగా బలిచక్రవర్తి పలికిన పలుకులకు సంతోషించి వామనుడు ఈ విధంగా అన్నాడు.

**సీ. ఇది నాకు నెలవని యేరీతిఁబలుకుదు? నొకచోటనక యెందు నుండ నేర్తు**
**నెవ్వనివాఁడ నం చేమని పలుకుదు? నాయంతవాఁడనై నడవనేర్తు**
**నీ నడవడియని యెట్లు వక్కాణింతుఁ బూని ముప్పోకలఁబోవ నేర్తు**
**నదినేర్తు నిదినేర్తు నని యేల చెప్పంగ? నేరుపు లన్నియు నేన నేర్తు**

**ఆ. నొరులు గారు నాకు నొరులకు నే నౌదు, నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు**
**సిరియుఁదొల్లి గలదు చెప్పెద నా టెంకి, సుజనులందుఁ దఱచుఁజొచ్చియుందు. 552**

**ప్రతి :** ఇది నాకు నెలవు+అని= ఇది నా నివాసస్థానమని; ఏ రీతిన్= ఏ విధంగా; పలుకుదున్= చెప్పుదును; ఒకచోటు+అనక= ఒక తావు అనక; ఎందున్+ఉండనేర్తు= అంతటా (అన్నిచోట్ల) ఉండగలను; ఎవ్వని వాఁడను+అంచు= ఎవరి చిన్నవాడనని; ఏమని; నుడువుదున్= వచింతును; నాయంతవాఁడనై= నాకు నేనే స్వతంత్రంగా; నడవనేర్తున్= సంచరించగలను; ఈనడవడి+అని= ఇట్టివర్తనమని; ఎట్లువక్కాణింతున్= ఏ విధంగా పలుకుదును; పూని= పూనికతో; మూడు+పోకలన్= మూడు విధాలగు మార్గాలలోను; పోవనేర్తున్= నడవగలను; అదినేర్తును+ఇదినేర్తును= అదినేర్చినాను ఇదినేర్చినాను; అని= అంటూ; చెప్పంగన్+ఏల= చెప్పటం ఎందుకు?; నేరుపులన్నియున్= అన్ని (విద్యలను) సామర్థ్యాలను; నేన నేర్తున్= నేనే నేర్చుకోగలను; నాకు+ఒరులుకారు= నాకు ఇతరులు సహాయంకారు, నేను; ఒరులకున్+ఔదున్= ఇతరులకు (అయినవాడను) సహాయంచేస్తాను; ఒంటివాడ= ఒంటరివాడను; చుట్టమొకఁడున్ లేడు= బంధువులెవ్వరునూ లేరు; సిరియున్= భాగ్యమును (లక్ష్మీదేవి); తొల్లి= పూర్వం; కలదు= ఉన్నవాడనే; నా టెంకి= నా నివాసం; చెప్పెదన్= వచింతును; తఱచున్= ఎక్కువగా; సుజనులందున్= సత్పురుషులందు; చొచ్చి= ప్రవేశించి, ఉందున్= ఉండెదను.

**తా :** ఇది నా నివాసస్థానం అని ఏ విధంగా చెప్పగలను? అంతటా ఉంటాను. ఎవరి చిన్నవాడ నని చెప్పగలను? నేను నాయంతవాడనై స్వేచ్ఛగా నడుచుకుంటాను. ఇలాంటి నడవడిక కలవాడనని ఎలా చెప్పగలను? పూనికతో మూడు పోకడలూ పోగలను. ఇది నేర్చుకున్నాను, అది నేర్చుకున్నాను అని అనడమెందుకు? అన్నీ నేను నేర్చుకున్నాను. ఇతరులెవ్వరూ నాకు సాయం చేయరు కానీ ఇతరులందరకూ నేను సాయం చేస్తుంటాను. నేను ఒంటరివాడను. నాకెవ్వరూ చుట్టాలు లేరు. మునుపు నాకు సిరి (లక్ష్మి) ఉండేది. ఎక్కువగా నేను మంచివారితో ఉంటాను. అదే నా నివాసం.

**వ. అది యట్లుండ నిమ్ము. 553**

**ప్రతి :** అది= ఆ విషయం; అట్లు= అలా; ఉండనిమ్ము= ఉండనీయి.

**సీ. జననాథ! నీ మాట సత్యంబు సత్కీర్తిదంబుఁ గులార్హంబు ధర్మయుతముఁ**
**గరుణానువర్తులు ఘనసత్త్వమూర్తులు గాని మీ కులమందుఁ గలుగ రొరులు**
**రణభీరువులు వితరణభీరువులు లేరు ప్రత్యర్థు లర్థులు ప్రబ్బికొనిన**
**దానశౌండిమమునఁదనుపుదు రధికులై మీ తాత లందఱు మేటిమగలు**

**ఆ. మీ కులంబునందు మెఱయుఁప్రహ్లాదుండు, మింటి చంద్రుమాడ్కి మేలి రుచులఁ**
**బ్రథితకీర్తితోడ భవదీయవంశంబు, నీరరాశిభంగి నెగడుచుండు. 554**

**ప్రతి :** జననాథ= రాజా!; నీ మాట= నీ పలుకు; సత్యంబు= నిజము; సత్+కీర్తిదంబున్= మంచి కీర్తినిచ్చేది; కుల+అర్హంబున్= వంశానికి తగినది; ధర్మయుతము= ధర్మంతో కూడుకొన్నది; కరుణ+అనువర్తులు= దయతో కూడినవారు; ఘనసత్త్వమూర్తులు= గొప్పబలంకలవారు; కాని, ఒరులు= ఇతరులు; మీకులమందున్= మీ వంశాన; కలుగరు= పుట్టరు; ప్రత్యర్థులు= విరోధులు; అర్థులు= యాచకులు; ప్రబ్బికొనినన్= చుట్టుకొనిన; రణభీరువులు= యుద్ధాన భయపడేవారు; వితరణభీరువులున్= దానమనిన భీతినొందేవారు; లేరు; దానశౌండిమమునన్= దాన సామర్థ్యంచే; అధికులై= గొప్పవారై; తనుపుదురు= తృప్తిని పొందింతురు; మీ తాతలు= మీ పితామహులు; అందఱున్= ఎల్లవారూ; మేటిమగలు= అధికపౌరుషవంతులు; మీకులంబునందున్= మీ వంశంలో; ప్రహ్లాదుండు; మింటిచంద్రుమాడ్కిన్= ఆకాశాన చంద్రునివలె; మేలిరుచులన్= గొప్పప్రకాశముచే; ప్రథితకీర్తితోడన్= ప్రఖ్యాతమయిన యశస్సుతో; మెఱయున్= ప్రకాశిస్తున్నాడు; భవదీయవంశంబు= మీ కులం; నీరరాశిభంగిన్= సముద్రంవలె; నెగడుచుండున్= వృద్ధిపొందుతూ ఉంటుంది.

**తా :** రాజా! నీ పలుకులు నిజం. మంచి కీర్తిని ఇచ్చేదీ, నీ వంశానికి తగింది, ధర్మంతో కూడింది, మీ కులంలో కనికరం గలవారు ఆత్మబలం కలవారు తప్ప వేరేవారు జన్మించలేదు. యుద్ధంచేయడానికీ, దానం చేయడానికీ మీ వంశంలో భయపడేవారే లేరు. ప్రత్యర్థులకు పరాక్రమంతోను, అర్థులకు దానంతోనూ తృప్తి కలిగిస్తారు. మీ తాతలందరు బలిచక్రవర్తికి విరోచనుడు తండ్రి, ప్రహ్లాదుడు మొదటితాత, హిరణ్యకశిపుడు రెండవతాత, హిరణ్యాక్షుడు మూడవతాత పౌరుషశాలులు. మీ వంశాన ప్రహ్లాదుడు ఆకాశాన చంద్రునిలా ప్రకాశిస్తాడు. మీ వంశం సమృద్ధమైన యశస్సుతో సముద్రంవలె వృద్ధి చెందుతుంది.

**విశే :** వామనుని చతురసంభాషణం ఈ పద్యంలో దాగి ఉంది. మాటకు కట్టుబడి ఉండటం, వంశప్రతిష్ఠ అనే రెండు అభిమానాలతో బలిచక్రవర్తి ముందరికాళ్లకు బంధంవేసే ప్రయత్నం ఈ మాటల్లో ఉంది.

**వ. తొల్లి మీ మూఁడవ తాత హిరణ్యాక్షుండు విశ్వజయంబు సేసి గదాయుధుండై భూతలంబునఁ బ్రతి వీరులం గానక సంచరింప విష్ణుండు వరాహరూపంబున నతని సమయించెఁ దద్భ్రాతయగు హిరణ్యకశిపుం డది విని హరిపరాక్రమంబునకు నాశ్చర్యంబు నొంది తన జయంబును, బలంబునుం బరిహసించి గ్రద్దన నుద్దవిడి నద్దనుజమర్దను మందిరంబునకుం జనియె; నప్పుడు- 555**

**ప్రతి :** తొల్లి= పూర్వం; మీ మూఁడవ తాత= ముత్తాత; హిరణ్యాక్షుండు; విశ్వజయంబుచేసి= ప్రపంచాన్ని జయించి; గదాయుధుండై= గద అనే ఆయుధాన్ని ధరించినవాడై; భూతలంబునన్= భూమియందు; ప్రతివీరులన్= శత్రువీరులను; కానక= చూడక; సంచరింపన్= తిరుగగా; విష్ణుండు= శ్రీహరి; వరాహరూపంబునన్= దివ్య వరాహరూపంలో; అతనిన్= ఆయనను; సమయించెన్= చంపినాడు; తద్+భ్రాతయగు= ఆయన అన్నయైన; హిరణ్యకశిపుండు; (హిరణ్య= బంగారును, కశిపుడు= అన్నముగా దినువాడు); అదివిని= ఆ వృత్తాంతాన్ని ఆలకించి; హరి పరాక్రమంబునకున్= విష్ణుమూర్తి శౌర్యానికి; ఆశ్చర్యంబున్= అచ్చెరువును; ఒంది= పొంది; తన జయంబున్= అతనియొక్క విజయాన్ని; బలంబునున్= శక్తిని; పరిహసించి= పరిహాసం చేసి; గ్రద్దనన్= శీఘ్రంగా; ఉద్దవిడిన్= ఉవ్వెత్తుగా; ఆ+దనుజమర్దన= ఆ రాక్షసులను సంహరించువాడగు హరియొక్క; మందిరమునకున్= గృహానికి; చనియెన్= వెళ్ళినాడు; అప్పుడు= ఆ సమయాన.

**తా :** మునుపు నీ మూడవ తాతయైన హిరణ్యాక్షుడు విశ్వాన్ని జయించి గదాదండాన్ని ధరించి భూలోకమంతటా తిరిగినాడు. ఎక్కడా శత్రువు కనిపించలేదు. చివరకు ఆయనను శ్రీహరి వరాహరూపంలో పరిమార్చినాడు. ఆ సంగతిని

హిరణ్యాక్షుని తమ్ముడైన హిరణ్యకశిపుడు విన్నాడు, విష్ణువు శౌర్యానికి ఆశ్చర్యపడినాడు. విష్ణువు విజయాన్ని బలాన్నీ తూలనాడినాడు. వెంటనే విష్ణువు నగరమైన వైకుంఠంపైకి దండెత్తినాడు.

**విశే :** ప్రత్యర్థులైన హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల పరాక్రమాన్ని సుదీర్ఘంగా పొగడి విష్ణు పరాక్రమాన్ని తేల్చి చెప్పడం సందర్భోచిత వాక్యరచనలోని సొగసు.

**క. శూలాయుధహస్తుండై, కాలాకృతి వచ్చు దనుజుఁ గని విష్ణుండుం**
**గాలజ్ఞత మాయాగుణ, శీలత నిట్లని తలంచెఁ జిత్తములోనన్. 556**

**ప్రతి :** శూల+ఆయుధ+హస్తుండై= శూలం అనే ఆయుధాన్ని చేతియందు ధరించినవాడై; కాల+ఆకృతిన్= యమునివలె; వచ్చు= వస్తున్న; దనుజున్= రాక్షసుని (హిరణ్యకశిపుని); కని= చూచి; విష్ణుండున్= హరియును; కాలజ్ఞతన్= సమయా సమయాలను ఎరుగుటచేత; మాయగుణశీలతన్= మాయాగుణంతో; చిత్తములోనన్= మనస్సునందు; ఇట్లని= ఈ విధంగా; తలంచెన్= ఆలోచించినాడు.

**తా :** శూలపాణియై యమునివలె వస్తున్న హిరణ్యకశిపుని చూచి విష్ణువు సమయాసమయాలను గుర్తించి మాయచేయాలని మనస్సులో ఇలా ఆలోచించినాడు.

**విశే :** విష్ణువును 'మాయావి' అని పిలవడం దైత్యుల కలవాటు. మాయగుణశీలుడు అనటం 'విష్ణుమాయ'కు చెందినది.

**మ. ఎదురై పోర జయింప రాదితనిఁ; గా కెందేనియుంబోవ భీ**
**ప్రదుఁడై ప్రాణులఁదోలు మృత్యువు క్రియం బై వచ్చు నంచుం గ్రియా**
**విదుఁ డబ్జాక్షుఁడు సూక్ష్మరూపమున నావేశించె నిశ్వాస రం**
**ధ్ర దిశన్ దైత్యు హృదంతరాళమునఁ బ్రత్యక్షక్రియాభీరుఁడై. 557**

**ప్రతి :** ఎదురై పోరన్= ఎదుర్కొని యుద్ధంలో; ఇతనిన్= ఈ రాక్షసుని; జయింపరాదు= గెలువశక్యంకాదు; కాక= అంతేగాక; ఎందు+ఏనియున్ పోవన్= ఎక్కడికైన పారిపోతే; భీప్రదుఁడై= భయాన్ని కలిగించేవాడై; ప్రాణులన్= జీవులను; తోలు= పారదోలునట్టి; మృత్యువుక్రియన్= మృత్యుదేవతవలె; పైవచ్చున్+అంచున్= మీదబడు నని; క్రియావిదుఁడు= కార్యం తెలిసిన; అబ్జ+అక్షుఁడు= పద్మముల వంటి నేత్రాలుగల హరి; సూక్ష్మరూపమునన్= చిన్నరూపంతో; నిశ్వాసరంధ్రదిశన్= నాసికారంధ్రంగుండా; దైత్యు= రాక్షసునియొక్క; హృదంతరాళమునన్= హృదయంలో; ప్రత్యక్షక్రియా భీరుఁడై= ఎదురుగా పోరాడడంలో భయపడినవాడై; ఆవేశించెన్= చేరినాడు.

**తా :** ఈ హిరణ్యకశిపుని ఎదుర్కొని పోరాడి గెలిచేటందుకు శక్యంకాదు. అలాకాకుండా నేను ఎక్కడికైనా వెళ్లిపోతే లోకంలోని ప్రాణులపైకి మృత్యుదేవతవలె వెంటబడతాడు. ఆ విషయం తెలుసుకున్న హరి సూక్ష్మమైన రూపంతో ముక్కురంధ్రంద్వారా హిరణ్యకశిపుని గుండెలో ప్రవేశించినాడు.

**వ. అంత నద్దైత్యవల్లభుండు వైష్ణవాలయంబు సొచ్చి వెదకి హరిం గానక, కోపంబు మానక, మిన్ను మన్ను నన్వేషించి, త్రిదివంబున నరసి, దిశలం బరికించి, భూ వివరంబులు వీక్షించి, సముద్రంబులు వెదకి,**

**పురంబులు శోధించి, వనంబులు విమర్శించి, జగంబున నదృష్టశత్రుండై మార్గణంబు సాలించి, తనలో నిట్లనియె. 558**

**ప్రతి :** అంతన్= అంతట; ఆ దైత్యవల్లభుండు= ఆ రాక్షసరాజయిన హిరణ్యకశిపుడు; వైష్ణవ+ఆలయంబున్= వైకుంఠాన్ని; చొచ్చి= ప్రవేశించి; వెదకి; హరిన్= విష్ణువును; కానక= చూడక; కోపంబున్= ఆగ్రహమును; మానక= విడువక; మిన్నున్= ఆకశములోనూ; మన్నున్= భూమిలోనూ; అన్వేషించి= వెదకి; త్రిదివంబునన్= స్వర్గలోకాన; అరసి= చూచి; దిశలన్= దిక్కులను; పరికించి= కాంచి; భూవివరంబులు= భూమి బిలములను; వీక్షించి= చూచి; సముద్రంబులు= సప్తసముద్రాలను; వెదకి= గాలించి; పురంబులు= పట్టణాలను; శోధించి= పరిశీలించి; వనంబులు= అడవులను; విమర్శించి= పరీక్షించి; పాతాళంబు= పాతాళలోకాన్ని; పరీక్షించి= కనుగొని; జగంబునన్= ప్రపంచములో; అదృష్ట= చూడబడని; శత్రుండై= విరోధి కలవాడై; మార్గణంబున్= వెదకుటను; చాలించి= కట్టిపెట్టి; తనలోన్= తన మనసులో; ఇట్లు+అనియెన్= ఇట్లనుకొన్నాడు.

**తా :** ఆ తర్వాత హిరణ్యకశిపుడు వైకుంఠం చొచ్చి ఆయన కోసం వెదకినాడు. కానీ శత్రువు కనిపించలేదు. విష్ణువు కోసం ఆ రాక్షసుడు కోపంతో ఆకాశాన్నీ భూలోకాన్నీ స్వర్గాన్నీ గాలించినాడు. దిక్కులనూ, భూగర్భాలనూ, సముద్రాలనూ, పట్టణాలనూ, అడవులనూ అన్వేషించినాడు. లోకంలో ఎక్కడా శ్రీహరి జాడ చిక్కలేదు. చివరకు వెతకటం చాలించి తనలో ఇలా అనుకున్నాడు.

**క. 'పగవాఁడు మడియనోపును, దెగఁడేనియు నెదురువడఁడె? దేహధరులకుం**
**దెగినయెడఁబగఱ మీఁదను, బగ గొనఁదగ' దనుచు నుడిగెఁబ్రాభవశక్తిన్. 559**

**ప్రతి :** పగవాఁడు= విరోధి అయిన విష్ణువు; మడియన్+ఓపును= చనిపోయి ఉంటాడు; తెగఁడు+ఏనియున్= చావకుంటే; దేహధరులకున్= దేహాన్ని ధరించినవారికి (బతికి ఉన్నవారికి); ఎదురుపడఁడె= కన్పడకుంటాడా?; తెగినయెడన్= చచ్చినపుడు; పగఱమీఁదను= వైరులపై; పగగొనన్= విరోధాన్ని వహించటం; తగదు+అనుచున్= కూడదని; ప్రాభవశక్తిన్= అధికార బలంచే; ఉడిగెన్= మానినాడు.

**తా :** 'నా పగవాడు చచ్చి ఉంటాడు. అలా కాకుంటే కనపడకుండా ఉంటాడా? చచ్చిన విరోధిపై పగబూనటం మంచిది కా'దని అధికారబలంతో తన పగను విడిచిపెట్టాడు.

**వ. అతండు మీ ప్రపితామహుం; డతనిగుణంబు లనేకంబులు గల; వవి యట్లుండనిమ్ము. 560**

**ప్రతి :** అతండు= ఆ హిరణ్యకశిపుడు; మీ ప్రపితామహుండు= మీ ముత్తాత; అతనిగుణంబులు= ఆయన గుణాలు; అనేకంబులుగలవు= చాలా ఉన్నాయి; అవి+అట్లు+ఉండనిమ్ము= ఆ గుణాలు అట్లుండనీ.

**క. ఆతురభూసురగతిఁ బురు, హూతాదులు దన్ను వేఁడ నొగిఁ గొండనుచున్**
**మీ తండ్రి యిచ్చె నాయువు, నేతన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్? 561**

**ప్రతి :** ఆతుర= బాధగలిగిన; భూసురగతిన్= బ్రాహ్మణులవలె; పురుహూతాదులు= ఇంద్రుడు మొదలయినవారు; తన్నువేఁడన్= తననుకోరగా; ఒగిన్= క్రమంగా; కొండు+అనుచున్= పుచ్చుకొనుడని; మీ తండ్రి= మీ జనకుడు; ఆయువున్= ప్రాణాన్ని; ఇచ్చెన్= ఒసంగెను; నీవు; ఈలోకమునన్= ఈ ప్రపంచమందు; ఏతద్+మాత్రుఁడవె= సామాన్యుడవా!

**తా :** బాధకు లోనయిన బ్రాహ్మణులవలె ఇంద్రాదులు మీతండ్రిని వేడగా ఆయన వారికి తన ప్రాణాన్ని (ఆయువును) ఇచ్చినాడు. ఈ ప్రపంచాన నీవుకూడా సామాన్యుడవుకావు.

**విశే :** బలితండ్రి విరోచనుడు. ఆయన దేవతలకు ఆయువు దానం చేసిన కథను మాయావటువు జ్ఞాపకం చేస్తున్నాడు.

**క. ఏలితివి మూఁడు జగములుఁ, దోలితి వింద్రాది సురలఁ, దొల్లిటివారిం**
**బోలితివి దానగుణములఁ, జాలితి వీ రాక్షసులను సంరక్షింపన్. 562**

**ప్రతి :** మూఁడు జగములన్= ముల్లోకాలనూ; ఏలితివి= పాలించినావు; ఇంద్రాదిసురలన్= ఇంద్రుడు మొదలయిన దేవతలను; తోలితివి= పారదోలితివి; దానగుణములన్= దాతృత్వగుణాలచే; తొల్లిటివారిన్= పూర్వులను; పోలితివి= పోలిఉన్నావు; రాక్షసులన్= దైత్యులను; రక్షింపన్= కాపాడుటకు; చాలితివి= సమర్థుడవై ఉన్నావు.

**తా :** నీవు మూడులోకాలను పాలించినావు. ఇంద్రాది దేవతలను వెడలగొట్టినావు, దానమివ్వటంలో మీ పూర్వులను పోలినావు. రాక్షసులను కాపాడటంలో సమర్థుడ వైనావు.

**వ. అదియునుం గాక. 563**

**ప్రతి :** అదియునున్+కాక= అదిమాత్రమేగాక

**క. రాజ్యంబు గలిగెనేనియుఁ, బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్**
**భాజ్యముగ బ్రదుకఁడేనియుఁ, ద్యాజ్యంబులు వాని జన్మధనగేహంబుల్. 564**

**ప్రతి :** రాజ్యంబు గలిగె నేనియున్= రాజ్యమున్నప్పుడు; పూజ్యులకును= పూజింపదగినవారికినీ; యాచకులకున్= యాచించువారికీ; భూమిసురులకున్= బ్రాహ్మణులకూ; భాజ్యముగన్= విభజింపదగిన విధంగా; బ్రతుకఁడేనియున్= జీవించని యెడల; వాని= అట్టివానియొక్క; జన్మ= పుట్టుక; ధన= ద్రవ్యం; గేహంబుల్= ఇల్లూ; త్యాజ్యంబులు= విడువతగినవి.

**తా :** రాజ్యమున్నందుకు పూజింపదగినవారికీ, యాచకులకూ బ్రాహ్మణులకూ ధనాదికాన్ని పంచి మంచివాడుగ బ్రతకాలి. అలాకానప్పుడు వాని బతుకూ, ధనం, ఇల్లూ విడువదగినవే.

**క. మున్నెన్నుదురు వదాన్యుల, నెన్నెడుచో నిన్నుఁ ద్రిభువనేశుండనుచున్;**
**ఇన్ని దినంబులనుండియు, నెన్నఁడు నినుఁ బెట్టు మనుచు నీంద్రము సేయన్. 565**

**ప్రతి :** వదాన్యులన్= దాతలను; ఎన్నెడుచోన్= గణించునప్పుడు; నిన్నున్= నిను; త్రిభువన= మూడులోకాలకు; ఈశుండనుచున్= గొప్పవాడనుచు; మున్ను= ముందుగా; ఎన్నుదురు= గణనచేయుదురు; ఇన్ని దినంబులనుండియున్= ఇన్నినాళ్లనుండి; ఎన్నఁడున్= ఎప్పుడూ; నినున్= నిన్ను; పెట్టుము+అనుచున్= ఇమ్ము అని; ఈంద్రము+చేయన్= పీడించను.

**తా :** దాతలను లెక్కించేటప్పుడు ముల్లోకాలలోనూ గొప్పవాడ వని నిన్నే ముందుగా ఎన్నిక చేస్తారు. ఇన్ని దినాలనుండి ఎన్నడుకూడా నిన్ను పెట్టుమని పీడించిన వాడనుకాను.

**ఆ. ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగులు, మేర యిమ్ము; సొమ్ము; మేర యొల్లఁ;**
**గోర్కిదీర బ్రహ్మకూఁకటి ముట్టెద, దానకుతుకసాంద్ర! దానవేంద్ర! 566**

**ప్రతి :** దానవేంద్ర= రాక్షసరాజా!; దానకుతుకసాంద్ర= దానంచేయాలన్న కుతూహలం దట్టంగా కలవాడా!; ఒంటివాఁడన్= ఒంటరివాణ్ణి; నాకు, ఒకటి+రెండు+అడుగులమేర= (మూడు) అడుగులచోటు మాత్రం; ఇమ్ము= ఒసగుము; సొమ్ముమేర= అధికధనం; ఒల్లన్= ఇష్టపడను; కోర్కిదీరన్= కోరిక నెరవేరేటట్లు; బ్రహ్మకూకటిన్= బ్రహ్మయొక్క పిల్లజుట్టును; ముట్టెదన్= అందుకొంటాను. (బ్రహ్మానందాన్ని పొందుతాను).

**తా :** రాక్షసరాజా! నాకు నీవు దానంచేయాలని కుతూహలపడుతున్నావు. నేను ఒంటిగాడను. నాకు సొమ్ములు, భూములు అవసరంలేదు. ఒకటి, రెండు (మూడు) అడుగులనేల మాత్రం ఇవ్వు. దానితో తృప్తిచెంది బ్రహ్మానందం పొందుతాను.

**వ. అనినఁబరమయాచకునకుఁ బ్రదాత యిట్లనియె. 567**

**ప్రతి :** అనినన్= అలా పలుకగా; పరమయాచకునకున్= ఉత్కృష్టమైన యాచకునికి; ప్రదాత= గొప్పదాత అయిన బలి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికినాడు.

**ఆ. 'ఉన్నమాటలెల్ల నొప్పును విప్రుండ!, సత్యగతులు వృద్ధసమ్మతంబు;**
**లడుగఁదలఁచి కొంచె మడిగితివో చెల్ల!, దాత పెంపుసొంపుఁదలఁపవలదె?' 568**

**ప్రతి :** విప్రుండ= బ్రాహ్మణుడా!; ఉన్నమాటలెల్లన్= ఉన్నట్టిమాటలన్నీ; ఒప్పున్= తగును; సత్యగతులు= సత్యసంచారములు; వృద్ధసమ్మతంబులు= పెద్దలు అంగీకరించినవి; అడుగన్ తలఁచి= యాచించనెంచి; కొంచెమడిగితివో= స్వల్పం యాచించితివో; చెల్ల= అయ్యయ్యో!; దాత= దాతయొక్క; పెంపున్ సొంపున్= ఆధిక్యతను చందమును; తలఁపవలదె= ఆలోచించవద్దా?

**తా :** ఓ బ్రాహ్మణుడా! నీవన్న మాటలన్నీ నిజం. సత్యమైన విషయాలు పెద్దలు సమ్మతిస్తారు. అడుగదలచినావు కానీ కొంచెపుకోరికను కోరినావు. అయ్యో! దాత గొప్పతనపు తీరును తలచవద్దా!

**వ. అని మఱియు నిట్లనియె. 569**

**ప్రతి :** అని; మఱియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పినాడు.

**మ. వసుధాఖండము వేఁడితో? గజములన్ వాంఛించితో? వాజులన్**
**వెస నూహించితొ? కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో?**
**పసిబాలుండవు; నేర వీ వడుగ; నీ భాగ్యంబు లీపాటిగా**
**కసురేంద్రుండు పదత్రయంబడుగ నీ యల్పంబు నీనేర్చునే? 570**

**ప్రతి :** వసుధాఖండమున్= భూభాగాన్ని; వేఁడితో= అడిగితివా?; గజములన్= ఏనుగులను; వాంఛించితో= కోరితివా?; వాజులన్= గుర్రాలను; వెసన్= వేగంగా; ఊహించితో= తలచుకొంటివా?; కోరితో= కోరితివా?; యువతులన్= స్త్రీలను; వీక్షించి= చూచి; కాంక్షించితో= కోరుకొంటివా?; పసిబాలుండవు= మిక్కిలి చిన్నవాడవు; ఈవు= నీవు; అడుగన్= కోరుటకు; నేరవు= చేతగానివాడవు; నీ భాగ్యంబులు= నీ అదృష్టాలు; ఈపాటిగాక= ఇంతటివి (అల్పమైనవి) అయినాయికాని; పదత్రయంబున్= మూడడుగులనేలను; అడుగన్= యాచించగా; అసురేంద్రుండు= రాక్షసరాజయిన బలిచక్రవర్తి; ఈ అల్పంబున్= ఈ చిన్నకోరికను; ఈ నేర్చున్+ఏ= ఈయగలడా? (ఎలా ఇస్తాడు?)

**తా :** భూభాగాన్ని కోరినావా? ఏనుగులను కోరినావా? గుర్రాలను కోరినావా? యువతులను కోరినావా? పసిబాలుడవు. నీకు అడగడం తెలియదు. ఇంతటి రాక్షసచక్రవర్తిని ఇంత చిన్న కోరికకోరినావు. అల్పమైనదానిని ఎలా ఇస్తాడు?

**వ. అన మొగంబునం జిఱునగవు మొలకలొత్త గృహమేధికి మేధావి యిట్లనియె. 571**

**ప్రతి :** అనన్= అనగా; మొగంబునన్= ముఖంమీద, చిఱునగవు; మొలకలు+ఒత్తన్= చిగురించగా; గృహమేధికిన్= యజమానికి (బలితో); మేధావి= గొప్పవాడైన హరి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** బలిచక్రవర్తి ఆ మాటనగా చిరునవ్వుతో శ్రీహరి బలితో ఇలా అన్నాడు.

**మ. 'గొడుగో, జన్నిదమో,కమండలమొ, నాకున్ ముంజియో, దండమో,**
**వడు గేనెక్కడ? భూము లెక్కడ? కరుల్, వామాక్షు, లశ్వంబు లె**
**క్కడ? నిత్యోచితకర్మ మెక్కడ? మదాకాంక్షామితంబైన మూఁ**
**డడుగుల్ మేరయ త్రోవ కిచ్చుటది బ్రహ్మాండంబు నా పాలికిన్. 572**

**ప్రతి :** నాకున్= నాకు; గొడుగు+ఓ= ఛత్రమో; జన్నిదము+ఓ= యజ్ఞోపవీతమో; కమండలుము+ఒ= కుండికయో; ముంజియో= ముంజిగడ్డితో చేసిన మొలతాడో; దండమో= కర్రయో; (కాని) వడుగు+ఏన్+ఎక్కడ= బ్రహ్మచారినగు నేనెక్కడ; భూములెక్కడ= ధాత్రీతలములెక్కడ; కరుల్= ఏనుగులు; వామ+అక్షులు= స్త్రీలు; అశ్వంబులు+ఎక్కడ= గుర్రాలు ఎక్కడ; నిత్య+ఉచిత= ప్రతిదినమూ తగిన; కర్మము+ఎక్కడ= కర్మకాండ ఎక్కడ; మత్= నాచే; ఆకాంక్షితంబు+అయిన= కోరబడిన; మూఁడు+అడుగుల్మేరయ= మూడడుగుల నేలమాత్రమే; త్రోవక= లేదని త్రోసివేయక; ఇచ్చుట= ఇవ్వడం; అది నా పాలికిన్= నా పాలిటికి; బ్రహ్మాండంబు= గొప్ప విషయం.

**తా :** నాకు గొడుగో, జందెమో, కుండికయో, ముంజిత్రాటిమొలతాడో, దండమో అవసరం. అంతేకాని బ్రహ్మచారిని అయిన నాకు ఏనుగులు, స్త్రీలు, గుర్రాలు ఎందుకు? కాదనక నేను కోరిన మూడడుగుల నేల ఇస్తే అదే నా పాలిటికి బ్రహ్మాండం (చాల గొప్పదానం).

**వ. అదియునుంగాక. 573**

**ప్రతి :** అదియునుంగాక= అదేగాక

**క. వ్యాప్తింబొందక వగవక, ప్రాప్తంబగు లేశమైనఁబదివే లనుచుం**
**దృప్తింజెందని మనుజుఁడు, సప్తద్వీపముల నయినఁ జక్కంబడునే? 574**

**ప్రతి :** వ్యాప్తిన్= ఆశను; పొందక= చెందక; వగవక= దుఃఖపడక; ప్రాప్తంబు+అగు= దొరకినట్టి; లేశమైనన్= కొంచెమైనా; పదివేలు+అనుచున్= పదివేల రూపికలుగా భావిస్తూ; తృప్తిన్= సంతుష్టిని; చెందని= పొందనట్టి; మనుజుఁడు= మానవుడు; సప్తద్వీపములనైనన్= ఏడు దీవులను ఇచ్చినా; చక్కన్+పడునే= బాగుపడుతాడా? (తృప్తిపడుతాడా?)

**తా :** ఆశించక, దుఃఖపడక, దొరికింది కొంచెమైనా దానినే పదివేలుగా భావిస్తూ తృప్తిపొందనివానికి ఏడు దీవులను ఇచ్చినాకూడా బాగుపడడు. (తృప్తిపడడు).

**విశే :** సప్తద్వీపాలు= జంబూ, ప్లక్ష, కుశ, శాక, శాల్మల, క్రౌంచ, పుష్కరములు.

**శా. ఆశాపాశము దాఁగడున్ నిడుపు; లే దంతంబు రాజేంద్ర! వా**
**రాశిప్రావృతమేదినీవలయసామ్రాజ్యంబు సేకూడియుం**
**గాసింబొందిరి గాక వైన్యగయభూకాంతాదులు; న్నర్థకా**
**మాశం బాయఁగ నేర్చిరే! మును నిజాశాంతంబులంజూచిరే. 575**

**ప్రతి :** రాజేంద్ర= ఓ మహారాజా!; ఆశాపాశము= ఆశ అనే తాడు; తాన్= తాను; కడున్+నిడుపు= మిక్కిలి పొడవుకలది; లేదు+అంతంబు= దానికి తుదిలేదు; వారాశి= సముద్రముచే; ప్రావృత= చుట్టబడిన; మేదినీవలయ= భూచక్రముతో కూడిన; సామ్రాజ్యంబు= ఆధిపత్యము; చేకూడియున్= కలిగియుండి కూడా; వైన్య= వేనుని కుమారుడైన పృథుచక్రవర్తి (అపత్యార్థకతద్ధితరూపం – వైన్య); గయ= గయుడనునట్టి; భూకాంతాదులున్= ధరణీపతులు మొదలగువారు; గాసిన్+పొందిరిగాక= కష్టాలను చెందిరేకాని; మును= పూర్వం; అర్థకామ= ధనముకావలయునను; ఆశన్= కోరికను; పాయఁగన్= విడువగా; నేర్చిరే= సమర్థులయినారా?; నిజ= తమయొక్క; ఆశ= ఆశలయొక్క; అంతంబులన్= తుదలను; చూచిరే= చూచినారా? (లేదు అనుట).

**తా :** ఓ మహారాజా! ఆశ అనే తాడు చాలా పొడవయినది. దానికి అంతులేదు. పూర్వం వేనుని కుమారుడు పృథుచక్రవర్తి, గయుడు మొదలయిన రాజులు సముద్రాలదాకా వ్యాపించిన సామ్రాజ్యాన్ని సంపాదించి పాలించినారు. వారుకూడా కష్టపడినారు కానీ అర్థకామాన్ని వదలలేదు. వారి ఆశలు నెరవేరనూ లేదు.

**సీ. సంతుష్టుఁ డీమూఁడు జగములఁబూజ్యుండు సంతోషి కెప్పుడు జరుగు సుఖము**
**సంతోషి గాకుంట సంసారహేతువు సంతసంబున ముక్తిసతియు దొరకుఁ**
**బూఁట పూఁటకు జగంబుల యదృచ్ఛాలాభ తుష్టిని దేజంబు దోన పెరుఁగుఁ**
**బరితోషహీనతఁబ్రభసెడి పోవును జలధార ననలంబు సమయునట్లు**

**ఆ. నీవు రాజ వనుచు నిఖిలంబు నడుగుట, దగవు కాదు నాకుఁ; దగిన కొలఁది**
**యేను వేఁడికొనిన యీ పదత్రయమును, జాల దనక యిమ్ము; చాలుఁజాలు! 576**

**ప్రతి :** సంతుష్టుఁడు= మిగుల తృప్తి కలవాడు; ఈ మూఁడుజగములన్= ఈ మూఁడులోకాలయందు; పూజ్యుండు= పూజింపదగినవాడు; సంతోషికి= సంతోషముకలవానికి; ఎప్పుడున్= ఎల్లకాలమును; సుఖము= సౌఖ్యము; జరుగున్= అగును; సంతోషిగాకుంట= సంతోషముకలవాడుకాకుండుట; సంసారహేతువు= సంసారకారణము; సంతసంబునన్= ఆనందముచే; ముక్తిసతియున్= ముక్తికాంతయును; దొరకున్= లభించును; జగంబులన్= లోకములయందు; పూఁటపూఁటకున్= ప్రతి పూఁటకును; యదృచ్ఛాలాభ= దొరకిన దానితో; తుష్టిని= తృప్తిపొందుటచేత; తేజంబు= కాంతి; తోన= దానితోనే; పెరుఁగున్= వృద్ధిపొందును; పరితోషహీనతన్= సంతోషం లేకపోవటంచే; జలధారన్= నీటిధారచే; అనలంబు= అగ్నిహోత్రం; సమయునట్లు= నశించురీతి; ప్రభ చెడిపోవును= కాంతినశించును; నీవు; రాజవనుచున్= ప్రభువువని; నిఖిలంబున్= సకలమును; అడుగుట= కోరుట; తగవుగాదు= న్యాయంకాదు; నాకున్; తగినకొలఁది=

తగినంత పరిమాణము; ఏను= నేను; వేఁడికొనిన= యాచించినట్టి; ఈ పదత్రయమును= ఈ మూఁడడుగులనేలను; చాలదనక= తక్కువది అనక; ఇమ్ము= ఒసగుము; చాలున్‌చాలు= నిశ్చయంగా చాలు.

**తా :** తృప్తి కలిగినవాడు మూడులోకాలలోను గౌరవింపబడుతాడు. సంతోషం కలవానికి ఎప్పుడూ సుఖం కలుగుతుంది. సంతోషం లేకపోవటమే సంసారంలో చిక్కుకోవడానికి కారణం. ఆనందంచే ముక్తికాంత లభిస్తుంది. ఏ పూటకు ఆపూట దొరకిన దానితో తృప్తిని పొందితే తేజస్సు పెరుగుతుంది. సంతోషం లేకపోతే నీళ్లవల్ల నిప్పు నశించినట్లు తేజస్సు తగ్గిపోతుంది. నీవు రాజువని నేను అన్నీ కోరటం న్యాయం కాదు. నాకు తగినట్లుగా నేనడిగిన మూడడుగుల చోటే కాదనకుండా ఇవ్వు. అదే చాలు, అంతే చాలు.

**వ. అని యిట్లు పలుకుచున్న ఖర్వునకు నుర్వీదానంబు సేయం దలంచి కరకలిత సలిల కలశుండైన యవ్వితరణముఖరునిం గని నిజవిచారయుక్తదనుజరాజ్యచక్రుండగు శుక్రుం డిట్లనియె. 577**

**ప్రతి :** అని; ఇట్లుపలుకుచు+ఉన్న= ఈ విధంగా మాటలాడుతున్న; ఖర్వునకున్= (పొట్టివానికి) వామనునకు; ఉర్వీదానంబున్= భూదానమును; చేయన్+తలంచి= చేయగానెంచి; కర= హస్తమునందు; కలిత= కూడుకొనిన; సలిలకలశుండు+ఐన= జలకుండికగలవాడగు; ఆ+వితరణముఖరునిన్= దానమును గూర్చియే ముఖ్యముగా పలుకుచున్న వానిని (అనగా బలిచక్రవర్తిని); కని= చూచి; నిజ= తనయొక్క; విచార= ఆలోచనతో; యుక్త= కూడుకొనియున్న; దనుజరాజ్యచక్రుండు= రాక్షసరాజ్య చక్రముకలవాడు; అగు= అయినట్టి; శుక్రుండు= శుక్రాచార్యుడు; ఇట్లనియెన్= ఈ విధంగా పలికినాడు.

**తా :** అలా పలికిన వామనునికి మూడుడుగుల నేలను దానం చేయటానికి బలిచక్రవర్తి జలకలశం తీసుకొన్నాడు. అంతలో రాక్షసరాజ్యనిర్మాణధుర్యుడైన శుక్రాచార్యుడు దానశీలుడైన దానవ చక్రవర్తితో ఇట్లా అన్నాడు.

**సీ. 'దనుజేంద్ర! యీతఁడు ధరణీసురుఁడు గాఁడు దేవకార్యంబు సాధించుకొఱకు**
**హరి విష్ణుఁడవ్యయుండదితిగర్భంబునఁ గశ్యపసూనుఁడై కలిగె; నకట!**
**యెఱుఁగ కీతని కోర్కి నిచ్చెద నంటివి దైత్యసంతతి కుపద్రవము వచ్చు**
**నీ లక్ష్మిఁ దేజంబు నెలవు నైశ్వర్యంబు వంచించి యిచ్చుఁ దా వాసవునకు;**

**ఆ. మొనసి జగములెల్ల మూఁడు పాదంబుల, నఖిలకాయుఁడగుచు నాక్రమించు**
**సర్వధనము విష్ణుసంసర్జనము సేసి, బడుగుపగిది నెట్లు బ్రదికె దీవు? 578**

**ప్రతి :** దనుజ+ఇంద్ర= రాక్షసశ్రేష్ఠుడా!; ఈతఁడు= ఈ వామనుడు; ధరణీసురుఁడు+కాఁడు= బ్రాహ్మణుడుకాడు; దేవకార్యంబున్= దేవతలయొక్క కార్యమును; సాధించుకొఱకున్= నెరవేర్చునిమిత్తము; హరి= సకలముహరించువాడు – విష్ణువు; విష్ణుఁడు= సర్వవ్యాపకుడు; అవ్యయుండు= నాశనము లేనివాడు; అగు శ్రీహరి; అదితిగర్భంబునన్= అదితి అనే ఆమె కడుపునుండి; కశ్యపసూనుఁడై= కశ్యపబ్రహ్మకుమారుడై; కలిగెన్= పుట్టినాడు; అకట= అయ్యో; ఎఱుఁగక= తెలియక; ఈతనికోర్కిన్= ఈతడుకోరినకోర్కెను, ఇచ్చెదన్+అంటివి= తీర్చెదనని (ఒసగెదనని) పలికితివి; దైత్యసంతతికిన్= రాక్షసకులమునకు; ఉపద్రవము వచ్చున్= హాని సంభవిస్తున్నది; నీలక్ష్మిన్= నీ ధనమును; తేజంబున్= నీ తేజస్సును; నెలవున్= నీస్థానాన్ని; ఐశ్వర్యంబున్= నీ విభవాన్ని; తాన్= ఈ వామనుడు; వంచించి= కపటముచేత తీసుకొని; వాసవునకున్=

ఇంద్రునకు; ఇచ్చున్= ఒసగును; మొనసి= పూనుకొని; జగములెల్లన్= ప్రపంచములన్నీ; మూఁడుపాదంబులన్= మూడడుగులచేత; అఖిలకాయుఁడు+అగుచున్= విశ్వ రూపము ధరించినవాడై; ఆక్రమించున్= వశపరచుకొంటాడు; సర్వధనమున్= భాగ్యమంతా; విష్ణుసంసర్జనము+చేసి= హరికి విడిచిపెట్టి; బడుగుపగిదిన్= (బీద) బక్కవానివలె; ఈవు= నీవు; ఎట్లు= ఏ విధంగా; బ్రదికెదు= జీవిస్తావు?

**తా :** ఓ రాక్షసరాజా! ఇతడు బ్రాహ్మణుడు కాదు. దేవతలపనిని నెరవేర్చేందుకు కశ్యపునికొడుకుగా అదితిగర్భంలో పుట్టినవాడు. తెలియక ఈతని కోరికను తీరుస్తానని చెప్పినావు. రాక్షసులకు హాని సంభవిస్తుంది. నీ ధనం, తేజం, స్థానం, ఐశ్వర్యం అన్నీకూడా ఈ వామనుడు మోసంతో తీసుకొని ఇంద్రునికి ఇస్తాడు. విశ్వరూపాన్ని ధరించి ప్రపంచాలన్నింటినీ మూడడుగులతో ఆక్రమించుకొంటాడు. సకలభాగ్యాలను హరికి సమర్పించి దీనునివలె నీవు ఎట్లా బ్రతుకుతావు?

**క. ఒక్కపదంబున భూమియు, నొక్కటఁ ద్రిదివంబుఁద్రొక్కి యున్నతమూర్తిన్**
**దిక్కులు గగనముఁదానై, వెక్కసమై యున్న నెందు వెడలెదు చెపుమా! 579**

**ప్రతి :** ఒక్కపదంబునన్= ఒక యడుగుచే; భూమియున్= ధాత్రీతలాన్ని; ఒక్కటన్= మరియొక అడుగుచే; త్రిదివంబున్= స్వర్గలోకాన్ని; త్రొక్కి= ఆక్రమించి; ఉన్నతమూర్తిన్= పెద్ద ఆకారంతో (విశ్వరూపంతో); దిక్కులన్= దిశలూ; గగనమున్= ఆకాశమూ; తానై= నిండినవాడై; వెక్కసమై+ఉన్నన్= సహించేందుకు శక్యం కానప్పుడు; ఎందువెడలెదు= ఎక్కడికిపోతావు?; చెపుమా= వచించు.

**తా :** ఈయన ఒక అడుగుతో భూలోకాన్నీ ఇంకొక అడుగుతో స్వర్గలోకాన్నీ తొక్కి, (ఆక్రమించి) విశ్వరూపంతో దిక్కులూ ఆకాశమూ తానై సహింపశక్యం కాకుండా ఉన్నపుడు నీ వెక్కడికి పోతావో చెప్పు.

**సీ. ఇచ్చెద నని పల్కి యీకున్న నరకంబుఁ ద్రోవ నీవును సమర్థుఁడవు గావ;**
**యే దానమున నాశ మేతెంచు నదియును దానంబు గాదండ్రు తత్త్వవిదులు;**
**దానంబు యజ్ఞంబుఁదపముఁగర్మంబును దా విత్తవంతుఁడై తలఁపవలయుఁ;**
**దనయింటఁగల సర్వధనమును నైదు భాగములుగా విభజించి కామమునకు**

**ఆ. నర్థమునకు ధర్మయశముల కాశ్రిత, బృందములకు సమతఁబెట్టునట్టి**
**పురుషుఁడిందు నందుఁ బూర్ణుఁడై మోదించు, దన్నుమాని చేఁత దగవు గాదు. 580**

**ప్రతి :** ఇచ్చెదను+అని= ఇస్తానని; పలికి= చెప్పి; ఈకున్నన్= ఇవ్వకున్న ఎడల; నరకంబున్= వచ్చే దుర్గతిని; త్రోవన్= తోసివేయడానికి; నీవును= నీవు; సమర్థుఁడవు+కావ= శక్తివంతుడవు కావు; ఏ దానమునన్= ఏ దానముచే; నాశము= హాని; ఏ తెంచున్= వచ్చునో; అదియును= ఆ దానమును; తత్త్వవిదులు= జ్ఞానులు; దానంబుగాదు+అండ్రు= దానముకాదని చెపుతారు; దానంబున్= దానంచేయడం; యజ్ఞంబున్= జన్నమును; తపమున్= తపస్సును; కర్మంబున్= దానాదులగు పనులను; తాన్= తాను; విత్తవంతుఁడై= ధనం కలవాడై; తలపవలయున్= తలపెట్టాలి (ఆలోచించాలి); తనయింటన్= తన గృహమందు; కల= ఉన్నట్టి; సర్వధనమున్= ధనాన్నంతా; ఐదుభాగములుగాన్= అయిదు భాగాలుగా; విభజించి= భాగించి; కామమునకున్= స్వకీయమైన అవసరాల వినియోగానికి; అర్థమునకున్= ధనార్జనకు ధనాన్నే పెట్టుబడి పెట్టడానికి; ధర్మయశములకున్= దాన ధర్మాలకు, దైవకార్యాలకు; ఆశ్రితబృందములకున్= తనను ఆశ్రయించిన కుటుంబ సభ్యులకు,

బంధువర్గానికి; సమతన్= సమానంగా; పెట్టునట్టి= వ్యయపరచునట్టి; పురుషుఁడు= మనుష్యుడు; ఇందున్+అందున్= ఇహపరాలయందు; పూర్ణుఁడై= పరిపూర్ణతతో; మోదించున్= సంతోషించును; తన్నుమాని= తనకుమాలిన; చేఁత= పని; తగవుగాదు= పనికిరాదు (న్యాయం కాదు).

**తా :** ఇస్తానని చెప్పి ఇవ్వకపోతే వచ్చే నరకాన్ని త్రోసిపుచ్చడానికి నీవు సమర్థుడవుకావు. ఏ దానం చేయటంవల్ల హాని సంభవిస్తుందో అలాంటి దానం దానమే కాదని జ్ఞానులంటారు. దానం, యజ్ఞం, తపస్సు, కర్మం మొదలైనవాటిని భాగ్యవంతుడై ఉన్నపుడే చేయటానికి ఆలోచించాలి. తనకున్న ధనమంతా ఐదుభాగాలుగా చేసి ధర్మానికీ, అర్థానికీ, కామానికీ, కీర్తికీ, ఆశ్రితులకూ సమానంగా ఇచ్చేవాడు ఇహపర లోకాలలో సంతోషంగా ఉంటాడు. తనకుమాలిన ధర్మం పనికిరాదు.

**వ. అదియునుం గాక యీ యర్థంబునందు బహుభంగి బహ్వృచ గీతార్థంబు గల దొక్కటి సావధానుండవై యాకర్ణింపుము. 581**

**ప్రతి :** అదియునుంగాక= అంతే కాకుండా; ఈ అర్థంబునందున్= ఈ ప్రయోజనమున; బహుభంగి= పలువిధముల (ప్రసిద్ధమైన); బహ్వృచ గీతార్థంబు= ఋగ్వేదసూక్తి; ఒక్కటి= ఒకటి; కలదు= ఉంది; సావధానుండవై= అవధానంతో కూడినవాడవై; ఆకర్ణింపుము= విను.

**తా :** అంతేకాక ఈ విషయంలో పెక్కు విధాలుగా ప్రసిద్ధమైన ఒక ఋగ్వేదసూక్తి ఉంది. దానిని చెపుతాను శ్రద్ధగా విను.

**సీ. అంగీకరించిన నఖిలంబుఁబోవుచో నన్నృతంబు గాదు లే దనిన నధిప!**
**యాత్మ వృక్షము మూల మనృతంబు నిశ్చయ మనృతమూలము గల్గ నాత్మ సెడదు;**
**పుష్పఫలము లాత్మభూజంబునకు సత్య మా మ్రాను బ్రదుకమి నవియుఁజెడును**
**ఫలపుష్పములు లేక పససెడి వృక్షంబు మూలంబుతో వృద్ధిఁబొందుఁగాదె?**

**తే. చేటుఁగొఱఁతయు లఘిమయుఁజెందకుండ, నిచ్చు పురుషుండు సెడకుండు నిద్ధచరిత!**
**కాక యంచితసత్యసంగతి నటంచు, నిజధనంబర్థి కిచ్చిన నీకు లేదు. 582**

**ప్రతి :** అధిప= ఓ రాజా!; అంగీకరించినన్= ఇస్తానని ఒప్పుకొంటే; అఖిలంబున్= సర్వమునూ; పోవుచోన్= పోవునప్పుడు; లేదనినన్= ఒప్పుకొని లేదని చెప్పినా; న+ఋతంబుగాదు= అబద్ధం కాదు; ఆత్మ= దేహం అనే; వృక్షము= చెట్టునకు; మూలము= మొదలు; న+ఋతంబు= అసత్యము; నిశ్చయము= నిజము; న+ఋతమూలము గల్గన్= అసత్యమనే మొదలు కల్గినచో; ఆత్మ= దేహం; చెడదు= నశింపదు; సత్యము= యథార్థము; ఆత్మభూజంబునకున్= దేహం అనే చెట్టుకు; పుష్పఫలములు= పూలూపండ్లూ; ఆ మ్రానుబ్రదుకమి= ఆ మూలమగు అసత్యము నిలిచియుండినచో; అవియున్= పూలు, పండ్లు; చెడును= నశిస్తుంది; ఫలపుష్పములులేక= పండ్లునూ పూలునూ లేకుండా; వృక్షంబు= చెట్టు; పసచెడి= చేవలేనిదై; మూలంబుతోన్= మొదలుతో; వృద్ధిన్ పొందున్ కాదె= వృద్ధి పొందునుగదా!; చేటున్= కీడును; కొఱతయున్= హీనతయు; లఘిమయున్= తేలికదనమును; చెందకుండన్= పొందకుండా; ఇచ్చు= ఇచ్చునట్టి; పురుషుండు= మనుజుడు; ఇద్ధచరిత= ప్రకాశించే చరిత్రగలవాడా!; చెడకుండున్= నాశనముగాకుండును; కాక= అట్లుగాక; అంచిత= ఒప్పుచున్న;

సత్యసంగతిన్= సత్యం కోసం; అటంచున్= అనుకొంటూ; నిజధనంబు= తన ధనమును; అర్థికిచ్చినన్= యాచకున కొసగిన యెడల; నీకు లేదు= నీకేమీ ఉండదు.

**తా :** ఓ రాజా! ఏది ఇస్తే సర్వమూ నష్టమవుతుందో ఆ దానం ఇవ్వరాదు. ఇస్తానని మాట ఇచ్చినా సరే, దానివల్ల అసత్యదోషం అంటదు. ఎందుకంటే దేహం అనే చెట్టుకు అసత్యమే మూలం. అటువంటి దేహ వృక్షానికి సత్యం, పూలు పండ్లుగా ఉంటాయి. అసత్యం అనే మూలం బాగుంటే దేహం అనే వృక్షం చెడదు. మొదలు చెడితే చెట్టుకూడా చెడుతుంది. పూలూపండ్లూ చెడుతాయి. పండ్లూ, పూలూ లేకపోయినా మొదలు బాగా ఉంటే చెట్టుబాగా ఎదుగుతుంది. కాబట్టి మొదటికి చేటుకలుగకుండ, లోటురాకుండ, పదుగురిలో పలుచన కాకుండ దానం చేసేదాత చెడదు. అందువల్ల సత్యం కోసం నీవు ఇతనికి దానమిస్తే నీకు మిగిలేది ఇక ఏమీ ఉండదు.

**విశే :** శుక్రాచార్యుడు దానవ గురువు. కనుక, దానవకుల క్షేమాన్ని కోరినవాడుగా అసత్యమాడుమని ధర్మపన్నాలను చెప్పినాడు. పై పద్యంలోని శుక్రుని భావాలు వేదతత్త్వానికి వక్రభాష్యం. ఆత్మ అంటే దేహమని అర్థం. అది నిలపాలంటే అసత్యం పలకాలని శుక్రనీతి.

**ఆ. సర్వమయినచోట సర్వధనంబులు, నడుగ 'లే' దటంచు నన్నృతమాడు**
**చెనఁటి పంద నేమి సెప్పఁబ్రాణము తోడి, శవము వాఁడు! వాని జన్మమేల? 583**

**ప్రతి :** సర్వము= సమస్తమూ; అయినచోటన్= ఇచ్చేందుకు శక్తి కలిగినపుడు; సర్వధనంబులున్= సర్వభాగ్యాలున్నూ; అడుగన్= కోరగా; లేదటంచున్= లేదని; అనృతమాడు= అసత్యముపలుకునట్టి; చెనఁటిపందను= వట్టి దుర్మార్గుని; ఏమిచెప్పన్= చెప్పడానికేముంది?; వాఁడు= అలాంటివాడు; ప్రాణముతోడి శవము= ప్రాణమున్నశవము వంటివాడు; వానిజన్మము= వానిబ్రతుకు; ఏల= ఎందుకు?

**తా :** అన్ని విషయాలలో ఇది వర్తించదు. సమస్తమూ ఉన్నా అడిగిన వస్తువు లేదని అబద్ధం చెప్పరాదు. ఆ విధంగా చెప్పేవాడు నీచుడు, పిరికివాడు. వాడు ప్రాణమున్న శవం. వాని బ్రతుకు వ్యర్థం.

**వ. మఱియు నిందొక్క విశేషంబు గలదు; వివరించెద. 584**

**ప్రతి :** మఱియున్= ఇదే కాక; ఇందు= దీనిలో; విశేషంబు+కలదు= అతిశయమైనవిషయం ఉంది; వివరించెదన్= తెలియజేస్తాను.

**తా :** దీనిలో ఇంకో విశేషముంది. వివరిస్తాను.

**ఆ. వారిజాక్షులందు వైవాహికములందుఁ, బ్రాణవిత్తమానభంగమందుఁ**
**జకితగోకులాగ్రజన్మరక్షణమందు, బొంకవచ్చు నఘము వొందఁ దధిప! 585**

**ప్రతి :** అధిప= రాజా!; వారిజాక్షులందు= స్త్రీలవిషయంలో; వైవాహికములందున్= వివాహవిషయాలలో; ప్రాణ= ప్రాణములయొక్కయూ; విత్త= ధనముయొక్కయూ; మాన= గౌరవం యొక్కయూ; భంగమందున్= హాని జరిగే విషయంలో; చకిత= భయపడిన; గోకుల= ఆవుల; అగ్రజన్మ= బ్రాహ్మణుల; రక్షణమందున్= కాపాడే విషయంలో; బొంక వచ్చున్= అసత్యమాడవచ్చు; అఘము+పొందఁడు= పాపం పొందడు.

**తా :** రాజా! ఆడవాళ్ల విషయంలోను, పెళ్లిళ్ల విషయంలోను, ప్రాణ ధన మానాలకు హాని వాటిల్లినప్పుడూ, భయపడిన గోవులనూ, బ్రాహ్మణులనూ ఆదుకొనేటప్పుడు అబద్ధం ఆడవచ్చు, పాపం రాదు.

**మ. కులమున్ రాజ్యముఁదేజమున్ నిలుపు మీ కుబ్జుండు విశ్వంభరుం**
**దలఁతింబోఁడు; త్రివిక్రమస్ఫురణవాఁడై నిండు బ్రహ్మాండముం;**
**గలఁడే మాన్ప నొకండు? నా పలుకు లాకర్ణింపు కర్ణంబులన్;**
**వల దీ దానము గీనముం; బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా! 586**

**ప్రతి :** వదాన్య+ఉత్తమా= దాతలలో ఉత్తముడా!; కులమున్= వంశం; రాజ్యమున్= రాజ్యం; తేజమున్= ప్రతాపం; నిలుపుము= నిలుపుకో; ఈ కుబ్జుండు= ఈ వామనుడు; విశ్వంభరుండు= ప్రపంచాన్ని భరించే విష్ణువు; అలఁతిన్+పోఁడు= కొంచెంతో వెళ్లడు; త్రివిక్రమస్ఫురణవాఁడై= మూడులోకాలను ఆక్రమించగలవాడై; బ్రహ్మాండమున్= బ్రహ్మాండమంతా; నిండున్= నిండుతాడు (విశ్వరూపాన్ని ధరిస్తాడన్నమాట); మాన్పన్= వారించడానికి; ఒకండు= ఒక్కడుకూడా; కలఁడే= ఉన్నాడా?; కర్ణంబులన్= చెవులతో; నా పలుకులు= నా మాటలు; ఆకర్ణింపు= విను; ఈ దానము+గీనమున్= ఈ దాతృత్వం ఎంత మాత్రమూ (గీనం అంటే నిందార్థకం); వలదు= తగదు; వర్ణిన్= బ్రహ్మచారిని; పనుపుమా= పంపివేయుమా.

**తా :** ఉత్తమదాతా! కులాన్ని రాజ్యాన్ని పరాక్రమాన్ని నిలుపుకో. ఈ వామనుడు ప్రపంచాన్నంతా భరించేవాడు. కొంచెంతో పోయేవాడుకాదు. త్రివిక్రముడై బ్రహ్మాండాన్నంతా ఆక్రమిస్తాడు. ఇతనిని ఒక్కడుకూడా అడ్డగించలేడు. నా మాటవిని ఈ దానం చేయవద్దు. ఈ బ్రహ్మచారిని పంపించివేయి.

**వ. అని యిట్లు హితంబు పలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్ర నిమీలితలోచనుండయి యశస్వి యిట్లనియె. 587**

**ప్రతి :** అని; ఇట్లు= ఈ విధంగా; హితంబు= మేలును; పలుకుచున్న= బోధిస్తున్న; కుల+ఆచార్యునకున్= కులగురువయిన శుక్రాచార్యునకు; క్షణమాత్ర= క్షణకాలం; నిమీలిత= మూయబడిన; లోచనుండు+అయి= కన్నులుకలవాడయి; యశస్వి= కీర్తిగల బలి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికినాడు.

**తా :** ఈ విధంగా శుక్రాచార్యుడు మేలుకోరి చెప్పగా క్షణకాలం కన్నులుమూసి ఆలోచించి యశస్వి అయిన బలిచక్రవర్తి ఇలా అన్నాడు.

**సీ. నిజ మాన తిచ్చితి నీవు మహాత్మక! మహిని గృహస్థధర్మంబు నిదియ**
**యర్థంబుఁ గామంబు యశమును వృత్తియు నెయ్యది ప్రార్థింప నిత్తు ననియు**
**నర్థలోభంబున నర్థిఁ బొమ్మను టెట్లు? పలికి లేదనుకంటెఁ బాప మెద్ది?**
**'యెట్టి దుష్కర్ముని నే భరించెదఁగాని సత్యహీనుని మోవఁజాల' ననుచుఁ**

**తే. బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ, సమరముననుండి తిరుగకచచ్చుకంటెఁ**
**బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె, మానధనులకు భద్రంబు మఱియుఁగలదె! 588**

**ప్రతి :** మహాత్మక= ఓ మహానుభావా!; నీవు; నిజము+ఆనతిచ్చితి= సత్యం చెప్పినావు; మహినిన్= భూమిపై; గృహస్థ ధర్మంబున్= గృహస్థుని యొక్క ధర్మమునూ; ఇదియ= ఇదే; అర్థంబున్= ధనమునూ; కామంబున్= కోరికనూ; యశమును= కీర్తినీ; వృత్తియున్= జీవనోపాధినీ; ఎయ్యది ప్రార్థింపన్= ఏదికోరినా; ఇత్తున్+అనియు= ఇస్తానని చెప్పి; అర్థలోభంబునన్= ద్రవ్య మందలి లుబ్ధత్వాన; అర్థిన్= యాచకుని; పొమ్మనుట ఎట్లు= ఎలా పొమ్మనగలను?; పలికి= ఇస్తానని చెప్పి; లేదను కంటెన్= లేదని చెప్పటంకంటె; పాపము+ఎద్ది= దోషం మరొకటి ఉంటుందా?; ఎట్టి దుష్కర్మున్+ఏన్= ఎలాంటి చెడ్డపనులు చేసే వాడినైనా; భరించెదన్+కాని= భరిస్తానుకానీ; సత్యహీనునిన్= అసత్యం ఆడేవానిని; మోవన్+చాలను= మోయలేను (భరించలేను); అనుచున్= అంటూ; తొల్లి= పూర్వం; భూదేవి= భూమి; బ్రహ్మతోడన్= విధాతతో; పలుకదే= చెప్పలేదా?; సమరముననుండి= యుద్ధంనుండి; తిరుగక= వెనుదిరుగక (పారిపోక); చచ్చు కంటెన్= చావటానికన్నా; పలికి= చెప్పి; బొంకక= అబద్ధమాడక; నిజముననన్= సత్యముగ; పరఁగుకంటెన్= వర్తించటంకన్నా; మానధనులకు= అభిమానమే ధనముగా గలవారికి; భద్రంబు= క్షేమం; మఱియున్ కలదె= ఇంకొకటి ఉందా?

**తా :** ఓ మహానుభావా! నీవు నిజం చెప్పినావు. గృహస్థధర్మం ఇదే. ధనం, కోరిక, కీర్తి, జీవనోపాధి, వీటిలో ఏది కోరినా కూడా ఇస్తానని చెప్పినాను. ద్రవ్యలోభంతో యాచకునికి లేదని చెప్పి తిప్పిపంపలేను. ఇచ్చినమాట తప్పటంకంటె పాపంలేదు. పూర్వం భూదేవి 'ఎలాంటి చెడ్డపని చేసినవానినైనా మోస్తాను, కానీ ఆడిన మాటను తప్పిన వానిని మాత్రం మోయలేను' అని బ్రహ్మతో చెప్పిందికదా! రణంలో వెనుకంజవేయక ప్రాణాలు విడువటం, మాటకు కట్టుబడి సత్యంతో బ్రతకటమూ మానధనులకు మేలైన మార్గాలు.

**క.** **ధాత్రిని హలికునకును సు, క్షేత్రము బీజములు నొకటఁజేకుఱుభంగిం**
**జిత్రముగ దాత కీవియుఁ, బాత్రము సమకూరునట్టి భాగ్యము గలదే?** **589**

**ప్రతి :** ధాత్రిని= భూమియందు; హలికునకును= వ్యవసాయము చేయువానికి; సుక్షేత్రము= మంచిపొలం; బీజములున్= విత్తనాలు; ఒకటన్= ఒకచోట; చేకుఱుభంగిన్= లభించునట్లు; చిత్రముగన్= అద్భుతంగా; దాతకు= దానంచేసే వానికి; ఈవియున్= దాతృత్వమును; పాత్రమున్= తగినవాడును (దానం గ్రహించేందుకు తగినవాడు); సమకూరునట్టి= సంప్రాప్తించునట్టి; భాగ్యము= సంపద; కలదే= ఉందా?

**తా :** వ్యవసాయదారునికి మంచిపొలం, మంచి విత్తనాలు, ఒకేచోట దొరికినట్లుగా దాతకు తగిన ధనమూ, దానిని దానంగా గ్రహించే యోగ్యుడూ సమకూరటం అనే భాగ్యం ఉంటుందా?

**శా.** **కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతింబొందరే?**
**వారేరీ సిరి మూట గట్టుకొని పోవంజాలిరే? భూమి పైఁ**
**బేరైనంగలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై**
**యీరే కోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!** **590**

**ప్రతి :** భార్గవా= శుక్రాచార్యా!; కారేరాజులు= రాజులగుటలేదా?; రాజ్యముల్ గలుగవే= రాజ్యాలు కలుగుటలేదా?; గర్వ+ఉన్నతిన్= గర్వముయొక్క అతిశయమును; పొందరే= పొందరా?; వారుఏరీ= అట్టివారు ఎక్కడున్నారు?; సిరిన్= సంపదను; మూటన్+కట్టుకొని= మూటకట్టుకొని; పోవన్+చాలిరే= పోగలిగినారా?; భూమిపైన్= ధాత్రిమీద;

పేరైనన్+కలదే= వారి పేరయినా ఉన్నదా?; శిబిప్రముఖులున్= శిబిచక్రవర్తి మొదలయినవారు; ప్రీతిన్= ప్రేమతో; యశఃకాములై= కీర్తిని కోరినవారై; కోర్కులు= కోరికలను; ఈరే= తీర్చరా?; వారలన్= అలాంటివారిని; ఈ+కాలమున్= ఇప్పుడుకూడా; మఱచిరే= మరచిపోయినారా?

**తా :** శుక్రాచార్యా! రాజులులేరా? రాజ్యాలు లేవా? వారు అతిశయమయిన గర్వాన్ని పొందలేదా? అలాంటివారు ఎక్కడ ఉన్నారు?, వారు సంపదను మూటకట్టుకొని పోయినారా? భూమిమీద వారి పేరైనా ఉందా? శిబిచక్రవర్తి మొదలయినవారు కీర్తికోసం యాచకుల కోర్కెలను తీర్చలేదా? అలాంటి వారిని ఇప్పుడు కూడా జనులు మరచిపోలేదుకదా?

**క. ఉడుగని క్రతువుల వ్రతములఁ, బొడగనఁజననట్టి పొడవు పొడవునఁగుఱుచై**
**యడిగెడినఁట; ననుబోఁటికి, నిడరాదె మహానుభావ! యిష్టార్థంబుల్. 591**

**ప్రతి :** మహానుభావ= మహాత్మా!; ఉడుగని= విరమించనట్టి; క్రతువులన్= యజ్ఞాలయందు; తపములన్= తపస్సులయందు; పొడగనన్= చూచుటకు; చననట్టి= తగని; పొడవు= గొప్పవాడు; పొడవునన్= గొప్పతనమందు; కుఱుచై= తక్కువవాడై; అడిగెడిన్+అఁట= యాచించుచున్నాడట; ననుబోఁటికిన్= నా వంటివానికి; ఇష్ట+అర్థంబుల్= కోరినకోరికలను; ఇడరాదె= ఈయకూడదా?

**తా :** మహాత్మా! ఎడతెగని యజ్ఞాలు చేయటంచేత, తపస్సులు చేయటంచేతకూడా చూచేందుకు వీలుకాని గొప్పవాడయిన విష్ణువు ఆకృతియందు చిన్నవాడై నన్ను యాచిస్తున్నాడు. కనుక ఆయన కోరిన దానిని ఇవ్వటంకంటె నావంటి వానికి ఇంకేం కావాలి?

**శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ, దనువుపై, నంసోత్తరీయంబుపైఁ**
**బాదాబ్జంబులపైఁగపోలతటిపైఁబాలిండ్లపై నూత్న మ**
**ర్యాదంజెందు కరంబు గ్రిందగుట మీఁదై నా కరంబుంట మేల్**
**గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు నాపాయమే? 592**

**ప్రతి :** ఆదిన్= పూర్వమందు (మొదట); శ్రీసతికొప్పుపైన్= లక్ష్మియొక్క కొప్పుమీదా; తనువుపైన్= శరీరంమీదా; అంస= భుజంమీద ఉన్న; ఉత్తరీయంబుపైన్= పైటమీదా; పాద+అబ్జంబులపైన్= చరణకమలాలమీదా; కపోలతటిపైన్= చెక్కిళ్ల భాగంమీదా; నూత్నమర్యాదన్= కొత్తగౌరవాన్ని; చెందు= పొందునట్టి; కరంబు= విష్ణువుహస్తం; క్రిందగుట= కిందై ఉండటం (యాచించేవాని చేయి కిందుగా ఉంటుంది); నా కరంబు= నా చేయి; మీఁదై+ఉంట= మీదుగా ఉండటం (ఇచ్చేవాని చేయి మీదుగా ఉంటుంది); మేల్+కాదే= మంచిదికాదా?; రాజ్యముగీజ్యమున్= రాజ్యమూగీజ్యమూ; సతతమే= శాశ్వతమా?; కాయంబు= శరీరం; న+అపాయమే= అపాయాన్ని చెందకుండా ఉంటుందా?

**తా :** విష్ణువంతటివాడు చెయ్యిచాచి అడుగుతున్నాడు. ఆ చెయ్యి ఎంతోగొప్పది. మొదట లక్ష్మీదేవి కొప్పుపైన, శరీరంపైనా, భుజంపై ఉండే పైటపైన, పదపద్మాలపైన, చెక్కిళ్లపైన, పాలిండ్లపైన సరికొత్త గౌరవాన్ని పొందే ఆ చెయ్యి కిందుగా ఉండటం, నా చేయి మీదుగా ఉండటం మంచిదికాదా? ఈ రాజ్యం గీజ్యం శాశ్వతమా? శరీరం స్థిరంగా ఉంటుందా?

**మ. నిరయంబైన, నిబద్ధమైన, ధరణీనిర్మూలనంబైన, దు**
**ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము; కానిమ్ము పో;**

**హరుఁడైనన్, హరియైన,నీరజభవుం డభ్యాగతుండైన నౌఁ;**
**దిరుగన్ నేరదు నాదు జిహ్వ; వినుమా! ధీవర్య! వేయేటికిన్? 593**

**ప్రతి :** నిరయంబు+ఐనన్= నరకమైనా; నిబద్ధము+ఐనన్= బంధనం ప్రాప్తమైనా; ధరణీనిర్మూలనంబు+ఐనన్= భూమి అంతా నశించినా; దుర్మరణంబు+ఐనన్= దుర్మరణం వచ్చినా; కులాంతము+ఐనన్= వంశనాశనమైనా; నిజమున్= సత్యమునే; రానిమ్ము= జరుగనిమ్ము; కానిమ్ముపో= ఏమైనా అగునుగాక!; హరుఁడైనన్= శంకరుడైనా; హరియైనన్= విష్ణువైనా!; నీరజభవుండు= బ్రహ్మదేవుడైనా; అభ్యాగతుండైనన్= అతిథిగా వచ్చినా; ఔన్= అగుగాక; ధీవర్య= పండిత శ్రేష్ఠా! వేయి+ఏటికిన్= వేయిమాట లెందుకు?; నాదుజిహ్వ= నా నాలుక; తిరుగన్+నేరదు= తిరుగనేరదు; వినుమా= వినుము.

**తా :** ఓ ధీమణీ! నరకమైనా, చెర అయినా; భూమి అంతా నశించినా, దుర్మరణం సంభవించినా; వంశనాశనమైనా, జరుగవలసింది జరుగుతుంది, జరుగనీ! భయంలేదు. అభ్యాగతుడు శివుడైనా, విష్ణువైనా, బ్రహ్మదేవుడైనా, ఎవరైనా సరే! ఏమైనా సరే! వేయిమాటలెందుకు? నా నాలుకకు ఇవ్వననే మాట రాదు.

**ఆ. నొడివినంత పట్టు నుసలక యిచ్చుచో, నేల కట్టు విష్ణుఁ డేటి మాట?**
**గట్టెనేనిఁదాన కరుణించి విడుచును, విడువకుండనిమ్ము విమలచరిత! 594**

**ప్రతి :** విమలచరిత= స్వచ్ఛమైనచరిత్ర కలవాడా!; నొడివినంతపట్టున్= ఇస్తానని చెప్పినదంతా; నుసలక= ఆలస్యంచేయక; ఇచ్చుచోన్= ఇచ్చినపుడు; విష్ణుఁడు= హరి; ఏల కట్టున్= ఎందుకు బంధిస్తాడు?; ఏటిమాట= అది ఏమి మాట; కట్టెనేనిన్= ఒకవేళ కట్టినను (బంధించినా); తాన= తనంతటతానే; కరుణించి= దయచూపి; విడుచును= వదలిపెడతాడు; విడువక+ఉండనిమ్ము= వదలిపెట్టకుండా కూడా ఉండనీ...

**తా :** స్వచ్ఛమైనచరిత్రకలవాడా! అన్నమాట ప్రకారం ఆలస్యం చేయక ఇస్తానని చెప్పిన దానమిస్తే శ్రీహరి ఎందుకు బంధిస్తాడు? ఇది ఎక్కడిమాట! ఒకవేళ బంధించినా తనంత తానే కరుణించి విడిచిపెడతాడు. వదలిపెట్టకున్నా సరే!

**క. మేరువు దలక్రిందైనను, బారావారంబు లింకఁబాటిన లోలో**
**ధారుణి రజమై పోయినఁ, దారాధ్వము బద్ధమైనఁదప్పక యిత్తున్. 595**

**ప్రతి :** మేరువు= మేరుపర్వతం; తలక్రిందు+ఐనను= తిరుగబడినా; పారావారంబు= సముద్రం; ఇంకన్+పాటినన్= ఇంకిపోయినా; లోలోన్= లోపలలోపల; ధారుణి= భూమి; రజమైపోయినన్= పిండియైపోయినా; తారా+అధ్వము= నక్షత్రమార్గం; బద్ధమైనన్= బంధింపబడినా సరే; తప్పక ఇత్తున్= తప్పకుండ ఇస్తాను.

**తా :** మేరుపర్వతం తలకిందులైనా, సముద్రం ఇంకి పోయినా, భూమి పొడియైపోయినా, నక్షత్రమార్గం గతి తప్పినా తప్పకుండా ఈ దానాన్ని ఇస్తాను.

**మత్తకోకిలము.**

**ఎన్నఁడుం బరు వేడఁబోఁడఁట! యేకలుండఁట! కన్న వా**
**రన్నదమ్ములు నైన లేరఁట; యన్నివిద్యల మూల గో**

**ష్ఠి న్నెఱింగిన ప్రోడ గుజ్జఁట; చేతు లొగ్గి వసింప నీ**
**చిన్ని పాపనిఁద్రోసి పుచ్చఁగఁజిత్త మొల్లదు సత్తమా! 596**

**ప్రతి :** సత్తమా= మంచివాడా!; ఎన్నఁడున్= ఎప్పుడూ; పరున్= ఇతరుని; వేఁడన్‌పోఁడు+అట= కోరుటకు వెళ్లడట; ఏకలుండు+అఁట= అసహాయుడట; కన్నవారు= తలిదండ్రులు; అన్నదమ్ములున్+ఐనన్= అన్నలూతమ్ములూ అయినా; లేరఁట= కూడా లేరట; అన్నివిద్యల= సమస్త విద్యలయొక్క; మూలగోష్ఠిన్= ముఖ్యప్రసంగాన్ని; ఎఱింగిన= తెలిసినట్టి; ప్రోడ= ప్రౌఢత్వముగల; గుజ్జఁట= వామనుడట; చేతులొగ్గి= చేతులుపట్టి; వసింపన్= నిలువగా; ఈ చిన్నిపాపనిన్= ఈ ముద్దుబాలకుని; త్రోసిపుచ్చగన్= పొమ్మనుటకు; చిత్తము= బుద్ధి; ఒల్లదు= ఒప్పుకోదు.

**తా :** పూజ్యుడా! ఈ వామనుడు ఎప్పుడూ ఇతరులను వేడడట. సాయంలేనివాడట. తలిదండ్రులూ అన్నదమ్ములూ లేనివాడట. అన్ని విద్యల మూలాన్ని తెలుసుకున్న నేర్పరియట. నా ముందు చేతులొగ్గి నిలువగా ఈ ముద్దు బాలుని పొమ్మనేందుకు బుద్ధిపుట్టటంలేదు.

**విశే :** ఇది వామనుని సామాన్య సాధారణ పరిస్థితిగా కనిపించినాకూడా నిదానించి పరికిస్తే ఇది పరమాత్ముని లక్షణాలను చెప్పిన పద్యం.

**వ. అని యిట్లు సత్య పదవీ ప్రమాణ తత్పరుండును, వితరణ కుతూహల సత్వరుండును, విమల యశస్కుండును, దృఢమనస్కుండును, నియతసత్యసంధుండును, నర్థిజనబంధుండును నైన బలిం జూచి శుక్రుండు గోపించి మదీయ శాసనం బతిక్రమించితివి గావున శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవు గమ్మని శాపం బిచ్చె; బలియును గురుశాప తప్తుండయ్యు ననృతమార్గంబున కభిముఖుండు గాకుండె; నప్పుడు. 597**

**ప్రతి :** అని; ఇట్లు= ఈ విధంగా; సత్యపదవీ= సత్యపదవియొక్క; ప్రమాణ= మేరయందు; తత్పరుండును= ఆసక్తికలవాడూ; వితరణ= దానము చేయడంలో; కుతూహల= సంతోషమునందు; సత్వరుండును= వేగముగలవాడూ; విమల= నిర్మలమైన; యశస్కుండును= కీర్తిగలవాడూ; దృఢ= గట్టియైన; మనస్కుండును= మనస్సుకలవాడూ; నియత= నిత్యమూ; సత్య= సత్యవ్రతంతో; సంధుండును= కూడు కొనినవాడూ; అర్థిజన= యాచకజనులకు; బంధుండును= బంధువూ; ఐన= అయినట్టి; బలిన్+చూచి= బలిచక్రవర్తిని వీక్షించి; శుక్రుండు= దైత్యగురువగు శుక్రాచార్యుడు; కోపించి; మదీయ= నా యొక్క; శాసనంబున్= ఆజ్ఞను; అతిక్రమించితివి+కావున= మీరినావు కాబట్టి; శీఘ్రకాలంబునన్= స్వల్ప కాలంలో; పదభ్రష్టుండవు= స్థానమునుండి (ఇంద్ర పదవినుండి) తొలగినవాడవు; కమ్ము+అని= అగుమని; శాపంబు+ఇచ్చెన్= శపించినాడు; బలియును= బలిచక్రవర్తికూడా; గురు= గురువుయొక్క; శాప= శాపంచే; తప్తుండు+అయ్యున్= తపించినవాడు అయికూడా; అనృతమార్గంబునకున్= అసత్యమార్గానికి; అభిముఖుండుగాక= ఎదురుగాక; ఉండెన్= ఉండెను; అప్పుడు= ఆ సమయాన.

**తా :** పై రీతిగా పలికిన బలిచక్రవర్తి సత్యమార్గం నుంచి చలించలేదు. ఆ మార్గంనుండి ఆయనను మార్చడానికి వీలుకాదు. అతని మనస్సు దృఢమైంది. కీర్తి నిర్మలమైంది. ఆయన దానం అడిగేవారికి సమీపబంధువు. అతడు వామనునికి దానమిచ్చే కుతూహలంతో తహతహలాడటం చూచి అతనిపై శుక్రాచార్యుడు కోపపడినాడు. 'నా ఆనతిని మీరినావు. కనుక త్వరలో పదభ్రష్టుడవైపోతావు' అని శపించినాడు. గురువు శాపానికి గురిఅయికూడా బలిచక్రవర్తి బాధపడలేదు. ఆయన అసత్యమార్గాన్ని అవలంబించలేదు.

**ఆ. బ్రదుకవచ్చుఁగాక బహుబంధనములైన, వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక**
**జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక, మాటఁదిరుగలేరు మానధనులు. 598**

**ప్రతి :** బ్రదుకవచ్చున్ కాక= ఎలాగో జీవించవచ్చుకానీ; బహుబంధనములైనన్= ఎన్ని బంధనాలు వచ్చినా; వచ్చున్కాక= వచ్చునుగానీ; లేమివచ్చున్కాక= దారిద్ర్యంవచ్చునుకాక; జీవధనములైనన్= ప్రాణమూ ధనమూ అయినా; చెడున్కాక= చెడిపోవు గాక; పడున్+కాక= పతనమగునుగాక; మానధనులు= అభిమానమే ధనముగా కలవారు; మాటన్ తిరుగలేరు= అనినమాటను తప్పలేరు.

**తా :** బాగా బతికినా, బాగా కష్టాలకు గురైనా, బీదతనం వచ్చినా, ప్రాణానికీ ధనానికీ చేటు వచ్చినా, చివరకు చావే సంభవించినాకూడా మానధనులు మాట తప్పలేరు.

**వ. అ య్యవసరంబున. 599**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయాన

**ఆ. దనుజలోకనాథు దయిత వింధ్యావళి, రాజవదన మదమరాళగమన**
**వటుని కాళ్లు గడుగ వరహేమఘటమున, జలముఁదెచ్చె భర్త సన్న యెఱిఁగి. 600**

**ప్రతి :** రాజవదన= చంద్రునివంటి ముఖముకలదీ; మద= మదించిన; మరాళగమన= హంసనడకలవంటి నడకకలదీ; దనుజలోకనాథు= రాక్షసరాజయిన బలిచక్రవర్తియొక్క; దయిత= భార్య; వింధ్యావళి= వింధ్యావళి అనే పేరుగల ఆమె; వటుని= బ్రహ్మచారియొక్క; కాళ్లుగడుగన్= పాదాలను కడుగుటకు; భర్త= పెనిమిటియొక్క; సన్నయెఱిఁగి= సంజ్ఞను తెలిసికొని; వర= శ్రేష్ఠమైన; హేమఘటమునన్= బంగారు కలశముతో; జలమున్+తెచ్చెన్= ఉదకమును తీసుకొని వచ్చింది.

**తా :** బలిచక్రవర్తిభార్య వింధ్యావళి పెనిమిటి చేసిన సంజ్ఞను తెలిసికొని బ్రహ్మచారిపాదాలు కడుగుటకు బంగారు కలశంతో నీళ్లు తెచ్చింది.

**వ. అయ్యవసరంబునఁ గపటవటునకు నద్దానవేంద్రుం డిట్లనియె. 601**

**ప్రతి :** ఆ+ఆవసరంబునన్= ఆ సమయంలో; కపటవటునకున్= టక్కరి బ్రహ్మచారికి; ఆ+దానవేంద్రుండు= ఆ రాక్షసరాజు (బలి); ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అపుడు వామనునితో బలిచక్రవర్తి ఇలా అన్నాడు.

**క. రమ్మా! మాణవకోత్తమ!, లెమ్మా! నీ వాంఛితంబు లేదన కిత్తుం**
**దెమ్మా యడుగుల నిటు రా, నిమ్మా కడుగంగవలయు నేఁటికిఁదడయన్? 602**

**ప్రతి :** మాణవక+ఉత్తమ!= బాలకులలో ఉత్తముడా!; రమ్మా= రమ్ము; లెమ్మా!= లెమ్ము; నీ వాంఛితంబున్= నీ కోరికను; లేదనక ఇత్తున్= లేదనకుండా ఇస్తాను; అడుగులన్= పాదాలను; తెమ్మా!= తెమ్ము; ఇటు= ఈ వైపునకు; రానిమ్మా= రానిమ్ము; కడుగంగన్ వలయున్= కడుగవలెను; తడయన్ ఏఁటికిన్= ఆలస్యం చేయటం ఎందుకు?

**తా :** బాలకశ్రేష్ఠుడా! రమ్ము! లెమ్ము! నీ కోరికను లేదనకుండా ఇస్తాను. నీ పాదాలు కడుగనిమ్ము. ఇక ఆలస్యం చేయటం ఎందుకు?

**వ. అనిన విని. 603**

**ప్రతి :** అనినన్= అట్లుపలుకగా; విని= ఆలకించి.

**మ. బలిదైత్యేంద్రకరద్వయీకృతజలప్రక్షాళనవ్యాప్తికిన్**
**జలజాతాక్షుఁడు సాఁచె యోగిసుమనస్సంప్రార్థితశ్రీదముం**
**గలితానమ్రరమాలలాటపదవీకస్తూరికాశాదమున్**
**నళినామోదము రత్ననూపురితనానావేదముం బాదమున్. 604**

**ప్రతి :** బలి= బలి అనే పేరుగల; దైత్యేంద్ర= రాక్షసశ్రేష్ఠునియొక్క; కరద్వయీ= రెండుచేతులచేత; కృత= చేయబడిన; జల ప్రక్షాళన= నీటిలో కడుగుట అనే; వ్యాప్తికిన్= వ్యాపకానికి; జలజాతాక్షుఁడు= పద్మములవంటి నేత్రములుగల వామనుడు; యోగి= మునీశ్వరులచేత; సుమనస్= దేవతలచే; సంప్రార్థిత= మిక్కిలి ప్రార్థించబడిన; శ్రీదమున్= సంపదను ప్రసాదించునది; కలిత= కూడుకొనిన; ఆనమ్ర= వంగిన; రమా= లక్ష్మియొక్క; లలాట పదవీ= నొసటియందలి; కస్తూరికా= కస్తూరియొక్క; శాదమున్= బురదకలది; నళిన+ఆమోదమున్= పద్మముల పరిమళం వంటి పరిమళం కలది; రత్ననూపురిత= మణులతో చెక్కబడిన కాలి అందెగా చేయబడిన; నానా= సమస్తమయిన; వేదమున్= వేదములు కలదియును అగు; పాదమున్= కాలిని (పదమును); చాఁచెన్= చాపినాడు.

**తా :** బలిచక్రవర్తి తన రెండు చేతులతోనూ కడగడానికి అనుకూలంగా వామనుడు తన పాదాన్ని చాచినాడు. ఆ పాదం మునులచే, దేవతలచే ప్రార్థించబడునది, సంపద నిచ్చునది, లక్ష్మీదేవి నొసటి కస్తూరి బురదతో కూడినది, పద్మంవలె పరిమళాన్ని వెదజల్లేది, రత్నాల అందెగా చేయబడిన వేదాలుకలది.

**క. సురలోకసముద్ధరణము, నిరత శ్రీకరుణ మఖిలనిగమాంతాలం**
**కరణము భవసంహరణము, హరిచరణము నీటఁగడిగె నసురోత్తముఁడున్. 605**

**ప్రతి :** సురలోక= దేవలోకాన్ని; సముద్ధరణము= ఉద్ధరించునదీ; నిరత= ఎల్లకాలమూ; శ్రీకరణము= సంపత్తును కలుగచేసేదీ; అఖిల= సమస్తమయిన; నిగమాంత= ఉపనిషత్తులకు; అలంకరణము= భూషణమైనదీ; భవ= భవబంధాలను; సంహరణము= పోగొట్టునదీ; అగు; హరిచరణమున్= విష్ణుమూర్తి పాదాన్ని; అసురోత్తముఁడున్= బలిచక్రవర్తి; నీటన్= ఉదకంచే; కడిగెన్= కడిగినాడు.

**తా :** దేవలోకాన్ని కాపాడేదీ, నిత్యం సంపత్తును కలుగచేసేదీ, సర్వోపనిషత్తులకూ భూషణమైనదీ, భవబంధాలను పోగొట్టేదీ అయిన హరిచరణాన్ని బలిచక్రవర్తి కడిగినాడు.

**వ. ఇట్లు ధరణీసుర దక్షిణ చరణ ప్రక్షాళనంబు సేసి వామపాదంబు గడిగి తత్పావన జలంబు శిరంబునం జల్లుకొని వార్చి దేశకాలాదిపరిగణనంబు సేసి. 606**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ధరణీసుర= బ్రాహ్మణునియొక్క; దక్షిణచరణప్రక్షాళనంబుచేసి= కుడికాలుకడిగి; వామపాదంబున్‌కడిగి= ఎడమకాలుకడిగి; తద్+పావనజలంబు= ఆ పవిత్రోదకాన్ని; శిరంబునన్= తలపై; చల్లుకొని= ప్రోక్షించుకొని; వార్చి= ఆచమనంచేసి; దేశ= దేశంయొక్క; కాల= వేళయొక్క; పరిగణనంబుచేసి= లెక్కించి (ఎన్ని)...

**తా :** ఈ విధంగా వామనుని కుడిఎడమ పాదాలను బలిచక్రవర్తి కడిగినాడు. పవిత్రమైన ఆ జలాలను నెత్తిపై చల్లుకొన్నాడు. ఆచమించినాడు. దేశమూ కాలమూ మొదలయినవాటిని లెక్కించినాడు (సంకల్పం చెప్పినాడన్నమాట).

**కా.** **'విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే**
**దప్రామాణ్యవిదే త్రిపాదధరణీం దాస్యామి' యంచుం గ్రియా**
**క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం జేసాఁచి పూజించి' బ్ర**
**హ్మప్రీత' మ్మని ధారవోసె భువనంబాశ్చర్యముంబొందఁగన్.** **607**

**ప్రతి :** విష్ణుస్వరూపాయ= విష్ణుస్వరూపుడైనట్టి; ప్రకటవ్రతాయ= ప్రకటమైన వ్రతము కలిగినట్టి; వేదప్రామాణ్యవిదే= వేదంయొక్క ప్రామాణ్యం తెలిసినవానికి; విప్రాయ= బ్రాహ్మణుడవైనట్టి; భవతే= నీ కొరకు; త్రిపాదధరణీమ్= మూడడుగులనేలను; దాస్యామి= ఇస్తున్నాను; అంచున్= అంటూ; క్రియాక్షిప్రుండై= పనియందు త్వర (తొందర) కలవాడై; దనుజేశ్వరుండు= బలిచక్రవర్తి; వడుగున్= బ్రహ్మచారిని; చేసాఁచి= హస్తాన్ని చాచినవాడై; పూజించి= పూజచేసి; బ్రహ్మప్రీతమ్+అని= బ్రహ్మము ప్రీతి చెందుగాక అంటూ; భువనంబు= ప్రపంచం; ఆశ్చర్యమున్+పొందగన్= అబ్బురపడగా; ధార+పోసెన్= ధారవోసినాడు.

**తా :** 'విష్ణుస్వరూపుడవూ, ప్రకటమయిన వ్రతం కలవాడవూ, వేదప్రామాణ్యం తెలిసినవాడవూ, బ్రాహ్మణుడవూ అయిన నీకు మూడడుగుల భూమిని ఇస్తున్నాను' అంటూ బ్రహ్మచారి అయిన వామనుని చేయి సాచి పూజించి 'పరబ్రహ్మ ప్రీతికై ఇస్తున్నాను' అని ప్రపంచమంతా ఆశ్చర్యం చెందేటట్లుగా ధారవోసినాడు.

**వ.** **తత్కాలంబున.** **608**

**ప్రతి :** తత్= ఆ; కాలంబునన్= సమయమందు.

**ఆ.** **నీరధారఁబడఁగనీక యడ్డంబుగాఁ, గలశరంధ్ర మాఁపఁగాను దెలిసి**
**హరియుఁగావ్యనేత్ర మటఁగుశాగ్రంబున, నడువ నేకనేత్రుఁడయ్యె నతఁడు.** **609**

**ప్రతి :** నీరధారన్= నీటిధారను; పడఁగన్+ఈక= పడనీయక; అడ్డంబుగాన్= అడ్డంగా; కలశరంధ్రము+ఆపఁగాను= జలకలశరంధ్రమును ఆపగా; హరియున్= విష్ణుమూర్తి; తెలిసి= తెలిసికొని; అటన్= ఆ సమయాన; కుశ+అగ్రంబునన్= దర్భకొనచే; కావ్యనేత్రము= శుక్రాచార్యునికంటిని; అడువన్= పొడువగా; అతఁడు= ఆ శుక్రాచార్యుడు; ఏకనేత్రుఁడు+అయ్యెన్= ఒంటికన్ను కలవాడయ్యెను.

**తా :** నీటిధార పడకుండా శుక్రాచార్యుడు కలశం రంధ్రానికి అడ్డుపడి ఆపినాడు. ఆ సంగతి తెలిసిన వామనుడు దర్భకొనతో పొడిచినాడు. దానివల్ల శుక్రునికి దర్భకొన కంటిలోగుచ్చుకొంది. శుక్రుడు ఒక కన్నువాడైనాడు.

**వ.** **అంత.** **610**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట

**మ. అమరారాతికరాక్షతోజ్ఝితపవిత్రాంభఃకణశ్రేణికిం**
**గమలాధీశ్వరుఁడొడ్డె ఖండితదివౌకస్స్వామిజిన్మస్తముం**
**గమలాకర్షణసుప్రశస్తము రమాకాంతాకచోపాస్తమున్**
**విమలశ్రీకుచశాతచూచుకతటీవిన్యస్తమున్ హస్తమున్. 611**

**ప్రతి :** అమర+అరాతి= దేవ శత్రువగు బలిచక్రవర్తియొక్క; కర= హస్తమునుండి; ఉజ్ఝిత= విడువబడిన; పవిత్ర= పూతమైన; అంభఃకణ= నీటిబొట్టుయొక్క; శ్రేణికిన్= సముదాయానికి; ఖండిత= ఖండించబడిన; దివౌకస్స్వామిజిత్= ఇంద్రునిజయించిన రాక్షసులయొక్క; మస్తమున్= శిరస్సుకలది; కమలా= లక్ష్మీదేవిని; ఆకర్షణ= చేర్చుటయందు; సుప్రశస్తము= మిగులయోగ్యమయినది; రమాకాంతా= లక్ష్మీదేవియొక్క; కచోపాస్తమున్= శిరోజాలచే సేవించబడినది; విమల= స్వచ్ఛమైన; శ్రీకుచ= లక్ష్మీదేవిస్తనములయందైన; శాత= వాడియగు; చూచుక= కుచాగ్రములయొక్క; తటీ= ప్రదేశంలో; విన్యస్తమున్= ఉంచబడినదియు అగు; హస్తమున్= కరమును; కమలాధీశ్వరుఁడు= లక్ష్మీపతి అయిన హరి; ఒడ్డెన్= చాచినాడు.

**తా :** బలిచక్రవర్తి (దానమిస్తున్నట్లు తెలిపే) పవిత్రోదకాన్ని ధారపోసినాడు. ఆ నీటి బిందువులకు వామనుడు తన చెయ్యిని ఒడ్డినాడు. ఆ చెయ్యి రాక్షసుల తలలను ఖండించినట్టిది. లక్ష్మీదేవిని ఆకర్షించటంలో మేలైనది. రమాదేవి శిరోజాలచే సేవించబడినది. నిర్మలమైన శ్రీదేవి కుచాగ్రాలమీద ఉంచబడినది.

**క. మునిజననియమాధారను, జనితాసురయువతినేత్రజలకణధారన్**
**దనుజేంద్రనిరాధారను, వనజాక్షుఁడు గొనియె బలివివర్జితధారన్. 612**

**ప్రతి :** మునిజన= మునీశ్వరులయొక్క; నియమ= వ్రతాదినియమములకు; ఆధారను= ఆధారమయినదానిని; జనిత= పుట్టిన; అసురయువతి= రాక్షసస్త్రీయొక్క; నేత్ర= కనులయందలి; జలకణధారన్= నీటిబిందువుల ధారకలదియు; దనుజేంద్ర= బలిచక్రవర్తికి; నిరాధారను= ఆధారము లేకుండా చేసినది అయిన; బలి= బలిచక్రవర్తిచే; వివర్జిత= విడువబడిన; ధారన్= జలధారను; వనజాక్షుఁడు= కమలములవంటి కన్నులుగల వామనుడు; కొనియెన్= చేకొన్నాడు.

**తా :** బలిచక్రవర్తి అందించిన దానధారను వామనుడు గ్రహించినాడు. ఆ జలధార మునీశ్వరుల దాననియమాల సంకల్పాలకు ఆధారమైనది. రాక్షసస్త్రీలను కన్నీటిపాలు చేసేది. రాక్షసరాజు బలిని నిరాధారునిగ మార్చేది.

**ఆ. కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు, నెఱిఁగి శుక్రు మాట లెఱిఁగి నాశ**
**మెఱిఁగి పాత్ర మనుచు నిచ్చె దానము బలి, మహి వదాన్యుఁ డొరుఁడు మఱియుఁగలఁడె. 613**

**ప్రతి :** కమలనాభున్= విష్ణువును; ఎఱిఁగి= తెలిసికొని; కాలంబున్+దేశంబున్= కాలాన్ని దేశాన్ని; ఎఱిఁగి= తెలిసికొని; శుక్రుమాటలు= శుక్రాచార్యుడు చెప్పిన మాటలను; ఎఱిఁగి= తెలిసికొని; నాశము+ఎఱిఁగి= చేటుకలుగుతుందని తెలిసి; బలి= బలిచక్రవర్తి; పాత్రమనుచున్= దానమునకు పాత్రుడని (తగినవాడని); ఇచ్చెన్+దానము= దానము చేసినాడు; మహిన్= భూమియందు; మఱియున్= ఇంతకన్న; వదాన్యుఁడు= దాత; ఒరుఁడు= ఇంకొకడు; కలఁడె= ఉన్నాడా? (ఉండడు).

**తా :** విష్ణువును, కాలాన్ని, దేశాన్ని, శుక్రాచార్యుని మాటలను, నాశనమును ఎరిగికూడా బలిచక్రవర్తి ఆ దానం యోగ్యమైనదిగా భావించి ఇచ్చినాడు. భూమిమీద ఆతనికన్న మరొకదాత ఉంటాడా? (లేదు)

**క. బలి సేసిన దానమునకు, నలినాక్షుఁడు నిఖిలభూత నాయకుఁ డగుటం**
**గలకల మని దశదిక్కులు, బళి బళి యని పొగడె భూతపంచక మనఘా! 614**

**ప్రతి :** అనఘా= పాపరహితుడవైన రాజా!; బలి+చేసిన= బలిచక్రవర్తి ఒనర్చిన; దానమునకున్= ఈవికి; నలినాక్షుఁడు= కమలములవంటి కన్నులుగల వామనుడు; నిఖిలభూత= సకల భూతాలకూ; నాయకుఁడు+అగుటన్= ప్రభువు కావటంచే; దశదిక్కులున్= పది దిక్కులూ; కలకలమని= కలకలధ్వనులతో; భూతపంచకము= పంచభూతాలు; బళిబళియని= మేలుమేలని; పొగడెన్= నుతించినాయి.

**తా :** పరీక్షిన్మహారాజా! సకల భూతాలకూ విష్ణువు అధిపతి. ఆయనకు బలిచక్రవర్తి దానం చేయగానే దిక్కుల ధ్వనులతో, పంచభూతాలూ బళి బళి అని పొగడినాయి.

**క. క్షితి దానమిచ్చు నతఁడును, నతికాంక్షఁ బరిగ్రహించు నతఁడును దురిత**
**చ్యుతులై శతవత్సరములు, శతమఖలోకమునఁగ్రీడ సలుపుదు రెలమిన్. 615**

**ప్రతి :** క్షితిన్= భూమియందు; దానమిచ్చునతఁడును= దానం చేసేవాడూ; అతికాంక్షన్= మిక్కిలి కోరికతో; పరిగ్రహించునతఁడును= పుచ్చుకొనువాడును; దురిత= పాపాలనుండి; చ్యుతులై= విడువబడినవారయి; శతవత్సరములు= నూరుసంవత్సరాలు; ఎలమిన్= సంతోషంతో; శతమఖలోకమునన్= స్వర్గలోకమందు; క్రీడసలుపుదురు= క్రీడిస్తారు.

**తా :** భూమిని దానమిచ్చినవానికీ, దానిని ప్రీతితో పుచ్చు కొన్నవానికీ పాపాలు నశిస్తాయి. వారు సంతోషంగా నూరేండ్లు స్వర్గంలో విహరిస్తారు.

**వ. అట్లు గావున నే దానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు; గావున వసుంధరా దానం బిచ్చితి; వుభయలోకంబులం గీర్తిసుకృతంబులు వడయు మని పలికి యమ్మాయావటుం డిట్లనియె. 616**

**ప్రతి :** అట్లుగావునన్= ఆకారణంచేత; ఏదానంబును= దానమేది అయినా; భూదానంబునకున్= భూమిదానానికి; సదృశంబు= సమానం; కానేరదు= కాజాలదు; కావునన్= కాబట్టి; వసుంధరా దానంబు= భూదానాన్ని; ఇచ్చితివి= ఒసగినావు; ఉభయలోకంబులన్= భూలోక స్వర్గలోకాలలో; కీర్తి సుకృతంబులు= యశస్సును, పుణ్యాన్ని; పడయుము+అని= పొందుమని; పలికి= వచించి; ఆ+మాయావటుండు= ఆ కపట బ్రహ్మచారి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికినాడు.

**తా :** 'అందువల్ల ఏ దానమూ భూదానానికి సమానంకాదు. భూదానం ఇచ్చిన నీకు రెండులోకాలలోనూ కీర్తి, పుణ్యం కలుగుతుంది.' అని పలికి మాయావటుడు మళ్లీ ఇలా అన్నాడు.

**క. ఇది యేమి వేఁడితని నీ, మది వగవక ధారవోయుమా; సత్యము పెం**
**పొదవఁగఁ గోరిన యర్థం, బిది యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్. 617**

**ప్రతి :** ఇది; ఏమి వేఁడితని= ఏమి కోరితివని; నీ మదిన్= నీ మనస్సున; వగవక= విచారింపక; ధార+పోయుమా= ధారపోయవలెసుమా!; సత్యము= యథార్థం; పెంపు+ఒదవఁగన్= వృద్ధిపొందగా; కోరినయర్థంబు= యాచించినదియగు;

ఇది= దీనిని; మాకున్= మాకు; ఇచ్చుట= ఒసగుట; మూడు+జగంబులు+ఇచ్చుట= మూడులోకాలను ఇవ్వడం వంటిది.

**తా :** నేనెందుకు దీనిని అడిగినానని నీ మనస్సులో విచారింపక దానమివ్వు. సత్యం పెంపొందేవిధంగా దీనిని అడిగినాను. ఈ మూడడుగులు ఇస్తే మాకు మూడులోకాలు ఇచ్చినట్లే.

**వ. అని పలికిన వటుని పలుకులకు హర్షనిర్భరచేతస్కుండై వైరోచనుండు. 618**

**ప్రతి :** అనిపలికిన= అలా చెప్పిన; వటునిపలుకులకు= బ్రహ్మచారి మాటలకు; హర్ష= సంతోషంతో; నిర్భర= నిండిన; చేతస్కుండై= చిత్తం కలవాడై; వైరోచనుండు= విరోచనుని తనయుడగు బలిచక్రవర్తి...

**తా :** అలా పలికిన వామనుని మాటలకు బలిచక్రవర్తి చాలా సంతోషించి

**ఆ. 'పుట్టి నేర్చుకొనెనొ పుట్టకనేర్చెనో, చిట్టిబుద్ధు లిట్టి పొట్టివడుగుఁ**
**బొట్ట నున్న వెల్ల బూమెలు' నని నవ్వి, యెలమి ధరణిదాన మిచ్చె నపుడు. 619**

**ప్రతి :** పుట్టి= జన్మించి; నేర్చుకొనెనొ= అభ్యసించెనో!; పుట్టక= పుట్టక మునుపే; నేర్చెనో= నేర్చుకున్నాడో!; చిట్టిబుద్ధులు= చిన్నారిబుద్ధులు; ఇట్టి= ఇటువంటి; పొట్టివడుగు= వామనుఁడైన బ్రహ్మచారియొక్క; పొట్టన్+ఉన్నవి+ఎల్ల= కడుపులో ఉన్నవన్నీ; బూమెలు= మాయలు; అని; నవ్వి; ఎలమిన్= సంతోషంతో; అపుడు= ఆ సమయాన; ధరణి దాన మిచ్చెన్= భూదాన మిచ్చినాడు.

**తా :** 'పుట్టిన తర్వాత నేర్చెనో పుట్టకముందే నేర్చెనో కానీ, ఈ చిట్టి పొట్టి పాపని పొట్టనిండ మాయలే' అంటూ నవ్వి బలి భూమిని దానమిచ్చినాడు.

## ✤ వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట ✤

**ఆ. గ్రహమునీంద్రసిద్ధగంధర్వకిన్నర, యక్షపక్షిదేవతాహిపతులు**
**వొగడి రతని పెంపుఁ; బుష్పవర్షంబులు, గురిసె దేవతూర్యకోటి మొరసె. 620**

**ప్రతి :** గ్రహ= గ్రహాలు; మునీంద్ర= మునీశ్వరులు; సిద్ధ= సిద్ధులు; గంధర్వ= గంధర్వులు; కిన్నర= కిన్నరులు; యక్ష= యక్షులు; పక్షి= గరుడులు; దేవతా= వేల్పులు; అహిపతులు= నాగపతులు; అతని పెంపున్= అతని ఉన్నతిని; పొగడిరి= నుతించినారు; పుష్పవర్షంబులు= పూలవానలు; కురిసెన్= వర్షించినాయి; దేవతూర్యకోటి= దేవతలయొక్క వాద్య సమూహం; మొరసెన్= మ్రోగింది.

**తా :** బలిచక్రవర్తి ఔదార్యాన్ని గ్రహాలు, మునీశ్వరులు, సిద్ధులు, గంధర్వులు, కిన్నరులు, యక్షులు, గరుడులు, దేవతలు, నాగపతులు పొగడినారు, అతనిపై పూలవానలు కురిపించినారు; దేవ వాద్యాలు మ్రోగినాయి.

**వ. ఇట్లు ధారాపరిగ్రహంబు సేసి. 621**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ధారా= ఉదకధారను; పరిగ్రహంబు+చేసి= గ్రహించి.

**శా. ఇంతింతై, వటుఁడింతయై, మఱియుఁ దా నింతై, నభోవీథిపై**
**నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై**
**నంతై, చంద్రుని కంతయై, ధ్రువునిపై నంతై, మహర్వాటిపై**
**నంతై, సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై. 622**

**ప్రతి :** వటుఁడు= బ్రహ్మచారి; ఇంత+ఇంత+ఐ= ఇంతవాడింతవాడై; ఇంత+ఐ= ఇంకా ఇంతవాడై; తాన్= తాను, మఱియున్= ఇంకనూ; ఇంత+ఐ= ఇంతవాడై; నభోవీథిపైన్= ఆకాశవీథియందు; అంత+ఐ= అంతవాడయి; తోయదమండల+అగ్రమునకు= మేఘమండలంచివరకు; అల్ల+అంత+ఐ= కొంత దూరమై; ప్రభారాశిపైన్= సూర్యమండలము మీద; అంత+ఐ= అంతవాడై; చంద్రునికి= చంద్రమండలానికి; అంత+ఐ= అంతవాడై; ధ్రువునిపైన్= ధ్రువమండలం మీద; అంత+ఐ= అంతవాడై; మహర్వాటిపైన్= మహర్లోకం మీద; అంత+ఐ= అంతవాడై; సత్యపద= సత్యలోకానికన్న; ఉన్నతుండగుచు= అధికుడై; బ్రహ్మాండాంత= బ్రహ్మాండం చివరివరకు; సంవర్ధియై= వృద్ధి పొందినవాడయి.

**తా :** బ్రహ్మచారి ఇంతవాడింతవాడై, తాను ఆకాశానికన్నా పెద్దవాడై; మేఘమండలం చివరివరకు పెరిగి; సూర్యమండలంకన్న – చంద్రమండలంకన్న – ధ్రువమండలంకన్న పెరిగి, మహర్లోకాన్ని మించి – సత్యలోకాన్ని మించి – బ్రహ్మాండం చివరివరకు వృద్ధి పొందినాడు.

**మ. రవిబింబం బుపమింపఁబాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై**
**శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై**
**ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర**
**ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్. 623**

**ప్రతి :** రవిబింబంబు= సూర్యబింబం; ఉపమింపన్= ఉపమానంగా చెప్పేందుకు; పాత్రమగు= తగినట్టి; ఛత్రంబై= గొడుగై; శిరోరత్నమై= తలయందలిమణియై; శ్రవణాలం కృతియై= కర్ణభూషణమై; గళ+ఆభరణమై= కంఠానికి అలంకారమై; సౌవర్ణ= సువర్ణమయమయిన; కేయూరమై= భుజకీర్తియై; ఛవిమత్= కాంతిమంతమయిన; కంకణమై= మురుగై; కటిస్థలిన్= మొలలోని; ఉదంచత్= మిక్కిలి ప్రకాశిస్తున్న; ఘంటయై= ఘంటికయై; నూపుర ప్రవరంబై= శ్రేష్ఠమైన కాలిఅందెయై; పదపీఠమై= పాదపీఠమయి; వటుఁడు= బ్రహ్మచారి; తాన్= తాను; బ్రహ్మాండమున్= బ్రహ్మాండాన్ని; నిండుచోన్= నిండేటప్పుడు...

**తా :** వామనుడు బ్రహ్మాండమంతా నిండిపోతున్న సమయాన సూర్యబింబం ఆతనికి క్రమక్రమంగా గొడుగుగా, శిరోమణిగా, కర్ణాలంకారకుండలంగా, కంఠభూషణంగా, తరువాత బంగారు భుజకీర్తిగా, ఆ పిమ్మట కాంతులీనే కంకణంగా, అనంతరం కటిస్థలమందలి గంటగా, ఆ పైన కాలి అందెగా, చివరకు పాదపీఠంగా ప్రకాశించింది.

**వ. ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకంబగు విశ్వరూపంబు ధరియించి భువియును, నభంబును, దివంబును, దిశలును, దిశాఛిద్రంబులును, సముద్రంబులును, జల దచల దఖిల భూతనివహంబులుం దానయై యేకీభవించి, క్రమ క్రమంబున భూలోకంబునకుం బొడవై, భువర్లోకంబు నతిక్రమించి, సువర్లోకంబును దల కడచి, మహర్లోకంబు దాఁటి జనోలోకంబునకు మీఁదై, తపోలోకంబునకు నుచ్ఛ్రితుండై,**

**సత్యలోకంబుకంటె నౌన్నత్యంబు వహించి, యెడ లిఱుములు సందులు రంధ్రంబులు లేకుండ నిండి, మహాదేవమహితుండై చరణతలంబున రసాతలంబును, బాదంబుల మహియును, జంఘల మహీధ్రంబులును, జానువులఁ బతత్త్రిసముదయంబులును, నూరువుల నింద్రసేన మరుద్గణంబులును, వాసస్థలంబున సంధ్యయు, గుహ్యంబునఁ బ్రజాపతులును, జఘనంబున దనుజులును, నాభిని నభంబును, నుదరంబున నుదధిసప్తకంబును, నురంబునఁ దారకానికరంబును, హృదయంబున ధర్మంబును నురోజంబుల ఋతసత్యంబులును, మనంబునఁ జంద్రుండును, వక్షంబునఁ గమలహస్త యగు లక్ష్మియుఁ, గంఠంబున సామాది సమస్త వేదంబులును, భుజంబులం బురందరాది దేవతలును, గర్ణంబుల దిశలును, శిరంబున నాకాశంబును, శిరోజంబుల మేఘంబులును, నాసాపుటంబున వాయువును, నయనంబుల సూర్యుండును, వదనంబున వహ్నియు, వాణినఖిలచ్ఛంద స్సముదయంబును, రసనను జలేశుండును, భ్రూయుగళంబున విధినిషేధంబులును, ఱెప్పల నహోరాత్రంబులును, లలాటంబునఁ గోపంబును, నధరంబున లోభంబును,స్పర్శంబునఁ గామంబును, రేతంబున జలంబును, బృష్ఠంబున నధర్మంబును, గ్రమణంబుల యజ్ఞంబులును, ఛాయల మృత్యువును, నగవున ననేక మాయావిశేషంబులును, రోమంబుల నోషధులును, నాడీప్రదేశంబుల నదులును, నఖంబుల శిలలును, బుద్ధి నజుండును, బ్రాణంబుల దేవర్షిగణంబులును, గాత్రంబున జంగమస్థావర జంతుసంఘంబులును గలవాఁడై, జలధరనినద శంఖ శార్ఙ్గ సుదర్శన గదాదండ ఖడ్గాక్షయ బాణతూణీర విభ్రాజితుండును, మకరకుండల కిరీట కేయూర హార కటక కంకణ కౌస్తుభమణి మేఖలాంబర వనమాలికా విరాజితుండును, సునంద నంద జయ విజయ ప్రముఖ పరిచర వాహినీ సందోహ పరివృతుండును, నమేయ తేజోవిరాజితుండునునై బ్రహ్మాండంబు దన మేనికప్పు తెఱంగున నుండ విజృంభించి. 624**

ప్రతి : ఇట్లు= ఈ విధంగా; విష్ణుండు= హరి; గుణత్రయ+ఆత్మకంబగు= సత్త్వరజస్తమోగుణాలతో కూడిన; విశ్వరూపంబున్= విశ్వరూపాన్ని; ధరియించి= పూని; భువియును= భూమిని; నభంబును= ఆకాశాన్ని; దివంబును= స్వర్గాన్ని; దిశలును= దిక్కులను; దిశాఛిద్రంబులును= దిక్కుల రంధ్రాలును; సముద్రంబులును= సాగరాలను; చలత్= చలిస్తున్న; అఖిలభూతనివహంబులున్= సకలభూతసముదాయాలు; తానయై= తానేయై; ఏకీభవించి= ఏకమై; క్రమక్రమంబునన్= వరుసగా; భూలోకంబునకున్= మహీస్థలానికన్న; పొడువై= ఉన్నతుడై; భువర్లోకంబున్= భువర్లోకాన్ని; అతిక్రమించి= దాటి; సువర్లోకంబును= సువర్లోకాన్ని; తలకడచి= అతిక్రమించి; మహర్లోకంబున్= మహర్లోకాన్ని; దాఁటి= తరించి; జనోలోకంబునకు= జనలోకానికి; మీఁదై= పయిగా అయి; తపోలోకంబునకున్= తపోలోకానికంటె; ఉచ్ఛ్రితుండై= పొడవైనవాడయి; సత్యలోకంబుకంటెన్= సత్యలోకానికన్న; ఔన్నత్యంబువహించి= పొడవైనవాడై; ఎడలు= వైపులూ; ఇఱుములు= మరుగులును; సందులు= సొరంగాలూ; రంధ్రంబులు= కన్నాలున్నూ; లేకుండ= లేనట్లుగా; నిండి= పూర్ణమై; మహాదేహ= గొప్ప శరీరంతో; మహితుండై= ఒప్పినవాడై; చరణతలంబునన్= అరికాలిచే; రసాతలంబును= పాతాళలోకాన్ని; పాదంబులన్= కాళ్లలో; మహియును= భూమియు; జంఘలన్= పిక్కలలో; మహీధ్రంబులును= పర్వతాలున్ను; జానువులన్= మోకాళ్ళలో; పతత్త్రి= పక్షులయొక్క; సముదయంబులును= సమూహాలున్నూ; ఊరువులన్= తొడలయందు; ఇంద్రసేనమరుద్గణంబులును= దేవతాగణాలున్నూ; వాసస్థలంబునన్= వస్త్రము కట్టుచోటునందు; సంధ్యయున్=

సంజయున్ను; గుహ్యంబునన్= గుదప్రదేశాన; ప్రజాపతులును= నవబ్రహ్మలును; జఘనంబునన్= పిరుదునందు; దనుజులును= రాక్షసులున్ను; నాభిని= బొడ్డునందు; నభంబును= ఆకాశమున్ను; ఉదరంబునన్= కడుపునందు; ఉదధిసప్తకంబును= ఏడు సముద్రాలును; ఉరంబునన్= వక్షమందు; తారకానికరంబును= చుక్కలగుంపును; హృదయంబునన్= గుండెలయందు; ధర్మంబును= న్యాయమును; ఉరోజంబులన్= చనులందు; ఋతు= ఋతువులును; సత్యంబులును= నిజాలును; మనంబునన్= చిత్తమునందు; చంద్రుండును= చందురుడును; వక్షంబునన్= ఎదయందు; కమలహస్తయగు= పద్మము చేతియందుగల; లక్ష్మియున్= సిరియు; కంఠంబునన్= కుత్తుకయందు; సామాది= సామముమొదలయిన; సమస్తవేదంబులును= సర్వవేదాలును; భుజంబులన్= భుజములందు; పురందరాది= ఇంద్రుడుమొదలయిన; దేవతలును= సురలున్ను; కరంబులన్= చేతులందు; దిశలును= దిక్కులును; శిరంబునన్= తలయందు; నాకంబును= స్వర్గమును; శిరోజంబులన్= తలవెంట్రుకలందు; మేఘంబులును= మబ్బులును; నాసాపుటంబునన్= ముకుపుటములందు; వాయువును= గాలియు; నయనంబులన్= నేత్రాలందు; సూర్యుండును= రవియును; వదనంబునన్= ముఖమందు; వహ్నియు= అగ్నియును; వాణిన్= వాక్కునందు; అఖిల= సమస్తమైన; ఛందస్సముదయంబును= ఛందస్సులయొక్క సముదాయమును; రసజ్ఞను= నాలుకను; జలేశుండును= వరుణుడును; భ్రూయుగళంబునన్= రెండుకనుబొమలందును; విధినిషేధంబులును= విధియును నిషేధమును; ఱెప్పలన్= కనురెప్పలందు; అహోరాత్రంబులును= పవళ్ళునురాత్రులును; లలాటంబునన్= ముఖాన; మన్యువును= కోపమును; అధరంబునన్= పెదవియందు; లోభంబును= లుబ్ధతయును; స్పర్శంబునన్= తాకుడున; కామంబును= కోరికయును; రేతంబునన్= వీర్యమునందు; జలంబును= నీరును; పృష్ఠంబునన్= వీపులో; అధర్మంబును= అన్యాయాన్ని; క్రమణంబులన్= నడకలందు; యజ్ఞంబులును= జన్నములును; ఛాయలన్= నీడలయందు; మృత్యువును= చావును; నగవులవలనన్= నవ్వులవలన; అనేక= బహువిధాలయిన; మాయావిశేషంబులును= మాయలును; రోమంబులన్= వెంట్రుకలందు; ఓషధులును= వనమాలికలును; నాడీప్రదేశంబులన్= నరములయందు; నదులును= స్రవంతులును; నఖంబులన్= గోళ్లయందు; శిలలును= రాళ్లును; బుద్ధిన్= బుద్ధియందు; అజుండును= బ్రహ్మయును; ప్రాణంబులన్= జీవనములందు; దేవ= దేవతలు; ఋషిగణంబులును= మునిగణాలును; గాత్రంబునన్= శరీరమందు; జంగమ= కదలునట్టి స్థావర= కదలనట్టి; జంతుసంఘంబులును= ప్రాణిసమూహాలును; కలవాడయి= ఉన్నవాడై; జలధరనినద= మేఘధ్వనిగల (ఉరుమువలె చప్పుడుచేసే); శంఖ= శంఖంచేత; శార్ఙ్గ= శార్ఙ్గమనే వింటిచేత; సుదర్శన= సుదర్శనం అనే పేరుగల చక్రంచేత; గదా= గదచేత; దండ= దండంచేత; ఖడ్గ= కత్తిచేత; అక్షయ= నాశనంకాని; బాణ= బాణాలతోకూడిన; తూణీర= అమ్ముల పొదుల చేత; విభ్రాజితుండును= ప్రకాశించువాడును; మకరకుండల= మొసలితలలు చెక్కబడిన పోగుల చేతను; కిరీట= కిరీటంచేత; కేయూర= బాహుపురులచేతను; హార= హారాలచేతను; కటక= కాలి అందెలచేతను; కంకణ= కంకణాల చేతను; కౌస్తుభమణి= కౌస్తుభం అనే రత్నంచేతను; మేఖల= మొలనూలిచేతను; అంబర= బంగారువస్త్రం చేతను; వనమాలికా= వనమాలికచేతను; విరాజితుండును= ప్రకాశించునట్టివాడును; సునంద= సునందుడు; నంద= నందుడు; జయ= జయుడు; విజయ= విజయుడు; ప్రముఖ= మొదలయిన; పరిచర= పరిచారకులయొక్క; వాహినీ= సేనలయొక్క; సందోహ= సముదాయంచే; పరివృతుండును= కూడియున్నవాడును; అమేయ= హద్దులేని; తేజః= కాంతిచే; విలసితుండును= ఒప్పునట్టివాడును; ఐ= అయి; బ్రహ్మాండంబు= బ్రహ్మాండము; తన= తనయొక్క; మేని= శరీరముయొక్క; కప్పుతెఱంగునన్= ఆచ్ఛాదన వస్త్రంవలె; ఉండన్= ఉండేటట్లు; విజృంభించి= పెరిగి.

**తా :** ఈ విధంగా వామనరూపుడగు విష్ణుమూర్తి సత్త్వ రజస్తమో రూపకమైన విశ్వరూపాన్ని ధరించి విజృంభించినాడు. భూమీ ఆకాశమూ స్వర్గమూ దిక్కులూ దిక్కుల మధ్యభాగాలూ సముద్రాలూ చరాచర భూతరాసులన్నీ కూడా తానే అయి

ఏకాకృతిని ధరించినాడు. క్రమంగా భూలోకాన్ని అతిక్రమించినాడు. భువర్లోకం, సువర్లోకం, మహర్లోకం, జనోలోకం, తపోలోకం దాటి సత్యలోకాన్ని కూడా ఆక్రమించి దానిని కూడా దాటిపోయినాడు. అన్ని తావులలో మూలమూలలూ సందుసందులూ నిండిపోయినాడు. మహోన్నతమైన ఆకారంతో పాదాల అడుగుభాగాన రసాతలాన్నీ, పాదాలతో భూమినీ, పిక్కలతో పర్వతాలనూ, మోకాళ్లతో పక్షులసమూహాన్నీ; తొడలలో దేవతలను, వస్త్రంలో సంధ్యాకాలాన్నీ, గుహ్యాంగంలో ప్రజాపతులను, పిరుదులలో రాక్షసులను, నాభిలో ఆకాశాన్ని, కడుపులో సప్తసముద్రాలను, వక్షంలో నక్షత్రసమూహాన్ని, హృదయంలో ధర్మాన్నీ, వక్షోజస్థానంలో ఋతాన్నీ సత్యాన్నీ, మనస్సులో చంద్రుడినీ, ఎదలో లక్ష్మీదేవిని, కంఠంలో వేదాలను, భుజాలలో ఇంద్రాదులైన దేవతలను, చెవులలో దిక్కులను, తలలో స్వర్గలోకాన్ని, తలవెంట్రుకలలో మేఘాలను, ముక్కుపుటాలలో వాయువును, కన్నులలో సూర్యుడినీ, ముఖంలో అగ్నినీ, వాక్కునందు సర్వ ఛందస్సులను, నాలుకలో వరుణునీ, కనుబొమ్మలలో కార్యాకార్యాలను, రెప్పలలో రేయింబవళ్ళనూ, ఫాలభాగంలో కోపాన్నీ, క్రింది పెదవిలో లోభాన్నీ, స్పర్శలో కామాన్నీ, రేతస్సులో జలాన్నీ, వీపులో అధర్మాన్నీ, అడుగులలో యజ్ఞాలనూ, నీడలో మరణాన్నీ, నవ్వులో సకలమాయలను, దేహరోమాలలో ఓషధులను, నాడీప్రదేశాలలో నదులను, గోళ్ళలో రాళ్ళనూ, బుద్ధిలో బ్రహ్మనూ, ప్రాణాలలో దేవర్షిగణాలనూ, శరీరంలో చరాచరసకలప్రాణులను ఇమిడించుకొన్నారు. ఆయన మేఘంవలె మ్రోగే పాంచజన్యం అనే శంఖంతో, శార్ఙ్గం అనే ధనుస్సుతో, సుదర్శనం అనే చక్రంతో, కౌమోదకి అనే గదతో, ఖడ్గంతో అక్షయాలయిన అంపపొదులతో ప్రకాశిస్తున్నాడు. మకరకుండలాలతో, కిరీటంతో, కౌస్తుభమణితో, రత్నమయమైన మొలనూలితో, పీతాంబరంతో, వక్షాన వైజయంతీ మాలికతో దివ్య కాంతులతో విరాజిల్లుతున్నాడు. సునంద, నంద, జయ, విజయాది పరిచారకసమూహం చుట్టూ చేరి ఉంది. సాటిలేని తేజస్సుతో మెరుస్తున్న విష్ణువుకు బ్రహ్మాండమే శరీరానికి ఒక మేలిముసుగుగా ఒప్పుతున్నది.

**మ. ఒకపాదంబున భూమిఁగప్పి, దివి వేఱొంటన్ నిరోధించి, యొం**
**డొకటన్ మీఁది జగంబులెల్లఁదొడి, యొండొంటిన్ విలంఘించి, ప**
**ట్టక బ్రహ్మాండకటాహముం బగిలి వేంద్రంబై పరుల్ గానరా**
**కొకఁడై వాగ్దృగలభ్యుఁడై హరివిభుం డొప్పారె విశ్వాకృతిన్. 625**

**ప్రతి :** ఒకపాదంబునన్= ఒక అడుగుచే; భూమిన్= భూతలాన్ని; కప్పి= మూసి; దివిన్= ఆకాశాన్ని; వేఱొంటన్= వేరొకపాదంచే; నిరోధించి= అడ్డుకొని; ఒండొకటన్= మరొక అడుగున; మీఁదిజగంబులు= పయిలోకాలు; ఎల్లన్= అన్నీ; తొడి= ధరించి; ఒండొంటిన్= ఒక్కొక్కదానినే; విలంఘించి= దాటి; పట్టక= చాలక; బ్రహ్మాండకటాహమున్= బ్రహ్మాండభాండం; పగిలి= చీలి / బద్దలై; వేంద్రంబై= అధికమై; పరుల్= ఇతరులు; కానరాక= కనిపించకుండా; ఒకఁడై= ఒంటివాడై; వాక్= మాటకు; దృక్= చూపునకు; అలభ్యుఁడై= దొరకనివాడయి; హరివిభుండు= విష్ణుదేవుడు; విశ్వాకృతిన్= విశ్వరూపంతో; ఒప్పారెన్= శోభించినాడు.

**తా :** విశ్వరూపాన్ని పొందిన త్రివిక్రముడు ఒక అడుగుతో భూలోకాన్నీ, ఇంకొక అడుగుతో స్వర్గలోకాన్నీ, మరొక అడుగుతో పైలోకాలను ఆక్రమించినాడు. క్రమంగా అన్నింటినీ దాటిపోయినాడు. ఇక ఆ రూపం పట్టకపోవడంవల్ల బ్రహ్మాండం బద్దలు కాసాగింది. ఆయన తప్ప ఇంకెవరూ కనిపించకుండా పోయినారు. ఆ విశ్వరూపుడు మాటలకూ, చూపులకూ అందరానివాడై ప్రకాశించినాడు.

**విశే :** భూలోకం కిందుగాను దేవలోకం పైగాను ఉంటుందని భావన. దీనికి అనుగుణంగానే వామనుని విజృంభణం వర్ణించబడింది.

**ఆ. ఒక పదంబు క్రింద నుర్వి పద్మము నంటి, కొన్న పంకలవము కొమరుఁదాల్చె;**
**నొకటి మీఁదఁదమ్మి కొదిఁగిన తేఁటినా, వెలసె మిన్ను నృప! త్రివిక్రమమున. 626**

**ప్రతి :** నృప= రాజా!; త్రివిక్రమునన్= హరి త్రివిక్రమరూపాన్ని ధరించినప్పుడు; ఉర్వి= భూమి; ఒకపదంబు క్రిందన్= ఒకచరణం కింద; పద్మమునంటికొన్న= తామరపూవును అంటికొనినట్టి; పంకలవము= బురదముద్దయొక్క; కొమరున్= చక్కదనాన్ని; తాల్చెన్= ధరించింది (పూనింది); ఒకటిమీఁదన్= ఒక పాదంమీద; మిన్ను= ఆకాశం; తమ్మికి+ఒదిఁగిన= పద్మమున ఒదిగి ఉన్న; తేఁటినాన్= తుమ్మెద అనేటట్లు; వెలసెన్= ప్రకాశించింది.

**తా :** రాజా! విష్ణుమూర్తి పాదాలు రెండూ రెండుపద్మాలవలె ఉన్నాయి. ఒక పాదం కింద ఉన్న భూమండలం పద్మానికి అంటుకున్న చిన్న బురదముద్దలా ఒప్పారింది. ఇంకొక పాదంమీద ఉన్న ఆకాశం పద్మం మీద ఉన్న తుమ్మెదలా శోభించింది.

**వ. తత్సమయంబున. 627**

**ప్రతి :** తద్+సమయంబునన్= ఆ సమయంలో

**ఆ. జగములెల్ల దాఁటి చనిన త్రివిక్రము, చరణనఖరచంద్రచంద్రికలను**
**బొనుఁగుపడియె సత్యమున బ్రహ్మతేజంబు, దివసకరుని రుచుల దివియవోలె. 628**

**ప్రతి :** జగములెల్లన్= లోకాలన్నీ; దాఁటి= అతిక్రమించి; చనిన= వెళ్ళిన; త్రివిక్రము= హరియొక్క; చరణ= కాలియందలి; నఖర చంద్ర= = గోళ్లు అనే చంద్రునియొక్క; చంద్రికలను= వెన్నెలలచే; సత్యమునన్= సత్యలోకమందు; బ్రహ్మతేజంబు= విధాత తేజస్సు; దివసకరుని= సూర్యుని; రుచులన్= కాంతులముందు; దివియ+పోలెన్= దీపంవలె; పొనుఁగు పడియెన్= తక్కువయింది.

**తా :** లోకాలన్నీ దాటిపోయిన త్రివిక్రముని కాలిగోళ్లకాంతులు చంద్రునియొక్క వెన్నెలవలె ప్రకాశించినాయి. ఆ వెలుగులో సత్యలోకమందలి బ్రహ్మ తేజస్సుకూడా సూర్యుని వెలుగు ముందు దీపంవలె తక్కువయింది (వెలవెలపోయింది).

**సీ. భవబంధములఁబాసి బ్రహ్మలోకంబునఁ గాఁపురంబులు సేయు ఘనులు రాజు**
**లా మరీచ్యాదులు నా సనందాదులు నా దివ్యయోగీంద్రు లచట నెపుడు**
**మూర్తిమంతంబులై మ్రోయు పురాణ తర్కామ్నాయ నియమేతిహాస ధర్మ**
**సంహితాదులు గురుజ్ఞానాగ్ని నిర్దగ్ధ కర్ములై మఱియును గలుగునట్టి**

**ఆ. వార లెల్లఁజొచ్చి వచ్చి సర్వాధిపు, నంఘ్రిఁజూచి మ్రొక్కి రధికభక్తి**
**దమ మనంబులందుఁ దలఁచు నిధానంబుఁ, గంటి మనుచు నేఁడు మంటి మనుచు. 629**

**ప్రతి :** భవబంధములన్= సంసారబంధాలను; పాసి= పోగొట్టుకొని; బ్రహ్మలోకంబునన్= సత్యలోకమందు; కాపురంబులు+చేయు= కాపురాలుచేస్తున్న; ఘనులు= గొప్పవారయిన; రాజులు= నృపులు; ఆ మరీచి+ఆదులు=

సప్తఋషులలోను నవబ్రహ్మలలోను ఒకరైన మరీచి మొదలైనవారు; ఆ సనంద+ఆదులున్= బ్రహ్మమానసపుత్రులైన సనక, సనందన, సనాతన సనత్కుమారులు; ఆ దివ్యయోగీంద్రులు= ఆ దేవమునులు; అచటన్= అక్కడ; ఎపుడున్= ఎల్లప్పుడూ; మూర్తిమంతంబులై= ఆకారాన్ని ధరించినవై; మ్రోయు= మ్రోగునట్టి; పురాణ= పురాణాలు; తర్క= తర్కం; ఆమ్నాయ= వేదాలు; నియమ= వ్యాకరణం; ఇతిహాస= పూర్వరాజన్యచరిత్రలు; ధర్మ= ధర్మశాస్త్రం; సంహిత= వేదభాగం; ఆదులు= మొదలయినవి; గురు= విస్తారమైన; జ్ఞాన= తెలివి అనే; అగ్ని= నిప్పుచే; నిర్దగ్ధ= బాగా కాలిన; కర్ములై= కర్మలుకలవారై; మఱియును= ఇంకా; కలుగునట్టి= కలిగిన; వారలు+ఎల్లన్= వారందరూ; చొచ్చి= ప్రవేశించి; వచ్చి= వచ్చినట్టి; సర్వాధిపు= అందరికి ప్రభువైన (భగవంతునియొక్క); అంఘ్రిన్= పాదాన్ని; చూచి= తిలకించి; అధికభక్తిన్= మిక్కిలిభక్తిచే; తమ= తమయొక్క; మనంబులందున్= చిత్తాలయందు; తలఁచు= భావించునట్టి; నిధానంబున్= పెన్నిధానాన్ని; నేడు= ఈ దినం; కంటిమి+అనుచున్= చూచినామని; మంటిమి+అనుచున్= బ్రతికినామని; మ్రొక్కిరి= నమస్కారంచేసినారు.

**తా :** సంసారబంధాన్ని తెంచుకొని సత్యలోకంలో ఉన్న రాజులూ, సప్తఋషులలోను నవబ్రహ్మలలోను ఒకడైన మరీచి మొదలగువారు, సనందనుడు మొదలయిన బ్రహ్మమానస పుత్రులూ, దేవమునులూ, అక్కడ ఎల్లప్పుడూ రూపాన్ని ధరించి మ్రోగుతున్న పురాణాలూ, తర్కం, వేదాలూ, వ్యాకరణం, చరిత్రలు, ధర్మశాస్త్రాలూ, మొదలయినవీ, జ్ఞానాగ్నిచే సంచితమైన కర్మలన్నీ దగ్ధంకాగా, ఇంకను మిగిలి ఉన్నవారందరూ వస్తున్న శ్రీహరియొక్క పాదాన్ని చూచి తమతమ చిత్తాలలో తలుస్తున్న పెన్నిధానాన్ని చూచినామనీ, నేడు ధన్యులమైనామనీ భక్తితో నమస్కరించినారు.

**మ. తన పుట్టిల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభిపంకేరుహం**
**బు నిరీక్షించి, నటించి యున్నతపదంబుంజూచి తత్పాద సే**
**చనముంజేసెఁగమండలూదకములంజల్లించి; తత్తోయముల్**
**వినువీథింబ్రవహించె దేవనదినా విశ్వాత్మకీర్తిప్రభన్. 630**

**ప్రతి :** అజుఁడున్= బ్రహ్మదేవుడును; తనపుట్టిల్లు= తాను పుట్టిన ఇల్లు; ఇదెపొమ్ము= ఇదేసుమా; అటంచున్= అంటూ; తత్= ఆ హరియొక్క; నాభిపంకేరుహంబున్= నాభికమలాన్ని; నిరీక్షించి= చూచి; నటించి= నర్తనంచేసి; ఉన్నత= పొడుగైన; పదంబున్= పాదాన్ని; చూచి= కని; కమండలు+ఉదకములన్= కమండలువునందలి జలముచే; చల్లించి= చల్లించినవాడై; తత్= ఆ; పాదసేచనమున్+చేసెన్= పాదాన్ని కడిగినాడు; తత్= ఆ; తోయముల్= నీరు; వినువీథిన్= ఆకాశమందు; విశ్వాత్ము= విశ్వరూపుడైన హరియొక్క; కీర్తిప్రభన్= యశస్సుయొక్క ప్రభచే; దేవనదినాన్= స్వర్గలోకంలోని గంగానది మందాకిని వలె; ప్రవహించెన్= పారింది.

**తా :** హరియొక్క బొడ్డుతామరను చూచి 'నా పుట్టినతావు ఇదేకదా' అనుకొని బ్రహ్మదేవుడు సంతోషించినాడు. ఆయన తన కమండలు జలాలతో స్వామివారి పాదాన్ని కడిగినాడు. ఆ జలధారలు హరియొక్క కీర్తి ప్రభలతోనిండి మందాకిని అనే పేరుగల స్వర్గ గంగవలె ప్రవహించినాయి.

**వ. తత్సమయంబున. 631**

**ప్రతి :** తత్+సమయంబునన్= ఆ సమయాన

**సీ. యోగమార్గంబున నూహించి బహువిధపుష్పదామంబులఁబూజసేసి**
**దివ్యగంధంబులు తెచ్చి సమర్పించి ధూపదీపములఁదోడ్తోడ నిచ్చి**

**భూరిలాజాక్షతంబులు సల్లి ఫలములు గానిక లిచ్చి రాగములఁబొగడి**
**శంఖాదిరవముల జయఘోషములు సేసి 'కరుణాంబునిధి! త్రివిక్రమ' యటంచు**

**ఆ. బ్రహ్మమొదలు లోకపాలురు గొనియాడి; రెల్ల దిశల వనచరేశ్వరుండు**
**జాంబవంతుఁడరిగి చాటె భేరీధ్వని, వెలయఁజేసి విష్ణువిజయ మనుచు. 632**

**ప్రతి :** యోగమార్గంబునన్= యోగమార్గంచే; ఊహించి= ఆలోచించి; బహువిధ= పలురీతుల; పుష్పదామంబులన్= పూలమాలలచే; పూజచేసి= పూజించి; దివ్య= దేవసంబంధమయిన; గంధంబులు= పరిమళద్రవ్యాలు; తెచ్చి= తీసుకొనివచ్చి; సమర్పించి= ఇచ్చి; ధూపదీపములన్= ధూపాన్నీ దీపాన్నీ; తోడ్తోడన్= వెంటనే; ఇచ్చి= ఒసగి; భూరి= ఎక్కువయిన; లాజ= పేలాలు; అక్షతంబులు= అక్షతలు; చల్లి; ఫలములు= పండ్లు; కానికలు+ఇచ్చి= కట్నంగాఒసగి; రాగములన్= అనురాగాలతో / వివిధరాగాలతో; పొగడి= కీర్తించి; శంఖాదిరవములు= శంఖంమొదలయినవానిధ్వనుల; జయఘోషములు= జయధ్వానాలు; చేసి; కరుణాంబునిధి= కరుణాసముద్రుడా!; త్రివిక్రమ= త్రివిక్రముడా!; అటంచున్= అంటూ; బ్రహ్మమొదలు= బ్రహ్మమొదలుకొని; లోకపాలురు= దిక్పాలురు / భూపాలురు; కొనియాడిరి= పొగడిరి; ఎల్లదిశలన్= అన్నిదిక్కులందు; విష్ణువిజయమనుచున్= హరిజయించినాడని; వనచరేశ్వరుండు= ఎలుగుబంట్లకు రాజయిన; జాంబవంతుడు; అరిగి= వెళ్లి; భేరీధ్వనిన్= భేరీనాదాన్ని; వెలయన్‌చేసి= మోగింపజేసి; చాటెన్= చాటించినాడు.

**తా :** బ్రహ్మాదులు మహావిష్ణువును యోగమార్గంలో ఊహించి పలురకాలయిన పూలదండలతో పూజించినారు. గంధాన్ని సమర్పించినారు, ధూపదీపాలు పెట్టినారు, పేలాలు అక్షతలు చల్లినారు, పండ్లను కానుకలుగా ఇచ్చినారు, శంఖారావములు జయజయధ్వానాలు చేస్తూ భల్లూకరాజయిన జాంబవంతుడు అన్ని దిక్కులలో ఢంకా మోగిస్తూ 'కరుణాంబు నిధీ, త్రివిక్రమా' అంటూ విష్ణుదేవుని జయాన్ని ఎల్లదిక్కులలో చాటినాడు.

**క. అన్ని జగంబులఁదానై, యున్న జగన్నాథుఁజూడ నొగి భావింపం**
**గన్నందక మన మందక, సన్నుతులంజేసి రపుడు సభ్యులు బలియున్. 633**

**ప్రతి :** అన్నిజగంబులన్= సకల లోకాలయందూ; తానై= తానేయై; ఉన్న= ఉన్నట్టి; జగన్నాథున్= హరిని; చూడన్= చూచుటకు; ఒగిన్= క్రమంగా; భావింపన్= విచారించేందుకు; కన్ను+అందక= చూపానక; మనమందక= మనస్సునకుశక్తిలేక; అపుడు= ఆ సమయాన; సభ్యులు= సభలోనివారు; బలియున్= బలిచక్రవర్తీ; సన్నుతులన్= స్తోత్రాలను; చేసిరి= చేసినారు.

**తా :** సకలలోకాలలోనూ వ్యాపించిన భగవంతుని కంటితో చూడటానికీ మనస్సులో ఊహించటానికీ వీలుకాక బలిచక్రవర్తీ, ఆయన సభలోనివారూ చక్కగా స్తోత్రం చేసినారు.

**వ. అంత నొయ్యనఁ బూర్వప్రకారంబున వామనాకారంబు వహించి యున్న వామనునిం గని 'పదత్రయ వ్యాజంబున నితండు సకలమహీమండలంబు నాక్రమించెఁ గపటవటురూప తిరోహితుండగు విష్ణుం డని యెఱుంగక మన దానవేంద్రుండు సత్యసంధుండు గావున మాట దిరుగక యిచ్చె; నతనివలన నేరంబులే; దీ కుబ్జుం దప్రతిహత తేజః ప్రభావంబున సజ్జకంబుగా నిజ్జగంబులం బరిగ్రహించి, పర్జన్యాదులకు**

**విసర్జనంబు సేయందలంచి యున్నవాఁ, డీ పాఱునిం దూఱి పాఱనీక నిర్జించుట కర్జం' బని తర్జనంబులును గర్జనంబులును జేయుచు, వజ్రాయుధాది మరుజ్జేతలగు రాహు హేతి ప్రహేతి విప్రచిత్తి ముఖ్యులయిన రక్కసులు పెక్కం డ్రుక్కుమిగిలి యుద్ధంబునకు సన్నద్ధులై పరశు పట్టిస భల్లాది సాధనంబులు ధరియించి, కసిమసంగి ముసరికొని దశదిశలం బ్రసరించినం చూచి హరి పరిచరులు సునంద నంద జయ జయంత విజయ ప్రబలోద్బల కుముద కుముదాక్ష తార్క్ష్య పుష్పదంత విష్వక్సేన శ్రుతదేవ సాత్వత ప్రముఖులగు దండనాథు లయుత వేదండ సముద్దండబలులు దమతమ యూథంబుల నాయుధంబులతోడం గూర్చుకొని దానవానీకంబులఁ బరలోకంబున కనుపువారలై వారల నెదుర్కొని కదనంబునకుం బరవసంబు సేయుచున్నం గనుంగొని శుక్రుశాపంబుఁదలంచి దనుజవల్లభుండిట్లనియె. 634**

**ప్రతి :** అంతన్= అంతట; ఒయ్యనన్= వరుసగా; పూర్వప్రకారంబునన్= తొంటిరీతిగా; వామనాకారంబు= బుడుగు రూపాన్ని; వహించి= ధరించి; ఉన్న= ఉండిన; వామనునింగని= వామనమూర్తిని చూచి; పదత్రయ= మూడడుగుల భూదానం అనే; వ్యాజంబునన్= మిషచే; ఇతండు= ఈతడు; సకలమహీమండలంబున్= భూమండలమంతా; ఆక్రమించెన్= వ్యాపించినాడు; కపటవటురూప= మాయాబ్రహ్మచారిరూపంతో; తిరోహితుండు+అగు= దాగియున్నవాడైన; విష్ణుండని= సర్వవ్యాపకుడగు హరియని; ఎఱుంగక= తెలిసికొనలేక; మన దానవేంద్రుండు= మనరాక్షసరాజు; సత్యసంధుండుగావునన్= సత్యవంతుడు కనుక; మాట+తిరుగక= పలుకు తప్పక; ఇచ్చెన్= ఒసగినాడు; అతని వలనన్= ఆతని విషయంలో; నేరంబులేదు= తప్పులేదు; ఈకుబ్జుండు= ఈ వామనుడు; అప్రతిహత= కొట్టబడని; తేజః= తేజస్సుయొక్క; ప్రభావంబునన్= ప్రభావంలో; సజ్జకంబుగాన్= మనోజ్ఞంగా; ఈ+జగంబులన్= ఈలోకాలను; పరిగ్రహించి= తీసికొని; పర్జన్య+ఆదులకున్= ఇంద్రాది దేవతలకు; విసర్జనంబు+చేయన్+తలంచి= దానముగా విడువనెంచి; ఉన్నవాఁడు= ఉన్నాడు; ఈ పాఱునిన్= ఈ బ్రాహ్మణుని; తూఱిపాఱనీక= తప్పించుకొని పరువెత్తనీక; నిర్జించుట= చంపుట; కర్జంబని= కార్యంబని; తర్జనంబులును= అదల్పులును; గర్జనంబులును= హూంకృతులును; చేయుచు; వజ్రాయుధ+ఆది= వజ్రాయుధం ధరించిన ఇంద్రుడు మొదలయిన; మరుత్= దేవతలను; జేతలగు= జయించినవారగు; రాహు= రాహువు అనే వాడు; హేతి= హేతి అనే వాడు, ప్రహేతి= ప్రహేతి అనేవాడు, విప్రచిత్తి= విప్రచిత్తి అనేవాడు; ముఖ్యులైన= మొదలయిన; రక్కసులు= రాక్షసులు; పెక్కండ్రు= చాలామంది; ఉక్కుమిగిలి= చెలరేగి; యుద్ధంబునకు= సంగరానికి; సన్నద్ధులై= సిద్ధమయినవారయి; పరశు= గొడ్డలి; పట్టిస= అడ్డకత్తి; భల్ల= ఈటె; ఆది= మొదలయిన; సాధనంబులు= ఆయుధాల పనిముట్లు; ధరించి= తాల్చి; కసిమసంగి= విజృంభించి; ముసరికొని= మూగి; దశదిశలన్= పది దిక్కులను; ప్రసరించినన్= వ్యాపించగా; చూచి= కని; హరిపరిచరులు= విష్ణుమూర్తిని సేవించువారయిన; సునంద= సునందుడు; నంద= నందుడు; జయ= జయుడు; జయంత= జయంతుడు; విజయ= విజయుడు; ప్రబల= ప్రబలుడు; ఉద్బల= ఉద్బలుడు; కుముద= కుముదుడు; కుముదాక్ష= కుముదాక్షుడు; తార్క్ష్య= తార్క్ష్యుడు; పుష్పదంత= పుష్పదంతుడు; విష్వక్సేన= విష్వక్సేనుడు; శ్రుతదేవ= శ్రుతదేవుడు; సాత్వత= సాత్వతుడు; ప్రముఖులగు= మొదలగు; దండనాథులు= దండనాయకులు; అయుత= పదివేల; వేదండ= ఏనుగులకన్న; సమ్+ఉద్దండ= చాలయెక్కువైన; బలులు= బలంకలవారు; తమతమ= తమయొక్క తమయొక్క; యూథంబులన్= సేనలను; ఆయుధంబులతోడన్= శస్త్రాస్త్రములతోకూడా; కూర్చుకొని= పోగుచేసుకొని; దానవానీకంబులన్= రాక్షససేనలను; పరలోకంబునకు= ఇతరలోకాలకు/స్వర్గానికి; అనుపువారలై= పంపేవారై; వారలన్= ఆ రక్కసులను; ఎదుర్కొని= ఎదిరించి; కదనంబునకున్= యుద్ధానికి; పరవసంబు= చొరవ; చేయుచున్నన్= చేస్తుండగా; కనుంగొని=

చూచి; శుక్రుశాపంబున్= శుక్రాచార్యుడిచ్చిన శాపాన్ని; తలంచి= తలచుకొని; దనుజవల్లభుండు= రాక్షసరాజయిన బలిచక్రవర్తి; ఇట్లనియెన్= ఈ విధంగా పలికినాడు.

**తా :** ఆ పిమ్మట విష్ణుమూర్తి మెల్లగా వామనరూపాన్ని వహించినాడు. ఆయనను చూచి 'మూడడుగుల నెపంతో ఇతడు సమస్త ప్రపంచాన్నీ ఆక్రమించుకొన్నాడు. మాయతో బ్రహ్మచారి రూపాన్ని పొందిన విష్ణువని తెలియక మనరాజు ఆడినమాట తప్పకుండా దానమిచ్చినాడు. అతనిలోతప్పు లేదు. ఈ పొట్టివాడు ఎదురులేని మహిమలతో లోకాలను స్వాధీనం చేసుకున్నాడు. వీటిని ఇంద్రాదులకు ఇస్తాడు. ఈ బ్రహ్మచారి తప్పించుకొని పరుగెత్తిపోకుండా చంపివేయాలి' అంటూ ఇంద్రాది దేవతలను గెలిచిన రాహువు, హేతి, ప్రహేతి, విప్రచిత్తీ మొదలయిన రాక్షసులు బెదరిస్తూ కేకలు వేస్తూ పోరుకు సిద్ధమైనారు. గొడ్డళ్లూ, అడ్డకత్తులూ, ఈటెలు మొదలయిన ఆయుధాలు ధరించి చెలరేగి అన్నివైపుల ముసరుకున్నారు. దానిని గమనించి విష్ణుపరిచారకులైన సునందుడూ, నందుడూ, జయుడూ, జయంతుడూ, విజయుడూ, ప్రబలుడూ, ఉద్బలుడూ, కుముదుడూ, కుముదాక్షుడూ, గరుడుడూ, పుష్పదంతుడూ, విష్వక్సేనుడూ, శ్రుతదేవుడూ, సాత్వతుడూ మొదలయిన సేనాపతులు పదివేల ఏనుగులబలంతో కూడి తమతమ సైన్యాలను ఆయుధాలలో సిద్ధంచేసుకున్నారు. యుద్ధంలో దానవసేనను ఎదుర్కొని తుదముట్టించడానికి ఉత్సాహంతో సమాయత్తమైనారు. అది గమనించి అప్పుడు బలిచక్రవర్తి శుక్రాచార్యుని శాపాన్ని గుర్తుకు తెచ్చుకొని దానవులతో ఇలా అన్నాడు.

**సీ. రాక్షసోత్తములార! రండు పోరాడక; కాలంబు గాదిది కలహమునకు**
**సర్వభూతములకు సంపదాపదలకుఁ బ్రభువైన దైవంబుఁబరిభవింప**
**మన మోపుదుమె? తొల్లి మనకు రాజ్యంబును సురలకు నాశంబు సొరిది నిచ్చి**
**విపరీతముగఁజేయు వేల్పు నే మందుము! మనపాలిభాగ్యంబు మహిమ గాక**

**తే. వెఱచి పలుమాఱుఁబాఱెడి విష్ణుభటులు, మిమ్ము నెగచుట దైవంబు మేర గాదె?**
**మనకు నెప్పుడు దైవంబు మంచిదగును, నాఁడు గెలుతము పగవారి; నేఁడు వలదు. 635**

**ప్రతి :** రాక్షస+ఉత్తములార= రాక్షసశ్రేష్ఠులారా!; పోరాడక= పోరుచేయక; రండు= రండి; కలహమునకున్= పోరుచేసేందుకు; ఇది; కాలంబుగాదు= సమయంకాదు; సర్వభూతములకున్= అన్ని జీవులకూ; సంపద= ఐశ్వర్యానికీ; ఆపదలకున్= కష్టాలకూ; ప్రభువైన= అధిపతి అయిన; దైవంబున్= భగవంతుని; పరిభవింపన్= పరాభవంచేయుటకు; మనము+ఓపుదుమె= మనము తగిన వారమా!; తొల్లి= పూర్వం; మనకు= మనందరకూ; రాజ్యంబును= రాజ్యాన్ని; సురలకున్= దేవతలకు; నాశంబున్= క్షీణత్వాన్ని; సొరిదిన్= క్రమంగా; ఇచ్చి= ఒసగి; విపరీతముగన్= తారుమారుగా; చేయు= ఒనర్చునట్టి; వేల్పున్= దేవుని; ఏమి+అందుము= ఏమని పలుకుదము; మనపాలి= మనకురాసి పెట్టిన; భాగ్యంబు= అదృష్టం; మహిమకాక= మహత్తేకాక; వెఱచి= భయపడి; పలుమాఱున్= అనేక పర్యాయాలు; పాఱెడి= పారిపోవునట్టి; విష్ణుభటులు= హరిసైనికులు; మిమ్మున్= తమందరిని; ఎగచుట= తరుముట; దైవంబుమేరగాదె= దైవాధీనంకదా!; మనకున్= మనకు; ఎప్పుడు= ఏ కాలమందు; దైవంబు= అదృష్టం; మంచిదగును= ఉత్తమమయినది అగునో; నాఁడు= అప్పుడు; పగవారిన్= విరోధులను; గెలుతము= జయింతము; నేఁడు వలదు= ఇప్పుడు వద్దు.

**తా :** ఓ రాక్షసవీరులారా! కలహించక రండి. పోరుచేయటానికి ఇది సరయిన సమయంకాదు. సకలజీవకోటికి సంపదల నివ్వడానికి, ఆపదలు కలిగించడానికి అధిపతిఅయిన భగవంతుని పరాభవించటానికి మనం సమర్థులం కాము. పూర్వం

మనకు రాజ్యాన్నిచ్చి దేవతలను నశింపచేసిన దేవుని వైపరీత్యాన్ని ఏమందాం? మన సంపదయొక్క మహిమయేకదా ఇదంతా. భయపడి అనేక పర్యాయాలు పారిపోయిన దేవతలు మిమ్ములను తరుముట దైవనిర్ణయం. మన అదృష్టం ఎప్పుడు బాగుంటుందో ఆనాడే విరోధులను జయిద్దాం. ఇప్పుడు వద్దు.

**వ. అదియునుంగాక. 636**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాక.

**క. బలు దుర్గంబులు సచివులు, బలములు మంత్రౌషధములు బహుశేముషియుం**
**గలిగియు సామోపాయం, బులఁ గాల మెఱింగి నృపుఁడు పోరుట యొప్పున్. 637**

**ప్రతి :** బలు= బలుపైన (గొప్పవియగు); దుర్గంబులు= కోటలు; సచివులు= మంత్రులు; బలములు= సేనలు; మంత్ర= మంత్రాంగాలు; ఔషధములు= ఓషధులు; బహు= విస్తారమైన; శేముషియున్= బుద్ధియు; కలిగియు= ఉండినప్పటికి; సామోపాయంబులన్= సామదానభేదదండములు అనే నాలుగు ఉపాయాలచే; కాలమెఱింగి= సమయాసమయాలు తెలుసుకొని; నృపుడు= రాజు; పోరుట= కలహించుట; ఒప్పున్= తగును.

**తా :** గొప్పవైన కోటలు, మంత్రులు, దండు, మంత్రాంగాలు, ఔషధాలు, తెలివితేటలు ఉన్నప్పటికీ కాలాన్ని ఎరిగి సామదానభేదదండోపాయాలచే రాజు యుద్ధం చేయటం మంచిది.

**వ. అట్లు గావున రణంబున కిప్పుడు శత్రులకెదురు మోహరించుట కార్యంబు గాదు; మనకుం దగు కాలంబున జయింతము; నలంగక తలంగుఁ డనినఁ దలంగి భాగవత భట భీతులై చిక్కి రక్కసులు రసాతలంబునకుం జని; రంత హరి హృదయం బెఱింగి తార్క్ష్యనందనుండు యాగసుత్యాహంబున వారుణ పాశంబుల నసురవల్లభుని బంధించె; నంత. 638**

**ప్రతి :** అట్లుగావునన్= ఆ కారణంచే; రణంబునకు= యుద్ధానికి; ఇప్పుడు= ఈ సమయాన; శత్రువులకు= వైరులకు; ఎదురుమోహరించుట= ఎదిరించి వ్యూహంపన్నడం; కార్యంబుగాదు= మంచిపనికాదు; మనకున్= మనకు; తగుకాలంబునన్= మంచిదైన కాలంలో; జయింతము= గెలుచుకుందాం; నలంగక= అలసట చెందక; తొలంగుఁడు+అనినన్= తొలగిపొండి అనగా; తలంగి= వెనుదీసి; భాగవతభట= హరిభటులచే; భీతులై= భయపడినవారయి; చిక్కి= కృశించి; రక్కసులు= రాక్షసులు; రసాతలంబునకున్+చనిరి= పాతాళలోకానికి పోయినారు; అంతన్= అపుడు; హరి= విష్ణుమూర్తియొక్క; హృదయంబు+ఎఱింగి= చిత్తమునుగ్రహించి; యాగ= యజ్ఞంలో; సుత్య= సోమపానం చేయునట్టి; అహంబునన్= పగటిపూట; తార్క్ష్యనందనుండు= తార్క్ష్యుడు అనే విష్ణుభటుని కుమారుడు; వారుణపాశంబులన్= వరుణపాశములతో; అసురవల్లభునిన్= బలిచక్రవర్తిని; బంధించెన్= కట్టివేసినాడు; అంత= పిమ్మట.

**తా :** 'ఇప్పుడు వైరులతో రణం చేయటం సరికాదు. మనకు అనుకూలమైన సమయంలో జయించవచ్చు. అనవసరంగా శ్రమించక తొలగిపొండి' అని బలిచక్రవర్తి చెప్పినాడు. అప్పుడు విష్ణుభటులకు భయపడి రాక్షసులు పాతాళలోకానికి వెళ్లినారు. ఆ తర్వాత యాగంలో సోమపానం చేసే చివరిదినాన విష్ణువు అభిప్రాయాన్ని తెలుసుకున్న తార్క్ష్యనందనుడు వరుణపాశాలతో బలిచక్రవర్తిని బంధించినాడు.

**క. బాహులుఁబదములుఁగట్టిన, 'శ్రీహరికృప గాక యేమి సేయుదు?' నని సం**
**దేహింపక బలి నిలిచెను, హాహారవ మెసఁగె దశ దిగంతములందున్. 639**

**ప్రతి :** బాహులున్= చేతులును; పదములున్= కాళ్లను; కట్టినన్= బంధిస్తే; శ్రీహరి= విష్ణుమూర్తియొక్క; కృపగాక= దయయేగాక; ఏమిచేయుదున్+అని= ఏమిచేయువాడను అని; సందేహింపక= సంశయించక; బలి= బలిచక్రవర్తి; నిలిచెను= నిలబడినాడు; దశదిగంతములందున్= పది దిక్కుల చివరిభాగాల్లో; హాహారవము= హా! హా! అనే శబ్దం; ఎసగెన్= వ్యాపించింది.

**తా :** చేతులూ, కాళ్లూ కట్టివేయగా 'ఇదంతా హరికృపయే ఏమిచేయగలను' అనుకొంటూ, ఏ సంశయం లేకుండా బలి నిలబడిపోయినాడు. దశదిశలలో హాహాకారాలు ధ్వనించాయి.

**క. సంపద సెడియును దైన్యముఁ, గంపంబును లేక తొంటికంటెను బెంపుం**
**దెంపును నెఱుకయు ధైర్యము, వంపని సురవైరిఁజూచి వటుఁడిట్లనియెన్. 640**

**ప్రతి :** సంపద+చెడియును= భాగ్యము పోయినను; దైన్యమున్= దీనత్వమును; కంపంబును= వణకును; లేక= లేనివాడై; తొంటికంటెను= మునుపటికన్నను; పెంపున్= ఆధిక్యమును; తెంపును= తెగువయును; ఎఱుకయు= జ్ఞానమును; ధైర్యమున్= సాహసమును; వంపని= తగ్గింపని; సురవైరిన్= దేవతల శత్రువగుబలిచక్రవర్తిని; చూచి= కని; వటుఁడు= బ్రహ్మచారి; ఇట్లనియెన్= ఈ విధముగా పలికినాడు.

**తా :** భాగ్యాలు పోయినా బలిచక్రవర్తిలో దీనత్వం, కంపం కలుగలేదు. మునుపటికన్నా తెగువ, జ్ఞానం, ధైర్యం ఎక్కువైనాయి. ఆ బలిని చూచి వామనుడు ఇలా అన్నాడు.

**సీ. దానవ! త్రిపదభూతల మిత్తు నంటివి ధరణిఁ జంద్రార్కు లెందాఁక నుందు**
**రంతభూమియు నొక్క యడుగయ్యె నాకును;, స్వర్లోకమును నొక్క చరణమయ్యె;**
**నీ సొమ్ము సకలంబు నేఁడు రెండడుగులు; గడమ పాదమునకుఁగలదె భూమి?**
**యిచ్చెద నన్నర్థ మీని దురాత్ముండు నిరయంబుఁబొందుట నిజము గాదె?**

**తే. కాన దుర్గతికిని గొంతకాల మరుగు, కాక యిచ్చెదవేని వేగంబు నాకు**
**నిపుడు మూఁడవ పదమున కిమ్ము చూపు, బ్రాహ్మణాధీనములు ద్రోవ బ్రహ్మవశమె? 641**

**ప్రతి :** దానవ= రాక్షసా!; త్రిపదభూతలము= మూడడుగులనేల, దానము; ఇత్తునంటివి= ఇస్తానని చెప్పినావు; ధరణిన్= లోకంలో; చంద్ర+అర్కులు= చంద్రుడు సూర్యుడు; ఎందాఁకన్= ఎక్కడి వరకు; ఉందురు= ఉంటారో; అంతభూమియున్= అక్కడి వరకు ఉన్న భూమి; నాకున్ ఒక్క అడుగయ్యెన్= నాకు ఒక పాదం అయింది; స్వర్లోకమును= స్వర్గలోకంకూడా; ఒక్కచరణమయ్యెన్= ఒకపాదం అయింది; నీ సొమ్ము= నీ ఆస్తి; సకలమ్ము= అంతా; నేఁడు= ఈనాడు; రెండడుగులు= రెండడుగులనేలమాత్రం; కడమపాదమునకున్= తక్కిన మూడవ అడుగునకు; కలదె భూమి= భూమి ఉందా?; ఇచ్చెదను+అన్న= ఇస్తానని చెప్పిన; అర్థము= ధనం; ఈని= ఈయని; దురాత్ముండు= చెడుమనసుకలవాడు; నిరయంబున్= నరకాన్ని; పొందుట= పొందడం; నిజముగాదె= సత్యంకాదా?; కాన= కావున; దుర్గతికిని= నరకానికి; కొంతకాలము; అరుగు=

వెళ్ళు; కాక= అలా కాకుంటే; ఇచ్చెదవు+ఏని= ఇవ్వగలవేని; వేగంబ= శీఘ్రంగా; నాకున్= నాకు; ఇపుడు; మూఁడవ పదమునకున్= మూడవ అడుగునకు; ఇమ్మున్= చోటును; చూపు= చూపించు; బ్రాహ్మణ+అధీనములు= విప్రుల వశమైనవి; త్రోవన్= త్రోసివేయుటకు; బ్రహ్మవశమె?= విధాతకైనా శక్యమా!

**తా :** ఓ దానవా! మూడడుగుల నేలను దానమిస్తానంటివి. భూలోకం సూర్యచంద్రులు ఉండేస్థలం నాకు ఒక అడుగైనది. స్వర్గలోకం ఒక అడుగైనది. నీ ఆస్తి అంతా నాకు రెండడుగులైనది. తక్కిన మూడవ పాదానికి భూమి ఉందా? ఇస్తానన్నదాన్ని ఇవ్వకుంటే నరకానికి వెళ్లవలసిరావడం నిజం. అందువల్ల నరకానికి కొంతకాలం వెళ్లు. అలాకాకుండా మూడవ అడుగు ఇవ్వదలిస్తే వెంటనే నాకు మూడవ అడుగుకు చోటును చూపించు. బ్రాహ్మణుల స్వాధీనంలో ఉన్నవానిని కాదనడానికి బ్రహ్మకు కూడా సాధ్యంకాదు.

**వ. అని యిట్లు వామనుండు పలుక సత్యభంగ సందేహ విషదిగ్ధ శల్యనికృత్త హృదయుండయ్యును విషణ్ణుండు గాక వైరోచని ప్రసన్నవదనంబుతోడఁజిన్నిప్రోడ వడుగున కి ట్లనియె. 642**

**ప్రతి :** అని; ఇట్లు= ఈ విధంగా; వామనుండు పలుకన్= వామనుడు చెప్పగా; సత్య= నిజముయొక్క; భంగ= చెడుటయొక్క; సందేహ= సంశయమను; విష= విషంచే; దిగ్ధ= పూయబడిన; శల్య= శూలం/మేకుచే; నికృత్త= గుచ్చబడిన; హృదయుండయ్యును= మనస్సుకలవాడై కూడా; విషణ్ణుండు= విచారాన్నిపొందినవాడు; కాక; వైరోచని= విరోచనుని కొడుకగు బలిచక్రవర్తి; ప్రసన్న= సంతోషముతో కూడిన; వదనంబుతోడన్= ముఖంతో; చిన్ని= చిన్నవాడును; ప్రోడ= నేర్పరియు అగు; వడుగునకున్= బ్రహ్మచారికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ విధంగా పలికిన వామనుని మాటలు విని 'సత్యం భంగమవుతుందేమో' అనే అనుమానం కలిగింది బలిచక్రవర్తికి. అది విషపు ములికివలె ఆయన మనస్సును గాయపరచింది. అయినా ఆయన దిగులుచెందక ప్రసన్నంగా నేర్పరి అయిన వామనునితో ఇలా అన్నాడు.

**ఆ. సూనృతంబ గాని సుడియదు నా జిహ్వ, బొంకఁజాల; నాకు బొంకు లేదు;**
**నీ తృతీయపదము నిజము నా శిరమున, నెలవు సేసి పెట్టు నిర్మలాత్మ! 643**

**ప్రతి :** నిర్మల+ఆత్మ= నిర్మలమైన మనస్సుకలవాడా!; నా జిహ్వ= నా నాలుక; సూనృతంబు+అ+కాని= నిజమునే పలుకుతుంది గాని; సుడియదు= వెనుకకు మరలుకొనదు; బొంకన్ చాలన్= అసత్యాన్ని ఆడలేను; నాకు; బొంకులేదు= అనృతంలేదు; నీ తృతీయపదము= నీ మూడవ అడుగు; నిజము= సత్యంగా; నా శిరమునన్= నా తలపై; నెలవుచేసి= స్థానంచేసి; పెట్టు= ఉంచు.

**తా :** నిర్మలాత్మా! నా నాలుక సత్యమే వచిస్తుంది. అబద్ధా లాడజాలదు. నాకు అనృతం లేదు. నీ మూడవ అడుగును నా తలపై ఉంచు.

**ఆ. నిరయమునకుఁ బ్రాప్తనిగ్రహంబునకును, బదవిహీనతకును బంధనమున**
**కర్థభంగమునకు నఖిలదుఃఖమునకు, వెఱవ దేవ! బొంక వెఱచినట్లు. 644**

**ప్రతి :** దేవ= స్వామీ!; నిరయంబునకున్= దుర్గతికిని; ప్రాప్త= పొందబడిన; నిగ్రహంబునకును= శిక్షకును; పదవిహీనతకును= పదభ్రష్టతకును; బంధనమునకున్= కట్టివేయబడుటకు; అర్థభంగమునకున్= ధననష్టమునకును;

అఖిలదుఃఖమునకున్= వచ్చిన ఈ దుఃఖానికంతటికి; బొంకన్= అసత్యమాడుటకు; వెఱచినట్లు= భయపడినట్లు; వెఱవన్= భయపడను.

**తా :** దేవా! దుర్గతికి, శిక్షకు, పదభ్రష్టతకు, బంధనానికి, ధననష్టానికి, వచ్చిన ఈ దుఃఖానికి భయపడను. అసత్యం పలుకడానికి మాత్రమే భయపడతాను.

**వ. అదియునుంగాక. 645**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక.

**సీ. తల్లిదండ్రులు, నన్నదమ్ములుఁ, జెలికాండ్రు, గురువులు శిక్షింపఁగొఱఁతవడునె?**
**పిదప మేలగుఁగాక! పృథుమదాంధులకును దానవులకు మాకుఁదఱియెఱింగి**
**విభ్రంశచక్షువు వెలయ నిచ్చుటఁజేసి గురువులలో నాదిగురువ వీవ;**
**నీవు బంధించిన నిగ్రహమో లజ్జయో నష్టియో బాధయో తలంప**

**తే. నిన్ను నెదిరించి పోరాడి నిర్జరారు, లాది యోగీంద్రు లందెదునట్టి టెంకి**
**నందరే తొల్లి పెక్కండ్రు? హర్షమూర్తి!, యీశ! నీయెడ దుర్లభమేమి గలదు? 646**

**ప్రతి :** తల్లిదండ్రులున్= జననీజనకులును; అన్నదమ్ములున్= సోదరులును; చెలికాండ్రున్= స్నేహితులును; గురువులున్= ఉపాధ్యాయులును; శిక్షింపన్= శిక్షించినయెడల; కొఱఁతవడునె= తక్కువగునా?; పిదప= తరువాత; మేలు+అగున్+కాక= మంచి జరుగుతుంది కదా!; పృథు= గొప్ప; మద+అంధులకును= మదమున కన్నుగాననిి; దానవులకు= రాక్షసులమైన; మాకున్= మాకు; తఱి యెఱింగి= సమయము తెలిసికొని; విభ్రంశ= నాశనము కాని; చక్షువున్= కంటిని (దివ్యదృష్టిని); వెలయన్= ఒప్పగా; ఇచ్చుటన్+చేసి= ఒసగుటచే; గురువులలోన్= ఒజ్జలందరిలోనూ; ఆదిగురువు= మొదటిగురువు; ఈవ= నీవే; నీవు; బంధించినన్= కట్టివేసినా; తలంపన్= ఆలోచిస్తే ఆ కట్టివేయడం; నిగ్రహమో= చెరయో (శిక్షయో); లజ్జయో= సిగ్గో; నష్టియో= నష్టమో; బాధయో= పీడయో (ఏదీకాదు); నిన్నున్= నిన్ను; ఎదిరించి= ఎదుర్కొని; పోరాడి; నిర్జర+అరులు= రాక్షసులు; తొల్లి= పూర్వము; పెక్కండ్రు= అనేకులు; ఆది= పూర్వపు; యోగీంద్రులు= మునివరులు; అందెదునట్టి= పొందునట్టి; టెంకిన్= స్థానమును; అందరే= పొందలేదా?; హర్షమూర్తి!= ఆనందస్వరూపా!; ఈశ= ప్రభూ!; నీయెడన్= నీ యందు; దుర్లభము= పొందరానిది; ఏమికలదు= ఏముంది?

**తా :** ఓ ఆనందస్వరూపా! ప్రభూ! జననీజనకులు, అన్నదమ్ములు, మిత్రులు, ఉపాధ్యాయులు శిక్షిస్తే మేలే జరుగుతుంది కానీ కీడురాదు. మదాంధులమైన మాకు సమయానికి దివ్యదృష్టిని ఇచ్చినావు. అందువల్ల గురువులలో నీవే మొదటివాడవు. నీవు బంధించినావనీ చెరపెట్టినావనీ నేను లోటుగాకానీ, బాధగాకానీ, భావించను, సిగ్గుపడను. నిన్ను ఎదిరించి రాక్షసులు ముందు మునీంద్రులు పొందునట్టి స్థానాన్ని (పరమపదాన్ని) పొందినారు గదా! స్వామీ! నీ నుండి పొందరానిది (ఇవ్వలేనిది) ఏముంది?

**మ. చెలియే మృత్యువు? చుట్టమే యముఁడు? సంసేవార్థులే కింకరుల్?**
**శిలలంజేసెనె బ్రహ్మ దన్ను? దృఢమే జీవంబు? నో చెల్లరే!**

**చలితంబౌట యెఱుంగ కీ కపట సంసారంబు నిక్కంబుగాఁ**
**దలఁచున్ మూఢుఁడు సత్యదానకరుణాధర్మాదినిర్ముక్తుఁడై. 647**

**ప్రతి :** మృత్యువు= మృత్యుదేవత; చెలియే= స్నేహితురాలా!; యముఁడు= జముడు; చుట్టమే= బంధువా?; కింకరుల్= యమకింకరులు; సంసేవార్థులే= సేవను కోరేవారా!; తన్నున్= తనను; బ్రహ్మ= విధాత; శిలలన్= రాళ్లచే; చేసెనె= నిర్మించినా?; ఓ చెల్లరే= అయ్యయ్యో; జీవంబును= ప్రాణమునూ; దృఢమే= గట్టిదా?; చలితంబు+ఔట= చలించునట్టిదగుట; ఎఱుంగక= తెలిసికొనలేక; మూఢుఁడు= జ్ఞానహీనుడు; సత్య= సత్యము; దాన= దానము; కరుణా= దయ; ధర్మ= ధర్మము; ఆది= మొదలయినవానితో; నిర్ముక్తుఁడై= విడిచిపెట్టబడినవాడయి; ఈ కపటసంసారంబున్= ఈ కుత్సితమయిన సంసారాన్ని; నిక్కంబుగాన్= నిజమైనదానినిగా; తలఁచున్= ఊహిస్తాడు.

**తా :** అయ్యయ్యో! మృత్యుదేవత స్నేహితురాలుకాదు, యముడు చుట్టంకాదు. యమకింకరులు సేవకులుకారు. బ్రహ్మ ఈ శరీరాన్ని రాతితో చేయలేదు. బుద్ధిహీనుడు – సత్యం, దానం, దయ, ధర్మం, మొదలయిన వాటిని విడనాడి ఈ మాయాసంసారమే సత్యమని భావిస్తున్నాడు.

**సీ. చుట్టాలు దొంగలు; సుతులు ఋణస్థులు; కాంతలు సంసారకారణములు;**
**ధనము లస్థిరములు; దను వతి చంచల; కార్యార్థు లన్యులు గడచుఁగాల**
**మాయువు సత్వర మైశ్వర్య మతిశీఘ్రమని కాదె తమ తండ్రి నతకరించి**
**మా తాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు నీ పాదకమలంబు నియతిఁ జేసె**

**తే. భద్రుఁ డతనికి మృతిలేని బ్రదుకు గలిగె, వైరులై కాని తొల్లి మావారు గాన**
**రర్థివై వచ్చి నీవు న న్నడుగు టెల్లఁ, బద్మలోచన! మా పుణ్యఫలము గాదె? 648**

**ప్రతి :** చుట్టాలు= బంధువులు; దొంగలు= చోరులు; సుతులు= పుత్రులు; ఋణస్థులు= అప్పుగలవారు; కాంతలు= భార్యలు; సంసారకారణములు= సంసారానికి హేతువైనవారు; ధనములు= భాగ్యములు; అస్థిరములు= అశాశ్వతమైనవి; తనువు= శరీరము; అతిచంచల= మిక్కిలి చలనముకలది; అన్యులు= ఇతరులు; కార్యార్థులు= పనికోసం వచ్చినవారు; కాలము; కడచున్= గడిచిపోతుంది; ఆయువు= ఆయుర్దాయము; సత్వరము= త్వరతోకూడినది; ఐశ్వర్యము= సంపద; అతిశీఘ్రము= మిక్కిలివేగము కలది; అనికాదె= అనియేకదా; సాధుసమ్మతుఁడు= సజ్జన సహితుడు; మా తాత= మా పితామహుడు; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడనువాడు; తమ తండ్రిన్= తమజనకుని; అతకరించి= తిరస్కరించి (అధఃకరించు అనేదానికి వికృతి); నీ పాదకమలంబున్= నీపాదపద్మమును; నియతిన్= నిష్ఠతో; చేసెన్= అంగీకరించాడు; భద్రుఁడు= మంగళప్రదుడగు; అతనికి= ప్రహ్లాదునికి; మృతిలేని= చావులేని; బ్రతుకు= జీవనము; కలిగెన్= కలిగింది; తొల్లి= పూర్వము; మావారువైరులైకాని= మా వారు విరోధులయితే తప్ప; కానరు= నిన్ను దర్శింపలేకపోయారు; నీవు; అర్థివైవచ్చి= యాచకుడవుగా ఏతెంచి; నన్ను అడుగుటఎల్లన్= నన్ను కోరుట అంతా; పద్మలోచన= కమలమువంటికన్నులుకల ఓ హరీ!; మా పుణ్య ఫలముగాదె= మేము చేసుకున్న సుకృతఫలమేకదా!

**తా :** ఓ హరీ! మా తాత ప్రహ్లాదుడు 'బంధువులు దొంగలు, పుత్రులు ఋణస్థులు, భార్యలు సంసారమునకు సంబంధించినవారు, ధనాలు అస్థిరాలు, శరీరం నిలుకడలేనిది, ఇతరులు తమ ప్రయోజనాలను ఆశించి వచ్చినవారు, కాలం నిలువనిది,

అయుర్దాయం త్వరగా గడుస్తుంది, సంపద తొందరగా వెళ్లిపోతుంది' అనియేకదా! తన తండ్రిని ధిక్కరించి నీ పాద కమలాలను సేవించినాడు. అతనికి చిరంజీవత్వం కలిగింది. పూర్వం మావారు శత్రుత్వంతోనే నిన్ను పొందినారు. నీవు యాచకుడవై వచ్చి నన్నడగటం నాపుణ్యఫలమే కదా!

**వ. అని యిట్లు పలుకుచున్న యవసరంబున. 649**

**ప్రతి :** అని; ఇట్లు= ఈ విధంగా; పలుకుచున్న= చెబుతున్న; అవసరంబునన్= సమయాన.

**శా. ఆ దైత్యేంద్రుఁడు పీనవక్షు, నవపద్మాక్షుం, బిశంగాంబరా**
**చ్ఛాదున్, నిర్మలసాధువాదు, ఘనసంసారాదివిచ్ఛేదు, సం**
**శ్రీదున్, భక్తిలతాతిరోహిత హరి శ్రీపాదు నిఃఖేదుఁ బ్ర**
**హ్లాదున్ బోధకళావినోదుఁగనియెన్ హర్షంబుతో ముందటన్. 650**

**ప్రతి :** పీనవక్షున్= బలిసిన ఉరముగలవానిని; నవ= నూతనమయిన; పద్మాక్షున్= తామరల వంటి కన్నులుగలవానిని; పిశంగ= పసుపువర్ణముగల; అంబర= వస్త్రముచే; ఆచ్ఛాదున్= కప్పుకొన్నవానిని; నిర్మల= స్వచ్ఛమయిన; సాధు వాదున్= ప్రశంసావాక్యాలు కలవానిని; ఘన= గొప్పదయిన; సంసార+ఆది= చావుపుట్టుకలు గల సంసారాదులను; విచ్ఛేదున్= ఛేదించినవానిని; సంశ్రీదున్= లక్ష్మీప్రదుడయినవానిని; భక్తిలతా= భక్తి అనే లతలతో; తిరోహిత= కప్పబడిన; హరిశ్రీపాదున్= శ్రీహరి మంగళకరమైన పాదాలు గలవానిని; నిస్+ఖేదున్= దుఃఖములేనివానిని; బోధకళా= జ్ఞానవిద్యయందు; వినోదున్= వినోదముకలవానిని; ప్రహ్లాదున్= ప్రహ్లాదుని; ఆ దైత్యేంద్రుఁడు= రాక్షసరాజగు ఆ బలిచక్రవర్తి; హర్షంబుతోన్= సంతోషంతో; ముందటన్= ఎదుట; కనియెన్= చూచినాడు.

**తా :** విశాల వక్షఃస్థలము కలవాడు, తామరలవంటి కన్నులుగలవాడు, పసుపుపచ్చని వస్త్రాన్ని కప్పుకున్నవాడు, స్వచ్ఛమైన ప్రశంసా వాక్యాలు కలవాడు; సంసారాదులను ఛేదించినవాడు, లక్ష్మీప్రదుడు, భక్తిలతలచే కప్పబడిన శ్రీహరి పాదాలు కలవాడు, దుఃఖం లేనివాడు, జ్ఞానవిద్యయందు వినోదం కలవాడు అయిన ప్రహ్లాదుని ఆ బలిచక్రవర్తి సంతోషంతో తన ఎదుట చూచినాడు.

**వ. ఇట్లు సమాగతుండైన తమ తాతం గనుంగొని విరోచన నందనుండు వారుణపాశబద్ధుండు గావునఁ దనకుం దగిన నమస్కారంబు సేయరామింజేసి సంకులాశ్రువిలోల లోచనుండై సిగ్గుపడి నతశిరస్కుండై నమ్రభావంబున మ్రొక్కు సెల్లించె; నంతఁ బ్రహ్లాదుండు ముఖమండపంబున సనందాది పరిచర సమేతుండై కూర్చున్న వామనదేవునిం గని యానందబాష్పంబులుఁ బులకాంకురంబులున్ నెఱయ దండప్రణామం బాచరించి యిట్లని విన్నవించె. 651**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సమాగతుండు+ఐన= వచ్చిన; తమతాతన్= తమయొక్క పితామహుని; కనుంగొని= చూచి; విరోచననందనుండు= బలి; వారుణపాశబద్ధుండు గావునన్= వరుణపాశములచే కట్టబడినవాడుగాన; తనకున్= తనకు; తగిన= అర్హమయిన; నమస్కారంబు= నమస్కృతి; చేయరామింజేసి= చేయలేకుండుటచే; సంకుల= వ్యాపించిన; అశ్రు= బాష్పములచే; విలోల= మిక్కిలి చంచలములయిన; లోచనుండు+ఐ= నేత్రములు కలవాడయి; సిగ్గుపడి= లజ్జించి;

నతశిరస్కుండు+ఐ= తలవంచినవాడై; నమ్ర భావంబునన్= వినయంతో; మ్రొక్కు+చెల్లించెన్= నమస్కరించినాడు; అంతన్= అటుతరువాత; ప్రహ్లాదుండు; ముఖమండపంబునన్= మొగసాలలో; సనంద+ఆది= సనందుడు మొదలైన; పరిచరసమేతుండు+ఐ= పరిచరులతో కలసి; కూర్చున్న; వామనదేవునిన్+కని= భగవంతుడగు వామనమూర్తిని కాంచి; ఆనంద= సంతోషముతో కూడిన; బాష్పంబులున్= కన్నీరును; పులక+అంకురంబులున్= గగురుపాటులును; నెఱయన్= నిండగా; దండప్రణామంబు= సాష్టాంగనమస్కారము; ఆచరించి= చేసి; ఇట్లని= ఈ విధంగా; విన్నవించెన్= విన్నపం చేసినాడు.

**తా :** ఇట్లా వచ్చిన తమ తాతను చూచిన బలిచక్రవర్తి వరుణపాశాలతో కట్టివేయబడి ఉండటంవలన నమస్కారం చేసేందుకు వీలులేకపోయింది. బలికి కన్నులలో నీళ్ళువచ్చినవి. సిగ్గుతో తలవంచుకొని తాతకు నమస్కారం చేసినాడు. యజ్ఞమండపం(మొగసాల)లో సనందుడు మొదలయిన పరిచరులతోకూడి కూర్చొని ఉన్న వామనునికి ప్రహ్లాదుడు ఆనందబాష్పాలు గగుర్పాటు ఒప్పారగా సాష్టాంగనమస్కారాన్ని చేసి ఇలా అన్నాడు.

**విశే :** బలి దుఃఖపడింది తన ఐశ్వర్యం పోయిందనో, తాను బంధితుడ నైనా ననోకాదు. పెద్దలకు (తన తాత ప్రహ్లాదునికి) నమస్కరించే అవకాశం లేకపోయిందని మాత్రమే దుఃఖించినాడు. ఇలాంటి ధర్మసూక్ష్మాలు భాగవతంలో అనేకం.

**సీ. ఇతనికి మున్ను నీ వింద్రపదం బిచ్చి నేఁడు త్రిప్పుటయును నెఱయ మేలు**
**మోహనాహంకృతి మూలంబు గర్వాంధ తమసవికారంబు దాని మాన్పి**
**కరుణ రక్షించుటగాక బంధించుటే? తత్త్వజ్ఞునకు మహేంద్రత్వమేల?**
**నీ పాదకమలంబు నియతిఁ గొల్చిన దానిఁ, బోలునే సురరాజ్యభోగపరత?**

**తే. గర్వమేపారఁ గన్నులు గానరావు;, చెవులు వినరావు; చిత్తంబు సిక్కుపడును;**
**మఱచు నీ సేవలన్నియు మహిమ మాన్పి, మేలు సేసితి నీ మేటి మేర సూపి. 652**

**ప్రతి :** ఇతనికిన్= ఈ బలికి; నీవు; మున్ను= ముందు; ఇంద్రపదంబు+ఇచ్చి= ఇంద్రపదవిని ఒసగి; నేఁడు= ఇపుడు; త్రిప్పుటయును= ఆ పదవినుండి తొలగించడం; నెఱయమేలు= చాలామంచిది; మోహన= మోహముతో కూడిన; అహంకృతి= అహంకారానికి; మూలంబు= మొదలు; గర్వ= గర్వమను; అంధతమస= గాఢాంధకారముయొక్క; వికారంబు= వికృతి; దానిన్= అట్టి దానిని; మాన్పి= పోగొట్టి; కరుణన్= దయతో; రక్షించుటగాక= కాపాడడమే గాక; బంధించుటే= ఇది బంధించడం కాదు; తత్త్వజ్ఞునకు= జ్ఞానశీలునకు; మహేంద్రత్వము+ఏల= ఇంద్రపదవి ఎందులకు?; సురరాజ్యభోగపరత= స్వర్గరాజ్యవైభవమందలి ఆసక్తి; నీ పాదకమలంబున్= నీ పాదపద్మాన్ని; నియతిన్= నిష్ఠతో; కొల్చిన దానిన్= సేవించినదానిని; పోలునే= సరిపోవునే?; గర్వము+ఏపారన్= గర్వముపెరుగగా; కన్నులు; కానరావు= అగుపించవు; చెవులు; వినరావు= వినిపించవు; చిత్తంబు= మనస్సు; చిక్కు+పడును= చిక్కుచెందును; నీసేవలు+అన్నియున్= నిన్ను సేవించే విధానాలన్నింటినీ; మఱచున్= మరచిపోవును; మహిమమాన్పి= మహత్త్వాన్ని పోగొట్టి; నీ మేటి మేర+చూపి= నీ గొప్ప తనమంతా చూపించి; మేలుచేసితి= మంచి (పని) చేసినావు.

**తా :** ఈ బలికి మునుపు నీవు ఇంద్రపదవిని ఇచ్చి ఇప్పుడు మరల తీసుకోవటం చాలా మేలైనది. ఆ పదవి అజ్ఞానానికి అహంకారానికి మూలకారణమైనది. గర్వం అనే కారుచీకటిని కలిగించేది. అలాంటి దానిని పోగొట్టడమంటే దయతో

రక్షించటమేగానీ బంధించటంకాదు. జ్ఞానవంతునికి మహేంద్రత్వం ఎందుకు? అది నీ పాదసేవనానికి సమానం అవుతుందా? ఆ పదవితో గర్వం ఎక్కువై కన్నులు కనిపించవు, చెవులు వినపడవు, మనస్సు మైకం కమ్ముతుంది, నీ సేవా విధానాల నన్నింటినీ మరచిపోతాడు. అలాంటి పదవిని విడిపించి బలికి గొప్ప ఉపకారమే చేసినావు.

**వ. అని పలికి జగదీశ్వరుండు నిఖిలలోక సాక్షియు నగు నారాయణదేవునకు నమస్కరించి ప్రహ్లాదుండు పలుకుచున్న సమయంబున. 653**

**ప్రతి :** అని; పలికి= చెప్పి; జగదీశ్వరుండు= జగత్తునకు ప్రభువగు; నిఖిలలోక సాక్షియును= సకల ప్రపంచాలకూ సాక్షి అయినవాడునూ; అగు= అయిన; నారాయణదేవునకున్= శ్రీహరికి; నమస్కరించి= మొక్కి; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడు; పలుకుచున్న= వచిస్తున్న; సమయంబునన్= సమయంలో...

**తా :** ఈ విధంగా ప్రహ్లాదుడు జగత్ప్రభువూ జగత్సాక్షి అయిన విష్ణుమూర్తికి నమస్కరించి పలుకుతున్న సమయాన

**మ. తతమత్తద్విపయానయై కుచనిరుంధచ్చోళసంవ్యానయై**
**ధృతబాష్పాంబువితానయై కరయుగాధీనాలికస్థానయై**
**'పతిభిక్షాం మమ దేహి కోమలమతే! పద్మాపతే!' యంచుఁ ద**
**త్సతి వింధ్యావలి సేరవచ్చెఁద్రిజగద్రక్షామనున్ వామనున్. 654**

**ప్రతి :** తత= విస్తారమైన; మత్త= మదించిన; ద్విపయాన+ఐ= ఏనుగునడకలవంటి నడకలు కలదై; కుచ= పాలిండ్లపై; నిరుంధత్= కట్టబడిన; చోళ= రవికయు; సంవ్యానయై= ఉత్తరీయమూకలదియై; ధృత= ధరించబడిన; బాష్పాంబు= కన్నీళ్లయొక్క; వితానయై= సముదాయముకలదై; కరయుగ= రెండుచేతులకు; అధీన= వశమైన; అలికస్థానమై= నొసలుకలదై; కోమలమతే= మృదువైన మతికలవాడా!; పద్మాపతే= లక్ష్మికి భర్తఅయినవాడా!; మమ= నాకు; పతిభిక్షాం= భర్తృభిక్షను; దేహి= ఇమ్ము; అంచున్= అంటూ; తత్+సతి= ఆ బలిచక్రవర్తి భార్య; వింధ్యావలి= వింధ్యావలి అనే ఆమె; త్రిజగద్రక్షామనున్= ముల్లోకాలను రక్షించే ప్రభువైనవానిని; వామనున్= వామనమూర్తిని; చేరవచ్చెన్= సమీపించింది.

**తా :** బలిచక్రవర్తి భార్య వింధ్యావలి మందగమనంతో పాలిండ్లమీద రవిక, ఉత్తరీయం సవరించుకొన్నదై, కన్నీళ్లు కారుస్తూ, రెండు చేతులను నొసటిపై జోడించి, మృదువైన మనస్సు కలవాడైన రమాపతిని, తనకు పతిభిక్ష పెట్టమని ప్రార్థిస్తూ ముల్లోకాలను కాపాడే వామనమూర్తి చెంతకు వచ్చింది.

**వ. వచ్చి యచ్చేడియ తచ్చరణ సమీపంబునం బ్రణతయై నిలువంబడి యిట్లనియె. 655**

**ప్రతి :** వచ్చి; ఆ+చేడియ= ఆ స్త్రీ (వింధ్యావలి); తద్= ఆ వామనమూర్తియొక్క; చరణసమీపంబునన్= పాదాలదగ్గర; ప్రణత+ఐ= నమస్కరించినదియై; నిలబడి= నిలిచియుండి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**క. నీకుంగ్రీడార్థములగు, లోకంబుల జూచి పరులు లోకులు కుమతుల్**
**లోకాధీశుల మందురు, లోకములకు రాజ వీవ లోకస్తుత్యా! 656**

**ప్రతి :** లోకస్తుత్యా= లోకంచే స్తుతించదగినవాడా!; నీకున్= నీకు; క్రీడా+అర్థములు+అగు= విహారస్థలంగా ఉన్న; లోకంబులన్= లోకాలను; చూచి; పరులు= ఇతరులు; లోకులు= జనాలు; కుమతులు= కుత్సితబుద్ధి కలవారు;

లోకాధీశులము+అందురు= లోకాలకు ప్రభువులము అంటారు; లోకములకున్= సర్వలోకాలకున్నూ; రాజవు+ఈవ= నీవే రాజువు.

**తా :** లోకాలచే కొనియాడబడినవాడా! లోకాలు నీవు సంచరించే క్రీడాస్థలాలు. అలాంటిలోకాలకు కుత్సితబుద్ధులైనవారు తామే అధిపతులమని భావిస్తారు. లోకాలకు రాజువు నీవే.

**విశే :** ఈ పద్యం వింధ్యావలి మనో నిశ్చయాన్ని తెలుపుతున్నది. లోకాలకన్నిటికి ప్రభువు భగవంతుడే అనే విశ్వాసం ఆమె ప్రతి ఊహలోనూ ఉంది. అందుకే ఆమె 'కుమతుల్ లోకాధీశులమందురు లోకములకు రాజవీవ' అంటూ నిర్ధారణగా, నిశ్చయంగా చెప్పింది.

**క. కా దనఁడు పొమ్ము లే దీ, రాదనఁడు జగత్త్రయైకరాజ్యము నిచ్చెన్**
**నా దయితుఁగట్ట నేటికి?, శ్రీదయితాచిత్తచోర! శ్రితమందారా! 657**

**ప్రతి :** శ్రీదయితా చిత్తచోర= లక్ష్మీదేవి మనసును హరించినవాడా!; శ్రితమందారా= ఆశ్రితులకు కల్పవృక్షమా!; కాదనఁడు= కాదనిచెప్పడు; లేదు; పొమ్ము= వెళ్ళు; ఈరాదు+అనఁడు= ఈయకూడదు అనడు; జగత్త్రయ+ఏక రాజ్యమున్= ముల్లోకముల పర్యంతమగు రాజ్యమంతా, ఇచ్చెన్= దానముచేసినాడు; నా దయితున్= నా పతిని; కట్టన్+ఏటికి= బంధించడం ఎందుకు?

**తా :** లక్ష్మీదేవి మనస్సును దోచినవాడా! ఆశ్రితమందారా! 'కాదు – లేదు – పొమ్ము – ఇవ్వను' అని నా భర్త నిరాకరించకుండా ముల్లోకాల పర్యంతమైన రాజ్యాన్ని నీకు ధారపోసినాడు. అలాంటి నా పతిని ఎందుకు బంధించినావు?

**వ. అని యిట్లు వింధ్యావళియుం బ్రహ్లాదుండును విన్నవించు నవసరంబున హిరణ్యగర్భుండు సనుదెంచి యిట్లనియె. 658**

**ప్రతి :** అని= అలా పలికి; ఇట్లు= ఈ విధంగా; వింధ్యావళియున్= బలిభార్య అయిన వింధ్యావళి; ప్రహ్లాదుండును= బలి తాత అయిన ప్రహ్లాదుడూ; విన్నవించు= విన్నపంచేసుకునే; అవసరంబునన్= సమయంలో; హిరణ్యగర్భుండు= బ్రహ్మ; చనుదెంచి= వచ్చి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అలా ప్రహ్లాదుడు వింధ్యావళి విన్నవించిన పిమ్మట విధాత వచ్చి వామనమూర్తితో ఇలా అన్నాడు.

**సీ. భూతలోకేశ్వర! భూతభావన! దేవదేవ! జగన్నాథ! దేవవంద్య!**
**తనసొమ్ము సకలంబుఁ దప్పక నీ కిచ్చె దండయోగ్యుఁడు గాఁడు దానపరుఁడు;**
**గరుణింప నర్హుండు గమలలోచన! నీకు; విడిపింపు మీతని వెఱపు దీర్చి;**
**తోయపూరము సల్లి దూర్వాంకురంబులఁ జేరి నీ పదము లర్చించునట్టి**

**తే. భక్తియుక్తుఁడు; లోకేశపదము నందు, నీవు ప్రత్యక్షముగ వచ్చి నేఁడు వేఁడ**
**నెటిఁగి తన రాజ్య మంతయు నిచ్చినట్టి, బలికిఁదగునయ్య దృఢపాశబంధనంబు? 659**

**ప్రతి :** భూతలోక+ఈశ్వర= సకల భూతలోకానికీ ప్రభువైనవాడా!; భూతభావన= పంచభూతాలను భావించువాడా!; దేవదేవ= దేవతలకు దేవుడవైనవాడా!; జగత్+నాథ= జగత్ప్రభూ!; దేవవంద్య= దేవతలచేత నుతించబడువాడా!; తనసొమ్ము=

తన సంపదను; సకలంబున్= సర్వమునూ; తప్పక= తప్పిపోక; నీకు+ఇచ్చెన్= నీకు ఇచ్చినాడు; దండయోగ్యుడుగాఁడు= దండించుటకు తగినవాడుకాదు; దానపరుఁడు= దాతృత్వమంటే ఆసక్తి కలవాడు; కమలలోచన= పద్మాక్షా!; నీకున్= నీకు; కరుణింపన్= దయ జూపుటకు; అర్హుండు= యోగ్యుడు (తగినవాడు); ఈతని వెఱపున్ తీర్చి= ఈయన భయాన్ని పోగొట్టి; విడిపింపుము= విడుదలచేయించుము; తోయపూరము+చల్లి= నీళ్లు చల్లి; దూర్వా+అంకురంబులన్= లేతగరిక పోచలతో; చేరి= సమీపించి; నీ పదములర్చించునట్టి= నీ చరణములను పూజించునట్టి; భక్తియుక్తుఁడు= భక్తితో కూడుకొన్నవాడు; లోకేశ పదమును+అందు= బ్రహ్మపదమును అందుకుంటాడు; నీవు; ప్రత్యక్షముగ వచ్చి= సాక్షాత్కరించి; నేఁడు= ఈ దినమున; వేఁడన్= యాచించగా; ఎఱిఁగి= తెలిసికొని; తనరాజ్య మంతయున్= తన రాజ్యమంతా; ఇచ్చినట్టి= ఒసగినట్టి; బలికిన్= బలిచక్రవర్తికి; దృఢ= గట్టి; పాశబంధనంబు= తాళ్ళతో కట్టుట; తగునయ్య= ఒప్పునా!

**తా :** దేవదేవా! దేవవంద్యా! జగన్నాథా! నీవు పరమాత్ముడవు. సకలప్రాణులను సంరక్షించి అభివృద్ధి చేసేవాడివి. బలిచక్రవర్తి గొప్ప దాత. ఈయన నీకు తన సంపదనంతా సమర్పించినాడు. ఈయన శిక్షింపతగినవాడు కాడు. కరుణింపదగినవాడు. ఈయనకు అభయ మొసగి బంధవిముక్తుణ్ణి చెయ్యి. ఇతడు ఉదకముతో అభిషేకించి గరికపోచలతో నీ పాదాలను అర్చించిన భక్తుడు. లోకాధిపతివైన నీవు స్వయంగా దరిచేరి అడగడాన్ని తెలిసికూడా తన రాజ్యాన్నంతా ఇచ్చినాడు. ఇలాంటి వాడిని తాళ్లతో కట్టివేయడం న్యాయమా?

**వ. అని పలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుం డిట్లనియె. 660**

**ప్రతి :** అని పలికిన= అని చెప్పిన; బ్రహ్మవచనంబులు= బ్రహ్మదేవునిమాటలు; విని= ఆలకించి; భగవంతుడు= శ్రీహరి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పినాడు.

**తా :** అలా చెప్పిన బ్రహ్మదేవుని మాటలు విని భగవంతుడు ఇలా చెప్పినాడు.

**సీ. 'ఎవ్వనిఁగరుణింప నిచ్ఛయించితి వాని యఖిలవిత్తంబు నే నపహరింతు**
**సంసారగురుమదస్తబ్ధుఁడై యెవ్వఁడు, దెగడి లోకము నన్ను ధిక్కరించు**
**నతఁడెల్లకాలంబు నఖిలయోనులయందుఁ బుట్టుచు దుర్గతిఁ బొందుఁ బిదప**
**విత్తవయోరూపవిద్యాబలైశ్వర్య కర్మజన్మంబుల గర్వ ముడిగి**

**తే. యేకవిధమున విమలుఁడై యెవ్వఁ డుండు, వాఁడు నా కూర్చి రక్షింపవలయువాఁడు;**
**స్తంభలోభాభిమానసంసారవిభవ, మత్తుఁడై చెడ నొల్లఁడు మత్పరుండు. 661**

**ప్రతి :** ఎవ్వనిన్= ఏవానిని; కరుణింపన్= దయజూచుటకు; ఇచ్ఛయించితివి= ఇష్టపడినానో; వాని= వానియొక్క; అఖిలవిత్తంబున్= సంపదనంతా; నేను; అపహరింతున్= హరిస్తాను; సంసార= సంసారసంబంధమయిన; గురు= అధికమైన; మద= మత్తతచే; స్తబ్ధుఁడై= అణగినవాడై; ఎవ్వఁడు= ఎవడు; తెగడి= దూషించి; లోకమున్= ప్రపంచాన్ని; నన్నున్= నన్ను; ధిక్కరించున్= తిరస్కరించునో; అతఁడు= అట్టివాడు; ఎల్లకాలంబున్= సర్వకాలమును; అఖిల= సమస్తమయిన; యోనులయందున్= గర్భములయందు; పుట్టుచున్= జన్మిస్తూ; దుర్గతిన్= నరకాన్ని; పొందున్= చెందును; పిదపన్= పిమ్మట; విత్త= ధనమందు; వయస్= వయస్సునందును; రూప= రూపమందును; విద్యా= విద్యయందును; బల= బలమందును; ఐశ్వర్య= సంపదలందును; కర్మ= కర్మలందును; జన్మంబులన్= పుట్టుకలందును; గర్వముడిగి= గర్వాన్ని

విడిచిపెట్టి; ఏకవిధమునన్= ఒకే మార్గమందు; విమలుఁడై= నిర్మలుడై; ఎవ్వఁడుండున్= ఎవడుండునో; వాఁడు= అట్టివాడు; నా కూర్చి= నన్ను గూర్చి; రక్షింపవలయువాఁడు= రక్షింపదగినవాడు; మత్పరుండు= నాయందు భక్తిగలవాడు; స్తంభ= మ్రాన్పడుటచే; లోభ= లుబ్ధత్వంచే; అభిమాన= ధనాదులచేగలుగు గర్వంచే; సంసార= సంసారం; విభవ= వైభవంచే; మత్తుఁడై= మదించినవాడై; చెడనొల్లఁడు= చెడిపోడు.

**తా :** నేను దయచూపాలనుకొన్నవాని సంపదనంతా అపహరిస్తాను. సంసార మత్తతచే అణగి ఎవ్వడు నన్ను దూషిస్తాడోవాడు ఎల్లకాలం సకలయోనులందు పుట్టుతుంటాడు. ఆ తర్వాత ఎవడైతే ధనానికీ వయస్సుకూ రూపానికీ విద్యకూ బలానికీ ఐశ్వర్యానికీ వృత్తికీ జన్మకు సంబంధించిన గర్వాన్ని విడిచిపెట్టి ఎప్పుడూ నిర్మలంగా ఉంటాడో వాడు నాచే రక్షించదగినవాడు. నా యందు భక్తికలవాడు అజ్ఞానంతో దురాశతో గర్వంతో సంసారవైభవాలచే మత్తుడై చెడిపోవాలని కోరుకోడు.

**శా. బద్ధుండై గురుశాపతప్తుఁడయి తా బంధువ్రజత్యక్తుఁడై**
**సిద్ధైశ్వర్యముఁగోలుపోయి విభవక్షీణుండునై పేదయై**
**శుద్ధత్వంబును సత్యముంగరుణయున్ సొంపేమియుందప్పఁ డు**
**ద్బుద్ధుండై యజయాఖ్యమాయ గెలిచెం బుణ్యుం డితం డల్పుఁడే? 662**

**ప్రతి :** బద్ధుండు+ఐ= కట్టుబడినవాడై; గురుశాపతప్తుఁడు+అయి= గురువగు శుక్రుని శాపంచేత తపించినవాడయి; తాన్= తాను; బంధువ్రజత్యక్తుఁడై= చుట్టముల గుంపునుండి విడువబడినవాడై; సిద్ధ+ఐశ్వర్యమున్= ఉన్న సంపదను; కోలుపోయి= పోగొట్టుకొని; విభవక్షీణుండునై= నశించిన వైభవంకలవాడై; పేదయై= బీదవాడై; శుద్ధత్వంబును=పరిశుద్ధతను; సత్యమున్= సత్యాన్ని; కరుణయున్= దయను; సొంపు= ప్రసన్నతను; ఏమియున్+తప్పఁడు= ఎంతమాత్రమూ విడువడు; ఉద్బుద్ధుండై= గొప్ప బోధకలవాడయి; అజయ+ఆఖ్య= అజయ అనే పేరుగల; మాయన్= మాయను; గెలిచెన్= జయించినాడు; పుణ్యుండు= పుణ్యాత్ముడు; ఇతఁడు= ఈ బలిచక్రవర్తి; అల్పుఁడే?= తక్కువవాడా? (కాదు అని)

**తా :** ఈ పుణ్యాత్ముడు బంధించబడినాడు. గురుశాపంవల్ల చలించినవాడయినాడు. చుట్టాలచే విడువబడినాడు. సంపదను అధికారాన్నీ పోగొట్టుకొని బీదవాడయినాడు. ఐనా శుచిత్వంతో ఉన్నాడు. సత్యాన్నీ, దయను ప్రసన్నతను ఏమాత్రం విడువలేదు. జ్ఞానియై గెలిచేందుకు వీలుకాని మాయను గెలిచినాడు. ఈ పుణ్యాత్ముడు అల్పుడు కాడు.

**అ. అసురనాథుఁడనుచు ననఘుని మర్యాద, యేను జూత మనుచు నింత వలుక**
**నిజము వలికె నితఁడు నిర్మలాచారుండు, మేలు మేలు నాకు మెచ్చువచ్చు. 663**

**ప్రతి :** అసురనాథుఁడు+అనుచున్= రాక్షసప్రభువు అని; అనఘుని= పాపరహితుడయిన వానియొక్క; మర్యాద= గౌరవము; ఏను= నేను; చూతము+అనుచున్= చూచెదనుగాక అని; ఇంత+పలుకన్= ఇంతగా పలుకగా; నిజము+పలికెన్= సత్యమును వచించెను; ఇతఁడు= ఈ బలి; నిర్మల= కలుషరహితమయిన; ఆచారుండు= ఆచారంకలవాడు; మేలు మేలు= బాగు బాగు; నాకు; మెచ్చువచ్చున్= సంతోషమయింది.

**తా :** రాక్షసరాజుకదా, ఈ పుణ్యాత్ముని నియమం ఎంతవరకో చూతమని నేను పరీక్షించగా ఇతడు సత్యానికే కట్టుబడినాడు. నిర్మలమైన ఈతని ప్రవర్తనను నేనెంతో మెచ్చుకొంటున్నాను.

**విశే :** వామనమూర్తిచేత ఇంతగా వాచ్యంగా మెప్పుపొందిన బలిచక్రవర్తి ధన్యుడు.

**క. సావర్ణిమనువు వేళను, దేవేంద్రుండగు నితండు దేవతలకు; దు**
**ర్భావిత మగు నా చోటికి, రావించెద; నంతమీఁద రక్షింతు దయన్. 664**

**ప్రతి :** సావర్ణిమనువు వేళను= సావర్ణి అనే మనువు పాలించేటప్పుడు; ఇతండు= ఈ బలి; దేవతలకున్= సురలకు; దేవేంద్రుండు+అగును= ఇంద్రుడుగా ఉంటాడు; దుర్భావితమగు= భావించేందుకు శక్యంకాని; నాచోటికిన్= నేనున్నస్థలానికి; రావించెదన్= పిలిపిస్తాను; అంతమీఁదన్= అటుపిమ్మట; దయన్= కరుణతో; రక్షింతున్= కాపాడుతాను.

**తా :** సావర్ణి మనువుకాలంలో ఇతడు (బలి) దేవతలకు ప్రభువై దేవేంద్రుడవుతాడు. ఎవరూ భావించలేని దుర్లభమైన నాచోటికి నేనే పిలిపిస్తాను. దయతో రక్షిస్తాను.

**క. వ్యాధులు దప్పులు నొప్పులు, బాధలు చెడి విశ్వకర్మభావిత దనుజా**
**రాధితసుతలాలయమున, నేధిత విభవమున నుండు నితఁ డందాఁకన్'. 665**

**ప్రతి :** వ్యాధులున్= రోగాలూ; దప్పులున్= దప్పికలు; నొప్పులున్= శ్రమలూ; బాధలున్= కష్టాలూ; చెడి= నశించి; విశ్వకర్మ= విశ్వకర్మచే; భావిత= భావింపబడి; దనుజ= రాక్షసులచే; ఆరాధిత= పూజింపబడుతున్న; సుతల+ఆలయమునన్= పాతాళాన; ఇతఁడు= ఈ బలి; అందాకన్= అంతపర్యంతము; (అనగా సావర్ణి మనువు సమయం వరకూ); ఏధిత= వృద్ధిపొందిన; విభవమునన్= వైభవంతో; ఉండున్= నివసించి ఉంటాడు.

**తా :** రోగాలు, దాహాలు, శ్రమలు, కష్టాలు మొదలయినవి లేకుండా విశ్వకర్మచే భావింపబడి రాక్షసులచే పూజింపబడుతున్న పాతాళలోకంలో అంతవరకు (సావర్ణిమనువుకాలం వచ్చేవరకు) బలి వైభవంగా ఉంటాడు.

**వ. అని పలికి బలిం జూచి భగవంతుం డిట్లనియె. 666**

**ప్రతి :** అని పలికి= అని చెప్పి; బలిన్+చూచి= బలిచక్రవర్తిని తిలకించి; భగవంతుండు= శ్రీహరి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికినాడు.

**సీ. సేమంబు నీ కింద్రసేనమహారాజ! వెఱవకు! మేలు నీ వితరణంబు**
**వేలుపు లందుండి వేడుక పడుదురు; దుఃఖంబు లిడుమలు దుర్మరణము**
**లాతురతలు నొప్పు లందుండువారికి నొందవు; సుతలమందుండు నీవు**
**నీ పంపు సేయని నిర్జరారాతుల నా చక్ర మేతెంచి నఱకుచుండు**

**ఆ. లోకపాలకులకు లోనుగా వక్కడ, నన్యు లెంతవార లచట?నిన్ను**
**నెల్ల ప్రొద్దు వచ్చి యేను రక్షించెదఁ, గరుణతోడ నీకుఁ గానవత్తు. 667**

**ప్రతి :** ఇంద్రసేన మహారాజా= ఇంద్రసేనుడు అనే పేరుగల మహారాజా (బలిచక్రవర్తి మొదటిపేరు ఇంద్రసేనుడు. బలి అనేది పౌరుషనామం); నీకు; సేమంబు= క్షేమమగుగాక; వెఱవకు= భయపడకు; నీ వితరణంబు= నీ దాతృత్వం; మేలు= మెచ్చదగింది; వేలుపులు= దేవతలు; అందు+ఉండి= ఆ సుతలమందుండి; వేడుకపడుదురు= కుతూహలపడతారు; దుఃఖంబులు= విచారాలు; ఇడుమలు= కష్టాలు; దుర్మరణములు= చెడ్డచావులు; ఆతురతలు= తొందరపాటులు; నొప్పులు= బాధలు; అందుండువారికిన్= ఆ పాతాళమునందుండువారికి; పొందవు= చెందవు; సుతలమందుండునీవు= నీవు

పాతాళమునందుండుము; నీ పంపు+చేయని= నీ ఆనతి ననుసరింపని; నిర్జర+అరాతులన్= దేవతల శత్రువులగు రాక్షసులను; నా చక్రము ఏతెంచి= నా సుదర్శనచక్రము వచ్చి; నఱకుచుండున్= ఖండిస్తుంటుంది; లోకపాలకులకున్= దిక్పతులకు కూడా; అక్కడ; లోనుగావు= లోపడవు; అచట= అక్కడ; అన్యులు+ఎంతవారలు= ఇతరులు ఎంతటివారు?; నిన్ను; ఎల్లప్రొద్దువచ్చి= ఎల్లవేళలావచ్చి; ఏను= నేను; రక్షించెదన్= కాపాడుతాను; నీకున్= నీకు; కరుణతోడన్= దయతో; కానవత్తున్= ప్రత్యక్షమౌతుంటాను.

**తా :** ఇంద్రసేన మహారాజా! నీకు క్షేమం. భయపడకు. నీ దాతృత్వం మెచ్చదగింది. పాతాళంలో ఉండి దేవతలుకూడా సంతోషపడుతూ ఉంటారు. ఆ లోకంలోనివారికి దుఃఖాలూ, కష్టాలూ, బాధలూ, దుర్మరణాలూ ఉండవు. అలాంటి లోకంలో నీవు ఉండు. అక్కడ నీ మాట వినని వారిని నా చక్రం నరకుతుంది. అక్కడ దిక్పాలకులకు కూడా నీపై అధికారం ఉండదు. ఇక ఇతరులు ఏమి లెక్క? ఎల్లప్పుడూ నిన్ను నేను రక్షిస్తుంటాను. కనికరంతో నీకు కనిపిస్తుంటాను.

**క. దానవదైత్యుల సంగతిఁ, బూనిన నీ యసురభావమును దోడ్తో మ**
**ద్ధ్యానమునఁదొలఁగి పోవును, మానుగ సుతలమున నుండుమా మా యాజ్ఞన్. 668**

**ప్రతి :** దానవ= నిశాచరులయొక్క; దైత్యుల= దితిసంతతియగు రాక్షసులయొక్క; సంగతిన్= సాంగత్యంచే; పూనిన= వహించినట్టి; నీ యసురభావమును= నీ రాక్షసభావమును; తోడ్తోన్= వెంటవెంటనే; మత్+ధ్యానమునన్= నన్ను ధ్యానించటంచేత; తొలఁగిపోవును= తొలగిపోతుంది; మానుగన్= చక్కగా; మా యాజ్ఞన్= నా ఆజ్ఞచే; సుతలమునన్= పాతాళమందు; ఉండుమా= ఉండవలసినది సుమా!

**తా :** దానవదైత్యులవల్ల నీకు కలిగిన రాక్షసత్వం నన్ను ధ్యానించడంవల్ల తొలగిపోతుంది. మా ఆజ్ఞప్రకారంగా సుతలంలో సుఖంగా ఉండు.

**వ. అని యిట్లు పలుకుచున్న ముమ్మూర్తుల ముదుకవేల్పు తియ్యని నెయ్యంపుఁ బలుకుఁ జెఱకు రసంపుసోనలు వీనుల తెరువులం జొచ్చి లోను బయలు నిండి ఱెప్పల కప్పు దప్పం ద్రోచికొని కనుఁగవ కొలంకుల నలుఁగులు వెడలిన చందంబున సంతసంబునం గన్నీరు మున్నీరై పఱవ, నురః ఫలకంబునం బులకంబులు కులకంబులయి తిలకంబు లొత్తఁ, గేలు మొగిడ్చి నెక్కొన్న వేడుకం ద్రొక్కుడువడుచుఁ జిక్కని చిత్తంబునఁజక్కని మాటల రక్కసులతేఁడిట్లనియె. 669**

**ప్రతి :** అని; ఇట్లు= ఈ రీతిగా; పలుకుచున్న= మాట్లాడుతున్న; మూడు+మూర్తుల= త్రిమూర్త్యాత్మకుడగు; ముదుకవేల్పు= (ముదుసలి దైవముయొక్క) పురాణ పురుషునియొక్క; తియ్యని= మధురమయిన; నెయ్యంపున్ పలుకున్= ప్రియవాక్యం అనే; చెఱకురసంపు= చెరకురసంయొక్క; సోనలు= ధారలు; వీనుల తెరువులన్= శ్రుతి మార్గములందు (చెవులందు); చొచ్చి= ప్రవేశించి; లోనున్= లోపలను; బయలున్= బహిఃప్రదేశమును; నిండి= పూర్ణమయి; ఱెప్పలకప్పున్= కనురెప్పలమూతను; తప్పన్= తొలగునట్లు; త్రోచికొని= త్రోచివేస్తూ; కనుఁగవ= రెండుకన్నులనున్నట్టి; కొలంకులన్= సరస్సులయందు; అలుఁగులు= తూములు; వెడలిన చందంబునన్= బయలుదేరిన విధంగా; సంతసంబునన్= సంతోషంతో; కన్నీరు= కంటినీరు; మూడు+నీరు+ఐ= సముద్రమై; పఱవన్= ప్రవహించగా; ఉరస్+ఫలకంబునన్= పలకవంటి వక్షస్థలాన; పులకంబులు= రోమాంచములు (గగుర్పాటు); కులకంబులై= వరుసలై (సమూహమై); తిలకంబులు+ఒత్తన్= బొట్లువెట్టగా;

కేలుమొగిడ్చి= హస్తాలు జోడించి; నెక్కొన్న= నెలకొనిన; వేడుకన్= వేడ్కతో; త్రొక్కుడు+పడుచున్= తొట్రుపాటు చెందుతూ; చిక్కని= చక్కనయిన; చిత్తంబునన్= మనస్సుతో; చక్కనిమాటలన్= మంచి పలుకులతో; రక్కసులఱేడు= రాక్షసరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ విధంగా భగవానుడు పలికిన మధురవాక్కులు బలిచక్రవర్తి చెవులలో చెరకురసపు జల్లులవలె ప్రవేశించినాయి. సంతోషబాష్పాలు కనురెప్పలను తొలగత్రోసుకుంటూ కాలువలుగా పారివెలువడినవి. వక్షస్థలమంతా పులకాంకురాలతో నిండిపోయింది. అప్పుడు బలిచక్రవర్తి మిక్కిలి వేడుకతో చేతులు జోడించినాడు. స్థిరమైన చిత్తంతో మెల్లగా ఇలా అన్నాడు.

**ఉ. ఎన్నడు లోకపాలకుల నీ కృపఁజూడని నీవు నేఁడు న**
**న్నున్నతుఁజేసి నా బ్రదుకు నోజయు నానతి యిచ్చి కాచి; తీ**
**మన్నన లీ దయారసము మాటల పెద్దఱికంబుఁ జాలదే?**
**పన్నగతల్ప! నిన్నెఱిఁగి పట్టిన నాపద గల్గనేర్చునే? 670**

**ప్రతి :** పన్నగతల్ప= ఓ పన్నగశాయీ!; ఎన్నడున్= ఎప్పుడును; లోకపాలకులన్= దిక్పతులనుకూడా; ఈకృపన్= ఇట్టిదయతో; చూడని= కనుగొననట్టి; నీవు; నేఁడు= ఇప్పుడు; నన్= నన్ను; ఉన్నతున్+చేసి= గొప్పవానిగా చేసి; నా బ్రదుకు= నా జీవనముయొక్క; ఓజయున్= విధమును; ఆనతియిచ్చి= తెలిపి; కాచితి= రక్షించితివి; ఈ మన్ననలు= ఈ గౌరవాలు; ఈ దయారసము= ఈ కరుణారసము; మాటలపెద్దఱికంబున్= మాటలయొక్క గొప్పతనము; చాలవే= చాలవా? నిన్ను; ఎఱిఁగి= తెలిసికొని; పట్టినన్= ఆశ్రయించినయెడల; ఆపదగల్గనేర్చునే= విపత్తుకలుగునా (కలుగదు–అని)

**తా :** ఓ పన్నగరాజతల్పా! నీవు దిక్పతులనుకూడా ఏనాడూ ఇంతటి దయతో చూడలేదు. ఈనాడు నన్ను గొప్పవానిని చేసి నా బ్రతుకుతెరువును చూపి రక్షించినావు. ఈ గౌరవం, ఈ దయ, ఈ మాటలగొప్పతనం నాకు చాలు! నిన్ను తెలుసుకొని ఆశ్రయించిన వారికి ఎప్పుడూ ఆపదలు కలుగవు.

**వ. అని పలికి హరికి నమస్కరించి, బ్రహ్మకుం బ్రణామంబు సేసి, యిందుధరునకు వందనం బాచరించి, బంధవిముక్తుండై తన వారలతోఁ జేరికొని బలి సుతలంబునకుఁ జనియె; నంత హరి కృపావశంబునం గృతార్థుండై కులోద్ధారకుండయిన మనుమనిం గని సంతోషించి ప్రహ్లాదుండు భగవంతున కిట్లనియె. 671**

**ప్రతి :** అనిపలికి= అట్లు చెప్పి; హరికి నమస్కరించి= శ్రీహరికి వందనంచేసి; బ్రహ్మకున్= బ్రహ్మ దేవునికి; ప్రణామంబు+చేసి= రెండుచేతులు జోడించి; ఇందుధరునకున్= ఈశ్వరునకు; వందనంబు+ఆచరించి= నమస్కారం చేసి; బంధవిముక్తుండై= బంధమునుండి విడుదలఅయి; తనవారితోన్= తన బంధుమిత్రాదులతో; చేరుకొని= కలిసికొని; బలి= బలిచక్రవర్తి; సుతలంబునకున్= పాతాళలోకానికి; చనియెన్= వెళ్ళెను; అంతన్= ఆ పిమ్మట; హరికృపావశంబునన్= విష్ణుదయచే; కృతార్థుండై= ధన్యుడై; కుల+ఉద్ధారకుండయిన= కులమును ఉద్ధరించునట్టివాడయిన; మనుమనిన్+కని= పౌత్రునిచూచి; సంతోషించి= ఆనందించి; ప్రహ్లాదుండు; భగవంతునకు+ఇట్లనియెన్= హరితో ఈ విధంగా పలికినాడు.

**తా :** అలా పలికి బలిచక్రవర్తి విష్ణుమూర్తికీ విధాతకూ శివునికీ నమస్కరించినాడు. బంధవిముక్తుడై తనవారితో చేరి పాతాళానికి వెళ్లినాడు. విష్ణుదేవుని కృపతో కులాన్ని సముద్ధరించిన మనుమడగు బలిని చూచి ప్రహ్లాదుడు సంతోషించి భగవంతునితో ఇలా అన్నాడు.

**సీ. చతురాననుఁడు నీ ప్రసాదంబు గానఁడు; శర్వుఁడీ లక్ష్ముల జాడఁబొందఁ,**
**దన్యుల కెక్కడి? దసురులకును మాకు బ్రహ్మాదిపూజితపదుఁడ వయిన**
**దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడ వైతి; పద్మజాదులు భవత్పాదపద్మ**
**మకరంద సేవనమహిమ నైశ్వర్యంబు లందిరి కాక మే మల్పమతుల**

**తే. మధిక దుర్యోనులము కుత్సితాత్మకులము, నీ కృపాదృష్టిమార్గంబు నెలవు సేర**
**నేమి తప మాచరించితి మెన్నఁగలమె?, మమ్ముఁగాచుట చిత్రంబు మంగళాత్మ! 672**

**ప్రతి :** చతురాననుఁడున్= బ్రహ్మదేవుడు కూడా; ఈ ప్రసాదంబున్= ఈ అనుగ్రహమును; కానఁడు= పొందడు; శర్వుఁడు= ఈశ్వరుడు; ఈ లక్ష్ములజాడన్= ఈ సిరులచందమును; పొందఁడు= పొందలేదు; అన్యులకు= ఇతరులకు; ఎక్కడిది= ఎక్కడకలదు?; అసురులకును= రాక్షసులకును; మాకున్= మాకును; బ్రహ్మ+ఆది= బ్రహ్మమొదలయినవారిచే; పూజిత= పూజించబడిన; పదుఁడవు= పాదములు కలవాడవు; అయిననీవు= అయినట్టినీవు; దుర్లభుండవు= లభించనివాడవు; దుర్గపాలుఁడవు= పాతాళదుర్గమును పాలించువాడవు; అయితివి= కాగలిగితివి; పద్మజ+ఆదులు= పద్మమునందు పుట్టిన బ్రహ్మ మొదలయినవారు; భవత్+పాదపద్మ= నీ పాదపద్మాల; మకరంద= తేనెను; సేవన= ఆస్వాదించుటవలన కలిగిన; మహిమన్= మహత్త్వముచే; ఐశ్వర్యంబులు= భోగములు; అందిరి= పొందిరి; కాక= కానీ; మేము; అల్పమతులము= తక్కువబుద్ధికలవారము; అధిక= విస్తారమయిన; దుర్యోనులము= పాడు జన్మలు కలవారము; కుత్సితాత్మకులము= కపటచిత్తులము; నీ కృపాదృష్టి మార్గంబునెలవున్= నీ దయాదృష్టి పథమును; చేరన్= చేరుటకు; ఏమి తపమాచరించితిమి= ఎట్టి తపస్సుచేసితిమో!; ఎన్నఁగలమె?= ఎన్నతరమా?; మంగళ+ఆత్మ!= శుభప్రదమయిన మనస్సుకలవాడా!; మమ్మున్= మమ్ములను; కాచుట= కాపాడుట; చిత్రంబు= ఆశ్చర్యము.

**తా :** ఓ మంగళాకారా! బ్రహ్మదేవుడుకూడా నీ అనుగ్రహాన్ని ఇంతగా పొందలేదు. ఈశ్వరుడు కూడా ఇంత ఆదరాభిమానాలను పొందలేదు. ఇంక ఇతరులెంత? బ్రహ్మాదులచేత నీవు అర్చించబడినావు. నీ దరి చేరటం దుర్లభం. అలాంటినీవు రాక్షసులకు దుర్గరక్షకుడ వైనావు. బ్రహ్మమొదలయినవారు నీ పాదపద్మమకరందాన్ని సేవించటంచే కలిగిన మహిమవలన ఐశ్వర్యవంతులయినారు. మేము అల్పులము, పాడుజన్మలు కలవారము, కపట చిత్తులము. నీ దయను పొందటానికి మేము ఎట్టి తపస్సు చేసినామో! మమ్ములను నీవు రక్షించటం చిత్రం.

**వ. అదియునుంగాక. 673**

**ప్రతి :** అదియునున్+కాక= అంతే కాక.

**ఆ. సర్వగతుఁడ వయ్యు సమదర్శనుఁడ వయ్యు, నొకట విషమవృత్తి నుండు దరయ**
**నిచ్ఛ లేనివారి కీవు భక్తులు గోరు, తలఁపు లిత్తు కల్పతరువుమాడ్కి. 674**

**ప్రతి :** సర్వగతుఁడవు= అన్ని గతులు కలవాడవు; అయ్యున్= అయి ఉండికూడా; సమదర్శనుఁడవు= అన్నింటిని సమానముగా చూచువాడవును; అయ్యున్= అయి ఉండీ; ఒకటన్= ఒక విషయమందు; విషమవృత్తిన్= అసమ వర్తనంతో; ఉండుదు= ఉంటావు; అరయన్= చూడగా; ఇచ్ఛలేనివారికి= కోరికలేనట్టివారికి; ఈవు= ఇవ్వవు; కల్పతరువుమాడ్కిన్= కల్పవృక్షం వలె; భక్తులు+కోరు= భక్తులు కోరే; తలఁపులు+ఇత్తు= కోర్కులు నెరవేర్తువు.

**తా :** నీవు అన్నింటియందూ ఉంటావు. అందరినీ సమానంగా చూస్తావు. అయినా కూడా నీవు ఒక విషయంలో విషమంగా ఉంటావు. భక్తిలేనివారి కోరికలు తీర్చవు. కల్పవృక్షంలా భక్తుల కోర్కెలు తీర్చుతావు.

**వ. అని విన్నవించుచున్న ప్రహ్లాదుంజూచి, పరమపురుషుం డిట్లనియె. 675**

**ప్రతి :** అని; విన్నవించుచున్న= పలుకుచున్న; ప్రహ్లాదున్+చూచి= ప్రహ్లాదుని కని; పరమపురుషుండు= పురుషోత్తముడగు హరి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పినాడు.

**తా :** ఈ విధంగా మనవి చేస్తున్న ప్రహ్లాదునితో పరమాత్ముడు ఇలా అన్నాడు.

**తే. వత్స! ప్రహ్లాద! మేలు నీ వారి నీవు, సొరిది మనుమనిఁదోడ్కొని సుతలమునకుఁ**
**బయనమై పొమ్ము నే గదాపాణి నగుచుఁ, జేరి రక్షింతు దురితంబు సెంద దచట. 676**

**ప్రతి :** వత్స= కుమారా!; ప్రహ్లాద; మేలు= మంచిది; నీవు; సొరిదిన్= క్రమంగా; నీవారిని= నీకు సంబంధించినవారిని; మనుమనిన్= మనుమడగు బలిని; తోడ్కొని= వెంటబెట్టుకొని; సుతలమునకున్= పాతాళానికి; పయనమైపొమ్ము= ప్రయాణమై వెళ్ళుము; నేన్= నేను; గదాపాణిని+అగుచున్= గదను చేతధరించినవాడనై; చేరి= సమీపించి; రక్షింతున్= కాపాడుతాను; అచటన్= అక్కడ; దురితంబు= పాపం; చెందదు= (మిమ్ము) పొందదు.

**తా :** కుమారా! ప్రహ్లాదా! మంచిది. నీ చుట్టాలూ నీవూ బలిని వెంటపెట్టుకొని పాతాళానికి వెళ్ళు. నేను గదాధరుడనై సమీపించి మిమ్ములను కాపాడుతాను. అక్కడ మీకు ఏ పాపమూ అంటదు.

**వ. అని యిట్లు నియమించినఁ బరమేశ్వరునకు నమస్కరించి వలగొని కరకమల పుటఘటిత నిటల తటుండై, వీడ్కొని బలిం దోడ్కొని సకల సురయూథంబునుం దానునొక్క మహాబిలద్వారంబు సొచ్చి ప్రహ్లాదుఁడు సుతలలోకంబునకుం జనియె; నంత బ్రహ్మవాదులయిన యాజకుల సభామధ్యంబునం గూర్చున్న శుక్రునింజూచి నారాయణుం డిట్లనియె. 677**

**ప్రతి :** అని; ఇట్లు= ఈ విధంగా; నియమించినన్= ఏర్పాటుచేయగా; పరమేశ్వరునకు= భగవంతునకు; నమస్కరించి= నమస్కారం చేసి; వలగొని= ప్రదక్షిణముచేసి; కరకమలపుట= హస్తపద్మములచే; ఘటిత= కూర్పబడిన; నిటలతటుండై= ఫాలతలముగలవాడై; వీడ్కొని= సెలవుతీసుకొని; బలిన్+తోడ్కొని= బలిచక్రవర్తిని వెంటపెట్టుకొని; సకల+అసుర యూథంబునున్= ఎల్ల రాక్షస సముదాయం; తానును; ఒక్కమహాబిలద్వారంబున్= ఒకగొప్ప భూబిలముఖమును; చొచ్చి= ప్రవేశించి; ప్రహ్లాదుఁడు; సుతలలోకంబునకున్= పాతాళలోకానికి; చనియెన్= వెళ్ళెను; అంతన్= ఆ పిమ్మట; బ్రహ్మవాదులయిన= బ్రహ్మవేత్తలై ఒప్పు; యాజకుల= ఋత్విక్కుల; సభామధ్యంబునన్= సంఘమునడుమ; కూర్చున్న= కూర్చుండి ఉన్న; శుక్రున్+చూచి= శుక్రాచార్యుని కనుగొని; నారాయణుండు= భగవంతుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికినాడు.

**తా :** ఈ విధంగా ఆనతిచ్చిన పరమాత్మునికి ప్రహ్లాదుడు మ్రొక్కి ప్రదక్షిణం చేసినాడు. నొసటిపై చేతులు జోడించి సెలవు తీసుకున్నాడు. ఆ తర్వాత ఆయన బలినీ రాక్షససమూహాన్నీ వెంటపెట్టుకొని ఒక గొప్ప గుహాద్వారంగుండా పాతాళలోకానికి చేరినాడు. అటుపిమ్మట మహావిష్ణువు బ్రహ్మవేత్తలయిన ఋత్విజులనడుమ సభలో కూర్చున్న శుక్రుని చూచి ఇలా అన్నాడు.

**ఆ. 'ఏమి గొఱఁత వడియె నీ బలి జన్నంబు, విస్తరింపు కడమ విప్రవర్య!**
**విషమ మయిన కర్మ విసరంబు బ్రాహ్మణ, జనులు సూచినంత సమతఁ బొందు' 678**

**ప్రతి :** విప్రవర్య= బ్రాహ్మణ శ్రేష్ఠుడా!; ఈ బలి జన్నంబు= ఈ బలినిర్వహించిన యజ్ఞం; ఏమి కొఱఁతన్+పడియెన్= ఏమి తక్కువయ్యెనో?; కడమ= మిగిలినదానిని; విస్తరింపు= నెరవేర్పుము; విషమము+అయిన= వ్యత్యస్తమయిన; కర్మవిసరంబు= కర్మసముదాయం; బ్రాహ్మణజనులు= విప్రులు; చూచినంతన్= చూచినతోడనే; సమతన్= సమత్వాన్ని; పొందున్= పొందుతుంది.

**తా :** శుక్రాచార్యవర్యా! బలిచక్రవర్తి యాగానికి లోపమేమీ రాలేదుకదా! ఈ యజ్ఞంలో మిగిలిన కార్యాన్ని నీవు నెరవేర్చు. ఆగిపోయిన యజ్ఞకార్యాలు విప్రులు చూచినంతనే సఫలమౌతాయి.

**వ. అనిన శుక్రుం డిట్లనియె. 679**

**ప్రతి :** అనినన్= అని పల్కగా; శుక్రుండు= శుక్రాచార్యుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికినాడు.

**సీ. అఖిలకర్మంబుల కధినాథుఁడవు నీవ; యజ్ఞేశుఁడవు నీవు యజ్ఞపురుష!**
**ప్రత్యక్షమున నీవు పరితుష్టి నొందినఁ గడ మేల కల్గునేకర్మములకు?**
**ధనదేశకాలార్హతంత్రమంత్రంబులఁ గొఱఁతలు నిన్నుఁ బేర్కొనిన మాను;**
**నయినఁగావింతు నీ యానతి; భవదాజ్ఞ మెలఁగుట జనులకు మేలు గాదె?**

**తే. యింతకంటెను శుభము నా కెచటఁ గలుగు, ననుచు హరిపంపు శిరమున నావహించి**
**కావ్యుఁడసురేంద్రుజన్నంబు కడమఁదీర్చె, మునులు విప్రులు సాహాయ్యమునఁజరింప. 680**

**ప్రతి :** అఖిలకర్మంబులకు= సమస్తకర్మలకు; అధినాథుఁడవు= అధిపతివి; నీవ= నీవే; యజ్ఞపురుష= ఓ యజ్ఞపురుషుడా!; యజ్ఞేశుఁడవు= యజ్ఞానికి అధిపతివి; నీవ= నీవే; ప్రత్యక్షమునన్= సాక్షాత్కారంతో; నీవు; పరితుష్టిన్= నిండుతృప్తిని; ఒందినన్= పొందినట్లయితే; కర్మములకు= యజ్ఞకార్యాలకు; కడమ= లోపం; ఏలకలుగు= ఎలా కలుగుతుంది? (కలుగదు అని); ధన= ద్రవ్యానికి; దేశ= దేశానికి; కాల= కాలానికి; అర్హ= తగిన; తంత్రమంత్రంబులన్= తంత్రమంత్రాలయందు; కొఱఁతలు= లోపాలు; నిన్నున్+పేర్కొనినన్= నిన్ను ధ్యానించిన ఎడల; మానున్= పోవును; అయినన్= అయినప్పటికిని; నీ యానతిన్= నీ యాజ్ఞను; కావింతున్= చేస్తాను; భవత్+ఆజ్ఞన్= నీ ఆనతిచొప్పున; మెలఁగుట= ప్రవర్తించడం; జనులకున్= ప్రజలకు; మేలుకాదె= మంచిదికాదా?; ఇంతకంటెను= నీవు చెప్పిన పనిని నెరవేర్చుటకంటె; శుభము= మంగళము; నాకు+ఎచటన్+కలుగున్= నాకు ఎక్కడ కలుగుతుంది; అనుచున్; హరిపంపున్= విష్ణుమూర్తి ఆజ్ఞను; శిరమునన్= తలయందు; ఆవహించి= తాలిచి; కావ్యుఁడు= శుక్రుడు; అసురేంద్రు= బలిచక్రవర్తియొక్క; జన్నంబు= యజ్ఞముయొక్క; కడమన్= మిగిలిన భాగాన్ని; మునులు= ఋషులు; విప్రులు= బ్రాహ్మణులు; సాహాయ్యమునన్= సహాయంతో; చరింపన్= ఉండగా; తీర్చెన్= నెరవేర్చినాడు.

**తా :** 'అన్ని కర్మలకు నీవే అధిపతివి. యజ్ఞాలకు నీవే అధిపతివి. నీవు స్వయంగా వచ్చి సంతుష్టిపొందితే ఏ కొరతకూడా ఉండదు. నిన్ను తలచినట్లయితే ధన, దేశ, కాల, మంత్ర, తంత్రాలకు కలిగిన దోషాలు తొలగిపోతాయి. నీ ఆనతి

ప్రకారమే చేస్తాను. నీ ఆజ్ఞ ప్రకారం నడవటం జనాలకు మంచిదికదా! ఇంతకన్నా నాకు భాగ్యమేముంది?' అని పలికి శుక్రుడు విష్ణుమూర్తి ఆజ్ఞను తలదాల్చి బలిచక్రవర్తి యాగాన్ని పూర్తిచేసినాడు. ఆయనకు మునులు విప్రులు తోడ్పడినారు.

**వ. ఇ వ్విధంబున వామనుండయి హరి బలినడిగి, మహిం బరిగ్రహించి, తనకు నగ్రజుండగు నమరేంద్రునకుం ద్రిదివంబు సదయుండయి యొసంగె; నత్తఱి దక్షభృగుప్రముఖ ప్రజాపతులును, భవుండును, గుమారుండును, దేవర్షి పితృగణంబులును, రాజులును, దానును గూడికొని చతురాననుండు గశ్యపునకు నదితికి సంతోషంబుగా లోకంబులకు లోకపాలురకు 'వామనుండు వల్లభుం'డని నియమించి యంత ధర్మంబునకు యశంబునకు లక్ష్మికి శుభంబులకు దేవతలకు వేదంబులకు స్వర్గాపవర్గంబులకు 'నుపేంద్రుండు ప్రధానుం' డని సంకల్పించె; నా సమయంబున. 681**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; హరి= విష్ణువు; వామనుండు+అయి= వామనమూర్తియై; బలిన్+అడిగి= బలిచక్రవర్తిని యాచించి; మహిన్= భూమిని; పరిగ్రహించి= తీసికొని; తనకున్= తనకు; అగ్రజుండగు= అన్నయగు; అమర+ఇంద్రునకున్= సురపతికి; త్రిదివంబున్= స్వర్గాన్ని; సదయుండయి= దయతోకూడినవాడయి; ఒసంగెన్= ఇచ్చినాడు; ఆ+తఱిన్= ఆ సమయమందు; దక్షభృగు ప్రముఖ= దక్షుడు భృగువు మొదలయిన; ప్రజాపతులును= బ్రహ్మలును; భవుండును= ఈశ్వరుడును; కుమారుండును= కుమారస్వామియు; దేవర్షి= దేవ మునులును; పితృగణంబులును= పితృదేవతా సమూహాలును; రాజులును= నృపాలురును; తానును; కూడికొని= చేరుకొని; చతుర+ఆననుండు= బ్రహ్మ; కశ్యపునకున్= కశ్యపప్రజాపతికిని; అదితికిన్= అదితికిని; సంతోషంబుగాన్= సంతసమగునట్లు; లోకంబులకున్= సర్వప్రపంచాలకు; లోకపాలురకున్= దిక్పతులకును; వామనుండు= వామనమూర్తి; వల్లభుండు+అని= ప్రభువని; నియమించి= ఏర్పరచి; అంత= ఆ తర్వాత; ధర్మంబునకున్= ధర్మానికీ; యశంబునకున్= కీర్తికీ; లక్ష్మికిన్; శుభంబులకున్; దేవతలకున్= వేల్పులకు; వేదంబులకున్; స్వర్గ+అపవర్గంబులకున్= స్వర్గమోక్షాలకు; ఉప+ఇంద్రుండు= వామనుడు; ప్రధానుండని= ముఖ్యుడని; సంకల్పించెన్= నిశ్చయించెను; ఆ సమయంబునన్= అట్టివేళ.

**తా :** ఆ విధంగా విష్ణుమూర్తి వామనమూర్తియై బలిచక్రవర్తి దగ్గర భూదానం గ్రహించినాడు. ఆయన తన అన్నయైన ఇంద్రునికి దయతో స్వర్గలోకాన్ని ఇచ్చినాడు. బ్రహ్మదేవుడు ఆ సమయంలో దక్షుడు భృగువు మొదలయిన ప్రజాపతులతో శివునితో కుమారస్వామితో నారదునితో పితృదేవతలతో నృపాలురతో కలుసుకున్నాడు. కశ్యపునికి అదితికీ ఆనందం కలిగేవిధంగా లోకాలకూ దిక్పతులకు 'వామనుడు ప్రభువు' అని కట్టడి చేసినాడు. అంతేకాక ధర్మానికీ, కీర్తికీ, సంపదలకు, శుభాలకు, దేవతలకు, స్వర్గానికి, మోక్షానికి 'వామనుడే అధికారి' అని నిర్ణయించినాడు.

**క. కమలజుఁడు లోకపాలురు, నమరేంద్రునిఁగూడి దేవయానంబున న**
**య్యమరావతికిని వామను, నమరంగొనిపోయి రంత నటమీఁద నృపా! 682**

**ప్రతి :** నృపా= రాజా!; కమలజుఁడు= బ్రహ్మ; లోకపాలురున్= దిక్పాలురును; అమరేంద్రునిన్+కూడి= ఇంద్రునితో కలిసి; దేవయానంబునన్= విమానం మీద; ఆ+అమరావతికిని= ఆ స్వర్గానికి; వామనున్= వామనమూర్తిని; అంతన్= అంతట; అమరన్= ఒప్పునట్లుగా; కొనిపోయిరి= తీసుకొనివెళ్లిరి; అటమీఁదన్= అటు తర్వాత...

**తా :** పరీక్షిన్మహారాజా! బ్రహ్మ, దిక్పాలకులు, దేవేంద్రుడూ విమానం మీద వామనుని అమరావతికి తీసుకొని వెళ్ళినారు. ఆ తర్వాత

**ఆ. బల్లిదంపుఁదోడు ప్రాపున నింద్రుని, కింద్రపదము సేరు టిట్లు గలిగెఁ;**
**దనకు నాఢ్యుఁడైన తమ్ముఁడు గలిగినఁ, గోర్కు లన్న కేల కొఱఁత నొందు? 683**

**ప్రతి :** బల్లిదంపున్= బలవంతుడయినవాని; తోడుప్రాపునన్= సహాయం కల్గుటవల్ల; ఇంద్రునికిన్= సురపతికి; ఇంద్రపదము= ఇంద్రపదవి; ఇట్లు= ఈ విధంగా; చేరుటకలిగెన్= సంప్రాప్తమయ్యెను; తనకున్= తనకు (అన్నకు); ఆఢ్యుఁడు+అయిన= సమర్థుడయిన; తమ్ముఁడు+కలిగినన్= సోదరుడు ఉంటే; అన్నకున్= అన్నకు; కోర్కులు= కోరికలు; ఏల కొఱఁతనొందున్= ఎందుకు తక్కువౌతాయి (తక్కువ కావు అని).

**తా :** బలవంతుడయిన తోడబుట్టినవాని సహాయంతో ఈ విధంగా ఇంద్రునికి ఇంద్రపదము లభించింది. సమర్థుడయిన తమ్ముడుగల అన్నకు కోర్కెలు ఎందుకు కొరతపడతాయి? (పడవు).

**క. పాలడుగఁడు మేలడుగం, డేలఁడు భిక్షించి యన్న కిచ్చెఁద్రిజగముల్**
**వేలుపులతల్లి కడపటి, చూలుం బోలంగఁ గలరె సొలయని తమ్ముల్. 684**

**ప్రతి :** పాలు= భాగము; అడుగఁడు= ఇమ్మనడు; మేలు+అడుగండు= మంచిచేయుమనీ అడుగడు; ఏలఁడు= పరిపాలించడు; త్రిజగముల్= ముల్లోకాలూ; భిక్షించి= యాచనచేసి; అన్నకు+ఇచ్చెన్= అగ్రజునికి ఒసగినాడు; వేలుపులతల్లి= దేవతలమాతయగు అదితియొక్క; కడపటిచూలున్= కడగొట్టుబిడ్డను; పోలంగన్= సరివచ్చుటకు; సొలయని తమ్ముల్= (అన్నకోసం) వెనుదీయని తమ్ములు; కలరె= ఉన్నారా? (లేరు అని).

**తా :** భాగం ఇమ్మనడు, మంచిచేయమనడు, పరిపాలించడు, ముల్లోకాలను యాచనవల్ల స్వీకరించి అన్నయగు ఇంద్రునకు ఇచ్చినాడు. వేలుపులతల్లిఅయిన అదితి చిన్నకొడుకు వామనునివంటి తమ్ముడు ఏ అన్నలకు ఉన్నాడు? (వామనునికి సాటియైన తమ్ముడు లేడు)

**ఆ. కడుపు బదరగాఁగఁ గొడుకులఁగనుకంటెఁ, దల్లికొకఁడె చాలు బల్లిదుండు;**
**ద్రిదశగణముఁగన్న యదితి కానుపు దీర్చి, జిన్ని మేటివడుగుఁగన్న యట్లు. 685**

**ప్రతి :** కడుపు= గర్భము; బదరగాఁగన్= బ్రద్దలగునట్లు; కొడుకులన్= పలువురు కుమారులను; కనుకంటెన్= కనుటకన్నా; తల్లికి= జననికి; బల్లిదుండు= బలవంతుడు; ఒకఁడెచాలున్= ఒక్కడే చాలును; త్రిదశగణమున్= దేవతాసమూహాన్ని; కన్న= ప్రసవించిన; అదితి కానుపుదీర్చి= అదితి గర్భం ధరించి; చిన్ని= చిన్నవాడును; మేటి= గొప్పవాడును అగు; వడుగున్= బ్రహ్మచారిని; కన్న+అట్లు= ప్రసవించినట్లు (ఒక్కడే చాలును అని)

**తా :** కడుపు బ్రద్దలయ్యేటట్లు చాలామంది కొడుకులను కనటం కంటె, దేవతా సమూహాన్ని కన్న అదితి ఘనుడగు వామన వటుని కన్నట్లు తల్లికి బలవంతుడైన ఒక కొడుకు చాలు.

**వ. ఇట్లు దేవేంద్రుండు వామన భుజపాలితం బగు త్రిభువన సామ్రాజ్య విభవంబు మరల నంగీకరించె; నప్పుడు బ్రహ్మయు, శర్వుండును, గుమారుండును, భృగుప్రముఖులయిన మునులును, బితృదేవతలును, దక్షాదిప్రజాపతులును, సిద్ధులును, వైమానికులును మఱియుం దక్కినవారలును, బరమాద్భుతంబైన విష్ణుని**

**సుమహాకర్మంబులకు నాశ్చర్యంబు నొందుచుఁ, బ్రశంసించుచు, నాడుచుం, బాడుచుం, దమతమ నివాసంబులకుం జని; రని చెప్పి శుకుం డిట్లనియె. 686**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; దేవేంద్రుండు= అమరవల్లభుడు; వామన= వామనమూర్తియొక్క; భుజ= బాహువులచే; పాలితంబు+అగు= పరిపాలించబడునట్టి; త్రిభువన= ముల్లోకాలయొక్క; సామ్రాజ్య= ప్రభుత్వమునందయిన; విభవంబున్= వైభవాన్ని; మరలన్= తిరుగా; అంగీకరించెన్= కైకొనెను; అప్పుడు= ఆ సమయాన; బ్రహ్మయు= బ్రహ్మదేవుడును; శర్వుండును= ఈశ్వరుడును; కుమారుండును= కుమారస్వామియును; భృగుప్రముఖులయిన= భృగువుమొదలయిన; మునులును= ఋషులును; పితృదేవతలును; దక్షాది= దక్షుడు మొదలయిన; ప్రజాపతులును= బ్రహ్మలును; సిద్ధులును; వైమానికులును= ఖేచరులును; మఱియున్+తక్కిన వారలును= ఇంకను మిగిలినవారును; పరమ+అద్భుతంబు+ఐన= ఎంతో ఆశ్చర్యం కలిగించే; విష్ణుని= శ్రీహరియొక్క; సుమహాకర్మంబులకున్= మంచి గొప్పకార్యాలకు; ఆశ్చర్యంబు+ఒందుచున్= అబ్బురపాటునుపొందుచు; ప్రశంసించుచున్= మెచ్చుచు; ఆడుచున్= నర్తనముచేస్తూ; పాడుచున్= కీర్తిస్తూ; తమతమ= తమయొక్క; నివాసంబులకున్= ఉనికిపట్లకు; చనిరి+అనిచెప్పి= వెళ్లిరని పలికి; శుకుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ విధంగా వామనమూర్తి సంపాదించి ఇచ్చిన త్రిలోకసామ్రాజ్యసంపదను దేవేంద్రుడు తిరిగి తీసుకున్నాడు. ఆ తర్వాత బ్రహ్మ, శివుడు, కుమారుడు, భృగువూ మొదలయిన మునులు, పితృదేవతలు, దక్షుడు మొదలయిన ప్రజాపతులు, సిద్ధులు, ఖేచరులు, ఇంకా తక్కినవారు ఆశ్చర్యం కలిగించే విష్ణుమూర్తి లీలావిలాసాలకు అబ్బురపడుతూ పొగడుతూ ఆడుతూ, పాడుతూ తమ తమ నివాసాలకు వెళ్లినారు – అని శుకుడు ఇలా అన్నాడు.

**తే. మనుజనాథ! త్రివిక్రము మహిమ కొలఁది, యెఱుఁగఁదర్కింప లెక్కింప నెవ్వఁడోపుఁ?**
**గుంభినీరేణుకణములు గుఱుతుపెట్టు, వాఁడు నేరఁడు దక్కినవారి వశమె? 687**

**ప్రతి :** మనుజనాథ= పరీక్షిన్మహారాజా!; త్రివిక్రము= (త్రి= మూడు; విక్రమ= అడుగులపెట్టిన) హరియొక్క; మహిమ కొలఁది= మహత్త్వముయొక్కహద్దు; ఎఱుఁగన్= తెలిసికొనుటకు; తర్కింపన్= ఇట్టిదని నిర్ధారణచేయుటకు; లెక్కింపన్= గణించుటకు; ఎవ్వఁడు+ఓపున్= ఎవడు సమర్థుడు; కుంభినీ= భూమియొక్క; రేణుకణములు= పరాగలేశములు; గుఱుతుపెట్టువాఁడు= లెక్కించేవాడు కూడా; నేరఁడు= సమర్థుడుకాడు; తక్కినవారి వశమె?= ఇతరుల సాధ్యమగునా?

**తా :** రాజా! త్రివిక్రముని మహిమయొక్క గొప్పతనాన్ని తెలుసుకోవటానికిగాని అది ఇలాంటిదని చెప్పటానికికాని ఎవ్వరికీ శక్యంకాదు. భూపరాగ లేశాలను లెక్కపెట్టేవాడు కూడా తెలుసుకొనలేడంటే ఇక ఇతరులకు తరమవుతుందా? (కాదు అని)

**క. అద్భుతవర్తనుఁడగు హరి, సద్భావితమైన విమలచరితము విను వాఁ**
**డుద్భటవిక్రముఁడై తుది, నుద్భాసితలీలఁబొందు నుత్తమగతులన్. 688**

**ప్రతి :** అద్భుతవర్తనుఁడు+అగు= ఆశ్చర్యకరమైన ప్రవర్తనముకల; హరి= విష్ణుమూర్తియొక్క; సద్భావితమైన= సత్పురుషులచే కొనియాడబడిన; విమల= నిర్మలమయిన; చరితము= చరిత్ర; వినువాఁడు= ఆలించువాడు; ఉద్భట= ఘనమయిన; విక్రముఁడు+ఐ= పరాక్రమముకలవాడై; తుదిన్= అంతమున; ఉద్భాసితలీలన్= మిక్కిలి ప్రకాశించునట్టి విలాసముతో; ఉత్తమగతులన్= సుగతులను (పుణ్యలోకములను); పొందున్= పొందుతాడు.

**తా :** అద్భుతమైన లీలలతోకూడి, విష్ణుమూర్తిని గురించి తెలిపే ఈ పుణ్యచరిత్రను వినేవాడు ఘనమైన పరాక్రమం కలవాడై చివరకు ప్రకాశించే విలాసంతో ఉత్తమగతులను పొందుతాడు.

**తే. తగిలి మానుష పైతృక దైవకర్మ, వేళలందుఁ ద్రివిక్రమవిక్రమంబు**
**లెక్క డెక్కడఁ గీర్తింతు రెవ్వరేనిఁ, బొందుదురు నిత్యసౌఖ్యంబు భూవరేంద్ర! 689**

**ప్రతి :** భూవర+ఇంద్ర= రాజశ్రేష్ఠా!; తగిలి= పూని; మానుష= మనుష్య సంబంధమైన; పైతృక= పితృసంబంధమైన; దైవ= దేవసంబంధమైన; కర్మ= పనులయొక్క; వేళలందున్= సమయములయందు; త్రివిక్రమ= (మూడడుగులు కొలిచిన) హరియొక్క; విక్రమంబులు= పరాక్రమాలు; ఎక్కడ+ఎక్కడన్= ఎందెందు; కీర్తింతురు= స్తుతింతురో; ఎవ్వరు+ఏనిన్= ఎవరైనా; (వారు); నిత్యసౌఖ్యంబున్= నిరంతరసుఖాన్ని; పొందుదురు= అనుభవిస్తారు.

**తా :** రాజేంద్రా! మనుష్యసంబంధమైన, పితృసంబంధమైన, దేవసంబంధమైన కార్యాలుచేసే సమయాలలో త్రివిక్రముని పవిత్రచరిత్రను కీర్తిస్తే వారు నిత్యసౌఖ్యాలను పొందుతారు.

## ❖ మత్స్యావతార కథా ప్రారంభము ❖

**వ. అని యిట్లు శుకుఁడు రాజునకు వామనావతార చరితంబు సెప్పెనని సూతుండు మునులకుం జెప్పిన విని, వార లతని కిట్లనిరి. 690**

**ప్రతి :** అని; ఇట్లు= ఇలా; శుకుఁడు= శుకమహర్షి; రాజునకున్= పరీక్షిన్మహారాజుకు; 'వామనావతారచరితంబు'; చెప్పెనని= చెప్పినాడని; సూతుండు= సూతమహర్షి; మునులకున్= మునీశ్వరులకు; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; వారలు= ఆ మునులు; అతనికి= సూతునితో; ఇట్లనిరి= ఇలా అన్నారు.

**తా :** పై విధంగా శుకుడు పరీక్షిత్తుకు వామనావతారకథను చెప్పినాడని సూతుడు శౌనకాది మునులకు తెలిపినాడు. అప్పుడు శౌనకాది మునులు సూతునితో ఇలా అన్నారు.

**సీ. 'విమలాత్మ! విన మాకు వేడ్క యయ్యెడు; మున్ను హరి మత్స్యమైన వృత్తాంతమెల్లఁ;**
**గర్మబద్ధుని భంగి ఘనుఁడీశ్వరుఁడు లోక నిందింతంబై తమోనిలయమైన**
**మీనరూపము నేల మేలని ధరియించె? నెక్కడ వర్తించె? నేమి సేసె?**
**నాద్యమై వెలయు నయ్యవతారమునకు నెయ్యది కారణంబు? గార్యాంశ మెట్లు?**

**ఆ. నీవు దగుదు మాకు నిఖిలంబు నెఱిఁగింపఁ, దెలియఁజెప్పవలయు, దేవదేవు**
**చరిత మఖిలలోకసౌభాగ్యకరణంబు గాదె; విస్తరింపు క్రమముతోడ' 691**

**ప్రతి :** విమలాత్మ= నిర్మలమైనఆత్మకలవాడా!; మున్ను= తొల్లి; హరి= విష్ణుమూర్తి; మత్స్యము+ఐన= మత్స్యావతారుడైన; వృత్తాంతము+ఎల్లన్= గాథను అంతా; మాకు; వినన్= వినాలని; వేడ్క+అయ్యెడున్= కుతూహలంగా ఉంది; కర్మబద్ధునిభంగి= కర్మకు కట్టుబడినవానివలె; ఘనుఁడు= గొప్పవాడైన; ఈశ్వరుఁడు= భగవానుడు; లోకనిందితంబు+ఐన= లోకంలో తక్కువగా చూడబడుతున్న; తమోనిలయంబు+ఐన= అజ్ఞానానికి ఆకరమైన; మీనరూపమును= చేప ఆకారాన్ని; ఏల=

ఎందుకు; మేలని ధరించెన్= మేలుగా భావించి ధరించినాడు?; ఎక్కడవర్తించెన్= (ఆ మత్స్యమూర్తి) ఏ చోట సంచరించినాడు?; ఏమిచేసెన్= ఏమి చేసినాడు?; ఆద్యమై= మొదటిదై; వెలయున్= ఒప్పారిన; ఆ+అవతారమునకున్= ఆ అవతారానికి; ఏ+అది కారణంబు= కారణమేమి?; కార్య+అంశము+ఎట్లు= (ఆ అవతారంయొక్క) పని ఏమి?; మాకు; నిఖిలంబున్= అంతయు; ఎఱింగింపన్= తెలియచేయటానికి; నీవు+తగుదు= నీవు తగినవాడవు; తెలియన్+చెప్పవలయు= తెలిసేటట్లుగా చెప్పాలి; దేవదేవుచరిత= దేవతలకే దేవుడైనవాని చరిత్ర; అఖిలలోక= సమస్తలోకాలకు; సౌభాగ్యకరణంబుగాదె= మేలుకలిగించేదికదా!; క్రమముతోడన్= వరుసగా; విస్తరింపుము= వివరించుము.

**తా :** పుణ్యాత్మా! పూర్వం విష్ణువు మత్స్యావతారం ధరించిన విషయం వినాలని మాకు కుతూహలంగా ఉంది. భగవంతుడు కర్మకు కట్టుబడినవానివలె లోకంలో గౌరవమూ, జ్ఞానమూ లేని చేపరూపాన్ని ఎందుకు ధరించాడు? ఎక్కడుండి ఏమి చేశాడు? మొదటిదైన ఆ అవతారానికి కారణమేమిటి? ఆ అవతార అవసరమేమిటి? ఆ విషయాలన్నీ మాకు తెలియజేయ గలిగినవాడవు నీవే. వాటిని గురించి మాకు తెలియజెప్పు. దేవదేవుడైన విష్ణుదేవుని కథ అఖిలలోకాలకూ మంగళాన్ని కలిగించేది కదా! కాబట్టి, ఆ విషయాలను క్రమా న్ననుసరించి విశదంగా తెలుపు.

**వ. అని, మునిజనంబులు సూతు నడిగిన నతం డిట్లనియె; మీర లడిగిన యీ యర్థంబుఁ బరీక్షిన్నరేంద్రుం డడిగిన భగవంతుండగు బాదరాయణి యిట్లనియె. 692**

**ప్రతి :** అని; మునిజనంబులు= మునీశ్వరులు; సూతున్= సూతమహర్షిని; అడిగినన్= అడుగగా; అతండు= ఆ సూతుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పినాడు; మీరలు= మీరు; అడిగిన= ప్రశ్నించిన; ఈ+అర్థంబున్= ఈ మత్స్యావతార విశేషార్థమును; పరీక్షిత్+నరేంద్రుండు= పరీక్షిత్తు అనే రాజశ్రేష్ఠుడు; అడిగినన్= అడుగగా; భగవంతుండు+అగు= మహానుభావుడగు; బాదరాయణి= శుకుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పినాడు.

**తా :** ఇలా అడిగిన మునులతో సూతుడు ఇట్లా చెపుతున్నాడు. మీరు అడిగినట్లే పరీక్షిత్తురాజు శుకమహర్షిని అడిగినాడు. అందుకు ఆ మహాముని ఇట్లా చెప్పినాడు.

**సీ. విభుఁడీశ్వరుఁడు వేద విప్ర గో సుర సాధు ధర్మార్థములఁగావఁదనువుఁదాల్చి**
**గాలిచందంబున ఘనరూపములయందుఁ దనురూపములయందుఁదగిలియుండు;**
**నెక్కువ దక్కువ లెన్నఁడు నొందక, నిర్గుణత్వంబున నెఱియు ఘనుఁడు;**
**గురుతయుఁ గొఱఁతయు గుణసంగతి వహించు; మనుజేశ! చోద్యమే మత్స్య మగుట?**

**తే. వినుము పోయిన కల్పాంతవేళఁ దొల్లి, ద్రవిళదేశపురాజు సత్యవ్రతుండు**
**నీరు ద్రావుచు హరిఁగూర్చి నిష్ఠతోడఁ, దపముఁగావించె నొక యేటితటమునందు. 693**

**ప్రతి :** మనుజ+ఈశ= ఓ రాజా!; వినుము= ఆలకించుము; విభుఁడు= ప్రభువైన; ఈశ్వరుఁడు= భగవానుడు; వేద= శ్రుతులనూ; విప్ర= బ్రాహ్మణులనూ; గో= ఆవులనూ; సుర= వేల్పులనూ; సాధు= సజ్జనులనూ; ధర్మ= ధర్మాన్నీ; అర్థములన్= అర్థాలనూ; కావన్= కాపాడుటకు; తనువు+తాల్చి= శరీరాన్ని ధరించి (అవతరించి); గాలి చందంబునన్= వాయువు మాదిరిగా; ఘనరూపములయందున్= గొప్పరూపాలలోనూ; తనురూపములయందున్= సూక్ష్మమైన రూపాలలోను; తగిలి+ఉండున్= చేరి ఉంటాడు, ఎక్కువ= ఆధిక్యాన్ని; తక్కువ= అల్పత్వాన్ని; ఎన్నఁడున్= ఎప్పుడుకూడా; ఒందక=

(చెందక)లేక; నిర్గుణత్వంబునన్= గుణరహితంగా; నెఱియు= ఒప్పే; ఘనుఁడు= గొప్పవాడు; గురుతయున్= గొప్పతనాన్నీ; కొఱఁతయున్= తక్కువతనాన్నీ; గుణసంగతి= గుణాలకలయికను; వహించున్= పొందుతాడు; మత్స్యము+అగుట= మత్స్యావతారం ధరించటం; చోద్యమే?= ఆశ్చర్యమా? (లేదు); పోయిన= గడచిన; కల్ప+అంతవేళన్= కల్పం చివర; తొల్లి= పూర్వం; ద్రవిళదేశపురాజు= ద్రవిళదేశానికి ప్రభువయిన; సత్యవ్రతుండు= సత్యవ్రతుడు అనే పేరుకలవాడు; నీరున్+త్రావుచున్= నీళ్లుమాత్రమే తాగుతూ; హరిన్+కూర్చి= విష్ణుమూర్తిని గురించి; నిష్ఠతోడన్= నియమయుక్తంగా; ఒక= ఒకానొక; ఏటితటమునందున్= నదీతీరాన; తపమున్= తపస్సును; కావించెన్= చేసినాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! విను. లోకాలకు అధిపతి, ఈశ్వరుడు అయిన విష్ణుమూర్తి వేదాలనూ బ్రాహ్మణులనూ గోవులనూ దేవతలనూ సజ్జనులనూ ధర్మాన్నీ అర్థాన్నీ కాపాడటం కోసం మాత్రమే అవతారాలు ధరిస్తాడు. వాయువు వలె గొప్పరూపాలలోను అల్ప రూపాలలోనూ చేరి ఉంటాడు. ఆయన ఎప్పుడూ ఎక్కువ తక్కువలులేని నిర్గుణుడైనప్పటికీ ఎక్కువ తక్కువభావాలు లేక గుణాలకలయికను పొందుతుంటాడు. అలాంటి విష్ణువు మత్స్యావతారం ధరించటంలో ఆశ్చర్యం ఏమీలేదు. పోయిన కల్పం చివర ద్రవిళదేశానికి రాజయిన సత్యవ్రతుడు నీటినిమాత్రమే ఆహారంగా గ్రహిస్తూ ఒకనదిగట్టున విష్ణువును గురించి తపస్సు చేశాడు.

**వ. మఱియు నొక్కనాఁ డమ్మేదినీకాంతుండు గృతమాలికయను నేటిపొంత హరిసమర్పణంబుగా జలతర్పణంబు సేయుచున్న సమయంబున నా రాజు దోసిట నొక్క మీనుపిల్ల; దవిలి వచ్చిన నులికిపడి, మరలం దరంగిణీ జలంబు నందు శకుల శాబకంబు విడిచె నట్లు విడివడి నీటిలో నుండి జలచరపోతంబు భూతలేశ్వరున కిట్లనియె. 694**

**ప్రతి :** మఱియున్= వెండియు; ఒక్కనాఁడు= ఒకదినం; ఆ+మేదినీకాంతుండున్= ఆ రాజు; కృతమాలిక అను ఏటి పొంతన్= కృతమాలిక అనే నది దగ్గర; హరి సమర్పణంబుగా= విష్ణునకు అర్పితంగా; జలతర్పణంబున్= నీళ్లతో తర్పణం; చేయుచున్న= ఒనరిస్తున్న; సమయంబునన్= వేళలో; ఆ రాజు దోసిటన్= ఆ ప్రభువుయొక్క దోసిలిలో; ఒక్కమీనుపిల్ల= ఒక చేపపిల్ల; తవిలి వచ్చినన్= తగులుకొనిరాగా; ఉలికిపడి= తుళ్లిపడి; మరలన్= తిరిగి; తరంగిణీ= నదియొక్క; జలంబునందు= నీటియందు; శకులశాబకంబున్= చేపపిల్లను; విడిచెన్= వదలినాడు; అట్లు= అలాగ; విడివడి= విడువబడి; నీటిలోనుండి= నీటినుండి; జలచరపోతంబు= నీటిలో సంచరించే చేపపిల్ల; భూతల+ఈశ్వరునకున్= రాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తా :** సత్యవ్రతుడు ఒకనాడు కృతమాలిక అనేపేరుగల నదిఒడ్డున హరిసమర్పణంగా జలతర్పణం చేస్తుండగా అతని దోసిలితో ఒక చేపపిల్ల కనిపించింది. అతడు ఉలిక్కిపడి ఆ చేపపిల్లను నదిలో వదలినాడు. నీటిలోనుండి చేపపిల్ల ఆ రాజుతో ఇలా అన్నది.

**మత్తకోకిల.**

**“పాటువచ్చిన జ్ఞాతి ఘాతులు పాపజాతి ఝషంబు లీ**
**యేటఁ గొండొక మీనుపిల్లల నేఱి పట్టి వధింప న**
**చ్చోట నుండక నీదు దోసిలి సొచ్చి వచ్చిన నన్ను న**
**ట్టేటఁ ద్రోవఁగఁ బాడియే? కృప యింత లేక దయానిధీ? 695**

**ప్రతి :** దయానిధీ= కృపానిలయా!; పాటు= సముద్రముప్పొంగి శమించిన తర్వాత; వచ్చిన= ఏతెంచిన; జ్ఞాతిఘాతులు= దాయాదులను చంపునట్టి; పాపజాతిఝుషంబులు= పాపిష్ఠిచేపలు; ఈ+ఏటన్= ఈ నదిలో; కొండొక= చిన్న; మీను పిల్లలన్= చేపపిల్లలను; ఏఱిపట్టి= ఒకటొకటిగా గుర్తించి పట్టుకొని; వధింపన్= చంపటం కారణంగా; ఆ+చోటన్+ఉండక= ఆ తావున ఉండకుండా; నీదు= నీ యొక్క; దోసిలి+చొచ్చి= దోసిటిలోనికి ప్రవేశించి; వచ్చిన= వచ్చినటువంటి; నన్ను= నను; కృప= దయ; ఇంతన్= ఇసుమంతకూడా; లేక= లేకుండా; నడు+ఏటన్= ఏటి నడుమ; త్రోవఁగన్= త్రోయటం; పాడియే= న్యాయమా?

**తా :** దయానిలయుడా! ఈ ఏటిలో దాయాదులను చంపే పాపిష్ఠి చేపలున్నాయి. అవి చిన్న చేపలనుపట్టి మింగుతాయి. అందువల్ల నేను ఇక్కడ ఉండలేక నీ దోసిటిలోనికి వచ్చినాను. దయలేకుండా నన్ను నట్టేటిలో తోయటం న్యాయం కాదు.

**ఆ. వలలుఁ దారు నింక వచ్చి జాలరి వేఁట, కాఱు నేఱు గలఁచి గారవెట్టి**
**మిడిసి పోవనీక మెడఁ బట్టుకొనియెద;, రప్పు డెందుఁ జొత్తు? ననఘ చరిత! 696**

**ప్రతి :** అనఘచరిత= పుణ్యచరిత్రా!; వలలున్+తారున్= వలలతో తాము; జాలరివేఁటకాఱున్= జాలరులగు వేటగాళ్లు; ఇంక= ఇకమీద; వచ్చి= ఏతెంచి; ఏఱున్= నదిని; కలఁచి= కలతపెట్టి; గారవెట్టి= బంధించి; మిడిసి= ఎగిరి; పోవనీక= పోనీయక; మెడన్+పట్టుకొనియెదరు= మెడ పట్టుకుంటారు; అప్పుడు= ఆ సమయాన; ఎందున్= ఎక్కడ; చొత్తున్?= దాగుదును?

**తా :** పుణ్యాత్ముడా! ఇక మీదట చేపలుపట్టే జాలరులు వలలు తీసుకుని వస్తారు. నదిని కలతపెట్టి బంధించి, ఎగిరిపోనీకుండా నా మెడ పట్టుకుంటారు. అప్పుడు ఎక్కడ దాగుకోగలను?

**క. భక్షించు నొండె ఝుషములు, శిక్షింతురు ధూర్తు లొండెఁ; జెడకుండ ననున్**
**రక్షింపు దీనవత్సల!, ప్రక్షీణులఁ గాచుకంటె భాగ్యము కలదే?" 697**

**ప్రతి :** దీనవత్సల= దీనులైనవారిపై వాత్సల్యంకలవాడా!; ఝుషములు= (పెద్ద) చేపలు; భక్షించున్+ఒండె= తినటం కానీ; ఒండెన్= అలాకానిపక్షంలో; ధూర్తులు= దుర్మార్గులగు జాలరులు; శిక్షింతురు= బంధిస్తారు; చెడకుండననున్= నన్ను చెడిపోకుండా; రక్షింపు= కాపాడు; ప్రక్షీణులన్= ఎక్కువగా చెడిపోయినవారిని (బలహీనులను); కాచుటకంటెన్= కాపాడటంకంటె; భాగ్యము కలదే= పుణ్యం ఉందా? (లేదు)

**తా :** దీనవత్సలా! నన్ను పెద్దచేపలయినా తింటాయి. అలా కాని పక్షంలో ధూర్తులగు వేటకాండ్రయినా పట్టుకొంటారు. ఆ విధంగా చచ్చిపోకుండా నన్ను రక్షించు. బలహీనులను కాపాడటం కన్నా మరొక పుణ్యం ఉందా?

**వ. అనిన విని కరుణాకరుండగు నవ్విభుండు మెల్లన యయ్యంభశ్చరడింభకంబును గమండలు జలంబునం బెట్టి తన నెలవునకుం గొనిపోయె, నదియు నొక్క రాత్రంబునం గుండిక నిండి తనకు నుండ నిమ్ము సాలక రాజన్యున కిట్లనియె. 698**

**ప్రతి :** అనినన్= అని పలుకగా; విని= ఆలకించి; కరుణా+ఆకరుండు+అగు= దయకు నిలయమైనవాడగు; ఆ+విభుండు= ఆ రాజు; మెల్లనన్= మెల్లగా; ఆ+అంభః+చర= ఆ (నీటిలో కదలాడు) చేప; డింభకంబును= పిల్లను; కమండలు=

కమండలమందలి; జలంబునన్= నీటిలో; పెట్టి= ఉంచి; తన నెలవునకున్= తన నివాసానికి; కొనిపోయెన్= తీసికొనిపోయినాడు; అదియున్= ఆ చేపపిల్ల కూడా; ఒక్క రాత్రంబునన్= ఒకే రాత్రిలోనే; కుండికనిండి= కమండలమంతానిండి; తనకున్+ఉండన్= తాను ఉండేటందుకు; ఇమ్ము= తావు (చోటు); చాలక= సరిపోక; రాజన్యునకు= రాజశ్రేష్ఠునికి; ఇట్లు+అనియెన్= ఇలా అంది.

**తా :** చేపపిల్ల మాటలువిని జాలిపడి దయకు నిలయమైనవాడగు సత్యవ్రతుడు, ఆ చేపపిల్లను నెమ్మదిగా అందుకొని తన కమండలంలోని నీటిలో ఉంచి తన నివాసానికి తీసికొని వెళ్లినాడు. ఒక్కరాత్రిలోనే ఆ చేపపిల్ల పెరిగిపెద్దదై కమండలమంతా నిండిపోయింది. కదలటానికి తావులేక ఆ చేపపిల్ల రాజుతో ఇలా అంది.

**క. 'ఉండ నిది గొంచె మెంతయు, నొండొకటిందెమ్ము భూవరోత్తమ?' యనుడున్**
**గండకముఁదెచ్చి విడిచెను, మండలపతి సలిలకలశమధ్యమునందున్. 699**

**ప్రతి :** భూవర+ఉత్తమ= రాజశ్రేష్ఠుడా!; ఉండన్= (నేను) ఉండడానికి; ఇది= ఈ కమండలము; ఎంతయున్= చాలా; కొంచెము= చిన్నది; ఒండు+ఒకటిన్= వేరొకటి; తెమ్ము= తీసుకొనిరమ్ము; అనుడున్= అనగా; గండకమున్= ఆ చేపను; తెచ్చి= తీసుకొని వచ్చి; మండలపతి= రాజు; సలిలకలశ= మంచినీళ్ళకడవ; మధ్యమునందున్= మధ్యలో; విడిచెను= వదలినాడు.

**తా :** 'ఓ రాజేంద్రా! నేను ఉండడానికి ఈ కమండలం చాలా చిన్నది. చాలటంలేదు. ఇంకొకదానిని తీసుకురా' అని చేపపిల్ల అడుగగా సత్యవ్రతుడు ఒక నీళ్ళకడవలో దానిని విడిచినాడు.

**వ. అదియును ముహూర్తమాత్రంబునకు మూఁడు చేతులనిడుపై యుదంచనంబు నిండి పట్టు సాలక వేఱొండు దెమ్మనవుడా రాచపట్టి కరుణాగుణంబునకు నీడపట్టు గావున గండకంబు నొండొక్క చిఱుత మడుఁగున నునిచె; నదియు నా సరోవర జలంబునకు నగ్గలంబై 'తనకు సంచరింప నిదిగొంచెం' బని పలికినం బుడమిఱేఁడు మంచివాఁడగుటం జేసి యా కంచరంబు నుదంచిత జలాస్పదంబైన హ్రదంబునందు నిడియె; నదియు నాసలిలాశయంబునకును నధికంబై పెరుఁగ నిమ్ము సాలదని చెప్పికొనిన నప్పుణ్యుం డొప్పెడి నడవడిం దప్పనివాఁడైన కతంబున నమ్మహామీనంబును మహార్ణవంబున విడిచె; నదియును మకరాకరంబునం బడి రాజున కి ట్లను బెనుమొసళ్లు ముసరికొని కసిమసంగి మ్రింగెడి; నింత కాలంబు నడపి కడపట దిగవిడువకు; వెడలఁ దిగువు' మని యెలింగింపఁ దెలిసి యన్నీటి తిరుగుడు ప్రోడకుం బుడమిఱేఁడిట్లనియె. 700**

**ప్రతి :** అదియును= ఆ చేపపిల్ల; ముహూర్తమాత్రంబునకున్= క్షణకాలంలోనే; మూఁడుచేతుల నిడుపై= మూడుచేతుల (కొలత) పొడవై, ఉదంచనంబునిండి= పాత్రమూతివరకు నిండి; పట్టు+చాలక= చోటుచాలక; వేఱు+ఒండు= వేరొకపాత్ర; తెమ్ము+అనవుడు= తెమ్మనగా; ఆ రాచపట్టి= ఆ రాకుమారుడు; కరుణాగుణంబునకున్= దయాగుణానికి; నీడపట్టు గావున= ఉనికిపట్టు కనుక; గండకంబును= చేపను; ఒండు+ఒక్క= వేరొక; చిఱుత మడుఁగునన్= చిన్న మడుగులో; ఉనిచెన్= ఉంచినాడు; అదియున్= అక్కడ ఉంచినట్టి చేపకూడా; ఆ సరోవరజలంబునకున్= ఆ సరస్సులోని నీళ్లకు; అగ్గలంబు+ఐ= ఎక్కువై, తనకు సంచరింపన్= తాను తిరుగాడటానికి; ఇది= ఈ సరస్సు; కొంచెంబు+అని= తక్కువైనదని

(చాలదని); పలికినన్= చెప్పగా; పుడమిఱేఁడు= రాజు; మంచివాఁడు+అగుటంజేసి= ఉత్తముడు కావటంవల్ల; ఆ కంచరంబున్= ఆ జలచరాన్ని; ఉదంచిత= విజృంభించిన (ఎక్కువనీళ్లుండే), జల+ఆస్పదంబైన= నీటికి నెలవైన, హ్రదంబునందున్= చెరువునందు; ఇడియెన్= విడిచినాడు, అదియున్= ఆ చేపకూడా; ఆ సలిలాశయంబునకున్= ఆ మంచినీటి చెరువుకంటెను; అధికంబై= ఎక్కువై; పెరుఁగన్= పెద్దదికాగా; ఇమ్ము= చోటు; చాలదని= సరిపోదని; చెప్పికొనినన్= చెప్పుకోగా; ఆ+పుణ్యుండు= ఆ పుణ్యాత్ముడు; ఒప్పెడినడవడిన్= మంచిప్రవర్తనను; తప్పనివాడైన= విడువనివాడైన; కతంబున= కారణంబున; ఆ+మహామీనంబును= ఆ చేపకూడా; మహార్ణవంబునన్= మహాసముద్రంలో; విడిచెన్= విడిచినాడు; అదియును= ఆ చేప కూడా; మకర+ఆలయంబునన్+పడి= మొసళ్లకు నిలయమైన సముద్రంలోపడి; రాజునకు+ఇట్లు+అనున్= రాజుతో ఇలా అంది; పెనుమొసళ్లు= పెద్దమొసళ్లు; ముసరికొని= చుట్టుకొని; కసిమసంగి= ఖండించి (విజృంభించి); మ్రింగెడిన్= మింగుతాయి; ఇంతకాలంబు= ఇంతకాలం; నడపి= కాపాడి (నడిపించి); కడపటన్= చివరకు; దిగవిడువకు= విడిచిపెట్టవద్దు; వెడలన్= బయటకు; తిగువుము+అని= ఉద్ధరించమని; ఎలింగింపన్= బిగ్గరగా పలుకగా; తెలిసి= తెలుసుకొని; ఆ+నీటితిరుగుడు ప్రోడకున్= ఆ గొప్ప జలచరానికి; పుడమిఱేఁడు= రాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఆ చేప క్షణకాలంలోనే మూడుచేతులపొడవై ఆ పాత్ర అంతా నిండిపోయింది. ఆ చోటు దానికి చాలక ఇంకొక దానిని తెమ్మన్నది. దయానిధి అయిన సత్యవ్రతుడు ఆ చేపను ఒక చిన్న మడుగులో విడిచినాడు. అది ఆ మడుగుకంటే పెద్దదై 'నేను తిరగడానికి ఇది చాలదు' అని చెప్పింది. ఉత్తముడైన రాజు ఆ చేపను ఎక్కువ నీళ్లుండే పెద్ద చెరువులో విడచినాడు. ఆ చేప ఆ చెరువుకన్నా పెద్దదిగా పెరిగింది. 'చోటుచాలదని చెప్పుకున్నది' చేప. ఆ పుణ్యాత్ముడు ఆ పెద్ద చేపను పెనుకడలిలో విడచినాడు. సముద్రంలో చేరిన తర్వాత 'పెద్దమొసళ్లు నన్ను పట్టుకొని చంపి మ్రింగుతాయి. ఇంత కాలమూ కాపాడి ఇప్పుడు నన్ను విడవవద్దు, బయటకు ఎత్తు' అని ఆ చేప రాజుతో మొరపెట్టుకొన్నది. అప్పుడు నేర్పరియైన చేపతో రాజు ఇట్లా అన్నాడు.

**సీ. ఒక దినంబున శతయోజనమాత్రము విస్తరించెదు నీవు; వినము చూడ**
**మిటువంటి ఝషముల నెన్నఁడు నెఱుఁగము; మీనజాతుల కిట్టి మేను గలదె?**
**యేమిటి కెవ్వఁడ? వీ లీలఁ ద్రిప్పెదు కరుణ నాపన్నులఁగావ వేఁడి**
**యంభశ్చరంబైన హరివి నే నెఱిఁగితి నవ్యయ! నారాయణాభిధాన!**

**తే. జననసంస్థితిసంహారచతురచిత్త!, దీనులకు భక్తులకు మాకు దిక్కు నీవ**
**నీదు లీలావతారముల్ నిఖిలభూత, భూతిహేతువుల్ మ్రొక్కెదఁ బురుషవర్య! 701**

**ప్రతి :** పురుషవర్య!= ఓ పురుషోత్తమా!; ఒకదినంబునన్= ఒక్కనాడే, నీవు; శతయోజనమాత్రంబు= నూరుయోజనాలంత; విస్తరించెదు= వ్యాపించినావు; వినము= ఆలకించము; చూడము+ఇటువంటి ఝషములన్= ఇలాంటి చేపలను చూడలేదు; ఎన్నడున్= ఏనాడుకూడా; ఎఱుఁగము= తెలియము; మీనజాతులకు= చేపజాతులకు; ఇట్టి= ఇలాంటి; మేను= శరీరం; కలదె= ఉందా!; ఎవ్వఁడవు?= నీవెవ్వరు?; ఏమిటికి= ఎందులకుగాను?; ఈలీలన్ త్రిప్పెదు= ఈ మాదిరిగా తిప్పుతున్నావు; కరుణన్= దయతో; ఆపన్నులన్= ఆపదలో ఉండేవారిని; కావవేఁడి= కావగోరి; అంభస్+చరంబైన= జలచరమగు మత్స్యమవైన; హరివి= విష్ణుమూర్తివి; నేన్+ఎఱిఁగితిన్= నేను తెలుసుకున్నాను; అవ్యయ= అచ్యుత; నారాయణ+అభిధాన=

నారాయణ అనేపేరు కలవాడా!; జనన= పుట్టుక; సంస్థితి= పోషణ; సంహార= లయము – వీటిలో; చతురచిత్త= నైపుణ్యం కలిగిన చిత్తం కలవాడా!; దీనులకున్= దైన్యం కలిగిన; భక్తులకు= భక్తిగలిగినమాకు; దిక్కునీవ= నీవేదిక్కు; నీదు= నీయొక్క; లీలా+అవతారముల్= మహిమతోకూడిన అవతారాలు; నిఖిలభూతభూతి హేతువుల్= అన్ని ప్రాణులకు మేలు కలిగించేవి; మ్రొక్కెదన్= నీకు మ్రొక్కుతున్నాను.

**తా :** పురుషోత్తమా! ఒక్కదినంలోనే నీవు నూరుయోజనాలదూరం వ్యాపించినావు. ఇలాంటి చేపలను మేము ఎప్పుడూ కనీ వినీ ఎరుగము. చేపజాతులకు ఇంతటి శరీరం ఉండదు. నీవెవరు? ఎందుకు ఇబ్బంది పెడుతున్నావు? నీవు దీనులను కాపాడటం కోసం చేపరూపం ధరించిన విష్ణుదేవుడవని తెలుసుకొన్నాను. అచ్యుతా! నారాయణా! లోకాలను సృష్టించి, పోషించి లయించే మహానుభావుడవు నీవు. దిక్కులేని భక్తులమైన మాకు నీవే దిక్కు. మహిమతోకూడిన నీ అవతారాలు అన్ని ప్రాణులకూ మేలు కలిగిస్తాయి. అలాంటి నీకు నమస్కారం చేస్తున్నాను.

**క. ఇతరులము గాము చిత్సం, గతులము మాపాల నీవు గలిగితి భక్త**
**స్థితుఁడవగు నిన్ను నెప్పుడు, నతిసేసిన వాని కేల నాశము గలుగున్? 702**

**ప్రతి :** ఇతరులము= పరాయివాళ్లం; కాము= కాదు; చిత్+సంగతులము= నిర్మలమైన జ్ఞానం కలవాళ్లం; మాపాలనీవు= మాకు అండగా నీవు; కలిగితి= దొరకినావు; భక్త= భక్తులలో; స్థితుఁడవు+అగు= నివసించేవాడవైన; నిన్నున్= నిన్ను; ఎప్పుడున్= ఎల్లవేళల; నతిన్+చేసినవానికిన్= నమస్కరించినవానికి; ఏల= ఎందుకు; నాశము= చేటు; కలుగున్= కలుగుతుంది?

**తా :** మేము నీకు పరాయివాళ్లం కాము. నిర్మలమైన జ్ఞానం కలవాళ్లం. మా రక్షణకు నీవున్నావు. ఎల్లప్పుడూ భక్తులు ఎక్కడ ఉంటే నీవూ అక్కడనే ఉంటావు. నిన్ను స్తుతించినవారికి ఎప్పటికీ కీడు జరగదు.

**క. శ్రీలలనాకుచవేదికఁ, గేళీపరతంత్రబుద్ధిఁ గ్రీడించు సుఖా**
**లోలుఁడవు దామసాకృతి, నేలా మత్స్యంబ వైతి వెఱిగింపు హరీ!" 703**

**ప్రతి :** హరీ= శ్రీహరీ!; శ్రీలలనా= లక్ష్మీరమణి; కుచవేదికన్= వక్షస్థలంమీద; కేళీపరతంత్రబుద్ధిన్= క్రీడించాలనే పరవశమైన మానసంతో; క్రీడించు= విహరించునట్టి; సుఖ+ఆలోలుఁడవు= ఆనంద విలోలుడవు; తామస+ఆకృతి= తామసాకారంగల (అజ్ఞానంతో కూడిన రూపంగా); ఏలా= ఎందుకు; మత్స్యంబవు+ఐతివి= చేపవు అయినావు; ఎఱిఁగింపు= తెలియజేయుము.

**తా :** "శ్రీహరీ! నీవు లక్ష్మీదేవి వక్షస్థలంమీద క్రీడిస్తూ సంతోషంతో విహరించే ఆనందస్వరూపుడవు. అజ్ఞానంతో కూడిన చేపరూపాన్ని ఎందుకు ధరించినావో చెప్పు".

**వ. అని పలుకు సత్యవ్రతమహారాజునకు నయ్యుగంబు కడపటఁ బ్రళయవేళా సముద్రంబున నేకాంతజన ప్రీతుండయి విహరింప నిచ్ఛించు మీనరూపధరుండైన హరి యిట్లనియె. 704**

**ప్రతి :** అని పలుకు= అని చెప్పే; సత్యవ్రతమహారాజునకు= సత్యవ్రతుడు అనే గొప్పరాజుకు; ఆ+యుగంబు కడపటన్= ఆ యుగం చివర; ప్రళయవేళా= ప్రళయ కాలంలో; సముద్రంబునన్= కడలిలో; ఏకాంతజన= ఒంటరిగా; ప్రీతుండు+అయి=

ఇష్టపడినవాడై; విహరింపన్=విహారం చేయటానికి; ఇచ్ఛించు= ఇష్టపడు; మీనరూపధరుండు+ఐ= చేపరూపాన్ని ధరించినవాడై; హరి= విష్ణువు; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** ఈ విధంగా సత్యవ్రతమహారాజు అడుగగా ఆ యుగం చివర ప్రళయకాలంలో ఒంటరిగా సాగరంలో సంచరించడానికి చేపరూపాన్ని ధరించిన విష్ణుమూర్తి సత్యవ్రతునితో ఇలా అన్నాడు.

**సీ. ఇటమీఁద నీ రాత్రి కేడవదినమునఁ బద్మగర్భుని కొక్క పగలు నిండు;**
**భూర్భువాదికజగంబులు మూఁడు విలయాబ్ధిలోన మునుంగు; నా లోనఁబెద్ద**
**నావ సేరఁగ వచ్చు; నా పంపు పెంపున దానిపై నోషధితతులు బీజ**
**రాసులు నిడి పయోరాశిలో విహరింపఁ గలవు సప్తర్షులుఁకలసి తిరుగ**

**ఆ. మ్రోలఁగాన రాక ముంచు పెంజీఁకటి, మిడుకుచుండు మునుల మేని వెలుఁగు**
**దొలఁకుచుండు జలధి దోదూయమాన మై, నావ దేలుచుండు నరవరేణ్య! 705**

**ప్రతి :** నరవరేణ్య= రాజశ్రేష్ఠా!; ఇటమీఁదన్= ఇకమీదట; ఈ రాత్రికి= ఈ రేయి (గడచిన); ఏడవదినమునన్= ఏడవరోజున; పద్మగర్భునికి= బ్రహ్మకు; ఒక్కపగలు= ఒకపగలు; నిండున్= పూర్తి అవుతుంది; భూః+భువ+ఆదికజగంబులు= భూలోకం భువర్లోకం మొదలయిన లోకాలు; మూఁడు= మూడును; విలయ+అబ్ధిలోన= ప్రళయసముద్రంలో; మునుంగున్= మునిగిపోతాయి, ఆలోనన్= అప్పుడు; పెద్దనావ= గొప్పఓడ; చేరగన్= నీ దరి చేరటానికి; వచ్చున్= వస్తుంది; నా పంపు పెంపునన్= నా ఆనతి మేరకు; దానిపైన్= ఓడపై; ఓషధితతులు= ఔషధ సమూహాలు; బీజరాసులున్= విత్తనాలు; ఇడి= ఉంచుకొని; పయోరాశిలో= జలనిధిలో; విహరింపన్+కలవు= విహరిస్తావు; సప్తర్షులు= ఏడుగురుమునీశ్వరులు; కలిసితిరుగన్= నీతోకలిసి సంచరించగా; మ్రోలన్= ఎదుట ఉన్నది; కానరాక= కనపడక; పెను+చీకటి= పెద్ద చీకటి; ముంచు= ఆవరిస్తుంది; మునుల= ఋషుల; మేని= శరీరపు; వెలుగు= కాంతి; మిడుకు చుండున్= మినుకు మినుకుమని మెరుస్తూ ఉంటుంది; జలధి= సముద్రము; దోదూయమానమై= మిక్కిలి కదలించబడుతున్నదై; తొలఁకుచుండున్= చలిస్తూ ఉంటుంది; నావ= ఓడ; తేలుచుండున్= తేలుతూ ఉంటుంది.

**తా :** ఓ నృపవర్యా! ఈ రేయి గడచిన తరువాత రాబోయే ఏడవ దినంతో బ్రహ్మకు ఒక పగలు పూర్తి అవుతుంది. భూలోకాది ముల్లోకాలూ ప్రళయసాగరంలో మునిగిపోతాయి. అప్పుడు నా ఆనతి మేరకు ఒక పెద్ద ఓడ నీ చెంతకు వస్తుంది. అప్పుడు నీవు సమస్త ఓషధీసమూహాలనూ విత్తనాలరాసులనూ ఆ నౌకపై ఉంచుకొని ప్రళయసముద్ర జలాలలో విహరిస్తావు. నీతో కలిసి సప్తర్షులుకూడా ఆ ఓడలో ఉంటారు. మీ ముందుభాగంలో పెనుచీకటి ఆవరిస్తుంది. మునుల శరీరకాంతులు మిణుకు మిణుకుమంటూ మెరుస్తుంటాయి. సాగరంలో నౌక ఊగుతూ తేలుతూ సాగిపోతూ ఉంటుంది.

**వ. మఱియు నన్నావ మున్నీటి కరళ్లకు లోనుగాకుండ, నిరుగెలంకుల వెనుక ముందట నేమఱకుండఁ బెన్నెఱులగు నా గఱులన్ జడియుచుఁ బొడువ వచ్చినఁ బలుగ్రాహంబుల నొడియుచు సంచరించెద; నొక్క పెనుఁబాము చేరువ నా యనుమతిం బొడసూపెడు దానంజేసి సుడిగాడ్పుల కతంబున నావ వడిం దిరుగంబడకుండ నా కొమ్ము తుదిం బదిలముచేసి నీకును మునులకును నలజడి సెందకుండ మున్నీట నిప్పాటం దమ్మిచూలి రేయి వేగునంతకు మెలంగెద; నది కారణంబుగా జలచర రూపంబుఁ గయికొంటి;**

**మఱియును బ్రయోజనంబు గలదు. నా మహిమ పరబ్రహ్మంబని తెలియుము. నిన్ను ననుగ్రహింతు నని సత్యవ్రతుండు సూడ హరి తిరోహితుండయ్యె; నయ్యవసరంబున. 706**

**ప్రతి :** మఱియున్= వెండియు; ఆ+నావ= ఆ ఓడ; మున్నీటి= సముద్రముయొక్క; కరళ్లకున్= అలలకు; లోనుగాకుండన్= స్వాధీనంకాకుండా; ఇరుగెలంకులన్= రెండుదిక్కులందు; వెనుక ముందటన్= వెనుకవైపు ముందువైపు; ఏమఱకుండన్= అప్రమత్తంగా; పెను+నెఱులగు= పెద్ద ఈకలుగల; నా= నాయొక్క; కఱులన్= రెక్కలను; జడియుచున్= కదలిస్తూ; పొడువవచ్చినన్= పొడవటానికి ఏతెంచిన; పలుగ్రాహంబులన్= అనేకమైన పెద్ద జలచరాలను (బలుగ్రాహంబులన్= పెద్ద మొసళ్ళను); ఒడియుచున్= పైకెగిరి పట్టుకొంటూ; సంచరించెదన్= తిరుగుతుంటాను; ఒక్క= ఒక; పెను+పాము= పెద్దసర్పం; చేరువన్= (అక్కడికి) సమీపాన; నా అనుమతిన్= నా ఆనతిమేరకు; పొడసూపెడున్= కనిపిస్తుంది; దానన్+చేసి= దాని వలన; సుడిగాడ్పుల= సుడిగాలుల; కతంబునన్= కారణాన; నావ= ఓడ; వడిన్= మెలికలుగా; తిరుగంబడకుండన్= తిరుగబడక ఉండేటట్లు; నా కొమ్ముతుదిన్= నా కొమ్ము చివరన; పదిలముచేసి= దృఢపరచి (కట్టి); నీకును= నీకూ; మునులకున్= ఋషులకూ; అలజడి= ఆపద; చెందకుండన్= కలుగకుండ; మున్నీటన్= సముద్రాన; ఇప్పాటన్= ఈ పాటున; తమ్మిచూలి= బ్రహ్మకు; రేయి వేగునంతకు= ప్రళయరాత్రిగడిచేవరకు; మెలంగెదన్= జాగరూకతతో ఉంటాను; అదికారణంబుగాన్= అందుకోసమే; జలచరరూపంబున్= మత్స్యరూపాన్ని; కయికొంటిన్= చేకొంటిని; మఱియును= (మరొక) వెండియు; ప్రయోజనంబుకలదు= ఉపయోగం ఉంది; నా మహిమ= నా మహత్త్వం; పరబ్రహ్మంబు+అని= పరబ్రహ్మస్వరూపమని; తెలియుము= తెలుసుకో; నిన్నున్= నిన్ను; అనుగ్రహింతును= కృపజూడగలను; అని= అని పలికి; సత్యవ్రతుండు+చూడన్= సత్యవ్రతుడు చూస్తుండగనే; హరి= విష్ణుమూర్తి; తిరోహితుండు+అయ్యెన్= అదృశ్యమైనాడు; ఆ+ అవసరంబునన్= ఆ సమయాన...

**తా :** ఆ నౌక కడలి అలలకు దెబ్బతినకుండా మత్స్యరూపం ధరించిన నేను అన్నివైపులా పెద్ద ఈకలుకలిగిన నారెక్కలను కదలిస్తూ ఉంటాను. నా ఆనతి మేరకు ఒక పెద్దపాము అక్కడ కనిపిస్తుంది. సుడి గాలులకు నావ తిరుగబడకుండా ఆ పాముతో నా కొమ్ముకొనకు ఆ నౌకను కట్టివేసి. నీకూ మునులకూ కీడు కలుగకుండా ఆ ప్రళయరాత్రి గడిచేవరకు నేను కాపాడుతుంటాను. ఇందుకోసమే నేను ఇలాంటి మత్స్యరూపాన్ని ధరించినాను. ఇంకా విశేషమేమంటే నేను నిన్ను అనుగ్రహిస్తాను. పరబ్రహ్మస్వరూపమైన నా మహిమను తెలుసుకో. ఈ విధంగా పలికి శ్రీహరి సత్యవ్రతుడు చూస్తుండగానే అదృశ్యమైనాడు.

**ఆ. మత్స్యరూపియైన మాధవు నుడుగులు, దలఁచికొనుచు రాచతపసి యొక్క**
**దర్భశయ్యఁదూర్పు దలగడగాఁబండి, కాచి యుండె నాఁటి కాలమునకు. 707**

**ప్రతి :** మత్స్యరూపి+ఐన= చేపరూపాన ఉన్న; మాధవు నుడుగులు= శ్రీపతి మాటలను; తలఁచికొనుచున్= తలచుకొంటూ; ఒక్కదర్భశయ్యన్= ఒక దర్భశయ్యపైన; తూర్పు+తలగడ+కాన్= తూర్పువైపు తలగడగాచేసి; పండి= పరుండి; నాటి కాలమునకున్= ప్రళయకాలం కోసం; రాచతపసి= రాజు అయిన ఆ తాపసి; కాచియుండెన్= వేచి ఉన్నాడు.

**తా :** చేపరూపంతో మాధవుడు పలికిన మాటలను తలచుకొంటూ తాపసియైన సత్యవ్రతుడు దర్భలశయ్యపై తూర్పువైపు తలగడగా పరుండి ప్రళయసమయంకోసం ఎదురుచూస్తున్నాడు.

**వ. అంతఁ గల్పాంతంబు డాసిన. 708**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట; కల్ప+అంతంబు= ప్రళయం; డాసినన్= సమీపించగా.

**తా :** అటు పిమ్మట ప్రళయం సమీపించింది.

**క. ఉల్లసితమేఘపంక్తులు, జల్లించి మహోగ్రవృష్టి జడిగొని కురియన్**
**వెల్లివిరిసి జలరాసులు, సెల్లెలికట్టలను దాఁటి సీమల ముంచెన్. 709**

**ప్రతి :** ఉల్లసిత= ప్రకాశించే (మెరుపులతోకూడిన); మేఘపంక్తులు= మొయిలుగుంపులు; జల్లించి= జల్లెడపట్టినట్లు (ఎడతెరపిలేకుండ); మహా+ఉగ్ర+వృష్టి= గొప్పభయంకరమైన వర్షం; జడిగొని= నిరంతరాయంగా; కురియన్= కురియగా/ వర్షించగా; జలరాసులు= సముద్రాలు; వెల్లివిరిసి= ఉప్పొంగి; చెల్లెలికట్టలను= చెలియలికట్టలను (సముద్రపుగట్టులను హద్దులను); దాటి= అతిక్రమించి; సీమలన్= (ప్ర)దేశాలను; ముంచెన్= ముంచివేసినాయి.

**తా :** మెరుపులతోకూడిన మేఘాలు ఎడతెరపిలేకుండా భయంకరమైన వర్షం కురిపించినాయి. సముద్రాలు చెలియలికట్టలు దాటి పొంగిపొరలి దేశాలను ముంచివేసినాయి.

**వ. తదనంతరంబ. 710**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= ఆ తర్వాత

**తే. మున్ను పోయిన కల్పాంతమున నరేంద్ర!, బ్రాహ్మ మనఁగ నైమిత్తికప్రళయవేళ**
**నింగిపై నిట్టతొలఁకు మున్నీటిలోనఁ, గూలె భూతాళి జగముల కొలఁదు లెడలి. 711**

**ప్రతి :** నర+ఇంద్ర= ఓ రాజా!; మున్ను పోయిన= మునుపు గతించిన; కల్పాంతమునన్= ప్రళయంలో; బ్రాహ్మమనఁ గన్= బ్రాహ్మము అనే; నైమిత్తిక= నిమిత్తసంబంధమైన; ప్రళయవేళన్= ప్రళయసమయాన; నింగిపైన్= ఆకాశంవరకు వ్యాపించిన; నిట్టతొలఁకు= వెల్లువ అలలుగల; మున్నీటిలోనన్= సముద్రంలో; జగముల= ప్రపంచాల; కొలఁదులుఎడలి= హద్దులుదాటి; భూతాళి+కూలెన్= ప్రాణుల సమూహాలు కూలిపోయినాయి.

**తా :** ఓ రాజా! బ్రహ్మకల్పంయొక్క అంత్యకాలంలో ఏర్పడిన ఆ ప్రళయం నైమిత్తికమైనది. ఆకాశంలో ఎగసిపడుతున్న అలలుగల ప్రళయకాల జలరాశిలో సకలభూతరాశులు కూలిపోయినాయి. లోకాల సరిహద్దులు మాయమైనాయి.

**విశే :** ప్రళయం ఐదువిధాలు. అవి దైనందినం, బ్రాహ్మం, ఆధిభౌతికం, నిత్యం, నైమిత్తికం అనేవి. నిత్యం, నైమిత్తికం, దైనందినం, మనుప్రళయం, మహాప్రళయం అని కూడా కొందరు చెప్తారు. జలప్రళయం (ఉప్పెన), అగ్నిప్రళయం (దహనం), పృథివీప్రళయం (భూకంపం), వాయుప్రళయం (వాయుగుండం), ఆకాశప్రళయం (కుంభవృష్టి) అనే పాంచభౌతిక ప్రళయాలూ ఉన్నాయి.

**వ. అంత నమ్మహారాత్రి యందు. 712**

**ప్రతి :** అంతన్= ఆ పిమ్మట; ఆ+మహారాత్రి యందున్= దీర్ఘమైన ఆ రాత్రిలో.

**మ. నెఱి నెల్లప్పుడు నిల్చి ప్రాణిచయమున్ నిర్మించి నిర్మించి వీఁ**
**పిఱియన్ నీల్గుచు నావులించుచు నజుండే సృష్టియున్ మాని మే**

**నొఱఁగన్ ఱెప్పలు మూసి కేల్ దలగడై యుండంగ నిద్రించుచున్**
**గుఱువెట్టందొడఁగెంగలల్ గనుచు నిర్ఘోషించుచున్ భూవరా! 713**

**ప్రతి :** భూవరా= ఓ రాజా!; నెఱిన్= క్రమంగా; ఎల్లప్పుడు= సర్వకాలమూ; నిల్చి= నిలబడి పూనికతో; ప్రాణిచయమున్= జీవసమూహాన్ని; నిర్మించి నిర్మించి= సృష్టించి సృష్టించి; వీపు+ఇఱియన్= వీపులు విరుస్తూ (బిగపట్టిన వాటిని సడలిస్తూ); నీల్గుచున్= నీల్గుతూ; ఆవులించుచున్= ఆవులిస్తూ; అజుండు= బ్రహ్మదేవుడు; ఏ సృష్టియున్మాని= ఏ సృష్టినీ మానుకొని; మేన్= శరీరాన్ని; ఒఱఁగన్= వాల్చి; ఱెప్పలుమూసి= కనురెప్పలు మూసుకొని; కేల్= చెయ్యి; తలగడ+ఐ= తలదిండుగా అయి; ఉండంగన్= ఉండగా; నిద్రించుచున్= నిద్రపోతూ; కలల్+కనుచు= కలలుకంటూ; నిర్ఘోషించుచున్= శబ్దంచేస్తూ; గుఱువెట్టన్= గురకపెట్టడం; తొడఁగెన్= మొదలుపెట్టినాడు.

**తా :** ఓ రాజా! బ్రహ్మదేవుడు విశ్రాంతిలేకుండా పూనికతో ప్రాణులను సృష్టించి సృష్టించి అలసిపోయినాడు. ఆయన నడుమూ వీపూ బిగుసుకుపోయినాయి. అతడు నీలుగుతూ ఆవులిస్తూ సృష్టికార్యాన్ని ఆపినాడు. శరీరాన్ని వాల్చి రెప్పలుమూసుకొని చెయ్యి తలగడగా ఉంచుకొని గురకలు పెడుతూ కలలుకంటూ నిద్రపోయినాడు.

**ఆ. అలసి సొలసి నిదుర నందిన పరమేష్ఠి, ముఖమునందు వెడలె మొదలి శ్రుతులు**
**నపహరించె నొక హయగ్రీవుఁడను దైత్య, భటుఁడు; దొంగఁదొడరఁబరులవశమె! 714**

**ప్రతి :** అలసి సొలసి= బాగా అలసిపోయి; నిదురన్+అందిన= నిద్రించిన; పరమేష్ఠి= బ్రహ్మదేవుని; ముఖమునందు= నోటినుండి; మొదలి శ్రుతులున్= తొలిచదువులు; వెడలెన్= వెలువడినాయి; హయగ్రీవుఁడు+అను= హయగ్రీవుడు అనే; ఒక దైత్యభటుఁడు= ఒక రాక్షసవీరుడు; అపహరించెన్= (వేదాలను) దొంగిలించినాడు; దొంగన్= చోరుని; తొడరన్= చెంతకువెళ్లటానికి; పరులవశము+ఎ= ఇతరులకు సాధ్యమా? (కాదు)

**తా :** బ్రహ్మదేవుడు బాగా అలసిపోయి నిద్రించినాడు. ఆయన నోళ్ల నుండి వేదాలు వెలువడినాయి. హయగ్రీవుడనే ఒక రాక్షసుడు ఆ వేదాలను దొంగిలించినాడు. ఆతని దరిచేరటానికి ఇతరులకు సాధ్యమా? (సాధ్యంకాదు.)

**విశే :** హయగ్రీవుడు అనే దేవుడు విష్ణువు అవతారంగా పురాణాలలో కీర్తింపబడినాడు. అతడు జ్ఞానానంద స్వరూపుడు. సర్వవిద్యలకు ఆధారమైనవాడు. ఇక్కడి దానవుని పేరుకూడా హయగ్రీవుడే. ఇతడు జ్ఞాననిలయాలైన వేదాలను బ్రహ్మదగ్గరనుండి దొంగిలించినవాడు.

**క. చదువులు దన చేవడినం, జదువుచుఁ బెన్ బయల నుండ శంకించి వడిం**
**జదువుల ముదుకఁడు గూరుకఁ, జదువుల తస్కరుఁడు సొచ్చె జలనిధి కడుపున్. 715**

**ప్రతి :** చదువులు= వేదాలు; తన= తనయొక్క; చేవడినన్= చేతపడగానే (స్వాధీనం చేసుకొనగానే); చదువుచున్= (ఆ వేదాలను) పఠిస్తూ; పెన్+బయలన్+ఉండన్= పెద్దబయలులో (ప్రపంచంలో) ఉండటానికి; శంకించి= సందేహించి; వడిన్= వేగంగా; చదువులముదుకఁడు= ప్రాజదువుల పెద్దవేలుపు అగు బ్రహ్మ; కూరుకన్= నిద్రించగా; చదువుల= వేదాల; తస్కరుఁడు= దొంగ; జలనిధికడుపున్= సముద్రగర్భంలో; చొచ్చెన్= ప్రవేశించినాడు.

**తా :** వేదాలను చేజిక్కించుకొన్న రాక్షసుడు వాటిని చదువుతూ, బయటి ప్రపంచంలో ఉండటానికి భయపడినాడు. బ్రహ్మదేవుడు నిద్రలో ఉండటం కనిపెట్టి వాడు వేగంగా సాగరంలోకి ప్రవేశించినాడు.

**వ. ఇట్లు వేదంబులు దొంగిలి దొంగరక్కసుండు మున్నీట మునింగిన వాని జయింపవలసియు, మ్రాను దీఁగెల యందు విత్తనంబుల పొత్తరలు పెన్నీట నాని చెడకుండ మనుపవలసియు నెల్లకార్యంబులకుం గావలి యగు నా పురుషోత్తముం డప్పెనురేయి చొరుదలయందు. 716**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వేదంబులు= తొలిచదువులు; దొంగిలి= దొంగిలించి; దొంగరక్కసుండు= చోరుడగురాక్షసుడు; మున్నీటన్= సముద్రంలో; మునింగినన్= మునిగిన; వాని= ఆ రక్కసుని; జయింపవలసియున్= గెలువవలసీ; మ్రానుదీఁగెలయందున్= వృక్షలతలందు; విత్తనంబుల= బీజాల; పొత్తరలు= పొట్లాలు; పెను+నీటన్= సముద్రంలో; నాని= తడిసి; చెడకుండన్= చెడిపోకుండా; మనుపవలసియున్= రక్షించవలసియూ; ఎల్ల కార్యములకున్= అన్నిపనులకూ; కావలియగు= రక్షకుడగు; ఆ పురుషోత్తముండు= ఆ భగవానుడు; ఆ+పెనురేయి= ఆ మహారాత్రి; చొరుదలయందు= ప్రవేశించేటప్పుడు...

**తా :** ఆ ప్రళయకాలంలో వేదాలను అపహరించి సముద్ర జలాలలో మునిగి దాగిన ఆ రాక్షసుడిని జయించడమూ, ఓషధులూ విత్తనాల పొట్లాలు సముద్రంలో తడిసిపోకుండా రక్షించడం ఈ రెండూ పురుషోత్తముడగు విష్ణుదేవునకు కర్తవ్యా లయినాయి. ఆ పురుషోత్తముడు ఆ మహారాత్రి ప్రవేశించే సమయాన

**క. కుఱుగఱులు వలుఁద మీసలు, చిఱుఁదోఁకయు బసిఁడి యొడలు సిరిగల పొడలున్**
**నెఱి మొగము నొక్క కొమ్మును, మిఱుచూపులుఁగలిగి విభుఁడు మీనంబయ్యెన్. 717**

**ప్రతి :** కుఱు= చిన్నని (పొట్టి); గఱులు= రెక్కలు; వలుఁద= పెద్ద; మీసలు= మీసాలు; చిఱు= పొట్టి; తోఁకయున్= వాలమున్నూ; పసిఁడి+ఒడలు= బంగారు (రంగు)మేను; సిరిగల= అందమైన; పొడలున్= మచ్చలును; నెఱిమొగమున్= చక్కనిముఖము; ఒక్కకొమ్మును= ఏకశృంగమూ; మిఱుచూపులున్= మిరుమిట్లుకొలిపే చూపులు; కలిగి= ఉండి; విభుఁడు= విష్ణుమూర్తి; మీనంబు= చేపగా; అయ్యెన్= అయినాడు.

**తా :** విష్ణుమూర్తి మత్స్యావతారం ధరించినాడు. చిన్న రెక్కలూ పెద్ద మీసాలూ పొట్టితోకా బంగారు కాంతులీను మేనూ, అందమైన మచ్చలూ చక్కనిమొగమూ ఒక కొమ్మూ మిరుమిట్లు కొలిపే చూపులు కలిగి ఆ మహామత్స్యం విరాజిల్లుతున్నది.

**వ. అట్లు లక్షయోజనాయతంబయిన పాఠీనంబై విశ్వంభరుండు జలధి సొచ్చి. 718**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; లక్షయోజన= లక్షఆమడల; ఆయతంబు+అయిన= పొడవయిన; పాఠీనంబు+ఐ= మత్స్యమై; విశ్వంభరుండు= విష్ణుమూర్తి; జలధిన్= సముద్రంలో; చొచ్చి= ప్రవేశించి.

**తా :** ఆ విధంగా విష్ణుమూర్తి లక్షఆమడల పొడవైన మత్స్యరూపం ధరించి సముద్రంలో ప్రవేశించినాడు.

**సీ. ఒకమాటు జలజంతుయూథంబుతోఁగూడు నొకమాటు దరులకు నుఱికి వచ్చు**
**నొకమాటు మింటికి నుదరి యుల్లంఘించు నొకమాటు లోపల నొదిఁగియుండు**
**నొకమాటు వారాశి నొడలు ముంపఁగఁజూచు నొకమాటు బ్రహ్మాండ మొరయఁదలఁచు**
**నొకమాటు ఝషకోటి నొడిసి యాహారించు నొకమాటు జలముల నుమిసివైచు**

**తే. గఱులు సారించు, మీసలు గదలు కొలుపుఁ, బొడలు మెఱయించుఁగన్నుల పొలప మార్చుఁ**
**నొడలు జళిపించుఁ దళతళ లొలయు మీన, వేషి పెన్నీట నిగమ గవేషి యగుచు. 719**

**ప్రతి :** తళతళలు+ఒలయు= తళతళ మెరిసే; మీనవేషి= మత్స్యరూపధారి; పెను+నీట= సముద్రంలో; నిగమ= వేదాలను; గవేషియగుచు= వెదకువాడవుతూ; ఒకమాటు= ఒకసారి; జలజంతు= నీటిలో ఉండే ప్రాణుల; యూథంబుతోన్= గుంపుతో; కూడున్= కలిసి తిరుగుతాడు; ఒకమాటు= ఒకపర్యాయం; దరులకున్= ఒడ్డులకు; ఉఱికివచ్చున్= పరుగిడివస్తాడు; ఒకమాటు= ఒకతడవ; మింటికిన్= ఆకసానికి; ఉదరి= బాగాచలించి; ఉల్లంఘించున్= అతిక్రమిస్తాడు (ఎగురుతాడు); ఒకమాటు= ఒకమారు; లోపలన్= సముద్రగర్భంలో; ఒదిగి= అణగి; ఉండున్= ఉంటాడు; ఒకమాటు= ఒకపరి; వాః+రాశిన్= సముద్రంలో; ఒడలు= శరీరాన్ని; ముంపcగన్= ముంచుటకు; చూచున్= చూస్తాడు; ఒకమాటు= ఇంకొకసారి; బ్రహ్మాండము= బ్రహ్మాండాన్ని; ఒరయన్= ఒరుసుకోవాలని; తలcచున్= తలుస్తాడు; ఒకమాటు= ఒకవిడత; ఝషకోటిన్= చేపలగుంపును; ఒడిసి= పైకెగిరిపట్టుకొని; ఆహారించున్= మింగుతాడు (తింటాడు); ఒకమాటు= ఒకసారి; జలములన్= నీళ్లను; ఉమిసివైచున్= (పీల్చిన తదుపరి) వెలుపలకు (ఉమ్ముతాడు) చిమ్ముతాడు; గఱులు సారించున్= రెక్కలు చాపుతాడు; మీసలు గడలు కొలుపున్= మీసాలు కదిలిస్తాడు; పొడలు మెఱయించున్= మేని మచ్చలు మెరిపిస్తాడు; కన్నుల పొలప మార్చున్= కన్నుల కాంతులను వేరువేరుగా ప్రసరిస్తాడు; ఒడలు జళిపించున్= శరీరాన్ని విదలిస్తాడు;

**తా :** మత్స్యావతారుని క్రీడలు అద్భుతంగా ఉన్నాయి. తళతళలాడే పెనుచేప రూపంతో ప్రళయ జలాలలో వేదాలను వెదకటానికి పూనుకొన్నాడు. ఒకసారి జలచరాలతో కలిసి తిరుగుతాడు. ఒకసారి వేగంగా గట్లవైపు దుమికి వస్తాడు. ఒకసారి ఆకసానికి ఎగురుతాడు. ఒకసారి నీళ్లలో ఒదిగి దాగుతాడు. ఒకసారి సముద్రంలో మునిగితేలుతాడు. ఒకసారి బ్రహ్మాండాన్ని ఒరుసుకోవటానికి ప్రయత్నిస్తాడు. ఒకసారి చేపలగుంపును మ్రింగుతాడు. ఒకసారి నీళ్లను పీల్చి వెలుపలికి చిమ్ము (ఉమ్ము)తాడు. ఇలా ఆ మహామత్స్యమూర్తి రెక్కలు చాస్తూ, మీసాలు కదలిస్తూ, మేనిపొడలు మెరపిస్తూ, కన్నులకాంతులు ప్రసరిస్తూ, ఒడలు విరచుకుంటూ, తళతళలాడుతూ సముద్రగర్భంలో విహరించినాడు.

**వ.** **అంతకు మున్న సత్యవ్రతుండు మహార్ణవంబులు మహీవలయంబు ముంచు నవసరంబున భక్తపరాధీనుండగు హరిం దలచుచునుండ నారాయణప్రేరితయై యొక్క నావ వచ్చినంగనుంగొని. 720**

**ప్రతి :** అంతకు మున్న= దానికంటే ముందు; సత్యవ్రతుండు= సత్యవ్రతుడు అనే రాజు; మహా+అర్ణవంబులు= పెద్ద కడలులు; మహీవలయంబున్= భూగోళాన్ని; ముంచు+అవసరంబునన్= ముంచివేసేవేళ; భక్త= భక్తులకు; పరాధీనుండు+అగు= వశమైనవాడగు; హరిన్= విష్ణువును; తలcచుచునుండన్= తలచుకొంటూ ఉండగా; నారాయణ ప్రేరితయై= శ్రీహరి ప్రేరణతో; ఒకనావ= ఒక ఓడ; వచ్చినన్= రాగా; కనుంగొని= చూచి.

**తా :** సత్యవ్రతుడు నారాయణుని స్మరిస్తుంటాడు. ప్రళయ సముద్రం భూలోకాన్ని ముంచెత్తే సమయం వచ్చింది. శ్రీహరి ప్రేరణతో ఒక ఓడ అక్కడకు వచ్చింది. ఆ ఓడను చూచినాడు సత్యవ్రతుడు.

**మ.** **చని సత్యవ్రతమేదినీదయితుcడోజంబూని మ్రాన్దీcగ వి**
**త్తనముల్ పెక్కులు నావపై నిడి హరిధ్యానంబుతో దానిపై**
**మునిసంఘంబులు దాను నెక్కి వెఱతో మున్నీటిపైcదేలుచుం**
**గనియెన్ ముందట భక్తలోక హృదలంకర్మీణమున్ మీనమున్. 721**

**ప్రతి :** చని= వెళ్ళి; సత్యవ్రత= సత్యవ్రతుడు అనేపేరుగల; మేదినీదయితుcడు= భూవల్లభుడు (రాజు); ఓజన్= ఉత్సాహంతో పూనుకొని; మ్రాన్‌తీcగ= (చెట్లు తీగలు) ఔషధాలు; విత్తనముల్= బీజాలు; పెక్కులు= అనేకం; నావపైన్= ఓడపై; ఇడి=

ఉంచి; హరిధ్యానంబుతోన్= విష్ణుమూర్తిని తలచుకొంటూ; దానిపై= ఆ ఓడపై; మునిసంఘంబులు= మునీశ్వరుల గుంపులు; తానున్= తాను; ఎక్కి= అధిరోహించి; వెఱతోన్= ఆశ్చర్యంగా; మున్నీటిపైన్= సముద్రంపై; తేలుచున్= తేలిపోతూ; ముందటన్= ఎదుట; భక్తలోక హృత్+అలంకర్మీణమున్= భక్తసమూహాల హృదయాలను అలంకరించే; మీనమున్= మత్స్యమూర్తిని; కనియెన్= చూచినాడు.

**తా :** సత్యవ్రతరాజు ఓడపై పెక్కు ఓషధులను విత్తనాలను అమర్చినాడు. విష్ణుమూర్తిని స్తోత్రం చేస్తూ మునులతోపాటు నావపై కూర్చున్నాడు. భయంతో సముద్రంపై తేలిపోతున్నాడు. అప్పుడు ఆ రాజుకు భక్తుల హృదయాలను అలంకరించే విష్ణుమూర్తి మహామత్స్యరూపంతో ఎదుట సాక్షాత్కరించినాడు.

**వ. కని, జలచరేంద్రుని కొమ్మున నొక్కపెనుఁ బాఁపత్రాట న న్నావఁ గట్టి, సంతసించి డెందంబు నివురుకొని తపస్వులుం దాను నారాచపెద్ద మీనాకారుండగు వేల్పుతేని నిట్లని పొగడందొడంగె. 722**

**ప్రతి :** కని= చూచి; జలచర+ఇంద్రుని= జలచర శ్రేష్ఠుడయిన ఆ మహామత్స్యంయొక్క; కొమ్మునన్= శృంగమునకు; ఒక్క= ఒక; పెనుబాఁప త్రాటన్= పెద్దపామును త్రాడుగాచేసి; ఆ+నావన్= ఆ ఓడను; కట్టి= కట్టివేసి; సంతసించి= సంతోషించి; డెందంబున్= హృదయాన్ని; నివురుకొని= పదిలపరచుకొని; తపస్వులున్= తాపసులు; తాను= తను; ఆ రాచపెద్ద= ఆ రాజేంద్రుడు; మీన+ఆకారుండగు= చేపరూపంకల; వేల్పుతేనిన్= దేవదేవుడైన విష్ణువును; ఇట్లని= ఈ విధంగా; పొగడన్+తొడంగెన్= నుతిచేయపూనినాడు.

**తా :** సత్యవ్రతుడు ఒక పెద్దపామును తాడుగాచేసి ఆ ఓడను మహామత్స్యంకొమ్ముకు కట్టివేసినాడు. సంతోషంతో హృదయాన్ని పదిలపరచుకొన్నాడు. ఋషులతోపాటు అతడు విష్ణుమూర్తిని ఇలా పొగడసాగాడు.

**మ. తమలోఁబుట్టు నవిద్య గప్పిగొనుడుందన్మూలసంసార వి**
**భ్రములై కొందఱు దేలుచుంగలఁగుచున్ బల్వెంటలన్ దైవయో**
**గమునం దే పరమేశుఁ గొల్చి ఘనులై కైవల్యసంప్రాప్తులై**
**ప్రమదంబందుదు రట్టి నీవు కరుణంబాలింపు మమ్మీశ్వరా! 723**

**ప్రతి :** ఈశ్వరా= ఓ భగవానుడా!; తమలోన్+పుట్టు= తమయందు జనించిన; అవిద్య= అజ్ఞానం; కప్పి కొనుడున్= ఆవరించిన; తత్+మూల= ఆ కారణంగా; సంసార= సంసారంలో (చావు పుట్టుకలలో); విభ్రములై= విభ్రాంతులై; కొందఱు= కొంతమంది; తేలుచున్= తేలియాడుతూ; పల్వెంటలన్–పలు–వెంటలన్= అనేక మార్గాలలో; కలఁగుచున్= కలతపడుతూ; దైవయోగమునందు= అదృష్టం వల్ల; ఏ పరమేశున్+కొల్చి= ఏ పరమాత్ముని సేవించి; ఘనులై= గొప్పవారై; కైవల్య సంప్రాప్తులై= కైవల్యాన్ని పొందినవారై; ప్రమదంబు+అందుదురు= సంతోషపడుతుంటారో; అట్టి నీవు= అలాంటి నీవు; మమ్ము= మమ్ములను; కరుణన్= దయతో; పాలింపుము= రక్షింపుము.

**తా :** ఓ భగవంతుడా! తమలో ఆవరించిన అజ్ఞానంవల్ల కొందరు భ్రాంతితో తిరుగుతుంటారు. మునుగుతూ కల్లోలపడుతూ పెక్కుదారులవెంట పరుగులు తీస్తుంటారు. అలాంటివారు అదృష్టంవల్ల పరమాత్ముడవైన నిన్ను సేవించి కైవల్యాన్నిపొంది సంతోషిస్తుంటారు. అలా అందరినీ ఆదరించేనీవు మమ్ములను రక్షించు.

**ఉ. కన్నులు గల్గువాఁడు మఱి కాననివానికిఁ ద్రోవఁ జూపఁగాఁ**
**జన్న తెఱంగు మూఢునకు సన్మతి దా గురుఁడౌట సూర్యుఁడే**
**కన్నులు గాఁగ భూతములఁగాంచుచు నుండు రమేశ! మాకు ను**
**ద్యన్నయమూర్తివై గురువవై యల సద్గతిజాడఁ జూపవే! 724**

**ప్రతి :** రమా+ఈశ= ఓ లక్ష్మీపతీ!; కన్నులు= నేత్రములు; కల్గువాఁడు= ఉన్నవాడు; మఱి= మరొక; కాననివానికిన్= కనపడని (గుడ్డి)వానికి; త్రోవన్= దారిని; చూపఁగాన్= చూపించగా; చన్న తెఱంగు= వెళ్లిన విధంగా; మూఢునకు= మూర్ఖునికి; సత్+మతి= బుద్ధిమంతుడు; తాన్= తాను; గురుఁడు+ఔట= తండ్రికావటం; సూర్యుఁడే= భానుడే; కన్నులుగాఁగన్= కనులుకాగా; భూతములన్= ప్రాణులను; కాంచుచున్+ఉండు= చూస్తుంటాడు; మాకున్= మాకును; ఉద్యత్+నయమూర్తివై= ఉద్ధరించు మేలైన స్వరూపంకల వాడవై; గురువవై= గురుడవై; అల సత్+గతిజాడన్+చూపవే= మంచిదారిని చూపించు.

**తా :** ఓ లక్ష్మీపతీ! సూర్యుడే కన్నులుగా నీవు ప్రాణులను చూస్తుంటావు. జ్ఞానం లేనివానికి దుర్బుద్ధికలవానికి తండ్రివి నీవే. కనుక కనులున్నవాడు కనులులేనివానికి దారిచూపిన రీతిగా మమ్ములను ఉద్ధరించు. గురుడవై మాకు దారిని చూపించు.

**క. ఇంగలముతోడి సంగతి, బంగారమువన్నె గలుగుభంగినిఁ ద్వత్సే**
**వాంగీకృతుల యఘంబులు, భంగంబులఁబొందు ముక్తి ప్రాప్తించు హరీ! 725**

**ప్రతి :** హరీ= విష్ణుమూర్తీ!; ఇంగలముతోడి= అగ్నితో; సంగతి= చేరటంవల్ల; బంగారమువన్నె= బంగారానికి రంగు (మెరుగు); కలుగుభంగిన్= చేకూరే విధంగా; త్వత్= నీయొక్క; సేవ= కైంకర్యాన్ని; అంగీకృతుల= ఒప్పుకొని చేసేవారికి; అఘంబులు= పాపాలు; భంగంబులన్+పొందున్= నాశనమైపోతాయి; ముక్తి= మోక్షం; ప్రాప్తించున్= లభిస్తుంది.

**తా :** శ్రీహరీ! అగ్నితో చేరడంవల్ల బంగారానికి రంగు / మెరుగు కలుగుతుంది. ఆ విధంగానే నిన్ను పూజించే భక్తుల పాపాలు నాశనమై ముక్తి లభిస్తుంది.

**క. హృదయేశ! నీ ప్రసన్నత, పదివేలవపాలి లేశభాగముకతనం**
**ద్రిదశేంద్రత్వము గలదఁట!, తుది నిను మెప్పింప నేది దొరకదు శ్రీశా! 726**

**ప్రతి :** శ్రీ+ఈశా= లక్ష్మీరమణా!; హృదయ+ఈశ= పరమాత్మా!; నీ ప్రసన్నత= నీ అనుగ్రహంలో; పదివేలవపాలి= పదివేలవ వంతులో; లేశభాగము= కొద్దిపాటిభాగం; కతనన్= (లభించటం)వల్ల; త్రిదశ+ఇంద్రత్వము= స్వర్గాధిపత్యమగు ఇంద్రపదవి; కలదఁట= కలుగుతుందట; నిను మెప్పింపన్= నీకు మెప్పు కలిగిస్తే; తుదిన్= చివరకు; ఏది దొరకదు?= లభించనిది ఏముంది?

**తా :** లక్ష్మీరమణా! నీ అనుగ్రహంలో పదివేలవంతులో ఒక లేశభాగంవల్ల దేవేంద్రపదవి కలుగుతుందట. ఇక నీకు మెప్పుకలిగిస్తే లభించనిభాగ్యం ఏముంటుంది?

**క. పెఱవాఁడు గురుఁ డటంచును, గొఱగాని పదంబు సూపఁ గుజనుండగు నీ**
**నెఱత్రోవ నడవ నేర్చిన, నఱమఱ లేనట్టి పదమునందు దయాబ్ధీ! 727**

**ప్రతి :** దయా+అబ్ధీ= కృపాసముద్రుడా!; పెఱవాఁడు= పనికిమాలినవానిని; గురుఁడటంచును= గొప్పవాడనుకొని; కొఱగానిపదంబు+చూపన్= పనికిమాలిన మార్గాన్నిచూపిస్తే; కుజనుండు+అగు= చెడ్డవాడవుతాడు; నీ నెఱత్రోవన్= నీదయిన మంచిమార్గాన్ని; నడవ నేర్చినన్= నడవటానికి అలవాటయితే; అఱమఱ లేనట్టి పదమున్= సందేహంలేని స్థానాన్ని; అందున్= పొందును.

**తా :** దయాసముద్రుడా! పనికిమాలినవానిని గొప్పవాడనుకొనిపోతే అతడు పనికిమాలిన మార్గాన్నే చూపిస్తాడు. ఆ దారిలో వెళ్లినవాడు చెడిపోతాడు. నిన్ను నమ్మి మంచిదారిని నడవగలిగితే సందేహంలేని మంచి స్థానాన్ని పొందుతాడు.

**మ. చెలివై చుట్టమవై మనస్థితుఁడవై చిన్మూర్తివై యాత్మవై**
**వలనై కోర్కుల పంటవై విభుఁడవై వర్తిల్లు నిన్నొల్లకే**
**పలువెంటంబడి లోక మక్కట! వృథాబద్ధాశమై పోయెడిన్**
**నిలువన్ నేర్చునె హేమరాశిఁగనియున్ నిర్భాగ్యుఁడంభశ్శయా! 728**

**ప్రతి :** అంభస్+శయా!= జలశయనుడవగు నారాయణా!; చెలివై= స్నేహితుడవై; చుట్టమవై= బంధువువై; మనస్+స్థితుఁడవై= మనసులో నిలిచేవాడవై; చిత్+మూర్తివై= జ్ఞానస్వరూపుడవై; ఆత్మవై= ఆత్మ రూపుడవై; కోర్కులపంటవై= వాంఛాఫలానివై; విభుఁడవై= అధిపతివై; వర్తిల్లు= మసలునట్టి; నిన్ను= నిను; ఒల్లకే= ఆదరించకుండానే; లోకము= ప్రాణులు; పలు-వెంటన్-పడి= అనేక మార్గాలలో వెళ్లి; అక్కట= అయ్యో!; వృథా= వ్యర్థంగా; బద్ధ+ఆశమై= ఆశకు కట్టుబడి; పోయెడిన్= పోతుంది; హేమరాశిన్= బంగారుకుప్పను; కనియున్= చూచికూడా; నిర్భాగ్యుఁడు= భాగ్యహీనుడు; నిలువన్ నేర్చునె= నిలువబడగలడా?(నిలువలేడు)

**తా :** నారాయణా! నీవు చెలికానిగా చుట్టంగా జ్ఞానస్వరూపునిగా మానవుల మనస్సులలో మసలుతావు. ఆత్మవై అండగా ఉంటావు. ప్రభువువై కోరికలు నెరవేరుస్తావు. అలాంటి నిన్ను ఆదరించక లోకం పెక్కింటిపై పేరాసతో పరుగులు తీస్తుంది. అదృష్టం లేనివాడు బంగారు రాశి దొరకినా దక్కించుకోలేడు కదా!

**ఆ. నీరరాశిలోన నిజకర్మబద్ధమై, యుచితనిద్రఁబొంది యున్న లోక**
**మే మహాత్ముచేత నెప్పటి మేల్కాంచు, నట్టి నీవు గురుఁడ వగుట మాకు. 729**

**ప్రతి :** నీరరాశిలోనన్= సముద్రంలో; నిజకర్మ బద్ధమై= తమ కర్మఫలానికి కట్టుబడి; ఉచితనిద్రన్= తగినంత రీతిగా నిదురను; పొందియున్న= పొందినట్టి; లోకము= ప్రపంచం; ఏ మహాత్ముచేతన్= ఏ మహానుభావుని చేత; ఎప్పటి మేల్కాంచున్= ఎప్పటికప్పుడు మేల్కొనునో; అట్టినీవు= అటువంటినీవు; మాకు= మాకు; గురుడవు - అగుట= గురుడవైనావు

**తా :** కర్మఫలానికి కట్టుబడి సముద్రంలో మునిగి కూరుకపోయిన లోకం ఏ మహానుభావుని చేత ఎప్పటికప్పుడు మేలుకొంటుందో అలాంటి మహానుభావుడవు నీవు. మాకు గురుడవయ్యావు.

**క. ఆలింపుము! విన్నప మిదె, వేలుపు గమిఱేని నిన్ను వేఁడికొనియెదన్**
**నాలోని చిక్కు మానిచి, నీలోనికిఁ గొంచుఁబొమ్ము నిఖిలాధీశా! 730**

**ప్రతి :** నిఖిల+అధీశా!= సర్వేశా!; ఇదె= ఇదిగో; విన్నపము= మా విన్నపం; ఆలింపుము= విను; వేలుపుగమిఱేని= దేవతల సమూహానికి ప్రభువువైన; నిన్నున్= నిను; వేడికొనియెదన్= ప్రార్థిస్తాను; నాలోని చిక్కున్= నాలోని సంకటాన్ని; మానిచి= మానిపి; నీలోనికిన్= నీలోకి; కొంచున్+పొమ్ము= తీసుకువెళ్ళు.

**తా :** ఓ సర్వేశ్వరా! మా విజ్ఞాపము వినవయ్యా. నాలోని సంకటాన్ని తొలగించి నన్ను నీ లోకానికి తీసుకొని వెళ్లుమని దేవదేవా! నిన్ను వేడుకొంటున్నాను.

**వ. అని ఇట్లు సత్యవ్రతుండు పలికిన సంతసించి మత్స్యరూపంబున మహాసముద్రంబున విహరించు హరి పురాణపురుషుం డగుటం జేసి, సాంఖ్య యోగక్రియాసహితయగు పురాణ సంహిత నుపదేశించె; నమ్మహారాజు మునిసమేతుండై భగవన్నిగదితంబై సనాతనంబగు బ్రహ్మస్వరూపంబు విని కృతార్థుండయ్యె; నతం డిమ్మహా కల్పంబున వివస్వంతుండనం బరఁగిన సూర్యునకు శ్రాద్ధదేవుండన జన్మించి శ్రీహరికృపావశంబున నేడవ మనువయ్యె; నంత నవ్విధంబునఁ బెనురేయి నిండునంతకు సంచరించి జలచరాకారుండగు నారాయణుండు దన్నిశాంత సమయంబున. 731**

**ప్రతి :** అని; ఇట్లు= ఈ విధంగా; సత్యవ్రతుండు= సత్యవ్రతుడనేరాజు; పలికినన్= చెప్పగా; సంతసించి= సంతోషించి; మత్స్యరూపంబునన్= చేపరూపంతో; మహాసముద్రంబునన్= పెనుకడలిలో; విహరించు= సంచరించు; హరి= విష్ణువు; పురాణపురుషుండు+అగుటన్+చేసి= పురాణపురుషుడు కావటంవల్ల; సాంఖ్యయోగక్రియాసహిత+అగు= సాంఖ్యయోగక్రియలతోకూడినదయిన; పురాణసంహితన్= పురాతనవేదభాగాన్ని; ఉపదేశించెన్= బోధించినాడు; ఆ+మహారాజు= ఆ మహాప్రభువు; మునిసమేతుండు+ఐ= మునీశ్వరులతోపాటు; భగవత్+నిగదితంబు+ఐ= భగవానుడు చెప్పినదయి; సనాతనంబు+అగు= సనాతనమైన; బ్రహ్మస్వరూపంబు= బ్రహ్మజ్ఞానాన్ని; విని= ఆలకించి; కృత+అర్థుండు+అయ్యెన్= ధన్యుడైనాడు; అతండు= ఆ సత్యవ్రతుడు; ఈ+మహాకల్పంబునన్= ఈ మహాకల్పంలో; వివస్వంతుండు+అనన్+పరఁగి= వివస్వతుడు అనబడిన; సూర్యునకున్= భాస్కరునకు; శ్రాద్ధదేవుండు+అనన్= శ్రాద్ధదేవుడు అనే పేరుతో; జన్మించి= పుట్టి; శ్రీహరి కృపావశంబునన్= శ్రీవిష్ణువుదయతో; ఏడవమనువు+అయ్యెన్= ఏడవమనువు అయినాడు; అంతన్= ఆ తర్వాత; ఆ+విధంబునన్= ఆ రీతిగా; పెనురేయి= ప్రళయరాత్రి; నిండునంతకు= ముగిసేవరకు; సంచరించి= తిరిగి; జలాచరాకారుండు+అగు= మత్స్యరూపుడగు; నారాయణుండు= విష్ణుమూర్తి; తద్+నిశా+అంత+ సమయంబున= ఆ తెల్లవారేవేళ...

**తా :** ఈ విధంగా సత్యవ్రతుని ప్రార్థనను ఆలకించి మత్స్యావతారుడై సముద్రంలో సంచరిస్తున్న మహావిష్ణువు సంతోషించినాడు. ఆ పరమాత్ముడు సాంఖ్యయోగశాస్త్రాలతో కూడిన పురాతనమైన వేదభాగాన్ని అతనికి బోధించినాడు. మునీశ్వరులతోపాటు సత్యవ్రతుడు పరమపురుషుడు చెప్పిన సనాతనమైన బ్రహ్మజ్ఞానాన్ని తెలుసుకొని ధన్యుడైనాడు. సత్యవ్రతుడు ఈ కల్పంలో వివస్వంతుడని పిలువబడే సూర్యునికి శ్రాద్ధదేవుడనే పేరుతో జన్మించి విష్ణుమూర్తి దయవల్ల ఏడవమనువైనాడు. ప్రళయరాత్రి ముగిసి తెల్లవారే పర్యంతమూ ఆ విధంగా విష్ణువు మత్స్యరూపంతో తిరుగుతున్నాడు.

**మ. ఉఱ కంభోనిధి రోసి వేదముల కుయ్యున్ దైన్యముం జూచి వే**
**గఱ లల్లార్చి ముఖంబు సాఁచి బలువీఁకం దోఁక సారించి మే**

**న్మెఱయన్ దౌడలు దీటి మీస లదరన్ మీనాకృతిన్ విష్ణుఁ డ**
**క్కఱటిం దాఁకి వధించె ముష్టిదళిత గ్రావున్ హయగ్రీవునిన్. 732**

**ప్రతి :** ఉఱక= ఊరకే; అంభోనిధిన్= సముద్రంలో; రోసి= వదలబడి; వేదముల= తొలిచదువుల; కుయ్యున్= మొరపెట్టు కోవటమనే; దైన్యమున్= దీనత్వాన్ని; చూచి= కని; వే= వేగంగా; గఱులు= రెక్కలు; అల్లార్చి= కదల్చి; ముఖంబుసాఁచి= నోరు ముందుకు సాచి; పలువీఁకన్= చాలాఉత్సాహంతో; తోఁకసారించి= తోకనుసాగదీసి; మేన్+మెఱయన్= మేనుమెరియగా; దౌడలు దీటి= దౌడలు చక్కచేసికొని / పటపటలాడించి; మీసలు= మీసాలు; అదరన్= కదలగా; మీనాకృతిన్= మత్స్యరూపంతో; విష్ణుఁడు= శ్రీహరి; ముష్టిదళితగ్రావున్= పిడికిలి పోటుతో కొండలను పిండిచేయబడిన కొండలుగల; హయగ్రీవున్= హయగ్రీవ రాక్షసుడైన; అ+కరటిన్= ఆ దుర్జనుని; తాఁకి= మార్కొని; వధించెన్= చంపినాడు.

**తా :** ప్రళయసముద్రంలో వ్యర్థమై మునిగి ఉన్న వేదాల దైన్యస్థితిని అవి మొరపెట్టుకోగా మీనావతారుడగు విష్ణుమూర్తి విన్నాడు. వేగంగా రెక్కలు అల్లార్చి నోరు తెరచినాడు. ఉత్సాహంతో తోక ఊగించినాడు. మేను మెరిపించినాడు. దౌడలు చక్కచేసికొన్నాడు. మీసాలు కదలించినాడు. పిడికిటిపోటుతో కొండలను పిండి చేయగలవాడు, దుర్జనుడు అయిన హయగ్రీవుని హతమార్చినాడు.

**వ. అంతం బ్రళయావసానసమయంబున. 733**

**ప్రతి :** అంతన్= అంతలో; ప్రళయ+అవసాన+సమయంబునన్= ప్రళయకాలం ముగిసినవేళ.

**సీ. ఎప్పుడు వేగునం చెదురు చూచుచు నుండు మునుల డెందంబులు ముదము నొందఁ**
**దెలివితోఁ బ్రక్క నిద్రించు భారతి లేచి యోరపయ్యెఁద జక్కనొత్తికొనఁగ**
**మలినమై పెను రేయి గ్రక్కిన తేజంబు దొంటి చందంబునఁ దొంగలింపఁ**
**బ్రాణుల సంచితభాగధేయంబులు గన్నుల కొలఁకులఁ గానఁబడఁగ**

**తే. నవయవంబులు గదలించి యావులించి, నిదురఁదెప్పిఱి మేల్కాంచి నీల్గి మలఁగి**
**యొడలు విఱుచుచుఁ గనుఁగవ లుసుముకొనుచు, ధాత గూర్చుండె సృష్టిసంధాత యగుచు. 734**

**ప్రతి :** ఎప్పుడు= ఏసమయాన; వేగునంచున్= తెల్లవారుతుందని; ఎదురుచూచుచున్+ఉండు= నిరీక్షిస్తున్న; మునుల= ఋషుల; డెందంబులు= హృదయాలు; ముదమున్= సంతోషాన్ని; ఒందన్= పొందగా; తెలివితోన్= మెలకువతో (అప్రమత్తంగా); ప్రక్క= చెంతనే; నిద్రించు= నిదురిస్తున్న; భారతి= సరస్వతి; లేచి= మేలుకొని; ఓరపయ్యెదన్= జారుపైటను; చక్కన్+ఒత్తి+కొనఁగన్= సరిదిద్దుకొనగా; పెనురేయి= ప్రళయంలో; మలినమై= మాసిపోయి; గ్రక్కిన= నష్టమైన; తేజంబు= కాంతి; తొంటిచందంబునన్= పూర్వపురీతిగా; తొంగలింపన్= ప్రకాశించగా (వర్ధిల్లగా); ప్రాణుల= జీవుల; సంచిత= సంపాదించిన; భాగధేయంబులు= పుణ్యభాగ్యాలు; కన్నుల= నయనాల; కొలఁకులన్= కొలంకులలో; కానఁబడఁగన్= కనిపించగా; అవయవంబులు= శరీరభాగాలయిన అవయవాలను; కదలించి= చలింపచేసి; ఆవులించి= ఆవులించుకొంటూ; నిదురన్+తెప్పిఱి= నిదురనుంచి తేరుకొని; మేల్కాంచి= మేలుకొని; నీల్గి= నీలిగి; మలఁగి= మరలి; ఒడలు విరుచుచున్= ఒడలు విరుచుకొంటూ; కనుఁగవలు= కన్నుదోయి; ఉసుముకొనుచున్= తుడుచుకొంటూ; సృష్టి+సంధాత+అగుచున్= సృష్టిని అందివ్వటం (చేయటం) కోసం; ధాత= బ్రహ్మదేవుడు; కూర్చుండెన్= కూర్చున్నాడు.

**తా :** ఎప్పుడు తెల్లవారునా అని ఆతురులై ఎదురుచూస్తున్న మునీశ్వరులకు సంతోషకరంగా వేకువ కనిపించింది. మెలకువశక్తితో నిద్రిస్తున్న సరస్వతిలేచి బ్రహ్మ ప్రక్కన కూర్చొని జారిన పయ్యెదకొంగును సవరించుకొన్నది. నిద్రవలన ప్రళయకాలంలో మసకబారిన బ్రహ్మదేవుని ముఖం ప్రకాశించింది. జీవులు సంపాదించుకొన్న పూర్వపుణ్యాలు ఆయన కడకన్నులకు కనిపించినాయి. బ్రహ్మదేవుడు తన అవయవాలను కదలించినాడు. ఆవులించి నిదుర నుండి మేల్కొన్నాడు. కొద్దిగా నీలిగినాడు, ఒత్తిగిలినాడు, ఒడలు విరుచుకొన్నాడు. కన్నులు నులుముకొన్నాడు. తిరిగి సృష్టి చేయటం కోసం సిద్ధమై కూర్చున్నాడు.

**వ. అయ్యవసరంబున. 735**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో

**ఆ. వాసవారిఁ జంపి వానిచే పడియున్న, వేదకోటి చిక్కు విచ్చి తెచ్చి**
**నిదుర మానియున్న నీరజాసనునకు, నిచ్చెఁగరుణతోడ నీశ్వరుండు. 736**

**ప్రతి :** వాసవ+అరిన్= ఇంద్రుని శత్రువైన హయగ్రీవాసురుని; చంపి= అంతమొందించి; వానిచేపడియున్న= ఆ రాక్షసుని చేతిలో పడిన; వేదకోటిన్= తొలిచదువుల సంచయమును; చిక్కువిచ్చి= చిక్కునుండి విడిపించి; నిదురమాని+ఉన్న= మేల్కొన్న; నీరజ+ఆసనునకున్= బ్రహ్మకు; ఈశ్వరుండు= భగవానుడు; కరుణతోడన్= దయతో; ఇచ్చెన్= ఇచ్చినాడు.

**తా :** భగవానుడు విష్ణువు హయగ్రీవుని చంపి వాడు దొంగిలించిన వేదాలను చిక్కునుండి విడిపించినాడు. వాటిని మేల్కొన్న బ్రహ్మదేవునికి దయతో అప్పగించినాడు.

**క. జలరుహనాభునికొఱకై, జలతర్పణ మాచరించి సత్యవ్రతుఁ డా**
**జలధి బ్రదికి మను వయ్యెను, జలజాక్షునిఁ గొలువ కెందు సంపద గలదే? 737**

**ప్రతి :** జలరుహనాభుని కొఱకై= పద్మనాభుడగు విష్ణుమూర్తి కోసం; సత్యవ్రతుఁడు; జలతర్పణము+ఆచరించి= (నీటితో) అర్ఘ్యం సమర్పించి; ఆ జలధిన్ బ్రదికి= ఆ సముద్రంనుండి బయటపడి బ్రతికి; మనువు+అయ్యెను= మనువు అయినాడు; జలజాక్షునిన్+కొలువక= కమలాక్షుడైన విష్ణువును పూజించకుండా; ఎందున్= ఎక్కడైనా; సంపదకలదే?= ఐశ్వర్యం కలుగుతుందా? (కలుగదు)

**తా :** విష్ణుమూర్తికి సత్యవ్రతుడు అర్ఘ్యం సమర్పించినాడు. ప్రళయ సముద్రంనుంచి బయటపడినాడు. మనువు అయినాడు. విష్ణువును పూజించక ఎక్కడైనా ఐశ్వర్యం ప్రాప్తిస్తుందా? (ప్రాప్తించదు.)

**ఆ. జనవిభుండు దపసి సత్యవ్రతుండును, మత్స్యరూపి యైన మాధవుండు**
**సంచరించినట్టి సదమలాఖ్యానంబు, వినినవాఁడు బంధవిరహితుండు. 738**

**ప్రతి :** జనవిభుండున్+తపసి= రాజర్షిఅయిన; సత్యవ్రతుండును= సత్యవ్రతుడూ; మత్సరూపి+అయిన= మత్స్యావతారం ధరించిన; మాధవుండు= శ్రీపతీ; సంచరించినట్టి= ప్రవర్తించిన; సత్+అమల= పవిత్రమగు; ఆఖ్యానంబున్= గాథను; వినినవాఁడు= ఆలకించినవాడు; బంధవిరహితుండు= బంధ విమోచనుడవుతాడు.

**తా :** రాజర్షి అయిన సత్యవ్రతుడూ, మీనరూపుడైన శ్రీపతీ ప్రవర్తించిన ఈ పవిత్రగాథను విన్నవారు బంధాలనుంచి విముక్తిని పొందుతారు.

**క. హరిజలచరావతారముఁ, బరువడిఁ బ్రతిదినముఁ జదువఁ బరమపదంబున్**
**నరుఁడొందు వాని కోర్కులు, ధరణీశ్వర! సిద్ధిఁబొందుఁ దథ్యము సుమీ్మ! 739**

**ప్రతి :** ధరణి+ఈశ్వర= ఓ రాజా!; హరి= విష్ణువుయొక్క; జలచర+అవతారమున్= మత్స్యావతార కథను; పరువడిన్= శ్రద్ధతో; ప్రతిదినమున్= ప్రతిరోజూ; చదువన్= పఠించగా; పరమపదమున్= మోక్షాన్ని; నరుఁడు= మానవుడు; ఒందు= పొందుతాడు; వానికోర్కులు= అట్టివాని వాంఛలు; సిద్ధిపొందున్= నెరవేరుతాయి; తథ్యము= ఇది సత్యం; చుమీ్మ= సుమా!

**తా :** ఓ రాజా! ప్రతిదినం మత్స్యావతార కథను శ్రద్ధతో చదివేవాడు మోక్షాన్ని పొందుతాడు. ఆతని కోర్కెలూ నెరవేరుతాయి. ఇది సత్యం సుమా!

**విశే :** పై రెండు పద్యాలలో మత్స్యావతార కథకు 'ఫలశ్రుతి' చెప్పబడినది.

**మ. ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రంజెందు వాణీశు మో**
**ముల వేదంబులు గొన్న దైత్యుని మృతిం బొందించి సత్యవ్రతుం**
**డలరన్ బ్రహ్మము మాటలం దెలిపి సర్వాధారుఁడై మీనమై**
**జలధిం గ్రుంకుచుఁ దేలుచున్ మెలఁగు రాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్. 740**

**ప్రతి :** ప్రళయ= కల్పాంత; అంభోనిధిలోనన్= సముద్రంలో; మేన్–మఱచి= మైమరచి; నిద్రన్+చెందు= నిద్రించిన; వాణీ+ఈశు= వాణి భర్తఅయిన బ్రహ్మదేవుని; మోములన్= ముఖాలనుండి; వేదంబులు= తొలిచదువులు; కొన్న= దొంగిలించిన; దైత్యుని= రాక్షసుని; మృతిన్+పొందించి= చంపి; సత్యవ్రతుండు, అలరన్= సంతోషించేటట్లు; బ్రహ్మము= బ్రహ్మస్వరూపాన్ని; మాటలన్+తెలిపి= మాటలతో ఎరిగించి; సర్వ+ఆధారుఁడై= అన్నింటికీ మూలమైనవాడై; మీనమై= మత్స్యావతారుడై; జలధిన్= సముద్రమందు; క్రుంకుచున్= మునుగుతూ; తేలుచున్= తేలుతూ; మెలఁగు= వర్తిల్లు; రాజత్+మూర్తికిన్= ప్రకాశించే మూర్తిఅగు విష్ణుమూర్తికి; మ్రొక్కెదన్= నమస్కరిస్తున్నాను.

**తా :** ప్రళయకాల సముద్రంలో మేనుమరచి నిద్రించిన బ్రహ్మదేవుని ముఖాలనుండి వెలువడిన వేదాలను దొంగిలించిన రాక్షసునిచంపి, సత్యవ్రతుడు సంతోషించేటట్లు బ్రహ్మస్వరూపాన్ని తెలియచేసి, అన్నింటికి మూలమై, మత్స్యావతారంతో సాగరాన మునుగుతూ తేలుతూ సంచారం చేసి ప్రకాశించే విష్ణుమూర్తికి నమస్కరిస్తున్నాను.

**వ. అని చెప్పి. 741**

**ప్రతి :** అని చెప్పి= అని వచించి...

**తా :** ఈ విధంగా శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకు చెప్పినాడు.

**క. రాజేంద్ర! దైత్యదానవ, రాజమహాగహనదహన! రాజస్తుత్యా!**
**రాజావతంసమానిత!, రాజధరార్చిత! గుణాఢ్య! రాఘవ రామా! 742**

**ప్రతి :** రాజ+ఇంద్ర= రాజశ్రేష్ఠుడా!; దైత్య – దానవ – రాజ – మహాగహన – దహన!= (దైత్యులును దానవులును అయిన) రాక్షసరాజులు అనే గొప్ప అడవిని కాల్చివేసినవాడా!; రాజస్తుత్యా= రాజులచేత నుతించబడినవాడా!;

రాజ+అవతంస-మానిత= రాజులలో తలమానికమైనవారిచే గౌరవించబడినవాడా!; రాజ-ధర+అర్చిత= చంద్రుని ధరించిన శివునిచే పూజించబడినవాడా! గుణ+ఆఢ్య= సద్గుణసంపన్నా!; రాఘవరామా= రఘువంశంలో పుట్టిన రాముడా!

**తా :** శ్రీరామా! నీవు రాజేంద్రుడవు. దైత్యులు-దానవులు అనబడే రాక్షసులు అనే అరణ్యాలను దహించినవాడవు. రాజులు, రాజులలో ఉన్నతులు కూడా నిన్ను గౌరవించినారు. చంద్రధారిఅయిన శివునిచేత పూజించబడినవాడా! సద్గుణసంపన్నా! రఘువంశలలామా రామా!

**విశే :** దితి తనూజులు దైత్యులు. దనువు తనూజులు దానవులు

**మాలిని.**

> **దివిజరిపువిదారీ! దేవలోకోపకారీ!**
> **భువనభరనివారీ! పుణ్యరక్షానుసారీ!**
> **ప్రవిమలశుభమూర్తీ! బంధుపోషప్రవర్తీ!**
> **ధవళబహుళకీర్తీ! ధర్మనిత్యానువర్తీ!** **743**

**ప్రతి :** దివిజ= దేవతల; రిపు= శత్రువులగు రాక్షసులను; విదారీ= తెగటార్చినవాడా!; దేవలోక= దేవతా సమూహానికి; ఉపకారీ= మేలుచేసినవాడా!; భువన= భూమియొక్క; భర= భారాన్ని; నివారీ= తొలగించినవాడా!; పుణ్య= సుకృతం చేసినవారిని; రక్ష+అనుసారీ= కాపాడుటకు అనుగుణంగా నడచుకొనేవాడా!; ప్రవిమల= నిర్మలమైన; శుభ= మంగళప్రదమైన; మూర్తీ= రూపం కలవాడా!; బంధు= ఆత్మీయులను (చుట్టాలను); పోష= పోషించే, ప్రవర్తీ= ప్రవర్తనం కలవాడా!; ధవళ= స్వచ్ఛమైన; బహుళ= గొప్ప; కీర్తీ= యశస్సుకలవాడా!; ధర్మ= ధర్మాన్ని; నిత్య= ఎల్లప్పుడూ; అనువర్తీ= అనుసరించేవాడా!

**తా :** రక్కసులను తెగటార్చినవాడా! వేల్పులకు మేలుచేయువాడా! (దుష్టులచే బరువెక్కిన) భూమిభారాన్ని తొలగించువాడా! పుణ్యాత్ములను కాపాడువాడా! నిర్మలమైన శుభకరమైన రూపం కలవాడా! ఆత్మీయులను పోషించేవాడా! స్వచ్ఛమైన గొప్ప కీర్తికలవాడా! ఎల్లపుడూ ధర్మాన్ని ఆదరించేవాడా!

**గద్యము**

**ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్త్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవత పురాణంబను మహాప్రబంధంబునందు స్వాయంభువ స్వారోచిషోత్తమతామస మనువుల చరిత్రంబును, గరిమకరంబుల యుద్ధంబును, గజేంద్రరక్షణంబును, రైవతచాక్షుషమనువుల వర్తనంబును, సముద్రమథనంబును, గరళ భక్షణంబును, నమృతాది సంభవంబును, దేవాసుర కలహంబును, హరి కపటకామినీరూపంబున నసురుల వంచించి దేవతల కమృతంబు వోయుటయును, రాక్షసవధంబును, హరిహర సల్లాపంబును, హరి కపటకామినీరూప విభ్రమణంబును, వైవస్వత సూర్యసావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి ధర్మసావర్ణి భద్రసావర్ణి దేవసావర్ణీంద్రసావర్ణి మనువుల వృత్తాంతంబును, బలియుద్ధయాత్రయును, స్వర్గవర్ణనంబును, దేవపలాయనంబును, వామనావతారంబును, శుక్రబలిసంవాదంబును, త్రివిక్రమవిస్ఫురణంబును, రాక్షసుల సుతలగమనంబును, సత్యవ్రతోపాఖ్యానంబును, మీనావతారంబును నను కథలు గల యష్టమస్కంధము.** **744**

**ప్రతి :** ఇది= ఈయదది; శ్రీపరమేశ్వర= శ్రీపరమశివుని; కరుణా= దయవలన; కలిత= పొందిన; కవితావిచిత్ర= కవితావైచిత్ర్యం కల; కేసనమంత్రిపుత్ర= కేసనమంత్రి కుమారుడూ; సహజపాండిత్య= స్వభావసిద్ధంగా పాండితి కలిగినవాడూ, అయిన; పోతనామాత్య= పోతనామాత్యునిచే, ప్రణీతంబు+అయిన= రచితమైన, 'శ్రీమద్భాగవతపురాణము', అను, మహాప్రబంధంబునందు= గొప్పకావ్యమునందు; స్వాయంభువ= స్వాయంభువుడు; స్వారోచిష= స్వారోచిషుడు; ఉత్తమ= ఉత్తముడు; తామస= తామసుడు అనే; మనువులచరిత్రంబును= మనువులచరిత్రలనూ; కరిమకరంబుల యుద్ధంబును= ఏనుగుకూ మొసలికీ జరిగిన పోరాటమూ; గజేంద్రమోక్షణంబును= గజేంద్రునికి మోక్షము కలుగుటయు; రైవత= రైవతుడు; చాక్షుష= చాక్షుషుడు అనే; మనువులవర్తనంబును= మనువులచరిత్రమూ; సముద్రమథనంబును= పాలకడలిని చిలుకుటయును; గరళభక్షణంబును= శివుడు విషాన్ని మ్రింగడమూ; అమృత+ఆది సంభవంబును= అమృతము మొదలైనవి క్షీరసాగరంలో పుట్టడమూ; దేవాసురకలహంబును= వేల్పులకు రక్కసులకు జరిగిన పోరాటమూ; హరి= విష్ణువు; కపట కామినీ రూపంబునన్= మాయామోహినీ రూపాన; అసురుల వంచించి= రాక్షసులను మోసగించి; దేవతలకు= వేల్పులకు; అమృతంబున్= సుధను; పోయుటయును= పోయడమూ; రాక్షసవధంబును= రాక్షససంహారమూ; హరిహరసల్లాపంబును= శివకేశవుల సరససంభాషణమూ; హరి= విష్ణువు; కపటకామినీరూప= మాయామోహినీరూపాన; విభ్రమణంబును= భ్రమింపచేయడమూ; వైవస్వత, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, భద్రసావర్ణి, దేవసావర్ణి, ఇంద్రసావర్ణిమనువుల; వృత్తాంతంబును= చరిత్రయూ; బలియుద్ధయాత్రయును= బలిచక్రవర్తి దండయాత్రా; స్వర్గవర్ణనంబును= సురలోకవర్ణనమూ; దేవపలాయనంబును= వేలుపులు పారిపోవుటయున్నూ; వామనావతారంబును= వామనుని అవతార కథయును; శుక్రబలిసంవాదంబును= శుక్రాచార్య బలిచక్రవర్తుల సంభాషణమూ; త్రివిక్రమ స్ఫురణంబును= త్రివిక్రముడు విజృంభించడం; రాక్షసుల సుతల గమనంబును= రక్కసులు పాతాళలోకంబునకు వెళ్ళుటయు; సత్యవ్రత+ఉపాఖ్యానంబును= సత్యవ్రతుని ఇతిహాసమున్నూ; మీన+అవతారంబును= మత్స్యావతారము; అను= అనే; కథలుగల= కథలు ఉన్నట్టి; అష్టమస్కంధము= ఎనిమిదవ స్కంధము.

**తా :** ఇది పరమశివుని దయవల్ల కలిగిన కవితా సౌందర్యం కలవాడూ; కేసనమంత్రి పుత్రుడూ, సహజపాండిత్యుడూ ఐన పోతనామాత్యునిచే విరచింపబడిన 'శ్రీమహాభాగవతపురాణం' అనే మహాకావ్యంలోని అష్టమస్కంధం. దీనిలో స్వాయంభువుడూ, స్వారోచిషుడూ, ఉత్తముడూ, తామసుడూ, అనే మనువుల చరిత్రమూ; ఏనుగుకూ మొసలికీ జరిగిన పోరాటమూ; శ్రీహరి గజేంద్రుడిని కాపాడటమూ; రైవతుడూ, చాక్షుషుడూ అనే మనువుల చరిత్రమూ; దేవతలు రాక్షసులు సముద్రాన్ని మథించడమూ; పరమేశ్వరుడు విషాన్ని మింగడమూ; పాలసముద్రంలో అమృతం మొదలయినవి పుట్టడమూ; దేవతలకూ రాక్షసులకూ పోరాటం జరగడమూ; విష్ణువు మోహినీ రూపంతో రాక్షసులను మోసగించి దేవతలకు అమృతాన్ని పోయడమూ; రాక్షస సంహారమూ; శివకేశవుల సరస సంభాషణమూ; విష్ణువు మోహినీ రూపంతో శివుణ్ణి భ్రమింపచేయడమూ; వైవస్వతుడూ, సూర్యసావర్ణీ, దక్షసావర్ణీ, బ్రహ్మసావర్ణీ, ధర్మసావర్ణీ, భద్రసావర్ణీ, దేవసావర్ణీ, ఇంద్రసావర్ణీ అనే మనువుల వృత్తాంతమూ; బలిచక్రవర్తి యుద్ధానికి వెళ్లడమూ; స్వర్గలోక వర్ణనమూ; దేవతల పలాయనమూ; వామనావతారమూ; శుక్రబలిచక్రవర్తుల సంభాషణమూ; వామనుని త్రివిక్రమ స్ఫురణమూ; రాక్షసులు పాతాళానికి వెళ్లడమూ; సత్యవ్రతుని వృత్తాంతమూ; మత్స్యావతారచరిత్రమూ అనే కథలున్నాయి.

*:: శ్రీకృష్ణార్పణమస్తు ::*

శ్రీరస్తు

# శ్రీమహాభాగవతము

## నవమస్కంధము

**శ్రీరాజిత! మునిపూజిత!, వారిధిగర్వాతిరేకవారణబాణా!**
**సూరిత్రాణ! మహోజ్జ్వల, సారయశస్సాంద్ర! రామచంద్రనరేంద్రా! 1**

**ప్రతిపదార్థము :** శ్రీ= లక్ష్మీదేవి (ఇక్కడ సీతాదేవి)తో; రాజిత= ప్రకాశించువాడా!; ముని= మునులచే; పూజిత= అర్చింపబడువాడా!; వారిధి= సముద్రంయొక్క; గర్వ+అతిరేక= మిక్కుటమైన గర్వాన్ని; వారణ= నివారించిన; బాణా= బాణాలు గలవాడా!; సూరి= పండితుల్ని; త్రాణ= రక్షించినవాడా!; మహా+ఉత్+జ్వల= మిక్కిలి ప్రకాశమానమైన; సార= పటువైన; యశస్+సాంద్ర= నిండైన కీర్తిగలవాడా; రామచంద్ర= శ్రీ రామచంద్రుడనే; నర+ఇంద్రా= ఓ రాజా!

**తాత్పర్యం :** శ్రీరామచంద్రుడనే ఓ రాజా! సీతా సంయుతుడవై మునులచేత పూజింపబడేవాడా! సేతుబంధనానికి పూర్వం సముద్రాతిశయగర్వాన్ని నివారించిన బాణాలు కలవాడా! పండితుల్ని రక్షించినవాడా! మిక్కిలి ప్రకాశమానమైన, నిండైన కీర్తి కలవాడా!

**విశేషం :** ఈ స్కంధంలో సూర్యవంశక్షత్రియుల చరిత్రలున్నాయి. సూర్యవంశంలో ప్రసిద్ధుడైన శ్రీరామచంద్రుని చరిత్రం కూడా ఉంది. ఆ శ్రీరాముని గుణగణాలను ఈ పద్యం సూచనప్రాయంగా తెలియజేస్తూ ఉంది.

**వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుండయిన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2**

**ప్రతి :** మహనీయ= పూజనీయమైన; గుణ= గుణాలచేత; గరిష్ఠులు+అగు= అధికులైన; ఆ+ముని శ్రేష్ఠులకున్= ఆ మునివర్యులకు; నిఖిల= సమస్తమైన; పురాణ= పురాణాలయొక్క; వ్యాఖ్యాన= అర్థవివరణకుచెందిన; వైఖరీ= వాక్కుల పద్ధతితో; సమేతుండు+ఐన= కూడిన; సూతుండు= సూతమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అట్లు= ఆ విధంగా; పరీక్షిత్+నర+ఇంద్రునకున్= పరీక్షిన్మహారాజుకు; శుకయోగి+ఇంద్రుండు= శుకుడనే యోగిశ్రేష్ఠుడు; ఇట్లు+ అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** నైమిశారణ్యంలో భాగవతశ్రవణం చేయాలన్న కోరికతో చేరిన మునులు ఉన్నతగుణవంతులు. వారిని చూచి సర్వపురాణాలనూ విశదీకరించడంలో నిపుణుడైన సూతుడు ఇలా అన్నాడు.

ఆ రీతిగా ప్రాయోపవేశం చేసి ముక్తిమార్గం చూపుమని అడిగిన పరీక్షిన్మహారాజు నుద్దేశించి యోగివర్యుడైన శుకుడు ఈ విధంగా చెప్పాడు.

**సీ. మనువులనడవళ్లు మర్యాదలును వింటి; మన్వంతరంబున మాధవుండు**
**దిరిగిన జాడలు దెలిసె సత్యవ్రతుం డనురాజు ద్రవిళదేశాధిపుండు**
**పోయిన కల్పాంతమున విష్ణు సేవించి విజ్ఞానమును బొంది వెలుఁగుతేని**
**కతఁడు వైవస్వతుండై పుట్టి మను వయ్యె; నతనికి నిక్ష్వాకుఁ డాదిగాఁగఁ**

**తే. ఐదురు గొడుకులు గల రండ్రు పరంగ వారి, వంశ మేరీతి వర్తించె? వారిలోనఁ**
**జనినవారిని జనువారిఁ జనెడువారిఁ, జెప్పవే వ్యాసనందన! చిత్తగించి. 3**

**ప్రతి :** వ్యాసనందన= వ్యాసునికుమారుడవైన శుకయోగివర్యా!; మనువుల= మనువులయొక్క; నడవళ్ళు= వర్తనాలు; మర్యాదలును= పద్ధతులు; వింటిన్= విన్నాను; మను+అంతరంబునన్= మనువుకాలంలో (పురాణలక్షణం); మాధవుండున్= లక్ష్మీభర్తయైన మహావిష్ణువు; తిరిగిన జాడలు= సంచరించిన విధానాలు; తెలిసెన్= తెలిశాయి; ద్రవిళదేశ+అధిపుండు= ద్రవిళదేశ ప్రభువు; సత్యవ్రతుండు+అనురాజు= సత్యవ్రతుడనే పేరుగలరాజు; పోయిన= జరిగిపోయిన; కల్ప+అంతమునన్= కల్ప పరిసమాప్తి కాలంలో(లయకాలం); విష్ణున్+సేవించి= విష్ణువును ధ్యానించి; విజ్ఞానమున్+పొంది= జ్ఞానియై; వెలుఁగుఱేనికిన్= వెలుగుకు ప్రభువైన సూర్యునికి; అతఁడు= ఆ సత్యవ్రతుడు; వైవస్వతుండు+ఐ= వివస్వంతుని కొడుకుగా; పుట్టి= జన్మించి; మనువు+అయ్యెన్= మనువైనాడు (ఏడవమనువు); అతనికిన్= ఆ మనువుకు; ఇక్ష్వాకుఁడు+ఆదిగాన్+కన్= ఇక్ష్వాకుడు మొదలైన; పదురు+కొడుకులు= పదిమంది కొడుకులు; కలరు+అండ్రు= ఉన్నారు అని అంటారు; పరఁగన్= చక్కగా; వారి వంశము= ఆ వైవస్వతుని వంశం; ఏరీతిన్ వర్తించెన్= ఏ విధంగా నడిచింది?; వారిలోనన్= ఆ పదిమందిలో; చనినవారిని= వెళ్ళిపోయినవారిని; చనువారిన్= వెళ్ళతున్నవారిని; చనెడువారిన్= వెళ్ళబోవువారిని గూర్చి; చిత్తగించి= దయయుంచి; చెప్పవే= చెప్పండి;

**తా :** ఓ శుకమహర్షీ! మీరు చెప్పగా ఇంతకు మునుపు ఆరుగురు మనువులయొక్క వృత్తాంతాలు విన్నాను. ఆయా మన్వంతరాల్లో శ్రీ మహావిష్ణువు లీలల్ని తెలుసుకొన్నాను. ద్రవిళదేశాధిపతి అయిన సత్యవ్రతుడనే రాజు పూర్వసృష్టి అంతంలో విష్ణువును సేవించి జ్ఞానియై వైవస్వతుడనే పేరుతో సూర్యునికి జన్మించి మనువయ్యాడు. అతనికి ఇక్ష్వాకుడు మొదలుకొని పదమందికొడుకులు ఉన్నారంటారుగదా! నా యందు దయతో ఆ వంశం ఏ విధంగా నడిచింది?, ఆ వంశస్థుల్లో చనిన, చనుతున్న, చనెడు వారిని అనగా ఆ వంశం యొక్క భూత, వర్తమాన. భవిష్యత్ స్థితిని గూర్చి చెప్పండి.

**విశే :** 1. మనువుల పుట్టుకను గూర్చి పూర్వస్కంధంలో వివరంగా చెప్పబడింది. (8-1-6). ఈ కల్పంలో ఆరుగురు మనువుల యొక్క వృత్తాంతాలు వివరింపబడ్డాయి. ప్రస్తుత కథా సందర్భం ఏడవమనువు వైవస్వతుని కాలానికి సంబంధించింది. పోయిన కల్పాంతంలో జరిగిన మీనావతారాంశమిది. ఆ సత్యవ్రతుడే వైవస్వతునిగా ఏడవ మనువైనాడు. ఇతనికి సంబంధించిన వృత్తాంతం ఈ నవమస్కంధప్రారంభంలో చెప్పబడింది.

2. సత్యవ్రతుడు పూర్వజన్మలో ద్రవిళదేశాధిపతి. ఈ కల్పంలో వివస్వంతుడు అనబడే సూర్యునికి శ్రాద్ధదేవుడిగా జన్మించి, శ్రీహరి కృపావశంచేత ఏడవ మనువైనాడు. ఇక్కడనుండి సూర్యవంశపురాజుల ప్రస్థానం ప్రారంభమవుతుంది.

**క. చెవులార నేఁడు వినియెద, రవివంశమునందుఁ గలుగు రాజుల కీర్తుల్**
**వివరింపు వరుసతోడను, భువిఁ బుణ్యులకీర్తి వినినఁ బుణ్యము గాదే! 4**

**ప్రతి :** రవివంశమున్+అందున్= సూర్యుని వంశంలో; కలుగు= కలిగిన; రాజుల కీర్తుల్= రాజుల ప్రశస్తి; నేఁడు= ఈ రోజు; చెవులు+ఆరన్= చెవులకింపుగా; వినియెదన్= వింటాను; వరుసతోడను= వరుసగా; వివరింపు= వివరించండి; భువిన్= ఈ లోకంలో; పుణ్యులకీర్తి= పుణ్యాత్ములయినవారియశస్సు; వినినన్= వింటే; పుణ్యము+కాదు+ఏ= పుణ్యమే కదా!

**తా :** ఓ మహర్షీ! సూర్యవంశంలో జన్మించిన రాజుల కీర్తిప్రతిష్ఠలు నేడు చెవులార వినాలని కుతూహలం కలుగుతోంది. వరుసగా వాటిని గూర్చి వివరించండి. ఈ లోకంలో పుణ్యాత్ముల కీర్తిని గూర్చి వినడం పుణ్యదాయకమే కదా!

**వ. అనినం బరాశరమునిమనుమం డిట్లనియె. 5**

**ప్రతి :** అనినన్= అని పరీక్షిన్మహారాజు అడుగగా; పరాశరముని= పరాశరమునియొక్క; మనుమండు= మనుమడైన శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** మనువుల వర్తనాలు, సూర్యవంశరాజుల చరిత్ర విపులంగా చెప్పుమని పరీక్షిన్మహారాజు కోరగా, పరాశరమహర్షి మనుమడైన శుకయోగీంద్రుడు ఇలా అన్నాడు.

## ❖ వైవస్వత మనువంశ కథనము ❖

**ఆ. వినుము, మనువుకులము వేయినూఱేండ్లును, బరఁగ విస్తరించి పలుకరాదు**
**నాకుఁ దోఁచినంత నరనాథ! వేగంబ, యెఱుకపడఁగఁ బ్రీతి నేర్పరింతు. 6**

**ప్రతి :** నరనాథ= ఓ రాజా!; మనువు కులమున్= మనువు వంశాన్ని గురించి; వేయినూఱు+ఏండ్లునున్= లక్ష సంవత్సరాలైనా; పరఁగన్= చక్కగా; విస్తరించి= వివరించి; పలుకన్+రాదు= చెప్పటానికి సాధ్యంకాదు; వేగంబు+అ= త్వరగానే; నాకున్= నాకు; తోఁచిన+అంత= తెలిసినంతవరకు; ఎఱుకపడన్+కన్= (నీకు) తెలిసేటట్లుగా; ప్రీతిన్= ప్రియంగా; ఏర్పరింతున్= చెప్తాను; వినుము= వినండి.

**తా :** ఓ మహారాజా! ఈ మనువువంశాన్నిగురించి చక్కగా వివరించి చెప్పటానికి లక్షసంవత్సరాలైనా సరిపోదు. కాని అంత సమయం తీసుకోకుండా త్వరగా నాకు తెలిసినంతవరకు నీకు వివరిస్తాను. విను.

**క. ఎక్కువ తక్కువ పొడవుల, కెక్కటి మొదలైన పురుషుఁ డింతయుఁ జెడఁ దా**
**నొక్కఁడుఁ గల్పాంతంబున, నక్కజమై నిల్చె విశ్వ మతఁడై యుంటన్. 7**

**ప్రతి :** మొదలు+ఐన= మొదటివాడైన; పురుషుఁడు= ఆ భగవంతుడు; ఎక్కువ తక్కువ= హెచ్చుతగ్గులకు; పొడవులకున్= రూపాలకు; ఎక్కటి= అతిశయమైనవాడు; ఇంతయున్+చెడన్= ఈ సృష్టి అంతా లయించగా; విశ్వము+అతఁడు+ఐ+ఉంటన్= విశ్వమే ఆయన కావడంచేత; తాను+ఒక్కఁడున్= తను ఒక్కడే; కల్ప+అంతంబునన్= ప్రళయకాలంలో కూడ; అక్కజము+ఐ= ఆశ్చర్యకరంగా; నిల్చెన్= నిలబడ్డాడు.

**తా :** భగవానుడు ఎక్కువ తక్కువ పొడవులకు అతీతమైనవాడు అంటే రూపరహితుడు. కల్పాంతంలో ఈ సృష్టి అంతా నాశనమైనా విశ్వరూపుడు కావడంచేత తానొక్కడే ఆశ్చర్యకరంగా మిగులుతాడు.

**సీ. భూమీశ! య మ్మహాపురుషునినాభిమధ్యమున బంగారుఁగెందమ్మి మొలిచె;**
**నా తమ్మిపూవులో నటమీఁదఁ దనయంత నాలుగుమోముల నలువ పుట్టె**
**నా బ్రహ్మమనమున నట మరీచి జనించె; గశ్యపుం డతనికిఁ గలిగె; నంత**
**నా కశ్యపునికి దక్షాత్మజ యదితికిఁ గొమరుఁడై చీఁకటిగొంగ వొడమె;**

**తే. జలజబంధునిపెండ్లాము సంజ్ఞయందు, శ్రాద్ధదేవుండు మనువు సంజాతుఁ డయ్యె**
**మనువునకు శ్రద్ధ యనియెడి మగువయందుఁ, బదురుగొడుకులు గలిగిరి భద్రయశులు. 8**

**ప్రతి :** భూమి+ఈశ!= ఓ మహారాజా!; ఆ= ఆ యొక్క (పైన ప్రస్తావించబడిన); మహాపురుషుని= దివ్యపురుషుని (భగవంతుని); నాభిమధ్యమునన్= బొడ్డు నడిమి తావులో; బంగారు కెంపు+తమ్మి= బంగారు ఎఱ్ఱతామర; మొలిచెన్= పుట్టింది; ఆ తమ్మిపూవులోన్= ఆ తామరపుష్పంలో; అటమీఁదన్= తరువాత; తన+అంతన్= స్వయంగా; నాలుగు మోముల= నాలుగు ముఖాలుగల; నలువ= బ్రహ్మ; పుట్టెన్= జన్మించాడు; ఆ బ్రహ్మమనమునన్= ఆ బ్రహ్మమనసునందు; అట= అప్పుడు; మరీచి= మరీచిమహర్షి; జనించెన్= పుట్టాడు; అతనికిన్= ఆ మహర్షికి; కశ్యపుండు= కశ్యపుడు; కలిగెన్= జన్మించాడు; అంతన్= అటమీద; ఆ కశ్యపునికిన్= ఆ కశ్యపమహర్షికి; దక్ష+ఆత్మజ= దక్షునికూతురైన; అదితికిన్= అదితికి; కొమరుఁడు+ఐ= పుత్రుడై; చీకటిగొంగ= చీకటికి శత్రువైన సూర్యుడు; పొడమెన్= ఉదయించాడు; జలజబంధుని= పద్మబాంధవుడైన సూర్యదేవుని; పెండ్లాము= భార్య అయిన; సంజ్ఞ+అందున్= సంజ్ఞాదేవియందు; మనువు= మనువైన; శ్రాద్ధదేవుండు= శ్రాద్ధదేవుడు (వైవస్వతుడు); సంజాతుఁడు+అయ్యెన్= పుట్టాడు; మనువునకున్= ఆ మనువుకు; శ్రద్ధ+ అనియెడి= శ్రద్ధ అనే; మగువ+అందున్= స్త్రీ యందు; భద్రయశులు= మంగళకరమైన కీర్తి కలవారు అయిన; పదురున్= పదిమంది; కొడుకులున్= కుమారులు; కలిగిరి= జన్మించారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! కల్పాంతంలో నిల్చిన ఆ దివ్యపురుషునినాభినుండి బంగారుకమలం ఉద్భవించింది. ఆ కమలంలో స్వయంభువై బ్రహ్మ జన్మించాడు. ఆ బ్రహ్మమనసునుండి మరీచి జన్మించాడు. అతనికి కశ్యపుడు, కశ్యపునికి దక్షునికూతురైన అదితికి సూర్యుడు, అతనికీ సంజ్ఞకు మనువైన శ్రాద్ధదేవుడు, ఆ మనువుకు శ్రద్ధకు శుభకీర్తి కలిగిన పదిమందికుమారులు కలిగారు.

**వ. వార లిక్ష్వాకుండును, నృగుండును, శర్యాతియు, దిష్టుండును, ధృష్టుండును, గరూశకుండును, నరిష్యంతుండును, వృషధ్రుండును, నభగుండును, గవియు నన నెగడి; రటమున్ను మనువుకొడుకులు లేనివాఁడై, మిత్రావరుణుల నుద్దేశించి. 9**

**ప్రతి :** వారలు= ఆ పదిమంది; ఇక్ష్వాకుండును= ఇక్ష్వాకుడు; నృగుండును= నృగుడు; శర్యాతియున్= శర్యాతి; దిష్టుండును= దిష్టుడు; ధృష్టుండును= ధృష్టుడు; కరూశకుండును= కరూశకుడు; అరిష్యంతుండును= అరిష్యంతుడు; వృషధ్రుండును= వృషధ్రుడు; నభగుండును= నభగుడు; కవియును= కవి; అనన్= అనే పేర్లతో; నెగడిరి= ప్రసిద్ధి చెందారు; అట మున్ను= అంతకు పూర్వం (వీరు పుట్టటానికి పూర్వం); మనువు= మనువైన శ్రాద్ధదేవుడు; కొడుకులు= కుమారులు; లేనివాఁడు+ఐ= లేనివాడై; మిత్రావరుణులన్= మిత్రావరుణులనబడే యజ్ఞదేవతలను; ఉద్దేశించి= గురించి...

**తా :** శ్రాద్ధదేవుడనే మనువుకు ఇక్ష్వాకుడు, నృగుడు, శర్యాతి, దిష్టుడు, ధృష్టుడు, కరూశకుడు, అరిష్యంతుడు, వృషధ్రుడు, నభగుడు, కవి అనే పదిమంది కొడుకులు కలిగారు. వీరు జన్మించటానికి పూర్వం మనువు కొడుకులు లేనివాడై యజ్ఞదేవతలైన మిత్రావరుణులను గూర్చి

**సీ. మనువు బిడ్డలు పుట్ట మఖ మాచరించుచో నతనిభార్యయు హోత నాశ్రయించి**
**కూఁతురు పుట్ట నాకును జేయు మని పల్కి వరభక్తితోఁ బయోవ్రతము సల్పె;**

**నా సతి సెప్పిన ట్లధ్వర్యుఁడును హోత నగుఁ గాక! వేలువు, మనుచుఁ బలికె;**
**హవి నందుకొని 'కూఁతు రయ్యెడు' మని వషట్కారంబు సెప్పుచుఁ గదిసి వేల్వ**

**తే. హోత పెడచేఁత నిల యను నువిద పుట్టె, దానిఁ బొడగని మనువు సంతాప మంది**
**"కొడుకు మేల్ గాక! యేటికిఁ గూఁతు? రకట!, చెప్పవే" యని పోయె వసిష్ఠకడకు. 10**

**ప్రతి :** మనువు= వైవస్వతుడు (శ్రాద్ధదేవుడు); బిడ్డలు పుట్టన్= సంతానం కలగటానికి; మఖమున్= యజ్ఞాన్ని; ఆచరించుచోన్= చేస్తుండగా; అతని భార్యయున్= మనువు భార్యయైన శ్రద్ధాదేవి; హోతన్+ఆశ్రయించి= (యజ్ఞక్రియను నడిపే) హోతను చేరి; నాకును= నాకు; కూఁతురు పుట్టన్= కుమార్తె కలిగేటట్లు; చేయుము= (యజ్ఞాన్ని) చేయి; అని పల్కి= అని చెప్పి; వరభక్తితోన్= నియమనిష్ఠలుగల భక్తితో; పయస్+వ్రతమున్= పాలనుమాత్రమే సేవించే వ్రతాన్ని; సల్పెన్= చేసింది; ఆ సతి+చెప్పిన+అట్లు= ఆమె చెప్పిన విధంగానే; అధ్వర్యుఁడును= (యజ్ఞక్రియను నిర్వర్తించే) కర్త; హోతను= (మంత్రాల్ని చదివేవాడు) హోతను; అగున్+కాక= అట్లే జరుగుతుంది గాక; వేలువుము= హవిస్సును వేల్చు; అనుచున్+పలికెన్= అని చెప్పాడు; హవిని= హవిస్సును (అగ్నిహోత్రము నందు వేల్చుటకు ఇవురబెట్టిన అన్నం లేక నెయ్యి); అందుకొని= తీసుకొని; కూఁతురు+అయ్యెడు+అని= కుమార్తె కలుగు గాక అని; వషట్కారంబున్= యజ్ఞంలో ఆశీర్వచనంగా పలికే బీజాక్షర మంత్రాన్ని; చెప్పుచున్= పలుకుతూ; కదిసి= సమీపించి; వేల్వన్= వేల్వగా; హోత= ఆ హోతయొక్క; పెడచేఁతన్= వ్యతిరేక చేష్టవల్ల; ఇల+అను+ఉవిద= ఇల అనే పేరుగల స్త్రీ; పుట్టెన్= జన్మించింది; దానిన్+పొడన్+కని= ఆ కుమార్తెను చూచి; మనువు= మనువు; సంతాపము+అంది= దుఃఖాన్ని పొంది; అకట= అయ్యో; కొడుకు= పుత్రుడు; మేల్+కాక= మంచిది కాని; కూఁతురు= కుమార్తె; ఏటికిన్= ఎందుకు?; చెప్పుము+ఏ= చెప్పుమా; అని= అని; వసిష్ఠ కడకున్= వసిష్ఠుని దగ్గరకు; పోయెన్= వెళ్ళాడు.

**తా :** మనువు సంతానంకోసం యజ్ఞాన్ని చేస్తుండగా, అతనిభార్య హోతతో 'నాకు యజ్ఞఫలంగా కుమార్తె కలిగేటట్లు యజ్ఞాన్ని చేయి అని పల్కి' భక్తితో క్షీరవ్రతాన్ని చేసింది. ఆమె చెప్పినట్లుగా అధ్వర్యుడు హోతతో 'ఆమెకోరినట్లే చెప్పి వేల్చు' అని అన్నాడు. అతడు హవిస్సును చేబూని' కూతురు కలుగుగాక' అని సంకల్పం చెప్తూ వేల్చాడు. హోత వ్యతిరేక చేష్టవల్ల 'ఇల' అనే స్త్రీ పుట్టింది. దానిని చూచి మనువు తీవ్రమనస్తాపం పొంది, అయ్యో! పుత్రసంతానం మంచిది కదా కూతురెందుకని' అనుకొంటూ వసిష్ఠునిదగ్గరకు పరుగుతీశాడు.

**వ. చని యిట్లనియె. 11**

**ప్రతి :** చని= వెళ్లి; ఇట్లు+అనియెన్= ఇట్లన్నాడు

**తా :** పై పద్యంలో చెప్పబడినట్లు తన అసంతృప్తిని తనలోనే అణచుకొని, వసిష్ఠునిదగ్గరకు వెళ్ళి ఆయనతో ఇలా మొర పెట్టుకొన్నాడు.

**క. "అయ్యా! కొడుకులకొఱకై, యియ్యాగము నీ యనుజ్ఞ నేఁ జేయంగా**
**నియ్యాఁడు దేల పుట్టెను?, మీయంతటివారి కొండు మేరయుఁ గలదే! 12**

**ప్రతి :** అయ్యా!= తండ్రీ; కొడుకులకొఱకున్+ఐ= పుత్రులకోసమే; ఈ+యాగమున్= ఈ యజ్ఞాన్ని; నీ+అనుజ్ఞన్= నీ అనుమతి మేరకు; నేన్+చేయన్+కాన్= నేను చేయగా; ఈ+ఆఁడుది= ఈ స్త్రీ; ఏలన్ పుట్టెన్= ఎందుకు కలిగింది?; మీ+అంతటివారికిన్= మీ అంత గొప్పవారికి; ఒండు= ఒక; మేరయున్= హద్దు; కలదే= ఉంటుందా!

**తా :** అయ్యా! కొడుకులు కలగాలని నేను ఈ యజ్ఞాన్ని మీ అనుజ్ఞతో చేస్తే, ఈ కుమార్తె ఎందుకు కలిగింది? మీ బోటి వారిశక్తికి హద్దు ఉండదుగదా!

**వ. అదియునుంగాక, మీరు బ్రహ్మవాదులరు; మంత్రవాదులరు; పాపంబు లందకుండం జేయించువా; రిదియేమి?" యనవుడు, మా ముత్తాత వసిష్ఠుండు హోతృవ్యభిచారం బెఱింగి, మనువున కిట్లనియె!13**

**ప్రతి :** అదియునున్+కాక= పైన చెప్పిన విషయమేకాక; మీరు= మీరు (వసిష్ఠులు); బ్రహ్మవాదులు+రు= బ్రహ్మమును ఎరిగి తెలిపేవారు; మంత్రవాదులు+రు= శబ్ద ప్రధానమైన బీజాక్షరాలతో నిండిన మంత్రాన్ని ప్రయోగించేవారు; (మంత్రజ్ఞులు); పాపంబులు= పాపాలు; అందక+ఉండన్= పొందకుండా; చేయించువారు= చేయించేవారు; ఇది+ఏమి= (అయినా) ఇదంతా ఎలా జరిగింది?; అనవుడు= అనగా; మా= మాయొక్క (శుకమహర్షియొక్క); ముత్తాత= ప్రపితామహుడు; వసిష్ఠుండు= వసిష్ఠ మహర్షి; హోతృ= హోతయొక్క; వి+అభిచారంబున్= వ్యతిరేక వర్తనాన్ని; ఎఱింగి= తెలుసుకొని; మనువునకున్= మనువుతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** "అదీగాక మీరు బ్రహ్మవాదులు. మంత్రవాదులు. పాపం అంటకుండా చూచేవారు. కాని జరిగింది మాత్రం వేరుగా ఉంది" అని అన్నాడు. అపుడు మా ముత్తాతయైన వసిష్ఠుడు అకార్యంవల్ల జరిగినవిషయాన్ని గ్రహించి, మనువుతో ఇలా అన్నాడు.

**తే. 'అధిప! సంకల్పవైషమ్య మగుటఁజేసి, హోత కల్లతనంబున నువిద గలిగె;**
**నైనఁ గలిగింతు నీకుఁ బ్రియాత్మజునిని, నీవు మెచ్చంగఁ జూడు నా నేర్పుబలిమి' 14**

**ప్రతి :** అధిప= ఓ రాజా!; హోత= యాగప్రవర్తకుని; కల్లతనంబునన్= మోసంచేత; సంకల్ప= యాగ ఉద్దేశానికి; వైషమ్యము+అగుటన్+చేసి= వ్యతిరేకమవడం చేత; ఉవిద= స్త్రీ; కలిగెన్= కలిగింది; ఐనన్= అయినా; నీవు మెచ్చన్+కన్= నీవు ప్రశంసించేటట్లుగా; నీకున్= నీకు; ప్రియ+ఆత్మజునినిన్= ఇష్టుడైన కొడుకును; కలిగింతును= కలిగిస్తాను; నా నేర్పున్= నా నేర్పరితనాన్ని, బలిమిన్= శక్తిని; చూడు(ము)= గమనించు.

**తా :** ఓ రాజా! హోత మోసం చేయడంవల్ల యాగఉద్దేశానికి వ్యతిరేకంగా కూతురు కలిగింది. అయినా నీవు మెచ్చుకొనేటట్లు నీకు కొడుకును ప్రసాదిస్తాను. నా కౌశలాన్ని, బలాన్ని చూడు.

**విశే :** యజమాని చేసే యాగఉద్దేశానికి అనుకూలంగా హోత వషట్కారం చెప్పాలి. తద్విరుద్ధంగా చెప్పడం కల్లతనమే. కాని ఒకసారి పుట్టిన ఆడశిశువును మగవాడుగా మార్చడం అద్భుతమైన విషయమే. దాన్ని సాధించటానికి నేర్పు, శక్తి కావాలి. అదే జరిగితే రాజు మెచ్చుకోకుండా ఎట్లుంటాడు? అలామారిన కొడుకు 'ప్రియాత్మజుడు' కాకుండా ఎట్లుంటాడు? అనే విషయాలు ద్యోతక మవుతాయి.

**వ. అని పలికి భగవంతుండగు వసిష్ఠుండు గీర్తితత్పరుండు గావున మనువుకూఁతు మగతనంబుకొఱకు నేకచిత్తంబున నాదిపురుషుండగు హరిం బొగడిన నప్పరమేశ్వరుండు మెచ్చి తపసి కోరిన వరం బిచ్చె; నది నిమిత్తంబుగా నిలాకన్యక సుద్యుమ్నుండను కుమారుండయి రాజ్యంబు సేయుచు. 15**

**ప్రతి :** అని పలికి= అని చెప్పి; భగవంతుడు+అగు= భగవానుడైన; వసిష్ఠుండున్= వసిష్ఠమహర్షి; కీర్తితత్పరుండున్= ప్రశస్తియందాసక్తి కలవాడు; కావునన్= కాబట్టి; మనువుకూఁతున్= మనువుకుమార్తెను; మగతనంబుకొఱకున్=

పురుషత్వంకోసం; ఏకచిత్తంబునన్= ఏకాగ్రతతో; ఆదిపురుషుండు+అగు= మొదటి పురుషుడైన; హరిన్+పొగడినన్= విష్ణువును స్తుతించగా; ఆ+పరమ+ఈశ్వరుండు= ఆ ప్రభువు; మెచ్చి= మెచ్చుకొని; తపసి కోరిన వరంబున్= మహర్షి కోరిన వరాన్ని; ఇచ్చెన్= ప్రసాదించాడు. అది నిమిత్తంబున్+కాన్= ఆ కారణంచేత; ఇలా కన్యక= ఇల అనే పేరుగల కన్య; సుద్యుమ్నుండు+అను=సుద్యుమ్నుడనే పేరుగల; కుమారుండు+అయి= కొడుకై; రాజ్యంబున్+చేయుచున్=రాజ్యపాలనం చేస్తూవుండగా...

**తా :** రాజుతో పైవిధంగా పలికి భగవానుడైన వసిష్ఠమహర్షి కీర్తియందాసక్తితో మనువుకుమార్తె పురుషత్వంకోసం ఏకాగ్రతతో ఆదిపురుషుడైన విష్ణువును స్తుతించగా, ఆ స్వామి మెచ్చుకొని, ఆ మహర్షి కోరిన వరాన్ని ప్రసాదించాడు. ఆ కారణంచేత ఇలా పుత్రిక సుద్యుమ్నుడనే పేరుతో కొడుకై రాజ్యపాలనం చేస్తూవుండగా

**విశే :** లోకంలో సంతానం భగవన్నిర్ణయం. అసంతృప్తుడైన మనువు మహర్షికి తన దుఃఖాన్ని చెప్పుకొన్నాడు. కాని కొడుకును ప్రసాదించమని అడగలేదు. కాని అద్భుతంగా వసిష్ఠుడు కూతురిని కొడుకుగా చేశాడు. కారణం కీర్తితత్పరత అని కవే చెప్పాడు. గహనమైన విషయం సాధించటంవల్ల కలిగే కీర్తియా? లేక లోకకల్యాణకారకమైన కీర్తియా? రెండోది సరైందని భావించాలి.

**సీ. ప్రొద్దు వో కొకనాఁడు వోయి పేరడవుల, వెంట వేఁటాడుచు వేడ్కతోడఁ**
**గొందఱు మంత్రులు గూడ రా సైంధవం బయిన గుఱ్ఱము నెక్కి యందమైన**
**బలువిల్లుఁ గ్రొవ్వాఁడి బాణంబులును దాల్చి పెనుమెకంబులవెంట బిఱుసుతోడ**
**నుత్తరదిశను మహోగ్రుఁడై చని చని మేరువుపొంతఁ గుమారవనముఁ**

**తే. జేరె నందు మహేశుండు శివయు నెపుడు, రతి సలుపుచుందు రందుఁ జొరంగఁ బోవ**
**నాఁడు దయ్యెను రాజు; రాజానుచరులుఁ, బడఁతులైరి తదశ్వంబు బడబ యయ్యె. 16**

**ప్రతి :** ఒకనాఁడు= ఒకరోజు; ప్రొద్దు+పోక= కాలం గడవక; వేడ్కతోడన్= వేడుకతో; కొందఱు మంత్రులున్+కూడరాన్= కొద్దిమంది మంత్రులు వెంటరాగా; సైంధవంబు+అయిన= సింధుదేశానికి చెందిన; గుఱ్ఱమున్+ఎక్కి= గుర్రాన్ని అధిరోహించి; అందము+ఐన= సొగసైన; బలువిల్లున్= గొప్పవిల్లును; క్రొత్త+వాఁడి బాణంబులున్+తాల్చి= పదునైన బాణాలును ధరించి; పేరు+అడవుల వెంటన్= పెద్ద అరణ్యాల వెంబడి; పోయి= వెళ్లి; పెను= పెద్ద; మెకంబుల వెంటన్= మృగాల వెంబడి; బిరుసుతోడన్= శౌర్యంతో; ఉత్తరదిశను= ఉత్తర దిక్కుగా; మహా+ఉగ్రుఁడు+ఐ= మహా ఉగ్రరూపంతో (ఆర్భాటంగా); చని చని= వెళ్ళి వెళ్ళి; మేరువు పొంతన్= మేరుపర్వతం దగ్గరలోనున్న; కుమారవనమున్+చేరెను= కుమారవనాన్ని ప్రవేశించాడు; అందున్= అక్కడ; మహా+ఈశుండు= పరమేశ్వరుడు; శివయున్= పార్వతియు; ఎపుడున్= సతతమూ; రతి+చలుపుచున్+ఉందురు= రతిక్రీడలో ఉంటారు; అందున్+చొరన్+కన్+పోవన్= ఆ వనంలో ప్రవేశించేసరికి; రాజు= సుద్యుమ్నుడు; ఆఁడుది+అయ్యెన్= స్త్రీగా మారాడు; రాజ+అనుచరులున్= రాజపరివారంకూడ; పడఁతులు+ఐరి= స్త్రీలుగా మారారు; తద్+అశ్వంబున్= ఆ గుర్రం కూడ; బడబ+అయ్యెన్= ఆడుగుర్రంగా అయ్యింది.

**తా :** సుద్యుమ్నుడనే ఆ రాజు ఒకరోజు కొందరు మంత్రులు వెంటరాగా, మేలుజాతి గుర్రాన్నెక్కి సొగసైన వింటిని, వాడియైన బాణాలను ధరించి, దట్టమైన అరణ్యాల వెంబడి పెద్దమృగాలను వేటాడుతూ మేరుపర్వతసమీపంలోని కుమారవనాన్ని

ప్రవేశించాడు. అక్కడ పార్వతీపరమేశ్వరులు ఎప్పుడూ ఏకాంతవిహారం చేస్తుంటారు. ఆ వనంలో ప్రవేశించగానే రాజు స్త్రీ అయ్యాడు. అతని సేవకులుకూడా స్త్రీలుగా మారారు. ఆ రాజుగుర్రంసైతం ఆడుగుర్రంగా మారింది.

**వ. ఇట్లు మగతనంబు సెడి మగువలై యొండొరుల మొగంబులు సూచి మఱుఁగుచుండి; రనిన విని శుకునకు రాజిట్లనియె. 17**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; మగతనంబు+చెడి= పురుషత్వం పోయి; మగువలు+ఐ= స్త్రీలై; ఒండు+ఒరుల= ఒకరికొకరి; మొగంబులు+చూచి= ముఖాల్ని చూచుకొని; మఱుఁగుచున్+ఉండిరి= దుఃఖిస్తూ ఉండారు; అనినన్+విని= అని చెప్పగా విని; శుకునకున్= శుకునితో; రాజు+ఇట్లు+అనియెన్= పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా ఆ వనప్రవేశంచేత పురుషత్వం కోల్పోయి, స్త్రీలై పరస్పరం ముఖాలు చూచుకొని దుఃఖించారు అని చెప్పిన శుకునితో పరీక్షిత్తు ఇలా అన్నాడు.

**ఆ. 'రాజుఁ దోడివారు రమణులై రంటివి, కాంత లగుట యేమికారణమున?**
**నిట్టి దేశ మెఱుఁగ మెన్నఁడు నా కథల్, వేడ్కదీర నాకు విస్తరింపు. 18**

**ప్రతి :** రాజున్+తోడివారు= రాజును, అనుచరులును; రమణిలు= స్త్రీలు; ఐరి+అంటివి= అయ్యారని అన్నావు; ఏమి కారణమునన్= ఏ కారణంచేత; కాంతలు+అగుట= స్త్రీలు కావడం? ఎన్నఁడున్= ఎప్పుడుకూడా; ఇట్టిదేశమున్+ఎఱుఁగము= ఇటువంటి దేశాన్ని గూర్చి తెలియము; ఆ కథల్= ఆ వృత్తాంతాల్ని; వేడ్క+తీరన్= వేడుక తీరేటట్లు; నాకున్+విస్తరింపు(ము)= నాకు వివరించండి.

**తా :** 'రాజు, ఆయన అనుచరులు ఆ వనంలో ప్రవేశించినంతనే స్త్రీలయ్యారని అన్నావు. ఏ కారణంచేత వాళ్లు స్త్రీలయ్యారు? లోకంలో ఇటువంటి దేశాన్ని గూర్చి ఎప్పుడూ వినలేదు. నా కుతూహలం తీరేటట్లు వివరించండి.

**వ. అదియునుంగాక. 19**

**ప్రతి :** అదియునున్+కాక= అదీగాక.

**తా :** ఈ ఆశ్చర్యకరమైన విషయంతో బాటు మరొక విషయంకూడా.

**ఆ. మగువతనము మాని మగవాఁడు గావచ్చుఁ, గాక పేరుఁ బెంపు గాసి గాఁగ**
**మగతనంబు మాని మగువ గావచ్చునె, మానవంతుఁడైన మానవునకు? 20**

**ప్రతి :** మగువతనము= స్త్రీతనం; మాని= విడిచి; మగవాఁడు+కావచ్చున్+కాక= పురుషుడు కావచ్చు కాని; పేరున్+పెంపున్= పేరుప్రతిష్ఠలకు; గాసి+కాన్+కన్= భంగం కలిగేటట్లుగా; మానవంతుఁడు+ఐన= పౌరుషవంతుడైన; మానవునకున్= పురుషునికి; మగతనంబు మాని= పురుషత్వం కోల్పోయి; మగువ+కావచ్చున్+ఎ= స్త్రీ కావచ్చునా?

**తా :** పౌరుషవంతుడైన మానవుడు స్త్రీత్వం కోల్పోయి, మగవాడు కావడం బాగుండవచ్చుగాని; పేరుప్రతిష్ఠలకు భంగం కలిగేట్టుగా పురుషత్వం కోల్పోయి స్త్రీ కావడం బాగుంటుందా?

**వ. అని యడిగిన నర్జునపౌత్త్రునకు వ్యాసపుత్త్రుం డిట్లనియె. 21**

**ప్రతి :** అని= అంటూ; అడిగినన్= అడుగగా; అర్జున= అర్జునుని; పౌత్రునకున్= మనుమనికి (పరీక్షిత్తుకు); వ్యాసపుత్రుండు= వ్యాసుని కుమారుడు (శుకమహర్షి); ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తా :** పై విధంగా ప్రశ్నించిన పరీక్షిత్తుకు శుకమహర్షి ఇట్లన్నాడు.

**సీ. 'పురవైరి కొకనాఁడు పొడసూపువేడుకఁ దద్దయు దిక్కుల తమము లెల్ల**
**దమతమ వెలుఁగులు దగిలి గొందులు సొరఁ గొందఱు మౌనులు గోరి రాఁగఁ**
**బ్రాణేశుతొడలపై భాసిల్లు నంబిక వారలఁ జూచి మై వలువ లేమి**
**సిగ్గు పుట్టిన లేచి చీరఁ గట్టినఁ జూచి దేవియు దేవుండు దీర్ఘలీల**

**తే. నొంటి దమలోనఁ గ్రీడించుచున్నవారు, మనకు సమయంబు గా దని మరలి మునులు**
**నరుఁడు నారాయణుండు ననారతంబు, మెలఁగుచోటికి నడచిరి మేదినీశ! 22**

**ప్రతి :** మేదినీ+ఈశ= ఓ రాజా, (పరీక్షిన్మహారాజా); పురవైరికిన్= ఈశ్వరునికి; ఒకనాఁడు= ఒక రోజు; పొడసూపు= కనపడాలనే; వేడుకన్= తలంపుతో; తద్దయున్= మిక్కిలిగా; దిక్కుల తమములు+ఎల్లన్= దిక్కుల్లో ఉండే చీకట్లు; తమ తమ వెలుఁగులు= తమ తమ తేజస్సులు; తగిలి= పడి; గొందులు+చొరన్= మూలలకు పరుగుతీయగా; కొందఱు మౌనులు= కొందరు ఋషులు; కోరి రాన్+కన్= కోరికతో రాగా (చూచే కోరిక); ప్రాణ+ఈశు= భర్త; తొడలపైన్+భాసిల్లు= తొడలపై విలసిల్లే; అంబిక= పార్వతీదేవి; వారలన్+చూచి= వారిని గాంచి; మైవలువ లేమిన్= శరీరంపై వస్త్రం లేకపోవడంచేత; సిగ్గుపుట్టినన్= బిడియం కలుగగా; లేచి= లేచి నిలబడి; చీరన్+కట్టినన్= వస్త్రం ధరించగా; చూచి= గమనించి (వారు); దేవియు దేవుండు= పార్వతీపరమేశ్వరులు; దీర్ఘలీలన్= బహుకాలరతిలో; ఒంటిన్= ఏకాంతంగా; తమలోనన్= పరస్పరం; క్రీడించుచున్+ఉన్నవారు= విహరిస్తున్నారు; మనకున్+సమయంబు+కాదు+అని= మనకిప్పుడు ప్రవేశకాలం కాదని; మరలి= వెనుకకు తిరిగి; మునులు= మునీశ్వరులు; అనారతంబున్= ఎల్లప్పుడు; నరుఁడున్, నారాయణుండున్= నరనారాయణులు; మెలఁగు చోటికిన్= విహరించే ప్రదేశానికి; నడచిరి= వెళ్లారు.

**తా :** చీకట్లను పారదోల గలిగిన తేజోవంతులైన కొందరు మునులు పరమేశ్వరుణ్ణి సందర్శించే కోరికతో, ఆ వనంలో ప్రవేశించారు. భర్తతొడలపై కూర్చున్న పార్వతీదేవి వారిని చూచి, సిగ్గుతో వస్త్రం ధరించింది. వారు 'పార్వతీ పరమేశ్వరులు ఏకాంతవిహారంలో ఉన్నారు. ఇది దర్శన సమయం కాదని' నరనారాయణులున్న బదరికావనానికి వెళ్లారు.

**వ. అది కారణంబుగా, భగవంతుండగు శివుండు తన ప్రియురాలివేడుకలకొఱకు నిట్లని వక్కాణించె.23**

**ప్రతి :** అదికారణంబుగా= ఆ సంఘటన కారణంగా; భగవంతుండు+అగు= పరమాత్ముడైన; శివుండు= ఈశ్వరుడు; తనప్రియ+ఆలు= తనకిష్టురాలైన పార్వతీదేవి; వేడుకలకొఱకున్= వినోదాలకోసం; ఇట్లు+అని= ఈ విధంగా; వక్కాణించెన్= చెప్పాడు.

**తా :** పై సన్నివేశకారణంగా పరమాత్ముడైన ఈశ్వరుడు పార్వతీదేవి వినోదాలకోసం ఇట్లా కట్టడిచేశాడు.

**క. ఈ నెల వెవ్వఁడు సొచ్చిన, మానిని యగు ననిన తొంటి మాటకతమునన్**
**మానవుఁడు మగువపోఁడిమి, మానక పేరడవులందు మఱియుం దిరిగెన్. 24**

**ప్రతి :** ఈ నెలవు= ఈ చోటు; ఎవ్వఁడు+చొచ్చినన్= ఎవరు ప్రవేశిస్తారో (వాడు); మానిని+అగున్= స్త్రీ అవుతాడు; అనిన= అన్నటువంటి; తొంటిమాట= పూర్వపుమాట; కతమునన్= కారణంచేత; మానవుఁడు= మనువు కొడుకైన సుద్యుమ్నుడు; మగువ పోఁడిమిన్= స్త్రీసొబగు; మానక= పోగొట్టుకోలేక; పేరు+అడవుల+అందున్= దట్టమైన అరణ్యాల్లో; మఱియున్+ తిరిగెన్= మరలమరల తిరిగాడు.

**తా :** 'ఈ ప్రదేశంలో ప్రవేశించేవాడు స్త్రీ అగుగాక' అన్న ఆ ఈశ్వరుని మాటచేత సుద్యుమ్నుడు స్త్రీగా మారి, ఆ అడవులలో తిరిగిన చోటే తిరుగుతూ ఉండినాడు.

**వ. ఇట్లు చెలికత్తియల మొత్తంబులుం దానును నా రాచపూఁబోఁడిచూపుల నాఁడుపోఁడిమి నెఱపుచు దైవయోగంబున సోమసుతుండును, భగవంతుండును నగు బుధునియాశ్రమంబు సేరి మెలఁగుచున్న యెడ. 25**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; చెలికత్తియల మొత్తంబులున్= సఖుల సమూహం; తానునున్= తాను (స్త్రీ రూపియైన సుద్యుమ్నుడు); ఆ రాచపూఁబోడి= ఆ రాచకూతురు; చూపులన్= చూపులతో; ఆఁడు పోఁడిమిన్= స్త్రీ సౌందర్యాన్ని; నెఱపుచున్= ప్రదర్శిస్తూ; దైవయోగంబునన్= దైవనిర్ణయంచేత; సోమసుతుండును= చంద్రునికుమారుడును; భగవంతుడునున్+అగు= మహిమాన్వితుడైన; బుధుని ఆశ్రమంబున్+చేరి= బుధుని ఆశ్రమాన్ని చేరుకొని; మెలఁగుచున్+ఉ+ఎడన్= తిరుగాడుచుండగా...

**తా :** ఈ విధంగా చెలికత్తెలతో స్త్రీరూపం పొందిన సుద్యుమ్నుడు రాజకుమార్తెహొయలతో స్త్రీసౌందర్యాన్ని వెదజల్లుతూ దైవయోగంచేత చంద్రునికొడుకు మహిమాన్వితుడైన బుధునిఆశ్రమంలో తిరుగాడుతుండగా

**విశే :** సుద్యుమ్నుడు ప్రథమంగా స్త్రీ. వసిష్ఠ మహర్షి తపశ్శక్తిచేత పురుషుడు. బుధునిఆశ్రమంలో తిరగడం దైవయోగం. రాచకూతురు చూపులతో స్త్రీభావాల్ని నెరపడం ప్రేరకం. ఇన్ని విషయాలు ఒక్కచోట చేర్చబడ్డాయి.

**ఆ. రాజుకొడుకుఁ జూచె రాజీవదళనేత్ర, రాజవదనఁ జూచె రాజుపట్టి**
**దొంగకాముఁ డంత దొందడిఁ జిగురాకు, వాలు వెఱికి యుఱికి వారి మొత్తె. 26**

**ప్రతి :** రాజీవ దళనేత్ర= పద్మపురేకులవంటి కన్నులు కలది (ఆ స్త్రీ); రాజుకొడుకున్+చూచెన్= చంద్రుని కొడుకైన బుధుణ్ణి చూచింది; రాజుపట్టి= చంద్రునికొడుకైన బుధుడు; రాజవదనన్+చూచెన్= చంద్రునివంటి ముఖంగల ఆమెను చూచాడు; దొంగకాముఁడు= దొంగవాడైన మన్మథుడు; అంతన్= అప్పుడు; తొందడిన్= వేగిరంగా; చిగురు+ఆకు= లేత చిగురుటాకు అనే; వాలు+పెఱికి= కత్తిని తీసి; ఉఱికి= పరుగెత్తి; వారిన్ మొత్తెన్= వారిని బాదాడు.

**తా :** పద్మదళనేత్ర అయిన ఆ స్త్రీ చంద్రునికొడుకైన బుధుణ్ణి చూచింది. అపుడే అతను కూడ ఆమెను చూచాడు. సరిగ్గా అదే సమయంలో దొంగవాడైన మన్మథుడు తొందరగా తన చిగురుటాకు కత్తిని తీసి, పరుగెత్తి వారిని కొట్టాడు.

**వ. ఇట్లలరువిల్తుని నెఱబిరుదుచిగురుటడిదంబు మొనకు నోహటించి వార లిరువురుం బై పడి వేడుకలకుం జొచ్చిన వారలకుం బురూరవుం డను కుమారుండు పుట్టె. నివ్విధంబున. 27**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అలరువిల్తుని= పుష్పబాణుని; నెఱ= నిండైన; బిరుదు= గొప్ప; చిగురు+అడిదంబు= చిగురాకు ఆయుధంయొక్క; మొనకున్= ములికికి; ఓహటించి= జంకి; వారలు+ఇరువురున్= ఆ ఇద్దరును; పైన్‌పడి=

ఒకరిపై మరొకరుపడి; వేడుకలకున్+చొచ్చినన్= వినోదాల్లో ప్రవేశింపగా; వారలకున్= ఆ ఇరువురికి; పురూరవుండు+అను= పురూరవుడనే పేరుగల; కుమారుండు పుట్టెన్= కొడుకు జన్మించాడు; ఈ+విధంబునన్= ఈ రీతిగా...

**తా :** ఈ విధంగా మన్మథుని బిగువైన చిగురాకు ఆయుధం తాకిడికి వారిరువురు రతివినోదాలలో మునిగారు. దాని ఫలితంగా వారికి పురూరవుడనే కొడుకు పుట్టాడు. ఈ విధంగా

**ఆ. మనుసుతుండు ఘనుఁడు మగనాలితనమునఁ, గొడుకుఁ గాంచి విసివి కుంది కుంది**
**చింతఁ బొంది గురు వసిష్ఠుని భావించె, నతనితలఁపుతోన నతఁడు వచ్చె. 28**

**ప్రతి :** ఘనుఁడు= గొప్పవాడైన; మనుసుతుండు= మనువుకొడుకైన సుద్యుమ్నుడు; మగనాలితనమునన్= మగవానికి ఆలు కావడంచేత; కొడుకున్+కాంచి= కుమారుణ్ణి కని; విసివి= విసుగు చెంది; కుంది కుంది= చాలా దుఃఖించి; చింతన్+పొంది= చింతిస్తూ; గురు= గురువైన; వసిష్ఠునిన్= వసిష్ఠ మహర్షిని; భావించెన్= తలచాడు; అతని తలఁపుతోనన్= అతడు తలచిన వెంటనే; అతఁడున్= ఆ మహర్షికూడ; వచ్చెన్= వచ్చాడు.

**తా :** మనువు కుమారుడైన సుద్యుమ్నుడు మరొకరికి ఆలుకావడంచేత కొడుకును గని, ఆ జీవితానికి విసిగి, దుఃఖంతో చింతిస్తూ గురువైన వసిష్ఠుణ్ణి తలచుకొన్నాడు. అలా తలచుకోగానే ఆ మహర్షికూడా వచ్చాడు.

**వ. వచ్చి సుద్యుమ్నుండు మగవాడగుకొఱకు న మ్మునిపుంగవుండు శంకరు నారాధింప నీశ్వరుండును దపసిప్రయాసంబునకు సంతసిల్లి యిట్లనియె. 29**

**ప్రతి :** వచ్చి= (అలా) వచ్చి; సుద్యుమ్నుండు= సుద్యుమ్నుడు; మగవాడు+అగుకొఱకున్= పురుషుడుకావటంకోసం; ఆ+ముని పుంగవుండు= ఆ మునిశ్రేష్ఠుడు; శంకరున్+ఆరాధింపన్= శివుణ్ణి పూజించగా; ఈశ్వరుండును= ఈశ్వరుడు కూడా; తపసి ప్రయాసంబునకున్= మునిపడిన శ్రమకు; సంతసిల్లి= సంతోషించి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** వసిష్ఠుడు ఆ విధంగా అక్కడికి వచ్చి సుద్యుమ్నుడు పురుషుడు కావటంకోసం పరమేశ్వరుణ్ణి సేవించగా ఈశ్వరుడు ఆతని శ్రమకు మెచ్చి ఇట్లన్నాడు.

**మ. 'తన మున్నాడినమాటయున్ నిజముగాఁ దన్మౌనికిం బ్రీతిగా**
**మనుచుండున్ నెల వో నెలం బురుషుఁడై మాసాంతరంబైనఁ గా**
**మినియై యీ గతి వీడుపాటమర భూమిం దాన రక్షించుఁ బొ**
**మ్మనినన్ వచ్చె వసిష్ఠుఁ; డా మనుసుతుం డా రీతి రాజ్యస్థుఁడై. 30**

**ప్రతి :** తన= తనయొక్క; మున్ను+ఆడిన= పూర్వం చెప్పిన; మాటయున్= పలుకు; నిజము+కాన్= నిజమయ్యేటట్లు; తద్+మౌనికిన్= ఆ మునికి; ప్రీతి+కాన్= సంతోషం కలిగేట్టుగా; నెల+పోన్+నెలన్= నెలమార్చి నెల; పురుషుఁడు+ఐ= మగవాడై; మాస+అంతరంబు+ఐనన్= నెల తరువాత; కామిని+ఐ= స్త్రీయై; ఈ గతిన్= ఈ విధంగా; వీడుపాటు+అమరన్= మార్పులకు తగినట్లుగా; మనుచున్+ఉండున్= జీవిస్తుంటాడు; భూమిన్= రాజ్యాన్ని; తాను+అ= తానే; రక్షించున్= పరిపాలిస్తాడు; పొమ్ము+అనినన్= వెళ్ళండి అనగా; వసిష్ఠుఁడు= వసిష్ఠముని; వచ్చెన్= వచ్చాడు; ఆ మనుసుతుండు= ఆ సుద్యుమ్నుడు; ఆ రీతిన్= ఆ విధంగా; రాజ్యస్థుఁడు+ఐ= (రాజ్యం చేస్తూ) రాజ్యాన్ని పాలిస్తున్నవాడై...

**తా :** తాను పూర్వం అన్నమాట వ్యర్థం కాకుండా, ఆ ముని సంతోషించేటట్లు శివుడు 'ఈ సుద్యుమ్నుడు ఒక నెలపురుషుడుగాను, మరో నెల స్త్రీ గాను ఉంటాడు. ఈ మార్పులతో జీవిస్తూ, రాజ్యాన్ని పాలిస్తాడు. వెళ్లు' అనగా వసిష్ఠుడు సుద్యుమ్నుని దగ్గరకు వచ్చాడు. ఆ విధంగానే సుద్యుమ్నుడు రాజ్యాన్ని పాలిస్తూ

**విశే :** పూర్వం విష్ణువు ఇచ్చిన వరానికి, ఇప్పుడు తాను (శివుడు) ఇచ్చిన శాపానికి భంగంరాకుండునట్లు సుద్యుమ్నుడు ఒకనెల పురుషుడుగా, మరోనెల స్త్రీగా ఉండునట్లూ, రాజ్యపాలన స్తంభించకుండా ఉండేటట్లు అనుగ్రహించాడు శివుడు.

**ఆ. మగువ యగుచు మరల మగవాఁడు నగుచును, భూతధాత్రి యంత నాతఁ డేలెఁ**
**ప్రజలు సంతసింప బాహాబలముతోడ, గురునికరుణఁజేసి కువలయేశ! 31**

**ప్రతి :** కువలయ+ఈశ= ఓ భూమీశా!; గురునికరుణన్+చేసి= గురువుదయవల్ల; ఆతఁడు= ఆ సుద్యుమ్నుడు; మగువ+అగుచున్= స్త్రీగా మారుతూ; మరల మగవాఁడున్+అగుచున్= మరల పురుషుడవుతూ; ప్రజలు సంతసింపన్= ప్రజలు ఆనందపడగా; బాహాబలముతోడన్= భుజబలంతో; భూతధాత్రి+అంతన్= భూమండలాన్నంతటిని; ఏలెన్= పరిపాలించాడు.

**తా :** ఓ రాజా! గురువుదయవల్ల అతడు ఆ విధంగా స్త్రీత్వం పొంది, మరల పురుషుడవుతూ, ప్రజలు ఆనందిస్తుండగా భుజబలంతో భూమిని పాలించాడు.

**వ. అతనికి నుత్కలుండును, గయుండును, విమలుండును నను కొడుకులు ముప్పురు గలిగి ధర్మపరులై యుత్తరాపథంబునకు రాజు లయిరి సుద్యుమ్నుండు ముదుసలియై ప్రతిష్ఠానపురంబు విడిచి పురూరవునకు భూమి యిచ్చి వనంబునకుం జనియె న వ్విధంబున. 32**

**ప్రతి :** అతనికిన్= అతనికి (సుద్యుమ్నునికి); ఉత్కలుండును, గయుండును, విమలుండును; అను= అనబడే; కొడుకులు= కుమారులు; ముప్పురు= ముగ్గురు; ధర్మపరులు+ఐ= ధర్మపరాయణులై; ఉత్తరాపథంబునకున్= ఉత్తర దిక్కులోని భూములకు; రాజులు+అయిరి= రాజులయ్యారు; సుద్యుమ్నుండు; ముదుసలి+ఐ= వృద్ధుడైనందువల్ల; ప్రతిష్ఠానపురంబు= ప్రతిష్ఠానపురాన్ని; విడిచి= వదలిపెట్టి; పురూరవునకున్= పురూరవునికి; భూమి+ఇచ్చి= రాజ్యమిచ్చి; వనంబునకున్= అరణ్యానికి; చనియెన్= వెళ్ళిపోయెను; ఆ+విధంబునన్= ఆ విధంగా...

**తా :** ఆ సుద్యుమ్నునికి ఉత్కలుడు, గయుడు, విమలుడు అనే ముగ్గురు కొడుకులు కలిగి ధర్మానురక్తులై ఉత్తరదిక్కులోని భూములకు రాజులయ్యారు. సుద్యుమ్నుడు వృద్ధుడయినందువల్ల, పురూరవునికి రాజ్యమిచ్చి, ప్రతిష్ఠానపురాన్ని విడిచి, వానప్రస్థానికి వెళ్ళాడు. ఆ విధంగా

**సీ. కొడుకు సుద్యుమ్నుండు ఘోరాటవుల కేఁగ వందుచు మనువు వైవస్వతుండు**
**దనకు బిడ్డలు గల్గఁ దప మాచరించెను హరిఁగూర్చి నూతేండ్లు యమునలోన;**
**హరి యంత నిక్ష్వాకుఁ డాదిగాఁ బదుగురు పుత్త్రుల నిచ్చెను బొసఁగ; వారి**
**యందుఁ బృషధ్రాఖ్యుఁ డనువాడు గురునాజ్ఞ విమలధర్మంబులు వెలయఁ బూని**

**తే. పసులకదుపులఁ గాచుచు బలు మొగిళ్లు, వచ్చి నడురేయి జోరున వాన గురియ**
**మంద విడియించి చుట్టు నేమఱకయుండె, నడవిమెకములు సొరకుండ నరసికొనుచు. 33**

**ప్రతి :** కొడుకు సుద్యుమ్నుండు= కుమారుడైన సుద్యుమ్నుడు; ఘోర+అటవులకున్+ఏఁగన్= దుర్గమారణ్యాలకు పోగా; మనువు వైవస్వతుండున్= మనువైన వైవస్వతుడు; తనకున్= తనకు; బిడ్డలు+కల్గన్= సంతానం కలిగేందుకు; నూఱు+ఏండ్లు= వంద సంవత్సరాలు; యమునలోనన్= యమునానదీతీరంలో; హరిన్+కూర్చి= విష్ణువును గూర్చి; తపమున్+ఆచరించెన్= తపస్సు చేశాడు; హరి+అంతన్= అపుడు విష్ణువు; ఇక్ష్వాకుఁడు+ఆది+కాన్= ఇక్ష్వాకుడు మొదలైన; పదుగురు పుత్త్రులన్= పదిమంది కొడుకులను; పొసఁగన్+ఇచ్చెను= పొందికగా ఇచ్చాడు; వారి+అందున్= వారిలో; పృషధ్ర+ఆఖ్యుఁడు+ అనువాఁడు= పృషధ్రుడనేవాడు; గురు+ఆజ్ఞన్= గురువు ఆనతో; విమల ధర్మంబులు= మేలిమి ధర్మాలు; వెలయన్+పూని= గట్టిగా పాటిస్తూ; పసుల కదుపులన్= ఆవులమందల్ని; కాచుచున్= కాస్తూ; పలు మొగిళ్ళు వచ్చి= అనేకమేఘాలు వచ్చి; నడురేయిన్= అర్ధరాత్రిలో; జోరునవాన+కురియన్= బోరున వర్షం కురియగా; మందన్+విడియించి= ఆలమందను ఒకచోట చేర్చి; అడవి మెకములు= క్రూర జంతువులు; చొరకుండన్= రాకుండా; అరసికొనుచున్= కనిపెట్టుకొంటూ; ఏమఱక+ఉండెన్= జాగ్రత్తగా ఉండాడు.

**తా :** ఈ విధంగా కొడుకు సుద్యుమ్నుడు అరణ్యాలకు పోగా, వైవస్వతమనువు సంతానంకోసం దుఃఖిస్తూ యమునానదీ తీరంలో విష్ణువునుగూర్చి నూరేండ్లు తపస్సు చేశాడు. అపుడు హరి అతనికి ఇక్ష్వాకుడు మొదలైన పదిమందికొడుకులను అనుగ్రహించాడు. వారిలో పృషధ్రుడనేవాడు గురువు ఆజ్ఞమేరకు ధర్మాల్ని పాటిస్తూ ఆవులమందను కాచేవాడు. ఒకరోజు అర్ధరాత్రి దట్టమైన మేఘాలు కమ్ముకొని జడివాన కురవసాగింది. అతడు ఆవులన్నింటిని ఒకచోట చేర్చి, క్రూరమృగాల బారిన పడకుండా జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉన్నాడు.

**వ. అంత. 34**

**ప్రతి :** అంతన్= అపుడు

**క. ప్రబ్బికొనిన పెంజీఁకటి, నిబ్బరముగ నడిఁకి నడిఁకి నింగికి వడితో**
**గొబ్బున నెగసి తటాలున, బెబ్బులి మందావుఁ బట్టెఁ బెలుకుఱి యఱవన్. 35**

**ప్రతి :** ప్రబ్బికొనిన= కమ్ముకొన్న; పెను+చీఁకటిన్= దట్టమైనచీకట్లో; బెబ్బులి= పెద్దపులి ఒకటి; నిబ్బరము+కాన్= కదలకుండా; నడికి నడికి= ఒదిగి ఒదిగి; నింగికిన్= ఆకాశానికి; వడితోన్= వేగంగా; గొబ్బునన్= ఉన్నట్లుండి; ఎగసి= ఎగిరి; తటాలునన్= వేగంగా; పెలుకుఱి+అఱవన్= భయంతో అరవగా; మంద+ఆవున్+పట్టెన్= మందలోని ఒక ఆవును పట్టుకొంది;

**తా :** కమ్ముకొన్న చీకట్లో ఒక పెద్దపులి మెల్లగా ఒదిగి ఒదిగి ఉన్నట్లుండి పైకెగిరి ఆకస్మికంగా మందలోని ఒక ఆవును అది భయంతో అరుస్తూ ఉండగా పట్టుకొనింది.

**క. ఉల్లములు గలఁగి మొదవుల, వెల్లువ లన్నియును లేచి విచ్చలవిడితోఁ**
**జెల్లాచెదరై పాఱెను, బెల్లుగ నంబా యటంచు బెబ్బులి గాలిన్. 36**

**ప్రతి :** బెబ్బులి గాలిన్= పెద్దపులి వాసనసోకి; ఉల్లములు+కలఁగి= మనసులు బెదిరి; మొదవుల వెల్లువలు+అన్నియున్= ఆవుల గుంపులన్నీ; లేచి= నిలబడి; విచ్చల విడితోన్= విడివిడిగా విచ్చుకొని; పెల్లుగన్= ఒక్కసారిగా; అంబా+అటంచున్= అంబా అని అరుస్తూ; చెల్లాచెదరై= కకావికలై; పాఱెను= పరుగులుతీశాయి.

**తా :** పెద్దపులి గాలి సోకి గుంపుగా ఉన్న ఆవులన్నీ బెదరి లేచి ఒక్కసారిగా అంబా అని అరుస్తూ చెల్లాచెదరుగా పరుగుతీశాయి.

**వ. అయ్యవసరంబున** **37**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**శా. ఆ పెంజీఁకటి మ్రోలఁ గాన కడిదం బంకించి శార్దూల మం**
**చా పుల్లావు శిరంబుఁ ద్రుంచి తెగదో యంచుం, బులిన్ వెండియున్**
**వాపోవం దెగ వ్రేసి భూవరుఁడు ద్రోవన్ ఖడ్గరక్తంబుచేఁ**
**బై పై గీయుచుఁ జేరి చూచెఁ దల ద్రెవ్వంబడ్డ యద్ధేనువున్.** **38**

**ప్రతి :** భూవరుఁడు= రాజు (పృషధ్రుడు); ఆ పెను+చీఁకటిన్= ఆ కటిక చీకట్లో; మ్రోలన్= ఎదురుగా; కానక= కనబడక; అడిదంబు+అంకించి= కత్తిని పూని; శార్దూలము+అంచున్= పెద్దపులి అని; ఆ పుల్ల+ఆవు= ఆ పసుపు మించిన తెల్లని ఆవుయొక్క; శిరంబున్+త్రుంచి= తలను నరికి; తెగదు+ఓ+అంచున్= తెగలేదనుకొని; వెండియున్= మరల; పులిని= పెద్దపులిని; వాపోవన్+తెగవ్రేసి= నోరు పడిపోయేటట్లు తెగనరికి; త్రోవన్= దారిని; ఖడ్గరక్తంబున్+చేన్= ఖడ్గానికి అంటిన నెత్తురును చేతితో; పైన్+పైన్, గీయుచున్= పై పైన తుడుస్తూ; చేరి= దగ్గరకు చేరుకొని; తలత్రెవ్వన్+పడ్డ= తల తెగిపడిన; ఆ ధేనువున్= ఆ ఆవును; చూచెన్= చూశాడు.

**తా :** పృషధ్రుడు ఆ చీకట్లో కనబడక కత్తిని చేతపూని పెద్దపులి అనుకొని ఒక పుల్లావు తలను నరికి, తెగలేదనుకొని మళ్లీ తెగవేసి దారిలో ఖడ్గరక్తాన్ని చేతితో తుడుస్తూ, దగ్గరికి చేరి, తల తెగిపడిన ఆవును చూశాడు.

**వ. చూచి దుఃఖితుండై యున్న పృషధ్రునిం గని, కులగురుండగు వసిష్ఠుండు కోపించి 'నీవు రాజత్వంబునకుఁ బాసి యీ యపరాధంబున శూద్రుండవు గ' మ్మని శపియించె; నతండును గృతాంజలియై తన కులాచార్యుని వలన మరలం గైకోలు వడసి యతని యనుమతంబున.** **39**

**ప్రతి :** చూచి= అదిచూచి; దుఃఖితుండు+ఐ+ఉన్న= దుఃఖిస్తున్నట్టి; పృషధ్రునిన్; కని= చూచి; కులగురుండు+అగు= కులగురువగు; వసిష్ఠుండు; కోపించి= ఆగ్రహించి; నీవు; (పృషధ్రుడు); రాజత్వంబునకున్= రాజ్యాధికారానికి; పాసి= దూరమై; ఈ అపరాధంబునన్= ఈ నేరానికి; శూద్రుండవు= శూద్రుడివి; కమ్ము+అని= అవుతావు అంటూ; శపియించెన్= శపించాడు; అతండును= ఆ పృషధ్రుడు; కృత+అంజలి+ఐ= చేతులు జోడించి; తన; కుల+ఆచార్యుని వలనన్= కులగురువైన వసిష్ఠుని నుండి; మరలన్= మరలా; కైకోలు+పడసి= అనుమతి పొంది; అతని అనుమతంబునన్= వసిష్ఠుని అనుజ్ఞతో...

**తా :** తల నరుకబడిన ఆవును చూచి దుఃఖితుడైన పృషధ్రుని కులగురువు వసిష్ఠుడు చూచి కోపంతో ఈ నేరంచేత నీవు రాచరికానికి దూరమై శూద్రుడవవుతావు అని శపించాడు. అతడు కూడ చేతులు జోడించి గురుదయతో, అనుమతితో

**సీ. అఖిలాత్ముఁ డగుచున్న హరియందుఁ బరునందు భక్తితోఁ జాలఁ దత్పరత మెఱసి**
**యూర్ధ్వరేతస్కుఁడై యున్న ప్రాణులకెల్ల నాప్తుఁడై సర్వేంద్రియములు గెల్చి**
**సంగంబునకుఁ బాసి శాంతుండు నపరిగ్రహుండునై కోరక యుండి తనకు**
**వచ్చినయదియ జీవనము గావించుచుఁ దనుఁ దాన నిలుపుచు ధన్యబుద్ధి**

**తే.** **జడునితెఱఁగున నంధునిచందమునను, జెవిటిభంగిని మహినెల్లఁ జెల్లఁ దిరిగి**
**యడవులకు నేఁగి కార్చిచ్చునందుఁ జొచ్చి, చిక్కి నియతుఁడై బ్రహ్మంబుఁ జెందె నతఁడు. 40**

**ప్రతి :** అతఁడు= పృషధ్రుడు; అఖిల+ఆత్ముఁడు+అగుచున్+ఉన్న= సర్వాత్మకుడుగానున్న; హరి+అందున్= విష్ణువునందును; పరున్+అందున్= ఇతరునియందును; భక్తితోన్+చాలన్= చాలా భక్తితో; తత్పరతన్= ఆసక్తిని; మెఱసి= ప్రకటించి; ఊర్ధ్వరేతస్కుఁడు+ఐ= ఇంద్రియ నిగ్రహంకలవాడై; ఉన్న= ఉన్నట్టి; ప్రాణులకున్+ఎల్లన్= జీవులకన్నింటికి; ఆప్తుఁడు+ఐ= ఇష్టుడై; సర్వ+ఇంద్రియములు గెల్చి= అన్ని ఇంద్రియాల్ని జయించి; సంగంబునకున్+పాసి= విషయసాంగత్యంవదలి; శాంతుండున్= ప్రశాంతుడు; అపరిగ్రహుండును+ఐ= దేనినీ స్వీకరించనివాడును అయి; కోరక+ఉండి= దేనినీ కోరుకోకుండా ఉండి; తనకున్+వచ్చిన+అది+అ= తనకు లభించిన దానితోనే; జీవనమున్+కావించుచున్= బ్రతుకుతూ; తనున్+తాను+అ= తనను తానే; నిలుపుచున్= నిగ్రహించుకుంటూ; ధన్యబుద్ధిన్= ధన్యుడనయ్యాను అనే బుద్ధితో; జడుని తెఱంగునన్= మందునివలె; అంధుని చందమునను= గుడ్డివానివలె; చెవిటి భంగిని= చెవిటివానివలె; మహిని+ఎల్లన్= భూమి అంతా; చెల్లన్+తిరిగి= పూర్తిగా తిరిగి; అడవులకున్+ఏఁగి= అరణ్యాలకు వెళ్ళి; కారు+చిచ్చు+అందున్= దావానలంలో; చొచ్చి= ప్రవేశించి; చిక్కి= తగుల్కొని; నియతుఁడు+ఐ= నియమం కలవాడై; బ్రహ్మంబున్+చెందెన్= పరబ్రహ్మంలో ఐక్యమయ్యాడు.

**తా :** సర్వాత్మకుడైన హరియందును, ఇతరునియందును భక్తితాత్పర్యాలను ప్రదర్శించాడు. ఊర్ధ్వరేతస్కుడై, ప్రాణులకు ఇష్టుడై, ఇంద్రియప్రవృత్తికి దూరుడై, విషయసాంగత్యంమాని, ప్రశాంతుడై దేనినీ స్వీకరించక, తానై దేనినీ కోరక, లభించినదానితో బ్రతుకుతూ, ఆత్మావలోకనంతో కృతార్థుడై మందునివలె, గ్రుడ్డివలె, చెవిటివలె నేల నాలుగు చెరగుల తిరిగి చివరకు అడవులకు వెళ్ళి కార్చిచ్చులో పడి పరబ్రహ్మంలో లీనమయ్యడు.

**విశే :** పులిగా భావించి గోహత్య చెయ్యడంతోను, వసిష్ఠుని శాపంవల్ల వైరాగ్యం చెందిన పృషధ్రుడు నిర్లిప్తుడై జీవిస్తూ, చివరకు శాపఫలం పొందకుండానే మోక్షం పొందడం అనేది చాల విశేషం. ఎలాంటి కర్మపరిపాకాలనైనా సాధనలవల్ల పోగొట్టుకోవచ్చు.

**క.** **కవి యను కడపటికొమరుఁడు, భవనము రాజ్యంబు విడిచి బంధులతో నేఁ**
**గి వనమునఁ బరమపురుషునిఁ, బ్రవిమలమతిఁ దలఁచి తలఁచి పరముం బొందెన్. 41**

**ప్రతి :** కవి+అను= కవి అనే పేరుగల; కడపటి కొమరుఁడు= చివరివాడు (మనువు కొడుకుల్లో); భవనమున్, రాజ్యంబున్= రాజభవనాన్ని, రాజ్యాన్ని కూడా; విడిచి= వదిలిపెట్టి; బంధులతోన్+ఏఁగి= చుట్టాలతో వెళ్ళి; వనమునన్= అరణ్యంలో; పరమపురుషునిన్= భగవంతుడైన హరిని; ప్రవిమలమతిన్= పరిశుద్ధమైనమనస్సుతో; తలఁచి తలఁచి= ధ్యానించి, ధ్యానించి; పరమున్+పొందెన్= మోక్షాన్ని పొందాడు.

**తా :** మనువుకొడుకుల్లో చివరివాడైన కవి ఇంటినీ, రాజ్యాన్నీ వదలి చుట్టాలతో అడవికి పోయి, భగవంతుడైన హరిని పవిత్రమైన మనసుతో ధ్యానించి మోక్షాన్ని పొందాడు.

**వ.** **మఱియుఁ గరూశుం డను మానవునివలనం గొందఱు కారూశులు క్షత్రియులు గలిగి, ధర్మంబుతోడి ప్రియంబున బ్రహ్మణ్యులై యుత్తరాపథంబునకు రక్షకులైరి; ధృష్టునివలన ధార్ష్టం బను వంశంబు గలిగి భూతలంబున బ్రహ్మభూయంబు నొంది నెగడె; నృగునివంశంబున సుమతి పుట్టె; నతనికి భూతజ్యోతి పుట్టె;**

**నతనికి వసువు జనించె; వసువునకుం బ్రతీతుండు గలిగెఁ; బ్రతీతునికి నోఘవంతుఁడు జనించె; నతని కూఁతు నోఘవతి యను కన్యకను సుదర్శనుండు వివాహంబయ్యె; నరిష్యంతుండను మనుపుత్త్రునికిఁ జిత్రసేనుం, డా విభునకు దక్షుం, డా పుణ్యునకు మీఢ్వాంసుం, డా సుజనునికి శర్వుం, దమ్మహాత్మునికి నింద్రసేనుం, డా రాజునకు వీతిహోత్రుం, డా సుమతికి సత్యశ్రవుం, డాఘనునికి నురుశ్రవుం, డా వీరునకు దేవదత్తుం, డా పండితునకు నగ్నివేశుండు సుతులయి జనియించి; రయ్యగ్నివేశుండు కానీనుండన నెగడి జాతకర్ణుండను మహర్షియై వెలసె; నతనివలన నాగ్నివేశ్యాయనంబను బ్రహ్మకులంబు గలిగె; నవ్విధంబున. 42**

ప్రతి : మఱియున్= అంతేగాక; కరూశుండు+అను= కరూశుడనే; మానవునివలనన్= నరునివల్ల; కొందఱు= కొంతమంది; కారూశులు= కారూశులనే; క్షత్రియులున్+కలిగి= క్షత్రియులుపుట్టి; ధర్మంబుతోడి ప్రియంబునన్= ధర్మమునందు ఆసక్తి కలిగి; బ్రహ్మణ్యులు+ఐ= బ్రాహ్మణప్రియులై; ఉత్తరాపథంబునకున్= ఉత్తరదిక్కునందలి దేశాలకు; రక్షకులు+ఐరి= రాజులయ్యారు; ధృష్టునివలనన్= ధృష్టునివల్ల; ధార్ష్టంబు+అను= ధార్ష్టమనే; వంశంబు కలిగి= వంశం పుట్టి; భూతలంబునన్= భూలోకంలో; బ్రహ్మభూయంబున్+ఒంది= బ్రహ్మజ్ఞానాన్ని పొంది; నెగడెన్= ప్రసిద్ధి చెందింది. నృగుని వంశంబునన్= నృగుని వంశంలో; సుమతి పుట్టెన్= సుమతి అనేవాడు జన్మించాడు; అతనికిన్= వానికి (సుమతికి); భూతజ్యోతి పుట్టెన్= భూతజ్యోతి కలిగాడు; అతనికిన్= ఆ భూతజ్యోతికి; వసువు జనించెన్= వసువు పుట్టాడు; వసువునకున్= వసువుకు; ప్రతీతుండున్+కలిగెన్= ప్రతీతుడు పుట్టాడు; ప్రతీతునికిన్= ప్రతీతుడనే వానికి; ఓఘవంతుఁడు+జనించెన్= ఓఘవంతుడు జన్మించాడు; అతని కూఁతున్= అతని కుమార్తెఅయిన; ఓఘవతి+అనుకన్యకన్= ఓఘవతి అనే పేరుగల బాలికను; సుదర్శనుండు= సుదర్శనుడు; వివాహంబు+అయ్యెన్= పెండ్లాడాడు; నరిష్యంతుండు+అను= నరిష్యంతుడనే; మనుపుత్రునికిన్= మనువుకొడుకుకు; చిత్రసేనుండు= చిత్రసేనుడూ; ఆ విభునకున్= ఆ రాజుకు; దక్షుండు= దక్షుడూ; ఆ పుణ్యునకున్= ఆ పుణ్యాత్మునికి; మీఢ్వాంసుండు= మీఢ్వాంసుడూ; ఆ సుజనునికిన్= ఆ సజ్జనునికి; శర్వుండు= శర్వుడూ; ఆ+మహా+ఆత్మునికిన్= ఆ మహానుభావునికి; ఇంద్రసేనుండు= ఇంద్రసేనుడూ; ఆ రాజునకున్= ఆ ఏలికకు; వీతిహోత్రుండు= వీతిహోత్రుడూ; ఆ సుమతికిన్= ఆ బుద్ధిమంతునికి; సత్యశ్రవుండును= సత్యశ్రవుడూ; ఆ ఘనునికిన్= ఆ గొప్పవానికి; ఉరుశ్రవుఁడు= ఉరుశ్రవుడనేవాడు; ఆ వీరునకున్= ఆ పరాక్రమశాలికి; దేవదత్తుండు= దేవదత్తుడనువాడు; ఆ పండితునకున్= ఆ జ్ఞానికి; అగ్నివేశుండు= అగ్నివేశుడూ; సుతులు+అయి= కొడుకులుగా; జనియించిరి= జన్మించారు; ఆ+అగ్నివేశుండు= ఆ అగ్నివేశుడనేవాడు; కానీనుండు+అనన్+నెగడి= కానీనుడని ప్రసిద్ధుడై; జాతకర్ణుండు+అను= జాతకర్ణుడనే; మహర్షి+ఐ+వెలసెన్= మహర్షిగా ప్రకాశించాడు; అతనివలనన్= ఆ జాతకర్ణునివలన; ఆగ్నివేశ్యాయనంబు+అను= 'ఆగ్నివేశ్యాయన' మనే; బ్రహ్మకులంబు+కలిగెన్= బ్రాహ్మణకులం ఏర్పడింది; ఆ+విధంబునన్= ఆ పద్ధతిగా...

**తా :** కరూశుడనే మనువు కొడుకువల్ల కారూశులనే రాజులు కలిగారు. వారు ధర్మప్రియులు, బ్రాహ్మణప్రియులై ఉత్తర దిక్కులోని భూములకు రక్షకులైనారు. దృష్టునివల్ల ధార్ష్టమనే వంశం కలిగి బ్రహ్మజ్ఞానసంపన్నతతో భూతలంలో ప్రసిద్ధి పొందింది. నృగుని వంశంలో సుమతి, అతనికి భూతజ్యోతి, అతనికి వసువు, అతనికి ప్రతీతుడు, అతనికి ఓఘవంతుడు కలిగారు. ఓఘవంతుని కుమార్తె ఓఘవతిని సుదర్శనుడు వివాహమాడాడు. నరిష్యంతుడనే మనువు కొడుక్కి చిత్రసేనుడు, ఆ రాజుకు దక్షుడు, ఆ పుణ్యాత్మునికి మీఢ్వాంసుడు, ఆ సజ్జనునికి శర్వుడు, ఆ మహాత్మునికి ఇంద్రసేనుడు, ఆ రాజుకు వీతిహోత్రుడు, ఆ బుద్ధిమంతునికి సత్యవ్రతుడు, ఆ మహానుభావునికి ఉరుశ్రవుడు, ఆ వీరునికి దేవదత్తుడు, ఆ పండితునికి

అగ్నివేశుడు జన్మించారు. అగ్నివేశుడు కానీనుడనే ప్రసిద్ధితో జాతకర్ణుడనే మహర్షిగా వెలిశాడు. అతని పేరు మీద 'ఆగ్నివేశ్యాయన' మనే బ్రాహ్మణవంశం ఏర్పడింది.

**విశే :** ఈ వచనంలో కరూశుడు, ధృష్టుడు, నృగుడు, నరిష్యంతుడు అనే మనువుకుమారుల వంశాలు చెప్పబడ్డాయి. నరిష్యంతునివంశంలో జన్మించిన ప్రతి ఒక్కరికి విశేషణం చెప్పబడింది. అంటే ఆ వంశం అన్ని ఉత్తమగుణాలతో విరాజిల్లిందనుకోవాలి.

**క. తెలుపఁబడె నరిష్యంతుని, కుల మెల్లను నీకు దిష్టకులమున్ దెలియం**
**దెలిపెద రాజేంద్రోత్తమ!, తెలియుము సర్వంబు నీకుఁ దేటపడంగన్. 43**

**ప్రతి :** రాజ+ఇంద్ర+ఉత్తమ= ఉత్తముడవైన రాజశ్రేష్ఠుడా!; నీకున్= నీకు; నరిష్యంతుని కులము+ఎల్లనున్= నరిష్యంతుని వంశాన్ని గూర్చి; తెలుపన్+పడె= చెప్పబడింది; దిష్టకులమున్= మనువుకొడుకైన దిష్టునియొక్క వంశాన్నిగూర్చి; తెలియన్+తెలిపెదన్= తెలియ చెప్తాను; సర్వంబు= సమస్తమూ; నీకున్+తేటపడన్+కన్= నీకు అర్థమయ్యేటట్లు; తెలియుము= తెలుసుకో!

**తా :** ఓ రాజశ్రేష్ఠుడా! నరిష్యంతుని వంశాన్ని గూర్చి నీకు చెప్పాను. ఇప్పుడు దిష్టుని వంశాన్ని గురించి స్పష్టంగా చెప్తాను. గ్రహించు.

**వ. దిష్టునికొడుకు నాభాగుండనువాఁడు కర్మవశంబున వైశ్యత్వంబు నొందె; నా నాభాగునికి హలంధనుండు కలిగె; నతనికి వత్సప్రీతియు, వత్సప్రీతికిఁ బ్రాంశువు, నతనికిఁ బ్రమితియుఁ, బ్రమితికి ఖమిత్రుండును, ఖమిత్రునికిఁ జాక్షుషుండు, నతనికి వివింశతియు, వివింశతికి రంభుండు, రంభునికి ధార్మికుండైన ఖనినేత్రుండు, నతనికిఁ గరంధనుండు, గరంధనున కవీక్షిత్తు, నా యవీక్షిత్తునకు మరుత్తుండు జనియించి రా మరుత్తుండు చక్రవర్తి యయ్యెఁ; నతనిచరిత్రంబు వినుము. 44**

**ప్రతి :** దిష్టుని కొడుకు= దిష్టుని కుమారుడు; నాభాగుండు+అనువాఁడు= నా భాగుడనేవాడు; కర్మవశంబునన్= కర్మవశాత్తు; వైశ్యత్వంబున్+ఒందెన్= వైశ్యత్వాన్ని పొందాడు; ఆ నాభాగునికిన్= ఆ నాభాగునికి; హలంధనుండు కలిగెన్= హలంధనుడు పుట్టాడు; అతనికిన్= అతనికి (హలంధనునికి); వత్సప్రీతి= వత్సప్రీతి; వత్సప్రీతికి; ప్రాంశువు; అతనికిన్= అతనికి (ప్రాంశువునకు); ప్రమితియున్= ప్రమితి (అనువాడు); ప్రమితికి= ప్రమితికి; ఖమిత్రుండును= ఖమిత్రుడనువాడు; ఖమిత్రునికిన్= ఖమిత్రునికి; చాక్షుషుండును= చాక్షుషుడూ; అతనికిన్= అతనికి (చాక్షుషునికి); వివింశతియు= వివింశతి; వివింశతికి= వివింశతికి; రంభుండు= రంభుడూ; రంభునికి; ధార్మికుండు+ఐన= ధర్మాత్ముడైన; ఖనినేత్రుండున్= ఖనినేత్రుడును; అతనికిన్= ఆ ఖనినేత్రునికి; కరంధనుండు= కరంధనుడు; కరంధనునికిన్= కరంధనునికి; అవిక్షిత్తున్= అవిక్షిత్తును; ఆ+అవిక్షిత్తునకున్= ఆ అవిక్షిత్తుకు; మరుత్తుండు= మరుత్తుడూ; జనియించిరి= పుట్టారు; ఆ మరుత్తుండు= ఆ మరుత్తుడు; చక్రవర్తి+అయ్యెన్= చక్రవర్తి అయ్యాడు; అతనిచరిత్రంబున్+వినుము= ఆతనిచరిత్రను విను.

**తా :** దిష్టుని కొడుకు నాభాగుడనేవాడు కర్మవశాత్తు వైశ్యత్వాన్ని పొందాడు. ఆ నాభాగునికి హలంధనుడు కలిగాడు. అతనికి వత్సప్రీతి. అతనికి ప్రాంశువు, అతనికి ప్రమితి, అతనికి ఖమిత్రుడు, అతనికి చాక్షుషుడు, అతడికి వివింశతి, అతనికి రంభుడు, అతనికి ధర్మాత్ముడైన ఖనినేత్రుడు, అతనికి కరంధనుడు, అతనికి అవిక్షిత్తు, అతనికి మరుత్తుడు జన్మించారు. ఆ మరుత్తుడు చక్రవర్తి అయ్యాడు. అతడి చరిత్ర విను.

**సీ. అంగిరస్సుతుఁడు మహాయోగి సంవర్తుఁ డతనియాగమునకు యాజకుండు,**
**దిరిగి యుండెడివారు మరుదాఖ్యగణము లొప్పారు విశ్వేదేవు లచటి సభ్యు**
**లధికదక్షిణల బ్రాహ్మణకోటిఁ దనిపెను; సోమపానంబున సురవరుండు**
**మది నుబ్బి బంగారుమయము గావించెను యాగవస్తువులెల్ల; నధికనియతి**

**తే. నా మరుత్తుఁడు సేసిన యట్టిభంగి, ధీరభావంబుఁ జాగంబుఁ దెంపుఁ గలిగి**
**మఖము సేసినవారిని మఱియు నెఱుఁగ, మెల్ల లోకములందు నరేంద్రముఖ్య! 45**

**ప్రతి :** అంగిరస్+సుతుఁడు= అంగిరసుని కుమారుడు; మహాయోగి= గొప్పఋషి అయిన; సంవర్తుఁడు= సంవర్తుడు; అతని= అతనియొక్క; యాగమునకున్= యజ్ఞానికి; యాజకుండు= నిర్వాహకుడు; తిరిగి+ఉండెడివారు= దానిని పరివేష్టించినవారు; మరుత్+ఆఖ్యగణములు= మరుత్తు లనబడువారు; ఒప్పు+ఆరు= పొందికైన; విశ్వేదేవులు= విశ్వేదేవతలు; అచటి సభ్యులు= అక్కడి సదస్యులు; అధిక దక్షిణలన్= గొప్ప సంభావనలతో; బ్రాహ్మణకోటిన్= బ్రాహ్మణుల సమూహాన్ని; తనిపెను= సంతృప్తి పరచాడు; సోమపానంబునన్= సోమపానంచేత; మదిన్+ఉబ్బి= పొంగిపోయి; సురవరుడు= దేవతా శ్రేష్ఠుడైన దేవేంద్రుడు; యాగవస్తువులు+ఎల్లన్= యజ్ఞనిర్వహణకు కావలసిన వస్తువుల నన్నిటిని; బంగారుమయము+ కావించెన్= బంగారుమయం చేశాడు; అధిక నియతిన్= మిక్కిలి నియమంతో; ఆ మరుత్తుఁడు+చేసిన= ఆ మరుత్తు కావించిన; అట్టి భంగిన్= అటువంటి రీతిని; ధీరభావంబున్= ధైర్యాన్ని; చాగంబున్= త్యాగాన్ని; తెంపున్+కలిగి= తెగింపును కలిగి; మఖము+చేసినవారిని= యజ్ఞం చేసినవారిని; మఱియున్= మరల; ఎల్లలోకముల+అందున్= అన్ని లోకాల్లోను; ఎఱుఁగము= చూడలేము (తెలియము).

**తా :** ఓ రాజా! ఆ మరుత్తుని యాగానికి అంగిరసునికొడుకు మహాయోగియైన సంవర్తుడు నిర్వహణ వహించాడు. దానిని పరివేష్టించినవారు మరుత్తులు. విశ్వేదేవతలు సదస్యులు. అతడు అధికదక్షిణలతో బ్రాహ్మణ సమూహాన్ని తృప్తిపరచాడు. దేవేంద్రుడు సోమపానంచేత తృప్తుడై, యాగద్రవ్యాల్ని సువర్ణమయం చేశాడు. ఈ విధంగా ఆ మరుత్తుడు చేసినట్లు ధైర్యం, త్యాగం, తెగింపు కలిగి యాగం చేసినవారిని సర్వలోకాల్లో ఎక్కడా చూడము.

**వ. ఆ మరుత్తునకు దముండును, దమునకు రాజవర్ధనుండును, రాజవర్ధనునకు సుధృతియు, సుధృతికి సౌధృతేయుండును, సౌధృతేయునకుఁ గేవలుండును, కేవలునకు బంధుమంతుండును, నతనికి వేదవంతుండును, వేదవంతునికి బంధుండును, బంధునకుఁ దృణబిందుండును సంభవించి; రంత. 46**

**ప్రతి :** ఆ మరుత్తునకున్= ఆ మరుత్తునికి; దముండును= దముడు; దమునకున్= దమునికి; రాజవర్ధనుండును= రాజవర్ధనుడును; రాజవర్ధనునకున్= రాజవర్ధనునికి; సుధృతియు= సుధృతియు; సుధృతికిన్= సుధృతికి; సౌధృతేయుండును= సౌధృతేయుడును; సౌధృతేయునకున్= సౌధృతేయునికి; కేవలుండును= కేవలుడును; కేవలునకున్= కేవలునికి; బంధుమంతుండును= బంధుమంతుడును; అతనికి; వేదవంతుండును= వేదవంతుడును; వేదవంతునికి= వేదవంతునికి; బంధుండును= బంధుడును; బంధునకున్= బంధునికి; తృణబిందుండును= తృణబిందుడును; సంభవించిరి= జన్మించారు; అంత= అప్పుడు...

**తా :** యజ్ఞకార్యం చేత ప్రసిద్ధి పొందిన ఆ మరుత్తుకు దముడనేవాడు, అతనికి రాజవర్ధనుడు. అతనికి సుధృతి, అతనికి సౌధృతేయుడు, అతనికి కేవలుడు, అతనికి బంధుమంతుడు, అతనికి వేదవంతుడు, అతనికి బంధుడు, అతనికి తృణబిందుడు అనే వాళ్లు కలిగారు. అపుడు

**క. అచ్చరకన్య యలంబుస, గ్రచ్చుఱఁ దృణబిందుఁ జూచి కామించి తుదిం**
**బచ్చవిలుకానియమ్ముల, ముచ్చిచ్చున వచ్చి పొందె మోహాతురయై. 47**

**ప్రతి :** అచ్చరకన్య= అచ్చరకన్నె అయిన; అలంబుస; క్రచ్చుఅన్= శీఘ్రంగా; తృణబిందున్+చూచి= తృణ బిందునిగాంచి; కామించి= ఇష్టపడి; తుదిన్= చివరకు; పచ్చవిలుకాని+అమ్ములన్= మన్మథుని బాణాలయొక్క; మూడు+చిచ్చునన్= మూడువిధాలైన మంటలచేత; మోహ+ఆతుర+ఐ= మోహావేశంతో బాధపడింద్రై; వచ్చిపొందెన్= వచ్చి పొందింది.

**తా :** అప్సరస స్త్రీయైన అలంబుస తృణబిందుణ్ణి చూచి ఇష్టపడి చివరకు మన్మథ బాణాలమంటలచేత మోహావేశంతో సమీపించి అతణ్ణి పొందింది.

**వ. ఆ దంపతులకు నిలబిల యను కూఁతురు జన్మించె; నా కొమ్మను విశ్రవసుండు వొందిననైలబిలుండనం గుబేరుండు పుట్టె; మఱియు నా తృణబిందునకు విశాలుండును, శూన్యబంధుండును, ధూమ్రకేతుండును ననువారు ముప్వురుగొడుకులు గలిగి, రందు విశాలుండును వంశవర్ధనుండై వైశాలియను నగరంబు నిర్మించె; నా రాజునకు హేమచంద్రుం, డా నరేంద్రునకు ధూమ్రాక్షుం, డా పుడమిఱేనికి సహదేవుం, డా బలిష్ఠునకుఁ గృశాశ్వుం డాతనికి సోమదత్తుండు జన్మించె; నతండు. 48**

**ప్రతి :** ఆ దంపతులకున్= ఆ భార్యభర్తలకు; ఇలబిల+అను= ఇలబిల అనే; కూఁతురు జన్మించెన్= కుమార్తె పుట్టింది; ఆ కొమ్మను= ఆ స్త్రీని; విశ్రవసుండు+పొందినన్= విశ్రవసుడు స్వీకరించగా (భార్యగా); ఐలబిలుండు+అనన్= ఐలబిలుడనే; కుబేరుండు పుట్టెన్= కుబేరుడు జన్మించాడు; మఱియున్= అంతేగాక; ఆ తృణబిందునకున్= ఆ తృణబిందునికి; విశాలుడును; శూన్యబంధుండును, ధూమ్రకేతుండునున్; అనువారు= అనేవారు; ముప్వురున్+కొడుకులున్+కలిగిరి= ముగ్గురు కొడుకులు పుట్టారు; అందున్= ఆ ముప్వురిలో; విశాలుండును= విశాలుడనేవాడు; వంశవర్ధనుండు+ఐ= వంశాభివృద్ధికరుడై; వైశాలి+అను= వైశాలి అనబడే; నగరంబున్+నిర్మించెన్= పట్టణాన్ని నిర్మించాడు; ఆ రాజునకున్= ఆ రాజుకు; హేమచంద్రుండు= హేమచంద్రుడు; ఆ నర+ఇంద్రునకున్= ఆ హేమచంద్రునికి; ధూమ్రాక్షుండు= ధూమ్రాక్షుడు; ఆ పుడమిఱేనికిన్= ఆ ధూమ్రాక్షునికి; సహదేవుండు= సహదేవుడు; ఆ బలిష్ఠునకున్= ఆ సహదేవునికి; కృశాశ్వుండు= కృశాశ్వుడు; ఆతనికిన్= ఆ కృశాశ్వునికి; సోమదత్తుండు= సోమదత్తుడు; జన్మించెన్= పుట్టారు; అతండు= ఆతడు...

**తా :** ఆ దంపతులకు ఇలబిల అనే కూతురు పుట్టింది. ఆమెను విశ్రవసుడు భార్యగా పొందగా, ఐలబిలుడనే పేరుగల కుబేరుడు పుట్టాడు. అంతేగాక ఆ తృణబిందునికి విశాలుడు, శూన్యబంధుడు, ధూమ్రకేతుడనబడే ముగ్గురుకొడుకులు కలిగారు. వీరిలో విశాలుడు వంశాభివృద్ధికరుడై వైశాలి అనే నగరాన్ని నిర్మించాడు. ఈయనకు హేమచంద్రుడు, అతనికి ధూమ్రాక్షుడు, అతనికి సహదేవుడు, ఆ బలశాలికి కృశాశ్వుడు, అతనికి సోమదత్తుడు జన్మించారు. ఆ సోమదత్తుడు

**ఆ. అమరవిభుఁడు మెచ్చ నశ్వమేధము సేసి, భూరిపుణ్యగతికిఁ బోయె నెలమి;**
**సోమదత్తుకొడుకు సుమతికి జనమేజ, యుం డనంగఁ గొమరుఁ డుప్పతిల్లె. 49**

**ప్రతి :** అమరవిభుఁడు= దేవతలకు ప్రభువైన ఇంద్రుడు; మెచ్చన్= మెచ్చుకొనేటట్లు; అశ్వమేధమున్+చేసి= అశ్వమేధ యాగాన్ని నిర్వహించి; ఎలమిన్= సంతోషంతో; భూరిపుణ్యగతికిన్+పోయెన్= అధికమైన పుణ్యమార్గానికి వెళ్ళాడు;

సోమదత్తుకొడుకున్= సోమదత్తుని కొడుకైన; సుమతికిన్= సుమతి అనేవానికి; జనమేజయుండు+అనన్+కన్= జనమే జయుడనే పేరుగల; కొమరుఁడు= కొడుకు; ఉప్పతిల్లెన్= జన్మించాడు.

**తా :** దేవేంద్రుడు ప్రశంసించేటట్లు ఆ సోమదత్తుడు అశ్వమేధయాగం చేసి సద్గతికి వెళ్లాడు. అతని కొడుకు సుమతికి జనమేజయుడనే కొడుకు కలిగాడు.

**వ. వీరలు వైశాలు రనం బరఁగి తృణబిందునికీర్తి వహించి, రాజ్యంబు సేసిరి. మఱియును. 50**

**ప్రతి :** వీరలు= వీరు; వైశాలురు+అనన్= వైశాలురనే పేరుతో; పరఁగి= ప్రసిద్ధిపొంది; తృణబిందుని కీర్తి= తృణబిందుడు పొందిన కీర్తిలాంటి కీర్తిని; వహించి= పొంది; రాజ్యంబున్+చేసిరి= రాజ్యపాలన చేశారు; మఱియును= ఇంకనూ...

**తా :** పై చెప్పబడిన వారంతా వైశాలురు అనే పేరుతో ప్రసిద్ధిపొంది, తృణబిందుని కీర్తిని వ్యాపింపజేసి రాజ్యపాలన చేశారు మరియు

**సీ. శర్యాతి యను రాజు జనియించె బ్రహ్మవరుండైన మనువుకు రూఢితోడ;**
**నతఁ డంగిరుని సత్త్రమందు రెండవనాఁటి విహితకర్మము నెల్ల వెలయఁ జెప్పె;**
**నతనికూఁతురు సుకన్యక యను వనజాక్షి దన తండ్రితోఁ దపోవనికి నరిగి**
**చ్యవనాశ్రమముఁ జేరి సఖులును దానును ఫలపుష్పములు గోయఁ బాఱ తిరిగి**

**ఆ. యొక్కపుట్టలోన నొప్పారు జ్యోతుల, రెంటిఁ గాంచి వాఁడిముంటఁ బొడిచెఁ;**
**గన్య ముగుద మఱచి ఖద్యోతయుగ మంచు, దైవవశముకతనఁ దమకి యగుచు. 51**

**ప్రతి :** బ్రహ్మవరుండు+ఐన= పరబ్రహము నందాసక్తి కలిగిన; మనువుకు= వైవస్వతునికి; రూఢితోడన్= తగినట్లు; శర్యాతి+అను= శర్యాతి అనే పేరుగల; రాజు జనియించెన్= రాజు పుట్టాడు; అతఁడు= ఆయన; అంగిరుని సత్త్రము+అందున్= అంగిరసునియజ్ఞంలో; రెండవనాఁటి= రెండోరోజుకు; విహితకర్మము+ఎల్లన్= చేయవలసిన కర్మకాండనంతా; వెలయన్+చెప్పెన్= లోకవిదితంగా చెప్పాడు; అతని కూఁతురు= ఆ శర్యాతి యొక్క కుమార్తె; సుకన్యక+అను= సుకన్యక అనే పేరుగల; వనజ+అక్షి= పద్మాల్లాంటి కళ్ళుకలది; తన తండ్రితోన్= తనతండ్రి వెంబడి; తపస్+వనికిన్+అరిగి= అరణ్యానికి వెళ్ళి; చ్యవన+ఆశ్రమమున్+చేరి= చ్యవనమహర్షిఆశ్రమాన్ని చేరుకొని; సఖులునున్+తానును= చెలికత్తెలు, తాను; ఫలపుష్పములు+కోయన్= పండ్లు పువ్వులు కోయటానికి; పాఱన్ తిరిగి= బాగా తిరిగి; ఒక్కపుట్టలోనన్= ఒక వల్మీకం లోపల; ఒప్పారు= ప్రకాశించు; జ్యోతుల రెంటిన్= రెండుకాంతుల్ని; కాంచి= చూచి; కన్య ముగుద= అమాయకురాలైన బాలిక; (ముగ్ధయైన కన్య) దైవవశము కతనన్= విధివశాత్తు; తమకి+అగుచున్= తొందరపడింద్రై; మఱచి= అజ్ఞానంతో; ఖద్యోతయుగము+అంచున్= మిణుగురు పురుగుల జంట అనుకొంటూ; వాఁడిముంటన్= పదునైన ముల్లుతో; పొడిచెన్= గుచ్చింది,

**తా :** బ్రహ్మతత్పరుడైన మనువుకు శర్యాతి అనే రాజు జన్మించాడు. అతడు అంగిరసుని యజ్ఞంలో రెండవనాడు చేయవలసిన కర్మకాండను ఏర్పరచాడు. అతని కుమార్తె సుకన్య ఒకరోజు తండ్రితోపాటు అరణ్యానికి వెళ్ళింది. అక్కడ చ్యవనమహర్షి

ఆ(శమానికి వెళ్ళి చెలికత్తెలతో పూలూపండ్లు కోయటానికి తిరుగుతూ ఒక పుట్టలో వెలుగుతున్నరెండుజ్యోతులను చూచి, దైవఘటన చేత చాపల్యంతో తెలివి తక్కువగా వాటిని మిణుగురుపురుగుల జంట అనుకొని పదునైన ముల్లుతో గుచ్చింది.

**విశే :** తెలిసి చేసినా తెలియక చేసినా తప్పు తప్పే! తెలియక అగ్గిని తాకితే కాలకమానదు.

**క. జ్యోతుల ముంటం బొడిచిన, వాతల నెత్తురులు గురిసె వసుధేశభట**
**వ్రాతముల కెల్ల నచ్చట, నా తఱి మలమూత్రబంధ మయ్యె నరేంద్రా! 52**

**ప్రతి :** నర+ఇంద్రా!= ఓ రాజా!; జ్యోతులన్= వెలుగులను; ముంటన్+పొడిచినన్= ముల్లుతో పొడవగా; వాతల= పుట్టనోళ్లనుండి, (ఆ కన్నులనుండి); నెత్తురులు+కురిసెన్= రక్తాలు కారాయి; అచ్చటన్= అక్కడనున్న; వసుధా+ఈశ= భూనాయకుడైన రాజుయొక్క; భటవ్రాతములకున్+ఎల్లన్= సైనికులందరికి; ఆ తఱిన్= అపుడు; మలమూత్రబంధము+ అయ్యెన్= మలమూత్రాలు ఆగిపోయాయి.

**తా :** ఓ రాజా! పుట్టలో ఉన్న ఆ జ్యోతుల్ని ముల్లుతో గుచ్చగా ఆ పుట్టరంధ్రాలనుండి రక్తం కారింది. ఆ వెంటనే అక్కడనున్న రాజభటులందరికి మలమూత్రాలు స్తంభించిపోయాయి.

**వ. వారలం జూచి రాజర్షియగు శర్యాతి విస్మితుండై 'మీరలియ్యాశ్రమదూషణంబు సేయ నోపుదు రది కారణంబుగా మీకీ నిరోధంబు సిద్ధించె నని పలుకు నవసరంబునఁ దండ్రికి సుకన్య యిట్లనియె. 53**

**ప్రతి :** వారలన్+చూచి= వారిని (భటులను)చూచి; రాజ+ఋషి+అగు= రాచమునియైన; శర్యాతి= శర్యాతి రాజు; విస్మితుండు+ఐ= ఆశ్చర్యపడినవాడై; మీరలు= మీరు, ఈ; ఆశ్రమదూషణంబు+చేయన్+ఓపుదురు= ఆశ్రమంలో అపరాధం చేసి ఉంటారు; అది కారణంబుగా= ఆ కారణంచేత; మీకున్+ఈ నిరోధంబు= మీకీ స్తంభనం; సిద్ధించెన్= కలిగి ఉంటుంది; అని పలుకు+అవసరంబునన్= అని పలికే సమయంలో; తండ్రికిన్= తన తండ్రితో (శర్యాతితో); సుకన్య; ఇట్లు+అనియెన్= ఇలా అన్నది.

**తా :** ఆ రాజభటుల్ని చూచి రాజర్షియైన శర్యాతి వారిస్థితికి ఆశ్చర్యపడి 'మీరు ఈ ఆశ్రమంలో ఏదో అపరాధం చేసి ఉంటారు. కాబట్టి ఈ స్తంభనం కలిగింది'. అని అంటుండగా కుమార్తె తండ్రితో ఇట్లా అంది.

**తే. అయ్య! యీ పుట్టచేరువ నాడి యాడి, యిందులో రెండుజ్యోతుల నేనుఁ గాంచి**
**కంటకంబునఁ బొడువ రక్తంబు గురిసె, నే విధంబునఁ గురిసెనో యెఱుఁగు మీవు. 54**

**ప్రతి :** అయ్య!= తండ్రీ!; ఏనున్= నేను (సుకన్యక); ఈ పుట్టచేరువన్= ఈ పుట్టకు సమీపంలో; ఆడి+ఆడి= బాగా ఆడుకొని; ఇందులోన్= ఈ పుట్టలో; రెండు జ్యోతులన్= రెండు వెలుగులను; కాంచి= చూచి; కంటకంబునన్= ముల్లుతో; పొడువన్= పొడువగా; రక్తంబు+కురిసెన్= నెత్తురు కారింది; ఈవు= నీవు; ఏ విధంబునన్+కురిసెను+ఓ= ఎందుచేత కారిందో; ఎఱుఁగుము= తెలుసుకో.

**తా :** తండ్రీ! ఈ పుట్ట దగ్గర ఆడుకుంటూ ఇందులోని రెండు వెలుగుల్ని చూచి ముల్లుతో పొడవగా నెత్తురు కారింది. ఎందుకు జరిగిందో తెలుసుకో.

**విశే :** సుకన్య తానుచేసిన పనిని దాచుకోలేదు. తండ్రితో తెలిపింది. తప్పిదానికి దండన అనుభవించడానికి సిద్ధపడినట్లు తెలుస్తూ ఉంది.

**వ. అనిన శర్యాతి భీతుండై కూఁతుం దోడ్కొని వల్మీకంబుకడకుం జని యందుఁ దపంబు సేయుచున్న చ్యవనుని గని తన నేర్పున నతనివలనఁ బ్రసన్నత వడసి తపసిచిత్తంబు నెఱింగి తన పుత్రిక నిచ్చి యెట్టకేలకుం బ్రదికినవాఁడై మునీశ్వరుని వీడ్కొని పురంబునకుం జనియె; నంత. 55**

**ప్రతి :** అనినన్= అని చెప్పగా; శర్యాతి భీతుండు+ఐ= శర్యాతి భయపడి; కూఁతున్+తోడ్కొని= కుమార్తెను వెంటతీసుకొని; వల్మీకంబు కడకున్+చని= పుట్టదగ్గరకు వెళ్ళి; అందున్= ఆ పుట్టలో; తపంబున్+చేయుచున్న= తపస్సు చేస్తున్న; చ్యవనునిన్+కని= చ్యవనమహర్షిని చూచి; తన నేర్పునన్= తన కౌశలంతో; అతనివలనన్= అతని నుండి; ప్రసన్నతన్+పడసి= అనుగ్రహాన్ని పొంది; తపసిచిత్తంబున్+ఎఱింగి= ముని మనస్సును గ్రహించి; తన పుత్రికన్+ఇచ్చి= తన కూతురునిచ్చి (పెళ్లిచేసి); ఎట్టకేలకున్= తుదకు; బ్రదికినవాఁడు+ఐ= జీవించినవాడై (ప్రమాదం తప్పినవాడై); ముని+ఈశ్వరునిన్= మునిశ్రేష్ఠుణ్ణి; వీడ్కొని= సెలవు తీసుకొని; పురంబునకున్+చనియెన్= నగరానికి వెళ్ళాడు; అంతన్= ఆ తరువాత...

**తా :** అని కుమార్తె చెప్పగా శర్యాతి భయపడి ఆమెను వెంటబెట్టుకొని పుట్టదగ్గరకు వచ్చి అందులో తపస్సు చేస్తున్న చ్యవనుని చూచి, తన నేర్పరితనంతో అతనిని ప్రసన్నునిగా చేసుకొని, ఆ మునిఅభిప్రాయం తెలిసి తనకుమార్తె నిచ్చి వివాహం చేసి ఎట్లో తుదకు ప్రమాదం తప్పించుకొని మునివద్ద సెలవు తీసుకొని తన నగరానికి వెళ్ళాడు. తరువాత

**ఆ. పరమకోపుఁడయిన భార్గవుఁ బతిఁ జేరి, మిగులఁ బనులయెడల మెచ్చుఁ దిరిగి**
**యతనిపర్ణశాల నా సుకన్యక యను, మగువ గొన్నియేండ్లు మనువు మనియె. 56**

**ప్రతి :** పరమకోపుఁడు+అయిన= పరమ కోపిష్ఠివాడైన; పతిన్= భర్తయైన; భార్గవున్= చ్యవనుణ్ణి; చేరి= కలిసి; మిగులన్= మిక్కిలి; పనుల+ఎడలన్= పనుల విషయంలో; మెచ్చున్+తిరిగి= మెప్పు పొందేటట్లు ప్రవర్తించి; అతని పర్ణశాలన్= అతనిఆశ్రమంలో; ఆ సుకన్యక+అను= ఆ సుకన్యక అనే; మగువ= స్త్రీ; కొన్ని+ఏండ్లు= కొన్ని సంవత్సరాలు; మనువు మనియెన్= వైవాహిక జీవితం గడిపింది.

**తా :** పిమ్మట ఆ సుకన్యక మిక్కిలికోపిష్ఠుడైన భర్త చ్యవనుని చేరి, మెచ్చుకొనేటట్లు పనులు చేస్తూ కొన్నేండ్లు కాపురం చేసింది.

**విశే :** సుకన్యది చాల విచిత్రపరిస్థితి. తాను తెలియక అపరాధం చేసింది. తండ్రిఆజ్ఞచే చ్యవనుణ్ణి భర్తగా పొందింది. భర్త మహాకోపిష్ఠి. అతడు మెచ్చేటట్లు పనులు చేయడం చాలా కష్టం. తాను రాజకుమార్తె. కాని ఆమె అతని మెప్పును పొందింది అనటంలో ఆమె వ్యక్తిత్వ ఉదాత్తతను కవి ఆవిష్కరించాడు.

**వ. అంత నొక్కనాఁ డ య్యాశ్రమంబునకు వేల్పువెజ్జులైన యాశ్విను లిద్దఱు వచ్చిన వారలం బూజించి తన ముదిమి సూపి చ్యవనుం డిట్లనియె, 'మీకు మున్న యాగభాగంబుల లేని సోమపానంబు నేఁడు గల్పించి యిచ్చెద, సోమపానసమయంబునఁ బానపాత్రంబు మీకు నందిచ్చెద; నా ముదిమి మానుపుం' దని యిట్లనియె. 57**

**ప్రతి :** అంతన్+ఒక్కనాఁడు= తరువాత ఒకరోజున; ఆ+ఆశ్రమంబునకున్= ఆ ఆశ్రమానికి; వేల్పువెజ్జులు+అయిన= దేవతా వైద్యులయిన; ఆశ్వినులు+ఇద్దఱు= (ఇద్దరు) అశ్వినీదేవతలు; వచ్చినన్= రాగా; వారలన్+పూజించి= వారిని

గౌరవించి; తన ముదిమిన్+చూపి= తన ముసలితనాన్ని చూపించి; చ్యవనుండు+ఇట్లు+అనియెన్= చ్యవనుడిట్లన్నాడు; మీకున్+మున్ను+అ= ఇది వరకు; యాగభాగంబులన్+అ= యజ్ఞభాగాలలో; లేని= లేనట్టి; సోమపానంబున్= సోమపానాన్ని; నేఁడు+కల్పించి+ఇచ్చెదన్= నేడు కల్పించి ఇస్తాను; సోమపాన సమయంబునన్= సోమపానాన్ని పంచేసమయంలో; పానపాత్రంబున్= తాగే పాత్రను; మీకున్+అందిచ్చెదన్= మీకు అందజేస్తాను; నా ముదిమిన్= నా ముసలితనాన్ని; మానుపుండు+అని= పోగొట్టండి అని; ఇట్లు+అనియెన్= ఇంకా ఇలా అన్నాడు.

**తా :** అట్లుండగా ఆ ఆశ్రమానికి దేవతా వైద్యులయిన అశ్వినీ దేవతలు వచ్చారు. వారిని గౌరవించి చ్యవనుడు తన ముసలి తనాన్ని చూపించి ఇట్లన్నాడు. మీకు యజ్ఞభాగంగా లేని సోమపానాన్ని నేను కల్పించి ఇస్తాను. సోమపానసమయంలో పానపాత్రను మీకు అందిస్తాను. ప్రత్యుపకారంగా నా ముసలితనాన్ని పోగొట్టండి అని ఇంకా ఇలా అన్నాడు.

**క. నవకంబగు ప్రాయంబున, జవరాండ్రఁ గరంచు మేని చక్కఁదనంబున్**
**శివతరముగఁ గృప సేయుఁడు, దివిజాధిపవైద్యులార! దీవింతు మిమున్. 58**

**ప్రతి :** దివిజ+అధిప వైద్యులార!= దేవేంద్రుని వైద్యులారా!; నవకంబు+అగు= లేతయైన; ప్రాయంబునన్= వయస్సులో; జవ+ఆండ్రన్= యువతుల్ని; కరంచు= కరగించే; మేని చక్కఁదనంబున్= శరీర సౌందర్యాన్ని; శివతరముగన్= మంగళకరంగా; కృప+చేయుఁడు= అనుగ్రహించండి; మిమున్= మిమ్ములను, దీవింతున్= ఆశీర్వదిస్తాను.

**తా :** దేవేంద్ర వైద్యులారా! అందమైన ప్రాయంతో, జవరాండ్రను కరగించే శరీర సౌందర్యాన్ని శుభకరంగా నాకు అనుగ్రహించండి మిమ్మల్ని దీవిస్తాను.

**వ. అనిన నశ్వినీదేవతలు సంతోషించి సిద్ధనిర్మితంబయిన యీ మడుఁగున మునుఁగు మని పలికి. 59**

**ప్రతి :** అనినన్= అని చెప్పగా; అశ్వినీదేవతలు; సంతోషించి= సంతసించి; సిద్ధనిర్మితంబు+అయిన= సిద్ధులచే నిర్మింపబడిన; ఈ మడుఁగునన్= ఈ మడుగులో; మునుఁగుము+అని= మునుగుమని; పలికి= చెప్పి...

**తా :** అలా అన్న చ్యవనునితో అశ్వినీదేవతలు సంతోషించి సిద్ధులచేత నిర్మింపబడిన ఈ మడుగులో మునుగుమని చెప్పి

**సీ. ముసలితాపసుఁ బట్టి మొగి నెత్తుకొనిపోయి ముగురు నా మడుఁగున మునిఁగి లేచి**
**వనితాజనము నెల్ల వలపించువారలై సుందరమూర్తులై సుభగు లగుచుఁ**
**గమలమాలికలతోఁ గనకకుండలములతో మంచి చీరలతోడఁ దుల్యు**
**లై సూర్యతేజస్కులై యున్నవారల ముప్వురఁ బొడఁగాంచి ముగుద బాల**

**తే. యిందు బెనిమిటి వీఁడని యెఱుఁగ లేక, గరిత గావున నిజనాథుఁ గానఁగోరి**
**సుభగమతులార! నా నాథుఁ జూపుఁ డనుచు, నశ్వినీదేవతలకు నయ్యబల మ్రొక్కె. 60**

**ప్రతి :** ముసలి తాపసున్+పట్టి= వృద్ధుడైన ఆ మునిని పట్టుకొని; మొగిన్= ప్రయత్నంతో ఎత్తుకొనిపోయి; ముగురున్= ముప్వురూ; ఆ మడుఁగునన్= ఆ మడుగులో; మునిఁగి లేచి= మునిగి లేచి; వనితాజనమున్+ఎల్లన్= స్త్రీ జనమంతటిని; వలపించువారలు+ఐ= ఆకర్షించేవారై; సుందరమూర్తులు+ఐ= సౌందర్యరూపులై; సుభగులు+అగుచున్= అదృష్టవంతులవుతూ; కమలమాలికలతోన్= పద్మాల దండలతో; కనకకుండలములతోన్= బంగారు చెవిపోగులతో; మంచి చీరలతోడన్=

మేలిమి వస్త్రాలతో; తుల్యులు+ఐ= ముగ్గురూ ఒకేవిధంగా అయి; సూర్యతేజస్కులు+ఐ= సూర్యునివంటి కాంతికలిగినవారై; ఉన్నన్= ఉండగా; వారలన్+ముగ్వురన్= వాళ్ల ముగ్వురిని(అశ్వినీ దేవతలిద్దరు, చ్యవనుడు); పొడన్+కాంచి= చూచి; ముగుద బాల= అమాయకురాలైన ఆ బాలిక (సుకన్యక); ఇందున్= ఈ ముగ్వురిలో; పెనిమిటి వీఁడు+అని= భర్త ఇతడని; ఎఱుఁగన్ లేక= తెలుసుకోలేక; గరిత+కావునన్= పతివ్రత కాబట్టి; నిజనాథున్+కానన్+కోరి= భర్తను తెలుసుకోగోరి; సుభగమతులార= పుణ్యాత్ములారా!; నా నాథున్= నా భర్తను; చూపుఁడు+అనుచున్= చూపించండి అంటూ; ఆ+అబల= ఆ స్త్రీ; అశ్వినీ దేవతలకున్= ఆ దేవతా వైద్యులైన అశ్వినీదేవతలకు; మ్రొక్కెన్= నమస్కరించింది.

**తా :** ముసలి ముని అయిన చ్యవనుణ్ణి అశ్వినీదేవతలు పూనికతో ఎత్తుకొని పోయి, ఆ మడుగులో మునిగి లేచారు. స్త్రీ జనాన్ని ఆకర్షించే సౌందర్యవంతులు, అదృష్టవంతులుగా మారారు. తామరపూల హారాలతో, బంగారు చెవిపోగులతో, మంచి బట్టలతో, సూర్యునివలె కాంతిగలిగి ఒకే విధంగా ఉన్న ఆ ముగ్గురినీ చూచి అమాయకురాలైన సుకన్య వారిలో తన భర్తను కనిపెట్టలేకపోయింది. పతివ్రత అయిన ఆమె తన భర్తను తెలుసుకోవాలని 'ఓ పుణ్యాత్ములారా! నా భర్తను చూపించండి' అంటూ అశ్వినీదేవతలకు మ్రొక్కింది.

**వ. వార లా పతివ్రతనిజమరితనంబునకు మెచ్చి వయోరూపసంపన్నుండయిన చ్యవనుం జూపి, దంపతుల వీడ్కొని విమానారూఢులై వేలుపులప్రోలికిం జని, రంత. 61**

**ప్రతి :** వారలు= ఆ అశ్వినీ దేవతలు; ఆ పతివ్రత= ఆ సుకన్యకయొక్క; నిజమరితనంబునకున్= సత్యసౌశీల్యానికి; మెచ్చి= మెచ్చుకొని; వయస్+రూపసంపన్నుండు+అయిన= ప్రాయం, రూపం, కలిగిన; చ్యవనున్+చూపి= చ్యవనుణ్ణి చూపించి; దంపతులన్+వీడ్కొని= ఆ భార్యాభర్తలవద్ద సెలవు తీసుకుని; విమాన+ఆరూఢులు+ఐ= విమానమెక్కి; వేలుపుల ప్రోలికిన్= దేవతలనగరానికి; చనిరి= వెళ్లారు; అంతన్= పిమ్మట...

**తా :** అశ్వినీదేవతలు పతివ్రతయైన సుకన్యక సత్యశీలానికి మెచ్చి, యౌవనరూపంతో ఉన్న చ్యవనుని చూపించి, ఆ దంపతుల వద్ద సెలవు తీసుకొని విమానమెక్కి దేవతల నగరమైన అమరావతికి వెళ్ళారు. పిమ్మట

**సీ. యాగంబు సేయంగ నర్థించి శర్యాతి, చ్యవనమునీంద్రు నాశ్రమముకడకుఁ**
**గూఁతు నల్లునిఁ దోడుకొని పోవువేడుక వచ్చి పుత్త్రికకుఁ బార్శ్వంబునందు**
**సూర్యతేజంబున సొంపారు నరుఁ గని, వీఁ డెవ్వఁడో దీనివిభుఁడు గాఁడు;**
**చెల్లరే! యని పుత్త్రి సేసిన ప్రియములు మ్రొక్కులు నొల్లక మోము వాంచి**

**తే. మాఱుమాటాడ దీవింప మనసు రోసి, "చ్యవనుఁ డధికుండు మునిజనసత్తముండు**
**భువనసన్నుతుఁ డతఁడెందుఁబోయె? నాతఁ, డెట్లు వంచింపఁబడియె? వీఁడెవ్వఁ డబల! 62**

**ప్రతి :** శర్యాతి= శర్యాతి రాజు; యాగంబున్+చేయన్+కన్= యజ్ఞము చేయాలని; అర్థించి= కోరి; కూఁతున్+ అల్లునిన్= కుమార్తెను, అల్లుని, తోడుకొని పోవువేడుకన్= తీసుకువెళ్ళాలనే వేడుకతో; చ్యవనముని+ఇంద్రు= మునిశ్రేష్ఠుడైన చ్యవనమహర్షియొక్క; ఆశ్రమము కడకున్= ఆశ్రమం దగ్గరికి; వచ్చి= వచ్చి; పుత్త్రికకున్+పార్శ్వంబునందున్= కుమార్తె పక్కన; సూర్యతేజంబునన్= సూర్యుని తేజస్సువంటి తేజస్సుతో; సొంపు+ఆరు= ప్రకాశించే; నరున్+కని= పురుషుణ్ణిచూచి; వీఁడు+ఎవ్వఁడు+ఓ= వీడెవడో; దీని విభుఁడు+కాఁడు= ఈమె భర్తకాడు; చెల్లరు+ఏ!= ఆశ్చర్యంగా ఉంది; అని= అని

అనుకొని; పుత్త్రి+చేసిన= కుమార్తె చేసిన (తండ్రికి); ప్రియములున్, మ్రొక్కులున్= మర్యాదలను, నమస్కారాలను; ఒల్లక= ఇష్టపడక; మోము వాంచి= తలవంచుకొని; మాఱుమాటాడన్= బదులు మాటలు పలకడానికి; దీవింపన్= ఆశీర్వదించడానికి; మనసురోసి= మనస్సులో అసహ్యపడి; చ్యవనుఁడు= చ్యవనమహర్షి; అధికుఁడు= గొప్పవాడు; మునిజనసత్తముండు= మునులలో శ్రేష్ఠుడు; భువన సన్నుతుఁడు= లోకంలో పొగడిక గలవాడు; అతఁడు+ఎందున్+పోయెన్= ఆయన ఎక్కడకు వెళ్లాడు; ఆతఁడు+ఎట్లు+వంచింపన్+పడియెన్= ఆయనెలా మోసగించబడ్డాడు?; అబల= (అశక్తురాలా!) అమ్మాయీ!; వీఁడు+ఎవ్వఁడు= వీడెవడు?

**తా :** శర్యాతి యాగం చేయటానికి, కూతుర్నీ, అల్లుణ్ణీ ఆహ్వానించి తీసుకెళ్ళే ఉద్దేశంతో చ్యవనమహర్షి ఆశ్రమానికి వచ్చాడు. తన కుమార్తె ప్రక్కన సూర్యతేజస్సుతో ప్రకాశించే పురుషుణ్ణి చూచి తనలో 'వీడెవడో ఈమె భర్తకాదు, ఆశ్చర్యం!' అనుకొని కూతురిమాట, ఆమె చేసే గౌరవాలు ఇష్టపడక, ఆశీర్వదించటానికి అసహ్యపడి ఇట్లన్నాడు. చ్యవనమహర్షి గొప్పవాడు, మునిజనాల్లో శ్రేష్ఠుడు, లోకంచేత కీర్తింపబడేవాడు, ఎక్కడకు వెళ్ళాడు? ఆయన ఎలా మోసగించబడ్డాడు? నీ పక్కనున్న వీడెవడు?

**మ. తగవే? ధర్మమె? శీలమే? కులజవై దర్పించి మోదింప నా**
**జగదారాధ్యునిఁ బుణ్యశీలుఁ దపసిన్ సాధ్వీమనస్సమ్మతున్**
**మగనిన్ మాని భుజంగుఁ బొందఁదగునే మానంబు పాటింపఁగాఁ**
**దగదే! దుర్గతిఁ ద్రోచితే కఠినవై తండ్రిం బతిం గూఁతురా! 63**

**ప్రతి :** కూతురు+ఆ= బిడ్డా!; తగవు+ఏ= న్యాయమా? (ఈ పని); ధర్మము+ఎ= ధర్మమా?; శీలము+ఏ= నడవడియా?; కులజవు+ఐ= సత్కులసంజాతవై; దర్పించి= గర్వించి; మోదింపన్= సంతోషంకోసం; ఆ జగత్+ఆరాధ్యునిన్= లోకంచేత పూజింపబడే; పుణ్యశీలున్= పుణ్యాత్ముణ్ణి; తపసిన్= తపస్విని; సాధ్వీమనస్+సమ్మతున్= సాధ్వి మనస్సుకు నచ్చేవాడు అయిన; మగనిన్ మాని= భర్తను వదలి; భుజంగున్= విటుణ్ణి; పొందన్+తగున్+ఏ= పొందడం న్యాయమా? మానంబున్= స్త్రీ సహజమైన కోపం; పాటింపన్+కాన్+తగదు+ఏ!= పాటించనవసరం లేదా; కఠినవు+ఐ= కఠినమైన మనస్సుతో; తండ్రిన్+పతిన్= తండ్రిని, భర్తను; దుర్గతిన్+త్రోచితి(వి)+ఏ= నరకానికి తోసేశావు కదా!

**తా :** అమ్మాయీ! నీకీపని న్యాయమేనా? ధర్మమేనా? శీలవంతుల లక్షణమేనా? సత్కులంలో పుట్టి గర్వించి సంతోషం కోసం జగత్తుచే పూజింపబడేవాడు, పుణ్యాత్ముడు, తపస్వి, సాధ్వీమనసుకు నచ్చేవాడు అయిన భర్తను వదలి, విటుణ్ణి పొందడం న్యాయమా? అభిమానం పాటించనక్కరలేదా? తండ్రిని, భర్తను నరకానికి తోసేశావు కదా!

**ఆ. పద్మనయన! మగఁడు ప్రాయంపువాఁడైనఁ, గాపు పెట్టి కొంతఁ గావ నేర్చుఁ**
**గడఁగి ముసలితపసి గావంగ నేర్చునే, యువతి ముదుకఁ గూర్ప నొప్ప దెందు." 64**

**ప్రతి :** పద్మనయన= పద్మాల్లాంటి కన్నులు కలదానా; మగఁడు= భర్త; ప్రాయము+వాఁడు+ఐనన్= వయసులో ఉన్నవాడైతే; కాపున్+పెట్టి= రక్షణ కల్పించి; కొంతన్+కావన్+నేర్చున్= కొంతవరకైన కాపాడుకోగలడు; కడఁగి= ప్రయత్నించి అయినా; ముసలి తపసి= వృద్ధుడైన మహర్షి; కావన్+కన్+నేర్చున్+ఏ= కాపాడుకోగలడా?; ఎందున్= ఎక్కడకూడా; యువతిన్+ ముదుకన్= పడుచు పిల్లను ముసలివానికి; కూర్పన్+ఒప్పదు= కట్టబెట్టుట మంచిదికాదు.

**తా :** అమ్మాయీ! మగడు ప్రాయపువాడైతే కొంతవరకైనా భార్యను కాపాడుకోగలడు. ముసలిముని ప్రయత్నపూర్వకంగానైనా భార్యను అదుపులో ఉంచగలడా? ఎక్కడైనా పడుచు పిల్లను ముసలివానికి కట్టబెట్ట కూడదు.

**వ. అని పలికిన న ప్పరమపతివ్రతాలలామంబు చిఱునగవు చెక్కుటద్దంబులఁ జిడిముడిపడఁ దండ్రి కిట్లనియె. 65**

**ప్రతి :** అని పలికినన్= అని పలుకగా; ఆ+పరమ పతివ్రతాలలామంబు= పరమ పతివ్రతలలో శ్రేష్ఠురాలైన సుకన్య; చెక్కు+అద్దంబులన్= అద్దాల్లాంటి బుగ్గలపై; చిరునగవు= చిరునవ్వు; చిడిముడిపడన్= తొణికిసలాడుతుండగా; తండ్రికిన్= తన తండ్రితో, (శర్యాతితో); ఇట్లు+అనియెన్= ఇలా అనింది.

**తా :** పరమపతివ్రతాలలామ అయిన ఆ సుకన్యక చిరునవ్వు చెక్కిళ్లపై తొణికిసలాడుతుండగా తండ్రితో ఇలా అంది.

**క. 'ఇయ్యల్లుఁ డితఁడు భార్గవుఁ, డయ్యా! జారుండు గాఁడు హర్షముతోడన్**
**నెయ్యంబు నిల్పు' మంచును, దొయ్యలి సర్వంబు దండ్రితో వినిపించెన్. 66**

**ప్రతి :** అయ్యా!= తండ్రీ!; ఈ+అల్లుఁడు+ఇతఁడు= ఈ అల్లుడైన ఇతడు; భార్గవుఁడు= చ్యవనుడే; జారుండు+కాఁడు= విటుడుకాదు; హర్షముతోడన్= సంతోషంతో; నెయ్యంబున్ నిల్పుము= చుట్టరికంపాటించు; అంచున్= అనుచు; తొయ్యలి= యువతి (సుకన్యక); తండ్రితోన్= తండ్రికి; సర్వంబున్= సమస్తమైన వృత్తాంతాన్ని; వినిపించెన్= తెలియజెప్పింది.

**తా :** 'ఓ తండ్రీ! ఇతడు నీ అల్లుడైన భార్గవుడేకాని విటుడు కాదు. సంతోషంతో నీవు కూడ ఈయనతో చుట్టరికాన్ని పాటించుము' అని తండ్రికి జరిగినదంతా చెప్పింది.

**వ. అంత శర్యాతియు నప్రమత్తుండై కూఁతుం గౌఁగిలించుకొని గారవంబున' నయిదువవు గ'మ్మని దీవించె; నంత భార్యాసహితుండై చ్యవనుండు సని తన మామకు యాగంబు సేయించి యొక్క పాత్రంబున సోమభాగంబుఁ బట్టి నిజ తపోబలమున నశ్వినీదేవతల కిచ్చినం జూచి. 67**

**ప్రతి :** అంతన్= తరువాత; శర్యాతియున్; అప్రమత్తుండు+ఐ= జాగరూకుడై; కూఁతున్= కుమార్తెను; కౌగిలించుకొని= ఆలింగనం చేసుకొని; గారవంబునన్= ఆదరంతో; అయిదువవు= సౌభాగ్యవతివి; కమ్ము+అని; దీవించెన్= దీవించాడు; అంతన్= అటు పిమ్మట; భార్యాసహితుండు+ఐ= భార్యతోకూడినవాడై; చ్యవనుండు; చని= వెళ్ళి; తన మామకున్= తన మామకు, (శర్యాతికి); యాగంబు+చేయించి= యాగం చేయించి; ఒక్క పాత్రంబునన్= ఒక పాత్రలో; సోమభాగంబున్= సోమరసభాగాన్ని; పట్టి= పోసి; నిజ తపస్+బలమునన్= తన తపశ్శక్తిచేత; అశ్వినీ దేవతలకున్= అశ్వినీదేవతలకు; ఇచ్చినన్+చూచి= ఇవ్వగా చూచి...

**తా :** శర్యాతి సంతోషంతో కూతురిని చేరదీసి ఆదరంతో 'సౌభాగ్యవతివి కమ్మ'ని దీవించాడు. అప్పుడు చ్యవనుడు భార్యతో పాటు వెళ్ళి 'మామకు యాగం చేయించి, ఒక పాత్రలో సోమరసాన్ని పోసి' తన తపశ్శక్తితో అశ్వినీ దేవతలకిచ్చాడు. దాన్ని చూచి

**విశే :** 1. మాంగల్యం 2. పసుపు కుంకుమ 3. గాజులు 4. చెవ్వాకు 5. మెట్టెలు. ఈ అయిదు వస్తువులు ముత్తైదువ మాత్రమే ధరిస్తుంది. అందుకనే ఆమెను అయిదువ అంటారు.

**క. కోపముతోడుత వాసవుఁ, దేపున మునిపైని వజ్రమెత్తిన మరలం**
**దాపసుఁడు వజ్రిభుజమున, నా పవి నిలిపెన్ జగంబు లాశ్చర్యపడన్. 68**

**ప్రతి :** కోపముతోడుతన్= కోపంతో; వాసవుఁడు= దేవేంద్రుడు; ఏపునన్= గర్వంతో విజృంభణంతో; మునిపైని= మునిపైకి; వజ్రము+ఎత్తినన్= వజ్రాయుధం ప్రయోగించటానికి ఎత్తగా; జగంబులు= లోకాలు; ఆశ్చర్యపడన్= ఆశ్చర్యపడేటట్లు; మరలన్= మరల; తాపసుఁడు= ఆ ముని; ఆ పవిన్= ఆ వజ్రాయుధాన్ని; వజ్రిభుజమునన్= ఇంద్రుని భుజంమీదే; నిలిపెన్= నిలబెట్టాడు.

**తా :** దేవేంద్రుడు కోపంతో మునిపైకి వజ్రాయుధమెత్తగా ఆశ్చర్యకరంగా ముని దాన్ని అతని భుజం మీదే కదలకుండా నిలబెట్టాడు.

**వ. ఇవ్విధంబున నశ్వినీదేవతలిద్దఱు దేవతావైద్యులై సోమభాగంబు లేని వారయ్యుఁ జ్యవనుసామర్థ్యంబునఁ బ్రాప్తభాగు లయి చనిరి; శర్యాతికి నుత్తానబర్హియు, నానర్తుండును, భూరిషేణుండు నను మువ్వురుకొడుకులు గలిగి; రందు. 69**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ విధంగా; అశ్వినీ దేవతలు+ఇద్దఱు= అశ్వినీ దేవతలు ఇరువురు; దేవతా వైద్యులు+ఐ= దేవతలకు వైద్యులై; సోమభాగంబు= సోమభాగం; లేనివారు+అయ్యున్= పొందలేనివారై కూడా; చ్యవనుసామర్థ్యంబునన్= చ్యవనుని ప్రభావంచేత; ప్రాప్తభాగులు+అయి+చనిరి= భాగాన్ని పొంది వెళ్ళారు; శర్యాతికిన్= శర్యాతికి; ఉత్తానబర్హియున్= ఉత్తానబర్హియును; ఆనర్తుండును= ఆనర్తుడు; భూరిషేణుండు+అను= భూరిషేణుడను; ముగ్గురు కొడుకులున్ కలిగిరి= ముగ్గురుకొడుకులు పుట్టారు; అందున్= వారిలో...

**తా :** ఈ విధంగా అశ్వనీ దేవతలు దేవతావైద్యులైకూడా సోమభాగం లేనివారైనా, చ్యవన మహర్షి ప్రభావంవల్ల యజ్ఞభాగం పొందగలిగి వెళ్ళారు. శర్యాతికి ఉత్తానబర్హి, ఆనర్తుడు, భూరిషేణుడు అనే ముగ్గురు కొడుకులు కలిగారు. వారిలో

**సీ. ఆనర్తునకు రైవతాహ్వయుం డుదయించె నతఁడు కుశస్థలి యను పురంబు**
**నీరధిలోపల నిర్మించి పెంపుతో, నానర్తముఖవిషయంబు లేలెఁ;**
**గనియెఁ గకుద్మిముఖ్యంబైన నందనశతము; రైవతుఁడు విశాలయశుఁడు**
**దన కూఁతు రేవతి ధాతముందటఁ బెట్టి, తగు వరు నడిగెడి తలఁపుతోడఁ**

**తే. గన్యఁ దోడ్కొని బ్రహ్మలోకమున కేఁగి, యచట గంధర్వకిన్నరు లజునిమ్రోల**
**నాటపాటలు సలుపఁగ నవసరంబు, గాక నిలుచుండె నతఁ డొక్కక్షణముతడవు. 70**

**ప్రతి :** ఆనర్తునకున్= ఆనర్తుడనేవానికి; రైవత+ఆహ్వయుండు= రైవతుడనే పేరుగలవాడు; ఉదయించెన్= జన్మించాడు; అతఁడు= రైవతుడు; కుశస్థలి+అనుపురంబున్= కుశస్థలి అనేపేరుగల నగరాన్ని; నీరధి లోపలన్= సముద్రంలోపల; నిర్మించి= కట్టి; పెంపుతోన్= ఆధిక్యంతో; ఆనర్తముఖ విషయంబులు+ఏలెన్= ఆనర్తము మొదలైన దేశాలను పాలించాడు; కకుద్మిముఖ్యంబు+ఐన= కకుద్మివంటి శ్రేష్ఠులైన; నందనశతము= వందమంది కొడుకుల్ని; కనియెన్= పొందాడు; విశాల

యశుఁడు= విస్తారమైన కీర్తిగల; రైవతుఁడు= రైవతుడు; తనకూఁతున్= తన కుమార్తె అయిన; రేవతిన్= రేవతిని; ధాత ముందటన్+పెట్టి= బ్రహ్మముందు నిలిపి; తగు వరున్+అడిగెడి= ఆమెకు తగిన భర్తను అడిగే; తలఁపుతోడన్= ఉద్దేశంతో; కన్యన్= కన్యను (రేవతిని); తోడ్కొని= తీసుకొని; బ్రహ్మలోకమునకున్+ఏఁగి= బ్రహ్మలోకానికి వెళ్ళి; అచటన్= అక్కడ; గంధర్వకిన్నరులు= గంధర్వులు కిన్నరులనేవారు; అజుని మ్రోలన్= బ్రహ్మముందు; ఆటపాటలు+చలుపన్+కన్= ఆటపాటలు సలుపుతుండగా; అవసరంబు+కాక= సమయం కాకపోవుటచే; అతఁడు= రైవతుడు; ఒక్క క్షణముతడవు= ఒక క్షణం; నిలుచుండెన్= నిలబడ్డాడు.

**తా :** వారిలో ఆనర్తుడికి రైవతుడు పుట్టాడు. అతడు సముద్రంలో కుశస్థలి అనే పట్టణాన్ని నిర్మించి, ఆనర్తము మొదలైన దేశాలను పెంపుతో పాలించాడు. అతడు కకుద్మివంటి శ్రేష్ఠులైన వందమంది కొడుకుల్ని కన్నాడు. కీర్తిమంతుడైన రైవతుడు తన కుమార్తె రేవతిని బ్రహ్మకు చూపించి తగిన వరుణ్ణి అడగాలనుకొని బ్రహ్మలోకానికి వెళ్ళాడు. అప్పుడు బ్రహ్మకొలువులో గంధర్వులు కిన్నరులు ఆడుతూ పాడుతూ ఉండడంవల్ల దర్శించే సమయంకోసం ఒక్క క్షణంపాటు నిలబడ్డాడు.

**వ. అంత నవసరంబైన నజునికి నమస్కరించి రైవతుండు రేవతిఁ జూపి యిట్లనియె. 71**

**ప్రతి :** అంతన్= అటు పిమ్మట; అవసరంబు+ఐన= (దర్శించే) సమయంరాగా; అజునికిన్= బ్రహ్మకు; నమస్కరించి; రైవతుండు; రేవతిన్+చూపి= రేవతిని చూపించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అంతట దర్శించే సమయం కలుగగా, బ్రహ్మకు నమస్కరించి రైవతుడు రేవతిని చూపించి ఇట్లా అన్నాడు.

**ఆ. చాల ముద్దరాలు జవరాలు గొమరాలు, నీ శుభాత్మురాలి కెవ్వఁ డొక్కొ**
**మగఁడు? సెప్పు' మనిన మదిఁ జూచి పకపక, నవ్వి భూమిపతికి నలువ పలికె. 72**

**ప్రతి :** చాల ముద్ద+ఆలు= ఎంతో అమాయకురాలు; జవ+ఆలు= ప్రాయంలో ఉన్నది; కొమరు+ఆలు= సౌందర్యవతి (అయిన); ఈ శుభ+ఆత్మురాలికిన్= ఈ మంచి అమ్మాయికి; మగఁడు= భర్త; ఎవ్వఁడు+ఒక్కొ= ఎవడో?; చెప్పుము+అనినన్= చెప్పండి అనగా; మదిన్+చూచి= మనోదృష్టితో పరికించి; పక పక నవ్వి= గట్టిగా నవ్వి; నలువ= బ్రహ్మ; భూమిపతికిన్= రాజుతో, (రైవతునితో); పలికెన్= అన్నాడు.

**తా :** అమాయకురాలు, అందకత్తె, ప్రాయంలో ఉన్న ఈ మంచి మనస్సున్న అమ్మాయికి భర్తఎవడో? సెలవివ్వండి అన్నాడు రైవతుడు. బ్రహ్మ మనోదృష్టితో పరికించి పక పక నవ్వి ఇలా అన్నాడు.

**సీ. 'మనుజేశ! దీనికై మదిలోనఁ దలఁచిన, వార లెల్లరు గాల వశతఁ జనిరి;**
**వారల బిడ్డల వారల మనుమల, వారల గోత్రంబువారినైన**
**వినము మేదినిమీఁద; వినుము నీ వచ్చిన యాలోన నిరువదియేడు మాఱు**
**లొండొండ నాలుగుయుగములుఁ జనియె; నీ వటు గాన ధరణికి నరుగు మిపుడు**

**తే. దేవదేవుండు హరి బలదేవుఁ డనఁగ, భూమిభారంబు మాన్పంగఁ బుట్టినాఁడు;**
**సకలభూతాత్మకుఁడు నిజాంశంబుతోడ, యువతిమణి నిమ్ము జనమణి కున్నతాత్మ! 73**

**ప్రతి :** మనుజ+ఈశ= రాజా!; దీనికి+ఐ= ఈమెకోసం; మదిలోనన్+తలఁచినవారలు= మనసులో భావించుకొన్నవారు; ఎల్లరు= అందరు; కాలవశతన్+చనిరి= కాలంతో పాటు పోయారు; వారల బిడ్డల= ఆ వెళ్ళినవారి బిడ్డలనుగూర్చి;

వారలమనుమల= వారి మనుమలను గూర్చి; వారల గోత్రంబువారిని+ఐన= వారి గోత్రీకులను గూర్చి అయినా; మేదిని మీఁదన్= భూమిమీద; వినము= తెలిసికోలేము; వినుము= విను; నీవచ్చిన= నీవు వచ్చిన; ఈ లోనన్= ఈ సమయంలోనే; ఇరువది యేడుమాఱులు= ఇరవై ఏడుసార్లు; ఒండు+ఒండు+అ= ఒకదాని వెంబడి ఒకటి; నాలుగు యుగములు+చనియెన్= నాలుగుయుగాలు గడిచిపోయాయి; అటున్+కాన= అట్లాజరిగింది కాబట్టి; నీవు, ఇప్పుడు; ధరణికిన్+అరుగుము= భూలోకానికి వెళ్ళు; సకలభూత+ఆత్మకుఁడు= సమస్తభూతాలకు ఆత్మయైనవాడు; దేవదేవుండు హరి= దేవదేవుడైన నారాయణుడు; బలదేవుఁడు+అనఁగన్= బలదేవుడనే పేరుతో; భూమిభారంబు= భూభారాన్ని; మాన్పంగన్= పోగొట్టటానికి; నిజ+అంశంబుతోడన్= తన అంశతో; పుట్టినాఁడు= అవతరించాడు; ఉన్నత+ఆత్మ= గొప్ప హృదయంకలవాడా!; జనమణికిన్= ఆ పురుషోత్తమునికి; యువతి మణిన్+ఇమ్ము= ఈ కన్యారత్నాన్ని ఇవ్వు.

**తా :** 'ఓ రాజా! ఈమె కోసం మనసులో భావించిన వాళ్ళందరూ కాలంతోపాటు చెల్లిపోయారు. ఇప్పుడు వాళ్ళకొడుకులు, మనుమలు ఎవ్వరూ లేరు; గతించారు. భూమిమీద వాళ్ల గోత్రాలపేర్లు కూడ వినబడవు. నీవు వచ్చిన ఈ లోపలే ఇరవై ఏడు పర్యాయాలు నాలుగుయుగాలు వరుసగా గడచిపోయాయి. కాబట్టి నీవిపుడే భూలోకానికి వెళ్లు. దేవదేవుడు సర్వభూతాత్మకుడు అయిన నారాయణుడు భూభారాన్ని పోగొట్టడానికి తన అంశతో బలరాముడుగా అవతరించాడు. నీవు ఈ కన్యారత్నాన్ని ఆయన కివ్వు' అని అన్నాడు.

**విశే :** బ్రహ్మలోకంలో ఒక్క క్షణకాలం – భూలోకంలో ఇరవైఏడు మహాయుగాలు గడచిన దానితో సమానం.

**వ. అని యానతిచ్చిన బ్రహ్మకు నమస్కరించి భూలోకంబునకుఁ జనుదెంచి సోదరస్వజన హీనంబగు తన నగరంబున కారాజు వచ్చి బలభద్రుం గాంచి రేవతీకన్య నతని కిచ్చి నారాయణాశ్రమంబగు బదరికావనంబునకు నియమంబునఁ దపంబు సేయం జనియె. 74**

**ప్రతి :** అని+ఆనతి+ఇచ్చిన= అని ఆజ్ఞాపించిన; బ్రహ్మకున్+నమస్కరించి= బ్రహ్మ దేవునికి నమస్కారంచేసి; భూలోకంబునకున్+చనుదెంచి= భూలోకానికి వచ్చి; సోదరస్వజనహీనంబగు= సోదరులు, తనవారులేని; తన నగరంబునకున్= తన నగరానికి; ఆ రాజు వచ్చి= ఆ రాజు విచ్చేసి; బలభద్రున్+కాంచి= బలదేవుణ్ణి చూచి; రేవతీకన్యన్+ అతనికిన్+ఇచ్చి= రేవతీ కన్యను ఆయనకిచ్చి; నారాయణ+ఆశ్రమంబు+అగు= నారాయణుని ఆశ్రమమైన; బదరికావనంబునకున్= బదరికావనానికి; నియమంబునన్+తపంబు+చేయన్= నియమంతో తపస్సు చేయటానికి; చనియెన్= వెళ్లాడు.

**తా :** ఇట్లా ఆనతియ్యగా బ్రహ్మకు రైవతుడు నమస్కరించి భూలోకానికి వచ్చాడు. ఆయన తనసోదరులు, స్వజనులులేని తన నగరానికి వచ్చాడు. బలదేవుని చూచి రేవతీకన్యను అయనకిచ్చి పెళ్ళిచేసి నారాయణుని ఆశ్రమముండే బదరికావనానికి నియమబద్ధమైన తపస్సు చేయటం కోసం వెళ్ళాడు.

**క. నభగుఁ డను మనుజపతికిని శుభమతి, నాభాగుఁ డనఁగ సుతుఁ డుదయించెం<br>బ్రభులై మనియెడు తలఁపున, విభజించిరి భ్రాత లతనివిత్తము నధిపా! 75**

**ప్రతి :** అధిపా!= ఓ రాజా (పరీక్షిత్తు); నభగుఁడు+అను= నభగుడనే (మనువుకొడుకు); మనుజపతికినిన్= రాజుకు; శుభమతి= బుద్ధిమంతుడైన; నాభాగుఁడు+అనఁగన్= నా భాగుడనే పేరుగల; సుతుఁడు+ఉదయించెన్= కొడుకు పుట్టాడు;

భ్రాతలు= సోదరులు; ప్రభులు+ఐ= యజమానులై; మనియెడు తలంపునన్= జీవించే ఉద్దేశంతో; అతనివిత్తమున్= అతని ఆస్తిని; విభజించిరి= పంచుకొన్నారు.

**తా :** ఓ రాజా! నభగుడనే మనువుకు బుద్ధిమంతుడైన నాభాగుడు జన్మించాడు. అతని సోదరులు యజమానులుగా జీవించడంకోసం నాభాగుని ఆస్తిని పంచుకొన్నారు.

**వ. అంత నాభాగుండును బ్రహ్మచారియై తన తోడంబుట్టువులను ధనంబుల పాలడగిన వారలు' దండ్రి చెప్పిన క్రమంబున నిచ్చెద' మనిన నాభాగుండు తండ్రియగు నభగు కడకుం జని' విభాగంబు సేయు'మని పలికిన నతం 'డిందు నంగిరసులు మేధ గలవార లయ్యును సత్త్రయాగంబు సేయుచు నాఱవదినంబున నర్హకర్మంబులు దోఁపక మూఢు లయ్యెదరు; వారలకు నీవు వైశ్వదేవసూక్తంబులు రెండెఱింగించినఁ గవి యనం బ్రసిద్ధి కెక్కెదవు; దానంజేసి వారు కృతకృత్యులై స్వర్గంబునకుఁ బోవుచు, సత్త్ర పరిశేషితంబైన ధనంబు నీ కిచ్చెద' రని పలికినం దండ్రి వీడ్కొని నాభాగుండు సని యట్టు సేసిన నంగిరసులు సత్త్రపరిశేషితధనంబు లతని కిచ్చి నాకంబునకుం జని రంత. 76**

**ప్రతి :** అంతన్= అపుడు; నాభాగుండును= నాభాగుడు; బ్రహ్మచారి+ఐ= బ్రహ్మచర్యాన్ని పొంది; తనతోడన్+పుట్టువులను= తన సోదరులను; ధనంబులపాలు+అడిగినన్= ఆస్తిలో భాగమడుగగా; వారలున్= వారు; తండ్రి చెప్పిన క్రమంబునన్= నాన్న చెప్పిన విధంగా; ఇచ్చెదము+అనినన్= ఇస్తాము అనగా; నాభాగుండు= నాభాగుడు; తండ్రి+అగు= తండ్రియైన; నభగు కడకున్+చని= నభగుని దగ్గరకు వెళ్ళి; విభాగంబు+చేయుము+అని= ఆస్తిని భాగాలుగా చేయవలసిందని; పలికినన్= అడుగగా; అతఁడు= నభగుడు; ఇందున్= ఇందులో; అంగిరసులు= అంగిరసులనేవాళ్లు; మేధ+కలవారలు= జ్ఞానవంతులు; అయ్యును= అయి ఉండికూడా; సత్రయాగంబు+చేయుచున్= సత్రయాగంచేస్తూ; ఆఱవదినంబునన్= ఆరో రోజున; అర్హకర్మంబులున్+తోఁపక= చేయవలసిన విధులు తెలియక; మూఢులు+అయ్యెదరు= అజ్ఞానులవుతారు; వారలకున్= వారికి; నీవు; వైశ్వదేవసూక్తంబులు= వైశ్వదేవసూక్తాలను; రెండు+ఎఱింగించినన్= రెండు తెల్పినట్లైతే; కవి+అనన్= కవి అనేపేరుతో; ప్రసిద్ధికిన్+ఎక్కెదవు= ప్రసిద్ధిని పొందుతావు; దానన్+చేసి= అందువలన; వారు= అంగిరసులు; కృతకృత్యులు+ఐ= కృతార్థులై; స్వర్గంబునకున్+పోవుచున్= స్వర్గానికి పోతూ; సత్త్ర పరిశేషితంబు+ఐన= యాగంలో మిగిలి పోయిన; ధనంబు= ధనాన్ని; నీకున్+ఇచ్చెదరు+అని పలికినన్= నీకిస్తారని చెప్పగా; తండ్రిన్+వీడ్కొని= తండ్రి దగ్గర సెలవుతీసుకొని; నాభాగుండు+చని= నాభాగుడు వెళ్లి; అట్లు చేసినన్= అట్లే చేయగా; అంగిరసులు= అంగిరసులనేవారు; సత్త్రపరిశేషిత ధనంబులు= యాగమునందు మిగిలిన సంపదలను; అతనికిన్+ఇచ్చి= నాభాగునికిచ్చి; నాకంబునకున్+చనిరి= స్వర్గానికి వెళ్లారు; అంతన్= అపుడు...

**తా :** బ్రహ్మచారియైన నాభాగుడు తనసోదరులను తండ్రిఆస్తిలో భాగమడిగాడు. వారు తండ్రి చెప్పేపద్ధతిలో ఇస్తామన్నారు. నాభాగుడు తండ్రి దగ్గరకు వెళ్ళి సంపదను భాగాలు చేయమన్నాడు. అపుడు తండ్రి "ఇక్కడ దగ్గరలో అంగిరసులు సత్త్రయాగం చేస్తున్నారు. వారు గొప్పజ్ఞానులే అయినా ఆరవరోజు యాగంలో చేయవలసిన కర్మకాండ మనసుకు రాక మూఢులవుతారు. అపుడు నీవు వారిదగ్గరకువెళ్ళి వైశ్యదేవసూక్తాలను రెండింటిని చెప్తే కవి అని అందరూ అంటారు. యాగం పూర్తియై వారు స్వర్గానికి వెళ్తూ యాగంలో మిగిలిన సంపదనంతా నీకిస్తారు" అని చెప్పాడు. నాభాగుడు తండ్రి దగ్గర సెలవు తీసుకొని ఆయన చెప్పినట్లు చేశాడు. అంగిరసులు యాగంలో మిగిలిన ధనాన్ని నాభాగునికిచ్చి స్వర్గానికి వెళ్ళారు. అపుడు

**క. అంగిరసు లిచ్చు పసిఁడికి, మంగళమతిఁ జేరు నృపుని మానిచి యొకఁ డు**
**త్తుంగుఁడు గృష్ణాంగుఁడు దగ, ముంగల నిలుచుండి విత్తముం జేకొనియెన్. 77**

**ప్రతి :** అంగిరసులు+ఇచ్చు= అంగిరసులు ఇచ్చే; పసిఁడికి= బంగారానికి; మంగళమతిన్+చేరు= మంచి మనసుతో చేరే; నృపుని= రాజును; ఉత్తుంగుఁడు= ఎత్తైనవాడు; కృష్ణ+అంగుఁడు= నల్లనివాడు; ఒకడు= ఒక వ్యక్తి; తగన్= తగినట్లు; ముంగలన్+నిలుచుండి= ఎదురుగా నిలబడి; విత్తమున్+చేకొనియెన్= ఆ ద్రవ్యాన్ని తీసుకున్నాడు.

**తా :** అంగిరసులిచ్చే బంగారం నాభాగునికి శుభప్రదంగా చేరే సమయంలో, పొడగరి, నల్లనివాడు అయిన ఒకడు రాజును ఆపి ముందు నిలబడి దాన్ని తీసుకొన్నాడు.

**వ. వానిం జూచి నాభాగుండు దనకు మును లిచ్చుటంజేసి తన ధనం బని పలికిన, నమ్మహాపురుషుండు 'మీ తండ్రి సెప్పిన క్రమంబ కర్తవ్యం' బనిన నాభాగుండు నభగు నడిగిన, నతండు యజ్ఞమందిరగతంబై 'యుచ్ఛిష్టంబగు ధనంబుఁ దొల్లి మహామునులు రుద్రున కిచ్చి; రది కారణంబుగా నా దేవుండు సర్వధనంబులకు నర్హుం' డనిన విని, వచ్చి నాభాగుండు మహాదేవునకు నమస్కరించి 'దేవా! యీ ధనంబు నీ యధీనం' బని మా తండ్రి సెప్పె, నే నపరాధంబు సేసితి; సహింపు' మనవుడు భక్త వత్సలుండగు న మ్మహాపురుషుండు నభగు సత్యవచనంబునకు, నాభాగుని నిజంబునకు మెచ్చి'నీవు దప్పక పలికితివి కావున, సత్త్రపరిశేషితంబగు ధనంబు నీకు నిచ్చితి' నని పలికి యంతర్దర్శిత్వంబును, సనాతనంబగు బ్రహ్మజ్ఞానంబు నుపదేశించి తిరోహితుండయ్యె; నివ్విధంబున. 78**

**ప్రతి :** వానిన్+చూచి= ధనం తీసుకున్నవాడిని చూచి; నాభాగుండు= నాభాగుడు; తనకున్= తనకు; మునులు+ ఇచ్చుటన్+చేసి= మునులివ్వడంవల్ల; తనధనంబు+అని= తన ధనమని; పలికినన్= పలుకగా; ఆ+మహా పురుషుఁడు= ఆ వ్యక్తి; మీ తండ్రి+చెప్పినక్రమంబు+అ= మీ తండ్రి చెప్పిన విధమే; కర్తవ్యంబు+అనినన్= చేయదగింది అనగా; నాభాగుండు= నాభాగుడు; నభగున్+అడిగినన్= నభగుని (తండ్రిని) అడగ్గా; అతండు= ఆయన; యజ్ఞమందిర గతంబు+ఐ= యాగశాలలో నుండి; ఉచ్ఛిష్టంబు+అగు ధనంబున్= ఉపయోగించగా మిగిలిన ధనం; తొల్లి= పూర్వం; మహామునులు= మహర్షులు; రుద్రునకున్+ఇచ్చిరి= శివునికి ఇచ్చారు; అది కారణంబు+కాన్= ఆ కారణంచేత; ఆ దేవుండు= ఆ శివమూర్తి; సర్వధనంబులకున్+అర్హుండు= అన్ని ధనాలకు హక్కుదారుడు; అనినన్+వినివచ్చి= అని చెప్పగా విని వచ్చి; నాభాగుండు= నాభాగుడు; మహాదేవునకున్= శివునకు; నమస్కరించి; దేవా!= స్వామీ!; ఈ ధనంబు= ఈ సొమ్ము; నీ+అధీనంబు+అని= నీకు చెందుతుంది అని; మా తండ్రి+చెప్పెన్= మా నాన్న చెప్పాడు; నేను+అపరాధంబు+చేసితి= నేను తప్పుచేశాను; సహింపుము= క్షమించు; అనవుడు= అని అనగా; భక్తవత్సలుండు+అగు= భక్తులయందు ప్రేమగల; ఆ+మహాపురుషుండు= ఆ దివ్యపురుషుడు; నభగు సత్యవచనంబునకున్= నభగుని నిజమైన మాటకు; నాభాగుని నిజంబునకున్= నాభాగుని చక్కని ప్రవర్తనకు; మెచ్చి= ప్రశంసించి; నీవు+తప్పక పలికితివి= నీవు నిజమే చెప్పావు; కావునన్= కాబట్టి; సత్త్రపరిశేషితంబు+అగు= యాగంలో మిగిలిన; ధనంబున్= సొమ్మును; నీకున్+ఇచ్చితిన్= నీకిస్తున్నాను; అనిపలికి= అని అంటూ; అంతర్+దర్శిత్వంబును= ఆత్మదర్శనాన్ని; సనాతనంబు+అగు= ప్రాచీనమైన; బ్రహ్మజ్ఞానంబును= బ్రహ్మజ్ఞానాన్ని; ఉపదేశించి= బోధించి; తిరోహితుండు+అయ్యెన్= అంతర్ధానం అయినాడు; ఈ+విధంబునన్= ఈ విధంగా;

**తా :** నాభాగుడు వాణ్ణి చూచి మునులు ఇవ్వడంవల్ల అది తనకు చెందవలసిన ధనమని చెప్పాడు. అప్పుడు ఆ మహాపురుషుడు "మీ తండ్రి చెప్పిన రీతిగా చేయడమే తగి ఉంటుంది" అన్నాడు. నాభాగుడు తండ్రిని అడగ్గా అతడు "పూర్వం ఋషులు యజ్ఞశాలలో మిగిలినధనం శివునకే చెందుతుందని తీర్మానించారు. కాబట్టి ఈ ధనానికి ఆ దేవుడే అర్హుడు. అని చెప్పాడు. అప్పుడు నాభాగుడు రుద్రునికి నమస్కరించి 'ఓ దేవా! ఈ ధనం నీకే చెందుతుందని మా తండ్రి చెప్పాడు. నేను దోషం చేశాను. మన్నించండి' అన్నాడు. ఆ దేవుడు తండ్రితీర్పునకు, కొడుకునిజాయితికి మెచ్చుకొని నీవు నిజమే పలికావు. కాబట్టి యాగంలో మిగిలిన ద్రవ్యం నీకే ఇస్తున్నాను' అని నాభాగునికి ఆత్మదర్శనాన్ని, సనాతన బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించి అంతర్ధానం చెందాడు.

**క. భువిలో నాభాగునికథ, దవిలి మతిన్ రేపు మాపుఁదలఁచిన మాత్రం**
**గవి యగు; మంత్రజ్ఞుం డగుఁ, బ్రవిమలగతిఁ బొందు నరుఁడు భద్రాత్మకుఁడై. 79**

**ప్రతి :** భువిలోన్= ఈ లోకంలో; నాభాగుని కథన్= నాభాగుని కథను; తవిలి= ప్రయత్నించి; మతిన్= చిత్తంలో; రేపున్ మాపున్+తలఁచిన మాత్రన్= ఎల్లప్పుడు స్మరించినంతనే; నరుఁడు= మానవుడు; కవి+అగున్= కవి అవుతాడు; మంత్రజ్ఞుండు+అగున్= ఆలోచన తెలిసిన వాడవుతాడు; భద్ర+ఆత్మకుఁడు+ఐ= శుభప్రదమైన మనసుగలవాడై; ప్రవిమల గతిన్+పొందున్= సద్గతిని పొందుతాడు.

**తా :** లోకంలో నాభాగుని కథను ఉదయం సాయంత్రం వేళలలో చిత్తశుద్ధితో స్మరించినంతనే నరుడు పండితుడవుతాడు, మంత్రజ్ఞుడవుతాడు. మోక్షాన్ని పొందుతాడు.

**వ. అంత నాభాగునకు నంబరీషుండు జనియించె; నతనియందు జగదప్రతిహతంబైన బ్రాహ్మణశాపంబు నిరర్థకం బయ్యె ననిన విని యేమి కారణంబున దురంతంబైన బ్రహ్మదండంబువలన నతండు విడువం బడియె ననిన నప్పుడమితేనికి శుకుం డిట్లనియె. 80**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట; నాభాగునకున్= నాభాగునికి (పరమశివునిచేత ఆత్మదర్శనజ్ఞానాన్ని పొందినవాడు); అంబరీషుండు= అంబరీషుడు; జనియించెన్= పుట్టాడు; అతని+అందున్= అతని విషయంలో; జగత్+అప్రతిహతంబు+ఐన= ప్రపంచంలో తిరుగులేనిదైన; బ్రాహ్మణశాపంబు= బ్రహ్మణునిశాపం; నిరర్థకంబు+అయ్యెన్= వ్యర్థమైపోయింది; అనినన్+ విని= అని చెప్పగా విని; ఏమి కారణంబునన్= ఏ కారణంచేత; దురంతంబు+ఐన= అంతంలేనిదైన; బ్రహ్మదండంబువలనన్= బ్రాహ్మణ శిక్షనుండి; అతండు= ఆ అంబరీషుడు; విడువన్+పడియెన్= తప్పించుకో గలిగాడు; అనినన్= అని అడగ్గా; ఆ పుడమితేనికిన్= ఆ రాజుకు; శుకుండు+ఇట్లు+అనియెన్= శుకమహర్షి ఇలా అన్నాడు.

**తా :** అట్టి నాభాగునికి అంబరీషుడు జన్మించాడు. ఆతనిపట్ల లోకంలో ఎదురులేని బ్రాహ్మణశాపం వ్యర్థమైపోయింది. అని శుకుడు చెప్పగా "ఏ కారణంచేత జవదాటరాని బ్రాహ్మణదండన అతణ్ణి ఏమీ చేయలేక పోయింది?" అని రాజు అడిగాడు. అప్పుడు శుకుడు రాజుతో ఇలా అన్నాడు.

**విశే :** నాభాగుని ఉదాత్త వృత్తాంతం చెప్పడం వెనుక ఉన్న కారణం మహాభక్త శిఖామణియైన అంబరీషుని భక్తితత్త్వానికి వేదిక నిర్మించటమే.

## ❖ అంబరీషోపాఖ్యానము ❖

**శా. సప్తద్వీపవిశాలభూభరము దోఃస్తంభంబునం బూని సం**
**ప్రాప్తశ్రీయుతుఁడై మహీవిభవసంపచ్చాతురిం గల్గి దు**
**ర్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనల మేరం గాలముం బుచ్చుచున్**
**సుప్తిం బొందక యొప్పె సద్గుణగరిష్ఠుం డంబరీషుండిలన్. 81**

**ప్రతి :** సత్+గుణ గరిష్ఠుడు+అగు= సద్గుణాలతో విశిష్టుడైన; అంబరీషుండు= అంబరీషుడు; సప్తద్వీప విశాలభూభరమున్= ఏడు ద్వీపాలతో కూడిన విశాలమైన భూభారాన్ని; దోస్+స్తంభమునన్+పూని= భుజస్తంభాలపై ధరించి; సంప్రాప్త= ప్రాప్తించిన; శ్రీయుతుఁడు+ఐ= సంపదతో కూడినవాడై; మహీవిభవ= రాజ్యవైభవంవల్ల; సంపత్+చాతురిన్+కల్గి= సంపదయొక్క ఆధిక్యం కలిగికూడా; దుర్+వ్యాప్తిన్+చెందక= చెడునడతకు లోనుగాక; వైష్ణవ+అర్చనల మేరన్= విష్ణుపూజల ఏర్పాటుతో; కాలమున్+పుచ్చుచున్= పొద్దు గడపుతూ; సుప్తిన్+పొందక= ఏమరుపాటు లేకుండా; ఒప్పెన్= ప్రసిద్ధిపొందాడు.

**తా :** సద్గుణవిశిష్టుడైన అంబరీషుడు ఏడుదీవులతో కూడిన విశాలభూభారాన్ని తన భుజస్తంభాలపై మోసి శుభప్రాప్తితో రాజ్యవైభవ సంపద కలిగి కూడా చెడునడత లేకుండా నిత్యం విష్ణుపూజలతో కాలం గడపుతూ ఏమరుపాటు లేకుండా ఈ లోకంలో ప్రసిద్ధిని పొందాడు.

**సీ. చిత్తంబు మధురిపుశ్రీపాదములయంద; పలుకులు హరిగుణపఠనమంద;**
**కరములు విష్ణుమందిరమార్జనములంద; శ్రవములు హరికథాశ్రవణమంద;**
**చూపులు గోవిందరూపవీక్షణమంద; శిరము గేశవనమస్కృతులయంద;**
**పదము లీశ్వరగేహపరిసర్పణములంద; కామంబు చక్రికైంకర్యమంద;**

**తే. సంగ మచ్యుతజనతనుసంగమంద, ఘ్రాణ మసురారిభక్తాంఘ్రికమలమంద;**
**రసన దులసిదళములంద; రతులు పుణ్య, సంగతులయంద యా రాజచంద్రమునకు. 82**

**ప్రతి :** ఆ రాజచంద్రమునకున్= ఆ రాజ చంద్రునికి; చిత్తంబు= మనస్సు; మధురిపు= మధురాక్షసునికి శత్రువైన విష్ణువుయొక్క; శ్రీపాదముల+అందున్+అ= శుభకరమైన పదములందే; పలుకులు= మాటలు; హరిగుణ= విష్ణువుయొక్క గుణముల; పఠనము+అందున్+అ= కీర్తనయందే; కరములు= చేతులు; విష్ణుమందిర= విష్ణువుయొక్క మందిరాన్ని; మార్జనముల+అందున్+అ= శుభ్ర పరచడమందే; శ్రవములు= చెవులు; హరికథాశ్రవణము+అందున్+అ= హరికథలను వినడమందే; చూపులు; గోవింద= విష్ణువుయొక్క; రూపవీక్షణము+అందున్+అ= రూపాన్ని చూడడమందే; శిరము= తల; కేశవ= విష్ణువుకు; నమస్కృతులు+అందున్+అ= నమస్కరించడమందే; పదములు= కాళ్లు; ఈశ్వరగేహ= విష్ణువుయొక్క ఆలయాన్ని; పరిసర్పణములు+అందున్+అ= చుట్టి రావడమందే; కామంబు= ఆసక్తి; చక్రి కైంకర్యము+అందున్+అ= హరిసేవయందే; సంగము= స్నేహం; అచ్యుతజన= విష్ణుభక్తుల; తనుసంగము+అందున్+అ= దేహసాంగత్యమందే; ఘ్రాణము= ముక్కు; అసుర+అరి= రాక్షసులకు శత్రువైన విష్ణువుయొక్క; భక్త+అంఘ్రి+ కమలము+అందున్+అ= భక్తుల పాదపద్మమందే; రసన= నాలుక; తులసిదళములు+అందున్+అ= తులసీదళసేవన మందే; రతులు= కోరికలు; పుణ్యసంగతుల+అందున్+అ= పుణ్యకరమైన విషయాలందే.

**తా :** అంబరీషుడనే ఆ రాజచంద్రుని మనస్సు విష్ణుపదములందే. మాటలు విష్ణుగుణ కీర్తనమందే. చేతులు విష్ణ్వాలయం శుభ్రపరచడమందే. వీనులు హరికథలను వినడమందే. చూపులు విష్ణురూపదర్శనమందే. శిరస్సు హరినమస్కారమందే, పాదాలు విష్ణ్వాలయాలను చుట్టి రావడమందే. ఆసక్తి హరికైంకర్యమందే. స్నేహం వైష్ణవభక్తులతోనే. ముక్కు వైష్ణవ భక్తుల పాదపద్మములందే. నాలుక తులసీదళ సేవనమందే. కోరికలు పుణ్యకరమైన విషయాలందే ఉండేవి.

**వ. మఱియు నమ్మహీవిభుండు. 83**

**ప్రతి :** మఱియున్= అంతేగాక; ఆ+మహీవిభుఁడు= ఆ భూభర్త...

**తా :** (పైన చెప్పినట్లేగాక) ఆ రాజు

**సీ. ఘనవైభవంబునఁ గల్మషదూరుఁడై యజ్ఞేశు నీశు నబ్జాక్షుఁ గూర్చి**
**మొనసి వసిష్ఠాదిమునివల్లభులతోడఁ దగిలి సరస్వతీతటమునందు**
**మేధతో బహువాజిమేధంబు లొనరించె గణుతింపరాని దక్షిణలు వెట్టి**
**సమలోష్టహేముఁడై సర్వకర్మంబులు హరిపరంబులు గాఁగ నవని యేలె;**

**ఆ. విష్ణుభక్తులందు విష్ణువునందుఁ గ, లంక మెడల మనసు లంకె పెట్టి**
**విహితరాజ్యవృత్తి విడువనివాఁడునై, యతఁడు రాచతపసి యనఁగ నొప్పె. 84**

**ప్రతి :** ఘనవైభవంబునన్= గొప్ప వైభవంతో; కల్మషదూరుఁడు+ఐ= పాపానికి దూరుడై (పుణ్యాత్ముడై); యజ్ఞ+ఈశున్= యజ్ఞాలకు ప్రభువైనవాణ్ణి; ఈశున్= సర్వేశ్వరుణ్ణి; అబ్జ+అక్షున్+కూర్చి= పద్మాక్షునిగూర్చి (విష్ణువు); మొనసి= ప్రయత్నంతో; వసిష్ఠ+ఆది= వసిష్ఠుడు మొదలైన; మునివల్లభులతోడన్+తగిలి= మునీశ్వరులతో కలిసి; సరస్వతీతటము+అందున్= సరస్వతీ నది ఒడ్డున; గణుతింపరాని= లెక్కపెట్టలేనటువంటి; దక్షిణలు+పెట్టి= సంభావనలిచ్చి; మేధతో= జ్ఞానంతో; బహు= అనేకమైన; వాజిమేధంబులు= అశ్వమేధయాగాలు; ఒనరించెన్= నిర్వహించాడు; సమ= సమానమైన; లోష్టహేముఁడు+ఐ= మట్టిపెళ్ల బంగారం కలవాడై (సమదృష్టికలవాడు); సర్వకర్మంబులు= అన్ని పనులు; హరిపరంబులు+ కాఁగన్= విష్ణు సమర్పణలు కాగా; అవనిన్+ఏలెన్= భూమిని పరిపాలించాడు; విష్ణుభక్తులు+అందున్= విష్ణువుయొక్క భక్తులపట్ల; విష్ణువు+అందున్= విష్ణువు పట్ల; కలంకము+ఎడలన్= పాపదూరుడై; మనసున్+లంకెపెట్టి= మనస్సులో బంధించి; విహితరాజ్యవృత్తిన్= విధింపబడిన రాజ్యపాలన కార్యాన్ని; విడువని వాఁడును+ఐ= వదలిపెట్టనివాడై; అతఁడు= ఆ అంబరీషుడు; రాచతపసి+అనన్+కన్+ఒప్పెన్= రాజర్షిగా ప్రకాశించాడు.

**తా :** ఆ రాజు గొప్పవైభవంతో పుణ్యాత్ముడై యజ్ఞాలకు ప్రభువైన విష్ణువునుగూర్చి వసిష్ఠాదిమునులతో సరస్వతీనది ఒడ్డున భూరిసంభావనలిచ్చి అనేక అశ్వమేధయాగాలు చేశాడు. ఆ అంబరీషుడు మట్టిపెళ్లను బంగారాన్ని సమానంగా చూస్తూ, సర్వకర్మలు విష్ణుపరంగా చేస్తూ రాజ్యాన్ని పాలించాడు. విష్ణువునందు, విష్ణుభక్తులయందు మనసు లంకెపెట్టి తనకు విధించబడ్డ రాజ్యపాలనాకార్యాన్ని వదలిపెట్టకుండా రాజర్షిగా పేరుపొందాడు.

**వ. వెండియు న మ్మహాభాగవతుండు. 85**

**ప్రతి :** వెండియున్= ఇంకా; ఆ+మహాభాగవతుండు= ఆ గొప్ప భగవద్భక్తుడు...

**తా :** ఇంకా ఆ భక్తాగ్రేసరుడైన అంబరీషుడు

**క. హరి యని సంభావించును, హరి యని దర్శించు; నంటు; నాఘ్రాణించున్;**
**హరి యని రుచిగొనఁ దలఁచును, హరిహరి! ఘను నంబరీషు నలవియె పొగడన్? 86**

**ప్రతి :** 'హరి'+అని= 'హరి' అని; సంభావించును= తలుస్తాడు; హరి+అని= 'హరి' అని; దర్శించును= చూస్తాడు; అంటున్= హరి అంటూ తాకుతాడు, స్పృశిస్తాడు; ఆఘ్రాణించున్= హరి అంటూ వాసన చూస్తాడు; 'హరి'+అని= హరి అని; రుచి+కొనన్= రుచి చూడాలని; తలఁచును= అనుకొంటాడు; హరి!హరి!= హరిహరీ!; ఘనున్= మహనీయుడైన; అంబరీషున్= అంబరీషుణ్ణి; పొగడన్= ప్రశంసించడానికి; అలవి+ఎ= వీలవుతుందా?

**తా :** భగవద్భక్తుడైన ఆ రాజు 'హరి' అని తలుస్తాడు. హరి అని దర్శిస్తాడు. 'హరి' అని స్పర్శిస్తాడు. 'హరి'యని వాసనలు చూస్తాడు. హరియని 'రుచి' చూడాలనుకొంటాడు. హరిహరీ! ఆ మహాత్ముడైన అంబరీషుణ్ణి కొనియాడడం సులువైనపని కాదు.

**వ. ఇట్లు పుణ్యచిత్తుండు, నీశ్వరాయత్తుండునై యల్లనల్లన రాజ్యంబు సేయుచున్న సమయంబున. 87**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పుణ్యచిత్తుండు= పుణ్యాత్ముడు; ఈశ్వర+ఆయత్తుండును+ఐ= భగవంతుని యందు నిమగ్నుడు అయి; అల్లనన్+అల్లనన్= మెల్లమెల్లగా; రాజ్యంబు+చేయుచున్+ఉన్న= రాజ్యపాలన చేస్తూఉన్న; సమయంబునన్= కాలంలో...

**తా :** పై చెప్పిన విధంగా (పంచేంద్రియప్రవృత్తి) భగవన్నిమగ్నుడు, పుణ్యాత్ముడైన ఆ రాజు మెల్లమెల్లగా పరిపాలనచేస్తూ ఉండగా

**ఆ. అతని కీహ మానె హరులందుఁ గరులందు, ధనములందుఁ గేళివనములందుఁ,**
**బుత్త్రులందు బంధుమిత్త్రులయందును, బురమునందు నంతిపురమునందు. 88**

**ప్రతి :** అతనికిన్= ఆ అంబరీషునికి; హరుల+అందున్= గుఱ్ఱాలపట్ల; కరుల+అందున్= ఏనుగులపట్ల; ధనముల+అందున్= సంపదలపట్ల; కేళివనముల+అందున్= ఉద్యానవనాలపట్ల; పుత్త్రుల+అందున్= సంతానంపట్ల; బంధుమిత్త్రుల+అందున్= చుట్టాలపట్ల, స్నేహితులపట్ల; పురమున్+అందున్= నగరం పట్ల; అంతిపురమున్+అందున్= అంతఃపురంపట్ల; ఈహ= కోరిక; మానెన్= తొలగిపోయింది.

**తా :** భగవదధీన మనస్కుడైన ఆ రాజుకు మెల్లగా గుఱ్ఱాలు, ఏనుగులు, సంపదలు, ఉద్యానవనాలు, సంతానం, బంధువులు, మిత్రులు, నగరం, అంతఃపురంవంటి భోగభాగ్యాలపట్ల ఆసక్తి తొలగిపోయింది.

**వ. అంతఁ గొంతకాలంబున క మ్మేదినీకాంతుండు సంసారంబువలని తగులంబు విడిచి నిర్మలుండై యేకాంతంబున భక్తిపరవశుండయి యుండ నా రాచతపసికి భక్తలోకవత్సలుండగు పురుషోత్తముండు ప్రతిభటశిక్షణంబును, నిజజనరక్షణంబును, నిఖిలజగదవక్రంబునగు చక్రంబు నిచ్చి చనియె నంత. 89**

**ప్రతి :** అంతన్+కొంతకాలంబునకున్= ఆ తరువాత కొంతకాలానికి; ఆ+మేదినీకాంతుండు= ఆ రాజు అయిన అంబరీషుడు; సంసారంబువలని= సంసారం పట్ల; తగులంబున్+విడిచి= సంబంధాన్ని పరిత్యజించి; నిర్మలుండు+ఐ= పరిశుద్ధుడై; ఏకాంతంబునన్= ఏకాంతంలో; భక్తిపరవశుండు+అయి= భక్తిలో మునిగినవాడై; ఉండన్= ఉండగా; ఆ రాచతపసికిన్= ఆ రాజ ఋషికి; భక్తలోకవత్సలుండు+అగు= భక్తులయందు ప్రేమకలిగినవాడైన; పురుష+ఉత్తముండు= నారాయణుడు;

ప్రతిభటశిక్షణంబును= శత్రువులను శిక్షించేది; నిజజనరక్షణంబును= ఆత్మీయులను రక్షించేది; నిఖిల= సమస్తమైన; జగత్= ప్రపంచంలో; అవక్రంబున్+అగు= తిరుగులేనిది అయిన; చక్రంబున్+ఇచ్చి= చక్రాన్ని ఇచ్చి; చనియెన్= వెళ్ళాడు; అంతన్= ఆ తరువాత...

**తా :** ఆ తరువాత కొంతకాలానికి సంసారంపట్ల సంబంధాన్ని వదలుకొని, పవిత్రుడై ఏకాంతంలో భక్తిపారవశ్యంలో ఉండగా ఆ రాజర్షికి భక్తులపట్ల ప్రేమకలవాడైన హరి శత్రువులను శిక్షించేది, ఆత్మీయుల్ని రక్షించేది అయిన సమస్త విశ్వంలో ఎదురులేని చక్రాన్ని ఇచ్చి వెళ్ళాడు. తరువాత

**క. తనతోడి నీడకైవడి, ననురూపగుణాఢ్యయైన యాత్మమహిషితో**
**జనవిభుఁడు ద్వాదశీవ్రత, మొనరఁగ హరిఁ గూర్చి చేసె నొకయేఁ డధిపా! 90**

**ప్రతి :** అధిపా!= ఓ రాజా! (పరీక్షిత్తు); జనవిభుఁడు= రాజు; తనతోడి నీడకైవడిన్= తనతో ఉండే తన నీడవలె; అనురూప= తనకు తగిన; గుణ+ఆఢ్య+ఐన= గుణశ్రేష్ఠురాలైన; ఆత్మమహిషితో= తన పట్టపుదేవితో; హరిన్+కూర్చి= విష్ణువును గూర్చి; ఒక+ఏఁడు= ఒక సంవత్సరం పాటు; ద్వాదశీవ్రతమున్= ద్వాదశీవ్రతాన్నీ; ఒనరన్+కన్= చక్కగా; చేసెన్= చేశాడు.

**తా :** ఓ రాజా! ఆ మహారాజు తనకు తోడు నీడవలె తనకు తగిన గుణశ్రేష్ఠురాలైన పట్టపుదేవితో కలిసి, విష్ణువును గూర్చి ఒక సంవత్సరం పాటు ద్వాదశీవ్రతాన్ని చక్కగా చేశాడు.

**వ. ఇట్లు వ్రతంబు సేసి, యా వ్రతాంతంబునం గార్తికమాసంబున మూఁడురాత్రు లుపవసించి, కాళిందీజలంబుల స్నాతుండయి, మధువనంబున మహాభిషేకవిధానంబున విహితపరికరసంపన్నుండయి, హరి నభిషేకంబు సేసి, మనోహరంబు లయిన గంధంబులు సమర్పించి యభినవామోదంబులైన పుష్పంబులం బూజించి తదనంతరంబ. 91**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వ్రతంబున్+చేసి= వ్రతం చేసి; ఆ వ్రత+అంతంబునన్= వ్రతపరిసమాప్తిలో; కార్తిక మాసంబునన్= కార్తికమాసంలో; మూఁడురాత్రులు+ఉపవసించి= మూడు రాత్రులు ఉపవాసముండి; కాళిందీజలంబులన్= యమునానది నీళ్ళలో; స్నాతుండు+అయి= స్నానంచేసి; మధువనంబునన్= మధువనంలో, మహా+అభిషేక విధానంబునన్= మహాభిషేకవిధిప్రకారం; విహిత= విధింపబడిన; పరికరసంపన్నుండు+అయి= వస్తువుల సమృద్ధికలవాడై; హరిన్+ అభిషేకంబు+చేసి= విష్ణువును అభిషేకించి; మనస్+హరంబులు+అయిన= మనస్సును ఆకర్షించేవైన; గంధంబులున్= సుగంధాలను; సమర్పించి= ఇచ్చి; అభినవ+ఆమోదంబులు+ఐన= కొంగొత్త సువాసనలు కలవైన; పుష్పంబులన్+పూజించి= పూవులతో పూజచేసి; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత...

**తా :** ఈ విధంగా వ్రతంచేసి, వ్రతాంతంలో కార్తికమాసంలో మూడురాత్రులు ఉపవాసం చేశాడు. యమునానదిలో స్నానంచేసి, మధువనంలో మహాభిషేక పూజావిధానంతో అవసరమని విధింపబడిన అనేక వస్తువులను కలిగి, విష్ణుదేవుణ్ణి అభిషేకించి, మనోహరమైన గంధాలను సమర్పించి, కొంగొత్త సువాసనలు వెదజల్లే పూలతో పూజ చేశాడు. ఆ తరువాత

**విశే :** ద్వాదశీవ్రత సమాప్తిలో చేయవలసిన విధివిధానం చెప్పబడింది. కార్తికమాసంలో మూడురాత్రుల ఉపవాసం, అనేకపరికరాలతో, గంధాలను, పువ్వులను సమర్పించడం అనేవి విధులు–ఉపవాసం అనగా ఉప= సమీపంలో, వాసం= వసించడం (ఉండడం) ఎవరికి? ఆ భగవంతునికి. అంతటా ఉండే ఆయనకు సమీపంలో ఎలా ఉండడం అనేది ప్రశ్న. అంటే భగవచ్చింతన కలిగి ఉండడం. ఈ విధంగా వ్రతాన్ని రాజు పూర్తిచేశాడు.

**శా. పాలేఱై ప్రవహింప దగ్గఱుచు లేఁత్రాయంబులున్ రూపము**
**ల్మేలై ధూర్తలు గాక వెండిగొరిజల్ హేమోరుశృంగంబులుం**
**గ్రాలం గ్రేపుల యఱ్ఱు నాఁకుచును రంగచ్ఛాయలై యున్న మం**
**దాలన్ న్యర్బుదషట్కమిచ్చె విభుఁ డుద్యద్వైదికశ్రేణికిన్. 92**

**ప్రతి :** పాలు+ఏఱు+ఐ= పాలు ఏరుగా; ప్రవహింపన్= ప్రవహిస్తుండగా; దగ్గఱుచున్= తిరుగాడే; లేఁత+ప్రాయంబులున్= లేత వయసులో ఉండేవి; రూపముల్+మేలు+ఐ= మిక్కిలి అందంగా ఉంటూ; ధూర్తలున్+కాక= పోట్లమారితనం లేకుండా; వెండి గొరిజల్= వెండి తొడిగిన గిట్టలు; హేమ+ఉరుశృంగంబులున్= బంగారు కుప్పెలు తొడిగిన పెద్దకొమ్ములతో; క్రాలన్= ప్రకాశిస్తూండగా; క్రేపులన్= దూడల; అఱ్ఱు నాఁకుచును= మెడ నాకుతూ; రంగచ్ఛాయలు (రంగత్+ఛాయలు)+ఐ+ ఉన్న= ప్రకాశిస్తున్న రంగులు కలవైన; న్యర్బుదషట్కమున్= ఆరువందల కోట్ల; మంద+ఆలన్= ఆవుల మందను; ఉద్యత్+వైదిక శ్రేణికిన్= గొప్ప శ్రేష్ఠులకు; విభుఁడు= రాజు; ఇచ్చెన్= ఇచ్చెను.(దానమిచ్చాడు).

**తా :** పాలు ఏరై ప్రవహిస్తుండగా తిరుగాడేవి, లేతవయసులో ఉండేవి, అందమైనవి, పోట్లమారితనం లేనివి, వెండితొడిగిన గిట్టలు గలవి, బంగారు కుప్పెలు కలిగిన పెద్దకొమ్ములతో ప్రకాశించేవి, దూడల మెడలను నాకుతూ ప్రేమగా చూచేవి, పలురంగులు కలిగినవి అయిన ఆరువందలకోట్ల ఆవులను వైదికశ్రేష్ఠులకు ఆ రాజు దానం చేశాడు.

**విశే :** ఇవన్నీ మేలు జాతి ఆవుల లక్షణాలు. దానం ఇచ్చేటపుడు మంచిజాతి ఆవులను ఇవ్వడం ధర్మం. లేత వయసులో ఉండడంవల్ల సంతానోత్పత్తి కలవి కావడం, వెండి బంగారు తొడుగులచే ఆరాధింపబడినవైనం తెలుస్తోంది.

**క. పెక్కండ్రు విప్రవరులకు, గ్రక్కున నతిభక్తితోడఁ గడుపులు నిండం**
**జొక్కపు టన్నంబిడి విభుఁ, డొక్కెడఁ బారణము సేయ నుద్యోగించెన్. 93**

**ప్రతి :** గ్రక్కునన్= వెంటనే; పెక్కండ్రు విప్రవరులకున్= చాలమంది బ్రాహ్మణ శ్రేష్ఠులకు; అతిభక్తితోడన్= మిక్కిలి భక్తితో; కడుపులు నిండన్= కడుపులు నిండేటట్లు (సంతృప్తిగా); చొక్కము+అన్నంబున్+ఇడి= మంచి భోజనం పెట్టి; విభుఁడు= రాజు; ఒక్కెడన్ (ఒక్క+ఎడన్)= ఒకచోట; పారణమున్+చేయన్= ఉపవాసానంతరం చేయవలసిన భోజనం చేయడానికి; ఉద్యోగించెన్= పూనుకొన్నాడు.

**తా :** వెంటనే ఆ రాజు చాలమంది బ్రాహ్మణశ్రేష్ఠులకు భక్తితో సంతృప్తిగా భోజనంపెట్టి, ఉపవాసం తర్వాత పారణ చేయడానికి పూనుకొన్నాడు.

**వ. అ య్యవసరంబున. 94**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** ఆ సమయంలో (రాజు పారణ చేయబోయే సమయంలో)

**క. భాసురనిగమపదోప, న్యాసుఁడు సుతపోవిలాసుఁ డనుపమయోగా**
**భ్యాసుఁడు రవిభాసుఁడు దు, ర్వాసుఁ డతిథి యయ్యెఁ దన్నివాసంబునకున్. 95**

**ప్రతి :** భాసుర= ప్రకాశించే; నిగమపద+ఉపన్యాసుఁడు= వేదాలనుగూర్చి ఉపన్యసించేవాడు; సుతపస్+ విలాసుఁడు= గొప్ప తపస్సంపన్నుడు; న+ఉపమ= ఇతరులతో పోలికలేని; యోగ+అభ్యాసుఁడు= యోగాభ్యాసం కలవాడు;

రవిభాసుఁడు= సూర్యునిలాగా ప్రకాశించేవాడు; దుర్వాసుఁడు= దుర్వాసమహర్షి; తద్+నివాసంబునకున్= ఆయన ఇంటికి; అతిథి+అయ్యెన్= అతిథిగా అయినాడు (వచ్చాడు).

**తా :** ఆ సమయంలో వేదాలను ఆపోశన పట్టినవాడు, తపస్సంపన్నుడు, సాటిలేని యోగాభ్యాసనిపుణుడు, సూర్యునివంటి తేజస్సు కలవాడు అయిన దుర్వాసుడు ఆ రాజు ఇంటికి అతిథిగా వచ్చాడు.

**వ. అట్లతిథియై వచ్చిన న మ్మునివల్లభునకుఁ బ్రత్యుత్థానంబు చేసి, కూర్చుండ గద్దియ యిడి పాదంబులు గడిగి పూజించి సేమం బరసి తనయింట నన్నంబు గుడువుమని నమస్కరించిన నమ్మహాత్ముండును సంతసించి భోజనంబునకు నంగీకరించి నిర్మలంబులగు కాళిందీజలంబులం బరమధ్యానంబు సేయుచు, మునింగి లేచి రాక తడవుసేసిన, ముహూర్తార్ధావశిష్ట యగు ద్వాదశియందుఁ బారణ సేయవలయుటఁ జింతించి బ్రాహ్మణాతిక్రమదోషంబునకు శంకించి విద్వజ్జనంబుల రావించి వారల నుద్దేశించి. 96**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; అతిథి+ఐ= అతిథిగా; వచ్చిన= వచ్చినటువంటి; ఆ+మునివల్లభునకున్= ఆ మునిశ్రేష్ఠునికి; ప్రతి+ఉత్థానంబుచేసి= లేచి నిలబడి (గౌరవించి); కూర్చుండన్= కూర్చోవడానికి; గద్దియన్+ఇడి= ఆసనమిచ్చి; పాదంబులున్+ కడిగి= కాళ్ళు కడిగి; పూజించి= అర్చించి; సేమంబు+అరసి= కుశలాన్ని విచారించి; తన+ఇంటన్= తన గృహంలో; అన్నంబున్+కుడువుము+అని= భోజనం చేయుమని; నమస్కరించినన్= ప్రార్థించగా; ఆ+మహా+ఆత్ముండును= ఆ మహనీయుడు; సంతసించి= సంతోషించి; భోజనంబునకున్+అంగీకరించి= భోజనంచేయడానికి సమ్మతించి; నిర్మలంబులు+అగు= స్వచ్ఛమైన; కాళిందీజలంబులన్= యమునానది నీళ్లలో; పరమధ్యానంబున్+చేయుచున్= పరమాత్మను ధ్యానం చేస్తూ; మునింగి లేచి= మునుగుతూ, లేస్తూ; రాక= రావడం; తడవు+చేసినన్= ఆలస్యం చేయగా; ముహూర్త+అర్ధ+ అవశిష్ట+అగు= ముహూర్తంలో అర్ధంమాత్రమే మిగిలి ఉన్న; ద్వాదశి+అందున్= ద్వాదశి తిథిలోనే; పారణ+ చేయవలయుటన్= ఆహారం తీసుకోవలసి ఉండడాన్ని; చింతించి= విచారించి; బ్రాహ్మణ+అతిక్రమదోషంబునకున్= బ్రాహ్మణతిరస్కారంవల్ల కలిగే తప్పునకు; శంకించి= అనుమానించి; విద్వత్+జనంబులన్= పండితులను; రావించి= పిలిపించి; వారలన్+ఉద్దేశించి= వాళ్లను ఉద్దేశించి...

**తా :** అట్లావచ్చిన మునిని చూచి లేచి నిలబడి, ఆయన కూర్చోడానికి ఆసనం ఏర్పాటు చేసి, పాదపూజచేసి, క్షేమం అడిగి రాజు తన ఇంట్లో భోజనం చేయుమని ప్రార్థించాడు. ఆ మహాత్ముడుకూడా సంతోషించి రాజుకోరికను ఒప్పుకొన్నాడు. ఆయన యమునానదికి వెళ్ళి స్నానంచేసి ధ్యానంచేస్తూ మునుగుతూ లేస్తూ ఆలస్యం చేశాడు. రాజు చేసే పారణ ముహూర్తంలో సగంగడియ మాత్రమే ఉంది. ద్వాదశిలోనే పారణ చేయవలసిన విషయాన్ని విచారించి, బ్రాహ్మణ తిరస్కారం వల్ల కలిగే దోషాన్నీ శంకించి, పండితులను పిలిపించి వాళ్లతో ఇలా అన్నాడు.

**విశే :** అహోరాత్రానికి – 30 ముహూర్తాలు. ఒక్క ముహూర్తం= 48 ని. ఒక్క గడియ= 24 ని.

**పారణ :** వ్రతాలు, దీక్షలు సందర్భంలో ఉపవాసం ఉండి అనంతరం ఆహారం తీసుకోవడాన్ని పారణం అంటారు.

**క. 'ముని నీరు సొచ్చి వెడలఁడు, చనియెడు ద్వాదశియు నింత సనియె న్నీలో**
**నన పారణచేయవలయు, వినిపింపుం డర్హమైన విధ మెట్టిదియో?' 97**

**ప్రతి :** ముని= మునీశ్వరుడు; నీరున్+చొచ్చి= నీటిలో ప్రవేశించి; (స్నానానికివెళ్లి); వెడలఁడు= బయటకురాడు; (నదినుండి ఇంకారాలేదు) ద్వాదశియున్= ద్వాదశి తిథికూడా; ఇంతన్= ఇప్పుడిప్పుడే; చనియెడున్= వెళ్ళిపోతోంది;

చనియెన్+ఈలోనన్+అ= అలా వెళ్ళిపోయేలోగానే; పారణ+చేయవలయున్= పారణం చేయాలి (అహారం గ్రహించాలి); అర్హము+ఐన= ఉచితమైన; విధము+ఎట్టిది+ఓ= పద్ధతేమిటో; వినిపింపుండు= తెలపండి.

**తా :** 'దుర్వాసమహర్షి యమునకు స్నానానికి వెళ్ళి ఇంకా రాలేదు. ద్వాదశి కూడా వెళ్ళిపోతోంది. అది వెళ్ళిపోయేలోగా పారణ చేయాలి. తగిన ధర్మాన్ని నాకు చెప్పండి' అన్నాడు రాజు.

**వ. అని పలికిన నా రాజునకు బ్రాహ్మణజను లిట్లనిరి. 98**

**ప్రతి :** అని పలికిన= పై విధంగా అడిగిన; ఆ రాజునకున్= ఆ రాజుతో; బ్రాహ్మణజనులు= బ్రాహ్మణులు; ఇట్లు+అనిరి= ఇలా చెప్పారు.

**తా :** తనకు కలిగిన ధర్మసంకటాన్ని ముందుంచిన రాజుతో బ్రాహ్మణులు ఇలా అన్నారు.

**ఆ. 'అతిథి వోయి రామి నధిప! యీ ద్వాదశి, పారణంబు మానఁ బాడి గాదు**
**గుడువకుంటఁ గాదు కుడుచుటయును గాదు, సలిలభక్షణంబు సమ్మతంబు.' 99**

**ప్రతి :** అధిప= రాజా!; అతిథి+పోయి= అతిథి వెళ్ళి; రామిన్= రాకపోవడంచేత; ఈ ద్వాదశి పారణంబున్= ఈ ద్వాదశి తిథిలో చేసే పారణను; మానన్= మానడం; పాడి+కాదు= ధర్మంకాదు; సలిలభక్షణంబు= నీటిని తాగడం; కుడువకుంటన్+కాదు= తిననట్లుకాదు; కుడుచుటయున్+కాదు= తినినట్లుకాదు; సమ్మతంబు= ఒప్పుదల అవుతుంది.

**తా :** రాజా! అతిథి స్నానానికి పోయి రాకపోవడంచేత ద్వాదశి పారణను మానివేయడం ధర్మంకాదు. నీటిని స్వీకరించండి. అది తినినట్లుకాదు; తిననట్లుకాదు; సలిలభక్షణం అంగీకారమైందే.

**వ. అని ధర్మసందేహంబు వాపిన, నా రాజర్షి శ్రేష్ఠుండును మనంబున హరిం దలంచి నీరు పారణంబు సేసి, జలంబుల మునింగిన తపసిరాక కెదురుచూచుచున్న సమయంబున. 100**

**ప్రతి :** అని= పైన చెప్పినవిధంగా; ధర్మసందేహంబు+పాపినన్= ధర్మం ఎడ కలిగిన సందేహం పోగొట్టగా; ఆ రాజ+ఋషి శ్రేష్ఠుండును= ఆ రాజర్షివరుడు; మనంబునన్= మనసులో; హరిన్+తలంచి= విష్ణువును ధ్యానించి; నీరు పారణంబు+చేసి= నీటిని ఆహారంగా తీసుకొని; జలంబులన్+మునింగిన= స్నానానికి వెళ్ళిన; తపసి రాకకున్= మునిరాకకోసం; ఎదురు చూచున్+ఉన్న సమయంబునన్= ఎదురుచూస్తున్న సమయంలో...

**తా :** బ్రాహ్మణులు రాజుగారి ధర్మసందేహాన్ని పోగొట్టారు. ఆ రాజర్షి మనసులో విష్ణువును ధ్యానించి నీటిని పారణ చేశాడు. స్నానానికి వెళ్ళిన మునికోసం ఎదురు చూస్తుండగా

**సీ. యమునలోఁ గృతకృత్యుఁడై వచ్చి రాజుచే సేవితుండై రాజుచేష్టితంబు**
**బుద్ధిలో నూహించి బొమముడి మొగముతో నదరెడి మేనితో నాగ్రహించి**
**రెట్టించి యాఁకలి కొట్టుమిట్టాడంగ నీ సంపదున్మత్తు నీ నృశంసు**
**నీ దురహంకారు నిందఱుఁ గంటిరే? విష్ణుభక్తుఁడు గాఁడు వీఁడు నన్నుఁ**

**తే. గుడువ రమ్మని మునుముట్టఁ గుడిచినాఁడు, ధర్మభంగంబు సేసి దుష్కర్ముఁ డయ్యె!**
**నయిన నిప్పుడు సూపెద నన్నిదిశల, నేనుఁ గోపింప మాన్పువాఁ డెవ్వఁ? డనుచు. 101**

**ప్రతి :** యమునలోన్= యమునా నదిలో; కృతకృత్యుఁడు+ఐ= పనిని పూర్తిచేసినవాడై (స్నానం చేసినవాడై); వచ్చి; రాజుచేన్+సేవితుండు+ఐ= రాజుచేత సేవించబడినవాడై; రాజుచేష్టితంబున్= రాజు యొక్క పనిని; (పారణచేసిన విషయాన్ని) బుద్ధిలోన్+ఊహించి= మనోదృష్టితో భావించి; బొమముడి మొగముతోన్= కనుబొమలు ముడిపడిన తన ముఖంతో; అదరెడి మేనితోన్= కంపిస్తున్న శరీరంతో; ఆగ్రహించి= కోపించి; రెట్టించి= రెట్టింపైన; ఆఁకలి కొట్టుమిట్టు+ఆడగన్= ఆకలి నకనకలాడుతుండగా; ఈ సంపత్+ఉన్మత్తున్= ఈ ఐశ్వర్యమదాంధుణ్ణి; ఈ నృశంసున్= ఈ ఘాతకుణ్ణి; ఈ దుర్+అహంకారునిన్= ఈ గర్విష్ఠిని; ఇందఱున్+కంటిరి+ఏ= మీరందరూ చూశారా?; వీఁడు విష్ణుభక్తుఁడు+కాఁడు= వీడు విష్ణువుయొక్క భక్తుడుకాదు; నన్నున్+కుడువన్= నన్ను భోజనానికి; రమ్ము+అని= రావలసిందని (పిలిచి); మునుముట్టన్+కుడిచినాఁడు= (నా రాకకు) ముందే భుజించాడు; ధర్మభంగంబు+చేసి= ధర్మానికి భంగంచేసి; దుష్కర్ముఁడు+అయ్యెన్= చెడ్డనడతవాడయ్యాడు; అయినన్+ఇప్పుడు= అయినా ఇప్పుడే (నా శక్తి); చూపెదన్= ప్రదర్శిస్తాను; నేనున్+కోపింపన్= నేను కోపిస్తే; అన్నిదిశలన్= అన్ని వైపులా; ఎవ్వఁడు= ఎవరు; మాన్పువాఁడు= కోపాన్ని మాన్పగలడు; అనుచున్= అంటూ...

**తా :** ఆ సమయంలో యమునానదిలో స్నానాదికం పూర్తిచేసి వచ్చిన మునీశ్వరుడు అంబరీషుని సేవలు అందుకొన్నాడు. తన బుద్ధితో జరిగిన విషయం తెలుసుకున్నాడు. బొమముడి కలిగిన ముఖంతో, శరీరం కంపిస్తుండగా, కోపంతో రెట్టించిన, ఆకలి నకనకమంటుండగా, ఇలా అన్నాడు. “ఈ ఐశ్వర్య మదాంధుని, ఈ ఘాతుకుణ్ణి, గర్విష్ఠుణ్ణి మీరందరూ చూచారా? వీడు విష్ణుభక్తుడుకాదు. నన్ను అతిథిగా పిలిచి నా రాకకుముందే భుజించి, ధర్మభంగం చేసి దుర్మార్గుడయ్యాడు. నా శక్తి ఇప్పుడు ప్రదర్శిస్తాను. నేను కోపిస్తే ఎక్కడైనాసరే అడ్డుపడేవాడెవడు?” అంటూ

**చ. పెటపెటఁబండ్లు గీఁటుచును, భీకరుఁడై కనుఁగ్రేవ నిప్పుకల్**
**పొటపొట రాల, గండములు పొంగ, మునీంద్రుఁడు హుంకరించుచున్,**
**జట మొదలంటఁగాఁ బెఱికి చక్కన దానన కృత్య నాయుధో**
**త్కటవలమానహస్తయుతఁగా నొనరించె నయించె రాజుపైన్' 102**

**ప్రతి :** పెటపెటన్= పెటపెటమని (పటపటమని); పండ్లు+గీఁటుచును= పండ్లు కొరుకుతూ; భీకరుఁడు+ఐ= భయంకరుడై; కనున్+క్రేవన్= కనుకొనలనుండి; నిప్పుకల్= నిప్పులు; పొటపొటన్+రాలన్= చిటచిటమని రాలగా; గండములు+పొంగన్= చెంపలు పెద్దవికాగా; ముని+ఇంద్రుడు= మునిశ్రేష్ఠుడు (దుర్వాసుడు); హుంకరించుచున్= హుంకారంచేస్తూ; జటన్= జడను; మొదలు+ అంటన్+కాన్+పెఱికి= సమూలంగా లాగి; చక్కనన్= పొందికగా; దానన= దానినే; ఆయుధ+ఉత్కట= గొప్ప ఆయుధాన్ని; వలమాన హస్తయుతన్+కాన్= చలిస్తున్న చేతియందు కలిగినదాన్నిగా; కృత్యన్= సంహారకదేవతను; ఒనరించెన్= సృష్టించాడు; రాజుపైన్= రాజుమీద; నయించెన్= ప్రయోగించాడు.

**తా :** దుర్వాసుడు పటపటమని పండ్లు కొరుకుతూ భయంకరుడై కనుకొనలనుండి తీక్ష్ణమైన నిప్పులు చిటచిటమని రాలుతుండగా చెంపలు పొంగగా హూంకారం చేస్తూ తన జుట్టులోని శిఖను ఒక దాన్ని పెరికి దాన్ని చేత ఆయుధంకల్గిన సంహారక దేవతను సృష్టించి రాజుపై వదిలాడు.

**వ. అంత. 103**

**ప్రతి :** అంత= ఆ సమయంలో...

**క. కాలానలసన్నిభయై, శూలాయుధహస్త యగుచు సుఱసుఱ స్రుక్కన్,**
**నేలఁ బదంబులఁ ద్రొక్కుచు, వాలి మహాకృత్య మనుజవల్లభుఁ జేరెన్. 104**

**ప్రతి :** కాల+అనల+సమ్+నిభ+ఐ= ప్రళయాగ్నితో సమానురాలై; శూల+ఆయుధహస్త+అగుచున్= శూలమనే ఆయుధాన్ని పట్టినచేతితో; సుఱసుఱ స్రుక్కన్= సురసురమని కుంగిపోయేటట్లు; నేలన్= భూమిపై; పదంబులన్+త్రొక్కుచున్= పాదాలతో తొక్కుతూ; మహాకృత్య= కృత్య అనే ఆ గొప్పశక్తి; వాలి= విజృంభించి వచ్చి; మనుజ వల్లభున్+చేరెన్= రాజును సమీపించింది;

**తా :** ప్రళయాగ్నితో సమానురాలై, చేతితో శూలాన్ని ధరించి, నేల సురసురమని అణగిపోయేటట్లు పాదాలతో తొక్కుతూ విజృంభించి రాజును సమీపించింది.

**ఆ. ఆ ప్రకార మెఱిఁగి హరి విశ్వరూపుండు, 'వెఱ్ఱితపసి సేయు వేడబంబుఁ**
**జక్కఁ బెట్టు' మనుచుఁ జక్రంబుఁ బంచిన, వచ్చె నదియుఁ బ్రళయవహ్నిపగిది. 105**

**ప్రతి :** విశ్వరూపుండు= విశ్వమే రూపంగా కలిగిన (విశ్వమయుడు); హరి= విష్ణువు; ఆ ప్రకారము+ఎఱిఁగి= ఆ సంగతి తెలిసి; 'వెఱ్ఱితపసి= అజ్ఞానియైన ముని; చేయు= చేస్తున్న; వేడబంబున్= మాయను; చక్కన్+పెట్టుము+అనుచున్= సరిచేయవలసిందంటూ; చక్రంబున్+పంచినన్= చక్రాన్ని పంపగా; అదియున్= ఆ చక్రం; ప్రళయవహ్ని పగిది= ప్రళయకాలంనాటి అగ్నివలె; వచ్చెన్= వచ్చింది.

**తా :** విశ్వరూపుడైన విష్ణువు దుర్వాసుని దుష్కృత్యాన్ని తెలిసికొని 'అజ్ఞానియైన తపసిమాయను సరిచేయమని చక్రాన్ని పంపాడు. అది ప్రళయాగ్నివలె వచ్చింది.

**వ. వచ్చి ముని పంచిన కృత్యను దహించి, తనివి సనక ముని వెంటంబడిన, మునియును మేరుగుహ సొచ్చిన నదియు వ్యాళంబు వెనుకొను దవానలంబు చందంబునఁ దోన చొచ్చి మఱియును. 106**

**ప్రతి :** వచ్చి= ఆ విధంగా వచ్చి (చక్రం); ముని పంచిన= ముని పంపిన; కృత్యను; దహించి= కాల్చి; తనివి+చనక= తృప్తి లేక; ముని వెంటన్+పడినన్= మునిని వెంబడించగా; మునియును= మునికూడ; మేరుగుహ+చొచ్చినన్ = మేరు పర్వతపు గుహలో ప్రవేశించగా; అదియును= అదికూడా; వ్యాళంబున్= సర్పాన్ని; వెనుకొను= వెంబడించే; దవ+అనలంబు+చందంబునన్= కారుచిచ్చువలె; తోన చొచ్చి= వెంట వచ్చి; మఱియును= అంతేగాక...

**తా :** ఆ విధంగా వచ్చిన చక్రం మునిపంపిన కృత్యను కాల్చి, అంతటితో ఆగక మునిని వెంబడించింది. ముని మేరు పర్వతగుహలో దూరగా అదికూడ సర్పాన్ని వెంబడించే దావాగ్నివలె అందులో ప్రవేశించింది. అంతేగాక

**మ. భువి దూఱన్ భువి దూఱు; నబ్ధిఁ జొర నబ్ధుల్ సొచ్చు; నుద్వేగియై**
**దివిఁ బ్రాఁకన్ దివిఁ బ్రాఁకు; దిక్కులకుఁ బో దిగ్వీథులం బోవుఁ; జి**
**క్కి వెసంగ్రుంకినఁ గ్రుంగు; నిల్వ నిలుచుం గ్రేడింపఁ గ్రేడించు నొ**
**క్క వడిన్ దాపసు వెంటనంటి హరిచక్రం బన్యదుర్వక్రమై. 107**

**ప్రతి :** అన్య= పరులకు; దుర్+వక్రము+ఐ= మరలింపరానిదై; హరిచక్రంబు= విష్ణుచక్రం; ఒక్కవడిన్= ఒక్కసారిగా; తాపసున్= మునిని; వెంటన్+అంటి= వెంబడించి; భువిన్+తూఱన్= భూమిలోనికి దూరితే; భువిన్+తూఱున్= భూమిలోనికి

దూరుతుంది; అబ్ధిన్+చొరన్= సముద్రంలో మునిగితే; అబ్ధుల్+చొచ్చున్= సముద్రాలలో ప్రవేశిస్తుంది; ఉద్వేగి+ఐ= కలతతో; దివిన్+ప్రాఁకన్= ఆకాశానికి ఎగప్రాకితే; దివిన్+ప్రాకున్= ఆకాశానికి ఎగబాకుతుంది; దిక్కులకున్+పోన్= దిక్కులవైపు వెళితే; దిక్+వీథులన్+పోవున్= దిక్కుల్లోకి వెళుతుంది; చిక్కి= అలసిపోయి; వెసన్+క్రుంకినన్= వెంటనే కనబడకపోతే; క్రుంగున్= తానూ కనబడదు; నిల్వన్= నిలబడితే; నిలుచున్= నిలబడుతుంది; క్రేడింపన్= తొలగినట్లైతే; క్రేడించున్= తొలగిపోతుంది.

**తా :** పరులకు మరలించుటకు వీలులేని విష్ణుచక్రం ఒక్క ఉదుటున ముని వెంటబడి భూమిలో దూరితే భూమిలోకి దూరుతుంది. సముద్రంలో మునిగితే తానుకూడ సముద్రాలలో మునుగుతుంది. ఉద్వేగంతో ఆకాశానికి పాకితే తాను కూడా ఆకాశానికి ఎగబాకుతుంది. దిక్కుల్లోకి వెళితే దిగ్వీథుల్లోకి వెళుతుంది. దారిలో ముని ఆగితే తానూ ఆగుతుంది. నిలబడితే నిలబడుతుంది. తొలగినట్లైతే తాను కూడా తొలగిపోతుంది.

**శా. ఏలోకంబున కైన వెంటఁబడి తో నేతెంచు చక్రానల**
**జ్వాలల్ మానుపువారు లేమిఁ జని దేవజ్యేష్ఠు లోకేశు వాఁ**
**డాలోకించి "విధాత! విశ్వజననవ్యాపారపారీణ రే**
**ఖా లీలేక్షణ! కావవే కరుణఁ జక్రంబు న్నివారింపవే." 108**

**ప్రతి :** ఏ లోకంబునకున్+ఐనన్= ఏ లోకానికైనా; వెంటన్+పడి= వెంబడించి; తోన్+ఏతెంచు= తనతో వచ్చే; చక్ర+అనలజ్వాలల్= చక్రం యొక్క అగ్ని జ్వాలలను; మానుపువారు లేమిన్= ఆర్ప గలిగినవారు లేకపోవడంచే; వాఁడు= ఆ దుర్వాసుడు; చని= వెళ్ళి; దేవజ్యేష్ఠున్= దేవతలలో ప్రథముడునూ; లోక+ఈశున్= లోక ప్రభువును; ఆలకించి= చూచి; విశ్వజననవ్యాపార పారీణ= సృష్టించే పనిలో నేర్పరితనం కలిగినట్టి; రేఖాలీలా+ఈక్షణ= అలవోకమైన విలాసమైన చూపులు కలవాడా!; విధాత= ఓ బ్రహ్మా!; కరుణన్= దయతో; కావుము+ఏ= కాపాడుమా!; చక్రంబున్+నివారింపుము+ఏ= చక్రాన్ని తొలగించుమా!.

**తా :** ఏ లోకానికైనా వెంబడించి తనతో వచ్చే చక్రాగ్నిజ్వాలల్ని ఆర్పగలిగినవారు లేకపోవడంతో దుర్వాసుడు దేవతలలో ప్రథముడు అయిన బ్రహ్మ దగ్గరకువెళ్ళి, సృష్టి కార్యంలో కౌశలం కలిగిన విలాసమైన చూపులుగల ఓ బ్రహ్మా! 'నన్ను కాపాడు. చక్రాన్ని అడ్డుకో' అని ప్రార్థించాడు.

**వ. అనిన బ్రహ్మ యిట్లనియె. 109**

**ప్రతి :** అనినన్= అని ప్రార్థించగా; బ్రహ్మ; ఇట్లు+అనియెన్= ఇలాగన్నాడు.

**మ. కర మర్థిన్ ద్విపరార్థసంజ్ఞ గల యీ కాలంబుఁ గాలాత్ముఁడై**
**సొరిదిన్ నిండఁగఁజేసి లోకముల నా చోటున్ విభుం డెవ్వఁడో**
**పరిపూర్తిన్ గనుఁగ్రేవఁగెంపు గదురన్ భస్మంబుగాఁ జేయు నా**
**హరిచక్రానలకీల కన్యుఁ డొకరుం దడ్డంబు గా నేర్చునే? 110**

**ప్రతి :** కరము+అర్థిన్= మిక్కిలి ప్రీతితో; ద్విపర+అర్థసంజ్ఞన్+కల= రెండు పరార్థాల ప్రమాణంగల; ఈ కాలంబున్= ఈ కాలాన్ని; కాల+ఆత్ముఁడు+ఐ= కాలస్వరూపుడై; సొరిదిన్= చక్కగా; నిండగన్+చేసి= నిండింపచేసి; ఆ చోటున్=

ఆ ప్రదేశాన్ని; లోకములన్= లోకాల్ని; పరిపూర్తిన్= పూర్తి అయ్యాక; కనున్+క్రేవన్= కనుకొనలలో; కెంపు+కదురన్= ఎరుపు వ్యాపించినంతనే; భస్మంబుగాన్+చేయు= బూడిదచేసే; విభుఁడు= ప్రభువు; ఎవ్వఁడు+ఓ= ఎవరో; ఆహరి= ఆ విష్ణువుయొక్క; చక్ర+అనలకీలకున్= చక్రాగ్ని జ్వాలకు; అన్యుఁడు= ఇతరుడైన; ఒకరుండు= ఒకడు; అడ్డంబు+కాన్+నేర్చును+ఏ= అడ్డుపడగలడా!.

**తా :** రెండు పరార్థాల ప్రమాణంకల ఈ కాలాన్ని కాలస్వరూపుడై లోకములో చక్కగా నిండించి, పరిపూర్తి అయిన వెంటనే కళ్లలో ఎర్రదనం వ్యాపించినంతనే వాటిని ఏ ప్రభువు బూడిదచేస్తాడో ఆ ప్రభువైన విష్ణువుయొక్క చక్రాగ్ని జ్వాలలకు అడ్డుపడ కలిగినవాడెవ్వడున్నాడు?

**విశే :** ద్విపరార్థం అంటే రెండు పరార్థాలు. కేవలం ఇంత అల్పమాత్రం సమయంలో లోకాల్ని నిండిస్తాడు. కోపం కలిగిన వెంటనే వాటిని భస్మీభూతం చేస్తాడు. లోకాలన్ని రెండు పరార్థాల కాలంలోనే పుడుతున్నాయి, గిడుతున్నాయి. అంటే ఎక్కడో కాదు. మనలోనే కదా! ఎన్నో సృష్టింపబడుతున్నాయి. కాసేపటికి లయమవుతున్నాయి.

**ఆ. ఏను, భవుఁడు, దక్షుఁ, డింద్రాదులునుఁ బ్రజా, పతులు, భృగుఁడు, భూతపతులు శిరము**
**లందుఁ దాల్తు మతని యాజ్ఞ జగద్ధితం, బంచు భూరికార్యమతుల మనుచు. 111**

**ప్రతి :** ఏను= నేను (బ్రహ్మ); భవుఁడు= ఈశ్వరుడు; దక్షుఁడు= దక్షుడు; ఇంద్ర+ఆదులునున్= ఇంద్రుడు మొదలైనవారు; ప్రజాపతులు; భృగుఁడు= భృగుడు; భూతపతులు= భూతనాథులు; అతని+ఆజ్ఞన్= ఆ భగవానుని ఆనతిని; జగత్+హితంబు+అంచున్= లోకానికి మేలు కలిగిస్తుందని; భూరికార్యము= గొప్ప పని; అతులము= సాటిలేనిది; అనుచు= అనుకొంటూ; శిరముల+అందున్+తాల్తుము= తలలమీద ధరిస్తాం (శిరసావహిస్తాం).

**తా :** ఆ శ్రీహరి ఆజ్ఞను నేను, ఈశ్వరుడు, దక్షుడు, ఇంద్రాదులు, ప్రజాపతులు, భృగుడు, భూతపతులు అందరం లోకకల్యాణకరమని, గొప్ప కార్యమని, సాటిలేనిదని అనుకొంటూ తలదాలుస్తాం.

**వ. కావున సుదర్శనానల నివారణంబునకు నోపనని విరించి పలికిన దుర్వాసుండు కైలాసంబునకుం జనుదెంచి, శర్వు నాలోకించి, చక్రానలంబు తెఱంగెఱింగించిన న మ్మహాదేవుండిట్లనియె. 112**

**ప్రతి :** కావునన్= కాబట్టి; సుదర్శన+అనల= చక్రాగ్నిని; నివారణంబునకున్= ఆపటానికి; ఓపను+అని= శక్తిలేనివాడనని; విరించి= బ్రహ్మ; పలికినన్= చెప్పగా; దుర్వాసుండు= దుర్వాసమహర్షి; కైలాసంబునకున్= శివుని నివాసానికి; చనుదెంచి= వచ్చి; శర్వున్+ఆలోకించి= ఈశ్వరుని చూచి; చక్ర+అనలంబు= చక్రాగ్ని; తెఱంగు+ఎఱింగించినన్= విషయాన్ని తెల్పగా; ఆ+మహాదేవుండు= ఆ పరమేశ్వరుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** 'కాబట్టి తాను చక్రాగ్నిని ఆపడానికి అశక్తుణ్ణి' అని బ్రహ్మ అన్నాడు. దుర్వాసుడు కైలాసానికి వెళ్ళి ఈశ్వరుని సందర్శించి ఆయినకు సుదర్శనచక్ర విషయం చెప్పాడు. అపుడు ఆ పరమేశ్వరుడిలా అన్నాడు.

**సీ. వినవయ్య! తండ్రి! యీ విశ్వేశ్వరుని యందుఁ జతురాస్య జీవకోశములు పెక్కు**
**వేల సంఖ్యలు గూడి వేళతో నిబ్బంగి, నగుచుండుఁ జనుచుండు; నదియుఁగాక**
**యెవ్వానిచే భ్రాంతి నేమందుచున్నార మేను దేవలుఁడసురేంద్ర సుతుఁడు**
**నారదుఁ డజుఁడు సనత్కుమారుఁడు ధర్ముఁ డా కపిలుఁడు మరీచ్యాదు లన్య**

**ఆ. పారవిదులు సిద్ధపతులు నెవ్వని మాయ, నెఱుఁగలేము దాన నింత పడుదు**
**మట్టి నిఖిలనాథు నాయుధశ్రేష్ఠంబుఁ, దొలఁగఁజేయ మాకు దుర్లభంబు. 113**

**ప్రతి :** తండ్రి= నాయనా! విను+అయ్య= విను; ఈ విశ్వ+ఈశ్వరుని+అందు= ఈ విశ్వానికి ప్రభువైన విష్ణువునందు; చతుర+ఆస్య జీవకోశములు= బ్రహ్మాండాలు; పెక్కువేల సంఖ్యలున్+కూడి= అనేక వేలసంఖ్యలు కలిసి; వేళతోన్= ఆయా సమయంలో; ఈ+భంగిన్= ఈ విధంగా; అగుచుండున్= కలుగుతుంటాయి (పుడుతూ ఉంటాయి); చనుచున్+ఉండు= వెళుతుంటాయి (నశించడం); అదియున్+కాక= అంతేగాకుండా; ఏ+వానిచేన్= ఎవరిచేత; ఏము= మేము; భ్రాంతిన్= మాయను; అందుచున్నారము= పొందుతున్నాం; ఏను= నేను (ఈశ్వరుడు); దేవలుఁడు+అసుర+ఇంద్రసుతుఁడు= దేవలుడు, ప్రహ్లాదుడు; నారదుఁడు+అజుఁడు= నారదుడు, బ్రహ్మ; సనత్కుమారుఁడు, ధర్ముఁడు= సనత్కుమారుడు, యముడు; ఆ కపిలుఁడు= ఆ కపిలుడు; మరీచి+ఆదులు= మరీచి మొదలైనవారు; అన్యపారవిదులు= పరతత్త్వం తెలిసిన ఇతరులు; సిద్ధపతులు= సిద్ధేశ్వరులు; ఎవ్వని మాయన్= ఎవరి మాయను; ఎఱుఁగన్+లేము= తెలిసికోలేము; దానన్+ఇంత+పడుదుము= అందువల్ల ఇంత స్థితిని పొందుతున్నాము; అట్టి= అటువంటి; నిఖిలనాథున్= సర్వేశ్వరుని; ఆయుధశ్రేష్ఠంబున్= విశిష్ట ఆయుధాన్ని (చక్రాన్ని); తొలఁగన్+చేయన్= నివారించడం; మాకు+దుర్లభంబు= మావల్ల అయ్యేపనికాదు.

**తా :** నాయనా! విను. ఈ విశ్వప్రభువువైన విష్ణువులో అనేక వేలసంఖ్యలైన బ్రహ్మాండాలు ఆయా సమయంలో పుడుతుంటాయి. నశిస్తుంటాయి. అదేకాదు మేము ఎవరి మాయకు లోనవుతున్నామో, నేను (ఈశ్వరుడు) దేవలుడు, ప్రహ్లాదుడు, నారదుడు, బ్రహ్మ, సనత్కుమారుడు, ధర్ముడు, కపిలుడు, మరీచి మొదలైనవారు పరతత్త్వజ్ఞులు, సిద్ధపతులు, ఎవరి మాయను తెలుసుకోలేక ఇటువంటి స్థితిని పొందుతున్నామో అటువంటి సర్వేశ్వరుని యొక్క విశిష్ట ఆయుధాన్ని (చక్రాన్ని) నివారించడం మా వల్లకాదు.

**వ. మునీంద్రా! నీవు న మ్మహాత్ముని శరణంబు వేఁడు మతండు మేలు సేయంగలవాఁడని పలికిన నీశ్వరునివలన నిరాశుండై, దుర్వాసుండు వైకుంఠనగరంబునకుంజని. 114**

**ప్రతి :** ముని+ఇంద్రా!= మునిశ్రేష్ఠుడా!; నీవు; ఆ+మహా+ఆత్ముని= ఆ మహానుభావుని; శరణంబున్+వేఁడుము= శరణం కోరు; అతండు మేలు+చేయంగలవాఁడు= అతడు నీకు మేలుచేయగలడు; అని పలికినన్= అని చెప్పిన; ఈశ్వరుని వలన= పరమశివునివల్ల; నిర్+ఆశుండు+ఐ= నిరాశపొందినవాడై; దుర్వాసుండు= దుర్వాసమహర్షి; వైకుంఠ నగరంబునకున్+చని= వైకుంఠ నగరానికి వెళ్ళి...

**తా :** మునీశ్వరా! నీవు ఆ పరమాత్మ శరణంకోరు. అతడు నీకు మేలు చేస్తాడు. అని చెప్పిన శివుని నుండి నిరాశపొందిన దుర్వాసుడు వైకుంఠానికి వెళ్ళి

**శా. ఆ వైకుంఠములోని భర్మమణిసౌధాగ్రంబుపై లచ్చి దాఁ**
**గ్రేవన్ మెల్లన నర్మభాషణములం గ్రీడించు పుణ్యున్ హరిన్**
**దేవాధీశ్వరుఁ గాంచి "యో వరద! యో దేవేశ! యో భక్త ర**
**క్షా విద్యాపరతంత్ర! మానుపఁ గదే, చక్రానలజ్వాలలన్. 115**

**ప్రతి :** ఆ వైకుంఠములోని= ఆ వైకుంఠనగరంలోని; భర్మ= బంగారు మయమైన; మణిసౌధ+అగ్రంబుపైన్= మణులు పొదిగిన భవనంపై; లచ్చి+తాన్= లక్ష్మియు, తానును; క్రేవన్= చెంతనే; నర్మభాషణములన్= సరసపుమాటలతో; క్రీడించు= విహరించునట్టి; పుణ్యున్= పుణ్యాత్ముడైన; దేవ+అధి+ఈశ్వరున్= దేవతలకు ప్రభువైన; హరిన్+కాంచి= విష్ణువును చూచి; ఓవరద!= ఓ వరాలిచ్చువాడా!; ఓ దేవ+ఈశ= ఓ దేవతలకు ప్రభూ!; ఓ భక్తరక్షా= భక్తుల్ని రక్షించడం అనే; విద్యాపరతంత్ర!= విద్యయందు నిమగ్నమైనవాడా!; చక్ర+అనల జ్వాలలన్= చక్రాగ్నిమంటల్ని; మానుపన్+కదు+ఏ= మాన్పవా...

**తా :** ఆ వైకుంఠంలో ఎత్తైన మణిభవనంపై లక్ష్మీదేవితో సరససల్లాపాలతో విహరించే దేవతా ప్రభువైన విష్ణుణ్ణి చూచి "ఓ వరదా! భక్తరక్షాపరాయణా! దేవేశా! చక్రాగ్నిమంటల్ని మాన్పవా?" అని అభ్యర్థించాడు.

**ఉ. నీ మహిమార్ణవంబు తుది నిక్కముగా నెఱుఁగంగ లేక నీ**
**ప్రేమకు వచ్చు దాసునకుఁ గ్రించుఁదనంబున నెగ్గు చేసితిన్**
**నా మఱపున్ సహింపు మట నారకుఁడైన మనంబులో భవ**
**న్నామము చింతసేసిన ననంతసుఖస్థితిఁ జెందకుండునే? 116**

**ప్రతి :** నీ మహిమ+అర్ణవంబు= నీ మాహాత్మ్యమనే సముద్రంయొక్క; తుదిన్= ఆవలి గట్టును; నిక్కము+కాన్+ఎఱుఁగంగన్+లేక= నిజంగా తెలుసుకోలేక; నీ ప్రేమకున్+వచ్చు= నీ వాత్సల్యానికి పాత్రుడైన; దాసునకున్= సేవకునికి; క్రించు+తనంబునన్= తక్కువదనంతో; ఎగ్గుచేసితిన్= అపకారం కలిగించాను; నా మఱపున్= నా అజ్ఞానాన్ని; సహింపుము= మన్నించు; అట= అదిగాక; నారకుఁడు+ఐనన్= నరకంలో ఉండేవాడైనా; మనంబులోన్= తన మనస్సులో; భవత్+నామము= నీ పేరును; చింత+చేసినన్= స్మరిస్తే; అనంతసుఖస్థితిన్= అధిక సౌఖ్యస్థితిని; చెందక+ఉండును+ఏ= పొందకుండా ఉండగలడా?

**తా :** పరమాత్మా! నీ మాహాత్మ్యం అనే సముద్రంయొక్క చివరను నిజంగా తెలుసుకోలేక నీవాత్సల్యానికి పాత్రుడైన నీ భక్తునికి అల్పబుద్ధితో హాని చేశాను. నా అజ్ఞానాన్ని క్షమించు. నరకలోకవాసియైనవాడుకూడా నీ పేరును స్మరిస్తే సౌఖ్యస్థితి పొందకుండా ఉంటాడా? (పొందుతాడని భావం)

**వ. అని పలికి, పాదకమలంబులకు మ్రొక్కి, లేవకయున్న దుర్వాసునిం గని హరి యిట్లనియె. 117**

**ప్రతి :** అని పలికి= అని చెప్పి; పాదకమలంబులకున్= పాదపద్మాలకు; మ్రొక్కి= నమస్కరించి; లేవక+ఉన్న= పైకి లేవకున్న; దుర్వాసునిన్+కని= దుర్వాసుణ్ణి చూచి; హరి= విష్ణువు; ఇట్లు+అనియెన్= ఇలాగన్నాడు;

**తా :** ఇలా చెప్పి, పాదపద్మాలకు నమస్కరించి, లేవకుండా అట్లే ఉండే దుర్వాసుణ్ణి చూచి, శ్రీహరి ఇలా అన్నాడు.

**చ. చలమున బుద్ధిమంతులగు సాధులు నా హృదయంబు లీల దొం**
**గిలి కొనిపోవుచుందురు రకిల్బిషభక్తిలతాచయంబులన్**
**నిలువఁగఁబట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభికైవడిన్**
**వలలకుఁ జిక్కి భక్తజనవత్సలతన్ జనుచుందుఁ దాపసా! 118**

**ప్రతి :** తాపసా!= ఓ మహర్షీ; చలమునన్= పట్టుదలతో; బుద్ధిమంతులు+అగు= తెలివి కలవారైన; సాధులు= సజ్జనులు; నా హృదయంబున్= నా మనసును; లీలన్= అలవోకగా; దొంగిలి కొనిపోవుచున్+ఉందురు= కొల్లగొట్టుకొని పోతుంటారు; మదకుంభికైవడిన్= మదపుటేనుగువలె; అకిల్బిష= పాపంలేని; భక్తిలతాచయంబులన్= భక్తి అనే తీగలసమూహంతో; నేరుపుతోన్= నేర్పుతో; నిలువన్+కన్+పట్టి= నిలబెట్టి పట్టుకొని; కట్టుదురు= కట్టివేస్తారు; వలలకున్+చిక్కి= ఆ బంధాలకు చిక్కి; భక్తజన= భక్తులయందలి; వత్సలతన్= ప్రేమతో; చనుచున్+ఉందున్= వెళుతుంటాను (వారితో)

**తా :** దుర్వాసుడు ఆవిధంగా పల్కి పాదాల మీది నుంచి లేవక అట్లే ఉండగా విష్ణుడిలా అన్నాడు. ఓ మహర్షీ! బుద్ధిమంతులైన సాధువులు నా మనసును అలవోకగా కొల్లగొట్టుకొని పోతుంటారు. పవిత్రమైన భక్తి అనే తీగలతో మదపుటేనుగును కట్టినట్లు నేర్పుతో నన్ను కట్టివేస్తారు. ఆ బంధాలకు చిక్కి భక్తులయందలి ప్రేమతో నేను వారిని అనుసరిస్తుంటాను.

**విశే :** పాదపద్మాలకు మొక్కిన దుర్వాసుడు పాదాలను వదలలేదు. అంటే సంపూర్ణ శరణాగతిని పొందాడు. భగవానుని భక్తజనవత్సలకు ఈ పద్యం తార్కాణం. భగవానుడు స్వేచ్ఛగా విహరించే మదగజం. దాన్ని బంధించాలంటే మంచి తీగలు కావాలి. అవికూడా భక్తి అనే తీగలు. ఆ భక్తితీగలతో ఆయన్ను బంధించవచ్చు. ఆ బంధనాలకు చిక్కిన ఆయన భక్తుడెలా వెళ్తే అలాగా వెళుతుంటాడు.

**ఆ. నాకు మేలుఁ గోరు నా భక్తుఁ డగువాఁడు, భక్తజనుల కేన పరమగతియు;**
**భక్తుఁ డెందుఁ జనినఁ బఱతెంతు వెనువెంట, గోవువెంటఁ దగులు కోడెభంగి. 119**

**ప్రతి :** నా భక్తుఁడు+అగువాఁడు= నా భక్తుడైనవాడు; నాకున్+మేలున్+కోరున్= నా క్షేమాన్ని కోరుకొంటాడు; భక్తజనులకున్= భక్తులకు; ఏను+అ= నేనే; పరమ గతియున్= దిక్కు; భక్తుఁడు+ఎందున్= భక్తుడెక్కడికి; చనినన్= వెళ్లినా; గోవువెంటన్+తగులు= ఆవు వెంటబడే; కోడెభంగిన్= కోడెలాగా; వెనువెంటన్= వెంటబడి; పఱతెంతున్ (పఱతెంచుదును)= పరుగెత్తుతాను.

**తా :** నా భక్తుడు నా క్షేమాన్ని కోరుతుంటాడు. భక్తులకు నేనే దిక్కు. భక్తుడెక్కడికి వెళితే నేను ఆవు వెంటబడే కోడెలాగా వెంటబడి వెళతాను.

**వ. అదియునుంగాక. 120**

**ప్రతి :** అదియునున్+కాక= అదీగాక.

**ఆ. తనువు మనువు విడిచి, తనయులఁ జుట్టాల, నాలి విడిచి, సంపదాళి విడిచి**
**నన్నె కాని యన్య మెన్నఁడు నెఱుఁగని, వారి విడువ నెట్టివారినైన. 121**

**ప్రతి :** తనువున్+మనువున్ విడిచి= దేహాన్ని, జీవితాన్ని వదలి; తనయులన్+చుట్టాలన్+ఆలిన్= సంతానాన్ని, బంధువులను, భార్యను; విడిచి= వదలి; సంపత్+ఆళిన్+విడిచి= ఐశ్వర్యాలను వదలి; నన్ను+ఎ, కాని= నన్నే తప్ప; అన్యమున్+ఎన్నఁడున్= ఇతరమెప్పుడును; ఎఱుఁగని వారిన్= తెలియనివారిని; ఎట్టివారినిన్+ఐనన్= ఎటువంటి వారినైనా; విడువను= విడిచిపెట్టను.

**తా :** దేహాన్ని, జీవితాన్ని, సంతానాన్ని, బంధువులను, భార్యను, ఐశ్వర్యాన్ని వదలి నన్నుతప్ప మరిదేనినీ ఎప్పుడునూ తెలియని వారిని, ఎట్టివారినైనా నేను వదలను.

**విశే :** భగవంతుని పొందుకోరడానికి మార్గాన్ని భగవానుడే చెబుతున్నాడు. అన్నింటిని వదలి నన్నే దిక్కుగా భావించేవారు ఏ లక్షణాలతో ఉన్నా, వారిని వదలను. ఎల్లప్పుడు కాపాడుతుంటాను అని భావం. అయితే పైన చెప్పినవన్నీ వదలటమెలాగా, శరీరం, జీవితం, ఆలుబిడ్డలు, ఐశ్వర్యం వీటిని వదిలేస్తే భగవానునిరక్ష లభిస్తుంది. అంటే వీటిమీద అహంకారమమకారాల్ని వదలాలి. భగవానుడే దిక్కుగా భావించేవారిని కాపాడుతూ ఉంటాడనడానికి గజేంద్రమోక్షం మంచి తార్కాణం.

**క. పంచేంద్రియముల తెరువుల, వంచించి మనంబునందు వరమతులు ప్రతి**
**ష్ఠించి వహింతురు నన్నును, మంచివరుం బుణ్యసతులు మరగిన భంగిన్. 122**

**ప్రతి :** మంచివరున్= ఉత్తముడైన వరుణ్ణి; పుణ్యసతులు= పతివ్రతలు; మరగిన భంగిన్= ఇష్టపడే విధంగా; వరమతులు= బుద్ధిమంతులు; పంచ+ఇంద్రియముల= పంచేంద్రియాల; తెరువులన్= మార్గాలను; వంచించి= మోసగించి; మనంబు+అందున్= మనస్సులలో; నన్నును= నన్ను (భగవానుణ్ణి); ప్రతిష్ఠించి= నిలబెట్టుకొని; వహింతురు (వహించుదురు)= మోస్తారు.

**తా :** ఉత్తముడైన భర్తను పతివ్రతలు ఇష్టపడినట్లు, బుద్ధిమంతులైన భక్తులు పంచేంద్రియాల మార్గాలను అరికట్టి తమమనసులో నన్నే భావించుకుంటారు.

**క. సాధులహృదయము నాయది; సాధులహృదయంబు నేను; జగముల నెల్లన్**
**సాధుల నేన యెఱుంగుదు, సాధు లెఱుంగుదురు నాదుచరితము విప్రా! 123**

**ప్రతి :** విప్రా!= బ్రాహ్మణుడా! (దుర్వాసా); సాధుల హృదయము= సజ్జనుల హృదయం; నా+అది= నాది; సాధులహృదయంబు= సాధుల హృదయం; నేను= నేనే; జగములన్+ఎల్లన్= లోకాలన్నిటిలో; సాధులన్= సజ్జనులను; నేను+అ= నేను మాత్రమే; ఎఱుంగుదున్= తెలియగలను; నాదుచరితము= నా నడవడి; సాధులు+ఎఱుంగుదురు= సజ్జనులు తెలుసుకోగలరు.

**తా :** ఓ బ్రాహ్మణుడా! సజ్జనుల హృదయం నాది. వారిహృదయమే నేను. లోకాలన్నిటిలో సాధులను నేనుమాత్రమే తెలుసుకోగలను. నా నడవడిని వారుమాత్రమే తెలుసుకోగలరు.

**విశే :** సాధుల హృదయాలనిండా నిండి ఉన్న భగవానునికి సాధులకు అభేదమని భావించాలి. ‘సజ్జనులందుఁదఱచు సొచ్చియుందు” అన్నాడు వామనుడు.

**ఆ. ధారుణీసురులకుఁ దపము విద్యయు రెండు, ముక్తి చేయుచుండు ముదముతోడ;**
**దుర్వినీతులైన దుర్జను లగువారి, కివియుఁ గీడు సేయ కేలయుండు? 124**

**ప్రతి :** ధారుణీ సురులకున్= భూదేవతలైన బ్రాహ్మణులకు; తపము విద్యయున్= తపస్సు, విద్యఅనే; రెండు; ముదముతోడన్= సంతోషంతో; ముక్తిన్= మోక్షాన్ని; చేయుచున్+ఉండున్= కలుగజేస్తాయి; దుర్వినీతులు+ఐన= నీతిదప్పిన; దుర్జనులు+అగువారికిన్= చెడ్డవారికి; ఇవియున్= ఈ రెండే; కీడున్+చేయక= హాని కలిగించక; ఏల+ఉండున్= ఎందుకుంటాయి?

**తా :** భూదేవులైన బ్రాహ్మణులకు తపస్సు, విద్య అనేవి మోక్షాన్ని కల్గిస్తాయి. అవినయపరులకు ఇవే హానిని కలిగిస్తాయి.

**క. నా తేజము సాధులలో, నాతతమై యుండు వారి నలఁచుజనులకున్**
**హేతిక్రియ భీతి నిచ్చుం, జేతోమోదంబుఁ జెఱుచు సిద్ధము సుమ్మీ. 125**

**ప్రతి :** నా తేజము= నా తేజస్సు; సాధులలోన్= సజ్జనుల్లో; ఆతతము+ఐ+ఉండున్= విస్తరించి ఉంటుంది; వారిన్+అలఁచు= వారిని కష్టపెట్టే; జనులకున్= వ్యక్తులకు; హేతిక్రియన్= ఆయుధంవలె; భీతిన్+ఇచ్చున్= భయాన్ని కలిగిస్తుంది; చేతస్+మోదంబున్= మనస్సుకు సంతోషాన్ని; చెఱుచున్= నాశనం చేస్తుంది; సిద్ధము సుమ్మీ= నిజం సుమా!

**తా :** నా తేజస్సు సజ్జనుల్లో నిండి ఉంటుంది. వారికి కష్టం కలిగించే వారికి ఆయుధం వలె భయాన్ని కలిగిస్తుంది. మనసుకు సంతోషం లేకుండా చేస్తుంది. ఇది నిజం.

**క. అదె పో బ్రాహ్మణ! నీకును, సదయుఁడు నాభాగసుతుఁడు జనవినుతగుణా**
**స్పదుఁ డిచ్చు నభయ మాతని, మది సంతసపఱచి వేఁడుమా శరణంబున్,. 126**

**ప్రతి :** బ్రాహ్మణ= ఓ బ్రాహ్మణుడా!; నీకును= నీకు; జనవినుత= జనులచే పొగడబడు; గుణ+ఆస్పదుఁడు= గుణాలు కలవాడు; సదయుఁడు= దయాపరుడు; నాభాగసుతుఁడు= నాభాగుని కుమారుడు (అంబరీషుడు); అభయమున్= అభయాన్ని; ఇచ్చున్= ఇస్తాడు; అది,పో= అదిసుమా! (ఇది సత్యం అని అర్థం) ఆతనిమదిన్= ఆతని మనస్సును; సంతసపఱచి= ప్రీతి కలిగించి; శరణంబున్= శరణాన్ని; వేఁడుము+ఆ= వేడుకో.

**తా :** ఓ బ్రాహ్మణుడా! నీకు జనులు పొగడే మంచి గుణవంతుడు, దయాపరుడు అయిన అంబరీషుడు అభయం ఇస్తాడు. అక్కడికే వెళ్ళు. అతని మనసుకు ప్రీతి కలిగించి శరణుకోరు. ఇది నీకు మంచి మార్గం సుమా!

**మ. అని శ్రీవల్లభుఁ డానతిచ్చిన మహోద్యచ్చక్రకీలావళీ**
**జనితాయాసుఁడు నిర్వికాసుఁ డుదితశ్వాసుండు దుర్వాసుఁ డ**
**ల్లన యేతెంచి సభక్తిఁ గాంచెఁ గరుణాలావణ్యవేషున్ విదో**
**ష నయోదారమనీషు మంజుమితభాషు న్నంబరీషున్ వెసన్. 127**

**ప్రతి :** అని= అంటూ; శ్రీవల్లభుఁడు= శ్రీపతి; ఆనతిన్+ఇచ్చినన్= ఆనతివ్వగా; మహా+ఉద్యత్= ఎంతో ప్రకాశవంతమైన; చక్ర= చక్రముయొక్క; కీల+ఆవళీ= జ్వాలల సమూహంచేత; జనిత+ఆయాసుఁడు= కలిగిన ఆయాసం కలవాడు; నిర్+వికాసుఁడు= కాంతిహీనుడు; ఉదిత= వదలుతున్న; శ్వాసుండు= శ్వాస కలవాడు అయిన; దుర్వాసుఁడు= దుర్వాసమహర్షి; అల్లనన్+ఏతెంచి= మెల్లగా వచ్చి; కరుణాలావణ్యవేషున్= కరుణతో కూడిన విలాసవంతమైన వేషం కలవాడు; విదోషున్= దోషాతీతుడు; నయ+ఉదార మనీషున్, నయ= నీతిచేత; ఉదార= గొప్పదైన; మనీషున్= ప్రజ్ఞ – కలవాడు; మంజు= మనోజ్ఞమైన; మితభాషున్= మితమైన వాక్కుకలవాడు అగు; అంబరీషున్= అంబరీషుణ్ణి; వెసన్= వెంటనే; సభక్తిన్+కాంచెన్= భక్తితో దర్శించాడు.

**తా :** అని ఆ లక్ష్మీపతి ఆనతివ్వగా, ప్రకాశవంతమైన చక్రజ్వాలలవల్ల ఆయాసపడ్డవాడు, కళతప్పినవాడు, రొప్పుతున్నవాడు అయిన దుర్వాసుడు మెల్లగా వచ్చి దయాస్వభావుడు, దోషరహితుడు, నీతిచేత గొప్ప ప్రజ్ఞకలవాడు హితమితభాషి అయిన అంబరీషుణ్ణి వెంటనే భక్తిపూర్వకంగా దర్శించుకున్నాడు.

**వ. కని, దుఃఖితుండై, యమ్మహీవల్లభుపాదంబులు వట్టి విడువకున్న నా నరేంద్రచంద్రుండు చరణస్పర్శ నంబునకు నోడుచుఁ గరుణారసభరితహృదయుండై, హరిచక్రంబు నిట్లని స్తుతియించె. 128**

**ప్రతి :** కని= చూచి; దుఃఖితుండు+ఐ= దుఃఖించి; ఆ+మహీవల్లభు= ఆ భూభర్తయొక్క; పాదంబులు+పట్టి= కాళ్లను పట్టుకొని; విడువక+ఉన్నన్= విడిచిపెట్టకుండగా; ఆ నర+ఇంద్ర, చంద్రుండు= ఆ రాజశ్రేష్ఠుడు; చరణస్పర్శనంబునకున్= పాదాలు పట్టుకున్నందుకు; ఓడుచున్= జంకుతూ; కరుణారసభరిత హృదయుండు+ఐ= దయారసంతోనిండిన మనస్సుకలవాడై; హరిచక్రంబున్= విష్ణుచక్రాన్ని; ఇట్లు+అని= ఈ విధంగా; స్తుతియించెన్= స్తోత్రంచేశాడు.

**తా :** దుర్వాసుడు చూచి దుఃఖించి ఆ రాజు కాళ్లను పట్టుకొని విడువకుండగా, ఆ రాజచంద్రుడు తన పాదస్పర్శకు జంకి, దయా హృదయుడై విష్ణుచక్రాన్ని ఈ విధంగా స్తోత్రం చేశాడు.

**సీ. నీవ పావకుఁడవు; నీవ సూర్యుండవు; నీవ చంద్రుండవు; నీవ జలము;**
**నీవ నేలయు; నింగి వీవ; సమీరంబు నీవ; భూతేంద్రియనికర మీవ;**
**నీవ బ్రహ్మంబును; నీవ సత్యంబును; నీవ యజ్ఞంబును; నీవ ఫలము;**
**నీవ లోకేశులు; నీవ సర్వాత్మయు; నీవ కాలంబును నీవ జగము;**

**తే. నీవ బహుయజ్ఞభోజివి;నీవ నిత్య, మూలతేజంబు; నీకు నే మ్రొక్కువాఁడ**
**నీరజాక్షుండు చాల మన్నించు నట్టి, శస్త్రముఖ్యమ! కావవే చాలు మునిని 129**

**ప్రతి :** నీరజ+అక్షుండు= పద్మనేత్రుడైనహరి; చాలన్= ఎక్కువగా; మన్నించు+అట్టి= గౌరవించునట్టి; శస్త్రముఖ్యము+అ= ఆయుధ శ్రేష్ఠమా!; నీవు+అ= నీవే; పావకుఁడవు= అగ్నివి; నీవు+అ= నీవే; సూర్యుండవు= సూర్యుడివి; నీవు+అ= నీవే; చంద్రుండవు= చంద్రుడివి; నీవు+అ= నీవే; జలము= నీటివి; నీవు+అ= నీవే; నేలయు= భూమివి; నీవు+అ= నీవే; నింగివి= ఆకాశానివి; నీవు+అ= నీవే; సమీరంబు= గాలివి; నీవు+అ= నీవే; భూత+ఇంద్రియనికరము= ప్రాణులు, ఇంద్రియసమూహం; నీవు+అ= నీవే; బ్రహ్మంబును= బ్రహ్మం; నీవు+అ= నీవే; సత్యంబును= సత్యానివి; నీవు+అ= నీవే; యజ్ఞంబును= యజ్ఞానివి; నీవు+అ= నీవే; ఫలము= ఆ యాగఫలానివి; నీవు+అ= నీవే; లోక+ఈశులు= లోకపాలకులు; నీవు+అ= నీవే; సర్వ+ఆత్మయున్= సర్వాత్మవు; నీవు+అ= నీవే; కాలంబును= కాలానివి; నీవు+అ= నీవే; జగము= ప్రపంచానివి; నీవు+అ= నీవే; బహుయజ్ఞభోజివి= అనేక యజ్ఞాలభోక్తవు; నీవు+అ= నీవే; నిత్యమూలతేజంబు= శాశ్వతమైన మూలతేజస్సువు; నీకున్= అట్టినీకు; నేన్= నేను; మ్రొక్కువాఁడన్= నమస్కరిస్తున్నాను; మునినిన్= మహర్షిని; కావుము+ఏ= రక్షించవే; చాలు= ఇకచాలు.

**తా :** శ్రీహరి మన్నించు ముఖ్యాయుధమా! నీవే అగ్నివి, సూర్యుడివి, చంద్రుడివి, నీటివి, భూమివి, ఆకాశానివి, గాలివి, ప్రాణేంద్రియాలు నీవే. నీవే బ్రహ్మవు, సత్యానివి, యజ్ఞానివి, యజ్ఞఫలానివి, నీవే లోకపాలకులు! నీవే సర్వాత్మవు, కాలానివి, లోకానివి నీవే, అనేకయాగభోక్తవు, నిత్యానివి, మూలతేజానివి నీవే. అటువంటినీకు నమస్కరిస్తున్నాను. మహర్షిని కాపాడు.నాకంతే చాలు.

**మ. హరిచే నీవు విసృష్టమై చనఁగ ము న్నాలించి నీ ధారలన్**
**ధరణిన్ వ్రాలుట నిక్క మంచు మునుపే దైత్యేశ్వరవ్రాతముల్**

**శిరముల్ పాదములున్ భుజోరుయుగమున్ చేతుల్ నిజాంగంబు ల**
**ప్పొరగం బ్రాణసమీరముల్ వెడలు నీ యుద్ధంబులం జక్రమా! 130**

**ప్రతి :** చక్రమా!= ఓ చక్రాయుధమా; నీయుద్ధంబులన్= నీ యుద్ధాలలో; హరిచేన్= విష్ణువుచేత; నీవు; విసృష్టము+ఐ= వదలబడిన దానవై; చనన్+కన్= వెళ్ళగా; మున్ను+ఆలించి= (ఆ విషయం) ముందే తెలుసుకొని; నీ ధారలన్= నీ పదునుచేత; ధరణిన్+వ్రాలుట= భూమిపై పడడం (చావడం); నిక్కము+అంచు= నిజమని; మునుపు+ఏ= (చక్రం సమీపించడానికి) ముందే; దైత్య+ఈశ్వరవ్రాతముల్= రాక్షసరాజుల సమూహాలు; శిరముల్ పాదములున్= తలలు, పాదాలు; భుజ+ఊరుయుగమున్= భుజాలు, తొడలు; చేతుల్= చేతులు మొదలైన; నిజ+అంగంబులు= తమ శరీరావయవాలు; అప్డు+ఒరగన్= ఆ క్షణమే వాలిపోగా; ప్రాణసమీరముల్= ఆ రాక్షసుల ప్రాణవాయువులు; వెడలున్= వెళ్లిపోతాయి.

**తా :** ఓ చక్రాయుధమా! యుద్ధాల్లో నీవు విష్ణువుచేత వదలబడడాన్ని ముందే విని నీ పదునుచేత ఎలాగూ చావడం జరుగుతుందని ముందే రాక్షసరాజులు తమ తలలు, పాదాలు, భుజాలు, తొడలు, చేతులు, మొదలైన శరీరావయవాలు వాలిపోగా ప్రాణవాయువులను వదలుతారు (మరణిస్తారు).

**ఆ. కలఁగి నిద్రవోవఁ గలలోన వచ్చిన, నిన్నుఁ జూచి దీర్ఘనిద్ర వోదు**
**రసురవరులు శయ్యలందున్నసతులు ప్ర, భాతమందు లేచి పలవరింప. 131**

**ప్రతి :** అసురవరులు= రాక్షసశ్రేష్ఠులు; కలఁగి= కలతపడి; నిద్రన్+పోవన్= నిద్రించగా; కలలోనన్+వచ్చిన= స్వప్నంలో కనపడిన; నిన్నున్+చూచి= నిన్ను గాంచి; ప్రభాతము+అందున్= తెల్లవారగనే; శయ్యలందు+ఉన్న= పడకలపైనున్న; సతులు= స్త్రీలు; లేచి= మేల్కొని; పలవరింపన్= దుఃఖించునట్లు; దీర్ఘనిద్ర+పోదురు= మరణిస్తారు.

**తా :** కలతనిద్ర చెందిన రాక్షసులు కలలో కనపడిన నిన్ను చూచి మరణిస్తారు. తెల్లవారిన తరువాత వారి భార్యలు అది చూచి ఏడుస్తారు.

**ఉ. చీఁకటి వాపుచున్ వెలుఁగు సేయుచు సజ్జనకోటి నెల్ల స**
**శ్రీకులఁజేయు నీ రుచులు చెల్వుగ ధర్మసమేతలై నినున్**
**వాకున నిట్టి దట్టిదని వర్ణన సేయ విధాత నేరఁ డ**
**స్తోకము నీదు రూపు గలదుందుది లేదు పరాత్పరాద్యమై. 132**

**ప్రతి :** నీ రుచులు= నీ తేజస్సులు (కాంతులు); చెల్వుగన్= చక్కగా; ధర్మసమేతలు+ఐ= ధర్మబద్ధులై; చీఁకటిన్+పాపుచున్= చీకట్లను పారద్రోలుతూ; వెలుఁగున్+చేయుచున్= వెలుగును కలుగజేస్తూ; సత్+జనకోటిన్+ఎల్లన్= సత్పురుషుల గుంపునంతటిని; సశ్రీకులన్+చేయున్= సంపన్నులను చేస్తాయి; నినున్= నిన్ను; వాకున+ఇట్టిది+అట్టిది+అని= మాటలతో ఇలాంటిది అలాంటిది అని; వర్ణన+చేయన్= వర్ణించడం; విధాత= బ్రహ్మ; నేరఁడు= తెలియడు; నీదురూపు= నీ రూపం; పరాత్పర+ఆద్యము+ఐ= పరాత్పరుడు ఆదిగా కలదై; కలదున్= ఉన్నది; తుదిలేదు= అంతంలేదు (అనంతమైనది); అస్తోకము= మహోన్నతమైనది.

**తా :** ధర్మమయమైన నీకాంతులు చీకటిని పారద్రోలుతూ, వెలుగులను పుట్టిస్తూ, సజ్జనులను సంపన్నం చేస్తాయి. నిన్నుగూర్చి వర్ణించడం బ్రహ్మకు అశక్యం. నీ రూపం సర్వోత్కృష్టములలో మొదటిదై ఉన్నది. తుది లేదు. మహోన్నతమైనది.

**ఆ. కమలలోచనుండు ఖలుల శిక్షింపంగఁ, బాలు సేయ నీవు పాలు వడితి**
**వైన నింకఁ జాలు నాపన్నుఁడై యున్న, తపసిఁ గావు నీవు ధర్మవృత్తి. 133**

**ప్రతి :** కమలలోచనుండు= పద్మాల్లాంటి నేత్రాలుకలిగినవాడు(హరి); ఖలులన్= దుర్మార్గులను; శిక్షింపన్+కన్= శిక్షించడానికి; పాలు+చేయన్= నియోగించగా; నీవు పాలు+పడితివి= నీవు పూనుకొన్నావు; ఐనన్= అయినా; ఇంకన్+చాలున్= ఇకచాలు; నీవు; ధర్మవృత్తిన్= ధర్మప్రవృత్తితో; ఆపన్నుఁడు+ఐ+ఉన్న= శరణార్థియై ఉన్న; తపసిన్+కావుము= మునిని రక్షించు.

**తా :** పుండరీకాక్షుడైన హరి దుర్జనులను శిక్షించడానికి నిన్ను నియోగించగా నీవు పూనుకొన్నావు. అయినా ఇకచాలు. ధర్మప్రవృత్తితో ఆపన్నుడై ఉన్న మునిని రక్షించు.

**వ. అని వినుతించి కేలుఁదమ్మిదోయి నొసలంబొసంగించి యిట్లనియె. 134**

**ప్రతి :** అని వినుతించి= అని పొగడి; కేలు+తమ్మిదోయి= తామరలవంటి రెండుచేతులను; నొసలన్+పొసంగించి= నొసటమీద ఉంచి, నమస్కరించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అని చక్రాన్ని పొగిడి నుదుటియందు చేతులు జోడించి (నమస్కరించి) ఇట్లా అన్నాడు.

**ఆ. ఏ నమస్కరింతు నింద్రశాత్రవ ధూమ, కేతువునకు ధర్మసేతువునకు**
**విమలరూపమునకు విశ్వదీపమునకుఁ, జక్రమునకు గుప్తశక్రమునకు. 135**

**ప్రతి :** ఇంద్రశాత్రవ= దేవేంద్రుని శత్రువులైన రాక్షసులకు; ధూమకేతువునకున్= మృత్యుసూచకమైన తోకచుక్కకు; ధర్మసేతువునకున్= ధర్మ వారధికి; విమల రూపమునకున్= స్వచ్ఛమైన ఆకారానికి; విశ్వదీపమునకున్= ప్రపంచపు వెలుగుకు; గుప్త శక్రమునకున్= దేవేంద్రుని కాపాడే; చక్రమునకున్= చక్రానికి; ఏన్+ నమస్కరింతున్= నేను నమస్కరిస్తాను.

**తా :** ఇంద్రుని శత్రువులైన రాక్షసులకు తోకచుక్కలాంటిది, ధర్మానికి వంతెన వంటిది, స్వచ్ఛమైన ఆకారంకలది, ప్రపంచానికి వెలుగునిచ్చే దీపం దేవేంద్రుని రక్షించేది అయిన చక్రానికి నేను నమస్కరిస్తున్నాను.

**వ. అని మఱియు నిట్లనియె. 136**

**ప్రతి :** అని= పైవిధంగా పలికి; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇలాగన్నాడు.

**తా :** అని ప్రశంసించి ఇంకా ఇలాగన్నాడు.

**ఆ. విహితధర్మమందు విహరింతు నేనియు, నిష్టమైన ద్రవ్య మిత్తునేని**
**ధరణిసురుఁడు మాకు దైవతంబగునేని, విప్రునకు శుభంబు వెలయుఁగాక! 137**

**ప్రతి :** విహితధర్మము+అందున్= విధించబడిన ధర్మమార్గమందు; విహరింతున్+ఏనియున్= నడచేవాడినైతే; ఇష్టము+ఐన= (ఇతరులకు) కావలసిన; ద్రవ్యమున్= ధనాన్ని; ఇత్తున్+ఏని= ఇచ్చేవాడినైతే; ధరణిసురుఁడు= భూదేవుడైన బ్రాహ్మణుడు; మాకున్= మాకు; దైవతంబు+అగును+ఏని= దైవసమానుడయితే; విప్రునకు= బ్రాహ్మణునకు (దుర్వాసునకు); శుభంబు= మేలు; వెలయున్+కాక= కలుగుగాక.

**తా :** నేను విధించబడిన ధర్మమార్గంలో నడిచేవాడనయితే, యాచకులు అర్థించిన ద్రవ్యాన్ని దానం చేసినవాడనయితే, బ్రాహ్మణుడు మాకు దైవసమానుడే అయితే ఈ మహర్షికి శుభం కలుగుగాక.

**క. అఖిలగుణాశ్రయుఁడగు హరి, సుఖియై నా కొలువువలనఁ జొక్కెడినేనిన్**
**నిఖిలాత్మమయుండగుటకు, సుఖమందుంగాక భూమిసురుఁ డివ్వేళన్. 138**

**ప్రతి :** అఖిల= సమస్తమైన; గుణ+ఆశ్రయుఁడు+అగు= గుణాలకు నిలయుడైన; హరి= విష్ణువు; సుఖి+ఐ= సుఖంకలవాడై; నా కొలువువలనన్= నా సేవవలన; చొక్కెడిన్+ఏనిన్= పరవశుడైతే; నిఖిల= సమస్తమైన; ఆత్మమయుండు+అగుటకు= ఆత్మలనిండినవాడు కావడానికి తార్కాణంగా; ఈ+వేళన్= ఇప్పుడు; భూమిసురుఁడు= భూదేవుడు; సుఖము+అందున్+కాక= సుఖాన్ని పొందుగాక.

**తా :** సర్వగుణాశ్రయుడైన హరి నా సేవచేత పరవశుడే అయితే, సర్వాత్మల యందుండువాడయితే, ఇప్పుడీ బ్రాహ్మణుడు సుఖాన్ని పొందుగాక.

**వ. అని యివ్విధంబునం బొగడు పుడమితేని వలన మన్నించి, తపసిని దాహంబు నొందింపక, రక్కసుల గొంగ చక్రంబు తిరిగి చనియె; నంత దుర్వాసుండు శాంతిం బొంది మెల్లని మేలిమి మాటల నా రాజుం దీవించి, యిట్లనియె. 139**

**ప్రతి :** అని= అంటూ, ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; పొగడు= స్తుతించే; పుడమితేనివలనన్= భూమికి ప్రభువైన రాజునుండి; తపసిని= మునిని; మన్నించి= క్షమించి; దాహంబున్+ఒందింపక= కాల్చక; రక్కసుల గొంగ= రాక్షసుల శత్రువైన విష్ణువుయొక్క; చక్రంబు= చక్రము; తిరిగి చనియెన్= వెనుకకు మరలి వెళ్ళింది; అంతన్= పిమ్మట; దుర్వాసుండు= దుర్వాసమహర్షి; శాంతిన్+పొంది= నెమ్మదిని కలిగి; మెల్లని= మృదువైన; మేలిమిమాటలన్= మంచి మాటలతో; ఆ రాజున్+దీవించి= ఆ రాజుని ఆశీర్వదించి; ఇట్లు+అనియెన్= ఇలాగన్నాడు.

**తా :** ఈ విధంగా రాజు స్తుతించగా మునిని మన్నించి, బాధపెట్టకుండా విష్ణుచక్రం మరలివెళ్లింది. తరువాత దుర్వాసుడు నెమ్మదిగా మెల్లని మంచి మాటలతో ఆ రాజుని ఆశీర్వదించి ఇలా అన్నాడు.

**మ. 'నరనాథోత్తమ! మేలు సేసితి కదా! నా తప్పు మన్నించి శ్రీ**
**హరి పాదాబ్జము లింతముట్టఁగొలుతే? యాశ్చర్య మౌ నెన్నుచో**
**నరుదంద్రే నినుఁబోఁటి సాధులకుఁదానై యిచ్చుటల్ గాచుటల్**
**సొరిదిన్ నైజగుణంబులై సరస వచ్చుంగాదె మిత్రాకృతిన్. 140**

**ప్రతి :** నరనాథ+ఉత్తమ= ఓ రాజోత్తమా!; నా తప్పున్= నా దోషాన్ని; మన్నించి= కాచి; మేలున్+చేసితి+కదా!= మేలుచేశావు కదా!; శ్రీహరి= విష్ణువుయొక్క; పాద+అబ్జముల్= పాదపద్మాల్ని; ఇంతన్= ఇంతగా; ముట్టన్+కొలుతువు+ఏ= అంటునట్లు సేవించావా?; ఎన్నుచోన్= ఊహిస్తే; ఆశ్చర్యము+ఔన్= ఆశ్చర్యం కలుగుతోంది; నినున్+బోఁటి= నీ లాంటి; సాధులకున్= సజ్జనులకు; తాను+ఐ= తానే స్వయంగా; ఇచ్చుటల్+కాచుటల్= ఇవ్వడం, కాపాడ్డం అనేవి; అరుదు+అంద్రు+ఎ= అరుదేమీకాదు; సొరిదిన్= క్రమంగా; మిత్ర+ఆకృతిన్= మైత్రీపూర్వకంగా; నైజగుణంబులు+ఐ= సహజగుణాలై; సరస వచ్చున్+కాదు+ఎ= సమీపిస్తాయి కదా!

**తా :** ఓ రాజోత్తమా! నా తప్పుకాచి మేలుచేశావుకదా! విష్ణువు పాదపద్మాల్ని ఇంతగా సేవించావా? ఆశ్చర్యం కలుగుతోంది. నీ బోటి సన్మార్గుల విషయంలో అరుదేమికాదు. నీ వంటివారికి, దానం, రక్షణ అనేవి క్రమంగా మైత్రీపూర్వకంగా సహజగుణాలై సరసకు వస్తాయి కదా!

**వ. అదియునుం గాక. 141**

**ప్రతి :** అదియునున్+కాక= అదీగాక.

**మ. ఒక మా టెవ్వని పేరు కర్ణములలో నొయ్యారమై సోఁకినన్**
**సకలాఘంబులు పల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో నట్టి స**
**త్సుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశుఁ దా**
**నకలంకస్థితిఁ గొల్చు భక్తులకు లే దడ్డంబు రాజాగ్రణీ! 142**

**ప్రతి :** రాజ+అగ్రణీ!= రాజశ్రేష్ఠా!; ఒక్కమాటు+ఎవ్వని పేరు= ఒక్కసారి ఎవ్వని పేరు; కర్ణములలోన్= చెవులకు; ఒయ్యారము+ఐ= అలవోకగా; సోఁకినన్= తాకితే; సకల+అఘంబులు= సమస్త పాపాలు; సంభ్రాంతితోన్= తొట్రుపాటుతో; పల్లటిల్లి తొలఁగున్= కిందుమీదై పక్కకు తొలగుతాయో; అట్టి= అటువంటి; సత్+సుకరున్= మంచిని కలుగజేసేవానిని; మంగళతీర్థపాదున్= మంగళకరమైన తీర్థం పాదములందుగలవానిని; దేవదేవ+ఈశున్= దేవతల ప్రభువును; హరిన్= హరిని; విష్ణున్= విష్ణుని; తాన్= తాను; అకలంకస్థితిన్+కొల్చు= మలినంలేని బుద్ధితో సేవించే; భక్తులకున్= భక్తులకు; అడ్డంబు లేదు= ఆటంకం లేదు.

**తా :** ఓ రాజోత్తమా! ఎవ్వని పేరు ఒక్కసారి చెవులకు అలవోకగా సోకితే సమస్తమైన పాపాలు తొట్రుపాటుతో కిందు మీదై వైదొలగుతాయో, అటువంటి మంచిని కలుగజేసే, మంగళకరమైన తీర్థం (గంగ) పాదములందుగల దేవేశుడైన విష్ణుని నిష్కళంక బుద్ధితో సేవించే భక్తులకు అడ్డముండదు.

**మత్తకోకిల.**

**తప్పు లోఁగొని చక్రపావకదాహముం బెడఁబాపి తొ**
**నొప్పునొప్పు భవద్దయారస మో నరేశ్వర! ప్రాణముల్**
**సెప్ప మున్మును వోయి క్రమ్మఱఁజేరె ధన్యుఁడ నైతి నీ**
**కెప్పుడున్ శుభ మేను గోరెద నింకఁబోయెద భూవరా! 143**

**ప్రతి :** భూవరా!= ఓ రాజా! తప్పున్= దోషాన్ని (నేను చేసిన); లోఁగొని= లెక్కపెట్టక; చక్రపావక దాహమున్= చక్రంయొక్క అగ్నిదహించుటను; పెడన్+పాపితివి+ఔన్= తప్పించావు; భవత్+దయారసము= నీయొక్క కరుణారసము; ఒప్పున్+ఒప్పున్= బాగా ఒప్పినది; ఓ= నర+ఈశ్వర= ఓ రాజా; చెప్పన్= చెప్పాలంటే; ప్రాణముల్= ప్రాణాలు; మున్+మును= ముందు ముందే; పోయి; క్రమ్మఱన్= మళ్లీ; చేఱెన్= వచ్చాయి; ధన్యుఁడన్+ఐతిన్= ధన్యతను పొందాను; నీకున్+ఎప్పుడున్= నీకెప్పుడూ; ఏను= నేను; శుభము= మంగళం; కోరెదన్= కోరుతాను; ఇంకన్+పోయెదన్= ఇంక వెళతాను.

**తా :** 'ఓ రాజా! నేను చేసిన తప్పును పట్టించుకోకుండా, చక్రాగ్ని దహించుటనుండి నన్ను తప్పించావు. నీ కరుణరసం నీకే తగును రాజా! చెప్పాలంటే నా ప్రాణాలు పోయి మళ్లీవచ్చాయి. ధన్యుడనయ్యాను. ఎప్పుడూ నీ శ్రేయస్సునే కోరుతాను. ఇక వెళతాను'. అన్నాడు మహర్షి.

**క. అనిన విని రాజముఖ్యుఁడు, మునివల్లభు పాదములకు మ్రొక్కి కడున్ మ**
**న్నన సేసి యిష్టభోజన, మనువుగఁబెట్టించెఁదృప్తుఁడయ్యె నతండున్. 144**

**ప్రతి :** అనినన్+విని= అని పల్కగా ఆలకించి; రాజముఖ్యుఁడు= రాజులలో ప్రముఖుడైన అంబరీషుడు; మునివల్లభు= మునిశ్రేష్ఠునియొక్క; పాదములకున్= పాదాలకు; మ్రొక్కి= నమస్కరించి; కడున్= మిక్కిలి; మన్నన+చేసి= గౌరవించి; ఇష్టభోజనము= ప్రియమైన భోజనాన్ని; అనువుగన్= తగినట్లు; పెట్టించెన్= పెట్టించాడు; అతండున్= ఆ మునికూడా; తృప్తుఁడు+అయ్యెన్= తృప్తిపొందాడు.

**తా :** అని దుర్వాసుడు చెప్పగా విని ఆ రాజముఖ్యుడైన అంబరీషుడు మునిపాదాలకు ప్రణమిల్లి, గౌరవించి ఇష్టమైన భోజనం పెట్టించాడు. ఆ ముని తృప్తి పొందాడు.

**వ. మఱియు నమ్మునీంద్రుం డిట్లనియె. 145**

**ప్రతి :** మఱియు= మరల; ఆ+మునీంద్రుండు= ఆ మునీంద్రుడు (దుర్వాస మహర్షి); ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** మరల ఆ దుర్వాసమహర్షి అంబరీషుడితో ఇలా అన్నాడు.

**శా. "కంటిన్ నేఁటికి నిన్ను నీ వచనముల్ కర్ణద్వయప్రీతిగా**
**వింటి న్నన్నముఁ గొంటి నీ గృహమునన్ వేడ్కన్ ఫలంబబ్బె నే**
**మంటిన్ బోయెద! నీ చరిత్ర మమరుల్ మర్త్యుల్ సుఖాసీనులై**
**మింటన్ మేదిని సన్నుతింపఁగల రీమీఁదన్నరేంద్రాగ్రణీ! 146**

**ప్రతి :** నరేంద్ర+అగ్రణీ!= రాజశ్రేష్ఠుడా!; నిన్నున్= నిన్ను; నేఁటికి= ఈ దినానికి; కంటిన్= చూడగలిగాను; కర్ణద్వయప్రీతి+కాన్= రెండు చెవులకు సంతోషకరంగా; నీ వచనముల్= నీ మాటలు; వింటిన్= విన్నాను; నీ గృహమునన్= నీ ఇంటిలో; వేడ్కన్= సంతోషంతో; అన్నమున్+కొంటిన్= భోజనం చేశాను; ఫలంబు+అబ్బెన్= వ్రతంయొక్క ఫలితం దక్కింది; నేన్+మంటిన్= నేను బ్రదికాను; పోయెదన్= వెళతాను; నీ చరిత్రము= నీ నడవడిని; ఈ మీఁదన్= ఇక మీదట; సుఖ+ఆసీనులు+ఐ= సుఖంగా కూర్చొని; మింటన్ మేదినిన్= ఆకాశంలో, భూమిపైన; అమరుల్, మర్త్యుల్= దేవతలు, మానవులు; సన్నుతింపన్+కలరు= పొగడుతారు.

**తా :** ఓ రాజచంద్రా! ఈ రోజు నిన్ను చూచాను. వీనులవిందుగా నీ మాటలు విన్నాను. నీ ఇంట్లో తృప్తిగా భోజనంచేశాను. వ్రతఫలితం దక్కింది. నేను బ్రతికాను. నీ నడవడిని ఆకాశంలో దేవతలు, భూమిపై మానవులు ఇకమీదట సుఖంగా కూర్చొని పొగడుతూ ఉంటారు. ఇక వెళతాను.

**వ. అని చెప్పి దుర్వాసుం డంబరీషుని దీవించి, కీర్తించి, మింటి తెరువున బ్రహ్మలోకమునకుం జనియె. మునీశ్వరుండు తిరిగి చనువేళకు నొక సంవత్సరంబు నిండి, వ్రతంబు పరిపూర్ణంబయిన. 147**

**ప్రతి :** అని చెప్పి= అని పలికి; దుర్వాసుండు; అంబరీషుని దీవించి= అంబరీషుని ఆశీర్వదించి; కీర్తించి= పొగడి; మింటి తెరువునన్= ఆకాశమార్గంలో; బ్రహ్మలోకంబునకున్= బ్రహ్మలోకానికి; చనియెన్= వెళ్లాడు; ముని+ఈశ్వరుడు= మునిశ్రేష్ఠుడు; తిరిగి చనువేళకున్= తిరిగి వెళ్లిన కాలానికి; ఒక సంవత్సరంబు= ఒక ఏడాది; నిండి= పూర్తిఅయి; వ్రతంబు= ద్వాదశీవ్రతం; పరిపూర్ణంబు+అయిన= పూర్తికాగా...

**తా :** అని పలికి దుర్వాసుడు అంబరీషుని ఆశీర్వదించి ప్రశంసించి ఆకాశమార్గంలో బ్రహ్మలోకానికి వెళ్లాడు. ఆయన వచ్చివెళ్ళినప్పటికి ఒక సంవత్సరం నిండి ద్వాదశీవ్రతం పూర్తి అయింది.

**ఆ. అవనిసురుఁడు గుడువ నతిపవిత్రంబైన, వంటకంబు భూమివరుఁడు గుడిచెఁ**
**దపసి నెగులు మాన్పఁ దానెంతవాఁడను, హరి కృపామహత్త్వ మనుచుఁ దలఁచి. 148**

**ప్రతి :** తపసి= ముని; నెగులు మాన్పన్= కష్టం పోగొట్టడానికి; తాను+ఎంత వాఁడను= నేనెంతవాడిని; హరి కృపామహత్త్వంబు+అనుచున్= (ఇదంతా) విష్ణువు దయామహిమే అంటూ; తలఁచి= భావించి; అవనిసురుఁడు= భూదేవుడు (ముని); కుడువన్= తినుటచే; అతిపవిత్రంబు+ఐన= మిక్కిలి పవిత్రమైన; వంటకంబున్= భోజనాన్ని; భూమివరుఁడు= రాజు; కుడిచెన్= తిన్నాడు.

**తా :** "మునికి వచ్చిన కష్టం పోగొట్టడానికి నేనెంత వాడిని. అంతా విష్ణువు దయావిశేషమే" అంటూ రాజు ముని తినడంచేత పవిత్రమైన అన్నాన్ని తిన్నాడు.

**వ. మఱియును. 149**

**ప్రతి :** మఱియును= ఇంకనూ...

**క. హరిఁగొల్చుచుండువారికిఁ, బరమేష్ఠిపదంబు మొదలు పదభోగంబుల్**
**నరకసమములను తలఁపున, ధరణీరాజ్యంబుతోడి తగులము మానెన్. 150**

**ప్రతి :** హరిన్= విష్ణువును; కొల్చుచున్+ఉండువారికిన్= సేవిస్తూ ఉండేవారికి; పరమేష్ఠిపదంబు= బ్రహ్మపదవి; మొదలు= మొదలుకొని; పదభోగంబుల్= అధికార భోగభాగ్యాలన్నీ; నరకసమములు+అను= నరకంతో సమానమైనవనే; తలఁపునన్= ఆలోచనతో; ధరణీరాజ్యంబుతోడి= రాజ్యముతో, భూపాలనతో; తగులము+మానెన్= సంబంధం వదలుకున్నాడు.

**తా :** హరిసేవకులకు బ్రహ్మపదవి మొదలుకొని అనేక పదవుల వల్ల లభించే భోగభాగ్యాలు నరకప్రాయాలని భావించి అంబరీషుడు రాజ్యంతో తనకుగల సంబంధాన్నే వదలుకున్నాడు.

**వ. ఇట్లు విరక్తుం డై 151**

**ప్రతి :** ఇట్లు= ఈవిధంగా; విరక్తుండు+ఐ= విరక్తి కలిగినవాడై...

**తా :** ఈ విధంగా విరక్తి కలిగినవాడై

**ఆ. తనకు సదృశులైన తనయుల రావించి, ధరణిభరము వారిఁ దాల్పఁ బంచి**
**కాననంబు సొచ్చెఁ గామాది విజయుఁడై, నరవిభుండు హరిసనాథుఁ డగుచు. 152**

**ప్రతి :** నరవిభుఁడు= మానవులకు ప్రభువైనరాజు; హరిసనాథుఁడు+అగుచు= విష్ణువే తనకు ప్రభువుకాగా; కామ+ఆది= (అరిషడ్వర్గాలను) కామం మొదలైన వాటిని; విజయుఁడు+ఐ= జయించినవాడై; తనకున్+సదృశులు+ఐన= తనకు సమానులైన; తనయులన్+రావించి= కొడుకులను పిలిపించి; ధరణిభరము= రాజ్యభారము; వారిన్+తాల్పన్+పంచి= వారు మోయునట్లు పంపకంచేసి; కాననంబున్+చొచ్చెన్= అడవికి వెళ్లాడు.

**తా :** మానవులకు ప్రభువైన రాజు తనకు విష్ణువే ప్రభువుకాగా కామక్రోధాదులను జయించినవాడై తనతో సమానులైన కొడుకులను పిలిచి రాజ్యభారాన్ని వారికి అప్పగించి అడవికి వెళ్లాడు.

**క. ఈ యంబరీషచరితము, తీయంబున విన్నఁ జదువ ధీసంపన్నుం**
**డై యుండును భోగపరుం, డై యుండును నరుఁడు పుణ్యుఁడై యుండు నృపా! 153**

**ప్రతి :** నృపా!= ఓ రాజా (పరీక్షిత్తు); ఈ+అంబరీషచరితము= ఈ అంబరీషుని చరిత్రను; తీయంబున= ఆసక్తితో; విన్నన్= విన్ననూ; చదువన్= చదివిననూ; నరుఁడు= మానవుడు; ధీ సంపన్నుండు+ఐ+ఉండును= బుద్ధిమంతుడై ఉంటాడు; భోగపరుండు+ఐ+ఉండును= భోగపరుడై ఉంటాడు; పుణ్యుఁడు+ఐ+ఉండున్= పుణ్యాత్ముడై ఉంటాడు.

**తా :** ఈ అంబరీషుని చరిత్ర విన్నా, చదివినా మానవుడు బుద్ధిమంతుడవుతాడు. భోగపరుడవుతాడు. పుణ్యాత్ముడవుతాడు.

**విశే :** ఇది అంబరీషుని కథకు ఫలశ్రుతి.

**వ. విను మయ్యంబరీషునకు విరూపుండును, గేతుమంతుండును, శంభుండు నను వారు ముప్వురు కొడుకు; లందుఁ గేతుమంతుండును, శంభుండును హరింగూర్చి తపంబు సేయువారై, వనంబునకుం జనిరి. విరూపునికిఁ బృషదశ్వుండును, బృషదశ్వునకు రథీతరుండును గలిగి; రమ్మహాత్మునికి సంతతి లేకున్న నంగిరసుఁడను మునీంద్రుం డతని భార్యయందు బ్రహ్మతేజోనిధులైన కొడుకులం గలిగించె; వారలు రథీతరగోత్రులు, నాంగిరసులను బ్రాహ్మణులునై, యితరులందు ముఖ్యులయి ప్రవర్తిల్లి రని చెప్పి శుకుం డిట్లనియె. 154**

**ప్రతి :** వినుము= విను; ఆ+అంబరీషునకు= ఆ అంబరీషునికి; విరూపుండును+కేతుమంతుడును= విరూపుడు, కేతుమంతుడు; శంభుండును+అనువారు= శంభుడు అనేవారు; ముప్వురు కొడుకులు= ముగ్గురు కుమారులు; అందున్= అందులో (ఆ ముప్వురిలో); కేతుమంతుండును, శంభుండును= కేతుమంతుడు, శంభుడు; హరిన్+కూర్చి= విష్ణువు నుద్దేశించి; తపంబు+చేయువారై= తపస్సుచేయడం కోసం; వనంబునకున్+చనిరి= అరణ్యానికి వెళ్లారు; విరూపునికిన్= విరూపుడనేవానికి; పృషదశ్వుండును= పృషదశ్వుడు; పృషదశ్వనకు= పృషదశ్వునికి; రథీతరుండునున్+కలిగిరి= రథీతరుడూ–పుట్టారు; ఆ+మహా+ఆత్మునికిన్= ఆ మహానుభావునికి; సంతతి లేకున్నన్= సంతానం లేకపోతే; అంగిరసుఁడు+అను= అంగిరసుడనే; ముని+ఇంద్రుడు= మునీశ్వరుడు; అతని భార్య+అందున్= అతని భార్యకు (రథీతరుని భార్య); బ్రహ్మతేజోనిధులు+ఐన= బ్రహ్మతేజస్సును కలిగిన; కొడుకులన్+కలిగించెన్= కుమారులను అనుగ్రహించాడు; వారలు= వారు; రథీతరగోత్రులున్= రథీతర గోత్రులు; ఆంగిరసులు+అను= ఆంగీరసులనే; బ్రాహ్మణులును+ఐ= బ్రాహ్మణులుగా; ఇతరులు+అందు= మిగిలినవారిలో; ముఖ్యులు+అయి= ప్రసిద్ధులై; ప్రవర్తిల్లిరి+అనిచెప్పి= జీవించిరని చెప్పి; శుకుండు+ఇట్లు+అనియెన్= శుకయోగి ఇట్లన్నాడు.

**తా :** ఆ అంబరీషునికి విరూపుడు, కేతుమంతుడు, శంభుడు అని ముగ్గురు కొడుకులు. వారిలో కేతుమంతుడు, శంభుడు విష్ణువును గూర్చి తపస్సు చేయడానికి అడవులకు వెళ్ళారు. విరూపునికి పృషదశ్వుడు, అతనికి రథీతరుడు పుట్టారు. ఆ మహాత్మునకు సంతానం లేకపోవడం చేత అంగిరసుడనే ముని అతని భార్యకు బ్రహ్మతేజోవంతులైన కొడుకులను ప్రసాదించాడు. వాళ్ళు రథీతరగోత్రులుగాను, ఆంగిరసులనే బ్రాహ్మణులుగాను ప్రఖ్యాతి పొందారు, అని చెప్పి శుక మహర్షి ఇట్లా అన్నాడు.

## ❖ ఇక్ష్వాకు వంశానుక్రమము ❖

**క. ఒకనాఁడు మనువు దుమ్మిన, వికలుఁడు గా కతని ఘ్రాణవివరము వెంటం**
**బ్రకటయశుండిక్ష్వాకుం, డకలంకుఁడు పుట్టె రవికులాధీశుండై. 155**

**ప్రతి :** ఒకనాఁడు= ఒక రోజున; మనువు= వైవస్వత మనువు; తుమ్మినన్= తుమ్మగా; అతని= అతనియొక్క; ఘ్రాణవివరము వెంటన్= ముక్కు రంధ్రంనుండి; ప్రకటయశుండు= గొప్పకీర్తికలిగినవాడు; అకలంకుఁడు= పుణ్యాత్ముడు; ఇక్ష్వాకుండు= ఇక్ష్వాకుడు; రవికుల+అధీశుండు+ఐ= సూర్యవంశపురాజై; వికలుఁడు+కాక= వైకల్యం లేకుండా; పుట్టెన్= జన్మించాడు.

**తా :** ఒకరోజు వైవస్వత మనువు తుమ్మగా అతని ముక్కురంధ్రం నుండి గొప్పకీర్తి కలిగిన పుణ్యాత్ముడు ఇక్ష్వాకుడు వైకల్యం లేకుండా పుట్టి సూర్యవంశానికి రాజయ్యాడు.

**విశే :** మనువుకు పదిమంది సంతానం. ఇక్ష్వాకుడు తొమ్మిదవవాడు. ఇంతవరకు ఎనిమిదిమంది వృత్తాంతాలు చెప్పబడ్డాయి.

**సీ. ఇక్ష్వాకునకుఁబుత్త్రు లెలమిఁబుట్టిరి నూర్వు రమర వికుక్షియు నిమియు దండ**
**కుండు నాతని పెద్దకొడుకులు ముప్వు రా ర్యావర్తమందు హిమాచలంబు**
**వింధ్యాద్రిమధ్య మూర్వీమండలము కొంత యేలిరి యిరువదియేవు రొక్క**
**పొందున నా తూర్పు భూమి పాలించిరి యందఱు పడమటి కధిపులైరి**

**తే. యున్న నలువది యేడ్గురు నుత్తరోర్వి, దక్షిణోర్వియుఁగాచిరి తండ్రి యంత**
**నష్టకాశ్రాద్ధ మొనరింతు ననుచు నగ్ర, సుతు వికుక్షి నిరీక్షించి శుద్ధమైన,**
**మాంసఖండంబుఁ దెమ్మనె మహితయశుఁడు. 156**

**ప్రతి :** ఇక్ష్వాకునకున్= ఇక్ష్వాకునికి; నూర్వురు= నూరుమంది; పుత్త్రులు= కొడుకులు; ఎలమిన్+పుట్టిరి= ఆనందకరంగా పుట్టారు; అమరన్= వరుసగా; వికుక్షియు= వికుక్షి అనేవాడు; నిమియు= నిమి అనేవాడు; దండకుండున్= దండకుడనేవాడు; ఆతని పెద్దకొడుకులు; ముప్వురు= వారిలో ముగ్గురు; ఆర్యావర్తము+అందున్= ఆర్యావర్తదేశంలో; హిమ+అచలంబు= హిమాలయానికి; వింధ్య+అద్రి= వింధ్య పర్వతానికి; మధ్యన్= మధ్యనున్న; ఉర్వీమండలమున్= భూభాగాన్ని; కొంత+ఏలిరి= కొంత పరిపాలించారు; ఇరువది+ఏవురు= ఇరవై ఐదుమంది; ఒక్కపొందునన్= కలిసిమెలిసి; ఆ తూర్పుభూమిన్= ఆ తూర్పుభాగాన్ని; పాలించిరి= పాలించారు; అందఱు= అంతమంది (ఇరవైఐదు); పడమటికిన్+అధిపులు+ఐరి= పడమటి ప్రాంతానికి రాజులైరి; ఉన్న= మిగిలిన; నలువది+ఏడ్గురున్= నలభై ఏడుమంది; ఉత్తర+ఉర్విన్= ఉత్తరంవైపు భూముల్ని; దక్షిణ+ఉర్వియున్= దక్షిణంవైపు భూములను; కాచిరి= రక్షించారు; మహితయశుఁడు= గొప్పకీర్తిమంతుడు; తండ్రి=

తం(డ్రి (ఇక్ష్వాకుడు); అంతన్= అప్పుడు; అష్టకా(శ్రాద్ధమున్+ఒనరింతున్+అనుచున్= అష్టకా(శ్రాద్ధం చేస్తానంటూ; అ(గసుతున్= పెద్దకొడుకైన; వికుక్షిన్= వికుక్షిని; నిరీక్షించి= చూచి; శుద్ధము+ఐన= పరిశుద్ధమైన; మాంస ఖండంబున్= మాంసపు ముక్కను; తెమ్ము+అనెన్= తెమ్మన్నాడు.

**తా :** ఇక్ష్వాకుడికి నూరుమంది కొడుకులు పుట్టారు. వారిలో వికుక్షి, నిమి, దండకుడు అనేవారు వరుసగా పెద్దకొడుకులు. వీరు ఆర్యావర్తంలోని హిమాలయానికి, వింధ్యకు మధ్యనున్న కొంతభూమిని పాలించారు. తరువాతి ఇరవై ఐదుమంది తూర్పుభాగాన్ని పాలించారు. మరో ఇరవైఐదుమంది పడమటి భాగాన్ని పాలించారు. ఇంక మిగిలిన నలభైఏడుమంది ఉత్తరదక్షిణభూములకు రాజులయ్యారు. అప్పుడు ఇక్ష్వాకుడు అష్టకా(శ్రాద్ధం చేయాలనుకొని పెద్దకొడుకు, కీర్తిమంతుడు అయిన వికుక్షినిచూచి పరిశుద్ధమైన మాంసఖండాన్ని తెమ్మన్నాడు.

**మ. అగుఁగా కంచు వికుక్షి వేఁట సని ఘోరారణ్యభూమిం దగన్**
**మృగసంఘంబులఁ జంపి బిట్టలసి తా, మే నొల్లఁబో నాఁకటన్**
**సగమై యొక్క శశంబుఁ బట్టి తిని శేషంబైన మాంసంబు శీ**
**(ఘ్రగతిం దం(డ్రికిఁదెచ్చి యిచ్చె నకలంకస్ఫూర్తి వర్తిల్లఁగాన్. 157**

**(ప్రతి :** అగున్+కాక+అంచున్= అట్లే అగునని వికుక్షి; వేఁట+చని= వేటకు వెళ్ళి; ఘోర+అరణ్యభూమిన్= భయంకరమైన అటవీ(ప్రాంతంలో; తగన్= తగినట్లు; మృగసంఘంబులన్+చంపి= జంతువులను చంపి; బిట్టు+అలసి= ఎక్కువగా అలసిపోయి; తాన్= తాను; మేను+ఒల్లన్+పోన్= శరీరం సహకరించక పోవంటచేత; ఆఁకటన్ సగము+ఐ= ఆకలితో సగమైపోయి; ఒక్కశశంబున్+పట్టి తిని= ఒక కుందేలును పట్టుకొని తిని; శేషంబు+ఐన= మిగిలిన; మాంసంబున్= మాంసాన్ని; శీ(ఘ్రగతిన్= తొందరగా; తం(డ్రికిన్= తం(డ్రికి; అకలంక స్ఫూర్తి= తప్పులేదనుకొని; వర్తిల్లన్+కాన్= కన్పించేటట్లు; తెచ్చి+ఇచ్చెన్= తెచ్చి ఇచ్చాడు.

**తా :** తం(డ్రి ఆనతిని విని వికుక్షి అట్లేనని దట్టమైన అడవులకు వేటకువెళ్లాడు. అక్కడ జంతువుల్ని వేటాడిచంపాడు. శరీరం బాగా అలసిపోయింది. తట్టుకోలేని ఆకలిబాధతో సగమై, ఒక కుందేలును పట్టుకొని తిన్నాడు. తినగా మిగిలిన మాంసఖండాన్ని దోషంలేదనే భావంతో వెంటనే తం(డ్రికి తెచ్చిఇచ్చాడు.

**తరలము.**

**కులగురుండు వసిష్ఠుఁ డంత వికుక్షి కుందెలు దింట లో**
**పల నెఱింగి 'యనర్హ మెంగిలి పైతృకం బొనరింపఁగా**
**వలదు వీఁడు దురాత్మకుం' డన వానితం(డ్రియు వానిఁ జెం**
**తలను జేరఁగనీక దేశము దాఁటి పో నడిచెన్ వడిన్. 158**

**(ప్రతి :** అంతన్= అప్పుడు; కులగురుండు= కులగురువైన; వసిష్ఠుఁడు= వసిష్ఠ మహర్షి; వికుక్షి= వికుక్షి; కుందెలున్+తింటన్= కుందేలును తినడం; లోపలన్+ఎఱింగి= మనసులో తెలుసుకొని; ఎంగిలి= ఎంగిలి మాంసం; పైతృకంబు+ఒనరింపన్+కాన్= పితృకర్మలు చేయుటకు; అనర్హము= తగిందికాదు; వలదు= పనికిరాదు; వీఁడు= వీడు; (వికుక్షి); దుర్+ఆత్మకుండు= చెడ్డ బుద్ధికలవాడు; అనన్= అనిపలుకగా; వానితం(డ్రియున్= అతని తం(డ్రియైన ఇక్ష్వాకుడు; వానిన్+చెంతలను= వానిని

దగ్గరకు; చేరఁగనీక= రానీకుండా; వడిన్= వెంటనే; దేశము+దాఁటిపోన్+అడిచెన్= దేశమునుండి వెడలగొట్టాడు. (బహిష్కరించాడు).

**తా :** అపుడు కులగురుడు వసిష్ఠుడు వికుక్షి కుందేలుమాంసం తినడం మనస్సులో గ్రహించాడు. "ఇది ఎంగిలిపడిన మాంసం. పితృకర్మలకు పనికిరాదు. వీడు దుర్బుద్ధి కలవాడు" అని అన్నాడు. ఇక్ష్వాకుడు వికుక్షిని రాజ్యంనుండి బయటకు వెడలగొట్టాడు.

**ఆ. కొడుకు వెడలఁగొట్టి గుణవంతుఁ డిక్ష్వాకుఁ, డా వసిష్ఠుఁ దేమి యాన తిచ్చె**
**నదియుఁజేసి యోగియై వనంబునఁ గళే, బరము విడిచి ముక్తిపదము నొందె. 159**

**ప్రతి :** గుణవంతుఁడు+ఇక్ష్వాకుఁడు= గుణవంతుడైన ఇక్ష్వాకుడు; కొడుకున్+వెడలన్+కొట్టి= కొడుకును వెళ్ళగొట్టి; ఆ వసిష్ఠుఁడు= ఆ వసిష్ఠమహర్షి; ఏమి+ఆనతి+ఇచ్చెన్= ఏమని ఆజ్ఞాపించాడో; అదియున్+చేసి= దానివల్ల; యోగి+ఐ= మునియై; వనంబునన్= అరణ్యమందు; కళేబరమున్= దేహాన్ని; విడిచి= వదలి; ముక్తిపదమున్+ఒందెన్= మోక్షపదవిని పొందాడు.

**తా :** గుణవంతుడైన ఇక్ష్వాకుడు కొడుకును వెళ్ళగొట్టి, ఆ వసిష్ఠమహర్షి చెప్పింది ఆచరించి యోగియై, అరణ్యాలకు వెళ్ళి శరీరాన్ని వదలి మోక్షాన్ని పొందాడు.

**చ. జనకుఁడు ముక్తిఁ బొంద నయశాలి వికుక్షి శశాదు డంచు భూ**
**జనులు నుతింప నీ ధరణిచక్ర మశేషము నేలి యాగముల్**
**గొనకొని చేసెఁ బ్రీతి హరిఁ గూర్చి పురంజయుఁ బుత్త్రుఁ గాంచెఁ బే**
**ర్కొనె "నమరేంద్రవాహుఁడు గకుత్స్థుఁడు" నంచును వాని లోకముల్. 160**

**ప్రతి :** జనకుఁడు= తండ్రి; ముక్తిన్+పొందన్= మోక్షము పొందగా; నయశాలి వికుక్షి= నీతిమంతుడైన వికుక్షి; భూజనులు= ప్రజలు; శశాదుఁడు+అంచున్= శశాదుడని; నుతింపన్= పొగడుచుండగా; ఈ ధరణీచక్రమున్= ఈ భూమండలాన్ని; అశేషమున్= కొదువలేకుండా; ఏలి= పరిపాలించి; హరిన్+కూర్చి= విష్ణువును గూర్చి; ప్రీతిన్= ఇష్టంతో; యాగముల్= యాగాలను; కొనకొని చేసెన్= ప్రయత్నంతో చేశాడు; పురంజయున్= పురంజయుడనే; పుత్రున్+కాంచెన్= కొడుకును పొందాడు; వానిన్= అతణ్ణి గూర్చి (కొడుకుని గూర్చి); లోకముల్= లోకాలు; అమర+ఇంద్రవాహుఁడు= దేవేంద్రుణ్ణి వాహనంగా కలవాడై; కకుత్స్థుఁడు+అంచును= కకుత్స్థుడు అంటూ; పేరు+కొనెన్= పేర్కొన్నాయి.

**తా :** తండ్రి మోక్షం పొందగా నీతిశాలి వికుక్షి తనను ప్రజలు శశాదుడని పొగడుతుండగా ఈ భూమిని పరిపాలించి విష్ణువును గూర్చి ప్రయత్నపూర్వకంగా యాగాలు చేశాడు. పురంజయుడనే కొడుకును కన్నాడు. అతనిని గూర్చి లోకాలు కకుత్స్థుడని, అమరేంద్రవాహనుడని పేర్కొన్నాయి.

**విశే :** పూర్వపద్యంలో వికుక్షి చేసిన దోషం చెప్పబడింది. కాని వాణ్ణి ప్రజలు కీర్తించారు. అనేకయాగాలు చేశాడు. అంటే ప్రజామోదం పొందాడన్నమాట. దోషం చేసినా దాన్ని సర్దుకున్నాడు. శశాదుడు అనగా కుందేలును తిన్నవాడని అర్థం.

**సీ. కృతయుగాంతంబున దితిసుతామరులకు రణ మయ్యె; నందు నా రాక్షసులకు**
**నమరవల్లభుఁ డోడి హరితోడఁ జెప్పిన జలజనేత్రుఁడు పురంజయునియందు**

**వచ్చి నే నుండెద వాసవ! వృషభంబవై మోవు మని పల్క నమరవిభుఁడు**
**గోరాజమూర్తిఁ గకుత్ప్రదేశంబున నా పురంజయు మోచె నంత నతఁడు**

**తే. విష్ణుతేజంబు దనయందు విస్తరిల్ల , దివ్యచాపంబు చేఁబట్టి దీర్ఘనిశిత**
**బాణములఁ బూని వేల్పులు ప్రస్తుతింప, నంత కాలాగ్నిచాడ్పున ననికి నడచె. 161**

**ప్రతి :** కృతయుగ+అంతంబునన్= కృతయుగం చివర; దితిసుత+అమరులకున్= దితి సంతానమైన రాక్షసులకు, దేవతలకు; రణము+అయ్యెన్= యుద్ధం జరిగింది; అందున్= ఆ యుద్ధంలో; ఆ రాక్షసులకున్= ఆ రాక్షసులకు; అమరవల్లభుఁడు+ఓడి= దేవేంద్రుడు ఓడిపోయి; హరితోడన్+చెప్పినన్= విష్ణువుతో చెప్పగా; జలజనేత్రుఁడు= పద్మనేత్రుడైన విష్ణువు; వాసవ!= ఓ ఇంద్రా!; పురంజయుని+అందున్= పురంజయునిలో; నేన్+వచ్చి= నేను వచ్చి; ఉండెదన్= ఉంటాను; వృషభంబవు+ఐ= ఎద్దువై; మోవుము+అనిపల్కన్= మోయుమని అని చెప్పగా; అమర విభుఁడు= దేవతాప్రభువైన ఇంద్రుడు; గోరాజమూర్తిన్= ఎద్దురూపంలో; కకుత్+ప్రదేశంబునన్= మూపుపై; ఆ పురంజయున్+మోచెన్= ఆ పురంజయుణ్ణి మోశాడు; అంతన్+అతఁడు= అపుడతడు; విష్ణుతేజంబు= విష్ణువుయొక్క తేజస్సు; తన+అందున్= తనలో; విస్తరిల్లన్= వ్యాపించగా; దివ్యచాపంబున్= ప్రకాశవంతమైన ధనుస్సును; చేన్+పట్టి= చేతిలో పట్టుకొని; దీర్ఘనిశితబాణములన్= పొడవైన వాడియైన బాణాలను; పూని= ధరించి; వేల్పులు= దేవతలు; ప్రస్తుతింపన్= పొగడగా; అంతకాల+అగ్ని+చాడ్పునన్= ప్రళయకాలాగ్నివలె; అనికిన్= యుద్ధానికి; నడచెన్= బయలుదేరాడు.

**తా :** కృతయుగం చివర్లో రాక్షసులకు దేవతలకు యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో ఓడిన దేవేంద్రుడు విష్ణువుతో మొరపెట్టుకొన్నాడు. అప్పుడు విష్ణువు ఇంద్రా! పురంజయునిలో నేను ఆవేశిస్తాను. నువ్వు ఎద్దువై అతణ్ణి మోయుమన్నాడు. ఇంద్రుడు ఎద్దుగా మారి తనమూపుపై పురంజయుణ్ణి మోశాడు. విష్ణుతేజస్సు తనలో వ్యాపించగా పురంజయుడు ధనుర్బాణాలను ధరించి ప్రళయకాలాగ్నివలె యుద్ధానికి బయలుదేరాడు.

**చ. నడచి శరావళిన్ దనుజనాథులమేనులు చించి కంఠముల్**
**దొడిఁదొడిఁ ద్రుంచి కాలుపురిత్రోవకుఁ గొందఱఁ బుచ్చి కొందఱన్**
**వడి నురగాలయంబున నివాసము సేయఁగఁ దోలి యంత నూ**
**రడక నిశాచరేంద్రులపురంబులు గూల్చె పురంజయాఖ్యతన్. 162**

**ప్రతి :** నడచి= బయలుదేరి; శర+ఆవళిన్= బాణసమూహంతో; దనుజనాథుల= రాక్షసప్రభువుల; మేనులు చించి= శరీరాలను ఖండించి; కంఠముల్= కంఠాలను; తొడిన్+తొడిన్= ముక్కలు ముక్కలుగా; త్రుంచి= విరిచి; కాలుపురిత్రోవకున్= యమనగరందారికి; కొందఱన్+పుచ్చి= కొందరిని పంపి; కొందఱన్= మరికొందరిని; వడిన్= వేగంగా; ఉరగ+ఆలయంబునన్= నాగలోకంలో; నివాసము+చేయన్+కన్= నివసించునట్లుగా; తోలి= తరిమి; అంతన్+ఊరడక= అంతటితో ఊరుకోక; పురంజయ+ఆఖ్యతన్= పురంజయుడనే పేరుచేత; నిశాచర+ఇంద్రుల= రాక్షసరాజుల; పురంబులు+కూల్చెన్= నగరాలను కూల్చాడు.

**తా :** ఆ విధంగా బయలుదేరి రాక్షసవీరుల శరీరాలను ఖండించి, కుత్తుకలను ముక్కలుగా ఖండించి, కొందరిని యముని నగరానికి పంపి, మరికొందరిని నాగలోకానికి తరిమాడు. అంతటితో ఊరుకోక పురంజయుడనే పేరు సార్థకం అయ్యేటట్లు ఆ రాక్షసులనగరాలనుకూడా కూల్చాడు.

**వ. ఇ వ్విధంబున శశాదపుత్త్రుండు రాక్షసులపురంబులు జయించిన కతనం బురంజయుండును, వృషభరూపుండైన యింద్రుండు వాహనం బగుటంజేసి యింద్రవాహనుండును, నతనిమూపురం బెక్కి రణంబు సేసిన కారణంబునఁ గకుత్స్థుండును నన నీ మూఁడు నామంబులం బ్రసిద్ధి కెక్కిదైత్యుల ధనంబులు నింద్రుని కిచ్చె, నప్పురంజయునిపుత్త్రుం డనేనసుండు, అతనిపుత్త్రుండు పృథుండు, పృథునికొడుకు విశ్వగంధుండు, విశ్వగంధునకు నందనుండు చంద్రుండు. చంద్రసుతుండు యువనాశ్వుండు, యువనాశ్వ తనూభవుండు శవస్తుండు. అతండు శావస్తి నామనగరంబు నిర్మించె. శవస్తతనయుండు బృహదశ్వుండు; బృహదశ్వతనూజుండు గువలయాశ్వుం; డానరేంద్రచంద్రుండు. 163**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ విధంగా; శశాదపుత్రుండు= శశాదుని కొడుకు; రాక్షసుల పురంబులు= రాక్షసుల నగరాల్ని; జయించిన కతనన్= జయించి నందువల్ల; పురంజయుండు+అని= పురంజయుడని; వృషభరూపుండు+ఐన= ఆబోతు రూపం కలిగిన; ఇంద్రుండు= ఇంద్రుడు; వాహనంబు+అగుటన్+చేసి= వాహనం కావడంచేత; ఇంద్రవాహనుండునున్= ఇంద్రవాహనుడని; అతని మూపురంబు+ఎక్కి= అతనిమూపురాన్ని ఎక్కి; రణంబు+చేసిన కారణంబునన్= యుద్ధం చేయడంచేత; కకుత్స్థుండునున్+అనన్= కకుత్స్థుడనే; ఈ మూఁడునామంబులన్= ఈ మూడు పేర్లతో; ప్రసిద్ధికిన్+ఎక్కి= ప్రశస్తిని పొంది; దైత్యులధనంబులున్= రాక్షసుల సంపదను; ఇంద్రునికిన్+ఇచ్చెను= దేవేంద్రునికిచ్చాడు; ఆ+పురంజయుని పుత్రుండు= ఆ పురంజయుని కొడుకు; అనేనసుండు= అనేనసుడనేవాడు; అతని పుత్త్రుండు= అతనికొడుకు; పృథుండు= పృథుడు; పృథునికొడుకు= పృథునికుమారుడు; విశ్వగంధుండు= విశ్వగంధుడు; విశ్వగంధునకున్= విశ్వగంధునికి; నందనుడు= కొడుకు; చంద్రుండు= చంద్రుడు; చంద్రసుతుండు= చంద్రునికొడుకు; యువనాశ్వుండు= యువనాశ్వుడు; యువనాశ్వతనూభవుండు= యువనాశ్వునికొడుకు; శవస్తుడు= శవస్తుడు; అతడు= అతను (శవస్తుడు); శావస్తినామ= శావస్తి అను పేరుగల; నగరంబున్+నిర్మించెన్= నగరాన్ని నిర్మించాడు; శవస్త తనయుండు= శవస్తునికొడుకు; బృహదశ్వుండు= బృహదశ్వుడు; బృహదశ్వతనూజుండున్= బృహదశ్వునికొడుకు; కువలయాశ్వుండు= కువలయాశ్వుడు; ఆ నర+ఇంద్రచంద్రుడు= ఆ రాజశ్రేష్ఠుడు...

**తా :** ఈ విధంగా శశాదుని కొడుకు రాక్షసులపురాలను జయించిన కారణంచేత పురంజయుడని, ఎద్దురూపంలో ఉన్న దేవేంద్రుడు వాహనం కావటంచేత ఇంద్రవాహనుడని, అతని మూపురంమీద ఎక్కి యుద్ధంచేయటంచేత కకుత్స్థుడని మూడుపేర్లతో ప్రఖ్యాతి పొంది, రాక్షసుల ధనాలను ఇంద్రుని కిచ్చాడు. అతని కుమారుడు అనేనసుడు. అతనికొడుకు పృథుడు. అతనికొడుకు విశ్వగంధుడు. విశ్వగంధునికొడుకు చంద్రుడు. చంద్రునికొడుకు యువనాశ్వుడు. అతని కొడుకు శ్రవస్తుండు. ఈతడే శావస్తి అనే పేరుగల నగరాన్ని నిర్మించాడు. శవస్తికొడుకు బృహదశ్వుడు. ఇతనికొడుకు కువలయాశ్వుడు. ఆ రాజశ్రేష్ఠుడు

**క. లావు మెఱసి యిరువదియొక, వేవురు నందనులుఁ దాను వీరుఁ డతఁడు భూ**
**దేవుఁ డుదంకుఁడు పనుప దు, రావహుఁడై చంపె దుంధు నమరాబంధున్. 164**

**ప్రతి :** వీరుఁడు+అతఁడు= వీరుడైన ఆతడు (కువలయాశ్వుడు); లావుమెఱసి= శక్తి ప్రస్ఫుటమయ్యేటట్లు; ఇరువది+ఒకవేవురు= ఇరవైఒక్క వేలమంది; నందనులున్+తాను= కొడుకులు, తాను; భూదేవుఁడు+ఉదంకుఁడు= బ్రాహ్మణుడైన ఉదంకుడు; పనుపన్= పంపగా; దురావహుఁడు+ఐ= తిరుగులేనివాడై; అమర+అబంధున్= దేవతల శత్రువైన; దుంధున్= దుంధుడనే వాణ్ణి; చంపెన్= చంపాడు.

**తా :** వీరుడైన కువలయాశ్వుడు బలిష్ఠుడై తన ఇరవైఒక్కవేలమందికొడుకులతో ఉదంకుని ఆనతిమేరకు వెళ్ళి, దేవతల శత్రువైన దుంధుడనేవాణ్ణి చంపాడు.

**వ. అది కారణంబుగా దుంధుమారుం డన నెగడె. నయ్యసురుముఖానలంబునఁ గువలయాశ్వ కుమారు లందఱు భస్మంబై; రందు దృఢాశ్వుండును, గపిలాశ్వుండును, భద్రాశ్వుండును ననువారలు ముగ్గురు సిక్కి; రందు దృఢాశ్వునకు హర్యశ్వుండును, హర్యశ్వునకు నికుంభుండును, నికుంభునకు బర్హిణాశ్వుండును, బర్హిణాశ్వునకుఁ గృతాశ్వుండును, గృతాశ్వునకు సేనజిత్తును, సేనజిత్తునకు యువనాశ్వుండును జనియించి; ర య్యువనాశ్వుండు గొడుకులు లేక నూర్వురుభార్యలుం దానును నివ్వెఱపడియుండ, నా రాజునకు మునులు కృపసేసి, ఇంద్రునిఁ గూర్చి సంతతికొఱకై యైంద్రయాగంబు సేయించి రందు. 165**

**ప్రతి :** అది కారణంబు+కాన్= ఆ కారణంచేత; దుంధుమారుండు+అనన్+నెగడెన్= దుంధుమారుడని ప్రసిద్ధిచెందాడు; ఆ+అసురు= ఆ రాక్షసునియొక్క; ముఖ+అనలంబునన్= నోటినుండి వచ్చిన అగ్నిచేత; కువలయాశ్వకుమారులు+అందఱున్= కువలయాశ్వుని కొడుకులందరూ; భస్మంబు+ఐరి= బూడిద అయ్యారు; అందున్= వారిలో; ధృడాశ్వుండును= దృఢాశ్వుడు; కపిలాశ్వుండును= కపిలాశ్వుడు; భద్రాశ్వుండును= భద్రాశ్వుడు; అనువారలు= అనబడేవారు; ముగ్గురు+చిక్కిరి= ముగ్గురు తప్పించుకొన్నారు; అందున్= ఆ ముువ్వురిలో; దృఢాశ్వునకున్= దృఢాశ్వునికి; హర్యశ్వుండును= హర్యశ్వుడును; హర్యశ్వునకున్= హర్యశ్వునికి; నికుంభుండును= నికుంభుడును; నికుంభునకున్= నికుంభునికి; బర్హిణాశ్వుండును= బర్హిణాశ్వుడును; బర్హిణాశ్వునకున్= బర్హిణాశ్వునికి; కృతాశ్వుండునున్= కృతాశ్వుడును; సేనజిత్తును= సేనజిత్తునకు; సేనజిత్తునకున్= సేనజిత్తునికి; యువనాశ్వుండును= యువనాశ్వుడును; జనియించిరి= జన్మించారు; ఆ+యువనాశ్వుండున్= ఆ యువనాశ్వుడు; కొడుకులు లేక= కుమారులు లేక; నూర్వురు భార్యలున్+తానును= నూర్వురు భార్యలు, తానును; నివ్వెఱ పడియుండన్= భయపడుతుండగా; ఆ రాజునకున్= ఆ రాజుకు; మునులు కృప+చేసి= మునులు దయతో; ఇంద్రునిన్+కూర్చి= ఇంద్రుణ్ణి గూర్చి; సంతతికొఱకై= సంతానంకోసం; ఐంద్రయాగంబున్+చేయించిరి= ఇంద్ర సంబంధమైన యాగాన్ని చేయించారు; అందున్= ఆ యాగంలో...

**తా :** దుంధుడనే రాక్షసుణ్ణి చంపటంచేత కువలయాశ్వునికి దుంధుమారుడనే పేరు కలిగింది. దుంధుని నోటినుండి వెడలిన కువలయాశ్వుని కొడుకులు బూడిద అయ్యారు. దృఢాశ్వుడు, కపిలాశ్వుడు, భద్రాశ్వుడు అనే ముగ్గురుమాత్రం బ్రతికారు. వారిలో దృఢాశ్వునికి హర్యశ్వుడు, వానికి నికుంభుడు, వానికి బర్హిణాశ్వుడు, వానికి కృతాశ్వుడు, వానికి సేనజిత్తు, వానికి యువనాశ్వుడు పుట్టారు. ఆ యువనాశ్వుడు సంతానంలేక నూర్వురుభార్యలతో భయపడుతూ ఉండినాడు. అప్పుడు కొందరుమునులు దయతలచి సంతానంకోసం అతనితో ఇంద్రయాగం చేయించారు. ఆ యాగంలో

**సీ. భూమీశుభార్యకుఁ బుత్త్రలాభమునకై పోయు తలంపున భూమిసురులు**
**జలమును మంత్రించి జలకలశము దాఁచి నియమంబుతోఁగూడి నిద్రవోవ**
**ధరణీశ్వరుఁడు పేరుదప్పితో నా రాత్రి ధృతిలేక యజ్ఞమందిరముఁ జొచ్చి**
**యా నీరుఁ ద్రావిన నంత మేల్కని వార 'లెవ్వఁడు ద్రావె నీరెందుఁ బోయె?'**

**ఆ. ననుచు రాజు ద్రావు టంతయు భావించి, యెఱిఁగి చోద్యమంది యీశ్వరాజ్ఞ**
**యెవ్వఁ డోపుఁ గడవ; నీశ్వరునకు నమ, స్కార మనుచు నేది కార్య మనుచు. 166**

**ప్రతి :** భూమి+ఈశు= రాజుయొక్క; భార్యకున్= పత్నికి; పుత్రలాభమునకున్+ఐ= పుత్రసంతానంకోసం; పోయుతలంపునన్= పోసే భావనతో; భూమిసురులు= బ్రాహ్మణులు; జలమును మంత్రించి= నీటిని మంత్రించి; జలకలశమున్+దాఁచి= నీటిపాత్రను దాచిపెట్టి; నియమంబుతోన్+కూడి= నియమంతో కూడి; నిద్ర+పోవన్= నిద్రించగా; ధరణి+ఈశ్వరుఁడు= రాజు (యువనాశ్వుడు); పేరు దప్పితోన్= పెద్ద దాహంతో; ఆ రాత్రి= ఆ రాత్రిసమయంలో; ధృతిలేక= నిలకడలేక; యజ్ఞమందిరమున్+చొచ్చి= యాగశాలను ప్రవేశించి; ఆ నీరున్+త్రావినన్= ఆ కలశంలోని నీటిని త్రావగా; వారలు= ఆ బ్రాహ్మణులు; అంతన్+మేల్కొని= అప్పుడు మేల్కొని; నీరు; ఎవ్వఁడు+త్రావెన్= ఎవడు తాగాడు? ఎందున్+పోయెన్= ఏమైంది; అనుచున్= అంటూ; రాజు+త్రావుట= రాజు త్రాగటం; అంతయున్= అంతా; భావించి= ఆలోచించి; ఎఱిఁగి= తెలిసికొని; చోద్యము+అంది= ఆశ్చర్యపోయి; ఈశ్వర+ఆజ్ఞన్= భగవంతుని ఆజ్ఞను; కడవన్= దాటుటకు; ఓపున్+ఎవ్వఁడు= ఎవ్వనికి శక్యము; ఈశ్వరునకున్= అట్టి భగవంతునికి; నమస్కారంబు+అనుచున్= నమస్కారమంటూ; ఏది కార్యము+అనుచున్= ఏది కర్తవ్యమంటూ...

**తా :** రాజుభార్యకు, పుత్రలాభంకోసం బ్రాహ్మణులు నీటిని మంత్రించి, నియమంగా ఆ నీరున్నకలశాన్ని దాచి నిద్రపోయారు. ఆ రాత్రి రాజు దప్పికతో విధిలేక యాగశాలను ప్రవేశించి, ఆ నీటిని త్రాగాడు. అపుడు బ్రాహ్మణులు మేల్కొని నీళ్లు ఏమైనాయి? ఎవరు త్రాగారు? అని రాజు త్రాగిన విషయాన్ని గ్రహించారు. ఆశ్చర్యపోయి "ఈశ్వరాజ్ఞను ఎవడు దాటగలడు? ఇప్పుడేం చేయాలి? ఆ భగవంతుడికి నమస్కారం" అంటూ

**వ. వారలు దుఃఖింపుచుండు నంతఁ గొంత తడవునకు యువనాశ్వునికడుపు వ్రక్కలించుకొని, చక్రవర్తి చిహ్నంబులు గల కుమారుండు జన్మించి, తల్లి లేనికతంబునం గడుపునకు లేక యేడ్చుచుండ, ఇంద్రుండు వచ్చి, శిశువునకు నాఁకటి దీఱుకొఱకు వానినోటం దనవ్రేలిడినం, ద్రావినకతంబున వానిపేరు మాంధాత యని నిర్దేశించి చనియె. ని వ్విధంబున. 167**

**ప్రతి :** వారలు= ఆ బ్రాహ్మణులు; దుఃఖింపుచున్+ఉండున్+అంతన్= దుఃఖపడుతుండగనే; కొంతతడవునకున్= కాసేపటికి; యువనాశ్వుని; కడుపు వ్రక్కలించుకొని= పొట్టచీల్చుకొని; చక్రవర్తి చిహ్నంబులు+కల= చక్రవర్తిలక్షణాలు కలిగిన; కుమారుండు= కొడుకు; జన్మించి= పుట్టి; తల్లి లేనికతంబునన్= తల్లిలేని కారణంచేత; కడుపునకు లేక= కడుపునిండక; ఏడ్చుచున్+ఉండన్= ఏడుస్తూ ఉండగా; ఇంద్రుండు= ఇంద్రుడు; వచ్చి= అక్కడికి వచ్చి; శిశువునకున్= ఆ బిడ్డకు; ఆఁకటి= ఆకలి; తీఱుకొఱకున్= తీరడానికి; వానినోటన్= ఆ శిశువునోటియందు; తన= తనయొక్క; వ్రేలు+ఇడినన్= వ్రేలు పెట్టగా; త్రావిన కతంబునన్= త్రాగిన కారణంచేత; వానిపేరు= ఆ శిశువుపేరు; మాంధాత+అని= మాంధాత అంటూ; నిర్దేశించి= నామకరణం చేసి; చనియెన్= వెళ్ళిపోయాడు; ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** ఆ బ్రాహ్మణులు విచారిస్తుండగా కొంత సేపటికి యువనాశ్వునిపొట్టచీల్చుకొని చక్రవర్తి లక్షణాలతో ఒక కొడుకు పుట్టాడు. తల్లిలేని కారణంచేత పొట్టనిండక ఏడుస్తున్న ఆ శిశువుదగ్గరికి ఇంద్రుడు వచ్చి తన వ్రేలును వాడినోటిలో ఉంచాడు. అట్లా త్రాగినందున ఆ బాలునికి మాంధాత అనే పేరుపెట్టి వెళ్ళాడు. ఈ విధంగా

**విశే :** మాం= నన్ను, ధాతా= త్రాగగలడు అని ఇంద్రుడు – అన్నాడు. శిశువు అట్లే చేశాడు. ఆ శిశువుకు మాంధాత అని పేరయ్యింది.

**ఆ.	కడుపు పగుల ముద్దుకొడుకు జన్మించినఁ, దీఱఁ డయ్యెఁ దండ్రి దేవవిప్ర**
**కరుణ యట్ల కాదె? కడిఁది దైవము లావు, కలుగువాఁడు బ్రతుకుఁ గాక చెడునె?	168**

**ప్రతి :** కడుపు పగులన్= పొట్ట పగులగా; ముద్దుకొడుకు= ప్రియకుమారుడు; జన్మించినన్= పుట్టినా; తండ్రి= ఆ బిడ్డ తండ్రి; తీఱఁడు+అయ్యెన్= చావలేదు; దేవవిప్రకరుణ= దేవతల, బ్రాహ్మణుల దయ; అట్లు+అ+కాదె= అలా ఉంటుంది కదా? కడిఁది= అధికమైన; దైవములావు= దైవబలము; కలుగువాఁడు= కలిగినవాడు; బ్రతుకున్+కాక= జీవిస్తాడుకాని; చెడును+ఎ= చెడిపోతాడా? (చెడిపోడని భావం)

**తా :** పొట్టపగిలి ముద్దుకొడుకు పుట్టినా తండ్రి చావలేదు. దేవతల, బ్రాహ్మణుల దయ అలా ఉంటుంది కదా! అధికమైన దైవబలం కలిగినవాడు జీవిస్తాడేకాని చెడిపోతాడా? చెడిపోడు.

**వ.	ఇట్లు బ్రతికియున్న యువనాశ్వుండు, కొంతకాలంబునకుఁ దపంబుసేసి, సిద్ధిం బొందె; నంత.169**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; బ్రతికి+ఉన్న= జీవించి ఉండిన; యువనాశ్వుండు= యువనాశ్వుడు; కొంతకాలంబునకున్= కొంతకాలానికి; తపంబు+చేసి= తపస్సుచేసి; సిద్ధిన్+పొందెన్= సిద్ధిపొందాడు; అంతన్= అటుపిమ్మట...

**తా :** ఈ విధంగా బ్రతికిన యువనాశ్వుడు కొంతకాలానికి తపస్సుచేసి సిద్ధిపొందాడు. ఆ తరువాత

**సీ.	పడమటఁ బొడమెడు బాలచంద్రునిమాడ్కిఁ బూఁటపూఁటకు వృద్ధిఁ బొందె బాలుఁ;**
**డల్లన పరిపూర్ణయౌవనారూఢుఁడై రావణాదిరిపుల రాజవరుల**
**దండించి తనుఁ ద్రసదస్యుఁ డంచు సురేంద్రుఁ డంకింప శూరుఁడై యఖిలదేవ**
**మయు నతీంద్రియు విష్ణు మాధవు ధర్మాత్ము నజుని యజ్ఞాధీను నాత్ముఁ గూర్చి**

**తే.	చేసెఁ గ్రతువులు భూరిదక్షిణల నిచ్చి, ద్రవ్యయజమానవిధిమంత్రధర్మయజ్ఞ**
**కాలఋత్విక్ప్రదేశముఖ్యంబు లెల్ల, విష్ణురూపంబు లనుచు భావించి యతఁడు	170**

**ప్రతి :** బాలుఁడు= కుమారుడు; పడమటన్+పొడమెడు= పడమటి దిక్కున ఉదయించు; బాలచంద్రునిమాడ్కిన్= బాలచంద్రునివలె; పూఁటకున్+పూఁటకున్= పూటపూటకు; వృద్ధిన్+పొందెన్= అభివృద్ధి చెందెను; అల్లనన్= మెల్లగా; పరిపూర్ణ= నిండైన; యౌవన+ఆరూఢుఁడు+ఐ= యౌవనం కలిగి; రావణ+ఆదిరిపులన్= రావణుడు మొదలైన శత్రురాజులను; రాజవరులన్= రాజశ్రేష్ఠులను; దండించి= శిక్షించి; తనున్= తనను; త్రసదస్యుఁడు+అంచున్= త్రసదస్యుడని; సుర+ఇంద్రుఁడు= దేవేంద్రుడు; అంకింపన్= పొగడగా; శూరుఁడు+ఐ= పరాక్రమవంతుడై; అఖిలదేవమయున్= సమస్తమైన దేవతామయుణ్ణి; అతి+ఇంద్రియున్= ఇంద్రియాతీతుణ్ణి; విష్ణున్= విష్ణువును; ధర్మ+ఆత్మున్= ధర్మస్వరూపుణ్ణి; అజునిన్= పుట్టుకలేనివాణ్ణి; యజ్ఞ+అధీనున్= యజ్ఞంచేత లొంగేవాణ్ణి; ఆత్మున్= ఆత్మస్వరూపుణ్ణి; మాధవున్= లక్ష్మీవల్లభుడైననారాయణుణ్ణి; కూర్చి= గురించి; ద్రవ్య= యజ్ఞసంభారాలు; యజమాన= యజమాని; విధిమంత్ర= శాస్త్రమంత్రాలు; ధర్మయజ్ఞకాల= ధర్మబద్ధమైన యజ్ఞసమయం; ఋత్విక్+ప్రదేశముఖ్యంబులు+ఎల్లన్= ఋత్విక్కులు, యజ్ఞప్రదేశాలు మొదలైనవన్ని; విష్ణురూపంబులు+అనుచున్= విష్ణుస్వరూపములే అని; భావించి= తలచి; అతఁడు= ఆ మాంధాత; భూరిదక్షిణలన్+ఇచ్చి= అధికమైన దక్షిణలిచ్చి; క్రతువులు= యజ్ఞాలు; చేసెన్= చేశాడు.

**తా :** ఆ బాలుడు పడమటి దిక్కున పుట్టే బాలచంద్రునివలె దినదిన ప్రవర్ధమానుడై, నిండు యౌవనం పొంది, రావణాది రాక్షసులను, శత్రురాజులను దండించాడు. అతణ్ణి దేవేంద్రుడు త్రసదస్యుడు అని పొగిడాడు. అతడు యజ్ఞవస్తువులు, యజమాని, మంత్రాలు, ఋత్విక్కులు, యజ్ఞకాలాలు అన్నీ విష్ణుమయంగా భావించి, గొప్పగా దక్షిణలనిచ్చి యజ్ఞాలు చేశాడు.

**క. బలిమి నడంచుచు నరులం, జలివెలుఁగున్ వేఁడివెలుఁగుఁ జనుచోటెల్లన్**
**జలరుహనయనునికరుణను, జెలువుగ మాంధాత యేలె సిరి నిండారన్. 171**

**ప్రతి :** నరులన్= ప్రజలను; బలిమిన్= బలంతో; అడంచుచున్= శిక్షిస్తూ; చలివెలుఁగున్= చంద్రుడు; వేఁడివెలుఁగున్= సూర్యుడు; చనుచోటు+ఎల్లన్= వెళ్లే ప్రదేశమంతా; జలరుహనయనుని కరుణను= పద్మనేత్రుడైన విష్ణువు దయతో; చెలువుగన్= ఒప్పుగా; మాంధాత; సిరినిండారన్= సంపద తాండవించేటట్లు; ఏలెన్= పరిపాలించాడు.

**తా :** ఆ మాంధాత శ్రీహరిదయతో శత్రువులను శిక్షిస్తూ, చంద్రసూర్యులు సంచరించే చోటులన్నింటిని సిరిసంపదలతో తులతూగేటట్లు పరిపాలించాడు.

**వ. అంత నా రాజునకు శతబిందునికూఁతురగు బిందుమతియందుఁ బురుకుత్సుండు; నంబరీషుండును, ముచుకుందుండును నను వారు ముగ్గురుగొడుకులు, నేఁబండ్రుకూఁతులును జనియించి, పెరుఁగుచున్న యెడ. 172**

**ప్రతి :** అంతన్+ఆ రాజునకున్= అప్పుడు ఆ రాజుకు; శతబిందుని కూఁతురు+అగు= శతబిందుని కుమార్తె అయిన; బిందుమతి+అందున్= బిందుమతియందు; పురుకుత్సుండును= పురుకుత్సుడును; అంబరీషుండును= అంబరీషుడును; ముచుకుందుండును= ముచుకుందుడును; అనువారు= అనబడేవారు; ముగ్గురున్+కొడుకులున్= ముగ్గురు కుమార్లును; ఏఁబండ్రు కూఁతులును= ఏభైమంది కుమార్తెలు; జనియించి= పుట్టి; పెరుగుచున్న+ఎడన్= పెరుగుతుండగా...

**తా :** పిమ్మట ఆ మాంధాతకు శతబిందుని కూతురైన బిందుమతివల్ల పురుకుత్సుడు, అంబరీషుడు, ముచుకుందుడు అనే ముగ్గురుకొడుకులు, ఏభైమందికూతుళ్లు కలిగి పెరుగుచుండగా

**సీ. యమునాజలములోన నధికుఁడు సౌభరి తపము సేయుచు జలస్థలమునందుఁ**
**బిల్లలుఁ దనప్రాణవల్లభయునుఁ గూడి మెలఁగ నానందించు మీనరాజుఁ**
**గనుఁగొని సంసారకాంక్షియై మాంధాత నొక కన్య నడుగ నృపోత్తముండు**
**తరుణి నిత్తును స్వయంవరమునఁ జేకొను మనవుడు ననుఁ జూచి యౌవనాంగి**

**ఆ. యేల ముసలిఁ గోరు నిట్టట్టు వడఁకెడి, వాఁడఁ జాల నరసినాఁడ నొడల**
**జిగియు బిగియు లేని శిథిలుండఁ గరఁగింప, బాలఁ దిగిచికొను నుపాయ మెట్లు? 173**

**ప్రతి :** అధికుఁడు= గొప్పవాడైన; సౌభరి= సౌభరి అనేముని; యమునాజలములోనన్= యమునానదినీటిలో; తపము+చేయుచున్= తపస్సు చేస్తూ; జలస్థలము+అందున్= నీటి ప్రదేశంలో; పిల్లలున్+తనప్రాణ వల్లభయున్= పిల్లలు, తన భార్యయు; కూడి మెలఁగన్= కలసి తిరుగుతూ; ఆనందించు= సంతోషించు; మీనరాజున్+కనుఁగొని=

చేపలరాజును చూచి; సంసారకాంక్షి+ఐ= సంసారవిషయంలోని కోరిక కలవాడై; మాంధాతను; ఒక కన్యన్= ఒక కన్యను; అడుగన్= అడుగగా; నృప+ఉత్తముండు= రాజశ్రేష్ఠుడు; స్వయంవరమునన్= స్వయంవరంలో; తరుణిన్+ఇత్తును= కన్య నిస్తాను; చేకొనుము= గ్రహించు; అనవుడు= అనగా; ననున్+చూచి= నన్నుచూచి; యౌవన+అంగి= వయసులో ఉన్న స్త్రీ; ముసలిన్= ముసలివాణ్ణి; ఏలన్= ఎందుకు; కోరున్= కోరుకొనును; ఇట్టు+అట్టు= ఇటూ అటూ; వడఁకెడివాఁడన్= వణుకుతున్నవాడను; చాలన్+ నరసినాఁడన్= చాలా (జుట్టు) నెరసిపోయినవాణ్ణి; ఒడలన్= శరీరంలో; జిగియున్+బిగియున్= కాంతి, పటుత్వం; లేని= లేనటువంటి; శిథిలుండన్= శిథిలమైనవాణ్ణి; కరఁగింప= ఆకర్షించి; బాలన్+తిగిచికొను= కన్యను లోబరచుకునే; ఉపాయము+ఎట్లు= ఉపాయమేమి?

**తా :** మహానుభావుడైన సౌభరి అనే ముని యమునానదినీటిలో తపస్సుచేస్తూ, భార్యాపుత్రులతో కలిసి సంసారసుఖాన్ని అనుభవిస్తున్న చేపలరాజును చూశాడు. సంసార మందలి కోరికతో మాంధాతను ఆయన పుత్రికలలో ఒక కన్యను తన కిమ్మని అడిగాడు. ఆ రాజు స్వయంవరంలో కన్యనిస్తాను గ్రహించమన్నాడు, వయసులో ఉండే కన్య నాలాంటి ముసలివాణ్ణి ఎందుకు ఇష్టపడుతుంది. ముసలితనంతో వణుకుతున్నాను. జుట్టు నెరిసింది. ఒంట్లో కాంతిగాని, బిగువుగాని లేదు. కన్యను లోబరచుకొనే ఉపాయమేది?' అని అనుకున్నాడు.

**వ. అదియునుం గాక. 174**

**ప్రతి :** అదియునున్+కాక= అదీకాకుండా...

**ఆ. బాల పువ్వుఁబోఁడి ప్రాయంపువానినిఁ, జెన్నువాని ధనముఁజేర్చువాని**
**మరగెనేనిఁ గొంత మరగుఁగా కెదిరిఁ ద, న్నెఱిఁగి ముసలితపసి నేల మరగు? 175**

**ప్రతి :** బాల= కన్య; పువ్వుఁబోఁడి= పుష్పంవంటి శరీరం కలది; ప్రాయము+వానినిన్= వయస్సులో ఉన్నవాణ్ణి; చెన్నువానిన్= అందమైనవాణ్ణి; ధనమున్+చేర్చువానిన్= ఐశ్వర్యవంతుణ్ణి; మరగెన్+ఏనిన్= ఇష్టపడితే; కొంత మరగున్+కాక= కొంచెం ఇష్టపడవచ్చుగాని; ఎదిరిన్= ఎదుటివాణ్ణి; తన్నున్+ఎఱిఁగి= తనను తెలుసుకొని; ముసలితపసిన్= ముసలిమునిని; ఏలన్+మరగున్= ఎందుకు కోరుకుంటుంది?

**తా :** పువ్వులాంటి శరీరం గల కన్య యౌవనవంతుణ్ణి, సౌందర్యవంతుణ్ణి, ధనవంతుణ్ణి కోరుకుంటే కోరుకోవచ్చుగాని, ఎదురుగా నున్న ముసలిమునినైన నన్ను ఎందుకు కోరుకుంటుంది?

**వ. అని విచారించి సౌభరి దన తపోబలంబునం జేసి ముసలితనంబు విడిచి యెలప్రాయంపుఁ గొమరుండయి యలంకరించుకొని ముందట నిలువంబడిన మాంధాతయుఁ గన్నియల నగరు గాచికొని యున్నవారికి సెలవు సేసినవా ర మ్మునీంద్రుని నా రాజపుత్రికలున్న యెడకుం గొనిపోయి చూపిన. 176**

**ప్రతి :** అని విచారించి= అని ఆలోచించి; సౌభరి+తన తపోబలంబునన్+చేసి= సౌభరి తనతపోబలంతో; ముసలితనంబున్+విడిచి= ముసలితనాన్ని వదిలి; ఎలప్రాయము+కొమరుండు+అయి= పడుచుప్రాయపువాడై; అలంకరించుకొని= అలంకారం చేసుకొని; ముందటన్+నిలువబడినన్= ఎదురుగా నిలబడగా; మాంధాతయున్= మాంధాత కూడా; కన్నియల నగరున్= కన్నెలుండే అంతఃపురాన్ని; కాచుకొని+ఉన్నవారికిన్= కాపలకాస్తూ ఉన్నవారికి; సెలవు

చేసినన్= ఆజ్ఞాపించగా; వారు+ఆ+ముని+ఇంద్రునిన్= వారు ఆ మునిశ్రేష్ఠుని; ఆ రాజపుత్రికలు+ఉన్న+ఎడకున్= ఆ రాజకుమార్తెలు ఉన్నచోటికి; కొనిపోయి చూపినన్= తొడుకొనిపోయి చూపగా...

**తా :** అని యోచించి సౌభరి తన తపశ్శక్తితో ముసలితనాన్ని విడిచి లేతవయస్సు యువకుడై చక్కగా అలంకరించుకొని మాంధాత దగ్గరకు వచ్చాడు. అపు డారాజు అంతఃపుర రక్షకుల నాజ్ఞాపించగా వారు ఆ మునిని రాజకుమార్తెలున్న చోటికి తీసుకువెళ్లి చూపించారు. చూపగా

**ఉ. 'కోమలులార! వీఁడు నలకూబరుఁడో! మరుఁడో! జయంతుడో!**
**యేమఱి వచ్చె; వీనిఁ దడ వేల వరింతుము నేమ నేమ' యం**
**చా మునినాథుఁ జూచి చలితాత్మికలై సొరిదిన్ వరించి రా**
**భామిను లందఱుం గుసుమబాణుఁడు గీయని ఘంట వ్రేయఁగన్. 177**

**ప్రతి :** కోమలులారా!= ఓ యువతులారా!; వీఁడు నలకూబరుఁడు+ఓ= ఈతడు నలకూబరుడో; మరుఁడు+ఓ= మన్మథుడో; జయంతుఁడు+ఓ= జయంతుడో; ఏమఱి వచ్చెన్= పొరపాటున ఇక్కడికి వచ్చాడు; తడవు+ఏల= ఆలస్య మెందుకు; వీనిన్= వీనిని; నేము+అ+నేము+అ= మేమూ మేమూ అని; వరింతుము (వరించుదుము)= వరిస్తాము; అంచున్+ఆ మునినాథున్= అంటూ మునీశ్వరుణ్ణి చూచి; చలిత+ఆత్మికలు+ఐ= చలించిన మనసులు కలవారై; ఆ భామినులు+అందఱున్= ఆ కన్యలందరు; సొరిదిన్= వరుసగా; కుసుమబాణుఁడు= పుష్పబాణుడైన మన్మథుడు; గీ+అని= గీ అనేశబ్దంతో; ఘంట వ్రేయఁగన్= ఘంట కొట్టగా; వరించిరి= వరించారు.

**తా :** మన్మథుడు మోహావేశాన్ని కల్గించగా, ఆ కన్యలందరు ఆ మునీశ్వరుని చూచి "కొమ్మలారా! వీడు నలకూబరుడో, మన్మథుడో, జయంతుడో పొరబాటున ఇక్కడికి వచ్చాడు. ఆలస్యమెందుకు"అంటూ మేము మేము అని సంచలిత మనస్కులై అందరు వరించారు.

**వ. ఇట్లు రాజకన్యకల నందఱం జేకొని సౌభరి నిజతపఃప్రభావంబున ననేకలీలావినోదంబులఁ గల్పించి. 178**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; రాజకన్యకలన్= రాజకన్యకలను; అందఱన్= అందరినీ; చేకొని= స్వీకరించి; సౌభరి; నిజతపస్+ప్రభావంబునన్= తన తపశ్శక్తిచేత; అనేక= అనేకమైన; లీలావినోదంబులన్= లీలా వినోదాలను; కల్పించి= సృష్టించి...

**తా :** ఈ విధంగా ఆ రాజకన్యలనందరిని పెళ్ళాడి, సౌభరి తన తపోమహిమతో అనేకలీలావినోదాలు సృష్టించి

**సీ. గృహరాజములయందుఁ గృతకాచలములందుఁ గలువలు విలసిల్లు కొలఁకులందుఁ**
**గలకంఠశుకమధుకరనినాదములచే వర్ణనీయములైన వనములందు**
**మణివేదికలయందు మహనీయపర్యంకపీఠలీలాశైలబిలములందు**
**శృంగారవతులగు చెలువలు పలువురు తనపంపు సేయ సుస్థలములందు**

**తే. వస్త్రమాల్యానులేపసువర్ణహార, భూరిసంపద నిష్టాన్నభోజి యగుచుఁ**
**బూఁట పూటఁకు నొక వింత పొలుపుఁ దాల్చి, రాజకన్యల నందఱ రతులఁ దేల్చె. 179**

**ప్రతి :** గృహరాజముల+అందున్= సుందరభవనాల్లో; కృతక+అచలములు+అందున్= కృతకంగా నిర్మించిన పర్వతాల్లో; కలువలు విలసిల్లు= కలువలతో ప్రకాశించే; కొలఁకుల+అందున్= సరస్సుల్లో; కలకంఠ= కోకిలలయొక్క; శుక= చిలుకలయొక్క; మధుకర= తుమ్మెదలయొక్క; నినాదములచేన్= (మనోజ్ఞ)శబ్దాలతో; వర్ణనీయములు+ఐన= చెప్పదగిన; వనముల+అందున్= వనాలలో; మణివేదికల+అందున్= మణులు పొదిగిన తిన్నెలపై; మహనీయ= గొప్పవైన; పర్యంకపీఠ= శయ్యలయందు; లీలాశైలబిలముల+అందున్= కేళీపర్వతగుహల్లో; శృంగారవతులు+అగు= శృంగారవతులైన; చెలువలు = స్త్రీలు; పలువురు= చాలమంది; తనపంపు+చేయన్= తన ఆజ్ఞను పాటించే; సుస్థలముల+అందున్= మంచి ప్రదేశాల్లో; వస్త్ర, మాల్య+అనులేప= మంచి బట్టలు, పుష్పహారాలు, మైపూతలు; సువర్ణహార= బంగారు హారాలు మొదలైన; భూరిసంపదన్= గొప్ప ఐశ్వర్యంతో; ఇష్ట+అన్నభోజి+అగుచున్= ఇష్టమైన భోజనం చేస్తూ; పూఁటకున్+పూఁటకున్= దినదినమూ; ఒకవింత పొలుపున్+తాల్చి= ఒక ఆశ్చర్యకరమైన అందాన్ని ధరించి; రాజకన్యలన్+అందఱన్= రాజకుమార్తె లందరిని; రతులన్+తేల్చెన్= సంగమాలతో తృప్తిపరచాడు.

**తా :** సుందర భవనాల్లోనూ, కేళీపర్వతాల్లోనూ, కలువలు వికసించిన సరస్సుల్లో, కోకిలల, చిలుకల, తుమ్మెదల మనోజ్ఞ నాదాలతో సుందరమైన ఉద్యానవనాలలో, మణులు పొదిగిన తిన్నెలపైనా, గొప్పశయ్యలపైనా, కొండగుహల్లో శృంగారవతులైన స్త్రీలు తన ఆజ్ఞలు పాటిస్తుండగా, అందమైన ప్రదేశాలలో వస్త్రమాల్యానులేపనాదులను కల్పించి, ఇష్టభోజనాలతో పూటపూటకు ఒక ఆశ్చర్యకరమైన అందంతో ఆ రాజకుమార్తెలను సంతృప్తిపరచాడు.

**క. పెక్కండ్రు రాజముఖులకు, నొక్కఁడు మగఁ డయ్యుఁ దనియకుండె మునీంద్రుం**
**డెక్కుడు ఘృతధారలచే, నక్కజమై తృప్తి లేని యనలునిభంగిన్. 180**

**ప్రతి :** ఎక్కుడు= అధికమైన; ఘృతధారలచేన్= నేతిధారలతో; అక్కజము+ఐ= ఆశ్చర్యకరంగా; తృప్తిలేని= సంతృప్తి పొందని; అనలుని భంగిన్= అగ్నివలె; పెక్కండ్రు రాజముఖులకున్= చంద్రునివంటి ముఖాలుగల చాలమంది కన్యలకు; ఒక్కడు మగఁడు+అయ్యున్= ఒక్కడే భర్త అయి ఉండికూడా; తనియక+ఉండెన్= తృప్తి పొందలేకపోయాడు.

**తా :** అధికమైన నేతిధారలచేత తృప్తిపొందని అగ్నివలె, మునీశ్వరుడు పలువురు రాచకన్యలకు ఒకడే భర్తగా అయిఉండి కూడా తృప్తి పొందలేకపోయాడు.

**వ. ఇవ్విధంబున 181**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ విధంగా...

**క. ఆరామంబున మునివరుఁ, డా రామలతోడ బహువిహారమయుండై**
**గారాములఁ దన కిట్టటు, పోరాముల సేసి కొన్నిప్రొద్దులు పుచ్చెన్. 182**

**ప్రతి :** మునివరుఁడు= మునిశ్రేష్ఠుడు; ఆరామంబునన్= ఉద్యానవనంలో; ఆ రామలతోడన్= ఆ స్త్రీలతో; బహువిహారమయుండు+ఐ= అనేకవిధాల విహరిస్తున్నవాడై; గారాములన్= అనురాగాలతో; తనకున్+ఇట్టు+అటున్= తనకు అటునిటూ; పోవు+రాములన్+చేసి= కదలకుండా (పోవుట వచ్చుటలు లేకుండుట); కొన్ని ప్రొద్దులు పుచ్చెన్= కొన్ని రోజులు గడిపాడు.

**తా :** పైవిధంగా మునీశ్వరుడు ఉద్యానవనంలో ఆ రాజకుమార్తెలతో అనేకవిధాల విహారాలతో, అనురాగాలతో, రాకపోకలతో కొన్నిరోజులు గడిపాడు.

**వ. అంత నొక్కనాఁడు మాంధాతృమేదినీవల్లభుండు, మునీశ్వరుం డెందుఁ బోయెఁ? గూఁతు లెక్కడ నలజడి పడుచున్నవారలో' అని తలంచి, వెదుక వచ్చి, యొక్క మహానగరంబున, మణిమయసౌధంబులం, జక్రవర్తియుంబోలెఁ గ్రీడించుచున్న తాపసరాజుం గని, సంతసించి, వెఱఁగుపడి, మన్ననలంబొంది, మెల్లన కూఁతులం బొడగని సత్కరించి యిట్లనియె. 183**

**ప్రతి :** అంతన్+ఒక్కనాఁడు= పిమ్మట ఒకరోజు; మాంధాతృమేదినీ వల్లభుండు= మాంధాతృ మహారాజు; ముని+ఈశ్వరుండు= మునీశ్వరుడు; ఎందున్+పోయెన్= ఎక్కడికి వెళ్లాడు; కూఁతులు= కుమార్తెలు; ఎక్కడన్+అలజడిపడుచున్నవారలు+ఓ= ఎక్కడ కష్టపడుతున్నారో; అని తలంచి= అని ఆలోచించి; వెదుకన్+వచ్చి= వెదుకుతూ వచ్చి; ఒక్క మహానగరంబునన్= ఒక గొప్ప నగరంలో; మణిమయ సౌధంబులన్= మణులు పొదిగిన మేడల్లో; చక్రవర్తియున్+పోలెన్= చక్రవర్తివలె; క్రీడించుచున్+ఉన్న= విహరిస్తున్న; తాపసరాజున్+కని= మునీశ్వరుణ్ణి చూచి; సంతసించి= సంతోషపడి; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; మన్ననలన్+పొంది= గౌరవాలను అందుకొని; మెల్లనన్= మెల్లగా; కూఁతులన్= కుమార్తెలను; పొడగని= చూచి; సత్కరించి= ఆదరించి; ఇట్లు+అనియెన్= ఇలా గన్నాడు.

**తా :** పిమ్మట కొంతకాలానికి మంధాతృమహారాజు ముని ఏమయ్యాడో? కుమార్తెలు ఎన్నికష్టాలు పడుతున్నారో? అని ఆలోచించి, వెదుకుతూవచ్చి ఒక గొప్ప నగరంలో మణులు పొదిగిన భవంతిలో చక్రవర్తివలె విహరిస్తున్న తాపసరాజును చూచి సంతసించి, ఆశ్చర్యపడి ఆ మునిచేత గౌరవాలు పొంది, మెల్లగా కుమార్తెలను చేరి ఇలా అన్నాడు.

**క. నా తోడులార! మీ పతి, మీ తోడే?, పనులయెడల మేలే' యనుడున్**
**'నా తోడిదె నా తోడిదె, తాతా మే!', లనుచు ననిరి తరుణులు వరుసన్. 184**

**ప్రతి :** నా తోడులార= నా (వెంట ఉండే)బిడ్డలారా!; మీ పతి= మీ భర్త; మీతోడు+ఏ= మీకు తోడుగా ఉన్నాడా?(అన్యోన్యంగా ఉన్నాడా); పనుల+ఎడలన్= పనుల పట్ల; మేలు+ఏ= బాగున్నాడా? (ఆదరిస్తున్నాడా!); అనుడున్= అనగా; తాతా!= తండ్రీ; నా తోడు+ఇది+ఎ, నా తోడు+ఇది+ఎ= నా తోడే, నా తోడే; మేలు+అనుచున్= బాగు అంటూ; తరుణులు= ఆ స్త్రీలు; వరుసన్= వరుసగా; అనిరి= పలికారు.

**తా :** నా బిడ్డలారా! మీ భర్త అన్యోన్యంగా ఉంటున్నాడా? బాగా ఆదరిస్తున్నాడా? అని అడిగాడు – మాంధాత. ఆరాచ కుమార్తెలు అందరూ తండ్రీ! నా తోడే నా తోడే అంటూ బాగా ఆదరిస్తున్నాడన్నారు.

**విశే :** 'తోడు' శబ్దానికి 'ఆన' అనే అర్థముంది. నాన్నా! నేను నిజమే చెబుతున్నాను. ఇది నా ఆన (నా సాక్షి) అని ఆ రాజు మాంధాతతో బిడ్డలందరూ చెప్పారు.

**వ. అంతఁ గొంతకాలంబునకు గృహగతచర్యుండగు సౌభరి యేకాంతంబునఁ దన్నుఁ దాన చింతించుకొని, మీనమిథునసంగదోషంబునం గాఁపురంబు దనకు నగపడుట యెఱింగి, పశ్చాత్తాపంబున నిట్లనియె. 185**

**ప్రతి :** అంతన్= ఆ తరువాత; కొంతకాలంబునకున్= కొంత కాలానికి; గృహగతచర్యుండు+అగు= గృహస్థ జీవితాన్ని గడుపుతున్నవాడైన; సౌభరి= సౌభరిముని; ఏకాంతంబునన్= ఒంటరిగా; తన్నున్+తాను+అ= తనకుతానే; చింతించుకొని= విచారించుకొని; మీనమిథునసంగదోషంబునన్= చేపదంపతుల సాంగత్యాన్ని చూచిన దోషంచేత; కాఁపురంబు= సంసారం; తనకున్+అగపడుట+ఎఱింగి= తనకు ప్రాప్తించడం తెలుసుకొని; పశ్చాత్+తాపంబునన్= అనుతాపంతో; ఇట్లు+అనియెన్= ఇట్లన్నాడు.

**తా :** పిమ్మట కొంతకాలానికి లౌకికబంధాలకు చిక్కిన సౌభరి ఏకాంతంలో తనకు తానే విచారించుకొని చేపల జంట పొత్తును చూడ్డంచేత తాను సంసారబంధంలో చిక్కుకోవడం తెలుసుకొని, పశ్చాత్తాపంతో ఇట్లా అనుకున్నాడు.

**మ.** **ఉపవాసంబుల దయ్యుటో? విషయసంయోగంబు వర్జించుటో?**
**తపముం బూని చరించుటో? హరిపదధ్యానంబునన్ నిల్చుటో?**
**యపలాపంబున నేల పొందితి? హతం బయ్యెం దపంబెల్ల నీ**
**కపటస్త్రీపరిరంభముల్ మునులకుం గైవల్యసంసిద్ధులే? 186**

**ప్రతి :** ఉపవాసంబులన్= ఒక్కపొద్దులతో; దయ్యుట+ఓ= శుష్కించడమో; విషయ సంయోగంబు= ఇంద్రియ సుఖాలతోడి పొత్తు; వర్జించుట+ఓ= వదలివేయడమో; తపమున్+పూని= తపస్సుతో; చరించుట+ఓ= గడపడమో; హరిపదధ్యానంబునన్= శ్రీహరి ధ్యానంలో; నిల్చుట+ఓ= ఉండడమో; అపలాపంబునన్= మరుగు మాటలతో; ఏల పొందితి= ఎందుకు పొందాను; తపంబు+ఎల్లన్= తపస్సంతా; హతంబు+అయ్యెన్= నశించింది; ఈ కపట= ఈ మోసపూరితమైన; స్త్రీ పరిరంభముల్= స్త్రీల కౌగిలింతలు; మునులకున్= మునీశ్వరులకు; కైవల్యసంసిద్ధులు+ఏ= మోక్షకారణాలా?(కావని భావం).

**తా :** ఉపవాసాలతో శుష్కించడమో, ఇంద్రియ సుఖాలతోడి పొత్తు వదలి వేయడమో, తపస్సులో గడపడమో, శ్రీహరిధ్యానంలో ఉండడమో చేయక ఎందుకు ఈ మాటలాడి ఈ స్థితి తెచ్చుకొన్నాను. నా తపస్సంతా నశించింది. కపటమైన స్త్రీ కౌగిళ్లు మోక్షాన్ని కల్గిస్తాయా? (కల్గించవు).

**చ.** **ముని నఁట! తత్త్వవేది నఁట! మోక్షమ కాని సుఖంబు లెవ్వియుం**
**జన వఁట! కాంత లేఁబ దఁట! సౌధచయంబఁట వాసదేశముం,**
**దనయులు నైదువే లఁట! నిదానము మీనకుటుంబిసౌఖ్యముం**
**గను టఁట చెల్లరే నగవుగాక మహాత్ములు సూచి మెత్తురే? 187**

**ప్రతి :** మునినిన్+అఁట= ఋషినట; తత్త్వవేదిని+అఁట= తత్త్వాన్ని తెలిసినవాడినట; మోక్షము+అ కాని= మోక్షం తప్ప; సుఖంబులు+ఎవ్వియున్= సుఖాలు ఏట్టివైనా; చనవు+అఁట= వెళ్లనట; కాంతలు= భార్యలు; ఏఁబది+అఁట= యాభై మందట; వాసదేశమున్= నివాసము; సౌధచయంబు+అఁట= మేడల్లోనట; తనయులు= కొడుకులు; ఐదువేలు+అఁట= ఐదువేలమంది అట; నిదానము= (వీటికి) మూలకారణం; మీనకుటుంబి సౌఖ్యమున్= చేపల కుటుంబి సుఖాన్ని; కనుట+అఁట= చూడడమట; చెల్లరు+ఏ= అయ్యో!; నగవు+కాక= నవ్వు(లాట)కాక; మహా+ఆత్ములు+చూచి= మహానుభావులు చూచి; మెత్తురు(మెచ్చుదురు)+ఏ= మెచ్చుకొంటారా?(మెచ్చుకోరు)

**తా :** నేనొక మునినట, తత్త్వం తెలిసినవాడనట, మోక్షం తప్ప ఇతరసుఖాల జోలికి వెళ్ళనట, ఏభైమంది భార్యలట, మేడల్లో నివాసమట, ఐదువేలమంది కొడుకులట. దీని కంతటికి కారణం చేపలరాజు సౌఖ్యం చూడడ మట. నవ్విపోతారుగాని పెద్దవారు మెచ్చుకొంటారా? (మెచ్చుకోరు)

**ఆ. తపము సేయువాఁడు దత్త్వజ్ఞుఁ డగువాఁడు, నెలమి మోక్ష మిచ్ఛ నెంచువాఁడు**
**నేకతంబు విడిచి యేర్పడ నేరఁడు, కాఁపురంబు సేయుఁ గఊటితపసి. 188**

**ప్రతి :** తపము+చేయువాఁడు= తపస్సు చేసేవాడు; తత్త్వజ్ఞుఁడు+అగువాఁడు= తత్త్వవేత్త అయినవాడు; ఎలమిన్= ఆసక్తితో; మోక్షము= మోక్షాన్ని; ఇచ్ఛన్+ఎంచువాఁడు= కోరేవాడు; ఏకతంబు= ఏకాంతాన్ని; విడిచి= విడిచిపెట్టి; ఏర్పడన్+ నేరఁడు= బయటపడి ఉండడు; కఊటితపసి= కపటముని; కాఁపురంబు+చేయున్= సంసారంలో దిగుతాడు.

**తా :** తపస్సు చేసేవాడు, తత్త్వవేత్త అయినవాడు, మోక్షాన్ని కోరేవాడు ఏకాంతం కోరుకుంటాడు. కపటముని మాత్రం సంసారంలో తగుల్కొంటాడు.

**వ. అని దుఃఖించి, తన్నుం దాన నిందించుకొని, తన వేడబంబు వివేకించుచు, నిహపరసాధకుండై, కాఁపురంబు విడిచి, సతులుం దానును వానప్రస్థధర్మంబున నడవికిం జని, ఘోరతపంబు సేసి, శరీరంబు గుదియించి, యగ్నిసహితుండై, పరబ్రహ్మంబు సొచ్చె; నంత. 189**

**ప్రతి :** అని దుఃఖించి= అని విచారించి; తన్నున్+తాను+అ= తనను తానే నిందించుకొని; తన వేడబంబున్= తనను ఆవేశించిన మాయను; వివేకించుచున్= విమర్శించుకుంటూ; ఇహపరసాధకుండు+ఐ= ఇహ, పరలోక గమ్యాన్ని సాధించేవాడై; కాఁపురంబున్= కాపురాన్ని; విడిచి= వదలిపెట్టి; సతులున్+తానును= భార్యలూ, తానూ; వానప్రస్థధర్మంబునన్= వానప్రస్థధర్మంతో; అడవికిన్+చని= అరణ్యానికి వెళ్ళి; ఘోరతపంబు+చేసి= భయంకరమైన తపస్సుచేసి; శరీరంబున్+కుదియించి= శరీరాన్ని కుంగదీసి; అగ్ని సహితుండు+ఐ= అగ్నితో కలిసి; పరబ్రహ్మంబున్+చొచ్చెన్= పరమాత్మలో లీనమయ్యాడు; అంతన్= పిమ్మట...

**తా :** అని దుఃఖించి తన్ను తాను నిందించుకొని, తన చేతను విమర్శించుకుంటూ ఇహపరాలను సాధించాలని నిశ్చయించి, సంసారాన్ని వదలి, భార్యలతో వానప్రస్థధర్మాన్ని స్వీకరించి, అడవులకు వెళ్ళి తపస్సుచేసి శరీరాన్ని వదలి అగ్నితో పరమాత్మను చేరుకున్నాడు. తరువాత

**క. మునిపతి వనమున కరిగిన, వనితలు తో నరిగి ప్రాణవల్లభుగతికిం**
**జనిరి వెనుతవిలి విడువక, యనలునితో శిఖలు నిలువ కరిగినభంగిన్. 190**

**ప్రతి :** మునిపతి= మునీశ్వరుడు (సౌభరి); వనమునకున్+అరిగినన్= అరణ్యానికి వెళ్ళగా; వనితలు= అతని భార్యలు; తోన్+అరిగి= అతనితో వెంటవెళ్ళి; వెనుతవిలి= వెంటబడి; విడువక= విడిచిపెట్టక; అనలునితోన్= అగ్నితో; శిఖలు= జ్వాలలు; నిలువక= నిలబడక; అరిగిన భంగిన్= వెళ్ళినట్లుగా; ప్రాణవల్లభుగతికిన్= భర్తమార్గానికి; చనిరి= వెళ్ళారు.

**తా :** అగ్ని దేవుణ్ణి జ్వాలలు విడిచిపెట్టక అనుసరించినట్లు సౌభరిభార్యలుకూడా అతణ్ణి అనుసరించి, అతను పొందిన స్థితినే పొందారు.

**వ. అంత మాంధాత పెద్దకొడుకగు నంబరీషునిం దత్పితామహుం డగుటం జేసి యువనాశ్వుండు దనకుఁ బుత్త్రుండు గావలయునని కోరి తెచ్చుకొనియె; న య్యంబరీషునకు యౌవనాశ్వుం, డతనికి హారితుండు జనియించి, రది కారణంబుగా నంబరీష యౌవనాశ్వ హారితులు మాంధాతృగోత్రంబునకుఁ బ్రవరులైరి; మాంధాత రెండవకొడుకు పురుకుత్సుం; డతని నురగలోకంబునకుఁ గొనిపోయి భుజంగకుమారులు దమ చెల్లెలి నర్మదయను కన్యకను వివాహంబు చేసిరి; పురుకుత్సుండు నక్కడ ననేకగంధర్వనాథుల వధించి తన నాగలోక సంచరణంబు దలంచువారికి నురగభయంబు లేకుండ వరంబు వడసి తిరిగి వచ్చె; నా పురుకుత్సునకుఁ ద్రసదస్యుండుఁ, ద్రసదస్యునకు ననరణ్యుండు, నా యనరణ్యునకు హర్యశ్వుండు, హర్యశ్వునకు నరుణుండు, నరుణునకుఁ ద్రిబంధనుండుఁ; ద్రిబంధనునకు సత్యవ్రతుండును జన్మించి; రా సత్యవ్రతుండు త్రిశంకుఁడనం బరఁగె; నతండు. 191**

**ప్రతి :** అంతన్= ఆ తరువాత; మాంధాతపెద్దకొడుకు+అగు= మాంధాత పెద్దకొడుకైన; అంబరీషునిన్= అంబరీషుణ్ణి; తత్+పితామహుండు+అగుటన్+చేసి= అతని తాతకావడంవల్ల; యువనాశ్వుండున్= యువనాశ్వుడు; తనకున్+పుత్రుండు= తనకు కొడుకుగా; కావలయున్+అని= కావాలి అని; కోరితెచ్చుకొనియెన్= ఇష్టపడి తెచ్చుకున్నాడు; ఆ+అంబరీషునకున్= ఆ అంబరీషునికి; యౌవనాశ్వుండు= యౌవనాశ్వుడును; అతనికి= అతనికి (యౌవనాశ్వునికి); హారితుండు+జనియించిరి= హారితుడు పుట్టారు; అది కారణంబు+కాన్= ఆ కారణంచేత; అంబరీష, యౌవనాశ్వహారితులు= అంబరీషుడు, యౌవనాశ్వుడు, హారితుడు; మాంధాతృగోత్రంబునకున్= మాంధాతృగోత్రానికి; ప్రవరులు+ఐరి= ముఖ్యపురుషులైనారు; మాంధాత రెండవకొడుకు= మాంధాత రెండవ కుమారుడు; పురుకుత్సుండు= పురుకుత్సుడు; అతనిన్+ఉరగలోకంబునకున్+కొనిపోయి= అతణ్ణి నాగలోకానికి తీసుకొనివెళ్ళి; భుజంగ కుమారులు= నాగకుమారులు; తమ చెల్లెలు= తమ చెల్లెలైన; నర్మద+అను కన్యకను= నర్మద అనే కన్యకను; వివాహంబు+చేసిరి= పెండ్లి చేశారు; పురుకుత్సుండున్+అక్కడన్= పురుకుత్సుడు కూడ అక్కడ; అనేక గంధర్వనాథులన్+వధించి= పులువురు గంధర్వరాజులను చంపి; తన నాగలోక సంచరణంబున్= తన నాగలోక సంచారాన్ని; తలంచువారికిన్= భావించేవారికి; ఉరగభయంబులేక+ఉండన్= సర్పభయం లేకుండా; వరంబు+పడసి= వరాన్నిపొంది; తిరిగి వచ్చెన్= తనలోకానికి తిరిగివచ్చాడు; ఆ పురుకుత్సునకున్= ఆ పురుకుత్సునికి; త్రసదస్యుండున్= త్రసదస్యుడును; త్రసదస్యునకున్= త్రసదస్యునికి; అనరణ్యుండున్= అనరణ్యుడును; ఆ+అనరణ్యునకున్= ఆ అనరణ్యునికి; హర్యశ్వుండు= హర్యశ్వుడును; హర్యశ్వునకున్= హర్యశ్వునికి; అరుణుండును= అరుణుడును; అరుణునకున్= అరుణునికి; త్రిబంధనుండున్= త్రిబంధనుడును; త్రిబంధనునకున్= త్రిబంధనునికి; సత్యవ్రతుండును= సత్యవ్రతుడును; జన్మించిరి= పుట్టారు; ఆ సత్యవ్రతుండు= ఆ సత్యవ్రతుడు; త్రిశంకుఁడు+అనన్+పరగెన్= త్రిశంకుడని ప్రసిద్ధిచెందాడు; అతడు= అతను (త్రిశంకుడు)...

**తా :** మాంధాతకొడుకుల్లో అంబరీషుణ్ణి తాత యువనాశ్వుడు అతనిని కుమారునిగా స్వీకరించాడు. ఆ అంబరీషునికి యౌవనాశ్వుడు, అతనికి హారితుడు పుట్టారు. ఆ కారణంచేత అంబరీష, యౌవనాశ్వ, హారితులు మాంధాతృ గోత్రానికి ముఖ్యపురుషులైనారు. మాంధాత రెండవకొడుకు పురుకుత్సుడు. నాగకుమారులు అతణ్ణి పాతాళానికి తీసుకొనిపోయి, తమ చెల్లెలు నర్మద నిచ్చి వివాహం చేశారు. అక్కడ ఎందరో గంధర్వనాథుల్ని చంపి, తాను నాగలోకం వెళ్లి సంచరించిన విషయం స్మరించిన వాళ్లకు పాముల వల్ల భయం లేకుండా వరం పొంది, తిరిగివచ్చాడు. పురుకుత్సునికి త్రసదస్యుడు,

అతనికి అనరణ్యుడు, అతనికి హర్యశ్వుడు, అతనికి అరుణుడు, అతనికి త్రిబంధనుడు, అతనికి సత్యవ్రతుడు జన్మించారు. ఆ సత్యవ్రతుడే త్రిశంకుడని ప్రసిద్ధి పొందాడు. ఆ త్రిశంకుడు

**సీ. గురుశాపవశమునఁ గూలి చండాలుఁడై యనఘాత్ముఁ గౌశికు నాశ్రయించి**
**యతనిలావున దివిజాలయంబున కేఁగ మన్నింప కమరులు మరలఁ ద్రోయఁ**
**దలక్రిందుగాఁ బడి దైన్యంబుతో రాఁగఁ గౌశికుం డెప్పటి ఘనత మెఱసి**
**నిలిపె నాకసమున; నేఁడు నున్నాఁడు త్రిశంకుఁ; డాతఁడు హరిశ్చంద్రుఁ గనియె**

**తే. నా హరిశ్చంద్రుఁ గౌశికుఁ డర్థిఁ జేరి, యాగదక్షిణామిషమున నఖిలధనముఁ**
**గొల్లఁగొని మీఁదఁ గులహీనుఁ గొలువఁబెట్ట, బొంక కలజడిఁ బొందె నా భూవరుండు. 192**

**ప్రతి :** గురుశాపవశమునన్+కూలి= గురువుయొక్క (వసిష్ఠుడు) శాపవశాత్తు పతనమై; చండాలుఁడు+ఐ= చండాలుడై; అనఘ+ఆత్మున్= మహానుభావుడైన; కౌశికున్+ఆశ్రయించి= విశ్వామిత్రుణ్ణి చేరి; అతని లావునన్= ఆయన గొప్పతనంచేత; దివిజ+ఆలయమునకున్+ఏగన్= స్వర్గానికి వెళ్లగా; అమరులు= దేవతలు; మన్నింపక= ఆదరించక; మరలన్+త్రోయన్= మరలా తోసివేయగా; తలక్రిందుగాన్+పడి= తలక్రిందుగా పడి; దైన్యంబుతో రాన్+కన్= దీనత్వంతో రాగా; కౌశికుండు= విశ్వామిత్రుడు; ఎప్పటి ఘనతన్= ఎప్పటి గొప్పతనంతో; మెఱసి నిలిపెన్= ప్రకాశించి నిలబెట్టాడు; త్రిశంకుఁడు= అట్టి త్రిశంకుడు; ఆకసమునన్= ఆకాశంలో; నేఁడున్+ఉన్నాడు= ఇప్పటికీ ఉన్నాడు; ఆతఁడు= అతడు; హరిశ్చంద్రున్+కనియెన్= హరిశ్చంద్రుణ్ణి కన్నాడు; ఆ హరిశ్చంద్రున్= ఆ హరిశ్చంద్రుణ్ణి; కౌశికుఁడు= విశ్వామిత్రుడు; అర్థిన్+చేరి= కోరికతో సమీపించి; యాగదక్షిణామిషమునన్= యాగదక్షిణ నెపంతో; అఖిలధనమున్= సమస్తసంపదను; కొల్లన్+కొని= దోచుకొని; మీఁదన్= తరువాత; కులహీనున్= కులహీనుణ్ణి; కొలువన్+పెట్టన్= సేవించడానికి పెట్టగా; ఆ భూవరుండు= ఆ రాజు; బొంకక= అసత్య మాడక; అలజడిన్+పొందెన్= కష్టాల పాలయ్యాడు.

**తా :** గురుశాపంవల్ల చండాలుడైన అతడు మహానుభావుడైన విశ్వామిత్రుణ్ణి ఆశ్రయించి, అతని ప్రభావంచేత స్వర్గానికి వెళ్ళాడు. దేవతలు అతణ్ణి ఒప్పుకోక తోసివేశారు. అతడు తలకిందుగా దీనుడై రావడం చూచి, విశ్వామిత్రుడు తన గొప్పతనంతో ఆకసంలో నిలిపాడు. నేటికీ ఆ త్రిశంకుడు అక్కడే ఉన్నాడు. అతనికొడుకు హరిశ్చంద్రుడు. విశ్వామిత్రుడితని వద్దకు వచ్చి యాగం నెపంతో అతని సంపదను హరించి, అతణ్ణి కులహీనునికి సేవకుడుగా చేశాడు. కాని హరిశ్చంద్రుడు అసత్యం పలుకక కష్టాల పాలయ్యాడు.

**వ. అట్లు విశ్వామిత్రుండు హరిశ్చంద్రు నెగులుపఱచుట విని వసిష్ఠుండు విశ్వామిత్రుని గృధ్రమ్మవు గమ్మని శపించె. విశ్వామిత్రుండును వసిష్ఠుని బకంబవు గమ్మని శపించెఁ; బక్షిరూపు లయ్యును వైరంబు మానక య య్యిరువురును యుద్ధంబు సేసి; రంత హరిశ్చంద్రుండు పుత్త్రులు లేక నారదు నుపదేశంబున వరుణోపాసనంబు నతిభక్తితోఁ జేయ నా వరుణుండు ప్రత్యక్షంబైన నతనికిఁ ద్రొక్కి యిట్లనియె. 193**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; విశ్వామిత్రుండు= విశ్వామిత్రుడు; హరిశ్చంద్రున్+నెగులు+పఱచుట విని= హరిశ్చంద్రుణ్ణి బాధపెట్టడం విని; వసిష్ఠుండు= వసిష్ఠుడు; విశ్వామిత్రునిన్= విశ్వామిత్రుణ్ణి; గృధ్రమ్మవు+కమ్ము+అని= గద్దవు కమ్మని; శపించెన్= శపించాడు; విశ్వామిత్రుండును= విశ్వామిత్రుడుకూడ; వసిష్ఠునిన్= వసిష్ఠుణ్ణి; బకంబవు+కమ్ము+అని= కొంగవు

కమ్మని; శపించెన్= శపించాడు; ఆ+ఇరువురును= ఆ ఇద్దరు; పక్షిరూపులు+అయ్యును= పక్షిరూపాల్ని పొందినవాళ్లయినా; వైరంబున్+మానక= శత్రుత్వం విడువక; యుద్ధంబు+చేసిరి= పోరాడారు; అంతన్+హరిశ్చంద్రుండు= అంతట హరిశ్చంద్రుడు; పుత్రులు లేక= సంతానంలేక; నారదు+ఉపదేశంబునన్= నారదుని ఉపదేశంతో; వరుణ+ఉపాసనంబున్= వరుణదేవుణ్ణి ఉపాసించడంవల్ల; అతిభక్తితోన్+చేయన్= మిక్కిలి భక్తితో చేయగా; ఆ వరుణుండు= ఆ వరుణుడు; ప్రత్యక్షంబు+ఐనన్= దర్శనం కాగా; అతనికిన్+మ్రొక్కి= ఆ వరుణునికి మ్రొక్కి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఆ విధంగా విశ్వామిత్రుడు హరిశ్చంద్రుణ్ణి బాధపెట్టడం విని, వసిష్ఠుడు విశ్వామిత్రుని గద్దవు కమ్మని శపించాడు. విశ్వామిత్రుడు వసిష్ఠుణ్ణి కొంగవు కమ్మని శపించాడు. పక్షిరూపాలు పొందినా ఆ ఇద్దరూ శత్రువులై పోరాడారు. ఆ తరువాత హరిశ్చంద్రుడు కొడుకులు లేక నారదుని ఉపదేశంతో వరుణుణ్ణి భక్తితో ఉపాసించాడు. వరుణుడు ప్రత్యక్షం కాగా హరిశ్చంద్రు డతనికి నమస్కరించి ఇలా అన్నాడు.

**ఆ. 'వరుణదేవ! నాకు వరవీరగుణములఁ, గొడుకు పుట్టెనేనిఁ గొడుకుఁబట్టి**
**పశువుఁజేసి నీవు పరిణమింపఁగ వేల్తుఁ, గొడుకు నీఁ గదయ్య కొసరు లేక! 194**

**ప్రతి :** వరుణదేవ= ఓ వరుణదేవా!; నాకున్= నాకు; వరవీరగుణములన్= శ్రేష్ఠమైన వీరులగుణాలతో; కొడుకుపుట్టెన్+ఏనిన్= కుమారుడు జన్మిస్తే; కొడుకున్+పట్టి= కొడుకును పట్టి; పశువున్+చేసి= యాగపశువుగా మార్చి; నీవు పరిణమింపన్+కన్= నీవు సంతోషించేటట్లు; వేల్తున్= అగ్నిలో సమర్పిస్తాను; కొసరులేక= వెలితిలేకుండా; కొడుకున్+ఈన్+కదయ్య= కొడుకునీయవయ్యా!

**తా :** ఓ వరుణదేవా! నాకు మంచి వీరుడైన కొడుకునిస్తే అతణ్ణి యాగపశువుగా మార్చి, నీవు సంతోషించేటట్లు హోమం చేస్తాను. కాబట్టి కొరత లేకుండా కొడుకు నిమ్ము.

**వ. అని పలికినం గుమారుండు గలిగెడు మని వరం బిచ్చి వరుణుండు సనియె; నంత హరిశ్చంద్రునకు వరుణప్రసాదంబున రోహితుండను కుమారుండు జన్మించె; వరుణుండును హరిశ్చంద్రకుమారు నుద్దేశించి. 195**

**ప్రతి :** అని పలికినన్= అని వేడగా; కుమారుండున్+కలిగెడున్+అని= కుమారుడు కలుగుతాడని; వరంబున్+ఇచ్చి= వరమిచ్చి; వరుణుండు+చనియెన్= వరుణుడు వెళ్లాడు; అంతన్= ఆ తరువాత; హరిశ్చంద్రునకున్= హరిశ్చంద్రునికి; వరుణ ప్రసాదంబునన్= వరుణుని అనుగ్రహంచేత; రోహితుండు+అను= రోహితుడనే; కుమారుండు+జన్మించెన్= కొడుకు పుట్టాడు; వరుణుండును= వరుణుడుకూడ; హరిశ్చంద్రకుమారున్+ఉద్దేశించి= హరిశ్చంద్రుని కొడుకును గురించి...

**తా :** అని అడిగిన హరిశ్చంద్రునికి కొడుకు కలుగుగాక అని వరమిచ్చి వరుణుడు వెళ్ళాడు. ఆ వరుణుని అనుగ్రహంచేత హరిశ్చంద్రునికి రోహితుడనే కొడుకు కలిగాడు. అపుడు వరుణుడు హరిశ్చంద్రుని కుమారుణ్ణి గురించి

**సీ. పురిటిలోపల వచ్చి పుత్త్రువేలుపు మన్నఁ బురుడు వోయినఁగాని పొసఁగ దనియెఁ;**
**బలురాక మును వచ్చి బాలు వేలుపు మన్నఁ బండ్లు లేకుంట నభావ్యుఁడనియెఁ;**
**బండ్లు రాఁజూచి డింభకుని వేలుపు మన్నఁ బడి పండ్లు రామి నభావ్యుఁడనియెఁ;**
**బడిపండ్లు వొడమినఁ గొడుకు వేలుపు మన్నఁ బోరుల కొదవక పోల దనియెఁ;**

**ఆ. దొదరి యిట్లు గొడుకుతోడిమోహంబునఁ, బ్రొద్దు గడపుచుండె భూవరుండు**
**దండ్రి తలఁపుకొలఁదిఁ దనలోనఁ జింతించి, యింట నుండ కడవి కేగెఁ గొడుకు. 196**

**ప్రతి :** పురిటిలోపలన్+వచ్చి= పురిటి సమయానికి ముందేవచ్చి; పుత్రున్+వేలుపుము+అన్నన్= కొడుకును వేల్చుమని అడుగగా; భూవరుండు= రాజు; పురుడు+పోయినన్+కాని= పురిటి సమయం దాటితేగాని; పొసగదు+అనియెన్= కుదరదన్నాడు; పలురాక మును వచ్చి= పండ్లురాకముందు వచ్చి; బాలున్+వేలుపుము+అన్నన్= పిల్లవాణ్ణి వేల్చుమంటే; పండ్లులేకుంటన్= పండ్లు లేకపోవటంచేత; అభావ్యుఁడు= కాదగినవాడు కాదు; అనియెన్= అన్నాడు; పండ్లురాన్+చూచి= పండ్లు వచ్చుట గమనించి; డింభకునిన్= బాలుణ్ణి; వేలుపుము+అన్నన్= బలి ఇవ్వుమనగా; పడిపండ్లురామి= గట్టిపండ్లు రాకపోవడంచేత; అభావ్యుఁడు+అనియెన్= అర్హత లేనివాడన్నాడు; పడిపండ్లు+పొడమినన్= పడిపండ్లు కనపడగా; కొడుకున్+వేలుపుము+అన్నన్= కొడుకుని బలి ఇవ్వుమనగా; పోరులకున్+ఒదవక= యుద్ధాలకు ఉపయోగపడక; పోలదు+అనియెన్= పనికిరాదన్నాడు; తొడరి= ప్రయత్నపూర్వకంగా; ఇట్లున్= ఈ విధంగా; కొడుకుతోడి మోహంబునన్= కుమారుని మీద ప్రేమచేత; భూవరుడు= రాజైన హరిశ్చంద్రుడు; ప్రొద్దున్+గడపుచున్+ఉండెన్= కాలక్షేపంచేస్తూ ఉన్నాడు; తండ్రితలఁపు కొలఁదిన్= తండ్రిఆలోచన కొద్దీ; తనలోనన్+చింతించి= తన మనస్సులో ఆలోచించి; కొడుకు= కుమారుడు; ఇంటన్+ఉండక= ఇంట్లో ఉండకుండా; అడవికిన్+ఏగెన్= అడవికి పోయాడు.

**తా :** వరుణుడు హరిశ్చంద్రుని వాగ్దానం ప్రకారం పురిటి లోపల వచ్చి కొడుకును బలి ఇవ్వుమనగా పురుడు దాటితేగాని కుదరదు అన్నాడు. పండ్లు రావడానికి ముందువచ్చి అడుగగా పండ్లు లేకపోవడంచేత బలికి అనర్హుడన్నాడు. పండ్లు వచ్చాక అడుగగా పడిపండ్లు రాలేదు కాబట్టి అనర్హుడన్నాడు. పాలపండ్లు పోయి మళ్లీ పళ్లు వచ్చాక అడుగగా యుద్ధాలకు ఉపయోగపడితేనే అర్హత కలుగుతుందన్నాడు. ఈ విధంగా రాజు కొడుకుమీద ప్రేమచేత కాలక్షేపం చేశాడు. తండ్రి మనసులోని భావం తెలిసి కొడుకు ఇల్లు విడిచి అరణ్యాలకు వెళ్ళాడు.

**వ. ఇట్లు వనంబునకుం జని శరశరాసనధరుండయి రోహితుండు దిరుగుచుండి వరుణగ్రస్తుండై హరిశ్చంద్రుండు మహోదరవ్యాధిచేఁ బీడితుండుగా నుండుట విని, పురంబునకుం దిరిగి రా గమకింప నింద్రుండు ముసలితపసియై వచ్చి యిట్లనియె. 197**

**ప్రతి :** వనంబునకున్+చని= అడవికి వెళ్ళి; శర= బాణాలను; శర+ఆసన= ధనుస్సును; ధరుండు+అయి= ధరించినవాడై; రోహితుండు+తిరుగుచుండి= రోహితుడు తిరుగుతూ; వరుణగ్రస్తుండు+ఐ= వరుణునికి చిక్కినవాడై; హరిశ్చంద్రుండు= హరిశ్చంద్రుడు; మహోదరవ్యాధిచేన్= మహోదరవ్యాధితో; పీడితుండు+కాన్+ఉండుట= పీడింపబడుతూ ఉండడం; విని; పురంబునకున్+తిరిగిరాన్= నగరానికి తిరిగిరావటానికి; గమకింపన్= ప్రయత్నించగా; ఇంద్రుండు= ఇంద్రుడు; ముసలితపసి+ఐ= ముసలితపసిగా; వచ్చి; ఇట్లు+అనియెన్= ఇట్లన్నాడు.

**తా :** ఇట్లా రోహితుడు ఇల్లువిడిచి అడవికిపోయి ధనుర్బాణాల్ని ధరించి తిరుగుతూ ఉన్నాడు. అక్కడ వరుణుని కారణంచేత హరిశ్చంద్రుడు మహోదరవ్యాధితో బాధింపబడుతున్నాడని తెలిసి, నగరానికి వచ్చే ప్రయత్నం చేశాడు. అది తెలుసుకొని ఇంద్రుడు ముసలితపసిగా వచ్చి ఇట్లా అన్నాడు.

**విశే :** వరుణుడు జలదేవత. జలదేవతకు అపచారం చేసినకారణంగా జలతత్త్వం - అధికమై మహోదరవ్యాధి పట్టి పీడించింది.

**ఆ. పుణ్యభూము లరుగు; పుణ్యతీర్థంబులఁ, గ్రుంకు; పుణ్యజనులఁ గోరి చూడు;**
**పుణ్యకథలు వినుము భూపాలపుత్రక!, మేలు గలుగునట్టి మేర గలదు. 198**

**ప్రతి :** భూపాలపుత్రక= రాజకుమారా!; పుణ్యభూములు+అరుగు(ము)= పుణ్యక్షేత్రాలకు వెళ్ళు; పుణ్యతీర్థంబులన్+క్రుంకు(ము)= పుణ్యతీర్థాల్లో మునుగు; పుణ్యజనులన్+కోరిచూడు(ము)= పుణ్యాత్ములను కలుసుకో; పుణ్యకథలు వినుము= పుణ్యుల కథలను విను; మేలు+కలుగునట్టి= మేలుకలిగే; మేర+కలదు= అవకాశం ఉంది.

**తా :** ఓ రాజకుమారా! పుణ్యక్షేత్రాలను దర్శించు. పుణ్యతీర్థాల్లో మునుగు, పుణ్యాత్ములను కలుసుకో, పుణ్యకథలు విను. నీకు ఉపయోగముంటుంది.

**వ. అని యిట్లు మగుడించినం దిరిగి చని రోహితుం డొక్క యే డవ్వనంబునం దిరిగి క్రమ్మఱఁ జనుదేర నింద్రుండు వచ్చి తొంటియట్ల నివారించె; ని వ్విధంబున. 199**

**ప్రతి :** అని; ఇట్లు= ఈ విధంగా; మగుడించినన్= వెనుకకు మరల్చగా; తిరిగి చని= తిరిగివెళ్ళి; రోహితుండు= రోహితుడు; ఒక్క+ఏడు= ఒక సంవత్సరం; ఆ+వనంబునన్+తిరిగి= ఆ అడవిలో తిరుగాడి; క్రమ్మఱన్+చనుదేరన్= మరల నగరానికి బయలుదేరగా; ఇంద్రుండు వచ్చి= ఇంద్రుడు వచ్చి; తొంటి+అట్లు+అ= పూర్వంవలె; నివారించెన్= అడ్డుపడ్డాడు; ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** అని ఇంద్రుడీ విధంగా రోహితుణ్ణి మరలించాడు. అతడు ఒక సంవత్సరం అడవిలో తిరిగి ఇంటిముఖం పట్టాడు. ఇంద్రుడు మళ్లీ వచ్చి అతణ్ణి నివారించాడు. ఈ విధంగా

**సీ. ఐదేండ్లు మరలించె నమరేంద్రుఁ డా బాలు నాఱవయేటఁ దా నడవినుండి**
**యింటికి వచ్చుచు నెలమి నజీగర్తు మధ్యమపుత్త్రు సన్మాన్యచరితు**
**ఘను శునశ్శేఫునిఁ గొని యాగపశువుగ నా హరిశ్చంద్రున కాతఁ డిచ్చెఁ;**
**బురుషమేధము సేసి భూపాలవర్యుఁడు వరుణాదినిఖిలదేవతలఁ దనిపె**

**తే. హోత కౌశికుఁ; డధ్వర్యుఁ డొనర భృగువు;, బ్రహ్మ జమదగ్ని, సామంబు పాడువాఁడు**
**ముని వసిష్ఠుఁ డా మఖమున ముదముఁ బొంది, కనకరథ మిచ్చె నింద్రుఁ డా మనుజపతికి. 200**

**ప్రతి :** అమర+ఇంద్రుఁడు= దేవేంద్రుడు; ఆ బాలున్= ఆ బాలుడైన రోహితుణ్ణి; ఐదు+ఏండ్లు= ఐదు సంవత్సరాలు; మరలించెన్ (పురానికి రాకుండా) నివారించాడు; ఆఱవ+ఏటన్= ఆరో సంవత్సరంలో; తాన్+అడవినుండి= తాను అరణ్యంనుండి; ఇంటికిన్+వచ్చుచున్= ఇంటికి వస్తూ; ఎలమిన్= ప్రేమతో; అజీగర్తుమధ్యమపుత్రున్= అజీగర్తుడనే వాడి నడిమికొడుకునూ; సన్మాన్యచరితున్= మంచినడవడిక కలవాణ్ణి; ఘనున్= గొప్పవాణ్ణి; శునశ్శేఫునిన్+కొని= శునశ్శేఫుణ్ణి తీసుకొనివచ్చి; ఆతఁడు= ఆ రోహితుడు; యాగపశువుగన్= యాగపశువుగా; ఆ హరిశ్చంద్రునకున్= ఆ హరిశ్చంద్రునికి; ఇచ్చెన్= ఇచ్చాడు; భూపాలవర్యుఁడు= రాజశ్రేష్ఠుడగు హరిశ్చంద్రుడు; పురుషమేధము+చేసి= నరమేధం చేసి; వరుణ+ఆది= వరుణుడు మొదలైన; నిఖిల దేవతలన్+తనిపెన్= దేవతలందరిని సంతృప్తిపరచాడు; ఆ మఖమునన్= ఆ యాగంలో; కౌశికుఁడు= విశ్వామిత్రుడు; హోత= హోత; ఒనరన్= చక్కగా; భృగువు= భృగుమహర్షి; అధ్వర్యుఁడు= అధ్వర్యుడు;

జమదగ్ని= జమదగ్నిమహర్షి; బ్రహ్మ= బ్రహ్మ; సామంబు పాడువాఁడు= సామవేద గానం చేసేవాడు; ముని వసిష్ఠుఁడు= వసిష్ఠమహర్షి; ఇంద్రుఁడు= దేవేంద్రుడు; ముదమున్+పొంది= సంతోషించి; ఆ మనుజపతికిన్= ఆ రాజుకు; కనకరథము+ఇచ్చెన్= బంగారు రథాన్ని ఇచ్చాడు.

**తా :** ఈ విధంగా దేవేంద్రుడు ఆ బాలుణ్ణి ఐదేండ్లు నివారించాడు. ఆఱవ ఏడు ఆ కుమారుడు అడవినుండి ఇంటికి వస్తూ అజీగర్తుని నడిమికొడుకు, మంచినడవడిక గలవాడు అయిన శునశ్శేపుణ్ణి తీసుకవచ్చి తండ్రికి అప్పగించాడు. ఆ రాజు నరమేధం చేసి వరుణాది దేవతలను సంతృప్తి పరచాడు. ఆ యాగానికి హోత కౌశికుడు, అధ్వర్యుడు భృగువు, ఋత్విక్కు జమదగ్ని, సామవేదగానం చేసినవాడు వసిష్ఠుడు. ఈ యాగానికి సంతోషించి దేవేంద్రు డా రాజుకు బంగారు రథం ఇచ్చాడు.

**వ. శునశ్శేపునిప్రభావంబు వెనుక వివరించెద; నంత భార్యాసహితుండైన హరిశ్చంద్రువలన నత్యంతప్రీతుండై విశ్వామిత్రుం డతనికి ముఖ్యజ్ఞానంబుఁ గృపసేసిన మనం బన్నమయంబు గావున, నన్నరూపియైన పృథివి నెఱింగి, పృథివిని జలంబువలన నణంచి, జలంబుఁ దేజంబువలన నింకించి, తేజంబు వాయువువలనం జేర్చి, వాయువు నాకాశంబునం గలిపి, యాకసంబు దామసాహంకారంబునందు లయంబు చేసి, యహంకారత్రయంబు మహత్తత్త్వంబునందు డిందించి, పరతత్త్వంబునకు లోకంబులు సృజించెద నను తలంపైన మహత్తత్త్వంబునందు విషయాకారంబు నివర్తించి విషయవివర్జితుండై పరతత్త్వంబుల నెఱుంగుచు, న య్యెఱుకవలన సంసారహేతువైన ప్రకృతిని భస్మంబుఁ జేసి, యయ్యెఱుకను నిర్వాణసుఖపారవశ్యంబునం బరిహరించి, సకలబంధవిముక్తుండై హరిశ్చంద్రుం డవాఙ్మానసగోచరంబయిన నిజరూపంబుతో వెలుంగుచుండె; నతని కుమారునకు హరితుండు పుట్టె; హరితునకుఁ జంపనామధేయుండు జనియించె; నతండు దనపేరఁ జంపానగరంబు నిర్మించె; నా చంపునికి సుదేవుండు, సుదేవునికి విజయుండు, విజయునకు రురుకుండు, రురుకునకు వృకుండు, వృకునకు బాహుకుండు జనియించి; రందు బాహుకుండు. 201**

**ప్రతి :** శునశ్శేపునిప్రభావంబున్= శునశ్శేపునిమహిమను; వెనుకన్ వివరించెదన్= తర్వాత వివరిస్తాను; అంతన్= అపుడు; భార్యాసహితుండు+ఐన= భార్యతో కూడిన; హరిశ్చంద్రువలనన్= హరిశ్చంద్రునివల్ల; అతి+అంత ప్రీతుండు+ఐ= మిక్కిలి సంతోషించి; అతనికిన్= ఆ హరిశ్చంద్రునికి; విశ్వామిత్రుండు= విశ్వామిత్రుడు; ముఖ్యజ్ఞానంబున్+కృప+చేసినన్= పరమజ్ఞానాన్ని బోధించగా; హరిశ్చంద్రుడు= హరిశ్చంద్రుండు; మనంబు+అన్నమయంబు+కావునన్= మనసు అన్నమమయం కాబట్టి; అన్నరూపి+ఐన= అన్నరూపం కలిగిన; పృథివిన్+ఎఱింగి= భూమిని తెలుసుకొని; పృథివిని= భూమిని; జలంబువలనన్+అణంచి= నీటిలో కలిపి; జలంబున్+తేజంబువలనన్= నీటిని తేజస్సుతో; ఇంకించి= లేకుండాచేసి; తేజంబున్= తేజస్సును; వాయువు వలనన్+చేర్చి= వాయువులో కలిపి; వాయువున్= వాయువును; ఆకాశంబునన్+కలిపి= ఆకాశంలో కలిపి; ఆకసంబున్= ఆకాశాన్ని; తామస+అహంకారంబున్+అందు= తమోగుణమైన అహంకారంలో; లయంబున్+చేసి= కలిపివేసి; అహంకారత్రయంబున్= అహంకారత్రయాన్ని; మహత్తత్త్వంబున్+అందున్+డిందించి= మహత్తత్త్వంలో విలీనంచేసి; పరతత్త్వంబునకున్= పరతత్త్వానికి; లోకంబులు= లోకాల్ని; సృజించెదన్+అను= సృష్టిస్తాను అనే; తలంపు+అయిన= భావం కలిగిన; మహత్తత్త్వంబును+అందున్= మహత్తత్త్వంలో; విషయ+ఆకారంబున్=

విషయాకారాన్ని; నివర్తించి= తొలగించి; విషయ వివర్జితుండు+ఐ= విషయాల్నివదలి; పరతత్త్వంబులన్+ఎఱుంగుచున్= పరమాత్మను తెలుసుకుంటూ; ఆ+ఎఱుకవలనన్= ఆజ్ఞానంచేత; సంసారహేతువు+అయిన= సంసారానికి కారణమైన; ప్రకృతిని= ప్రకృతిని; భస్మంబున్+చేసి= బూడిదచేసి; ఆ+ఎఱుకను= ఆ జ్ఞానాన్ని; నిర్వాణ సుఖపారవశ్యంబునన్= మోక్షానందపరవశత్వంతో; పరిహరించి= పోగొట్టి; సకలబంధవిముక్తుండు+ఐ= అన్ని బంధాలనుండి విమోచనుడై; హరిశ్చంద్రుండు= హరిశ్చంద్రుడు; అవాక్+మానస+గోచరంబు+అయిన= మాటకు, మనస్సుకు అందని; నిజరూపంబుతోన్= ఆత్మస్వరూపంతో; వెలుంగుచున్+ఉండెన్= ప్రకాశిస్తూ ఉన్నాడు; అతని కుమారునకున్= అతని కొడుకుకు; హరితుండు+పుట్టెన్= హరితుడు జన్మించాడు; హరితునకున్= హరితునికి; చంపనామధేయుండు= చంపుడనే పేరుకలవాడు; జనియించెన్= పుట్టాడు; అతండున్= వాడు; తనపేరన్= తనపేరుమీద; చంపానగరంబున్+నిర్మించెన్= చంపానగరాన్ని నిర్మించాడు; ఆ చంపునికిన్= ఆ చంపునికి; సుదేవుండు= సుదేవుడు; సుదేవునికిన్= సుదేవునికి; విజయుండు= విజయుడు; విజయునకున్= విజయునికి; రురుకుండు= రురుకుడు; రురుకునకున్= రురుకునికి; వృకుండు= వృకుడు; వృకునకున్= వృకునికి; బాహుకుండు+జనియించిరి= బాహుకుడు పుట్టాడు; అందున్ బాహుకుండు= వారిలో బాహుకుడు...

**తా :** ఆ శునశ్శేఫుని గొప్పతనం తర్వాత చెప్తాను. భార్యతోకూడిన హరిశ్చంద్రుడు పాటించిన సత్యనిష్ఠకు మెచ్చిన విశ్వామిత్రుడు అతనికి తత్త్వజ్ఞానాన్ని బోధించాడు. అపుడాతడు మనసు అన్నమయం కాబట్టి అన్నరూపియైన భూమిని తెలుసుకొని దాన్ని జలంలో కలిపాడు. జలాన్ని తేజస్సులో లీనం చేశాడు. తేజస్సును వాయువులో కలిపాడు. వాయువును ఆకాశంలో కలిపాడు. ఆకాశాన్ని తామసాహంకారంలో కలిసేలా చేశాడు. అహంకారత్రయాన్ని మహత్తత్త్వంలో వీలీనమయ్యేలా చేశాడు. లోకసృష్టికి సంకల్పరూపమైన మహత్తత్త్వంలో విషయాహంకారాన్ని తొలగించాడు. అది పోగానే పరమాత్మను తెలుసుకున్నాడు. ఆ జ్ఞానంవల్ల సంసారకారణమైన ప్రకృతిని భస్మం చేసి, అజ్ఞానాన్ని మోక్షసుఖ పారవశ్యంతో తొలగించి, అన్ని బంధాలనుండి విముక్తుడైన ఆ హరిశ్చంద్రుడు అవాఙ్మానస గోచరంబైన ఆత్మస్వరూపంతో కలిసి ప్రకాశించాడు. అతని కొడుకు రోహితునికి హరితుడు, అతనికి చంపుడు పుట్టారు. చంపుడు తన పేరుమీద చంపానగరాన్ని నిర్మించాడు. అతడికి సుదేవుడు, అతనికి విజయుడు, అతనికి రుచికుడు, అతనికి వృకుడు, అతనికి బాహుకుడు పుట్టారు. వారిలో బాహుకుడు

## ✤ సగర చక్రవర్తి కథాప్రారంభము ✤

**సీ.** **దండించి పగవారు దన భూమిఁ జేకొన్న నంగనలును దాను నడవి కేఁగి**
**యడవిలో ముసలియై యాతఁడు సచ్చిన నాతని భార్య దా ననుగమింపఁ**
**గదియుచో నా స్త్రీకి గర్భంబు గలుగుట యౌర్వమునీశ్వరుఁ డాత్మ నెఱిఁగి**
**వారించె; నంత న వ్వనజాక్షి సవతులు సూలు నిండారినఁ జూడఁ జాల**

**తే.** **కర్థి నన్నంబు గుడుచుచో నందుఁ గలిపి విషము వెట్టిరి; పెట్టిన విరిసి పడక**
**గరముతోఁగూడ సగరుండు ఘనుఁడు పుట్టి, వరయశస్స్ఫూర్తితోఁ జక్రవర్తి యయ్యె. 202**

**ప్రతి :** పగవారున్= శత్రువులు; దండించి= శిక్షించి; తనభూమిన్+చేకొన్నన్= తనరాజ్యాన్ని తీసుకోగా; అంగనలును+తానున్= తన స్త్రీలూ, తానూ; అడవికిన్+ఏఁగి= అరణ్యానికి వెళ్ళి; అడవిలోన్= అరణ్యంలో; ముసలి+ఐ= వృద్ధుడై; ఆతఁడు+చచ్చినన్=

ఆతడు మరణించగా; ఆతని భార్య= అతని పెండ్లాము; తాను+అనుగమింపన్= అతణ్ణి అనుసరించటానికి; కదియుచోన్= సమీపించగా; ఆ స్త్రీకిన్= ఆమెకు; గర్భంబున్+కలుగుట= గర్భము ధరించి ఉండటాన్ని; ఔర్వమునీశ్వరుఁడు= ఔర్వుడనే మహర్షి; ఆత్మన్+ఎఱిఁగి= మనసులో గ్రహించినవాడై; వారించెన్= ఆమెను అడ్డుకొన్నాడు; అంతన్= అప్పుడు; ఆ+వనజ+అక్షి= పద్మాల్లాంటి కన్నులుకలిగిన ఆ స్త్రీ; సవతులు= సపత్నులు; చూలు నిండు+ఆరినన్= నెలలు నిండటాన్ని; చూడన్+చాలక= చూడలేక; అర్థిన్= కోరికతో; అన్నంబున్= భోజనం; కుడుచుచోన్= తినుచుండగా; అందున్= ఆ అన్నంలో; విషమున్= విషాన్ని; కలిపి; పెట్టిరి= పెట్టారు; పెట్టినన్= పెట్టగా; విరిసిపడక= గర్భం విచ్ఛిన్నం కాకుండా; గరముతోన్+కూడన్= విషంతో పాటు; ఘనుఁడున్= గొప్పవాడైన; సగరుండున్= సగర చక్రవర్తి; పుట్టి= జన్మించి; వరయశస్+స్ఫూర్తితోన్= గొప్పదైన యశఃప్రకాశంతో; చక్రవర్తి+అయ్యెన్= చక్రవర్తి అయ్యాడు.

**తా :** బాహుకుడు తన శత్రువులు తననోడించి రాజ్యం ఆక్రమించగా తన స్త్రీలతో అడవికి వెళ్ళి వృద్ధాప్యం కారణంగా మరణించాడు. అతనిభార్య అతణ్ణి అనుసరించే ప్రయత్నంచేసింది. కాని ఆమె గర్భవతి అనే విషయం తెలుసుకొన్న ఔర్వముని ఆ ప్రయత్నానికి అడ్డుపడ్డాడు. కొంతకాలానికి ఆమెకు గర్భం నిండగా ఆమెసవతులు ఈర్ష్యతో ఆమె తినే అన్నంలో విషం కలిపి పెట్టారు. కాని దానిచే గర్భవిచ్ఛిన్నం కాకుండా ఆ విషంతోపాటు మహానుభావుడైన సగరుడు జన్మించి, గొప్ప యశఃప్రకాశంతో చక్రవర్తి అయ్యాడు.

**శా. చండస్ఫూర్తి నతండు తండ్రిపగకై సంగ్రామరంగంబులం**
**జెండెన్ హైహయబర్బరాదుల; వధించెం దాళజంఘాదులన్;**
**ముండీభూతులుగా నిరంబరులుగా మూర్తుల్ సబీభత్సులై**
**యుండంజేసె నిజారులన్ సగరనామోర్వీవిభుం డల్పుఁడే. 203**

**ప్రతి :** అతండు= ఆ సగరుడు; చండస్ఫూర్తిన్= తీక్ష్ణమైన పరాక్రమంతో; తండ్రిపగకై= తండ్రియొక్క పగకోసం; హైహయబర్బర+ఆదులన్= హైహయులు, బర్బరులు మొదలైనవారిని; సంగ్రామరంగంబులన్= యుద్ధరంగాల్లో; చెండెన్= చెండాడాడు; తాళజంఘ+ఆదులన్= తాళజంఘుడు మొదలైనవారిని; వధించెన్= చంపాడు; నిజ+అరులన్= తన శత్రువులను; ముండీభూతులు+కాన్= శిరోముండనం చేయించబడినవారుగా; నిరంబరులు+కాన్= వస్త్రాలు లేనివారుగా; మూర్తుల్= ఆకారాలు; సబీభత్సులు+ఐ+ఉండన్+చేసెన్= భయంకరంగా ఉండేటట్టు చేశాడు; సగరనామ+ఉర్వీవిభుండు= సగరుడనే పేరుగలరాజు; అల్పుఁడు+ఏ= సామాన్యుడా? (సామాన్యుడు కాడు).

**తా :** సగరుడు తండ్రిపగకోసం యుద్ధాలుచేసి హైహయ బర్బరాదులను చెండాడాడు. తాళజంఘాదుల్ని చంపాడు. తన శత్రువుల తలలు గొరిగించాడు. వస్త్రహీనులుగా భయంకర రూపాలతో ఉండేటట్లు చేశాడు. సగరుడనే పేరుగల ఆ రాజు సామాన్యుడా? (సామాన్యుడు కాడు).

**క. ఖగరాజరుచులు గల యిల, పగరాజుల నడఁచి యేలె బాహాశక్తిన్**
**నగరాజధీరు శూరున్, సగరున్ హతవిమతనగరుఁ జను వినుతింపన్. 204**

**ప్రతి :** ఖగరాజ= సూర్యచంద్రుల; రుచులు+కల= కాంతులు కలిగిన; ఇల= భూమిని; బాహాశక్తిన్= భుజబలంతో; పగరాజులన్+అడఁచి= శత్రురాజులను అణచి; ఏలెన్= పరిపాలించాడు; నగరాజధీరున్= మేరుపర్వతంలా ధైర్యవంతుణ్ణి;

శూరున్= పరాక్రమవంతుణ్ణి; హతవిమతనగరున్= శత్రునగరాలను మట్టుపెట్టినవాణ్ణి (అయిన); సగరున్= ఆ సగరుణ్ణి; వినుతింపన్, చనున్= పొగడదగును.

**తా :** సూర్యచంద్రుల కాంతులు ప్రసరించునంతటి భూమిని సగరుడు తన భుజబలంతో శత్రురాజులను అణచి పరిపాలించాడు. మేరుపర్వత ధీరుడని, పరాక్రమవంతుడని, శత్రునగరనాశకుడని ఆ సగరుణ్ణి ప్రశంసింపవచ్చు.

**సీ. ఔర్వుండు సెప్పంగ నమర వేదాత్మకు హరి నీశు నమృతు ననంతుఁగూర్చి;**
**వాజిమేధంబులు వసుధేశ్వరుఁడు సేసె నం దొక్క మఖమున హయము విడువ**
**నగభేది గొనిపోయి నాగలోకంబునఁ గపిలుని చేరువఁ గట్టి తొలఁగె;**
**నంత గుఱ్ఱము గాన కా రాజు దనపుత్త్రనివహంబు దిశలకు నెమకఁ బంప**

**తే. వారు నిల యేడుదీవుల వరుస వెదకి, మఖతురంగంబు లేకున్న మగుడి రాక**
**ప్రాభవంబున దోర్దండబలము మెఱసి, గ్రొచ్చి కోరాడి త్రవ్విరి కుతల మెల్ల. 205**

**ప్రతి :** వసుధా+ఈశ్వరుఁడు= భూ భర్తఅయిన సగరుడు; ఔర్వుండు+చెప్పన్+కన్= ఔర్వముని చెప్పడంవల్ల; అమరన్= చక్కగా; వేద+ఆత్మకున్= వేదస్వరూపుడైనవాణ్ణి; హరిన్= విష్ణువును; ఈశున్= సర్వానికీ ప్రభువైనవాణ్ణి; అమృతున్= శాశ్వతుని; అనంతున్= అంతం లేనివానివాడైనవాణ్ణి; కూర్చి= గురించి; వాజిమేధంబులున్= అశ్వమేధయాగాలను; చేసెన్= చేశాడు; అందున్= అందులో(వాటిలో); ఒక్కమఖమునన్= ఒక యజ్ఞంలో; హయమున్+విడువన్= గుర్రాన్ని వదలగా; నగభేది= పర్వతాన్ని భేదించినవాడైన ఇంద్రుడు; కొనిపోయి= తీసుకొనివెళ్ళి; నాగలోకంబునన్= పాతాళలోకంలో; కపిలుని చేరువన్= కపిలముని దగ్గరలో; కట్టితొలగెన్= కట్టివేసి వెళ్లాడు; అంతన్= అంతలో; ఆ రాజు= ఆ సగరుడు; గుఱ్ఱము+కానక= గుర్రము కనబడక; తనపుత్రనివహంబున్= తనకుమారులసమూహాన్ని; దిశలకున్= దిక్కులకు; నెమకన్= వెదకటానికి; పంపన్= పంపగా; వారు= ఆ పుత్రులు; ఇలన్= భూమిపైనున్న; ఏడుదీవులన్= సప్తద్వీపాలను; వరుసన్ వెదకి= క్రమంగా వెదకి; మఖతురంగంబు= యజ్ఞాశ్వం; లేకున్నన్= లేకపోవటంచేత; మగుడిరాక= తిరిగిరాకుండా; ప్రాభవంబునన్= వైభవంచేత; దోర్దండబలము మెఱసి= భుజబలం తేటపడగా; కుతలము+ఎల్లన్= భూమినంతటిని; గ్రొచ్చికోరాడి= పొడిచి పొడిచి; త్రవ్విరి= త్రవ్వారు.

**తా :** ఔర్వముని చెప్పడంవల్ల వేదాత్మకుడు, అమృతుడు, అనంతుడు ఈశుడు అయిన హరినిగూర్చి ఆ సగరుడు అశ్వమేధాలను చేశాడు. ఒక యజ్ఞంలో అశ్వాన్ని వదలగా ఇంద్రుడు దాన్ని తీసుకొనిపోయి నాగలోకంలో కపిలమునికి సమీపంలో కట్టివెళ్ళాడు. అక్కడ గుర్రం కనబడక రాజు తనకుమారులను అన్ని దిక్కులకు వెతకడానికి పంపాడు. వారు భూమిమీది సప్తద్వీపాల్లో వెదకి అశ్వం కనపడకపోవడంతో అంతటితో తిరిగిరాక ప్రాభవంతో భుజబలంతో భూమినంతటిని పొడిచి పొడిచి త్రవ్వారు.

**వ. ఇట్లు సుమతికొడుకులు నేలం ద్రవ్వి పాతాళంబునం దూర్పు ముట్టియున్న యుత్తరభాగంబునం గపిలముని పొంతనున్న తురంగంబుఁ గని. 206**

**ప్రతి :** ఇట్లు= ఇలా; సుమతికొడుకులు= సుమతి పుత్రులు; నేలన్+త్రవ్వి= భూమిని తవ్వి; పాతాళంబునన్= పాతాళలోకంలో; తూర్పుముట్టి+ఉన్న= తూర్పును ఆనుకొని ఉన్న; ఉత్తరభాగంబునన్= ఈశాన్యమూలలో; కపిలముని పొంతన్+ఉన్న= కపిలమహర్షి చెంత ఉన్న; తురంగంబున్+కని= గుర్రాన్నిచూచి...

**తా :** ఈ విధంగా సుమతికొడుకులు నేలను త్రవ్వి, పాతాళలోకంలో ఈశాన్యదిక్కున కపిలమహర్షికి సమీపంలో ఉన్న గుర్రాన్నిచూచి

**విశే :** సగరుని భార్యల్లో సుమతి ఒకతె.

**చ. 'ఎఱిఁగితి మద్దిరయ్య తడ వేటికి? గుఱ్ఱపు దొంగ వీఁడె; యీ**
**జఱభునిఁ బట్టి చంపు; డతిసాధుమునీంద్రుఁడువోలె నేత్రము**
**ల్దెఱవక బాకినోరు మెదలింపక బైసుకపట్టె' నంచు న**
**య్యఱువది వేవురున్ నిజకరాయుధముల్ జళిపించి డాయుచోన్. 207**

**ప్రతి :** అద్దిర+అయ్య= అయ్యారే; ఎఱిఁగితిమి= తెలుసుకొన్నాం; తడవు+ఏటికిన్= ఆలస్యం ఎందుకు? వీఁడె= ఈతడే; గుఱ్ఱము+దొంగ= గుర్రాన్ని దొంగిలించినవాడు; ఈ జఱభునిన్= ఈ పాపిని; పట్టిచంపుడు= పట్టుకొని చంపండి; అతిసాధు= అత్యంతసాధువైన; ముని+ఇంద్రుఁడువోలెన్= మునీశ్వరునివలె; నేత్రముల్+తెఱవక= కళ్లు తెరవక; పాకినోరున్= మురికినోరును; మెదలింపక= కదలించక; బైసుకపట్టెన్+అంచున్= ప్రతిజ్ఞ పట్టాడు అంటూ; ఆ+అఱువది వేవురున్= ఆ అరవై వేలమంది; నిజకర+ఆయుధముల్= తమ చేతుల్లోని ఆయుధాలను; జళిపించి= ఎగురవేస్తూ; డాయుచోన్= సమీపిస్తుండగా...

**తా :** "అయ్యారే! తెలుసుకున్నాం, ఆలస్యం దేనికి? వీడే గుర్రాన్ని దొంగిలించాడు. ఈ పాపిని పట్టి చంపండి. పెద్దసాధువైన మునివలె కళ్లుతెరవకుండా, మురికినోరు కదలించకుండా పంతంపట్టాడు" అంటూ ఆ అరవైవేలమంది తమ ఆయుధాలను ఝళిపిస్తూ దగ్గరకు వస్తుండగా

**చ. కపిలుఁడు నేత్రముల్ దెఱవఁగా దమ మేనుల మంట పుట్టి తా**
**రపగతధైర్యులై పడి యహంకరణంబున మూఢచిత్తులై**
**నృపసుతు లందఱున్ ధరణి నీఱయి రా క్షణమంద; సాధులం**
**దపసులఁ గాసిఁ బెట్టెడి మదస్ఫురితాత్ములు నిల్వనేర్తురే? 208**

**ప్రతి :** కపిలుఁడు= కపిలమహర్షి; నేత్రముల్+తెఱవన్+కన్= కళ్లు తెరవగా; తమ మేనులన్= తమ శరీరాల్లో; మంటపుట్టి= అగ్నిపుట్టి; తారు+అపగతధైర్యులు+ఐ= తాము ధైర్యాలను కోల్పోయినవాళ్లయి; అహంకరణంబునన్= అహంకారంతో; మూఢచిత్తులు+ఐ= తెలివి కోల్పోయినవారై; నృపసుతులు+అందఱున్= రాజకుమారులందరూ; ఆ క్షణము+అందున్+అ= ఆ క్షణంలోనే; ధరణిన్+నీఱు+అయిరి= భూమిపై బూడిదఅయినారు; సాధులన్= సజ్జనులను; తపసులన్= మునులను; గాసిన్+పెట్టెడి= కష్టపెట్టే; మదస్ఫురిత+ఆత్ములు= గర్వమనస్కులు; నిల్వన్+నేర్తురే= బ్రతుక గలరా? (బతుకలేరు).

**తా :** కపిలమహర్షి కళ్లుతెరవగా సగరపుత్రులు తమ శరీరాల్లో అగ్ని పుట్టి, ధైర్యాల్ని కోల్పోయారు. అహంకరించి మూఢులై రాజకుమారులందరూ ఆ నిముషంలోనే బూడిదయ్యారు. సాధువుల్ని, మునులను కష్టపెట్టే గర్విష్ఠులు జీవించగలరా?

**సీ. కొందఱు కపిలుని కోపానలంబున బ్రమందిరి సగరకుమారు లనుచు**
**నందు రాముని శాంతుఁ డానందమయమూర్తి తొడరి కోపించునే? దుష్వనేలఁ**

**గాక జన్మించునే గగనస్థలంబున? నే సాంఖ్యమతమున నిద్ధమతులు**
**భవసముద్రము మృత్యుభయమును లంఘింతు రా బుద్ధిఁజేయు పరాత్మభూతుఁ**

**తే. దఖిలబోధకుఁ డతనికి నరసి చూడ, సఖు లమిత్రులు నెవ్వరు? సగరసుతులు**
**దాము దమచేయునేరమి దనువులందు, ననలకీలలు పుట్టి నీఱైరి గాక. 209**

**ప్రతి :** కొందఱు= కొంతమంది; కపిలుని= కపిలునియొక్క; కోప+అనలంబునన్= కోపాగ్నిచేత; సగరకుమారులు= సగరుని పుత్రులు; మ్రందిరి= చచ్చారు; అనుచున్= అంటూ; ఆ ముని= ఆ మహర్షి; శాంతుఁడు= నెమ్మదస్తుడు; ఆనందమయమూర్తి= ఆనందంతో నిండిన స్వరూపుడు; తొడరి= ప్రయత్నించి; కోపించునే= కోపిస్తాడా? నేలన్+కాక= నేలమీదగాక; గగనస్థలంబునన్= ఆకాశంలో; దువ్వ= దుమ్ము; జన్మించునే= కలుగుతుందా?; సగరసుతులు= సగరుని కొడుకులు; తామున్= తాము; తమ చేయునేరమి= తాము చేసిన తప్పువల్ల; తనువుల+అందున్= శరీరాల్లో; అనలకీలలు+ పుట్టి= అగ్నిజ్వాలలు పుట్టి; నీఱు+ఐరి+కాక= బూడిద అయ్యారు కాని; ఏ సాంఖ్యమతమునన్= ఏ సాంఖ్యశాస్త్రప్రకారం; ఇద్ధమతులు= ప్రసిద్ధజ్ఞానులు; భవసముద్రమున్= సంసారం అనే సాగరాన్ని; మృత్యుభయమున్= చావువలని భయాన్ని; లంఘింతురు (లంఘించుదురు)= జయిస్తారో; ఆ బుద్ధిన్+చేయు= ఆ జ్ఞానాన్ని ఇచ్చే; పర+ఆత్మభూతుఁడున్= బ్రహ్మస్వరూపుడు; అఖిల బోధకుఁడున్= సమస్తాన్ని గూర్చి చెప్పేవాడు అయిన; అతనికిన్= ఆ కపిల మునికి; అరసి చూడన్= ఆలోచించి చూస్తే; సఖులున్= మిత్రులు; అమిత్రులున్= శత్రువులు; ఎవ్వరు?= ఎవరుంటారు. (ఎవరూ ఉండరని భావం).

**తా :** కొంతమంది కపిల మహర్షి కోపాగ్నిచేత సగరుని కొడుకులు చచ్చారంటారు. కాని ఆ మహర్షి పరమశాంతుడు. ఆనందమయమూర్తి. ఆయన కోపిస్తాడా? ధూళి భూమిమీద పుడుతుంది గాని ఆకాశంలో కాదుగదా! సగరునికొడుకులు తాము చేసుకొన్న దోషంచేత శరీరాల్లో అగ్నిపుట్టి నాశనమయ్యారు కాని, ఏ సాంఖ్యశాస్త్రంచేత జ్ఞానులు సంసారసాగరాన్ని, మృత్యుభయాన్ని పోగొట్టుకొంటారో, ఆ శాస్త్రాన్ని రూపకల్పన చేసిన భగవన్మూర్తి, సమస్తబోధకుడు ఆయిన, ఆయనకు మిత్రులని, శత్రువులని ఎవ్వరుంటారు? (ఎవ్వరూ ఉండరు).

**వ. మఱియు, సగరుండు గేశినియందుఁ గన్న పుత్త్రుం డసమంజసుం డనువాఁడు, సమంజసగుణంబులు లేక పూర్వజన్మంబున యోగీశ్వరుండై యుండి, సంగదోషంబు వలన యోగభ్రష్టుండయి, సగరునకు జన్మించి, జాతిస్మరజ్ఞానంబు గలిగి లోకంబువారలకుఁ దమవారలకు నప్రియంబగు వర్తనంబునం దిరుగుచు, నొక్కనాఁడు. 210**

**ప్రతి :** మఱియున్= అంతేగాక; సగరుండు= సగరుడు; కేశిని+అందున్= కేశిని అనే భార్యయందు; కన్నపుత్రుండు= కనిన కొడుకు; అసమంజసుండు+అనువాడు= అసమంజసుడు అనేవాడు; సమంజస గుణంబులు+లేక= సముచితగుణాలులేక; పూర్వజన్మంబునన్= పూర్వజన్మలో; యోగి+ఈశ్వరుండు+అయి+ఉండి= యోగీశ్వరుడై ఉండి; సంగదోషంబువలనన్= సహవాసదోషంచేత; యోగభ్రష్టుండు+అయి= యోగభ్రష్టుడై; సగరునకున్+జన్మించి= సగరునికి పుట్టి; జాతిస్మరజ్ఞానంబున్+కలిగి= పూర్వజన్మస్మరణ తెలివి కలిగి; లోకంబువారలకున్= లోకులకూ; తమవారలకున్= స్వజనులకూ; అప్రియంబు+అగు= ఇష్టంలేని; వర్తనంబునన్= ప్రవర్తనతో; తిరుగుచున్= తిరుగుతూ; ఒక్కనాడు= ఒక్కరోజున...

**తా :** సగరునికి కేశినియందు అసమంజసుడనే కొడుకు కలిగాడు. సమంజసమైన గుణాలులేక పూర్వజన్మలో మునిశ్రేష్ఠుడై ఉండికూడ సహవాసదోషంచేత పతితుడై సగరునికి పుట్టాడు. కాని పూర్వజన్మ స్మరణచేత వాడు ప్రజలకు, తనవారికి కూడా కష్టం కలిగించే పనులు చేస్తూ తిరుగుతూ ఒక్కరోజున

**చ. వరుస నయోధ్యలోనఁ గల వాడల నాడెడు పిన్నవాండ్ర నా**
**సరయువులోన వైచి జనసంఘముఁ దండ్రియుఁ దిట్టుచుండ వాఁ**
**డురుమతిఁ గొన్నిప్రొద్దులకు యోగబలంబునఁజేసి బాలురం**
**దిరిగి పురంబులోపలికిఁ దెచ్చిన నివ్వెఱగంది రందఱున్. 211**

**ప్రతి :** వాడు= అసమంజసుడు; వరుసన్= క్రమంగా; అయోధ్యలోనన్+కల= అయోధ్యానగరంలో ఉన్న; పిన్నవాండ్రన్= చిన్న పిల్లలను; ఆ సరయువులోనన్+వైచి= ఆ సరయూనదిలో పడవేసి; జనసంఘమున్= ప్రజల సమూహం; తండ్రియున్= తండ్రియైన సగరుడును; తిట్టుచున్+ఉండన్= దూషిస్తుండగా; ఉరుమతిన్= గొప్పజ్ఞానంతో; కొన్ని ప్రొద్దులకున్= కొన్ని రోజుల తర్వాత; యోగబలంబునన్+చేసి= తన యోగశక్తిబలంతో; బాలురన్= ఆ పిల్లలను; తిరిగి= మరల; పురంబు లోపలికిన్+తెచ్చినన్= నగరంలోకి తీసుకరాగా; అందఱున్= ప్రజలందరూ; నిండు+వెఱగు+అందిరి= మిక్కిలి ఆశ్చర్యపోయారు.

**తా :** ఆ అసమంజసుడు క్రమంగా అయోధ్యానగర వీథుల్లో ఆడుకునే చిన్నపిల్లలను సరయూనదిలో పడవేశాడు. నగర ప్రజలు, తండ్రి అయిన సగరుడు అతనిని దూషించారు. వాడు తరువాత గొప్పజ్ఞానం కలిగి తనయోగశక్తితో ఆ పిల్లలను కొద్దిరొజుల తర్వాత నగరానికి తెచ్చాడు. అది చూచి అందరూ ఆశ్చర్యపోయారు.

**వ. ఆ య్యసమంజసునికొడుకు అంశుమంతుం డనువాఁడు వినీతుండై, తనయొద్దఁ బనులు సేయుచుండు నంత సగరుం దమ్మనుమని నంశుమంతు నశ్వంబు వెదకి తెమ్మని పంచిన నతండు దమతండ్రులచొప్పునం జని, వారలు ద్రవ్విన మహాఖాతంబు సొచ్చి, యందు భస్మరాసులపొంత నున్న హయంబునుం గని, హయసమీపంబునం దున్న కపిలాఖ్యుండైన విష్ణునికి దండప్రణామంబు సేసి, యిట్లని స్తుతియించె. 212**

**ప్రతి :** ఆ+అసమంజసుని= ఆ అసమంజసునియొక్క; కొడుకు= కుమారుడైన; అంశుమంతుండు+అనువాడు= అంశుమంతుడనేవాడు; వినీతుండు+ఐ= నీతిమంతుడై; తన+ఒద్దన్= సగరుని దగ్గర; పనులు+చేయుచున్+ఉండున్= పనులు చేస్తుంటాడు; అంతన్= అపుడు; సగరుండు= సగరచక్రవర్తి; ఆ+మనుమని= ఆ మనుమడైన; అంశుమంతున్= అంశుమంతుణ్ణి; అశ్వంబున్= గుర్రాన్ని; వెదకి తెమ్ము+అని= వెదకి తీసుకరమ్మని; పంచినన్= పంపగా; అతండు= అంశుమంతుడు; తమతండ్రుల= తన తండ్రులు; చొప్పునన్+చని= వెళ్ళిన మార్గంలో వెళ్ళి; వారలు+త్రవ్విన= ఆ తండ్రులు తవ్విన; మహాఖాతంబున్+చొచ్చి= పెద్ద గొయ్యిలో; అందున్= అక్కడ; భస్మరాసుల= బూడిద కుప్పల; పొంతన్+ఉన్న= పక్కనే ఉన్న; హయంబున్+కని= గుర్రాన్ని చూచి; హయసమీపంబు+అందున్+ఉన్న= ఆ గుర్రానికి దగ్గరలో ఉన్న; కపిల+ఆఖ్యుండు+ఐన= కపిలుడనే పేరుగల; విష్ణునికిన్= శ్రీహరికి; దండప్రణామంబున్+చేసి= నమస్కరించి; ఇట్లు+అని= ఈ విధంగా; స్తుతియించెన్= ప్రార్థించాడు.

**తా :** ఆ అసమంజసునికొడుకు అంశుమంతుడనేవాడు నీతిమంతుడై తాత దగ్గర పనులు నిర్వర్తించేవాడు. అప్పుడు సగరుడు మనుమనితో యాగాశ్వాన్ని వెదికి తీసుకరమ్మని పంపాడు. వాడు తన తండ్రులు వెళ్ళిన మార్గంలోనే వెళ్ళి, వారు

తవ్విన పెద్దగొయ్యిలో ప్రవేశించి, అక్కడ బూడిదకుప్పల పక్కన ఉన్న గుర్రాన్నిచూచి, దాని పక్కన ఉన్న కపిలుడనే పేరుగల శ్రీహరికి నమస్కరించి ఇట్లా స్తోత్రం చేశాడు.

**సీ. మతి సిక్కఁబట్టి సమాధిగౌరవమున వ్రాలియుఁ దనకు నవ్వల వెలుంగు**
**నినుఁ గానఁ డొకనాఁడు ని న్నెఱుంగునె? బ్రహ్మ యజునిమనంబున నవయవముల**
**బుద్ధి జన్మించిన భూరిజంతువులందు హీనులమైన మా కెఱుఁగ వశమె?**
**తమలోన నీ వుండఁ దా మెఱుంగరు నిన్ను గుణములు చూతురు గుణములైనఁ**

**తే. గాన రొకవేళ జీఁకటిఁ గందు రాత్మ, లందుఁ దెలియరు వెలుపల నమరు పొందు**
**లరయుదురు దేహధారు లత్యంధు లగుచుఁ, గడిఁది నీ మాయ నెన్నఁడు గడవలేక. 213**

**ప్రతి :** మతి+చిక్కన్+పట్టి= బుద్ధిని అదుపులో ఉంచుకొని; సమాధిగౌరవమునన్= సమాధి స్థితిలో; వ్రాలియున్= ప్రవేశించి కూడా; తనకున్+ఆ+వలన్= తనకు వేరుగా (తాననుకొనే శరీరానికి వేరుగా); వెలుంగు= ప్రకాశిస్తున్న; నినున్+కానఁడు= నిన్ను చూడలేదు; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; ఒకనాఁడు నిన్ను+ఎఱుంగునె= ఏ రోజుకైనా తెలుసుకోగలడా; అజుని= బ్రహ్మయొక్క; మనంబునన్= మనస్సునందు; అవయవములన్= శరీరావయావాల్లో; బుద్ధిన్= బుద్ధియందు; జన్మించిన= పుట్టిన; భూరిజంతువుల+అందున్= పెద్ద జీవుల్లోకూడ; హీనులము+ఐన= చిన్నవారమైన; మాకున్+ఎఱుఁగన్+వశమే= మాకు తెలుసుకోవడం సాధ్యమా? తమలోనన్= తమలోన (వారిలోన); నీవు+ఉండన్= నీవుండగా; నిన్నున్= నిన్ను; తాము+ఎఱుంగరు= తాము (వారు) తెలుసుకోలేరు; గుణములున్+చూతురు(చూచుదురు)= భౌతికమైన గుణాలను చూస్తారు; ఒకవేళన్= ఒక్కొక్కప్పుడు; గుణములు+ఐనన్+కానరు= ఆ గుణాలను కూడ చూడలేరు; చీఁకటిన్+కందురు= చీకటిని చూస్తారు; దేహధారులు= శరీరాలను ధరించేవారు; అతి+అంధులు+అగుచున్= మిక్కిలి గుడ్డివారై; కడిఁది= అతిశయమైన; నీ మాయన్+ఎన్నడున్= నీ మాయను ఎప్పటికి; కడవలేక= దాటలేక; ఆత్మల+అందున్+తెలియరు= ఆత్మలో ఉండే నిన్ను తెలుసుకోలేరు, (ఆత్మజ్ఞానాన్ని) పొందలేరు; వెలుపలన్+అమరు= కేవలం బాహ్యంలో ఉండే; పొందులు+అరయుదురు= సంబంధాలను తెలుసుకుంటారు.

**తా :** బుద్ధిని స్వాధీన పరచుకొని సమాధిస్థితిలో ఉండి కూడా తాననుకొనే శరీరానికి వేరుగా ప్రకాశించే నిన్ను బ్రహ్మకూడా చూడలేడు. ఏ నాటికైనా తెలుసుకోలేడు. ఆ బ్రహ్మయొక్క మనస్సు, అవయవాలు, బుద్ధిలో పుట్టే పెద్దజీవుల్లో కూడ అల్పులమైన మాకు తెలుసుకోవడం సాధ్యమా? తమలోనే నీవుండగా నిన్ను తెలుసుకోలేరు. బాహ్యమైన గుణాలనుమాత్రమే చూస్తారు. ఒక్కొక్కప్పుడు వాటిని కూడ చూడలేక తమస్సు పాలవుతారు. శరీరధారులు గుడ్డివారై నీ మాయకు లోబడి ఆత్మజ్ఞానాన్ని పొందలేరు. బాహ్యమైన సంబంధాలకు విలువనిస్తారు.

**వ. అని వినుతి సేయుచు, హయంబు విడువుమని చెప్పక తన తండ్రులు నీఱ గుటం దడవక, మ్రొక్కి నిలుచున్న యంశుమంతునికిఁ గరుణావిపులుండగు గపిలుం డిట్లనియె. 214**

**ప్రతి :** అని= అని; వినుతి+చేయుచు= పొగడుతూ; హయంబు= గుఱ్ఱాన్ని; విడువుము+అని= విడిచిపెట్టమని; చెప్పక= చెప్పకుండా; తనతండ్రులు= తన తండ్రితాతలు; నీఱు+అగుటన్+తడవక= భస్మంకావటాన్ని ప్రస్తావించక; మ్రొక్కి నిలుచున్న=

నమస్కరించి నిలబడ్డ; అంశుమంతునికిన్= అంశుమంతునికి; కరుణావిపులుండు+అగు= దయాధికుడైన; కపిలుండు+ఇట్లు+అనియెన్= కపిలుడిట్లన్నాడు.

**తా :** అని విన్నపం చేస్తూ, గుర్రాన్ని విడిచిపెట్టమని అడగక, తండ్రులు నాశనమైన విషయాన్ని ప్రస్తావించక, నమస్కరించి నిలబడ్డ అంశుమంతునితో అపారమైన కరుణతో కపిలముని ఇట్లా అన్నాడు.

**క. 'గుఱ్ఱము గొనిపో బుద్ధుల, కుఱ్ఱఁడ!, మీ తాతయొద్దకున్ నీ తండ్రుల్**
**వెఱ్ఱులు నీఱై రదె! యీ, మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభ మగున్.' 215**

**ప్రతి :** బుద్ధుల కుఱ్ఱఁడు+అ= సద్బుద్ధులు కలిగిన బాలుడా; మీ తాత+ఒద్దకున్= మీ తాత దగ్గరికి; గుఱ్ఱమున్+కొనిపో= గుర్రాన్ని తీసుకపో; నీ తండ్రుల్ వెఱ్ఱులు= నీ తండ్రులు అవివేకులు; అదె నీఱు+ఐరి= అదె బూడిద అయ్యారు; ఈ మిఱ్ఱునన్= ఈ మిట్టమీద; గంగాజలంబు= పవిత్రమైన గంగనీరు; మెలఁగన్= ప్రవహించినట్లయితే; శుభము+అగున్= మంచి కలుగుతుంది.

**తా :** బుద్ధిమంతుడైన బాలకా! ఈ గుర్రాన్ని మీ తాత దగ్గరకు తీసుకపో. అవివేకులైన మీ తండ్రులు బూడిద అయినారు. ఈ బూడిదకుప్పమీద గంగ ప్రవహిస్తే వారికి మేలు జరుగుతుంది.

**విశే :** గంగాజలాన్ని గూర్చి అంశుమంతుడు ప్రస్తావించలేదు. కపిలభగవానుడే సెలవిచ్చాడు. అసలు ఈ కథ పరమార్థమే అది. ఇంద్రుడు యాగాశ్వాన్ని దొంగలించడం, కపిలమహర్షి దగ్గర కట్టివేయడం ఎందుకు? ఇది కూడా ఆ పరమార్థమే. దేవనది భూలోకానికి రావడం ఆ పరమార్థమే.

**వ. అని పలికిన, నమస్కరించి, తురగంబుఁ గొనివచ్చి యా సగరున కిచ్చిన సగరుం డా పశువువలన జన్నంబుకడమ నిండించి, యంశుమంతునకు రాజ్యం బిచ్చి, ముక్తబంధనుండై, యౌర్వుండు సెప్పిన మార్గంబున నుత్తమగతికిం జనియె నంత. 216**

**ప్రతి :** అని పలికినన్= అని చెప్పగా; నమస్కరించి= నమస్కారంచేసి; తురగంబున్+కొనివచ్చి= గుఱ్ఱాన్ని తీసుకవచ్చి; ఆ సగరునకున్+ఇచ్చినన్= ఆ సగరునికివ్వగా; సగరుండు+ఆ పశువువలనన్= సగరుడు ఆ గుఱ్ఱంతో; జన్నంబు= యజ్ఞంయొక్క; కడమ నిండించి= మిగులును పూర్తిచేసి; అంశుమంతునకున్= అంశుమంతునికి; రాజ్యంబు+ఇచ్చి= రాజ్యమిచ్చి; ముక్తబంధనుండు+ఐ= బంధాలు వదలినవాడై; ఔర్వుండు= ఔర్వుడు; చెప్పిన= నిర్దేశించిన; మార్గంబునన్= పద్ధతిలో; ఉత్తమగతికిన్= పరమపదానికి; చనియెన్= వెళ్ళాడు; అంతన్= అప్పుడు...

**తా :** అని ఆ ముని చెప్పగా ఆయనకు నమస్కరించి అంశుమంతుడు గుర్రాన్ని తెచ్చి సగరునికిచ్చాడు. అతడు ఆ గుర్రంతో యాగాన్ని పూర్తిచేసి, మనుమనికి రాజ్యమిచ్చి బంధాలనుండి విముక్తుడై ఔర్వుడు చెప్పిన దారిలో మోక్షానికి వెళ్ళాడు.

**క. జనకులు క్రుగ్గినచోటికి, ననిమిషనదిఁ దెత్తు ననుచు నటవీస్థలికిన్**
**జని తపము సేయఁజాలక, మనమున వగ లొలయ నంశుమంతుఁడు దీఱెన్. 217**

**ప్రతి :** జనకులు= తండ్రులు; క్రుగ్గిన చోటికిన్= కాలిపోయి బూడిదైన ప్రదేశానికి; అనిమిషనదిన్= దేవనదిని; తెత్తున్+అనుచున్= తెస్తానంటూ; అటవీస్థలికిన్+చని= అరణ్యానికి వెళ్ళి; తపము+చేయన్+చాలక= తపస్సు చేయలేక; మనమునన్= మనస్సులో; వగలు+ఒలయన్= దుఃఖం కలుగగా; అంశుమంతుఁడు+తీఱెన్= అంశుమంతుడు మరణించాడు.

**తా :** తండ్రులు బూడిద అయిన ప్రదేశానికి దేవనదిని తెస్తానని అరణ్యానికి వెళ్ళి తపస్సు చేయలేక, మనోదుఃఖంతో అంశుమంతుడు మరణించాడు.

**క. ఆతనికొడుకు దిలీపుఁడు, భూతలమున గంగఁ దెచ్చి పొందించుటకై**
**ప్రీతిం దపంబు సేయుచు, భాతిగఁ దేలేక కాలపరవశుఁ డయ్యెన్. 218**

**ప్రతి :** ఆతనికొడుకు దిలీపుఁడు= అంశుమంతుని కుమారుడు దిలీపుడు; భూతలమునన్= భూమిపైకి; గంగన్+తెచ్చి= గంగానదిని తెచ్చి; పొందించుటకున్+ఐ= కలుపుటకై; ప్రీతిన్+తపంబున్+చేయుచున్= ఇష్టంతో తపస్సుచేస్తూ; భాతిగన్= చక్కగా; తేలేక= తీసుకరాలేక; కాలపరవశుఁడు+అయ్యెన్= కాలధర్మం చెందాడు;

**తా :** అతనికొడుకు దిలీపుడు భూమి మీదికి గంగను తేవడానికి తపస్సు చేశాడు కాని తేలేక గతించాడు.

**క. అతనిసుతుండు భగీరథుఁ, డతితప మొనరించి కనియె నమృతాపాంగన్**
**సుతరంగన్ ముఖవనరుహ, రతభృంగన్ శివజటాగ్రరంగన్ గంగన్. 219**

**ప్రతి :** అతనిసుతుండు= దిలీపునికొడుకైన; భగీరథుఁడు= భగీరథుడు; అతితపము+ఒనరించి= గొప్పతపస్సుచేసి; అమృత+అపాంగన్= అమృతమయమైన కడగంటి చూపులు కలదాన్ని; సుతరంగన్= మంచి అలలు కలది; ముఖవనరుహ= ముఖమనే పద్మంపై; రతభృంగన్= కోరిక కలిగిన తుమ్మెదలు కలది; శివజటా+అగ్ర= పరమేశ్వరునిజటపైభాగం; రంగన్= వేదికగా కలది అయిన; గంగన్= గంగానదిని; కనియెన్= చూశాడు.

**తా :** దిలీపునిపుత్రుడైన భగీరథుడు గొప్పతపస్సుచేసి, అమృతమయకటాక్షాలు కలది, గొప్పఅలలతో కూడింది, ముఖపద్మంపై ఆసక్తిగల తుమ్మెదలు కలది. శివజటాజూటం రంగస్థలంగా కలది అయిన గంగను దర్శించాడు.

**వ. కని నమస్కరించిన గంగ కృపసేసి, వరంబు వేఁడు మనిన, నా రాచపట్టి యిట్లనియె. 220**

**ప్రతి :** కని= చూచి; నమస్కరించినన్= నమస్కరించగా; గంగ; కృప+చేసి= కరుణించి; వరంబు; వేఁడుము+అనినన్= వేడుకోమనగా; ఆ రాచపట్టి= ఆ రాజుకొడుకైన భగీరథుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** గంగను చూచి భగీరథుడు నమస్కరించగా గంగ దయతో వరం కోరుకొమ్మనింది. అందుకు ఆ రాజకుమారుడు ఇట్లన్నాడు.

**క. మా వారిభస్మరాసుల, నీ వారిం గలిపికొనుము; నెఱి మావారల్**
**నీ వారిఁ గలయ నాకము, మావారికి గలుగు; నిది ప్రమాణము తల్లీ! 221**

**ప్రతి :** తల్లీ= అమ్మా!; మా వారి= మా వారియొక్క (పూర్వీకుల); భస్మరాసులన్= బూడిదరాసులను; నెఱిన్= నిండుగా; నీ వారిన్= నీ నీటిలో; కలిపికొనుము= కలిపివేసుకో; మావారలు= మావాళ్ళు; నీ వారిన్+కలయన్= నీ నీటిలో కలిసినందువల్ల; మా వారికిన్= మావాళ్లకు; నాకము= స్వర్గము; కలుగున్= కలుగుతుంది; ఇది ప్రమాణము= ఇది సత్యం.

**తా :** తల్లీ! మా వారిబూడిద రాసులను నీ నీటిలో కలుపుకో. నీ నీటి స్పర్శచేత మావాళ్లకు స్వర్గం సిద్ధిస్తుంది. ఇది నిజం.

**ఇంద్రవజ్ర.**

**చెల్లన్ మది న్ని న్ను భజింతు గంగన్**
**ఫుల్లాంతరంగన్ బహుపుణ్యసంగన్**
**గల్లోల లక్ష్మీజితకాశమల్లిన్**
**దల్లిన్ సుధీకల్పలతామతల్లిన్. 222**

**ప్రతి :** ఫుల్ల+అంతరంగన్= వికసించిన హృదయం కలిగినదానివి; బహుపుణ్యసంగన్= అనేక పుణ్యాలు కలిగినదానివి; కల్లోలలక్ష్మీ= కెరటాల శోభతో; కాశ మల్లిన్= రెల్లు, మల్లెలను; జిత= జయించిన; తల్లిన్= తల్లివి; సుధీ= ఉత్తములపాలిటి; కల్పలతామతల్లిన్= శ్రేష్ఠమైన కల్పవల్లిని; గంగన్= గంగానదివి అయిన; నిన్నున్= నిన్ను; చెల్లన్= చక్కగా; మదిన్= మనస్సులో; భజింతున్= పూజిస్తాను.

**తా :** వికసించిన హృదయం కలదానివి, పుణ్యాత్మురాలివి, అలల సంపదచే రెల్లు, మల్లెపూలల శోభను జయించిన దానివి. ఉత్తముల పాలిట శ్రేష్ఠమైన కల్పవృక్షానివి అయిన ఓ గంగామాతా! నిన్ను మనసులో నిండుగా భజిస్తాను.

**విశే :** ఫుల్లాంతరంగ అనడంవల్ల ఆమె విశాలహృదయం, 'సుధీకల్పలతామతల్లి' అనడంవల్ల మంచివారి పాలిట కల్పవృక్షానివనే సూచనతో తను కోరిన వరమీయవలసిందని భగీరథుడర్థించినట్లయ్యింది.

ఇది ఇంద్రవజ్రవృత్తం – నాల్గుపాదాలలో వరుసగా త,త,జ,గగ అనే గణాలు ఉంటాయి. ప్రాస ఉంటుంది. యతి ఎనిమిదవ అక్షరం.

**వ. అని వినుతులు సేయుచున్న రాజకుమారునకు లోకపావని యిట్లనియె. 223**

**ప్రతి :** అని= ఈ విధంగా; వినుతులు= స్తుతులు; చేయుచున్న= చేస్తున్న; రాజకుమారునకున్= భగీరథునితో; లోకపావని= లోకాల్ని పవిత్రం చేసేగంగ; ఇట్లు+అనియెన్= ఇలా అనింది.

**తా :** అని స్తుతిస్తున్న భగీరథునితో లోకపావని గంగామాత ఇలా పలికింది.

**మ. వినువీథిం బఱతెంచి నేలఁబడ నా వేగంబును న్నిల్ప నో**
**పినవాఁ డెవ్వఁడు? మేదినీతలము నే భేదించి పాతాళమున్**
**జనుదున్; వచ్చితినేని నా జలములన్ సుస్నాతులై మానవుల్**
**ననుఁ బొందించు నఘవ్రజంబె చట నే నాశంబుఁ బొందించెదన్. 224**

**ప్రతి :** వినువీథిన్+పఱతెంచి= ఆకాశమార్గంనుండి వచ్చి; నేలన్+పడన్= భూమిమీదపడగా; నా వేగంబునున్= నా వేగాన్ని; నిల్పన్+ఓపినవాడు= నిలుపగలిగిన శక్తికలవాడు; ఎవ్వఁడు= ఎవడున్నాడు; నేన్= నేను; మేదినీతలము= భూఉపరితలాన్ని; భేదించి= చీల్చి; పాతాళమున్+చనుదున్= పాతాళానికి వెళతాను; వచ్చితిన్+ఏనిన్= నేను వచ్చినట్లయితే; నా జలములన్= నా నీటిలో; సుస్నాతులు+ఐ= పవిత్రస్నానం చేసినవారై; మానవుల్= నరులు; ననున్+పొందించు= నాకు అంటగట్టే; అఘవ్రజంబున్= పాపసమూహాన్ని; ఎచటన్= ఎక్కడ; ఏన్= నేను; నాశంబున్+పొందించెదన్= పోగొట్టుకోగలను?

**తా :** ఆకాశమార్గం నుండి వచ్చి భూమిమీద పడే నా వేగాన్ని నిలుప కలిగిన సామర్థ్యం ఎవరికుంది? ఆ వేగంతో నేను భూమిని చీల్చుకొని పాతాళానికి వెళతాను. నేను వస్తే మానవులు నాయందు స్నానంచేసి కడిగేసుకొన్నవారు ఆ పాపాలను నాకు అంటగడతారు. ఆ పాపాలను నేనెక్కడ వదిలించుకోను.

**వ. అది కారణంబుగా విచారించెద నని పలుకుచున్న లోకమాతకు రాజన్యవర్యుండగు భగీరథుం డిట్లనియె. 225**

**ప్రతి :** అది కారణంబు+కాన్= ఆకారణంచేత; విచారించెదన్+అని= ఆలోచిస్తున్నాను అంటూ; పలుకుచున్+ఉన్న= చెపుతున్న; లోకమాతకున్= జగన్మాతతో; రాజన్యవర్యుండు+అగు= రాజశ్రేష్ఠుడైన; భగీరథుండు+ఇట్లు+అనియెన్= భగీరథుడు ఇలా అన్నాడు;

**తా :** ఆ కారణంచేత ఆలోచిస్తున్నానన్న లోకమాతతో రాజశ్రేష్ఠుడైన భగీరథు డిట్లన్నాడు.

**మ. పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు తపఃపారీణు లార్యుల్ ఘనుల్**
**పురుషశ్రేష్ఠులు వచ్చి తల్లి! భవదంభోగాహముల్ సేయఁగా**
**నరసంఘాఘము నిన్నుఁ బొందునె జగన్నాథుండు నానాఘసం**
**హరుఁ డా విష్ణుఁడు వారిచిత్తములఁ దా నై యుంట మందాకినీ! 226**

**ప్రతి :** మందాకినీ= ఓ దేవలోకంలో ప్రవహించే గంగా!; పరతత్త్వజ్ఞులు= పరతత్త్వం తెలిసినవారు; శాంతచిత్తులు= ప్రశాంతమనస్కులు; తపస్+పారీణులు= తపస్సులో నేర్పరులు; ఆర్యుల్= గౌరవార్హులు; ఘనుల్= మహనీయులు; పురుషశ్రేష్ఠులు= ఉత్తములైన మానవులు; వచ్చి= విచ్చేసి; తల్లి= అమ్మా!; భవత్+అంభస్+గాహముల్+చేయన్+కాన్= నీ నీటియందు మునుకలువేయగా; జగత్+నాథుండు= విశ్వానికి ప్రభువైనవాడు; నానా+అఘ= అనేకమైన పాపాలను; సంహరుడు= నాశనంచేసేవాడు; ఆ విష్ణుఁడు= ఆ శ్రీహరి; వారిచిత్తములన్= నీ నీట స్నానమాడుతున్న వారి హృదయాల్లో; తాను+ఐ+ఉంటన్= తానే నిండి ఉండడంచేత; నరసంఘ+అఘము= మానవ సమూహాల పాపం; నిన్నున్+పొందున్+ఎ= నిన్ను చుట్టుకుంటుందా?

**తా :** ఓ దివ్యగంగా! పరతత్త్వం తెలిసినవారు, ప్రశాంత మనస్కులు, తపోనిష్ఠ కలవారు, గౌరవార్హులు, మహనీయులు అయిన మానవులు వచ్చి, నీ నీటిలో మునకలు వేసే సమయంలో విశ్వానికి ప్రభువు, సమస్తపాపహరుడు అయిన ఆ శ్రీహరి వారిహృదయాల్లో నిండి ఉంటాడు కదా! వారిపాపాలు నిన్నెలా అంటుకుంటాయి? (అంటుకోవు).

**మ. తనలో నిన్ని జగంబులుం గలుగుటం దా నిన్నిటం గల్గుటన్**
**జననీ! తంతువులందుఁ జీర గల యా చందంబునన్ విశ్వభా**
**వనుఁడై యొప్పు శివుండు గాక మఱి నీ వారి న్నివారింప నే**
**ర్చిన వార్వెరు; నిన్ ధరించుకొఱకై శ్రీకంఠునిన్ గొల్చెదన్. 227**

**ప్రతి :** జననీ!= తల్లీ!; తనలోన్+ఇన్ని= తనలో అనేకమైన; జగంబులున్+కలుగుటన్= లోకాలు ఉండడం, తాన్= తాను, ఇన్నిటన్+కల్గుటన్= ఇన్నిటిలో ఉండడం, (ఆ లోకాల్లో); తంతువుల+అందున్= దారాల్లో; చీర+కల= వస్త్రమున్న; ఆ

చందంబునన్= ఆ విధంగా; విశ్వభావనుఁడు+ఐ= విశ్వమయుడై; ఒప్పు= ప్రకాశించే; శివుండు+కాక= పరమేశ్వరుడు కాకుండా; మఱి= ఇంక; నీ వారిన్+నివారింపన్= నీ ప్రవాహాన్ని అడ్డకోవడం; నేర్చినవారు+ఎవ్వరు= తెలిసిన వారెవ్వరున్నారు; నిన్ ధరించుకొఱకున్+ఐ= నిన్ను భరించటానికిగాను; శ్రీకంఠునిన్= సదాశివుని; కొల్చెదన్= ప్రార్థిస్తాను.

**తా :** ఓ తల్లీ! తనలో అనేకమైన లోకాలుండడం, తాను ఆ లోకాల్లో ఉండడం దారాల్లో వస్త్రముండే రీతిగా విశ్వమయుడైన పరమేశ్వరుడు కాక నీ నీటి వేగాన్ని అడ్డుకునే నేర్పు ఎవరికుంది? నిన్ను భరించడానికి శివుణ్ణి ప్రార్థిస్తాను.

**వ. అని యెఱింగించి వీడ్కొని, చని, భగీరథుండు మహేశ్వరు నుద్దేశించి, గ్రద్దనఁ దపంబు సేసిన. 228**

**ప్రతి :** అని+ఎఱింగించి= అని తెలిపి; వీడ్కొని చని= వీడుకొలిపి వెళ్ళి, భగీరథుండు; మహా+ఈశ్వరునిన్= పరమశివుణ్ణి; ఉద్దేశించి= గురించి; గ్రద్దనన్= వెంటనే; తపంబు+చేసినన్= తపస్సు చేయగా...

**తా :** అని తెలిపి గంగాదేవి దగ్గర సెలవు తీసుకొని భగీరథుడు వెంటనే శివుణ్ణి గురించి తపస్సు చేశాడు.

**ఆ. భక్తవత్సలుండు ఫాలాక్షుఁ డా భగీ, రథుని మెచ్చి నిజశిరంబునందు**
**శౌరిపాదపూతసలిలయై దివినుండి, ధరకు వచ్చు గంగఁ దాల్చె నపుడు. 229**

**ప్రతి :** భక్తవత్సలుండు= భక్తులయందు వాత్సల్యం కలిగినవాడు; ఫాల+అక్షుఁడు= నుదుటియందు కన్నుకలిగిన శివుడు; ఆ భగీరథునిన్= ఆ భగీరథుణ్ణి; మెచ్చి= మెచ్చుకొని; శౌరిపాదపూత సలిల+ఐ= విష్ణుపాదాలను సోకి పవిత్రమైన జలం కలిగిందైన; దివినుండి ధరకున్+వచ్చు= ఆకాశంనుండి భూమికి వచ్చే; గంగన్= గంగానదిని; నిజశిరంబున+అందున్= తనతలపై; అపుడు; తాల్చెన్= ధరించాడు;

**తా :** అపుడు భక్తవత్సలుడైన పరమశివుడు ఆ భగీరథుని ప్రయత్నానికి మెచ్చుకొని, విష్ణుపాదాలను స్పృశించడంవల్ల పవిత్రమైన జలంతో ఆకాశంనుండి భూమి మీదికి అవతరించే గంగను తన శిరస్సుపై ధరించాడు.

**విశే :** లోకంలో భగీరథప్రయత్నం అనేమాట వ్యాప్తివెనుక ఉన్న ఆ భగీరథుని శ్రమను గ్రహించాలి.

## ❖ శ్రీ పరమేశ్వర జటానిర్గత గంగా ప్రవాహ మహిమాభివర్ణనము ❖

**వ. ఇ ట్లమ్మహానది, పురారాతిజటాజూటరంధ్రంబు వలన దిగంబడి, నిరర్గళ ప్రవాహంబై, నేలకు జల్లించి నెఱసి, నిండి, పెల్లువెల్లిగొని, పెచ్చు పెరిఁగి, విచ్చలవిడిం గ్రేపువెంబడి నుఱక క్రేళ్ళుఱుకు మఱకప్రాయంపుఁ గామధేనువు చందంబున ముందటికి నిగుడుచు, ముద్దుఁ జందురుతోడి నెయ్యంబునఁ గ్రయ్య నడరి చొప్పుదప్పక సాఁగి చనుదెంచు సుధార్ణవంబు కైవడిఁబెంపు గలిగి, మహేశ్వరు వదన గహ్వరంబువలన నోంకారంబు పిఱుంద వెలువడు శబ్దబ్రహ్మంబు భంగి నదభ్రవిభ్రమంబున నమ్మహీపాల తిలకంబు తెరువువెంట నంటివచ్చుచు వెలియేనుఁగు తొండంబుల ననుకరించి పఱచు వఱద మొగంబులును, వఱద మొగంబుల పిఱుంద నందంద క్రందుకొని, పొడచూపి, తొలంగు బాలశారదా కుచకుంభంబులకు నగ్గలంబైన బుగ్గలును, బుగ్గల సంగడంబునం బారిజాత కుసుమ స్తబకంబుల చెలువంబునుం దెగడు వెలినురువులును, వెలినురువుల చెంగట నర్ధోన్మీలిత కర్పూర తరుకిసలయంబుల గేలిగొను సుళ్ళును, సుళ్ళ కెలంకుల ధవల జలధర రేఖాకారంబులు బాగు**

మెచ్చని నిడుదయేఱులును, నేఱులం గలసి వాయువశంబుల నొండొంటిం దాఁకి బిట్టు మిట్టించి, మీఁది కెగయు దురితభంగంబులైన భంగంబులును, భంగంబుల కొనల భిన్నభిన్నంబులై కుప్పించి, యుప్పరం బెగసి; ముత్తియంపు సరుల వడువున, మల్లికాదామంబుల తెఱంగునఁ, గర్పూరఖండ కదంబంబుల చెలువంబున, నిందు శకలంబుల తేజంబునఁ, దారకానికరంబుల పొలుపున మెఱయుచు; ముక్తికన్యావశీకరంబులైన శీకరంబులునుం గలిగి మధ్యమలోక శ్రీకరంబై, శ్రీకరంబు తెఱంగున విష్ణుపదంబు ముట్టి, విష్ణు పదంబు భాతి నుల్లసిత హంస రుచిరంబై, రుచిరపక్షంబురీతి నతిశోభిత కువలయంబై, కువలయంబు చెన్నున బహుజీవనంబై, జీవనంబులాగున సుమనోవికాసప్రధానంబై, ప్రధాన పర్వంబు పొలుపున నేకచక్ర బక భీమ మహాభంగ సుభద్రార్జున చరిత్రాభిరామంబై, రామచిత్తంబు మెలుపునం దనవారిలోఁ జొచ్చిన దోషాచరుల కభయప్రదాన చణంబై, ప్రదాన చణవర్తనంబుభాతి సముపాసిత మృత్యుంజయంబై, మృత్యుంజయు రూపంబుపోలిక విభూతి సుకుమారంబై, కుమారచరిత్రంబులేవను గ్రౌంచప్రముఖవిజయంబై, విజయ రథంబుభాతి హరిహయామంథరంబై, మంథరవిచారంబు గ్రద్దన మహారామ గిరివన ప్రవేశకామంబై, కామకేతనంబు పెల్లున నుద్దీపిత మకరంబై, మకర కేతనుబాణంబు కైవడి విలీన పరవాహినీకలిత శంబరంబై, శంబరారాతి చిగురుఁ గుంతంబుసూటి నధ్వగవేదనాశమనంబై, శమనదండంబు జాడ న్నిమ్నోన్నత సమవృత్తంబై, వృత్తశాస్త్రంబు విధంబున వడిఁ గలిగి సదా గురులఘువాక్యచ్ఛటాపరిగణితంబై, గణితశాస్త్రంబు కొలఁదిని ఘనఘనమూలవర్గమూలసంకలిత భిన్నమిశ్రప్రకీర్ణ ఖాతభీష్మంబై, భీష్మపర్వంబు పెంపున ననేక భగవద్గీతంబై, గీతాశాస్త్రంబు నిలుకడను మహాసుషిరతను ఘన నానాశబ్దంబై, శబ్దశాస్త్రంబు మర్యాద నచ్చువడి హల్లు గలిగి, మహాభాష్య రూపావతారవృత్తి వృద్ధిగుణసమర్థంబై, యర్థశాస్త్రంబు మహిమను బహుప్రయోజన ప్రమాణ దృష్టాంతంబై, దృష్టాంతంబు తెఱంగున సర్వసామాన్య గుణ విశేషంబై, శేషవ్యాపారంబు కరణిని సుస్థిరోద్ధరణ తత్పరంబై, పరబ్రహ్మంబు గరిమ నతిక్రాంతానేక నిగమంబై, నిగమంబు నడవడిని బ్రహ్మావర్ణ పద క్రమసంగ్రహంబై, గ్రహశాస్త్రంబు పరిపాటిని కర్కట మీన మిథున మకర రాశి సుందరంబై, సుందరి ముఖంబు పోఁడిమిని నిర్మల చంద్రకాంతంబై , కాంతాధరంబు రుచిని శోణచ్ఛాయావిలాసంబై, విలాసవతి కొప్పు నొప్పునఁ గృష్ణనాగాధికంబై, యధికమతి శాస్త్ర సంవాదంబు సొంపున నపార సరస్వతీ విజయవిభ్రమంబై, విభ్రమవతి చనుదోయి పగిది నిరంతర పయోవ్యాప్తాఖిలలోక జీవన ప్రదతుంగభద్రాతిరేఖా సలలితంబై, లలితవతి నగవు మించున నపహసిత చంద్రభాగధేయంబై, భాగధేయవంతుని వివాహంబు లీల మహామేఖల కన్యకావిస్తారం బై, తారకెంగేలి యొడికంబున నాక్రాంత సూర్యతనయంబై, సూర్యతనయు శరవర్షంబు పోలిక భీమరథ్యాటోపవారణంబై, వారణంబు పరుసునం బుష్కరోన్నత సంరంభంబై, రంభ నెమ్మోము దాలున సురసాతిశయదశంబై, దశరథతనయు బొమముడి చాడ్పున సింధుగర్వ ప్రభంజనంబై, ప్రభంజనతనయు గదపెట్టు మాడ్కిని సమీపగత దుశ్శాసన దుర్మద నివారకంబై, వార కన్యక ముంజేతి గతిని ముహుర్ముహు రుచ్చలిత కంకణాలంకృతంబై, కృతయుగంబు నోజ నపంకంబై, పంకజాసన ముఖంబు నొఱపునఁ బ్రభూతముఖవర్ణంబై, వర్ణగుణితంబు తెఱకువను బహుదీర్ఘబిందు విసర్గంబై, సర్గబంధకావ్యంబు విన్ననువున గంభీరభావమధురంబై, మధురాపురంబు

**సొబగున మహానందనందనంబై, నందనవనంబు పొందున విహరమాణ కౌశికంబై, కౌశికహయంబు రీతి సుదశ్రధ్రువంబై, ధ్రువుతలంపు క్రియం పరిశీలత విశ్వంభరంబై, విశ్వంభరుని శంఖంబు రూపున దక్షిణావర్తోత్తరంబై, యుత్తరావివాహంబు చందంబునఁ బ్రముదిత నరంబై, నరసింహ నఖరంబుల భాతి నాశ్రిత ప్రహ్లాద గురువిభవ ప్రదానంబై, దానకాండంబు సిరిం గామధేను కల్పలతాద్యభినవంబై, నవసూతికాకుచంబు పేర్మిని నిరంతర పయోవర్ధనంబై, ధనదు నిలయంబు తూనిక సంగత మకర పద్మ మహాపద్మ కచ్ఛపంబై, కచ్ఛప కర్పరంబు బలిమిని పతితశైల సముద్ధరణంబై, ధరణీధరంబు సాటి నుత్తుంగ తటముఖ్యంబై, ముఖ్య వరాహంబు గరిమ నున్నతక్షమంబై, క్షమాసుర హస్తంబు గరగరికను సత్పవిత్ర మనోరామంబై, రామచంద్రుబాణంబు కడింది నభ్యాగత ఖరదూషణ మదాపహరణ ముఖరంబై, ముఖర రామ కుఠారంబు రీతిని భూభృన్మూలభేదన ప్రబలంబై, బలరామ హలంబుభాతిని బ్రతికూల సన్నికర్షణ ప్రబుద్ధంబై, బుద్ధదేవుని మేని యొఱపున నభియాతి రక్షోదార మనోహరంబై, హరతాండవంబు మేర నుల్లసి తానిమిషంబై, యనిమిషావతారంబు కీర్తిని శ్రుతి మంగళ ప్రదంబై, ప్రదాత యాఁగి సూటి నర్థపరంపరా వామనంబై, వామన చరణరేఖను బలివంశవ్యపనయంబై, నయశాస్త్రంబు మార్గంబున సామ భేద మాయోపాయ చతురంబై, చతురాననాండంబు భావంబున నపరిమిత భువన జంతుజాల సేవ్యమానంబై, మానిని యన లోఁతు సూపక, గరితయన సడిచప్పుడు సేయక, ముగుద యన బయలుపడక, ప్రమద యనఁ గ్రయ్యం బాఱుచుఁ బతివ్రత యన నిట్టట్టు సనక, తల్లి యన నెవ్వియైన లోఁగొనుచు, దైవంబన భక్త మనోరథంబు లిచ్చుచు, నంతకంతకు విస్తరించి గుఱి గడచి, యవాఙ్మానసగోచరంబై ప్రవహించి. 230**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ఆ+మహానది= ఆ గొప్పనది; పుర+అరాతి= త్రిపురాలకు శత్రువైన ఈశ్వరుని; జటాజూట రంధ్రంబువలనన్= జడల సందులనుండి; దిగన్+పడి= కిందికి దిగి; నిరర్గళప్రవాహంబు+ఐ= అడ్డులేని ప్రవాహం కలిసి; నేలకున్+చల్లించి= నేలమీద పాకి; నెఱసి= వ్యాపించి; నిండి= ఆక్రమించి; పెల్లువెల్లిన్+కొని= పెద్ద వరదరూపాన్ని పొంది; పెచ్చుపెరిగి= అధికంగా వృద్ధిచెంది; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; క్రేపువెంబడి= దూడ వెంబడి; ఉఱకన్+క్రేళ్ళు+ఉఱుకు= గంతులువేస్తూ పరుగులుతీసే; మఱక ప్రాయము+కామధేనువు చందంబునన్= తొలి ఈత మేకవయసులో ఉండే కామధేనువువలె; ముందటికిన్+నిగుడుచున్= ముందుకు సాగుతూ; ముద్దున్+చందురుతోడి నెయ్యంబునన్= అందమైన చంద్రునితో అనుబంధంచేత; క్రయ్యన్+అదరి= ఉవ్వెత్తున ఎగసి; చొప్పున్+తప్పక= దారి మరలక; సాగి= నిగిడి; చనుదెంచు= వచ్చేటి; సుధా+అర్ణవంబు కైవడిన్= పాలసముద్రంలాగా; పెంపున్+కలిగి= ఆధిక్యత కలిగి; మహా+ఈశ్వరు= పరమేశ్వరుని; వదన గహ్వరంబువలనన్= నోరు అనే గుహనుండి; ఓంకారంబు పిఱుంద= ఓంకారం వెంబడి; వెలువడు= బయలుదేరే; శబ్దబ్రహ్మంబు భంగి= శబ్దబ్రహ్మవలె; అదభ్ర విభ్రమంబునన్= విస్తారమైన విలాసంతో; ఆ+మహీపాలతిలకంబు= ఆ రాజశ్రేష్ఠుని; తెరువు వెంటన్= మార్గం వెంబడి; అంటి వచ్చుచున్= అనుసరిస్తూ; వెలి+ఏనుగు= తెల్లఏనుగు (ఐరావతం); తొండంబులన్+అనుకరించి పఱచు= తొండములను అనుకరించి వ్యాపించే; వఱదమొగంబులును= వరదముఖాలూ; వఱద మొగంబుల పిఱుందన్= వరదముఖాల వెంబడే; అందున్+అందున్= అక్కడక్కడే; క్రందుకొని= ఆక్రమించి; పొడచూపి= ఉనికినిచాటి; తొలంగు= ప్రక్కకు తొలగే; బాలశారదా= బాలసరస్వతి; కుచకుంభంబులకున్= కలశాల్లాంటి స్తనాలకు; అగ్గలంబు+అయిన= సమానమైన; బుగ్గలును= నీటి బుగ్గలూ; బుగ్గల సంగడంబునన్= నీటి

బుగ్గల చేరికతో; పారిజాత కుసుమస్తబకంబుల= పారిజాత పుష్పగుచ్ఛాల; చెలువంబునున్+ తెగడు= అందాన్ని నిందించే; వెలినురువులును= తెల్లని నురుగలూ; వెలినురువుల చెంగటన్= తెల్లని నురగల దగ్గరే; అర్థ+ఉన్మీలిత= సగం విరిసిన; కర్పూర తరుకిసలయంబులు= కర్పూరచెట్ల చిగుళ్లను; గేలిగొను= పరిహసించే; సుళ్ళును= సుడులూ; సుళ్ళకెలంకులన్= సుడుల ప్రక్కనే; ధవల జలధర= తెల్లటి మేఘాల; రేఖా+ఆకారంబుల= రేకల్లాంటి ఆకారాల; బాగు మెచ్చని= ఆధిక్యతను మెచ్చుకోని; నిడుద+ఏఱులును= పొడవైన ఏఱులూ; ఏఱులన్+కలసి= ఏఱులలో కలిసి; వాయువశంబులన్= గాలిచేత; ఒందు+ఒంటిన్= ఒకాదాని నొకటి; తాకి= ఎదుర్కొని; బిట్టు మిట్టించి= అధికంగా స్పర్శించి; మీఁదికిన్+ఎగయు= మీదికి ఎగిరే; దురిత భంగంబులు+అయిన= పాపనాశనకారులైన; భంగంబులును= కెరటాలూ; భంగంబుల కొనలన్= కెరటాల చివర్లలో; భిన్న భిన్నంబులు+ఐ= ముక్కలు ముక్కలై; కుప్పించి+ఉప్పరంబు+ఎగసి= కుప్పించి ఆకాశానికి ఎగసి; ముత్తియము+సరుల వడుపునన్= ముత్యాల హారాల వలె; మల్లికాదామంబుల తెఱంగునన్= మల్లెపూల మాలలరీతిగా; కర్పూరఖండ కదంబంబుల చెలువంబునన్= కర్పూర ఖండాల సమూహాల అందం వలె; ఇందుశకలంబుల తేజంబునన్= చంద్ర శకలాల కాంతిలాగా; తారకా నికరంబుల= నక్షత్ర సమూహాల; పోలుపునన్= విధంగా; మెఱయుచున్= ప్రకాశిస్తూ; ముక్తికన్యావశీకరంబులు+ఐన= మోక్షమనే స్త్రీని వశం చేసుకోగలిగిన; శీకరంబులునున్+కలిగి= నీటి తుంపురులు కలిగి; మధ్యమలోక శ్రీకరంబు+ఐ= భూలోకానికి మంగళకరమై; శ్రీకరంబు తెఱంగునన్= లక్ష్మీదేవి హస్తంవలె; విష్ణుపదంబున్+ ముట్టి= విష్ణుపాదమైన ఆకాశాన్నితాకి; విష్ణుపదంబు భాతి= ఆకాశానికి వలె; ఉల్లసిత= ప్రకాశించే; హంస రుచిరంబు+ఐ= హంసల (సూర్య) కాంతితో ప్రకాశమానమై; రుచిరపక్షంబురీతి= శుక్లపక్షం వలె; అతిశోభిత కువలయంబు+ఐ= శోభాయమానములైన కలువలు కలిగినదై; కువలయంబు చెన్నునన్= భూమికివలె; బహుజీవనంబు+ఐ= అనేక బ్రతుకుదెరువులు కలిగినదై; జీవనంబు లాగున= నీటివలె (బ్రతుకుదెరువు); సుమనో వికాసప్రధానంబు+ఐ= పుష్పవికాసకారణమై (మంచి మనస్సు కలవారి); ప్రధానపర్వంబు పోలుపునన్= సభాపర్వానికి వలె; ఏకచక్ర బక, భీమ, మహాభంగ సుభద్ర+అర్జున చరిత్ర+అభిరామంబు+ఐ= ఏకచక్రపురం, బకుడు, భీముడు, గొప్పసైన్యం, సుభద్రార్జునుల వర్తనంచేత మనోహరమై (చక్రవాకాలు, కొంగలు, గొప్పనీటితో); రామచిత్తంబు మెలుపునన్= శ్రీరాముని మనస్సుకువలె; తనవారిలోన్+చొచ్చిన= తనవారిలో కలిసిన (తన నీటిలో కలిసిన); దోషాచరులకున్+అభయప్రదానచణంబు+ఐ= రాక్షసులకు అభయమివ్వడంలో నేర్పరియై (తన నీటిలో మునిగిన పాపులకు అభయమిచ్చే నేర్పరియై); ప్రదాన చణవర్తనంబుభాతి= గొప్పదాత వర్తనం వలె; సముపాసిత= ఉపాసించే; మృత్యుంజయంబు+ఐ= పరమేశ్వరుడు కలిగిందై; మృత్యుంజయు రూపంబుపోలిక= పరమేశ్వరుని రూపానికివలె; విభూతి సుకుమారంబు+ఐ= విభూతితో సుకుమారమై; కుమారచరిత్రంబు రేవను= కుమారస్వామి చరిత్రలాగా; క్రౌంచప్రముఖ విజయంబు+ఐ= క్రౌంచ పర్వతాలను జయించిందై; విజయరథంబు భాతి= అర్జునుడి రథంలాగా; హరిహయమంథరంబు+ఐ= సూర్యుని గుఱ్ఱాల వేగం కలిగిందై; మంథర విచారంబు గ్రద్దన= మంథర (కైకదాసి) ఆలోచనలాగా; మహా+ఆ రామ, గిరి, వన ప్రవేశకామంబు+ఐ= వన, పర్వత, ఆరామాల్లో ప్రవేశించేదియై; కామకేతనంబు పెల్లున= మన్మథుని జెండాలాగా; ఉద్దీపిత మకరంబు+ఐ= ప్రకాశించే మొసళ్ళు కలిగిందై; మకరకేతను బాణంబు కైవడిన్= మన్మథుని బాణానికివలె; విలీన పరవాహినీ కలితశంబరంబు+ఐ= సైన్యంతో కలిసి శంబరాసురునిలో ప్రవేశించే విధంగా, (తనలో ప్రవేశించే ఇతరజలాలు కలిగిందై); శంబర+అరాతి= మన్మథుని; చిగురున్+కుంతంబు సూటి= చిగురుకత్తిలాగా; అధ్వగ వేదనాశమనంబు+ఐ= బాటసారుల తాపాన్ని పోగొట్టే; శమన దండంబు జాడన్= యమదండానికివలె; నిమ్న+ఉన్నత= ఎగుడుదిగుడులందుకూడ; సమవృత్తంబు+ఐ= సమానంగా మెలిగేదియై (అల్పులు అధికులందు సమానంగా ప్రవర్తించేదై); వృత్తశాస్త్రంబు విధంబునన్= ఛందస్శాస్త్రానికివలె;

వడిన్+కలిగి= వేగంకలిగి (యతి కలిగి); సదా= ఎప్పుడూ; గురులఘువాక్యచ్ఛటా పరిగణితంబు+ఐ= గురులఘువులతోను వాక్యసమూహంతో లెక్కపెట్టబడునదై (పెద్ద, చిన్న శబ్దాలతో కూడింద్రై); గణితశాస్త్రంబు కొలఁదిని= గణితశాస్త్రంలాగా; ఘన ఘనమూల, వర్గమూల= ఘనం ఘనమూలం, వర్గమూలాలతో; సంకలిత= కూడిన; భిన్న, మిశ్ర, ప్రకీర్ణఖాతభీష్మంబు+ఐ= భిన్నాలు, మిశ్రమాలు, ప్రకీర్ణకాలతో విజృంభణం కలిగింద్దై (పరస్పరం రాసుకొనే పొదరింఢ్లతో, విడివడిన ......) భీష్మపర్వంబు పెంపున= భీష్మపర్వం గొప్పదనంవలె; అనేక భగవద్గీతంబై= పెక్కు భగవద్వాక్యాలు కలిగింద్దై (భగవంతుని గూర్చిన పాటల శబ్దాలతో కూడింద్దై); గీతాశాస్త్రంబు నిలుకడను= గీతాశాస్త్రానికి వలె; మహాసుషిరతను= గొప్ప వేణునాదంతో; ఘన నానాశబ్దంబు+ఐ= గొప్పవియైన అనేక శబ్దాలతో కూడింద్దై; శబ్దశాస్త్రంబు మర్యాదన్= వ్యాకరణంవలె; అచ్చువడి హల్లుకలిగి= అచ్చులు, హల్లుల, వేగంకలిగి; మహాభాష్యరూప+అవతారవృత్తి= మహాభాష్యవృత్తిలాగా; వృద్ధి గుణ సమర్థంబు+ఐ= వృద్ధి, గుణాల శక్తికలిగింద్దై (అభివృద్ధి, మంచికలిగి); అర్థశాస్త్రంబు మహిమను= అర్థశాస్త్రానికి వలె; బహు ప్రయోజన ప్రమాణదృష్టాంతంబు+ఐ= పెక్కు ప్రయోజనాల ప్రమాణతకు నిదర్శనమై; దృష్టాంతంబు తెఱంగునన్= దృష్టాంతానికి వలె; సర్వ సామాన్య గుణవిశేషంబు+ఐ= సర్వుల సామాన్యగుణవిశేషాలు కలిగింద్దై; శేషవ్యాపారంబు కరణిన్= శేషుని ప్రయత్నంవలె; సుస్థిర+ఉద్ధరణ తత్పరంబై= సుస్థిరమైన మోతలో ఆసక్తి కలిగి, (ప్రజలను ఉద్ధరించుటలో), పరబ్రహ్మంబు గరిమన్= పరబ్రహ్మ స్వరూపంవలె; అతిక్రాంత+అనేక నిగమంబు+ఐ= అనేక వేదాలను దాటింద్దై (ఆటంకాల్ని దాటింద్దై); నిగమంబు నడవడిని= వేదంలాగా; బ్రహ్మవర్ణ పదక్రమ సంగ్రహంబు+ఐ= బ్రహ్మ, ధ్వని, పదక్రమంకలిగి; గ్రహశాస్త్రంబు పరిపాటిని= గ్రహశాస్త్రానికివలె; కర్కట, మీన, మిథున, మకర రాశి సుందరంబు+ఐ= కర్కట, మీన, మిథున, మకరరాశులచేత ఒప్పినదై (కర్కటాలు, మీనాలు, జంటలు, మకరాలతో కూడింద్దై); సుందరి ముఖంబు పోఁడిమిని= సౌందర్యవతి ముఖంలాగా; నిర్మల= స్వచ్ఛమైన; చంద్రకాంతంబు+ఐ= చంద్రకాంతులతో కూడింద్దై; కాంతా+అధరంబు రుచిని= ఇంపైన స్త్రీ పెదవిలాగా; శోణచ్ఛాయా విలాసంబు+ఐ= కెంపురంగుతో సుందరమై; విలాసవతి= సుందరాంగి; కొప్పున్+ఒప్పునన్= కొప్పునకు వలె; కృష్ణనాగ+అధికంబు+ఐ= నల్లత్రాచు వైభవంకలిగి; అధికమతి= బుద్ధిమంతుని; శాస్త్ర సంవాదంబు సొంపునన్= శాస్త్ర చర్చయొక్క వైభవంలాగా; సరస్వతీ జయ విభ్రమంబు+ఐ= సరస్వతీ విజయంతో విలసిల్లేదియై; విభ్రమవతి చనుదోయి పగిది= సుందరాంగి చనుదోయికి వలె; నిరంతర= ఎడతెగని; పయస్+వ్యాప్త= నీటితో (పాలతో) వ్యాపించడంచేత; అఖిలలోక జీవనప్రద= సమస్త ప్రజలకు బ్రతుకుతెరువై; తుంగభద్రా+అతిరేఖా= తుంగభద్రానది సొగసునుమించి; సలలితంబు+ఐ= నీటితో మనోహరమై; లలితవతి నగవుమించునన్= లావణ్యవతి నవ్వునకు వలె; అపహసిత= ఎగతాళిచేయు; చంద్రభాగదేయంబు+ఐ= చంద్రభాగ సౌభాగ్యం కలిగింద్దై; భాగదేయవంతుని= అదృష్టవంతుని; వివాహంబులీల= వివాహానికి వలె; మహామేఖల= గొప్ప ఒడ్డాణాలతోడి; కన్యకావిస్తారంబు+ఐ= కన్యకలు కలిగింద్దై, (మహామేఖలతోడి విస్తరించిన భూమి కలిగింద్దై); తారకెంపు+కేలి ఒడికంబునన్= తార చేతికివలె; ఆక్రాంత= ఆక్రమించిన; సూర్యతనయంబు+ఐ= యమునానది కలిగింద్దై (తార తనచేతితో సుగ్రీవుని స్పర్శించినట్లు); సూర్యతనయు శరవర్షంబుపోలిక= కర్ణుని బాణవర్షానికివలె; భీమరథ్+ఆటోపవారణంబు+ఐ= భీమరథీనదియొక్క విజృంభణను అరికట్టినదై (భీముని రథ విజృంభణను అడ్డగించినదై); వారణంబు పరుసునన్= ఏనుగుకువలె; పుష్కర+ఉన్నత సంరంభంబు+ఐ= పుష్కరుని గొప్ప ఆటోపం కలిగింద్దై (నీటిని చిమ్మే ఏనుగుతొండంవంటి విజృంభణతో); రంభ నెఱ+మోము డాలున= రంభ నిండైన ముఖంవలె; సురస+అతిశయదశంబు+ఐ= మంచినీటితో అతిశయించింద్దై; దశరథ తనయు= శ్రీరాముని; బొమముడి చాడ్పునన్= తీక్ష్ణ దృష్టికివలె; సింధు గర్వప్రభంజనంబు+ఐ= సింధునది గర్వాన్ని నాశనంచేసేదై (సముద్ర గర్వాన్ని భంజించేదై); ప్రభంజనతనయు= వాయుకుమారుడైన భీముని; గదవెట్టుమాడ్కిని=

గదాఘాతంలాగా; సమీపగత= సమీపించినవారి; దుశ్శాసన దుర్మద నివారకంబు+ఐ= దుశ్శాసనుని గర్వమనే పాపాల్ని నివారించేద్రై; వారకన్యక= వేశ్యస్త్రీ; ముంజేతి గతిని= ముంజేయిలాగా; ముహుర్+ముహుర్= మాటి మాటికి; ఉచ్చలిత= కదలాడే; కంకణ+అలంకృతంబు+ఐ= కంకణాలతో అలంకరింపబడింద్రై; కృతయుగంబున్+ఓజన్= కృతయుగానికి వలె; అపంకంబు+ఐ= బురదలేనిద్రై (పాపంలేనిద్రై); పంకజ+ఆసనుముఖంబున్+ఒఱపునన్= పద్మాసనుడైన బ్రహ్మముఖంవలె; ప్రభూత= పుట్టిన; ముఖవర్ణంబు+ఐ= తెల్లటిరంగు కలిగింద్రై (ముఖవర్ణాలు కలిగింద్రై); వర్ణ గుణితంబు తెఱకువను= అక్షరాల గుణితంలాగా; బహు= అనేకమైన; దీర్ఘబిందు= అధిక నీటిబిందువులను; విసర్గంబు+ఐ= వెదజల్లుచున్నద్రై; సర్గబంధకావ్యంబున్+విన్ననువునన్= సర్గబంధమహాకావ్యంవలె; గంభీర భావ మధురంబు+ఐ= గంభీరమైన భావాలతో మనోజ్ఞమై (గంభీరమైన, మధురమైన నీటిబిందువు); మధురాపురంబు సొబగున= మధురానగరానికి వలె; మహా+నంద నందనంబు+ఐ= గొప్పవాడైన నందనందనుని కూడి (ఆనందానికి నందనవనమై); నందన వనంబు పొందునన్= నందనవనానికి వలె; విహరమాణ కౌశికంబు+ఐ= కౌశిక నదితో విహరించేద్రై (ఇంద్రునితో విహరించేద్రై); కౌశికహయంబురీతి= ఇంద్రుని గుఱ్ఱంలాగా; సుదశధ్రువంబు+ఐ= ధ్రువమైన మంచిదశ కలిగింద్రై; ధ్రువు తలంపుక్రియన్= ధ్రువుని ఆలోచనవలె; పరిశీలత= పరిశీలించబడిన; విశ్వంభరంబు+ఐ= విశ్వాన్ని భరించింద్రై; విశ్వంభరుని శంఖంబు రూపునన్= విష్ణువు శంఖంవలె; దక్షిణ+ఆవర్త+ఉత్తరంబు+ఐ= కుడినుండి ఎడమవైపుకు మరలినద్రై; ఉత్తరా వివాహంబు చందంబునన్= ఉత్తర వివాహంలాగా; ప్రముదిత= సంతోషపెట్టబడిన; నరంబు+ఐ= (నరులకు సంతోషకారియై) అర్జునుడు కలిగింద్రై; నరసింహ నఖరంబులభాతిన్= నరసింహస్వామి గోళ్లకువలె; ఆశ్రిత= ఆశ్రయించిన; ప్రహ్లాద= ప్రహ్లాదునికి; గురువిభవప్రదానంబు+ఐ= గొప్ప వైభావాన్ని ప్రసాదించేద్రై (గురువిభవాన్ని ప్రసాదించేది); దానకాండంబు సిరిన్= దానఘట్టానికివలె; కామధేను, కల్పలతా+ఆది+అభినవంబు+ఐ= కామధేను, కల్పవృక్షాదులతో నిత్యనూతనమై; నవసూతికా కుచంబుపేర్మినిన్= పచ్చిబాలెంతరాలి స్తనంలాగా; నిరంతర= ఎడతెగని; పయోవర్ధనంబు+ఐ= పాలధారలతో వృద్ధిచెందేద్రై (ఎప్పుడూ పెరుగుతున్న నీళ్లతోనిండి); ధనదు నిలయంబు తూనికన్= కుబేరుని నిలయంలాగా; సంగత= కలిగిన; మకర పద్మ మహాపద్మకచ్ఛపంబు+ఐ= మకరం, పద్మం, మహాపద్మం, కచ్ఛపం అనే నిధులతో నిండినద్రై (మొసళ్లతో, మెట్టతామరలతో, తామరలతో, తాబేళ్లతో నిండింద్రై); కచ్ఛపకర్పరంబు బలిమిని= ఆదికూర్మపు బలమైన కర్పరము (పైకప్పు) విధంగా; పతిత= పడిన; శైల సముద్ధరణంబు+ఐ= పర్వతాల్ని పైకెత్త కలిగింద్రై (మిక్కిలి ఓర్పు కలిగింద్రై); ధరణీధరంబు సాటి= పర్వతంవలె; ఉత్తుంగ= మిక్కిలి ఎత్తైన; తటముఖ్యంబై= గట్టులు కలిగింద్రై (ఎత్తైన చరియలతో కూడింద్రై); ముఖ్యవరాహంబు గరిమన్= ఆదివరాహంలాగా; ఉన్నత క్షమంబు+ఐ= గొప్ప ఓర్పుకలిగింద్రై; క్షమాసురహస్తంబున్= బ్రాహ్మణుని చేతిని; గరగరికను= వలె; సత్+పవిత్ర= మంచి పవిత్రంతో దర్భతో కూడిన చేయినివలె; మనస్+రామంబు+ఐ= మనసుకు ఇంపు కలిగించేద్రై; రామచంద్రు బాణంబు కడింది= శ్రీరాముని బాణంలాగా; అభ్యాగత= ఎదుర్కోవడానికి వచ్చిన; ఖర, దూషణ మద+అపహరణ ముఖరంబు+ఐ= ఖరదూషణుల గర్వాన్ని మింగుతూ మ్రోగేద్రై (తనను చేరే కఠిన పాపుల అహంకారాన్ని అపహరించేద్రై); ముఖర= మ్రోగుతున్న; రామకుఠారంబు రీతినిన్= పరశురాముని గండ్రగొడ్డలినివలె; భూభృత్+మూలభేదన= రాజుల మూలాల్ని భేదించడంలో; ప్రబలంబు+ఐ= బలం కలిగింద్రై (పర్వతాలను సమూలంగా నాశనం చేయటంలో బలం కలిగింద్రై); బలరామ హలంబు భాతినిన్= బలరాముని నాగలి అనే ఆయుధంవలె; ప్రతికూల= ఒడ్లను; సన్నికర్షణ= రాసుకొనుటలో; ప్రబుద్ధంబు+ఐ= ఉప్పొంగుచున్నద్రై (శత్రువులను ఉన్మూలించుటలో పొంగిపోయేది); బుద్ధదేవునిమేని+ఒఱపునన్= బుద్ధదేవుని శరీరాన్నివలె; అభియాతి రక్షోదారమనోహరంబు+ఐ= ఆశ్రయించిన రాక్షసకాంతలకు మనోహరమై (ఆశ్రయించినవారిని రక్షించడంలో సమర్థవంతమైంద్రై); హరతాండవంబుమేరన్= శివుని తాండవ నృత్యంలాగా;

ఉల్లసిత+అనిమేషంబు+ఐ= సంతోషపెట్టబడిన దేవతలు కలిగిందై (తుళ్ళిపడేచేపలుకలిగిందై); అనిమిష+అవతారంబు కీర్తిని= మత్స్యావతారంవలె; శ్రుతి మంగళ ప్రదంబు+ఐ= వేదాలకు శుభాన్ని చేకూర్చేదై (చెవులకు ఇంపునకు కలిగించేదై); ప్రదాత+ఈఁగి సూటిన్= దాత ధనంలాగా; అర్థపరంపరావామనంబు+ఐ= ధనసమూహంతోడి విస్తారమైందై; వామను చరణ రేఖను= వామనుని పాదంలాగా; బలివంశ వ్యపనయంబు+ఐ= బలివంశాన్ని నిర్మూలించేదై (గొప్ప వెదురు పొదలను కదల్చేదై); నయశాస్త్రంబు మార్గంబున= నీతిశాస్త్రానికి వలె; సామభేద మాయా+ఉపాయచతురంబు+ఐ= సామభేదమాయోపాయాలనే నాలుగంశాలు కలిగిందై (ఆయా ప్రదేశంలో ఆయారీతిని వర్తించేదై); చతురానన+అండంబు భావంబునన్= బ్రహ్మాండాన్నివలె; అపరిమిత= అంతులేని; భువన= లోకాలతో; జంతుజాల= జంతు సమూహంతో; సేవ్యమానంబు+ఐ= సేవించబడేదై; (లెక్కలేనన్ని నీటి జంతువులతో సేవించబడేదై); మానిని+అనన్= మానవతిలాగా; లోఁతు చూపక= గట్టు తెలియనీక; గరిత+అనన్= స్త్రీకి వలె; చడిచప్పుడు+చేయక= గుట్టు తెలియనీక; ముగుద+అనన్= ముద్దరాలివలె; బయలు పడక= ప్రస్ఫుటం కాకుండా; ప్రమద+అనన్= జవరాలిలాగా; క్రయ్యన్+పాఱుచున్= వేగంగా పారుతూ; పతివ్రత+అనన్= పతివ్రతలాగా; ఇట్టు+ఇట్టు+చనక= అటు ఇటూ పోక; తల్లి+అనన్= తల్లిలాగా; ఎవ్వి+ఐనన్= వేటినైనా; లోన్+కొనుచున్= లోపలికి గ్రహిస్తూ (దాచుకుంటూ); దైవంబు+అనన్= దేవతలాగా; భక్తమనోరథంబులు+ ఇచ్చుచున్= భక్తులకు కోరికలను తీర్చుతూ; అంతకున్+అంతకున్= క్రమక్రమంగా; విస్తరించి= వ్యాపించి; గుఱిన్+కడచి= పరిమితిని దాటి; అవాక్+మానసగోచరంబు+ఐ= మాటకు, మనసుకు అందకుండా; ప్రవహించి= పారి...

**తా :** ఈ విధంగా ఆ మహానది శివుని జడల సందునుండి దిగి, అడ్డులేని ప్రవాహంతో భూమిపై కురికింది. బాగా వ్యాపించిన గొప్ప ప్రవాహంతో దూడవెంబడి గంతులువేస్తూ పరుగులు తీసే యౌవన ప్రాయంలో ఉన్న కామధేనువులాగా ముందుకు వ్యాపిస్తూ, ముద్దులొలికే చంద్రునిపై ప్రేమతో ఉప్పొంగే పాలసముద్రంలాగా అతిశయించి, పరమాత్ముని వదనంనుండి వెలువడే ఓంకారాన్ని అనుసరించే శబ్దబ్రహ్మంలాగా, విస్తృతమైన విలాసంతో ఆ రాజశ్రేష్ఠుని మార్గాన్ని అనుసరించింది. ఐరావతతొండాన్ని అనుకరిస్తూ ప్రవహించే వరద ముఖాలు కలిగి, వరద ముఖాల వెనుకనే అక్కడక్కడ కనిపించి తొలగిపోయే బాలసరస్వతి కుచకలశాలను మించిన అధికమైన నీటిబుడగలనూ, నీటి బుడగల చేరికతో పారిజాతపు పూలగుత్తుల కాంతిని మించిన తెల్లని నురగలనూ, ఆ నురగల ప్రక్కన సగం విరిసిన కర్పూరపు చెట్ల చిగుళ్ల సోయగాన్ని గెలిచేసి సుడులును, ఆ సుడుల ప్రక్కన తెల్లమేఘాలను మెచ్చుకోని నిడుపైనయేర్లును, ఆ యేర్లను కలసి గాలి తాకిడి వల్ల తీవ్రంగా పైకెగసే పాపనాశనకరమైన కెరటాలను, ఆ కెరటాల చివరల్లో ముక్కలు ముక్కలై కుప్పించి పైకెగరే ముత్యాలహారాల్లాగా, మల్లెపూదండల్లాగా, కర్పూర ఖండాలలాగా, చంద్రుని శకలాల్లాగా, చుక్కల గుంపులాగా ప్రకాశిస్తూ బాటసారుల తాపాన్ని పోగొట్టే నీటి తుంపురులు కలిగి, భూలోకానికి శుభాన్ని కలిగించేదిగా, లక్ష్మీదేవి హస్తంలాగా విష్ణుపాదమైన ఆకాశాన్ని తాకి; ఆకాశం వలె ప్రకాశించే హంసల కాంతితో ఒప్పి, శుక్లపక్షంలోని భూమండలం లాగా శోభించే కలువలు కలిగి, అనేకమైన బ్రతుకు తెరువులతో కూడిన లోకంలాగా అధికమైన నీటిని కలిగి, మంచి మనస్సుతో శోభించే జీవితం లాగా వికసించిన పూలతో కూడి, అనేక సేనలు, బక, భీమ, సుభద్రార్జునుల చరిత్రతోడి మనోహరమైన భారత పర్వంలాగా అనేకమైన చక్రవాకపక్షులతోకూడి, కొంగలతో భయంకరమైన అలలతో సుందరమై, తన వాళ్లను కలిసిన రాక్షసులకు అభయ మివ్వడంలో సమర్థమైన శ్రీరాముని హృదయంలాగా తన నీళ్లలో మునిగిన పాపులకు అభయమివ్వడంలో సమర్థమై, మృత్యువును జయించిన గొప్పదాత ప్రవర్తనలాగా, గొప్పనడకతో శివుణ్ణి సేవిస్తూ, విభూతితో కూడిన అందమైన శివుని రూపంలాగా సంపదతో సుకుమారమై, క్రౌంచ పర్వతాన్ని జయించిన కుమారస్వామి చరిత్రలాగా

కొంగలు మొదలైన వాటితోకూడి; అర్జునుడి రథంలాగా సూర్యుని గుఱ్ఱాలవంటి వేగం కలిగి, శ్రీరామునికి వనవాసం కల్పించిన మంథర ఆలోచనలాగా శీఘ్రంగా వనపర్వతాలలో ప్రవేశించే కోరికకలిగి, మన్మథుని జెండాలాగా మొసళ్లతో కూడి; సైన్యంతో కూడిన శంబరాసురునిలో ప్రవేశించే మన్మథుని బాణంలాగా, తనలో లీనమైన ఇతర ప్రవాహజలాలు కలిగి, మన్మథుని చిగురుకత్తిలాగా, బాటసారుల తాపాన్ని తొలగించి; అల్పులపట్ల, అధికులపట్ల సమానంగా ప్రవర్తించే యముని దండంలాగా ఎత్తుపల్లాల్లో సమానంగా మెలిగి; యతితోనూ, గురులఘువులతోనూ, వాక్యసమూహంతోనూ కూడిన ఛందశ్శాస్త్రంలాగా వేగంతోను, పెద్ద చిన్న శబ్దాలతోను కూడి; గొప్ప వర్గమూలాలతో, భిన్నాలతో, మిశ్రాలతో, ప్రకీర్ణాలతో నిండిన గణిత శాస్త్రంలాగా, పరస్పరం రాచుకునే పొదరిండ్లతో, లోయలతో భయంకరంగా ప్రవహించేదై, భగవద్గీతా సహితమైన భీష్మపర్వంలాగా సుఖకరమైన శబ్దాలతో కూడినదై, వాద్యం నుండి వెలువడే మంద్రతార స్వరాలుగల సంగీతశాస్త్రంలాగా అనేక విధాలైన శబ్దాలతో కూడిందై; అచ్చులు, హల్లులు కలిగిన వ్యాకరణశాస్త్రంలాగా వడిగలదై; మహాభాష్యవృత్తిలాగా వృద్ధిగుణాల సామర్థ్యం కలిగిందై; పెక్కు ప్రయోజనాలతో కూడిన నిడివి అందరికీ అందుబాటులో ఉండే గొప్పగుణంతో విలసిల్లిందై, వేదసమూహాలకు అతీతమైన పరబ్రహ్మలాగా అనేక మార్గాలను అతిక్రమించిందై; వర్ణపదక్రమాలతో కూడిన వేదంలాగా ధ్వనిక్రమాలకు కూడికయై; కర్కటమీనమిథునాలతో ప్రకాశించే ఖగోళ చక్రంలాగా కుళీరాలు, చేపలు, మొసళ్ళతో ఉండి; సుందరిముఖంలాగా స్వచ్ఛమైన చంద్రకాంతులతో నిండి; స్త్రీ పెదవివలె ఎఱ్ఱని కెంపు వర్ణం కలిగి; కాంత పెదవిలాగా ఎఱ్ఱరంగుతో కూడిందై, అందమైన స్త్రీ జడబంధంలాగా నల్లనాగు అందాలతో అతిశయించి, బుద్ధిమంతుని శాస్త్రవాదంలాగా అంతులేని శారదావిజయంతో ప్రకాశించేదై, విభ్రమవతి చనుదోయిలాగా సమస్త ప్రజానీకానికి బ్రతుకు తెరువై పయోధారతో నిండి జీవనప్రద తుంగయైన తుంగభద్రానది సొగసును మించిందై; మనోజ్ఞవతి చిరునవ్వులాగా చంద్రభాగానదిని గెలిచేసేదై, గొప్ప ఒడ్డాణాలు ధరించిన కన్యక సహితుడైన అదృష్టవంతుని వివాహంలాగా భూమి నిండా వ్యాపించిందై, తార తనహస్తంతో సుగ్రీవుని తాకినట్లు ముత్యాలవంటి తనచేతితో యమునానదిని ఆక్రమించేదై; భీముని రథవిజృంభణాన్ని నివారించిన కర్ణుని బాణపరంపరలాగా భీమరథి నది ఆటోపాన్ని నివారించేదై; నీటిని చిమ్మే ఏనుగుతొండంవంటి గొప్ప విజృంభణతో కూడిందై, సురసాతిశయమైన రంభ ముఖంలాగా మంచినీటితో అతిశయించి, సముద్ర గర్వాన్ని అణచిన శ్రీరామచంద్రుని బొమముడిలాగా సింధునది గర్వాన్ని అణచిందై; తన్ను సమీపించిన దుశ్శాసను గర్వాన్ని అణగించే భీముని గదాఘాతంలాగా తనను చేరినవారి పాపాల్ని కడిగి వేసేదై; మాటి మాటికి కదలాడే గాజులతో శోభిల్లే వేశ్యముంజేయిలాగా మళ్ళీ మళ్ళీ కదలాడే నీటిబిందువులు కలిగి; పాపంలేని కృతయుగంలాగా పవిత్రమై, బ్రహ్మముఖం లాగా గొప్ప బ్రాహ్మణుల ఆశ్రయాన్ని పొందిందై; అనేకదీర్ఘాలు, బిందువులతో, విసర్గలతో కూడిన వర్ణ గుణింతంలాగా అనేకమైన నీటిబిందువులు కలిగిందై; సర్గబంధకావ్యానికి వలె గంభీరభావమాధుర్యం కలిగిందై; మధురాపురం నందనందనునితో కలసి ఆనందపడ్డట్లు ఆనందానికి నందనవనమై; ఇంద్రుడు విహరించే నందన ఉద్యానవనంలాగా కౌశికనదితో తిరిగేదై; ఇంద్రుని గుఱ్ఱం వలె స్థిరమైన మంచి స్థితికలిగి, విష్ణుచింత కలిగిన ధ్రువుని ఆలోచనలాగా విశ్వాన్ని పరిశీలించేదై, విష్ణువు శంఖంలాగా కుడినుండి ఎడమవైపుకు తిరిగి, ఉత్తర వివాహంలాగా అర్జునునికి ఆనందదాయకమై, పాలతో పొంగే పచ్చి బాలింతరాలి స్తనంలాగా నిరంతరం వృద్ధి కలిగిన నీళ్లతో (పాలతో) నిండిందై; మకరం, పద్మం, మహాపద్మం, కచ్ఛపం అనే నిధులతో నిండిన కుబేరుని నిలయంలాగా మొసళ్ళతో, పద్మాలతో మెట్టతామరలతో తాబేళ్లతో నిండిందై; కూలిన కొండను పైకెత్తే ఆది కూర్మపు బలమైన వెన్నెముకలాగా కొండల్ని కదలించేదై, ఎత్తైన కటకాలతో నిండిన కొండలాగా ఎత్తైన గట్లతో కూడిందై భూమిని మోసే ఆదివరాహంలాగా ఓర్పుకలిగిందై, దర్భను ధరించిన బ్రాహ్మణుని హస్తంలాగా పవిత్రమై; తన నెదుర్కోడానికి వచ్చే ఖరదూషణాదుల గర్వాన్ని పోగొట్టే రామబాణంలాగా

తనను చేరవచ్చే పాపుల అహంకారాన్ని పోగొట్టేదై; రాజులను సమూలంగా ఖండించే పరశురాముని గండ్రగొడ్డలిలాగా పర్వతాలను సమూలంగా పెల్లగించే బలం కలిగిందై; విరోధుల్ని దున్నే బలరాముని నాగలి లాగా గట్లను రాచుకొని పొంగేదై; బుద్ధుని శరీరంలాగా ఆశ్రితులను రక్షించే సామర్థ్యం కలిగిందై; దేవతలను సైతం సంతోషపెట్టే శివుని నాట్యంలాగా ఎగిరిపడే చేపలతో నిండిందై; వేదాలకు శుభాన్ని ఇచ్చే మత్స్యావతారంలాగా చెవులకు ఆనందకరమై, ధనసమూహంతో ఇవ్వాలనుకొనే దాత దానంలాగా అర్థసమూహంతో విస్తారమైందై; బలిచక్రవర్తి వంశాన్ని నిర్మూలించిన వామనుని పాదం లాగా గొప్ప వెదురు పొదలను పెకలించేదై; సామభేదోపాయాలతో కూడిన నీతిశాస్త్రం లాగా నేర్పరితనం కలిగిందై; అనేక జగాలతో, ప్రాణి సమూహంతో సేవింపబడే బ్రహ్మాండం లాగా పలు జీవరాశులతో నిండినట్టిదై; మానిని లాగా గుట్టుతెలియనీక, ఇల్లాలి లాగా శబ్దంచేయక, ముగ్ధవలె బయటపడక, జవరాలిలాగా వేగం కలిగి, పతివ్రతలాగా స్థిరత్వం కలిగి, తల్లిలాగా అన్నిటిని కడుపులో దాచుకొంటూ, దేవతలాగా భక్తుల కోరికలను ఈడేరుస్తూ, క్రమక్రమంగా హద్దులను దాటి మాటకు మనసుకు అందకుండా ఆ గంగానది భగీరథునివెంట ప్రవహించింది.

**విశే :** ఆకాశాన్నుండి భూమికి అవతరించిన గంగానది సోయగాల్ని పోతనగారు సహజసుందరంగా, సాభిప్రాయంగా, మనోజ్ఞంగా వర్ణించారు. పరమేశ్వరు జటాజూటంనుండి క్రిందికి దిగబడ్డ ఆ నది పోయిన పోకడలు కళ్ళకు కట్టినట్లు వర్ణించబడ్డాయి. సృష్టిలోని వర్ణనీయ వస్తువుల్నీ సందర్భోచితంగా గ్రహించి చినుకులు, తుంపురులు, బిందువులు, బుడగలు, కాలువలు, సెలయేళ్లు మొదలైన నీటియొక్క అవస్థా భేదాలతో కవి ఒక అనుబంధాన్ని చేర్చాడా అన్నట్లు వచనం ముక్తపదగ్రస్తంగా చిత్రించబడింది. ఆయాచోట్ల శ్లేష సాభిప్రాయంగా మనోజ్ఞతను వెల్లివిరిసింది. గంగ 'విష్ణుపాదోద్భవ'గా ప్రసిద్ధి. గంగావతరణాన్ని విష్ణువుయొక్క దశావతారాలతో అనుబంధించి ఒక విశిష్టతను ఆపాదించాడు కవి. పోతన ఇటువంటి వచనాల్ని నరసింహావతారాది ఘట్టాల్లో కూడ వ్రాశాడు. అవన్నీ ఎక్కడి కక్కడే సందర్భోచితంగా ఉన్నాయి.

**మ. జగతీనాథు రథంబుపజ్జ బహుదేశంబుల్ వడిం దాఁటి త**
**త్సగరక్ష్మాపకుమారభస్మములమీఁదన్ ముంచి పాఱన్ మరు**
**న్నగరావాసము వారు పొందిరి నవీనశ్రీలతో గంగ నీ**
**రు గతింగాక మహాదురంత సుజనద్రోహానలం బాఱునే. 231**

**ప్రతి :** జగతీనాథు= భూమికి ప్రభువైన భగీరథుని; రథంబుపజ్జన్= రథం వెంబడి; బహుదేశంబుల్= అనేక దేశాలను; వడిన్+దాఁటి= వేగంగా దాటుతూ; తద్= ఆ; సగరక్ష్మాప= సగరరాజుయొక్క; కుమార= కుమారుల; భస్మముల మీఁదన్= బూడిద రాసులపై; ముంచి పాఱన్= ముంచి ప్రవహించగా; నవీన శ్రీలతో= నూతన శోభలతో; మరుత్= దేవతల; నగర+ఆవాసమున్= నగర నివాసమైన స్వర్గాన్ని; వారు పొందిరి= వారు పొందారు; మహా= గొప్పనైన; దురంత= అంతులేని; సుజన= మంచివారియందలి; ద్రోహ+అనలంబు= ద్రోహమనే అగ్ని; గంగనీరు గతిన్+కాక= పవిత్ర గంగాజల ప్రవాహంవల్ల కాక వేరేవిధంగా; ఆఱునే= చల్లారుతుందా?

**తా :** గంగానది భగీరథ మహారాజు రథం వెంబడి అనేక దేశాల్ని దాటి ఆ సగర రాజకుమారుల బూడిదరాసులను ముంచి ప్రవహించగా వారు నూతనశోభలతో దేవతల నగర నివాసమైన స్వర్గాన్ని పొందారు. పుణ్యాత్ముల పట్ల చేసిన అంతులేని ద్రోహమనే అగ్ని గంగాజల ప్రవాహంవల్ల కాకుండా వేరేవిధంగా చల్లారుతుందా? (చల్లారదు).

**విశే :** సజ్జనులపట్ల చేసిన దోషం ఊరకే చల్లారదు. ఆ దోషం పోగొట్టగల సాధనం పవిత్రమైన గంగాజలమే.

**మ. హరు మెప్పించి మహాతపోనియతుఁడై యాకాశగంగానదిన్**
**ధరకుం దెచ్చి నితాంతకీర్తిలతికాస్తంభంబుగా నవ్య సు**
**స్థిరలీలం బితృకృత్య మంతయు నొనర్చెన్ వారితానేక దు**
**స్తరవంశవ్యథుఁ డా భగీరథుఁడు నిత్యశ్రీకరుం డల్పుఁడే! 232**

**ప్రతి :** వారిత= నివారింపబడిన; అనేక= అనేకమైన; దుస్తర= తరించడానికి వీలుకాని; వంశవ్యథుడు= వంశానికి ఏర్పడిన దుఃఖాలు కలవాడు; మహాతపస్+నియతుడు+ఐ= గొప్ప తపోనిష్ఠతో కూడినవాడై; హరున్+మెప్పించి= పరమేశ్వరుణ్ణి మెప్పించి; ఆకాశగంగానదిన్= ఆకాశమందలి గంగానదిని; ధరకున్+తెచ్చి= భూమి మీదకు తెచ్చి; నితాంత= అధికమైన; కీర్తిలతికాస్తంభంబు+కాన్= కీర్తి అనే తీగకు స్తంభంగా; నవ్యసుస్థిరలీలన్= కొత్తగా, స్థిరంగా; పితృకృత్యము+అంతయున్= పితృకార్యాన్నంతటిని; ఒనర్చెను= పూర్తిచేశాదు; నిత్యశ్రీకరుఁడు= శాశ్వత శుభకరుడైన; ఆ భగీరథుడు; అల్పుడే= సామాన్యుడా? (సామాన్యుడు కాడు).

**తా :** వంశానికి కలిగిన జటిలమైన దుఃఖాన్ని నివారించినవాడు, శాశ్వత శుభకరుడు అయిన ఆ భగీరథుడు పరమేశ్వరుణ్ణి గొప్ప తపోనిష్ఠతో మెప్పించి, ఆకాశమందలి దేవగంగానదిని భూమిమీదకు తెచ్చి, తనకీర్తి అనే తీగకు శాశ్వతమైన స్తంభంగా చేసుకొని పితృకార్యాన్ని పూర్తిచేశాడు. అతడు సామాన్యుడు కాడు.

**విశే :** 'మందాకినీ వియద్గంగా స్వర్ణదీ సురదీర్ఘికా' అని గంగానదికి పేర్లు. ఆకాశమందలి నదిని భూమికి తేవడం అసాధారణం. దాన్ని సాధించటం చేతనే అతడు కీర్తిపొందాడు. 'భగీరథ ప్రయత్నం' గా శాశ్వతత్వాన్ని పొందాడు.

**క. హరిఁ దమమనమున లోనిడి, హరిపాదాంభోజజనితమైన నదిన్ సు**
**స్థిరులై గ్రుంకి మునీంద్రులు, హరిఁ గలిసిరి త్రిగుణరహితులై యవ్వేళన్. 233**

**ప్రతి :** ఆ+వేళన్= అపుడు; ముని+ఇంద్రులు= ఋషి శ్రేష్ఠులు; హరిన్= విష్ణువును; తమ మనమునన్= తమ మనస్సులో; లోనిడి= ప్రతిష్ఠించుకొని హరిపాద+అంభోజ= విష్ణువుయొక్క పాదపద్మంనుండి; జనితము+ఐన= పుట్టిన; నదిన్= ఏటిలో; సుస్థిరులు+ఐ= దృఢ నిశ్చయంతో; క్రుంకి= మునిగి; త్రిగుణరహితులు+ఐ= త్రిగుణాతీతులై; హరిన్+కలిసిరి= విష్ణువునందు ఐక్యమయ్యారు.

**తా :** అప్పుడు కొందరు మహర్షులు శ్రీహరిని తమ మనస్సులలో తీవ్రంగా ధ్యానిస్తూ విష్ణుపాదోద్భవమైన గంగానదిలో క్రుంకులిడి త్రిగుణాతీతులై విష్ణువులో ఐక్యమయ్యారు.

**వ. అంత నా భగీరథునకు శ్రుతుందును, శ్రుతునకు నాభావరుందును, నాభావరునకు సింధుద్వీపుందును, సింధుద్వీపునకు నయుతాయువును, నయుతాయువునకు ఋతుపర్ణుదును జనియించె నతండు. 234**

**ప్రతి :** అంతన్= ఆ తరువాత; ఆ భగీరథునకున్= ఆ భగీరథునికి; శ్రుతుందును= శ్రుతుడు; శ్రుతునకున్= శ్రుతునికి; నాభావరుందును= నాభావరుడును; నాభావరునకున్= నాభావరునికి; సింధు ద్వీపుందును= సింధు ద్వీపుడు; సింధు ద్వీపునకున్= సింధు ద్వీపునికి; అయుతాయువును= అయుతాయువు; అయుతాయువునకున్= అయుతాయువునికి; ఋతు పర్ణుదును= ఋతుపర్ణుదును; జనియించెన్= పుట్టారు; అతండు= అతడు (ఋతుపర్ణుడు)...

**తా :** తరువాత వరుసగా ఆ భగీరథునికి శ్రుతుడు, శ్రుతునికి నాభావరుడు నాభావరునికి సింధుద్వీపుడు, సింధుద్వీపునికి అయుతాయువు, అయుతాయువునకు ఋతుపర్ణుడు జన్మించారు. అతడు

**ఆ. నయవిశాలబుద్ధి నలచక్రవర్తితో, సంగడీనితనము చాలఁజేసి**
**యక్షహృదయ మతని కభ్యస్తముగ నిచ్చి, యశ్వవిద్య నేర్చె నతనివలన. 235**

**ప్రతి :** నయవిశాలబుద్ధిన్= నీతి కల్గిన గొప్ప బుద్ధితో; నలచక్రవర్తితోన్= నలచక్రవర్తితో; సంగడీనితనమున్= స్నేహాన్ని; చాలన్+చేసి= ఎక్కువగా చేసి; అక్షహృదయము= పాచికలాటకు చెందినవిద్యను; అతనికిన్+అభ్యస్తము+కన్+ఇచ్చి= ఆ నలచక్రవర్తికి తెలిసేటట్లు ఇచ్చి; అతని వలనన్= ఆ నలునివల్ల; అశ్వవిద్యన్+నేర్చెన్= గుర్రాలకు చెందిన శాస్త్రం తెలుసుకొన్నాడు.

**తా :** ఆ ఋతుపర్ణుడు గొప్ప బుద్ధిమంతుడైన నలమహారాజుతో స్నేహం చేశాడు. అతనికి తనకు తెలిసిన అక్షహృదయాన్ని (పాచికల ఆటకు సంబంధించిన శాస్త్రాన్ని) ఇచ్చి, అతనినుండి గుర్రాలకు చెందిన శాస్త్రాన్ని తెలుసుకున్నాడు.

**వ. ఆ ఋతుపర్ణునకు సర్వకాముండును, సర్వకామునకు మదయంతీ వల్లభుండైన సుదాసుండును బుట్టె నా రాజశేఖరుని మిత్రసహుండును, గల్మాషపాదుండునని చెప్పుదు రాభూవరుండు వసిష్ఠుని శాపంబున రాక్షసుండై, తన కర్మంబున ననపత్యుండయ్యె ననిన విని పరీక్షిన్నరేంద్రుం డేమి కారణంబున సుదాసునకు గురుశాపంబు ప్రాప్తం బయ్యె నని యడిగిన శుకుం డిట్లనియె. 236**

**ప్రతి :** ఆ ఋతుపర్ణునకున్= ఆ ఋతుపర్ణునికి; సర్వకాముండును= సర్వకాముడూ; సర్వకామునకున్= సర్వకామునికి; మదయంతీ వల్లభుండు+ఐన= మదయంతి భర్తయైన; సుదాసుండును+పుట్టెన్= సుదాసుడు జన్మించాడు; ఆ రాజశేఖరుని= ఆ రాజశ్రేష్ఠుని; మిత్రసహుండును= మిత్రసహుడని; కల్మాషపాదుండును+అని= కల్మాషపాదుడు అని; చెప్పుదురు= పిలుస్తారు; ఆ భూవరుండు= ఆ రాజు; వసిష్ఠుని శాపంబునన్= వసిష్ఠముని శాపంచేత; రాక్షసుండు+ఐ= రాక్షసుడై; తనకర్మంబునన్= తన కర్మవశాత్తు; అనపత్యుఁడు+అయ్యెన్= సంతానహీనుడయ్యాడు; అనిన విని= అని చెప్పగా విన్న; పరీక్షిత్+నర+ఇంద్రుండు= పరీక్షిన్మహారాజు; ఏమి కారణంబునన్= ఏ కారణంచేత; సుదాసునకున్= సుదాసునికి; గురుశాపంబు= గురువుయొక్క శాపం; ప్రాప్తంబు+అయ్యెన్= కలిగింది? అని+అడిగినన్= అని అడగ్గా; శుకుండు+ఇట్లు+ అనియెన్= శుకయోగి ఇలాగన్నాడు.

**తా :** ఆ ఋతుపర్ణునికి సర్వకాముడు, సర్వకామునికి సుదాసుడు పుట్టారు. ఆ సుదాసుని భార్యపేరు మదయంతి. ఆ రాజశ్రేష్ఠుని మిత్రసహుడు, కల్మాషపాదుడు అని కూడా అంటారు. ఆ రాజు వసిష్ఠుని శాపంవల్ల రాక్షసుడై తన కర్మానుసారంగా బిడ్డలు లేనివాడయ్యాడు అని చెప్పగా పరీక్షిన్మహారాజు, ఏ కారణంచేత సుదాసునికి గురుశాపం కలిగింది అని ప్రశ్నించాడు అపుడు శుకయోగీంద్రు డిట్లన్నాడు.

**సీ. ఆ సుదాసుఁడు వేఁటకై వనంబున కేఁగి గర్వించి యొక్క రక్కసునిఁ జంపి**
**వానితోఁబుట్టిన వానిఁబో విడిచిన వాఁడును దనతోడివాని చావు**
**వోనీక కపటియై భూపాలుగృహమున నడబాలతనమున నర్థిఁ గొలిచి**
**యుండ వసిష్ఠున కుర్వీశుఁడొక్క నాఁ డన్నంబు సేయంగ నతనిఁబనుప**

**తే. వాఁడు మానవమాంసంబు వండి తెచ్చి, మునికి వడ్డింపఁ గోపించి ముని నరేంద్రుఁ
బిల్చి మానవమాంసంబుఁ బెట్టి తనుచు, నలుకతో రాక్షసుఁడవు గమ్మని శపించె. 237**

**ప్రతి :** ఆ సుదాసుఁడు= ఆ సుదాసుడు; వేఁటకై= వేటాడడంకోసం; వనంబునకున్+ఏఁగి= అడవికి వెళ్లి; గర్వించి= దర్పించి; ఒక రక్కసునిన్+చంపి= ఒక రాక్షసుణ్ణి చంపి; వానితోన్+పుట్టినవానిన్= వాని తోడబుట్టినవానిని; పోన్+విడిచినన్= వదలివేయగా; వాడును= వాడు (రాక్షసుని సోదరుడు) తనతోడివాని చావు= తన తోడబుట్టినవాని మరణం; పోనీక= మర్చిపోక; కపటి+ఐ= మోసగాడై; భూపాలు గృహమునన్= ఆ రాజు ఇంట్లో; అడబాలతనమునన్= వంటపని చేస్తూ; అర్థిన్= కోరిక కలవాడై; కొలిచి ఉండన్= సేవిస్తుండగా; ఉర్వీ+ఈశుడు= భూమికి ప్రభువైనరాజు; వసిష్ఠునకున్= వసిష్ఠమహర్షికి (అతిథిగా వచ్చిన); అన్నంబున్+చేయన్+కన్= వంటచేయడానికి; అతనిన్+పనుపన్= ఆ మోసగాడైన వంటవాణ్ణి పంపగా; వాఁడు; మానవ మాంసంబున్= వాడు నరమాంసాన్ని; వండి తెచ్చి; మునికి వడ్డింపన్= మునికి వడ్డించగా; ముని= మహర్షి; నర+ఇంద్రున్+పిల్చి= రాజును పిలిచి; మానవమాంసంబున్= నరమాంసాన్ని; పెట్టితి(వి)+అనుచున్= పెట్టించావు అంటూ; అలుకతోన్= కోపంతో; రాక్షసుఁడవు+కమ్ము+అని= రక్కసుడవైపో అని; శపించెన్= శపించాడు.

**తా :** ఆ సుదాసుడు వేటకోసం అడవికి వెళ్ళి బలగర్వంతో ఒక రాక్షసుణ్ణి చంపాడు. కాని వాని సోదరుణ్ణి మాత్రం వదలి వేశాడు. వాడు తన తోబుట్టువు చావు సహించలేక ప్రతీకారంతో మోసపూరితంగా రాజుగారి భవనంలో వంటలవాడుగా చేరాడు. ఒకరోజు వసిష్ఠుడు అతిథిగా రాగా రాజు ఆయనకోసం వంటచేయమని వానికి చెప్పాడు. వాడు నరమాంసాన్ని వండి మునికి వడ్డించాడు. అపుడు వసిష్ఠుడు రాజును పిలిచి కోపంతో నరమాంసాన్ని వండించి పెట్టావు అంటూ రాక్షసుడవు కమ్మని శపించాడు.

**వ. ఇట్లు శపించి పదంపడి, రాక్షసుండు వండి తెచ్చుటయు, సుదాసుని యెఱుంగమియుఁ దన మనంబున నెఱింగి, వసిష్ఠుండు పండ్రెండేండ్లు రక్కసుండవై యుండుమని నియమించె; న య్యవసరంబున. 238**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; శపించి= శపించి; పదంపడి= తరువాత; రాక్షసుండు= రాక్షసుడు; వండితెచ్చుటయున్= వండి తీసుకొనిరావడం; సుదాసుని+ఎఱుంగమియున్= సుదాసునికి తెలియకపోవడం; తనమనంబునన్+ఎఱింగి= తన మనసులో గ్రహించి; వసిష్ఠుండు= వసిష్ఠముని; పండ్రెండు+ఏండ్లు= పన్నెండు సంవత్సరాలు; రక్కసుండవు+ఐ= రాక్షసుడివై; ఉండుము+అని నియమించెన్= ఉండమని కట్టడి చేశాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** ఆ విధంగా శపించిన తర్వాత రాక్షసుడు వండితేవడం, సుదాసునికి తెలియదనే విషయం మనోదృష్టితో తెలుసుకొన్న వసిష్ఠుడు పండ్రెండేండ్లు మాత్రం రాక్షసుడవై ఉండమని శాపాన్ని సవరించాడు. అపుడు

**మ. గురువున్ మాఱు శపింతు నంచు జలముల్ గోపంబుతో దోయిటన్
నరనాథుండు ధరింపఁ దత్సతి పతిన్ వారింప మిన్నున్ దిశల్
ధరయుం జీవమయంబకా నిఖిలముం దాఁజూచి చల్లెన్ ధరా
వరుఁ డాత్మీయపదంబులం గరపుటీవాఃపూరమున్ బొక్కుచున్. 239**

**ప్రతి :** నరనాథుండు= రాజు; గురువున్= గురువైన వసిష్ఠుణ్ణి; మాఱు శపింతును (శపించుదును)+అంచున్= మారు శపిస్తానని అంటూ; కోపంబుతో= కోపంతో; దోయిటన్= దోసిట్లో; జలముల్= నీళ్లను; ధరింపన్= తీసుకోగా; తత్+సతి=

అతని భార్య; పతిన్ వారింపన్= భర్తను వారించగా; ధరావరుఁడు= రాజు; మిన్నున్= ఆకాశం; దిశల్= దిక్కులు; ధరయున్= భూమి; నిఖిలమున్= సమస్తం; జీవమయంబు+కాన్= ప్రాణులతో నిండి ఉండటాన్ని; తాన్+చూచి= తాను గ్రహించి; పొక్కుచున్= దుఃఖిస్తూ; కరపుటీవాఃపూరమున్= దోసిట్లోని నీటిని; ఆత్మీయపదంబులన్= తన కాళ్లపై; చల్లెన్= చల్లుకున్నాడు.

**తా :** అపుడు రాజు గురువును మారు శపిస్తానని దోసిటితో నీటిని తీసుకున్నాడు. వద్దని భార్య వారించింది. భూమ్యాకాశాలు, దిక్కులు సర్వం ప్రాణిమయంగా గ్రహించిన రాజు చేసేదేమీ లేక దుఃఖంతో చేతిలోని నీటిని తనపాదాలమీద చల్లుకున్నాడు.

**విశే :** గురువును మారుశపిస్తానని దోసిటిలో నీళ్లు తీసుకున్నాడు సుదాసుడు. అంటే శాపసామర్థ్యం ఉందనుకోవాలి. సర్వం ప్రాణిమయం కాబట్టి కాళ్లమీదనే చల్లుకున్నాడు. అందుకే కల్మాషపాదుడనబడ్డాడు. తన దోషాన్ని తెలుసుకున్న ముని శాపాన్ని సవరించాడు. అది తెలియని రాజు ప్రతిశాపమిచ్చేందుకు సిద్ధపడ్డాడు. కాబట్టే అతని వృత్తాంతం సుఖాంతం కాలేదు.

**వ. ఇట్లు మిత్రసహుండు గావునఁ గళత్రానుకూలుండై శపియింప నొల్లక, సుదాసుండు రాక్షసభావంబు నొంది, కల్మషవర్ణంబు లయిన పాదంబులతో నడవులం దిరుగుచు. 240**

**ప్రతి :** మిత్రసహుండు= మైత్రితో ఓర్పు గలవాడు; కావునన్= కాబట్టి; కళత్ర+అనుకూలుండు+ఐ= భార్యకు అనుకూలుడై; శపియింపన్+ఒల్లక= శపించటానికి ఇష్టపడక; సుదాసుండు= సుదాసుడు; రాక్షసభావంబున్+ఒంది= రాక్షసభావం పొంది; కల్మషవర్ణంబులు+అయిన= నల్లని రంగుగలవైన; పాదంబులతో= పాదాలతో; అడవులన్+తిరుగుచున్= అడవులలో తిరుగుతూ...

**తా :** ఇట్లా మిత్రసహుడైన అతడు భార్యమాటకు అనుకూలుడై శపించడానికి ఇష్టపడక రాక్షసత్వం పొంది నల్లని రంగు కలిగిన పాదాలతో కల్మాషపాదుడై అడవుల్లో తిరుగుతూ

**విశే :** సుదాసునికి మిత్రసహుడు, కల్మాషపాదుడనే పేర్లు ఉన్నట్లు కథాప్రారంభంలో చెప్పబడింది. వాటి సార్థకత ఇక్కడ చెప్పబడింది.

**క. ఆఁకట మలమల మాడుచు, వీఁక నతం డడవి నున్న విప్రమిథునమున్**
**దాఁకి తటాలున విప్రునిఁ, గూఁకటి చేఁబట్టి మ్రింగఁగొనిపోవు తతిన్. 241**

**ప్రతి :** అతండు= ఆ సుదాసుడు; ఆఁకటన్= ఆకలితో; మలమలమాడుచున్= అలమటిస్తూ; వీఁకన్= గర్వంతో; అడవిన్+ఉన్న= అరణ్యంలో ఉండే; విప్రమిథునమున్= బ్రాహ్మణ దంపతులను; తాఁకి= ఎదుర్కొని; తటాలునన్= వెంటనే; విప్రునిన్= బ్రాహ్మణునియొక్క; కూఁకటిన్= జుట్టును; చేన్+పట్టి= చేతితో పట్టుకొని; మ్రింగన్+కొనిపోవుతతిన్= మింగడానికి తీసుకొనిపోయే సమయంలో...

**తా :** ఆకలితో మలమల మాడుతున్న సుదాసుడు అడవిలో ఒక బ్రాహ్మణదంపతుల జంటను చూశాడు. వెంటనే వారిని ఎదుర్కొని తటాలున బ్రాహ్మణుణ్ణి జుట్టుపట్టుకొని మింగడానికి తీసుకొనిపోతుండగా

**వ. అంత నా బ్రాహ్మణుని భార్య మోఁదికొనుచుం బెగ్గడిల్లి, దగ్గుత్తికతోఁ బతికి నడ్డంబు వచ్చి, యేడ్చుచు రాచరక్కసున కిట్లనియె. 242**

**ప్రతి :** అంతన్= అంతట; ఆ బ్రాహ్మణునిభార్య; మోఁదికొనుచున్= గుండెలు బాదుకొంటూ; బెగ్గడిల్లి= భయపడి; డగ్గుత్తికతోన్= గద్గదస్వరంతో; పతికిన్= భర్తకు; అడ్డంబు వచ్చి= అడ్డుపడి; ఏడ్చుచున్= ఏడుస్తూ; రాచరక్కసునకున్= రాక్షసుడైనరాజుతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నది.

**తా :** అప్పుడు ఆ బ్రాహ్మణునిభార్య గుండెలు బాదుకొంటూ గొంతు పెగలక భర్తకు అడ్డం వచ్చి ఏడుస్తూ, ఆ రాక్షస రాజుతో ఇట్లా అంది.

**క. మానుషదేహము గలుగుట, భూనాయక! దుర్లభంబు పుట్టినమీఁదన్**
**దానము పరోపకారము, భూనుతకీర్తియును వలదె పురుషున కెందున్? 243**

**ప్రతి :** భూనాయక!= ఓ రాజా!; మానుషదేహము= మానవశరీరం; కలుగుట= లభించుట; దుర్లభంబు= అసాధ్యం; పుట్టిన మీఁదన్= అట్టి జన్మకలిగాక; పురుషునకున్= మనిషికి; దానము= దానం; పర+ఉపకారము= పరులకు ఉపకారం; భూనుతకీర్తియున్= ప్రశంసనీయమైన కీర్తి; ఎందున్ వలదె= ఎక్కడైనా ఉండాలికదా!;

**తా :** ఓ రాజా! మానవదేహం కలగడం బహుకష్టం. అటువంటిది కలిగాక మానవునికి దానం, పరోపకారం, పొగడ తగిన కీర్తి ఉండాలికదా!

**మ. రవివంశాగ్రణివై సమస్తధరణీరాజ్యానుసంధాయివై**
**భువనస్తుత్యుఁడవై పరార్థరతివై పుణ్యానుకూలుండవై**
**వివరం బేమియు లేక నా పెనిమిటిన్ విప్రున్ దపశ్శీలు స**
**త్ప్రవరున్ బ్రహ్మవిదున్ జగన్నుతగుణున్ భక్షింపఁగాఁ బాడియే? 244**

**ప్రతి :** రవివంశ+అగ్రణివి+ఐ= సూర్యవంశంలో ప్రముఖుడవై; సమస్తధరణీరాజ్య= మొత్తం భూరాజ్యాన్ని; అనుసంధాయివి+ఐ= కలిపినవాడవై; భువనస్తుత్యుఁడవు+ఐ= లోకంచేత పొగడబడినవాడవై; పర+అర్థరతివి+ఐ= ఇతరులమేలు కోరేవాడవై; పుణ్య+అనుకూలుండవు+ఐ= పుణ్యకృత్యాలకు అనుకూలత కలిగినవాడవై; వివరంబు+ఏమియున్+లేక= దోషం ఏమీ లేకుండా; విప్రున్= బ్రాహ్మణుణ్ణి; తపస్+శీలున్= తపఃస్వభావుణ్ణి; సత్+ప్రవరున్= మంచి నడవడిక గలవాణ్ణి; బ్రహ్మవిదున్= బ్రహ్మజ్ఞానిని; జగత్+నుతగుణున్= లోకంచేత పొగడబడిన గుణం కలవానిని; అయిన నా పెనిమిటిన్= నా భర్తను; భక్షింపన్+కాన్+పాడియే= తినటం న్యాయమా? (న్యాయంకాదు).

**తా :** సూర్యవంశంలో ప్రముఖుడివై, భూమండలాన్ని పరిపాలించే వాడివై, మంచి పొగడిక కలవాడివై, ఇతరుల మేలుకోరేవాడివై, పుణ్యాత్ముడివై ఉండి దోషరహితుడైన బ్రాహ్మణుణ్ణి, తపశీలుణ్ణి, సజ్జనుణ్ణి, బ్రహ్మవేత్తను, గుణవంతుడు అయిన నా భర్తను భక్షించడం ధర్మమేనా? (ధర్మంకాదు).

**శా. తండ్రీ! మీకు దినేశవంశజులకున్ దైవం బగున్ బ్రాహ్మణుం**
**దండ్రా మాటలు లేవె? భూమిసుర గోహత్యాభిలాషంబు గై**
**కొండ్రే మీ యటువంటి సాధువులు? రక్షోభావ మిట్లేల? మీ**
**తండ్రిం దాతలఁ బూర్వులం దలఁపవే ధర్మంబునం బోఁగదే! 245**

**ప్రతి :** తండ్రీ= నాయనా!; దిన+ఈశవంశజులకున్= సూర్యవంశీయులైన; మీకున్; బ్రాహ్మణుండు= విప్రుడు; దైవంబు+అగున్= దైవ సమానుడు అవుతాడు; అండ్రు= అంటారు; ఆ మాటలు లేవె= ఆ పలుకులు ఏమైనాయి? మీ+అటువంటి= మీ బోటి; సాధువులు= నెమ్మదస్తులు; భూమిసుర= బ్రాహ్మణులను; గోహత్య+అభిలాషంబున్= గోవులను హత్యచేయుటలో కోరికను; కైకొండ్రు+ఏ= గ్రహిస్తారా?; ఇట్లు= ఈ విధమైన; రక్షస్+భావము= రాక్షసత్వం; ఏల= ఎందుకు?; మీ తండ్రిన్+తాతలన్= మీ తండ్రి తాతలను; పూర్వులన్= మీ పూర్వికులను; తలఁపనే= గుర్తుకు తెచ్చుకోవా? ధర్మంబునన్+పోఁగదే= ధర్మమార్గంలో వెళ్ళవా?

**తా :** అయ్యా! సూర్యవంశీయులైన మీకు బ్రాహ్మణుడు దైవసమానుడవుతాడని అంటారు. ఆ పలుకులు ఏమైనాయి? మీ బోటి సాధువులు బ్రాహ్మణ గోహత్యలకు ఇష్టపడతారా? ఇంత రాక్షసత్వం ఎందుకు? ఒకసారి మీ తండ్రులను తాతలను, పూర్వికులను గుర్తుకు తెచ్చుకో. ధర్మంగా ప్రవర్తించు.

**విశే :** ప్రసిద్ధమైన వంశం పేరు చెపితే ఈ క్రూరకార్యం మానతాడని ఆమె ఆశ. వాళ్ల పూర్వికులను గుర్తుకు తెచ్చుకోమంది. సూర్యవంశంలో మహానుభావులు జన్మించారు. ఒక్కొక్కరు ఒక్కో విషయంలో కీర్తి గడించారు కదా!

**శా. అన్నా! చెల్లెల నయ్యెదన్; విడువు నీకన్నంబు వెట్టింతు నా**
**హృన్నాథున్ ద్విజు గంగికుఱ్ఱ నకటా! హింసింప నేలయ్య? నీ**
**వెన్నం డింతులతోడఁ బుట్టవె? నిజం బిట్టైన మున్ముట్ట నా**
**పన్నన్ నన్ను శిరంబు ద్రుంచి మఱి మత్ప్రాణేశు భక్షింపవే. 246**

**ప్రతి :** అన్నా!; చెల్లెలను+అయ్యెదన్= నీకు చెల్లెలిని అవుతాను; విడువు= విడిచిపెట్టు; నీకు+అన్నంబున్+పెట్టింతున్= నీకు అన్నం పెట్టిస్తాను; నా హృత్+నాథున్= హృదయానికి నాథుడైన నా భర్తను; ద్విజున్= బ్రాహ్మణుని; గంగికుఱ్ఱ= గంగిగోవు దూడలాంటివాడిని; అకటా= అయ్యో; హింసింపన్+ఏల+అయ్య= ఎందుకు హింసిస్తావు; నీవు+ఎన్నండు= నీ వెప్పుడూ; ఇంతుల తోడన్+పుట్టవె?= ఆడతోడున పుట్టలేదా? ఇట్టు= ఇలా చంపటం; నిజంబు= సత్యమే; ఐనన్= అయితే; మున్+ముట్టన్= ముందుగా; ఆపన్నన్= దీనురాలిని; నన్ను; శిరంబున్+త్రుంచి= తల నరికి; మఱి= తరువాత; మత్ప్రాణ+ఈశున్= నా భర్తను; భక్షింపవే= భుజించు;

**తా :** అన్నా! నీకు చెల్లెలి నవుతాను. నా భర్తను వదులు. నీకు ఆహారాన్ని సమకూరుస్తాను. నా భర్త గంగిగోవు దూడలాంటివాడు. బ్రాహ్మణుడు. అతన్నెందుకు హింసిస్తావు? నీకు తోబుట్టువులు లేరా? నీవు చంపాలనే అనుకుంటే ముందు నా తలను ఖండించి తరువాత నా భర్తను భుజించు.

**క. అని కరుణ పుట్ట నాడుచు, వనితామణి పలవరింప వసుధాదేవుం**
**దినియె నతఁడు పులి పశువుం, దినుక్రియ శాపంబు కతన ధీరహితుండై. 247**

**ప్రతి :** అని కరుణపుట్టన్+ఆడుచు= అని జాలి కలిగేటట్లు మాట్లాడుతూ; వనితామణి= ఆ స్త్రీ రత్నం; పలవరింపన్= బతిమలాడగా; వసుధాదేవున్= ఆ భూదేవుని; అతఁడు= రాక్షసుడు; పులి పశువున్+తినుక్రియన్= పులి పశువును తినే పద్ధతిలో; శాపంబు కతనన్= శాప కారణంచేత; ధీరహితుండు+ఐ= బుద్ధిలేనివాడై; తినియెన్= భక్షించాడు;

**తా :** అని ఆమె జాలి కలిగేటట్లు బతిమలాడుతుండగా అతడు శాపవశాత్తు అవివేకుడై పులి జంతువును తినే పద్ధతిలో భక్షించాడు.

**విశే :** ఆమె అన్ని మాటలు చెప్పి బతిమలాడినా అవన్నీ వ్యర్థమయ్యాయి. అతడు అవివేకు డయ్యాడు. కారణం గురుశాపమే. పైగా గురువుకే ప్రతిశాప మిచ్చేందుకు సిద్ధపడ్డాడు. ఆ దోషంకూడ అనుభవించవలసి ఉంది గదా!

**వ. అంత నా బ్రాహ్మణి కోపించి కామార్తనైన నాదు పెనిమిటిని భక్షించితివి గావున, నీవు నెలంతలం బొందఁ జేరిన వేళ మరణంబును బొందు మని, కల్మాషపాదుని శపించి, పతిశల్యంబులతో నగ్ని ప్రవేశంబు సేసి సుగతికిం జనియె, నంతఁ బంద్రెండేండ్లు సనిన నా రాజు మునిశాపనిర్ముక్తుండై. 248**

**ప్రతి :** అంతన్= తరువాత; ఆ బ్రాహ్మణి= ఆ బ్రాహ్మణుని భార్య; కామ+ఆర్తను+ఐన= సంగమాభిలాషతో బాధపడుతున్నదాననైన; నాదు పెనిమిటిని= నా యొక్క భర్తను; భక్షించితివి+కావునన్= తిన్నావు కాబట్టి; నీవు; నెలంతలన్+పొందన్+చేరినవేళన్= నీవు స్త్రీలసాంగత్యానికి సిద్ధమైన సమయంలో; మరణంబును= మరణాన్ని; పొందుము+అని= పొందుతావని; కల్మాషపాదుని; శపించి; పతిశల్యంబులతోన్= భర్త ఎముకలతో; అగ్ని ప్రవేశంబు+చేసి= అగ్నిలో దుమికి; సుగతికిన్+చనియెన్= ఉత్తమ గతికి వెళ్ళింది; అంతన్= ఆ తరువాత; పంద్రెండు+ఏండ్లు= పన్నెండు సంవత్సరాలు; చనినన్= గడవగా; ఆరాజు; మునిశాప= ముని శాపంనుండి; నిర్ముక్తుండు+ఐ= బయటపడినవాడై;

**తా :** అపుడా బ్రాహ్మణుని భార్య కోపించి కామార్త నైన నా భర్తను భక్షించావు కాబట్టి నీవు స్త్రీసాంగత్యానికి సిద్ధపడ్డప్పుడు మరణిస్తావు అని కల్మాషపాదుని శపించి తన భర్త ఎముకలతో అగ్ని ప్రవేశం చేసి ఉత్తమగతిని పొందింది. పిమ్మట పంద్రెండేండ్లు గడిచాయి. ఆ రాజు శాపం తీరిపోయింది.

**ఆ. రతులకొఱకు భార్య రావింప నదియును, బెదరి విప్రసతి శపించు టెఱిఁగి**
**మగని నడ్డపెట్టి మైథునకర్మంబు, మాన్చె సతుల గోష్ఠి మానె నతఁడు. 249**

**ప్రతి :** రతులకొఱకున్= పొందులనుకోరి; భార్యన్+రావింపన్= భార్యను పిలువనంపగా; అదియును= ఆమెకూడా; విప్రసతి= బ్రాహ్మణి; శపించుట+ఎఱిగి= శపించడాన్ని తెలుసుకొని; బెదరి= భయపడి; మగనిన్+అడ్డపెట్టి= భర్తను అడ్డుకొని; మైథున కర్మంబున్+మాన్చెన్= సాంగత్యాన్ని మాన్పించింది; అతడు= అతడు; సతుల గోష్ఠిన్+మానెన్= స్త్రీ సాంగత్యాన్ని విడిచాడు.

**తా :** తరువాత అతడు పొందుకోరి భార్యను పిలువనంపగా, బ్రాహ్మణ స్త్రీశాపం తెలిసిన ఆమె భయపడి భర్తను వారించి మైథునకృత్యాన్ని మాన్పించింది. అప్పటినుండి అతడు స్త్రీసాంగత్యాన్ని మానుకున్నాడు.

**క. అది కారణముగఁ బుత్రా, భ్యుదయము లే దా సుదాసభూపాలునకున్**
**దదనుమతి న వ్వసిష్ఠుఁడు, మదయంతికిఁగడుపుసేసె మదన క్రీడన్. 250**

**ప్రతి :** అది కారణముగన్= ఆ శాపకారణంచేత; ఆ సుదాసభూపాలునకున్= సుదాస మహారాజుకు; పుత్ర+అభి+ఉదయము= మగసంతు కలుగుట; లేదు= లేకపోయింది; తద్+అనుమతిన్= ఆ సుదాసుని అనుజ్ఞతో; ఆ+వసిష్ఠుడు= ఆ వసిష్ఠమహర్షి; మదయంతికిన్= మదయంతికి; మదనక్రీడన్= రతిక్రీడతో; కడుపు+చేసెన్= గర్భం కలిగించాడు;

**తా :** ఆ కారణంచేత ఆ సుదాసునికి సంతానం లేకపోయింది. అతని కోరిక ప్రకారం వసిష్ఠుడు మదయంతికి గర్భం ప్రసాదించాడు.

**వ. ఇట్లు సుదాసుని భార్యయగు మదయంతి వసిష్ఠువలన గర్భిణియై యేడేండ్లు గర్భంబు ధరియించి, నీళ్ళాడ సంకటపడుచున్న వసిష్ఠుండు వాఁడియగు నశ్మమున నా గర్భంబుఁ జీరిన, నశ్మకుండను కుమారుండు పుట్టె, నతనికి మూలకుండు పుట్టె నతండు. 251**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సుదాసునిభార్య+అగు= సుదాసుని భార్యయైన; మదయంతి= మదయంతి; వసిష్ఠ వలనన్= వసిష్ఠుని వలన; గర్భిణి+ఐ= గర్భవతియై; ఏడు+ఏండ్లు= ఏడు వత్సరాలు; గర్భంబున్+ధరియించి= గర్భాన్ని ధరించి; నీళ్లు+ఆడన్= ప్రసవించటానికి; సంకటపడుచున్న= కష్టపడుతుంటే; వసిష్ఠుండు= వసిష్ఠముని; వాఁడి+అగు+అశ్మమునన్= పదునైన రాతితో; ఆ గర్భంబున్+చీరిన= ఆమె గర్భాన్ని చీల్చగా; అశ్మకుండు+అను= అశ్మకుడను; కుమారుండు+పుట్టెన్= కొడుకు పుట్టాడు; అతనికిన్= అతనికి (అశ్మకునకు); మూలకుండు+పుట్టెన్= మూలకుడు పుట్టాడు; అతండు= వాడు...

**తా :** ఇలా సుదాసుని భార్య మదయంతి వసిష్ఠుని వల్ల గర్భవతియై ఏడేండ్లు గర్భాన్ని ధరించి ప్రసవించడానికి కష్టపడుతుంటే వసిష్ఠుడు పదునైన రాతితో ఆమె గర్భాన్ని చీల్చగా అశ్మకుడనే కొడుకు పుట్టాడు. అతనికి మూలకుడు జన్మించాడు. అతడు

**క. వీరుఁడగు పరశురాముఁడు, ఘోరకుఠారమున నృపులఁగూలుచు వేళన్**
**నారీజనములు దాఁచిన, నారీకవచుండనంగ నరనుతి కెక్కెన్. 252**

**ప్రతి :** వీరుఁడు+అగు= పరాక్రమవంతుడైన; పరశురాముఁడు= పరశురాముడు; ఘోర= భయంకరమైన; కుఠారమునన్= గొడ్డలితో; నృపులన్+కూలుచువేళన్= రాజులను చంపే సమయంలో; నారీజనములు= స్త్రీ జనం; దాఁచినన్= అతని చుట్టూఉండి దాచి వుంచగా; నారీకవచుండు+అనంగన్= నారీకవచుడని; నరనుతికిన్+ఎక్కెన్= ప్రజల పొగడ్తలకెక్కాడు.

**తా :** వీరుడైన పరశురాముడు భయంకరమైన గండ్ర గొడ్డలితో రాజులను వధించే సమయంలో స్త్రీలు మూలకుని చుట్టూ ఉండి కాపాడడంవల్ల అతనికి నారీకవచుడని ప్రసిద్ధి కలిగింది.

**విశే :** నారీకవచుడంటే నారీజనం కవచంలా ఉండినవాడని భావం. స్త్రీలు కవచంగా ఉన్నందున వారి మధ్య ఉన్న రాజును గుర్తించలేక స్త్రీగా భావించాడు పరశురాముడు. అందువల్లే మూలకుడు రక్షింపబడ్డాడు.

**వ. ఆ నారీకవచుండు నిర్మూలం బయిన రవి వంశంబునకు మూలం బగుటం జేసి, మూలకుం డనఁ బరఁగె నా మూలకునకు విశ్వసహుండు పుట్టె. విశ్వసహునకు ఖట్వాంగుండు పుట్టి చక్రవర్తి యయ్యె నతండు. 253**

**ప్రతి :** ఆ నారీకవచుండు= ఆ నారీకవచుడు; నిర్మూలంబయిన= నాశనమైన; రవి వంశంబునకున్= సూర్యవంశానికి; మూలంబు+అగుటన్+చేసి= మూలం కావడంచేత; మూలకుండు+అనన్+పరగె= మూలకుడని ప్రసిద్ధి చెందాడు; ఆ మూలకునకున్= ఆ మూలకునికి; విశ్వసహుండు+పుట్టెన్= విశ్వసహుడు జన్మించాడు; విశ్వసహునకు= విశ్వసహునికి; ఖట్వాంగుండు+పుట్టి= ఖట్వాంగుడు జన్మించి; చక్రవర్తి+అయ్యెన్= చక్రవర్తి అయ్యాడు; అతండు= అతడు...

**తా :** ఆ నారీకవచుడు పరశురామునిచే నిర్మూలింపబడ్డ సూర్యవంశానికి మూలమైనందువల్ల మూలకుడని పేరు పొందాడు. ఆ మూలకునికి విశ్వసహుడు పుట్టాడు. విశ్వసహునికి ఖట్వాంగుడు జన్మించి చక్రవర్తి అయ్యాడు. అతడు

**సీ. అమరులు వేఁడిన నసురనాథులఁ జంపి త్రిదశులతోఁదన బ్రదుకు కాల**
**మెంతని యడిగిన 'నిదె నిండుచున్నది తడవులే దే మైన నడుగు' మనిన**

**వరములు గోరక వరవిమానం బెక్కి తనపురి కేతెంచి తత్త్వబుద్ధిఁ**
**బరమేశ్వరునియంద భావంబుఁ గీలించి కులదైవత ద్విజకులము కంటె**

**తే. నంగనాప్రాజ్యరాజ్యపుత్త్రాదు లెల్లఁ, గావు ప్రియములు; ధర్మంబు గడచి నాదు**
**మతి ప్రవర్తింప దెన్నఁడు మది నెఱుంగ, నన్య మా యీశ్వరునిఁదక్క ననుచు మఱియు. 254**

**ప్రతి :** అమరులు= దేవతలు; వేడినన్= ప్రార్థించగా; అసురనాథులన్= రాక్షసరాజులను; చంపి= సంహరించి; త్రిదశులతోన్= దేవతలతో; తనబ్రదుకు కాలము= తన ఆయుర్దాయం; ఎంత+అని+అడిగినన్= ఎంత అని అడగ్గా; ఇదె= త్వరలోనే నిండుచు+ఉన్నది= పూర్తవుతున్నది; తడవులేదు= ఎక్కువ సమయంలేదు; ఏమి+ఐనన్+అడుగుము= ఏదైనా వరంకోరుకో; అనినన్= అనగా; వరములున్= వరాలను; కోరక= కోరుకోకుండా; వరవిమానంబు+ఎక్కి= శ్రేష్ఠమైన విమానాన్నెక్కి; తనపురికిన్= తన నగరానికి; ఏతెంచి= వచ్చి; తత్త్వబుద్ధిన్= ఆధ్యాత్మికజ్ఞానంతో; పరమ+ఈశ్వరుని+అందు+అ= భగవానునియందే; భావంబున్+కీలించి= మనస్సును లగ్నంచేసి; కులదైవత= వంశదైవం; ద్విజకులము కంటెన్= బ్రాహ్మణ కులముకంటె; అంగనా ప్రాజ్యరాజ్యపుత్త్ర+ఆదులు= భార్య, గొప్పరాజ్యం, కొడుకులు మొదలైనవి; ప్రియములు+కావు= ఇష్టాలుకావు; నాదు+మతి= నా మనస్సు; ధర్మంబున్+కడచి= ధర్మాన్ని విడిచి; ఎన్నఁడు= ఎప్పుడు; ప్రవర్తింపదు= నడవదు; ఆ+ఈశ్వరునిన్+తక్క= ఆ పరమేశ్వరుని తప్ప; అన్యము= ఇతరాన్ని; మదిని+ఎఱుంగన్= మనసులో అనుకోను; అనుచు= అంటూ; మఱియు= ఇంకా...

**తా :** అతడు దేవతల ప్రార్థన మేరకు రాక్షసరాజులను చంపి, దేవతలతో తన ఆయుర్దాయమెంత? అని అడిగాడు. వారు 'ఇదిగో పూర్తవబోతుంది. ఎక్కువ సమయం కూడలేదు. ఏదైనా వరాన్ని కోరుకో' అన్నారు. అతడు వరాలు కోరుకోకుండా విమానమెక్కి తన నగరానికి వచ్చి అధ్యాత్మజ్ఞానంతో భగవంతునిపై మనసు లగ్నంచేసి, కులదైవం, బ్రాహ్మణులకంటె ఆలుబిడ్డలు, రాజ్యం నాకు ఇష్టమైనవి కావు. నా మనసు అధర్మంగా ప్రవర్తించదు. ఆ ఈశ్వరుని తప్ప మరొకటి తెలియదు' అంటూ ఇంకా

**విశే :** ఖట్వాంగుని ప్రస్తావన ప్రథమస్కంధంలో కూడా ఉంది. గోవిందనామ స్మరణచే ఆతడు రెండు ఘడియల్లో కైవల్యం పొందాడని చెప్పబడింది. పరమేశ్వరుడు తప్ప మరొకటి ఇష్టం కాదనడానికి ఆతని తత్త్వబుద్ధి కారణం. ఆ స్పృహచేతనే అశాశ్వతమైన వస్తువులజోలికి పోక, దేవతలను వరమడగకుండా వచ్చాడు. అతడు నిజమైన బ్రహ్మవేత్త.

**మ. ఇలమీఁదం బ్రతుకేల? వేల్పుల వరంబేలా? ధనంబేల? చం**
**చల గంధర్వపురీవిడంబనము లైశ్వర్యంబు లేలా? జగం**
**బులఁ బుట్టించు తలంపునం బ్రకృతితోఁబొత్తై తుదిం బాసి ని**
**ర్మలమై వాఙ్మనసామితంబగు పరబ్రహ్మంబు నేఁజెందెదన్. 255**

**ప్రతి :** ఇలమీఁదన్= భూమిపై; బ్రతుకు+ఏల= జీవనం ఎందుకు? వేల్పుల వరంబు+ఏలా?= దేవతల అనుగ్రహం (వరం) ఎందుకు? ధనంబు+ఏల= ధనమెందుకు? చంచల= అశాశ్వతమైన; గంధర్వపురీ విడంబనములు= గంధర్వ నగరాన్ని అనుకరించే; ఐశ్వర్యంబులు+ఏలా?= సంపదలెందుకు? జగంబులన్+పుట్టించు= లోకాల్ని సృష్టించే; తలపునన్= భావంతో; ప్రకృతితోన్+పొత్తై= ప్రకృతితో కలిసి; తుదిన్+పాసి= చివరకు వదలిపెట్టి; నిర్మలమై= పరిశుద్ధమై;

వాక్+మనసా+అమితంబు+అగు= మాటకు, మనసుకు అందనిదైన; పరబ్రహ్మంబున్= ఆ భగవంతుని; నేన్+చెందెదన్= నేను పొందుతాను.

**తా :** భూమిపై ఈ బ్రతుకెందుకు? దేవతల వరాలెందుకు? ధనమెందుకు? అస్థిరమైన గంధర్వనగరాన్ని పోలిన సంపదలెందుకు? లోకాలను సృష్టించడంకోసం ప్రకృతితో పొత్తుపెట్టుకొని, చివరకు దాన్ని కూడా వదలి పరిశుద్ధమై, వాక్కుకు, మనసుకు అందని ఆ భగవతత్త్వాన్ని నేను పొందుతాను.

**వ. అని నిశ్చయించి. 256**

**మ. కలసెన్ సంగము లెల్లఁ బాసి నియతిన్ ఖట్వాంగుఁ డశ్రాంతమై**
**కల దయ్యున్ మఱి మీఁద లే దనెడిదై కల్యాణమై యాత్మలోఁ**
**దలఁపంబల్కఁగ రానిదై పరమమై తత్త్వజ్ఞు లూహించి హృ**
**జ్జలజాతంబుల వాసుదేవుఁడని సంస్థాపించు నా బ్రహ్మమున్. 257**

**ప్రతి :** అని నిశ్చయించి= అని నిర్ణయించి; ఖట్వాంగుఁడు= ఖట్వాంగ మహారాజు; సంగములెల్లన్+పాసి= బంధాలను అన్నిటిని వదలి; నియతిన్= నిష్ఠతో; అశ్రాంతము+ఐ= ఎల్లప్పుడును; కలదు+అయ్యున్= ఉండికూడా; మఱి మీఁదలేదు= లేదని; అనెడిది+ఐ= అనేటటువంటిదై; కల్యాణము+ఐ= శుభకరమైనదై; ఆత్మలోన్+తలఁపన్= మనస్సులో భావించటానికి; పల్కఁగరానిది+ఐ= మాటలలో చెప్పటానికి వీలుకానిదై; పరమము+ఐ= శ్రేష్ఠమై; తత్త్వజ్ఞులు+ఊహించి= బ్రహ్మవేత్తలు భావనచేసి; హృత్+జలజాతంబులన్= మనఃపద్మాల్లో; వాసుదేవుడు+అని= విష్ణువని; సంస్థాపించు= నిలబెట్టుకొనేది అయిన; ఆ బ్రహ్మమున్= ఆ పరబ్రహ్మంలో; కలసెన్= లీనమయ్యాడు.

**తా :** అని నిర్ణయించుకొని ఖట్వాంగుడు బంధాలను తెంచుకొని దీక్షతో అశ్రాంతమై ఉండికూడ లేనిదనిపించేది, శుభకరమైనది, మాటలలో చెప్పడానికి వీలుకానిది, తత్త్వవేత్తలు వాసుదేవుడని మనసులో స్థాపించుకొనేది అయిన పరబ్రహ్మలో లీనమయ్యాడు.

**వ. అట్టి ఖట్వాంగునకు దీర్ఘబాహుండు, దీర్ఘ బాహువునకు రఘువు, రఘువునకుఁ బృథుశ్రవుండుఁ, బృథుశ్రవునకు నజుండు, నజునకు దశరథుండును బుట్టి; రా దశరథునకు సుర ప్రార్థితుండై పరబ్రహ్మమయుండైన హరి నాల్గువిధంబులై శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్ను నామంబుల నిజాంశ సంభూతుండై జన్మించెఁ; దచ్చరిత్రంబు వాల్మీకి ప్రముఖులైన మునులచేత వర్ణితంబైనది; యైననుంజెప్పెద; సావధానమనస్కుండవై యాకర్ణింపుము. 258**

**ప్రతి :** అట్టి ఖట్వాంగునకున్= అటువంటి ఖట్వాంగునికి; దీర్ఘబాహుండు= దీర్ఘబాహుడు; దీర్ఘబాహువునకు= దీర్ఘబాహువుకు; రఘువు= రఘువు; రఘువునకున్= రఘువుకు; పృథుశ్రవుండున్= పృథుశ్రవుడూ; పృథుశ్రవునకున్= పృథుశ్రవునికి; అజుండున్= అజుడూ; అజునకు= అజునికి; దశరథుండునున్+పుట్టిరి= దశరథుడూ జన్మించాడు; ఆ దశరథునికి= ఆ దశరథునికి; సురప్రార్థితుండు+ఐ= దేవతలచేత ప్రార్థింపబడి; పరబ్రహ్మమయుండు+ఐన= పరబ్రహ్మస్వరూపమైన; హరి= విష్ణువు; నాల్గువిధంబులు+ఐ= నాలుగు విధాలుగా; శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్ను నామంబులన్= శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులను పేర్లతో; నిజ+అంశ= తన అంశమునుండి; సంభూతుండు+ఐ= కలిగి; జన్మించెన్=

పుట్టాడు; తత్+చరితంబు= ఆ చరిత్ర; వాల్మీకి ప్రముఖులు+ఐన= వాల్మీకి మొదలైన; మునులచేత= మహర్షులచేత; వర్ణితంబు+ఐనది= వివరింపబడింది; ఐననున్+చెప్పెదన్= ఐనా చెప్తాను; స+అవధాన మనస్కుండవు+ఐ= ఏకాగ్ర చిత్తముతో; ఆకర్ణింపుము= విను.

**తా :** అటువంటి ఖట్వాంగునికి దీర్ఘబాహుడు, దీర్ఘబాహునికి రఘువు, రఘువునకు పృథుశ్రవుడు, పృథుశ్రవునికి అజుడు, అజునికి దశరథుడు పుట్టారు. ఆ దశరథునికి దేవతల ప్రార్థనచే సాక్షాత్తు పరబ్రహ్మమైన శ్రీహరి తన అంశంతో నాలుగు విధాలుగా శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులనే పేర్లతో జన్మించాడు. ఆయన చరిత్రను వాల్మీకి మొదలైన ఋషులు వర్ణించారు. ఐనా చెపుతాను. శ్రద్ధగా విను.

## ❖ శ్రీరామచరిత్ర ❖

**మ. అమరేంద్రాశకుఁబూర్ణచంద్రుఁడుదితుండైనట్లు నారాయణాం**
**శమునంబుట్టె మదాంధరావణశిరస్సంఘాతసంఛేదన**
**క్రమణోద్దాముఁడు రాముఁ డా గరితకుంగౌసల్యకున్ సన్నుతా**
**సమనైర్మల్యకతుల్య కంచితజనుస్సంసారసాఫల్యకున్. 259**

**అవ :** పోతనగారు భాగవతాన్ని శ్రీరామచంద్రుని కంకితం చేశాడు. ఈషదున్మీలిత ధ్యానలోచనుడైన ఆయనకు రాముడు సాక్షాత్కరించాడు. స్కంధాది పద్యాల్లో శ్రీరామునే ఆయన స్తోత్రం చేశాడు. అటువంటి భగవదవతారమూర్తి శ్రీరాముని చరిత్ర ఈ స్కంధంలో చెప్పబడుతోంది. దాదాపు నూట ఆరు పద్యాల్లో సంక్షేపంగా రామాయణ కథనం సాగింది. అనుప్రాసగుంభిత రచన ఈ చిన్న కావ్యానికి శోభ నిచ్చింది. ప్రతిపాత్రకు, విషయానికి అనుప్రాస అలంకారమైంది.

**ప్రతి :** అమర+ఇంద్ర+ఆశకున్= దేవేంద్రుని దిక్కు (తూర్పు)కు; పూర్ణచంద్రుఁడు= నిండు చంద్రుడు; ఉదితుండు+ఐన+అట్లు= ఉదయించిన విధంగా; మద+అంధ= గర్వాంధుడైన; రావణ= రావణుని యొక్క; శిరస్+సంఘాత= తలల గుంపును; సంఛేదన= పూర్తిగా ఖండించడంకోసం; క్రమణ+ఉద్దాముడు= అడుగువేయడంలో అడ్డులేనివాడు; రాముఁడు= శ్రీరాముడు; నారాయణ+అంశమునన్= మహావిష్ణువు అంశలో; సత్+నుత= పొగడదగిన; అసమ= సాటిలేని; నైర్మల్యకున్= నిర్మలత్వం కలదానికి; అతుల్యకున్= సాటిలేనిదానికి; అంచిత= పూజింపదగిన; జనుస్= పుట్టుకల; సంసార= జనన మరణచక్రం నుంచి; సాఫల్యకున్= ఫలాన్ని పొందినది అయిన; ఆ గరితకున్, కౌసల్యకున్= సాధ్విఅయిన ఆ కౌసల్యాదేవికి; పుట్టెన్= జన్మించాడు;

**తా :** తూర్పున నిండుచంద్రుడు ఉదయించినట్లు, గర్వాంధుడైన రావణుని తలలను ఖండించడంలో నేర్పరి అయిన శ్రీరాముడు నారాయణుని అంశతో, అసమాన నిర్మలత్వంలో సాటిలేని సాధ్వీరత్నం, జనన మరణ సంసారచక్రంనుండి సాఫల్యం పొందిన కౌసల్యాదేవికి జన్మించాడు.

**మ. సవరక్షార్థము దండ్రి పంపఁజని విశ్వామిత్రుఁడుందోడ రా**
**నవలీలం దునుమాడె రాముఁ డదయుండై బాలుఁడై కుంతల**
**చ్ఛవిసంపజ్జితహాటకం గపటభాషావిస్ఫురన్నాటకన్**
**జవభిన్నార్యమఘోటకం గరవిరాజత్ఖేటకం దాటకన్. 260**

**ప్రతి :** సవరక్ష+అర్థమున్= యాగ రక్షణార్థము; తండ్రి పంపన్+చని= తండ్రి పంపగా వెళ్ళి; విశ్వామిత్రుఁడున్+తోడరాన్= విశ్వామిత్రమహర్షి తోడురాగా; రాముఁడు= శ్రీరాముడు; బాలుడు+ఐ= పిన్న వయస్కుడై; అదయుండు+ఐ= దయలేనివాడై; కుంతలచ్ఛవి= కేశకాంతి; సంపత్+జితహాటకన్= సంపదతో బంగారును జయించేది; కపటభాషావిస్ఫురత్+నాటకన్= మోసపు మాటలతో తెలియబడే నటన కలిగింది; జవభిన్న+అర్యమఘోటకన్= వేగంలో సూర్యరథాశ్వాలను జయించకలిగింది; కరవిరాజత్= చేతిలో ప్రకాశించే; ఖేటకన్= డాలు కలిగింది (అయిన); తాటకన్= తాటక అనే రాక్షసిని; అవలీలన్= సునాయాసంగా; తునుమాడెన్= సంహరించాడు.

**తా :** యాగరక్షణకోసం తండ్రి పంపగా విశ్వామిత్రుని వెంటవెళ్ళి బాలుడైన రాముడు ఎంతమాత్రం దయతలచక బంగారువర్ణ కేశకాంతి కలిగి, మోసపు మాటలతో నటిస్తూ, సూర్యరథాశ్వాల వేగంకల, చేతిలో ఆయుధమున్న తాటకను చంపాడు.

**క. గారామునఁ గౌశికమఖ, మా రాముఁడు గాచి దైత్యు నధికు సుబాహున్**
**ఘోరాజిఁ ద్రుంచి తోలెను, మారీచు న్నీచుఁగపటమంజులరోచున్. 261**

**ప్రతి :** ఆ రాముఁడు= అట్టి శ్రీరాముడు; కౌశికమఖమున్= విశ్వామిత్రుని యాగాన్ని; గారామునన్= గౌరవంతో; కాచి= రక్షించి; ఘోర+ఆజిన్= భయంకర యుద్ధంలో; అధికున్= గొప్పవాడిని; దైత్యున్= రాక్షసుడు అయిన; సుబాహున్= సుబాహుని; త్రుంచి= చంపి; నీచున్= హీనుడైన; కపట= మోసపూరితమైన; మంజులరోచున్= మనోజ్ఞమైన కాంతికలవాడైన; మారీచున్= మారీచుని; తోలెను= పారిపోయేట్లు చేశాడు.

**తా :** ఆ రాముడు విశ్వామిత్రుని యాగాన్ని కాపాడేందుకు యుద్ధంలో సుబాహుడనే రాక్షసుని చంపి, కపటమూ మంజులమైన కాంతిగల నీచుడైన మారీచుణ్ణి పారద్రోలాడు.

**మ. ఒక మున్నూఱు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షుచాపంబు బా**
**లకరీంద్రంబు సులీలమైఁ జెఱకుఁగోలం ద్రుంచు చందంబునన్**
**సకలోర్వీశులుఁజూడఁగా విఱిచె దోశ్శక్తిన్ విదేహక్షమా**
**పక గేహంబున సీతకై గుణమణిప్రస్ఫీతకై లీలతోన్. 262**

**ప్రతి :** గుణమణి ప్రస్ఫీతకై= గుణాలనే మణులప్రోవైన; సీతకై= సీతకోసం; విదేహక్షమాపక= విదేహరాజైన జనకుని; గేహంబునన్= ఇంటిలో; ఒక మున్నూఱు= ఒక మూడు వందలమంది; కదల్చి తెచ్చిన= కదలించి తెచ్చిన; లలాట+ఉగ్ర+అక్షు= నుదిటియందు భయంకరమైన కన్నుకల శివుని; చాపంబున్= ధనుస్సును; బాలకరి+ఇంద్రము= శ్రేష్ఠమైన చిన్న ఏనుగు; సులీలమై= హేలగా; చెఱకున్+కోలన్= చెరకుగడను; త్రుంచు చందంబునన్= విరిచిన విధంగా; సకల+ఉర్వి+ఈశులు= భూపతులందరు; చూడఁగాన్= చూచుచుండగా; దోస్+శక్తిన్= భుజబలంతో; లీలతోన్= సునాయాసంగా; విఱిచెన్= విఱిచాడు.

**తా :** సుగుణాల ప్రోవైన సీతకోసం ఆ రాముడు జనకరాజన్యుని ఇంటిలో మూడు వందల మంది కదలించి తెచ్చిన శివుని చాపాన్ని చిన్నఏనుగు చెరుకుగడను విరిచినట్లు భుజబలంతో సునాయాసంగా విరిచాడు.

**క. భూతలనాథుఁడు రాముఁడు, ప్రీతుండై పెండ్లి యాడెఁ బృథుగుణమణి సం**
**ఘూతన్ భాగ్యోపేతన్, సీతన్ ముఖకాంతివిజిత సితఖద్యోతన్. 263**

**ప్రతి :** భూతలనాథుఁడు= భూనాయకుడైన; రాముఁడు= శ్రీరాముడు; ప్రీతుండు+ఐ= సంతోషంతో కూడినవాడై; పృథుగుణమణి సంఘాతన్= గొప్పవియైన గుణాలనే మణుల సమూహం కలిగింది; భాగ్య+ఉపేతన్= అదృష్టంతో కూడినది; ముఖకాంతి= తన ముఖ తేజస్సుచేత; విజిత= జయించిన; సిత= తెల్లని; ఖద్యోతన్= చంద్రుని కలిగింది అయిన; సీతన్= సీతాదేవిని; పెండ్లి+ఆడెన్= వివాహమాడాడు.

**తా :** భూనాయకుడైన రామచంద్రుడు గుణవంతురాలు, అదృష్టవంతురాలు, చంద్రునికంటె అధికమైన ముఖతేజస్సు కలిగిన సీతాదేవిని ప్రీతితో పెండ్లాడాడు.

**క. రాముఁడు నిజబాహుబల, స్థేమంబున భంగపఱిచె దీర్ఘకుఠారో**
**ద్దామున్ విదళీకృతనృప, భామున్ రణరంగభీము భార్గవరామున్. 264**

**ప్రతి :** రాముఁడు= శ్రీరాముడు; నిజ= తన; బాహుబల= భుజబలంయొక్క; స్థేమంబునన్= శక్తితో; దీర్ఘకుఠార+ఉద్దామున్= పెద్ద గండ్రగొడ్డలి కలవాడు; విదళీకృత= చెల్లాచెదరు చేసిన; నృపభామున్= రాజుల తేజస్సు కలవాడు; రణరంగభీమున్= యుద్ధరంగాల్లో భయంకరుడు; భార్గవరామున్= పరశురాముని; భంగపఱచెన్= ఓడించాడు.

**తా :** శ్రీరాముడు తన భుజబలంతో గండ్రగొడ్డలి కలిగిన గండరగండడు, రాజుల తేజస్సును రూపుమాపినవాడు, రణరంగ భయంకరుడు అయిన పరశురాముని ఓడించాడు.

**క. దశరథుడు మున్ను గైకకు, వశుఁడై తా నిచ్చినట్టి వరము కతన వా**
**గ్దశ చెడక యడవి కనిచెను, దశముఖముఖకమలతుహినధామున్ రామున్. 265**

**ప్రతి :** దశరథుఁడు= దశరథుడు; మున్ను= పూర్వం; కైకకు+వశుఁడు+ఐ= కైకకు స్వాధీనుడై; తాను+ఇచ్చిన+అట్టి= తాను ఇచ్చిన; వరము కతనన్= వరకారణంచేత; వాక్+దశ చెడక= మాటతప్పక; దశముఖ= పదితలలు కల రావణుని; ముఖకమల= ముఖమనే కమలాలకు; తుహినధామున్= చంద్రుని వంటివాడగు; రామున్= శ్రీరాముని; అడవికి+అనిచెను= అరణ్యానికి పంపాడు.

**తా :** దశరథుడు పూర్వం తాను కైకకు ఇచ్చిన వరాల కారణంచేత, మాట తప్పకుండా రావణుని ముఖ కమలాలకు చంద్రుడైన రాముని అడవికి పంపాడు.

**విశే :** కమలానికి సూర్యుడు మిత్రుడు, చంద్రుడు శత్రువు. రావణుని ముఖకమలానికి రాముడు చంద్రుడు. అనగా శత్రువని అర్థం.

**క. జనకుఁడు పనిచిన మేలని, జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్**
**జనపతి రాముఁడు విడిచెను, జనపాలారాధ్య ద్విషదసాధ్య నయోధ్యన్. 266**

**ప్రతి :** జనకుఁడు= తండ్రి; పనిచిన= పంపగా; మేలు+అని= మంచిదని; జనకజయును= సీతాదేవియు; లక్ష్మణుండు= లక్ష్మణుడు; సంసేవింపన్= సేవిస్తుండగా; జనపతి= రాజైన; రాముఁడు= శ్రీరాముడు; జనపాల+ఆరాధ్యన్= రాజులచే పూజింపబడేది; ద్విషద్+అసాధ్య= శత్రువులకు అసాధ్యమైంది అయిన; అయోధ్యన్= అయోధ్యానగరాన్ని; విడిచెను= వదలిపెట్టాడు.

**తా :** తండ్రి ఆజ్ఞను పాటించి శ్రీరాముడు రాజులకు పూజనీయమై శత్రువులకు దుర్భేద్యమైన అయోధ్యానగరాన్ని విడిచి వెళ్లాడు.

**క. భరతున్ నిజపదసేవా, నిరతున్ రాజ్యమున నునిచి నృపమణి యెక్కెన్**
**సురుచిర రుచిపరిభావిత, గురుగోత్రాచలముఁ జిత్రకూటాచలమున్. 267**

**ప్రతి :** నృపమణి= రాజశ్రేష్ఠుడైన రాముడు; నిజపద= తన పాదాలను; సేవానిరతున్= సేవించటంలో ఆసక్తిగల; భరతున్= భరతుని; రాజ్యమునన్+ఉనిచి= రాజ్యంలో ఉంచి; సురుచిరరుచి= సుందర కాంతులతో; పరిభావిత= అవమానింపబడి; గురు= గొప్పదియైన; గోత్ర+అచలమున్= కులపర్వతమైన; చిత్రకూట+అచలమున్= చిత్రకూట పర్వతాన్ని; ఎక్కెన్= అధిరోహించాడు.

**తా :** రాజశ్రేష్ఠుడైన రాముడు నిజసేవానిరతుడైన భరతుని రాజ్యంలో ఉంచి కులపర్వతాన్ని అవమానించగల సుందరమైనకాంతులతో విరాజిల్లే చిత్రకూటపర్వతాన్ని అధిరోహించాడు.

**ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁడట వోయి ముదంబునఁగాంచె దండకా**
**రణ్యముఁ దాపసోత్తము శరణ్యము నుద్ధతబర్హిబర్హ లా**
**వణ్యము గౌతమీవిమల వాఃకణపర్యటనప్రభూత సా**
**ద్గుణ్యము నుల్లసత్తరునికుంజవరేణ్యము నగ్రగణ్యమున్. 268**

**ప్రతి :** పుణ్యుఁడు= పుణ్యాత్ముడైన; రామచంద్రుఁడు+అటన్+పోయి= రామచంద్రుడు ఆ విధంగా వెళ్ళి; తాపస+ఉత్తము= మునిశ్రేష్ఠులకు; శరణ్యమున్= తప్పనిసరి అయిందీ; ఉద్ధత= గొప్పనైన; బర్హిబర్హ= పింఛాలు కలిగిన నెమళ్ళయొక్క; లావణ్యమున్= శోభ కలది; గౌతమీ= గోదావరియొక్క; విమల= స్వచ్ఛమైన వాఃకణ= నీటి తుంపురుల; పర్యటన= ప్రసారంచేత; ప్రభూత= పుట్టిన; సాద్గుణ్యము= మంచి గుణాలు కలది; ఉల్లసత్= ప్రకాశమానమైన; తరు= చెట్లతోను, నికుంజవరేణ్యమున్= పొదరిండ్లతోను శ్రేష్ఠమైంది; అగ్రగణ్యమున్= విశిష్టమైనది అయిన; దండక+అరణ్యమున్= దండకమనే పేరుగల అడవిని; ముదంబునన్= సంతోషంతో; కాంచెన్= దర్శించాడు.

**తా :** పుణ్యాత్ముడైన రామచంద్రుడు ఆవిధంగా వెళ్ళి ఋషులకు శరణ్యము, గొప్ప పింఛాలు కలిగిన ఆడునెమళ్ళ శోభ కలది, గోదావరి నది నీటి తుంపురులచేత పుట్టిన ఆహ్లాదము కలది, గొప్ప చెట్లతో పొదరిండ్లతో కూడినదైన దండకమనే పేరుగల అడవిని సంతోషంగా చూశాడు.

**సీ. ఆ వనంబున రాముఁడనుజసమేతుఁడై, సతితోడ నొక పర్ణశాల నుండ**
**రావణు చెల్లెలు రతిఁగోరి వచ్చిన మొగి లక్ష్మణుఁడు దాని ముక్కు గోయ**
**నది విని ఖరదూషణాదులు పదునాల్గు వేవురు రా రామవిభుఁడు కలన**
**బాణానలంబున భస్మంబు గావింప జనకనందన మేని చక్కఁదనము**

**తే. విని దశగ్రీవుఁ డంగజ వివశుఁడగుచు, నర్థిఁబంచిన బసిఁడిఱ్ఱి యై నటించు**
**నీచు మారీచు రాముఁడు నెఱి వధించె, నంతలో సీతఁగొనిపోయె నసురవిభుఁడు. 269**

**ప్రతి :** ఆ వనంబునన్= ఆ అరణ్యంలో; రాముఁడు; అనుజ సమేతుఁడు+ఐ= సోదరునితో కలిసి; సతితోడన్= భార్యతో; ఒక పర్ణశాలన్+ఉండన్= ఒక కుటీరంలో ఉండగా; రావణు చెల్లెలు= రావణుని సోదరి; రతిన్+కోరివచ్చినన్= కామించి రాగా; మొగిన్= పూనికతో; లక్ష్మణుఁడు= లక్ష్మణుడు; దాని ముక్కున్+కోయన్= దాని ముక్కును ఖండించగా; అది విని= ఆ విషయాన్ని విన్న; ఖరదూషణ+ఆదులు= ఖరుడు, దూషణుడు మొదలైనవారు; పదునాల్గు వేవురురాన్= పద్నాలుగు వేలమంది రాగా; రామవిభుఁడు= రామచంద్రుడు; కలనన్= యుద్ధంలో; బాణ+అనలంబునన్= బాణాగ్నిలో; భస్మంబు+కావింపన్= బూడిద చేయగా; జనకనందన మేని= సీత శరీంయొక్క; చక్కఁదనము= అందం; విని; దశగ్రీవుఁడు= రావణుడు; అంగజ వివశుఁడు+అగుచున్= మన్మథపరవశుడవుతూ; అర్థిన్+పంచినన్= కోరికతో పంపగా; పసిఁడి+ఇఱ్ఱి+ఐ= బంగారు జింకై; నటించు= మోసగించు; నీచున్+మారీచున్= దుష్టుడైన మారీచుని; రాముఁడు= శ్రీరాముడు; నెఱిన్+వధించెన్= సంహరించాడు; అంతలోన్= ఆ లోగా; అసురవిభుడు= రాక్షసరాజు రావణుడు; సీతన్+కొనిపోయెన్= సీతను అపహరించుకొని పోయాడు;

**తా :** ఆ అడవిలో రాముడు తమ్ముడితో, భార్యతో ఒక కుటీరంలో ఉండగా, రావణుని చెల్లెలైన శూర్పణఖ రాముని కామించి వచ్చింది. అపుడు లక్ష్మణుడు ఆమె ముక్కును కోయగా, అది విన్న ఖరదూషణాదులు పద్నాలుగు వేలమంది రాక్షసులు వచ్చారు. రాముడు వారి నందరిని యుద్ధంలో తన బాణాగ్నితో భస్మం చేశాడు. సీతాదేవి చక్కదనాన్ని విన్న రావణుడు మన్మథపరవశుడై మారీచుని పంపాడు. వాడు బంగారు లేడిగా కపటవేషాన్ని ధరించి రాగా రాముడు వాణ్ణి వధించాడు. ఆ సమయంలో రావణుడు సీతను అపహరించుకొని వెళ్ళాడు.

**ఉ. ఆ యసురేశ్వరుండు వడి నంబరవీథి నిలాతనూజ న**
**న్యాయము సేసి నిష్కరుణుఁడై కొనిపోవఁగ నడ్డమైన ఘో**
**రాయతహేతిఁద్రుంచె నసహాయత రామనరేంద్రకార్యద**
**త్తాయువుఁబక్షవేగపరిహాసితవాయువు న జ్జటాయువున్. 270**

**ప్రతి :** ఆ+అసుర+ఈశ్వరుండు= ఆ రాక్షస నాయకుడు; వడిన్= వేగంగా; అంబర వీథిన్= ఆకాశమార్గంలో; ఇలాతనూజన్= భూసుతను; అన్యాయము+చేసి= అధర్మంచేసి; నిష్కరుణుఁడు+ఐ= దయావిహీనుడై; కొనిపోవఁగన్= తీసుకుపోతుండగా; అడ్డమైన= అడ్డుపడ్డ; అసహాయత= ఒంటరిగా; రామ నర+ఇంద్ర కార్య= పురుషోత్తముడైన రామునికార్యం కోసం; దత్త+ఆయువున్= ప్రసాదింపబడిన ఆయుస్సు కలవాడు; పక్షవేగ= రెక్కల వేగంచేత; పరిహాసిత= అపహసించే; వాయువున్= వాయువు కలవాడు; ఆ జటాయువు= ఆ జటాయువును; ఘోర+ఆయతహేతిన్= భయంకరమైన కత్తితో; త్రుంచెన్= ఖండించాడు.

**తా :** ఆ విధంగా రావణుడు ఆకాశమార్గంలో సీతాదేవిని అధర్మంగా దయావిహీనుడై తీసుకొని పోతున్నాడు. అపుడు అసహాయుడైన రామకార్యం కోసమే ప్రసాదింపబడిన ఆయుస్సు కలవాడు, గాలికంటె వేగంకలవాడు అయిన జటాయువు అడ్డగించాడు. రావణుడు అప్పుడు కఠోరమైన కత్తితో జటాయువును ఖండించాడు.

**విశే :** 'అన్యాయముసేసి' అనడంలో అధర్మంగా అపహరించాడని భావం. దత్తాయువు అనడంలో రామకార్యం కోసమే ఆయువు కలవాడని అర్థం. గాలిని మించిన వేగవంతుడు కాబట్టే ఆకాశంలో వెళ్ళే రావణుని అనుసరించగలిగాడు.

**వ. అంత నా రామచంద్రుండు లక్ష్మణసహితుండై, సీత వెదక నరుదెంచి, నిజకార్యనిహతుండైన జటాయువునకుం బరలోక క్రియలు గావించి ఋశ్యమూకంబునకుం జని. 271**

**ప్రతి :** అంతన్= అంతట; ఆ రామచంద్రుండు; సీతన్= సీతను; వెదకన్= అన్వేషించడానికి; అరుదెంచి= వచ్చి; లక్ష్మణ సహితుండు+ఐ= లక్ష్మణునితో కలిసి; నిజకార్యనిహతుండు+ఐన= తన పనికోసం మరణించిన; జటాయువునకున్= జటాయువుకు; పరలోక క్రియలు= ఉత్తర క్రియలు; కావించి= చేసి; ఋశ్యమూకంబునకున్= ఋశ్యమూకమనే పర్వతానికి; చని= వెళ్ళి...

**తా :** అపుడు ఆ రామచంద్రుడు లక్ష్మణునితో కలిసి, సీతను వెదుకుతూ, తన పనికోసం ప్రాణాలర్పించిన జటాయువునకు సంస్కారాదులు చేసి, ఋశ్యమూక పర్వతానికి వెళ్ళి

**క. నిగ్రహము నీకు వల దింక, నగ్రజు వాలిన్ వధింతు నని నియమముతో**
**నగ్రేసరుగా నేలెను, సుగ్రీవున్ చరణఘాతచూర్ణగ్రావున్. 272**

**ప్రతి :** ఇంకన్= ఇకమీద; నీకున్= నీకు; నిగ్రహము వలదు= నిర్బంధం అవసరంలేదు; అగ్రజు= సోదరుడైన; వాలిన్ వధింతున్+అని= వాలిని చంపుతాను అని; నియమముతోన్= ధర్మబద్ధంగా; చరణఘాత= పాదాల రాపిడి చేతనే; చూర్ణగ్రావున్= కొండను పిండి చేయగల; సుగ్రీవున్= సుగ్రీవుని; అగ్రేసరుగాన్+ఏలెను= ముఖ్యునిగా స్వీకరించాడు.

**తా :** 'ఇక మీదట నీకు నిర్బంధం అక్కర లేదు. మీ అన్న వాలిని చంపుతాను' అని ధర్మబద్ధంగా పాదాలరాపిడి చేతనే కొండలను పిండి చేయగల సుగ్రీవుని ముఖ్యునిగా స్వీకరించాడు.

**క. లీలన్ రామవిభుండొక, కోలం గూలంగ నేసె గురు నయశాలిన్**
**శీలిన్ సేవితశూలిన్, మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మూలిన్. 273**

**ప్రతి :** రామవిభుండు= శ్రీరాముడు; లీలన్= విలాసంగా; ఒక కోలన్= ఒక్క బాణంతో; గురునయశాలిన్= గొప్ప నీతివేత్తను; శీలిన్= మంచి స్వభావం కలవానిని; సేవితశూలిన్= ఈశ్వరుణ్ణి సేవించేవానిని; మాలిన్= మాలను ధరించినవానిని; దశ+ఆస్యమాన+ఉన్మూలిన్= రావణుని గర్వాన్ని హరించినవాడు అయిన; వాలిన్= వాలిని; కూలంగన్+ఏసెన్= కూల్చివేశాడు.

**తా :** గొప్ప నీతిశాలి, మంచిశీలం కలవాడు; ఈశ్వర సేవకుడు, ఇంద్రుడిచ్చిన వరమాలను ధరించినవాడు, రావణ గర్వ భంజకుడు అయిన వాలిని, శ్రీరాముడు ఒకే బాణంతో కూల్చి వేశాడు.

**క. ఇలమీఁద సీత వెదకఁగ, నలఘుఁడు రాఘవుఁడు పనిచె హనుమంతు నతి**
**చ్ఛలవంతున్ మతిమంతున్, బలవంతున్ శౌర్యవంతుఁ బ్రాభవవంతున్. 274**

**ప్రతి :** అలఘుడు= గొప్పవాడైన; రాఘవుఁడు= శ్రీరాముడు; ఇలమీఁదన్= భూమిపై; సీతన్+వెదకఁగన్= సీతను వెదకటానికి; అతిచ్ఛలవంతున్= అతివేగవంతుడు; మతిమంతున్= బుద్ధిమంతుడు; బలవంతున్= శక్తిమంతుడు; శౌర్యవంతున్= పరాక్రమవంతుడు; ప్రాభవవంతున్= వైభవోపేతుడు అయిన; హనుమంతున్= హనుమంతుని; పనిచెన్= పంపాడు.

**తా :** మహానుభావుడైన శ్రీరాముడు భూమి మీద సీతను వెదకటానికి వేగవంతుడు, బుద్ధిమంతుడు, శక్తిమంతుడు, సుగుణవంతుడు అయిన హనుమంతుని పంపాడు.

**క. అలవాటు కలిమి మారుతి, లలితామితలాఘవమున లంఘించెను శై**
**వలినీగణసంబంధిన్, జలపూరితధరణిగగనసంధిన్ గంధిన్. 275**

**ప్రతి :** మారుతి= హనుమంతుడు; శైవలినీగణ= నదుల సమూహానికి; సంబంధిన్= బంధువూ; జలపూరిత= నీటిచేత పూరింపబడిన; ధరణి, గగనసంధిన్= భూమ్యాకాశాల మధ్యభాగం కలిగిందీ; కంధిన్= సముద్రాన్ని; అలవాటు కలిమిన్= అలవాటు బలంచేత; లలిత= మనోజ్ఞమైన; అమితలాఘవమునన్= మిక్కిలి సులువుగా; లంఘించెను= దాటాడు.

**తా :** నదులసమూహానికి బంధువు, భూమ్యాకాశాల మధ్యభాగాన్ని నీటితో నింపినది అయిన సముద్రాన్ని అలవాటుమేరకు ఆ హనుమంతుడు అత్యంత లాఘవంతో దాటాడు.

**వ. ఇట్లు సముద్రంబు దాఁటి సీతంగని, హనుమంతుండు దిరిగి చనుదెంచుచు నక్షకుమారాదుల వధియించి. 276**

**ప్రతి :** ఇట్లు; సముద్రంబు దాఁటి= సముద్రాన్ని దాటి; సీతన్+కని= సీతను చూచి; హనుమంతుడు; తిరిగి చనుదెంచుచున్= మరలివస్తూ; అక్షకుమార+ఆదులన్= అక్షకుమారుడు మొదలైనవారిని; వధియించి= చంపి;

**తా :** ఆంజనేయుడు ఆ విధంగా సముద్రాన్ని దాటి, సీతను చూచి, తిరిగి వచ్చేటప్పుడు అక్షకుమారుడు మొదలైన వారిని సంహరించాడు.

**క. సముదగ్రత ననిలసుతుం, డమరాహితదత్తవాలహస్తాగ్నుల భ**
**స్మము సేసె నిరాతంకన్, సమదాసుర సుభటవిగతశంకన్ లంకన్. 277**

**ప్రతి :** అనిలసుతుండు= వాయునందనుడు; సముదగ్రతన్= పరాక్రమముతో; అమర+అహిత= రాక్షసులచే (దేవతలకు కీడుచేసే); దత్త= ఇవ్వబడిన; వాలహస్తాగ్నులన్= తోక అనేచేతి నిప్పులతో; నిరాతంకన్= అడ్డులేనిదీ; సమద+అసురసుభట= గర్వించిన రాక్షసభటులచే; విగతశంకన్= అనుమానం లేనిది అయిన; లంకన్= లంకా నగరాన్ని; భస్మము+చేసెన్= బూడిద చేశాడు.

**తా :** రాక్షసులు తన తోకకు పెట్టిన నిప్పుతో ఆటంకం లేనిదీ, గర్వించిన రాక్షసభటులచేత అనుమానం లేనిది అయిన లంకా నగరాన్ని హనుమంతుడు బూడిద చేశాడు.

**విశే :** రాక్షసులు హనుమంతుని వాలానికి నిప్పు పెట్టారు. దాన్ని ఆయన హస్తాగ్నిగా ఉపయోగించాడు. రాక్షస భటులచేత వారి వీరత్వంచేత ఆపద కలుగుతుందనే శంక లేనిది లంక. అదికూడా హనుమంతునిముందు నిర్వీర్యమైంది.

**వ. ఇట్లు లంకాదహనంబు చేసి వచ్చి వాయుజుండు సీతాకథనంబు సెప్పిన విని రామచంద్రుండు వనచరనాథ యూథంబులుం దానును, జని చని. 278**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; లంకాదహనంబు+చేసి వచ్చి= లంకను కాల్చి వచ్చి; వాయుజుండు= హనుమంతుడు; సీతాకథనంబు+చెప్పినన్+విని= సీత వృత్తాంతాన్ని చెప్పగావిని; రామచంద్రుండు= రామచంద్రుడు; వనచరనాథ యూథంబులున్+తానును= వానరసమూహం, తానూ; చని చని= వెళ్ళి...

**తా :** ఈ విధంగా లంకను కాల్చివచ్చి హనుమంతుడు సీతా వృత్తాంతాన్ని విన్నవించగా విన్న శ్రీరాముడు వానరసైన్యాలతో బయలుదేరి వెళ్ళి

**శా. ఆ రాజేంద్రుఁడు గాంచె, భూరివిధరత్నాగారమున్ మీన కుం**
**భీరగ్రాహకఠోరమున్ విపులగంభీరంబు నభ్రభ్రమ**
**ద్ఘోరాన్యోన్య విభిన్న భంగభవ నిర్ఘోషచ్ఛటాంభఃకణ**
**ప్రారుద్ధాంబరపారమున్ లవణపారావారమున్ జేరువన్. 279**

**ప్రతి :** ఆ రాజ+ఇంద్రుఁడు= ఆ రాజశ్రేష్ఠుడు; చేరువన్= సమీపంలో; భూరివిధ= అనేక విధాలైన; రత్న+ఆగారమున్= రత్నాలకు నిలయమైనది; మీన, కుంభీర, గ్రాహ= చేపలు, తిమింగలాలు, మొసళ్లతో; కఠోరమున్= భయంకరమైనది, విపుల= విశాలమై; గంభీరంబున్= లోతైనది; అభ్రభ్రమత్= ఆకాశానికి ఎగిరిపడుతున్న; ఘోర+అన్య+అన్య= భయంకరమై పరస్పరం; విభిన్న= కొట్టుకొనే; భంగభవ= భేదించుకునే కెరటాలనుండి పుట్టిన; నిర్ఘోష= చప్పుళ్లతో; ఛటా+అంభస్+కణ= కాంతిమంతమైన నీటితుంపురులతో; ప్రారుద్ధ= తగుల్కొంటున్న; అంబరపారమున్= ఆకాశపు అంచులు కలిగింది అయిన; లవణపారావారమున్= లవణసముద్రాన్ని; కాంచెన్= చూశాడు;

**తా :** రాజశ్రేష్ఠుడైన రామచంద్రుడు ఆ విధంగా వెళ్ళి దగ్గరగా అనేక విధాలైన రత్నాలు కలిగింది, చేపలు, తిమింగలాలు, మొసళ్లతో భయంకరమైంది. విశాలమై గంభీరమైంది, ఆకాశానికి ఎగసిపడే భయంకరమైన అలల ఒరిపిడిచేత పుట్టిన శబ్దాలతో కాంతివంతమైన నీటికణాలతో ఆకాశపు అంచుల్ని స్పృశించే లవణ సముద్రాన్ని చూశాడు.

**వ. కని తనకుఁ ద్రోవ యిమ్మని వేఁడిన నదియు మార్గంబు సూపక మిన్నందిన నా రాచపట్టి రెట్టించిన కోపంబున. 280**

**ప్రతి :** కని= సముద్రాన్ని చూచి; తనకున్= తనకు; త్రోవ+ఇమ్ము+అని= దారిమ్మని; వేఁడినన్= కోరగా; అదియున్= ఆ సముద్రుడు; మార్గంబు+చూపక= దారి చూపించక; మిన్ను+అందిన= ఆకాశ మంటగా; ఆ రాచపట్టి= ఆ రాజకుమారుడు; రెట్టించిన= ద్విగుణీ కృతమైన; కోపంబునన్= కోపంతో...

**తా :** తనకు దారి ఇమ్మని శ్రీరాముడు సముద్రాన్ని కోరగా అది దారి ఇవ్వకపోగా ఆకాశాన్ని తాకి ఉప్పొంగింది. అపుడు ఆ రాజకుమారుడు కోపంతో

**క. మెల్లని నగవున నయనము, లల్లార్చి శరంబు విల్లు నందినమాత్రన్**
**గుల్లలు నాఁచులుఁజిప్పలుఁ, బెల్లలునై జలధి పెద్ద బీడై యుండెన్. 281**

**ప్రతి :** మెల్లని నగవున= చిరునవ్వుతో; నయనములు= కళ్లను; అల్ల+ఆర్చి= మెల్లగా ఆడించి; శరంబున్= బాణాన్ని; విల్లున్= ధనుస్సును; అందిన మాత్రన్= అందుకున్న క్షణంలోనే; జలధి= సముద్రం; గుల్లలు= నత్త గుల్లలతో; నాఁచులున్= నాచుతో; చిప్పలున్= ముత్తెపు చిప్పలతో; పెల్లలున్= బురద గడ్డలతో; పెద్ద బీడు+ఐ+ఉండెన్= పెద్ద బీడుగా మారింది;

**తా :** చిరునగవుతో, రెప్పలల్లార్చి ధనుర్బాణాలు ధరించినంత మాత్రం చేతనే ఆ సముద్రం నత్తగుల్లలతో, నాచుతో, ముత్తెపుచిప్పలతో, బురద గడ్డలతో పెద్ద బీడుగా మారింది.

**వ. ఇట్లు విపన్నుండగు సముద్రుండు నదులతోఁ గూడి మూర్తి మంతుండయి చనుదెంచి రామచంద్రుని చరణంబులు శరణంబుఁజొచ్చి యిట్లని స్తుతియించె. 282**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విపన్నుండు+అగు= ఆపద పొందిన; సముద్రుండు= సముద్రుడు; నదులతోన్+కూడి= నదులతో కలిసి; మూర్తి మంతుండు+అయి= ఆకారం ధరించి; చనుదెంచి= వచ్చి; రామచంద్రుని చరణంబులు= శ్రీరాముని పాదాలను; శరణంబున్+చొచ్చి= శరణుచొచ్చి; ఇట్లు+అని= ఈ విధంగా; స్తుతియించెన్= స్తోత్రం చేశాడు.

**తా :** ఇలా ఆపదలపాలైన సముద్రుడు నదులతో కలిసి ఆకారం ధరించి రాముని పాదాలను శరణుజొచ్చి ఈ విధంగా స్తుతించాడు.

**శా. 'ఓ కాకుత్స్థకులేశ! యో గుణనిధీ! యో దీనమందార! నే**
**నీ కోపంబున కెంతవాఁడ? జడధిన్; నీ వేమి భూరాజవే?**
**లోకాధీశుఁడ; వాదినాయకుఁడ; వీ లోకంబు లెల్లప్పుడున్**
**నీ కుక్షిం బ్రభవించు; నుండు; నడఁగున్ నిక్కంబు సర్వాత్మకా! 283**

**ప్రతి :** ఓ కాకుత్స్థకుల+ఈశ= ఓ కాకుత్స్థవంశాగ్రణీ!; ఓ గుణనిధీ= గుణాలకు నిధానమా!; ఓ దీనమందార= దీనులకు కల్పవృక్షం వంటివాడా!; సర్వ+ఆత్మకా!= పరమాత్మా!; నేన్+నీకోపంబునకున్= నేను నీ కోపానికి; ఎంతవాడన్= ఏపాటి వాడను; జడధిన్= మూఢబుద్ధిని; నీవు+ఏమి= నీవేమి; భూరాజవు+ఏ= భూలోకం రాజువా? లోక+అధి+ఈశుడవు= జగాలకే ప్రభువువు; ఆది నాయకుడవు= తొలి నాయకుడివి; ఈ లోకంబులు= ఈ లోకాలన్నీ; ఎల్లప్పుడున్= ఎల్లప్పుడూ; నీ కుక్షిన్= నీ పొట్టలో; ప్రభవించున్= పుడతాయి; ఉండున్= ఉంటాయి; అడఁగున్= నశిస్తాయి; నిక్కంబు= ఇది నిజం.

**తా :** ఓ కాకుత్స్థవంశాగ్రణీ! ఓ గుణనిధానమా! ఓ దీనమందారా! పరమాత్మా! నీ కోపం ముందు నేనెంత? జడుణ్ణి. నీవేమి సామాన్యమైన భూలోకంరాజువా? లోకాలకే ప్రభువువు. ఆది నాయకుడివి. ఈ లోకాలు నీయందే పుడతాయి, జీవిస్తాయి, నశిస్తాయి. ఇది నిజం.

**క. ధాతల రజమున దేవ, వ్రాతము సత్త్వమున భూతరాశిఁదమమునన్**
**జాతులుఁగా నొనరించు గు, ణాతీతుఁడ వీవు గుణగణాలంకారా! 284**

**ప్రతి :** గుణగణ+అలంకారా!= గుణాల సమూహం అలంకారంగా కలవాడా!; ఈవు= నీవు; ధాతలన్= ప్రజాపతులను; రజమునన్= రజోగుణంచేత; దేవవ్రాతమున్= దేవతల సమూహాన్ని; సత్త్వమునన్= సత్త్వగుణంచేత; భూతరాశిన్= ప్రాణి సమూహాన్ని; తమమునన్= తమోగుణంచేత; జాతులుఁగాన్= జన్మించేవారుగా; ఒనరించు= చేయు; గుణ+అతీతుడవు= త్రిగుణాలకు వేరయినవాడివి;

**తా :** ఓ గుణగణాలంకారా! నీవు ప్రజాపతులను రజోగుణంచేత, దేవతలను సత్త్వగుణంచేత, ప్రాణిలోకాన్ని తమోగుణంచేత సృష్టిస్తావు. కాని నీవు గుణాతీతుడవు.

**విశే :** నిత్యం జరుగుతున్న సృష్టి స్థితి లయాలన్నీ భగవానునివే. త్రిగుణాత్మక ప్రభూతమైన ఈ సృష్టికి కర్మ భగవానుడే. కాని ఆయనను ఈ గుణాలు ఏవీ అంటవు. ఆయన గుణాతీతుడు.

**క. కట్టుము సేతువు. లంకంజుట్టుము, నీ బాణవహ్ని సురవైరితలల్**
**గొట్టుము నేలంబడఁ జే, పట్టుము నీ యబల నధికభాగ్యప్రభలన్. 285**

**ప్రతి :** సేతువున్= వారధిని; కట్టుము= నిర్మించు; లంకన్= లంకను; చుట్టుము= చుట్టుముట్టు; నీ బాణవహ్నిన్= నీ బాణాగ్నిచేత; సురవైరి= దేవతల శత్రువైన రావణుని; నేలన్+పడన్= భూమిమీదపడేటట్లు; తలల్+కొట్టుము= తలలను ఖండించు; అధిక భాగ్యప్రభలన్= అధికమైన భాగ్యరాశితో; నీ+అబలన్= నీ ఇల్లాలిని; చేపట్టుము= చేపట్టు.

**తా :** కాబట్టి ఓ రామా! నాపై వారధి నిర్మించు. లంకను చుట్టుముట్టు. నీ బాణాగ్నిచేత రావణుని తలలు భూమిపై రాలగొట్టు. అధిక భాగ్యప్రభలతో నీ ఇల్లాలిని చేపట్టు.

**ఆ. హరికి మామ నగుదు; నఁటమీఁద శ్రీదేవి, తండ్రి; నూరకేల? తాగడింపఁ**
**గట్టఁగట్టి దాఁటు కమలాప్తకులనాథ, నీ యశోలతలకు నెలవు గాఁగ. 286**

**ప్రతి :** కమల+ఆప్తకులనాథ!= ఓ సూర్యవంశ ప్రభువా!; హరికిన్= విష్ణువునకు; మామను+అగుదున్= మామనవుతాను; అఁటమీదన్= ఆపై; శ్రీదేవి తండ్రిన్= లక్ష్మీదేవి తండ్రిని; ఊరక= ఊరకనే; తాగడింపన్= పీడించడం; ఏల?= ఎందుకు?; నీ యశస్+లతలకున్= నీ కీర్తి అనే తీగలకు; నెలవున్+కాఁగన్= ఉనికి పట్టు అయ్యేటట్లు; కట్టన్+కట్టి దాఁటు= వారధి కట్టి; దాఁటు= దాటుము;

**తా :** ఓ సూర్యకులాధినాథ! నేను విష్ణువునకు మామను. ఆ మీద లక్ష్మీదేవికి తండ్రిని. ఊరకే నన్ను బాధించడం ఎందుకు? నీ కీర్తికి తగినట్లు సేతువు కట్టి సముద్రాన్ని దాటు.

**వ. అని విన్నవించిన రామచంద్రుండు సముద్రునింబూర్వప్రకారంబున నుండు; పొమ్మని వీడుకొల్పె; నంత. 287**

**ప్రతి :** అని విన్నవించినన్= అని మనవి చేసుకోగా; రామచంద్రుండు= శ్రీరాముడు; సముద్రునిన్= సముద్రుని; పూర్వ ప్రకారంబునన్+ఉండు= వెనుకటి లాగానే ఉండు; పొమ్ము+అని= వెళ్లమని; వీడు కొల్పెన్= సాగనంపాడు; అంత= అప్పుడు...

**తా :** అని విన్నవించుకోగా రామచంద్రుడు సముద్రుని వెనుకటిలాగా యథాస్థితిలో ఉండుమని పంపాడు. అప్పుడు

**క. ఘనశైలంబులుఁదరువులు, ఘనజవమునఁబెఱికి తెచ్చి కపికులనాథుల్**
**ఘనవనరాశింగట్టిరి, ఘనవాహప్రముఖ దివిజగణము నుతింపన్. 288**

**ప్రతి :** కపికులనాథుల్= వానరశ్రేష్ఠులు; ఘనశైలంబులున్= గొప్ప కొండలను; తరువులున్= చెట్లను; ఘనజవమునన్= గొప్పవేగంతో; పెఱికి తెచ్చి= పెకలించి తెచ్చి; ఘనవాహ ప్రముఖ= మేఘవాహనుడైన దేవేంద్రాది; దివిజగణము= దేవతలసమూహం; నుతింపన్= పొగడుచుండగా; ఘనవనరాశిన్+కట్టిరి= సముద్రాన్ని కట్టారు.

**తా :** వానర వీరులు దేవేంద్రాది దేవతలు ప్రశంసించేటట్లు పెద్ద కొండలను, వృక్షాలను వేగంగా పెకలించి తెచ్చి సముద్రంపై వారధి నిర్మించారు.

**వ. ఇట్లు సముద్రంబు దాఁటి రామచంద్రుండు రావణు తమ్ముండైన విభీషణుండు శరణంబు వేఁడిన నభయం బిచ్చి కూడుకొని లంకకుఁజని విడిసి వేడె పెట్టించి లగ్గలు పట్టించిన. 289**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సముద్రంబున్+దాటి= సముద్రాన్ని దాటి; రామచంద్రుండు= రామచంద్రుడు; రావణుతమ్ముండు+ఐన= రావణుని తమ్ముడైన; విభీషణుండు= విభీషణుడు; శరణంబు వేడినన్= శరణుకోరగా; అభయంబు+ఇచ్చి= అభయమిచ్చి; కూడుకొని= కలుపుకొని; లంకకున్+చని= లంకకు వెళ్ళి; విడిసి= విడిదిచేసి; వేడెపెట్టించి= చుట్టుకొని; లగ్గలు పట్టించినన్= ముట్టడించగా...

**తా :** ఈ విధంగా సముద్రాన్ని దాటి రామచంద్రుడు, రావణుని తమ్ముడైన విభీషణుడు తన్ను శరణుకోరగా అతనికి అభయమిచ్చాడు. అతడితో కలిసి లంకకు వెళ్ళి విడిసి, పట్టణాన్ని చుట్టుకొని ముట్టడించగా

**సీ. ప్రాకారములు ద్రవ్వి, పరిఖలు పూడిచి కోటకొమ్మలు నేలఁగూలఁద్రోచి**
**వప్రంబు లగలించి వాకిళ్లు పెకలించి తలుపులు విఱిచి యంత్రములు సెఱిచి**
**ఘనవిటంకంబులు ఖండించి పడవైచి గోపురంబులు నేలఁగూలఁదన్ని**
**మకరతోరణములు మహిఁగూల్చి కేతనంబులు సించి సోపానములు గదల్చి**

**ఆ. గృహము లెల్ల వ్రచ్చి గృహరాజముల గ్రొచ్చి, భర్మకుంభచయము పాఱవైచి**
**కరులు కొలను సొచ్చి కలఁచిన కైవడిఁ, గపులు లంకఁ జొచ్చి కలఁచి రపుడు. 290**

**ప్రతి :** అపుడు= ఆ సమయంలో; కపులు= వానరులు; లంకన్+చొచ్చి= లంకలోనికి ప్రవేశించి; కరులు= ఏనుగులు; కొలను+చొచ్చి= మడుగులోకి ప్రవేశించి; కలఁచిన కైవడిన్= కలచి వేసినట్లు; ప్రాకారములున్+త్రవ్వి= ప్రాకారాలను త్రవ్వి; పరిఖలు పూడిచి= అగడ్తలనుపూడ్చి; కోటకొమ్మలు= కోటకొమ్మలను; నేలన్+కూలన్+త్రోచి= నేలమీద కూల్చివేసి; వప్రంబులు+అగలించి= బురుజులను పగులగొట్టి; వాకిళ్లు పెకలించి= వాకిండ్లను ఊడబెరికి; తలుపులు విఱిచి= తలుపులను విరిచివేసి; యంత్రములు+చెఱిచి= యంత్రాలను నాశనంచేసి; ఘనవిటంకంబులు ఖండించి= గొప్పవైన ముంజూరులను విరిచి; గోపురంబులు= గోపురాలను; నేలన్+కూలన్+తన్ని= నేలమీద పడదన్ని; మకరతోరణములు= మకర తోరణాలు; మహిన్+కూల్చి= భూమిమీద పడవైచి; కేతనంబులు+చించి= జెండాలు చింపివేసి; సోపానములు+కదల్చి= మెట్లను కదలించి; గృహములు+ఎల్లన్= ఇండ్లనన్నిటిని; వ్రచ్చి= చీల్చి; గృహరాజములన్+క్రొచ్చి= భవనాలను కూల్చి; భర్మకుంభచయము= బంగారు కలశాలను; పాఱవైచి= విసిరివేసి; కలఁచిరి= కలవర పరచారు.

**తా :** ఆ సమయంలో వానరులు లంకలోకి ప్రవేశించి ఏనుగులు మడుగులో జొరబడి కలచివేసినట్లు ప్రాకారాలను త్రవ్వి, అగడ్తలను పూడ్చి, కోటకొమ్మలను కూల్చి, బురుజులను పగులగొట్టి, వాకిండ్లను ఊడబెరికి, తలుపులను విరిచి, యంత్రాలను నాశనంచేసి, ముంజూరులనువిరిచి, గోపురాలను పడదన్ని, మకరతోరణాల్ని మట్టిపాలుచేసి, జెండాలను చింపి, మెట్లను కదలించి, ఇండ్లనుచీల్చి, భవనాల్ని త్రవ్వి, బంగారు కలశాలను విసిరివేసి కలచి వేశారు.

**వ. అంత న య్యసురేంద్రుడు పంచిన గుంభ, నికుంభ, ధూమ్రాక్ష, విరూపాక్ష, సురాంతక, నరాంతక, దుర్ముఖ, ప్రహస్త, మహాకాయ ప్రముఖులగు దనుజవీరులు శరశరాసన తోమర గదా ఖడ్గ శూల భిందిపాల పరశు పట్టిస ప్రాస ముసలాది సాధనంబులు ధరియించి మాతంగ తురంగ స్యందన సందోహంబుతో**

**బవరంబు సేయు సుగ్రీవ పవనతనయ పనస గజ గవయ గంధమాదన నీల కుముద జాంబవదాదు లా రక్కసుల నెక్కటి కయ్యంబులందుఁ దరుల, గిరులఁ, గరాఘాతంబుల నుక్కడంచి రంత. 291**

**ప్రతి :** అంతన్= పిమ్మట; ఆ+అసుర+ఇంద్రుండు= ఆ రాక్షస శ్రేష్ఠుడు (రావణుడు); పంచినన్= పంపగా; కుంభ, నికుంభ, ధూమ్రాక్ష, విరూపాక్ష, సురాంతక, సురాంతక, దుర్ముఖ, ప్రహస్త, మహాకాయ ప్రముఖులు+అగు= కుంభుడు, నికుంభుడు, ధూమ్రాక్షుడు, విరూపాక్షుడు, సురాంతకుడు, నరాంతకుడు, దుర్ముఖుడు, ప్రహస్తుడు, మహాకాయుడు మొదలగు; దనుజవీరులు= రాక్షసవీరులు; శర= బాణాలు; శర+ఆసన= విల్లులు; తోమర= చిల్లకోలలు; గదా= గదలు; ఖడ్గ= కత్తులు; శూల= శూలాలు; భిందిపాల= గుదియలు; పరశు= గొడ్డండ్లు; పట్టిస= అడ్డకత్తులు; ప్రాస= ఈటెలు; ముసల+ఆది= రోకళ్ళు మొదలైన; సాధనంబులున్= పరికరాల్ని; ధరియించి= తీసుకొని; మాతంగ= ఏనుగులు; తురంగ= గుఱ్ఱాలు; స్యందన= రథాలయొక్క; సందోహంబుతోన్= సమూహంతో; బవరంబు+చేయు= యుద్ధం చేసే; సుగ్రీవ, పవనతనయ, పనస, గజ, గవయ, గంధమాధన, నీల, కుముద, జాంబవత్+ఆదులు= సుగ్రీవుడు, హనుమంతుడు, పనస, గజ, గవయ, గంధమాదన, నీల, అంగద, కుముద, జాంబవంతుడు మొదలైనవారు; ఆ రక్కసులన్= ఆ రాక్షసులను; ఎక్కటి కయ్యంబుల+అందున్= ద్వంద్వ యుద్ధంలో; తరులన్= చెట్లతో; గిరులన్= కొండలతో; కర+ఆఘాతంబులన్= పిడికిటి పోట్లతో; ఉక్కు+అడంచిరి= నాశనంచేశారు; అంత= పిమ్మట.

**తా :** అప్పుడు రావణుడు పంపించగా కుంభ, నికుంభ, ధూమ్రాక్ష, విరూపాక్ష, సురాంతక, దుర్ముఖ, ప్రహస్త, మహాకాయ ముఖ్యులైన రాక్షసవీరులు ధనుర్బాణాలు, గదలు, కత్తులు, శూలాలు, ఇనుప ఆయుధాలు; అడ్డకత్తులు, ఈటెలు, గొడ్డళ్ళు, రోకళ్ళు మొదలైన ఆయుధాలను ధరించి ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలతో వచ్చి యుద్ధంచేశారు. సుగ్రీవ, ఆంజనేయ పనస, గజ, గవయ, గంధమాదన, నీల, అంగద, కుముద, జాంబవదాదులు ఆ రాక్షసులను ద్వంద్వయుద్ధంలో ఎదుర్కొని చెట్లతో, కొండలతో, పిడికిటి పోట్లతో నాశనం చేశారు.

**క. ఆ యెడ లక్ష్మణుఁ డుజ్జ్వల, సాయకములఁ ద్రుంచె శైలసమకాయు సురా**
**జేయు ననర్గళమాయో, పాయున్ నయగుణవిధేయు న య్యతికాయున్. 292**

**ప్రతి :** ఆ+ఎడన్= అప్పుడు; లక్ష్మణుఁడు= లక్ష్మణుడు; ఉత్+జ్వల= ప్రకాశమానమైన; సాయకములన్= బాణాలతో; శైలసమకాయున్= కొండతో సమానమైన శరీరంగలవాడు; సుర+అజేయున్= దేవతలచేత జయించరానివాడు; అనర్గళ= అడ్డులేని; మాయా+ఉపాయున్= మాయలు,ఉపాయాలుగా కలవాడు; నయగుణవిధేయున్= నీతి గుణాలతో కూడినవాడు; ఆ+అతికాయున్= అయిన ఆ అతికాయుని; త్రుంచెన్= కూల్చాడు.

**తా :** అప్పుడు లక్ష్మణుడు తేజోవంతమైన బాణాలతో కొండంతవాడు, దేవతలకు అజేయుడు, మాయలతో నయగుణాలతో వర్తించేవాడు అయిన ఆ అతికాయుణ్ణి కూల్చివేశాడు.

**ఆ. రామచంద్రవిభుఁడు రణమున ఖండించె, మేటికడిమి నీలమేఘవర్ణు**
**బాహుశక్తిపూర్ణుఁ బటుసింహనాద సం, కుచిత దిగిభకర్ణుఁ గుంభకర్ణు. 293**

**ప్రతి :** రామచంద్రవిభుఁడు= రామచంద్రుడు; రణమునన్= యుద్ధంలో; మేటి కడిమిన్= గొప్పబలంతో; నీలమేఘవర్ణున్= నల్లని మేఘ ఛాయకలిగినవానిని; బాహుశక్తిపూర్ణున్= నిండైన భుజబలం కలవాణ్ణి; పటు= గొప్పదైన; సింహనాద=

సింహనాదంతో; సంకుచిత= కుంచించుకొనిపోయే; దిక్+ఇభకర్ణున్= దిగ్గజాల చెవులవంటి చెవులు కలవానిని; కుంభకర్ణున్= కుంభకర్ణుని; ఖండించెన్= నరికాడు;

**తా :** శ్రీరామచంద్రుడు యుద్ధంలో గొప్పశౌర్యవంతుడు, నల్లని మేఘవర్ణం కలవాడు, గొప్ప భుజబలం కలవాడు, దిగ్గజాల చెవులు దిమ్మెక్కేటట్లు సింహనాదం చేసిన కుంభకర్ణుని నరికివేశాడు.

**క. అలవున లక్ష్మణుఁ డాజి, స్థలి గూల్చెన్ మేఘనాదుఁ జటులాహ్లాదున్**
**బలభేది జయవినోదున్, బలజనితసుపర్వసుభటభావవిషాదున్. 294**

**ప్రతి :** అలవునన్= అనాయాసంగా; లక్ష్మణుఁడు= లక్ష్మణుడు; ఆజిస్థలిన్= యుద్ధరంగంలో; చటుల+ఆహ్లాదున్= కలియదిరుగుతూ సంతోషించేవాడు, బలభేది= బలుని జయించిన ఇంద్రుని; జయవినోదున్= జయించుటచే వినోదించేవాడు; బలజనిత= బలంచేత; సుపర్వసుభట= దేవతల సైనికుల; భావ= హృదయాలకు; విషాదున్= దుఃఖం కలిగించేవాడు అయిన, మేఘనాదున్= మేఘనాదుని; కూల్చెన్= కూల్చాడు;

**తా :** రణరంగంలో లక్ష్మణుడు అనాయాసంగా, యుద్ధమంటే ప్రీతికలవాడు, ఇంద్రుని జయించడంతో వినోదించినవాడు, తన బలంతో దేవతాసైనికులకు దుఃఖం కలిగించేవాడు అయిన మేఘనాదుని కూల్చివేశాడు.

**వ. అంత. 295**

**ప్రతి :** అంతన్= అటు పిమ్మట...

**క. తనవారందఱు ద్రుంగిన, ననిమిషపతివైరి పుష్పకారూఢుండై**
**యనికి నడచి రామునితో, ఘనరౌద్రముతోడ నంపకయ్యము సేసెన్. 296**

**ప్రతి :** అనిమిషపతివైరి= దేవతా ప్రభువుకు శత్రువు; తనవారు+అందఱున్= తనవాళ్ళంతా; ద్రుంగినన్= చావగా; పుష్పక+ఆరూఢుండు+ఐ= పుష్పక విమానమెక్కి; అనికిన్+నడచి= యుద్ధరంగానికి వచ్చి; రామునితోన్= శ్రీరామునితో, ఘనరౌద్రముతోడన్= గొప్ప రౌద్రంతో; అమ్ము+కయ్యము+చేసెన్= బాణయుద్ధం చేశాడు.

**తా :** అంత తనవారందరూ మరణించగా రావణుడు పుష్పకవిమానమెక్కి యుద్ధరంగానికి వచ్చి రామునితో వీరావేశంతో యుద్ధం చేశాడు.

**వ. అ య్యవసరంబున. 297**

**ప్రతి :** అ+అవసరంబునన్= ఆ సమయంలో...

**క. సురపతిపంపున మాతలి, గురుతరమగు దివ్యరథముఁ గొనివచ్చిన, నా**
**ధరణీవల్లభుఁ డెక్కెను, ఖరకరుఁ డుదయాద్రి నెక్కు కైవడి దోఁపన్. 298**

**ప్రతి :** సురపతి= దేవేంద్రుని; పంపునన్= ఆజ్ఞతో; మాతలి; గురుతరము+అగు= గొప్పదైన; దివ్యరథమున్+కొని వచ్చినన్= దేవరథాన్ని తీసుకరాగా; ఆ ధరణీవల్లభుఁడు= ఆ భూభర్త (రాముడు); ఖరకరుఁడు= తీక్ష్ణమైన కిరణాలు కలవాడు

(సూర్యుడు); ఉదయ+అద్రిన్= ఉదయ పర్వతాన్ని; ఎక్కుకైవడిన్+తోపన్= ఎక్కేవిధం కనపడగా; ఎక్కెను= (రథాన్ని) ఎక్కాడు.

**తా :** అప్పుడు దేవేంద్రుని ఆజ్ఞమేరకు మాతలి గొప్ప దేవరథాన్ని తేగా రాముడు సూర్యుడు ఉదయపర్వత మెక్కినట్లు ఆ రథం అధిరోహించాడు.

**వ. ఇట్లు దివ్యరథారూఢుండయి రామచంద్రుండు రావణున కిట్లనియె. 299**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; దివ్యరథ+ఆరూఢుండు+ఐ= దేవతా రథాన్ని ఎక్కి; రామచంద్రుండు= శ్రీరాముడు; రావణునకున్= రావణునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఇట్లా దివ్యరథాన్నెక్కి రామచంద్రుడు రావణునితో ఇలా అన్నాడు.

**మ. చపలత్వంబున డాఁగి హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెంచుటో**
**కపటబ్రాహ్మణమూర్తివై యబల నా కాంతారమధ్యంబునం**
**దపలాపించుటయో మదీయశితదివ్యామోఘబాణాగ్ని సం**
**తపనం బేగతి నోర్చువాఁడవు? దురంతం బెంతయున్ రావణా! 300**

**ప్రతి :** రావణా!= ఓ రావణుడా!; చపలత్వంబునన్+డాఁగి= నీచత్వంతో దాగుకొని; హేమమృగమున్= బంగారు జింకను; సంప్రీతిన్= సంతోషంగా; పుత్తెంచుట+ఓ= పంపడమో; కపట బ్రాహ్మణమూర్తివి+ఐ= మోసపు బ్రాహ్మణాకారంతో; అబలన్= అమాయకురాలిని; ఆ, కాంతారమధ్యంబునన్= ఆ అరణ్యంలో; అపలాపించుట+ఓ= కప్పిపుచ్చడమో; మదీయ= నాయొక్క; శిత= వాడియైన; దివ్య+అమోఘబాణ+అగ్నిన్= దివ్యమైన వ్యర్థం కాని బాణమనే అగ్నివలని; సంతపనంబు= తాపాన్ని; ఏ గతిన్+ఓర్చువాడవు= ఏ విధంగా సహిస్తావు; ఎంతయున్= ఎంతో; దురంతంబు= అంతంలేనిది;

**తా :** ఓ రావణా! నీచత్వంతో దాగుగొని బంగారుజింకను సంతోషంగా పంపడమనుకున్నావా? కపట బ్రాహ్మణుని వేషంతో అడవిలో ఉన్న అబలను మోసగించడం అనుకున్నావా? వాడియైన నా దివ్యబాణంవల్ల కలిగే తాపాన్ని ఎలా సహిస్తావు. ఇది అంతంలేని పర్యవసానం.

**క. నీ చేసిన పాపములకు, నీచాత్మక! యముఁడు వలదు నేఁ డిట నా నా**
**రాచములఁ ద్రుంచివైచెద, ఖేచర భూచరులుఁ గూడి క్రీడన్ జూడన్. 301**

**ప్రతి :** నీచ+ఆత్మక= నీచ హృదయుడా!; నీ చేసిన= నీవు కావించిన; పాపములకున్= పాపాలకు; యముఁడు వలదు= యమధర్మరాజు అవసరంలేదు. ఖేచర= ఆకాశంలో తిరిగేవారూ; భూచరులున్+కూడి= భూమిపై తిరిగేవారూ కలిసి; క్రీడన్+చూడన్= ఆటగా వినోదంగా చూడగా; నేఁడు+ఇటన్= ఈ రోజు ఇక్కడ; నా నారాచములన్= నా బాణాలతో; త్రుంచి వైచెదన్= ఖండించి వేస్తాను;

**తా :** ఓ నీచాత్ముడా! నువ్వు చేసిన పాపాలకు నిన్ను శిక్షించటానికి యముడవసరం లేదు. ఆకాశచరులు, భూచరులు వినోదిస్తుంటే ఈ రోజు ఇక్కడ నా బాణాలతో నిన్ను ఖండిస్తాను.

**వ. అని పలికి. 302**

**ప్రతి :** అని చెప్పి...

**మ. బలువింటన్ గుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండభీమంబుగాఁ**
**బ్రళయోగ్రానలసన్నిభంబగు మహాబాణంబు సంధించి రా**
**జలలాముండగు రాముఁడేసె ఖరభాషాశ్రావణున్ దేవతా**
**బలవిద్రావణు వైరిదారజనగర్భస్రావణున్ రావణున్. 303**

**ప్రతి :** రాజలలాముండు+అగు+రాముడు= రాజశ్రేష్ఠుడైన రాముడు; బలువింటన్= గొప్పధనుస్సునుండి; బ్రహ్మాండ భీమంబుగాన్= లోకాలకు భయంకరంగా; గుణటంకృతంబు+నిగుడన్= వింటినారియొక్క టంకారం వ్యాపించగా; ప్రళయ+ఉగ్ర+అనల= ప్రళయకాలమందలి భయంకరమైన అగ్నితో; సన్నిభంబు+అగు= సమానమైన; మహాబాణంబున్+సంధించి= గొప్ప బాణాన్ని కూర్చి; ఖరభాషాశ్రావణున్= కఠినమైన వాక్కులు వినిపించేవాడు; వైరిదారజన= శత్రురాజుల భార్యలైనవారికి; గర్భస్రావణున్= గర్భస్రావం కలిగించేవాడు అగు; రావణున్= రావణుని; ఏసెన్= కొట్టాడు.

**తా :** రాజశ్రేష్ఠుడైన శ్రీరాముడు గొప్పవింటినుండి టంకారం వ్యాపిస్తుండగా, ప్రళయాగ్నితో సమానమైన బాణాన్ని కూర్చి పరుషవాక్కులు కలవాడు, దేవతాసైన్యాన్ని పారద్రోలేవాడు, శత్రురాజుల స్త్రీలకు గర్భశోకాన్ని కలిగించేవాడు అయిన రావణుని పై కొట్టాడు.

**క. దశరథసూనుండేసిన, విశిఖము హృదయంబుఁదూఱ వివశుండగుచున్**
**దశకంధరుండు గూలెను, దశవదనంబులను రక్తధారలు దొరఁగన్. 304**

**ప్రతి :** దశరథసూనుండు+ఏసిన= రాముడు వేసిన; విశిఖము= బాణం; హృదయంబున్+దూఱన్= హృదయంలోకి చొచ్చుకొని వెళ్ళగా; వివశుండు+అగుచున్= అచేతనుడై; దశవదనంబులను= పది ముఖాలనుండి; రక్తధారలు+ తొరఁగన్= నెత్తురు కారగా; దశకంధరుండున్+కూలెన్= పదితలల రావణుడు కూలాడు;

**తా :** రాముడు వేసిన బాణం హృదయంలోకి దూరగా స్వాధీనం కోల్పోయి పది ముఖాలనుండి నెత్తురు కారుతుంటే రావణుడు నేలకొరిగాడు.

**వ. అంత నా రావణుండు దెగుట విని. 305**

**ప్రతి :** అంతన్= అంతట; ఆ రావణుడు; తెగుటవిని= మరణించడం విని...

**తా :** అంతట ఆ రావణుడు మరణించడం విని

**సీ. కొప్పులు బిగి వీడి కుసుమమాలికలతో నంసభాగంబుల నావరింప**
**సేసముత్యంబులు సెదరఁ గర్ణిక లూడఁ గంఠహారంబులు గ్రందుకొనఁగ**
**వదనపంకజములు వాడి వాతెఱ లెండఁ గన్నీళ్ళవఱద లంగములు దడుప**
**సన్నపు నడుములు జవ్వాడఁ బాలిండ్ల బరువులు నడుములఁబ్రబ్బికొనఁగ**

**ఆ. నెత్తి మోఁదికొనుచు నెఱిఁ బయ్యెదలు జాఱ, నట్టు నిట్టు తప్పటడగు లిడుచు**
**నసురసతులు వచ్చి రట భూత బేతాళ, సదనమునకు ఘోరకదనమునకు. 306**

**ప్రతి :** అసురసతులు= రాక్షస స్త్రీలు; కొప్పులు బిగివీడి= కొప్పుల బిగువు సడలిపోయి; కుసుమమాలికలతోన్= పుష్పమాలలతో; అంస భాగంబులన్= భుజాలపై; ఆవరింపన్= కమ్ముకోగా; సేసముత్యంబులు+చెదర= పాపట ముత్యాలు చెదరగా; కర్ణికలు+ఊడన్= చెవికమ్మలు ఊడిపోగా; కంఠహారంబులు+క్రందుకొనగా= కంఠహారాలు చిక్కుపడగా; వదనపంకజములు= ముఖ పద్మాలు; వాడి= వాడిపోగా; వాతెఱలు+ఎండన్= పెదవులు ఎండిపోగా; కన్నీళ్లవఱదలు= కన్నీళ్లు వరదలుపారి; అంగములున్+తడువన్= శరీరాంగాలను తడపగా; సన్నపు నడుములు= సన్నటి నడుములు; జవ్వాడన్= కదలాడగా; స్తనాల బరువులు= పాలిండ్ల బరువులు; నడుములన్+ప్రబ్బికొనగ= నడుములపై పడుతుండగా; నెత్తి మోఁదికొనుచు= తల బాదుకుంటూ; నెఱిన్+పయ్యెదలు జాఱన్= నిండైన పైటలు జారగా; అట్టున్+ఇట్టు= అటు ఇటూ; తప్పు+అడుగులు= తడబడుతున్న అడుగులు; ఇడుచున్= వేస్తూ; భూత బేతాళ సదనమునకున్= పిశాచాలకు ఉనికి పట్టు అయిన; ఘోరకదనమునకున్= భయంకర యుద్ధరంగానికి; వచ్చిరి= వచ్చారు.

**తా :** రావణుని మరణవార్త విన్న రాక్షస స్త్రీలు కొప్పులు జారి పూలదండలు భుజాలపై పడుతుండగా, పాపట ముత్యాలు చెదరగా, చెవికమ్మలు ఊడిపోగా, కంఠహారాలు చిక్కుపడగా, ముఖాలు వాడిపోయి, పెదవులు ఎండిపోయి, కన్నీళ్లు వరదలై శరీరాలను తడుపుతుండగా, సన్నటి నడుములు పాలిండ్ల బరువుచే నకనకలాడుతుండగా, పైటలు జారి తలబాదుకుంటూ తడబడుతున్న అడుగులతో భూత బేతాళాలకు నిలయమైన యుద్ధభూమికి వచ్చారు.

**వ. ఇట్లు వచ్చి తమ తమ నాథులం గని, శోకించి, రందు, మందోదరి రావణుం జూచి యిట్లనియె. 307**

**ప్రతి :** ఇట్లు వచ్చి= ఈ విధంగా వచ్చి; తమ తమనాథులన్= తమ తమ భర్తలను; కని= చూచి; శోకించిరి= ఏడ్చారు; అందున్= వారిలో; మందోదరి; రావణున్+చూచి= రావణుని చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నది.

**తా :** ఈ విధంగా వచ్చి తమ తమ భర్తలను చూచి దుఃఖించారు. వారిలో మందోదరి రావణుని చూచి ఇట్లా అన్నది.

**ఉ. హా దనుజేంద్ర! హా సురగణాంతక! హా హృదయేశ! నిర్జరేం**
**ద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రుని కోలల కోర్వలేక సో**
**న్మాదమునన్ రఘుప్రవరు మానిని నేటికిఁదెచ్చి? తప్పు దేఁ**
**గాదని చెప్పినన్ వినక కాలవశంబును బొంది తక్కటా! 308**

**ప్రతి :** హా దనుజ+ఇంద్ర= హా రాక్షసశ్రేష్ఠుడా!; హా సురగణ+అంతక= దేవతా సమూహాలను అంత మొందించినవాడా!; హృదయ+ఈశ= నా హృదయానికి ప్రభువా!; నీవు; నిర్జర+ఇంద్ర+ఆదులన్= దేవతా శ్రేష్ఠుల్ని; గెల్చి= జయించి; కుసుమ+అస్త్రుని= పుష్పబాణుని; కోలలకున్+ఓర్వలేక= బాణాలను సహించలేక; స+ఉన్మాదమునన్= ఉన్మాదంతో; రఘుప్రవరుమానినిన్= రఘువంశ శ్రేష్ఠుడైన రాముని భార్యను; ఏటికిన్+తెచ్చితి= ఎందుకు తెచ్చావు; అక్కటా!= అయ్యో!; అప్పుడు+ఏన్+కాదు+అని= అప్పుడు నేను వద్దని చెప్పినన్= చెప్పినా; వినక= వినకుండా; కాలవశంబునున్+పొందితి= కాలునికి చిక్కావు కదా!

**తా :** హా రాక్షసశ్రేష్ఠుడా! హా దేవాంతకా! హా మనోనాయకా! నీవు దేవతలను జయించి పుష్పబాణుని బాణాలను సహించలేకపోయావు. రాముని భార్యను ఎందుకు తెచ్చావు? అయ్యో! అపుడు నేను వద్దని చెప్పినా వినక ఇప్పుడీ విధంగా కాలగతికి చిక్కావుగదా!

**ఆ. ఎండఁగాయ వెఱచు, నినుఁడు వెన్నెలఁగాయ, వెఱచు, విధుఁడు గాలి వీవ వెఱచు**
**లంకమీఁద; నిట్టి లంకాపురికి మాకు, నధిప! విధవభావ మడరె నేఁడు. 309**

**ప్రతి :** లంక మీఁద= లంకానగరం మీద; ఇనుఁడు= సూర్యుడు; ఎండన్+కాయన్+వెఱచు= ఎండకాయడానికి భయపడేవాడు; విధుఁడు= చంద్రుడు; వెన్నెలన్+కాయన్+వెఱచు= వెన్నెల కాయడానికి భయపడేవాడు; గాలి వీవన్+వెఱచు= వాయువు వీచడానికి జంకేవాడు; నేఁడు= ఈ రోజు; ఇట్టి లంకాపురికి= ఇటువంటి లంకానగరానికి; మాకున్= మాకు; అధిప!= ఓ రాజా; విధవభావము+అడరె= అనాథత్వం కలిగింది.

**తా :** ఓ నాథా! ఇంతవరకు లంకపై ఎండకాయడానికి సూర్యుడు భయపడేవాడు. చంద్రుడు వెన్నెల కాయడానికి భయపడేవాడు. గాలి వీచేందుకు భయపడేది. ఈ రోజు అలాంటి లంకానగరమూ, మేమూ అనాథలమైపోయాము.

**క. దురితముఁ దలఁపరు గానరు, జరుగుదు రెటకైన నిమిష సౌఖ్యంబులకై**
**పరవనితాసక్తులకును, బరధనరక్తులకు నిహముఁ బరముం గలదే? 310**

**ప్రతి :** నిమిషసౌఖ్యంబులకై= క్షణికసుఖాల కోసం; దురితమున్+తలఁపరు= పాపమని అనుకోరు; కానరు= పాపాన్ని చూడరు; ఎటకు+ఐన= ఎంతవరకైనా; జరుగుదురు= ప్రవర్తిస్తారు; పరవనిత+ఆసక్తులకున్= పరస్త్రీలపై ఆసక్తి కలవారికి; పరధనరక్తులకున్= ఇతరుల ధనాన్ని ఆశించేవారికి; ఇహమున్+పరమున్+కలదే?= ఇహపరాలుంటాయా?

**తా :** క్షణిక సుఖాలకోసం పాపమని ఆలోచించరు. పాపమని చూడరు. ఎంతవరకైనా ప్రవర్తిస్తారు. పరస్త్రీ, పరధనాలను కోరేవారికి ఇహపరాలుండవు.

**వ. అని విలపింప నంత విభీషణుండు రామచంద్రుని పంపు వడసి, రావణునకు దహనాది క్రియలు గావించె, నంత రాఘవేంద్రుండు నశోకవనంబున కేఁగి, శింశుపాతరుసమీపంబు నందు. 311**

**ప్రతి :** అని విలపింపన్= అని శోకించగా; అంతన్= అపుడు; విభీషణుండు= విభీషణుడు; రామచంద్రుని పంపు+పడసి= రాముని ఆజ్ఞనుపొంది; రావణునకున్= రావణునికి; దహన+ఆదిక్రియలున్= దహనం మొదలైన కర్మలు; కావించెన్= చేశాడు; అంతన్= అప్పుడు; రాఘవ+ఇంద్రుడు= శ్రీరాముడు; అశోక వనంబునకున్+ఏగి= అశోకవనానికి వెళ్ళి; శింశుపాతరుసమీపంబున్+అందున్= ఇరుగుడుచెట్టు సమీపంలో...

**తా :** అని దుఃఖించింది. అపుడు విభీషణుడు రాముని అనుమతిని పొంది రావణునికి పరలోక క్రియలు నిర్వర్తించాడు. అపుడు రాముడు అశోక వనానికి వెళ్ళి ఇరుగుడుచెట్టు సమీపంలో

**శా. దైతేయప్రమదాపరీత నతిభీతన్ గ్రంథిబంధాలక**
**వ్రాతన్ నిశ్శ్వసనానిలాశ్రుకణజీవం జీవదారామ భూ**
**జాతన్ శుష్కకపోలకీలితకరాబ్జాతం బ్రభూతం గృశీ**
**భూతం బ్రాణసమేత సీతఁ గనియెన్ భూమీశుఁ డా ముందటన్. 312**

**ప్రతి :** భూమి+ఈశుఁడు= భూనాయకుడు రాముడు; ఆ ముందటన్= ఆ ముందు; దైతేయ ప్రమదాపరీతన్= రాక్షస స్త్రీలచేత చుట్టబడినది; అతిభీతన్= మిక్కిలి భయపడినది; గ్రంథి బంధ+అలకవ్రాతన్= ముడులుగా పెనవేసుకున్న

ముంగురులు కలిగినది; నిశ్శ్వసన+అనిల= నిట్టూర్పు గాలులచేత; అశ్రుకణ= కన్నీటి బిందువులచేత; జీవం జీవత్= ప్రాణాలను నిలబెడుతున్న; ఆ రామభూజాతన్= ఉద్యానవన వృక్షాలు కలిగినది; శుష్కకపోలకీలిత= చిక్కిపోయిన చెక్కిలిపై ఉంచిన; కర+అబ్జాతన్= పద్మంలాంటి చేయి కలిగినది; ప్రభూతన్= అధికంగా; కృశీభూతన్= చిక్కిపోయినది; ప్రాణసమేతన్= ప్రాణావశేషంగా ఉన్నది అయిన; సీతన్+కనియెన్= సీతను చూశాడు;

**తా :** రాముడు అక్కడ రాక్షస స్త్రీల కాపలాలో ఉన్నది, చాలా భయపడుతున్నది, ముడులుగా పెనగొన్న ముంగురులు కలిగింది, తన నిశ్వాసము, కన్నీరు చేత ఉద్యానవన వృక్షాలను పెంచుతున్నది, ఎండిపోయిన చెక్కిలిపై చేయి చేర్చినది, బాగా కృశించడంచేత ప్రాణాలు మాత్రమే మిగిలిన సీతను చూశాడు.

**విశే :** సీత ఒక ఏడాది కాలం అశోకవనంలో దుర్భరమైన వేదన అనుభవించింది. ఆమె నిరంతరం కన్నీరు కార్చింది. నిట్టూర్పులు తప్ప ఆమెకు ఓదార్పులు లేవు. ఆమె విడిచిన గాలిని, కార్చిన కన్నీటిని – చమత్కారంగా పోతన వర్ణించాడు. ఆమె ఉన్న, వనంలోని చెట్లు ఆ గాలిని పీల్చుకొన్నాయి. ఆ కన్నీటిని ఆరగించాయి అని. ఇందులోను మరొక చమత్కారం ఉంది. మనం విడిచిన గాలే చెట్లకు ఉపయోగం కదా! అలాగే – కన్నీరు కూడా చెట్లకు ప్రయోజనమే. ఇంతేకాదు పద్యంలో మరొక సొగసు కనిపిస్తుంది. ఆ రామభూజాత – పదబంధాన్ని ఆ రామభూజాత అని విడగొట్టితే – సీత "ఆ రాముని సీత" అనియు తెలుస్తుంది. సీత గడిపింది అశోకవనంలో అయినా ఆమెకది శోకవనమే అయింది. ఆమె భూజాత, ఆయన భూమీశుడు చక్కని సమన్వయం.

**వ. కని రామచంద్రుండును దాపంబు నొంది, భార్యవలన దోషంబు లేకుండుట వహ్నివలనం బ్రకటంబు సేసి, దేవతల పంపున దేవింజేకొని. 313**

**ప్రతి :** రామచంద్రుండును= శ్రీరాముడు కూడా; కని= సీతనుచూచి; తాపంబును+ఒంది= బాధపడి; భార్యవలన దోషంబు లేకుండుట= తప్పు లేకపోవడం అనేది; వహ్నివలనన్= అగ్నిద్వారా; ప్రకటంబు+చేసి= ప్రకటించి; పంపునన్= దేవతల ఆజ్ఞమేరకు; దేవిన్+చేకొని= సీతను స్వీకరించి;

**తా :** రామచంద్రుడు సీతను చూచి దుఃఖపడి, భార్య వలన దోషం లేదనే విషయాన్ని అగ్నిద్వారా ప్రకటించి దేవతల అనుజ్ఞమేరకు దేవి సీతను స్వీకరించాడు.

**ఉ. శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు రాక్షసేంద్రతా**
**శేషవిభూతిఁగల్పసమజీవివి గ మ్మని నిల్పె నర్థి సం**
**తోషణుఁబాపశోషణు నదూషణు శశ్వదరోషణున్ మితా**
**భాషణు నార్యపోషణుఁగృపాగుణభూషణు న వ్విభీషణున్. 314**

**ప్రతి :** శోషిత దానవుండు= రాక్షసుని నశింపజేసినవాడు; నృపసోముఁడు= రాజచంద్రుడు అయిన; రాముఁడు= శ్రీరామచంద్రుడు; అర్థిసంతోషణున్= యాచకులను సంతోషపరిచేవాడు; పాపశోషణున్= పాపాన్ని ఎండగట్టినవాడు; అదూషణున్= దోషరహితుడు; శశ్వత్+అరోషణున్= ఎప్పుడూ కూడా కోపంలేనివాడు; మిత+ఆభాషణున్= హద్దుదాటని నిందుమాటకలవాడు; ఆర్యపోషణున్= పెద్దలను సంతోషపెట్టేవాడు; కృపాగుణ భూషణున్= దయాగుణం ఆభరణంగా

కలవాడు అయిన; ఆ+విభీషణున్= ఆ విభీషణుని; రాక్షస+ఇంద్రతా+అశేష విభూతిన్= రాక్షసాధిపత్యమనే ఐశ్వర్యంతో; కల్పసమజీవివిన్+కమ్ము+అని= కల్పాంతం జీవించమని; అర్థిన్= కోరి; నిల్పెన్= నిలబెట్టాడు;

**తా :** దానవుని చంపిన రాజచంద్రుడు రామచంద్రుడు అప్పుడు యాచకులను సంతోషపెట్టేవాడు, పాప, దోష రహితుడు, కోపం లేనివాడు, నిండుదనంతో కూడిన మితమైన మాటకారితనం కలవాడు. పెద్దలను సంతోషపెట్టేవాడు, దయాగుణశీలి అయిన విభీషణుని రాక్షసాధిపత్యం అనే ఐశ్వర్యంతో కల్పాంతం ఉండమని సింహాసనంపై నిలిపాడు.

**వ. ఇట్లు విభీషణ సంస్థాపనుండై రామచంద్రుండు సీతాలక్ష్మణసమేతుండై, సుగ్రీవహనుమదాదులం గూడికొని, పుష్పకారూఢుండై , వేల్పులు గురియు పువ్వుల సోనలం దడియుచుఁ దొల్లి వచ్చిన తెరువు జాడలు సీతకు నెఱింగించుచు, మరలి నందిగ్రామంబునకు వచ్చె; నయ్యవసరంబున. 315**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విభీషణ సంస్థాపనుండు+ఐ= విభీషణుని ప్రతిష్ఠించినవాడై; రామచంద్రుండు= శ్రీరామచంద్రుడు; సీతాలక్ష్మణ సమేతుండు+ఐ= సీతాలక్ష్మణులతో కూడి; సుగ్రీవ, హనుమత్+ఆదులన్= సుగ్రీవుడు, ఆంజనేయుడు మొదలైనవారిని; కూడికొని= కలుపుకొని; పుష్పక+ఆరూఢుడు+ఐ= పుష్పక విమానమెక్కి; వేల్పులున్+కురియు= దేవతలు కురిపించు; పువ్వుల సోనలన్+తడియుచున్= పూలవానలో తడుస్తూ; తొల్లి, వచ్చిన, తెరువు జాడలు= పూర్వము వచ్చిన దారితెన్నుల్ని; సీతకున్+ఎఱిగించుచున్= సీతాదేవికి తెలుపుతూ; మరలి= వెనుతిరిగి; నందిగ్రామంబునకున్+వచ్చెన్= నందిగ్రామానికి వచ్చాడు; ఆ+అవసరంబున= ఆ సమయంలో...

**తా :** ఈ విధంగా విభీషణుని లంకారాజ్యంలో ప్రతిష్ఠించి, శ్రీరాముడు సీతాలక్ష్మణులతో కలిసి, హనుమదాదులతో పుష్పకాన్నెక్కి, దేవతలు కురిపించు పూలవానలో తడుస్తూ, పూర్వం తాము వచ్చిన దారి గుర్తులను సీతకు చెబుతూ నందిగ్రామానికి వచ్చాడు. అపుడు

**ఆ. రామచంద్రవిభుని రాక వీనుల విని, భరతుఁడుత్సహించి పాదుకలను**
**మోచికొనుచు వచ్చి ముదముతోఁబురజను, లెల్లఁ గొలువ నన్న కెదురు వచ్చె. 316**

**ప్రతి :** రామచంద్రువిభునిరాకన్= రామచంద్ర ప్రభువు రావడాన్ని; వీనులన్+విని= చెవులారవిని; భరతుఁడు+ఉత్సహించి= భరతుడు ఉత్సాహంపొంది; ముదముతోన్= సంతోషంతో; పురజనులు+ఎల్లన్+కొలువన్= నగర ప్రజలందరూ సేవిస్తుండగా; పాదుకలను= పాదుకలను; మోచికొనుచున్+వచ్చి= మోసుకుంటూ వచ్చి; అన్నకు+ఎదురువచ్చెన్= సోదరునికెదురుగా వచ్చాడు.

**తా :** శ్రీరామచంద్రుని రాకను ఆనందంగా విన్న భరతుడు ఉత్సాహంగా, పురజనులందరూ కలసి రాగా పాదుకల్ని తలపై ధరించి సోదరుని కెదురు వచ్చాడు.

**వ. వచ్చి, పాదుకల ముందట నిడికొని, యెడనెడ సాష్టాంగ దండప్రణామంబులు సేయుచు, మెల్లమెల్లన డాసి, రామచంద్రుని పాదంబులు దన నొసలం గదియించి, తచ్చరణ రేణువులు దుడిచి, శిరంబునం జల్లికొని తనివిలేక మఱియు, నప్పదకమలంబు లక్కున మోపికొనుచు, సంతసంపుఁగన్నీటం గడిగి, సేమంబు లరయుచుండె. నంత సీతాలక్ష్మణ సహితుండై విభుండును, దన కెదురు వచ్చిన బ్రాహ్మణ జనంబులకు నమస్కరించి తక్కిన వారలచేత మన్ననలు వొంది వారల మన్నించె, నయ్యవసరంబున. 317**

**ప్రతి :** వచ్చి= అట్లా వచ్చి; పాదుకల ముందటన్+ఇడికొని= పాదుకల్ని ముందుపెట్టుకొని; ఎడన్+ఎడన్= మధ్యమధ్య; స+అష్ట+అంగ= ఎనిమిది అంగములతోడి; దండ ప్రణామంబులు+చేయుచు= దండ నమస్కారాలుచేస్తూ; మెల్ల మెల్లన= నెమ్మదిగా; డాసి= సమీపించి; రామచంద్రునిపాదంబులు= శ్రీరాముని పాదాల్ని; తననొసలన్+కదియించి= తన నొసట చేరుస్తూ; తత్+చరణరేణువులు= ఆ పాదధూళిని; తుడిచి= తుడిచి; శిరంబునన్+చల్లికొని= నెత్తిన చల్లుకొని; తనివిలేక మఱియు= తృప్తినొందక ఇంకా; ఆ+పదకమలంబులు= ఆ పాద పద్మాల్ని; అక్కునన్+మోపికొనుచు= ఱొమ్మున తగిలిస్తూ; సంతసము+కన్నీటన్= ఆనందబాష్పాలతో; కడిగి= కడిగి; క్షేమంబులు+అరయు+చుండె= యోగక్షేమాల్ని విచారిస్తూ ఉన్నాడు; అంతన్= అప్పుడు; సీతాలక్ష్మణ సహితుండు+ఐ= సీతాలక్ష్మణులతో కూడి; విభుండును= రాజైన రాముడు; తనకున్+ఎదురు వచ్చిన= తనకు ఎదురుగా వచ్చిన; బ్రాహ్మణ జనంబులకున్= బ్రాహ్మణ సమూహానికి; నమస్కరించి= నమస్కారంచేసి; తక్కిన వారలచేతన్= మిగిలిన వారితో; మన్ననలు+పొంది= ప్రేమను పొంది; వారలన్+మన్నించెన్= వారిని గౌరవించాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** అలా వచ్చి పాదుకలను ముందుపెట్టుకొని మధ్యమధ్య సాష్టాంగ నమస్కారాలు చేస్తూ మెల్లగా సమీపించి, రాముని పాదాలను తన నుదిటికి తగిలించి, ఆ పాద ధూళిని తుడిచి నెత్తిపై చల్లుకొని, అంతటితో తృప్తిపొందక ఆతని పాదాలను అక్కున మోపుకొని, ఆనంద బాష్పాలతో కడిగి క్షేమా లడిగాడు. అప్పుడు సీతాలక్ష్మణులతో ఉన్న రాముడు తనకెదురుగా వచ్చిన బ్రాహ్మణులకు నమస్కరించి, మిగిలిన వారిచేత ఆదరింపబడి వాళ్లను తాను ఆదరించాడు. అపుడు

**చ.** **నృపవర! పెక్కునాళ్ల గొలె నిన్ గనకుండిన యట్టి నేఁడు మా**
**తపములు పండె నిందఱము ధన్యుల మైతి మటంచుఁబుట్టముల్**
**చపలతఁద్రిప్పి పువ్వుల వసంతము లాడుచుఁబాడుచున్ గత**
**త్రపులయి యాడుచుం బ్రజలు దద్దయుఁబండుగ సేసి రెల్లెడన్. 318**

**ప్రతి :** నృపవర!= ఓ రాజా!; పెక్కునాళ్లగొలె= చాలరోజులనుండి; నిన్+కనక+ఉండిన= నిన్ను చూడలేకుండా ఉండిన; అట్టి నేఁడు= అలాంటి ఈ రోజు; మా తపములు పండెన్= మా తపస్సులు ఫలించాయి; ఇందఱము= మేమందరము; ధన్యులము+ఐతిమి= చరితార్థుల మయ్యాము; అట+అంచున్= అని అంటూ; పుట్టముల్= వస్త్రాల్ని; చపలతన్+త్రిప్పి= కదలిస్తూ తిప్పి; పువ్వుల వసంతములు= పూల వసంతాలు; ఆడుచున్= ఆడుతూ, పాడుచున్= పాటలు పాడుతూ; గతత్రపులు+అయి= సిగ్గువిడిచి; ఆడుచున్= నృత్యం చేస్తూ; ప్రజలు= అక్కడి ప్రజలు; ఎల్ల+ఎడన్= అన్నిచోట్లా (నగరమంతటా); తద్దయున్= మిక్కిలి; పండుగ+చేసిరి= వేడుక చేసుకున్నారు.

**తా :** "ఓ రాజా! చాలరోజులనుండి నిన్ను చూడలేని మేము ఈ రోజు చూడగలిగాం. మా తపసులు ఫలించాయి. కృతార్థుల మయ్యాం." అంటూ ప్రజలు వస్త్రాల్ని తిప్పుతూ ఆడుతూ పాడుతూ, నృత్యం చేస్తూ నగరమంతా మిక్కిలిగా వేడుక చేసుకున్నారు.

**సీ.** **కవ గూడి యిరుదెసఁగపిరాజు రాక్షస రాజు నొక్కెడఁజామరములు వీవ**
**హనుమంతుఁడతి ధవళాతపత్రముఁ బట్టఁ బాదుకల్ భరతుండు భక్తిఁదేర**
**శత్రుఘ్నుఁడమ్ములుఁజాపంబుఁగొనిరాఁగ సౌమిత్రి భృత్యుఁడై చనవుసూప**
**జలపాత్ర చేఁబట్టి జనకజ గూడిరాఁ గాంచనఖడ్గ మంగదుఁడు మోవఁ**

**ఆ. బసిఁడి కేడె మర్థి భల్లూకపతి మోచి, కొలువఁబుష్పకంబు వెలయ నెక్కి**
**గ్రహము లెల్లఁగొలువఁ గడు నొప్పు సంపూర్ణ, చంద్రుపగిది రామచంద్రుఁడొప్పె. 319**

**ప్రతి :** కపిరాజు = సుగ్రీవుడు, రాక్షసరాజు= విభీషణుడు; కవన్+కూడి= జతగా కలిసి; ఇరుదెసన్= రెండు వైపులా; ఒక్కెడన్= ఒకేసారి; చామరముల వీవన్= వింజామరలు విసరగా; హనుమంతుఁడు= ఆంజనేయుడు; అతిధవళ+ఆతపత్రమున్+పట్టన్= మిక్కిలి తెల్లని గొడుగును పట్టగా; భరతుండు= భరతుడు; పాదుకల్= పాదుకలను; భక్తిన్+తేరన్= భక్తితో తేగా; శత్రుఘ్నుఁడు= శత్రుఘ్నుడు; అమ్ములున్+చాపంబున్+కొనిరాఁగన్= బాణాలు విల్లు తీసుకొనిరాగా; సౌమిత్రి= సుమిత్రానందనుడైన లక్ష్మణుడు; భృత్యుఁడు+ఐ= సేవకుడై; చనవు+చూపన్= ఆత్మీయతను ప్రదర్శించగా; జనకజ= సీతాదేవి; జలపాత్రచేన్+పట్టి= జలపాత్రను చేతితో పట్టుకొని; కూడిరాన్= వెంట నడవగా; అంగదుఁడు= అంగదుడు; కాంచన ఖడ్గము= బంగారు ఖడ్గాన్ని; మోవన్= మోయగా; భల్లూకపతి= జాంబవంతుడు; అర్థిన్= కోరికతో; పసిఁడికేడెము= బంగారు డాలును; మోచికొలువన్= మోస్తూ సేవించగా, గ్రహములు+ఎల్లన్= సమస్త గ్రహాలూ; కొలువన్= సేవిస్తుండగా; కడున్+ఒప్పు= మిక్కిలి ప్రకాశించే; సంపూర్ణ చంద్రుపగిది= పూర్ణచంద్రునివలె; పుష్పకంబు= పుష్పకాన్ని; వెలయన్= ప్రసన్నంగా; ఎక్కి= అధిరోహించి; రామచంద్రుడు; ఒప్పెన్= ప్రకాశించెను.

**తా :** సుగ్రీవుడు, విభీషణుడు జతగా ఇరువైపులా వింజామరలు వీస్తుండగా, మారుతి తెల్లగొడుగు పట్టగా, భరతుడు పాదుకల్ని భక్తితో తేగా, శత్రుఘ్నుడు ధనుర్బాణాలు తీసుకొని రాగా, లక్ష్మణుడు సేవకుడై సన్నిహితత్వాన్ని చూపించగా, సీతాదేవి జలపాత్ర తీసుకొని వెంట నడవగా, అంగదుడు బంగారు ఖడ్గాన్ని, జాంబవంతుడు బంగారు డాలును మోస్తూ సేవిస్తుండగా; సమస్త గ్రహాలు కొలుస్తున్న పూర్ణ చంద్రునివలె శ్రీరామచంద్రుడు పుష్పక విమానమెక్కి ప్రకాశించాడు.

**వ. ఇట్లు పుష్పకారూఢుండై, కపిబలంబులు చేరి కొలువ, శ్రీరామచంద్రుం డయోధ్యకుం జనియె. నంతకు మున్న య ప్పురంబునందు. 320**

**ప్రతి :** ఇట్లు= ఇలా; పుష్పక+ఆరూఢుండు+ఐ= పుష్పకాన్నెక్కినవాడై; కపిబలంబులు= వానర సైన్యాలు; చేరికొలువ= దగ్గరచేరి సేవించగా; శ్రీరామచంద్రుండు; అయోధ్యకున్+చనియెన్= అయోధ్యకు వెళ్లాడు; అంతకుమున్ను+అ= అంతకుముందే; ఆ+పురంబు+అందు= ఆ పురంలో...

**తా :** ఇట్లా పుష్పకాన్నెక్కి వానరసైన్యాలు తనను సేవిస్తుండగా శ్రీరాముడు అయోధ్య చేరాడు. అంతకు ముందే ఆ నగరంలో

**సీ. వీథులు సక్కఁగావించి, తోయంబులు సల్లి రంభాస్తంభచయము నిలిపి**
**పట్టుచీరెలు సుట్టి, బహుతోరణంబులు గలువడంబులు మేలుకట్లు గట్టి**
**వేదిక లలికించి, వివిధరత్నంబుల ముగ్గులు పలుచందములుగఁబెట్టి**
**కలయ గోడల రామకథలెల్ల వ్రాయించి, ప్రాసాదముల దేవభవనములను**

**తే. గోపురంబుల బంగారు కుండలెత్తి యెల్ల వాకిండ్లఁగానుక లేర్పరించి**
**జనులు గైసేసి తూర్యఘోషములతోడ నెదురు నడతెంచి రా రాఘవేంద్రుకడకు. 321**

**ప్రతి :** వీథులు= వీథులను; చక్కన్+కావించి= శుభ్రపరచి; తోయంబులు+చల్లి= నీళ్లు చల్లి; రంభాస్తంభచయమున్+నిలిపి= అరటి స్తంభాలను నిలబెట్టి; పట్టుచీరెలు+చుట్టి= పట్టు వస్త్రాలను చుట్టి; బహుతోరణంబులు= అనేక తోరణాలను; కలువడంబులు= వేలాడదీసిన పూదండలను; మేలుకట్లున్+కట్టి= చాందినీలను కట్టి; వేదికలు+అలికించి= అరుగులను అలికించి; వివిధ రత్నంబుల= రకరకాల రత్నాలతో; పలుచందములుగన్= అనేక విధాలుగా; ముగ్గులు+పెట్టి= రంగవల్లులు పెట్టి; గోడలన్= కుడ్యాలపై; కలయన్= చక్కగా; రామకథలు+ఎల్లన్= రామకథలన్నింటిని; వ్రాయించి= వ్రాయించి; ప్రాసాదముల= భవనాల; దేవభవనములను= దేవాలయాల; గోపురంబుల= గోపురాల మీద; బంగారుకుండలు+ఎత్తి= బంగారు కలశాలను అమర్చి; ఎల్లవాకిండ్లన్= అన్ని వాకిళ్లలో; కానుకలు+ఏర్పరించి= కానుకలను ఏర్పాటుచేసి, జనులు= ప్రజలు; కై+చేసి= అలంకరించుకొని; తూర్యఘోషముల తోడన్= మంగళవాద్యాలతో; ఆ రాఘవ+ఇంద్రు కడకున్= ఆ రఘువంశ తిలకుని దగ్గరకు; ఎదురు నడతెంచిరి= ఎదురు వెళ్ళారు.

**తా :** పౌరులు వీథుల్ని శుభ్రపరచి, నీళ్లు చల్లి, అరటిస్తంభాలను నిలబెట్టి, పట్టువస్త్రాలను చుట్టి, తోరణాలను, వేలాడే పూదండలను, చాందినీలను కట్టి, అరుగులను అలికించి, రత్నాలతో రంగవల్లులు తీర్చి, గోడలపై అంతటా రామకథలను వ్రాయించి, భవనాల, దేవాలయాల, గోపురాల మీద బంగారు కలశాలను అమర్చి, వాకిళ్ళలో కానుకలు పెట్టి, అలంకరించుకొని నగర ప్రజలు ఆ రఘువంశతిలకుని కెదురు వెళ్ళారు.

**క. సమదగజదానధారల, దుమదుమలై యున్న పెద్ద త్రోవల తోడన్**
**రమణీయ మయ్యె నప్పురి, రమణుఁడు వచ్చినఁగరంగు రమణియపోలెన్. 322**

**ప్రతి :** ఆ+పురి= ఆ నగరం; రమణుఁడు వచ్చినన్= భర్త వస్తే; కరంగు= కరగిపోయే; రమణియ పోలెన్= భార్యలాగా; సమదగజ= మదపుటేనుగుల; దానధారలన్= మదజలధారలచే; దుమదుమలు+ఐ= మిక్కిలి తడిగలవై; పెద్ద త్రోవల తోడన్= రాజమార్గాలతో; రమణీయము+అయ్యెన్= మనోహరమాయెను.

**తా :** భర్తరాకకు కరగిపోయే భార్యలాగా ఆ నగరం మదపుటేనుగుల మదజలంతో బాగా తడిసిన రాజమార్గాలతో మనోజ్ఞమయింది.

**ఆ. రామభూవరేంద్రు రాకఁదూర్యములతో, రథగజాశ్వసుభటరాజితోడ**
**నమరెఁబురము, చంద్రుఁడరుదేర ఘూర్ణిల్లు, జంతుభంగమిళిత జలధిభంగి. 323**

**ప్రతి :** చంద్రుఁడు+అరుదేరన్= చంద్రుడు రాగా; ఘూర్ణిల్లు= తిరుగుడుపడే; జంతు భంగ= ప్రాణులతోడి, కెరటాలతోడి; మిళిత= కలసిన; జలధిభంగి= సముద్రమువలె; పురము= నగరం; రామభూవర+ఇంద్రురాకన్= శ్రీరామచంద్రుని రాకచేత; తూర్యములతోన్= మంగళవాద్యాలతో; రథ,గజ+అశ్వ, సుభట రాజితోడన్= రథాలతో, ఏనుగులతో, గుర్రాలతో, సైనిక సమూహంతో; అమరెన్= విలసిల్లింది.

**తా :** చంద్రుడు కనిపించగా జలచరాలతో, అలలతో తిరుగుడుపడే సముద్రంలాగా, ఆ నగరం రామచంద్రుని రాకతో మంగళవాద్య శబ్దాలతో, రథాలతో, ఏనుగులతో, గుర్రాలతో, సైనిక సమూహంతో విలసిల్లింది.

**వ. 'ఇట్లొప్పుచున్న యప్పురంబు ప్రవేశించి, రాజమార్గంబుల రామచంద్రుం దరుగుచున్న సమయంబున. 324**

**ప్రతి :** ఇట్లు+ఒప్పుచున్న= ఈ విధంగా ప్రకాశిస్తున్న; ఆ+పురంబు= ఆ నగరంలో; ప్రవేశించి; రాజమార్గంబుల; రామచంద్రుండు; అరుగుచున్న= వస్తున్న; సమయంబునన్= సమయంలో...

**తా :** ఈ విధంగా విలసిల్లుతున్న ఆ నగరంలో ప్రవేశించి, రాజమార్గంలో రామచంద్రుడు వస్తున్న సమయంలో

**మ. 'ఇతఁడే రామనరేంద్రుఁ డీ యబల కాయింద్రారి ఖండించె న**
**ల్లతఁడే లక్ష్మణుఁ డాతఁడే కపివరుం డా పొంతవాఁడే మరు**
**త్సుతుఁ డాచెంగట నా విభీషణుఁ' డటంచుం జేతులం జూపుచున్**
**సతులెల్లన్ బరికించి చూచిరి పురీసౌధాగ్రభాగంబులన్. 325**

**ప్రతి :** ఇతఁడు+ఏ= ఈతడే; రామనర+ఇంద్రుఁడు= శ్రీరామచంద్రుడు; ఈ అబలకు= ఈ అబల (సీత)కోసమే; ఆ ఇంద్ర+అరిన్= ఆ ఇంద్రుని శత్రువైన రావణుని; ఖండించెన్= చంపాడు; అల్ల+అతఁడు+ఏ= అల్లదిగో ఆయనే; లక్ష్మణుఁడు= లక్ష్మణుడు; ఆతఁడు+ఏ= అతడే; కపివరుఁడు= వానరశ్రేష్ఠుడు (సుగ్రీవుడు); ఆ పొంతవాఁడు+ఏ= ఆ దగ్గరగా ఉన్నవాడే; మరుత్+సుతుఁడు= వాయునందనుడైన హనుమంతుడు; ఆ చెంగటన్= ఆ సమీపంలో; ఆ విభీషణుఁడు= ఆ విభీషణుడు; అటంచున్= అని అంటూ; చేతులన్+చూపుచున్= చేతులతో చూపిస్తూ; పురీసౌధ+అగ్రభాగంబులన్= నగరంలోని భవనాలపై నుండి; సతులు+ఎల్లన్= స్త్రీలందరూ; పరికించి చూచిరి= పరీక్షించి చూచారు.

**తా :** 'ఇతడే రాముడు. ఈమే సీత. ఈ అబల కోసమే రాముడు రావణుని చంపాడు. అదిగో ఆయనే లక్ష్మణుడు. అతడే సుగ్రీవుడు. ఆ దగ్గర ఉన్నవాడు హనుమంతుడు. ఆ సమీపంలో విభీషణుడు' అని అంటూ చేతులతో నిర్దేశిస్తూ నగరంలోని భవనాలపై నుండి స్త్రీలందరు పరీక్షించి చూచారు.

**వ. ఇట్లు సమస్త జనులు సూచుచుండ రామచంద్రుండు రాజమార్గంబునం జనిచని. 326**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సమస్తజనులు= ప్రజలందరూ; చూచుచుండన్= చూస్తూ ఉండగా; రామచంద్రుండు; రాజమార్గంబున్= రాజమార్గంలో; చని చని= వెళ్ళి...

**సీ. పటికంపు గోడలు పవడంపు వాకిండ్లు నీలంపు టరుగులు నెఱయఁ గలిగి**
**కమనీయవైడూర్యక స్తంభ చయముల మకరతోరణముల మహిత మగుచుఁ**
**బడగల మాణిక్యబద్ధచేలంబులఁ జిగురుతోరణములఁజెలువు మీఱి**
**పుష్పదామకముల భూరివాసనలను బహుతరధూపదీపముల మెఱసి**

**తే. మాఱువేల్పుల భంగిని మలయుచున్న, సతులు పురుషులు నెప్పుడు సందడింప**
**గుఱుతు లిడరాని ధనముల కుప్పలున్న, రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు. 327**

**ప్రతి :** పటికంపుగోడలు= స్ఫటికపుగోడలు; పవడము+వాకిండ్లు= పగడాలు తాపిన తలుపులు; నీలము+అరుగులు= ఇంద్రనీలాలు పొదిగిన అరుగులు; నెఱయన్+కలిగి= అందంగా ఉంటూ; కమనీయ= మనోజ్ఞమైన; వైడూర్యకస్తంభచయముల=

వైడూర్యాలు పొదిగిన స్తంభాలతో; మకర తోరణములన్= మకర తోరణాలతో; మహితము+అగుచున్= గొప్పగా ఉన్న; పడగల= జెండాలను; మాణిక్యబద్ధ చేలంబులన్= మాణిక్యాలు చేర్చిన వస్త్రాలతో; చిగురు తోరణములన్= లేతఆకుల తోరణాలతో; చెలువుమీఱి= అందగించగా; పుష్పదామకముల= పూలదండల; భూరివాసనలను= గొప్ప సువాసనలతో; బహుతర= అనేకమైన; ధూపదీపముల మెఱసి= ధూప దీపాలతో ప్రకాశిస్తూ; మాఱు వేల్పుల భంగిని= మరోదేవతలవలె; మలయుచున్న= తిరుగుతున్న; సతులు పురుషులున్= స్త్రీ పురుషులు; ఎప్పుడు సందడింప= నిరంతరం సందడి చేస్తుండగా; గుఱుతులు+ఇడరాని= లెక్కపెట్టలేనన్ని; ధనముల కుప్పలు+ఉన్న= ధనరాశులున్న; రాజసదనంబునకున్= రాజప్రాసాదంలోకి; రామవిభుఁడు వచ్చెన్= శ్రీరాముడు వచ్చాడు.

**తా :** ఈ విధంగా ప్రజలు తిలకిస్తుండగా రామచంద్రుడు రాజమార్గంలో వెళ్ళి, స్ఫటికపు గోడలు, పగడాల వాకిళ్ళు, ఇంద్రనీలమణులు పొదిగిన అరుగులు కలిగి, వైడూర్యాలు పొదిగిన స్తంభాలతో మకరతోరణాలతో విలసిల్లేది, పూలదండల వాసనలతో, అనేక ధూప దీపాలతో ప్రకాశిస్తున్నది, దేవతా మూర్తులవలె ఉన్న స్త్రీ పురుషుల సంచారంవల్ల సందడిగా ఉండేది, అంతులేని ధనరాశులకు నిలయమైనది అయిన రాజప్రాసాదంలో అడుగుపెట్టాడు.

**వ. ఇట్లు వచ్చి. 328**

**ప్రతి :** ఇట్లు వచ్చి= ఈ విధంగా వచ్చి...

**ఉ. తల్లుల కెల్ల మ్రొక్కి తమ తల్లికి వందన మాచరించి య**
**ల్లల్ల బుధాలికిన్ వినతుఁడై చెలికాండ్రను దమ్ములం బ్రసం**
**పుల్లతఁ గౌఁగిలించుకొని భూవరుఁడోలిఁ గృపారసంబు రం**
**జిల్లఁగఁజాల మన్ననలు సేసె నమాత్యులఁ బూర్వభృత్యులన్. 329**

**ప్రతి :** ఇట్లు వచ్చి= ఈ విధంగా ప్రవేశించి; భూవరుఁడు= రాజైన రాముడు; ఓలిన్= క్రమంగా; తల్లులకు+ఎల్లన్= తల్లులందరికి; మ్రొక్కి= నమస్కరించి; తమతల్లికిన్= తన తల్లి కౌసల్యకు; వందనము+ఆచరించి= నమస్కరించి; అల్ల+అల్లన్= మెలమెల్లగా; బుధ+ఆలికిన్= పండితుల సమూహానికి; వినతుఁడు+ఐ= వినయంగా మ్రొక్కి; చెలికాండ్రను= స్నేహితులను; తమ్ములన్= తమ్ములను; ప్రసంపుల్లతన్= మిక్కిలి ఆదరంతో; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసి; అమాత్యులన్+ పూర్వభృత్యులన్= మంత్రులను, పూర్వసేవకులను; కృపారసంబు రంజిల్లగాన్= దయారసం ఉట్టిపడుతుండగా; చాల మన్ననలు+చేసెన్= ఎంతగానో గౌరవించాడు.

**తా :** ఈ విధంగా రాజభవనం ప్రవేశించి, రాముడు క్రమంగా తల్లులందరికి నమస్కరించి, తన తల్లి కౌసల్యకు మ్రొక్కి, పండితులయందు వినయుడై, స్నేహితులను, తమ్ముళ్లను ఆదరంతో చేరదీసి, మంత్రులను, పూర్వ సేవకులను దయాభావంతో గౌరవించాడు.

**విశే :** రాముడు విభిన్నమైన వ్యక్తులతో ఎలా మెలిగాడో చెప్పబడింది. తల్లులకు వందనం, పండితులపట్ల వినయం, స్నేహితులపట్ల ఆదరం, మంత్రులు, సేవకులపట్ల గౌరవం – ఇది శ్రీరాముని వ్యక్తిత్వ ఔన్నత్యం. అందుకే ఆతడు సర్వుల అభిమానాన్ని చూరగొన్నాడు. అందుకే ఆయన చరిత్ర వాల్మీకి వంటివారెందరో రాశారు. ఆయన చరిత్ర సర్వమానవాళికి అనుసరణీయమైంది.

**వ. తత్సమయంబునఁదల్లులు. 330**

**చ. కొడుకులుఁ బెద్దకోడలును గొబ్బున మ్రొక్కిన నెత్తి చేతులన్**
**బుడుకుచు మోములుం దలలు బోరన ముద్దులు గొంచు నవ్వుచున్**
**దొడలకు వారి రాఁదిగిచి తోఁగఁగఁ జేసిరి నేత్రధారలన్**
**వెడలిన ప్రాణముల్ దగఁ బ్రవిష్టము లయ్యె నటంచు నుబ్బుచున్. 331**

**ప్రతి :** తత్+సమయంబునన్= ఆ సమయంలో; తల్లులు= కౌసల్యాది జనయిత్రులు; కొడుకులున్+పెద్దకోడలును= కుమారులు, పెద్దకోడలు సీతయు; గొబ్బునన్= వెంటనే; మ్రొక్కినన్+ఎత్తి= నమస్కరించగా లేవనెత్తి; చేతులన్+పుడుకుచు= చేతులతో తడుముతూ; మోములున్+తలలున్= ముఖాలు, తలలును; బోరన= వడిగా; ముద్దులు+కొంచు= ముద్దులు తీసుకొంటూ; నవ్వుచున్= నవ్వుతూ; తొడలకు+వారిన్+రాన్+తిగిచి= వారిని ఒడిలోకి తీసుకొని; నేత్రధారలన్= కన్నీటితో; వెడలిన ప్రాణముల్= పోయిన ప్రాణాలు; తగన్+ప్రవిష్టములు+అయ్యెన్= తిరిగి వచ్చాయి; అటంచున్+ఉబ్బుచున్= అంటూ పొంగిపోతూ; తోఁగఁగన్+చేసిరి= తడిపివేశారు;

**తా :** అపుడు కౌసల్య మొదలైన తల్లులు, కొడుకులు, పెద్దకోడలు గౌరవంతో నమస్కరించగా లేవనెత్తి, వారిని చేతులతో తడుముతూ, ముఖాలను తలలను ముద్దులాడుతూ, నవ్వుతూ ఒడిలోకి తీసికొని 'పోయిన ప్రాణాలు తిరిగి వచ్చాయి అంటూ పొంగిపోతూ, కన్నీటితో వారిని తడిపి వేశారు.

**వ. అంత వసిష్ఠుండు, శ్రీరామచంద్రుని జటాబంధంబు విడిపించి, కులవృద్ధులుం, దానును సమంత్రకంబుగా దేవేంద్రుని మంగళస్నానంబు సేయించు బృహస్పతి చందంబున, సముద్ర నదీ జలంబుల నభిషేకంబు సేయించె; రఘువరుండును, సీతాసమేతుండై, జలంబు లాడి, మంచిపుట్టంబులు గట్టికొని, కమ్మని పువ్వులు దుఱిమి , సుగంధంబు లలందికొని, తొడవులు దొడిగికొని, తనకు భరతుండు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి, యతని మన్నించి, కౌసల్యకుఁ బ్రియంబు సేయుచు, జగత్పూజ్యంబుగా రాజ్యంబు సేయుచుండె; నప్పుడు. 332**

**ప్రతి :** అంతన్= అప్పుడు; వసిష్ఠుండు= వసిష్ఠముని; శ్రీరామచంద్రుని జటాబంధంబున్= శ్రీరాముని సిగముడిని; విడిపించి= విప్పించి; కులవృద్ధులున్+తానును= కులవృద్ధులు, తానూ; సమంత్రకంబుగాన్= మంత్రాలతో; దేవ+ఇంద్రుని= దేవేంద్రునికి; మంగళస్నానంబున్+చేయించు= మంగళస్నానం చేయించే; బృహస్పతి చందంబునన్= బృహస్పతి రీతిగా; సముద్రనదీజలంబులన్= సముద్రమందలి, నదులయందలి నీటితో; అభిషేకంబు+చేయించెన్= అభిషేకం చేయించాడు; రఘువరుండును= రఘువంశశ్రేష్ఠుడైన రాముడు; సీతా సమేతుండు+ఐ= సీతతో కలిసి; జలంబులన్+ఆడి= మంగళస్నానాలు చేసి; మంచి పుట్టంబులు+కట్టికొని= మేలిమి వస్త్రాల్ని ధరించి; కమ్మని పువ్వులున్+తుఱిమి= సువాసనగల పూలను ధరించి; సుగంధంబులు+అలందికొని= సువాసన ద్రవ్యాలను పూసుకొని; తనకున్= తనకు; భరతుండు సమర్పించిన= భరతుడు నివేదించిన; రాజసింహాసనంబునన్= రాచసింహాసనంపై; కూర్చుండి= కూర్చొని; అతనిన్+మన్నించి= ఆ భరతుని ఆదరించి; కౌసల్యకున్+ప్రియంబు+చేయుచు= కౌసల్యకు ఆనందం కలుగచేస్తూ; జగత్+పూజ్యంబుగాన్= లోకం పూజించేటట్లు; రాజ్యంబున్+చేయుచు+ఉండెన్= రాజ్యం చేయసాగాడు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** అప్పుడు వసిష్ఠుడు శ్రీరామచంద్రుని సిగముడిని విప్పి, కులవృద్ధులు, తాను మంత్ర పూర్వకంగా దేవేంద్రుని మంగళస్నానం చేయించే బృహస్పతివలె సముద్ర నదీ జలాలతో అభిషేకం చేయించాడు. శ్రీరామచంద్రుడు సీతతో కూడి మంగళస్నానం చేసి, మంచి వస్త్రాలను పరిమళ పుష్పాలను ధరించి, గంధాలను రాసుకొని, ఆభరణాలు ధరించి, తనకు భరతుడిచ్చిన సింహాసనంపై కూర్చుని, అతనిని మన్నించి, కౌసల్యకు సంతోషం కలిగిస్తూ లోకం మెచ్చుకొనేటట్లు రాజ్యం చేయసాగాడు. అప్పుడు

**విశే :** వసిష్ఠుడు బృహస్పతి సదృశుడని సూచన. రామపట్టాభిషేకం కౌసల్యకు ఆనంద దాయకం. రామపరిపాలనను లోకం ప్రశంసించింది.

**సీ.** **కలఁగు టెల్లను మానెఁగంధు లేడింటికిఁ; జలనంబు మానె భూచక్రమునకు;**
**జాగరూకత మానె జలజలోచనునకు; దీనభావము మానె దిక్పతులకు;**
**మాసి యుండుట మానె మార్తాండ విధులకుఁ; గావిరి మానె దిక్తటములకును;**
**నుడిగి పోవుట మానె నుర్వీరుహంబుల; కణఁగుట మానెఁద్రేతాగ్నులకును;**

**ఆ.** **గడిఁది ప్రేఁగు మానెఁ గరి గిరి కిటి నాగ, కమఠములకుఁ; బ్రజల కలఁక మానె;**
**రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు, ధరణి భరణరేఖఁదాల్చునపుడు.** **333**

**ప్రతి :** రాజ+ఇంద్రరత్నంబు= రాజులలో శ్రేష్ఠుడైన; రామచంద్రవిభుఁడు= శ్రీరామచంద్ర ప్రభువు; ధరణిన్= భూమిని; భరణరేఖన్+తాల్చు+అపుడు= ధరించినపుడు; కంధులు+ఏడింటికిన్= సప్తసముద్రాలకు; కలఁగుట+ఎల్లను మానెన్= సంక్షోభపడుట ఆగింది; భూచక్రమునకున్= భూమండలానికి; చలనంబుమానెన్= కంపము లేకుండాపోయింది; జలజలోచనునకున్= పద్మాక్షుడైన విష్ణువుకు; జాగరూకతమానె= జాగ్రత్త అవసరం లేకుండాపోయింది; దిక్+పతులకు= దిక్పాలురకు; దీనభావము మానె= దైన్యస్థితి పోయింది; మార్తాండ, విధులకున్= సూర్యచంద్రులకు; మాసి+ఉండుటన్+మానె= మాలిన్యం లేకుండాపోయింది; దిక్+తటములకునున్= దిక్కుల చివరలకు; కావిరి మానె= కావి రంగు లేకుండాపోయింది; ఉర్వీరుహములకున్= చెట్లకు; ఉడిగి పోవుట మానె= మోడువారడం లేకుండాపోయింది; త్రేత+అగ్నులకును= మూడగ్నులకు; అణఁగుట మానెన్= అణగిపోవడం లేకుండాపోయింది; కరి= దిగ్గజాలకు; గిరి= కులపర్వతాలకు; కిటి= వరాహానికి; నాగ= శేషునికి; కమఠములకున్= కూర్మానికి; కడిఁది ప్రేఁగు మానెన్= మిక్కిలి బరువు లేకుండాపోయింది; ప్రజల కలఁక మానె= జనులకు దుఃఖం లేకుండాపోయింది.

**తా :** రాజేంద్రుడైన రామచంద్రుడు భూభారాన్ని వహిస్తుండగా సప్తసముద్రాలకు అలజడి లేదు. భూమండలానికి కంపం లేదు. శ్రీమహావిష్ణువునకు జాగరూకత లేదు. దిక్పాలురకు దీనత్వం లేదు. సూర్యచంద్రులకు మసక లేదు. దిగంతాలకు కావి వర్ణం లేదు. చెట్లు మోడువారలేదు. త్రేతాగ్నులు ఆరిపోలేదు. దిగ్గజాలకు, కులపర్వతాలకు, వరాహానికి, శేషునికి, కూర్మానికి బరువు తీరింది. ప్రజలకు దుఃఖం లేకుండా పోయింది.

**విశే :** రామరాజ్యం ప్రజానందకరంగా సాగిందని భావం. సప్తసముద్రాలకు అలజడి, భూకంపాలు మొదలైన ప్రకృతి వైపరీత్యాలు లేవు. నిరంతరం జాగ్రత్త అవసరమైన విష్ణువునకు అట్టి స్థితిలేదు. లోకానికి వెలుగును ప్రసాదించే సూర్యచంద్రులు. తేజోవంతులయ్యారు. త్రేతాగ్నులు నిరంతరం తేజోవంతమై ప్రజ్వరిల్లుతున్నాయి. ఈ భూమియొక్క భారాన్ని అది వరకే

అష్టదిగ్గజాలు, కులపర్వతాలు, ఆదివరాహం, ఆదికూర్మం, ఆదిశేషుడు మోస్తున్నారు. ఇప్పుడు శ్రీరాముడు ఆ భారాన్ని వహించుటంచేత వీరికి విశ్రాంతి లభించింది.

**అష్టదిగ్గజాలు :** ఐరావతం, పుండరీకం, వామనం, కుముదం, అంజనం, పుష్పదంతం, సార్వభౌమం, సుప్రతీకం.

**సప్త కులపర్వతాలు :** మహేంద్రం, మలయం, సహ్యం, శుక్తిమంతం, గంధమాదనం, వింధ్యం, పారియాత్రం.

**వ. మఱియును. 334**

**సీ. పొలఁతుల వాలుఁజూపులయంద చాంచల్య; మబలల నడుములయంద లేమి;**
**కాంతాలకములంద కౌటిల్యసంచార; మతివల నడపులయంద జడిమ;**
**ముగుదల పరిరంభములయంద పీడన; మంగనాకుచములయందు పోరు;**
**పడఁతుల రతులంద బంధసద్భావంబు;సతులఁ బాయుటయంద సంజ్వరంబు;**

**తే. ప్రియులు ప్రియురాండ్ర మనముల బెరసి తార్పు, లంద చౌర్యంబు; వల్లభు లాత్మసతుల**
**నాఁగి క్రొమ్ముళ్ళు పట్టులందక్రమంబు; రామచంద్రుండు పాలించు రాజ్యమందు. 335**

**ప్రతి :** రామచంద్రుండు; పాలించు= పరిపాలించే; రాజ్యము+అందున్= రాజ్యంలో; పొలఁతుల= స్త్రీలయొక్క; వాలుచూపులు+అందు+అ= కడగంటి చూపులలోనే; చాంచల్యము= చంచలత్వం; అబలల నడుముల+అందు+అ= స్త్రీల నడుములలోనే; లేమి= పేదరికం; కాంతా+అలకముల+అందు+అ= స్త్రీల కేశాలలోనే; కౌటిల్యసంచారము= వంకర ప్రవర్తన; అతివల= స్త్రీల; నడపుల+అందు+అ= నడకలలోనే; జడిమ= జడత్వం (మందం); ముగుదల= స్త్రీల; పరిరంభముల+అందు+అ= కౌగిలింతలలోనే; పీడనము= బాధించడం; అంగనాకుచముల+అందు= స్త్రీల స్తనాలయందే; పోరు= పోరాటం; పడఁతుల రతుల+అందు+అ= స్త్రీలతోటి కలయికలోనే; బంధ సద్భావంబు= బంధాల ఆలోచన; సతులన్= భార్యలను; పాయుట+అందు+అ= ఎడబాటులోనే; సంజ్వరంబు= తాపం; ప్రియులు; ప్రియురాండ్ర= ప్రేయసుల; మనములన్+బెరసి= మనస్సులనుపొంది; తార్పులు+అందు+అ= దోచుకోవడంలోనే; చౌర్యంబు= దొంగతనం; వల్లభులు= భర్తలు; ఆత్మసతులన్+ఆఁగి= తమ భార్యలను ఆపి; క్రొత్త+ముళ్లు= కొత్త జడ ముడులను; పట్టులందు= పట్టుకోవడం లోనే; అక్రమంబు= అన్యాయం (ఉండేది.)

**తా :** అంతేగాక ఆ రామచంద్రుడు పరిపాలించే రాజ్యంలో చంచలత్వం స్త్రీల వాలు చూపులలోనే, పేదఱికం ముగ్ధల నడుములోనే, కుటిలంగా సంచరించడం స్త్రీల కేశాలలోనే, మందత్వం; స్త్రీల నడవడికలోనే పీడించడం స్త్రీల కౌగిలింతలలోనే, యుద్ధం స్త్రీల స్తనాల విషయంలోనే, బంధనం స్త్రీలతో కలయికలోనే, జ్వరం భార్యల ఎడబాటులోనే, దొంగతనం ప్రియుడు ప్రియురాండ్ర మనసులను దోచుకొనే విషయంలోనే, అక్రమం భర్తలు భార్యల జడలుపట్టుకొని ఆపడంలోనే ఉండేవి.

**విశే :** రాజ్యంలో సంపదల అస్థిరత, పేదఱికం, కుటిల ప్రవర్తన, చైతన్యరాహిత్యం, యుద్ధం, తాపం, దొంగతనం, అక్రమం వంటి విషయాలు సాధారణంగా ఉంటాయి. రామరాజ్యంలో స్త్రీపురుషుల కలయిక విషయంలోనే ఉన్నాయి ఇవన్నీ. అంటే ప్రజలు ఈతిబాధలు లేకుండా సుఖసంతోషాలతో జీవించారని భావం.

**క. తండ్రిక్రియ రామచంద్రుఁడు,దండ్రుల మఱపించి ప్రజలఁ దా రక్షింపన్**
**దండ్రుల నందఱు మఱచిరి, తండ్రిగదా రామచంద్రధరణిపుఁడనుచున్. 336**

**ప్రతి :** తండ్రిక్రియన్= తండ్రివలె; రామచంద్రుఁడున్= శ్రీరాముడు; తండ్రులన్+మఱపించి= కన్నతండ్రులను సైతం మరచిపోయేటట్లుచేసి; ప్రజలన్+తాన్+రక్షింపన్= ప్రజలను తాను కాపాడుతుండగా; రామచంద్రధరణిపుఁడు=రామచంద్ర ప్రభువు; తండ్రిగదా= తమ తండ్రేగదా; అనుచున్= అంటూ; తండ్రులన్+అందఱున్= అందరూ తమ కన్నతండ్రులను; మఱిచిరి= మరచిపోయారు.

**తా :** తండ్రిలాగా శ్రీరాముడు కన్న తండ్రులను సైతం మరపించి, ప్రజలను (రక్షించాడు) పరిపాలించాడు. వారు శ్రీరాముడే తమ తండ్రి అంటూ కన్న తండ్రులను మరచిపోయారు.

**విశే :** బిడ్డల పాలన తండ్రి ధర్మం. తండ్రి స్థానం విశిష్టమైంది. రాముడు ప్రజల కష్టసుఖాలను గుర్తెరిగి కన్న బిడ్డలవలె పరిపాలించాడు.

**వ. మఱియు, నా రామచంద్రుండు రాజర్షి చరితుండును, నిజధర్మనిరతుండును, నేకపత్నీ వ్రతుండును, సర్వలోక సమ్మతుండును నగుచు, ధర్మవిరోధంబు గాకుండఁ గోరిక లనుభవించుచుఁ ద్రేతాయుగంబైనఁ గృతయుగధర్మంబు గావించుచు, బాలమరణంబు మొదలగు నరిష్టంబులు ప్రజలకుఁ గలుగకుండ రాజ్యంబు సేయుచుండె, నయ్యెడ 337**

**ప్రతి :** మఱియున్= అంతేగాక; ఆ రామచంద్రుండు= ఆ శ్రీరామచంద్రుడు; రాజర్షి చరితుండును= రాజర్షులవంటి నడవడిక కలవాడు; నిజధర్మ= తన ధర్మంపట్ల; నిరతుండును= ఆసక్తి కలవాడు; ఏకపత్నీవ్రతుండును= ఏక భార్యావ్రతం కలవాడు; సర్వలోక సమ్మతుండు+అగుచు= అన్ని లోకాలచేత ఒప్పుదల పొందినవాడై; ధర్మవిరోధంబు= ధర్మానికి వ్యతిరేకం; కాకుండన్= కలగకుండా; కోరికల+అనుభవించుచున్= కోరికలను తీర్చుకుంటూ; త్రేతాయుగంబు+ఐనన్= త్రేతాయుగమే అయినా; కృతయుగధర్మంబున్+కావించుచు= కృతయుగ ధర్మాల్ని పాటిస్తూ; ప్రజలకు; బాలమరణంబు మొదలగున్= బాలమరణాలు మొదలైన; అరిష్టంబులు= కీడులు; కలుగక+ఉండన్= కలగకుండా;రాజ్యంబున్+ చేయుచు+ఉండెన్= రాజ్యం చేశాడు; ఆ+ఎడ= ఆ సందర్భంలో...

**తా :** అంతేగాక ఆ రామచంద్రుడు రాజర్షులవంటి నడకతో, తన ధర్మంపట్ల అభినివేశంతో, ఏకపత్నీవ్రతంతో, సర్వులకు అంగీకారయోగ్యంగా, ధర్మానికి హాని కలుగనివ్వకుండా, ఇష్టకామ్యార్థసిద్ధితో, త్రేతాయుగమైనా కృతయుగధర్మాలను పాటిస్తూ శిశుమరణాలవంటి అరిష్టాలు ప్రజలకు కలుగనివ్వక రాజ్యం చేశాడు. అప్పుడు

**ఆ. సిగ్గువడుట గల్గి సింగారమును, గల్గి, భక్తి గల్గి చాల భయము గల్గి**
**నయముఁ బ్రియముఁ గల్గి, నరనాథు చిత్తంబు, సీత దనకు వశము చేసికొనియె. 338**

**ప్రతి :** సీత= సీతాదేవి; సిగ్గు+పడుటన్+కల్గి= సిగ్గుపడుటను కలిగి; సింగారమునున్+కల్గి= శృంగారమూ కలిగి; భక్తిన్+కల్గి= భక్తి ఉండి; భయమున్+కల్గి= భయమూ కలిగి; నయమున్+ప్రియమున్+కల్గి= నేర్పరితనమూ, ఇష్టమూకలిగి; నరనాథుచిత్తము= శ్రీరాముని మనసును; తనకు వశము చేసికొనియెన్= తనకు వశం చేసికొన్నది.

**తా :** అపుడు సీతాదేవి బిడియం, శృంగారం కలిగి, భయం భక్తి కలిగి, నయమూ ప్రియమూ కలిగి భర్త మనస్సును ఆకట్టుకుంది.

**వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుఁ డిట్లనియె. 339**

**ఆ. భ్రాతృజనుల యందు బంధువులందును, బ్రజలయందు రాజభావ మొంది**
**యెట్లు మెలఁగె? రాముఁడీశ్వరుండగు తన్నుఁ, గూర్చి క్రతువు లెట్లు గోరి చేసె?' 340**

**ప్రతి :** పరీక్షిత్+నర+ఇంద్రుఁడు= పరీక్షిన్మహారాజు; రాముడు= శ్రీరామచంద్రుడు; భ్రాతృజనుల+అందును= చుట్టాలపట్ల; ప్రజల+అందున్= ప్రజలపట్ల; రాజభావము+ఒంది= రాజత్వం వహించి; ఎట్లు మెలఁగెన్= ఎలా ప్రవర్తించాడు; ఈశ్వరుండు+అగు= పరమేశ్వరుడగు; తన్నున్+కూర్చి= తనను గూర్చి; క్రతువులు= యజ్ఞాలు; ఎట్లున్+కోరి చేసెన్?= ఏ విధంగా నిర్వర్తించాడు?

**తా :** అని చెప్పగా పరీక్షిన్మహారాజు ఇట్లన్నాడు. ఆ శ్రీరాముడు రాజత్వం వహించి సోదరులపట్ల, బంధువులపట్ల, ప్రజల పట్ల ఎలా ప్రవర్తించాడు? పరమేశ్వరుడైన తనను గూర్చి తానే యజ్ఞాలు ఏ విధంగా చేశాడు?

**విశే :** సాధారణంగా రాజులు భగవంతుని గూర్చి యజ్ఞాలు చేస్తారు. ఇక్కడ చేయవలసింది ఆ భగవానుడే కదా! అవి ఎలా చేశాడని పరీక్షిత్తు ప్రశ్న.

**వ. అనిన శుకుం డిట్లనియె. 341**

**సీ. భగవంతుఁడగు రామభద్రుండు ప్రీతితో దేవోత్తముని సర్వదేవమయునిఁ**
**దనుఁదాన కూర్చి యధ్వరములు సేసెను; హోతకుఁదూరుపు; నుత్తరంబు**
**సామగాయకునికి; శమనదిగ్భాగంబు బ్రహ్మకుఁ; గ్రమమునఁబడమ రెల్ల**
**నధ్వర్యునకు; శేష మాచార్యునకు నిచ్చి సొమ్ములు పంచి భూసురుల కొసఁగి**

**తే. తనదు రెండు పుట్టంబులుఁ దనకు నైన, మెలఁత మంగళసూత్రంబు మినుకుఁ దక్క**
**వినతుఁడై యుండె; నా రాము వితరణంబు, పాండవోత్తమ! యేమని పలుకవచ్చు? 342**

**ప్రతి :** పాండవ+ఉత్తమ!= ఓ పాండవ శ్రేష్ఠుడా!; భగవంతుఁడు+అగు= భగవానుడైన; రామభద్రుండు= రామచంద్రుడు; ప్రీతితోన్= ఇష్టపూర్వకంగా; దేవ+ఉత్తముని= దేవతా శ్రేష్ఠుని; సర్వదేవమయునిన్= సమస్త దేవతామయుడైన; తనున్+తాన కూర్చి= తన్నుగూర్చి తానే; అధ్వరములు+చేసెను= యజ్ఞాలు చేశాడు; హోతకున్+తూరుపున్= హోతకు తూర్పు దిక్కును; సామగాయకునికిన్= సామగానం చేసే వానికి; ఉత్తరంబున్= ఉత్తర దిక్కును; బ్రహ్మకున్= బ్రహ్మకు; శమనదిక్+భాగంబున్= దక్షిణదిక్కును; పడమర+ఎల్లన్= పడమర దిక్కునంతటిని; అధ్వర్యునకున్= అధ్వర్యునికి; శేషము= మిగిలిన సంపద; ఆచార్యునకున్+ఇచ్చి= గురువునకొసంగి; క్రమమునన్= వరుసగా; సొమ్ములు పంచి= ఆభరణాలు ఇచ్చివేసి; తన+రెండు పుట్టంబులున్= తన రెండు వస్త్రాలు; తనకును+ఐన మెలత= తనకు సంబంధించిన భార్య; మంగళ సూత్రంబు మినుకున్+తక్క= మంగళసూత్రాల బొట్టు తప్ప; భూసురులకు+ఒసఁగి= బ్రాహ్మణులకిచ్చి; వినతుఁడై+ఉండెన్= వినయంతో మెలిగాడు; ఆ రాము వితరణంబు= ఆ శ్రీరాముని దానగుణాన్ని; ఏమి+అని పలుకవచ్చున్= ఏమని ప్రశంసించాలి?

**తా :** అని పరీక్షిత్తు ప్రశ్నిస్తే శుకుడిలాగన్నాడు. ఓ పాండవ శ్రేష్ఠుడా! భగవానుడైన రామచంద్రమూర్తి సంతోషంగా దేవతాశ్రేష్ఠుడు, సర్వదేవతామయుడు అయిన తనను గూర్చి తానే యజ్ఞాలు చేశాడు: అప్పుడు హోతకు తూరుపుదిక్కు;

సామగాయకునికి ఉత్తరదిక్కు; బ్రహ్మకు దక్షిణదిక్కు; అధ్వర్యునికి పడమర దిక్కు, మిగిలింది గురువునకు క్రమంగా దానం చేశాడు. తన రెండు వస్త్రాలు, తన భార్య మంగళసూత్రాలు తప్ప అన్ని సొమ్ములను బ్రాహ్మణులకు వితరణ చేశాడు. ఆ రాముని దానగుణాన్ని ఏమని ప్రశంసించగలం?

**విశే :** యజ్ఞక్రియలో దేవతలను ఆహ్వానించేవాడు హోత. యజుస్సులద్వారా యజ్ఞక్రియను సంపన్నం చేసేవాడు అధ్వర్యుడు. తనకున్నదంతా యజ్ఞసమయంలో దానంచేశాడు రాముడు. తన రెండు వస్త్రాలు, భార్య మంగళసూత్రం తప్ప అన్నీ దానం చేయడం వితరణకు పరాకాష్ఠ. శ్రీరాముడు తాను రాజ్యం చేస్తున్నా – ఆయనకున్నవి ఉంచుకొన్నవి రెండు వస్త్రాలు మాత్రమే.

**వ. అంత నా రామచంద్రుని దానశీలత్వంబునకు మెచ్చి విప్రవరులు తమతమ భూములు మరల నిచ్చి యిట్లనిరి. 343**

**ప్రతి :** అంతన్= అంతట; ఆ రామచంద్రుని; దానశీలత్వంబునకున్= దానస్వభావానికి; విప్రవరులు= బ్రాహ్మణ శ్రేష్ఠులు; మెచ్చి; తమ తమ భూములు= తమకు దానంగా ఇచ్చిన పొలాలు; మరల= మళ్లీ; ఇచ్చి= రామునకు సమర్పించి; ఇట్లు+అనిరి= ఇలా అన్నాడు.

**తా :** అపుడు రామచంద్రుని దానశీలానికి మెచ్చి బ్రాహ్మణశ్రేష్ఠులు తమకు దానంచేసిన భూములను తిరిగి రామునికే ఇచ్చి ఇట్లన్నారు.

**ఆ. ధరణి వలదు మాకుఁదపసుల కేల? నీ, వఖిలలోక గురుఁడవైన హరివి;**
**మా మనంబులందు మలయు చీఁకటిఁ బాపు, భవ దుదారరుచులఁబార్థివేంద్ర! 344**

**ప్రతి :** పార్థివ+ఇంద్ర= ఓ రాజశ్రేష్ఠా!; మాకు; ధరణి వలదు= భూమి వద్దు; తపసులకున్+ఏల= మునుల కెందుకు?; నీవు+అఖిలలోక= నీవు సమస్త జగాలకు; గురుఁడవు+ఐనహరివి= గురుఁడవైన శ్రీమహావిష్ణుడవు; భవత్+ఉదారరుచుల= నీయొక్క ఔదార్యకాంతులతో; మామనంబుల+అందు= మా మనసులలో; మలయు= కమ్ముకొన్న; చీఁకటిన్+పాపు= అజ్ఞానమనే చీకటిని పోగొట్టు.

**తా :** ఓ రాజశ్రేష్ఠుడా! మునులకు భూములతో పనియేమి? మాకవసరం లేదు. నీవు సర్వేశ్వరుడవైన శ్రీహరివి. మా మనసులలో ఉన్న అజ్ఞానాంధకారాన్ని నీ దయాకాంతులతో పోగొట్టు.

**వ. అని పలికి బ్రహ్మణ్యదేవుండైన రామచంద్రుని వినయోక్తులం బూజించి మునులు సని రిట్లు పెద్దకాలంబు రాజ్యంబు సేసి, రాఘవేంద్రుం డొక్కదినంబున. 345**

**ప్రతి :** అని పలికి= అని చెప్పి; బ్రహ్మణ్యదేవుండు+ఐన= పరమాత్మయైన; రామచంద్రుని= శ్రీరామచంద్రుని; వినయ+ఉక్తులన్+పూజించి= వినయపు మాటలతో పూజించి; మునులు+చనిరి= మహర్షులు వెళ్ళారు; ఇట్లున్+పెద్దకాలంబు= ఈ విధంగా చాలకాలం; రాజ్యంబున్+చేసి= రాజ్యాన్ని పాలించి; రాఘవ+ఇంద్రుడు+ ఒక్కదినంబునన్= ఒకరోజు శ్రీరాముడు...

**తా :** అని చెప్పి, బ్రహ్మణ్యదేవుడైన రామచంద్రుని వినయంతో పూజించి మునులు వెళ్ళారు. ఈ విధంగా చాలకాలం పరిపాలన చేసి ఒకనాడు శ్రీరామచంద్రుడు

**సీ. వసుధపైఁబుట్టెడు వార్త లాకర్ణించు కొఱకునై రాముండు గూఢవృత్తి**
**నడురేయిఁదిరుగుచో నాగరజనములో నొక్కఁడు దన సతి యొప్పకున్న**
**నొరునింటఁ గాఁపురం బున్న చంచలురాలిఁ బాయంగ లేక చేపట్ట నేమి**
**తా వెట్టియగు రామధరణీశ్వరుండనే, బేల! పొమ్మను మాట బిట్టు వలుక**

**ఆ. నాలకించి మఱియు నా మాట చారుల, వలన జగములోనఁగలుగఁదెలిసి**
**సీత నిద్రవోవఁ జెప్పక వాల్మీకి, పర్ణశాలఁబెట్టఁబనిచె రాత్రి. 346**

**ప్రతి :** వసుధపైన్+పుట్టెడు= భూమిలో (రాజ్యంలో) పుట్టే; వార్తలు= వార్తలను; ఆకర్ణించు కొఱకునై= వినటంకోసం; రాముండు= శ్రీరామచంద్రుడు; గూఢవృత్తిన్= రహస్యపద్ధతిలో; నడురేయిన్+తిరుగుచో= అర్ధరాత్రి సంచారం చేస్తుండగా; నాగరజనములోన్+ఒక్కదున్= నగర పౌరుడొక్కడు; తనసతిన్+ఒప్పక+ఉన్నన్= తన భార్యను అంగీకరింపక; ఒరుని+ఇంటన్= పరాయివాడి ఇంటిలో; కాపురంబు+ఉన్న= కాపురమున్న; చంచలురాలిన్= చపలత్వం ఉన్న స్త్రీని; పాయంగన్+లేక= విడిచిపెట్టలేక; చేపట్టన్= స్వీకరించడానికి; తాన్+వెట్టి+అగు= తాను వెట్టివాడైన; రామధరణీ+ఈశ్వరుండను+ఏ= శ్రీరామ చంద్ర ప్రభువునా ఏమి?; బేల= అమాయకురాలా!; పొమ్ము+అను= పో అనే; మాట బిట్టు+పలుకన్= మాట గట్టిగా అనగా; ఆలకించి= విని; మఱియున్+ఆమాట= అంతేగాక అదేమాట; చారులవలనన్= చారులవల్ల; జగములోనన్+కలుగన్+తెలిసి= లోకంలో ఉండడాన్ని తెలుసుకొని; రాత్రి= రాత్రి సమయంలో; సీత నిద్ర+పోవన్= సీత నిద్రిస్తుండగా; చెప్పక= చెప్పకుండా; వాల్మీకి పర్ణశాలన్= వాల్మీకి ఆశ్రమంలో; పెట్టన్+పనిచెన్= దిగబెట్టుమని పంపించాడు;

**తా :** ఒకరోజు రాజ్యంలోని విశేషాలను స్వయంగా తెలియడంకోసం రాముడు మారువేషంలో నగరసంచారం చేస్తున్నాడు. అపుడు నగరపౌరుడొకడు తన భార్యను ఇష్టపడక "పరాయివాడింట్లో కాపురమున్న చపలత్వంకల స్త్రీని వదులుకోకుండా స్వీకరించడానికి నేనేమి వెట్టి రాముడినా" అన్నాడు. ఆ మాట విని లోకంలో కూడ అదే విషయం వ్యాప్తిలో ఉన్నదని చారులవల్ల తెలిసికొన్న రాముడు రాత్రి సీత నిద్రపోతుండగా, ఆమెను వాల్మీకి మహర్షి ఆశ్రమంలో దిగబెట్టి రమ్మని ఆజ్ఞాపించాడు.

**వ. అంత సీతయు గర్భిణి గావునఁ గుశలవు లనియెడి కొడుకులం గనియె. వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె; లక్ష్మణునకు నంగదుండును, చంద్రకేతుండును; భరతునకుఁ దక్షుండును, బుష్కలుండును; శత్రుఘ్నునకు సుబాహుండును, శ్రుతసేనుండును సంభవించి రయ్యెడ. 347**

**ప్రతి :** అంతన్= అపుడు; సీతయున్= సీతాదేవి; గర్భిణి+కావునన్= గర్భవతి అగుటచే; కుశలవులు+అనియెడి= కుశలవులనే; కొడుకులన్+కనియెన్= కుమారుల్ని కన్నది; వారికిన్= వారికి; వాల్మీకి= వాల్మీకి ఋషి; జాతకర్మంబులు+ఒనరించెన్= జాత కర్మల్ని చేశాడు; లక్ష్మణునకున్= లక్ష్మణునికి; అంగదుండును, చంద్రకేతుండును= అంగదుడు, చంద్రకేతుడూ; భరతునకున్= భరతునికి; దక్షుండును+పుష్కలుండును= దక్షుడు, పుష్కలుడూ; శత్రుఘ్ననకున్=శత్రుఘ్నునికి; సుబాహుండును, శ్రుతసేనుండును= సుబాహుడూ, శ్రుతసేనుడూ; సంభవించిరి= కలిగారు; ఆ+ఎడన్= అప్పుడు.

**తా :** గర్భవతి అయిన సీత కుశలవులనే కుమారులను కన్నది. వాల్మీకి మహర్షి వారికి జాత కర్మలు చేశాడు. అయోధ్యలో లక్ష్మణునికి అంగదుడు, చంద్రకేతుడు, భరతునికి తక్షుడు, పుష్కలుడు; శత్రుఘ్నునికి సుబాహుడు, శ్రుతసేనుడు అనే పుత్రులు పుట్టారు.

**క. బంధురబలుఁ డగు భరతుఁడు, గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాదుల స**
**ద్బంధుఁ డగు నన్న కిచ్చెను, బంధువులును మాతృజనులుఁ బ్రజలున్ మెచ్చన్. 348**

**ప్రతి :** బంధుర బలుఁడు+అగు= గొప్ప బలశాలి అయిన; భరతుఁడు= భరతుడు; గంధర్వచయంబున్+త్రుంచి= గంధర్వులను జయించి; బంధువులును= చుట్టాలు; మాతృజనులున్= తల్లులు; ప్రజలున్= ప్రజలు; మెచ్చన్= మెచ్చేటట్లు; కనక+ఆదులన్= బంగారం మొదలైనవి; సత్+బంధుఁడు+అగు= మంచివారికి బంధువైన; అన్నకున్+ఇచ్చెను= సోదరునికి సమర్పించాడు.

**తా :** అప్పుడు బలశాలియైన భరతుడు గంధర్వులను జయించి బంధువులు, తల్లులు, ప్రజలు ప్రశంసించగా కనకాది సంపదలను అన్నకు సమర్పించాడు.

**ఆ. మధువనంబులోన మధునందనుండగు, లవణుఁజంపి భుజబలంబు మెఱసి**
**మధుపురంబు సేసె మధుభాషి శత్రుఘ్నుఁ, డన్న రామచంద్రుఁడౌ ననంగ. 349**

**ప్రతి :** మధుభాషి= మధురంగా మాట్లాడే; శత్రుఘ్నుఁడు; అన్న= తనసోదరుడు; రామచంద్రుఁడు= శ్రీరాముడు; ఔను+అనంగన్= మెచ్చుకొనేటట్లు; మధునందనుండు+అగు= మధువు కొడుకైన; లవణున్+చంపి= లవణుని సంహరించి; మధువనంబులోనన్= మధువనంలో; మధుపురంబున్+చేసెన్= మధుపురాన్ని నిర్మించాడు.

**తా :** మధురభాషణుడైన శత్రుఘ్నుడు తన అన్న శ్రీరామచంద్రుడు మెచ్చుకొనేటట్లు భుజబలంతో మధువు అనేవాడి కొడుకైన లవణుని చంపి, మధువనంలో మధుపురాన్ని నిర్మించాడు.

**వ. అంతఁ గొంతకాలంబునకు రామచంద్రుని కొమారులైన కుశలవు లిద్దఱును వాల్మీకివలన వేదాది విద్యలయందు నేర్పరులై పెక్కు సభలను సతానంబుగా రామకథాశ్లోకంబులు పాడుచు, నొక్కనాఁడు రాఘవేంద్రుని యజ్ఞశాలకుంజని. 350**

**ప్రతి :** అంతన్+కొంతకాలంబునకున్= పిమ్మట కొంతకాలానికి; రామచంద్రుని కొమారులు+ఐన= శ్రీరాముని కొడుకులైన; కుశలవులు+ఇద్దఱును= కుశలవులు ఇద్దరూ; వాల్మీకి వలన= వాల్మీకి వల్ల; వేద+ఆది విద్యల+అందున్= వేదం మొదలైన విద్యల్లో; నేర్పరులు+ఐ= ప్రవీణులై; పెక్కు సభలను= అనేక సభల్లో; సతానంబుగాన్= తానస్వరసహితంగా; రామకథాశ్లోకంబులున్= రామచరితకు చెందిన శ్లోకాలను; పాడుచున్= పాడుతూ; ఒక్కనాడు= ఒకరోజున; రాఘవ+ఇంద్రుని= శ్రీరాముని; యజ్ఞశాలకున్+చని= యజ్ఞశాలకు వెళ్లి...

**తా :** తరువాత కొంతకాలానికి రామచంద్రుని కొడుకులైన కుశలవులు వాల్మీకివల్ల వేదవిద్యల్లో ప్రావీణ్యం గడించి, అనేక సభల్లో రామకథాశ్లోకాల్ని తానస్వరబద్ధంగా పాడుతూ, ఒకరోజు శ్రీరాముని యజ్ఞశాలకు వెళ్ళి

**మత్త. వట్టిమ్రాఁకులు పల్లవింప నవారియై మధుధార దా**
**నుట్టఁబాడిన వారిపాటకు నుర్వరాధిపుఁడున్ బ్రజల్**
**బిట్టు సంతస మంది రయ్యెడఁ బ్రీతిఁ గన్నుల బాష్పముల్**
**దొట్ట నౌదల లూఁచి వారలతోడి మక్కువ పుట్టఁగాన్. 351**

**ప్రతి :** వట్టిమ్రాఁకులు= మోడైన చెట్లు; పల్లవింపన్= చిగురించేటట్లు; అవారియై= అపరిమితమై; మధుధారన్+తాన్= అమృత ధారలును; ఉట్టన్+పాడిన= ఉట్టిపడేటట్లు పాడిన; వారిపాటకు; ఉర్వర+అధిపుఁడున్, ప్రజల్= భూపతియైన రాముడు, ప్రజలు; ఆ+ఎడన్= అప్పుడు; ప్రీతిన్= ఆనందంతో; కన్నులన్+బాష్పముల్= కళ్లలో నీరు; దొట్టన్= రాలుస్తూ; ఔదలలు+ఊఁచి= తలలూపుతూ; వారలతోడి= వారిపై; మక్కువ పుట్టఁగాన్= ప్రేమ కలుగగా; బిట్టు= అధికమైన; సంతసము+అందిరి= సంతోషం పొందారు.

**తా :** మ్రోళ్లు చిగురించేటట్లు, ఎడతెగని అమృత ప్రవాహం జాలువారినట్లు వారు పాడిన పాటకు రాజు, ప్రజలు ప్రేమతో ఆనందబాష్పాలు రాలుస్తూ, తలలూపుతూ వారిపై ప్రేమ కలుగగా మిక్కిలి సంతోషం పొందారు.

**వ. అంత నా రామచంద్రుండు కుమారుల కిట్లనియె. 352**

**ఆ. చిన్న యన్నలార! శీతాంశుముఖులార!, నళినదళ విశాలనయనులార!**
**మధుర భాషలార! మహి మీఁద నెవ్వరు, తల్లి దండ్రి మీకు ధన్యులార! 353**

**ప్రతి :** ధన్యులార!= చరితార్థులారా!; చిన్న+అన్నలార!= చిన్ని సోదరులారా!; శీత+అంశుముఖులార= చల్లని కిరణములు కలిగిన చంద్రుని వంటి ముఖాలు కలిగినవారలారా!; నళినదళ= తామర రేకుల్లాంటి; విశాలనయనులార= వెడల్పైన కన్నులు కలిగినవారలారా; మధుభాషలార= తియ్యని మాటలు పలికేవారలారా!; మహిమీఁదన్= ఈ లోకంలో; మీకున్= మీకు; తల్లి+తండ్రి= జననీజనకులు; ఎవ్వరు= ఎవరు?

**తా :** ధన్యులైన ముద్దుకుర్రలార! చంద్రుని వంటి వదనం, తామర రేకులవంటి విశాల నయనాలు కలిగినవారలారా! తియ్యని వాక్కులు పలికేవారలారా! మీ తల్లిదండ్రులెవరు?

**వ. అనిన వార'లేము వాల్మీకిపౌత్రులము; రాఘవేశ్వరుని యాగంబు సూడవచ్చితి' మనవుడు మెల్లన నగి 'యెల్లి ప్రొద్దున మీ తండ్రి నెఱింగెద; రుండుండని యొక్క నివాసంబునకు సత్కరించి పనిచె; మఱునాఁడు సీతం దోడ్కొని కుశలవుల ముందట నిడుకొని వాల్మీకి వచ్చి రఘుపుంగవునింగని యనేకప్రకారంబుల వినుతించి యిట్లనియె. 354**

**ప్రతి :** అనినన్= అనగా; వారలు= వారు (కుశలవులు); ఏము వాల్మీకి పౌత్రులము= మేము వాల్మీకి మనుమలం; రాఘవ+ఈశ్వరుని= రఘుశ్రేష్ఠుడగు రాముని; యాగంబున్+చూడన్+వచ్చితిమి= యజ్ఞాన్ని చూడ్డానికి వచ్చాం; అనవుడు= అనగా; మెల్లన నగి= మందహాసంచేసి; ఎల్లి ప్రొద్దున= రేపటి ఉదయం; మీ తండ్రిన్+ఎఱింగెదరు= మీ తండ్రిని తెలుసుకుంటారు; ఉండుండు+అని= ఇక్కడ ఉండండని; ఒక్క నివాసంబునకున్= ఒక్క భవనానికి; సత్కరించి పనిచెన్= గౌరవించి పంపాడు; మఱునాడు= మరుసటి రోజు; వాల్మీకి= వాల్మీకిముని; సీతన్+తొడ్కొని= సీతను తొడుకొని; కుశలవులన్+ముందటన్+ఇడికొని= కుశలవుల్ని ముందుంచుకొని; వచ్చి; రఘుపుంగవునిన్+కని= రఘుశ్రేష్ఠుని చూచి; అనేక ప్రకారంబులన్= అనేక విధాలుగా; వినుతించి= పొగడి; ఇట్లు+అనియెన్= ఇలా గన్నాడు.

**తా :** అని అడుగగా వాళ్లు 'మేము వాల్మీకి మహర్షి మనుమలం. శ్రీరాముని యాగాన్ని చూడటానికి వచ్చాం'. అన్నారు. రాముడు చిరునవ్వు నవ్వి 'రేపు ఉదయం మీతండ్రిని గూర్చి తెలుసుకుంటారు ఇక్కడే ఉండమ'ని వారికొక నివాసం ఇచ్చి

ఆదరించాడు. మరుసటిరోజు సీతను, కుశలవులను తోడ్కొని వాల్మీకి వచ్చి శ్రీరాముని చూచి అనేక విధాల సంస్తుతించి ఇట్లా అన్నాడు.

**ఆ. 'సీత శుద్ధురాలు, చిత్తవాక్కర్మంబు, లందు సత్యమూర్తి యమలచరిత**
**పుణ్యసాధ్వి విడువఁబోలదు చేకొను, రవికులాబ్ధిచంద్ర! రామచంద్ర! 355**

**ప్రతి :** రవికుల+అబ్ధి= సూర్యవంశమనే సముద్రానికి; చంద్ర= చంద్రుని వంటివాడా!; రామచంద్ర= శ్రీరామచంద్రా; సీత శుద్ధురాలు= సీత పవిత్రురాలు; చిత్త, వాక్+కర్మంబుల+అందున్= మనసు మాట చేతలలో (త్రికరణశుద్ధి); సత్యమూర్తి= సత్యనిష్ఠ కలిగినది; అమలచరిత= స్వచ్ఛమైన నడవడిక కలిగినది; పుణ్యసాధ్వి= పుణ్యాత్మురాలు; విడువన్+పోలదు= విడిచిపెట్టదగదు; చేకొను= స్వీకరించు.

**తా :** సూర్యవంశమనే సముద్రానికి చంద్రుని వంటి రామచంద్రా! సీతాదేవి పవిత్రురాలు, త్రికరణశుద్ధిగా సత్యనిష్ఠ కలది. స్వచ్ఛమైన నడవడిక కలిగినది. పుణ్యాత్మురాలు. అట్టి సాధ్విని విడువకు. స్వీకరించు.

**వ. అని వాల్మీకి వలుక, రామచంద్రుండు పుత్రార్థియై విచారింపఁ, గుశలవులను వాల్మీకికి నొప్పగించి, రామచంద్ర చరణధ్యానంబు సేయుచు, నిరాశయై సీత భూవివరంబు సొచ్చె. నయ్యెడ. 356**

**ప్రతి :** అని; వాల్మీకి+పలుకన్= వాల్మీకి చెప్పగా; రామచంద్రుండు; పుత్ర+అర్థి+ఐ= కొడుకుల గురించి; విచారింపన్= విచారించగా; కుశలవులను; వాల్మీకికిన్= వాల్మీకి మహర్షికి; ఒప్పగించి= అప్పగించి; రామచంద్ర= రామచంద్రుని; చరణధ్యానంబు+చేయుచు= పాదస్మరణ చేస్తూ; నిరాశ+ఐ= నిరాశ కలిగినదై; సీత; భూవివరంబున్+చొచ్చెన్= భూగర్భంలో ప్రవేశించింది; ఆ+ఎడ= ఆ సమయంలో...

**తా :** అని వాల్మీకి పలుకగా, రాముడు కొడుకులను గూర్చి విచారించాడు. నిరాశచెందిన సీత కుశలవులను వాల్మీకికి అప్పగించి రామపదస్మరణ చేస్తూ భూమిలో ప్రవేశించింది. అప్పుడు

**విశే :** సీత నిరాశ ఐనది. నిరాశ అంటే ఆశలేనిది. ఆమెకోరిక లింకేమీ లేవు. రాముని కిల్లాలైంది. ఆయనతో జీవించింది. సంతానాన్ని కని వంశవృద్ధికి తోడ్పడింది.

ఆశ అంటే దిక్కు అని అర్థం ఉంది. అంటే దిక్కులేనిదయింది. సీత రామునివెంట కష్టాలనుభవించింది. లంకలో తాను పవిత్రనని నిరూపించుకొంది. అయోధ్యకు వచ్చింది. నిందు చూలాలయింది. మళ్లీ కారణంలేని నిందకు గురయింది. కట్టుకున్నవాడు కారడవులకు పంపాడు. రాముని వంశాంకురాల్ని అప్పగించి దిక్కులేనిదిగా తన దారిన వెళ్లిపోయింది. భూమినుండి వచ్చింది. భూమిలోకే వెళ్లిపోయింది.

**మ. ముదితా! యేటికిఁగ్రుంకి తీవు మనలో మోహంబు చింతింపవే**
**వదనాంభోజము సూపవే మృదువు నీ వాక్యంబు విన్పింపవే**
**తుదిసేయం దగ దంచు నీశ్వరుఁడునై దుఃఖించె భూపాలుఁ డా**
**పద గాదే ప్రియురాలిఁబాసినయెడన్ భావింప నెవ్వారికిన్? 357**

**ప్రతి :** ముదితా!= కాంతా!; ఈవు= నీవు; ఏటికిన్= ఎందుకు; క్రుంకితి= భూమిలో క్రుంగి పోయావు? మనలో మోహంబున్= మన మధ్య అనురాగాన్ని; చింతింపవు+ఏ= ఆలోచించలేదా? వదన+అంభోజమున్= ముఖపద్మాన్ని;

చూపవే= చూపించవా? మృదువు= మెత్తన; నీ వాక్యంబు= నీ పలుకు; విన్పింపవు+ఏ= వినిపించవా?; తుదిన్+చేయన్+తగదు+అంచున్= ముగింపు చేయడం ఉచితం కాదు'' అంటూ; భూపాలుఁడు= రాజు; ఈశ్వరుఁడును+ఐ= భగవంతుడై ఉండికూడా; దుఃఖించెన్= విలపించాడు; ప్రియురాలిన్= ప్రేయసిని; పాసిన+ఎడన్= విడిచిపెట్టినపుడు; భావింపన్= ఆలోచిస్తే; ఎవ్వారికిన్= ఎవరికైనా; ఆపద+కాదే= దుఃఖమే కదా!

**తా :** "ఓ కాంతా! నీవు ఎందుకు భూమిలో క్రుంగిపోయావు? మనమధ్య అనురాగాన్ని తలచలేదా? నీ ముఖారవిందాన్ని ఒక్కసారి చూపించు. నీ తియ్యని వాక్కులు వినిపించు. ఇట్లా ముగింపు పలకడం బాగాలేదు'' అంటూ శ్రీరామచంద్రుడు తాను భగవంతుడై ఉండి కూడా విలపించాడు. ప్రియురాలి వియోగం ఎవరికైనా దుఃఖహేతువే కదా!

**విశే :** శ్రీరాముడు తాను భగవదవతారమూర్తి అయినా ప్రాకృతజనునివలె విలపించాడు. ప్రియురాలి వియోగం ఎవరికైనా దుఃఖహేతువే అని కవి సమర్థన. ధర్మబద్ధుడైన రాముని విలాపం కవి కరుణ రసభరితంగా వర్ణించాడు.

**వ. అని వగచి, రామచంద్రుండు బ్రహ్మచర్యంబు ధరియించి, పదుమూఁడువేల యేం డ్లెడతెగకుండ నగ్ని హోత్రంబులు సెల్లించి, తానీశ్వరుండు గావునఁ దన మొదలి నెలవునకుంజనియె; ని వ్విధంబున. 358**

**ప్రతి :** అని వగచి= అని శోకించి; రామచంద్రుండు; బ్రహ్మచర్యంబున్+ధరియించి= బ్రహ్మచర్యాన్ని అవలంబించి; పదమూడువేల ఏండ్లు; ఎడతెగకుండ= నిరంతరం; అగ్నిహోత్రంబులు+చెల్లించి= అగ్నిహోత్రాలను ప్రవర్తిల్లజేసి; తాను= తానే; ఈశ్వరుండు+కావునన్= భగవంతుడు కావడంవల్ల; తన= తనయొక్క; మొదలి నెలవునకున్= పూర్వస్థానమైన పరమపదానికి; చనియెన్= వెళ్లాడు; ఈ+విధంబున= ఈ విధంగా...

**తా :** ఆ విధంగా దుఃఖించి, శ్రీరాముడు బ్రహ్మచర్యాన్ని పాటించి, పదుమూడువేల సంవత్సరాలు అగ్నిహోత్రాలను ప్రవర్తింపజేసి, తానే భగవంతుడైనందువల్ల తన పూర్వపుస్థానమైన పరమపదానికి వెళ్ళాడు. ఈ విధంగా

**ఆ. ఆదిదేవుఁడైన యా రామచంద్రుని, కబ్ధిఁగట్టు టెంత? యసురకోటిఁ**
**జంపుటెంత? కపుల సాహాయ్య మది యెంత? సురల కొఱకుఁగ్రీడ చూపెఁగాక. 359**

**ప్రతి :** ఆదిదేవుఁడు+ఐన= తొలిదైవమైన; ఆ రామచంద్రునికి= ఆ శ్రీరామచంద్రునికి; అబ్దిన్+కట్టుట+ఎంత= సముద్రంపై సేతువు నిర్మించడం ఎంత పని?; అసురకోటిన్= రాక్షసులగుంపును; చంపుట+ఎంత= తునుమాడడం ఎంతపని?; కపులసాహాయ్యము= వానరుల సాయం; అది+ఎంత= అది ఏ పాటిది?; సురలకొఱకున్= దేవతలకోసం; క్రీడన్+చూపెన్+కాక= లీలను ప్రదర్శించాడు.

**తా :** దేవతాశిరోమణి అయిన ఆ శ్రీరామచంద్రునికి సముద్రంమీద వారధి నిర్మించడం, రాక్షసులగుంపును నాశనం చేయడం, వానరుల సాయం పొందడం ఏ పాటిది? కాకపోతే తన లీలలను దేవతలకోసం ప్రదర్శించాడంతే.

**విశే :** లీలామానుషవిగ్రహుడైన శ్రీరామచంద్రుని భగవత్తత్త్వాన్ని కవి సూచించాడు.

**చ. వశుఁడుగ మ్రొక్కెదన్ లవణవార్ధి విజృంభణతానివర్తికిన్**
**దశదిగధీశమౌళిమణిదర్పణమండితదివ్యకీర్తికిన్;**
**దశశతభానుమూర్తికి సుధారుచిభాషికి సాధుపోషికిన్**
**దశరథరాజుపట్టికిని దైత్యపతిం బొరిగొన్న జెట్టికిన్. 360**

**ప్రతి :** లవణవార్ధి= ఉప్పుసముద్రపు; విజృంభణతా= అహంకారాన్ని; నివర్తికిన్= అణచిన వానికి; దశదిక్+అధీశ= పది దిక్కుల పాలకుల; మౌళి= శిరస్సునందలి; మణిదర్పణమండిత= మణులనే అద్దాలలో ప్రకాశించే; దివ్యకీర్తికిన్= విశిష్టమైన కీర్తి కలవానికి; దశశత భానుమూర్తికిన్= వేయిసూర్యుల ఆకృతికి; సుధారుచిభాషికిన్= అమృతోపమానమైన పలుకుగలవానికి; సాధుపోషికిన్= సాధుజనులను పోషించేవానికి; దైత్యపతిన్= రాక్షసరాజు రావణుని; పోరిన్+కొన్నజెట్టికిన్= యుద్ధమందు సంహరించిన బలశాలికి; దశరథరాజుపట్టికిని= దశరథుని కుమారుడైన శ్రీరామచంద్రునకు; వశుఁడుగన్= వశుడయ్యేందుకు; మ్రొక్కెదన్= నమస్కరింతును.

**తా :** లవణ సముద్రపు అహంకారాన్ని నివారించిన వానికి, దిక్పాలుర కిరీటకీలితమణిదర్పణాల్లో ప్రకాశించే విశిష్టకీర్తికలవానికి, వేయిసూర్యుల మూర్తిమత్త్వం కలవానికి, అమృతోపమానమైన భాషణంకలవానికి, సజ్జన పోషకునికి, రావణుని సంహరించినవానికి శ్రీరామచంద్రునికి నేను (శుకమహర్షి) వినయంగా నమస్కరిస్తున్నాను.

**ఉ. నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁడు, మహాశుగంబులన్**
**విల్లును దాల్చువాఁడు, గడు విప్పగు వక్షమువాఁడు, మేలు పైఁ**
**జల్లెడువాఁడు, నిక్కిన భుజంబులవాఁడు, యశంబు దిక్కులం**
**జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁడీవుత మా కభీష్టముల్. 361**

**ప్రతి :** నల్లనివాఁడు= నల్లని శరీరచ్ఛాయకలవాడు; పద్మనయనంబులవాఁడు= పద్మాలవంటి కనులు కలవాడు; మహా+ఆశుగంబులన్= గొప్ప బాణాలను; విల్లునున్= వింటిని; తాల్చువాఁడు= ధరించేవాడు; కడువిప్పు+అగు= మిక్కిలి విశాలమైన; వక్షమువాఁడు= రొమ్ము కలవాడు; మేలు= శుభాన్ని; పైన్= అందరిపైన; చల్లెడువాఁడు= చిలకరించేవాడు; నిక్కిన భుజంబులవాఁడు= ఎత్తైన భుజాలు కలవాడు; యశంబు= కీర్తిని; దిక్కులన్+చల్లెడువాఁడు= దిక్కులవరకు వ్యాపింపజేసేవాడు; ఐన= అయినటువంటి; రఘుసత్తముఁడు= రఘువంశ శ్రేష్ఠుడు; మాకున్= మాకు; అభి+ఇష్టముల్= ఇష్టమైన కోరికలు; ఈవుత= ఇచ్చుగాక;

**తా :** నల్లని మేనిఛాయ కలవాడు, కమలనేత్రుడు, గొప్పధనుర్బాణాలను ధరించినవాడు, విశాలవక్షము కలవాడు, శుభములను అందరికి ప్రసాదించేవాడు, ఎగు భుజాలు కలవాడు, కీర్తి దిగంతాలవరకు వ్యాపింపజేసినవాడు అయిన రాఘవుడు మాకోరికలను తీర్చుగాక!

**విశే :** ఇలాంటి పద్యమే శ్రీకృష్ణునిగూర్చి దశమస్కంధంలో పోతనగారు వ్రాశారు. ఒక స్కంధం ముందే ఉన్న ఈ పద్యం కంటె శ్రీకృష్ణుని గూర్చి చెప్పిన పద్యమే విశేషంగా ప్రాచుర్యం పొందింది. విశాల వక్షఃస్థలం, ఎగుభుజాలుండడం ఉత్తమ పురుషుల లక్షణం 'వ్యూఢోరస్కో వృషస్కంధః' అని రఘువంశంలో దిలీపుని గూర్చిన వర్ణన. పోతనకు రాముడన్నా కృష్ణుడన్నా ఒక్కటే. భాగవతం శ్రీకారం చుడుతూ మహానందాంగనా డింభకుడు కృష్ణుణ్ణి స్తుతించాడు. ఆ తరువాత భాగవతాన్ని శ్రీరాముని సంబోధిస్తూ చెప్పాడు. రామకృష్ణులు వేర్వేరు కాదని చెప్పేందుకే నవమ దశమస్కంధాల్లో ఒకే పద్యాన్ని రచించాడు.

**ఆ. రామచంద్రుఁగూడి రాకల పోకలఁ, గదిసి తిరుగువారుఁగన్నవారు**
**నంటికొన్నవారు నా కోసల ప్రజ, లరిగి రాదియోగు లరుగు గతికి. 362**

**ప్రతి :** రామచంద్రున్+కూడి= శ్రీరామచంద్రునితో కలిసి; రాకలపోకలన్= రాకపోకలను; కదిసి తిరుగువారు= కలిసి తిరిగినవారు; కన్నవారు= చూచినవారు; అంటికొన్నవారు= ప్రేమతో తాకినవారు అయిన; ఆ కోసల ప్రజలు= ఆ కోసల దేశపు ప్రజలు; ఆదియోగులు= పూర్వయోగులు; అరుగుగతికిన్= వెళ్ళిన సద్గతికి; అరిగిరి= వెళ్ళారు.

**తా :** ఆ రామచంద్రునితో రాక పోకలతో కలిసి తిరిగేవారు, ఆయనను చూచినవారు, ఆయనను ప్రేమతో తాకిన ఆ కోసల దేశప్రజలు ఆదియోగులు వెళ్ళిన సద్గతిని పొందారు.

**క. మంతనములు సద్గతులకు, పొంతనములు ఘనములైన పుణ్యముల కిదా**
**నీంతనపూర్వమహాఘ ని, కృంతనములు రామనామకృతిచింతనముల్. 363**

**ప్రతి :** రామనామ= శ్రీరామనామమనే; కృతి= ప్రబంధంయొక్క; చింతనముల్= సంస్మరణలు; సద్గతులకున్= మంచిమార్గాన వెళ్లేవారికి; మంతనములు= విచారణీయాలు; ఘనములు+ఐన= గొప్పవైన; పుణ్యములకు= పుణ్యాలకు; పొంతనములు= నిలయాలు; ఇదానీంతనపూర్వ= ఇప్పటివీ మునుపటివీ అయిన; మహా+అఘ= గొప్పపాపాలకు; నికృంతనములు= నిష్కృతి కలిగించేవి.

**తా :** శ్రీరామనామ మంత్రస్మరణలు మోక్షార్థులకు విచారణీయాలు. గొప్ప పుణ్యాలకు నిలయాలు. ప్రస్తుతం, పూర్వకాలాల్లో చేసిన గొప్ప పాపాలకు నిష్కృతి దాయకాలు.

**విశే :** శ్రీరామ చరితాన్ని వర్ణించిన కవి ఫలశ్రుతిని చెబుతున్నాడు. రామనామం మోక్షదాయకం, పాపహరణమని భావం.

**వ. ఆ రామచంద్రునకుఁ గుశుండును, గుశునకు నతిథి, యతిథికి నిషధుండును, నిషధునకు నభుండును, నభునికిఁ బుండరీకుండును, బుండరీకునకు క్షేమధన్వుండును, క్షేమధన్వునకు దేవానీకుండును, దేవానీకునకు నహీనుండును, నహీనునకుఁ బారియాత్రుండును, బారియాత్రునకు బలుండును, బలునకు జలుండను, జలునకు నర్కసంభవుం డగు వజ్రనాభుండును, వజ్రనాభునకు శంఖణుండును, శంఖణునకు విధృతియును, విధృతికి హిరణ్యనాభుండును జనియించిరి. ఆ హిరణ్యనాభుండు జైమిని శిష్యుండైన యాజ్ఞవల్క్యముని వలన నధ్యాత్మయోగంబు నేర్చి, హృదయ కలుషంబులం బాసి యోగచర్యుండయ్యె; నా హిరణ్యనాభునకుఁ బుష్యుండును, బుష్యునకు ధ్రువసంధియు, ధ్రువసంధికి సుదర్శనుండును, సుదర్శనునకు నగ్నివర్ణుండును, నగ్నివర్ణునకు శీఘ్రుండును, శీఘ్రునకు మరువను రాజశ్రేష్ఠుండును బుట్టి; రా రాజయోగి సిద్ధుండయి, కలాపగ్రామంబున నున్నవాఁడు; కలియుగాంతంబున నష్టం బయ్యెడు సూర్యవంశంబుఁ గ్రమ్మఱఁ బుట్టింపం గల వాఁ;డా మరువునకుఁ బ్రశుశ్రుకుండును, నాప్రశుశ్రుకునకు సంధియు, నతనికి నమర్షణుండును, నా యమర్షణునికి మహస్వంతుండును, నా మహస్వంతునకు విశ్వసాహ్యుండును, నా విశ్వసాహ్యునకు బృహద్బలుండును జనియించి, రా బృహద్బలుండు భారత యుద్ధంబున మీ తండ్రియగు నభిమన్యునిచేత హతుండయ్యె; వినుము. 364**

**ప్రతి :** ఆ రామచంద్రునకున్= ఆ శ్రీరామునికి; కుశుండును= కుశుడూ; కుశునకున్+అతిథి= కుశునికి అతిథి; అతిథికిన్+నిషధుండును= అతిథికి నిషధుడూ; నిషధునకున్+నభుండును= నిషధునికి నభుడూ; నభునికిన్+పుండరీకుండును= నభునికి పుండరీకుడూ; పుండరీకునకున్+క్షేమధన్వుండును= పుండరీకునికి క్షేమధన్వుడూ; క్షేమధన్వునకున్+దేవానీకుండును=

క్షేమధన్వునికి దేవానీకుడూ; దేవానీకునకున్+అహీనుండును= దేవానీకునికి అహీనుడూ; అహీనునకున్+పారియాత్రుండును= అహీనునికి పారియాత్రుడు; పారియాత్రునకున్+బలుండును= పారియాత్రునికి బలుడూ; బలునకున్+చలుండును= బలునికి చలుడూ; చలునకు= చలునికి; అర్కసంభవుడు+అగు= సూర్యసంభవుడైన; వజ్రనాభుండును= వజ్రనాభుడూ; వజ్రనాభునకున్+శంఖణుండును= వజ్రనాభునికి శంఖణుడూ; శంఖణునకున్+విధృతియును= శంఖణునికి విధృతి; విధృతికిన్+హిరణ్యనాభుండును= విధృతికి హిరణ్యనాభుడూ; జనియించిరి= పుట్టారు; ఆ హిరణ్యనాభుండు= ఆ హిరణ్యనాభుడనువాడు; జైమిని శిష్యుండు+ఐన= జైమిని శిష్యుడైన; యాజ్ఞవల్క్యమునివలనన్= యాజ్ఞవల్క్యముని వల్ల; అధ్యాత్మయోగంబున్+నేర్చి= అధ్యాత్మయోగాన్ని నేర్చుకొని; హృదయ కలుషంబులన్+పాసి= మనో దుఃఖాల్ని పోగొట్టుకొని; యోగచర్యుండు+అయ్యెను= యోగగామి అయ్యాడు; ఆ హిరణ్యనాభునకున్+పుష్యుండును= ఆ హిరణ్యనాభునికి పుష్యుడూ; పుష్యునకున్+ధ్రువసంధియున్= పుష్యునికి ధ్రువసంధి; ధ్రువసంధికిన్+సుదర్శనుండును= ధ్రువసంధికి సుదర్శనుడూ; సుదర్శనునకున్+అగ్నివర్ణుండును= సుదర్శనునికి అగ్నివర్ణుడూ; అగ్నివర్ణునకున్+శీఘ్రుండును= అగ్నివర్ణునికి శీఘ్రుడూ; శీఘ్రునకున్+మరువు+అను= శీఘ్రునికి మరువు అనే; రాజశ్రేష్ఠుండునున్+పుట్టిరి= రాజశ్రేష్ఠుడు పుట్టారు; ఆ రాజయోగి= ఆ రాచముని; సిద్ధుండు+అయి= సిద్ధుడై; కలాపగ్రామంబునన్+ఉన్నవాడు= కలాపమనే గ్రామంలో ఉన్నాడు; కలియుగ+అంతంబునన్= కలియుగం చివర; నష్టంబు+అయ్యెడు= నాశనమయ్యే; సూర్యవంశంబున్= సూర్యవంశాన్ని; క్రమ్మఱన్+పుట్టింపన్+కలవాడు= మళ్లా ప్రతిష్ఠిస్తాడు; ఆ మరువునకున్= ఆ మరువుకు; ప్రశుశుక్రుండునున్= ప్రశు శుక్రుడూ; ఆ ప్రశుశుక్రునకున్+సంధియు= ఆ ప్రశుశుక్రునికి సంధి; అతనికిన్+అమర్షణుండును= ఆ సంధికి అమర్షణుడూ; ఆ+అమర్షణునికిన్+మహస్వంతుండునున్= ఆ అమర్షణునికి మహస్వంతుడూ; ఆ మహస్వంతునకున్+విశ్వసాహ్వుండును= ఆ మహస్వంతునికి విశ్వసాహ్వుడూ; ఆ విశ్వ సాహ్వునకున్+బృహద్బలుండును= ఆ విశ్వ సాహ్వునికి బృహద్బలుడూ; జనియించిరి= పుట్టారు; ఆ బృహద్బలుండు= ఆ బృహద్బలుడు; భారత యుద్ధంబునన్= మహాభారత యుద్ధంలో; మీ తండ్రి+అగున్+అభిమన్యునిచేతన్ = మీ తండ్రి అయిన అభిమన్యుని చేతిలో; హతుండు+అయ్యె= మరణించాడు; వినుము= విను...

**తా :** ఆ రామచంద్రునికి కుశుడు, కుశునికి అతిథి, అతిథికి నిషధుడు, నిషధునికి నభుడు, నభునికి పుండరీకుడు, పుండరీకునికి క్షేమధన్వుడు, క్షేమధన్వునికి దేవానీకుడు, దేవానీకునికి అహీనుడు, అహీనునికి పారియాత్రుడు, పారియాత్రునికి బలుడు, బలునికి చలుడు, చలునికి సూర్యసంభవుడైన వజ్రనాభుడు, వజ్రనాభునికి శంఖణుడును, శంఖణునికి విధృతి, విధృతికి హిరణ్యనాభుడు జన్మించారు. ఆ హిరణ్యనాభుడు జైమిని శిష్యుడైన యాజ్ఞవల్కముని వల్ల బ్రహ్మవిద్యను గ్రహించి కలతలు పోయి సద్గతిని పొందాడు. ఆ హిరణ్యనాభునికి పుష్యుడు, పుష్యునికి ధ్రువసంధియు, ధ్రువసంధికి సుదర్శనుడు, సుదర్శనునికి అగ్నివర్ణుడు, అగ్నివర్ణునికి శీఘ్రుడు, శీఘ్రునికి మరువు అనే రాజవరుడు జన్మించారు. ఈ రాజయోగి సిద్ధుడయి కలాప అనే గ్రామంలో ఉన్నాడు. కలియుగం చివరలో అంతరించే సూర్యవంశాన్ని మళ్ళీ ఉద్ధరిస్తాడు. ఆ మరువుకు ప్రశుశుక్రుడు, ప్రశుశుక్రునకు సంధి, అతనికి అమర్షణుడు, అతనికి మహస్వంతుడు, ఆ మహస్వంతునికి విశ్వసాహ్వుడు, విశ్వసాహ్వునికి బృహద్బలుడు జన్మించారు. ఆ బృహద్బలుడు మహాభారతయుద్ధంలో మీ తండ్రియైన అభిమన్యునిచేత చంపబడ్డాడు. విను. (అంటూ శుకుడు విన్పించాడు)

**విశే :** శ్రీరాముని వంశం సవిస్తరంగా చెప్పబడింది. త్రేతాయుగంనుండి క్రమంగా కలియుగ ప్రారంభంవరకు ఉన్న సూర్యవంశ రాజులు ప్రస్తావింపబడ్డారు. పంచలక్షణశోభితమైన పురాణం కాబట్టి వంశానుచరితం ప్రస్తావించబడింది.

ఇక్ష్వాకుడు మొదలుకొని బృహద్బలుని వరకు ఉన్న రాజులు ప్రస్తావించబడ్డారు. తరువాత జన్మించబోయే రాజులను గూర్చి ప్రస్తావించబోతున్నాడు.

## ❖ భవిష్యద్రాజేతిహాసము ❖

**తే. పరఁగ నిక్ష్వాకుఁడును బృహద్బలుఁడు మొదలుఁ, దుదయుఁ గాఁగల రాజులఁ దోడుతోడ**
**నెఱుఁగ జెప్పితి నీ వారి; నింకమీఁదఁ, బుట్టఁ గలవారిఁ జెప్పెద భూవరేంద్ర! 365**

**అవ :** "శ్రీ శుకమహర్షి తన తండ్రి వ్యాస భగవానుడు తనకుపదేశించిన భాగవతాన్ని పరీక్షిన్మహారాజునకు వినిపిస్తున్నాడు" అంటూ సూతుడు శౌనకాది మహర్షులతో చెబుతున్నాడు.

వైవస్వత మనువుకి ఇక్ష్వాకుడు మొదలైన కొడుకులు పదిమంది కలిగారని చెబుతారు కదా! ఇక్ష్వాకువంశం ఎలా ప్రవర్తిల్లింది? ఆ వంశంలో వెనుకటివాళ్ళను గూర్చి, ఇప్పటివాళ్ళనుగూర్చి, పుట్టబోయే వాళ్ళను గూర్చి దయతో నాకు విశదీకరించు అని పరీక్షిత్తు ప్రార్థించగా శుకమహర్షి ఇక్ష్వాకు మహారాజునుండి అభిమన్యుని చేతిలో మరణించిన బృహద్బలుడి వరకు వంశచరిత్రను, వారి వంశంలో విశేష చరిత్ర గలవారిని గూర్చి ఇంతవరకు చెప్పాడు. ఇక్ష్వాకువంశంలో బృహద్బలుని తరువాత జన్మించబోయే రాజులను గూర్చి తెలియజేస్తున్నాడు శుకమహర్షి.

**ప్రతి :** భూవర+ఇంద్ర= ఓ రాజేంద్ర!; పరఁగన్= ఒప్పుచున్న; ఇక్ష్వాకుఁడును= ఇక్ష్వాకుడు అనే పేరుగలవాడును; బృహద్బలుఁడు= బృహద్బలుడు అనే పేరుగలవాడు; మొదలున్ తుదయున్ కాఁగల= ప్రారంభమును, చివరగా కల; రాజులన్= రాజులను; తోడుతోడన్= క్రమక్రమంగా; నీవారిన్= నీకు సంబంధించిన వారిని; ఎఱుఁగన్ చెప్పితిన్= తెలిసేట్లు చెప్పాను; ఇంకమీఁదన్= ఇకపై; పుట్టన్+కలవారిన్= జన్మించే వాళ్ళనుగూర్చి; చెప్పెదన్= చెబుతాను.

**తా :** ఓ పరీక్షన్మహారాజా! నీ వంశంలో ఇక్ష్వాకుడు మొదలుగా బృహద్బలునివరకు ఉన్న రాజుల చరిత్రను నీకింతవరకు చెప్పాను. ఇక్ష్వాకువంశంలో ఇకపై పుట్టబోయే రాజులనుగూర్చి తెలియజేస్తాను.

**వ. ఆ బృహద్బలునకు బృహద్రణుండును, బృహద్రణునకు నురుక్షతుండు, నాతనికి వత్సప్రీతుండును, వత్సప్రీతునకుఁ బ్రతివ్యోముండును, బ్రతివ్యోమునకు భానుండును, భానునకు సహదేవుండును, సహదేవునకు బృహదశ్వుండును, బృహదశ్వునకు భానుమంతుండును, భానుమంతునకుఁ బ్రతీకాశ్వుండును, బ్రతీకాశ్వునకు సుప్రతీకుండును, సుప్రతీకునకు మేరుదేవుండును, మేరుదేవునకు సుతక్షత్రుండును, సుతక్షత్రునకు బుక్షకుండును, బుక్షకునకు నంతరిక్షుండును, నతనికి సుతపుండును, సుతపునకు నమిత్రజిత్తు, నతనికి బృహద్వాజియు, నతనికి బర్హియు, బర్హికి ధనంజయుండును, ధనంజయునకు రణంజయుండును, రణంజయునకు సృంజయుండును, సృంజయునకు శాక్యుండును, శాక్యునకు శుద్ధొదుండును, శుద్ధొదునకు లాంగలుండును, లాంగలునకుఁ బ్రసేనజిత్తు, నతనికి క్షుద్రకుండును, క్షుద్రకునకు బుణకుండును, బుణకునకు సురథుండును, సురథునకు సుమిత్రుండును బుట్టుదురు. సుమిత్రుని యనంతరకాలంబున సూర్యవంశంబు నశింపం గలదు. వీరలు బృహద్బలుని నుండి క్రమంబునం బుట్టంగలవారలు అని చెప్పి శుకుం డిట్లనియె. 366**

**ప్రతి :** ఆ బృహద్బలునకున్= ఆ బృహద్బలునకు; బృహద్రణుండును= బృహద్రణుడు; బృహద్రణునకున్= బృహద్రణునకు; ఉరుక్షతుండును= ఉరుక్షతుడు; ఆతనికిన్= ఆ ఉరుక్షతునకు; వత్సప్రీతుండును= వత్సప్రీతుడు; వత్సప్రీతునకున్= వత్సప్రీతునకు; ప్రతివ్యోముండును= ప్రతివ్యోముడు; ప్రతివ్యోమునకున్= ప్రతివ్యోమునకు; భానుండును= భానుడు; భానునకున్= భానునకు; సహదేవుండును= సహదేవుడు; సహదేవునకున్= సహదేవునకు; బృహదశ్వుండును= బృహదశ్వుడు; బృహదశ్వునకున్= బృహదశ్వునకు; భానుమంతుండును= భానుమంతుడు; భానుమంతునకున్= భానుమంతునకు; ప్రతీకాశ్వుండును= ప్రతీకాశ్వుడు; ప్రతీకాశ్వునకున్= ప్రతీకాశ్వునకు; సుప్రతీకుండును= సుప్రతీకుడు; సుప్రతీకునకున్= సుప్రతీకునకు; మేరుదేవుండును= మేరుదేవుడు; మేరుదేవునకున్= మేరుదేవునకు; సుతక్షత్రుండును= సుతక్షత్రుడు; సుతక్షత్రునకున్= సుతక్షత్రునకు; ఋక్షకుండును= ఋక్షకుడు; ఋక్షకునకున్= ఋక్షకునకు; అంతరిక్షుండును= అంతరిక్షుడు; అతనికిన్= ఆ అంతరిక్షునకు; సుతపుండును= సుతపుడు; సుతపునకున్= సుతపునకు; అమిత్రజిత్తున్= అమిత్రజిత్తుడు; అతనికిన్= ఆ అమిత్రజిత్తునకు; బృహద్వాజియున్= బృహద్వాజి; అతనికిన్= ఆ బృహద్వాజికి; బర్హియున్= బర్హి; బర్హికిన్= బర్హి అనువానికి; ధనంజయుండునున్= ధనంజయుడు; ధనంజయునకు= ధనంజయునకు; రణంజయుండును= రణంజయుడు; రణంజయునకున్= రణంజయునకు; సృంజయుండునున్= సృంజయుడు; సృంజయునకు= ఆ సృంజయునకు; శాక్యుండునున్= శాక్యుడు; శాక్యునకున్= శాక్యుడనేవానికి; శుద్ధాదుండునున్= శుద్ధాదుడు; శుద్ధాదునకున్= ఆ శుద్ధాదునకు; లాంగలుండును= లాంగలుడు; లాంగలునకున్= లాంగలునకు; ప్రసేనజిత్తున్= ప్రసేనజిత్తు; అతనికిన్= ప్రసేనజిత్తునకు; క్షుద్రకుండును= క్షుద్రకుడు; క్షుద్రకునకు= క్షుద్రకునకు; ఋణకుండునున్= ఋణకుడు; ఋణకునకు= ఆ ఋణకునకు; సురథుండును= సురథుడు; సురథునకున్= ఆ సురథునికి; సుమిత్రుండును= సుమిత్రుడు; పుట్టుదురు= జన్మిస్తారు; సుమిత్రుని అనంతరకాలంబునన్= సుమిత్రుని తరువాతికాలంలో; సూర్యవంశంబు= ఈ సూర్యవంశం; నశింపన్ కలదు= నశిస్తుంది; వీరలు= ఈ పైని చెప్పినవారు; బృహద్బలునినుండి= బృహద్బలునితో ప్రారంభించి; క్రమంబునన్= వరుసగా; పుట్టన్+కలవారలు= జన్మిస్తారు; అనిచెప్పి= ఈ విధంగాచెప్పి; శుకుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ బృహద్బలుడికి బృహద్రణుడు, ఉరుక్షతుడు, వత్సప్రీతుడు, ప్రతివ్యోముడు, భానుడు, సహదేవుడు, బృహదశ్వుడు, భానుమంతుడు, ప్రతీకాశ్వుడు, సుప్రతీకుడు, మేరుదేవుడు, సుతక్షత్రుడు, ఋక్షకుడు, అంతరిక్షుడు, సుతపుడు, అమిత్రజిత్తు, బృహద్వాజి, బర్హి, ధనంజయుడు, రణంజయుడు, సృంజయుడు, శాక్యుడు, శుద్ధాదుడు, లాంగలుడు, ప్రసేనజిత్తు, క్షుద్రకుడు, ఋణకుడు, సురథుడు, సుమిత్రుడు క్రమంగా జన్మిస్తారు, సుమిత్రుని తరువాత సూర్యవంశం నశిస్తుంది. వీళ్ళు బృహద్బలుడి నుండి క్రమంగా జన్మించేవారు అని శుకుడు ఇలా అన్నాడు.

**సీ. 'ధన్యుఁ డా యిక్ష్వాకు తనయుఁడౌ నిమి యాగ మాచరింపఁగఁ గోరి యా వసిష్ఠు**
**నార్త్విజ్యమునకుఁ దా నర్థింపఁ గని యాతఁ డింద్రుని మఖము సేయింప నియ్య**
**కొనినాఁడ మఱి వత్తుఁ గొదవ లే దన వచ్చి సంసార మెంతయుఁ జంచలంబు**
**కాలయాపన మేల? గ్రతువు సేసెద' మని యన్యఋత్విక్కుల నతఁడు గూర్చి**

**తే. సేయ నింద్రుని యాగంబు చెల్లఁజేసి, గురుఁడు చనుదెంచి శిష్యుపైఁ గోప మెత్తి**
**యోరి నా వచ్చు నిందాఁక నుండ వనుచు, నతని దేహంబు వడుఁగాక యని శపించె. 367**

**ప్రతి :** ఆ ఇక్ష్వాకు తనయుఁడు+ఔ= ఆ ఇక్ష్వాకుని కుమారుడైన; నిమి= నిమి అనే పేరుగల చక్రవర్తి; ధన్యుఁడు= ధన్యుడు; యాగమాచరింపఁగన్+కోరి= ఒక యాగం చేయాలనే కోరికతో; ఆ వసిష్ఠున్= ఆ వసిష్ఠ మహర్షిని; ఆర్త్విజ్యమునకున్=

ఋత్విక్కుగా ఉండి యజ్ఞం నిర్వహించడానికి; తాన్= తాను; ఆ నిమిచక్రవర్తి; అర్థింపన్+కని= కోరడం చూచి; ఆతఁడు= ఆ వసిష్ఠుడు; ఇంద్రుని మఖము= ఇంద్రుని యజ్ఞం; చేయింపన్= చేయించడానికి; ఇయ్యకొనినాఁడన్= అంగీకరించి ఉన్నాను; మఱివత్తున్= ఆ యజ్ఞం పూర్తి అయిన తరువాత వస్తాను; కొదవలేదు= ఏ లోటూ లేదు (ఎటువంటి లోటూ లేకుండా చేస్తాను); అనన్= అనగా; వచ్చి= నిమి చక్రవర్తి తన ఇంటికి వచ్చి; సంసారము+ఎంతయున్+ చంచలంబు= ఈ జీవితం చాలా చంచలమైనది; కాలయాపనము+ఏల= ఆలస్యం చేయడం ఎందుకు?; క్రతువు+చేసెదము+ అని= యజ్ఞం చేద్దామని; అన్యఋత్విక్కులన్= ఇతర ఋత్విక్కులను; (వసిష్ఠుడు గాక మిగిలిన వారిని) అతఁడు గూర్చి= నిమి సమకూర్చుకొని; చేయన్= చేయగా (యజ్ఞం చేయగా); ఇంద్రుని యాగంబు= ఇంద్రునియొక్క యజ్ఞాన్ని; చెల్లన్+చేసి= పూర్తిచేసి; గురుఁడు= గురువైన వసిష్ఠుడు; చనుదెంచి= వచ్చి; శిష్యుపైన్= శిష్యుడైన నిమిపై; కోపము+ఎత్తి= ఆగ్రహించి; ఓరి= ఓ నిమీ!; నావచ్చు+అందాఁకన్= నేను తిరిగి వచ్చేదాకా; ఉండవు+అనుచున్= ఆగి ఉండలేదు గదా అంటూ; అతని దేహంబు= ఆ నిమి శరీరం; పడున్+కాక= కూలిపోవుగాక; అని శపించెన్= అంటూ శాపం ఇచ్చాడు.

**తా :** ధన్యుడైన ఇక్ష్వాకు పుత్రుడు నిమి యాగం చేయాలనే ఆలోచనతో ఆ యజ్ఞానికి వసిష్ఠుని ఋత్విక్కుగా ఉండి నిర్వహింపుమని కోరాడు. వసిష్ఠుడు ఇంద్రుని యజ్ఞం చేయించడానికి ఇంతకుముందే ఒప్పుకొని ఉన్నాను. అది పూర్తి అయిన తరువాత వస్తాను. ఏ లోటూ ఉండదు అన్నాడు. ఇంటికి వచ్చిన నిమి "సంసారం నిలకడలేనిది. కాలయాపనం చేయడం మంచిది కాదు. యజ్ఞం చేద్దామని ఆలోచించి ఇతర ఋత్విక్కులను పిలిచి వారిచే యజ్ఞం చేయించాడు. వసిష్ఠుడు ఇంద్రుని యాగం పూర్తి చేయించి వచ్చి తాను లేకుండా యజ్ఞం పూర్తి చేయటాన్ని చూసి సహించలేక ఆయన శిష్యునిపై ఆగ్రహించి 'ఓరీ నేను వచ్చేదాక ఆగలేకపోయావు అంటూ అతని శరీరం కూలిపోవాలని నిమి చక్రవర్తిని శపించాడు.

**వ. ఇట్లు వసిష్ఠుండు శపించిన, నిమియును వసిష్ఠుని దేహంబు పడుఁగాక యని మరల శపించిన న వ్వసిష్ఠుండు మిత్రావరుణుల వలనఁ గడపట నూర్వశికి జన్మించె. గురుశాపంబున బ్రహ్మజ్ఞాని యైన నిమి, విగతదేహుండైన, నతని దేహంబు మునీశ్వరులు గంధవస్తువులం బొదివి, దాఁచి, దొరకొన్న సత్త్రయాగంబు సెల్లించిరి. యాగంబు కడపటను దేవగణంబులు మెచ్చి వచ్చిన, వారలకు నిమిదేహంబు సూపి, బ్రతుకం జేయుం' డనవుడు వారలు 'నిమి ప్రాణంబులు వచ్చుంగాక' యని పలికిన, నిమి తనదేహంబు సొరనొల్లక యిట్లనియె. 368**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వసిష్ఠుండు; శపించినన్= వసిష్ఠుడు నిమిని శపించగా; నిమియును= నిమి చక్రవర్తికూడా; వసిష్ఠుని దేహంబు పడున్+కాక= వసిష్ఠుని శరీరం కూలిపోవుగాక; అని= అంటూ; మరలన్ శపించినన్= తిరిగి శపించగా; ఆ+వసిష్ఠుండు= ఆ వసిష్ఠ మహర్షి; మిత్రావరుణుల వలనన్= మిత్రావరుణులవల్ల; కడపటన్= శాపాంతమున; ఊర్వశికిన్= ఊర్వశి అనే అప్సరసకు; జన్మించెన్= జన్మించాడు; గురుశాపంబునన్= గురుడైన వసిష్ఠుని శాపంవల్ల; బ్రహ్మజ్ఞాని+ఐన= బ్రహ్మజ్ఞానంగల; నిమి= నిమి చక్రవర్తి; విగతదేహుండు+ఐనన్= ప్రాణాలు వదలగా; అతని దేహంబున్= ఆ నిమి శరీరాన్ని; ముని+ఈశ్వరులు= మునిశ్రేష్ఠులు; గంధవస్తువులన్= సుగంధ ద్రవ్యాలను; పొదివి= చేర్చి; దాఁచి= దాచిపెట్టి; దొరకొన్న సత్త్రయాగంబు= ప్రారంభించిన సత్త్రయాగాన్ని; చెల్లించిరి= పూర్తి చేయించారు; యాగంబు కడపటను= యాగం చివరలో; దేవగణంబులు= దేవతా సమూహాలు; మెచ్చి వచ్చినన్= ఆనందించిరాగా; వారలకున్= ఆ దేవతలకు;

నిమిదేహంబు+చూపి= నిమి యొక్క శరీరాన్ని చూపించి; బ్రతుకన్+చేయుండు= బ్రతికించండి; అనవుడున్= అనగా; వారలు= దేవతలు; నిమి ప్రాణంబులు వచ్చున్+కాక= నిమికి ప్రాణాలు వచ్చి బ్రతుకుగాక; అని పలికినన్= అని పలుకగా; నిమి= నిమి చక్రవర్తి మాత్రము; తన దేహంబు= (పడి ఉన్న) తన శరీరాన్ని; చొరన్+ఒల్లక= ప్రవేశించడానికి ఇష్టపడక; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా వసిష్ఠుడు తనను శపించగా, నిమి కూడా వసిష్ఠుని దేహం కూలిపోవుగాక! అని తిరిగి శపించాడు. ఆ వసిష్ఠుడు ఊర్వశి అనే అప్సరసకు మిత్రావరుణుల వలన జన్మించాడు. శాపాంతకాలంలో బ్రహ్మజ్ఞాని నిమి గురుశాపంవల్ల ప్రాణాలు కోల్పోయాడు. ఆ నిమిదేహాన్ని మునీశ్వరులు సుగంధవస్తువులతో భద్రపరచి, ప్రారంభించిన సత్రయాగాన్ని పూర్తి చేశారు. యాగం పూర్తి అయిన తరువాత మెచ్చి వచ్చిన దేవతాబృందానికి నిమిదేహాన్ని చూపించి 'ఇతనిని బ్రతికించండి' అని ప్రార్థించారు. 'నిమి ప్రాణం వచ్చుగాక' అని దేవతలు ఆశీర్వదించారు. కాని నిమి మాత్రం తన శరీరాన్ని పొందడానికి ఇష్టపడక ఇలా అన్నాడు.

**మ. అతి మోహాకులితంబు సాంద్రమమతాహంకారమూలంబు సం**
**తత నానాసుఖదుఃఖపీడిత మనిత్యం? బిట్టి దేహంబు సం**
**కృతి నా కేటికి? మీనజీవనము భంగిం భీతిబాహుళ్య మం**
**చితరుల్ పెద్దలు దీనిఁ జేకొనరు సర్వేశున్ మదిన్ గొల్చెదన్. 369**

**ప్రతి :** అతి మోహ+ఆకులితంబు= మిక్కిలి మోహంతో వ్యాకులం అయినది; సాంద్ర= దట్టమైన; మమత= మమత్వమునకు; అహంకార= అహంకారానికి; మూలంబు= నిలయం; సంతత= నిరంతరం; నానా= అనేకములైన; సుఖదుఃఖ పీడితము= సుఖదుఃఖాలతో పీడింపబడేది; అనిత్యంబు= అశాశ్వతం; ఇట్టి దేహంబు= ఇటువంటి శరీరంతో; సంకృతి నాకున్+ఏటికిన్= కలయిక నాకెందుకు; (ఈ దేహసంబంధం నాకెందుకు) మీన జీవనముభంగిన్= చేపబ్రతుకువలె; భీతిబాహుళ్యము= ఎక్కువ భయంతో కూడినది; అంచున్= అని భావించి; ఇతరుల్ పెద్దలు= సామాన్యులకంటె భిన్నులైన విజ్ఞులు; దీనిన్ చేకొనరు= ఈ శరీర బంధాన్ని కోరుకోరు; మదిన్= నా మనసులో; సర్వేశున్= ఈ సమస్తానికి ప్రభువైన పరమాత్మను; కొల్చెదన్= సేవిస్తాను.

**తా :** మోహంవల్ల కలతపొంది, మమతాహంకారాలకు మూలమై, సుఖదుఃఖాలతో పీడింపబడి, అశాశ్వతమైన ఈ దేహంతో సంసర్గం నాకెందుకు? ఎప్పుడు, ఎవరిచేతికి, ఎలా చిక్కి, ప్రాణం కోల్పోతుందో తెలియక భయపడే చేప బ్రతుకులాంటి జీవనాన్ని విజ్ఞులు అంగీకరించరు. కావున నేను పరమేశ్వరుని మనసులో సేవిస్తాను.

**వ. అని పలికిన నిమిమాటలు గ్రమ్మఱింప నేరక, శరీరులు గన్నులు దెఱచినప్పుడును, మూసినప్పుడును, నిమి గాన వచ్చుంగాక యని పల్కి దేవతలు సనిరి. అంత. 370**

**ప్రతి :** అని పలికినన్= ఆ విధంగా మాట్లాడిన; నిమి మాటలు= నిమి పల్కులు; క్రమ్మఱింపన్ నేరక= కాదనలేక; శరీరులు= దేహధారులు; కన్నులు తెఱచినప్పుడును= తమ కళ్ళు తెరిచేటప్పుడు; మూసినప్పుడును= మూసేటప్పుడూ; నిమి+కానవచ్చున్+కాక= నిమి కనిపిస్తాడు; అని పల్కి= అంటూ పలికి; దేవతలు+చనిరి= దేవతలు వెళ్ళిపోయారు; అంతన్= ఆ తరువాత...

**తా :** నిమి పల్కిన మాటలు విన్న దేవతలు కాదనలేక, శరీరధారులు కళ్ళు తెరిచేటప్పుడు, మూసేటప్పుడు నిమి అస్తిత్వం కానవస్తుంది అని చెప్పి వెళ్ళారు. అంత

**ఆ. పెద్దలైన మునులు పృథ్వీస్థలికి రాజు, లేమిఁ జూచి నిమి కళేబరంబు**
**తరువ నొకఁడు పుట్టెఁ దనయుండు వానిని, జనకుఁ డనుచుఁ బలికె జగము లెల్ల. 371**

**ప్రతి :** పెద్దలైన మునులు= వయసులోను, జ్ఞానంలోను పెద్దవారైన మునులు; పృథ్వీస్థలికిన్= భూమండలానికి; రాజులేమిన్ చూచి= రాజు లేకపోవడం చూచి; నిమి కళేబరంబు తరువన్= నిమి శరీరాన్ని మథించగా; తనయుండు= కుమారుడు; ఒకఁడు పుట్టెన్= ఒకడు పుట్టాడు; వానిని= ఆ నిమి శరీరంనుండి పుట్టినవానిని; జగములు+ఎల్లన్= లోకాలన్నీ; జనకుఁడు+అనుచున్= జనకుడు అనే పేరుతో; పలికెన్= పేర్కొన్నాయి.

**తా :** మునీశ్వరులు రాజ్యానికి రాజు లేకపోతే అరాజకత్వం వస్తుందని భావించి నిమి శరీరాన్ని మథించగా దానినుండి ఒక కొడుకు పుట్టాడు. ఆ కుమారుణ్ణి లోకాలన్నీ జనకుడు అని పిలిచాయి.

**వ. మఱియు నతఁడు విగతదేహుండు గావున వైదేహుఁడనియును, మథఁనజాతుండు గావున మిథిలుం డనియుం బరఁగె. అ మ్మిథులునిచేత నిర్మితం బైనది గావున మిథిలా నగరంబు నాఁ బరఁగె; ఆ జనకునకు నుదావసుండును, సుదావసునకు నందివర్ధనుండును, నందివర్ధనునకు సుకేతుండును, సుకేతునకు దేవరాతుండును, దేవరాతునకు బృహద్రథుండును పుట్టె. అతనికి మహావీర్యుండును, నతనికి సుధృతియు, నతనికి ధృష్టకేతుండును, నతనికి హర్యశ్వుండు, నతనికి మరువు, నతనికిఁ బ్రతింధకుండును, నతనికిఁ గృతరయుండు, నతనికి దేవమీఢుండును, నతనికి విధృతుండును, నతనికి మహాధృతియు, నతనికిఁ గీర్తిరాతుండు, నతనికి మహారోముండు, నతనికి స్వర్ణరోముండును, నతనికి హ్రస్వరోముండును, నతనికి సీరధ్వజుండును బుట్టిరి. 372**

**ప్రతి :** మఱియున్; అతఁడు= ఆ పుట్టినవాడు; విగతదేహుండు కావునన్= ప్రాణంలేని నిమి నుండి పుట్టాడు కాబట్టి; వైదేహుఁడనియును= వైదేహుడని; మథన జాతుండు గావునన్= శరీరాన్ని మథించడంవల్ల పుట్టాడు కాబట్టి; మిథులుండు+ అనియున్= మిథులుడని; పరఁగెన్= పేర్కొనబడ్డాడు; ఆ+మిథిలునిచేతన్= ఆ మిథిలుడనే వానిచేత; నిర్మితంబు+ఐనది+ కావునన్= నిర్మింపబడటంచేత; మిథిలానగరంబునాన్= మిథిలా నగరంగా; పరఁగెన్= పేర్కొనబడింది; ఆ జనకునకున్= నిమి దేహంనుండి జన్మించిన జనకుడనే వానికి; ఉదావసుండును= ఉదావసుడు; ఉదావసునకున్= ఉదావసుడు అనేవానికి; నందివర్ధనుండును= నందివర్ధనుడు; నందివర్ధనునకున్= నందివర్ధనుడికి; సుకేతుండును= సుకేతుడు; సుకేతునకున్= సుకేతుడికి; దేవరాతుండును= దేవరాతుడు; దేవరాతునకున్= దేవరాతుడికి; బృహద్రథుండును= బృహద్రథుడు; పుట్టెన్= జన్మించారు; అతనికిన్= ఆ బృహద్రథుడికి; హర్యశ్వుండున్= హర్యశ్వుడు; అతనికిన్= హర్యశ్వుడికి; మరువున్= మరువు; అతనికిన్= మరువుకి; ప్రతింధకుండును= ప్రతింధకుడు; అతనికిన్= ప్రతింధకుడికి; కృతరయుండున్= కృతరయుడు; అతనికిన్= వానికి; దేవమీఢుండును= దేవమీఢుడు; అతనికిన్= అతనికి; విధృతుండును= విధృతుడు; అతనికిన్= అతనికి; కీర్తిరాతుండున్= కీర్తిరాతుడు; అతనికిన్= వానికి; మహారోముండును= మహారోముడు; అతనికిన్= వానికి; స్వర్ణరోముండును= స్వర్ణరోముడు, అతనికిన్= వానికి; హ్రస్వరోముండును= హ్రస్వరోముడు; అతనికిన్= అతనికి; సీరధ్వజుండును= సీరధ్వజుదును; పుట్టిరి= జన్మించారు.

**తా :** నిమిని మథించగా పుట్టినవాడు వైదేహుడని, మథించడంవల్ల పుట్టడంచేత మిథిలుడని పేరు పొందాడు. మిథులుడు నిర్మించడంవల్ల ఆ నగరానికి మిథిలానగరం అని పేరు వచ్చింది. ఆ జనకునకు ఉదావసుడు, వానికి నందివర్ధనుడు, వానికి సుకేతుడు, వానికి దేవరాతుడు, వానికి బృహద్రథుడు, వానికి మహావీర్యుడు, వానికి సుధృతి, వానికి ధృష్టకేతుడు, వానికి హర్యశ్వుడు, వానికి మరువు, అతనికి ప్రతింధకుడు, వానికి కృతరయుడు, వానికి దేవమీఢుడు, వానికి విధృతి, వానికి మహాధృతి, వానికి కీర్తిరాతుడు, వానికి మహారోముడు, వానికి స్వర్ణరోముడు, వానికి హ్రస్వరోముడు, వానికి సీరధ్వజుడు జన్మించారు.

**ఆ. అతఁడు మఖము సేయ నవని దున్నింపంగ, లాంగలంబుకొనను లక్షణాంగి**
**సీత జాత యయ్యె సీరధ్వజుండన, దానఁ జెప్పఁబడియె ధన్యుఁ డతఁడు. 373**

**ప్రతి :** అతఁడు= ఆ సీరధ్వజుడు; మఖము+చేయన్= యజ్ఞాన్ని చేయడానికి; అవని దున్నింపంగన్= భూమిని దున్నింపగా; లాంగలంబుకొనను= నాగలికి చివర; లక్షణ+అంగి= శుభలక్షణాలతో కూడిన శరీరముగల; సీత జాత+అయ్యెన్= సీత పుట్టింది (దొరికింది); దానన్= ఆ కారణంచేత; సీరధ్వజుండనన్= నాగలి ధ్వజ చిహ్నంగా గలవాడుగా; చెప్పన్+పడియెన్= లోకంలో పేరు పొందాడు; అతఁడు= ఆ సీరధ్వజుడు; ధన్యుఁడు= ధన్యుడు.

**తా :** సీరధ్వజుడు యజ్ఞభూమిని దున్నిస్తూ ఉండగా, నాగేటి కర్రుకొనకు తగిలి, సీత లభించింది. ఆమె శుభలక్షణాలు గల దేహం కలిగింది. ఈ కారణంచేత సీరధ్వజుడు అనే ప్రశస్తి కలిగి అతడు ధన్యు డయ్యాడు.

**విశే :** జనక, వైదేహ, మిథిల, సీరధ్వజ అనే పేర్ల వ్యుత్పత్తిని గుర్తిస్తే జనకచక్రవర్తి జీవిత విశేషాల మౌలిక విషయాలు తెలుస్తాయి.

**వ. ఆ సీరధ్వజునకుఁ గుశధ్వజుండును, గుశధ్వజునకు ధర్మధ్వజుండును, ధర్మధ్వజునకుఁ గృతధ్వజ, మితధ్వజులను వారిద్దఱుఁ బుట్టిరి. అందుఁ గృతధ్వజునకుఁ గేశిధ్వజుఁ డుదయించె. అతండుఁ దన్నుఁ దా నెఱింగెడి విద్యయందు నేర్పరి యయ్యె. మితధ్వజునకు ఖాండిక్యుం డనువాఁడు జన్మించి, తండ్రివలన నెఱుక గలవాఁడై, కర్మతత్త్వంబు నేర్చి, కేశిధ్వజునివలన భీతుండై యేగె, ఖాండిక్యునకు భానుమంతుండును, భానుమంతునకు శతద్యుమ్నుండును, శతద్యుమ్ననికి శుచియు, శుచికి సనద్వాజుండును, సనద్వాజునకు నూర్ధ్వకేతుండు, నూర్ధ్వకేతునకు నజుండును, నజునకుఁ గురుజిత్తును, గురుజిత్తునకు నరిష్టనేమియు, నరిష్టనేమికి శ్రుతాయువు, శ్రుతాయువునకుఁ బార్శ్వుండును, బార్శ్వునకుఁ జిత్రరథుండును, జిత్రరథునకు క్షేమాపియు, క్షేమాపికి హేమరథుండును, హేమరథునకు సత్యరథుండును, సత్యరథునకు నుపగురుండును, ఉపగురునకు నగ్నిదేవుప్రసాదంబున నుపగుర్వుండును, ఉపగుర్వునకు సావనుండును, సావనునకు సువర్చసుండును గలిగె, అతఁడె సుభూషణుండని వినంబడు. ఆ సుభూషణునకు జయుండును, జయునకు విజయుండును, విజయునకు ధృతుండును, ధృతునకు ననఘుండును, అనఘునకు వీతిహవ్యుండును, వీతిహవ్యునకు ధృతియు, ధృతికి బహుళాశ్వుండును, బహుళాశ్వునకుఁ గృతియుఁ, గృతికి మహావశియును జన్మించిరి. వీరలు మైథిలులగు రాజులని చెప్పంబడుదురు. యోగీశ్వరు ప్రసాదంబున గృహస్థులై యుండియు బంధవిముక్తులై యాత్మజ్ఞానంబు గలిగి, నిరంతర బ్రహ్మానుసంధానంబు సేయుచు నుండుదురు అని పలికి శుకయోగీంద్రుం డిట్లనియె. 374**

**ప్రతి :** ఆ సీరధ్వజునకున్= ఆ సీరధ్వజుడనేవానికి; కుశధ్వజుండును= కుశధ్వజుడు; కుశధ్వజునకు= ఆ కుశధ్వజునికి; ధర్మధ్వజుండును= ధర్మధ్వజుడు; ధర్మధ్వజునకున్= ఆ ధర్మధ్వజుడనేవానికి; కృతధ్వజ, మితధ్వజులనువారు= కృతధ్వజ, మితధ్వజులనే పేర్లు గలవారు; ఇద్దఱున్+పుట్టిరి= ఇద్దరు పుట్టారు; అందున్= వారివురియందు; కృతధ్వజునకున్= కృతధ్వజుడనేవానికి; కేశిధ్వజుండు= కేశిధ్వజుడనేవాడు; ఉదయించెన్= జన్మించాడు; అతండున్= ఆ కేశిధ్వజుడనేవాడు; తన్నున్ తాను ఎఱింగెడి= ఆత్మజ్ఞానమనే; విద్యయందున్= విద్యలో; నేర్పరి అయ్యెన్= ప్రవీణుడయ్యాడు; మితధ్వజునకున్= ధర్మధ్వజుని రెండవ కుమారుడైన మితధ్వజునకు; ఖాండిక్యుండనువాఁడు= ఖాండిక్యుడనే పేరు గలవాడు; జన్మించి= పుట్టి; తండ్రివలనన్= తన తండ్రియైన మితధ్వజుని వలన; ఎఱుక+కలవాఁడై= జ్ఞానం గలవాడై; కర్మతత్త్వంబున్ నేర్చి= యజ్ఞయాగాది కర్మకాండను తెలిసికొని; కేశిధ్వజుని వలనన్ = కృతధ్వజుని కుమారుడు తన పెదతండ్రి కుమారుడూ అయిన కేశిధ్వజుని వలన; భీతుండు+ఐ= భయం పొంది; ఏగెన్= పారిపోయాడు; ఖాండిక్యునకున్= ఖాండిక్యుడనే వానికి; భానుమంతుండును= భానుమంతుడు; భానుమంతునకున్= ఆ భానుమంతునకు; శతద్యుమ్నుండును= శతద్యుమ్నుడు; శతద్యుమ్నునికిన్= శతద్యుమ్నునికి; శుచియున్= శుచియు; శుచికిన్= ఆ శుచికి; సనద్వాజుండును= సనద్వాజుడు; సనద్వాజునకున్= సనద్వాజునకు; ఊర్ధ్వకేతుండును= ఊర్ధ్వకేతుడనేవాడు; ఊర్ధ్వకేతునకున్= ఊర్ధ్వకేతుడనేవానికి; అజుండును= అజుడు; అజునకున్= అజునకు; కురుజిత్తును= కురుజిత్తు అనేవాడు; కురుజిత్తునకున్= ఆ కురుజిత్తుకు; అరిష్టనేమియున్= అరిష్టనేమి; అరిష్టనేమికిన్= అరిష్టనేమికి; శ్రుతాయువున్= శ్రుతాయువు; శ్రుతాయువునకున్= శ్రుతాయువు అనేవానికి; పార్శ్వుండును= పార్శ్వుడు; పార్శ్వునకున్= పార్శ్వునకు; చిత్రరథుండును= చిత్రరథుడు; చిత్రరథునకున్= చిత్రరథునకు; క్షేమాపియున్= క్షేమాపి; క్షేమాపికిన్= క్షేమాపికి; హేమరథుండును= హేమరథుడు; హేమరథునకున్= హేమరథునకు; సత్యరథుండును= సత్యరథుడు; సత్యరథునకున్= సత్యరథునకు; ఉపగురుండును= ఉపగురుడు; ఉపగురునకున్= ఉపగురుడనేవానికి; అగ్నిదేవు ప్రసాదంబునన్= అగ్నిదేవుని అనుగ్రహంవలన; ఉపగుర్వుండును= ఉపగుర్వుడు; ఉపగుర్వునకున్= ఉపగుర్వునకు; సావనుండును= సావనుడు; సావనునకున్= ఆ సావనుడనే వానికి; సువర్చసుండును= సువర్చసుడనేవాడు; కలిగెన్= జన్మించారు; అతఁడె= ఆ సువర్చసుడే; సుభూషణుండు+అని= సుభూషణుడనే పేరుతో; వినన్+పడున్= పేరు పొందాడు; ఆ సుభూషణునకున్= ఆ సుభూషణుడనే వానికి; జయుండును= జయుడు; జయునకున్= జయునకు; విజయుండును= విజయుడు; విజయునకున్= విజయుడనేవానికి; ధృతుండును= ధృతుడు; ధృతునకున్= ధృతుడనేవానికి; అనఘుండును= అనఘుడు; అనఘునకున్= అనఘునకు; వీతిహవ్యుండును= వీతిహవ్యుడు; వీతిహవ్యునకున్= వీతిహవ్యునకు; ధృతియున్= ధృతి; ధృతికిన్= ఆ ధృతికి; బహుళాశ్వుండును= బహుళాశ్వుడు; బహుళాశ్వునకున్= బహుళాశ్వుడనేవానికి; కృతియున్= కృతియు; కృతికిన్= కృతికి; మహావశియును= మహావశి అనేవాడు; జన్మించిరి= పుట్టారు; వీరలు= ఈపైని చెప్పినవారు; మైథిలులు+అగు రాజులు+అని= మైథిలులు అనే పేరుగల రాజులని; చెప్పన్ పడుదురు= చెప్పబడతారు; యోగీశ్వరు ప్రసాదంబునన్= యోగమార్గంలో గొప్పవాడైన పరమేశ్వరుని అనుగ్రహంతో; గృహస్థులు+ఐ+ఉండియున్= గృహస్థులుగా ఉంటూకూడా; బంధవిముక్తులు+ఐ= కర్మబంధాలనుండి విడివడి; ఆత్మజ్ఞానంబు కలిగి= ఆత్మజ్ఞానాన్ని పొంది; నిరంతర= ఎల్లపుడు; బ్రహ్మ+అనుసంధానంబు+చేయుచున్= పరబ్రహ్మతో తమ మనోబుద్ధులను కలిపి; ఉండుదురు= ఉంటారు; అని పలికి= ఈ విధంగా చెప్పి; శుకయోగి+ఇంద్రుఁడు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ సీరధ్వజునకు కుశధ్వజుడు, కుశధ్వజునకు ధర్మధ్వజుడు, ధర్మధ్వజునకు కృతధ్వజుడు, మితధ్వజుడు అనే ఇరువురు కొడుకులు పుట్టారు. వారిలో కుశధ్వజునికి కేశిధ్వజుడు జన్మించాడు. అతడు ఆత్మవిద్యలో నేర్పరి, మితధ్వజునకు ఖాండిక్యుడు

జన్మించాడు. అతడు తండ్రివల్ల యజ్ఞయాగాది కర్మకాండలను గూర్చి తెలిసికొని, కేశిధ్వజునకు భయపడి పారిపోయాడు. ఖాండిక్యునకు భానుమంతుడు, భానుమంతునకు శతద్యుమ్నుడు, శతద్యుమ్నునకు శుచి, శుచికి సనద్వాజుడు, సనద్వాజునకు ఊర్ధ్వకేతుడు, ఊర్ధ్వకేతునకు అజుడు, అజునకు కురుజిత్తు, కురుజిత్తుకు అరిష్టనేమి, అరిష్టనేమికి శ్రుతాయువు, శ్రుతాయువుకు పార్శ్వుడు; వానికి చిత్రరథుడు, చిత్రరథునకు క్షేమాపి, క్షేమాపికి హేమరథుడు, హేమరథునకు సత్యరథుడు, సత్యరథునకు ఉపగురుడు, ఉపగురునకు అగ్నిదేవుని దయవల్ల ఉపగుర్వుడు, ఉపగుర్వునకు సావనుడు, సావనునకు సువర్చసుడు జన్మించారు. ఈ సువర్చసుడే సుభూషణుడని కీర్తింపబడతాడు. ఆ సుభూషణునకు జయుడు, జయునకు విజయుడు, విజయునకు ధృతుడు, ధృతునకు అనఘుడు, అనఘునకు వీతిహవ్యుడు, వీతిహవ్యునకు ధృతి, ధృతికి బహుళాశ్వుడు, బహుళాశ్వునకు కృతి, కృతికి మహావశి జన్మించారు వీరందఱు మైథిలులు అని పిలువబడతారు. యోగీశ్వరుని దయవల్ల వీరు గృహస్థులై ఉండి కూడా కర్మబంధముక్తులై ఆత్మజ్ఞానంతో, ఎల్లప్పుడు పరబ్రహ్మానుసంధానంతో ఉంటారు అని శుకుడు ఇలా అన్నాడు.

## ✤ చంద్రవంశ్యులగు రాజుల ఇతిహాసము ✤

**ఆ. చంద్రగౌరమైన చంద్రవంశమునందుఁ, జంద్రకీర్తితోడ జనితమైన**
**యట్టి పుణ్యమతులు నైళాదిరాజుల, నింక వినుము మానవేంద్రచంద్ర! 375**

**ప్రతి :** చంద్రగౌరమైన= చంద్రునివలె తెల్లనైన; చంద్రవంశము+అందున్= చంద్రవంశంలో; చంద్రకీర్తితోడన్= చంద్రునివలె స్వచ్ఛమైన కీర్తితో; జనితము+ఐన= జన్మించిన; అట్టి= అలాంటి; పుణ్యమతులున్= పుణ్యాత్ములైన; ఐళాదిరాజులన్= ఐళా పుత్రుడైన పురూరవుడు మొదలైన రాజులను గూర్చి; ఇంకన్= ఇకపైని; మానవ+ఇంద్ర చంద్ర= ఓ రాజచంద్రా; పరీక్షిన్మహారాజా!; వినుము= విను.

**తా :** ఓ రాజచంద్రా! చంద్రకాంతివలె తెల్లనైన చంద్రవంశంలో చంద్రునివలె తెల్లని కీర్తితో పుట్టి పుణ్యాత్ములైన ఐళాది రాజుల చరిత్రను ఇకపై విను.

**సీ. ఒకవేయుతలలతో నుండు జగన్నాథు బొడ్డుఁ దమ్మిని బ్రహ్మ పుట్టె మొదల;**
**నతనికి గుణముల నతనిఁ బోలిన దక్షుఁ, డగు నత్రి సంజాతుఁ డయ్యె; నత్రి**
**కడగంటి చూడ్కులఁ గలువలసంగడీఁ, డుదయించె విప్రుల కోషధులకు**
**నమరఁ దారాతతి కజుని పంపున నాథుఁడై యుండి రాజసూయంబు సేసి**

**తే. మూఁడులోకములను గెల్చి మోఱకమునఁ, జని బృహస్పతి పెండ్లాముఁ జారుమూర్తిఁ**
**దార నిలుసొచ్చి కొనిపోయి తన్ను గురుఁడు, వేఁడునందాఁక న య్యింతి విడువఁ డయ్యె.376**

**ప్రతి :** ఒక వేయుతలలతోన్= వేయి శిరస్సులతో; ఉండు జనార్దను= ఉండే విష్ణుమూర్తియొక్క; బొడ్డున్+తమ్మిని= నాభి కమలంలో; మొదలన్= మొదట; బ్రహ్మపుట్టెన్= బ్రహ్మదేవుడు జన్మించాడు; అతనికిన్= ఆ చతుర్ముఖ బ్రహ్మకు; గుణములన్= సుగుణాలలో; అతనిన్ పోలిన= బ్రహ్మను పోలిన; దక్షుఁడు+అగు= సమర్థుడైన; అత్రి= అత్రిమహర్షి; సంజాతుఁడు+అయ్యెన్= జన్మించాడు; అత్రి= అత్రియొక్క; కడగంటి చూడ్కులన్= క్రీగంటి చూపులనుండి; కలువల సంగడీఁడు= కలువలకు

మిత్రుడైన చంద్రుడు; ఉదయించెన్= జన్మించెను; విప్రులకున్= బ్రాహ్మణులకు; ఓషధులకున్= ఔషధాలకు మూలాలైన ఓషధులకు; అమరన్= ఒప్పునట్లుగా; తారాతతికిన్= నక్షత్ర సమూహానికి; అజుని పంపునన్= బ్రహ్మయొక్క ఆజ్ఞచేత; నాథుడు+ఐ+ఉండి= ప్రభువై ఉండి; రాజసూయంబు+చేసి= రాజసూయ యాగాన్ని చేసి; మూఁడు లోకములను గెల్చి= మూడులోకాల్నీ జయించి; మోఱకమునన్= మూర్ఖత్వంతో; చని= వెళ్ళి; చారుమూర్తిన్= అందమైన ఆకారంగల (సౌందర్యవతియైన); బృహస్పతి పెండ్లామున్= దేవగురువు బృహస్పతి భార్యను; తారన్= తార అనే పేరుగలదానిని; ఇలు+చొచ్చి= ఆమె ఇంటిలోనికి పోయి; కొనిపోయి= తనతో తీసికొనివెళ్ళి; తనున్= తనను; గురుఁడు= పెద్దవాడైన దేవగురువు; వేఁడు+అందాఁకన్= బతిమాలునంత వరకూ; ఆ+ఇంతిన్= అతని భార్య తారను; విడువఁడు+అయ్యెన్= విడిచిపెట్టలేదు.

**తా :** వేయితలలు గల శ్రీహరి నాభికమలం నుండి ముందుగా చతుర్ముఖ బ్రహ్మ పుట్టాడు. సుగుణాలలో అతనితో పోల్చదగిన సమర్థుడైన అత్రి ఆ బ్రహ్మకు పుట్టాడు. అత్రి క్రీగంటి చూపులనుండి కలువల చెలికాడు చంద్రుడు పుట్టాడు. బ్రహ్మ ఆజ్ఞతో ఆ చంద్రుడు బ్రాహ్మణులకు, ఓషధులకు, నక్షత్రసమూహానికి రాజయ్యాడు. చంద్రుడు రాజసూయ యాగాన్నిచేసి, ముల్లోకాలను జయించి, మూర్ఖత్వంతో వెళ్లి, సౌందర్యవతి అయిన బృహస్పతి భార్య తారను ఆమె ఇంటినుండి తనతో తీసికొని వచ్చాడు. దేవగురువు బ్రతిమాలినా అతని భార్య తారను చంద్రుడు విడిచిపెట్టలేదు.

**వ. అంత వేల్పులతో రక్కసులకుం గయ్యం బయ్యె, బృహస్పతితోడి వైరంబునం జేసి, కావ్యుఁడు రాక్షసులతోఁ జేరికొని చంద్రునిఁ జేపట్టి, సురాచార్యునిం బోఁదోలిన హరుండు భూతగణసమేతుండై, తన గురుపుత్త్రుండైన బృహస్పతినిఁ జేపట్టె. దేవేంద్రుండును, సురగణంబులుం, దానును బృహస్పతికి నడ్డంబు వచ్చె, అ య్యవసరంబున బృహస్పతి భార్యానిమిత్తంబున రణంబు సురాసుర వినాశకరం బయ్యె. ఆలోన బృహస్పతి తండ్రియగు నంగిరసుండు సెప్పిన విని బ్రహ్మదేవుండు చంద్రునిం గోపించి, గర్భిణి అయిన తారను మరల నిప్పించినం జూచి, బృహస్పతి దాని కిట్లనియె. 377**

**ప్రతి :** అంతన్= అంతట; వేల్పులతోన్= దేవతలతో; రక్కసులకున్= రాక్షసులకు; కయ్యంబు+అయ్యెన్= యుద్ధం జరిగింది; బృహస్పతితోడి= దేవగురువైన బృహస్పతితో; వైరంబునన్+చేసి= విరోధం కారణంగా; కావ్యుఁడు= శుక్రాచార్యుడు; రాక్షసులతోన్= రక్కసులతో; చేరికొని= చేరి; చంద్రునిన్= చంద్రుని; చేపట్టి= పక్షం వహించి; సురాచార్యునిన్= దేవగురువును; పోన్+తోలినన్= తరిమివేయగా; హరుండు= ఈశ్వరుడు; భూతగణసమేతుండు+ఐ= తన భూతగణాలతో కూడినవాడై; తన గురుపుత్త్రుండు+ఐన= తన గురువుగారి సుతుడైన; బృహస్పతిని= దేవగురువును; చేపట్టెన్= చేపట్టాడు, కైకొన్నాడు; దేవేంద్రుండును= దేవేంద్రుడు కూడా; సురగణంబులున్= దేవతల సమూహమూ; తానును= తాను (దేవేంద్రుడు); బృహస్పతికిన్= దేవగురువైన బృహస్పతికి; అడ్డంబు వచ్చెన్= సాయంగా ఉండి రాక్షసాదులకు అడ్డుపడ్డాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; బృహస్పతి భార్యానిమిత్తంబునన్= బృహస్పతి భార్య తారయొక్క కారణంగా; రణంబు= యుద్ధం; సురాసుర వినాశకరంబు+అయ్యెన్= దేవతల రాక్షసుల నాశనానికి హేతువు అయ్యింది; ఆ లోనన్= అంతలో; బృహస్పతి తండ్రి+అగు= బృహస్పతి తండ్రి అయిన; అంగిరసుండు+చెప్పినన్+విని= అంగిరసుడు చెప్పగా విని; బ్రహ్మదేవుండు= బ్రహ్మ; చంద్రునిన్ కోపించి= చంద్రునిపై ఆగ్రహించి; గర్భిణి అయిన= గర్భవతిగా ఉన్న; తారను= తారను; మరలన్ ఇప్పించినన్= తిరిగి బృహస్పతికి ఇప్పించగా; చూచి= తారను చూచి; బృహస్పతి= గురుడైన బృహస్పతి; దానికిన్= తారకు (తారతో) ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అప్పుడు దేవతలతో రాక్షసులకు యుద్ధం అయింది. బృహస్పతితో విరోధంవల్ల శుక్రాచార్యుడు రాక్షసులతో కలిసి చంద్రుని పక్షంచేరి బృహస్పతిని తరిమాడు. ఈశ్వరుడు తన భూతగణపరివారంతో బృహస్పతిపక్షాన నిలిచాడు. ఇంద్రుడు దేవతాసమూహంతో బృహస్పతికి సాయంగా నిలిచాడు. ఆ సమయంలో బృహస్పతిభార్య తార కారణంగా దేవతలకూ, రాక్షసులకూ వినాశం కలిగించే యుద్ధం జరిగింది. అంతలో బృహస్పతి తండ్రి అంగిరసుడు చెప్పగా బ్రహ్మ చంద్రునిపై కోపించి గర్భవతియైన తారను బృహస్పతికి తిరిగి ఇప్పించాడు. బృహస్పతి తారను చూచి ఇలా అన్నాడు.

**ఉ. సిగ్గొకయింతలేక వెలచేడియ భంగిని ధర్మకీర్తులన్**
**బొగ్గులు సేసి జారు శశిఁ బొంది కటా! కడు పేల దెచ్చి కొం**
**టెగ్గ దలంపఁగా వలదె యిప్పుడు గర్భము దించుకొమ్ము నిన్**
**మ్రగ్గఁగ జేసెదన్ జెనఁటి! మానవతుల్ నినుఁ జూచి మెత్తురే? 378**

**ప్రతి :** సిగ్గు+ఒక+ఇంతలేక= రవంత కూడా సిగ్గులేకుండా; వెలచేడియ భంగిని= వెలయాలులాగా; ధర్మకీర్తులన్= ధర్మాన్ని కీర్తిని; బొగ్గులు+చేసి= నాశనంచేసి; జారున్= విటుడైన; శశిన్+పొంది= చంద్రునిచేరి; కడుపు+ఏల+తెచ్చుకొంటి= గర్భాన్ని ఎందుకు తెచ్చుకున్నావు; కటా= అయ్యో!; ఎగ్గు+తలంపగాన్ వలదు+ఎ= దోషమని తలంచవలదా!; ఇప్పుడు; గర్భము దించుకొమ్ము= నీ గర్భం పోయేలా చేసికో; చెనటి= ఓ చెడ్డదానా!; నిన్ మ్రగ్గఁగన్+చేసెదన్= నిన్ను దహించివేస్తాను; నినున్+చూచి= నిన్ను చూచి; మానవతుల్= అభిమానవతులు; మెత్తురు+ఎ= మెచ్చుకుంటారా?

**తా :** ఓ దుష్టురాలా! ఏ మాత్రం సిగ్గు లేకుండా, వెలయాలివలె ధర్మాన్నీ, కీర్తినీ మంటగలిపి జారుడైన చంద్రునితో పొందుకోరి గర్భాన్ని తెచ్చుకోవడం నీకు తప్పుగా తోచడం లేదా! ఇప్పుడే ఈ గర్భాన్ని దించుకో. నిన్ను కాల్చేస్తాను అసలు నిన్ను చూచి అభిమానవతులు మెచ్చుకుంటారా?

**వ. అని కోపించుచుండ, నా చెలువకుఁ బసిండిచాయ మేనుగల కుఱ్ఱ పుట్టె. వానిం జూచి మోహంబు చేసి, బృహస్పతి తన కొడుకనియునుం, జంద్రుండు దన కన్నవాఁ డనియును, జగడించిరి. అప్పుడు 379**

**ప్రతి :** అని కోపించుచుండన్= ఈ విధంగా బృహస్పతి కోపగిస్తుండగా; ఆ చెలువకున్= ఆ తారకు; పసిండి చాయమేను+కల= బంగరు రంగు శరీరం గల్గిన; కుఱ్ఱపుట్టెన్= సుతుడు జన్మించాడు; వానిన్= ఆ సుతుని; చూచి= కనుగొని; మోహంబు చేసి= మోహాన్ని పొంది; బృహస్పతి= దేవగురువు; తన కొడుకు+అనియునున్= ఈ పుట్టినబిడ్డ తన బిడ్డ అని; చంద్రుండు= చంద్రుడు; తన కన్నవాఁడనియును= తానే ఈ బిడ్డను కన్నానని; జగడించిరి= కలహించారు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** తారపై ఈ విధంగా బృహస్పతి ఆగ్రహిస్తుండగా, ఆ తారకు బంగరు రంగు గల ఒక కొడుకు పుట్టాడు. ఆ బిడ్డను చూచి మోహాన్ని పొందిన బృహస్పతి 'ఈ బిడ్డ నా బిడ్డ' అని, చంద్రుడు 'ఈ సుతుడు నా సుతుడే' అనీ వాదులాడుకున్నారు అప్పుడు

**ఆ. వారి వాదు చూచి వారింపఁగా వచ్చి, యేర్పరింపలేక యెల్లమునులు**
**నమరవరుల నడుగ నా వేడుకలకత్తె, యెఱుఁగుఁ గాని యితరు లెఱుఁగ రనిరి. 380**

**ప్రతి :** వారి వాదుచూచి= వారి కలహాన్నిచూచి; వారింపఁగాన్ వచ్చి= ఆపు చేయడానికి వచ్చి; ఎల్లమునులున్= మునులందరు; ఏర్పరింపన్‌లేక= నిర్ణయింపలేక; అమరవరులన్ అడుగన్= దేవతాశ్రేష్ఠుల నడుగగా; ఆ వేడుకలకత్తె= ఆ వగలాడి; ఎఱుఁగున్+కాని= ఎరిగి ఉంటుంది తప్ప; ఇతరులు+ఎఱుఁగరు+అనిరి= ఇతరులు ఎరుగరు అన్నారు.

**తా :** వారు వాదులాడుకోవడం ఆపు చేయడానికి వచ్చిన మునులు 'ఆ బిడ్డ ఎవరి బిడ్డ' అనే విషయాన్ని నిర్ణయించలేక, దేవతలను అడిగారు. ఈ విషయం ఆ వగలాడికి మాత్రమే తెలుస్తుంది తప్ప ఇతరులకు తెలియదన్నారు దేవతలు.

**వ. ఆ పలుకులు విని, సిగ్గుపడి యున్న తారకుఁ జిన్ని కొమరుం డిట్లనియె. 381**

**ప్రతి :** ఆ పలుకులు విని= ఆ మాటలు విని; సిగ్గుపడి+ఉన్న= సిగ్గుపడుతూఉన్న; తారకున్= తారకు; చిన్ని కొమరుండు= అందాలకొడుకు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ మాటలు విని సిగ్గుతో నిలిచిన తారతో అందాల కుమారుడిలా అన్నాడు.

**క. ఇలువరుస చెడఁగ బంధులు, దలవంపఁగ మగఁడు రోయఁ దల్లీ! కట్టా!**
**వెలినేల నన్నుఁ గంటివి, కలిగించినవాఁడు శీతకరుఁడో గురుఁడో. 382**

**ప్రతి :** ఇలువరుస చెడఁగన్= ఇంటి మర్యాద పోయేలా; బంధులున్= చుట్టాలు; తలవంపన్+కన్= సిగ్గుతో తలవంచుకోగా; మగఁడు రోయన్= భర్త అసహ్యించుకొనేలా; కట్టా!= అయ్యో!; తల్లీ= అమ్మా!; వెలిన్= (నీ భర్తగాక) ఇతరులవల్ల; నన్నున్= నన్ను; ఏలకంటివి= ఎందుకు కన్నావు; కలిగించినవాఁడు= నా జన్మకు కారణమైనవాడు; శీతకరుఁడు+ఓ= చంద్రుడో!; గురుఁడు+ఓ= బృహస్పతియో!

**తా :** ఇంటి పరువు పోయేలా, బంధువులు తలవంచుకొనేలా, భర్త అసహ్యించుకొనేలా అన్యులవల్ల నన్ను ఎందుకు కన్నావు? తల్లీ! నా తండ్రి చంద్రుడా? బృహస్పతా?

**వ. అని పలుకుచున్న కొడుకునకు మాఱుమాటలాడనేరకున్న తార నేకాంతంబునకుం జీరి మంతనంబున బ్రహ్మ యిట్లనియె. 383**

**ప్రతి :** అని పలుకుచున్న= ఈ విధంగా మాట్లాడుతూ ఉన్న; కొడుకునకున్= బిడ్డకు; మాఱుమాటలాడన్ నేరక+ఉన్న= తిరిగి జవాబు చెప్పలేకున్న; తారన్= తారను; ఏకాంతంబునకున్+చీరి= ఒంటరిగా పిలిచి; మంతనంబునన్= రహస్యంగా; బ్రహ్మ= బ్రహ్మ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇలా అడుగుతూ ఉన్న కొడుకునకు జవాబు చెప్పలేక నిలిచిన తారను బ్రహ్మ ఏకాంతానికి పిలిచి రహస్యంగా ఇలా అన్నాడు.

**మ. చెలువా! నీయెల సిగ్గు వాసి, గురుఁడో శీతాంశుఁడో యెవ్వఁడౌ**
**లలితాకారుఁ గుమారుఁ గన్న యతఁ? డేలా దాఁప? నీ పాటు నీ**
**తలనే పుట్టెనె? వెచ్చ నూర్పకుము; కాంతల్ కామినుల్ గారె? మా**
**టల నిందేమియుఁ బోదుపో యొరులతోడం జెప్పు; విన్పింపవే. 384**

**ప్రతి :** చెలువా= ఓ తారా! (కాంతా!); నీ యెలసిగ్గు+పాసి= నీ చిరు బిడియాన్ని వదలిపెట్టి; గురుఁడు+ఓ= దేవగురువో; శీతాంశుఁడు+ఓ= చంద్రుడో; లలితాకారున్= అందమైన ఆకారంగల; కుమారున్ కన్న+అతఁడు= కొడుకును కన్నవాడు; ఎవ్వడు+ఔన్= ఎవ్వడగునో; ఏలాదాఁపన్= దాచడం ఎందుకు?; ఈ పాటు= ఈ పని; నీ తలనేపుట్టెనె?= నీ బుద్ధిలోనే పుట్టిందా?; వెచ్చనూర్పకుము= వేడి నిట్టూర్పులు విడువవద్దు; కాంతల్= స్త్రీలు; కామినుల్ కారు+ఎ= ఇష్టమైన వారిని కలవడంలో ఆసక్తి కలవారు కదా!; మాటలన్= చెప్పినంత మాత్రాన; ఇందు+ఏమియున్ పోదుపో= ఏమి పోదులే; ఒరులతోడన్= ఇతరులతో; చెప్పన్= చెప్పను; విన్పింపవు+ఏ= చెప్పుమా!

**తా :** ఓ కాంతా! నీ సిగ్గు విడిచి ఈ చిన్ని బాలుని తండ్రి దేవగురుడో, చంద్రుడో చెప్పుము. ఎందుకు దాస్తావు? ఈ ఆలోచన నీకే పుట్టిందా? నిట్టూర్పులు విడవడం మాను. సహజంగా కాంతలు కాముకురాండ్రు కదా! మాట చెప్పినంత మాత్రాన నష్టం రాదు. నే నెవ్వరికీ చెప్పను. నిజం చెప్పుము.

**వ. అని పలికిన బ్రహ్మకు నెదురుమాటాడ వెఱచి, మంతనంబున నయ్యింతి చంద్రునికిం గన్న దాన ననవుఁడు నా బాలకునకు బుధుండని పేరు పెట్టి, చంద్రున కిచ్చి బ్రహ్మ సనియె. నంత. 385**

**ప్రతి :** అని పలికిన= అలా మాట్లాడిన; బ్రహ్మకున్= బ్రహ్మకు; ఎదురు మాటాడన్ వెఱచి= ఎదురుచెప్పడానికి భయపడి; మంతనంబునన్= రహస్యంగా; ఆ+ఇంతి= ఆ కాంత (తార); చంద్రునికిన్= చంద్రునకు; కన్నదానన్= ఈ బిడ్డను కన్నాను (చంద్రునివల్లే ఈ బిడ్డను కన్నాను); అనవుడున్= అనగా; ఆ బాలకునకున్= ఆ బిడ్డకు; బుధుండు+అని పేరుపెట్టి= బుధుడని పేరుపెట్టి; చంద్రునకున్+ఇచ్చి= ఆ బాలుని చంద్రునకు అప్పగించి; బ్రహ్మ చనియెన్= బ్రహ్మ వెళ్ళిపోయాడు; అంతన్= ఆ తరువాత.

**తా :** అలా మాట్లాడిన బ్రహ్మకు ఎదురు చెప్పలేక తార రహస్యంగా 'ఈ బిడ్డను చంద్రునివల్ల కన్నాను' అని చెప్పగా, ఆ బిడ్డకు బుధుడని పేరుపెట్టి ఆ బాలుని చంద్రునకిచ్చి బ్రహ్మ వెళ్ళిపోయాడు.

**ఆ. బుద్ధిమంతుడైన బుధుఁడు పుత్త్రుండైన, మేను పెంచి రాజు మిన్ను ముట్టె;**
**బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి, మిన్ను ముట్టకేల మిన్నకుండు? 386**

**ప్రతి :** బుద్ధిమంతుడు+ఐన= బుద్ధి కలిగిన; బుధుఁడు= బుధుడనే పేరు గలవాడు (బుధుడు= జ్ఞాని); పుత్త్రుండు+ఐనన్= సుతుడు కాగా; మేనుపెంచి= వృద్ధిపొంది (మేను పెంచి= ఒడలు పొంగి); రాజు= చంద్రుడు; మిన్ను ముట్టెన్= ఆకాశాన్ని అంటాడు; (మిన్నుముట్టెన్= ఆకాశానికి చేరాడు, ఆకాశంలో ప్రకాశించాడు); బుద్ధిగల సుతుండు= జ్ఞానం కలిగిన బిడ్డ; పుట్టినచోన్= జన్మించినట్లయితే; తండ్రి= బిడ్డను కన్నతండ్రి; మిన్నుముట్టక= ఆకాశాన్ని తాకక; ఏల మిన్నక+ఉండు= ఎలా ఊరకుంటాడు!

**తా :** బుద్ధిమంతుడైన బుధుడు తన సుతుడుకాగా, చంద్రుడు వృద్ధి పొంది, ఆకాశాన్ని తాకాడు. జ్ఞానం కలిగిన కొడుకును కన్నతండ్రి ఆనందంతో ఉప్పొంగి ఆకాశాన్ని అందుకోడా?!

**వ. ఆ బుధునకుఁ దొల్లి చెప్పిన యిళాకన్యక వలనఁ బురూరవుండు పుట్టె; ఆ పురూరవునకుఁ గల శౌర్యసౌందర్య గాంభీర్యాది గుణంబులు నారదుని వలన నింద్రసభలోన నూర్వశి విని, మిత్రావరుణుల శాపంబున మనుష్యస్త్రీరూపంబు దాల్చి, భూలోకంబునకు వచ్చి, పురూరవు ముందట నిలువంబడి. 387**

**ప్రతి :** ఆ బుధునకున్= ఆ బుధుడనేవానికి; తొల్లిచెప్పిన= పూర్వం చెప్పిన; ఇళాకన్యక వలనన్= ఇళ అనే కన్యవల్ల; పురూరవుండు పుట్టెన్= పురూరవుడు పుట్టాడు; ఆ పురూరవునకున్= ఆ పురూరవునకు; కల= ఉన్న; రూప= ఆకారము; సౌందర్య= అందము; గాంభీర్య+ఆది గుణంబులు= గంభీరత మొదలైన సుగుణాలు; నారదుని వలనన్= నారదునిద్వారా; ఇంద్ర సభలోనన్= ఇంద్రుని సుధర్మ సభలో; ఊర్వశి; విని= విని; మిత్రావరుణులశాపంబునన్= మిత్రావరుణుల శాపంవల్ల; మనుష్య స్త్రీరూపంబు+తాల్చి= మానవకాంత ఆకారాన్ని ధరించి; భూలోకంబునకున్వచ్చి= భూమికివచ్చి; పురూరవు ముందటన్ నిలువన్+పడి= బుధుని కుమారుడైన పురూరవుని ముందు నిలిచి.

**తా :** ఆ బుధునికి ఇంతకుమునుపు చెప్పినట్లు ఇళా కన్యకవల్ల పురూరవుడు జన్మించాడు. అతడి సౌందర్యాన్నీ, శౌర్యాదిగుణాలను ఇంద్రసభలో ఊర్వశి నారదుడివల్ల విన్నది. మిత్రావరుణుల శాపంవల్ల ఆమె మనుష్య స్వరూపాన్ని ధరించి భూలోకానికి వచ్చింది.

**తరలము.**

**సరసిజాక్షు మృగేంద్రమధ్యు విశాలవక్షు మహాభుజున్**
**సురుచిరానన చంద్రమండల శోభితున్ సుకుమారు నా**
**పురుషవర్యుఁ బురూరవుం గని పువ్వుటంపరజోదుచేఁ**
**దొరఁగు క్రొవ్విరి తూపులన్ మదిఁ దూలపోవఁగ భ్రాంతయై. 388**

**ప్రతి :** సరసిజాక్షున్= పద్మములవంటి కన్నులు కలవానిని; మృగ+ఇంద్రమధ్యున్= మృగరాజైన సింహం నడుమువంటి నడుము గలవానిని; విశాలవక్షున్= విశాలమైన వక్షఃస్థలం గలవానిని; మహాభుజున్= గొప్ప భుజాలు గలవానిని; సురుచిర= అందమైన; ఆనన చంద్రమండల శోభితున్= ముఖమనే చంద్రమండలంతో ప్రకాశించేవానిని; సుకుమారున్= కోమలమైన వానిని; ఆ పురుషవర్యున్= ఆ పురుషశ్రేష్ఠుని; పురూరవున్ కని= పురూరవుని చూచి; పువ్వు+అంపరజోదుచేన్= పూల బాణాలయోధుడైన మన్మథునిచేత; తొరఁగు= పడుచున్న; క్రొత్త+విరితూపులన్= క్రొత్త పూల బాణములచే; మదిన్= మనస్సులో; తూలపోవఁగన్= చిన్నబోగా; భ్రాంత+ఐ= భ్రాంతి పొందినదై (వివశురాలై)...

**తా :** ఊర్వశి తామరలవంటి కన్నులు కలవాడు, సింహం నడుమువంటి నడుము కలవాడు, వెడదఱొమ్ము కలవాడు, మహాభుజుడు, అందమైన చంద్రునివంటి కాంతిమంతమైన మొగము కలవాడు, సుకుమారుడు, పురుషశ్రేష్ఠుడయిన పురూరవుణ్ణి చూచి, మన్మథుడు వేసే పూల బాణాలకు మనసు చిన్నబోగా వివశురాలై

**వ. ఊర్వశి నిలిచి యున్నంత 389**

**ప్రతి :** ఊర్వశి నిలిచి+ఉన్నంతన్= ఊర్వశి నిలిచి ఉండగా...

**తా :** ఊర్వశి నిలిచి ఉన్న సమయంలో

**ఉ. భావజు కోలయో? మొగులువాసి వెలుంగు మెఱుంగొ? మోహినీ**
**దేవతయో? నభోరమయొ? దీని కరగ్రహణంబు లేనిచో**
**జీవన మేటి కంచు మరుచేఁ జిగురా కడిదమ్ము జిమ్ములం**
**దా వడఁకెన్ బురూరవుఁడు తామరపాకు జలంబు కైవడిన్. 390**

**ప్రతి :** భావజు= మనసున పుట్టు మన్మథునియొక్క; కోలయో?= బాణమా; మొగులు+పాసి= మబ్బును విడిచి; వెలుంగు మెఱుంగు+ఒ= వెలుగుచిమ్మే మెరుపా (విద్యుల్లతయా); మోహినీ దేవతయో?= దేవదానవులకు అమృతం పంచడానికి అవతరించిన మోహినీ దేవతయా?; నభో+రమయొ?= ఆకాశలక్ష్మియా?; దీని కరగ్రహణంబు లేనిచోన్= ఈ కాంత చేయిపట్టకపోతే; జీవనము+ఏటికి+అంచున్= బ్రదుకెందుకు అనుకొంటూ; మరుచేన్= మన్మథునిచేత; చిగురాకు+అడిదమ్ము= చిగురాకు కత్తి; చిమ్ములన్= దెబ్బలచే; పురూరవుఁడు= ఆ పురూరవుడు; తామరపాకు జలంబుకైవడిన్= తామరాకు మీద ఉన్న నీటిబొట్టువలె; తా వడఁకెన్= తాను చలించిపోయాడు.

**తా :** పురూరవుడు ఊర్వశిని చూచి ఇది మన్మథుని బాణమా? మబ్బును వదలిన మెరుపా? మోహినీ దేవతయా? ఆకాశలక్ష్మియా? దీనిచేయి పట్టకుంటే జీవితం ఎందుకు? అనుకుంటూ తామరాకు పై నీటిబొట్టులాగా మన్మథ బాణాలవల్ల చలించిపోయాడు.

**వ. ఇట్లు రాచపట్టి చెఱకువింటి వాని దాడికి నోడి, యెట్టకేలకు సైరణచేసి నిలుకడం దెచ్చికొని; య చ్చెలువ కిట్లనియె. 391**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; రాచపట్టి= రాజపుత్రుడైన పురూరవుడు; చెఱకువింటివాని= చెరకుగడ ధనువుగా గల మన్మథునియొక్క; దాడికిన్+ఓడి= ధాటికి భయపడి; ఎట్టకేలకు= అతి ప్రయత్నంతో; సైరణచేసి= ఓర్పు వహించి; నిలుకడన్+తెచ్చికొని= స్తిమితాన్ని పొంది; ఆ+చెలువకున్= ఆ ఊర్వశికి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా రాజపుత్రుడు పురూరవుడు మన్మథ బాణాలకు గురియై, ఎలాగో స్తిమితపడి ఊర్వశితో ఇలా అన్నాడు.

**ఉ. ఎక్కడనుండి రాక? మన కిద్దఱికిం దగు; నీకుఁ దక్కితిన్**
**బ్రుక్కడి వచ్చెనే యలరుముల్కులవాఁ డడిదంబుఁ ద్రిప్పు చే**
**దిక్కు నెఱుంగ నౌ యబల! దేహము దేహము గేలుఁ గేల నీ**
**చెక్కునఁ జెక్కు మోపి తగు చెయ్వుల నన్ను విపన్నుఁ గావవే. 392**

**ప్రతి :** అబల= ఓ స్త్రీ!; ఎక్కడనుండి రాక?= నీవు ఎక్కడనుండి వస్తున్నావు; మనకు+ఇద్దఱికిన్= మనకిర్వురకి; తగు= సరిపోవును; నీకున్+తక్కితిన్= నేను నీకు లభించాను; బ్రుక్కడి= నీచుడు; అలరుముల్కులవాఁడు= పూలబాణాల మన్మథుడు; అడిదంబున్+త్రిప్పుచున్= ఖడ్గమును జళిపిస్తూ; వచ్చెనే= వచ్చాడు; ఏదిక్కున్+ఎఱుంగన్= ఏ దారి నాకు గోచరించడం లేదు; ఔ= ఇది నిజము; దేహమున్ దేహము= నా శరీరంతో నీ శరీరాన్ని; కేలున్ కేలన్= నా చేతిని నీ చేతితో; ఈ చెక్కునన్= ఈ నా చెక్కిలిపై; చెక్కున్మోపి= నీ చెక్కిలిని చేర్చి; తగు చెయ్వులన్= తగిన క్రియలతో; విపన్నున్= ఆపదలో ఉన్న; నన్నున్= నన్ను; కావవు+ఏ= రక్షించవా!

**తా :** ఓ అబలా! నీవు ఎక్కడనుండి వస్తున్నావు? మనకిద్దరికి ఈడు జోడు సరిపోతుంది. నీకు నేను దక్కాను. మన్మథుని బాణపు దెబ్బలతో నాకు దిక్కు తోచడం లేదు. నేను అసత్యం ఆడటం లేదు. నా శరీరానికి నీ శరీరాన్ని, నా చేతికి నీ చేతిని, నా చెక్కిలికి నీ చెక్కిలిని చేర్చి తగినరీతిగా ఆపదలోనున్న నన్ను కాపాడు.

**వ. అనినం బ్రోడచేడియ యిట్లనియె 393**

**ప్రతి :** అనినన్= పురూరవుడు ఇలా పలుకగా; ప్రోడ= ప్రౌఢురాలయిన; చేడియ= స్త్రీ (ఊర్వశి); ఇట్లు+అనియెన్= ఇలా అన్నది.

**తా :** పురూరవుని పలుకులు విని, ప్రౌఢురాలైన ఊర్వశి ఇలా అంది.

**మ.** **ఇవి నా కూర్చుతగళ్ళు రెండు దగ నీ వెల్లప్పుడున్ గాచె దే**
**ని వివస్త్రుండవు గాక నాకడ సదా నీవుండు దేనిన్ విశే**
**ష విలాసాధిక! నీకు నా ఘృతము భక్ష్యంబయ్యె నేనిన్ మనో**
**జ వినోదంబుల నిన్నుఁ దేల్తు నగునే చంద్రాన్వయగ్రామణీ!** **394**

**ప్రతి :** చంద్ర+అన్వయ గ్రామణీ= చంద్రవంశంలో జన్మించిన శ్రేష్ఠుడా!; విశేష విలాస+అధిక= విశేషం విలాసాలను అధికంగా కలవాడా!; ఇవి= ఈ; రెండు= రెండూ; నా కూర్చుతగరు+లు= నా మనసుకు ఇష్టాన్ని చేకూర్చే పొట్టేళ్ళు; తగన్= తగినరీతిగా; నీవు; ఎల్లప్పుడున్= ఎప్పుడూ; కాచెదు+ఏని= ఈ పొట్టేళ్ళు రెంటిని కాపాడినట్లయితే; వివస్త్రుండవు+కాక= దిగంబరుడవు కాకుండా; నాకడన్= నా వద్ద; సదా= ఎల్లప్పుడు; నీవు+ఉందుదు+ఏనిన్= నీవు ఉన్నట్లయితే; నీకున్= నీకు; నా ఘృతము= నేను భుజించే నేయి; భక్ష్యంబు+అయ్యెనేనిన్= నీవు తినేటట్లయితే; మనోజ వినోదంబులన్= మన్మథ వినోదాలతో; నిన్నున్= నిన్ను; తేల్తున్= తృప్తి పరుస్తాను; అగును+ఏ= నీకు అంగీకారమా!

**తా :** చంద్రవంశ సంజాతశ్రేష్ఠా! విశేష విలాసాలను కోరే పురూరవా! ఈ రెండు పొట్టేళ్ళు నాకు చాలా ఇష్టమైనవి. వీటిని ఎల్లప్పుడు నీవు రక్షించాలి. నా వద్ద నీ వెప్పుడూ దిగంబరుడవై ఉండకూడదు. నేను భుజించే నేయి నీవు కూడా తినాలి. ఈ అంశాలకు నీవు అంగీకరిస్తే నేను నిన్ను మన్మథ వినోదాలలో ఓలలాడిస్తాను. నీకు అంగీకారమేనా?

**వ.** **అని పల్కిన వేల్పుల వెలయాలి ప్రతిమాటల కియ్యకొని తన మనంబున.** **395**

**ప్రతి :** అని పల్కిన= ఈ విధంగా మాట్లాడిన; వేల్పుల వెలయాలి= దేవవేశ్యయొక్క; ప్రతిమాటలకున్= సమాధానాలకు; ఇయ్యకొని= అంగీకరించి; తన మనంబునన్= తన మనసులో...

**తా :** ఇలా పల్కిన దేవవేశ్య ఊర్వశి పలుకులకు తన అంగీకారాన్ని పురూరవుడు తెలిపి తన మనసులో (ఇలా అనుకున్నాదు)

**క.** **మంచిదఁట, రూపు ననురతి, నంచిత యఁట దేవగణిక యఁట, మరుచేతన్**
**సంచలితచిత్తయై కా, మించిన దఁట, యింతకంటె మేలుం గలదే.** **396**

**ప్రతి :** రూపు= ఆకారం; మంచిదఁట= చాల బాగున్నది; అనురతిన్= అనురాగమున అనుకూలమై; అంచితయఁట= తగినదై ఉన్నది; దేవగణికయఁట= దేవతలయొక్క వెలయాలు; మరుచేతన్= మన్మథునిచేత; సంచలిత చిత్త+ఐ= కదల్పబడిన మనస్సు కలదియై (మనసు చంచలముకాగా); కామించినదఁట= నన్ను కోరుకున్నది; ఇంతకంటెన్= ఈ విషయాలకంటె; మేలున్+కలదు+ఏ= ఇంక మేలైనదేమున్నది?

**తా :** ఈమె ఆకారం సుందరం, అనురాగం అనుకూలం, దేవవేశ్య, మన్మథునిచే మనసు చంచలంకాగా నన్ను కామించింది. ఇంతకంటె మేలు ఉంటుందా?

**వ.** **అని నిశ్చయించుకొని** **397**

**ప్రతి :** అని నిశ్చయించుకొని= ఈ విధంగా నిర్ణయించుకొని...

**తా :** ఈ విధంగా ఒక నిశ్చయానికి వచ్చి

**ఆ. రాజు రాజముఖిని రతిఁ దేల్చె బంగారు, మేడలందుఁ దరుల నీడలందుఁ**
**దోఁటలందు రత్నకూటంబులందును, గొలఁకులందు గిరుల కెలఁకులందు. 398**

**ప్రతి :** రాజు= చంద్రవంశంలో జన్మించిన పురూరవుడు; రాజముఖిని= చంద్రునివంటి మోముగల ఊర్వశిని; బంగారు మేడలు+అందున్= పైడి మేడలలో; తరుల నీడలు+అందున్= చెట్ల నీడలలో; తోటలు+అందున్= ఉద్యానవనాలలో; రత్న కూటంబులు+అందును= రత్నాల చావిళ్ళలో; కొలఁకులు+అందున్= సరస్సులలో; గిరుల= పర్వతాలయొక్క; కెలఁకులు+అందున్= పార్శ్వములందు; రతిన్+తేల్చెన్= శృంగార క్రీడలలో ముంచి తేల్చాడు.

**తా :** పురూరవుడు చంద్రముఖి ఊర్వశిని బంగారు మేడలలో, చెట్ల నీడలలో, తోటలలో రత్నాల చావిళ్ళలో, సరస్సులలో పర్వత పార్శ్వాలలో శృంగార క్రీడలలో ముంచి తేల్చాడు.

**వ. అంత న య్యిద్దఱకుం తగులంబు నెలకొనిన 399**

**ప్రతి :** అంతన్= అలా జరుగుతున్న కాలంలో; ఆ+ఇద్దఱకున్= ఊర్వశికి పురూరవునకు; తగులంబు= విడదీయరాని సంబంధం; నెలకొనినన్= ఏర్పడగా...

**తా :** అలా అన్నిచోట్ల రతిక్రీడాసక్తులైన ఆ ఊర్వశీపురూరవులకు విడదీయరాని అనుబంధం ఏర్పడగా

**క. ఒక దిక్క యేగుదురు వా, రొకచోటన కాని నిలిచి యుండరు దమలో**
**నొకటియె మనమున నెంచుచు, నొకనిమిషము పాయకుందు రువిదయుఁ దానున్. 400**

**ప్రతి :** ఉవిదయున్= (తరుణి) ఊర్వశీ; తానున్= పురూరవుడూ; ఒకదిక్కు+అ= ఒకవైపే (ఒకదిక్కుకే); ఏగుదురు= పయనిస్తారు; వారు= వారిరువురు; ఒకచోటను+అ= ఒక్కచోటనేగాని; నిలిచియుండరు= నిలువరు (ఇద్దరూ ఒకచోటనే ఉంటారు); తమలోన్= తమలో; మనమునన్= మనసులో; ఒకటి+ఎ= ఒక విషయాన్నే; ఎంచుచున్= ఆలోచిస్తూ; ఒక నిమిషము= ఒక క్షణంకూడా; పాయక+ఉందురు= విడిచిపెట్టకుండా ఉంటారు.

**తా :** ఒకప్రక్కకే వా రుభయులు వెళ్ళి, ఒకచోటనే ఉండి, తమ ఇరువురి మనసులలో ఒక విషయాన్నే ఆలోచిస్తూ, ఒక్క నిమిషం కూడా ఒకరి నొకరు వదలక ఊర్వశీ పురూరవులు ఉంటారు.

**క. దయ్య మెఱుంగును వారల, నెయ్యంబును మక్కువలును నిజమరితనముల్**
**వియ్యములును నెడసందినిఁ, బయ్యదకొం గడ్డమైనఁ బ్రాణము వెడలున్. 401**

**ప్రతి :** వారల= ఊర్వశీపురూరవులయొక్క; నెయ్యంబును= స్నేహమును; మక్కువలును= ఇష్టాలను; నిజమరితనముల్= సత్యశీలతలు; వియ్యములును= వైవాహిక సంబంధాలను (చుట్టరికాలను); దయ్యము+ఎఱుంగును= దేవునికి మాత్రమే తెలుసు; ఎడసందినిన్= ఆ ఇరువురి మధ్యలో; పయ్యదకొంగు= పైట చెరగు; అడ్డమైనన్= అడ్డంగా ఉన్నా; ప్రాణము వెడలున్= ప్రాణం పోతుంది.

**తా :** ఊర్వశీపురూరవుల మధ్య ఉండే స్నేహం, ప్రేమ, సత్యశీలత, దాంపత్య ధర్మం దేవునికి మాత్రమే తెలుసు. ఇద్దరికి మధ్య పైటకొంగు అడ్డమైనా 'ప్రాణాలు వదిలేస్తారా' అన్నంతగా కలిసి ఉండేవారు.

**వ. ఇ ట్లూర్వశియుం బురూరవుండు నొం డొరువుల వలన మక్కువలు చెక్కులొత్తం బగళ్లు రేలు నెల్లెడల విహరింప నొక్కనాఁడు దేవలోకంబున దేవేంద్రుండు గొలువుండు తఱిఁ గొలువున నూర్వశి లేకుండుటం జూచి. 402**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ఊర్వశియున్= ఊర్వశి; పురూరవుండును= పురూరవుడు; ఒండొరువుల వలనన్= ఒకళ్ళ వలన ఇంకొకరికి; మక్కువలు= ప్రేమలు; చెక్కులు+ఒత్తన్= అధికంకాగా; పగళ్ళురేలున్= అహోరాత్రులు; ఎల్ల+ఎడలన్= అన్నిచోట్ల; విహరింపన్= విహరిస్తూ ఉండగా; ఒక్కనాఁడు= ఒకరోజు; దేవలోకంబునన్= దేవలోకంలో; దేవేంద్రుండు= దేవతలరాజు మహేంద్రుడు; కొలువుండు తఱిన్= కొలువు తీరి ఉన్నవేళ; కొలువునన్= సభలో; ఊర్వశి లేకుండుటన్= ఊర్వశి లేకపోవడాన్ని; చూచి= గమనించి.

**తా :** ఈ విధంగా ఊర్వశీ పురూరవులు ఇరువురు ఒకరిపై ఒకరికి ప్రేమ అధికంకాగా పగలనక రేయనక అన్నిచోట్ల విహరిస్తూ ఉండగా, ఒకరోజు దేవలోకంలో దేవేంద్రుడు కొలువు తీరి ఉన్నవేళ సభలో ఊర్వశి లేకపోవడంచూచి.

**క. ఇన్ని దినంబులవలె నా, యున్న సభామధ్యవేది యూర్వశి లేమిన్**
**విన్నఁదనంబున నున్నది, వన్నె దఱిఁగి యున్న పసిఁడివడువున ననుచున్. 403**

**ప్రతి :** ఇన్నిదినంబులవలెన్= ఇన్నాళ్ళువలె; నా+ఉన్న= నేనుంటున్న; సభామధ్యవేదిన్= సభాంతరవేదికలో; ఊర్వశిలేమిన్= ఊర్వశి లేకపోవడంచేత; వన్నె+తఱిఁగి+ఉన్న= కాంతి తగ్గిన; పసిఁడి వడువునన్= బంగారంవలె; విన్నన్ఁదనంబునన్= వైవర్ణ్యంతో (తెల్లబోయి); ఉన్నది= ఉంది; అనుచున్= అంటూ...

**తా :** ఇన్నాళ్ళవలె నా సభాంతరములోని వేదిక ఊర్వశి లేకపోవడంచేత వన్నె తగ్గిన పైడిలా తెల్లబోయి ఉంది అంటూ

**వ. ఇంద్రుండు గంధర్వులం బనిచిన వారు నడురేయిం జని చీఁకటి నూర్వశి పెంచుకొన్న యేడకంబులం బట్టిన నవి రెండును మొఱవెట్టిన వాని మొఱ విని రతిఖిన్నుండై మేనుమఱచి కూరుకుచున్న పురూరవు కౌఁగిటనుండి యూర్వశి యిట్లనియె. 404**

**ప్రతి :** ఇంద్రుండు= ఇంద్రుడు; గంధర్వులన్= గంధర్వులను; పనిచినన్= పంపగా (వెళ్ళుటకు ఆజ్ఞాపింపగా); వారు= ఆ గంధర్వులు; నడురేయిన్= అర్ధరాత్రి; చని= వెళ్ళి; చీఁకటిన్= చీకటిలో; ఊర్వశి పెంచుకొన్న= ఊర్వశి లాలిస్తున్న; ఏడకంబులన్= పొట్టేళ్ళను (మేషాలను); పట్టినన్= బంధించేసరికి; అవిరెండును= ఆ రెండు పొట్టేళ్ళు; మొఱవెట్టినన్= మొర్రో అంటూ గీ పెట్టేసరికి; వాని మొఱన్ విని= వాటి ఆర్తనాదాన్ని విని; రతిఖిన్నుండు+ఐ= శృంగార క్రీడలో అలసినవాడై; మేనుమఱచి= ఒడలు మరచి; కూరుకుచు+ఉన్న= నిద్రిస్తున్న; పురూరవు కౌఁగిటన్+ఉండి= పురూరవుని ఆలింగనంలో ఉన్న; ఊర్వశి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తా :** ఇంద్రుడు గంధర్వులను పంపించగా, వారు అర్ధరాత్రమున చీకటిలో వెళ్ళి, ఊర్వశి పెంచుకుంటున్న పొట్టేళ్ళను బంధించారు. అవి రెండు మొర పెట్టాయి. ఆ ఆర్తనాదాలను విని శృంగార క్రీడలలో అలసి నిద్రిస్తున్న పురూరవుని ఆలింగనంలో ఉన్న ఊర్వశి ఇలా అంది.

**మ. 'అదె నా బిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచు ను**
**న్మదులై పోయెద; రడ్డపాటునకు సామర్థ్యంబునన్ హీనుఁడై**
**కదలం డీ మగపంద; కూరుకుగతిం గన్మూసి గుర్వెట్టుచున్**
**వదలం జాలఁడు నాదు కౌఁగిలియు దా వంధ్యాత్ముఁడై చెల్లరే' 405**

**ప్రతి :** అదె= అదిగో; నా బిడ్డలన్= నా పుత్రులను (నేను ప్రేమతో పెంచుకొంటున్న రెండు పొట్టేళ్ళను); పట్టి= బంధించి; దొంగలు; మహా+అహంకారులు+ఐ= గొప్ప అహంభావంకలవారై; కొంచున్= తీసికొంటు; ఉన్మదులు+ఐ= పెంపెక్కిన మదం గలవారై; పోయెదరు= తీసికొనిపోతున్నారు; అడ్డపాటునకున్= వారికి అడ్డుపడటానికి; సామర్థ్యంబునన్ హీనుఁడు+ఐ= సామర్థ్యం లేనివాడై; ఈ మగపంద= పిరికివాడైన ఈ పురుషుడు (మగవాడయ్యి పిరికివాడు); కూరుకుగతిన్= నిద్రలో ఉన్న విధంగా; కన్+మూసి= కళ్ళు మూసికొని; గుర్వెట్టుచున్= గుర్రుపెడుతూ; తా వంధ్యాత్ముఁడు+ఐ= తాను వ్యర్థమనస్కుడై (ఏమిచేయడానికీ సమర్థత లేనివాడై); నాదు; కౌఁగిలియున్= నా కౌగిలిని; వదలన్ చాలఁడు= వదలలేక పోతున్నాడు; చెల్లరు+ఏ= అయ్యో!

**తా :** నా బిడ్డలైన పొట్టేళ్ళను దొంగలువచ్చి, అహంకారంతో, మదంతో తీసికొనిపోతున్నారు. ఆ దొంగలకు అడ్డుపడలేక ఈ మగపంద నిద్రలో కళ్ళు మూసికొని నా కౌగిలి వదలకుండా పడి నిద్రపోతున్నాడు అయ్యో!

**క. పగతురు దొంగల రేఁపఁగ, మగఁటిమి వాటింపలేక మగతన మెల్లన్**
**మగువల కౌఁగిటఁ జూపెడు, మగవాఁడగుకంటె మగఁడు మగువగు టొప్పున్. 406**

**ప్రతి :** పగతురు= శత్రువులు; దొంగలన్= దొంగలను; రేఁపఁగన్= ప్రేరేపించి పంపగా; మగఁటిమి+పాటింపన్‌లేక= పౌరుషాన్ని చూపలేక; మగతనము+ఎల్లన్= తన పౌరుషమంతా; మగువల కౌఁగిటన్= స్త్రీల కౌగిళ్ళలో; చూపెడు= ప్రదర్శించే; మగఁడు= పురుషుడు (భర్త); మగవాఁడు+అగుకంటెన్= పురుషుడుగా ఉండటంకంటె; మగువ+అగుట+ఒప్పున్= ఆడుదిగా ఉండటం తగినది (ఒప్పును).

**తా :** శత్రువులు దొంగలను పంపితే, వారిపై తన పౌరుషాన్ని చూపలేక, ఆడువారి కౌగిళ్ళలో మగతనాన్ని చూపే మగాడు, పురుషుడుగా ఉండటంకంటె ఆడుదిగా ఉంటే బాగుంటుంది.

**ఆ. అధముఁడైన వాని కా లగుకంటె న, త్యధికునింట దాసి యగుట మేలు;**
**హీనుఁ బొంది యోని హింసింపఁగా నేల?, యువతిజనుల కూరకుంట లెస్స. 407**

**ప్రతి :** అధముఁడు+ఐనవానికిన్= నీచుడైన వానికి; ఆలు+అగుకంటెన్= భార్య అవడంకంటె; అత్యధికు+ఇంటన్= గొప్పవారి యింటిలో; దాసి+అగుట మేలు= పరిచారికగా ఉండటం మంచిది; హీనున్ పొంది= నీచుని పొందుపొంది; యోని హింసింపగాన్+ఏల= ఆడుతనమును బాధపెట్టుట ఎందుకు?; యువతి జనులకున్= స్త్రీలకు; ఊరకుంటలెస్స= (మగవాని పొందు పొందక) ఊరకే (ఒంటరిగా) ఉండుట మేలు.

**తా :** తక్కువతనము గలవానికి భార్య కావడంకంటె అధిక గుణసంపన్నుని ఇంటిలో దాసిగా ఉండటం ఆడవారికి మేలు. నీచుణ్ణి పొంది ఆడుతనాన్ని హింసించడంకంటె పొందుకోరక ఊరకే ఉండటమే మంచిది.

**క. ఏటిది నీరాచఱికం, బాఁటది మొఱవెట్టఁ బశువులాతురపడ నో**
**యాఁటదని లేచి దొంగల, గీఁటవు వెడలంగ శవముక్రియ నుండె దిదే. 408**

**ప్రతి :** నీరాచఱికంబు= నీ ప్రభుత్వం (నీవు రాజుగా నుండుట); ఏటిది= ఎంతటిది (తక్కువదే సుమా); ఆఁటది= ఒక ఆడుది; మొఱవెట్టన్= బాధతో మొరపెట్టగా; పశువులు= నోరులేని మృగాలు (పొట్టేళ్ళు); ఆతురపడన్= కంగారు పడుతుండగా; ఓ యాఁటదని= అయ్యో ఆడుది కదా అని; లేచి= మెలకువ తెచ్చుకొని; వెడలంగన్= దూరంగాపోయేటట్లుగా; దొంగలగీఁటవు= దొంగలను చిమ్మవు (తరిమికొట్టవు); ఇదే= ఈ విధంగా; శవము క్రియన్= పీనుగువలె; ఉండెదు= ఉంటావు (ఇది నీకు తగునా).

**తా :** నీ రాచరికం ఎందుకు? ఒక ఆడుది మొరపెడుతూ ఉంటే, పశువులు ఆతురపడుతూ ఉంటే, ఆడుది పిలుస్తోంది కదా అని లేవవు, దొంగలను దూరంగా తరిమికొట్టవు. శవంలా పడి ఉంటావు.

**క. వినియు వినవు రణభీరువు, మనుజాధము నిదురబోతు మందుని నకటా!**
**నినుఁ జక్రవర్తిఁ జేసిన, వనజాసనుకంటె వెఱ్ఱివాఁడును గలఁడే? 409**

**ప్రతి :** వినియున్ వినవు= విని కూడా విననట్లు ఉంటావు; రణభీరువున్= యుద్ధానికి భయపడేవాడును; మనుజాధమున్= మనుష్యులలో తక్కువతనం గలవాడును; నిదురబోతున్= నిద్ర మరిగినవానిని; మందునిన్= బుద్ధి తీక్షతలేని; నినున్= నిన్ను; చక్రవర్తిన్= రాజుగా; చేసిన= నిలిపిన (ప్రవర్తింపజేసిన); వనజాసనుకంటెన్= పద్మాసనుడైన బ్రహ్మకంటె; వెఱ్ఱివాఁడును కలఁడు+ఏ= వెవాడు ఉంటాడా?

**తా :** విని కూడా ఏమీ విననట్లుగా ఉంటావు; యుద్ధభీతి గలవాడిని, మనుజులలో అధముని, ఎల్లప్పుడు నిద్రపోయేవాడిని మందుడు అయిన నిన్ను చక్రవర్తిని చేసిన బ్రహ్మకంటె వెర్రివాడు ఉంటాడా (ఉండడు అని భావం).

**వ. అని పెక్కుభంగుల న య్యింతి, పరుషోక్తులను కరవాలమ్ములు చెవులఁజొనుప, నా రాజశేఖరుం డంకుశంబు పోట్ల నదరు మదగజంబు చందంబున చీరమఱచి, దిగంబరుండై వాలు కేల నంకించి, నడురేయి దొంగల నఱకి వైచి మేషంబుల విడిపించుకొని, తిరిగివచ్చునెడ. 410**

**ప్రతి :** అని= ఈ విధంగా; పెక్కు భంగులన్= అనేక విధాలుగా; ఆ+ఇంతి= ఆ స్త్రీ (ఊర్వశి); పరుష+ఉక్తులు+అను= కఠినమైన మాటలు అనే; కరవాలమ్ములు= కత్తులను; చెవులన్+చొనుపన్= చెవులలో దిగునట్లు చేయగా (మాట్లాడగా); ఆ రాజశేఖరుండు= ఆ రాజశ్రేష్ఠుడైన పురూరవుడు; అంకుశంబు పోట్లన్= అంకుశంయొక్క పోటులకు; అదరు= విజృంభించు; మదగజంబు చందంబునన్= మదించిన ఏనుగువలె; చీరమఱచి= వస్త్రాన్ని ధరించటం మరచిపోయి; దిగంబరుండు+ఐ= వివస్త్రుడై; వాలు= కత్తి; కేలన్+అంకించి= చేత ధరించి; నడురేయిన్= అర్ధరాత్రి; దొంగల నఱకివైచి= దొంగలను ముక్కలు చేసి (చంపి); మేషంబులన్ విడిపించుకొని= పొట్టేళ్ళను దొంగలనుండి విడుదల కావించుకొని; తిరిగివచ్చు+ఎడన్= తిరిగివచ్చే సమయంలో...

**తా :** అని ఈ ప్రకారంగా ఆ ఊర్వశి కఠినపు మాటలనే కత్తులు చెవిలో చొప్పించగా, రాజశ్రేష్ఠుడైన పురూరవుడు అంకుశపు పోట్లకు విజృంభించే మత్తేభంవలె, బట్టమరచి, దిగంబరుడై, కత్తి చేతబట్టి, ఆ అర్ధరాత్రంలో, దొంగలను నరకి, పొట్టేళ్ళను విడిపించుకొని, తిరిగివచ్చే సమయంలో

**ఆ. చీఱలేని మగనిఁ జెలువ దా నీక్షించి, కన్ను మొఱఁగి పోవఁ గడఁక నతఁడు**
**వెఱ్ఱివానిభంగి వివశుఁడై పడి లేచి, పొటిలి తెఱలి స్రుక్కి పొక్కిపడియె. 411**

**ప్రతి :** చీఱలేని మగనిన్= వస్త్రము లేక దిగంబరంగా ఉన్న భర్త పురూరవుణ్ణి; చెలువ= ఇంతి ఊర్వశి; తాన్ ఈక్షించి= తాను చూచి; కన్ను మొఱఁగి పోవన్= వంచించి కనబడకుండా పోగా; కడఁకన్= ప్రయత్నంతో; అతఁడు= ఆ పురూరవుడు; వెఱ్ఱివాని భంగిన్= వెఱ్ఱివానివలె; వివశుఁడు+ఐ= వశము తప్పినవాడై (తనను తాను స్వాధీనంలో ఉంచుకొనలేక); పడి= క్రిందపడి; లేచి= పైకి లేచి; పొటిలి= బాధపడి; తెఱలి= తిరిగి; స్రుక్కి= సొమ్మసిలి; పొక్కి= దుఃఖించి; పడియెన్= నేలపై కూలాడు.

**తా :** దిగంబరంగా ఉన్న పురూరవుణ్ణి ఊర్వశి చూచింది. అనుకున్న మాట ప్రకారంగా ఊర్వశి అతనికి కనపడకుండా వెళ్ళిపోయింది. ఆమె అదృశ్యం కాగా, పురూరవుడు వెఱ్ఱివాడిలా తనను తాను స్వాధీనపరచుకోలేక మిక్కిలి దుఃఖించి అవస్థ పడ్డాడు.

**వ. మఱియుఁ బురూరవుండు మదనాతురుండై, వెతకుచు, సరస్వతీ తీరంబునఁ జెలికత్తెలతోఁ గూడియున్న నూర్వశిం గని, వికసితముఖుండై యిట్లనియె. 412**

**ప్రతి :** మఱియున్= ఇంకను; పురూరవుండు= రాజు పురూరవుడు; మదన+ఆతురుండు+ఐ= మన్మథుని వలన ఆతురత గలవాడై; వెతకుచు= అన్వేషిస్తూ; సరస్వతీ తీరంబునన్= సరస్వతీ నదీతీరంలో; చెలికత్తెలతోన్= సఖీజనంతో; కూడియున్న= కలసియున్న (చేరియున్న); ఊర్వశిన్‌కని= ఊర్వశినిచూచి; వికసిత ముఖుండు+ఐ= విప్పారిన మోము గలవాడై; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** పురూరవుడు మన్మథుని బాధకు తాళలేక ఊర్వశి కొరకు అన్వేషిస్తూ, సరస్వతీ నదీతీరంలో సఖీజనంతో కూడి ఉన్న ఊర్వశిని చూచి వికసించిన మోముతో ఇలా అన్నాడు.

**మ. తనుమధ్యా! యిది యేల వచ్చి తకటా! ధర్మంబె శర్మంబె! మున్**
**మనలో నుంకువలాడి కొన్న వలపుల్ మర్యాదలున్ దప్పెనే**
**నిను నేఁ బాసిన యంతనుండి తనువు న్నేలం బడంబాఱె మే**
**దినిపై వ్రాలకమున్న నన్నుఁ గరుణాదృష్టిన్ విలోకింపవే! 413**

**ప్రతి :** తనుమధ్యా!= సన్నని నడుముగల ఓ ఊర్వశీ!; ఇది యేలవచ్చితి= ఇలా వచ్చావేమిటి!; అకటా= అయ్యో!; ధర్మంబు+ఎ= ఇది ధర్మమా; శర్మంబు+ఎ= (ఇలా విడిపోయి వెళ్ళిపోవడం) సుఖమా; మున్= మునుపు (పూర్వము); మనలోన్= మనలో మనము; ఉంకువలు+ఆడికొన్న వలపుల్= సమ్మతి మాటలుగా మాట్లాడుకొన్న ప్రేమలు; మర్యాదలున్+తప్పెనే= హద్దు తప్పాయా!; నినున్= నిన్ను; నేన్ పాసిన+అంతనుండి= నేను విడిచిపెట్టినప్పటినుండి; తనువున్= నా శరీరము; నేలన్ పడన్‌పాఱెన్= నేలపై పడిపోతోంది (నిలబడలేని స్థితిలో ఉంది); మేదిని పైన్ వ్రాలకమున్ను+అ= భూమిపై నా శరీరం పడకముందే (ఈ శరీరం పడిపోకముందే); నన్నున్= నన్ను; కరుణాదృష్టిన్= దయగల చూపుతో; విలోకింపవు+ఏ= చూడవా!

**తా :** ఓ ఊర్వశీ ఇలా నన్ను విడచి రావడం నీకు ధర్మమా! సంతోషమా! మనం కొన్ని ఒడంబడికలు చేసికొన్నాము కదా! అవి మేర తప్పటం బాగున్నదా! నిన్ను నేను విడిచినప్పటినుండి నా శరీరం నా స్వాధీనంలో లేదు. ఈ శరీరం భూమిపై పడకపూర్వమే (చనిపోక పూర్వమే) నన్ను దయాదృష్టితో వీక్షించు.

**వ. అనిన నూర్వశి యిట్లనియె. 414**

**ప్రతి :** అనినన్= పురూరవుడు అలా మాట్లాడగా; ఊర్వశి= ఊర్వశి అనే ఆ అప్సరస; ఇట్లు+అనియెన్= ఇలా అంది.

**తా :** పురూరవుని పలుకులు విని ఊర్వశి ఇలా అన్నది.

**క. మగువలకు నింత లొంగెదు; మగవాఁడవె నీకు పశువుమాడ్కిన్ వగవం**
**దగవే మానుషపశువును, మృగములు గని రోయుఁగాక మేలని తినునే! 415**

**ప్రతి :** మగువలకున్= స్త్రీలకు; ఇంతలొంగెదు= ఇంతగా లోబడిపోతావు; మగవాఁడవు+ఎ= నీవు మగవాడివేనా?; నీకున్= నీకు; పశువు మాడ్కిన్= పశువువలె (అజ్ఞానివలె); వగవన్+తగవే= బాధపడుట తగునా? న్యాయమా?; మానుష పశువును= మనుష్యరూపంలో ఉన్న పశువును (మనుష్యుడై పుట్టి కూడా అజ్ఞానంతో పశువులా ప్రవర్తించే వానిని); కని= చూచి; మృగములు= పశువులు; రోయున్+కాక= అసహ్యించుకుంటాయి తప్ప; మేలు+అని= మంచి కదా అని; తినును+ఏ= ఆహారంగానైన స్వీకరిస్తాయా?

**తా :** స్త్రీలకు ఇంతగా లొంగిపోతావు. నీవసలు మగవాడవేనా? ఇలా మృగంలా దుఃఖించడం నీకు న్యాయమా? మనుష్యరూపంలో ఉన్న పశువును చూచి పశుజాతి "మనకంటె వీళ్ళు అజ్ఞానంగా ఉన్నారే" అనే భావంతో అసహ్యించుకుంటాయి తప్ప కనీసం ఆహారంగానైనా స్వీకరించవు.

**వ. అదియునుం గాక. 416**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక...

**తా :** అంతేకాకుండా

**మ. తలఁపుల్ చిచ్చులు, మాట లుజ్జ్వల సుధాధారల్, విభుండైన పు**
**వ్విలుతున్ మెచ్చర! యన్యులన్ వలతురే! విశ్వాసమున్ లేదు క్రూ**
**రలు తోడుం బతినైనఁ జంపుదు రధర్మల్ నిర్దయల్ చంచలల్**
**వెలయాండ్రెక్కడ? వారి వేడబము లా వేదాంతసూక్తంబులే? 417**

**ప్రతి :** తలఁపుల్= ఆలోచనలు; చిచ్చులు= మంటలు; మాటలు= పలికే పలుకులు; ఉజ్జ్వల= గొప్పవైన; సుధాధారల్= అమృతధారలు; విభుండు+ఐన= భర్త అయిన; పువ్విలుతున్ మెచ్చరు+అ= (పూల బాణాలు గల) మన్మథునైన మెచ్చనే మెచ్చరు; అన్యులన్ వలతురు+ఏ= ఇతరులను ప్రేమిస్తారా?!; విశ్వాసమున్ లేదు= నమ్మకం ఉండదు; క్రూరలు= కఠినమైన క్రూరమైన ఆలోచనలు గలవారు; తోడున్+పతినైనన్= (తోడుంబతిన్+ఐనన్)= తోడుగా ఉండే భర్తనైనా; చంపుదురు= మట్టుపెట్టగలరు; అధర్మల్= ధర్మము లేనివారు; నిర్దయల్= కరుణలేనివారు; చంచలల్= చపలచిత్తం

గలవారు; వెలయాండ్రు+ఎక్కడ?= పై లక్షణాలుగల వేశ్యాస్త్రీలు ఎక్కడ; వారి వేడబములు= వారు చేసే వంచనలు; ఆ వేదాంతసూక్తంబులు+ఎ= ఆ ఉపనిషద్వాక్యా లనుకొన్నావా?

**తా :** వెలయాండ్ర ఆలోచనలు అగ్నిహోత్రాలవలె మంటలెగసిపడుతున్నా, మాటలు తీయని అమృతవర్షంలా ఉంటాయి. సాక్షాత్తుగా మన్మథుడే భర్త అయినా మెచ్చే లక్షణం వీరికి ఉండదు. అంతటి అందగాడైన మన్మథునే మెచ్చని వీరు ఇతరులను ప్రేమిస్తారా? కృతజ్ఞతలేక, క్రూరమైన భావాలు కలిగి తనకు తోడునీడగా ఉండే భర్తనైనా చంపడానికి వెనుకాడరు. ధర్మం లేనివారు, దయలేనివారు, చంచలమైన మానసిక స్థితిగలవారు వీరు. అటువంటి వేశ్యల మాటలు జ్ఞానాన్ని ఉపదేశించే వేదాంతసూక్తా లనుకొన్నావా?

**ఉ. ఇంకొక యేఁడు వోయిన నరేశ్వర! యాతలిరేయి నీవు నా**
**లంకెకు వచ్చి యాత్మజుల లక్షణవంతులఁ గాంచె దేమియున్**
**గొంకక పొమ్ము నావుడును గొమ్మను గర్భిణిఁ గాఁ దలంచుచున్**
**శంక యొకింత లేక నృపసత్తముఁ డల్లనపోయె వీటికిన్. 418**

**ప్రతి :** ఇంకొక యేఁడు+పోయినన్= ఇంకో సంవత్సరం జరిగిన తరువాత; నర+ఈశ్వర= ఓ రాజా!; ఆతలిరేయి= ఆ తరువాతి రోజు రాత్రి; నీవు; నాలంకెకున్ వచ్చి= నాతో సంగమానికి వచ్చి; ఆత్మజులన్= కుమారులను; లక్షణవంతులన్= శుభలక్షణాలతోకూడినవారిని; కాంచెదు= కనగలవు; ఏమియున్= ఎంతమాత్రము; కొంకకపొమ్ము= సందేహించకుండా వెళ్ళు; నావుడును= అనగా; నృపసత్తముఁడు= రాజశ్రేష్ఠుడైన పురూరవుడు; కొమ్మను= స్త్రీ అయిన ఊర్వశిని; గర్భిణిన్+కాన్= గర్భవతిగా; తలంచుచున్= భావిస్తూ; శంక+ఒకింతలేక= రవంత సందేహం కూడా లేకుండా; వీటికిన్= తన పురానికి; అల్లనపోయెన్= మెల్లగా వెళ్ళాడు.

**తా :** ఓ రాజా! పురూరవా! ఇంకొక సంవత్సరం గడిచాక ఆ తరువాతి రోజు రాత్రి నీవు నా సంగమానికి వచ్చి శుభలక్షణ లక్షితులయిన కుమారులను కంటావు. ఏ మాత్రము నా మాటలను శంకించవద్దు అని ఊర్వశి పలుకగా రాజు పురూరవుడు ఊర్వశిని గర్భవతిగా భావించి మనసులో ఏ మాత్రం సంకోచించక తన పట్టణానికి వెళ్ళాడు.

**వ. ఇట్లు మరలి చని, తన పురంబున నొక్కయేఁడుండి, పిదప నూర్వశికడ కేగి యొక్కరేయి పురూరవుం డ య్యింతికడ నున్న, నా వెలఁదియు గంధర్వుల వేఁడికొనుము, నన్నిచ్చెదరు అనవుడు నతండు గంధర్వులను బ్రార్థించిన, వారలతండు పొగడుటకు మెచ్చి, యగ్నిస్థాలి నిచ్చిన, న య్యగ్ని స్థాలి నూర్వశింగాఁ దలంచుచు, దానితో నడవిం దిరుగుచుండి, యొక్కనాఁ డగ్నిస్థాలి యని యెఱింగి, వనంబున దిగవిడిచి, యింటికిఁ జనుదెంచి, నిత్యంబు రాత్రి దానిన చింతించుచుండఁ, ద్రేతాయుగంబు సొచ్చిన నా రాజుచిత్తంబునం గర్మబోధంబులై, వేదంబులు మూఁడు మార్గంబులం దోఁచిన, నా భూవరుండు స్థాలికడకుం జని, యందు శమీగర్భజాతంబైన యశ్వత్థంబుఁ జూచి, యశ్వత్థంబుచేత నరణులు రెండు గావించి, ముందటి యరణి దానును, వెనుకటి యరణి నూర్వశియును, రెంటినడుమ నున్న కాష్ఠంబు పుత్రుండు నని, మంత్రంబు చెప్పుచుం ద్రచ్చుచుండ, జాతవేదుండను నగ్ని సంభవించె. నతఁడు విహితారాధన సంస్కారంబునం జేసి, యాహవనీయాది రూపంబుల మూఁట నెగడి పురూరవుని పుత్రుండని కల్పింపం బడియె. ఆ యగ్ని పురూరవునిఁ బుణ్యలోకంబునకుం బనుపం గారణం బగుటం జేసి. 419**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; మరలి చని= తిరిగి తన పట్టణానికి వెళ్ళి; తనపురంబునన్= తన పట్టణంలో; ఒక్క+ ఏఁడుండి= ఒక సంవత్సరం ఉండి; పిదపన్= ఆ తరువాత; ఊర్వశి కడకేగి= ఊర్వశి వద్దకువెళ్ళి; ఒక్కరేయి= ఒకరాత్రి; పురూరవుండు= పురూరవుడనే రాజు; ఆ+ఇంతికడన్+ఉన్నన్= ఆ ఊర్వశివద్ద ఉండగా; ఆ వెలఁదియున్= ఆ ఊర్వశి; గంధర్వులన్ వేఁడికొనుము= గంధర్వులను ప్రార్థించు; నన్నున్+ఇచ్చెదరు= ఆ గంధర్వులు నన్ను నీకు ఇస్తారు; అనవుడున్= అనగా; అతండు= ఆ పురూరవుడు; గంధర్వులను ప్రార్థించినన్= గంధర్వులను ప్రార్థన చేయగా; వారలు= ఆ గంధర్వులు; అతండు పొగడుటకున్మెచ్చి= పురూరవుని పొగడ్తలకు సంతసించి; అగ్నిస్థాలిన్ ఇచ్చినన్= ఒక నిప్పు పొయ్యిని (కుంపటిని) ఇవ్వగా; ఆ+అగ్నిస్థాలిన్= ఆ కుంపటిని; ఊర్వశిన్+కాన్= ఊర్వశిగా; తలంచుచున్= భావిస్తూ; దానితోన్= ఆ అగ్నిస్థాలితో; అడవిన్+తిరుగుచుండి= అడవిలో తిరుగుతూ; ఒక్కనాఁడు= ఒకరోజున; అగ్నిస్థాలి+అని+ఎఱింగి= వంటకుండగా (కుంపటిగా) తెలిసికొని; వనంబునన్ దిగవిడిచి= అడవిలో ఆ అగ్నిస్థాలిని విడిచిపెట్టి; ఇంటికిన్ చనుదెంచి= ఇల్లుచేరి; నిత్యంబు= ఎల్లప్పుడు; దానిన్+అ= ఆ విషయాన్నే; చింతించుచుండన్= ఆలోచిస్తూ ఉండగా; త్రేతాయుగంబు+ చొచ్చినన్= త్రేతాయుగం రాగా (ప్రవేశింపగా); ఆ రాజు చిత్తంబునన్= ఆ రాజు మనసులో; కర్మబోధంబులు+ఐ= కర్మాచరణను బోధించేట్లు; వేదంబులు మూఁడు మార్గంబులన్ తోఁచినన్= వేదాలు మూడు విధాలుగా తెలియరాగా; ఆ భూవరుండు= ఆ రాజు, పురూరవుడు; స్థాలికడకున్+చని= వంటకుండ దగ్గరకు వెళ్ళి; అందున్= ఆ ప్రదేశంలో; శమీగర్భజాతంబు+ఐన= జమ్మిచెట్టునుండి పుట్టిన; అశ్వత్థంబున్+చూచి= రావిచెట్టును చూచి; అశ్వత్థంబుచేతన్= రావిచెట్టు కొమ్మలచేత; అరణులు రెండు+కావించి= మథించి నిప్పు పుట్టించే రెండుకొయ్యలను తయారుచేసి; ముందటి అరణి= మొదటి కొయ్య; తానును= తననుగా; వెనుకటి యరణిన్= రెండవకొయ్య; ఊర్వశియును= ఊర్వశిగాను; రెంటి నడుమనున్న కాష్ఠంబు= ఆ రెంటిమధ్య ఉన్న కర్ర; పుత్రుండును+అని= కుమారుడుగాను భావించి; మంత్రంబు చెప్పుచున్= మంత్రాలను ఉచ్చరిస్తూ; త్రచ్చుచుండన్= మథిస్తూ ఉండగా; జాతవేదుండు+అను= జాతవేదుడనే పేరుగల; అగ్ని సంభవించెన్= అగ్ని పుట్టింది; అతఁడు= ఆ పుట్టిన అగ్ని; విహిత+ఆరాధన సంస్కారంబునన్+చేసి= ఆరాధన చేయడంవల్ల కలిగిన సంస్కారంచేత; ఆహవనీయ+ఆది= ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని అనబడే; రూపంబులన్= రూపాలతో; మూఁటన్ నెగడి= మూడిటియందు వర్తించి; పురూరవుని పుత్రుండు+అని= పురూరవుని పుత్రుడుగా; కల్పింపన్+పడియెన్= చెప్పబడింది; ఆ+అగ్ని= ఆ అగ్ని; పురూరవునిన్= పురూరవుణ్ణి; పుణ్యలోకంబులకున్= పుణ్యలోకాలకు; పనుపన్= పంపించడానికి; కారణంబు+అగుటన్+చేసి= కారణం అగుటచేత...

**తా :** ఇలా వెళ్ళి తన పట్టణంలో ఒక సంవత్సరం ఉండి, తరువాత ఊర్వశి దగ్గరకు వెళ్ళి ఒక రాత్రి ఆమెవద్ద ఉండగా, ఊర్వశి 'నీవు గంధర్వులను వేడుకో. వారు నన్ను నీకు ఇస్తారు' అని చెప్పగా పురూరవుడు గంధర్వులను ప్రార్థించగా, గంధర్వులు పురూరవుని పొగడ్తలకు మెచ్చుకొని, ఒక అగ్నిస్థాలిని (కుంపటిని) పురూరవునకు ఇవ్వగా, ఆ అగ్నిస్థాలిని ఊర్వశిగా భావించి దానితో అడవంతా తిరిగి ఒకరోజు అది ఊర్వశి కాదు అగ్నిస్థాలి అని గ్రహించి, దానిని అడవిలో విడిచి, ఇంటికి వెళ్ళి, నిత్యం ఊర్వశినే చింతిస్తూ ఉండగా, త్రేతాయుగం వచ్చింది. ఆ రాజైన పురూరవునకు కర్మానుష్ఠానాన్ని బోధించే మూడు మార్గాలుగా వేదాలు తోచాయి. అంత పురూరవుడు అడవిలోని అగ్నిస్థాలి వద్దకు వెళ్ళి అక్కడ జమ్మిచెట్టు నుండి పుట్టిన రావిచెట్టును చూచి, ఆ రావి కొమ్మలతో అగ్నిని మథించే రెండు కొయ్యలు తయారు చేశాడు. (వాటిని అరణులు అంటారు) అందులో మొదటి అరణిని తానుగా, రెండవ అరణిని ఊర్వశిగా, మధ్యనున్న కాష్ఠాన్ని పుత్రుడుగా భావన చేస్తూ మంత్రజపం చేస్తూ ఆ అరణులను మథిస్తుండగా జాతవేదుడనే పేరుగల అగ్ని పుట్టాడు. ఆ అగ్ని మంత్రారాధన

పూర్వక సంస్కారంతో ఆహవనీయాది మూడురూపాలుగా ప్రవర్తిల్లి పురూరవుని పుత్రుడుగా చెప్పబడ్డాడు. పురూరవుని పుత్రుడుగా చెప్పబడ్డ ఆ అగ్ని పురూరవుణ్ణి పుణ్యలోకాలకు పంపుటకు కారణం అవడంచేత

**క. ఆ యగ్నిచేఁ బురూరవుఁ, డా యజ్ఞేశ్వరు ననంతు హరి వేదమయున్**
**శ్రీయుతుఁ గూర్చి యజించె గు, ణాయుతుఁ డూర్వశిఁ గనంగ నరిగెడు కొఱకై. 420**

**ప్రతి :** గుణాయుతుఁడు= సుగుణములతో కూడిన; పురూరవుఁడు= పురూరవుడనే రాజు; ఊర్వశిన్= తన ప్రియురాలైన ఊర్వశిని; కనంగన్= చూచుటకు; అరిగెడు కొఱకు+ఐ= వెళ్ళుటకొఱకు; ఆ+అగ్నిచేన్= పురూరవుని పుత్రుడుగా చెప్పబడ్డ అగ్నిచేత; అనంతున్= అంతములేని ప్రభావముగల; హరిన్= విష్ణువును; వేదమయున్= వేదములే రూపముగా గలవానిని; శ్రీయుతున్= శోభాయుతుడైన వానిని (లక్ష్మీదేవితో కూడినవానిని); కూర్చి= గురించి; యజించెన్= యజ్ఞము చేసెను.

**తా :** సుగుణాన్వితుడైన పురూరవుడు తన పుత్రునిగా చెప్పబడ్డ అగ్నిచేత అనంతుడు, హరి, వేదమయుడు, లక్ష్మీదేవితో కూడినవానిని గూర్చి యజ్ఞం చేశాడు. ఆ యజ్ఞం చేయడం తన ప్రియురాలైన ఊర్వశిని చూడడానికి వెళ్ళాలనే కోరికతో చేశాడు.

**ఉ. ఒక్కడ వహ్ని వేల్పు పురుషోత్తముఁ డొక్కఁడ సర్వవాఙ్మయం**
**బొక్కఁడ వేద మా ప్రణవ మొక్కఁడ వర్ణము తొల్లి త్రేతయం**
**దెక్కటి మాన్చి మూఁడుగను నేర్పఱిచెన్ దనబుద్ధి పెంపుచేఁ**
**జక్కఁగ నా పురూరవుఁ డశక్తులకున్ సులభంబులౌ గతిన్. 421**

**ప్రతి :** తొల్లి= పూర్వము; త్రేతయందున్= త్రేతాయుగంలో; వహ్ని= అగ్నిహోత్రుడు; ఒక్కఁడు+అ= ఒక్కడే; వేల్పు= దైవము; పురుషోత్తముఁడు+ఒక్కఁడు+అ= పురుషులలో ఉత్తముడైన విష్ణుమూర్తి ఒకడే; సర్వవాఙ్మయంబు= సమస్తమైన మాటల సమూహము (భాష); వేదము= వేదం; ఒక్కఁడు+అ= ఒకటే; ఆప్రణవము= ఆ నిత్యనూతనమైన ఓంకారము; ఒక్కఁడు+అ+వర్ణము= ఒకే ఒక అక్షరము; ఎక్కటిమాన్చి= ఆ ఒక్కటిగా ఉన్న ఆ లక్షణాన్ని పోగొట్టి; ఆ పురూరవుఁడు= ఆ పురూరవుడు అనే రాజు; తన బుద్ధి పెంపుచేన్= తన గొప్పదైన తెలివితో; అశక్తులకున్= శక్తి లేనివారికి; సులభంబులు+ఔగతిన్= తేలికగా ఉండే మార్గంలో; మూఁడుగను= మూడింటిగా; ఏర్పఱిచెన్= (వింగడించెను) ఏర్పాటు చేశాడు.

**తా :** త్రేతాయుగంలో అగ్ని ఒకే రూపంతో ఉండేవాడు. దైవమైన పురుషోత్తముడు ఒకేరూపంలో ఉండేవాడు. సమస్త భాషాస్వరూపమైన వేదము ఒకటిగానే ఉండేది. నిత్యనూతనంగా ప్రకాశించే ఓంకార ప్రణవాక్షరము ఒక్కటిగా ఉండేది. ఒకే ఒక్క ఆకారంలో ఉన్న పై అంశాలు సామాన్యులకు తేలికగా అవగతం అవడంకోసం పురూరవుడు తన అమితమైన ధీశక్తితో మూడు మూడుగా విభాగం చేశాడు.

**వ. ఇట్లు వేదవిభాగంబు గల్పించి, యాగంబు సేసి, పురూరవుం డూర్వశియున్న గంధర్వలోకంబునకుం జనియె. అతనికి నూర్వశిగర్భంబున నాయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుండు, జయుండు విజయుం డన నార్గురు పుత్త్రులు గలిగిరి. అందు శ్రుతాయువునకు వసుమంతుండును, సత్యాయువునకు**

**ద్రుతంజయుండును, రయునకు శ్రుతుండు, నేకుండు నన నిరువురును గలిగిరి, జయునకు నమితుండును, విజయునకు భీముండును జనించిరి. ఆ భీమునకుఁ గాంచనుండును, గాంచనునకు హోత్రకుండును, హోత్రకునకు గంగా ప్రవాహంబు పుక్కిటం బట్టిన జహ్నుండును, జహ్నునకుఁ బూరుండును, బూరునకు బాలకుండును, బాలకునకు నజకుండును, నజకునకుఁ గుశుండును, గుశునకుఁ గుశాంబుండు, ధూర్తయుండు, వసువు, కుశనాభుం డన నలువురును సంభవించిరి. అందుఁ గుశాంబునికి గాధి యనువాఁడు గలిగె. ఆ గాధి రాజ్యంబు సేయుచుండ. 422**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వేద విభాగంబు+కల్పించి= ఒకే వేదాన్ని మూడు వేదాలుగా విభాగంచేసి; యాగంబు+చేసి= యజ్ఞక్రియను నిర్వహించి; పురూరవుండు= పురూరవుడనేరాజు; ఊర్వశి+ఉన్న= ఊర్వశి నివసించే; గంధర్వ లోకంబునకున్= గంధర్వ లోకానికి; చనియెన్= వెళ్ళాడు; అతనికిన్= ఆ పురూరవునకు; ఊర్వశి గర్భంబునన్= ఊర్వశి గర్భంలో; ఆయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుండు, జయుండు, విజయుండు+అనన్= ఆయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుడు, జయుడు, విజయుడు అనబడే; ఆర్గురు పుత్రులు+కలిగిరి= ఆరుగురు పిల్లలు కలిగారు; అందున్= వారిలో; శ్రుతాయువునకున్= శ్రుతాయువనే వానికి; వసుమంతుడును= వసుమంతుడనేవాడు; సత్యాయువునకున్= రెండవవాడైన సత్యాయువు అనే వానికి; ద్రుతంజయుండును= ద్రుతంజయుడనేవాడు; రయునకున్= రయుడనేవానికి; శ్రుతుండును= శ్రుతుడు అనేవాడును; ఏకుండును+అనన్= ఏకుడును అనబడే; ఇరువురును గలిగిరి= ఇద్దరు కలిగారు; జయునకున్= జయుడనేవానికి; అమితుండును= అమితుడనేవాడు; విజయునకున్= విజయుడనేవానికి; భీముండును= భీముడనేవాడు; జనించిరి= పుట్టారు; ఆ భీమునకున్= విజయుని కుమారుడైన భీముడు అనేవానికి; కాంచనుండును= కాంచనుడనేవాడు; కాంచనునకున్= కాంచనుడనేవానికి; హోత్రకుండును= హోత్రకుడు అనేవాడు; హోత్రకునకున్= హోత్రకుడనేవానికి; గంగాప్రవాహంబు= భగీరథుని ప్రార్థనతో వెడలివస్తున్న గంగను; పుక్కిటన్+పట్టిన= తన పుక్కిలిలో బంధించిన; జహ్నుండును= జహ్నుడు; జహ్నునకున్= ఆ జహ్నువునకు; పూరుండును= పూరుడనేవాడు; పూరునకున్= పూరుడనేవానికి; బాలకుండును= బాలకుడు; బాలకునకున్= బాలకునకు; అజకుండును= అజకుడు; అజకునకున్= ఆ అజకునకు; కుశుండును= కుశుడు; కుశునకున్= ఆ కుశునకు; కుశాంబుండు, ధూర్తయుండు, వసువు, కుశనాభుండు+అనన్= కుశాంబుడు, ధూర్తయుడు, వసువు, కుశనాభుడనబడే; నలువురును= నల్గురు పుత్రులు; సంభవించిరి= కలిగారు; అందున్= అందులో; కుశాంబునికిన్= కుశాంబుడనేవానికి; గాధియనువాఁడు+కలిగెన్= గాధి అనేవాడు జన్మించాడు; ఆ గాధి రాజ్యంబు+చేయుచుండన్= ఆ గాధి రాజ్యం చేస్తుండగా...

**తా :** ఈ విధంగా వేదవిభాగంచేసి, యాగంచేసి, పురూరవుడు ఊర్వశి ఉన్న గంధర్వ లోకానికి వెళ్ళాడు, ఆ పురూరవుడు అనే రాజుకు ఊర్వశివల్ల ఆయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుడు, జయుడు, విజయుడు అనే ఆర్గురు కొడుకులు పుట్టారు. ఆ ఆరుగురిలో శ్రుతాయువునకు వసుమంతుడు, సత్యాయువు అనేవానికి ద్రుతంజయుడు, రయుడు అనేవానికి శ్రుతుడు, ఏకుడు అనే ఇద్దరు జన్మించారు. జయునకు అమితుడనేవాడు, విజయుడు అనేవానికి భీముడు జన్మించారు. ఆ భీమునికి కాంచనుడు, కాంచనుడికి హోత్రకుడు, హోత్రకునకు గంగాప్రవాహాన్ని తన నోటిపుక్కిలిలో బంధించిన జహ్నుడు, ఆ జహ్నుడికి పూరుడు, పూరునకు బాలకుడు, ఆ బాలకునికి అజకుడు ఆ అజకునికి కుశుడు, ఆ కుశునికి కుశాంబుడు, ధూర్తయుడు, వసువు, కుశనాభుడు అనే నలుగురు జన్మించారు. అందులో కుశాంబుడు అనేవానికి గాధి పుట్టాడు. ఆ గాధి రాజ్యం చేసే సమయంలో

**సీ. సత్యవతిని గాధిజాతను కన్యను విప్రుఁడు ఋచికుండు వేఁడుకొనిన**
**గాధియు సుత కీడు గాఁడని తెల్లని, నవకంపు మేనులు నల్లచెవులు**
**గల గుఱ్ఱముల వేయు కన్యకు నీ వుంకు విచ్చిన గూఁతురు నిత్తు ననిన**
**వసుధామరుండును వరుణుని కడ కేగి హరులఁ దెచ్చినఁ గూఁతు నాతఁ డిచ్చె**

**ఆ. నా మహాత్ము సతియు నత్తయుఁ గొడుకులఁ, గోరి యడుగ నీయకొని యతండు**
**విప్రరాజ మంత్ర వితతుల వేల్పించి, చరువుసేసి గ్రుంకఁ జనియె నదికి. 423**

**ప్రతి :** కన్యను= పెండ్లి వయసుకు వచ్చిన కన్యను; గాధిజాతను= గాధి అనే కుశాంబుని కుమారునియొక్క కూతురిని; సత్యవతిని= సత్యవతి అనే పేరుగలదానిని; విప్రుఁడు= బ్రాహ్మణుడైన; ఋచికుండు= ఋచికుడు అనే పేరు గలవాడు; వేఁడుకొనినన్= తనకిచ్చి పెండ్లి చేయుమని ప్రార్థించగా; గాధియున్= గాధి అనే సత్యవతి తండ్రి; సుతకున్= తన కుమార్తె సత్యవతికి; ఈడు+కాఁడు+అని= తగిన వయసు, రూపము గలవాడు ఈ ఋచికుడు కాడని; తెల్లని= తెల్లని వర్ణము గల; నవకంపుమేనులు= సొగసైన శరీరాలు (కోమలమైన దేహాలు); నల్లచెవులు+కల= నల్లని వర్ణముగల చెవులు గలిగిన; గుఱ్ఱములు వేయు= వేయి సంఖ్యగల గుర్రాలను; కన్యకున్= నా కూతురునకు; నీవు+ఉంకువ+ఇచ్చినన్= నీవు శుల్కంగా ఇచ్చినట్లయితే (అల్లుడు కన్యకోసం ఇచ్చే డబ్బును ఉంకువ అంటారు); కూఁతునున్ ఇత్తున్ అనినన్= నా కూతుర్ని ఇస్తాను అనేసరికి; వసుధా+అమరుండును= ఆ ఋచికుడనే బ్రాహ్మణుడు; వరుణునికడకేగి= పశ్చిమ దిక్కునకు అధిపతి అయిన వరుణుడనే దిక్పాలకుని దగ్గరకు వెళ్ళి; హరులన్= (గాధి అడిగిన లక్షణాలు గల) గుర్రాలను; తెచ్చినన్= తీసికొనిరాగా; కూఁతున్+అతఁడు+ఇచ్చెన్= తన కుమార్తె సత్యవతిని ఋచికునకు ఇచ్చి వివాహం చేశాడు; ఆ మహాత్మునసతియున్= ఆ ఋచికుని భార్య సత్యవతి; అత్తయున్= సత్యవతి తల్లి అయిన గాధి భార్య; కొడుకులన్= కుమారులను; కోరి అడుగన్= వరాలుగా కావాలని అడుగగా; ఈయకొని= అంగీకరించి; అతండు= ఆ ఋచికుడు; విప్రరాజ మంత్ర వితతులన్ వేల్పించి= బ్రాహ్మణ, రాజమంత్రాల సమూహంతో యజ్ఞంచేసి; చరువు+చేసి= హోమద్రవ్యాన్నిచేసి; నదికిన్= నదికి; క్రుంకన్+చనియెన్= స్నానానికి వెళ్ళాడు.

**తా :** గాధిరాజు కుమార్తె సత్యవతిని ఋచికుడనే బ్రాహ్మణుడు తనకిచ్చి వివాహం చేయుమని అడిగాడు. గాధి ఈ ఋచికుడు తన కుమార్తెకు ఈడు కాడు అనే ఆలోచనతో తెల్లగా సుకుమారంగా ఉండే శరీరాలు, నల్లటి చెవులు గలవేయి గుఱ్ఱాలు కన్యాశుల్కంగా ఇస్తే నీకు నా కుమార్తెనిచ్చి వివాహం చేస్తానన్నాడు. ఋచికుడు వరుణుని దగ్గరకు వెళ్ళి గాధి కోరినవిధంగా వేయి గుఱ్ఱాలను తెచ్చి ఇచ్చాడు. గాధి ఋచికునకు తన కూతురు సత్యవతినిచ్చి వివాహం చేశాడు. సత్యవతి, సత్యవతి తల్లి ఇద్దరు ఋచికుని తమకు కొడుకులు కావాలని కోరారు. ఋచికుడు అంగీకరించి బ్రహ్మ మంత్రాలతో, రాజమంత్రాలతో యజ్ఞంచేసి హవ్యాన్ని తయారుచేసి నదీస్నానానికి వెళ్ళాడు.

**విశే :** పురాణకాలంలో కూడా 'ఉంకువ' (కన్యాశుల్కం) ఇవ్వటం ఉందని తెలుస్తున్నది.

**వ. అయ్యెడం దల్లి యడిగిన సత్యవతి బ్రహ్మమంత్రంబుల వేల్పించిన చరువు దల్లి కిచ్చి, క్షాత్ర మంత్రంబులం దల్లికి వేల్పించిన చరువు దా నందుకొని యుండ, నా ముని సనుదెంచి, వీడ్వడుట యెఱింగి, భార్య కిట్లనియె. 424**

**ప్రతి :** ఆ+ఎడన్= ఆ సమయంలో; తల్లి+అడిగినన్= తల్లి అడిగేసరికి; సత్యవతి= ఋచికుని భార్య సత్యవతి; బ్రహ్మమంత్రంబులన్= బ్రాహ్మణ మంత్రాలతో; వేల్పించిన= యజ్ఞం చేయించిన; చరువు= హోమద్రవ్యాన్ని; తల్లికిచ్చి= తన తల్లికి ఇచ్చి; క్షాత్రమంత్రంబులన్= క్షత్రియమంత్రాలతో; తల్లికిన్ వేల్పించిన= సత్యవతి తల్లికి యజ్ఞం చేయించిన; చరువు= హోమపదార్థాన్ని; తాను+అందుకొని+ఉండన్= సత్యవతి అయిన తాను తీసికోగా; ఆ ముని+చనుదెంచి= ఆ ఋచికుడనే మునివచ్చి; వీడ్వడుట+ఎఱింగి= ఒకరి హోమద్రవ్యాన్ని మరొకరు గ్రహించే విధంగా విడిపడుట తెలిసికొని; భార్యకున్= భార్య సత్యవతితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ ఋచికుడు స్నానానికి వెళ్ళిన సమయంలో సత్యవతి తన తల్లి కోరిన ప్రకారంగా బ్రాహ్మణ మంత్రాలతో యజ్ఞం చేసిన యజ్ఞ ప్రసాదాన్ని తల్లికిచ్చి, క్షత్రియ మంత్రాలతో తన తల్లికి తయారు చేయించిన హోమద్రవ్యాన్ని తాను స్వీకరించింది. ఇంతలో ముని వచ్చాడు. ఒకరి చరువును మరొకరు తీసికోవడాన్ని తెలిసికొని భార్య సత్యవతితో ఇలా అన్నాడు.

**ఆ. తల్లి చరువు నీవు దాల్చి నీ చరువేల, తల్లిపాల నిడితి తరళనేత్ర!**
**కొమ్మ! యింక నీకుఁ గ్రూరుఁడు పుట్టు మీ, యమ్మ బ్రహ్మవిదుని ననఘుఁ గాంచు. 425**

**ప్రతి :** తరళనేత్ర= అందంగా కదిలే కన్నులుగల ఓ సత్యవతీ!; తల్లిచరువు= నీ తల్లికోసం తయారు చేసిన హోమద్రవ్యాన్ని; నీవు+తాల్చి= నీవు స్వీకరించి; నీ చరువు= నీకోసం ఏర్పాటు చేసిన హోమప్రసాదాన్ని; ఏల= ఎందుకు?; తల్లిపాలన్+ఇడితి= నీ తల్లికిచ్చావు; కొమ్మ= ఓ స్త్రీ!; ఇంకన్= ఇకపైన; నీకున్= నీకు; క్రూరుఁడుపుట్టున్= క్రూరుడైన పుత్రుడు పుడతాడు; మీ+అమ్మ= మీ అమ్మమాత్రం; అనఘున్= దోషాలులేని; బ్రహ్మవిదునిన్= బ్రహ్మ జ్ఞానం గలవానిని; కాంచున్= కంటుంది.

**తా :** ఓ చంచలాక్షీ! సత్యవతీ! నీ కొరకు తయారుచేసిన చరువు నీ తల్లికిచ్చి ఆమెకొరకు తయారుచేసిన చరువు నీవు ఎందుకు తీసికొన్నావు? విను. నీకు క్రూరమైన ఆలోచనలుగల కొడుకు, నీ తల్లికి బ్రహ్మజ్ఞాని పుడుతారు.

**వ. అనిన, నయ్యింతి వెఱచి మ్రొక్కి, వినయంబు లాడినం బ్రసన్నుండై, నీ కొడుకు సాధువై, నీ మనుమండు క్రూరుం డగుంగాక యని, రుచికుం డనుగ్రహించిన నా సత్యవతికి జమదగ్ని సంభవించె, ఆ సత్యవతియునుం గౌశికీనదియై, లోకపావనియై ప్రవహించె. ఆ జమదగ్నియు రేణువుకూఁతురు రేణుకను వివాహంబై, వసుమనాది కుమారులం గనియె నందు. 426**

**ప్రతి :** అనినన్= అనగా; ఆ+ఇంతి= ఆ స్త్రీ (సత్యవతి); వెఱచి= భయపడి; మ్రొక్కి= నమస్కరించి; వినయంబులు+ఆడినన్= అణకువతో మాట్లాడగా; ప్రసన్నుండు+ఐ= దయగలవాడై; నీకొడుకుసాధువు+ఐ= నీకు పుట్టే కుమారుడు సరళస్వభావము గలవాడై; నీ మనుమండు= నీ కొడుకు కొడుకైన మనుమడు; క్రూరుండు+అగుంగాక= క్రూరస్వభావం గలవాడు అవుతాడు; అని= ఈ ప్రకారంగా; రుచికుండు= రుచికుడనే సత్యవతి భర్త; అనుగ్రహించినన్= దయదలచగా; ఆ సత్యవతికిన్= ఆ రుచికుని భార్య సత్యవతికి; జమదగ్ని సంభవించెన్= జమదగ్ని పుట్టాడు; ఆ సత్యవతియునున్= ఆ సత్యవతి అనే స్త్రీ; కౌశికీనది+ఐ= కౌశికి అనే పేరు గల నదియై; లోకపావని+ఐ= లోకాలను పవిత్రంచేసే నదియై; ప్రవహించెన్= ప్రవహించింది; ఆ జమదగ్నియున్= ఆ సత్యవతి కుమారుడు జమదగ్ని; రేణువు కూఁతురు= రేణువనే వాని కుమార్తెను; రేణుకను= రేణుక అను పేరుగల అమ్మాయిని; వివాహంబు+ఐ= పెండ్లి చేసికొని; వసుమన+ఆది= వసుమనుడు మొదలైన; కుమారులన్= సుతులను; కనియెన్= కన్నాడు; అందున్= వారిలో...

**తా :** ఋచికుడు తన భార్యను ప్రశ్నించేసరికి సత్యవతి భయపడి, మ్రొక్కి, వినయంగా మాట్లాడగా, ఆ మాటలకు ఋచికుడు జాలిపడ్డాడు. నీ కొడుకు సాధువై, నీ మనుమడు క్రూర కర్ముడవుతాడని దయదలచి పలికాడు. సత్యవతికి సాధువైన జమదగ్ని పుట్టాడు. సత్యవతి కౌశికీనదిగా మారి లోకాలను పవిత్రం చేస్తూ ప్రవహించింది. ఆ జమదగ్ని రేణువనే వాని కుమార్తె రేణుకను పెండ్లి చేసుకొని వసుమనాది పుత్రులను కన్నాడు. అందులో

**క. పురుషోత్తము నంశంబున, ధర జమదగ్నికి జనించె ధన్యుఁడు రాముం**
**డిరువది యొకమఱి నృపతుల, శిరములఁ జక్కడిచెఁ దనదు చేగొడ్డంటన్. 427**

**ప్రతి :** పురుషోత్తముని+అంశంబునన్= పురుషోత్తముడైన విష్ణుమూర్తి అంశతో; ధరన్= ఈ భూమిపై; జమదగ్నికిన్= సత్యవతి కుమారుడైన జమదగ్నికి; ధన్యుఁడు= గొప్ప ధన్యతగలవాడు; రాముండు= రాముడు (పరశురాముడు); జనించెన్= జన్మించాడు (అతడు); తనదు= తనయొక్క; చేగొడ్డంటన్= చేతిగొడ్డలితో; ఇరువది+ఒకమఱి= ఇరవై ఒక్కమార్లు; నృపతుల= రాజులయొక్క; శిరములన్= తలలను; చక్కడిచెన్= చక్కదనాన్ని నరికాడు.

**తా :** విష్ణుమూర్తి యొక్క అంశతో జమదగ్నికి పరశురాముడు జన్మించాడు. అతడు తనచేతి గొడ్డలితో రాజుల శిరములను ఇరువదియొక్క మార్లు నరికాడు.

**వ. అనిన విని, భూవరుండు శుకున కిట్లనియె. 428**

**ప్రతి :** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; భూవరుండు= పరీక్షిన్మహారాజు; శుకునకున్= శుకమహర్షికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తా :** ఆ మాటలు ఆలకించి పరీక్షిత్తు శుకమహర్షితో ఇట్లన్నాడు.

## ✤ పరశురాముని చరిత్రము ✤

**ఉ. ఏటికిఁ జంపె రాముఁ డవనీశులఁ బల్వుర, వారియందుఁ ద**
**ప్పేటిది? విప్రుఁడయ్యు నతఁడేటికి రాజస తామసంబులన్**
**వాటముఁ బొందె? భూభరము వారిత మౌటది యే విధంబు? నా**
**మాటకు మౌనిచంద్ర! మఱుమాట ప్రకాశము గాఁగఁ జెప్పవే! 429**

**ప్రతి :** మౌనిచంద్ర= మునులలో గొప్పవాడవైన ఓ శుకమహర్షీ!; రాముఁడు= జమదగ్నికుమారుడైన రాముడు; పల్వురన్ అవనీ+ఈశులన్= చాలమంది రాజులను; ఏటికిన్= ఎందులకు; చంపెన్= చంపాడు? వారియందున్= ఆ రాజులయందు; తప్పు+ఏటిది= దోషము ఎటువంటిది (చంపేటంత దోషం ఏం చేశారు); విప్రుఁడయ్యున్= బ్రాహ్మణుడైయుండికూడా; అతఁడు+ఏటికిన్= అతడెందుకు; రాజస తామసంబులన్= రజోగుణంతో తమోగుణంతో; వాటమున్+పొందెన్= అలవాటు పడ్డాడు; భూభరము= భూమియొక్క భారం; వారితము+ఔట+అది= నివారింపబడుట అనేది; ఏ విధంబు= ఏ విధంగా జరిగింది; నా మాటకున్= నేనడిగిన మాటకు (నా ప్రశ్నకు) మఱుమాట= సమాధానం; ప్రకాశము+కాఁగన్= స్పష్టం అగునట్లు; చెప్పవే= దయచేసి చెప్పు

**తా :** ఓ ముని చంద్రమా! శుకమహర్షీ! ఇరువది ఒక్కమార్లు జమదగ్ని కుమారుడు రాముడు రాజులను ఏ కారణంగా చంపాడు? రాజులు చేసిన తప్పేమిటి? బ్రాహ్మణుడైయుండి కూడా రజోగుణ తమోగుణాలను అతడెందుకు పొందాడు? భూభారం ఏ విధంగా నివారింపబడింది? నా యీ మాటకు సమాధానం స్పష్టంగా చెప్పు.

**వ. అనిన విని శుకుం డిట్లనియె. 430**

**ప్రతి :** అనినన్ విని= అనగా విని; శుకుండు= పరీక్షిత్తుకు భాగవతాన్ని చెపుతున్న శుకమహర్షి; ఇట్లనియెన్= ఇలా అన్నాడు;

**తా :** పరీక్షిత్తు వేసిన ప్రశ్నలను విని శుకమహర్షి రాజుతో ఇలా అన్నాడు.

**సీ. హైహయాధీశ్వరుం డర్జునుం డనువాఁడు ధరణీశ్వరులలోనఁ దగినవాఁడు**
**పురుషోత్తమాంశాంశుఁ బుణ్యదత్తాత్రేయు నారాధనము చేసి యతని వలనఁ**
**బరిపంథి జయమును బాహుసహస్రంబు నణిమాది గుణములు యశము బలము**
**యోగీశ్వరత్వంబు నోజయుఁ దేజంబు చెడని యింద్రియములు సిరియుఁ బడసి**

**తే. గాలికైవడి సకల లోకంబు లందుఁ, దనకు పోరాని రారాని తలము లేక**
**యెట్టిచో నైనఁ దనయాజ్ఞ యేపు మిగుల, ధరణి వెలుఁగొందె వినువీథిఁ దరణి మాడ్కి. 431**

**ప్రతి :** హైహయ+అధీశ్వరుండు= హైహయ వంశంలోనిరాజు; అర్జునుండు+అనువాఁడు= అర్జునుడు అనే పేరుగలవాడు; ధరణి+ఈశ్వరులలోనన్= రాజులలో; తగినవాఁడు= సమర్థుడు; పురుష+ఉత్తమ+అంశ+అంశున్= పురుషులలో ఉత్తముడైన విష్ణుమూర్తి అంశావతారమైన; పుణ్యదత్తాత్రేయున్= పుణ్యాత్ముడైన దత్తాత్రేయుని; ఆరాధనముచేసి= అర్చనగావించి; అతని వలనన్= ఆ దత్తాత్రేయునివల్ల; పరిపంథి జయమును= శత్రుజయాన్ని, బాహుసహస్రంబున్= వేయి చేతులను; అణిమ+ఆది గుణములు= అణిమ మొదలైన గుణాలు; యశము= కీర్తి; బలము= శారీరక శక్తి; యోగి+ఈశ్వరత్వంబున్= యోగులలో శ్రేష్ఠత్వాన్ని; ఓజయున్= ఓజస్సునూ; తేజంబు= శరీర తేజస్సును; చెడని యింద్రియములు= ఎన్నటికీ పాడుగాని జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలను; సిరియున్= సంపదను; పడసి= పొంది; గాలికైవడిన్= గాలివలె; సకలలోకంబులందున్= అన్నిలోకాలలో; తనకున్= తనకు; పోరాని రారాని= పోవుటకు గాని, వచ్చుటకు గాని అడ్డులేని; తలములేక= ప్రదేశంలేక; ఎట్టిచోన్+ఐనన్= ఎటువంటి ప్రదేశంలోనైనా; తన+ఆజ్ఞ= తానుచేసిన ఆజ్ఞ; ఏపుమిగులన్= అధికమైనది కాగా; (అన్నిచోట్ల తన అధికారంసాగగా); వినువీథిన్= ఆకాశ వీథిలో; తరణిమాడ్కిన్= సూర్యునివలె; ధరణిన్ వెలుఁగొందెన్= భూమిపై ప్రకాశించాడు;

**తా :** హైహయ వంశంలోని అర్జునుడు రాజులలో ఎన్నదగినవాడు. అతడు పురుషోత్తముని అంశావతారమైన దత్తాత్రేయుని ఆరాధనచేసి ఆయన దయవలన శత్రుజయం, వేయిచేతులు, అణిమాది గుణాలు, కీర్తి, బలం, యోగీశ్వరత్వం, ఓజస్సు, తేజం, వసివాడని ఇంద్రియాలు, ధనం పొందాడు. గాలి అడ్డులేకుండా నిరాటంకంగా అన్నిలోకాలలో ఎలా సంచరిస్తుందో అలా తాను ఎక్కడికైనా వెళ్ళేవిధంగా, వచ్చేవిధంగా తిరుగుతూ; ఎక్కడైనా తన ఆజ్ఞ చెల్లుబడి అయేవిధంగా; వినువీథిలో సూర్యునిలా భూమిపై ప్రకాశించాడు.

**విశే :** దేవతారాధనను సక్రమపద్ధతిలో చేసేవారికి ఈ అష్టసిద్ధులు లభిస్తాయని ప్రతీతి. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశిత్వం, వశిత్వం, ఈ ఎనిమిదింటిని అష్టసిద్ధులు అంటారు.

**మ. ఒకనాఁ డా మనుజేంద్రుఁ డంగనలతో నుద్దాముఁడై వీట నుం**
**డక, రేవానది కేగి యందుఁ దెలినీటం జల్లుపోరాడి, దీ**
**ర్ఘ కరాబ్జంబుల నా నదీజలములం గట్టెన్; వడిన్ నీరు మ్రో**
**లకుఁ బెల్లుబ్బి రణాగతుండయిన యా లంకేశుపైఁ దొట్టఁగన్. 432**

**ప్రతి :** ఆ మనుజేంద్రుఁడు= ఆ రాజైన కార్తవీర్యార్జునుడు; ఒకనాఁడు= ఒకరోజు; అంగనలతోన్= తన భార్యలతో; ఉద్దాముఁడై= గర్వితుడై; వీటన్+ఉండక= తన పురిలో ఉండక; రేవానదికి+ఏగి= రేవా అని పేరుగల నదికి వెళ్ళి; అందున్= ఆ నదిలో; తెలినీటన్= స్వచ్ఛమైన నీటితో; చల్లుపోరాడి= జలక్రీడలాడి; దీర్ఘకర+అబ్జంబులన్= తన పొడవైన పద్మాలవంటి చేతులతో; ఆ నదీజలములన్= ఆ రేవా నదీజలాన్ని; కట్టెన్= బంధించాడు; వడిన్= వేగముతో; నీరు= అడ్డుకట్ట వేయడంవల్ల ఆ రేవా నదీజలము; మ్రోలకున్= ముందుకు; పెల్లు+ఉబ్బి (పెల్లుబికి)= అధికముగా విజృంభించి; రణ+ఆగతుండు+అయిన= యుద్ధమునకు వచ్చిన; ఆ లంకా+ఈశుపైన్= ఆ లంకాధిపతి అయిన రావణాసురునిపైకి; తొట్టగన్= ప్రవహింపగా...

**తా :** ఒకనాడు కార్తవీర్యార్జునుడు తన కాంతులతోగూడి, బలగర్వితుడై; తన పట్టణాన్ని విడిచి రేవానదీ తీరానికి వెళ్ళి, తన భార్యలతో రేవానదీ స్వచ్ఛజలాలతో జలక్రీడలాడుతూ, తన పొడవైన హస్తపద్మాలతో నదీజలాలకు అడ్డుకట్టవేయగా; ఆ నదీజలం పొంగి ముందు భాగానకు ఉబికి, అక్కడ యుద్ధసన్నద్ధుడై ఉన్న రావణునిపై పడగా

**వ. ఇట్లు దిగ్విజయార్థంబు వచ్చిన రావణుం డా రాజుచే కట్టం దొట్టిన యేటినీటికి సహింపక రోషంబునం బోటరియుంబోలె నమ్మేటి మగనితోడి పోరాటకుం దొడరినఁ బాటింపక తన బాహుపాటవంబున. 433**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; దిగ్విజయ+అర్థంబు= దిగ్విజయంకొఱకు; వచ్చిన; రావణుండు= రావణాసురుడు; ఆ రాజుచేన్= ఆ కార్తవీర్యార్జునునిచే; కట్టం దొట్టిన= కట్టివేయగా పొంగిన; ఏటినీటిన్= రేవా నదీజలాలకు; సహింపక= సహించలేక; రోషంబునన్= పౌరుషంతో; పోటరియున్+పోలెన్= వీరునివలె; ఆ+మేటిమగనితోడి= ఆ గొప్పవీరునితో; పోరాటకున్= యుద్ధానికి; తొడరినన్= సిద్ధపడగా; పాటింపక= ఆ కార్తవీర్యార్జునుడు లెక్కచేయక; తన బాహుపాటవంబునన్= తన భుజపరాక్రమంతో...

**తా :** ఈ విధంగా దిగ్విజయం చేయడంకోసం వచ్చిన రావణాసురుడు; ఆ కార్త వీర్యార్జునునిచే నదీజలం కట్టివేయబడి పొంగడాన్ని సహించక, రోసంతో వీరునివలె, ఆ గొప్ప పరాక్రమశాలి అయిన కార్తవీర్యార్జునునితో యుద్ధానికి తలపడగా; ఆ కార్తవీర్యార్జునుడు రావణాసురుని బలాన్ని లెక్కచేయక, తన బాహుబల పరాక్రమంతో

**క. వీఁకమెయి నతఁడు రావణుఁ, గూఁకటు లగలించి పట్టికొని మోఁకాళ్లం**
**దాఁకించి కోఁతికైవడి, నాఁకం బెట్టించెఁ గింకరావళిచేతన్. 434**

**ప్రతి :** వీఁకమెయిన్= పరాక్రమంతో; అతఁడు= కార్తవీర్యార్జునుడు; రావణున్= రావణాసురుని; కూఁకటులు= ముందున్న జుట్టును; అగలించి పట్టుకొని= ఒడిసి పట్టుకొని; మోఁకాళ్ళన్= మోకాళ్ళతో; తాఁకించి= తొక్కి; కోఁతికైవడిన్= కోతిలా; కింకర+ఆవళిచేతన్= తన భటులతో; ఆఁకన్+పెట్టించెన్= చెరసాలలో వేయించాడు.

**తా :** కార్తవీర్యార్జునుడు తన భుజబలంతో, పరాక్రమంతో రావణాసురుని జుట్టు పట్టుకొని మోకాళ్ళతో క్రుమ్మి కోతిలా కట్టి భటులచే చెరసాలలో వేయించాడు.

**వ. అంత నర్జునుండు మాహిష్మతీపురంబున కేతెంచి. 435**

**ప్రతి :** అంతన్= అటు తరువాత; అర్జునుండు= కార్తవీర్యార్జునుడు; మాహిష్మతీ పురంబునకున్= తన నగరమైన మాహిష్మతి అను పేరుగల పట్టణానికి; ఏతెంచి= వచ్చి;

**తా :** అటుపిమ్మట కార్తవీర్యార్జునుడు తన నగరమైన మహిష్మతీపురానికి వచ్చి

**క. ఆ రాజేంద్రుఁడు రావణు, నోరీ! యిటమీఁద నూరకుండుము; జగతిన్**
**వీరుఁడ ననకుము; కాచితిఁ, బోరా; యని సిగ్గుపటిచి పుచ్చెను మరలన్. 436**

**ప్రతి :** ఆ రాజ+ఇంద్రుఁడు= ఆ రాజశ్రేష్ఠుడయిన కార్తవీర్యార్జునుడు; రావణున్= రావణుని; ఓరీ= ఓరీ రావణా! ఇటమీఁదన్= ఇటుపిమ్మట; ఊరకుండుము= మౌనంగా ఉండుము; జగతిన్= జగత్తులో; వీరుఁడన్ అనకుము= నేనే పరాక్రమవంతుణ్ణి అనకు; కాచితిన్= కాపాడాను; పోరా= ప్రాణాలతో బ్రతికావుపో; అని= ఈ ప్రకారంగాపలికి; సిగ్గుపటిచి= రావణుడు సిగ్గుపడేలాచేసి; మరలన్= తిరిగి; పుచ్చెను= పంపాడు.

**తా :** ఆ కార్తవీర్యార్జునుడు రావణాసురునితో "ఓరీ ఇకపై మౌనంగాఉండు. ప్రపంచంలో నేనే వీరుణ్ణి అని విర్రవీగకు, రక్షించాను పో" అని సిగ్గుపడే మాటలు పలికి రావణుని పంపించాడు.

**వ. అంత. 437**

**తా :** అటుపిమ్మట.

**సీ. ధరణీశుఁ డొకనాఁడు దైవయోగంబున వేఁటకై కాంతారవీథి కేగి**
**తిరిగి వేఁటల శ్రాంతదేహుఁడై జమదగ్ని ముని యాశ్రమముఁ జేరి మ్రొక్కి నిలువ**
**నా మునీంద్రుఁడు రాజు నర్థితోఁ బూజించి యా రాజునకు రాజుననుచరులకుఁ**
**దన హోమధేనువుఁ దడయక రప్పించి యిష్టాన్నములు గురియింపఁ దడవఁ**

**తే. గుడిచి కూర్చుండి మొదవుపైఁ గోర్కిఁ జేసి, సంపద యదేల యీ యావు చాలుఁ గాక**
**యిట్టి గోవుల నెన్నఁడు నెఱుఁగ మనుచుఁ, బట్టి తెండని తనయొద్ది భటులఁ బనిచె. 438**

**ప్రతి :** ధరణీశుఁడు= రాజైన కార్తవీర్యార్జునుడు; ఒకనాఁడు= ఒకరోజున; దైవయోగంబునన్= దైవఘటనతో; వేఁటకై= వేటాడుటకై; కాంతారవీథికిన్+ఏగి= అడవికి వెళ్ళి; వేఁటలన్ తిరిగి= వేటాడుట యందుబాగా తిరిగినవాడై; శ్రాంతదేహుఁడై= బడలిన శరీరంకలవాడై; జమదగ్నిముని+ఆశ్రమమున్+చేరి= జమదగ్నిమునియొక్క ఆశ్రమానికివచ్చి; మ్రొక్కి నిలువన్= నమస్కరించి నిలువగా; ఆ ముని+ఇంద్రుఁడు= ఆ జమదగ్ని మునిశ్రేష్ఠుడు; రాజున్= కార్తవీర్యార్జునుని; అర్థితోన్= కోరికతో; (ప్రీతితో; ఆసక్తితో); పూజించి= అర్చించి; ఆ రాజునకున్= ఆ కార్తవీర్యార్జునునకు; రాజున్+అనుచరులకున్= రాజుతో ఉండే పరివారానికి; తన హోమధేనువున్= తన ఆశ్రమాన ఉన్న హోమధేనువును;

తడయక= జాగుచేయక (వెంటనే); రప్పించి= తెప్పించి; ఇష్ట+అన్నములు= కావలసిన భోజన పదార్థములు; తడవన్= మాటిమాటికి; కురియింపన్= సమృద్ధిగా లభించేలా చేయించగా; కుడిచి= భుజించి; కూర్చుండి= కూర్చున్నవాడై; మొదవుపైన్= గోవుపై; కోర్కిన్‌చేసి= కోరిక కలుగుటచేత; సంపద+అదేల= నాకున్న సర్వసంపదలు ఎందులకు? ఈ ఆవుచాలున్ కాక= ఈ ఆవే సరిపోతుందికదా! (ఆవు ముందు సర్వసంపదలు వ్యర్థమే) ఇట్టిగోవులన్= ఇటువంటి ఆవులను; ఎన్నడున్ ఎఱుఁగమనుచున్= ఇతఃపూర్వమెప్పుడూ ఎరుగము కదా! అని పలుకుచు; తన యొద్దిభటులన్= తన సమీపమునగల భటులకు; పట్టితెండని= బంధించి తీసికొనిరండని; పనిచెన్= ఆజ్ఞాపించెను.

**తా :** ఒకరోజున కార్తవీర్యార్జునుడు దైవప్రేరితుడై అడవికి వేటకువెళ్ళి, వేటాడి అలసి, జమదగ్నిముని ఆశ్రమానికి వచ్చి, మునికి మ్రొక్కి నిలబడగా, ఆ జమదగ్నిమహర్షి రాజైన కార్తవీర్యార్జునుని ప్రేమతో పూజించి, రాజునకు రాజభటులకు తన హోమధేనువుద్వారా మృష్టాన్నాలు సమృద్ధిగా పెట్టించాడు. ఆరగించినరాజు హోమధేనువు మాహాత్మ్యాన్ని చూచి దాన్ని సొంతం చేసికోవలెననే కోరికతో “నాకెన్ని సంపదలున్నా ఈ ఆవుముందు తక్కువే. నాకు సంపదలెందుకు? ఈ ఆవు చాలు. ఇటువంటి గోవులను మున్ను నేను ఎరుగను” అని అనుకుంటూ “ ఈ హోమధేనువును పట్టితెండ”ని తన భటులకు ఆజ్ఞాపించాడు.

**విశే :** కార్తవీర్యార్జునుడు సామాన్యుడుకాదు నారయణాంశజుడైన దత్తాత్రేయస్వామి ఉపాసనతో అణిమాది సిద్ధులు పొందినవాడు. వేయిచేతులు, ఓజస్సు, తేజస్సు సంపదలుగలవాడు. తన ఆజ్ఞ అన్నిలోకాలలో చెల్లేటట్లు చేసికొన్న ప్రతాపశాలి.

ఐనా విచిత్రం ఏమంటే బడలిన తనకు తన భటులకు ఒక మహర్షి సేదతీర్చి ఇష్టాన్నాలు పెడితే, భుజించి, ఆనందపడి, కృతజ్ఞత చూపక జమదగ్ని అతిథిసత్కారాలకు ఆలంబనమైన హోమధేనువును కైవసం చేసికోవా లనుకొన్నాడు. అష్టసిద్ధులున్నా అంతరంగం అదుపులో లేకపోతే అనర్థాలు తప్పవు.

**వ. పంచిన వారలు దర్పంబునం జని. 439**

**ప్రతి :** పంచినన్= ఆ విధంగా కార్తవీర్యార్జునుడు ఆజ్ఞాపించగా; వారలు= ఆ భటులు; దర్పంబునన్+చని= గర్వంతో వెళ్ళి.

**తా :** ఆ విధంగా కార్తవీర్యార్జునుడు ఆజ్ఞాపించగా అతని భటులు గర్వంతో వెళ్ళి.

**క. క్రేపుం బాపకుఁ డంచును, నాపదలం బడితి ననుచు నంబా యంచున్**
**జూపోపరు నృపు లంచును, వాపోవన్ మొదవుఁ గొంచు వచ్చిరి పురికిన్. 440**

**ప్రతి :** క్రేపున్= దూడను (నాకు జన్మించిన వత్సను); పాపకుఁడు+అంచును= దూరం చేయవద్దు అంటూ; ఆ పదలన్= కష్టాలలో; పడితిన్= చిక్కుకొంటిని; అనుచున్= అంటూ; అంబా అనుచున్= అంబారావాన్ని చేస్తూ; నృపులు= రాజులు; చూపు+ఓపరు= ఎదుటివారి గొప్పతనాన్ని చూస్తూ సహించలేరు; అంచును= అంటూ; వాపోవన్= (తల్లి ఆవు); బాధపడుచుండగా; పురికిన్= కార్తవీర్యార్జునుని పట్టణానికి; మొదవున్+కొంచున్= ఆవును తీసికొని; వచ్చిరి= వచ్చారు.

**తా :** “నా దూడను నాకు దూరంచేయకండి; నేను ఆపదలోపడ్డాను; రాజులు ఎదుటివారి గొప్పతనాన్ని ఓర్వరు కదా” అని తల్లి ఆవు అంబా అని ఆక్రోశిస్తూ బాధపడుతుండగా ఆ కామధేనువును కార్తవీర్యార్జునుని భటులు తమ పట్టణానికి తీసికొని వచ్చారు.

**వ. అంత నర్జునుండు మాహిష్మతీ పురంబునకు వచ్చునెడ, రాముం డాశ్రమంబున కేతెంచి. 441**

**ప్రతి :** అంతన్= అంతట (ఆ విధంగా కామధేనువును భటులు తీసికొనివచ్చిన తరువాత); అర్జునుండు= కార్తవీర్యార్జునుడు; మాహిష్మతీపురంబునకు= మాహిష్మతి అనే తనపట్టణానికి; వచ్చునెడన్= వచ్చేటపుడు; రాముండు= పరశురాముడు; ఆశ్రమంబునకు+ఏతెంచి= తన తండ్రి ఉన్న ఆశ్రమానికి వచ్చి...

**తా :** ఆ విధంగా కామధేనువుతో కార్తవీర్యార్జునుడు మాహిష్మతీపురానికి వచ్చాడు. అక్కడ పరశురాముడు తన తండ్రి ఉన్న ఆశ్రమానికి వచ్చాడు

**ఆ. అద్దిరయ్య యింట నశనంబుఁ గుడిచి మా, యయ్య వల దనంగ నాక్రమించి**
**కోరి మొదవు రాజు గొనిపోయినాఁ డఁట, యేను రాముఁడౌట యెఱుఁగఁ డొక్కొ!. 442**

**ప్రతి :** అద్దిరయ్య= ఔరా!; ఇంటన్= మా యింట్లో; అశనంబున్+కుడిచి= ఆహారాన్ని హాయిగా భుజించి; మా+అయ్య= నా తండ్రి; వలదు+అనంగన్= వద్దు వద్దు అంటున్నా; ఆక్రమించి= స్వాధీన పరచుకొని; కోరి= ఆసక్తితో; మొదవున్= కామధేనువును; రాజు కొనిపోయినాఁడఁట= కార్తవీర్యార్జునుడు తీసికొనిపోయాడట; ఏను= నేను; రాముఁడౌట= రాముడు అవటాన్ని (పరశువును ఆయుధంగా ధరించిన పరశురాముడను అనే విషయాన్ని) ఎఱుఁగఁడు+ఒక్కొ= ఎరుగడా ఏమి?

**తా :** ఔరౌర! మా యింట మృష్టాన్నం భుజించి, నా తండ్రి "వద్దువద్దు" అంటున్నా వినకుండా, ఆశ్రమాన్ని ఆక్రమించి, మా గోవును ఆ రాజు కార్తవీర్యార్జునుడు తీసికొనిపోయాడు. ఆ రాజు నేను పరశురాముడనని ఎరుగడు కాబోలు.

**వ. అని పలికి. 443**

**తా :** ఈ విధంగా పలికి

**మ. ప్రళయాగ్నిచ్ఛట భంగిఁ గుంభి విదళింపన్ బాఱు సింహాకృతిన్**
**బెలుచన్ రాముఁ డిలేశుఁ వెంట నడచెన్ బృథ్వీతలంబెల్ల నా**
**కులమైఁ గ్రుంగఁ గుఠారియై కవచియై కోదండియై కాండియై**
**ఛలియై సాహసియై మృగాజిన మనోజ్ఞశ్రోణియై తూణియై. 444**

**ప్రతి :** రాముఁడు= పరశురాముడు; ప్రళయ+అగ్నిచ్ఛట భంగిన్= ప్రళయకాలమందలి అగ్నిశిఖలవలె; కుంభిన్= ఏనుగు కుంభస్థలమును; విదళింపన్= చీల్చుటకు; పాఱు= వేగంగా వచ్చు; సింహ+ఆకృతిన్= సింహంవలె; పెలుచన్= అతిశయముతో (కాఠిన్యముతో); పృథ్వీతలంబు+ఎల్లన్= భూభాగమంతయు; ఆకులమై= తొట్రుపాటుతో; క్రుంగన్= క్రుంగిపోగా; కుఠారియై= కుఠారం (గొడ్డలి) ధరించినవాడై; కవచియై= కవచం ధరించినవాడై; కోదండియై= కోదండం అనే విల్లు ధరించినవాడై; కాండియై= బాణాలు ధరించినవాడై; ఛలియై= నెపం చూపువాడై; సాహసియై= సాహసం గలవాడై; మృగ+అజిన= మృగంయొక్క తోలుతో (లేడి చర్మంతో); మనోజ్ఞ= సుందరమైన; శ్రోణియై= కటిభాగం కలవాడై; తూణియై= అమ్ముల పొది ధరించినవాడై; ఇలా+ఈశు= భూమీశుడైన కార్తవీర్యార్జునుని; వెంటన్= వెనువెంట; నడచెన్= బయలుదేరెను.

**తా :** పరశురాముడు ప్రళయకాలాగ్నిలాగా, ఏనుగు కుంభస్థలాన్ని చీల్చడానికివచ్చే సింహంలాగా, భూమి అంతా అదిరిపోయేలా గొడ్డలి, కవచం, కోదండం, బాణం, మృగచర్మం, అమ్ములపొది ధరించి సాహసంతో కార్తవీర్యార్జునుని వెంటపడ్డాడు.

**వ. చని మాహిష్మతీపురంబుఁ జేరి నిలుచున్న సమయంబున. 445**

**ప్రతి :** చని= వెళ్ళి; మాహిష్మతీ పురంబున్= మాహిష్మతి అనేపేరుగల పట్టణాన్ని; చేరి; నిలుచున్న సమయంబునన్= అక్కడ నిలబడిన సమయంలో...

**తా :** పరశురాముడు క్రోధంతో వెళ్ళి మాహిష్మతీపురాన్ని చేరి నిలబడ్డసమయంలో

**మ. కనియెన్ ముందటఁ గార్తవీర్యుఁడు సమిత్కాముం బ్రకాముం శరా**
**సనతూణీరకుఠారభీము నతిరోషప్రోచ్చల ద్భ్రూయుగా**
**నన నేత్రాంచలసీము నైణపట నానా మాలికోద్దాము నూ**
**తన సంరంభ నరేంద్రదానశుభసూత్రక్షామునిన్ రామునిన్, 446**

**ప్రతి :** కార్తవీర్యుఁడు= కార్తవీర్యార్జునుడు; ముందటన్= తనముందు; సమిత్కామున్= యుద్ధాన్ని కోరేవానిని; ప్రకామున్= మిక్కిలి ఉత్సాహంగా కోరికతో ఉన్నవానిని (విజయాన్ని కోరేవానిని); శర+ఆసన= విల్లు; తూణీర= అమ్ములపొది; కుఠార= గండ్రగొడ్డలి వీటిచే; భీమున్= భయంకరమైనవానిని; అతిరోష= మిక్కిలి కోపంచేత; ప్ర+ఉచ్చలత్= బాగా చలించే; భ్రూయుగ= కనుబొమలజంట; ఆనన= ముఖం; నేత్ర+అంచలసీమున్= నేత్రముల చివరలు గలవానిని; ఐణ= ఏణ సంబంధమైన (జింక తోలు); పట= వస్త్రం (మరియు); నానా= అనేకములైన; మాలికా+ఉద్దామున్= పుష్పమాలాదులతో ఒప్పువానిని; నూతన సంరంభ= క్రొత్తగా వచ్చిన తొట్రుపాటుతో ఎగిరిపడే; నర+ఇంద్ర= రాజశ్రేష్ఠులచే; దాన= ఇవ్వబడిన (కట్టబడిన); శుభసూత్ర= మంగళసూత్రములు; క్షామునిన్= లేకుండా చేయువానిని (గర్వపడే రాజుల భార్యల మంగళసూత్రములు లేకుండా చేయువాడు అనగా గర్వించు రాజులను సంహరించేవాడని భావం); రామునిన్= పరశురాముని; కనియెన్= చూచెను.

**తా :** కార్తవీర్యార్జునుడు తనముందు, కయ్యాన్ని, విజయాన్ని కోరివచ్చినవాడు, విల్లు అమ్ములపొదులతో గండ్రగొడ్డలితో భయంకరాకారుడు, తీవ్రమైన కోపంతో కదిలే కనుబొమ్మలు కడచూపులుగలవాడు, జింక చర్మాన్ని మరెన్నో కంఠహారాలను ధరించినవాడు, గర్వించే రాజుల భార్యల మంగళసూత్రాలు లేకుండా చేసేవాడు అయిన పరశురాముణ్ణి చూచాడు.

**వ. కని కోపించి. 447**

**ప్రతి :** కని= కార్తవీర్యార్జునిని పరశురాముడు చూచి; కోపించి= కినుక వహించి...

**తా :** కార్తవీర్యార్జునుడు చూచి కోపించి

**ఉ. బాలుఁడు వెఱ్ఱి బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుకైవడి నుంట మాని భూ**
**పాలురతోడ భూరిబలభవ్యులతోడ భయంబుఁ దక్కి క**
**య్యాలకు వచ్చినాఁడు మనయం దిఁకఁ బాపము లేదు లెండు లెం**
**డేల సహింప భూసురుని నేయుఁడు వ్రేయుఁడు గూల్పుఁ డిమ్మహిన్. 448**

**ప్రతి :** బాలుఁడు= ఈ బాలుడైన పరశురాముడు, వెఱ్ఱిబ్రాహ్మణుఁడు= అమాయకుడైన బాపడు; బ్రాహ్మణుకైవడిన్= బ్రహ్మజ్ఞానం కలిగి సాత్త్వికుడైన బ్రాహ్మణునివలె; ఉంట మాని= ఉండక; భూపాలురతోడన్= రాజులతో; భూరిబలభవ్యులతోన్= అధికమైన బలంగల వారితో; భయంబున్+తక్కి= భయములేకుండా; కయ్యాలకు వచ్చినాఁడు= యుద్ధాలకు వచ్చియున్నాడు; ఇఁకన్= ఇకపై; మనయందున్= మనలో; పాపములేదు= పాపంలేదు; లెండు లెండు= యుద్ధానికి సిద్ధం కండి; ఏల సహింపన్= సహించుట ఎందులకు; భూసురునిన్= ఈ బ్రాహ్మణుని; ఏయుఁడు= బాణాలతో కొట్టండి; వ్రేయుఁడు= కత్తులతో నరకండి; ఈ+మహిన్= ఈ భూమిపై పడేటట్లు; కూల్పుఁడు= కూల్చండి.

**తా :** ఈ పరశురాముడు వెర్రి బ్రాహ్మణుడు. ఇతడు బ్రహ్మజ్ఞానం కలిగి సాత్వికమైన ప్రవృత్తిగల బ్రాహ్మణునిలా ఉండక, బలంగల రాజులతో భయంలేకుండా యుద్ధానికివచ్చాడు. ఇక మనకు పాపం అంటదు. క్షమించే పనిలేదు. ఈ బ్రాహ్మణుని కొట్టడానికి, నరకడానికి భూమిపై కూల్చడానికి లెండి!

**విశే :** పరశురాముడు బ్రాహ్మణజాతికి చెందినవాడు. కార్తవీర్యార్జునుడు క్షత్రియజాతికి చెందినవాడు. సాత్త్విక ప్రవృత్తితో బ్రాహ్మణులు, రాజసప్రవృత్తితో క్షత్రియులు ఉండాలి. పరశురాముడు సత్త్వస్థితిలో ఉండక తనంత తానుగా క్షత్రియులపైకి అందునా బలమైన క్షత్రియులపైకి యుద్ధానికి వచ్చాడు. యుద్ధానికి వచ్చిన బ్రాహ్మణుని హింసించడం దోషం, పాపం అనుకోవలసిన పనిలేదు. కాబట్టి మీరందఱు ఈ బ్రాహ్మణుని చంపడానికి లేవండి అంటూ తనని తాను కార్తవీర్యార్జునుడు సమర్థించుకుంటున్నాడు.

**వ. అని కదలించి, దండనాయకుం బురికొల్పిన, వారును రథ గజ తురగ పదాతి సమూహంబులతో లెక్కకుం బదియే డక్షౌహిణులతో నెదురు నడచి, శర చక్ర గదా ఖడ్గ భిండివాల శూల ప్రముఖ సాధనంబుల నొప్పించిన, నవ్విప్రుండు గన్నుల కొలఁకుల నిప్పులు కుప్పలుగొన రెట్టించిన కట్టల్క మిట్టిపడి, యజ్ఞోపవీతంబు చక్క నిడికొని, కరాళించి, బిట్టు దట్టించి, కఠోరంబగు కుఠారంబు సారించి, మూఁకలపై కుఱికి, తొలకరి మొగంబునం గ్రొచ్చెలికపట్టునం జెట్టులు గొట్టు కృషీవలుని తెఱంగునఁ బదంబులు ద్రెంచుచు నరఁటికంబంబులఁ దెగనడచు నారామకారుని పగిది మధ్యంబులఁ ద్రుంచుచుఁ, దాళఫలంబులు రాల్చు వృక్షారోహకుని కైవడి శిరంబులు ద్రుంచుచు, మృగంబుల వండం దుండించు సూపకారుని భంగి నవయవంబులఁ జెక్కుచు, నంతటం దనివి సనక, విలయకాలకీలి కేళిని మంట లుమియుచు, విల్లంది యెల్లెడం బిడుగుల సోనలు గురియు బలు మొగుళ్ళ వడువున నప్రమాణంబులగు బాణంబులు పఱపి, సుభటసైన్యంబుల దైన్యంబు నొందించుచు, నడ్డంబు లేని యార్భాటంబులు గల బాణవర్ష ఘృతంబులచే రాహుతులం గోపానలంబున కాహుతులు సేయుచుఁ, దురంగంబుల నిరంగంబులఁ గావించుచు, రథంబుల విశ్లథంబులుగా నొనర్చుచు, ద్విరదంబుల నరదంబులపైఁ బఱవం దోలుచు, ని వ్విధంబున సేనల నంపవానల ముంచి, రూపుమాపిన. 449**

**ప్రతి :** అని= ఈ విధంగా మాట్లాడి; కదలించి= చైతన్యపరచి; దండనాయకున్= సేనానాయకుని; పురికొల్పినన్= ఉత్సాహపరచగా; వారును= ఆ సేన; రథ గజతురగ పదాతి సమూహంబులతోన్= రథములు, ఏనుగులు, గుర్రములు కాల్బలముల గుంపులతో; లెక్కకున్+పది యేడు+అక్షౌహిణులతోన్= పదిహేడక్షౌహిణుల సంఖ్యతో; ఎదురునడచి= పరశురామునకు ఎదురుగావెళ్ళి; శర= బాణములు; చక్ర= చక్రములు; గదా= గదలు; ఖడ్గ= కత్తులు; భిండివాల= విసిరే

రెండు మూడు చక్రములు గల ఆయుధ విశేషములతో; శూల ప్రముఖ= శూలములు మొదలైన; సాధనంబులన్= ఉపకరణములతో; నొప్పించినన్= బాధపెట్టగా; ఆ+విప్రుండు= బ్రాహ్మణుడైన పరశురాముడు; కన్నుల కొలఁకులన్= కన్నులనే సరస్సులలో; నిప్పులు= అగ్గి; కుప్పలుగొనన్= అధికంకాగా; రెట్టించిన= ఎక్కువైన (అధికమైన); కట్టల్కన్ (కడు+అల్క)= కోపంతో; మిట్టిపడి= ఎగిరిపడి, త్రుళ్ళి; యజ్ఞోపవీతంబు= జందెం; చక్కన్+ఇడికొని= చిక్కుంచుకొని; కరాళించి= పెద్దబొబ్బ పెట్టి; బిట్టుదట్టించి= వేగంగా అదలించి; కఠోరంబగు= తీక్ష్ణమైన; కుఠారంబు సారించి= గొడ్డలి విసరి; మూఁకలపైకి+ఉఱికి= సైన్యంపైకి దుమికి; తొలకరి మొగంబునన్= తొలకరి ప్రారంభ సమయంలో; క్రొచ్చెలిక పట్టునన్= కొత్త బీడునేలలో; చెట్టులు గొట్టు= కంపలు కొట్టి శుభ్రంచేసే; కృషీవలుని తెఱంగునన్= రైతువలె; పదంబులు+త్రెంచుచున్= శత్రుసేనల కాళ్ళు నరుకుతూ; అరఁటి కంబంబులన్= అరటి స్తంభాలను (అరటి బోదెలను); తెగనడచు= తెగగొట్టే; ఆ రామకారుని పగిదిన్= తోటమాలిలా; మధ్యంబులన్= నడుము భాగములను; త్రుంచుచున్= తెగకొడుతూ; తాళఫలంబులు= తాటిపళ్ళు; రాల్చు= పడగొట్టే; వృక్ష+ఆరోహకునికైవడిన్= చెట్టులు ఎక్కేవానిలా; శిరంబులు త్రుంచుచున్= తలలు తెగకొడుతూ; మృగంబుల వండన్+తుండించు= వండటం కొఱకు జంతువులను తరిగే; సూపకారుని భంగిన్= వంటవానివలె; అవయవంబులన్ చెక్కుచున్= అవయవాలని ఖండిస్తూ; అంతటన్= అంతటితో; తనివిసనక= తృప్తిపడక; విలయకాలకీలికేళినిన్= ప్రళయకాలాగ్నిలా; మంటలు+ఉమియుచున్= నిప్పులు క్రక్కుతూ; విల్లంది= ధనుస్సునుపట్టి; ఎల్లెడన్= అన్నివైపులా; పిడుగులసోనలు+కురియు= పిడుగుల వర్షాన్ని కురిసే; బలుమొగుళ్ళు వడువునన్= పెద్ద మేఘాలవలె; అప్రమాణంబులగు= లెక్కలేనన్ని; బాణంబులు+పఱపి= బాణాలువేసి; సుభట సైన్యంబులన్= యోధులున్న సైన్యాన్ని; దైన్యంబున్+ఒందించుచున్= కష్టపడేలా చేస్తూ; అడ్డంబులేని= అడ్డులేని; ఆర్భాటంబులు+కల= పరాక్రమంగల; బాణవర్ష ఘృతంబులచేన్= బాణాలవర్షం అనే నేతితో; రాహుతులన్= గుఱ్రాలు తోలే రౌతులను; కోపానలంబునకున్= కోపాగ్నికి; ఆహుతులు సేయుచున్= ఆహుతి చేస్తూ; తురంగంబులన్= గుఱ్ఱాలను; నిర్+అంగంబులన్= అంగములు లేనివానిగా; కావించుచున్= చేస్తూ; రథంబులన్= రథాలను; విశ్లథంబులుగాన్= విరిగిపోయేలా; ఒనర్చుచున్= చేస్తూ; ద్విరదంబులన్= ఏనుగులను; అరదంబులపైన్= రథాలపైకి; పఱవన్+తోలుచున్= పడేలా తోలుతూ; ఈ+విధంబున= ఈ విధంగా; సేనలన్= సైన్యాన్ని; అమ్ము+వానలన్= బాణవర్షంలో; ముంచి= మునిగేలాచేసి; రూపుమాపినన్= రూపుమాపేలా చేయగా.

**తా :** ఈ విధంగా పలికి, సేనానాయకుని ఉత్సాహపరచగా, వాళ్ళు రథగజతురగపదాతిసమూహంతో, పదిహేడు అక్షౌహిణుల సంఖ్యతో ఎదుర్కొని బాణం చక్రం గద మొదలైన ఆయుధాలతో పరశురాముని బాధించగా, ఆ బ్రాహ్మణుడైన పరశురాముడు కన్నులనే సరస్సులలో నిప్పులు రాలగా అధికమైన కోపంతో ఎగిరిపడి, జందెము సరిచేసికొని, బొబ్బపెట్టి, గట్టిగా అదలిస్తూ, పరుషమైన గొడ్డలి చాచి, కార్తవీర్యార్జునుని సైన్యంపైకి ఉరికి, తొలకరిలో బీడు నేలను చదును చేసే రైతువలె శత్రుసేనలపాదాలు తెగగొట్టి, తోటమాలి అరటిబోదెలను నరికినట్లు సేనల నడుములు తెగగొట్టి, తాటిపళ్ళు రాల్చే వృక్షారోహకుడిలా శత్రుసేనల తలలు త్రెంచి, జంతువులను ఖండించి వండే వంట వాడివలె శత్రుసేనల అవయవాలుకోసి అంతటితో తృప్తిపడక ప్రళయకాలాగ్నిలా మంటలు క్రక్కుతూ, ధనుస్సుతో పిడుగుల వర్షాన్ని కురిపించే పెద్ద మేఘంలా బాణాలు కురిపిస్తూ, బలమైన భటుల సముదాయాన్ని బాధించి, అడ్డులేని పరాక్రమంతో తన కోపాగ్నిలో బాణాలవర్షం అనే నేతితో గుఱ్ఱపు రౌతులను ఆహుతి చేస్తూ; గుఱ్ఱాల కాళ్ళు తలలు నరికి, రథములు విరగగొట్టి, ఏనుగులను రథాలపైకి తోలి ఈ విధంగా శత్రుసేనలను బాణవర్షంలో ముంచి రూపుమాపగా

**విశే :** 21870 ఏనుగులు, 21870 రథాలు, 65610 గుర్రాలు, 109350 కాలిబంట్లు కలిగిన సేన అక్షౌహిణి (గురుబాలప్రబోధికవ్యాఖ్య – పుట 512).

**క. మత్తిల్లి భూతజాలము, చిత్తంబులఁ జొక్కి వేడ్క చిందులు వాఱన్**
**జొత్తిల్లి సమిత్తలమున, నెత్తురు మేదంబు పలలనికరం బయ్యెన్. 450**

**ప్రతి :** మత్తిల్లి= మదించినవై; భూతజాలము= భూతముల సమూహం; చిత్తంబులన్= హృదయములలో; చొక్కి= పరవశించి; వేడ్క= సంతోషం; చిందులు+పాఱన్= గంతులు వేయగా; సమిత్తలమునన్= యుద్ధభూమిలో; జొత్తిల్లి= ఎర్రబారి; నెత్తురు= రక్తము; మేదంబు= కొవ్వు; పలలనికరంబు= మాంసపు గుట్టలసమూహంగా; అయ్యెన్= తయారయింది.

**తా :** భూతాల గుంపులు మత్తెక్కి ఆనందనాట్యాలు చేసే విధంగా ఆ యుద్ధరంగమంతా నెత్తురు, కొవ్వు, మాంసఖండాలతో ఎర్రబారింది.

**వ. అ య్యవసరంబున. 451**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** అప్పుడు

**క. మే లీ బ్రాహ్మణుఁ డొక్కఁడు, నేలం బడఁ గూల్చె సైన్యనిచయము నెల్లన్**
**బాలార్ప నేల యీతనిఁ, దూలించెదఁ గాక నాదు దోర్బలము వడిన్. 452**

**ప్రతి :** మేలు= బాగుంది (సరి సరి); ఈ బ్రాహ్మణుఁడు= ఈ బాపడు; ఒక్కఁడు= ఒక్కడే; సైన్యనిచయమున్+ఎల్లన్= సేనాసమూహాన్ని అంతటిని; నేలన్ పడన్ కూల్చెన్= నేలకూల్చాడు; పాలార్పన్+ఏల= ఇక ఉపేక్షించడం ఎందుకు?; ఈతనిన్= ఈ పరశురాముని; నాదుదోర్బలమువడిన్= నా భుజబలముయొక్క వేగంతో, తీవ్రతతో; తూలించెదన్ కాక= సంహరిస్తాను సుమా.

**తా :** అరె బాగు బాగు. ఈ బాపడు ఒక్కడే నా సేనాసమూహాన్ని నేలకూల్చాడు. ఇక ఉపేక్షించకూడదు. నా భుజపరాక్రమంతో ఈ పరశురాముని విజృంభణం నిర్మూలిస్తాను.

**విశే :** ఈ పద్యం మొదట గల 'మేలు' అన్న పదం మెచ్చుకోలు కాదు. ఇలా జరిగిందేమిటి అన్న ఆశ్చర్యవాచకం మాత్రమే.

**వ. అని పలికి. 453**

**తా :** అలా మాట్లాడి

**మ. ఒకయేనూఱు కరంబులన్ ధనువు లత్యుల్లాసియై తాల్చి వే**
**ఱొక యేనూట గుణధ్వనుల్ నిగుడ శాతోగ్రాస్త్రముల్ గూర్చి వి**
**ప్ర! కుఠారంబును నిన్నుఁ గూల్తు ననుచున్ భర్జించి పుంఖాను పుం**
**ఖ కఠోరంబుగ నేసె రాజు రయరేఖాధామునిన్ రామునిన్. 454**

**ప్రతి :** ఒక యేనూఱు కరంబులన్= ఒక ఐదువందల చేతులతో; ధనువులు= ధనుస్సులు; అతి+ఉల్లాసియై= మిక్కిలి ఉత్సాహము గలవాడై (కార్తవీర్యార్జునుడు); తాల్చి= ధరించి; వేఱొకయేనూటన్= మరొక ఐదువందల చేతులతో; గుణధ్వనుల్= వింటి నారియొక్క చప్పుళ్ళు; నిగుడన్= వెడలగా; శాత+ఉగ్ర+అస్త్రముల్+కూర్చి= వాడియైన భయంకర అస్త్రములను సంధించి; విప్ర= ఓ బ్రాహ్మణుడా!; కుఠారంబును= గొడ్డలిని; నిన్నున్= నిన్ను; కూల్తున్+అనుచున్= కూలగొడతానంటూ; భర్జించి= వేచి (బాధించి); పుంఖ+అనుపుంఖ కఠోరమ్ముగన్= బాణపు పిడి వెనుక బాణపుపిడి కఠినముగా వచ్చునట్లు (ఎడతెరపిలేనట్లు పింజలు పింజలుగా); రయరేఖాధామునిన్= వేగమునకు నిలయమైన; రామునిన్= పరశురాముని; ఏసెన్= బాణాలతో కొట్టెను.

**తా :** కార్తవీర్యార్జునుడు ఉత్సాహంతో ఐదువందల చేతులతో ధనుస్సులను పట్టుకొని, మిగిలిన ఐదువందల చేతులతో వింటినారుల చప్పుళ్ళతో, క్రూరమైన వాడిబాణాలను సమకూర్చి ఓ బాపడా నీ గొడ్డలితో సహా నిన్ను కూలగొడతాను చూడు మంటూ బాణపరంపరను పరశురామునిపై ఎడతెరిపి లేకుండా వేసి బాధించాడు.

**క. వడిఁదూపు లెగయ గుడుసులు, పడి కార్ముక పంచశతము పరఁగ విభుఁడు సొం**
**పడరెఁ బరివేషమండలి, నడుమ ఖరద్యుతుల వెలయు నళినాప్తు క్రియన్. 455**

**ప్రతి :** వడిన్= వేగంగా; తూపులెగయన్= బాణాలు పైకిరాగా; గుడుసులుపడి= గుండ్రంగా (బాణాలు) తిరిగి; కార్ముక పంచశతము పరఁగన్= ఐదువందల బాణాలు ఒప్పగా; విభుఁడు= రాజైన కార్తవీర్యార్జునుడు; పరివేషమండలి నడుమన్= (సూర్యునిచుట్టూ వెలిగే) వలయంమధ్యలో; ఖరద్యుతులన్ వెలయు= తీక్ష్ణమైన కాంతులతో ఒప్పు; నళిన+ఆప్తుక్రియన్= కమలబాంధవుడైన సూర్యునివలె; సొంపు అడరెన్= అందగించాడు.

**తా :** వేగంగా వేసిన ఐదువందల బాణాలు గుండ్రంగా ఏర్పడగా వాటిమధ్యనున్న కార్తవీర్యార్జునుడు పరివేష మండలం మధ్యలో ప్రచండసూర్యుడిలా అందగించాడు.

**వ. ఇ ట్లర్జునుండు బాణవిలాసంబు సూపిన. 456**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అర్జునుండు= కార్తవీర్యార్జునుడు; బాణవిలాసంబు= బాణాలు వేయడంలో సొంపు; చూపినన్= కనబరచగా.

**తా :** ఈ విధంగా కార్తవీర్యార్జునుడు తన బాణప్రయోగంలో సొంపు చూపగా.

**మ. ధరణీదేవుఁడు రాముఁ డాఢ్యుఁడు జగద్ధానుష్కరత్నంబు దు**
**ష్కరచాపం బొక టెక్కు పెట్టి శరమున్ సంధించి పెల్లేసి భూ**
**వరుకోదండము లొక్కచూడ్కిఁ దునిమెన్ వాఁడంతటం బోక వే**
**తరువుల్ ఱువ్వఁ గుఠారధార నఱకెన్ దద్బాహుసందోహమున్. 457**

**ప్రతి :** ధరణీదేవుఁడు= బ్రాహ్మణుడు; ఆఢ్యుఁడు= గొప్పవాడు; జగద్ధానుష్కరత్నంబు= ప్రపంచంలో మేటి విలుకాడు (అయిన); రాముఁడు= పరశురాముడు; దుష్కరచాపంబు= ఉగ్రమైన ధనుస్సు; ఒకటి+ఎక్కుపెట్టి= ఒకదానిని ఎక్కుపెట్టి; శరమున్ సంధించి= బాణాన్ని గూర్చి; పెల్లు+ఏసి= వేగంగావేసి; భూవరు కోదండములు= రాజైన కార్తవీర్యార్జునుని

ధనుస్సులు; ఒక్క చూడ్కిన్= ఒక్కసారిగా; తునిమెన్= విరుగగొట్టాడు; వాఁడు= ఆ కార్తవీర్యార్జునుడు; అంతటన్+పోక= అక్కడితో ఆగకుండా; వే తరువుల్= వేగంగా చెట్లను; ఱువ్వన్= విసరగా; తద్+బాహుసందోహమున్= అతని వేయి చేతులను; కుఠార ధారన్ నఱకెన్= గొడ్డలి అంచుతో ఖండించాడు.

**తా :** ప్రపంచంలోనే మేటి విలుకాడు, గొప్పవాడు, బాపడైన పరశురాముడు, ఒక ఉగ్రమైన ధనుస్సున బాణాన్ని సంధించి, కార్తవీర్యార్జునుని ధనుస్సులను విరుగగొట్టాడు. కార్తవీర్యార్జునుడు అంతటితో ఊరుకోక వేగంగా పరశురామునిపై చెట్లను విసిరాడు. తీక్ష్ణమైన గొడ్డలి అంచుతో పరశురాముడు కార్తవీర్యార్జునుని చేతులను నరికివేశాడు.

**క. కరములు దునిసిన నతనికి, శిరమొక్కటి చిక్క శైలశిఖరముభంగిం**
**బరశువున నదియుఁ ద్రుంచెను, బరసూదనుఁడైన ఘనుఁడు భార్గవుఁడు వడిన్. 458**

**ప్రతి :** కరములు= చేతులు; తునిసినన్= తెగగా; అతనికిన్= ఆ కార్తవీర్యార్జునునకు; శైలశిఖరము భంగిన్= పర్వత శిఖరంవలె; శిరము+ఒక్కటి చిక్కన్= తల ఒక్కటి మిగులగా; పరసూదనుఁడు+ఐన= శత్రుసంహారకుడైన; ఘనుఁడు= శ్రేష్ఠుడు; భార్గవుఁడు= భృగువంశ సంజాతుడైన పరశురాముడు; వడిన్= వేగంగా; పరశువునన్= గొడ్డలితో; అదియున్ త్రుంచెను= దానిని కూడా తెగగొట్టాడు.

**తా :** కార్తవీర్యార్జునుని చేతులు తెగగా, కొండ శిఖరంలా అతని శిరస్సు మాత్రం మిగిలింది. శత్రుజనులకు సంతాపం కలిగించే పరశురాముడు వేగంగా అతని తలనుకూడ తెగనరికాడు.

**ఆ. తండ్రివడిన నతని తనయులు పదివేలు, దలఁగి పోయి రతనిఁ దాఁకలేక**
**పరభయంకరుండు భార్గవుం డంత నా, గోవుఁ గ్రేపుతోడఁ గొనుచుఁ జనియె. 459**

**ప్రతి :** తండ్రి పడినన్= తమ తండ్రి కార్తవీర్యార్జునుడు నేలకూలగా; అతని తనయులు= అతని కుమారులు; పదివేలు= పదివేలమంది; అతనిన్= పరశురాముని; తాఁకలేక= ఎదుర్కొనలేక; తలఁగిపోయిరి= తొలగిపోయారు; పరభయంకరుండు= శత్రుభయంకరుడైన; భార్గవుండు= పరశురాముడు; అంతన్= ఆ సమయంలో; క్రేపుతోడన్= దూడతో; గోవున్+కొనుచున్= ఆవునుకూడా తీసికొని; చనియెన్= వెళ్లాడు.

**తా :** తండ్రి కార్తవీర్యార్జునుడు నేలకూలగా అతని పదివేలమంది కొడుకులు పరశురాముని ఎదుర్కొనలేక యుద్ధభూమిని విడిచి వెళ్ళిపోయారు. శత్రు భయంకరుడైన ఆ పరశురాముడు ఆపై దూడతో సహా ఆవును తీసికొని వెళ్ళాడు.

**వ. ఇట్లు హోమధేనువు మరలం దెచ్చి యిచ్చి తన పరాక్రమంబుఁ దండ్రికిం దోఁబుట్టువులకుఁ దెలియఁ జెప్పిన, జమదగ్ని రామున కిట్లనియె. 460**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; హోమధేనువు= హోమధేనువును; మరలన్ తెచ్చి= తిరిగితెచ్చి; ఇచ్చి= తండ్రికిచ్చి; తన పరాక్రమంబున్= తాను శత్రువును జయించిన విధానాన్ని; తండ్రికిన్= తండ్రి జమదగ్నికి; తోఁబుట్టువులకున్= సోదరులకు; తెలియన్ చెప్పినన్= తెలియజెప్పగా; జమదగ్ని= తండ్రి జమదగ్ని; రామునకున్= కొడుకు పరశురామునకు; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా హోమధేనువును తిరిగితెచ్చి ఇచ్చి తండ్రికి, తోడబుట్టిన వారికి తన పరాక్రమాన్ని తెలియజెప్పేసరికి జమదగ్ని పరశురామునితో ఇలా అన్నాడు.

**క. కలవేల్పు లెల్లఁ దమతమ, చెలువంబులు దెచ్చి రాజుఁ జేయుదు రకటా!**
**బలువేల్పు రాజు వానిం, జలమున నిట్లేల పోయి చంపితి పుత్త్రా! 461**

**ప్రతి :** పుత్రా= ఓ కుమారా; కలవేల్పులు+ఎల్లన్= దేవతలందరూ; తమ తమ= తమ తమయొక్క; చెలువంబులు+తెచ్చి= పరాక్రమాల్నితెచ్చి; రాజున్= రాజును; చేయుదురు= చేస్తారు; బలువేల్పు రాజు= బలిష్ఠుడైన వేలుపు రాజు; అకటా= అయ్యో; వానిన్= అటువంటి వానిని; చలమునన్= పట్టుదలతో; పోయి= అతనివద్దకుపోయి; ఇట్లు+ఏల చంపితి= ఇలా ఎందుకు చంపావు;

**తా :** ఓ కుమారా! దేవత లందరూ తమ తమ పరాక్రమాన్ని తెచ్చి ఒకచోట పెట్టి రాజును చేస్తారు. ఆ విధంగా గొప్పవేలుపైన రాజును పట్టుదలతో వెళ్ళి ఎందుకు చంపావు?

**క. తాలిమి మనకును ధర్మము, తాలిమి మూలంబు ధర్మతత్త్వంబునకున్;**
**దాలిమి గల దని యీశుం, డేలించును బ్రహ్మపదము నెల్లన్ మనలన్. 462**

**ప్రతి :** తాలిమి= ఓర్పు; మనకును= మనకు; ధర్మము= వహించవలసిన ధర్మం; ధర్మతత్త్వంబునకున్= అన్ని ధర్మతత్త్వాలకు; తాలిమి మూలంబు= ఓర్పు ఆధారం; తాలిమిగలదని= ఓర్పు ఉన్నదనే; మనలను= విపులమైన మనలను; బ్రహ్మపదమున్+ఎల్లన్= బ్రహ్మపదాన్ని అంతటిని; ఈశుండు= పరమేశ్వరుడు; ఏలించును= పరిపాలింపజేస్తాడు.

**తా :** ఓర్పు మనకుండవలసిన ధర్మం, అన్ని ధర్మతత్త్వాలకు ఓర్పే మూలం. అటువంటి ఓర్పు ఉందనే ఈశ్వరుడు మనల్ని బ్రహ్మపదాన్నంతటిని పాలించేలా చేస్తాడు.

**క. క్షమ గలిగిన సిరి గలుగును, క్షమ గలిగిన వాణి గలుగు సౌఖ్యము లెల్లన్**
**క్షమ గలుగఁ దోన కలుగును, క్షమ కలిగిన మెచ్చు శౌరి సదయుఁడు తండ్రీ! 463**

**ప్రతి :** తండ్రీ= నాయనా!; క్షమగలిగినన్= ఓర్పు ఉన్నట్లయితే; సిరి+కలుగును= సంపద కలుగును; క్షమ+కలిగినన్= ఓర్పు కలిగి ఉన్నట్లయితే; వాణి గలుగున్= సరస్వతి కలుగుతుంది (విద్యలు లభిస్తాయి); సౌఖ్యములు+ఎల్లన్= సుఖాలన్నీ; క్షమగలుగన్= ఓర్పు కలుగగా; తోన కలుగును= వెంటనే వస్తుంది; క్షమ గలిగినన్= ఓర్పు కలిగి ఉన్నట్లయితే; సదయుఁడు= దయగల; శౌరి= విష్ణువు (పరమాత్మ) మెచ్చున్= మెచ్చుకొంటాడు.

**తా :** ఓ కుమారా! ఓర్పు ఉన్నవారికి సంపద కలుగుతుంది. ఓర్పు ఉంటే విద్య లభిస్తుంది. అన్ని సౌఖ్యాలు ఓర్పుతోనే లభిస్తాయి. సదయుడైన విష్ణువు క్షమ కలిగినవారిని మెచ్చుకుంటాడు.

**క. పట్టపురాజును జంపుట, గట్టలుకన్ విప్రుఁ జంపు కంటెను పాపం**
**బట్టిట్టనకుము నీ వీ, చెట్ట సెడన్ దీర్థ సేవ సేయుము తనయా! 464**

**ప్రతి :** తనయా= ఓ కుమారా!; పట్టపురాజును చంపుట= మహారాజును చంపుట అనేది; కడు+అలుకన్= తీవ్రమైన కోపంతో; విప్రున్= బ్రాహ్మణుని; చంపుకంటెను= చంపుటకంటె కూడ; పాపంబు= పాపం; అట్టు+ఇట్టు+అనకుము= మారుమాటాడవద్దు; నీవు; ఈ చెట్ట+చెడన్= ఈ పాపం పోయేలా; తీర్థసేవ+చేయుము= పుణ్యతీర్థాలను సేవించు.

**తా :** ఓ కుమారా! మహారాజును చంపుట అనేది కోపంతో బాపని చంపినదానికంటె ఎక్కువ పాపం. ఇక నీవు మారుమాటాడక, ఈ పాపం పోయేలా తీర్థయాత్రలకు వెళ్లు.

**క. అని తన్నుఁ దండ్రి పనిచినఁ, బనిపూని ప్రసాద మనుచు భార్గవుఁడు రయం**
**బున నొకయేఁడు ప్రయాణము, చని తీర్థము లెల్ల నాడి చనుదెంచె నృపా! 465**

**ప్రతి :** నృపా= ఓ పరీక్షిన్మహారాజా!; అని= ఈ విధంగా పలికి; తన్నున్= పరశురాముని; తండ్రి= తండ్రి జమదగ్ని; పనిచినన్= ఆజ్ఞాపింపగా; ప్రసాదము+అనుచున్= మీదయ అంటూ; భార్గవుఁడు= పరశురాముడు; రయంబునన్= వెంటనే; పనిపూని= ప్రయత్నపూర్వకంగా; ఒక యేడు ప్రయాణము చని= ఒక సంవత్సరం ప్రయాణంచేసి; తీర్థములు+ఎల్లన్+ఆడి= తీర్థాలన్నీ సేవించి; చనుదెంచెన్= తిరిగివచ్చాడు.

**తా :** ఓ పరీక్షన్మహారాజా! ఆ విధంగా తండ్రి ఆజ్ఞాపించగా, మహాప్రసాదం అని ఆ పరశురాముడు శీఘ్రంగా ఒక సంవత్సరం ప్రయాణం చేసి ప్రయత్నపూర్వకంగా తీర్థయాత్రలను సేవించి తిరిగివచ్చాడు.

**ఉ. ఆ యెడ నొక్కనాఁడు సలిలార్థము రేణుక గంగలోనికిం**
**బోయి ప్రవాహమధ్యమునఁ బొల్పుగ నచ్చరలేమపిండుతోఁ**
**దోయవిహారముల్ సలుపు దుర్లభుఁ జిత్రరథున్ సరోజ మా**
**లాయుతుఁ జూచుచుండెఁ బతియాజ్ఞఁ దలంపక కొంత ప్రేమతో. 466**

**ప్రతి :** ఆ+ఎడన్= ఆ సమయంలో; ఒక్కనాఁడు= ఒకరోజున; సలిల+అర్థము= నీటికొరకు; రేణుక= జమదగ్ని భార్య (పరశురాముని తల్లి); గంగలోనికిన్= గంగానదిలోనికి; పోయి= వెళ్ళి; ప్రవాహమధ్యమునన్= గంగాప్రవాహ మధ్యభాగంలో; పొల్పుగన్= సొగసుగా; అచ్చరలేమ పిండుతోన్= అప్సరఃకాంతాసమూహంతో; తోయవిహారముల్ సలుపు= జలక్రీడలు చేస్తున్న; దుర్లభున్= చూడ వీలుగాని; సరోజ మాలాయుతున్= తామరపూమాలతో కూడిన వానిని; పతియాజ్ఞన్= తన భర్త జమదగ్ని పెట్టిన ఆనను; తలంపక= ఆలోచింపక (గుర్తుంచుకొనక); కొంత ప్రేమతోన్= కొంత ఆసక్తితో; చిత్రరథున్= ఆ చిత్రరథుడనే గంధర్వుని; చూచుచుండెన్= చూస్తూ ఉండిపోయింది.

**తా :** ఒకరోజున జమదగ్ని భార్య రేణుక నీటికోసం గంగానదికి వెళ్ళి, ఆ గంగాప్రవాహంలో అప్సరఃకాంతా సమూహంతో సొగసుగా జలవిహారం చేస్తున్న వానిని; చూడవీలుగానివానిని పద్మమాలికలు ధరించిన చిత్రరథుణ్ణి, తన భర్త ఆజ్ఞను మరచి ఆసక్తితో చూస్తూ ఉండిపోయింది.

**వ. ఇట్లు గంధర్వవల్లభునిం జూచు కారణంబునఁ దడసి. 467**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; గంధర్వవల్లభునిన్= గంధర్వ రాజైన చిత్రరథుని; చూచు కారణంబునన్= చూచిన కారణంగా; తడసి= ఆలస్యంచేసి...

**తా :** ఈ విధంగా గంధర్వరాజైన చిత్రరథుణ్ణి చూచిన కారణంగా ఆలస్యంచేసి

**ఉ. అక్కట! వచ్చి పెద్దతడ వయ్యెడి; హోమమువేళ దప్పె; నే**
**నిక్కడ నేల యుండితి? మునీశ్వరుఁ డేమనునో యటంచుఁ దా**

**గ్రక్కునఁ దోయకుంభము శిరఃస్థలమం దిడి తెచ్చి యిచ్చి వే**
**మ్రొక్కి కరంబు మోడ్చి పతిముందట నల్లన నిల్వఁ జూచుచున్. 468**

**ప్రతి :** అక్కట!= అయ్యో!; వచ్చి= నేను గంగకు నీటికొరకు వచ్చి; పెద్ద తడవు+అయ్యెడిన్= చాల ఆలస్యం అయింది; హోమము వేళ+తప్పెన్= హోమసమయం దాటిపోయింది; నేను; ఇక్కడన్+ఏల యుండితిన్= ఇక్కడే ఎందుకు ఉండిపోయాను?; మునీశ్వరుఁడు= మునిశ్రేష్ఠుడైన మహర్షి; ఏమనునో+అటంచున్= ఏమంటాడో అనుకుంటూ; తాన్= తాను (రేణుక); గ్రక్కునన్= వెంటనే; తోయకుంభము= నీటి కడవ; శిరఃస్థలమందిడి= తలపై పెట్టుకొని; తెచ్చియిచ్చి= తీసికొనివచ్చి ఇచ్చి; వే మ్రొక్క= వేగంగా మ్రొక్కి; కరంబుమోడ్చి= చేతులు జోడించి; పతిముందటన్= భర్త జమదగ్ని ముందు; అల్లన నిల్వన్= మెల్లగా నిలబడగా; చూచుచున్= మునీశ్వరుడు కనుగొంటూ...

**తా :** అయ్యో! గంగకు వచ్చి చాల జాగైంది. హోమ సమయంకూడా దాటిపోయింది. నేనిక్కడ ఇలా ఉండి పోయానేమిటి? మునీశ్వరుడు జమదగ్ని ఏమంటాడో అనుకుంటూ వెంటనే నీటి కడవను తలకెత్తుకొని వచ్చి అక్కడపెట్టి నమస్కరించి చేతులు జోడించి భర్తముందు నిలబడగా చూచి

**వ. అప్పుడు. 469**

**తా :** అప్పుడు

**క. చిత్తమున భార్య దడసిన, వృత్తాంతం బెఱిఁగి తపసి వేగము సుతులన్**
**మత్తం దీనిం జావఁగ, మొత్తుం డన మొత్తరైరి మునుకుచు వారల్. 470**

**ప్రతి :** భార్య= తన భార్య రేణుక; తడసిన= ఆలస్యంచేసిన; వృత్తాంతంబు= సమాచారం; చిత్తమునన్= తన మనసులో; ఎఱిఁగి= తెలిసికొని (దివ్యదృష్టితో గ్రహించి); తపసి= జమదగ్ని ఋషి; వేగము= శీఘ్రంగా; మత్తన్= మదించిన; దీనిన్= దీనిని (ఈ రేణుకను); చావఁగన్ మొత్తుండు= చావబాదండి; అనన్= అనగా; వారల్= ఆ కుమారులు; మునుకుచున్= బాధపడుతూ; మొత్తరైరి= చంపలేకపోయారు.

**తా :** తపస్వి అయిన జమదగ్ని తన భార్య ఎందుకు ఆలస్యంగా వచ్చిందో అన్న విషయాన్ని దివ్యదృష్టితో గ్రహించి, మదించిన దీనిని చచ్చేలా కొట్టండి అని తన సుతులకు చెప్పగా ఆ కుమారులు దుఃఖిస్తూ తమ తల్లిని చంపలేకపోయారు.

**క. కడుకొని పెండ్లముఁ జంపని, కొడుకులఁ బెండ్లాముఁ జంప గురుఁ డానతి యీ**
**నడుగులకు నెఱఁగి రాముం, డడుగిడకుండంగఁ ద్రుంచె నన్నలఁ దల్లిన్. 471**

**ప్రతి :** కడుకొని= పూనుకొని; పెండ్లమున్= తన భార్యను; చంపని కొడుకులన్= చంపని కుమారులను; పెండ్లామున్= తన భార్య రేణుకను; చంపన్= చంపుటకు; గురుఁడు= తండ్రి జమదగ్ని; ఆనతియాన్= ఆజ్ఞాపించగా; రాముఁడు= పరశురాముడు; అడుగులకున్= తండ్రి పాదాలకు; ఎఱఁగి= నమస్కరించి; అడుగు+ఇడ కుండంగన్= వెనుకడుగు వేయక; అన్నలన్= సోదరులను; తల్లిన్= తల్లి రేణుకను; త్రుంచెను= ఖండించాడు.

**తా :** జమదగ్ని మహర్షి, తన భార్యను చంపని కొడుకులను, తన భార్య రేణుకను చంపుమని పరశురాముని ఆజ్ఞాపించగా అతడు తండ్రి అడుగులకు మ్రొక్కి వెనకాడక అన్నలను తల్లిని ఖండించాడు.

**శా. తల్లిన్ భ్రాతల నెల్లఁ జంపు మనుచోఁ దాఁ జంపి రాకున్న బెం**
**పెల్లన్ బోవ శపించుఁ దండ్రి; తన పంపేఁ జేయుదున్ మెచ్చి నా**
**తల్లిన్ భ్రాతల నిచ్చు నిక్కము తపోధన్యాత్మకుం డంచు వే**
**తల్లిన్ భ్రాతలఁ జంపె భార్గవుఁడు లేదా చంపఁజేయాడునే. 472**

**ప్రతి :** తల్లిన్= తన తల్లియైన రేణుకను; భ్రాతలన్= సోదరులను; ఎల్లన్= అందరినీ; చంపుము+అనుచోన్= తన తండ్రి చంపుమనగా; తాన్ చంపిరాకున్నన్= తాను చంపి రాకపోతే; తండ్రి= తన తండ్రి జమదగ్ని; పెంపు+ఎల్లన్= మేలునంతటిని; పోవన్ శపించున్= పోయేలా శపిస్తాడు; తనపంపున్= తన తండ్రియైన జమదగ్ని ఆజ్ఞను; ఏన్+చేయుదున్= నేను చేయగా; మెచ్చి= మెచ్చుకొని సంతోషించి; తపోధన్య+ఆత్మకుండు= తన తపోదీక్షతో ధన్యమైన సామర్థ్యంగల ఈ జమదగ్ని; నా తల్లిన్= నా తల్లిని; భ్రాతలన్= నా సోదరులను; ఇచ్చున్ నిక్కము= తప్పక తిరిగి ఇస్తాడు; అంచున్= అలా అనుకుంటూ; భార్గవుఁడు= పరశురాముడు; వే తల్లిన్= వేగంగా తల్లిని; భ్రాతలన్ చంపెన్= సోదరులను చంపాడు; లేదా= అలాకానట్లయితే; చంపన్= తల్లిని సోదరులను చంపుటకు; చే+ఆడునే= చేయి కదులుతుందా (చంపలేడు కదా అని భావం).

**తా :** పరశురాముడు తన తల్లిని సోదరులను చంపుమని తండ్రి ఆజ్ఞాపించగా, "తాను చంపకపోతే కీడు కలిగేలా జమదగ్ని శపిస్తాడు. అలాకాక తండ్రి ఆజ్ఞను పాటిస్తే, తపోధనుడైన తండ్రి, తల్లిని, సోదరులను, తప్పక బ్రతికించగలడు" అని భావించి వెంటనే తల్లిని సోదరులను చంపాడు. తన తండ్రి గొప్పతనం తెలియకపోతే తండ్రిపై అంత నమ్మకం లేకపోతే చంపడానికి పరశురామునికి చేయాడుతుందా? ఆడదు కదా!

**వ. ఇ వ్విధంబున. 473**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా.

**క. అడ్డఁడు చెప్పక కడపటి, బిడ్డఁడు రాముండు సుతులఁ బెండ్లము నచటన్**
**గొడ్డంటం దెగ నడచిన, జడ్డనఁ దలయూఁచి మెచ్చె జమదగ్ని మదిన్. 474**

**ప్రతి :** కడపటి బిడ్డఁడు= తన చిట్టచివరి కొడుకైన; రాముండు= పరశురాముడు; అడ్డఁడు చెప్పక= వ్యతిరేకించకుండా; సుతులన్ పెండ్లమున్= కొడుకులను భార్యను; అచటన్= అక్కడ; గొడ్డంటన్+తెగనడచినన్= గొడ్డలితో వధింపగా, జమదగ్ని= జమదగ్ని మహర్షి; జడ్డనన్= తటాలున; మదిన్= మనసులో; తలయూఁచి= శిరమాడించి; మెచ్చెన్= మెచ్చుకొన్నాడు.

**తా :** పరశురాముడు ఎదురుచెప్పకుండా గొడ్డలితో (జమదగ్ని) భార్యను, సుతులను వధింపగా జమదగ్ని తల ఊపుతూ మనస్సులో మెచ్చుకొన్నాడు.

**క. మెచ్చిన తండ్రినిఁ గనుఁగొని, చెచ్చెర నీ పడినవారి జీవంబులు నీ**
**విచ్చితి నను మని మ్రొక్కిన, నిచ్చెన్ వారలును లేచి రెప్పటిభంగిన్. 475**

**ప్రతి :** మెచ్చిన తండ్రినిన్= సంతోషించిన తండ్రి జమదగ్నిని; కనుఁగొని= చూచి; చెచ్చెరన్= వెంటనే; ఈ పడినవారి జీవంబులు= ఈ మరణించిన వారి ప్రాణాలు; నీవు+ఇచ్చితి+అనుమని= తిరిగి ఇచ్చానని చెప్పు అని; మ్రొక్కినన్= వేడగా; ఇచ్చెన్= జమదగ్ని మహర్షి అలాగే ఇచ్చాడు; వారలును= వారుకూడా (తన తల్లి సోదరులు కూడా); ఎప్పటి భంగిన్= పూర్వంవలె; లేచిరి= ప్రాణాలతో తిరిగి లేచారు.

**తా :** మెచ్చుకొన్న తండ్రిని చూచి పరశురాముడు వెంటనే 'ఈ చచ్చిపడి ఉన్న వారి ప్రాణాలను ప్రసాదించాన'ని చెప్పు అని తండ్రి పాదాలకు నమస్కరించాడు. ముని వారి ప్రాణాలను తిరిగి అనుగ్రహించగా వాళ్ళు ఎప్పటిలాగా లేచి నిలిచారు.

**ఆ. పడిన వారి మరల బ్రతికింప నోపును, జనకుఁ డనుచుఁ జంపె జామదగ్న్యుఁ;**
**డతఁడు సంపె ననుచు నన్నలఁ దల్లిని, జనకునాజ్ఞ నైనఁ జంపఁదగదు. 476**

**ప్రతి :** పడినవారిన్= చనిపోయినవారిని; మరలన్= తిరిగి; జనకుఁడు= తండ్రి జమదగ్ని; బ్రతికింపన్+ఓపును= బ్రతికించగలదు; అనుచున్= అని భావిస్తూ; జామదగ్న్యుఁడు= జమదగ్ని కుమారుడైన పరశురాముడు; చంపెన్= చంపాడు; అతఁడు= ఆ పరశురాముడు; చంపెన్+అనుచున్= చంపాడు కదా అని; అన్నలన్= అన్నలను; తల్లిని; జనకు+ఆజ్ఞన్+ఐనన్= తండ్రి ఆజ్ఞాపించినప్పటికీ; చంపన్+తగదు= చంపకూడదు.

**తా :** తన తండ్రి జమదగ్ని – చనిపోయిన తన తల్లిని, సోదరులను బతికింపగల సామర్థ్యం గలవాడని తెలిసి పరశురాముడు వారిని చంపాడు. అత డలాచంపాడు కదా అని తన తండ్రి ఆజ్ఞాపించినా ఎవ్వరూ తల్లిని సోదరులను చంపకూడదు.

**విశే :** లోకంలో కొంతమంది మహాత్ములు ఉంటారు. వారు నిగ్రహానుగ్రహసమర్థులు. వారు ఏ పనైనా చేయగలరు. అలాంటి సమర్థుడు జమదగ్ని. ఈ విషయంలో పరిపూర్ణమైన విశ్వాసం కొడుకు పరశురామునకు ఉన్నది. అందుకే తండ్రి ఆజ్ఞను పాలించి కన్నతల్లిని సోదరులను కుఠారంతో నరికి వేశాడు. తండ్రిని తిరిగి బతికించమని ప్రార్థించాడు. సమర్థుడైన జమదగ్ని తన భార్యను పిల్లలను తిరిగి బ్రతికించాడు. దీనిని ఉదాహరణగా తీసికొని నా తండ్రి చంపమన్నాడంటూ లోకంలో మిగిలినవారు తల్లిని సోదరులను సంహరిస్తారేమో, పితృవాక్య పరిపాలనకు కట్టుబడ్డామంటారేమోనని కవి ఈ అంశాన్ని, గూర్చి స్పష్టంగా అందరికి హెచ్చరిక చేస్తున్నాడు. ఏ గ్రంథానికైనా ప్రయోజనం ప్రపంచ శ్రేయస్సు. చారిత్రక విషయాలను, సత్యాలను, స్పష్టంగా సూటిగా కవి చెప్పవలసి ఉంటుంది. ఎవరో ఏదో చేశారని అవన్నీ మనం చేయలేము. చేయకూడదు కూడా. అందుకే పరశురామ కథాప్రసంగంలో అపూర్వ ప్రయోజనాన్ని ఆశించి కొసమెరుపుగా ఈ పద్యాన్ని చెప్పాడు కవి.

**వ. అంత. 477**

**సీ. పరశురామున కోడి పరుగులు పెట్టిన యర్జునపుత్త్రకు లాత్మయందుఁ**
**దండ్రి మ్రగ్గుటకు సంతప్తులై పొగులుచు నింతట నంతట నెదరు వేచి**
**తిరిగి యాడుచు నొక్కదివసమం దా రాముఁ డడవి కన్నలతోడ నరుగఁ బిదపఁ**
**బగదీర్పఁ దఱి యని పఱతెంచి హోమాలయంబున సర్వేశు నాత్మ నిలిపి**

**తే. నిరుపమ ధ్యాన సుఖవృత్తి నిలిచియున్న, పుణ్యు జమదగ్ని నందఱుఁ బొదివి పట్టి**
**కుదులకుండఁగఁ దలఁ ద్రెంచి కొనుచుఁ జనిరి, యడ్డ మే తెంచి రేణుక యడిచికొనఁగ. 478**

**ప్రతి :** పరశురామునకున్= జమదగ్ని కుమారుడు పరశురామునకు; ఓడి= భయపడి; పరుగులుపెట్టినన్= పారిపోయిన; అర్జున పుత్త్రకులు= కార్తవీర్యార్జునుని కుమారులు; ఆత్మయందున్= తమ మనసులో; తండ్రి= తమ తండ్రి; మ్రగ్గుటకున్= మరణించుటకు; సంతప్తులై= మిక్కిలి బాధపడి; పొగులుచున్= దుఃఖిస్తూ; ఇంతటన్+అంతటన్= ఎప్పుడెప్పుడా అని;

ఎడరువేచి= ఎదురుచూచి (సందుకొరకు చూచి); తిరిగి యాడుచున్= తిరుగుతూ; ఒక్క దివసమందున్= ఒకరోజు; రాముఁడు= పరశురాముడు; అడవికిన్+అన్నలతోడన్= అడవికి అన్నలతోపాటుగా; అరుగన్= వెళ్ళగా; పిదపన్= ఆపై; పగ+తీర్పన్= పగ తీర్చుకొనుటకు; తఱి+అని= సమయమని; పఱతెంచి= వచ్చి; హోమ+ఆలయంబునన్= హోమగృహంలో; సర్వేశున్= పరమాత్మను; ఆత్మన్ నిలిపి= తన బుద్ధియందు నిలిపి; నిరుపమ= సాటిలేని; ధ్యాన సుఖవృత్తిన్= ధ్యానమనే సుఖప్రవృత్తిలో; నిలిచియున్న= స్థిరంగా ఉన్న; పుణ్యున్= పుణ్యాత్ముడైన; జమదగ్నిన్= జమదగ్ని మహర్షిని; రేణుక= భార్య రేణుక; అడ్డము+ఏతెంచి= అడ్డంగా వచ్చి; అడచికొనఁగ= అడగజేసినప్పటికి (ఆపు చేసినప్పటికి); అందఱున్= కార్తవీర్యార్జునుని సుతులందరూ; కుదులకుండఁగన్= చలించకుండా; పొదిలిపట్టి= గట్టిగాపట్టి; తలన్= తలను; త్రెంచికొనుచున్= తెగగొట్టుకొని; చనిరి= వెళ్ళిపోయారు.

**తా :** పరశురాముని ముందు నిలబడలేక ఓడి పారిపోయిన కార్తవీర్యార్జుని సుతులు, తమ తండ్రి మరణించినందులకు చాల బాధపడి, తగిన సమయంకోసం ఎదురుచూస్తూ, ఒకరోజు పరశురాముడు తన అన్నలతో అడవికి వెళ్ళిన వేళ, పగ తీర్చుకోవడానికి ఇదే అదనని వచ్చి, హోమశాలలో నిశ్చలంగా కూర్చొని, తన చిత్తంలో పరమేశ్వర ధ్యానం చేస్తున్న జమదగ్ని మహర్షిని, రేణుక అడ్డువచ్చి ఆపు చేస్తున్నా ఆగక, కదలకుండా గట్టిగా పట్టుకొని అతని తల నరికి వెళ్ళారు.

**వ. మఱియును. 479**

**ప్రతి :** అంతేకాక.

**మ. జనకుం జంపిన వైర మేమఱక రాజన్యాత్మజుల్ నేఁడు మీ**
**జనకుం జంపిరి రామ! రామ! రిపులన్ శాసింతు రమ్మంచు న**
**మ్మునిపై వ్రాలి లతాంగి మోఁదికొనియెన్ ముయ్యేడుమాఱుల్ రయం**
**బున రాముం దరుదెంచి యెన్నికొన నాపూర్ణాపదాక్రాంతయై. 480**

**ప్రతి :** రామ= ఓ పరశురామా!; రాజన్య+ఆత్మజుల్= కార్తవీర్యార్జునుని పుత్రులు; జనకున్= తమ తండ్రిని; చంపిన వైరము= నీవు చంపిన పగ; ఏమఱక= మరచిపోక; నేఁడు= ఈనాడు; మీ జనకున్ చంపిరి= మీ తండ్రి జమదగ్ని మహర్షిని చంపారు; రామ!= ఓ పరశురామా!; రిపులన్= శత్రువులను; శాసింతు= శిక్షించుటగాను; రమ్ము+అంచున్= రమ్ము అని పిలుస్తూ; ఆ+మునిపైన్ వ్రాలి= ఆ మహర్షి కళేబరంపైబడి; ఆపూర్ణ+ఆపద+ఆక్రాంతయై= అధికమైన దుఃఖానికి చిక్కి; లతా+అంగి= జమదగ్ని భార్య రేణుక; రయంబునన్= వేగంగా; రాముందరుదెంచి= పరశురాముడు వచ్చి; ఎన్నికొనన్= లెక్కపెట్టునట్లు; ముయ్యేడు మాఱుల్= మూడు ఏడులు ఇరువది ఒక్కమారు; మోదుకొనియెన్= (గుండెలు) బాదుకొన్నది.

**తా :** కార్తవీర్యార్జునసుతులు తమ తండ్రిని నీవు చంపిన వైరం మరచిపోకుండా, ఈనాడు వచ్చి మీ తండ్రిని చంపారు. ఓ పరశురామా! ఈ శత్రువులను శిక్షించుటకురా అంటూ ఆ ముని కళేబరం పైపడి రేణుక బాధాతప్తహృదయంతో పరశురాముడు వచ్చి చూచేసరికి ఇరవై ఒక్కమార్లు గుండెపై మోదుకొన్నది.

**వ. ఇట్లప్పుడు దల్లి మొఱ విని, జమదగ్నికుమారులు వచ్చి యిట్లని విలపించిరి. 481**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అప్పుడు= ఆ సమయంలో; తల్లి మొఱవిని= తల్లియొక్క దీనాలాపాలు విని; జమదగ్ని కుమారులు= మిగిలిన జమదగ్ని కుమారులు; వచ్చి= అక్కడకు వచ్చి (జమదగ్ని శరీరంవద్దకు వచ్చి); ఇట్లని విలపించిరి= ఈ విధంగా దుఃఖించారు.

**తా :** ఈ విధంగా రోదిస్తున్న తల్లి మొరవిని జమదగ్ని సుతులు అక్కడకు వచ్చి ఇలా దుఃఖించారు.

**క. వాకిలి వెడలవు కొడుకులు, రాకుండఁగ నట్టి నీవు రాజసుతులచేఁ**
**జీకాకు పొంది పోవఁగ, నీకా ళ్లెట్లాడెఁ దండ్రి! నిర్జరపురికిన్. 482**

**ప్రతి :** తండ్రీ= ఓ తండ్రీ!; కొడుకులు రాకుండగన్= నీతో నీ కొడుకులు వెంటరాకుండా; వాకిలి వెడలవు= గడపదాటి ఎరగవు; అట్టి నీవు= అలాంటి నీవు; రాజసుతులచేన్= కార్తవీర్యార్జునుని కొడుకులచే; చీకాకుపొంది= కలతపడి (శ్రమపడి); నిర్జరపురికిన్= దేవతల నగరమైన స్వర్గానికి; పోవఁగన్= వెళ్ళడానికి; నీకాళ్ళెట్లాడెన్= నీకు కాళ్ళెలా వచ్చాయి? (ఎలా వెళ్ళగలిగావు!).

**తా :** ఓ తండ్రీ! నీ కొడుకులు తోడు రాకుండా వాకిలి నుండి కూడా కదలవు గదా! అలాంటి నీవు కార్తవీర్యార్జునుని కొడుకులవల్ల శ్రమపడి స్వర్గానికి (ఒంటరిగా) ఎలా వెళ్ళగలిగావు?

**వ. అని విలపించుచున్న యన్నలను జూచి రాముం డిట్లనియె. 483**

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా; విలపించుచున్న= దుఃఖిస్తున్న; అన్నలనుజూచి= తన సోదరులను చూచి; రాముండు+ఇట్లు+ అనియెన్= పరశురాముడు ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ ప్రకారంగా దుఃఖిస్తూ ఉన్న సోదరులతో పరశురాముడు ఇలా అన్నాడు.

**ఉ. ఏడువనేల? తండ్రి తను వేమఱకుండుఁడు తోడులార! నే**
**సూడొగిఁ దీర్తునంచుఁ బరశుద్యుతి భీముఁడు రాముఁ డుగ్రుఁడై**
**యోడక యర్జునాత్మభవులున్న పురంబున కేగి వారు గో**
**డాడఁగఁ బట్టి చంపె వడి నర్జునజాతుల బ్రహ్మఘాతులన్. 484**

**ప్రతి :** తోడులార= ఓ తోడబుట్టిన సోదరులారా!; ఏడువన్+ఏల= దుఃఖించడం ఎందుకు (దుఃఖింపవలదు); తండ్రితనువు= మన తండ్రి కళేబరాన్ని; ఏ మఱకుండుఁడు= జాగరూకతతో చూస్తూ ఉండండి; నేన్= నేను; సూడు= పగను; ఒగిన్+తీర్తున్ అంచున్= క్రమంగా తీర్చుకుంటాను (ప్రతీకారం చేసి తీరుతాను) అని; పరశుద్యుతిన్= గండ్రగొడ్డలి కాంతితో; భీముఁడు= భయంకరుడైన; రాముఁడు= పరశురాముడు; ఉగ్రుఁడై= కోపించినవాడై; ఓడక= వెనుదీయక; అర్జున+ఆత్మభవులున్న= అర్జునాత్మభవులున్న, కార్తవీర్యార్జునుని కుమారులున్న; పురంబునకున్+ఏగి= పట్టణానికి వెళ్ళి; వారు= ఆ కార్తవీర్యార్జునుని సుతులు; గోడాడఁగన్= దుఃఖించగా; బ్రహ్మఘాతులన్= బ్రహ్మ హత్యచేసిన; అర్జునజాతులన్= అర్జున కుమారులను; వడిన్= వేగంగా; పట్టిచంపెన్= పట్టుకొని సంహరించాడు.

**తా :** అన్నలారా! దుఃఖించకండి. మన తండ్రి శరీరాన్ని జాగ్రత్తగా చూస్తూ ఉండండి. నేను పగతీర్చుకొని వస్తాను అంటూ తన చేతి గండ్రగొడ్డలిఅంచుకాంతి అధికంకాగా భయంకరుడై పరశురాముడు కోపంతో కార్తవీర్యార్జునుని కొడుకులున్న పట్టణానికి వెళ్ళి బ్రహ్మఘాతులైన ఆ అర్జున పుత్రులను పట్టి చంపాడు.

**క. ఖండించి రిపుల శిరములు, గొండలుగాఁ బ్రోగు లిడియె గురురక్తనదుల్**
**నిండికొని పాఱి యుబ్బెను, భండనమున నృపులు రిపులు భయమంద నృపా! 485**

**ప్రతి :** నృపా= ఓ పరీక్షిన్మహారాజా!; రిపుల శిరములు= శత్రువుల తలలు; ఖండించి= తెగగొట్టి (నరికి); కొండలుగాన్= పర్వతాకారాలుగా; ప్రోగులు+ఇడియెన్= పోగులుగా పెట్టాడు; భండనమునన్= ఆ యుద్ధంలో; నృపులు= రాజులు; రిపులు= శత్రువులు; భయము+అందన్= భయపడునట్లుగా; గురురక్తనదుల్= పెద్ద పెద్ద రక్తనదులు; నిండుకొని= పొంగి; పాఱి+ఉబ్బెను= ప్రవహించి అతిశయించాయి.

**తా :** ఓ పరీక్షన్మహారాజా! పరశురాముడు శత్రువుల శిరస్సులు తెగగొట్టి కొండలుగా పోగులు పెట్టాడు. ఆ యుద్ధంలో రాజులు శత్రువులు భయపడేలా పెద్ద రక్తనదులు పొంగిపారాయి.

**వ. మఱియు నంతటఁ బోక. 486**

**ప్రతి :** మఱియున్= మరియు; అంతటన్+పోక= అంతటితో ఆగక...

**తా :** పరశురాముడు అంతటితో ఆగకుండా

**ఆ. అయ్యపగకు రాముఁ డలయక రాజుల, నిరువదొక్కమాఱు లరసి చంపె;**
**జగతిమీఁద రాజశబ్దంబు లేకుండ, సూడు దీర్పలేని సుతుఁడు సుతుఁడె. 487**

**ప్రతి :** అయ్యపగకున్= తండ్రిని చంపినవారిపై పగనుగొన్న; రాముఁడు= పరశురాముడు; అలయక= విశ్రాంతి లేకుండా (సునాయాసంగా); జగతిమీఁదన్= ప్రపంచంలో; రాజశబ్దంబులేకుండన్= రాజు అనే శబ్దం లేకుండా; (క్షత్రియుడు అనేవాడు లేకుండా); రాజులన్= రాజులను; ఇరువదొక్కమాఱులు= ఇరవై ఒక్క తడవలు; అరసి= వెదకి; చంపెన్= చంపాడు; సూడు తీర్పలేని= పగ తీర్చుకోని; సుతుఁడు= కుమారుడు; సుతుఁడె= కుమారుడా కాదు అని భావం.

**తా :** తన తండ్రిని చంపిన రాజపుత్రులపై పగతీర్చుకొనే నిమిత్తం, లోకంలో క్షత్రియ శబ్దం లేకుండా ఇరవై ఒక్కమార్లు పరశురాముడు క్షత్రియులనందరిని వెదకి వెదకి చంపాడు. పగ తీర్చుకోకపోతే అతడు కొడుకేనా?! ప్రతీకారం తీర్చుకొని పరశురాముడు నిజమైన కొడుకు అనిపించుకున్నాడు.

**వ. మఱియు నా రాముఁడు శమంతక పంచకంబున రాజరక్తంబులం దొమ్మిది మడుఁగులు కావించి, తండ్రి శిరంబుఁ దెచ్చి, శరీరంబుతో సంధించి, సర్వదేవమయుండగు దేవుండు తాన కావునఁ దన్ను నుద్దేశించి యాగంబు చేసి, హోతకుం దూర్పును, బ్రహ్మకు దక్షిణభాగంబును, నధ్వర్యునకుఁ బడమటి దిక్కును, నుద్గాత కుత్తరదిశయును, నున్నవారల కవాంతరదిశలును, గశ్యపునకు మధ్యదేశంబును, నుపద్రష్టకు ఆర్యావర్తంబును, సదస్యులకుం దక్కిన యెడలును గలయ నిచ్చి, బ్రహ్మనదియైన సరస్వతియం దవభృథస్నానంబు సేసి, కల్మషంబులం బాసి, మేఘవిముక్తుండైన సూర్యుండునుం బోలె నొప్పుచుండె నంత. 488**

**ప్రతి :** మఱియున్= అంతేగాక; ఆ రాముఁడు= ఆ పరశురాముడు; శమంతకపంచకంబునన్= శమంతక పంచకం అనేచోట; రాజరక్తంబులన్= శత్రురాజుల రక్తంతో; తొమ్మిది మడుఁగులు కావించి= తొమ్మిది సరస్సులుగా చేసి; తన

శిరంబుఁదెచ్చి= తన తండ్రి తలను తెచ్చి; శరీరంబుతోన్ సంధించి= శరీరంతో కలిపి; సర్వదేవమయుండగు= సకల దేవతల స్వరూపమైన; దేవుండు= పరమాత్మ; తాన కావునన్= తానే కాబట్టి; తన్నున్+ఉద్దేశించి= తనను దాను ఉద్దేశించుకొని; యాగంబుచేసి= యాగాన్ని చేసి; హోతకున్= యజ్ఞదీక్షలో హోత అనేవానికి; తూర్పును= తూర్పు దిక్కునంతటిని; బ్రహ్మకున్= యజ్ఞంలో బ్రహ్మత్వం వహించినవానికి; దక్షిణ భాగంబును= దక్షిణ దిగ్భాగాన్ని; అధ్వర్యునకున్= అధ్వర్య స్థానంలో ఉండే బ్రాహ్మణునకు; పడమటి దిక్కును= పశ్చిమ దిక్కును; ఉద్గాతకున్= ఉద్గాతగా వ్యవహరించినవానికి; ఉత్తరదిశయును= ఉత్తర దిగ్భాగాన్ని; ఉన్నవారలకున్= ఇంకను మిగిలినవారికి; అవాంతరదిశలును= ఆగ్నేయ, వాయవ్య, నైరుతి, ఈశాన్య దిగ్భాగాలను; కశ్యపునకున్= కశ్యపుడు అనే పేరుగల మహర్షికి; మధ్యదేశంబును= అన్నిదిక్కులకు మధ్యలో ఉండే ప్రాంతాన్ని; ఉపద్రష్టకున్= ఉపద్రష్టస్థానంలో ఉన్నవానికి; ఆర్యావర్తంబును= ఆర్యావర్తప్రాంతాన్ని; సదస్యులకున్= సభలో ఉన్నవారికి; తక్కిన యెడలను= మిగిలిన ప్రాంతాలను; కలయన్ ఇచ్చి= సమర్పణచేసి; బ్రహ్మనదియైన= బ్రహ్మనదిగా పేరొందిన; సరస్వతియందున్= సరస్వతీనదిలో; అవభృథంబుసేసి= యజ్ఞాంతంలో చేసే అవభృథం అనే పేరుగల పవిత్రస్నానంచేసి; కల్మషంబులన్ పాసి= పాపాలను పోగొట్టుకొని; మేఘవిముక్తుండైన= మేఘాలనుండి విడువబడిన; సూర్యుండునుం బోలెన్= సూర్యుని విధంగా; ఒప్పుచుండెన్= ప్రకాశిస్తున్నాడు; అంతన్= అంతలో...

**తా :** ఆ పరశురాముడు శత్రురాజులను దునుమాడిన రక్తంతో శమంతకపంచకమనేచోట తొమ్మిది మడుగులుచేసి, తన తండ్రియొక్క తెగిన శిరస్సును శరీరంతో కలిపి, తాను సర్వదేవ స్వరూపుడు కాబట్టి తనను ఉద్దేశించి యాగాన్ని నిర్వహించి హోతకు తూర్పు భాగాన్ని, బ్రహ్మకు దక్షిణ భాగాన్ని, అధ్వర్యునకు పశ్చిమభాగాన్ని, ఉద్గాతకు ఉత్తరదిక్కును మిగిలినవారికి మిగిలిన విదిక్కులను, కశ్యపునకు అన్నిదిక్కుల మధ్యలో గల భూమిని, ఉపద్రష్టకు ఆర్యావర్త ప్రాంతాన్ని, సదస్యులుగా వచ్చిన బ్రాహ్మణ సభ్యులకు తక్కిన ప్రాంతాలను దానంగా ఇచ్చి, బ్రహ్మనదిగా పేరు పొందిన సరస్వతీనదిలో అవభృథ స్నానంచేసి పాపరహితుడై మేఘాలనుండి వెలువడ్డ సూర్యునిలా గొప్పకాంతితో ప్రకాశించాడు. అంతలో

**విశే :** యజ్ఞయాగాది క్రియలలో అన్ని వేదాలకు సంబంధించిన క్రియాకలాపాలు జరుగుతాయి. అందుకొరకు ఋగ్వేదాన్ని చదువుతూ ఆ ఋగ్వేదంలో చెప్పబడ్డ క్రియలు ఆచరించే వ్యక్తిని హోత అని, యజుర్వేదాన్ని చదువుతూ తత్క్రియలను నిర్వహించే వానిని అధ్వర్యుడని, సామవేదాన్ని గానంచేస్తూ యజ్ఞక్రియను నడిపేవానిని ఉద్గాత అని, మొత్తం యజ్ఞక్రియనంతటిని పర్యవేక్షించే వానిని ఉపద్రష్ట అని అంటారు. అంతేగాక ఈ యజ్ఞానికి ఆధ్యక్షం వహించి నిర్వహింపచేసేవాడు బ్రహ్మ అనే పేరుగల స్థానంలో ఉండేవాడు. యాగాన్ని నిర్వహించేవేళ ఎందరెందరో బ్రాహ్మణోత్తములు చూచే నిమిత్తం ఆహూతులై, అనాహూతులై కూడా వస్తారు. వారు సదస్యులు. ఇలా యజ్ఞనిర్వహణ చాల ప్రణాళికాబద్ధంగా జరుగుతుంది. ఇంత జరిగినా ఎక్కడైన మంత్రంలోగాని, స్వరంలోగాని, అక్షరాల ఉచ్చారణలోగాని, ద్రవ్యాల నిర్వహణలోగాని తక్కువతనం లేదా ఎక్కువతనం – దీనినే న్యూన అతిరిక్తదోషం అంటారు. ఇది ఏర్పడితే ఆ దోషనిమిత్తం యజ్ఞాంతంలో ఒక పవిత్రస్నానాన్ని మంత్రపూతంగా యజ్ఞ దీక్షలో ఉన్నవారు నిర్వహిస్తారు. దానినే అవభృథ స్నానం అంటారు.

**క. ఆప్తుఁడగు పుత్రువలనను, బ్రాప్తతనుం దగుచుఁ దపము బలిమిని మింటన్**
**సప్తర్షిమండలంబున, సప్తముఁడై వెలుఁగుచుండె జమదగ్ని నృపా! 489**

**ప్రతి :** నృపా= ఓ రాజా!; ఆప్తుఁడగు పుత్రువలనను= ఆప్తుడైన పుత్రుని కారణంగా; జమదగ్ని= పరశురాముని తండ్రి జమదగ్ని మహర్షి; ప్రాప్తతనుండగుచున్= శరీరం పొందినవాడై; తపము బలిమిని= తన తపోబలంతో; మింటన్=

ఆకాశంలో; సప్తర్షి మండలంబునన్= సప్తర్షి మండలంగా ఉన్న నక్షత్రాలలో; సప్తముఁడై= ఏడవవాడై; వెలుఁగుచుండెన్= ప్రకాశిస్తున్నాడు.

**తా :** రాజా! అప్పుడైన పరశురామునివల్ల శరీరాన్ని పొందిన జమదగ్ని తన తపోబలంతో ఆకాశంలో ఉన్న సప్తర్షి మండలంలో ఏడవ నక్షత్రంగా వెలుగులు చిమ్ముతున్నాడు.

**విశే :** సప్తర్షిమండలంలో కశ్యప, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, గౌతమ, వశిష్ఠ, జమదగ్ని అనేవారున్నారు.

**క.** **ఆ జమదగ్ని తనూజుఁడు, రాజీవాక్షుండు ఘనుఁడు రాముఁ డధికుఁడై**
**యోజను వేదర్షులలో, రాజిల్లెడు మీఁదిమనువు రా నవ్వేళన్. 490**

**ప్రతి :** ఆ జమదగ్ని తనూజుఁడు= ఆ జమదగ్ని కుమారుడు; రాజీవాక్షుండు= ఆ పద్మాక్షుడు; ఘనుఁడు= గొప్పవాడు; రాముఁడు= పరశురాముడు; అధికుఁడై= గొప్పవాడై; మీఁది మనువురాన్= ఈ పై మన్వంతరము వచ్చినపుడు; వేదర్షులలోన్= వేద ఋషులలో ఒకడై; ఓజను= కాంతితో; రాజిల్లెడున్= ప్రకాశిస్తాడు.

**తా :** జమదగ్ని మహర్షి పుత్రుడు, గొప్పవాడు, పద్మాక్షుడు అయిన పరశురాముడు కీర్తి గలవాడై రాబోయే మన్వంతరంలో సప్తర్షులలో ఒకడై ప్రకాశిస్తాడు.

**విశే :** డెబ్బది యొక్క దివ్య యుగాల కాలం ఒక మన్వంతరం. మనం ప్రస్తుతం వైవస్వత మన్వంతర కాలంలో ఉన్నాం.

**ఆ.** **శాంతచిత్తుఁ డగుచు సంగవిముక్తుఁడై, భవ్యుఁడై మహేంద్రపర్వతమున**
**నున్నవాఁడు రాముఁ డోజతో గంధర్వ, సిద్ధవరులు నుతులు సేయుచుండ. 491**

**ప్రతి :** రాముఁడు= పరశురాముడు; శాంత చిత్తుఁడగుచున్= ప్రశాంతమైన మనసు గలవాడై; సంగవిముక్తుఁడై= ఏ బంధాలకు లోనుగాక విడివడి; భవ్యుఁడై= యోగ్యుడై; ఓజతోన్= క్రమముగా; గంధర్వ సిద్ధవరులు= గంధర్వులు, సిద్ధశ్రేష్ఠులు; నుతులు+చేయుచుండన్= కీర్తిస్తూ ఉండగా; మహేంద్ర పర్వతమునన్= మహేంద్రం అనే పేరుగల పర్వతంమీద; ఉన్నవాఁడు= ఉన్నాడు.

**తా :** పరశురాముడు ప్రశాంతచిత్తుడై, బంధాలు విడివడినవాడై, యోగ్యుడై, గంధర్వులు, సిద్ధులు మొదలగువారు కీర్తిస్తుండగా మహేంద్ర పర్వతంపై ఉన్నాడు.

**క.** **భగవంతుఁడు హరి యీక్రియ, భృగుకులమునఁ బుట్టి యెల్ల పృథివీపతులన్**
**జగతీభారము వాయఁగఁ, బగఁగొని పలుమాఱు చంపె బవరమున నృపా! 492**

**ప్రతి :** నృపా= ఓ పరీక్షిన్మహారాజా!; భగవంతుఁడు హరి= దైవమైన విష్ణువు; ఈ క్రియన్= ఈ విధముగా; భృగు కులమునన్= భృగు వంశంలో; పుట్టి= జన్మించి; జగతీభారము+పాయఁగన్= భూభారము పోయేవిధంగా; బవరమునన్= యుద్ధంలో; ఎల్లపృథివీపతులన్= అందరు రాజులను; పగన్కొని= పగతో; పలుమాఱు చంపెన్= చాలమార్లు సంహరించాడు.

**తా :** ఓ పరీక్షన్మహారాజా! భగవంతుడైన విష్ణువు ఈ విధంగా భృగువంశంలో పరశురాముడై జన్మించి పగతో యుద్ధంలో రాజులందరిని భూభారం తగ్గేవిధంగా పలుమార్లు చంపాడు.

**విశే :** భగవంతుడు – షడ్గుణైశ్వర్య సంపన్నుడు. షడ్గుణాలు : ఐశ్వర్య, బల, శక్తి, వీర, జ్ఞాన, తేజస్సులు ఆరూన్నూ కలవాడు భగవంతుడు.

**వ. అంత గాధికి నగ్నితేజుండగు విశ్వామిత్రుండు జన్మించి తపోబలంబున రాజధర్మంబును మాని, బ్రహ్మర్షియై, యేకశత సంఖ్యాగణితు లగు కొడుకులం గనియె; అయ్యెడ భృగుకుల జాతుండైన యజీగర్తుని కొడుకు శునశ్శేపుండు దల్లిదండ్రుల చేత హరిశ్చంద్రుని యాగపశుత్వంబునకు నమ్ముడుపడి, బ్రహ్మాదిదేవతల వినుతి సేయుచు మెప్పించి, పితృదేవతలచే బంధవిముక్తుండైన వాని యందుఁ గృప గలిగి, విశ్వామిత్రుండు పుత్త్రుల కిట్లనియె. 493**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట; గాధికిన్= గాధి అనేవానికి; అగ్నితేజుండు+అగు= అగ్నివలె తేజస్సుగల; విశ్వామిత్రుండు= విశ్వామిత్రుడు అనువాడు; జన్మించి= పుట్టి; తపోబలంబునన్= తన తపస్సుయొక్క బలంచేత; రాజధర్మంబును మాని= తాను రాజపుత్త్రుడైనప్పటికి తన రాజధర్మాన్ని విడిచిపెట్టి; బ్రహ్మర్షియై= బ్రహ్మ ఋషిగా మారి; ఏకశతసంఖ్యా గణితులగు= ఒక వందమంది; కొడుకులన్= సుతులను; కనియెన్= కన్నాడు; ఆ+ఎడన్= ఆ సమయంలో; భృగుకులజాతుండైన= భృగువంశంలో పుట్టిన; అజీగర్తుని కొడుకు= అజీగర్తుని కుమారుడు; శునశ్శేపుండు అనేవాడు; తలిదండ్రులచేతన్= తలిదండ్రులచే; హరిశ్చంద్రుని యాగపశుత్వంబునకున్= హరిశ్చంద్రుడు చేసే యాగంలో యజ్ఞ పశువుగా ఉండుటకు; అమ్ముడుపడి= అమ్ముడుపోయి, విక్రయింపబడి; బ్రహ్మాదిదేవతలన్= బ్రహ్మ మొదలైన దేవతలను; వినుతిసేయుచున్= కీర్తించుచు; మెప్పించి= వారిని సంతోషపరచి; పితృదేవతలచేన్= పితృదేవతలయొక్క కృపతో; బంధవిముక్తుండైనన్= బంధవిముక్తుడు కాగా; వానియందున్= ఆ శునశ్శేపునియందు; కృప గలిగి= దయగలవాడై; విశ్వామిత్రుండు= గాధిసుతుడైన విశ్వామిత్రుడు; పుత్త్రులకున్+ఇట్లు+అనియెన్= తన వందమంది కుమారులతో ఇలా అన్నాడు.

**తా :** గాధికి అగ్నితో సమానమైన తేజస్సుగల విశ్వామిత్రుడు జన్మించాడు. ఈ విశ్వామిత్రుడు రాజు అయినప్పటికి తన రాజధర్మాన్ని, క్షాత్రధర్మాన్ని వదిలి తన తపోబలంతో బ్రహ్మర్షి అయ్యాడు. నూర్గురు సుతులను కన్నాడు.

భృగువంశంలో జన్మించిన అజీగర్తుడు అనే వానికొడుకు శునశ్శేపుడు హరిశ్చంద్రునికి తన తల్లిదండ్రులచే యజ్ఞపశువుగా అమ్మబడ్డాడు. అతడు యజ్ఞస్తంభానికి కట్టివేయబడగా బ్రహ్మ మొదలైన దేవతలను స్తుతించి, మెప్పించి పితృదేవతల చేత బంధవిముక్తుడయ్యాడు. ఆ శునశ్శేపునియందు దయగలిగిన విశ్వామిత్రుడు తన పుత్త్రులతో ఇలా అన్నాడు.

**విశే :** అజీగర్తుడు భృగువంశంలో జన్మించాడు. ఒక సమయంలో క్షామం వచ్చింది. ఆహారంలేక అందరూ బాధపడుతున్నవేళ ఈ అజీగర్తుడు తన కుమారుడైన శునశ్శేపుణ్ణి హరిశ్చంద్రునకు అమ్మివేసినాడు. హరిశ్చంద్రుడు ఈ శునశ్శేపుణ్ణి యాగపశువును చేసి యూపస్తంభానికి కట్టాడు. ఈ శునశ్శేపుడు తనను యజ్ఞపశువుగా బలి చేస్తారనే భయంతో బ్రహ్మాది దేవతలను ప్రార్థించాడు. బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు. పితృదేవతలచే శునశ్శేపునకు బ్రహ్మ దయవల్ల బంధవిముక్తి అయ్యింది. హరిశ్చంద్రునకు యాగఫలం లభించేలా చేశాడు. బ్రహ్మ దేవతలు వచ్చి ఈ శునశ్శేపుని విడిపించారు. కాబట్టి ఇతనికి దేవరాతుడనే పేరు వచ్చింది. ఈ శునశ్శేపుడనే దేవరాతునిమీద విశ్వామిత్రునకు ప్రేమ కలిగింది.

శునశ్శేపుని అమ్మిన కారణంగా తదుపరి అజీగర్తునకు పిశాచత్వం వచ్చింది. తన మూలంగా తండ్రికి పిశాచత్వం వచ్చిందని తెలిసికొన్న శునశ్శేపుడు గౌతమీతీరంలో తపస్సు చేశాడు. శివుడు విష్ణువు ప్రత్యక్షం అయ్యారు. వారి అనుగ్రహంతో ఈ శునశ్శేపుడు తన తండ్రికి వచ్చిన పిశాచత్వాన్ని పోగొట్టాడు.

**క. కన్నులఁ గంటిని వీనిని, మన్నన కొమరుండు నాకు మక్కువ మీలో**
**నన్నన్న యనుచు నతనిన్, మన్నింపుం డనినఁ జూచి మదసంయుతులై. 494**

**ప్రతి :** వీనిని= ఈ శునశ్శేఫుని; కన్నులన్+కంటిని= కళ్ళారా చూచాను; మన్నన కొమరుండు నాకున్= నాకు ఇతడు మన్నింపదగిన కొడుకు వంటివాడు; అతనిన్= ఈ శునశ్శేఫుని; మక్కువన్= ప్రేమతో; మీలోన్= మీలో (మీరందరూ అనిభావం); అన్నన్న యనుచున్= అన్న అన్న అనుచూ; మన్నింపుండు= గౌరవించండి; అనినన్= అనగా; చూచి= (విశ్వామిత్రుని నూరుగురు సుతులు) చూచి; మదసంయుతులై= మదంతో కూడినవారై...

**తా :** ఈ శునశ్శేఫుణ్ణి నేను కళ్ళారా చూచాను. ఇతడు నాకు ప్రియమైన కుమారుడు. వీనిని మీరందరూ ప్రేమతో అన్న అన్న అని పిలవండి. ఇతణ్ణి గౌరవించండి అని విశ్వామిత్రుడు తన కొడుకులతో అనగా వారు మదించిన వారై

**క. ఇతఁ డన్నఁటవో మాకును, గృతకృత్యుల మైతి మనుచు గేలి యొనర్పన్**
**సుతులన్ మ్లేచ్ఛులు గండని, ధృతిలేక శపించి తపసి తిరుగుడువడఁగన్. 495**

**ప్రతి :** మాకును= మాకు; ఇతఁడు= ఈ శునశ్శేఫుడు; అన్నఁటవో= అన్నయట గదా!; కృతకృత్యులము+ఐతిమి= కృతార్థులం అయ్యాం; అనుచున్= అంటూ; గేలి+ఒనర్పన్= ఎకసెక్కెం చేయగా; సుతులన్= తన కుమారులను; మ్లేచ్ఛులు+కండు+అని= మ్లేచ్ఛులైపొండి అని, పాపరతులు కండి అని; తపసి= తపస్వి అయిన విశ్వామిత్రుడు; ధృతిలేక= సంయమనంలేక; శపించి= శాపం ఇచ్చి; తిరుగుడు పడఁగన్= పరిభ్రమించగా...

**తా :** ఇతడు మాకు అన్న అగునా! బాగు బాగు. మేము ధన్యులమయ్యాం అంటూ గేలి చేస్తున్న తన కుమారులను చూచి, సంయమనం విడిచి "మీరు మ్లేచ్ఛులు అయిపొండి అని శపించి వెళ్ళిపోతూ ఉండగా

**వ. అయ్యెడ నతని శాపంబునకు వెఱచి, యా నూర్వురయందు మధ్యముండైన మధుచ్ఛందుం డేఁబండ్రు దమ్ములుం దానును నమస్కరించి, తండ్రీ! నీ చెప్పిన క్రమంబున శునశ్శేఫుండు మా కన్నయని నమస్కరింపం గలవార' మనవుడు సంతసించి, మంత్రదర్శియైన శునశ్శేఫుని వారల యందుఁ బెద్దఁజేసి, మధుచ్ఛందున కిట్లనియె. 496**

**ప్రతి :** ఆ+ఎడన్= ఆ సమయంలో; అతని శాపంబునకున్ వెఱచి= తండ్రియైన విశ్వామిత్రుని శాపానికి భయపడి; ఆ నూర్వురయందున్= ఆ వందమంది సుతులలో; మధ్యముండైన= నడిమివాడైన; మధుచ్ఛందుండు= మధుచ్ఛందుడనేవాడు; ఏఁబండ్రు దమ్ములున్= ఏబది మంది సోదరులు; తానును= తాను; నమస్కరించి= నమస్కారంచేసి; తండ్రీ= ఓ తండ్రీ!; నీ చెప్పిన క్రమంబునన్= నీవు చెప్పిన విధంగా; శునశ్శేఫుండు= ఈ శునశ్శేఫుడు; మాకు+అన్నయని= మాకు అన్న అనే భావంతో; నమస్కరింపంగలవారము= నమస్కరించి గౌరవిస్తాము; అనవుడు= అనగా; సంతసించి= సంతోషంపొంది; మంత్రదర్శియైన= మంత్రాన్ని దర్శించగలిగిన (బ్రహ్మను స్తుతించి బంధనాలు విడిపించుగోగల మంత్రద్రష్ట అయిన); శునశ్శేఫుని= శునశ్శేఫుడు అనేవానిని; వారలయందున్= మధుచ్ఛందునితో కూడిన యాభైమంది సోదరులలో; పెద్దన్+చేసి= పెద్దవానినిగాచేసి; మధుచ్ఛందునకున్= సుతుడైన మధుచ్ఛందునకు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ సమయంలో తండ్రి ఇచ్చిన శాపానికి భయపడి విశ్వామిత్రసుతులలో నడిమివాడైన మధుచ్ఛందుడనే వాడు యాభైమంది సోదరులతోవచ్చి తండ్రికి నమస్కారంచేసి 'ఓ తండ్రీ నీవు చెప్పిన విధంగా ఈ శునశ్శేఫుని మేము మాకు

అన్నగా భావించి మన్నించి నమస్కరిస్తాము' అని అనగా విశ్వామిత్రుడు ఆనందించి మంత్రద్రష్ట అయిన శునశ్శేపుని వారిలో పెద్దవాణ్ణి చేసి (ఆ యాభై మందికి అగ్రజుని గావించి) మధుచ్ఛందునితో ఇలా అన్నాడు.

**ఆ. పాడి సెడక వీఁడె నేఁడు నీకతమునఁ, గొడుకు కలిగె నేఁడు కొడుకులార!**
**కడుపులార మీరు గొడుకులఁ గనుఁ డింకఁ, బ్రీతితోడ దేవరాతుఁ గూడి. 497**

**ప్రతి :** కొడుకులార= ఓ సుతులారా!; నేఁడు= ఈ రోజు; పాడి+చెడక= ధర్మం తప్పకుండా ప్రవర్తించడంవల్ల; నీ కతమునన్= నీ మూలమున; వీఁడె= ఈ శునశ్శేపుడు అనేవాడే; నేఁడు= ఈనాడు; కొడుకు కలిగెన్= కొడుకు అయ్యాడు (కొడుకుగా లభించాడు); కడుపులార= మీమీ కడుపారా; ప్రీతితోడన్= ప్రేమతో; దేవరాతున్+కూడి= ఈ దేవరాతునితో కలసి మెలసి ఉండి; ఇంకన్= ఇకపైని; మీరు= మీరందరూ; కొడుకులన్ కనుఁడు= సుతులను పొందండి.

**తా :** ఓ కుమారులారా! తండ్రిమాటను వినాలనే ధర్మం మీరు తప్పని కారణంగా ఈ శునశ్శేపుడు నాకు కొడుకయ్యాడు. మీరంతా ఈ దేవరాతునితో ప్రేమతో ప్రవర్తించి మీరు కడుపారా సుతులను పొందండి.

**వ. అని పలికె, అట్లు శునశ్శేపుండు దేవతలచేత విడివడుటం జేసి, దేవరాతుండయ్యె. మధుచ్ఛందుండు మొదలైన యేఁబండ్రును దేవరాతునకుఁ దమ్ములైరి. పెద్దలైన యష్టక, హారీత, జయంత, సుమదాదు లేఁబండ్రును వేఱై చనిరి. ఈ క్రమంబున విశ్వామిత్రు కొడుకులు రెండు విధంబులైనం, బ్రవరాంతరంబు గలిగె నని చెప్పి శుకుం డిట్లనియె.**

**ఆ పురూరవు కొడుకగు నాయువునకు నహుషుండును, క్షత్రవృద్ధుఁడును, రజియును, రంభుండును, ననేనస్సు ననువారు పుట్టిరి. అందు క్షత్రవృద్ధునకుఁ గుమారుండగు సుహోత్రునకుఁ గాశ్యుండుఁ గుశుండు గృత్స్నమదుండను ముగ్గురు గలిగిరి. ఆ కృత్స్నమదునకు శునకుండును, శునకునకు శౌనకుండును, న మ్మహాత్మునకు బహ్వృచప్రవరుండును జన్మించిరి. ఆ బహ్వృచప్రవరుండు తపోనియతుండై చనియె. కాశ్యునకుఁ గాశియుఁ, గాశికి రాష్ట్రుండును, రాష్ట్రునకు దీర్ఘతపుండు నుదయించిరి. 498**

**ప్రతి :** అనిపలికెన్= విశ్వామిత్రుండు ఆ విధంగా అన్నాడు; అట్లు= ఆ విధంగా; శునశ్శేపుండు= శునశ్శేపుడు; దేవతలచేతన్= దేవతలచే; విడివడుటన్+చేసి= విడుదల అవడంచేత; దేవరాతుండయ్యెన్= దేవరాతుడు అనే పేరుగల వాడయ్యాడు; మధుచ్ఛందుండు మొదలైన= మధుచ్ఛందుడు మొదలుగాగల;ఏఁబండ్రును= ఏబదిమంది; దేవరాతునకున్= ఈ దేవరాతుడనేవానికి; తమ్ములైరి= తమ్ములు అయ్యారు; పెద్దలైన= పెద్ద వాళ్ళయిన; అష్టక, హారీత, జయంత, సమద+ఆదులు= సమదుడు మొదలైన ఏఁబండ్రును= ఏబదిమంది; వేఱైచనిరి= వేరుగా వెళ్ళిపోయారు; ఈ క్రమంబునన్= ఈ విధంగా; విశ్వామిత్రు కొడుకులు= విశ్వామిత్రుని సుతులు; రెండు విధంబులైనన్= రెండు విధాలుకాగా; ప్రవర+అంతరంబుగలిగెన్= పెద్దవారైన అష్టకాదులకు ఒక ప్రవర; దేవరాతాదులకు మరొక ప్రవర ఏర్పడ్డాయి; అనిచెప్పి= ఈ విధంగా పలికి; శుకుండిట్లు అనియెన్= శుకమహర్షి ఇలా అన్నాడు.

ఆ పురూరవు కొడుకు+అగు= ఆ పురూరవుడు అనేవానికి కొడుకైన; ఆయువునకున్= ఆయువు అనేవానికి; నహుషుండును= నహుషుడు; క్షత్రవృద్ధుడును= క్షత్ర వృద్ధుడు; రజియును= రజి; రంభుండును= రంభుడు; అనేనస్సును=

అనే నస్సు; అనువారు పుట్టిరి= అనే పేర్లు గలవారు జన్మించారు; అందున్= వారిలో; క్షత్రవృద్ధునకున్= పురూరవుని సుతుడైన క్షత్రవృద్ధునకు; కుమారుడగు= సుతుడైన; సుహోత్రునకున్= సుహోత్రుడు అనేవానికి; కాశ్యుండున్= కాశ్యుడు, కుశుండున్= కుశుడు; కృత్స్నమదుండు+అను= కృత్స్నమదుడు అనగా; ముగ్గురు గలిగిరి= ముగ్గురు కొడుకులు కలిగారు; ఆ కృత్స్నమదునకున్= ఆ మూడవ కొడుకైన కృత్స్నమదునకు; శునకుండును= శునకుడు; శునకునకున్= ఆ శునకునకు; శౌనకుండును= శౌనకుడు; ఆ+మహాత్మునకున్= ఆ గొప్పవాడైన శౌనకునకు; బహ్వృచప్రవరుండును= బహ్వృచప్రవరుడు; జన్మించిరి= పుట్టారు; ఆ బహ్వృచప్రవరుండు= ఆ బహ్వృచ ప్రవరుడనేవాడు; తపోనియతుండైచనియెన్= తపస్సు నియమంగా గలవాడై వెళ్ళాడు; కాశ్యునకున్= కాశ్యుడనేవానికి; కాశియున్= కాశి అనేవాడు; కాశికిన్= ఆకాశి అనేవానికి; రాష్ట్రుండును= రాష్ట్రుడు; రాష్ట్రునకున్= రాష్ట్రునకు; దీర్ఘతపుండును= దీర్ఘతపుడు; ఉదయించిరి= జన్మించారు.

**తా :** అలా విశ్వామిత్రుడు మధుచ్ఛందాదులతో చెప్పాడు. శునశ్శేఫుడు దేవతలచేత విముక్తి పొందడంచేత దేవరాతుడని పేరు పొందాడు. మధుచ్ఛందుడు మొదలైన ఏబదిమంది దేవరాతునకు సోదరులయ్యారు. పెద్దవాళ్ళైన అష్టక, హారీత, జయంత, సమదులు మొదలైనవారు ఏబదిమంది వేరుగా వెళ్ళిపోయారు. ఈ క్రమంలో విశ్వామిత్రుని సుతులు, రెండు విధాలుకాగా విశ్వామిత్ర సుతులలోనే మరొక ప్రవర కలిగింది అని చెప్పి భాగవతాన్ని పరీక్షిత్తుకు చెప్పే శుకుడు ఇలా అన్నాడు.

ఆ పురూరవుని కొడుకైన ఆయువునకు నహుషుడు, క్షత్రవృద్ధుడు, రజి, రంభుడు, అనేనస్సు అనేవారు జన్మించారు. వారిలో క్షత్ర వృద్ధుడు అనేవానికి కుమారుడైన సుహోత్రునకు కాశ్యుడు, కుశుడు కృత్స్నమదుడు అనే ముగ్గురు సుతులు కలిగారు. ఆ కృత్స్నమదునకు శునకుడు, శునకునకు శౌనకుడు, గొప్పవాడైన శౌనకునకు బహ్వృచ ప్రవరుడు జన్మించారు. ఆ బహ్వృచప్రవరుడు నియమవంతుడై తపస్సు చేసికోవడానికి వెళ్ళాడు.

ఇక కాశ్యుడు అనేవానికి కాశి, కాశికి రాష్ట్రుడు, రాష్ట్రునకు దీర్ఘతపుడు అనేవారు జన్మించారు.

**విశే :** విశ్వామిత్రుని కొడుకులు రెండు భాగాలుగా విడిపోయారు. తండ్రి మాట విని శునశ్శేఫుని సోదరునిగా గ్రహించిన మధుచ్ఛందాదులు ఒకవర్గం, తండ్రి మాట వినక శాపగ్రస్తులైన అష్టక హారీత జయంత సమదాదులు వేరొక వర్గంగా ఏర్పడ్డారు. ఈ విధంగా విశ్వామిత్ర సుతులలో రెండు ప్రవరలు ఏర్పడ్డాయి. ప్రవర అంటే పై తరాల చరిత్ర.

**క. ఆ దీర్ఘతపుని కధికుఁడు, శ్రీదయితాంశమునఁ బుట్టె సేవ్యుం డాయు**
**ర్వేదజ్ఞుఁడు ధన్వంతరి, ఖేదంబులు వాయు నతనిఁ గీర్తన సేయన్. 499**

**ప్రతి :** ఆ దీర్ఘతపునికిన్= ఆ దీర్ఘతపుడనే రాష్ట్రుని కుమారునకు; అధికుఁడు= గొప్పవాడు; శ్రీదయితాంశమునన్= శ్రీకి ప్రియుడైన విష్ణుమూర్తి అంశతో; ఆయుర్వేదజ్ఞుఁడు= ఆయుర్వేదం తెలిసినవాడు; సేవ్యుండు= అందరిచే సేవింపదగినవాడు; ధన్వంతరి= ధన్వంతరి అనే పేరుతో; పుట్టెన్= జన్మించాడు; అతనిన్= ఆ ధన్వంతరిని; కీర్తనసేయన్= నుతించగా (కీర్తించగా); ఖేదంబులు+పాయున్= కష్టములు, బాధలు తొలగిపోతాయి.

**తా :** ఆ దీర్ఘతపుడనేవానికి విష్ణుమూర్తి అంశతో ఆయుర్వేదం తెలిసినవాడు, ఎల్లరు కొలువదగినవాడు అయిన 'ధన్వంతరి' జన్మించాడు. ఆ ధన్వంతరిని కీర్తనచేస్తే కష్టాలు బాధలు తీరుతాయి.

**వ. వాసుదేవాంశ సంభూతుండగు నా ధన్వంతరి, యజ్ఞభోగంబున కర్హుండు. అతనికిఁ గేతుమంతుండు, కేతుమంతునకు భీమరథుం, డతనికి దివోదాసుం డనం బరఁగు ద్యుమంతుం డుదయించిరి.**

**ఆ ద్యుమంతునకుఁ బ్రతర్దనుండు జన్మించెఁ. బ్రతర్దనుండు శత్రుజిత్తనియు, ఋతధ్వజం దనియుం జెప్పఁబడె, అతనికిఁ గువలయాశ్వుండు సంభవించె. 500**

**ప్రతి :** వాసుదేవ+అంశ సంభూతుండగు= శ్రీ విష్ణుమూర్తి అంశతో జన్మించిన; ఆ ధన్వంతరి= ఆ ధన్వంతరి; యజ్ఞభోగంబునకున్= యజ్ఞయాగాది క్రియలలో సమర్పించే హవిస్సులు స్వీకరించడానికి; అర్హుండు= తగినవాడు; అతనికిన్= ధన్వంతరికి; కేతుమంతుండు= కేతుమంతుడు; కేతుమంతునకున్= కేతుమంతునకు; భూమరథుండు= భూమరథుడు; అతనికిన్= భూమరథునకు; దివోదాసుండు+అనన్+పరఁగు= దివోదాసుడు అని పిలవబడే; ద్యుమంతుండు+ఉదయించిరి= ద్యుమంతుడు జన్మించారు; ఆ ద్యుమంతునకున్= ఆద్యుమంతుడు అనేవానికి; ప్రతర్దనుండు= ప్రతర్దనుండు; జన్మించెన్= జన్మించాడు; ప్రతర్దనుండు= ప్రతర్దనుడు; శత్రుజిత్తనియున్= శత్రుజిత్తు అని; ఋతధ్వజుండనియున్= ఋతధ్వజుడని కూడా; చెప్పన్+పడెన్= చెప్పబడ్డాడు (పిలువబడ్డాడు); అతనికిన్= ఆ ఋతధ్వజునకు; కువలయాశ్వుండు= కువలయాశ్వుడు; సంభవించెన్= కలిగాడు.

**తా :** శ్రీ విష్ణుమూర్తి అంశతో జన్మించిన ధన్వంతరి యజ్ఞంలోని హవిస్సులు స్వీకరింప అర్హుడు. ధన్వంతరికి కేతుమంతుడు, అతనికి భూమరథుడు, భూమరథునకు దివోదాసుడని చెప్పబడే ద్యుమంతుడు జన్మించారు. ఆ ద్యుమంతునకు ప్రతర్దనుడు జన్మించాడు. ఆ ప్రతర్దనుడు శత్రుజిత్తని, ఋతధ్వజుడని పిలువబడ్డాడు. ఆ ప్రతర్దనునకు కువలయాశ్వుడు జన్మించాడు.

**ఆ. వసుమతీశ! విను కువలయాశ్వభూభర్త, లలితపుణ్యు ఘను నలర్కుఁ గనియె**
**నాతఁ డేలె నేల నఱువదియాఱు వే, లేండ్లు వానిభంగి నేలె నెవఁడు? 501**

**ప్రతి :** వసుమతీ+ఈశ= ఓ రాజా (ఓ పరీక్షన్మహారాజా!); విను= వినుము; కువలయాశ్వభూభర్త= కువలయాశ్వుడనే పేరుగల భూపతి (రాజు); లలితపుణ్యున్= గొప్పపుణ్యం గలవానిని; ఘనున్= గొప్పవానిని; అలర్కున్+కనియెన్= అలర్కుడు అనేవానిని కన్నాడు; అఱువది యాఱు వేలేండ్లు= అరవైయారు వేల వత్సరాలు; నేలన్= ఈ భూమిని; ఆతఁడేలెన్= అతడు పరిపాలించాడు (ఆ అలర్కుడు పాలించాడు); ఎవఁడు?= ఈ భూమిపై మరొకడెవడు; వానిభంగిన్= ఆ అలర్కునివలె; ఏలెన్= పరిపాలించాడు? (పరిపాలించలేదు అని భావం).

**తా :** ఓ పరీక్షన్మహారాజా! కువలయాశ్వుడనే రాజు లలిత పుణ్యుడైన అలర్కుని కన్నాడు. ఆ అలర్కుడు భూమిని అరవై ఆరువేల ఏండ్లు పాలించాడు. అలర్కునివలె భూమిని పాలించినవారు లేరు.

**వ. అ య్యలర్కునకు సన్నతియు, నతనికి సునీతుండు, నతనికి సుకేతనుండును, నతనికి ధర్మకేతువును, నతనికి సత్యకేతువును, నాతనికి ధృష్టకేతువును, నా ధృష్టకేతువునకు సుకుమారుండును, నా సుకుమారునకు వీతిహోత్రుండును, వీతిహోత్రునకు భర్గుండును, భర్గునకు భార్గభూమియు జనియించిరి. 502**

**ప్రతి :** ఆ+అలర్కునకున్= ఆ అలర్కుడు అనేవానికి; సన్నతియున్= సన్నతి; అతనికిన్= ఆ సన్నతికి; సునీతుండున్= సునీతుడు; అతనికిన్= సునీతునకు; సుకేతనుండును= సుకేతనుడు; అతనికిన్= ఆ సుకేతునకు; ధర్మకేతువును= ధర్మకేతువు; అతనికిన్= ఆ ధర్మకేతువునకు; సత్యకేతువును= సత్యకేతువు; ఆతనికిన్= ఆ సత్యకేతువునకు; ధృష్టకేతువునున్= ధృష్టకేతువు; ఆ ధృష్టకేతువునకు= ఆ ధృష్టకేతువునకు; సుకుమారుండును= సుకుమారుడు; ఆ సుకుమారునకున్= ఆ సుకుమారుడికి;

వీతిహోత్రుండునున్= వీతిహోత్రుడు అనేవాడు; వీతిహోత్రునకు= వీతిహోత్రుడనేవానికి; భర్గుండును= భర్గుడు; భర్గునకున్= ఆ భర్గునకు; భార్గభూమియున్ జనియించిరి= భార్గభూమి అనేవాడు జన్మించారు.

**తా :** ఆ అలర్కునకు సన్నతి, వానికి సునీతుడు, వానికి సుకేతనుడు, వానికి ధర్మకేతువు వానికి సత్యకేతువు, వానికి ధృష్టకేతువు, అతనికి సుకుమారుడు, అతనికి వీతిహోత్రుడు, అతనికి భర్గుడు, ఆ భర్గునకు భార్గభూమి జన్మించారు.

**ఆ. వాఁడు తుదయుఁ గాశ్యవసుమతీశుం డాది, యైనవారు గాశు లనఁగ నెగడి**
**రవనిమీఁద వార లా క్షత్రవృద్ధుని, వంశజాతు లగుచు వంశవర్య! 503**

**ప్రతి :** వంశవర్య= వంశశ్రేష్ఠా!; కాశ్యవసుమతీశుండు= కాశ్యుడనే రాజు; ఆది= మొదలు; వాఁడు తుదయున్= ఈ భార్గభూమి చివరివాడు; ఐనవారు= అయినట్టివారు; కాశులనఁగన్= కాశులు అనే పేరుతో; వారలు= వారంతా; క్షత్రవృద్ధుని= వంశ జాతులు అగుచున్= క్షత్ర వృద్ధుని వంశంవారై; అవనిమీఁదన్= భూమిపై; నెగడిరి= ఒప్పిరి.

**తా :** ఓ వంశశ్రేష్ఠా! కాశ్యవసుమతీశుని నుండి ఈ భార్గభూమి వరకు గల రాజులు క్షత్రవృద్ధుని వంశంలో పుట్టినవారై, కాశులనే పేరుతో భూమిపై ప్రసిద్ధి పొందారు.

**వ. మఱియు, క్షత్రవృద్ధునికి రెండవకొడుకగు కుశునికిఁ బ్రీతియును, వానికి సంజయుండును, సంజయునికి జయుండును, జయునికిఁ గృతుండును, గృతునకు హర్యధ్వనుండును, హర్యధ్వనునకు సహదేవుండును, సహదేవునికి భీముండును, భీమునకు జయత్సేనుండును. జయత్సేనునకు సంకృతియును, సంకృతికి జయుండును, జయునికి క్షత్రధర్ముండును బుట్టిరి. వీరలు క్షత్రవృద్ధుని వంశంబునం గల రాజులు. రంభునికి రభసుండును, రభసునకు గంభీరుండును, గంభీరునికిఁ గృతుండును గలిగిరి. ఆ కృతునికి బ్రహ్మకులంబు పుట్టె. అ య్యనేనసునకు శుద్ధుండును, శుద్ధునకు శుచియు, శుచికి బ్రహ్మసారథియైన త్రికకుత్తును జనించిరి. అతనికి శాంతరజుండు పుట్టె. నతండు విజ్ఞానవంతుండు, కృతకృత్యుండు, విరక్తుండు నయ్యె. 504**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; క్షత్రవృద్ధునికిన్= క్షత్రవృద్ధుడు అనేవానికి; రెండవ కొడుకగు= రెండవ సుతుడైన; కుశునికిన్= కుశునికి; ప్రీతియును= ప్రీతి; వానికిన్= ఆ ప్రీతికి; సంజయుండును= సంజయుడు; సంజయునికిన్= సంజయునికి; జయుండును= జయుడు; జయునికిన్= జయునికి; కృతుండును= కృతుడు; కృతునకున్= కృతుడు అనేవానికి; హర్యధ్వనుండును= హర్యధ్వనుడు; హర్యధ్వనునకున్= హర్యధ్వనుడు అనేవానికి; సహదేవుండును=సహదేవుడు; సహదేవునికిన్= సహదేవునికి; భీముండును= భీముడు; భీమునకున్= భీముడు అనేవానికి; జయత్సేనుండును= జయత్సేనుడు; జయత్సేనునకున్= జయత్సేనుడు అనేవానికి; సంకృతియును= సంకృతి; సంకృతికిన్= సంకృతికి; జయుండును= జయుడు; జయునికిన్= జయుడు అనేవానికి; క్షత్రధర్ముండును= క్షత్రధర్ముడు; పుట్టిరి= జన్మించారు; వీరలు= వీరందరూ; క్షత్రవృద్ధుని వంశంబునన్= క్షత్ర వృద్ధవంశంలో; కలరాజులు= ఉన్న రాజులు; రంభునికిన్= రంభుడనేవానికి; రభసుండును= రభసుడు; రభసునకున్= రభసునికి; గంభీరుండును= గంభీరుడు; గంభీరునికి= గంభీరుడనేవానికి; కృతుండును= కృతుడు; కలిగిరి= జన్మించారు; ఆ కృతునికిన్= ఆ కృతుడనేవానికి; బ్రహ్మకులంబుపుట్టెన్= బ్రాహ్మణ వంశం కల్గింది; ఆ+అనేనసునకున్= ఆ అనేనసుడనేవానికి; శుద్ధుండును= శుద్ధుడు; శుద్ధునకున్= శుద్ధునికి; శుచియున్= శుచి అనేవాడు; శుచికిన్= శుచికి;

బ్రహ్మసారథి+ఐన= బ్రహ్మకు సారథ్యం సలుపు; త్రికకుత్తునున్= త్రికకుత్తు అనేవారు; జనించిరి= పుట్టారు; అతనికిన్= త్రికకుత్తునకు; శాంతరజుండు పుట్టెన్= శాంతరజుడు కలిగాడు; అతండు= ఆ శాంతరజుడు; విజ్ఞానవంతుండు= విజ్ఞానంతో కూడినవాడు; కృతకృత్యుండు= చరితార్థుడు; విరక్తుండు= విరాగి; అయ్యెన్= అయినాడు.

**తా :** క్షత్రవృద్ధుని రెండవ కొడుకైన కుశునకు ప్రీతి, వానికి సంజయుడు, వానికి జయుడు, వానికి కృతుడు, వానికి హర్యధ్వనుడు, వానికి సహదేవుడు, వానికి భీముడు, వానికి జయత్సేనుడు, వానికి సంకృతి, వానికి జయుడు వానికి క్షత్రధర్ముడు పుట్టారు. వీరంతా క్షత్రవృద్ధుని వంశంలోగల రాజులు.

రంభునికి రభసుడు, వానికి గంభీరుడు, వానికి కృతుడు జన్మించారు. ఆ కృతునకు బ్రహ్మకులం పుట్టింది. అనేనసునకు శుద్ధుడు, వానికి శుచి, శుచికి బ్రహ్మకు సారథ్యంచేసే త్రికకుత్తు జన్మించారు. ఆ త్రికకుత్తుకు శాంతరజుడు పుట్టాడు. ఆ శాంతరజుడు విజ్ఞాని, కృతకృత్యుడు విరక్తుడు.

**సీ. రజియనువానికి రాజేంద్ర! యేనూఱు కొడుకులు గలిగిరి ఘోరబలులు**
**వేల్పులెల్లను వచ్చి వేఁడిన నా రజి, దైతులం బెక్కంద్ర ధరణిఁ గూల్చి**
**నాకంబు దేవేంద్రునకు నిచ్చె నిచ్చిన రజికాళ్ళ కెఱఁగి సురప్రభుండు**
**వెండియు నతనికి విబుధదేహము నిచ్చి సంతోషబుద్ధి నర్చన మొనర్చె**

**ఆ. అంత నా రజి మృతుఁడైన నతని పుత్త్రు, లమరవిభుఁడు దమ్ము నడిగికొనిన**
**నీక యింద్రలోక మేలిరి యాగభో, గములు పుచ్చుకొనిరి గర్వమంది. 505**

**ప్రతి :** రాజేంద్ర= ఓ పరీక్షన్మహారాజా! రజియనువానికిన్= రజి అనేవానికి; ఏ నూఱుకొడుకులు= ఐదువందలమంది కొడుకులు; ఘోరబలులు= భయంకరమైన బలం గలవారు; కలిగిరి= జన్మించారు; వేల్పులెల్లను= అందరు దేవతలు; వచ్చి వేఁడినన్= వచ్చి ప్రార్థింపగా; ఆ రజి= ఆ రజి అనేవాడు; పెక్కంద్రన్ దైత్యులన్ ధరణిన్ కూల్చి= ఎందరో రాక్షసులను నేలగూల్చి; నాకంబు= స్వర్గం; దేవేంద్రునకున్= దేవేంద్రునకు; ఇచ్చెన్= ఇచ్చినాడు; ఇచ్చినన్= అలా ఇవ్వగా; సురప్రభుండు= దేవపతి దేవేంద్రుడు; రజికాళ్ళకు+ఎఱఁగి= రజి పాదాలకు నమస్కరించి; అతనికిన్= ఆ రజి అనేవానికి; వెండియున్= మరల; విబుధదేహమున్ ఇచ్చి= దేవతల దేహాన్ని ఇచ్చి; సంతోషబుద్ధిన్= సంతోషంతో కూడిన బుద్ధితో; అర్చన మొనర్చె= పూజించినాడు; అంతన్= అటుపిమ్మట; ఆ రజి= ఆ రజి అనేవాడు; మృతుఁడైనన్= మరణింపగా; అతనిపుత్రులు= అతని కొడుకులు; అమరవిభుఁడు= దేవేంద్రుడు; తమ్మున్ అడిగికొనినన్= తమను అడిగినప్పటికి కూడా; ఈక= ఇవ్వకుండా; ఇంద్రలోకమేలిరి= ఇంద్రలోకాన్ని పాలించారు; గర్వమంది= గర్వం పొంది; యాగ భోగములు= యజ్ఞసంబంధమైన హవిర్దాన గ్రహణ భోగాలను; పుచ్చుకొనిరి= స్వీకరించారు.

**తా :** ఓ పరీక్షన్మహారాజా! రజి అనేవానికి అధికమైన బలంగల ఐదువందల మంది కొడుకులు జన్మించారు. దేవతల ప్రార్థనలు విని రజి ఎందరో రాక్షసులను చంపి స్వర్గాన్ని దేవేంద్రునకు ఇచ్చాడు. దేవేంద్రుడు కృతజ్ఞతగా రజి పాదాలకు నమస్కరించి, అతనికి దేవతాశరీరాన్ని ఇచ్చాడు. సంతోషంగా రజిని అర్చించాడు. కొంతకాలానికి రజి మృతి చెందాడు. అతని ఐదువందలమంది సుతులు దేవేంద్రుడు ప్రార్థించినా వినకుండా స్వర్గలోకాన్ని తామే పాలించారు. గర్వంతో యజ్ఞయాగాదులలో హవిస్సులను కూడా వారు స్వీకరించారు.

**క. వేలుపులఱేఁడు గురుచే, వేలిమిఁ బెట్టించి బలిమి వెలయఁగ నిజ దం**
**భోలిని రజిసుతులను ని, ర్మూలము గావించి స్వర్గముం గైకొనియెన్. 506**

**ప్రతి :** వేలుపులఱేఁడు= దేవతల రాజు; గురుచేన్= గురువైన బృహస్పతిచేత; వేలిమిన్ పెట్టించి= హోమం కావించి; బలిమి వెలయఁగన్= తనకు ఆ హోమప్రభావంచే బలంరాగా; నిజదంభోలిన్= తన వజ్రాయుధంతో; రజిసుతులను= రజి కొడుకులు ఐదువందల మందిని; నిర్మూలము+కావించి= నిర్మూలించి (చంపి); స్వర్గమున్ కైకొనియెన్= స్వర్గాన్ని కైవసం చేసికొన్నాడు.

**తా :** దేవతల రాజు ఇంద్రుడు దేవగురువైన బృహస్పతిచే హోమం చేయించి, ఆ హోమప్రభావంతో బలాన్నిపొంది తన వజ్రాయుధంతో రజి కుమారులను ఐదువందల మందినీ చంపి స్వర్గాన్ని తన హస్తగతం చేసికొన్నాడు.

**వ. అది యట్లుండె నహుషునకు యతియు, యయాతియు, సంయాతియు, నాయాతియు, వియతియుఁ గృతియు నన నార్గురు కొడుకులు దేహికి నింద్రియంబుల చందంబున సంభవించిరి. అందుఁ బెద్దకొడు కగు యతికి రాజ్యం బిచ్చిన, నతండు విరక్తుండై. 507**

**ప్రతి :** అది అట్లు ఉండెన్= అది అలా జరిగింది; నహుషునకున్= నహుషుడనే వానికి; యతియున్, యయాతియున్, సంయాతియున్, నాయాతియున్, వియతియున్ కృతియున్ అనన్= యతి, యయాతి, సంయాతి, ఆయాతి, వియతి, కృతి, అనే పేర్లుగల; ఆర్గురు కొడుకులు= ఆరుగురు సుతులు; దేహికిన్= దేహము గలవానికి (మానవునకు); ఇంద్రియంబుల చందంబునన్= ఇంద్రియాలవలె; సంభవించిరి= జన్మించారు; అందున్= వారిలో; పెద్దకొడుకగు= పెద్దవాడైన; యతికిన్= యతి అనేవానికి; రాజ్యంబు+ఇచ్చినన్= రాజ్యాధికారం ఇవ్వగా; అతండు= ఆ యతి అనే పెద్దకొడుకు; విరక్తుండై= ఏ విషయమునందును ఇచ్ఛ లేనివాడై...

**తా :** అది అలా ఉండగా నహుషునకు యతి, యయాతి, సంయాతి, ఆయాతి, వియతి, కృతి అనబడే ఆరుగురు కొడుకులు ప్రాణికి, పంచేంద్రియాలు మరియు మనస్సు అనే ఆరు ఇంద్రియాలవలె జన్మించారు. వారిలో పెద్ద కొడుకైన యతికి నహుషుడు రాజ్యం ఇయ్యగా అతడు విరాగియై

**విశే :** విశ్వామిత్రుడు సృష్టికి ప్రతి సృష్టి చేసినవాడు. వైదికచ్ఛందం తర్వాత సృష్టించబడింది లౌకికచ్ఛందం. విశ్వామిత్ర సంభవుడు (కొడుకు) మధుచ్ఛంద. ఆయన వంశపరంపరలో యతి, యయాతి, సంయాతి, నాయాతి, వియతి, కృతి అనే వారు సంభవిస్తారు. ఇవన్నీ లౌకికఛందస్సంబంధితమైన పేర్లుకావటం విశేషం. మధుచ్ఛంద అనగా స్రవించే మధువు, ఛందంకూడా అంతే. యతులతో ఒప్పారి కృతి చివరగా కృతి ఉద్భవిస్తుంది.

**క. రాజ్యంబు పాపమూలము, రాజ్యముతో నొడ లెఱుంగ రాదు సుమతియున్**
**రాజ్యమునఁ బూజ్యు నెఱుఁగఁడు, రాజ్యము గీజ్యంబు ముక్తిరతులకు నేలా? 508**

**ప్రతి :** రాజ్యంబు= రాజ్యం; పాపమూలము= పాపాలు చేయడానికి మూలకారణం (మొదలు); రాజ్యముతోన్= ఈ రాజ్యం పొందడంవలన; ఒడలెఱుంగన్‌రాదు= ఒళ్ళు తెలియదు అనగా మంచిచెడ్డల వివేచన తెలియదు; సుమతియున్= మంచి బుద్ధి గల జ్ఞానికూడా; రాజ్యమునన్= ఈ రాజ్యంవలన (ఈ రాజ్యాధికారం వల్ల); పూజ్యున్ ఎఱుఁగఁడు= ఎవరైతే

పరమపూజ్యుడో వానిని గుర్తించలేడు; ముక్తిరతులకున్= మోక్షం పై కోరిక గలవారికి; రాజ్యము గీజ్యంబు ఏలా= ఈ రాజ్యాదులు ఎందులకు? అవసరం లేదు అని భావం.

**తా :** రాజ్యం పాపానికి మొదలు. ఈ రాజ్యం వస్తే ఒళ్ళు తెలియని గర్వం వస్తుంది. ఎంతటి జ్ఞానియైన రాజ్యాధికారం వస్తే ఎవరు పూజింపదగినవారో వారిని గుర్తించలేడు. అయినా ముక్తికోరేవారికి ఈ రాజ్యాలు గీజ్యాలు అవసరం లేదు కదా!

**వ. అని పలికి, వాఁడు రాజ్యంబునకుం బాసి చనియె. 509**

**ప్రతి :** అని పలికి= ఈ విధంగా తండ్రితో మాట్లాడి; వాఁడు= నహుష సుతుడైన యతి అనే పెద్దకొడుకు; రాజ్యంబునకున్ పాసి చనియెన్= రాజ్యాన్ని వదలి వెళ్ళిపోయాడు.

**తా :** ఈ విధంగా మాట్లాడి యతి అనేవాడు రాజ్యాన్ని వదలి వెళ్ళిపోయాడు.

**క. ఆ నహుషుడు మఖశతమును, మానుగఁ గావించి యింద్రమానినిఁ గవియం**
**బూని మునీంద్రులు మోచిన, యానముపై నుండి కూలె నహియై నేలన్. 510**

**ప్రతి :** ఆ నహుషుఁడు= ఆ నహుషుడనేవాడు; మఖశతమును= వంద యజ్ఞాలను; మానుగన్ కావించి= చక్కగాచేసి; ఇంద్రమానినిన్= ఇంద్రుని భార్య శచీదేవిని; కవియన్పూని= పొందే ప్రయత్నంచేసి; మునీంద్రులు= మునిశ్రేష్ఠులు; మోచిన యానముపైన్+ఉండి= మోస్తున్న పల్లకిమీదనుండి; అహియై= పామై; నేలన్ కూలెన్= భూమిపై పడ్డాడు.

**తా :** ఆ నహుషుడు నూరు యజ్ఞాలుచేసి, ఇంద్రపదవిని పొంది, ఇంద్రుని భార్య శచీదేవిని పొంద గోరి, మహర్షులు మోసే పల్లకినుండి సర్పమై జారి భూమిపై పడ్డాడు.

**విశే :** నహుషుడు నూరు యజ్ఞాలు చేశాడు. దాని ఫలితంగా ఇంద్ర పదవి లభించింది. యజ్ఞం అనేది పవిత్ర కార్యం. అటువంటి నూరు యజ్ఞాలు చేయడం అందరివల్లా సాధ్యం కాదు. ఇన్ని యజ్ఞాలు చేసినా ఇంద్రపదవి పొందినా నహుషుని మనసులో పావిత్ర్యం లేదు. తాను ఇంద్రపదవి పొందాడు. కాన ఇంద్రుని భార్య పరమపతివ్రత శచీదేవిని పొందగోరాడు. మహర్షులు పల్లకిపై నహుషుని శచీదేవి వద్దకు తీసికొనిపోతున్నారు. ఆ మహర్షులలో అగస్త్యుని శాపంవల్ల నహుషుడు సర్పమై నేలకూలాడు.

ఎంత జ్ఞానం ఉన్నా, ఎన్ని యజ్ఞాలు చేసినా, ఎంత ఎత్తుకు ఎదిగి ఇంద్ర పదవినందినా మానసిక పావిత్ర్యం లేనివానికి అధోగతి తప్పదు అని నహుషుని కథ అందరికి తెలియజేస్తుంది.

**ఉ. అన్నయుఁ దండ్రియుం జన యయాతి మహీపతియై చతుర్దిశల్**
**పన్నుఁగఁ గావఁ దమ్ములకుఁ బాలిడి శుక్రుని కూఁతురున్ సుసం**
**పన్న గుణాభిరామ వృషపర్వుని కూఁతురు నోలి నాంద్రుగా**
**సన్నయశాలి యా ధరణి చక్రధురంధరుఁ డయ్యెఁ బేర్మితో. 511**

**ప్రతి :** అన్నయున్= అన్న అయిన యతి; తండ్రియున్= తండ్రి అయిన నహుషుడు; చనన్= వెళ్ళిపోగా; యయాతి= యయాతి అనేవాడు; మహీపతియై= రాజై; చతుర్దిశల్= నాల్గుదిక్కులు; పన్నుఁగన్ కావన్= చక్కగా రక్షించుటకు;

తమ్ములకున్= తన సోదరులైన సంయాతి మొదలయిన నలుగురికి; పాలు+ఇడి= భాగాన్నిచ్చి; శుక్రుని కూఁతురున్= శుక్రాచార్యుని కొమరితను; సుసంపన్న గుణ+అభిరామన్= మంచి సుగుణములచే అందమైన; వృషపర్వుని కూఁతురున్= వృషపర్వుడనే రాజు కొమరితను; ఓలిన్= క్రమంగా; ఆంద్రుగాన్= భార్యలుగా; ఆ+నయశాలి= ఆ నీతివేత్త; పేర్మితోన్= ఆధిక్యంతో; ఈ ధరణి చక్రధురంధరుడయ్యెన్= ఈ భూచక్రభారాన్ని (రాజ్యభారాన్ని) వహించాడు.

**తా :** అన్న అయిన యతి విరక్తుడు కాగా, తండ్రి అయిన నహుషుడు ఇంద్రలోకమున కేగగా యయాతి రాజై తన నలుగురు సోదరులకు నాల్గుదిక్కుల రాజ్యాన్ని భాగంగా ఇచ్చి, శుక్రుని కొమరితను, వృషపర్వుని కూతురును (ఇద్దరిని) వివాహమాడి న్యాయవర్తనుడైన యయాతి రాజ్యభారాన్ని వహించాడు.

**వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 512**

**ప్రతి :** అనినన్= అని శుకయోగీంద్రుడు చెప్పగా; విని= ఆలకించి; పరీక్షిత్+నర+ఇంద్రుండు= పరీక్షిన్మహారాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అనగా విని పరీక్షిత్తు అనే రాజు ఇలా అన్నాడు.

## ✤ యయాతి చరిత్రము ✤

**ఆ. పార్థివుఁడు యయాతి బ్రహ్మర్షిభార్గవుఁ, డల్లుఁడగుట మామ యగుట యెట్లు**
**రాజు రాచకూఁతు రతిసేయఁ దగుఁగాక, విప్రకన్య నొంద విహిత మగునె? 513**

**ప్రతి :** పార్థివుఁడు= రాజు; యయాతి; బ్రహ్మర్షి భార్గవుఁడు= బ్రహ్మ ఋషి అయిన భృగువంశంలోగల శుక్రాచార్యుడు; అల్లుఁడగుట= అల్లుడుగా అవడం; మామయగుట= మామగా అవడం; ఎట్లు= ఏ విధంగా జరిగింది?; రాజు= ఒక క్షత్రియుడు; రాచ కూఁతున్= ఒక క్షత్రియకన్యను; రతి సేయన్ తగున్+కాక= ఆసక్తి వహించడం న్యాయం అవుతుంది కాని; విప్రకన్యన్= బ్రాహ్మణ కన్యను; ఒందన్= స్వీకరించడం; విహితము+అగునె= తగునా?

**తా :** రాజైన యయాతి అల్లుడుగను, భృగువంశశ్రేష్ఠుడు, బ్రహ్మఋషి అయిన శుక్రాచార్యుడు మామగా అవడం ఏ విధంగా జరిగింది? క్షత్రియుడు క్షత్రియ కన్యను వివాహమాడుటకు కోరవచ్చు గాని విప్రకన్యను (బ్రాహ్మణకన్యను) స్వీకరించుట తగునా?

**వ. అనిన శుకుం డిట్లనియె. 514**

**ప్రతి :** అనినన్= అని ప్రశ్నించగా; శుకుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా బదులు పలికాడు.

**తా :** ఆ పరీక్షిత్తు ప్రశ్నకు శుకమహర్షి ఇలా బదులు చెప్పాడు.

**సీ. దనుజేంద్రుకూఁతురు తరళాక్షి శర్మిష్ఠ పురములో నొకనాఁడు ప్రొద్దువోక**
**వేలసంఖ్యను చెలుల్ వెంటరా గురుసుత యగు దేవయానితో నాట మరగి**
**పూచిన యెలదోఁట పొంత జొంపము గొన్న క్రొమ్మావిచేరువ కొలఁకుఁ జేరి**
**యందుఁ దమ్ములతేనె లాని చొక్కుచు మ్రోయు నళుల ఝుంకృతులకు నదరిపడుచు**

**ఆ. వలువ లూడ్చి కొలఁకు వడిఁ జొచ్చి తమలోనఁ, బెల్లురేఁగి నీటఁ జల్లులాడ**
**నందినెక్కి మౌళి నిందురోచులు పర్వ, శూలి వచ్చెఁ గొండచూలితోడ. 515**

**ప్రతి :** దనుజేంద్రు కూఁతురు= దానవరాజు వృషపర్వుని కొమార్తె; తరళ+అక్షి శర్మిష్ఠ= చంచలాక్షి శర్మిష్ఠ అనే పేరు గలది; పురములోన్= తన పట్టణంలో; ఒకనాఁడు= ఒకరోజున; ప్రొద్దుపోక= కాలం గడవక (తోచక); వేలసంఖ్యను చెలుల్ వెంటరాన్= వేలమంది సఖీజనం వెంబడిరాగా; గురుసుత+అగు దేవయానితోన్= గురువుగారైన శుక్రాచార్యుని కొమార్తె అయిన దేవయానితో; ఆటమరగి= ఆటలలో ఇష్టాన్ని చూపుతూ; పూచిన యెలదోఁట పొంత= పుష్పించిన లేత పూదోట సమీపంలో; జొంపముగొన్న= గుబురుగా ఉన్న; క్రొమ్మావిచేరువ= కొత్త మామిడి చెట్టుదగ్గర; కొలఁకున్+చేరి= సరస్సును చేరి; అందున్= ఆ సరోవరంలో; తమ్ముల తేనెలు ఆని= పద్మాలలోని మకరందాన్ని తాగి; చొక్కుచున్= ఆనందిస్తూ; మ్రోయు= చప్పుడు చేస్తున్న (ఝుంకారాలు చేస్తున్న); అళుల ఝుంకృతులకున్= తుమ్మెదల ధ్వనికి; అదరిపడుచున్= తుళ్లిపడుతూ; వలువలు+ఊడ్చి= వస్త్రాలు తీసివేసి; కొలఁకున్ వడిన్‌చొచ్చి= సరస్సులోనికి వేగంగా వెళ్ళి; తమలోనన్= తమలో తాము; పెల్లురేఁగి= మిక్కిలి చెలరేగి; నీటన్= నీటితో; చల్లులాడన్= ఒకరిపై ఒకరు చిమ్ముకొంటూ ఆడుతూ ఉండగా; నందినెక్కి= నంది వాహనమెక్కి; మౌళిన్= శిరమున; ఇందురోచులుపర్వన్= చంద్రకాంతి ప్రసరిస్తూ ఉండగా; కొండచూలితోడన్= పర్వత రాజపుత్రిక పార్వతితో; శూలివచ్చెన్= పరమేశ్వరుడు వచ్చాడు.

**తా :** ఒకనాడు ప్రొద్దు గడవక దానవ రాజపుత్రిక శర్మిష్ఠ గురుపుత్రిక దేవయానితో వేలమంది సఖీజనులు వెంటరాగా, బాగా పూచి ఉన్న ఉద్యానవనంలో గుబురుగా ఎదిగిన మామిడిచెట్ల సమీపంలో ఉన్న సరోవరానికి వెళ్ళి, ఆ సరోవరంలోని పద్మాల మకరందాన్ని గ్రోలుతూ ఉన్న తుమ్మెదలు చేసే శబ్దానికి గంతులువేస్తూ కట్టిన చీరలు విడిచి సరస్సులోనికి దిగి ఒకరిపై ఒకరు నీళ్ళు చిమ్ముకుంటూ అందరూ ఆనందిస్తూ ఉండగా అటుగా నంది వాహనుడు తలపై చంద్రకాంతి చిమ్ముతూ ఉండగా పార్వతితో కూడి ఈశ్వరుడు ఆ ప్రాంతానికి వచ్చాడు.

**చ. మలహరుఁ జూచి సిగ్గుపడి మానిను లందఱు సంభ్రమంబునన్**
**వలువలు గట్టుచో దనుజవల్లభు కూఁతురు దేవయాని దు**
**వ్వలువ ధరించి, ముందటికి వచ్చినఁ జూచి యెఱిం గెఱింగి నా**
**వలు విది యెట్లు గట్టుకొనవచ్చును దాసికి నంచు దెప్పుచున్. 516**

**ప్రతి :** మలహరున్ చూచి= దోషాలను హరించు ఈశ్వరుని చూచి; సిగ్గుపడి= సిగ్గుచెంది; సంభ్రమంబునన్= తత్తరపాటుతో; మానినులందఱున్= స్త్రీలంతా; వలువలు కట్టుచోన్= వస్త్రాలు ధరించగా; దనుజవల్లభు కూఁతురు= రాక్షస రాజు కొమార్తె; దేవయాని, దువ్వలువధరించి= గురుపుత్రిక దేవయాని యొక్క వస్త్రాన్ని ధరించి; ముందఱికిన్ వచ్చినన్= ఎదుటకు రాగా; చూచి= ఆలోకించి; ఎఱింగెఱింగి= తెలిసి తెలిసి; నా వలువ ఇది= ఇది నా వస్త్రం; దాసికిన్= దాసివైన నీకు; ఎట్లు కట్టుకొనవచ్చును= కట్టుకోవడం ఎలా తగును?; అంచున్= అంటూ; దెప్పుచున్= ఎత్తిపొడుపు మాటలు పలుకుతూ...

**తా :** పరమేశ్వరుని చూచి ఆ సరస్సులో స్నానం చేస్తున్నవారంతా సిగ్గుపడి, తత్తరపాటుతో గట్టుపైకి వచ్చి, వస్త్రాలు కట్టుకొంటున్న సమయంలో రాక్షస రాజపుత్రిక శర్మిష్ఠ, రాక్షస గురువైన శుక్రాచార్యుని కొమార్తె దేవయాని వస్త్రాన్ని

ధరించింది. అది చూచి దేవయాని తెలిసి తెలిసి దాసివైన నీవు నా వస్త్రాన్ని ఎలా ధరించావు అంటూ ఎత్తిపొడుపు మాటలు పలుకుతూ ఇంకా

**వ. దేవయాని యిట్లనియె: 517**

**ప్రతి :** దేవయాని= శుక్రాచార్యుని పుత్రి; ఇట్లు+అనియెన్= ఇలా అంది.

**తా :** దేవయాని ఇలా అంది.

**శా. ఆ లోకేశుముఖంబునం గలిగె బ్రాహ్మణ్యంబు బ్రహ్మంబు నా;**
**మేలై వైదికమార్గముల్ దెలుపుచున్ మిన్నంది రందున్ మహా**
**శీలుర్ భార్గవు; లందు శుక్రుఁడు సుధీసేవ్యుండు; నే వానికిన్**
**జూలన్; నా వలువెట్లు గట్టితివి రక్షోజాతవై చేటికా! 518**

**ప్రతి :** ఆలోకేశుముఖంబునన్= ఆ లోకాధీశుడైన పరమాత్మ (విష్ణుమూర్తి) ముఖంనుండి; బ్రాహ్మణ్యంబు= బ్రాహ్మణకులం; కలిగెన్= ఉద్భవించింది; బ్రహ్మంబునాన్= బ్రహ్మసంబంధమైన ఈ బ్రాహ్మణ కులంవారంతా; మేలై వైదిక మార్గముల్ తెలుపుచున్= లోకహితంకరమైన వైదిక ధర్మమార్గాలు తెలియజేస్తూ; మిన్నందిరి= ఆకాశాన్ని అంటారు (కీర్తి గడించారు); అందున్= వారిలో; భార్గవులు= భృగువంశానికి సంబంధించినవారు; మహాశీలుర్= గొప్ప సత్ప్రవర్తన గలవారు; అందున్= ఆ భార్గవులలో; శుక్రుఁడు= శుక్రాచార్యుడు; సుధీసేవ్యుండు= బుద్ధిమంతులచే సేవింపదగినవాడు; నేన్= నేను (దేవయానినైన నేను); వానికిన్ చూలన్= వాని కొమార్తెను; చేటికా= ఓ సేవికా; రక్షోజాతవై= రాక్షస కులంలో జన్మించిన నీవు; నా వలువ= నా వస్త్రాన్ని; ఎట్లు కట్టితివి= ఏ విధంగా ధరించావు?

**తా :** పరమాత్మ ముఖంనుండి బ్రాహ్మణకులం ఉద్భవించింది. ఈ బ్రాహ్మణులందరు లోకానికి మేలు కలిగించే వైదిక ధర్మమార్గాలు తెలిపేవారుగా కీర్తి పొంది ఆకాశాన్ని అందే ఎత్తు ఎదిగారు. అందులో భార్గవులు గొప్ప నడవడి గలవారు. అందునా శుక్రుడు బుద్ధిమంతులచే సేవింపదగినవాడు. నేను వాని పుత్రికను. రాక్షస వంశంలో జన్మించిన ఓ సేవకురాలా ఇంత గొప్పదాననైన నా వస్త్రాన్ని నీవెలా కట్టుకున్నావు?

**క. మహిమవతులైన భూసుర, మహిళలవిత్తంబులు పెఱమగువల కగునే?**
**మహిఁ బసిఁడి గొలుసు లిడినన్, విహితములే కుక్కలకు హవిర్భాగంబుల్. 519**

**ప్రతి :** మహిమవతులైన= మాహాత్మ్యముగల; భూసుర మహిళల విత్తంబులు= బ్రాహ్మణ స్త్రీల సంపదలు; పెఱమగువలకున్= ఇతర స్త్రీలకు; అగునే= అవుతాయా (సంభవిస్తాయా); మహిన్= భూమిపై; కుక్కలకున్= కుక్కలకు; పసిఁడి గొలుసులు ఇడినన్= బంగారపు గొలుసులు వేసినంత మాత్రాన; హవిర్భాగంబుల్= యజ్ఞంలో హోమం చేస్తూ వేసే హవిస్సులు; విహితములే= అర్హమౌతాయా?

**తా :** ఎంతో మహిమ గల బ్రాహ్మణ స్త్రీల సంపదలు ఇతర స్త్రీలకు లభిస్తాయా? కుక్కలకు బంగారపు గొలుసులు వేసినంత మాత్రంచేత దేవతలకు దక్కవలసిన హవిర్భాగాలు కుక్కలకు లభిస్తాయా?

**క. మీ తండ్రి మాకు శిష్యుఁడు, మా తండ్రి గురుండు గొంతమాత్రం బైనం**
**బ్రీతిం గావింపక పరి, భూతం జేయుదువె తులువపోఁడిమిఁ జెనఁటీ! 520**

**ప్రతి :** చెనఁటీ= ఓ దుష్టురాలా!; మీ తండ్రి= మీ తండ్రి రాక్షసరాజు; మాకున్ శిష్యుఁడు= మా శిష్యుడు (మా తండ్రికి శిష్యుడు); మా తండ్రి= మా జనకుడు శుక్రాచార్యుడు; గురుండు= గురువు; కొంతమాత్రంబైనన్; ప్రీతిన్ కావింపక= రవ్వంత ఐనా ప్రీతి కలిగించకుండా; తులువ పోఁడిమిన్= చెడ్డనడతతో; పరిభూతన్ చేయుదువె= నన్ను అవమానపరుస్తావా?!

**తా :** మీ తండ్రి శిష్యుడు. మా తండ్రి గురువు. అందుచే నీవు నన్ను ఎంతో గౌరవంగా చూడాలి. కొంచెమైనా ప్రేమ లేకుండా ప్రీతి కలిగించకుండా, నీ దుశ్శీలంతో నన్ను అవమానపరుస్తావా?!

**వ. అని భర్జించుచున్న దేవయాని పలుకులు విని, కరాళించి, మ్రోఁగుచున్న భుజంగి పగిది నిట్టూర్పులు నిగుడించి, పెదవులు గొఱుకుచు, శర్మిష్ఠ యిట్లనియె. 521**

**ప్రతి :** అని= ఈ విధంగా; భర్జించుచున్న= మండిపడుతున్న; దేవయాని పలుకులు విని= దేవయాని యొక్క మాటలు విని; కరాళించి= పెద్దగా శబ్దించి; మ్రోఁగుచున్న భుజంగి పగిదిన్= బుస కొడుతున్న ఆడుపామువలె; నిట్టూర్పులు నిగుడించి= నిశ్వాసాలు విడుస్తూ; పెదవులు కొఱుకుచున్= పెదవులు కొరుకుతూ; శర్మిష్ఠ యిట్లనియెన్= శర్మిష్ఠ ఇలా అన్నది.

**తా :** ఆ విధంగా మండిపడుతున్న దేవయాని మాటలు విని శర్మిష్ఠ పెద్దగా అరుస్తూ బుసకొడుతున్న ఆడుపాములా నిట్టూర్పులు విడుస్తూ పెదవులు కొరుకుతూ ఇలా అంది.

**శా. భిక్షుండై తమ తండ్రి మా జనకునిన్ భిక్షించి యుండంగ సం**
**రక్షింపం దుది నింతయై మఱపుతో రాజప్రసూతాకృతిన్**
**రక్షోరాజతనూజతో సుగుణతో నాతో సమం బాడెడిన్**
**గుక్షిస్ఫోటము గాఁగ దీనిఁ జెలు లీ కూపంబునం ద్రోవరే. 522**

**ప్రతి :** తమ తండ్రి= తనయొక్క తండ్రి శుక్రాచార్యుడు; భిక్షుండై= బిచ్చగాడై; మా జనకునిన్= మా తండ్రిని; భిక్షించి ఉండంగన్= భిక్షను కోరి ఉండగా (దయాధర్మ భిక్షను కోరి ఉండగా); సంరక్షింపన్= నా తండ్రి రక్షిస్తూ ఉంటే; తుదిన్+ ఇంతయై= చివరికి ఇంతగా; మఱపుతోన్= ఒళ్ళు మరచిపోయి (యుక్తాయుక్తాలు తెలియకుండా); రాజప్రసూతాకృతిన్= రాచ బిడ్డవలె; రక్షో రాజతనూజతోన్= రాక్షస రాజపుత్రికతో; సుగుణతోన్= సుగుణవతితో; నాతోన్= నాతో; సమంబు= నాతో సమానంగా; ఆడెడిన్= మాట్లాడుతోంది; కుక్షిస్ఫోటముగాఁగన్= కడుపు బ్రద్దలయ్యేలా; దీనిన్= ఈ శుక్రుని కూతును; చెలులు= ఓ నెచ్చెలులారా!; ఈ కూపంబునన్+ద్రోవరే= ఈ నూతిలోనికి తోయండి.

**తా :** మా తండ్రిని మీ తండ్రి ఐన శుక్రాచార్యుడు బిచ్చగానివలె దయాధర్మ భిక్షం అడుగగా, మా తండ్రి మిమ్మల్ని సంరక్షిస్తున్నాడు. చివరికి ఆశ్చర్యంగా ఒడలు మరచి రాజసుతవలె సుగుణవతిని, రాక్షస రాజపుత్రికను ఐన నాతో సమానంగా ప్రేలుతోంది. ఓ చెలికత్తెలారా! దీనిని కడుపు పగిలేలా నూతిలోనికి తోయండి.

**వ. అని పలికి. 523**

**ప్రతి :** అని పలికి= అని వచించి...

**తా :** ఈ విధంగా మాట్లాడి

**ఆ. బోఁటిపిండుచేతఁ బొదువంగఁ బట్టించి, రాజసమున దైత్యరాజతనయ**
**తొడరి దేవయానిఁ ద్రోపించె వలు వీక, క్రుంకి నూతిలోనఁ గుదిలకొనఁగ. 524**

**ప్రతి :** బోఁటి పిండుచేతన్= చెలుల సమూహంతో; పొదు వంగన్+పట్టించి= పొదువ పట్టించి; రాజసమునన్= గర్వంతో; దైత్యరాజతనయ= రాక్షస రాజపుత్రిక శర్మిష్ఠ; తొడరి= ప్రయత్నించి; దేవయానిన్= శుక్రాచార్యుని సుతయైన దేవయానిని; వలువ+ఈక= వస్త్రాన్ని ఇయ్యకుండా; క్రుంకి నూతిలోనన్= నూతిలో పడి; కుదిలకొనఁగ= దుఃఖించగా; త్రోపించెన్= తోయించింది.

**తా :** చెలికత్తెల బృందంతో పట్టించి, గర్వంతో, రాక్షస రాజపుత్రిక శర్మిష్ఠ, వస్త్రం ఈయకుండా దేవయానిని నూతిలోనికి దుఃఖించేలా తోయించింది.

**వ. ఇట్లు సేసి, శర్మిష్ఠ వోయిన వెనుక, యయాతిభూపాలుండు వేఁటమార్గంబున నడవిం దిరుగుచు, దైవయోగంబున నా దేవయాని యున్న నుయ్యి చేరం జనుదెంచి యందు. 525**

**ప్రతి :** ఇట్లు+చేసి= ఈ విధంగా చేసి; శర్మిష్ఠ; పోయిన వెనుకన్= వెళ్ళిపోగా; యయాతి భూపాలుండు= యయాతి మహారాజు; వేఁట మార్గంబునన్= వేటకుపోయే మార్గంలో; అడవిన్ తిరుగుచున్= అడవిలో తిరుగుతూ; దైవ యోగంబునన్= దైవ యోగంకొద్దీ (అదృష్టంకొద్దీ); ఆ దేవయాని ఉన్న నుయ్యి చేరన్ చనుదెంచి= ఆ దేవయాని పడి ఉన్న నుయ్యి వద్దకు వచ్చి; అందున్= ఆ నూతిలో...

**తా :** ఈ విధంగా శర్మిష్ఠ దేవయానిని నూతిలోనికి త్రోసిపోయిన పిమ్మట యయాతి మహారాజు వేటాడుతూ అడవి అంతా తిరుగుతూ అదృష్టం కొలదీ దేవయాని ఉన్న నూతివద్దకు వచ్చి అందులో

**క. బంధువుల నెల్లఁ జీరుచు, నందు జలామగ్న నగ్నయై వగచుచు ని**
**ర్బంధమునఁ జిక్కి వ్రీడా, సింధువున మునింగియున్న చేడియఁ గనియెన్. 526**

**ప్రతి :** బంధువుల నెల్లన్= బంధువులనందఱినీ; చీరుచున్= పిలుస్తూ; అందున్= ఆ నూతిలో; జల+ఆమగ్న= నీటిలో పూర్తిగా మునిగి; నగ్నయై= వస్త్రంలేక; వగచుచున్= దుఃఖపడుతూ; నిర్బంధమునన్ చిక్కి= బయటకు వచ్చేందుకు దారిలేక చిక్కుకొని; వ్రీడాసింధువునన్= సిగ్గు అనే సంద్రంలో; మునింగియున్న= మునిగిపోయి ఉన్న; చేడియన్= స్త్రీని (దేవయానిని); కనియెన్= చూచాడు.

**తా :** నూతి నీళ్ళలో పడి వస్త్రంలేక బంధువులనందరిని పిలుస్తూ బయటకు రావడానికి వీలులేక బావిలో చిక్కుకొనిపోయి సిగ్గు అనే సముద్రంలో మునిగిపోయిన దేవయానిని చూచాడు యయాతి మహారాజు.

## ✤ దేవయాని యయాతిని వరించుట ✤

**వ. కనుంగొని. 527**

**తా :** చూచి

**శా. సప్తాంభోనిధి మేఖలావృత మహా సర్వంసహా కన్యకా**
**ప్రాప్తోద్యద్వరదక్ష దక్షిణకరప్రాలంబముం జేసి ప్రో**

**క్షిప్తం జేసె యయాతి కట్టుకొనఁ బై చేలంబు మున్నిచ్చి ప**
**ర్యాప్త స్వేదజలాంగి నాళిసముదాయస్వర్గవిన్ భార్గవిన్. 528**

**ప్రతి :** యయాతి= యయాతి మహారాజు; కట్టుకొనన్= కట్టుకొనడానికి; పై చేలంబుమున్నిచ్చి= తన పైనున్న వస్త్రాన్ని ముందుగా దేవయానికి ఇచ్చి; సప్త+అంభోనిధి= ఏడు సముద్రాలు; మేఖలా+ఆవృత= మేఖలగా (నడుమునకు పెట్టుకొనే ఒడ్డాణమనే ఆభరణంవలె) చుట్టుకొని ఉన్న; మహా సర్వంసహాకన్యకా= ఈ భూమి అనే కన్యను; ప్రాప్త= పొంది; ఉద్యత్ వర= గొప్పదైన; దక్ష= సామర్థ్యంగల; దక్షిణ కర= కుడిచేతియొక్క; ప్ర+ఆలంబమున్‌చేసి= చక్కటి ఆలంబనాన్ని (చేయూతను) ఇచ్చి; పర్యాప్తస్వేదజల+అంగి= శరీరం అంతా చెమటలు కమ్మిన దానిని; ఆళిసముదాయ= చెలికెత్తెల సమూహానికి; స్వర్గవిన్= కామధేనువైన దానిని; భార్గవిన్= భృగువంశంలో జన్మించిన దేవయానిని; ప్రోక్షిప్తన్+చేసెన్= పైకి లేవదీసెను.

**తా :** యయాతి మహారాజు దేవయానికి ముందుగా తన పై బట్టను ఇచ్చి, ఏడు సముద్రాలు ఒడ్డాణంగా చుట్టుకొని ఉన్న భూమి అనే కన్యను రక్షించడంలో సామర్థ్యంగల తన కుడిచేతిని ఆలంబనంగా ఇచ్చి, స్వేదంతో ఒడలంతా తడిసినది, సఖీజనులకు కామధేనువు వంటిదైన భృగువంశంలో జన్మించిన దేవయానిని నూతినుండి పైకి తీశాడు.

**విశే :** సర్వం సహత ఇతి సర్వం సహా. సర్వమునూ సహించునదికనుక భూమికి ఈ పేరున్నది.

**వ. ఇట్లు నుయ్యి వెడలించిన రాజునకు రాజవదన యిట్లనియె. 529**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; నుయ్యి వెడలించిన= నూతినుండి బైటకుతీసిన; రాజునకున్= యయాతి మహారాజునకు; రాజవదన= చంద్రునివంటి మొగంగల దేవయాని; ఇట్లనియెన్= ఈ విధంగా మాట్లాడింది.

**తా :** ఈ విధంగా తనను నూతినుండి బైటకు తీసిన యయాతి మహారాజుతో చంద్రముఖి దేవయాని ఇలా అన్నది.

**మ. ననుఁ బాణిగ్రహణంబు చేసితి గదా నా భర్తవు న్నీవ దై**
**వ నియోగం బిది పౌరుషంబునకు నా వాక్యంబు సిద్ధంబు సౌ**
**ఖ్య నివాసు న్నిను మాని యొండు వరునిం గాంక్షింప నే నేర్తునే?**
**వనజం బానెడి తేఁటి యన్యకుసుమావాసం బపేక్షించునే? 530**

**ప్రతి :** ననున్= నన్ను; పాణిగ్రహణంబు చేసితిగదా= చేయి పట్టుకున్నావు కదా (నూతినుండి నీ కుడిచేతిని ఊతగా ఇచ్చిపైకి తీసి నా కరగ్రహణం చేశావు కదా); నా భర్తవున్ నీవ= నీవే నా భర్తవు; ఇది= ఈ విషయం; దైవనియోగంబు= దైవసంకల్పం; పౌరుషంబునకున్= పురుష ప్రయత్నానికి కూడా; నావాక్యంబు సిద్ధంబు= నా మాట తగినదే అవుతుంది; సౌఖ్యనివాసున్= సుఖాలకు ఆలవాలమైన; నినున్+మాని= నిన్ను విడిచి; ఒండువరునిన్= మఱొక వరుణ్ణి; కాంక్షింపన్ నేనేర్తునే= నేను కోరుకుంటానా?; వనజంబు= పద్మాన్ని (అందున్న మకరందాన్ని); ఆనెడితేఁటి= క్రోలే తుమ్మెద; అన్యకుసుమ+ఆవాసంబు= మరొక పుష్పంలో ఉండటాన్ని; అపేక్షించునే= కోరుతుందా?

**తా :** ఓ రాజా! ఈ నూతిలోనుండి నన్ను పైకి తీస్తూ నీవు నా కరగ్రహణం చేశావు. నీవే నా భర్తవు. ఇది దైవికమైన యోగం. పురుష ప్రయత్నానికి కూడా నా వాక్యం సిద్ధమైనదే. సర్వసుఖాలకు నిలయమైన నిన్ను వదిలి వేరొక వరుణ్ణి నేను కోరుకుంటానా? పద్మాల మకరందాన్ని తాగ మరగిన తుమ్మెద మరొక పుష్పమకరందాన్ని కోరుకోదు కదా!

**వ. అదియునుంగాక. 531**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక...

**తా :** అంతేకాక

**సీ. సుగుణాఢ్య! విను నేను శుక్రుని కూఁతుర దేవయానిని దొల్లి దేవమంత్రి**
**తనయుండు కచుఁడు మా తండ్రిచేత మృతసంజీవనిఁ దా నభ్యసించు వేళ**
**నతనిఁ గామించిన నతఁడొల్ల ననవుడు నతఁడు నేర్చిన విద్య యణఁగి పోవ**
**నతని శపించిన నతఁడు నా భర్త బ్రాహ్మణుఁడు గాకుండెడు నని శపించె**

**తే. నది నిమిత్తంబు నాకు బ్రాహ్మణుఁడు గాఁడు, ప్రాణనాథుఁడ వీ వని పడఁతి వలుకఁ**
**దనదు హృదయంబు నెలఁతపైఁ దగులువడినఁ, దమక మొక యింతయును లేక తలఁచి చూచి. 532**

**ప్రతి :** సుగుణ+ఆఢ్య= సుగుణములచే ప్రసిద్ధి పొందిన ఓ రాజా!; విను= వినుము; నేను; శుక్రుని కూఁతురన్= శుక్రాచార్యుని పుత్రికను; దేవయానిని= నన్ను దేవయాని అంటారు; తొల్లి= ఒకప్పుడు; దేవమంత్రి తనయుండు= దేవతలకు మంత్రియైన బృహస్పతి కొడుకు; కచుఁడు= కచుడు అనే పేరుగలవాడు; మా తండ్రిచేతన్= మా తండ్రి శుక్రునిచేత; మృత సంజీవనిన్= మృతసంజీవని అనే పేరుగల విద్యను; తాను అభ్యసించువేళన్= తాను నేర్చుకొనే సమయంలో; అతనిన్= ఆ కచుని; కామించినన్= నేను కోరుకోగా; అతఁడు+ఒల్లన్+అనవుడున్= అతడు అంగీకరించను అని అనగా; అతఁడు నేర్చిన విద్య= కచుడు నా తండ్రివద్ద నేర్చిన మృతసంజీవని విద్య అణఁగిపోవన్= నశించిపోయేలా (ఉపయోగపడనట్లు); అతనిన్ శపించినన్= కచుని శపించగా; అతఁడు= ఆ కచుడు; నా భర్త బ్రాహ్మణుఁడు కాకుండెడున్= నాకు కాబోయే భర్త బ్రాహ్మణుడు కాకుండా పోతాడు; అని= అని పలికి; శపించెన్= నన్ను శపించాడు; అది నిమిత్తంబు= అది కారణంకాగా; నాకున్= నాకు; ప్రాణనాథుఁడవు+ఈవు= నీవే భర్తవు; బ్రాహ్మణుఁడుగాడు= బ్రాహ్మణుడు కాడు; అని= ఈ విధంగా; పడఁతి పలుకన్= దేవయాని పల్కగా; తనదు హృదయంబు= తన మనస్సు; నెలతపైన్= ఆ దేవయానిపై; తగులు+పడినన్= ఆకర్షింపబడగా; తమకము= తొట్రుపాటు; ఒక ఇంతయునులేక= కొంచెం కూడా పొందకుండా; తలఁచి చూచి= ఆలోచించి చూచి...

**తా :** ఓ గుణవంతుడా! వినుము. నేను శుక్రాచార్యుని కూతురు అయిన దేవయానిని. పూర్వం బృహస్పతి కుమారుడు కచుడు మా తండ్రి వద్ద మృతసంజీవని విద్య అభ్యసించే సమయంలో, నేను అతనిని కామించాను. అతడు అంగీకరించని కారణంగా అతడు నేర్చిన మృతసంజీవనీ విద్య నశించిపోవాలని నేను శపించాను. అతడు నీకు బ్రాహ్మణుడు భర్త కాకుండా పోతాడు అని శపించాడు. ఆ కారణంగా నాకు బ్రాహ్మణుడు ప్రాణనాథుడు కాడు. నీవే నా పతివి అని పలుకగా తాను దేవయానిపై మనసు పడి తొందరపాటు ఏమాత్రం లేకుండా ఆలోచించి

**మత్త. దైవయోగము గాక విప్రసుతన్ వరించునె నా మనం**
**బే విధంబున నీశ్వరాజ్ఞయు నిట్టి దంచు వరించె ధా**
**త్రీవరుండును దేవయానిని ధీరబుద్ధులకున్ మనో**
**భావ మొక్కటియే ప్రమాణ మభావ్య భావ్య పరీక్షకున్. 533**

**ప్రతి :** దైవయోగముగాక= దైవఘటన కాకపోతే; నా మనంబు=నా మనసు; విప్రసుతన్ వరించునె= బ్రాహ్మణ పుత్రికను వరిస్తుందా?; ఏ విధంబునన్= ఏ రీతిగానైనను; ఈశ్వరాజ్ఞయున్= పరమేశ్వరుని ఆనతి కూడా; ఇట్టిదంచున్= ఇటులనే ఉంది అనుకొంటూ; ధాత్రీవరుండును= రాజైన యయాతి; దేవయానిని వరించెన్= దేవయానిని వరించాడు; అభావ్య= కానిది; భావ్య= భావ్యమైనది అనే విషయాల; పరీక్షకున్= పరీక్షలో; ధీరబుద్ధులకున్= వికారం చెందని మనస్సు గల ధైర్యవంతులకు; మనోభావము+ఒక్కటియే= మానసిక భావం ఒక్కటి మాత్రమే (మనస్సులో కలిగిన భావమే); ప్రమాణము= ప్రమాణమై ఉంటుంది.

**తా :** దైవయోగం కాకపోతే, నా మనస్సు బ్రాహ్మణసుతను వరిస్తుందా? ఈశ్వరాజ్ఞ కూడా ఈ విషయంలో ఇలాగే ఉంది కాబోలు! అని భావించి రాజైన యయాతి దేవయానిని వరించాడు. ధీరబుద్ధులకు చేయవలసిన పనులు చేయకూడని పనులు అనే సందేహం కలిగినప్పుడు వారి వారి మనస్సులే అందుకు ప్రమాణం.

**వ. ఇట్లు వరించి, యయాతి చనిన వెనుక దేవయాని శుక్రుని కడకుం జని, శర్మిష్ఠ చేసిన వృత్తాంతం బంతయుం జెప్పి కన్నీరు మున్నీరుగా వగచిన. 534**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వరించి= కోరుకొని; యయాతి= రాజైన యయాతి; చనిన వెనుకన్= వెళ్ళిపోయిన తరువాత; దేవయాని; శుక్రుని కడకుంజని= తండ్రి ఐన శుక్రాచార్యులవద్దకు వెళ్ళి; శర్మిష్ఠ చేసిన వృత్తాంతంబంతయున్ చెప్పి= శర్మిష్ఠ తనను అనిన మాటలు చేసిన పని తెలియజేసి; కన్నీరు మున్నీరుగాన్= తన కంటి నీరు సముద్ర జలమంతకాగా (అధికంగా); వగచిన= దుఃఖించేసరికి...

**తా :** ఈ విధంగా యయాతి వరించి వెళ్ళిన తరువాత దేవయాని తండ్రివద్దకు వచ్చి శర్మిష్ఠ అన్నమాటలు చేసిన చేష్టల సమాచారం అంతా చెప్పి విలపించగా

**క. క్రూరాత్ముల మందిరములఁ, బౌరోహిత్యముల కుంట పాపం బీ సం**
**సారముకంటె శిలల్ దిని, యూరక కాపోతవృత్తి నుండుట యొప్పున్. 535**

**ప్రతి :** క్రూరాత్ముల మందిరములన్= దుర్మార్గుల ఇళ్ళలో; పౌరోహిత్యములకు+ఉంట= పౌరోహిత్య క్రియకు ఉండుట; పాపంబు= చాల పాపం; ఈ సంసారముకంటెన్= ఈ పురోహిత వృత్తితో జీవించడంకంటె; శిలల్+తిని= రాళ్ళు తిని; ఊరక= ఏ ప్రమేయమూ లేకుండా; కాపోతవృత్తిన్ ఉండుట= పావురాలవలె జీవించడం; ఒప్పున్= తగియుండును.

**తా :** క్రూరాత్ముల ఇళ్ళలో పురోహిత వృత్తి చేస్తూ జీవనం సాగించడంకంటె పావురాలలాగా రాళ్ళు తిని బతకడం ఇంతకంటె చాలా ఉచితంగా ఉంటుంది.

**విశే :** పావురాలు ఆహారం జీర్ణం అవడానికి గులకరాళ్ళు తింటాయని ప్రతీతి. పావురాలలాగా బతకడం అంటే దేనినీ ఆశించక ఏది దొరికితే దాన్ని తిని జీవించడం అని భావం.

**వ. అని వృషపర్వుని కడ నుండుట నిందించుచు, శుక్రుం డాకూఁతుం దోడ్కొని పురంబు వెడలి చన, నయ్యసురవల్లభుం డెఱింగి, శుక్రునివలన దేవతల గెలువఁ దలఁచి తెరువున కడ్డంబు వచ్చి, పాదంబులపైఁ బడి ప్రసన్నుఁ జేసిన, నా కోపంబు మాని శుక్రుండు శిష్యున కిట్లనియె. 536**

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా అనుకొని; వృషపర్వునికడన్ ఉండుటన్= రాక్షస రాజైన వృషపర్వునివద్ద ఉండటం; నిందించుచున్= దూషిస్తూ; శుక్రుండు= శుక్రాచార్యుడు; ఆ కూఁతున్= తన సుతను; తోడ్కొని= తీసికొని; పురంబువెడలిచనన్= ఆ పట్టణాన్ని వదలివెళ్ళిపోగా; ఆ+అసుర వల్లభుండు+ఎఱింగి= ఆ దానవరాజు తెలిసికొని; శుక్రుని వలనన్= శుక్రాచార్యులవల్ల; దేవతలన్ గెలువన్‌తలఁచి= దేవతలను గెలవాలి అనుకొని; తెరువున కడ్డంబువచ్చి= దారికి అడ్డంవచ్చి; పాదంబులపైన్ పడి= శుక్రాచార్యుని పాదాలపై పడి; ప్రసన్నున్ చేసినన్= ప్రసన్నుణ్ణి చేయగా; ఆ కోపంబుమాని= తనకు కలిగిన కోపంవదలి; శుక్రుండు= శుక్రాచార్యులు; శిష్యునకు+ఇట్లు+అనియెన్= శిష్యుడైన వృషపర్వునితో ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా వృషపర్వునివద్ద ఉండడం తప్పని భావించి శుక్రాచార్యుడు తన కొమార్తెను తీసికొని వృషపర్వపురాన్ని వదిలి వెళ్ళుతూ ఉండగా, ఈ విషయం తెలిసిన వృషపర్వుడు శుక్రాచార్యుని వలన మాత్రమే దేవతలను గెలవగలం అని తెలిసినవాడు కాబట్టి శుక్రాచార్యుని దారి కడ్డుపడి పాదాలపై బడి శుక్రాచార్యుణ్ణి ప్రసన్నం చేసికోగా, కోపం విడిచిన శుక్రాచార్యుడు శిష్యుడైన వృషపర్వునితో ఇలా అన్నాడు.

**తరలము. చెలులు వేవురుఁ దాను నీ సుత చేటికైవడి నాసుతం**
**గొలుచు చుండినఁ దీఱుఁ గోపము గొల్వఁ బెట్టెద వేని నీ**
**వెలఁదిఁ దోడ్కొని వత్తు నావుడు వేగ రమ్మని భార్గవిం**
**గొలువఁ బెట్టె సురారివర్యుఁడు గూఁతు నెచ్చెలిపిండుతోన్. 537**

**ప్రతి :** చెలులు వేవురున్= వేయిమంది చెలికత్తెలును; తాను నీసుత= ఆ నీ కూతురు శర్మిష్ఠ; చేటికైవడిన్= దాసివలె; నా సుతన్ కొలుచు చుండినన్= నా కొమార్తె దేవయానిని సేవిస్తూ ఉంటే; తీఱున్ కోపము= నా కోపం తీరుతుంది; కొల్వన్ పెట్టెదవేనిన్= ఆ విధంగా నీ సుతనే దాసిగా చేయిస్తే; ఈ వెలఁదిన్= ఈ నా సుతను దేవయానిని; తోడ్కొని వత్తున్= తీసికొని వస్తాను; నావుడున్= అనగా; సురారివర్యుఁడు= రాక్షసశ్రేష్ఠుడైన వృషపర్వుడు; నెచ్చెలి పిండుతోన్= సఖీబృందంతో; కూఁతున్= తన సుతయైన శర్మిష్ఠను; వేగరమ్మని= తొందరగా రమ్మని; భార్గవిన్= భృగు వంశసంజాత దేవయానిని; కొలువఁన్‌పెట్టెన్= సేవించుటకు నియోగించాడు.

**తా :** కూతురైన శర్మిష్ఠ తన చెలికత్తెలు వేయిమందితో నా కూతురికి దాస్యం చేస్తే నా కోపం తీరుతుంది. అలా చేస్తేనే నా కూతురుతో నీ రాజ్యానికి వస్తాను అనగానే వృషపర్వుడు సఖీబృందంతో కూడిన శర్మిష్ఠను దేవయానికి సేవ చేయడానికి వెంటనే నియోగించాడు.

**మ. చల మింకేలని తన్నుఁ దండ్రి వనుపన్ శర్మిష్ఠ సన్నిష్ఠతో**
**జలజాతాస్యలు సద్వయస్యలు సహస్రంబు న్నజస్రంబుఁ ద**
**న్నలమన్ దాసి సుదాసి యయ్యెఁ బగ వాయన్ భూరికోపానలా**
**కలితగ్లానికి దేవయానికి మహాగర్వోద్యమ స్థానికిన్. 538**

**ప్రతి :** చలము= పట్టుదల; ఇంకేలని= ఇంక ఎందుకని; తన్నున్= తనను; తండ్రి పనుపన్= తండ్రి పంపగా; శర్మిష్ఠ; సత్‌నిష్ఠతోన్= చక్కని తాత్పర్య భావంతో; జలజాత ఆస్యలు= పద్మముఖులు; సత్‌వయస్యలు= మంచి స్నేహితురాండ్రు; సహస్రంబున్= వేయిమంది; అజస్రంబు= ఎల్లప్పుడు; తన్ను అలమన్= తనను కూడియుండగా; దాసి= సమీపించి; పగ

పాయన్= పగ పోవునట్లుగా; మహాగర్వ+ఉద్యమస్థానికిన్= గొప్ప గర్వోద్రేకానికి నిలయమైన దానికి; భూరి+ కోప+అనల+ ఆకలిత+గ్లానికిన్= అధికమైన కోపాగ్నితోకూడి బాధను పొందుతున్నదానికి; దేవయానికిన్= దేవయానికి; సుదాసి అయ్యెన్= చక్కని దాసిగా మారినది.

**తా :** తండ్రియైన వృషపర్వుడు తన్ను ఆదేశించగా, ఇంక పట్టుదల ఎందులకని నిష్ఠతో, సఖీజన సహస్రంతో, శర్మిష్ఠ కోపాగ్నిచే బాధపడుతూ, గర్వానికి నిలయమైన దేవయానిని సమీపించి ఆమె పగ చల్లారేలా ఆమెకు దాసి అయ్యింది.

**వ. అంత. 539**

**ప్రతి :** అంతట...

**తా :** అటు తరువాత

**ఉ. ఆతతమైన వేడ్క దనుజాధిపమంత్రి సురారినందనో**
**పేతఁ దనూభవం బిలిచి పెండ్లి యొనర్చె మహావిభూతికిన్**
**బ్రీతి మహోగ్రజాతికి నభీతికి సాధు వినీతికిన్ సిత**
**ఖ్యాతికి భిన్నదుష్కలహకార్యభియాతికి న య్యయాతికిన్. 540**

**ప్రతి :** ఆతతమైన వేడ్కన్= విస్తారమైన వేడుకతో; దనుజ+అధిపమంత్రి= రాక్షస రాజైన వృషపర్వుని మంత్రి; సుర+అరినందన+ఉపేతన్= రాక్షస పుత్రికతో కూడిన; తనూభవన్ పిలిచి= కొమార్తెను పిలిచి; ప్రీతిన్= సంతోషంతో; మహావిభూతికిన్= గొప్ప సంపదలు గల; మహోగ్రజాతికిన్= అధిక పౌరుషంగల క్షత్రియజాతికి చెందినవానికి; అభీతికిన్= భయం లేనివానికి; సాధువినీతికిన్= సాధువుల విషయంలో వినయం గలవానికి; సితఖ్యాతికిన్= స్వచ్ఛమైన కీర్తి గలవానికి; భిన్న దుష్కలహకారి+అభియాతికిన్= దుర్మార్గంగా కలహంచేసే శత్రువులకు ఎదురొడ్డి ఓడించేవానికి; ఆ యయాతికిన్= ఆ యయాతి మహారాజుకు; పెండ్లి యొనర్చెన్= పెండ్లి చేశాడు.

**తా :** అతిశయించిన వేడుకతో వృషపర్వుని మంత్రియైన శుక్రుడు రాక్షస రాజు కొమార్తెతో కూడిన తన సుతను పిలిచి, ప్రీతితో, అధిక ఐశ్వర్య సంపన్నుడు, క్షత్రియుడు, నిర్భయుడు, సాధువిధేయుడు, అచ్ఛమైన కీర్తి గలవాడు దుష్టశత్రువుల పీచమణచ గలవాడు అయిన యయాతికిచ్చి పెండ్లి చేశాడు.

**వ. ఇట్లు యయాతికి దేవయాని నిచ్చి శుక్రుండు శర్మిష్ఠాసంగమంబు సేయకు మని నియమించి చనియె. పిదప న ద్దేవయానియు, న య్యయాతివలన యదుతుర్వసు లను కుమారులం గనియె, ఒక్కరేయి సెఱంగు మాసి, దేవయాని వెలుపలనున్న యెడ శర్మిష్ఠ యెదరు వేచి, యేకాంతంబున యయాతి కడకుం జని, చెఱకువింటిజోదు పువ్వుటంపర కోహటించి, తన తలంపు సెప్పిన. 541**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; యయాతికిన్= యయాతి మహారాజునకు; దేవయానిన్ ఇచ్చి= దేవయానినిచ్చి; శుక్రుండు= శుక్రాచార్యుడు; శర్మిష్ఠా సంగమంబు= శర్మిష్ఠతో కలయికను; చేయకుము అని= చేయవలదు అని; నియమించి= కట్టుబాటుచేసి (యయాతికి); చనియెన్= వెళ్ళిపోయాడు; పిదపన్= తరువాత; ఆ దేవయానియున్= ఆ దేవయాని; యయాతి వలనన్= యయాతివల్ల; యదు తుర్వసులను= యదు, తుర్వసుడు అనే; కుమారులన్ కనియెన్= సుతులను

కన్నది; ఒక్కరేయి= ఒక రాత్రి; చెఱంగుమాసి= ఋతుమతియై; దేవయాని; వెలుపలన్+ఉన్న యెడన్= బహిష్ఠ అయి ఉండగా; శర్మిష్ఠ; ఎడరువేచి= అదనుకోసం ఎదురుచూచి; ఏకాంతంబునన్= ఒంటరిగా ఉన్నవేళ; యయాతి కడకున్‌చని= యయాతివద్దకు వెళ్ళి; చెఱకు వింటిజోదు= చెరకు విల్లుగాగల యోధుడు మన్మథునియొక్క; పువ్వు+అంపరకున్= పూల బాణాల వరుసకు; ఓహటించి= భయపడి; తన తలంపు= తనయొక్క ఆలోచన; చెప్పినన్= చెప్పగా...

**తా :** ఈ విధంగా యయాతికి శుక్రాచార్యుడు తన కొమార్తె అయిన దేవయానిని ఇచ్చి పెండ్లిచేసి, శర్మిష్ఠతో మాత్రం నీవు కలుసుకో కూడదు అని నిబంధన చేసి వెళ్ళిపోయాడు. పిదప ఆ దేవయాని యయాతివల్ల యదువు, తుర్వసుడు అనే కుమారులను కని, ఒకనాటి రాత్రి ఋతుమతియై బయట ఉండగా, శర్మిష్ఠ అదనుకోసం ఎదురుచూచి, ఒంటరిగా ఉన్న యయాతి దగ్గరకువచ్చి, మన్మథ ఆవేశానికి లోనై తన కోరికను తెలియజేయగా

## ✤ శుక్రాచార్యులు యయాతికి శాపం బొసంగుట ✤

**ఉ. ఆ జవరాలిఁ జూచి మన మాఁపఁగలేక మనోభవార్తుఁడై**
**యా జనభర్త మున్ను కవియాడిన మాట దలంచి యైనఁ జే**
**తోజసుఖంబులం దనిపెఁ, ద్రోవఁగ వచ్చునె దైవ యోగముల్**
**రా జఁట సద్రహస్య మఁట రాజకుమారిని మాన నేర్చునే? 542**

**ప్రతి :** ఆ జనభర్త= ఆ రాజు యయాతి; ఆ జవరాలిన్ చూచి= యౌవనవతియైన ఆ శర్మిష్ఠను చూచి; మనము+ ఆఁపఁగన్ లేక= మనస్సును అడ్డుకోలేక; మనోభవ+ఆర్తుఁడై= మన్మథ బాధకు గురియైనవాడై; మున్ను= పూర్వం; కవియాడినమాట+తలంచియైనన్= శుక్రాచార్యుడు పల్కిన పల్కులు గుర్తు ఉండికూడా; చేతోజ సుఖంబులన్ తనిపెన్= మన్మథ సుఖాలలో తృప్తి కలిగించాడు; దైవయోగముల్= దైవ నియోగాలు (దైవనిర్ణయాలు); త్రోవఁగన్ వచ్చునె= త్రోసి వేయగలమా?; రాజఁట= అతడా ఒక రాజ్యానికి రాజైన యయాతి మహారాజట; సత్‌రహస్యమఁట= జరుగుతున్న కార్యం గొప్ప రహస్యమై ఉన్నదట; రాజకుమారిని= రాజసుతయైన శర్మిష్ఠ సుఖాన్ని; మాననేర్చునే= మానగలడా?

**తా :** రాజైన యయాతి పూర్వం శుక్రాచార్యులు చెప్పిన మాటలు జవదాటరానివై గుర్తు ఉన్నప్పటికీ శర్మిష్ఠను జూచి మన్మథ బాధకు గురై ఆమెను మదనసుఖాలలో మురిపించాడు. దైవనిర్ణయాలు త్రోసివేయజాలం కదా! ఒక చక్రవర్తియైన యయాతి అందకత్తె అయిన శర్మిష్ఠతో సుఖించకుండా ఉండగలడా!

**వ. ఇట్లు యయాతి వలన శర్మిష్ఠ గర్భంబై క్రమంబున ద్రుహ్యుండును, ననువును, పూరువునుననువారి ముగ్వురు తనయులం గాంచె. అంత దేవయాని తద్వృత్తాంతం బంతయు నెఱింగి, కోపించి, శుక్రుని కడకుం జని క్రోధమూర్ఛితయై యున్న సమయమున యయాతి వెంటం జని, యిట్లనియె. 543**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; యయాతి వలనన్= యయాతివల్ల; శర్మిష్ఠ; గర్భంబై= గర్భాన్ని ధరించి; క్రమంబునన్= క్రమంగా (వరుసగా); ద్రుహ్యుండును= ద్రుహ్యుడూ; అనువును= అనువూ; పూరువును= పూరువూ; అనువారిన్= అనే పేర్లుగల వారిని; ముగ్వురు తనయులన్ కాంచెన్= ముగ్గురు పుత్రులను కన్నది; అంతన్= అంత; దేవయాని= దేవయాని; తద్వృత్తాంతంబంతయున్= ఆ జరిగిన వృత్తాంతాన్ని అంతటిని; ఎఱింగి= తెలిసికొని; కోపించి= కోపగించుకొని; శుక్రుని

కడకున్ చని= తన తండ్రియైన శుక్రాచార్యుని వద్దకు వెళ్ళి; క్రోధమూర్ఛితయై= అధికమైన కోపముతో ఒడలు తెలియనిదై; ఉన్న సయమునన్= ఉన్న వేళలో; యయాతి వెంటన్చని= యయాతి దేవయాని వెంటవెళ్ళి; ఇట్లనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా యయాతివల్ల శర్మిష్ఠ గర్భవతియై ద్రుహ్యుడు, అనువు, పూరువు అనే పేర్లు గల ముగ్గురు కుమారులను కన్నది. దేవయాని ఈ విషయాన్ని గ్రహించి కోపించి తండ్రి శుక్రాచార్యుని వద్దకు వెళ్ళింది. ఒడలు తెలియని కోపాన్ని వహించిన దేవయాని వెంట యయాతి వెళ్ళి ఇలా అన్నాడు.

**ఆ. మామకేల చెప్ప మాను సరోజాక్షి, దనుజతనయఁ బొంది తప్పువడితిఁ**
**గామినైన నన్నుఁ గరుణింపు పతిమాట, తండ్రిమాటకంటెఁ దగును నీకు. 544**

**ప్రతి :** సరోజాక్షి= ఓ పద్మాక్షి! దేవయాని!; మామకు+ఏలచెప్పన్= ఈ విషయాన్ని మామ అయిన శుక్రాచార్యుని వద్ద చెప్పడం ఎందుకు; మాను= మానుకో (చెప్పవద్దు); దనుజ తనయన్+పొంది= రాక్షస రాజు వృషపర్వుని కొమరితను కూడి; తప్పు+పడితిన్= తప్పును పొందాను (తప్పు చేశాను); కామినైన నన్నున్= కామాన్ని పొందిన నన్ను; కరుణింపు= దయచూడు; పతిమాట= భర్తనైన నా మాట; తండ్రి మాటకంటెన్= నీ తండ్రి శుక్రాచార్యుని మాటకంటె; నీకున్= నీకు; తగును= ఆచరింపదగినది.

**తా :** ఓ సరోజాక్షీ! దేవయానీ! ఈ విషయాన్ని మామ అయిన శుక్రాచార్యునికి చెప్పడమెందుకు? మానుము. నేను శర్మిష్ఠతో సంసారసుఖం అనుభవించి తప్పు చేశాను. కామంతో శర్మిష్ఠను పొందిన నన్ను కరుణించు. నీ తండ్రి మాటకంటె నా మాట వినడం నీకు తగినది.

**వ. అని పలికి పాదంబుల కెఱఁగిన న య్యింతి యొడంబడక యుండె; నంత నది యెఱింగి శుక్రుం డిట్లనియె. 545**

**ప్రతి :** అని పలికి= ఈ విధంగా యయాతి పలికి; పాదంబులకున్ ఎఱఁగినన్= పాదాలకు నమస్కరింపగా; ఆ+ఇంతి= ఆ దేవయాని (స్త్రీ); ఒడంబడక ఉండెన్= అంగీకారం పొందలేదు; అంతన్= అంతట; అది ఎఱింగి= ఆ విషయాన్ని గ్రహించి; శుక్రుండు ఇట్లు అనియెన్= శుక్రుడు ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా యయాతి పలికి దేవయాని పాదాలపై పడ్డాడు. అయినా దేవయాని ఒడంబడలేదు. ఈ విషయాన్ని తెలిసికొన్న శుక్రాచార్యుడు ఇలా అన్నాడు.

**క. నా మాటఁ ద్రోచి దానవ, భామను బొందితివి ధరణి పాలక! తగవే?**
**యేమాట యేది రూపము, కాముకులకు లోలుపులకుఁ గలవే నిజముల్? 546**

**ప్రతి :** ధరణిపాలక= ఓ (యయాతి) మహారాజా!; నా మాటన్= నా పలుకులను; త్రోచి= దాటి; దానవ భామను= రాక్షస వనితను; పొందితివి= పొందావు; ఏ మాట= నేను చెప్పినమాట ఏమి?; ఏది రూపము= ఆ మాటకు తగిన ఆకారమేమి? (నేను చెప్పినదేమి? నీవు చేసినదేమి?); కాముకులకున్= కాముకులైన వారికి; లోలుపులకున్= లోలుపత్వం గలవారికి (విషయలంపటులకు); కలవే నిజముల్= నిజాలు ఉన్నాయా? సత్యనిష్ఠ ఉందా?

**తా :** ఓ యయాతి మహారాజా! నేను నా వివాహ సమయంలో చెప్పిన మాటలు పెడచెవినిపెట్టి రాక్షస రాజ తనూజ శర్మిష్ఠతో సుఖించావు. నేను చెప్పిన మాట ఏమిటి? నీవు చేసిన పని ఏమిటి? కాముకులకు, విషయలంపటులకు సత్యవాక్యంపైని నియమం ఉంటుందా!

**వ. అని పలికి, నీవు వనితాజన హేయంబైన ముదిమిం బొందెదవు అని శపియించిన, యయాతి యిట్లనియె. 547**

**ప్రతి :** అని పలికి= ఈ విధంగా మాట్లాడి; నీవు; వనితా జనహేయంబైన= స్త్రీ జనులందరికి అసహ్యం కలిగించే; ముదిమిన్ పొందెదవు= ముసలితనాన్ని పొందుతావు; అని శపియించినన్= అని శపించగా; యయాతి= యయాతి మహారాజు; ఇట్లనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అని శుక్రాచార్యుడు పల్కి ఓ యయాతీ! నీవు స్త్రీలందరూ అసహ్యించుకొనే ముసలితనం పొందుతావు అని శపించేసరికి యయాతి ఇలా అన్నాడు.

**క. మామా! నాపైఁ గోపము, మా మా; నీ పుత్రి యందు మానవు నాకుం**
**గామోపభోగవాంఛలు, ప్రేమన్ రమియించి ముదిమిఁ బిదపన్ దాల్తున్. 548**

**ప్రతి :** మామా= ఓ మామా శుక్రాచార్యా; నాపైన్ కోపము= నా మీద కోపం; మా మా= వలదు వలదు (మానుకో)!; నాకున్= నాకు; నీ పుత్రియందున్= నీ సుతయైన దేవయానిపై; కామోపభోగవాంఛలు= కామమును అనుభవించాలనే కోర్కెలు; మానవు= నాకు ఇంకా నశించలేదు; ప్రేమన్ రమియించి= ఆ కామోపభోగాలను ఆమెయందు ప్రేమతో ఆచరించి; పిదపన్= ఆ తర్వాత; ముదిమిన్= నీవు శపించిన రీతిగా ముసలితనాన్ని; తాల్తున్= ధరిస్తాను.

**తా :** ఓ మామా! నాపై కోపంవద్దు. నీ సుత అయిన దేవయానిపై నాకు వాంఛ తీరలేదు. ఆమెతో మరికొంత కాలం రమించి ఆ తరువాత నేను ముసలితనాన్ని అనుభవిస్తాను.

**వ. అని పలికి యనుజ్ఞ గొని, దేవయానిం దోడ్కొని పురంబునకుఁ జని పెద్దకొడుకగు యదువుం బిలిచి యయాతి యిట్లనియె. 549**

**ప్రతి :** అని పలికి= అని యీ విధంగా వచించి; అనుజ్ఞగొని= అంగీకారము తీసికొని; దేవయానిన్ తోడ్కొని= దేవయానిని తీసికొని; పురంబునకున్ చని= తన పురానికి వెళ్ళి; పెద్దకొడుకగు= తనకు దేవయాని యందు జనించిన పెద్ద కొడుకైన; యదువున్ పిలిచి= యదువు అనేవానిని పిలిచి; యయాతి ఇట్లు అనియెన్= యయాతి ఇలా అన్నాడు.

**తా :** అని చెప్పి యయాతి శుక్రుని అనుజ్ఞనుపొంది దేవయానిని వెంటబెట్టుకొని నగరానికి వెళ్ళి పెద్దకొడుకు అయిన యదువును పిలిచి ఇలా అన్నాడు.

**శా. నీతల్లిం గనినట్టి శుక్రువలనన్ నేఁడీ జరం బొందితిన్;**
**నాతండ్రీ! యదునామధేయ! తనయా! నా వృద్ధతం దాల్పవే**
**నీ తారుణ్యము నాకు నిమ్ము తనివో నిండారఁ గొన్నేండ్లు నేఁ**
**జేతోజాతసుఖంబులం దిరిగెదన్ శృంగారినై పుత్రకా! 550**

**ప్రతి :** నా తండ్రీ! (ఇట తండ్రీ అనే సంబోధన కుమారుని ముద్దుతో పిలిచేది కన్నతండ్రి అని కాదు); యదునామధేయ= యదువు అనే పేరు గలవాడా!; తనయా= ఓ పుత్రా!; నీ తల్లిన్ కనినట్టి= నీ తల్లి అయిన దేవయానిని కన్నవాడైన; శుక్రువలనన్= శుక్రాచార్యునివల్ల; నేఁడు= ఈనాడు (ఈ సమయంలో); ఈ జరన్ పొందితిన్= ఈ ముసలితనాన్ని పొందాను; నా వృద్ధతన్= నా ముసలితనాన్ని; తాల్పవే= నీవు ధరింపవా?!; నీ తారుణ్యమున్= నీ యౌవనాన్ని; నాకున్ ఇమ్ము= నాకు ఇవ్వు; తనివోన్= తనివి చెందేలా (తృప్తి చెందేలా); నిండారన్= పూర్తిగా; కొన్నేండ్లు= కొన్ని వత్సరాలు; శృంగారినై= వివిధ శృంగారాలు (అలంకారాలు) గలవాడనై; పుత్త్రకా= ఓ కుమారా!; నేన్= నేను; చేతోజాత సుఖంబులన్= మన్మథ సుఖాలలో; తిరిగెదన్= జీవితాన్ని సాగిస్తాను.

**తా :** ఓ పుత్రా! యదునామధేయా! నా తండ్రీ! నా కుమారా! నీ తల్లినిగన్న శుక్రాచార్యునివల్ల నేను నేడే ముసలితనాన్ని పొందాను. నీ యౌవనాన్ని నాకు ఇమ్ము. నేను తృప్తి పొందేలా కొన్ని సంవత్సరాలు మన్మథ సౌఖ్యాలతో శృంగారినై తిరుగుతాను.

**వ. అనిన తండ్రికి యదు విట్లనియె. 551**

**ప్రతి :** అనిన= అలా అనగా; తండ్రికిన్= తండ్రియైన యయాతికి; యదువు ఇట్లు అనియెన్= యదువు ఇలా అన్నాడు.

**తా :** యయాతి పల్కులు విని తండ్రియైన యయాతితో కుమారుడైన యదువు ఇలా అన్నాడు.

**శా. కాంతాహేయము దుర్వికారము దురాకండూతి మిశ్రంబు హృ**
**చ్చింతామూలము పీనసాన్వితము ప్రస్వేదవ్రణాకంపన**
**శ్రాంతిస్ఫోటక యుక్త మీ ముదిమి వాంఛం దాల్చి నానాసుఖో**
**పాంతం బైన వయోనిధాన మిది యయ్యా! తేర యీవచ్చునే? 552**

**ప్రతి :** అయ్యా= ఓ తండ్రీ!; కాంతాహేయము= స్త్రీలకు అసహ్యమైనది; దుర్వికారము= చెడ్డ (వికారాలు) మార్పులు కలది; దురాకండూతి మిశ్రంబు= చెడ్డదైన దురదలతో కూడినది; హృచ్చింతామూలము= మనసులో కలుగు చింతకు మూలమైనది; పీనస అన్వితము= పడిసెం (రొంప)తో కూడినది; ప్రస్వేద, వ్రణ, ఆకంపన, శ్రాంతి, స్ఫోటక యుక్తము= చెమట, కురుపులు, వణకు, అలసట, బొబ్బలు మొదలైన వాటితో కూడినది; ఈ ముదిమిన్= ఈ ముసలితనాన్ని; వాంఛన్ తాల్చి= ఇష్టంతో వహించి; నానాసుఖ+ఉపాంతంబైన= అనేక సుఖాలకు చేరువైన; వయోనిధానం ఇది= యౌవనమనే నిధిని; తేరన్= ఊరకే (తేరగా); ఈ వచ్చునే?= ఇవ్వడానికి కుదురుతుందా?

**తా :** తండ్రీ! స్త్రీలు సహించనిది, చెడుమాటలకు నిలయమైనది, భరింపరాని కండూతితో కూడినది, చింతకు మూలమైనది, పడిసెమనే రోగంతో కూడినది, చెమట, కురుపులు వణకు, శ్రమ, బొబ్బలు మొదలైన జబ్బులు గలది ముసలితనం. అటువంటి ముదిమిని ఎవరైనా ఇష్టపడి సుఖానుకూలమైన యౌవననిధిని ఊరకే ఇతరులకు ఇవ్వగలరా?

**వ. అని యదుం డొడంబడకున్న యయాతి తుర్వసు ద్రుహ్యాదుల నడిగిన వారును యదువు పలికినట్లు పలికినఁ గడగొట్టు కుమారుండైన పూరువున కిట్లనియె. 553**

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా; యదుండు= యదువు అనే పుత్రుడు; ఒడంబడకున్నన్= అంగీకరింపక పోయేసరికి; యయాతి= తండ్రి యయాతి మహారాజు; తుర్వసు, ద్రుహ్యాదులన్= తుర్వసు, ద్రుహ్యుడు మొదలైన కుమారులును;

అడిగినన్= అడుగగా; వారును= వారుకూడా; యదువు పలికినట్లు పలికినన్= యదువు చెప్పినట్లే చెప్పగా; కడగొట్టు కుమారుండైన= చివరి కుమారుడైన; పూరువునకున్= పూరువు అనేవానికి; ఇట్లనియెన్= ఇలా అన్నాడు.

**తా :** యదువు తండ్రి మాటలకు అంగీకరింపలేదు. యయాతి తన మిగిలిన పుత్రులు తుర్వసుడు, ద్రుహ్యుడు అనేవారిని అడుగగా వారుకూడా యదువు చెప్పినట్లే సమాధానం చెప్పారు. అప్పుడు యయాతి కడగొట్టు కుమారుడైన పూరువుతో ఇలా అన్నాడు.

**ఉ. 'పిన్నవుగాని నీవు కడుఁ బెద్దవు బుద్ధుల యందు రమ్ము నా**
**యన్న! మదాజ్ఞ దాఁటవు గదన్న! వినీతుఁడ వన్న! నీవు నీ**
**యన్నలు సెప్పినట్లు పరిహారము సెప్పకు మన్న! నా జరన్**
**మన్ననఁ దాల్చి నీ తరుణిమం బొనఁగూర్పుము నాకుఁ బుత్రకా!' 554**

**ప్రతి :** పుత్రకా= ఓ కుమారా!; నీవు; పిన్నవుగాని= వయస్సులో చిన్నవాడవేగాని; బుద్ధుల యందున్= సద్బుద్ధులలో; కడుఁబెద్దవు= మిక్కిలి పెద్దవాడవు; రమ్ము నాయన్న= ఓ అన్న! రమ్ము; మత్+ఆజ్ఞన్= నా ఆనతిని; దాఁటవుగదన్న= జవదాటవుగదా!; వినీతుఁడవన్న= నీవు వినయం గలవాడవు; నీవు నీ యన్నలు+చెప్పినట్లు= నీ సోదరులు చెప్పినరీతిగా; పరిహారము+చెప్పకుము+అన్న= (నా మాటకు) ఎదురు చెప్పకు; నా జరన్= నాముసలితనాన్ని; మన్ననన్ తాల్చి= గౌరవంతో స్వీకరించి; నాకున్= నాకు; నీ తరుణిమంబు= నీ యౌవనం; ఒనగూర్పుము= అందించు.

**తా :** ఓ కుమారా! నీవు వయసులో పిన్నవాడవు కాని బుద్ధులలో పెద్దవాడవు. నీవు నా ఆజ్ఞను దాటవు కదా! నీవు వినయ సంపన్నుడవు. నీవు నీ అన్నలు చెప్పినట్లు ఎదురు చెప్పకు. నా ముసలితనాన్ని నీవు స్వీకరించి నీ యౌవనాన్ని నాకు అందించు.

**వ. అనిన విని, గురుభక్తి గుణాధారుండైన పూరుం డిట్లనియె. 555**

**ప్రతి :** అనినన్ విని= అనగావిని; గురుభక్తి గుణ+ఆధారుండు+ఐన= పెద్దలయందుభక్తి అనే సద్గుణానికి నిలయమైనవాడు; పూరుండు= పూరుడు అనే సుతుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** తండ్రి యయాతి మాటలువిని పెద్దలపై భక్తిగల పూరుడు ఇలా అన్నాడు.

**శా. అయ్యా! నన్నిటు వేఁడనేల? భవదీయాజ్ఞా సముల్లంఘనం**
**బయ్యుండన్ బరిహారమున్ నొడువ నే నన్యాయినే నీ జర**
**న్నెయ్యం బొప్పఁగఁ దాల్చి నా తరుణిమ న్నీ కిచ్చెదన్ బంపినన్**
**గయ్యం బాడెడి పుత్రకుండు గ్రిమిసంకాశుండుఁ గాకుండునే? 556**

**ప్రతి :** అయ్యా= ఓ తండ్రి!; నన్ను+ఇటు వేఁడన్+ఏల= నన్ను ఇలా అడగడం (ప్రార్థించుట) ఎందుకు?; భవదీయ+ఆజ్ఞా సముల్లంఘనంబు+అయ్యుండన్= నీయొక్క ఆజ్ఞను జవదాటేటట్లు మెలగడానికి; పరిహారమున్ నొడువన్= ఎదురుచెప్పడానికి (వ్యతిరేకించుటకు) నేన్ అన్యాయినే= నేను న్యాయం తెలియనివాడనా?!; నీజరన్= నా ముసలితనాన్ని; నెయ్యంబు+ఒప్పఁగన్+తాల్చి= ప్రేమతో వహించి; నా తరుణిమన్= నా యౌవనాన్ని; నీకిచ్చెదన్= నీకు ఇస్తాను; పంపినన్= (తండ్రి)

అజ్ఞాపిస్తే; కయ్యంబు ఆడెడి పుత్రకుండు= తగువులాడే కుమారుడు; క్రిమిసంకాశుండు= క్రిమి (చిన్నపురుగు)తో సమానుడు; కాకుండునే= కాడా?!

**తా :** ఓ తండ్రీ! నీవు నన్ను ఇంతగా ప్రార్థించాలా! నీ యాజ్ఞను అతిక్రమించి పనులు చేయడానికి, నీకెదురు మాట్లాడటానికి నేను న్యాయం తెలియనివాడనా? నీ ముసలితనాన్ని నేను ఇష్టంగా వహించి నా యౌవనాన్ని నీకిస్తాను తండ్రి ఆజ్ఞను తలదాల్చక తగువులాడే పుత్రుడు క్రిమితో సమానుడు కాడా?

**విశే :** యయాతి తన ముసలితనాన్ని స్వీకరించి యౌవనాన్ని ఇమ్మని సుతులను కోరాడు. కుమారులెవ్వరు అంగీకరించలేదు. పూరుడుమాత్రం అంగీకరించాడు. యయాతి తనసుతులను యౌవనాన్ని ఇమ్మనికోరడం సమంజసమా, కాదా అన్న అంశాన్ని అలా ఉంచితే, ఇస్తానని అంగీకరించడం పూరువు గొప్పతనం. పైగాకోరింది తారుణ్యాన్ని. వృద్ధత్వాన్ని ధరించవలసింది కుమారుడు. ముదిమి ఎటువంటిదో ముందు పద్యాలలో చెప్పబడింది. 'జన్మ కష్టం జరాకష్టం' అని పెద్దలు చెప్పనే చెప్పారు. ముసలితనం కడుభయంకరమైన కష్టం. ఎన్నో చేయాలని ఉన్నా చేయలేని అశక్తతా, చింత, ఆశ ఇత్యాదిలక్షణాలతో ఉండేది ముదిమి. తెలిసికూడా పూరువు తనతండ్రి యయాతి ముదిమిని స్వీకరిస్తానన్నాడు; దాన్ని కూడా నెయ్యంతో స్వీకరిస్తానన్నాడు. అంతేకాదు తండ్రిమాట శిరసావహింపని కుమారుడు క్రిమితో సమానుడన్నాడు. ఎప్పుడో జరిగిన ఈ చరిత్ర ఇప్పటికీ మనం జ్ఞప్తిలో ఉంచుకోవాలి. తల్లిదండ్రుల ముసలితనాన్ని మనం స్వీకరించి మనయౌవనం వారికివ్వలేకపోయినా, యౌవనంతో ఉన్న మనం వృద్ధులైన తల్లిదండ్రుల బాధ్యతను ప్రేమతో స్వీకరిస్తే మనం కూడా పూరువు అంతటి వాళ్ళం అవుతాము. ఇంత మాత్రపు ఆలోచన యువకులకు కలిగితే భాగవత పఠనం సార్థకం అయినట్లే.

**వ. అదియునుం గాక. 557**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాకుండా...

**తా :** అదే కాకుండా

**క. మునివృత్తి డయ్య నేటికి, జనపాలక! సుగతిఁ గోరు సత్పురుషులకున్**
**దనుఁ గన్న తండ్రి సెప్పిన, పనిచేసిన సుగతి గొంగుపసిఁడియె కాదే! 558**

**ప్రతి :** జనపాలక= ఓ రాజా!; మునివృత్తిన్= తాపసవృత్తితో; డయ్యన్ ఏటికి= కృశించవలసిన పనిఏల?; సుగతిన్= మంచిమార్గమును; కోరు= కోరుకొనే; సత్పురుషులకున్= సజ్జనులకు; తనున్= తనను; కన్నతండ్రి= కనినటువంటి తండ్రి; చెప్పిన; పనిచేసినన్= పనిచేసినట్లయితే; సుగతి= తాను పొందగోరిన సద్గతి; కొంగు పసిఁడియెకాదే= కొంగు బంగారమే కదా!

**తా :** ఓ రాజా! మంచి మార్గమును పొందడానికి మునివృత్తిని అనుసరించి, కృశించవలసిన పనిలేదు. కన్నతండ్రి ఆజ్ఞను తలదాల్చినవానికి ఆ సుగతి కొంగుబంగారం కదా!

**విశే :** కొంగులోనే ఉన్న బంగారాన్ని వెదుకవలసిన పనిలేదు. తేలికగా చేతికి అందేది అనేసందర్భంలో ఈ జాతీయం వాడుతూ ఉంటారు. ఉత్తమ మార్గాన్ని పొందడానికి తండ్రిమాట తలదాల్చడం ఒక్కటి చేస్తే సరిపోతుంది. వేరే శ్రమపడవలసిన అవసరంలేదు అని భావం.

**క. పనుపక చేయుదు రధికులు, పనిచిన మధ్యములు పొందుపఱుతురు; తండ్రుల్**
**పనిచెప్పి కోరి పనిచిన, ననిశము మాఱాడు పుత్త్రు లధములు తండ్రీ! 559**

**ప్రతి :** తండ్రీ= ఓ జనకా! అధికులు= గొప్పవారు; తండ్రుల్= తమనుకన్నవారు; పనుపక చేయుదురు= ఆజ్ఞాపింపకయే చేయుదురు; మధ్యములు= మధ్యతరగతివారు (రెండవ పక్షంవారు) పనిచినన్= ఆజ్ఞాపించినచో; పొందు పఱుతురు= అనుకూలమయ్యేలా చేస్తారు; పనిచెప్పి= ఒక పనిని చెప్పి; కోరి పనిచినన్= కోరి ఆజ్ఞాపించినను; అనిశము= ఎల్లప్పుడు; మాఱాడు పుత్త్రులు= ఎదురు మాటాడి చేయని కుమారులు; అధములు= కిందిస్థాయివారు (తక్కువవారు).

**తా :** ఓ తండ్రీ! ఉత్తములైన పుత్రులు తమతండ్రి ఆజ్ఞాపింపకయే వారికి కావలసిన పనులు చేస్తారు. మధ్యములైన పుత్రులు తండ్రి ఆజ్ఞాపింపగా వారికి అవసరమైన పనులు సమకూరుస్తారు. కాని తండ్రి కోరి ఆజ్ఞాపించినా ఎల్లవేళలా ఎదురుమాటాడి పనిచేయని కుమారులు అధములు.

**వ. అని పలికి, పూరుండు ముదిమి చేకొని, తన లేఁతప్రాయంబు యయాతి కిచ్చె, అ య్యయాతియుం దరుణుండై, 560**

**ప్రతి :** అని పలికి= అని మాట్లాడి; పూరుండు= పుత్రుడైన పూరుడు; ముదిమి చేకొని= తనతండ్రి యయాతి ముసలితనాన్ని స్వీకరించి; తన లేఁతప్రాయంబు= తన చిన్న వయసును (తన యౌవనాన్ని); యయాతికిచ్చెన్= యయాతికి ఇచ్చాడు. ఆ+యయాతియున్= ఆ యయాతికూడా; తరుణుండై= యౌవనవంతుడై...

**తా :** అని పలికి పూరుడు యయాతియొక్క ముసలితనాన్ని స్వీకరించి తన పిన్నవయస్సును యయాతికిచ్చాడు. యయాతి యౌవనంగలవాడై

**శా. ఏడున్ దీవులు నేడు వాడలుగ సర్వేలాతలం బెల్లఁ బెన్**
**వీడై లోనుగ నేలుచుం బ్రజల నన్వేషించి రక్షింపుచున్**
**దోడం భార్గవి రా మనోజసుఖసంతోషంబులం దేలుచున్**
**గ్రీడించె న్నియతేంద్రియుం డగుచు నాక్రీడా విశేషంబులన్. 561**

**ప్రతి :** ఏడున్ దీవులు= భూమిపైనున్న ఏడుదీవులు; ఏడువాడలుగన్= ఏడు చిన్న చిన్న వీథులుగా; సర్వ+ఇలా తలంబెల్లన్= సమస్త భూమండలం; పెన్ వీడై లోనుగన్ ఏలుచున్= గొప్ప పట్టణంగా చేసికొని పాలిస్తూ; ప్రజలన్= భూప్రజలను అందరినీ; అన్వేషించి= వెదకి (ఎవరెవరికి ఏమి అవసరమో వాటి వాటిని అందించడానికి అన్వేషించి); రక్షింపుచున్= రక్షణ కల్పిస్తూ; తోడన్= తనతో; భార్గవి+రాన్= భృగువంశానికి చెందిన శుక్రాచార్యుని సుత అయిన దేవయాని వెంటనంటి ఉండగా; మనోజసుఖసంతోషంబులన్= మన్మథసుఖాలలో; తేలుచున్= తేలుతూ (తృప్తివహిస్తూ) నియతేంద్రియుండగుచున్= ఇంద్రియాలకు ఉండవలసిన నియమాలతో ఇంద్రియాలను చక్కగా నియంత్రిస్తూ; క్రీడించెన్= క్రీడించాడు (సుఖించాడు) ఆ క్రీడా విశేషంబులన్= ఆయా క్రీడావిశేషాలలో...

**తా :** ఏడు ఖండాలుగా ఉన్న భూమండలాన్ని ఏడు వీథులుగా ఉన్న ఒక పెద్ద పట్టణంగా పరిపాలిస్తూ, ప్రజలందరికి ఏవి ఏవి అవసరమో వాటిని వెదకివెదకి సమకూర్చిరక్షిస్తూ, తోడుగా దేవయాని నిలువగా, వివిధ మన్మథ సుఖసంతోషాలలో మునిగితేలుతూ యయాతి క్రీడించాడు. ఆయా క్రీడా విశేషాలలో

క. మర్మంబుల నతిసాధ్వీ, ధర్మంబుల దేవయాని తన ప్రాణేశున్
నర్మముల మనోవాక్తను, కర్మంబుల నొండు లేక కడు మెప్పించెన్. **562**

**ప్రతి :** దేవయాని= యయాతిభార్య దేవయాని; మర్మంబులన్= గుట్టుమట్టులతో (మన్మథక్రీడామర్మాలతో) అతిసాధ్వీధర్మంబులన్= గొప్పవి అయిన పతివ్రతాధర్మాలతో; తన ప్రాణేశున్= తన ప్రాణనాథుడైన యయాతిని; నర్మములన్= ప్రియవాక్యాలతో; మనోవాక్తనుకర్మంబులన్= మనసు, మాట, క్రియ అను త్రికరణములతో; ఒండులేక= భేదభావములేక (త్రికరణ శుద్ధిగా); కడు మెప్పించెన్= ఎక్కువ సంతృప్తి పరచింది.

**తా :** దేవయాని వివిధములైన గుట్టుమట్టులతో, సాధ్వీధర్మాన్ని తప్పకుండా, ప్రాణేశుడైన యయాతిని ప్రియవాక్యాలతో, త్రికరణ శుద్ధిగా, వేరు ఆలోచన లేకుండా ఆనందపరచింది.

శా. ఆకాశంబున మేఘబృందము ఘనంబై సన్న మై దీర్ఘమై
యేకంబై బహురూపమై యణఁగు నట్లేదేవు గర్భంబులో
లోకశ్రేణి జనించుచున్ మెలఁగుచున్ లోపించు నా దేవు సు
శ్రీకాంతున్ హరిఁ గూర్చి యాగములు సేసె న్నాహుషుం డిమ్ములన్. **563**

**ప్రతి :** ఆకాశంబునన్= ఆకాశంలో; మేఘబృందము= మబ్బులగుంపు; ఘనంబై= దట్టమై; సన్నమై= పలుచనై; దీర్ఘమై= పొడుగై; ఏకంబై= ఒక్కటిగానై; బహురూపమై= వివిధ రూపములుగలదై; అణఁగునట్లు= అణగిపోవునట్లు (కనబడకుండా పోవునట్లు); ఏ దేవుగర్భంబులోన్= ఏ దేవుని ఉదరంలో; లోకశ్రేణి= లోకముల పరంపర; జనించుచున్= జన్మిస్తూ; మెలఁగుచున్= ఉంటూ; లోపించున్= నశిస్తుందో; ఆ దేవున్= ఆ పరాత్పరుని; సుశ్రీకాంతున్= మంగళకరుడైన లక్ష్మీపతిని; హరిన్ కూర్చి= విష్ణువునుగూర్చి; నాహుషుండు= నహుషుని పుత్రుడైన యయాతిమహారాజు; ఇమ్ములన్= విరివిగా; యాగములు+చేసెన్= యజ్ఞములు కావించాడు.

**తా :** ఆకాశంలో మేఘాల సముదాయం దట్టమై, పలుచనై, పొడవై, ఏకమై, వివిధాకృతులుగా మారి అణగిపోయినట్లు; ఏ పరమాత్మయొక్క గర్భంలో ఈ లోకాల సముదాయం పుట్టి, ప్రవర్తిల్లి, నశించిపోతాయో ఆ పరమాత్ముడైన హరినిగూర్చి యయాతి మహారాజు విస్తారంగా యాగాలు చేశాడు.

వ. మఱియు. **564**

**ప్రతి :** మఱియున్= ఇంకా...

**తా :** అంతేగాక

మ. చెలికాంద్రం గరులన్ రథమ్ముల భటశ్రేణిం దురంగంబులం
గలలోఁ గన్న ధనాళితో సమములంగాఁ జూచుచున్, భార్యతోఁ
బలు వేలేండ్లు మనోజభోగ లహరీపర్యాప్తుఁడై తేలియున్
బలుతృష్ణం గడఁగాన కెంతయు మహాబంధంబులన్ స్రుక్కుచున్. **565**

**ప్రతి :** చెలికాంద్రన్= స్నేహితులను; కరులన్= ఏనుగులను; రథమ్ములన్= రథాలను; భటశ్రేణిన్= బంటుల గుంపును; తురంగంబులన్= గుర్రాలను; కలలోన్ కన్న= కలలో చూచిన; ధన+ఆళితోన్= సంపదలతో; సమములన్గాన్=

సమానాలుగా; చూచుచున్= చూస్తూ; భార్యతోన్= తన భార్య దేవయానితో; పలువేలేండ్లు= చాలా వేలవత్సరాలు; మనోజభోగలహరీ పర్యాప్తుఁడై తేలియున్= మన్మథభోగ ప్రవాహంలో తేలినవాడైనప్పటికీ; బలుతృష్ణన్= మిక్కిలి దాహంతో (ఎక్కువ విషయాల మీద ఆసక్తితో) కడన్‌కానక= తుదిచూడక (తృప్తిపడక); ఎంతయున్= ఎంతో; మహాబంధమ్ములన్= గొప్ప బంధాలకు చిక్కి; స్రుక్కుచున్= దుఃఖిస్తూ...

**తా :** యయాతి మహారాజు తనస్నేహితులు, గజాలు, రథాలు, భటుల సముదాయం, గుర్రాలు మొదలైనవాటిని కలలో కన్న సంపదలతో సమానంగా చూస్తూ, తనభార్య దేవయానితో వేలకొలది సంవత్సరాలు మన్మథభోగాల ప్రవాహంలో తేలిన వాడైనప్పటికీ అధికమైన తృష్ణకు అంతాన్ని కనలేక అనేక బంధాలలో చిక్కి బాధపడుతూ

**వ. ఒక్కదినంబున నాత్మజ్ఞానంబునం జేసి కాంతానిమిత్తంబున మోసపోవుట యెఱింగి యయాతి యతివిషాదంబు నొంది దేవయాని కిట్లనియె. 566**

**ప్రతి :** ఒక్కదినంబునన్= ఒకరోజున; యయాతి= యయాతి మహారాజు; ఆత్మజ్ఞానంబునన్ చేసి= తన ఆత్మజ్ఞానంవల్ల; కాంతానిమిత్తంబునన్= ఒక స్త్రీ కారణంగా (తన భార్య దేవయాని కారణంగా); మోసపోవుట యెఱింగి= వంచనకు గురికావడం తెలిసికొని; అతివిషాదంబునొంది= ఎక్కువ దుఃఖాన్ని పొంది; దేవయానికి+ఇట్లు+అనియెన్= దేవయానితో ఇలా అన్నాడు.

**తా :** ఒకనాడు యయాతి మహారాజు తన ఆత్మ జ్ఞానంవల్ల తన భార్య దేవయాని కారణంగా వంచనకు గురికావడం తెలిసికొని ఎక్కువ దుఃఖాన్నిపొంది దేవయానితో ఇలా అన్నాడు.

## ✤ యయాతి దేవయానికి బస్తోపాఖ్యాన మనెడి వ్యాజంబున స్వవృత్తాంతంబు దెలుపుట ✤

**క. 'మనచారిత్రము వంటిది, విను మితిహాసంబు గలదు; వృద్ధజనములున్**
**మునులును మెత్తురు; నీవును, మనమున నంగీకరింపు మంజులవాణీ! 567**

**ప్రతి :** మంజులవాణీ= ఓ మనోహరభాషిణీ! (చక్కగా మాట్లాడుదానా! దేవయానీ!) మన చారిత్రము వంటిది= మన చరిత్రతో సరిపోయే విషయం; ఇతిహాసంబు గలదు= పూర్వం జరిగిన వృత్తాంతం ఉన్నది; విను; వృద్ధజనములున్= వయస్సుచే పెద్దవారు; మునులును= మునివృత్తిలో ఉన్న తాపసులు; మెత్తురు= ఈ విషయాన్ని విని మెచ్చుకుంటారు; నీవును= నీవుకూడా; మనమునన్ అంగీకరింపు= మనస్సుతో అంగీకారాన్ని తెలియజేయి (మనఃపూర్వకంగా విను).

**తా :** ఓ సుమధుర భాషిణీ! దేవయానీ! సరిగా మన చరిత్రవంటిదే గతంలో జరిగిన వృత్తాంతము ఒకటి ఉన్నది. దానిని పెద్దలు, మునులు విని సంతోషిస్తారు. నీవు కూడా మనసుపెట్టి విని అంగీకరించు.

**వ. అది యెట్టి దనిన. 568**

**ప్రతి :** అది= ఆ వృత్తాంతం; ఎట్టిది+అనినన్= ఎటువంటిది అంటే...

**తా :** అది ఎలాంటిదంటే

**సీ. అజ మొకం డడవిలో నరుగుచుఁ దాఁ గర్మ ఫలమున నూతిలోపలికి జాఱి**
**లోఁగెడి ఛాగి నాలోకించి కామియై కొమ్మున దరిఁ గొంత గూలఁ ద్రోచి**

**వెడలింప న ఛ్ఛాగి విభునిగా c గోరిన నగుcగాక యని తాను నదియుc దిరుగ**
**నెన్నియేనియుc దన్ను నెంత కామించిన నన్నింటికిని భర్తయై తనర్చి**

**తే. వాని నే ప్రొద్దు రతులకు వశలc జేసి, సొరిదిc గ్రీడించి క్రీడించి చొక్కి చొక్కి**
**కాముc డనియెడు దుస్సహగ్రహముకతనc, జిత్త మేమఱి మత్తిల్లి చెల్లc జిక్కె. 569**

**ప్రతి :** అజము ఒకండు= ఒక మేకపోతు; అడవిలోన్+అరగుచున్= అడవిలో తిరుగుతూ; తాన్= తాను; కర్మఫలమునన్= కర్మఫలంచేత; నూతిలోపలికిన్ జాఱి= నూతిలోపడి; లోcగెడి= దుఃఖించెడి; ఛాగిన్= ఆడుమేకను; ఆలోకించి= చూచి; కామియై= కామం పొంది (ఆ ఆడు మేకపై మరులుగొని); కొమ్మునన్= తన కొమ్ముతో; దరిన్ కొంత గూలన్ త్రోచి; ఒడ్డును కొంత కూలునట్లు చేసి; వెడలింపన్= బయటకు వెడలేలా చేయగా; ఆ+ఛాగి= ఆ ఆడుమేక; విభునిగాన్ కోరినన్= భర్తగా కోరగా; అగున్కాక= అట్లే అగుగాక; అని= అంగీకరించి; తానున్= ఆ మేకపోతు; అదియున్= ఆ ఆడుమేకయు; తిరుగన్= జతకట్టి తిరుగగా; ఎన్ని ఏనియున్= ఎన్ని ఆడుమేకలు అయినను; తన్నున్= తనను; ఎంత కామించినన్= ఎంత కోరుకొన్నప్పటికిని; అన్నింటికిని= (తనను చేరిన) ఆడు మేకలన్నిటికిని; భర్తయై= తాను మగడై; తనర్చి= ఒప్పి; వానిన్= వానినన్నిటిని; ఏ ప్రొద్దున్= అన్ని వేళలందు; రతులకున్= మన్మథక్రీడలకు; వశలన్ చేసి= వశం అయ్యేలా చేసి; సొరిదిన్= క్రమంగా; క్రీడించి క్రీడించి= వాటితో రమించి; చొక్కి చొక్కి= మిక్కిలి పరవశించి; కాముc డు+అనియెడు= మన్మథుడు అనేటువంటి; దుస్సహ= సహించుటకు వీలులేని; గ్రహము కతనన్= గ్రహంవల్ల (విడిపించుకొనుటకు వీలులేని గ్రహానికి చిక్కి) చిత్తము ఏమఱి= మనసు మరచి; మత్తిల్లి= మత్తులో మునిగి; చెల్లన్= సాగగా; చిక్కెన్= చిక్కుకుంది.

**తా :** ఒక అడవిలో ఒక మేకపోతు తిరుగుతూ, కర్మవశాన నూతిలోనికి జారిపడి బాధపడుచున్న ఒక ఆడుమేకను చూచి, దానిని కామించి, తన కొమ్ములతో ఆ ఆడుమేకను గట్టుమీదకు వచ్చేలా చేసింది. ఆ ఆడుమేక ఈ మేకపోతును భర్తగాకోరగా, అటులే అంగీకరించింది. ఆ ఆడుమేకతో తనను ఎన్ని మేకలు కామించి వెంట తిరిగాయో అన్నిటికీ ఈ మేకపోతు భర్తగా ఉంది. కూడియున్న ఆడుమేకలను అన్నివేళలయందు కామక్రీడలలో ముంచి, వాటన్నిటితో బాగాక్రీడించి, ఎంతో ఆనందపడి, మన్మథుడనే విడువని గ్రహం బారిపడి, మనసు మరచిపోయి, మత్తెక్కి దానికి (ఆ మన్మథ భయంకర భూతానికి) చిక్కింది.

**క. వెడవింటివాని చిగురా, కడిదపు వ్రేటునకు లొంగి యతిమోహితుcడై**
**విడువక సతులం దగిలెడు, జడునకు నెక్కడివి బుద్ధిచాతుర్యంబుల్? 570**

**ప్రతి :** వెడవింటివాని= మన్మథునియొక్క; చిగురాకు+అడిదము+వ్రేటునకున్= చిగురాకు అనే కత్తి దెబ్బకు; లొంగి= తలవంచి; అతిమోహితుcడై= అధికమైన వ్యామోహం కలవాడై; విడువక= విడిచిపెట్టకుండా నిరంతరం; సతులన్= స్త్రీలను; తగిలెడి= తగులుకొనే; జడునకున్= మందబుద్ధికి (మూర్ఖునకు); బుద్ధిచాతుర్యంబుల్= తెలివితేటలు; ఎక్కడివి= ఎక్కడినుండి వస్తాయి. రావు సుమా!

**తా :** మన్మథుని చిగురాకు బాకు దెబ్బలకులోనై, మిక్కిలి మోహంతో ఎడతెగకుండా స్త్రీల పొందునుగోరే మూర్ఖుడికి బుద్ధిచాతుర్యాలు ఎలా ఉంటాయి?

**వ. అంత న చ్ఛాగంబు తన పిదపం దగిలిన ఛాగీనివహంబు లోపలం జూడ నొప్పెడి ఛాగియందుఁ దగిలి, క్రీడింపం గని, నూతిలోపలం బడి వెలువడిన ఛాగి, తన పతివలని నెయ్యంబు లేకుండుటకు విన్ననై తన మనంబున. 571**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట; ఆ+ఛాగంబు= ఆ మేకపోతు; తనపిదపన్= తనవెంట; తగిలిన= తగులుకొన్న అనుసరిస్తున్న; ఛాగీనివహంబు లోపలన్= ఆడు మేకల సమూహంలో; చూడన్ ఒప్పెడి= అందంగా ఉన్న; ఛాగియందున్= ఆడుమేక యందు; తగిలి= తగులుకొని (ప్రేమనుపొంది); క్రీడింపన్= క్రీడిస్తుండగా; కని= చూచి; నూతిలోపలన్= నూతిలో; పడి= కూలి; వెలువడిన ఛాగి= బయటకు వచ్చిన ఆడుమేక; తన పతివలని= తన భర్తవల్ల; నెయ్యంబు లేకుండుటకున్= ప్రేమలేకుండా ఉండటాన్ని చూచి; (తన భర్త తనను ఇష్టంగా చూడటంలేదని గ్రహించి); విన్ననై= వెలవెలపోయి; దైన్యంపొంది; తనమనంబునన్= తన మనసులో...

**తా :** ఆ తరువాత ఆ మేకపోతు తనవెంట ఉన్న ఆడుమేకల సమూహంలో అందంగా ఉన్న ఒక ఆడుమేకపై మనసుపడి, దానితో ఇష్టంగా సంచరిస్తుండగా నూతిలోపడి రక్షింపబడిన ఆడుమేక, తనభర్త తనను ప్రేమగా చూడటంలేదనే విషయం గ్రహించి దైన్యాన్ని పొంది తన మనస్సులో

**క. పలికిన పలుకులు పలుకఁడు, కలఁచు న్నవకాంతఁ జూచి కదు సంచలుఁడై**
**నిలిచిన చోట న్నిలువఁడు, నిలు వెల్లను గల్ల కామి నిజమరి గలఁడే. 572**

**ప్రతి :** పలికిన పలుకులు పలుకఁడు= నేను మాట్లాడినా నాతో తిరిగి మాట్లాడదు; నవకాంతన్ చూచి= కొత్త స్త్రీని చూచి; కలఁచున్= కలుగుందుపడి ఆమెకొరకు వెంపర్లాడుతాడు; కదుసంచలుఁడై= మిక్కిలి తొట్రుపాటు పొంది; నిలిచిన చోటన్నిలువఁడు= ఉన్నచోట ఉండదు; నిలువెల్లను= మొదటినుండి చివరివరకు (మొత్తం జీవితమంతా) కల్ల= మోసం; కామి= స్త్రీలను రమించడమే కోరికగా గలవాడు; నిజమరి= సత్యవంతుడై; కలఁడే= ఉంటాడా?

**తా :** నేను మాట్లాడించినా, నాతో తిరిగి మాట్లాడటానికి ఇష్టంలేకుండా నా భర్త ఉన్నాడు. క్రొత్తగా దొరికిన ఈ ఆడుమేకను చూచి మిక్కిలి తొందరతో ఆమెనే కలవాలనిచూస్తూ, నిలుచున్నచోట నిలబడలేక తొట్రుపాటు పడుతున్నాడు. నాభర్త నిలువెల్లా మోసం చేయడమే లక్షణంగా కలిగి ఉన్నాడు. అయినా కామికి సత్యనిష్ఠ ఉండదుకదా!

**వ. అని పలికి, విడిచి చనిన, న య్యజవల్లభుండు సురతపరతంత్రుఁడై, మిసిమిసియను శబ్దంబు సేయుచు, న చ్ఛాగి వెంటం జని, యొడంబఱుపం జాలకుండె, అంత దానికిఁ గర్తయైన బ్రాహ్మణుండు రోషంబున రతిసమర్థంబు గాకుండ నల్లాడుచున్న ఛాగవృషణంబులు త్రెంచివేసిన, న చ్ఛాగంబు గ్రిందఁ బడి, వేఁడుకొనినఁ బ్రయోజనంబు వొడగని, యోగవిదుండు గావున, బ్రాహ్మణోత్తముండు గ్రమ్మఱ న య్యజవృషణంబులు సంధించిన. 573**

**ప్రతి :** అని పలికి= ఈ విధంగా మాట్లాడి; విడిచి చనినన్= ఆ మేకపోతును విడిచిపెట్టిపోగా; ఆ+అజవల్లభుండు= ఆ ఆడుమేక భర్త; సురత పరతంత్రుఁడై= రతిపట్ల ఆసక్తి కలవాడై; మిసి మిసి అనే శబ్దంబు చేయుచున్= మిసి మిసి అంటూ ధ్వనిచేస్తూ; ఆ+ఛాగి వెంటన్ చని= ఆ ఆడుమేక వెంటవెళ్ళి; ఒడంబఱుపన్ చాలక ఉండెన్= అంగీకరింప చేయలేకపోయింది;

అంతన్= అంతట; దానికిన్= ఆ మేకపోతుకు; కర్తయైన= యజమానియైన; బ్రాహ్మణుండు= బ్రాహ్మణుడు; రోషంబునన్= కోపంతో; రతిసమర్థంబు+కాకుండన్= ఆడుమేకలతో పొందునకు వీలుకాకుండా ఉండేవిధంగా; అల్లాడుచున్న= పేలాడుతూ ఉన్న; ఛాగవృషణంబులు= ఆ మేకపోతు అండములను; త్రెంచివేసినన్= తెగగొట్టగా; ఆ+ఛాగంబు= ఆ మేకపోతు; క్రిందన్‌పడి= నేలవ్రాలి; వేఁడుకొనినన్= ప్రార్థించినా; ప్రయోజనంబు వొడగని= ప్రయోజనం తెలిసికొని; యోగ విదుండు గావునన్= యోగవిజ్ఞాని అయిన కారణంగా; బ్రాహ్మణోత్తముండు= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు; క్రమ్మఱన్= తిరిగి; ఆ+అజవృషణంబులు= ఆ మేకపోతు అండములు; సంధించినన్= అతికించగా.

**తా :** ఇట్లుపలికి, ఆ ఆడుమేక విడిచిపోగా, ఆ మేకపోతు రతిక్రియయందు మిక్కిలి ఆసక్తితో శబ్దంచేస్తూ ఆ ఆడుమేక వెంటబడి దాన్ని అంగీకరింప జేయజాలక ఉంది. శబ్దంచేస్తూ ఆడుమేక కొరకు అల్లాడి పోతున్న ఆ మేకపోతు యజమాని అయిన బ్రాహ్మణుడు కోపంతో ఆ మేకపోతు అండములను రతిక్రియకు వీలుపడకుండేలా త్రెంచివేశాడు. ఆ మేకపోతు క్రిందామీదా పడి వేడుకొనేసరికి యోగవిదుడైన ఆ బ్రాహ్మణుడు పర్యవసానం గుర్తించి ఆ మేకపోతుకు అండాలు తిరిగి అతికించాడు.

### క. వృషణములు మరలఁ గలిగిన, సుషముండై ఛాగివిభుఁడు సుందరితోడన్
### విషయసుఖంబులఁ బొందుచుఁ, దృష తుదిఁ గనఁ డయ్యెఁ బెక్కు దివసము లయ్యున్. 574

**ప్రతి :** ఛాగి విభుఁడు= ఆ ఆడుమేకభర్త; వృషణములు= అండములు; మరలన్ కలిగినన్= తిరిగి లభించేసరికి; సుషముండై= కాంతిగలవాడై; (పటుత్వంగలవాడై); సుందరితోడన్= అందగత్తె అయిన ఆడుమేకతో; విషయసుఖంబులన్= విషయ సుఖాలను (కామసుఖాలను); పొందుచున్= అనుభవిస్తూ; పెక్కు దివసములయ్యున్= ఎంతకాలం అయినప్పటికీ; తృషతుదిన్= విషయదాహానికి తుదిని; కనఁడయ్యెన్= చూడలేకపోయాడు (విషయసుఖాలలో సంతృప్తిని పొందలేకపోయాడు).

**తా :** ఈ విధంగా మేకపోతు తిరిగి తన వృషణాలను పొంది పటుత్వంతో తన ఆడుమేకతో విషయసుఖాలను పెక్కుకాలం అనుభవించికూడా వాటిపై ఆశవిడవలేక 'ఇకచాలు' అనే తృప్తి పొందలేక పోయాడు.

### వ. అని యీ విధంబున యయాతి దేవయానికి నిజవృత్తాంతంబు గథారూపంబున నెఱింగించి యిట్లనియె. 575

**ప్రతి :** అని ఈ విధంబునన్= అని ఈ ప్రకారంగా; యయాతి= యయాతి మహారాజు; దేవయానికిన్= తన భార్య దేవయానికి; నిజవృత్తాంతంబు= తన సమాచారాన్ని; కథారూపంబునన్= ఒక కథవలె; ఎఱింగించి= తెలియజేసి; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని ఈ విధంగా యయాతి దేవయానికి తనసంగతినే కథారూపంలో తెలియజేసి ఇలా అన్నాడు.

**విశే :** ఈ ఉపాఖ్యానానికి 'బస్తోపాఖ్యానము' అనిపేరు. బస్తము అనే శబ్దానికి ఛాగము, మేకపోతు అని అర్థం. వివేకంగల యయాతి సంసార సుఖాల తృష్ణతీరని స్థితి గమనించి తన భార్య దేవయానితో చెప్పుచున్న విషయం ఇది. ఇందులో యయాతి మహారాజు మేకపోతు, దేవయాని కర్మవశాన నూతిలోపడిన ఆడుమేక, దానిని గట్టుకు చేర్చిన మేకపోతు యయాతి. ఆడుమేక దేవయాని కోరుకోగా మేకపోతు యయాతి వివాహం చేసికొన్నాడు. వెంటబడిన ఆడుమేకలు శర్మిష్ఠ. ఆమెను ప్రేమతో చూచిన విషయాన్ని గమనించి దేవయాని కోపంపొందితే ఆమెను అనునయించే ప్రయత్నం యయాతి

చేయగా శుక్రాచార్యుడు అతనికి యౌవనంలేకుండా ముదిమిని పొందుమని శపించడమే యజమాని ఛాగముయొక్క వృషణాలు తెగగొట్టడం. శాపాంతం చెప్పడమే యోగవిదుడైన బ్రాహ్మణుడు తిరిగి అండాలను అతికించడం. యయాతి విషయవాంఛల తుది చూడలేకపోవడమే ఈ బస్తోపాఖ్యానంలోని మేకపోతు మాటలు. బస్యతే హింస్యత ఇతిబస్తః బస్త అర్దనే. హింసింపబడునది అని 'బస్త' శబ్దానికి వ్యుత్పత్తి.

**మ. అబలా! నీ నిబిడాతి దుర్జయ సలజ్జాపాంగభల్లంబులం**
**ప్రబలంబైన మనంబు భగ్నముగ నా ప్రావీణ్యముం గోలుపో**
**యి బలిష్ఠుండగు కాముఁబారిఁ బడి నే నెట్లోర్చెదన్ బంది క**
**త్తె బడిం బాపపుఁ దృష్ణ యిప్పు డకటా! దీర్ఘాకృతిన్ రొప్పెడిన్. 576**

**ప్రతి :** అబలా= ఓ కాంతా! (దేవయానీ!); నీ= నీయొక్క; నిబిడ= దట్టమైన; అతిదుర్జయ= జయించుటకువీలులేని; సలజ్జా= సిగ్గుతోకూడిన; అపాంగ= కడగంటి చూపులనే; భల్లంబులన్= బాణాలచేత; ప్రబలంబైన= మిక్కిలి బలమైన; మనంబు= నా మనసు; భగ్నముగన్= ముక్కలుకాగా; నా ప్రావీణ్యమున్= నా సామర్థ్యాన్ని (నా పటుత్వాన్ని); కోలుపోయి= పోగొట్టుకొని; బలిష్ఠుండగు= మిక్కిలి బలవంతుడైన; కాముఁబారిన్‌పడి= మన్మథునివశమై; నేన్ ఎట్లోర్చెదన్= నేను ఎలా సహిస్తాను?!; బందికత్తెబడిన్= (చెరలో) వేయుదాని వశమై; పాపపుఁదృష్ణ= పాపాన్ని పొందిన ఈ నా పిపాస; ఇప్పుడు= ఈ సమయంలో; దీర్ఘాకృతిన్= పెద్దదై (అధికమై); రొప్పెడిన్= బాధపడుతుంది; అకటా= అయ్యో!

**తా :** ఓ భామినీ! దేవయానీ! దట్టమై జయించడానికి వీలులేని, సిగ్గుతో కూడిన నీక్రీగంటి చూపులనే బాణాల దెబ్బలకు ఎంతో బలమైన నా మనసు ముక్కలై దాని నైపుణ్యాన్ని కోలుపోయింది. చాలాబలం కలిగిన ఈ మన్మథుని బారినుండి నేనెలా తప్పించుకొని ఓర్చుకోగలను? చెరలో బడిన స్త్రీవలె నా పాపపు తృష్ణ అధికమై మిక్కిలి దుఃఖిస్తోంది. అయ్యో!

**క. అదలదు ప్రాణము లదలినఁ, గదలదు సర్వాంగకములు గదలుచు నున్నన్**
**వదలదు బిగువులు వదలినఁ, దుదిలే దీ తృష్ణ దీనిఁ ద్రుంపఁగ వలయున్. 577**

**ప్రతి :** ఈ తృష్ణ= ఈ కోరికలదాహం; ప్రాణములదలినన్= ప్రాణాలు కదలిపోతున్నా; అదలదు= ఇది మాత్రం చలించదు; సర్వాంగకములు= శరీరంలో ఉన్న అన్ని అవయవాలు; కదలుచునున్నన్= కదలిపోతూ ఉన్నా; కదలదు= ఇది మాత్రం కొంచెం కూడ సడలడంలేదు; బిగువులు= శరీరానికి ఉన్న బింకములు; వదలినన్= వీడిపోయినా; వదలదు= ఇది మాత్రం విడువడంలేదు; తుదిలేదు= ఈ తృష్ణకు మాత్రం అంతంలేదు; దీనిన్= ఈ తృష్ణను; త్రుంపగాన్ వలయున్= త్రుంచి వేయాలి.

**తా :** ఈ కోర్కెల దాహం ప్రాణాలు అల్లాడుతూ ఉన్నా చలించడంలేదు. శరీరావయవాలు వణకిపోతూ ఉన్నా కదలడంలేదు. శరీరానికి ఉన్న పొంకాలు వీడిపోయినా ఇది విడువడం లేదు ఈ తృష్ణకు సంతృప్తిలేదు. దీనిని (ఈ తృష్ణను) తుంచివేయాలి.

**క. వెయ్యేం డ్లయ్యెను నీతోఁ, గ్రయ్యంబడి యున్నవాఁడఁ గామసుఖములం**
**గ్రుయ్య దొక యించుకైనన్, దయ్యదు కొన లిడియెఁ దృష్ణ నవపద్మముఖీ! 578**

**ప్రతి :** నవపద్మముఖీ= వికసించిన పద్మమువంటి ముఖంకలదానా!; నీతోన్= నీతో; క్రయ్యంబడి= కూడి; ఉన్నవాఁడన్= ఉన్నాను; వెయ్యేండ్లయ్యెన్= వేయి సంవత్సరాలు అయింది; కామసుఖములన్= కామ సుఖాల విషయంలో; తృష్ణ=

ఈ కోర్కెలదాహం; ఒక ఇంచుకైనన్= కొంచెమైనా; క్రుయ్యదు= చాలు అనదు (సంతృప్తి పడదు); డయ్యదు= అలసిపోదు; కొనలిడియెన్= కొనలుసాగుతోంది (అధికం అవుతోంది).

**తా :** వికసించిన పద్మమువంటి ముఖం కలదానా! వేయి సంవత్సరాలుగా నిన్ను కూడి ఉన్నాను అయినా కామసుఖాల పట్ల ఆసక్తి తగ్గడంలేదు. కొంచెమైనా బడలిక కలగడంలేదు. ఈ తృష్ణ కొనలుసాగుతూ పెరుగుతూనే ఉంది.

**క. ముదిసెను దంతావళియును, ముదిసెను కేశములుఁ దనువు ముదిసెం దనకున్**
**ముదియనివి రెండు చిక్కెను, బ్రదికెడి తీపియును విషయపక్షస్పృహయున్. 579**

**ప్రతి :** దంత+ఆవళియును= దంతాలవరుస; ముదిసెను= ముసలితనం పొందింది; (రాలిపోయాయి); కేశములున్= తల వెంట్రుకలు; ముదిసెను= ముసలివయ్యాయి (తెల్లబడ్డాయి); తనువు= శరీరం; ముదిసెన్= ముసలిది అయ్యింది. (ముడుతలుపడింది) తనకున్= తనకైతే; ముదియనివి= ముసలివికానివి; రెండు చిక్కెను= రెండు మాత్రం మిగిలి ఉన్నాయి; (అవి) బదికెడి తీపియును= ఇంకా బ్రదకాలి అనే తియ్యనికోర్కె; విషయపక్ష స్పృహయున్= ఇంద్రియాల సంబంధమైన సుఖాలయందు ఆసక్తియును.

**తా :** దంతాలు ఊడినా, కేశాలు తెల్లబడినా శరీరం ముడతలుబడినా ఈ విధంగా ముసలితనం లక్షణాలు వచ్చినా బతకాలనే కాంక్ష, ఇంద్రియ సుఖాలపట్లకోరిక ఈ రెండూ మాత్రం విడువలేదు.

**క. కడ లే దాశాలతకును, గడఁజూడఁగఁ గానరాదు కడఁ గనిరేనిన్**
**గడుముదమున సంసారము, గడఁ గందురు తత్త్వవిదులు కమలదళాక్షీ! 580**

**ప్రతి :** కమలదళాక్షీ= ఓ పద్మాక్షీ!; ఆశాలతకును= ఆశ అనే తీగకు; కడలేదు= అంతంలేదు; కడన్= అంతాన్ని చూడఁ గన్= చూడగా; కానరాదు= కన్పట్టదు; తత్త్వవిదులు= తత్త్వం తెలిసినవారు; కడన్, కనిరేనిన్= (ఈ ఆశ అనే లతకు) అంతాన్ని చూచినట్లయితే; కడుముదమునన్= మిక్కిలి ఆనందంతో; సంసారము= సంసారంయొక్క; కడన్ కందురు= తుదిముట్టగలరు.

**తా :** ఓ పద్మాక్షీ! ఆశ అనే తీగకు అంతంలేదు. చూద్దామన్నా ఆశకు తుద కన్పట్టదు. తత్త్వజ్ఞానం గలవాళ్ళు మాత్రం ఆశకు అంతాన్ని చూడగలిగితే సంతోషంతో సంసారాన్ని తుదిముట్టగలరు (సార్థకంగా జీవించగలరు).

**క. మండన హాటక పశు వే, దండాశ్వ వధూ దుకూల ధాన్యాదులు పె**
**క్కుండియు నాశాపాశము, ఖండింపఁగ లేవు మఱియుఁ గడమయ చుమ్మీ. 581**

**ప్రతి :** మండన= అలంకారాలు; హాటక= సువర్ణం (బంగారం); పశు= పశువులు; వేదండ= ఏనుగులు; అశ్వ= గుర్రాలు; వధూ= స్త్రీ జనము; దుకూల= పట్టువస్త్రాలు; ధాన్య+ఆదులు= ధాన్యం మొదలైనవి; పెక్కుండియున్= ఎన్నో ఉండికూడా; ఆశాపాశమున్= ఆశ అనే తాటిని; ఖండింపఁగలేవు= తెగగొట్ట జాలవు; మఱియున్= పైచెప్పిన వస్తుసముదాయం ఎంత ఉన్నప్పటికీ కూడా; కడమయచుమ్మీ= కొరత(లోటు) తప్పదు సుమా!

**తా :** భూషణాలు, బంగారం, పశువులు, ఏనుగులు, గుర్రాలు, స్త్రీలు, పసిడి, వస్త్రాలు, ధాన్యం మొదలైనవి ఎన్ని ఉన్నప్పటికీ, ఆశ అనే పాశాన్ని ఖండించలేవు, సరికదా ఎన్ని ఉన్నా ఏదో ఒకలోటు కన్పిస్తూనే ఉంటుంది.

**క. కామోపభోగసుఖములు, వేమాఱును బురుషుఁ డనుభవింపుచు నున్నం**
**గామంబు శాంతిఁ బొందదు, ధూమధ్వజుఁ డాజ్యవృష్టిఁ ద్రుంగుడు వడునే? 582**

**ప్రతి :** కామ+ఉపభోగసుఖములు= విషయ సుఖాలు; వేమాఱును= వేయిమార్లు (అధికంగా) పురుషుఁడు= మానవుడు; అనుభవించుచున్నన్= అనుభవిస్తున్నప్పటికీ; కామంబు= కోరిక; శాంతిన్ పొందదు= శాంతి పొందదు (తృప్తిపడదు); ధూమధ్వజుఁడు= ధూమమే, ధ్వజంగా కలవాడు (పొగ జెండా కలవాడు); అగ్నిహోత్రుడు; ఆజ్యవృష్టిన్= నేతిధారతో; త్రుంగుడు పడునే= అణగుతాడా? (శాంతిబొందదు).

**తా :** కామసుఖాలు ఎన్నిమార్లు మానవుడు అనుభవించినా కోరిక మాత్రం అణగారదు. అగ్నిహోత్రుడు నేతిధారపోస్తే అణగుతాడా? అణగడు కదా!

**ఆ. అక్క తల్లి చెల్లె లాత్మజ యెక్కిన, పాను పెక్కఁ జనదు పద్మనయన!**
**పరమయోగికైన బలిమిని నింద్రియ, గ్రామ మధికపీడఁ గలుగఁ జేయు. 583**

**ప్రతి :** పద్మనయన!= తామరలవంటి కనులుగలదానా! పరమయోగికైనన్= గొప్ప జోగికి కూడా; అక్క, తల్లి, చెల్లెలు, ఆత్మజ= అక్క, అమ్మ, చెల్లి, కూతురు; ఎక్కిన; పానుపు= పాన్పును; ఎక్కన్ చనదు= ఎక్కుటకూడదు; బలిమినిన్= బలంతో; ఇంద్రియగ్రామము= ఇంద్రియాల సమూహం; అధికపీడన్= ఎక్కువ బాధను; కలుగన్ చేయున్= కలుగజేస్తుంది.

**తా :** ఓ తామరసాక్షి! అక్క, తల్లి, చెల్లెలు తన కొమరిత ఉన్న పాన్పుపై కలసి మనం కూర్చుండరాదు కారణం ఏమంటే పరమయోగికైనా ఇంద్రియాల సమూహం అధికమైన కష్టాన్ని కలుగజేస్తుంది.

**క. వెంగలివిత్తై తిరుగక, కంగారై చెడక ముక్తిఁ గాంక్షించు నతం**
**డంగనలతోడ విడువని, సంగడముల వదలవలయు జలజాతముఖీ! 584**

**ప్రతి :** జలజాతముఖీ= ఓ పద్మముఖీ!; ముక్తిన్ కాంక్షించునతండు= ముక్తికోరుకొనేవాడు; వెంగలివిత్తై= వెర్రితనానికి మూర్ఖత్వానికి బీజమై (మూలమై); తిరుగక= సంచరింపక; కంగారై= తొట్రుపాటుతో; చెడక= చెడిపోక; అంగనలతోడన్= స్త్రీలతో; విడువని= విడువలేని; సంగడములన్= సాంగత్యాలను; వదలవలయున్= వదలి పెట్టాలి.

**తా :** ఓ కమలముఖీ! ముక్తినికోరేవాడు మూర్ఖత్వానికి విత్తనం కాకుండా, తొట్రుపాటుతో చెడిపోకుండా, స్త్రీలతో విడువలేని స్నేహాన్ని, సాన్నిహిత్యాల్ని వదలిపెట్టాలి.

**వ. అది గావున నేఁడు మొదలు తృష్ణాఖండనంబు సేసి, నిర్విషయుండనై, యహంకారంబు విడిచి, మృగంబులం గలసి, వనంబున సంచరించెద. పరబ్రహ్మంబునందుఁ జిత్తంబుఁ జేర్చెద, బ్రహ్మనిష్ఠ మనుష్యులకు నాశా నివారిణి యగుటం జేసి యే నందుఁ దత్పరుండనై, యాహారనిద్రాది యోగంబులం బరిహరించెద. ఆత్మ విదుండై, సంసార నాశంబుఁ దలంచిన వాఁడె విద్వాంసుండని తలంచి పలికి, పూరుని యౌవనం బతని కిచ్చి, ముదిమి తాను గైకొని, విగతలోభుండై, నిజభుజశక్తి పాలితం బగు భూమండలంబు విభాగించి, ద్రుహ్యునకున్ బూర్వభాగంబును, యదువునకు దక్షిణభాగంబును, దుర్వసునకుఁ బశ్చిమదిగ్భాగంబును, ననువునకు నుత్తరదిగ్భాగంబును సంరక్షింపుం డని యిచ్చి వారల సమక్షంబున. 585**

**ప్రతి :** అదిగావునన్= అలా కాబట్టి; నేఁడు మొదలు= నేటినుండి; తృష్ణాఖండనంబు= తృష్ణను కోసివేయుట; చేసి (తృష్ణనువదలి); నిర్విషయుండనై= విషయాలను విడిచి; అహంకారంబు విడిచి= అహంకారం వదలిపెట్టి; మృగంబులంగలసి= జంతువులతోకలిసి; వనంబున సంచరించెదన్= అడవులలో తిరుగుతాను; పరబ్రహ్మంబునందున్= పరబ్రహ్మలో; చిత్తంబున్= నా చిత్తాన్ని; చేర్చెదన్= చేరుస్తాను; బ్రహ్మనిష్ఠ= బ్రహ్మయందుమాత్రమే చరించడం; మనుష్యులకున్= మానవులందరికి; ఆశానివారిణి= ఆశనులేకుండా చేసేది; అగుటంజేసి= అవడంవల్ల; ఏన్= నేను; అందున్= ఆ బ్రహ్మనిష్ఠలో; తత్పరుండనై= తాత్పర్యం గలవాడనై (నిమగ్నుణ్ణయి); ఆహార= ఆహారం; నిద్రా= నిద్ర; ఆది= మొదలైన; యోగంబులన్= యోగాలను; పరిహరించెదన్= వదిలిపెడతాను; ఆత్మవిదుండై: ఆత్మను తెలిసినవాడై; సంసారనాశంబున్= సంసారం లేదనే విషయాన్ని; తలంచినవాఁడె= భావించినవాడె; విద్వాంసుండని తలంచి పలికి= పండితుడనబడతాడని భావించి, మాట్లాడి; పూరుని యౌవనంబు= పూరుడైన తనకొడుకు వద్ద తీసికొన్న యౌవనాన్ని; అతనికిచ్చి= అతనికిచ్చివేసి; ముదిమి= ముసలితనాన్ని; తాను+కైకొని= తానుస్వీకరించి; విగతలోభుండై= లోభగుణంలేనివాడై; నిజభుజశక్తి పాలితంబగు= తన భుజశక్తితో పరిపాలింప బడుతున్న; భూమండలంబు విభాగించి= భూమిని విభజించి; పూర్వభాగంబును= తూర్పు ప్రాంతాన్ని; ద్రుహ్యునకున్= ద్రుహ్యునకు; దక్షిణభాగంబును= దక్షిణప్రాంతాన్ని; యదువునకున్= యదువు అనే కొడుకునకు; తుర్వసునకున్= తుర్వసుడు అనే సుతునకు; పశ్చిమ దిగ్భాగంబును= పశ్చిమ ప్రాంతాన్ని; అనువునకున్= అనువు అనే పుత్రునకు; ఉత్తరదిగ్భాగంబును= ఉత్తరదిక్ప్రదేశాన్ని; సంరక్షింపుండు+అని= చక్కగా కాపాడండి అని; ఇచ్చి; వారల సమక్షంబునన్= వారల ఎదుట...

**తా :** అందువల్ల ఈనాటినుండి తృష్ణను వదిలి; విషయసుఖాలువీడి; అహంకారం విడిచి, మృగాలతో కలిసి అడవులలో తిరుగుతాను. పరబ్రహ్మలో నా చిత్తాన్ని చేరుస్తాను. బ్రహ్మనిష్ఠ మానవులందరికి ఆశను పోగొడుతుంది. అందుచేత నేను బ్రహ్మనిష్ఠలో మున్గి, ఆహారాన్ని నిద్ర మొదలైన వానిని పరిహరిస్తాను. ఆత్మజ్ఞానం గలిగి, సంసారం అంటే నాశనం పొందేది అని తెలిసికొన్నవాడే పండితుడు అని గ్రహించి ఆ విధంగానే మాట్లాడి, పూరునివద్ద తీసికొన్న యౌవనాన్ని అతనికిచ్చి తన ముసలితనాన్ని తాను స్వీకరించి, లోభంలేనివాడై తన భుజపరాక్రమాలచే పాలింపబడుతున్న భూమిని విభజించి, ద్రుహ్యునకు తూర్పు, యదువునకు దక్షిణం, తుర్వసునకు పడమట, అనువునకు ఉత్తరదిక్కులందుగల భూములను చక్కగా రక్షించండని ఇచ్చి, వారల ఎదురుగా

**క. నాలుగుచెఱఁగుల నేలయుఁ, బాలింపుం డనుచు నగ్రభవులకుఁ బంచెన్**
**భూలోక మేలు మనుచును, బాలార్కోదారుఁ బూరుఁ బట్టము గట్టెన్. 586**

**ప్రతి :** నాలుగుచెఱఁగుల నేలయున్= నాలుగు ప్రక్కల ఉన్న భూమిని; పాలింపుండనుచున్= పరిపాలించండని; అగ్రభవులకున్= ముందు పుట్టినవారికి (పెద్దకొడుకులకు); పంచెన్= ఆజ్ఞాపించాడు; బాల+అర్క+ఉదారున్= బాల సూర్యునివలె ప్రకాశించే; పూరున్= పూరుని; భూలోకము ఏలు మనుచును= సమస్త భూమండలాన్ని పరిపాలించుమని; పట్టము+కట్టెన్= పట్టాభిషిక్తుని చేశాడు.

**తా :** నాలుగు చెరగుల నేలను పాలించుమని పెద్దకొడుకులను ఆజ్ఞాపించి యయాతి పూరునకు సమస్త భూమండలాన్ని పరిపాలించుమని పట్టం గట్టాడు.

**వ. ఇట్లు పూరునికి రాజ్యం బిచ్చి, పెక్కువర్షంబుల యందు ననుభూతంబులైన యింద్రియ సుఖంబులు విసర్జించి. 587**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; పూరునికిన్= పూరునికి; రాజ్యంబుఇచ్చి= రాజ్యాన్ని ఇచ్చి; పెక్కువర్షంబులయందున్= అనేక సంవత్సరాలలో; అనుభూతంబులైన= అనుభవింపబడిన; ఇంద్రియ సుఖంబులు= ఇంద్రియాలకు సంబంధించిన సుఖాల నన్నిటిని; విసర్జించి= విడిచిపెట్టి.

**తా :** ఈ విధంగా పూరునికి రాజ్యంఇచ్చి చాల వత్సరాలుగా అనుభవిస్తూ వచ్చిన ఇంద్రియ సుఖాలను విడిచిపెట్టి.

**క. మిక్కిలి విజ్ఞానంబునఁ, జక్కఁగ దిగ విడిచి వైరిషడ్వర్గంబున్**
**ఱెక్కలు వచ్చిన విహగము, గ్రక్కున నీడంబు విడుచుకరణి నుదితుఁడై. 588**

**ప్రతి :** మిక్కిలి విజ్ఞానంబునన్= అతిశయించిన అనుభవజ్ఞానంతో; వైరిషడ్వర్గంబున్= కామక్రోధాదులైన అరిషడ్వర్గాన్ని; చక్కఁగ దిగ విడిచి= చక్కగా వదలిపెట్టి; ఱెక్కలు వచ్చిన విహగము= ఱెక్కలు వచ్చిన పక్షి; గ్రక్కునన్= వెంటనే; నీడంబు విడుచు కరణిన్= గూటిని వదిలే విధంగా; ఉదితుండై= విడివడినవాడై (విముక్తుడై)...

**తా :** యయాతి తనకున్న అధికమైన అనుభవజ్ఞానంతో అరిషడ్వర్గాలను విడిచిపెట్టి, రెక్కలు వచ్చిన పక్షి తనగూటిని విడిచిపెట్టి ఎగిరిపోయే విధంగా తాను సంసార విముక్తుడై

**క. కారుణికోత్తముఁడగు హరి, కారుణ్యము కతన నతఁడు ఘనుఁడై గెలిచెన్**
**గ్రూరములగు విషయంబుల, నూరక గెలువంగ శక్తుఁ డొక్కఁడు గలఁడే? 589**

**ప్రతి :** కారుణిక+ఉత్తముఁడు+అగు= దయగలవాడైన; హరి= విష్ణుమూర్తియొక్క; కారుణ్యము కతనన్= దయవల్ల; అతఁడు= యయాతి; క్రూరములగు= అతికష్టములైన; విషయంబులన్= ఇంద్రియ సుఖాలను; ఘనుఁడై= గొప్పవాడై; గెలిచెన్= జయించాడు; ఊరకగెలువంగన్= హరిదయలేకుండా; తనకు తానుగా విషయసుఖాలను జయించడానికి; శక్తుఁడు= సమర్థుడు; ఒక్కఁడు గలఁడే= ఒకడైనా ఉన్నాడా? లేదని భావం.

**తా :** పరమదయాళుడైన విష్ణుమూర్తి దయవల్ల యయాతి క్రూరములైన ఇంద్రియసుఖాలను గెలిచాడు. హరిదయ లేకుండా ఊరకే ఇంద్రియ నిగ్రహం గలవా డెవడుంటాడు?!

**వ. మఱియు నిర్మూలిత సకలసంగుండై సత్త్వరజస్తమో గుణంబులం దిగనాడి నిర్మలంబై, పరమంబైన వాసుదేవాభిధాన బ్రహ్మంబునందు యయాతిభూపాలుండు స్వతస్సిద్ధయైన భాగవతగతిం జెందె నంత. 590**

**ప్రతి :** మఱియున్= అంతేగాక; నిర్మూలిత= పోగొట్టబడిన; సకలసంగుండై= అన్ని బంధాలుగలవాడై; సత్త్వరజస్తమో గుణంబులన్ దిగనాడి= త్రిగుణాలను విడిచి; నిర్మలంబై= స్వచ్ఛమై; పరమంబైన= శ్రేష్ఠమైన; వాసుదేవ+అభిధాన= వాసుదేవుడనే పేరుగల; బ్రహ్మంబునందున్= పరబ్రహ్మయందు; యయాతిభూపాలుండు= యయాతి అనేరాజు; స్వతస్సిద్ధయైన= సహజమైన; భాగవతగతిన్ చెందెన్ అంతన్= భగవద్భక్తుడు పొందెడి గతిని పొందాడు. అటుతరువాత.

**తా :** మరియు యయాతిభూపాలుడు అన్ని బంధాలను తెగగొట్టి, సత్త్వరజస్తమో గుణాలనే త్రిగుణాలనుదాటి, స్వచ్ఛమైన, ముఖ్యమైన వాసుదేవుడనే పేరుతో పిలువబడే పరబ్రహ్మంలో సహజంగా భాగవతులు పొందే పరమపదాన్ని పొంది వాసుదేవపరబ్రహ్మంలో లీనమయ్యాడు.

**సీ. ప్రాణేశుఁ డాడిన పలుకులు నగవులు గాఁ జూడ కంతరంగమున నిలిపి**
**పథికులై పోవుచుఁ బానీయశాలలఁ జల్లఁగా నుండెడి జనుల యట్ల**
**సంసారమునఁ గర్మసంబంధులై వచ్చి, యాలుబిడ్డలు మగం డనుచుఁ గూడి**
**యుండుట గాని సంయోగంబు నిత్యంబు గా దీశమాయా ప్రకల్పితంబు**

**తే. దీని విడుచుట తగ వని తెగువ మెఱసి, నిద్ర సాలించి మేల్కొన్న నేర్పు చాలఁ**
**గలిగి భార్గవి సర్వసంగముల విడిచి, హరిపదధ్యానయై ముక్తి కరిగె నధిప! 591**

**ప్రతి :** భార్గవి= భృగువంశంలో శుక్రునికి జన్మించిన సుత దేవయాని; ప్రాణేశుఁడు ఆడిన= తన భర్త యయాతి పలికిన; పలుకులు= మాటలు; నగవులుగాన్= నవ్వులాటమాటలుగా (వేళాకోళపు మాటలుగా) చూడక= గ్రహించక; అంతరంగమునన్ నిల్పి= తన మనసులో నిలుపుకొని; పథికులైపోవుచున్= బాటసారులై వెడుతూ; పానీయశాలలన్= చలివేంద్రాల్లో; చల్లగాన్ ఉండెడి= చల్లదనం కోసం కొంతసేపు మాత్రమే ఉండి తరువాత ఎవరి త్రోవను వారు వెళ్ళిపోయే; జనులయట్లు+అ= జనులవలె; సంసారమునన్= ఈ సంసారంలో; కర్మసంబంధులై= గతజన్మకు సంబంధించిన కర్మలయొక్క సంబంధంచేత; వచ్చి= జీవనయానంలోనికి వచ్చి; ఆలుబిడ్డలు మగండు అనుచున్ కూడి= భార్య పిల్లలు భర్త అనే బంధాలతో కలిసి; ఉండుటగాని= ఉండటమేగాని; సంయోగంబు= వారితో ఉండే కలయిక; నిత్యంబుగాదు= శాశ్వతంకాదు; ఈశమాయా ప్రకల్పితంబు= పరమాత్మయొక్క లీలచే చక్కగా కల్పించబడింది; దీనిన్ విడుచుట= ఈ సంసారాన్ని విడిచిపెట్టడం; తగవని= న్యాయమని; తెగువమెఱసి= సాహసం చూపి; నిద్ర సాలించి మేల్కొన్న నేర్పు= నిద్రనువిడిచి మెలకువ వచ్చినవాని నేర్పు; చాలన్ కలిగి= అధికంగా పొంది (జాగరూకతవచ్చినవానివలె); సర్వసంగములన్ విడిచి= అన్ని బంధాలను విడిచిపెట్టి; హరిపదధ్యానయై= శ్రీహరిపాదాలను ధ్యానిస్తూ; అధిప= ఓ పరీక్షిన్మహారాజా!; ముక్తికి అరిగెన్= మోక్షాన్ని చేరుకొంది.

**తా :** దేవయాని తనభర్త యయాతి పలికిన పలుకులు తేలికగా తీసికోక తన హృదయంలో నిలుపుకొని, చలివేంద్రంలో బాటసారులు చల్లదనానికై చేరి వారివారి మార్గాలవెంబడి పోయే జనులవలె, ఈ సంసారంలో కర్మబంధాలతో భార్యాపిల్లలు మగడు అనే బంధాలతో కూడి ఉంటారు. అంతే తప్ప ఈ భార్యాది సంబంధాలు శాశ్వతంకాదు. ఇదంతా పరమేశ్వర మాయావిలాసం. ఈ సంసారాన్ని ఈ బంధాలను విడిచిపెట్టాలి. అదే న్యాయం అనే తెలివికలిగి నిద్రమేల్కొన్నవాడు ఎటువంటి నేర్పుతో ప్రవర్తించి (స్వప్నం నిజంకాదు అని గ్రహిస్తాడో అలా) హరిపదాలపై ధ్యానం నిలిపి ముక్తి పొందింది.

**వ. అని యిట్లు యయాతి చరితంబు చెప్పి, భగవంతుండును, సర్వభూత నివాసుండును, శాంతుండును, వేదమయుండు నైన వాసుదేవునకు నమస్కరించెద అని శుకుం డిట్లనియె. 592**

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా; ఇట్లు; యయాతి చరితంబు చెప్పి= యయాతి మహారాజు కథను చెప్పి; భగవంతుండును= షడ్గుణ ఐశ్వర్య సంపన్నుడును; సర్వభూత నివాసుండును= అన్ని ప్రాణులలో నివసించేవాడూ; శాంతుండును= మిక్కిలి శాంతగుణం కలవాడూ; వేదమయుండును= వేదాలతో కూడినవాడూ (వేదాలే తన స్వరూపంగా కలవాడును); ఐన= ఐనటువంటి; వాసుదేవునకున్= వసుదేవ సుతుడైన శ్రీకృష్ణునకు; నమస్కరించెదన్= నమస్కరిస్తాను; అని= ఈ ప్రకారంగా పలికి; శుకుండు ఇట్లు అనియెన్= శుకుడు ఇలా అన్నాడు.

**తా :** ఈ ప్రకారంగా పరీక్షిన్మహారాజునకు యయాతి చరిత్ర చెప్పి భగవంతుడు, అన్ని జీవులలో ఉండేవాడు, శాంతుడు, వేదమయుడు అయిన పరబ్రహ్మకు నమస్కరిస్తాను అని శుకమహర్షి పలికి ఇలా అన్నాడు.

**క. భారత! నీవు జనించిన, పూరునివంశంబునందుఁ బుట్టిన వారిన్**
**జారుయశోఽలంకారుల, ధీరుల వినిపింతు నధిక తేజోధనులన్. 593**

**ప్రతి :** భారత= భరతవంశంలో జన్మించిన పరీక్షిన్మహారాజా!; నీవు జనించిన= నీవు పుట్టినట్టి; పూరుని వంశంబునందున్= పూరునియొక్క వంశంలో; పుట్టినవారిన్= జన్మించినవారిని; చారు యశోఽలంకారులన్= చక్కని కీర్తితో అలంకరింపబడినవారిని; అధిక తేజోధనులన్= మిక్కిలి తేజస్సే ధనంగా గలవారిని; ధీరులన్= ధైర్యంగలవారిని గూర్చి; వినిపింతున్= వినిపిస్తాను (తెలియజేస్తాను).

**తా :** ఓ భరతవంశ సంభవా! పరీక్షిన్మహారాజా! పూర్వంమీది పూరు వంశమే. అటువంటి పూరువంశంలో జన్మించిన నీకు మీ పూర్వులు, చక్కని కీర్తియే అలంకారంగా గలవారు, ధీరులు, తమ ప్రతాపమే ధనంగా గలవారు అయిన వారిని గూర్చి వినిపిస్తాను.

**వ. పూరునకుఁ జనమేజయుండు, జనమేజయునకుఁ బ్రాచిన్వాంసుఁ డతనికిఁ బ్రవిరోధనమన్యు, వతనికిఁ జారువు పుట్టె. ఆ చారునకు సుద్యువు, సుద్యువునకు బహుగతుండును, బహుగతునకు శర్యాతి, శర్యాతికి సంయాతియు, సంయాతికి రౌద్రాశ్వుండు, రౌద్రాశ్వునకు ఘృతాచి యను నచ్చరలేమయందు ఋతేపువు కక్షేపువు, స్థలేపువు, కృతేపువు, జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, సత్యేపువు, వ్రతేపువు, వనేపువు అనువారు జగదాత్మ భూతుండైన ప్రాణునకు నింద్రియంబుల చందంబునఁ బదుగురు కొడుకులు జన్మించిరి. అందు ఋతేపువునకు నంతిసారుండు, నంతిసారునకు సుమతియు, ధ్రువుండు, నప్రతిరథుండు నను ముప్వురును బుట్టిరి. అందు నప్రతిరథునకుఁ గణ్వుం, డా కణ్వునికి మేధాతిథి, యతనికి ప్రస్కందుండు మొదలగు బ్రాహ్మణులు జన్మించిరి. ఆ సుమతికి రైభ్యుండు, రైభ్యునకు దుష్యంతుండు పుట్టి. 594**

**ప్రతి :** పూరునకున్= పూరుడు అనేవానికి; జనమేజయుండు= జనమేజయుడు; జనమేజయునకున్= జనమేజయునకు; ప్రాచిన్వాంసుఁడు= ప్రాచిన్వాంసుడు; అతనికిన్= ఆ ప్రాచిన్వాంసునకు; ప్రవిరోధనమన్యువు= ప్రవిరోధనమన్యువు; అతనికిన్ చారువు పుట్టెన్= చారువు అనేవాడు జన్మించాడు; ఆ చారునకున్= సుద్యువు; సుద్యువునకున్; బహుగతుండును= బహుగతుడు అనేవాడు; బహుగతునకున్= శర్యాతి అనేవాడు; శర్యాతికిన్; సంయాతియున్= సంయాతి అనేవాడు; సంయాతికిన్; రౌద్రాశ్వుండు= రౌద్రాశ్వుడు; రౌద్రాశ్వునకున్= రౌద్రాశ్వుడు అనేవానికి; ఘృతాచి అను అచ్చరలేమయందున్= ఘృతాచి అనే పేరుగల అప్సరః కాంతయందు; ఋతేపువు, కక్షేపువు, స్థలేపువు, కృతేపువు, జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, సత్యేపువు, వ్రతేపువు, వనేపువు, అనువారు= అనేవారు; జగదాత్మభూతుండైన = జగదాత్మభూతుడైన; ప్రాణునకున్= ప్రాణునికి; ఇంద్రియంబుల చందంబునన్= ఇంద్రియాలవలె (ప్రాణంగలవ్యక్తికి పదికర్మజ్ఞానేంద్రియాలవలె); పదుగురు కొడుకులు జన్మించిరి= పదిమంది కొడుకులు పుట్టారు; అందు ఋతేపువునకున్= ఆ పదిమంది కుమారులలో మొదటివాడైన ఋతేపువు అనేవానికి; అంతిసారుండు= అంతిసారుడు; అంతిసారునకున్; సుమతియున్= సుమతి అనేవాడు; ధ్రువుండు= ధ్రువుడు; అప్రతిరథుండున్+అను= అప్రతిరథుడు అనే; ముప్వురును= ముగ్గురు; పుట్టిరి= జన్మించారు; అందున్= అందులో

(ఆ ముప్వురలో) అప్రతిరథునకున్= మొదటివాడైన అప్రతిరథునకు; కణ్వుండు; కణ్వునికిన్= కణ్వునికి; మేధాతిథి= మేధాతిథి అనేవాడు; అతనికిన్= ఆ మేధాతిథికి; ప్రస్కందుండు మొదలగు= ప్రస్కందుండు మొదలైన; బ్రాహ్మణులు జన్మించారు= బ్రాహ్మణులు పుట్టారు; ఆ సుమతికిన్= అంతిసారుని కుమారుడైన సుమతికి; రైభ్యుండు = రైభ్యుడు అనేవాడు; రైభ్యునకున్= రైభ్యునకు; దుష్యంతుండు పుట్టి= దుష్యంతుడు జన్మించి.

**తా :** పూరునికి జనమేజయుడు, జనమేజయునకు ప్రాచిన్వాంసుడు, ఆ ప్రాచిన్వాంసునికి ప్రవిరోధన మన్యువు అతడికి చారువు పుట్టారు. ఆ చారునకు సుద్యువు, అతనికి బహుగతుడు; అతనికి శర్యాతి, అతనికి సంయాతి, అతనికి రౌద్రాశ్వుడు, ఆ రౌద్రాశ్వునకు ఘృతాచి అనే అప్సరః కాంతవల్ల జగదాత్మభూతుడైన ప్రాణునకు పది ఇంద్రియాలవలె ఋతేపువు, కక్షేపువు, స్థలేపువు, కృతేపువు, జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, వ్రతేపువు, సత్యేపువు, వనేపువు అనే పదిమంది కొడుకులు పుట్టారు. వారిలో ఋతేపువునకు అతిసారుడు, అతిసారునకు సుమతి, ధ్రువుడు, అప్రతిరథుడు అనే ముగ్గురు పుత్రులు పుట్టారు. అప్రతిరథునకు కణ్వుడు, కణ్వునికి మేధాతిథి. అతడికి ప్రస్కందుడు మొదలైన బ్రాహ్మణులు జన్మించారు. ఆ సుమతికి రైభ్యుడు పుట్టాడు. రైభ్యునికి దుష్యంతుడు జన్మించాడు.

**క. పారావారపరీతో, దారధరాభారదక్ష దక్షిణహస్త**
**శ్రీ రాజిల్లఁగ నొకనాఁ, డా రాజేంద్రుండు వేఁటయం దభిరతుఁడై. 595**

**ప్రతి :** పారావార= సముద్రముచే; పరీత= చుట్టబడిన; ఉదార= విస్తారమైన; ధరాభార= భూభారమును; దక్ష= (సహించుటకు) సమర్థమైన; దక్షిణహస్త= కుడిచేతియొక్క; శ్రీరాజిల్లఁగన్= శోభ అతిశయింపగా; ఒకనాఁడు= ఒక దివసమున; ఆ రాజేంద్రుండు= ఆ రాజైన దుష్యంతుడు; వేఁటయందున్= మృగములను వేటాడుటయందు; అభిరతుఁడై= ఇష్టంగలవాడై...

**తా :** సముద్రంచే చుట్టబడిన విపులమైన భూభారాన్ని వహించే సామర్థ్యంగల తన కుడిచేయి శోభిల్లగా ఒకరోజున వేటయందు ఇష్టంగలవాడై

**క. గండక కంఠీరవ భే, రుండ శశ వ్యాళ కోల రోహిష రురు వే**
**దండ వ్యాఘ్ర మృగాదన, చండ శరభ శల్య భల్ల చమరాటవులన్. 596**

**ప్రతి :** గండక= ఖడ్గమృగాలు; కంఠీరవ= సింహాలు; భేరుండ= గండభేరుండాలు; శశ= కుందేళ్ళు; వ్యాళ= పాములు; కోల= అడవి పందులు; రోహిష= అడవిగొర్రెలు; రురు= లేళ్ళు; వేదండ= ఏనుగులు; వ్యాఘ్ర= పులులు; మృగాదన= సివంగులు; చండ శరభ= భయంకరమైన శరభాలు; శల్య= ముళ్ళపందులు; భల్ల= ఎలుగుబంట్లు; చమర= చమరీ మృగాలు (గల); అటవులన్= అడవులలో...

**తా :** ఖడ్గమృగాలు, సింహాలు, గండభేరుండాలు, కుందేళ్ళు, పాములు, అడవిపందులు, గొర్రెలు, లేళ్ళు, ఏనుగులు, పులులు, సివంగులు, భయంకరమైన శరభమనే మృగాలు, ముళ్ళపందులు, ఎలుగుబంట్లు, చమరీ మృగాలు తిరిగే అరణ్యంలో

**క. చప్పుడు సేయుచు మృగముల, రొప్పుచు నీరములయందు రోయుచు వలలం**
**ద్రిప్పుకొని పడఁగ ఁజోపుచుఁ, దప్పక యేయుచును వేఁటతమకం బొప్పన్. 597**

**ప్రతి :** చప్పుడు+చేయుచున్= శబ్దాలు చేస్తూ; మృగముల రొప్పుచున్= జంతువులను తరుముతూ; ఈరములయందున్= పొదలలో; రోయుచున్= వెదుకుచూ; వలలన్= వలలను; త్రిప్పుకొని= త్రిప్పుకుంటూ; పడఁగన్+చోపుచున్= (వలలో) పడేట్లా జంతువులను; చేస్తూ; తప్పక= గురితప్పకుండా; ఏయుచును= బాణాలతో కొడుతూ; వేఁటతమకంబు= వేటయందు ఆసక్తి; ఒప్పన్= ఒప్పునట్లు...

**తా :** శబ్దంచేస్తూ జంతువులను అదిలిస్తూ, పొదలలో వెదుకుతూ, వలలు త్రిప్పి అందులో జంతువులు పడేలా చేస్తూ, గురితప్పకుండా బాణాలతో జంతువులను కొడుతూ, వేటయందు ఆసక్తి ఒప్పగా

**క. మృగయూథంబుల వెంటను, మృగలాంఛన సన్నిభుండు మృగయాతురుఁడై**
**మృగయులు గొందఱుఁ గొలువఁగ, మృగరాజ పరాక్రమంబు మెఱయఁగ వచ్చెన్. 598**

**ప్రతి :** మృగయూథంబుల వెంటను= మృగసమూహాలవెనుక; మృగలాంఛన సన్నిభుండు= జింక గుర్తుగాగల చంద్రునితో సమానమైనవాడు, మృగయా+ఆతురుఁడై= వేటయందు ఆసక్తి కలవాడై; మృగయులు= వేటగాళ్ళు; కొందఱు= కొంతమంది; కొలువఁగన్= తనను సేవిస్తూ ఉండగా; మృగరాజు పరాక్రమంబు= సింహపరాక్రమం; మెఱయఁగన్= అతిశయింపగా; వచ్చెన్= వచ్చాడు.

**తా :** జంతువుల సమూహంవెనుక, చంద్ర సమాన సౌందర్యంగల దుష్యంతుడు, వేటయందు ఆసక్తితో, కొంతమంది వేటగాళ్ళు తనను సేవిస్తూ ఉండగా, సింహపరాక్రమం ఉట్టిపడే విధంగా వచ్చాడు.

**వ. ఇట్లు వచ్చి వచ్చి దైవయోగంబునఁ గణ్వమహాముని తపోవనంబు చేరంజని. 599**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వచ్చి వచ్చి= ప్రయాణంచేసి, దైవయోగంబునన్= దైవఘటనవల్ల; కణ్వమహాముని తపోవనంబు= కణ్వ మహాముని యొక్క తపోవనమునకు; చేరంజని= చేరి.

**తా :** దుష్యంతుడు క్రమక్రమంగా ముందుకు వెళ్ళి దైవయోగంవల్ల కణ్వమహాముని ఆశ్రమానికి చేరి.

**సీ. ఉరుతర శ్రాంతాహి యుగళంబులకుఁ బింఛముల విసరెడి కేకిముఖ్యములను**
**గరుణతో మదయుక్త కలభంబులకు మేఁత లిడుచు ముద్దాడు మృగేంద్రములను**
**ఘనమృగాదనములు, గాపుగా లేళ్ళతో రతులు సాగించు సారంగములను**
**నునుపుగా హోమధేనువుల కంఠంబులు దువ్వుచు నాడు శార్దూలములను**

**తే. దార కలహించు మూషిక దంపతులకు, మైత్రి నంకించు మార్జాలమల్లములను**
**మతిని జాతివైరంబులు మాని కూడి, కలసి క్రీడించు మృగములఁ గాంచె నతఁడు. 600**

**ప్రతి :** ఉరుతర= అధికమైన; శ్రాంత= అలసట పొందిన; అహియుగళంబులకున్= పాములజంటలకు; పింఛములన్= తమ పింఛములతో; విసరెడి= వీవనలు వీస్తున్న; కేకి ముఖ్యములును= నెమళ్ళను; కరుణతోన్= దయతో; మదయుక్త= మదంతో కూడిన; కలభంబులకున్= ఏనుగులకు; మేతలిడుచున్= ఆహారంపెడుతూ; ముద్దాడు= ముద్దులాడుతున్న; మృగేంద్రములను= సింహాలను; ఘనమృగాదనములు= పెద్దసివంగులు; కాపుగాన్= కాపలాకాస్తూ ఉండగా; లేళ్ళతోన్= లేళ్ళతో; రతులు సాగించు= జతగూడు; సారంగములును= మగజింకలనూ; నునుపుగాన్= మచ్చికగా; హోమధేనువుల=

హోమాలకు ఉపయోగపడే ఆవులయొక్క; కంఠంబులు= మెడలు; దువ్వుచున్ ఆడు= దువ్వుతూ ఆడుకొంటున్న; శార్దూలములను= పులులను; తార= తమలో తాము; కలహించు= పోట్లాడుకొను; మూషిక దంపతులకున్= ఎలుకల జంటలకు; మైత్రిన్ అంకించు= స్నేహాన్ని చేకూర్చు; మార్జాలమల్లములును= పిల్లుల సమూహాలను; మతిని= మనసులో; జాతివైరంబులు= తమ తమ జాతులకు సంబంధించిన; భేదాలను; మాని= మానుకొని; కూడి= కలిసి; క్రీడించు= ఆటలాడు; మృగములన్= జంతువులను; అతఁడు= ఆదుష్యంతుడు; కాంచెన్= చూచాడు.

**తా :** బడలిక చెందిన పెనుబాముల జంటలకు తమ పింఛాలతో విసురుతున్న నెమళ్ళను, మదించిన ఏనుగులకు దయతో మేతపెట్టి ముద్దాడే సింహాలను, సివంగులు కాపలా కాస్తుండగా లేళ్ళతో కాపురంచేస్తున్న మగజింకలను, హోమధేనువుల గంగడోళ్లను మృదువుగా దువ్వే పులులను, తమలో తాము కలహించుకొన్న ఎలుకల జంటలకు స్నేహాన్ని కలిగించే గండుపిల్లులను, సహజంగా ఉండే జాతివైరాన్ని విడిచి కలసిమెలసి ఆటలు ఆడే జంతువులను ఆ కణ్వముని తపోవనంలో దుష్యంతుడు చూచాడు.

**విశే :** ఆశ్రమవాతావరణం ఎంత గొప్పదో తెలుస్తున్నది. అది కణ్వముని తపోవనం. అక్కడ మృగాలకు జాతివైరం లేదు. అటువంటి వాతావరణం సమాజంలో కూడా నిర్మించుకొంటే, సర్వత్రా శాంతియుత వాతావరణం ఉంటుందని సందేశం.

**క. ఇత్తెఱంగున మృగజాతుల, పొత్తులు మే మెఱుఁగ మనుచు భూవల్లభుఁడుం**
**జిత్తములోపల నా ముని, సత్తము సద్వృత్తమునకు సంతసపడుచున్. 601**

**ప్రతి :** ఈ+తెఱఁగునన్= ఈ విధంగా; మృగజాతుల= జంతు జాతులయొక్క; పొత్తులు= స్నేహాలు; మేమెఱుఁగ మనుచున్= మేము ఎరుగము (మాకు తెలియదు) అనుకుంటూ; భూవల్లభుఁడున్= రాజైన దుష్యంతుడు; చిత్తములోపలన్= మనసులో; ఆ మునిసత్తము= ఆ ముని శ్రేష్ఠుని; సద్వృత్తమునకున్= చక్కని నడవడికి (మాహాత్మ్యానికి); సంతసపడుచున్= సంతోషాన్ని పొందుతూ.

**తా :** ఈ విధంగా సహజవైరంగల జంతువులు పొత్తుగూడి ఉండటం నేనెక్కడా చూడలేదని అబ్బురపడి దుష్యంతుడు తన మనస్సులో ఆ కణ్వమహాముని మహిమకు సంతోషించాడు.

**క. హల్లక బిసరుహ సరసీ, కల్లోలోత్ఫుల్ల యూథికా గిరిమల్లీ**
**మల్లీ మరువక కురవక, సల్లలితానిలము వలన సంతుష్టుండై. 602**

**ప్రతి :** హల్లక= చెంగలువలతో; బిసరుహ= తామరలతో కూడిన; సరసీ కల్లోల= సరస్సులందలి పెద్ద అలలచేత; ఉత్ఫుల్ల= వికసించిన; యూథికా= అడవి మల్లెలు; గిరిమల్లీ= కొండమల్లెలు; మల్లీ= మల్లెలు; మరువక= మరువము; కురువక= మొల్లలు (మొదలైనవాటినుండి వచ్చే) సల్లలితానిలము వలనన్= చక్కటి గాలివలన; సంతుష్టుండై= సంతుష్టి పొందినవాడై...

**తా :** దుష్యంతుడు చెంగలువలతోను, తామరపూలతోను, అలలమీదుగానూ, బాగా వికసించిన అడవిమల్లెలు, కొండమల్లెలు, మొల్లలు మొదలైన పూలమీదుగానూ వీచే మలయమారుతంతో సేదదీరినవాడై

**వ. దుష్యంతుండు వచ్చు నవసరంబున. 603**

**ప్రతి :** దుష్యంతుడు వచ్చు= దుష్యంతుడు వచ్చే; అవసరంబునన్= సమయంలో...

**తా :** దుష్యంతుడు వచ్చే సమయంలో

**క. ఇం దిందిరాతి సుందరి, యిందిందిరచికుర యున్న; దిందింద శుభం;**
**బిం దిందువంశ యను క్రియ, నిందీవరవీథి మ్రోసె నిందిందిరముల్. 604**

**ప్రతి :** ఇందు వంశ= చంద్రవంశమందు జన్మించిన దుష్యంత మహారాజా!; ఇందున్= ఈ కణ్వాశ్రమంలో; ఇందిరాతిసుందరి= లక్ష్మీదేవికంటె అధికమైన సౌందర్యంగల; ఇందిందిర చికుర= తుమ్మెదలవంటి ముంగురులుగల; ఉన్నది; ఇందింద= ఇక్కడే; శుభంబు= శుభము; ఇందు= ఇక్కడ; అనుక్రియన్= అనేటట్లు; ఇందీవరవీథిన్= నల్లకలువలున్న మార్గంలో; ఇందిందిరముల్= తుమ్మెదలు; మ్రోసెన్= శబ్దించాయి.

**తా :** ఓ చంద్రవంశరాజా దుష్యంతా! ఈ కణ్వాశ్రమంలో లక్ష్మీదేవిని మించిన సౌందర్యంగల, తుమ్మెదలవంటి కురులు గల స్త్రీ ఉన్నది ఇక్కడే నీకు శుభం కలుగుతుంది. అని అన్నట్లుగా నల్లకలువలు వరుసగా పూచిన చోట తుమ్మెదలు శుభశబ్దాలు చేశాయి.

**క. మా కందర్పుని శరములు, మాకందము లగుటఁజేసి మాకందంబుల్**
**మా కందము లను కైవడి, మాకందాగ్రములఁ బికసమాజము లులిసెన్. 605**

**ప్రతి :** మా కందర్పుని= మాకు సంబంధించిన మన్మథుని; శరములు= బాణాలు; మా కందములగుటన్ చేసి= మామిడి పూవులగుటవల్ల; మా కందంబుల్= మామిడిచెట్లు; మా కందములను కైవడిన్= మాకు మూలములు (మా నిలయములు) అనేటట్లు; మాకందాగ్రములన్= మామిడిచెట్ల కొనలయందు; పికసమాజములు= కోయిలల సమూహాలు; ఉలిసెన్= శబ్దం చేసాయి.

**తా :** మా మన్మథుని బాణములు మామిడిపూలు. అందువల్ల ఈ మామిడిచెట్లు మాకు నిలయాలు అనేలా మామిడిచెట్ల చివరను చేరి కోకిలలు శబ్దాలు చేశాయి.

**వ. అంత. 606**

**తా :** అంతట

**క. ఇందున్న కణ్వమునికిని, వందన మొనరించి తిరిగి వచ్చెద ననుచుం**
**బొందుగ ననుచరులను దా, నందఱ నందంద నిలిపి యటఁ జని మ్రోలన్. 607**

**ప్రతి :** ఇందున్న= ఈ ఆశ్రమంలో ఉన్న; కణ్వమునికిని= కణ్వుడనే పేరుగల మునికి; వందనము ఒనరించి= నమస్కరించి; తిరిగివచ్చెదన్= తిరిగివస్తాను; అనుచున్= అంటూ; పొందుగన్= తగిన విధముగా; తాను= దుష్యంతుడు; అనుచరులను= భటులను; అందఱిని= ఎల్లరనూ; అందంద నిలిపి= ఆ ప్రదేశంలోనే ఉంచి; అటన్ చని= ఆ కణ్వాశ్రమానికి వెళ్ళి; మ్రోలన్= ఎదుట...

**తా :** ఈ ఆశ్రమంలో ఉన్న కణ్వమహర్షికి నమస్కరించి తిరిగివస్తాను. అనుకొని భటులను అందరిని అక్కడే ఉంచి దుష్యంతుడు ఆశ్రమానికి వెళ్ళి ఎదుట

**శా. ఆ కణ్వాశ్రమమందు నీరజనివాసాంత ప్రదేశంబులన్
మాకందంబులనీడఁ బుష్పలతికా మధ్యంబునన్ మంజు రం
భాకాండాంచితశాలలోఁ గుసుమసంపన్నస్థలిన్ జూచె నా
భూకాంతుండు శకుంతల న్నవనటత్ భ్రూపర్యటత్కుంతలన్. 608**

**ప్రతి :** భూకాంతుండు= రాజైన దుష్యంతుడు; ఆ కణ్వాశ్రమమందున్= ఆ కణ్వాశ్రమంలో; నీరజనివాసాంత ప్రదేశంబులన్= పద్మాలకు నిలయాలైన కాసార ప్రదేశాలలో; మా కందంబులనీడన్= మామిడి చెట్ల నీడలో; పుష్పలతికా మధ్యంబునన్= పూలతీగల మధ్య ప్రదేశంలో; మంజు= సుందరమైన; రంభాకాండ= అరటిబోదెలతో; అంచితశాలలోన్= ఒప్పుచున్న శాలలో (పూల లతల అరటిచెట్లతో కూడిన పొదరింట్లో); కుసుమ సంపన్నస్థలిన్= పూలతో నిండిన ప్రదేశంలో; నవనటత్= కొత్తగా నాట్యమాడుతూ; భ్రూపర్యటత్= కనుబొమలవరకు వ్యాపించి కదులుతున్న; కుంతలన్= ముంగురులుగల; శకుంతలన్= శకుంతల అనే పేరుగల కన్యను; చూచెన్= చూచాడు.

**తా :** ఆ కణ్వాశ్రమంలో, పద్మాలతో నిండిన సరస్సు ఉన్న ప్రాంతంలో, మామిడిచెట్ల నీడ, పూలతీగల మధ్య, అందమైన అరటిబోదెలతో కూడిన పొదరింట్లో; పూలతోనిండిన ప్రదేశంలో దుష్యంతుడు కనుబొమలవరకు అందంగా కదలాడుతున్న ముంగురులుగల శకుంతలను చూచాడు.

**క. దట్టపుఁదుఱుమును మీఁదికి, మిట్టించిన చన్నుఁగవయు మిఱుమిఱుచూడ్కుల్
నట్టాడునడుముఁ దేనియ, లుట్టెడు మోవియును మనము నూరింపంగన్. 609**

**ప్రతి :** దట్టపున్ తుఱుమును= చిక్కని జుట్టూ; మీఁదికి మిట్టించిన= పైకి ఉబికి ఉన్న; చన్నుఁగవయున్= చనుకట్టూ; మిఱుమిఱు చూడ్కుల్= బెదురుచూపులు; నట్టాడు నడుమున్= జవజవలాడే నడుమూ; తేనియలు ఉట్టెడు= తేనెలొలికే; మోవియును= పెదవీ, మనమున్= మనసూ; ఊరింపంగన్= ఊరిస్తూ ఉండగా...

**తా :** (శకుంతలయొక్క) ఒత్తైన కేశపాశం, ఎత్తైన చనుకట్టూ, బెదురుచూపులు, కదలాడే నడుము, తేనెలొలికే మోవి దుష్యంతుని మనస్సును ఉవ్విళ్ళూరిస్తూండగా

**వ. అంత నా రాజకుమారుం డలరు టమ్ముల విలుకాని, వెడవింట ఘణఘణాయమానలై మ్రోయు ఘంటలకుం బబ్బరించి, తన మనంబున. 610**

**ప్రతి :** అంతన్= అంతట (శకుంతలనుచూచి); ఆ రాజకుమారుండు= రాజపుత్రుడైన దుష్యంతుడు; అలరు+అమ్ముల విలుకాని= పూలుబాణాలుగా గల మన్మథుని; వెడవింట= అల్పమైన చెరకు వింటిలో; ఘణఘణాయ మానలై మ్రోయు= గణ గణమని శబ్దంచేసే; ఘంటలకున్= చిరుగంటలకు; పబ్బరించి= లోబడి; తనమనంబునన్= తన మనస్సులో...

**తా :** అంతట దుష్యంతుడు గణగణమని ధ్వనిచేసే మన్మథుని వింటి గంటల మోతలకు లోబడి తనమనసులో

**శా. వన్యాహారములన్ జితేంద్రియత నావాసించు నా కణ్వుఁ డీ
కన్యారత్నము నే గతిం గనియెడిం గా; దీ కురంగాక్షి రా
జన్యాపత్యము గాఁగ నోపు; నభిలాషం బయ్యెఁ; గాదేని నే
యన్యాయక్రియలందుఁ బౌరవుల కెం దాశించునే చిత్తముల్? 611**

**ప్రతి :** వన్య+ఆహారములన్= వన సంబంధమైన ఆహారములను (కందమూలాలను తింటూ); జితేంద్రియతన్= ఇంద్రియ నిగ్రహంతో; ఆవాసించు= నివసించు; ఆ కణ్వుఁడు= ఆ కణ్వుడు; ఈ కన్యారత్నమున్= ఈ శ్రేష్ఠమైన కన్యను; ఏ గతిన్ కనియెడిన్= ఎలా కని ఉంటాడు?; ఈ కురంగాక్షి= లేడికన్నులవలె బెదురు చూపులుగల ఈ కన్య; కాదు= కణ్వకుమారి కాదు; రాజన్య అపత్యము కాఁగన్ ఓపున్= శ్రేష్ఠుడైన రాచబిడ్డ మాత్రమే అయి ఉంటుంది; అభిలాషంబయ్యెన్= నాకు ఈ కన్యపై మనసైనది; కాదేనిన్= ఈమె రాజకుమారి కాకపోయినట్లయితే, పౌరవులకున్= పురువంశంలో జన్మించిన మాకు ఏ అన్యాయక్రియలందున్= న్యాయంకాని పనులలో; ఎందున్= ఎప్పుడైనా; చిత్తముల్= మనసులు; ఆశించునే= కోరుకుంటాయా?!

**తా :** అడవిలో దొరికే కందమూలాలు తింటూ, ఇంద్రియ నిగ్రహంతో జీవించే కణ్వునికి కొమరిత జన్మించడం ఏమిటి?! ఈ బెదురు చూపుల చిన్నది నిశ్చయంగా మునికుమారి కాదు. ఈమెపై నాకు మనసైంది. ఈమె తప్పక రాజకుమారే అయి ఉంటుంది. పురువంశంలో జన్మించిన నాకు మునికుమారిని కోరే దురాలోచన వస్తుందా! అన్యాయంగా మా పురువంశంలో వారు దేనిని కోరుకోరు కదా!

**క. అడిగిన నృపసుతఁ గానని, నొడివెడినొ కదే మనంబు నొవ్వ నని విభుం**
**డుడురాజవదన నడుగఁగఁ, దడుమన యొకకొంతప్రొద్దు తడఁబడఁ జొచ్చెన్. 612**

**ప్రతి :** అడిగినన్ (నీ వెవరి పుత్రివి అని) అడిగినట్లయితే; నృపసుతన్= రాజకుమారిని; కానని= కాదు అని; మనంబు నొవ్వన్= నా మనసుబాధపడేలా నొడివెడినొకదే; అని= చెప్తుతుందేమో కదా అని; విభుండు= దుష్యంతుడు; ఉడురాజవదనన్= (నక్షత్రాలకు రాజైన) చంద్రునితో సమానమైన మొగం ఉండే శకుంతలను; అడుగక= ఏమీ అడుగక; తడుమన= ఆలోచించి; ఒక కొంత ప్రొద్దు= కొంతసేపు; తడఁబడన్ చొచ్చెన్= తడబాటు చెందాడు.

**తా :** నీ వెవరి పుత్రివి అని అడిగినట్లయితే తన మనసు బాధపడేలా 'నేను రాకుమారినికాదు' అని చెప్తుందేమో అని చంద్రవదన శకుంతలను ఏమీ అడగకుండా ఆలోచిస్తూ దుష్యంతుడు కొంతసేపు తడబడ్డాడు.

**వ. మఱియు నెట్టకేలకుఁ దన చిత్త సంచలనంబు సత్యంబుగాఁ దలంచి యిట్లనియె. 613**

**ప్రతి :** మఱియున్= ఇంకా; ఎట్టకేలకున్= చిట్టచివరకు (ఎలాగో) తన చిత్త సంచలనంబు= తన మనసులోని నమ్మకాన్ని (మనఃప్రేరణను); సత్యంబుగాన్= సత్యం అయ్యేటట్లు; తలంచి= ఆలోచించి; ఇట్లనియెన్= ఇలా అన్నాడు.

**తా :** మళ్లీ ఎలాగో చివరకు తన మనఃప్రేరణ నిజమయ్యేటట్లుగా భావించి ఇలా అన్నాడు.

**క. భూపాలక కన్యక వని, నీపై చిత్తంబు నాఁటె, నీవా రేరీ?**
**నీపే రెవ్వరు? నిర్జన, భూపర్యటనంబు తగవె? పూర్ణేందుముఖీ! 614**

**ప్రతి :** పూర్ణేందుముఖీ= నిండు చందమామవంటి మోముగలదానా!; భూపాలక కన్యకవని= నీవు రాజసుతవని; నీపైన్ చిత్తంబునాఁటెన్= నీపై నా మనసు నాటుకొన్నది; నీవారు ఏరీ= నీకు సంబంధించినవారు ఎక్కడున్నారు?; నీ పేరెవ్వరు= నీ పేరు ఏమిటి?!; నిర్జన= జనంలేని; భూర్యటనంబు= భూమిపై తిరగడం; తగవె= న్యాయమా?

**తా :** ఓ పూర్ణచంద్రముఖీ! నీవు రాజకుమారివని (నా మనసునకు) అనిపించి నా మనసు నీపై లగ్నం అయింది. నీవారేరి? నీపేరేమి? ఇలా నిర్జన ప్రదేశంలో తిరగడం న్యాయమా!

**వ. అని పలుకుచున్న రాజకుమారుని వదనచంద్ర చంద్రికా రసంబు నేత్రచకోరంబువలనఁ ద్రావుచు, న య్యువిద విభ్రాంతయై యున్న సమయంబున. 615**

**ప్రతి :** అని పలుకుచున్న= ఈ విధంగా మాట్లాడుతున్న; రాజకుమారుని= రాజపుత్రుడైన దుష్యంతుని; వదన చంద్ర చంద్రికారసంబు= ముఖమనే చంద్రునినుండి వెలువడుచున్న వెన్నెల అనే రసాన్ని; నేత్రచకోరంబువలనన్= తన కండ్లనే చకోరాలతో; త్రావుచున్= తాగుతూ; ఆ+ఉవిద= ఆ స్త్రీ (శకుంతల); విభ్రాంతయై= తడబడినదియై; ఉన్న సమయంబునన్= ఉన్నవేళ...

**తా :** ఇలా మాట్లాడున్న దుష్యంతుని ముఖచంద్ర చంద్రికలను తన నేత్రచకోరాలతో శకుంతల తాగుతూ తడబడుచున్నవేళ

**క. కంఠేకాలునిచేతన్, గుంఠితుఁడగు టెట్లు మరుఁడు? కుసుమాస్త్రంబుల్**
**లుంఠించి గుణనినాదము, ఠం, ఠమ్మన బాల నేసె ఠవఠవ గదురన్. 616**

**ప్రతి :** మరుఁడు= మన్మథుడు; కంఠేకాలునిచేతన్= (కంఠమందు నలుపుగల) శివునిచేత; కుంఠితుఁడగుట ఎట్లు= మొక్కవోయాడు అనడం ఎలా (బలహీనుడు అయ్యాడు అనడం ఎలా); కుసుమ+అస్త్రంబుల్= పూలబాణాలను; లుంఠించి= సంధించి; గుణనినాదము= అల్లెత్రాటి ధ్వని; ఠం ఠమ్మనన్= శబ్దించగా; ఠవఠవ+కదురన్= శ్రమకలుగునట్లు; బాలన్= బాలను (శకుంతలను) ఏసెన్= కొట్టెను.

**తా :** మన్మథుడు శివునిచే నిర్వీర్యుడు అయ్యాడు అనుట అసత్యము. అతడు పూలబాణాలు తీసికొని, అల్లెతాటికి సంధించి శకుంతలపై ప్రయోగించి ఆమెను శ్రమకు గురి చేయడం ఎలా జరిగింది?

**వ. ఇట్లు వలరాజువాఁడి క్రొవ్విరికోలల వేఁడిమిఁ దాలిమి పోఁడిమి సెడి, యా వాలుఁగంటి యిట్లనియె. 617**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వలరాజు= మన్మథునియొక్క; వాఁడి= పదునైన; క్రొవ్విరికోలల= క్రొత్త పూలబాణాల; వేఁడిమిన్= వేడిచేత; తాలిమి పోఁడిమి= ధైర్యస్థితి; చెడి= కోలుపోయి; ఆ వాలుఁగంటి= ఆ క్రీగన్నుల చిన్నది; ఇట్లు అనియెన్= ఇలా అన్నది.

**తా :** ఈ విధంగా మన్మథుని వాడివైన క్రొత్త పూలబాణాల వేడికి తాళలేక శకుంతల ఇలా అంది.

**మ. అనివార్యప్రభ మున్ను మేనకయు విశ్వామిత్రభూభర్తయున్**
**గని; రామేనక డించిపోయె నడవిన్; గణ్వుండు న న్నింతగా**
**మనిచెన్; సర్వము నా మునీంద్రుఁ డెఱుఁగున్ మద్భాగధేయంబునన్**
**నినుఁ గంటిం బిదపం గృతార్థ నగుదున్ నేఁడీ వనాంతంబునన్. 618**

**ప్రతి :** అనివార్యప్రభన్= నివారింప వీలుకాని కాంతితో; మున్ను= పూర్వం; మేనకయున్= మేనక అనే అప్సరఃకాంత; విశ్వామిత్రభూభర్తయున్= విశ్వామిత్రుడనే రాజు; కనిరి= నన్ను కన్నారు; ఆ మేనక= నన్ను కన్నతల్లి ఐన మేనక; అడవిన్ డించిపోయెన్= అడవిలో నన్ను వదలి వెళ్ళిపోయింది; కణ్వుండు= కణ్వమహర్షియే; నన్నింతగాన్ మనిచెన్= నన్నిలా పెంచి తీర్చిదిద్దాడు; సర్వమున్= ఈ విషయాలన్నీ; ఆ మునీంద్రుఁడెఱుఁగున్= కణ్వమహర్షికి తెలుసు; మద్భాగ ధేయంబునన్=

నా అదృష్ట విశేషంవల్ల; నినున్ కంటిన్= నిన్ను చూచాను; పిదపన్= (నీవు నన్ను వివాహం చేసికొన్న) తదుపరి; నేఁడు= ఈనాడు; ఈ వనాంతంబునన్= ఈ వనంలో; కృతార్థ నగుదున్= సఫలతను పొందినదానిని అవుతాను.

**తా :** పూర్వం మేనక అనే అప్సరఃకాంత, విశ్వామిత్రుడనే రాజు అమోఘమైన తేజస్సుతో నన్ను కన్నారు. నన్ను కన్న మేనక నన్ను అడవిలో వదలి వెళ్ళిపోయింది. కణ్వమహర్షియే నన్ను పెంచిపెద్ద చేశాడు. నా జనన విషయం అంతా కణ్వమహర్షికి తెలుసు. నా అదృష్టంకొద్ది నిన్ను చూడగలిగాను. ఇకపై కృతార్థను అవుతాను.

**క. నీవారము ప్రజ లేమును, నీవారము పూజగొనుము నిలువుము నీవున్**
**నీవారును మాయింటను, నీవారాన్నంబుఁ గొనుఁడు నేఁడు నరేంద్రా! 619**

**ప్రతి :** నరేంద్రా= ఓ రాజా! నీ వారము= నీ పరివారం; ప్రజలు= నీ దేశప్రజలు; ఏమును= మేము కూడా; నీవారము= నీకు సంబంధించినవారమే; నిలువుము= ఈ ఆశ్రమంలో ఉండు; పూజగొనుము= మా అతిథి పూజను స్వీకరించు; నీవున్= రాజువైన నీవూ; నీవారును= నీకు సంబంధించినవారూ; మాయింటను= మా ఇంట్లో; నేఁడు= ఈనాడు; నీవార+అన్నంబున్+కొనుడు= నివ్వరి ధాన్యంతో చేయబడిన భోజనాన్ని స్వీకరించండి.

**తా :** ఓ దుష్యంతమహారాజా! నీ పరివారము, ప్రజలు, మేము అందరును నీ వారమే నీకు సంబంధించిన వారమే. మా ఆశ్రమంలో ఈనాడు ఉండి నీవు నీ వారు కలిసి మా యింట్లో (ఆశ్రమంలో) నివ్వరి అన్నాన్ని భుజించి మా పూజలందుకో.

**వ. అని పలికిన, దుష్యంతుఁడు మెచ్చి, మచ్చెకంటి యిచ్చ యెఱింగి యిట్లనియె. 620**

**ప్రతి :** అని పలికిన= ఈ విధంగా; శకుంతల పలుకగా; దుష్యంతుఁడు మెచ్చి= దుష్యంత మహారాజు సంతసించి; మచ్చెకంటి= చేపకన్నుల శకుంతలయొక్క; ఇచ్చ ఎఱింగి= ఇష్టాన్ని గ్రహించి; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా శకుంతల పలుకగా దుష్యంతుడు ఆనందపడి, చేపకన్నులవంటి కన్నులున్న శకుంతల మనసులోని ఇష్టాన్ని గ్రహించి ఇలా అన్నాడు.

**ఆ. రాజతనయ వగుదు రాజీవదళనేత్ర!, మాట నిజము లోనిమాట లేదు**
**తనకు సదృశుఁడైన తరుణుని ఁ గైకొంట, రాజసుతకుఁ దగవు రాజవదన! 621**

**ప్రతి :** రాజీవదళనేత్ర= ఓ పద్మాక్షీ!; రాజతనయవు+అగుదు= నీవు రాజకుమారివే; మాటనిజము= ఈ మాట సత్యం; లోనిమాట= పైకి చెప్పక లోనగల మరొకమాట; లేదు= లేనే లేదు; రాజవదన= ఓ చంద్రవదన!; తనకు సదృశుఁడైన= తనతో సమానుడైన; తరుణునిన్= యువకుని; కైకొంట= స్వీకరించుట (పాణిగ్రహణం చేయుట); రాజసుతకున్= రాజకుమారికి; తగవు= న్యాయం.

**తా :** ఓ పద్మాక్షీ! నీవు రాజకుమారివి అనడం సత్యం. మరొకమాట లేదు. ఓ చంద్రవదన! రాజకుమారి తనకు తగిన యువకుని పాణిగ్రహణం చేసికోవడం న్యాయమే కదా!

**వ. అని మఱియుఁ దియ్యని నెయ్యంపుఁ బలుకుల వలన న య్యువిద నియ్యకొలిపి. 622**

ప్రతి : అని మఱియున్= అంతేకాక; తియ్యని= మధురమైన; నెయ్యంపున్ పలుకుల వలనన్= ప్రేమపూర్వకమైన పలుకులతో; ఆ+ఉవిదన్= ఆ శకుంతలను; ఇయ్యకొలిపి= అంగీకరింపజేసి...

**తా :** ఈ విధంగా తియ్యని ప్రేమపూర్వకమైన మాటలతో ఆ శకుంతలను అంగీకరింపజేసి

**క. బంధురయశుఁడు జగన్నుత, సంధుఁడు దుష్యంతుఁ దుచితసమయజ్ఞుండై**
**గంధగజగమన నప్పుడు, గాంధర్వవిధిన్ వరించె గహనాంతమునన్. 623**

ప్రతి : బంధురయశుఁడు= గొప్ప కీర్తిగలవాడు; జగన్నుత సంధుఁడు= విశ్వంచే కీర్తింపబడేవాడు (అయిన); దుష్యంతుఁడు= దుష్యంత మహారాజు; ఉచితసమయజ్ఞుండై= తగిన సమయం ఎరిగినవాడై; అప్పుడు= ఆ సమయంలో; గహనాంతమునన్= ఆ అడవిలో; గంధగజగమనన్= మదించిన ఏనుగు నడకవంటి నడకగల శకుంతలను; గాంధర్వవిధిన్= గాంధర్వ వివాహపద్ధతిలో; వరించెన్= వివాహమాడాడు.

**తా :** ప్రజలందరిచే పొగడ్తలు గొన్న గొప్ప కీర్తిగల దుష్యంతుడు, తగిన సమయం ఎరిగినవాడై, ఆ అడవిలో, ఆ మత్తేభగమన శకుంతలను, గాంధర్వ విధిప్రకారం వివాహం ఆడాడు.

## ✤ భరతుని చరిత్ర ✤

**వ. ఇ వ్విధంబున నమోఘవీర్యుండగు నా రాచపట్టి, తపసిరాచూలికిఁ జూలునిలిపి, మఱునాఁడు తన వీటికిం జనియె. న య్యింతియుం గొంతకాలంబునకుఁ గొడుకుం గనినం, గణ్వమునీంద్రుఁ డా రాచపట్టికి జాత కర్మాది మంగళాచారంబు లొనర్చె. నా డింభకుండును దినదినంబునకు బాలచంద్రుండునుం బోలె నెదుగుచు. 624**

ప్రతి : ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; అమోఘవీర్యుండగు= అద్భుత తేజస్సుగల; ఆ రాచపట్టి= ఆ రాజపుత్రుడు దుష్యంతుడు; తపసి రాచూలికిన్= తపశ్శ్రేష్ఠుడగు కణ్వుని సుతను; చూలునిలిపి= గర్భవతిని చేసి; మఱునాఁడు= మరుసటి దివసమున; తన వీటికిన్ చనియెన్= తన పట్టణానికి వెళ్ళాడు; ఆ+ఇంతియున్= ఆ శకుంతలయు; కొంతకాలంబునకున్= కొంత కాలానికి; కొడుకున్ కనినన్= సుతుని పొందగా; కణ్వమునీంద్రుఁడు= కణ్వ మహర్షి; ఆ రాచపట్టికిన్= ఆ దుష్యంత కుమారుడైన రాచబిడ్డకు; జాతకర్మ+ఆది= జాతకర్మ మొదలైన; మంగళ ఆచారంబులు= వైదిక శుభకార్యాలు; ఒనర్చెన్= చేశాడు; ఆ డింభకుండును= ఆ శిశువు; దినదినంబునకున్= రోజురోజుకు; బాలచంద్రుండునున్+పోలెన్= బాలచంద్రునివలె; ఎదుగుచున్= పెరుగుతూ...

**తా :** ఈ విధంగా అమోఘమైన తేజస్సుగల దుష్యంతుడు శకుంతలకు గర్భాన్ని నిలిపి తన పురం చేరాడు. శకుంతల కొంత కాలానికి కుమారుని కన్నది. కణ్వమహర్షి దుష్యంత సుతునకు వైదికయుక్తమైన జాతకర్మ మొదలైనవి చేయించాడు. ఆ దుష్యంత సుతుడు రోజురోజుకు బాలచంద్రునివలె పెరుగుతూ

**క. కుంఠితుఁడుగాక వాఁ డు, త్కంఠం దన పిన్ననాఁడె కణ్వవనచరత్**
**కంఠీరవముఖ్యంబుల, కంఠములన్ బట్టి యడచుఁ; గట్టున్; విడుచున్. 625**

ప్రతి : కుంఠితుఁడు గాక= మొక్కవోని ధైర్యంతో; వాఁడు= దుష్యంత మహారాజ సుతుడు; ఉత్కంఠన్= ఆసక్తితో; తన పిన్ననాఁడె= తన చిన్నవయసులోనే; కణ్వ వనచరత్= కణ్వమహర్షి వనంలో తిరుగాడెడి; కంఠీరవ ముఖ్యంబుల= గొప్ప

సింహాల; కంఠములన్= కంఠాలను (మెడలను); పట్టి= పట్టుకొని; అడచున్= లొంగదీస్తాడు; కట్టున్= (ఆ సింహాలను చెట్లకు) బంధిస్తాడు; విడుచున్= విడిచిపెడతాడు.

**తా :** ఆ దుష్యంత కుమారుడు తన బాల్యంలోనే కణ్వమహర్షి ఆశ్రమంలో తిరిగే పెద్ద పెద్ద సింహాల కంఠాలను పట్టుకొని వాటి గర్వాన్ని అణగగొడుతూ, వాటిని చెట్లకు కట్టేవాడు, విడిచేవాడు.

**వ. అంత నా కణ్వమునీంద్రుండు బాలకుం జూచి శకుంతల కిట్లనియె. 626**

**ప్రతి :** అంతన్= అంతట; కణ్వ మునీంద్రుండు= కణ్వ మహర్షి; శకుంతలకున్= శకుంతలతో; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** బాల్యంలోనే పరాక్రమాన్ని చూపుతున్న దుష్యంత సుతుణ్ణి చూచి కణ్వమహర్షి శకుంతలతో ఇలా అన్నాడు.

**ఉ. పట్టపురాజు నీ మగఁడు; పాపఁడు నన్నిట నెక్కు డంతకున్,**
**బట్టపుదేవివై గరిమ బాగుగ నుండక పాఱువారితో**
**గట్టువనంబులో నవయఁగాఁ బనిలే దిటఁ దర్లి పోఁగదే**
**పుట్టినయిండ్లు మాని పతిఁబొందక యిట్లనిశంబు నుందురే? 627**

**ప్రతి :** నీ మగఁడు= నీ భర్త దుష్యంతుడు; పట్టపురాజు= చక్రవర్తి; పాపఁడున్= నీ బిడ్డడు; అంతకున్= అంతకంటె; అన్నిటన్= అన్ని విషయాలలో; ఎక్కుడు= అధికుడు; గరిమన్= గౌరవంతో; పట్టపుదేవివై= పట్టపురాణివిగా; బాగుగన్ ఉండక= గొప్పగా ఉండకుండా; పాఱువారితోన్= బ్రాహ్మణులతో (తాపసులతో); ఇటన్= ఇక్కడ; గట్టు వనంబులోన్= పర్వతారణ్య ప్రదేశాలలో; నవయఁగాన్= కృశించవలసిన; పనిలేదు; పుట్టిన+ఇండ్లుమాని= జన్మించిన ఇండ్లను విడచి; తర్లిపోఁగదె= బయలుదేరి వెళ్లవమ్మా!; పతిన్ పొందక= భర్తను చెందక; ఇట్లు= ఈ ప్రకారం; అనిశంబున్+ఉందురే= ఎల్లప్పుడూ ఉంటారా? ఉండరని భావం.

**తా :** నీ భర్త చక్రవర్తి. నీ కుమారుడు అతనికంటె అన్ని విధములా గొప్పవాడు. గౌరవంతో నీవు పట్టపురాణివై ఉండాలి గాని ఈ తాపసులతో ఈ పర్వతారణ్య ప్రదేశాలలో పాట్లు పడవలసిన పనిలేదు. భర్తను విడిచి చిరకాలము పుట్టింట్లో ఎవరైనా ఉంటారా? నీవు నీ భర్త ఇంటికి తరలిపోవచ్చును గదా!

**వ. అనిన నియ్యకొని 628**

**ప్రతి :** అనినన్= అని చెప్పగా; ఇయ్యకొని= అంగీకరించి...

**తా :** అలా అనేసరికి అంగీకరించి

**క. ఆ పిన్నవాని నతుల, వ్యాపారు నుదారు వైష్ణవాంశోద్భవునిం**
**జూపెద నంచు శకుంతల, భూపాలునికడకు వచ్చెఁ బుత్త్రునిఁ గొనుచున్. 629**

**ప్రతి :** శకుంతల; ఆ పిన్నవానిన్= ఆ బాలకుని; అతుల వ్యాపారున్= సాటిలేని క్రియలు చేసేవానిని; ఉదారున్= ఉదారుని (గొప్పవానిని); వైష్ణవ+అంశ+ఉద్భవునిన్= విష్ణువు అంశతో జన్మించినవానిని; చూపెదన్+అంచున్= చూపుతాను అంటూ; భూపాలుని కడకున్= రాజైన దుష్యంతుని వద్దకు; పుత్త్రుని గొనుచున్= తన సుతుని తీసికొని; వచ్చెన్= వచ్చినది.

**తా :** శకుంతల సాటిలేని క్రియలు చేస్తున్న వానిని, గొప్పవానిని, విష్ణుని అంశతో జన్మించినవానిని, చూపుతానని తన పుత్రుని గైకొని రాజైన దుష్యంతుని వద్దకు వచ్చింది.

**వ. వచ్చి దుష్యంతుండున్న సభామండపంబునకుం జని నిలిచి యున్నయెడ. 630**

**ప్రతి :** వచ్చి= (కొడుకును తీసికొని) వచ్చి; దుష్యంతుండు+ఉన్న= దుష్యంత మహారాజు ఉన్నటువంటి; సభామండపంబునకున్= సభావేదిక వద్దకు; చని= వెళ్ళి; నిలిచి+ఉన్నయెడన్= నిలిచి ఉన్న సమయంలో...

**తా :** శకుంతల తన కుమారుని తీసికొని దుష్యంత మహారాజు ఉన్న సభామండపం వద్దకు వెళ్ళి నిలిచి ఉన్న సమయంలో

**మ. వలకేలన్ గురుచక్రరేఖయుఁ బదద్వంద్వంబునం బద్మరే**
**ఖలు నొప్పారఁగ నందు వచ్చిన రమాకాంతుండు నాఁ గాంతి న**
**గ్గలమై యున్న కుమారు మారసదృశాకారున్ విలోకించి తాఁ**
**బలుకండయ్యె విభుం డెఱింగి సతి విభ్రాంతాత్మయై వందురన్. 631**

**ప్రతి :** వలకేలన్= కుడిచేతిలో; గురు= గొప్పదైన; చక్రరేఖయున్= చక్రంయొక్క ఆకృతిలో ఉన్న రేఖ; పద ద్వంద్వంబునన్= పదాల జంటలో; పద్మరేఖలున్= పద్మరేఖలు; ఒప్పారఁగన్= తగి ఉండగా (ఒప్పుచుండగా); అందున్ వచ్చిన= ఆ సభా భవనానికి వచ్చిన; రమాకాంతుండునాన్= లక్ష్మీప్రియుడైన నారాయణుడా అన్నట్లు; కాంతిన్= ప్రభతో; అగ్గలమై= అతిశయించినట్టి; ఉన్న కుమారున్= ఉన్న తన కుమారుని; మారు సదృశ+ఆకారున్= మన్మథ సమానాకారుని; విలోకించి= చూచి; తాన్= తాను; విభుండు= రాజైన దుష్యంతుడు; ఎఱింగి= తెలిసి ఉండి కూడా; సతి= (భార్యయైన) శకుంతల; విభ్రాంత+ఆత్మయై= తొట్రుపాటు గల మనసుతో; వందురన్= బాధపడగా; పలుకండయ్యెన్= ఏమియు మాట్లాడలేదు.

**తా :** ఆ సుతుడు కుడిచేతిలో పద్మరేఖ, పాదాలలో పద్మరేఖలు కలిగి ఉన్నాడు. అతడు ఆ సభా భవనానికి వచ్చిన శ్రీనాథుడైన విష్ణువులా కాంతితో అతిశయించి ఉన్నాడు. అలా ఉన్న మన్మథ సమానాకారుడైన తన కుమారుని చూచి దుష్యంతుడు శకుంతల తొట్రుపాటుతో బాధపడగా ఏమి మాట్లాడలేదు.

**వ. ఆ సమయంబున. 632**

**ప్రతి :** ఆ సమయంబునన్= అట్టి వేళయందు...

**తా :** ఆ సమయంలో

**మ. అదె నీ వల్లభ, వాఁడు నీ సుతుఁడు; భార్యాపుత్త్రులన్ బాత్రులన్**
**వదలం గా; దలనాటి కణ్వవనికా వైవాహికారంభముల్**
**మది నూహింపు; శకుంతలా వచనముల్ మాన్యంబులౌ భూవరేం**
**ద్ర! దయం జేకొను మంచు మ్రోసెను వియద్వాణీ వధూవాక్యముల్. 633**

**ప్రతి :** భూవరేంద్ర= ఓ రాజశ్రేష్ఠా! దుష్యంత మహారాజా!; అదె నీ వల్లభ= అదిగో ఆమె నీ ప్రియురాలు; వాఁడు నీ సుతుఁడు= అతడు నీ కుమారుడు; పాత్రులన్= యోగ్యులైన; భార్యాపుత్త్రులన్= నీ సతిని, నీ కుమారుని; వదలన్కాదు=

విడువతగదు; అలనాటి= ఆనాటి (నీవు కణ్వాశ్రమమునకు వచ్చినపుడు); కణ్వవనికా= కణ్వ మహర్షి తపోవనంలోని; వైవాహిక+ఆరంభముల్= వివాహం (శకుంతలను గాంధర్వ వివాహము) చేసికొనుట మొదలైన విషయాలు; మదిన్ ఊహింపు= మనసులో ఒకసారి ఊహించుకో (గుర్తుకు తెచ్చుకో); శకుంతలావచనముల్= శకుంతల మాటాడిన పలుకులు; మాన్యంబులౌన్= గౌరవింపదగి ఉన్నవి; దయన్= కరుణతో; చేకొనుము= (ఈమెను భార్యగా అతనిని సుతునిగా); చేకొనుము= తీసుకో; అంచున్= అంటూ; వియద్వాణీ వధూవాక్యముల్= ఆకాశవాణి పలుకులు; మ్రోసెను= ధ్వనించాయి.

**తా :** ఓ దుష్యంత మహారాజా! ఈమె నీ భార్య, ఇతడు నీ కుమారుడు. యోగ్యులైన నీ సతీసుతులను విడువదగదు, అలనాడు కణ్వ మహర్షి ఆశ్రమానికి వచ్చి శకుంతలను వివాహమాడిన విషయాలను జ్ఞప్తికి తెచ్చుకో. శకుంతల పలికిన పలుకులన్నీ యథార్థాలు. గౌరవింపదగినవి. దయతో వీరిని స్వీకరించు అంటూ ఆకాశవాణి పలుకులు ధ్వనించాయి.

**వ. ఇట్లశరీరవాణి సర్వభూతంబులకుం దేటపడ భరింపు మని పలికిన, నా కుమారుండు భరతుండయ్యె, అంత నా రాజు రాజవదన నంగీకరించి, తనూభవుం జేకొని, కొంతకాలంబు రాజ్యంబుఁ జేసి పరలోకంబునకుం జనియె. తదనంతరంబ. 634**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అశరీరవాణి (ఆకాశవాణి)= శరీరం కనబడని మాట; సర్వ భూతంబులకున్= అన్ని జీవులకు; తేటపడన్= స్పష్టంగా అర్థం అయేలా; భరింపుము అని పలికినన్= 'భరించు' అని పలికిన కారణంగా; ఆ కుమారుండు= ఆ బిడ్డ; భరతుండయ్యెన్= భరతుడు అని పిలువబడ్డాడు; అంతన్= అటు తరువాత; ఆ రాజు= ఆ దుష్యంత మహారాజు; రాజవదనన్= చంద్రముఖి అయిన శకుంతలను; అంగీకరించి= భార్యగా స్వీకరించి; తనూభవున్ చేకొని= కొడుకును స్వీకరించి; కొంతకాలంబు రాజ్యంబున్ చేసి= కొంతకాలం రాజ్యపాలనచేసి; పరలోకంబునకున్ చనియెన్= పరలోకానికి చేరాడు; తత్ అనంతరంబ= ఆ తర్వాత...

**తా :** ఈ విధంగా ఆకాశవాణి లోకంలో అందరికి సత్యం అర్థం అయేలా 'భరింపుము' అన్న కారణంగా ఆ కుమారుడు భరతు డయ్యాడు. ఆ తరువాత దుష్యంతమహారాజు చంద్రునివంటి మొగంగల శకుంతలను భార్యగా స్వీకరించి కొంతకాలం రాజ్యపాలన చేసి పరలోకం చేరాడు. ఆ తర్వాత

**క. రెండవ హరిక్రియ ధరణీ, మండలభారంబు నిజసమంచితబాహా**
**దండమున నిలిపి తనకును, భండనమున నెదురులేక భరతుం డొప్పెన్. 635**

**ప్రతి :** భరతుండు= దుష్యంతసుతుడైన భరతుడు; రెండవ హరిక్రియన్= రెండవ హరివలె (ఇతడు మరొక విష్ణుమూర్తియా అనునట్లు); ధరణీమండలభారంబు= భూమండల భారాన్ని; నిజసమంచిత బాహాదండమునన్= తన బాహుదండంపై; నిలిపి= నిలబెట్టి (వహించి); తనకును= తనకైతే; భండనమునన్= యుద్ధంలో; ఎదురులేక= సాటిలేక; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తా :** భరతుడు రెండవ హరియా అనునట్లు తన భుజాదండంపై భూమండలాన్ని నిలిపి యుద్ధంలో ఎదురులేక ప్రకాశించాడు.

**వ. మఱియు నా దౌష్యంతి, యమునాతటంబున దీర్ఘతపుండు పురోహితుండుగా డెబ్బదియెనిమిది యును, గంగాతీరంబున నేఁబదియయిదును, నిట్లు నూటముప్పదిమూఁ డశ్వమేధయాగంబులు సదక్షిణంబులుగా నొనర్చి, దేవేంద్రవిభవంబున నతిశయించి, పదుమూఁడువేలున్నెనుబదినాలుగు**

**కదుపుధేనువులు గలయది ద్వంద్వంబనం బరఁగు. అట్టి వెయ్యి ద్వంద్వంబుల పాఁడిమొదవులఁ గ్రేపులతోడ నలంకారసహితలం జేసి, వేవురు బ్రాహ్మణుల కిచ్చి, మష్కార పుణ్యతీర్థ కూలంబున విప్రముఖ్యులకు రత్నభూషణశోభితంబులై; ధవళదంతంబులు గల నల్లని యేనుంగులఁ బదునాలుగు లక్ష లొసంగె. దిగ్విజయ కాలంబున శక, శబర, బర్బర, కష, కిరాతక, హూణ, మ్లేచ్ఛ దేశంబుల రాజుల పీచం బడంచి, రసాతలంబున రాక్షసకారాగృహంబులందున్న వేల్పులగరితలం బెక్కండ్ర విడిపించి తెచ్చి, వారల వల్లభులం గూర్చె. త్రిపురదానవుల జయించి, నిర్జరుల నిజమందిరంబుల నునిచె. అతని రాజ్యంబున గగనధరణీతలంబులు ప్రజలు గోరిన కోరిక లిచ్చుచుండె, ఇ వ్విధంబున. 636**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; ఆ దౌష్యంతి= ఆ దుష్యంత సుతుడు భరతుడు; యమునా తటంబునన్= యమునాతీరంలో; దీర్ఘతపుండు పురోహితుండుగాన్= దీర్ఘతపుడు పురోహితుడుగా ఉండగా; డెబ్బది యెనిమిదియును= డెబ్బై ఎనిమిదిన్నీ; గంగా తీరంబునన్= గంగానదీ తీరంలో; నూట ముప్పదిమూఁడు= నూట ముప్పై మూడు; అశ్వమేధ యాగంబులు= అశ్వమేధ యాగాల్ని; సదక్షిణంబులుగాన్= దక్షిణలతోకూడ; ఒనర్చి= చేసి; దేవ+ఇంద్ర విభవంబునన్ అతిశయించి= మహేంద్ర వైభవంతో గొప్పవాడై; పదుమూఁడు వేలున్నెనుబది నాలుగు= పదమూడు వేల ఎనబై నాలుగు; కదుపు ధేనువులు గలయది= ఆవులగుంపు కలది; ద్వంద్వంబనంబరఁగున్= ద్వంద్వం అని చెప్పబడుతుంది; అట్టి వెయ్యి ద్వంద్వంబుల= అలాంటి వేయి ద్వంద్వాలను ఒక కోటి ముప్పదిలక్షల ఎనబైనాలుగువేలు; పాఁడి మొదవులన్= పాలిచ్చే ఆవులను; క్రేపుల తోడన్= దూడలతో; అలంకార సహితలంజేసి= అలంకారంతో కూడినవానిగా చేసి; వేవురు బ్రాహ్మణులకిచ్చి= వేయిమంది బ్రాహ్మణులకు ధారపోసి; మష్కారపుణ్య తీర్థకూలంబునన్= మష్కారతీర్థం అనే పేరుగల పుణ్యతీర్థ తీరంలో; విప్రముఖ్యులకున్= బ్రాహ్మణ శ్రేష్ఠులకు; రత్నభూషణ శోభితంబులై= రత్నాభరణాలతో ప్రకాశింపబడిన; ధవళ దంతంబులు గల= తెల్లని దంతాలు కలిగి ఉన్న; నల్లని యేనుంగులన్= నల్లని ఏనుగులను; పదునాలుగు లక్షలొసంగెన్= పదునాలుగు లక్షలు దానం చేశాడు; దిగ్విజయ కాలంబునన్= దండెత్తి అన్నిదిక్కులను జయించే వేళ; శక, శబర, బర్బర, కప, కిరాతక, హూణ, మ్లేచ్ఛ దేశంబుల రాజుల= శక, శబర, బర్బర, కష కిరాతక, హూణ, మ్లేచ్ఛ అనే పేర్లుగల; దేశాలయొక్క రాజుల; పీచంబడంచి= గర్వాన్ని అణచి; రసాతలంబునన్= పాతాళం అనే పేరుగల లోకంలో; రాక్షస కారాగృహంబులందున్న= రక్కసుల చెరసాలలో ఉన్న; వేల్పుల గరితలన్= దేవతాస్త్రీలను; పెక్కండ్రన్ విడిపించి= ఎందరినో విడిపించి; వారల వల్లభులన్ కూర్చె= వారి వారి భర్తలకు చేర్చాడు; త్రిపుర దానవులన్ జయించి= త్రిపురాసురులను ఓడించి; నిర్జరులన్= దేవతలను; నిజమందిరంబులన్ ఉనిచెన్= వారి వారి సౌధాలలో ఉంచాడు; అతని రాజ్యంబునన్= ఆ భరతుని రాజ్యంలో; గగన ధరణీతలంబులు= ఆకాశం భూమికూడా; ప్రజలు+కోరిన= ప్రజలకు కావలసిన; కోరికలిచ్చుచుండెన్= కోర్కెలను తీర్చుచున్నాయి; ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** అంతేకాక, ఆ దుష్యంతసుతుడు భరతుడు, యమునాతీరంలో దీర్ఘతపుని పౌరోహిత్యంలో డెబ్బై ఎనిమిది, గంగానదీతీరంలో నూట ముప్పై మూడు అశ్వమేధ యాగాల్ని చక్కటి దక్షిణలతో నిర్వహించి మహేంద్ర వైభవాన్ని మించినాడు. పదమూడు వేల ఎనబై నాలుగు గోవుల సముదాయాన్ని ద్వంద్వం అంటారు. అటువంటి వేయి ద్వంద్వాలు దూడలతో గూడిన ఆవులను అలంకారాలతో అలంకరించి వేయిమంది బ్రాహ్మణులకు దానం చేశాడు. మష్కార నదీతీరంలో బ్రాహ్మణోత్తములకు రత్నాల ఆభరణాలతో కూడిన తెల్లని దంతాలు గల నల్లని ఏనుగులను పదునాలుగు లక్షలు దానం చేశాడు. దిగ్విజయవేళ శక, బర్బర, కష, కిరాతక, హూణ, మ్లేచ్ఛ దేశాల రాజులను జయించి, రసాతలంలో రాక్షసుల

చెరసాలల్లో మగ్గుతూ ఉన్న దేవతాస్త్రీలను విడిపించి వారి వారి భర్తల దగ్గరకు పంపించాడు. త్రిపురాసురులను జయించి వారి అధీనంలో ఉన్న దేవతలను వారి వారి ఇళ్ళకు పంపాడు. అతని రాజ్యంలో భూమ్యాకాశాలు ప్రజలు ఏమి కోరితే అవి చేకూర్చేవి ఈ విధంగా

**ఆ. సత్యచరితమందుఁ జలమందు బలమందు, భాగ్యమందు లోకపతులకంటె**
**నెక్కుడైన పేర్మి నిరువదియేడు వే, లేండ్లు ధరణి భరతుఁ డేలె నధిప! 637**

**ప్రతి :** అధిప= ఓ పరీక్షిన్మహారాజా!; సత్యచరితమందున్= సత్యమైన చరిత్రలో (నడవడిలో); చలమందున్= పట్టుదలలో; బలమందున్= బలములో; భాగ్యమందున్= సంపదలలో; లోకపతులకంటెన్= దిక్పాలకులకంటె; ఎక్కుడైన పేర్మిన్= అతిశయించిన వైభవంతో; ఇరువది యేడువేల+ఏండ్లు= ఇరవై ఏడువేల సంవత్సరాలు; ధరణిన్= భూమిని; భరతుఁడు ఏలెన్= భరతుడు పరిపాలించాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! చక్కటి నడవడిలో, పట్టుదలలో, బలంలో, సంపదలో దిక్పాలకులను మించిన వైభవంతో ఇరవై ఏడువేల సంవత్సరాలు భరతుడు భూమిని పాలించాడు.

**క. అర్థపతికంటెఁ గలిమి గృ, తార్థుండై యతుల శౌర్య మలవడియు నతం**
**డర్థములును బ్రాణములును, వ్యర్థము లని తలఁచి శాంతుఁడయ్యె నరేంద్రా! 638**

**ప్రతి :** నరేంద్రా= ఓ రాజా!; కలిమిన్= సంపదలో; అర్థపతికంటెన్= ధనపతి కుబేరునికంటె; కృతార్థుండై= సంపన్నుడై; అతుల శౌర్యమలవడియున్= సాటిలేని పరాక్రమం కలిగి ఉండీ; అతండు= ఆ భరతుడు; అర్థములును= సంపదలును; ప్రాణములును= ప్రాణాలు; వ్యర్థములు అని తలఁచి= పనికిరానివని భావించి (అశాశ్వతాలని గుర్తించి); శాంతుఁ డయ్యెన్= ప్రశాంతిని పొందాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! భరతుడు కుబేరునికంటె ఎక్కువ ధనం పొంది, సాటిలేని పరాక్రమం కలిగి ఉండి కూడా 'అర్థప్రాణాలు అశాశ్వతాలు' అని గుర్తించి ప్రశాంతుడయ్యాడు.

**క. భరతుని భార్యలు ముప్వురు, వరుసం బుత్త్రకులఁ గాంచి వల్లభుతోడన్**
**సరిగారని తోడ్తోడను, శిరములు దునుమాడి రాత్మశిశువుల నధిపా! 639**

**ప్రతి :** అధిపా= ఓ రాజా!; భరతుని భార్యలు ముప్వురు= ఆ భరత చక్రవర్తికి గల ముగ్గురు భార్యలు; వరుసన్= క్రమంగా; పుత్త్రకులన్ కాంచి= కొడుకులను కని; వల్లభుతోడన్= తన భర్త భరతునితో; సరి+కారని= తులతూగరని; తోడ్తోడను= వెంటవెంటనే; ఆత్మశిశువుల= తమ కుమారులయొక్క; శిరాలు తునుమాడిరి= శిరస్సులను ఖండించారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! భరత చక్రవర్తికి గల ముగ్గురు భార్యలు క్రమంగా కొడుకులను కన్నారు అయితే ఈ సుతులు తమ భర్త భరతునితో ఏ విషయంలోను తులతూగరని తమ సుతుల శిరస్సులను ఖండించారు.

**వ. ఇట్లు విదర్భరాజపుత్త్రికలు శిశువులఁ జంపిన భరతుం డపుత్త్రకుండై మరుత్స్తోమం బను యాగంబు**
**పుత్త్రార్థియై చేసి, దేవతల మెప్పించె న య్యవసరంబున. 640**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విదర్భ రాజపుత్రికలు= విదర్భ రాజు సుతలు (భరతుని భార్యలు); శిశువులన్= తమ బిడ్డలను; చంపినన్= సంహరింపగా; భరతుండు= భరత చక్రవర్తి; అపుత్రకుండై= కొడుకులు లేనివాడై; మరుత్‌స్తోమంబు= మరుత్ స్తోమం అనే; యాగంబు= యజ్ఞం; పుత్ర+అర్థియై= సంతానాన్ని కోరి; చేసి; దేవతలన్= దేవతలను; మెప్పించెన్= సంతోషపెట్టాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** భరతుని భార్యలు విదర్భరాజసుతలు ఈ విధంగా తమ శిశువులను ఖండించి వేయగా భరతుడు పిల్లలు లేనివాడయ్యాడు. కొడుకులను కోరి మరుత్ స్తోమం అనే యాగాన్ని చేసి దేవతలను మెప్పించాడు ఆ సమయాన

**సీ. అన్న యిల్లాలిఁ జూలాలిని మమతాఖ్యఁ జూచి బృహస్పతి సురతమునకుఁ**
**దొరఁకొని పైఁబడ్డఁ దొల్లి గర్భంబున నున్న బాలుఁడు భయం బొదవి వలదు**
**తగదని మొఱసేయఁ దమకంబుతో వాని నంధుండ వగుమన్న నలిగి వాఁడు**
**యోనిలోపలి వీర్య మూడఁదన్నిన నేలఁ బడి బిడ్డఁడై యున్నఁ బాయలేక**

**ఆ. నితనిఁ బెంపు; కొడుకు లిరువురు జన్మించి, రనుచు వెలయఁజేయుమనిన మమతఁ**
**బెంపఁజాల; నీవు పెంపు; భరింపు మీ; ద్వాజు ననుచుఁ జనియె దాని విడిచి. 641**

**ప్రతి :** బృహస్పతి; అన్న యిల్లాలిన్= తన అన్నభార్యను; చూలాలిని= గర్భవతిని; మమత+ఆఖ్యన్= మమత అనే పేరుగల దానిని; చూచి; సురతమునకున్= కలయికకు; దొరఁకొని= పూనుకొని; పైఁబడ్డన్= పై బడగా; తొల్లి గర్భంబున+ఉన్న బాలుఁడు= మొదట గర్భంలో ఉన్న బాలుడు; భయంబు ఒదవి= భయమును పొంది; వలదు తగదు అని= వద్దు న్యాయం కాదు అని; మొఱ+చేయన్= మొర పెట్టగా (ప్రార్థింపగా); తమకంబుతోన్= మిక్కిలి కోరికతో; వానిన్= గర్భంలో ఉన్న బాలుని; అంధుడవు+అగుమన్నన్= గుడ్డివాడివై పో అనగా; అలిగి= కోపించి; వాఁడు= ఆ గర్భంలో ఉన్న బిడ్డ; యోనిలోపలి వీర్యము= ఆ మమత జననాంగములోని బృహస్పతి వీర్యాన్ని; ఊడన్ తన్నినన్= బయటపడేలా తన్నేసరికి; నేలన్‌పడి= (ఆ బృహస్పతి వీర్యం) నేలపై పడి; బిడ్డడై యున్నన్= బిడ్డగా (మారగా) ఉండగా; పాయలేకన్= విడువలేక; ఇతనిన్ పెంపు= ఈ బిడ్డను పెంచు; కొడుకు లిరువురు జన్మించిరనుచున్= ఇద్దరు కొడుకులు జన్మించారు అని; మమత= మమత; వెలయన్+చేయుమనినన్= ప్రకటించుమనగా; పెంపఁజాలన్= నేను పెంచలేను (సాకలేను); నీవు పెంపుము= నీవే సాకు; ఈ ద్వాజున్ అనుచున్= ఈ ద్వాజుని అంటూ; దానినివిడిచి= మమతను విడిచి; చనియెన్= బృహస్పతి వెళ్ళిపోయాడు.

**తా :** ఒకసారి బృహస్పతి తన అన్నభార్య, గర్భవతి అయిన మమతను చూచి రతిక్రీడకు పూనుకోగా గర్భంలో ఉన్న శిశువు భయపడి వద్దు; ఇది నీకు తగదు – అని మొరపెట్టుకొన్నాడు. అప్పుడు బృహస్పతి తమకంతో వాణ్ణి గుడ్డివాడివై పో అని శపించాడు. వాడు కోపించి యోనిలోపల ఉన్న బృహస్పతి వీర్యం ఊడిపడేలా తన్నాడు. అది బిడ్డగా నేలమీద పడింది. అప్పుడు మమత ఆ బిడ్డను వదలలేక బృహస్పతితో వీణ్ణి పెంచు. ఇద్దరు కొడుకులు కలిగారు. బాగా మనేట్లు చేయి అన్నది. ఆ బృహస్పతి "నేను పెంచలేను. నీవే సాకు ఈ ద్వాజుణ్ణి నీవే భరించు" అంటూ ఆమెను వదలి వెళ్ళాడు.

**వ. ఇట్లుచథ్యునిభార్య యగు మమతయు, బృహస్పతియు శిశువుం గని, ద్వాజుండైన వీని నీవే భరింపుమని, వదినె మఱందులు దమలో నొండొరువులం బలికిన కారణంబున వాఁడు భరద్వాజుండయ్యె, గర్భస్థుండైన వాఁడు బృహస్పతి శాపంబున దీర్ఘతముం డయ్యె, అంత నా బృహస్పతియు, మమతయు నుదయించిన వాని విడిచి, నిజేచ్ఛం జనిన, మరుత్తులు వానిం బోషించి, పుత్రార్థియైన భరతున కిచ్చిరి. భరతుండును వానిం జేకొనియె. వితథంబైన భరతవంశమునకు నా భరద్వాజుండు వంశకర్త యగుటం జేసి, వితథుండనం బరఁగె. ఆ వితథునికి మన్యువు, మన్యువునకు బృహత్క్షత్ర జయ మహావీర్య నర గర్గులను వారేవురు సంభవించిరి. అందు నరునికి సంకృతి, సంకృతికి గురుండు, రంతిదేవుం డన నిరువురు జన్మించిరి. అందు. 642**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ఉచథ్యుని భార్యయగు= ఉచథ్యుని భార్య అయిన; మమతయున్= మమత; బృహస్పతియున్= బృహస్పతి; శిశువున్ కని= కుమారుని గని; ద్వాజుండైన వీనిన్= ద్వాజుడైన వీనిని; ఈవే భరింపుమని= నీవే భరించు అని; వదినె మఱందులు= వదినె అయిన మమత, మరదియైన బృహస్పతి; తమలోన్= వారిలో; ఒండొరువులన్= ఒకరితోఒకరు; పలికిన కారణంబునన్= మాట్లాడిన కారణంగా; వాఁడు= ఆ బిడ్డ; భరద్వాజుండయ్యెన్= భరద్వాజుడయ్యాడు (భరింపబడిన రెండవబిడ్డ భరద్వాజుడు); గర్భస్థుడైనవాఁడు= మమత గర్భంలో ముందున్న శిశువు; బృహస్పతి శాపంబునన్= బృహస్పతి ఇచ్చిన శాపంవల్ల; దీర్ఘతముండు అయ్యెన్= దీర్ఘతముడు అనే పేరుతో పిలువబడ్డాడు; అంతన్, ఆ బృహస్పతియున్, మమతయున్= అంతట ఆ బృహస్పతి మమత ఇరువురుకూడా; ఉదయించిన వానిన్ విడిచి= పుట్టిన కుమారుని వదలి; నిజ+ఇచ్ఛన్+చనినన్= తమ ఇష్టప్రకారం వెళ్ళిపోగా; మరుత్తులు= మరుద్దేవతలు; వానిన్ పోషించి= ఆ బిడ్డను పోషించి; పుత్ర+అర్థి+ఐన= కుమారుని కోరుకొంటున్న; భరతునకున్ ఇచ్చిరి= భరతుడికిచ్చారు; భరతుండును= భరతుడు; వానిన్ చేకొనియెన్= ఆ బిడ్డను స్వీకరించాడు; వితథంబైన= (సంతులేక) వ్యర్థమైన; భరతవంశంబునకున్= ఆ భరతుని వంశానికి; ఆ భరద్వాజుండు= ఆ భరద్వాజుడు; వంశకర్త అగుటన్ చేసి= వంశకర్త అవడంచేత; వితథుండు+అనన్ పరఁగెన్= వితథుడు అని పిలువబడ్డాడు; ఆ వితథునకున్= ఆ వితథుడు అనేవానికి; మన్యువు; మన్యువునకున్= ఆ మన్యువు అనేవానికి; బృహత్క్షత్ర, జయ, మహావీర్య, నర, గర్గులు+అనువారు= బృహక్షత్ర, జయ, మహావీర్య, నర, గర్గులు అను పేర్లు గలవారు; ఏవురు సంభవించిరి= ఐదుగురు జనించారు; అందున్ నరునికిన్= ఆ ఐదుగురిలో నరుడు అనేవానికి; సంకృతి= సంకృతి అనేవాడు; సంకృతికిన్ గురుండు= సంకృతి అనేవానికి గురుడు; రంతిదేవుండనన్= రంతిదేవుడనబడే; ఇరువురు జన్మించిరి= ఇద్దరు పుత్రులు జన్మించారు.

**తా :** ఈ విధంగా ఉచథ్యుని భార్య మమత, బృహస్పతి శిశువును చూచి ఈ ద్వాజుణ్ణి నీవు భరించు అంటే నీవు భరించు అని వాదులాడుకోవడంవల్ల అతడు భరద్వాజుడయ్యాడు. మమత గర్భంలో ఉన్నవాడు బృహస్పతి శాపంవల్ల గ్రుడ్డివాడయ్యాడు. అతడు దీర్ఘతముడు. అంతట బృహస్పతి, మమత ఇరువురు కూడా ఉదయించిన బిడ్డను విడిచి వారి వారి ఇష్టానుసారం వెళ్ళిపోయారు. మరుత్తులు ఆ బిడ్డను పోషించి పుత్రుని కోరుకొన్న భరతునకు ఇచ్చారు. భరతుడు ఆ బిడ్డను స్వీకరించాడు. సంతులేని భరత వంశానికి భరద్వాజుడు వంశకర్తయై వితథుడు అని పిలువబడ్డాడు. వితథునకు మన్యువు, మన్యువునకు బృహత్క్షత్ర, జయ మహావీర్య, నర, గర్గులనే ఐదుగురు సంతానం కలిగారు. ఆ ఐదుగురిలో నరుడు అనేవానికి సంకృతి, సంకృతికి గురుడు, రంతిదేవుడనే ఇరువురు పుత్రులు జన్మించారు.

## ✤ రంతిదేవుని చరిత్రము ✤

సీ. రాజవంశోత్తమ! రంతిదేవుని కీర్తి యేల? చెప్పఁగ విను మిందు నందు
నా రాజు దన సంచితార్థంబు లన్నియు నెడపక దీనుల కిచ్చి యిచ్చి
సకుటుంబుఁడై ధైర్యసంయుతుండై పేద యై కూడు నీరులే కధమవృత్తి
నెందేని నలువది యెనిమిది దివసముల్ చరియింప నొకదివసంబు రేపు

ఆ. నెయ్యి పాయసంబు నీళ్ళును గలిగిన, బహుకుటుంబ భారభయముతోడ
నలసి నీరువట్టు నాఁకలియును మిక్కి, లొదవఁ జూచి కుడువ నుత్సహించె. **643**

**ప్రతి :** రాజవంశ+ఉత్తమ!= ఓ రాజవంశశ్రేష్ఠా, పరీక్షిన్మహారాజా; రంతిదేవుని కీర్తి యేలచెప్పఁగన్= రంతి దేవుని కీర్తిని గూర్చి ఎందుకు చెప్పడం (చెప్ప పని లేకుండా అందరికీ తెలిసినదే, గొప్పది); వినుము= విను; ఆ రాజు= ఆ రంతిదేవుడనే రాజు; ఇందునందున్= ఇక్కడా అక్కడా (అన్నిచోట్లా); తన సంచిత+అర్థంబులు+అన్నియున్= తాను సంపాదించిన విత్తములన్నీ; ఎడపక= ఎడతెగకుండా; దీనులకున్ ఇచ్చియిచ్చి= దీనులకు పూర్తిగా ఇచ్చి; సకుటుంబుఁడై= కుటుంబంతో కూడినవాడై; ధైర్యసంయుతుండై= ధైర్యం కలిగినవాడై; పేదయై= బీదవాడై; కూడు నీరులేక= ఆహారం నీళ్ళు లేకుండా; అధమవృత్తిన్= (రాజై ఉన్నప్పటికీ) తక్కువ స్థితిలో; ఎందేనిన్= ఎక్కడో; నలువది యెనిమిది దివసముల్= నలభై ఎనిమిది రోజులు; చరియింపన్= సంచరిస్తుండగా; ఒక దివసంబురేపు= ఒకరోజు ఉదయసమయంలో; నెయ్యి పాయసంబు నీళ్ళును కలిగినన్= నెయ్యి, పరమాన్నం, జలం లభింపగా; బహుకుటుంబ భార భయముతోడన్= ఎక్కువ కుటుంబం కలిగి ఉన్న కారణంగా భయంతో (ఈ పదార్థాలు అందరికి చాలుతాయా, చాలవా అనే భయంతో); అలసి= నీరసించి; నీరువట్టు= దప్పిక; ఆఁకలియును= ఆకలి; మిక్కిలి ఒదవన్= ఎక్కువగా ఉండగా; చూచి= లభించిన పదార్థాలను చూచి; కుడువన్= తినుటకు; ఉత్సహించెన్= ఆసక్తి చూపాడు.

**తా :** ఓ రాజశ్రేష్ఠా! పరీక్షిన్మహారాజా! రంతిదేవుని కీర్తి గురించి చెప్ప బనిలేదు. అయినా విను. ఆ రాజు దీనులు అందరికి తాను సంపాదించిన ధనాన్ని దానం చేసేశాడు. కడు పేదవాడై కుటుంబంతో సహా ధైర్యం మాత్రం విడువక నలభై ఎనిమిది రోజులు ఆహార పానీయాలు లేక తిరిగాడు. ఒకనాటి ఉదయకాలంలో ఆ రంతిదేవునకు నెయ్యి, పాయసం, నీళ్ళు లభించాయి. తనకున్న పెద్ద కుటుంబ భారభయంతో ఆకలి, దాహం అధికం కాగా ఆ పదార్థాలను చూచి తినడానికి ఉత్సాహపడ్డాడు.

వ. అయ్యవసరంబున. **644**

**ప్రతి :** ఆ+అవసరమునన్= ఆ సమయంలో...

**తా :** ఆ సమయంలో

సీ. అతిథిభూసురుఁ డొక్కఁడాహార మడిగినఁ గడపక ప్రియముతో గారవించి
హరిసమర్పణ మంచు నన్నంబులో సగ మిచ్చిన భుజియించి యేగె నాతఁ;
డంతలో నొకశూద్రుఁ డశనార్థియై వచ్చి పొడసూపలే దనఁబోక తనకు
నున్న యన్నములోన నొకభాగ మిచ్చిన సంతుష్టుఁడై వాఁడు సనిన వెనుక

**ఆ. కుక్క గమియుఁ దాను నొక్కఁ డేతేర నా, యన్న శేషమిచ్చి సన్నయమున**
**వాని మ్రొక్కి పంప వరుసతోఁ జండాలుఁ, డొక్కఁ డరుగుదెంచి చక్క నిలిచి. 645**

**ప్రతి :** ఒక్కఁడు= ఒకడు; అతిథిభూసురుఁడు= అతిథిగా బ్రాహ్మణుడు; ఆహారమడిగినన్= భోజనాన్ని అడుగగా; కడపక= లేదని పంపక; ప్రియముతోన్= ప్రేమతో; గారవించి= గౌరవించి; హరిసమర్పణము అంచున్= విష్ణుమూర్తికి ఇది సమర్పిస్తున్నాను అంటూ; అన్నంబులోన్= తనకు లభించిన పరమాన్నంలో; సగమిచ్చినన్= సగభాగం ఇవ్వగా; ఆతఁడు భుజియించి ఏగెన్= ఆ బ్రాహ్మణుడు భుజించి వెళ్ళాడు; అంతలోన్= అంతలోనే; ఒక శూద్రుడు; అశన+అర్థియై వచ్చి= భోజనం కోరివచ్చి; పొడసూపన్= కన్పించగా; లేదు+అనన్+పోఁక= లేదు అనకుండా; తనకున్+ఉన్న యన్నములోనన్= బ్రాహ్మణునకు పెట్టగా మిగిలిన అన్నంలో; ఒక భాగమిచ్చినన్= ఒక భాగం ఇవ్వగా; వాఁడు= ఆ శూద్రుడు; సంతుష్టుఁడై= సంతోషం పొంది; చనిన వెనుకన్= వెళ్ళిన తరువాత; కుక్క గమియున్= కుక్కల గుంపుతో; తాను నొక్కఁడు+ఏతేరన్= తానొకడు రాగా; ఆ అన్నశేషము ఇచ్చి= మిగిలిన ఆ అన్నం అంతా ఇచ్చి; సత్+నయమునన్= మంచిబుద్ధితో; వాని మ్రొక్కిపంపన్= వానికి నమస్కరించి పంపించగా; వరుసతోన్= ఆ వెంటనే (ఆ వరుసలో); ఒక్కఁడు చండాలుఁడు= ఒక చండాలుడు; అరుగుదెంచి= వచ్చి; చక్క నిలిచి= నిలబడి.

**తా :** ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చి ఆహార మడుగగా ప్రియంగా గౌరవించి “హరి సమర్పణం” అంటూ అన్నంలో సగభాగమిచ్చాడు రంతిదేవుడు. అతడు భుజించి వెళ్ళేలోపున ఒక శూద్రుడు భోజనం కోరి వచ్చాడు. తనకు మిగిలిన అన్నంలో ఒక భాగం అతని కీయగా అతడు సంతోషించి వెళ్ళాడు. వాడు వెళ్ళిన వెంటనే కుక్కలగుంపుతో ఒకడురాగా మిగిలిన అన్నాన్ని ఇచ్చి వేశాడు రంతిదేవుడు. వెంటనే చండాలు డొకడు వచ్చి సమీపంలో నిలబడ్డాడు.

**క. హీనుఁడఁ; జండాలుండను, మానవకులనాథ! దప్పి మానదు; నవలం**
**బోనేర; నీకుఁ జిక్కిన, పానీయము నాకుఁ బోసి బ్రతికింపఁగదే! 646**

**ప్రతి :** మానవ కులనాథ= ఓ రాజా!; హీనుఁడన్= నేను హీనుడను; చండాలుండను= చండాలుడను; దప్పి= దాహము; మానదు= పోవడం లేదు; అవలన్ పోనేరన్= అవతలకు వెళ్ళలేను (ఒక్క అడుగు వేయలేను); నీకున్ చిక్కిన= నీకు లభించిన; పానీయము= నీరు (తాగు పదార్థం); నాకున్ పోసి= నాకు పోసి; బ్రతికింపన్+కదే= బతికింపవా?!

**తా :** ఓ రాజా! నేను హీనుడను, చండాలుడను, నాకు దప్పిక ఎక్కువగా ఉంది. ఒక్క అడుగు ముందుకు వేయలేను. నీకు ఉన్న ఆ నీరు నాకు పోసి నన్ను బతికించు.

**వ. అనిన వాని దీనాలాపంబులకుఁ గరుణించి, రాజిట్లనియె. 647**

**ప్రతి :** అనినన్= అనగా; వాని దీన+ఆలాపంబులకున్= అతని దీనత్వంతో కూడిన మాటలకు; కరుణించి= దయదలచి; రాజు+ఇట్లు అనియెన్= రాజు ఇలా అన్నాడు.

**తా :** చండాలుడు అలా అన్నాడు. అతని దైన్యంతో కూడిన మాటలకు జాలి వహించి రంతిదేవుడిట్లన్నాడు.

**ఉ. అన్నము లేదు, కొన్ని మధురాంబువు లున్నవి; ద్రావుమన్న; రా**
**వన్న, శరీరధారులకు నాపద వచ్చిన వారియాపదల్**

**గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకంటె నొండు మే**
**లున్నదె? నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడ సుమ్ము పుల్కసా! 648**

**ప్రతి :** పుల్కసా= ఓ చండాలా!; అన్నములేదు= నా వద్ద అన్నం లేదు; కొన్ని మధుర+అంబువులు= కొన్ని తీయని నీళ్ళు; ఉన్నవి= ఉన్నాయి; త్రావుము+అన్న= ఓ అన్నా త్రాగు; రావన్న= ఓ అన్నా రమ్ము; శరీర ధారులకున్= శరీరాన్ని ధరించిన జీవులకు; ఆపదవచ్చినన్= కష్టంవస్తే; వారి ఆపదల్= వారి కష్టాలు; క్రన్ననన్ మాన్చి= వెంటనే పోగొట్టి; వారికిన్= ఆ జీవులకు; సుఖంబులు= సౌఖ్యాలు; చేయుటకంటెన్= (కలిగించేకంటె) చేయడంకంటె; ఒండు= వేరొక; మేలు+ఉన్నదె!= మేలు ఉందా; పురుష+ఉత్తముఁడు+ఒక్కఁడ= ఒక్క పురుషోత్తముడే; నాకున్ దిక్కు= నాకు ఆధారం.

**తా :** ఓ పుల్కసా! నా వద్ద అన్నం లేదు. కొన్ని మధురజలాలు ఉన్నాయి. రా! త్రాగు. జీవులకు కష్టంవస్తే వాళ్ళ ఆపదలు వెంటనే పోగొట్టి వాళ్ళకు సుఖం కలిగించడంకంటె మేలు ఏముంటుంది! నాకంటావా! పురుషోత్తముడే నాకు దిక్కు.

**వ. అని పలికి. 649**

**ప్రతి :** అని పలికి= అని వచించి...

**తా :** ఈ విధంగా మాట్లాడి

**మ. బలవంతంబగు నీరువట్టున నిజప్రాణాంతమై యున్నచో**
**నలయం డేమియు; వీని హృజ్జ్వరము నాయాసంబు ఖేదంబు నా**
**జలదానంబున నేఁడు మాను ననుచున్ సర్వేశ్వరాధీనుఁడై**
**జలముల్ వోసెను రంతిదేవుఁడు దయం జండాలపాత్రంబునన్. 650**

**ప్రతి :** బలవంతంబు+అగు= మిక్కిలి కష్టమైన; నీరువట్టున= దాహంవల్ల; నిజ= తనయొక్క; ప్రాణ+అంతమై+ఉన్నచోన్= ప్రాణంపోయేలా ఉన్నట్లయితే; ఏమియున్ అలయండు= ఏమి కష్టపడదు; వీని హృత్ జ్వరమున్= వీని ఎదలోని బాధ; ఆయాసంబు= ఆయాసం; ఖేదంబు= కష్టం; నా జలదానంబునన్= నేను చేసే నీటిదానంతో; నేఁడు= ఈనాడు; మానును అనుచున్= పోవునుగాక అనుకుంటూ; సర్వ+ఈశ్వర+అధీనుఁడై= పరమేశ్వరునికి లోబడినవాడై; రంతిదేవుఁడు; దయన్= దయతో; చండాల పాత్రంబునన్= ఆ చండాలుని పాత్రలో; జలముల్+పోసెను= జలాన్ని పోశాడు.

**తా :** అతికష్టమైన దాహంతో ప్రాణం పోయేస్థితిలో ఉన్న ఈతడు ఏమి బాధపడకుండుగాక. వీని హృదయతాపం, ఆయాసం, బాధ నేనిచ్చే ఈ జలంతో పోవుగాక అనుకుంటూ పరమేశ్వరుని నమ్మినవాడై రంతిదేవుడు దయతో ఆ చండాలుని పాత్రలో మధురమైన నీటిని పోశాడు.

**వ. తదనంతరంబ, బ్రహ్మాదిదేవతలు సంతోషించి, రంతిదేవునికి మేలు సేయం దలంచి, నిజాకారంబులతో ముందట నిలువంబడి యా రాజు ధైర్య పరీక్షార్థంబు దమ చేసిన వృషలాదిరూపంబు లగు విష్ణుమాయ నెఱింగించిన, నా నరేంద్రుం దండతికి నమస్కరించి. 651**

**ప్రతి :** తద్+అనంతరంబ= అటు తరువాత; బ్రహ్మాదిదేవతలు సంతోషించి= బ్రహ్మ మొదలైన దేవతలందరు సంతసించి; రంతిదేవునికిన్ మేలు చేయన్ తలంచి= రంతిదేవునకు మేలు చేద్దామని; నిజ+ఆకారంబులతోన్= తమ తమ ఆకారాలతో;

ముందటన్ నిలువంబడి= రంతిదేవుని ఎదురుగా నిలబడి; ఆ రాజు= ఆ రాజైన రంతిదేవుని; ధైర్య పరీక్షా+అర్థంబు= ధైర్యాన్ని పరీక్షించడంకోసం; తమచేసిన= తాము ఏర్పాటు చేసిన; వృషల+ఆది= శూద్రుడు మొదలైన; రూపంబులగు= రూపాలతో కూడిన; విష్ణుమాయన్ ఎఱింగించినన్= విష్ణుమాయను తెలియజేయగా; ఆ నరేంద్రుండు= ఆ రాజు రంతిదేవుడు; అందఱికిన్ నమస్కరించి= ఆ వచ్చిన దేవతలందరికి చేతులు జోడించి...

**తా :** అటుపిమ్మట బ్రహ్మాది దేవతలు సంతసించి, రంతిదేవునకు మేలు చేద్దామని, తమ తమ (మారువేషాలు విడిచి) ఆకారాలతో రాజుముందు నిలబడ్డారు. ఆ రాజు ధైర్యాన్ని పరీక్ష చేయాలనే ఆలోచనతో తాము ధరించిన శూద్ర బ్రాహ్మణాది రూపాలతో కూడిన విష్ణుమాయను తెలిపారు. ఆ రంతిదేవుడు వచ్చిన దేవతలందరికి చేతులు జోడించి

**క. వారల నేమియు నడుగక, నారాయణభక్తి తన మనంబున వెలుఁగన్**
**ధీరుం డాతఁడు మాయా, పారజ్ఞుం డగుచుఁ బరమపదముం బొందెన్. 652**

**ప్రతి :** ధీరుండు ఆతఁడు= ధైర్యం గల రంతిదేవుడు; వారలన్= వచ్చిన దేవతలను; ఏమియున్ అడుగక= ఏమియు కోరక; నారాయణ భక్తి= హరిపై గల భక్తి; తనమనంబునన్ వెలుఁగన్= తన మనసులో ప్రకాశింపగా; మాయాపారజ్ఞుండు అగుచున్= మాయయొక్క పారమును (తుదను) తెలిసినవాడై; పరమ పదమున్ పొందెన్= మోక్షాన్ని పొందాడు.

**తా :** రంతిదేవుడు ధీరుడు, మాయావిధానాన్ని ఎరిగినవాడు. అందుకే ప్రత్యక్షమై వచ్చిన దేవతలను ఇహలోక సౌఖ్యాలు ఏమీ కోరక, నారాయణునిపై భక్తి తన ఎదలో ప్రకాశింపగా మోక్షాన్ని పొందాడు.

**క. ఆ రాజర్షిని గొలిచిన, వారెల్లఁ దదీయయోగవైభవమున శ్రీ**
**నారాయణ చింతనులై, చేరిరి యోగీశు లగుచు సిద్ధపదంబున్. 653**

**ప్రతి :** ఆ రాజ+ఋషిని= ఆ రాజ ఋషి అయిన రంతిదేవుని; కొలిచిన వారెల్లన్= సేవించిన వారందరూ; తదీయ= ఆ రంతిదేవునియొక్క; యోగ వైభవమునన్= గొప్పదైన యోగమహిమవల్ల; శ్రీ నారాయణ చింతనులై= శ్రీహరిని ధ్యానించే వారై; యోగీశులగుచున్= యోగీశ్వరులై; సిద్ధపదంబున్= యోగులు సిద్ధులు ఉండే పదవిని; చేరిరి= చేరుకున్నారు.

**తా :** ఆ రాజర్షి అయిన రంతిదేవుని సేవించిన వారంతా, అతని యోగ మహిమవల్ల హరిచింతన కలవారై, యోగీశ్వరులై, మహాయోగులు, సిద్ధులు నివసించే గొప్ప పదాన్ని పొందారు.

**వ. ఇట్లు రంతిదేవుండు విజ్ఞానగర్భిణియగు భక్తివలనఁ బరమ పదంబునకుం జనియె. అంత గర్గునకు శిని జన్మించె, శినికి గార్గ్యుండు గలిగె, అతని నుండి బ్రాహ్మణకులంబయ్యె. మహావీర్యునికి నురుక్షయుండు, నురుక్షయునకుఁ ద్రయ్యారుణియుఁ, గవియుఁ, బుష్కరారుణియు నను ముప్వురు సంభవించిరి. వారును బ్రాహ్మణులై చనిరి. బ్రహ్మక్షత్రునికి సుహోత్రుండును, సుహోత్రునికి హస్తియు జనించిరి. అతండు దనపేర హస్తినాపురంబు నిర్మించె, ఆ హస్తికి నజమీఢుండును, ద్విమీఢుండును, పురుమీఢుండును నన ముగ్గురు జనియించిరి. అందు నజమీఢుని వంశంబునఁ బ్రియమేధాదులు గొందఱు పుట్టి బ్రాహ్మణులై చనిరి. అ య్యజమీఢునికి బృహదిషువు, నతనికి బృహద్ధనువు, నతనికి బృహత్కాయుండు, నతనికి జయద్రథుండు, అతనికి విశ్వజిత్తు, విశ్వజిత్తునకు సేనజిత్తు, సేనజిత్తునకు రుచిరాశ్వుండు, దృఢహనువు, కాశ్యుండు,**

**వత్సుండు నన నలుగురు జనియించిరి. అందు రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుండు, నతనికిఁ బృథుసేనుండును, బృథుసేనునికిఁ బారుండును, వానికి నీపుండును, నీపునికి నూర్వురు కొడకులును బుట్టిరి; మఱియును. 654**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; రంతిదేవుండు= రంతిదేవుడు; విజ్ఞాన గర్భిణియగు భక్తివలనన్= విజ్ఞానం నిండుగా ఉన్న భక్తివల్ల; పరమ పదంబునకున్ చనియెన్= మోక్షాన్ని పొందాడు; అంతన్= అటుపిమ్మట; గర్గునకున్= గర్గుడు అనేవానికి; శిని జన్మించెన్= శిని పుట్టాడు; శినికిన్= ఆ శిని అనేవానికి; గార్గ్యుండు కలిగెన్= గార్గ్యుడు జన్మించాడు; అతనినుండి= ఈ గార్గ్యుని నుండి; బ్రాహ్మణకులంబయ్యెన్= బ్రాహ్మణ కులం అయింది; మహావీర్యునికిన్= మహావీర్యునికి; ఉరుక్షయుండు= ఉరుక్షయుడు; మరుక్షయునికిన్= ఆ మరుక్షయునికి; త్రయ్యారుణియున్= త్రయ్యారుణి; కవియున్= కవి; పుష్కరారుణియునను= పుష్కరారుణి అనబడే; ముువ్వురు సంభవించిరి= ముగ్గురు జన్మించారు; వారును= వారుకూడా; బ్రాహ్మణులై చనిరి= బ్రహ్మజ్ఞానంతో జీవించి వెళ్ళారు; బ్రహ్మక్షత్రునికిన్= బ్రహ్మక్షత్రుడు అనేవానికి; సుహోత్రుండును= సుహోత్రుడు అనేవాడు; సుహోత్రునికిన్= ఆ సుహోత్రుడు అనేవానికి; హస్తియున్ జనించిరి= హస్తి అనేవాడు పుట్టారు; అతండు= ఆ హస్తి అనే అతడు; తన పేరన్= తన పేరుతో; హస్తినాపురంబు నిర్మించెన్= హస్తినాపురం కట్టించాడు; ఆ హస్తికిన్= ఆ హస్తి అనేవానికి; అజమీఢుండును= అజమీఢుడు; ద్విమీఢుండును= ద్విమీఢుడు; పురుమీఢుండుననన్= పురుమీఢుడు అనబడే; ముగ్గురు జనియించిరి= ముగ్గురు జన్మించారు; అందున్= వారిలో; అజమీఢుని వంశంబునన్= అజమీఢుని వంశంలో; ప్రియమేధాదులు= ప్రియమేధుడు మొదలైనవారు; కొందఱు పుట్టి= కొందరు జన్మించి; బ్రాహ్మణులై చనిరి= బ్రహ్మజ్ఞానంతో జీవించి వెళ్ళారు; ఆ అజమీఢునికిన్= ఆ అజమీఢుడు అనేవానికి; బృహదిషువు= బృహదిషువు; అతనికిన్= అతనికి; బృహద్ధనువున్= బృహద్ధనువు; అతనికిన్= ఆ బృహద్ధనువునకు; బృహత్కాయుండును= బృహత్కాయుడు; అతనికిన్= ఆ బృహత్కాయునికి; జయద్రథుండును= జయద్రథుడు; అతనికిన్ విశ్వజిత్తు= ఆ జయద్రథునికి విశ్వజిత్తు; విశ్వజిత్తునకున్ సేనజిత్తు= ఆ విశ్వజిత్తునికి సేనజిత్తు; సేనజిత్తునకున్ రుచిరాశ్వుండు, దృఢహనువు, కాశ్యుండు, వత్సుండనన్= ఆ సేనజిత్తు అనేవానికి రుచిరాశ్వుడు, దృఢహనువు, కాశ్యుడు, వత్సుడు అనబడే; నలుగురు జనియించిరి= నలుగురు జన్మించారు; అందున్= వారిలో; రుచిరాశ్వనకున్= రుచి రాశ్వునికి; ప్రాజ్ఞుండున్= ప్రాజ్ఞుడు; అతనికిన్= ఆ ప్రాజ్ఞునకు; పృథుసేనుండును= పృథుసేనుడు; పృథుసేనునికిన్= ఆ పృథుసేనునికి; పారుండును= పారుడు; వానికిన్= ఆ పారునకు; నీపుండును= నీపుడు; నీపునికిన్= ఆ నీపుడు అనేవానికి; నూర్వురు కొడుకులును= నూరుమంది సుతులు; పుట్టిరి= పుట్టారు; మఱియును= అంతేకాక...

**తా :** ఈ ప్రకారంగా రంతిదేవుడు విజ్ఞానయుతమైన భక్తివల్ల మోక్షాన్ని పొందాడు. ఆ తరువాత గర్గునకు శిని, శినికి గార్గ్యుడు జన్మించారు. ఈ గార్గ్యుని నుండి బ్రాహ్మణకులం అయింది. మహావీరునికి ఉరుక్షయుడు, వానికి త్రయ్యారుణి, కవి, పుష్కరారుణి అనే ముగ్గురు జన్మించారు. వారు కూడా బ్రహ్మజ్ఞానం గల బ్రాహ్మణులయ్యారు.

బ్రహ్మక్షత్రునికి సుహోత్రుడు, వానికి హస్తి జన్మించారు. ఈ హస్తి తనపేర హస్తినాపురాన్ని నిర్మించాడు. హస్తికి అజమీఢుడు, ద్విమీఢుడు, పురుమీఢుడు అనే ముగ్గురు జన్మించారు. అందులో అజమీఢుని వంశంలో ప్రియమేధాదులు కొందరు పుట్టి బ్రాహ్మణులయ్యారు. ఆ అజమీఢునికి బృహదిషువు వానికి బృహద్ధనువు, అతనికి బృహత్కాయుడు, వానికి జయద్రథుడు, అతనికి విశ్వజిత్తు, విశ్వజిత్తునికి సేనజిత్తు, వానికి రుచిరాశ్వుడు, దృఢహనువు, కాశ్యుడు, వత్సుడు అనే నలుగురు జన్మించారు. అందులో రుచిరాశ్వునికి ప్రాజ్ఞుడు, వానికి పృథుసేనుడు, పృథుసేనునికి పారుడు, వానికి నీపుడు, ఆ నీపునికి నూర్గురు సుతులు పుట్టారు మరియు

**ఆ. శుకునికూఁతు రైన సుందరి సత్కృతిఁ, బొంది వేడ్క నీపభూవిభుండు**
**విమలయోగవిత్తు విజ్ఞానదీపితో, దారచిత్తు బ్రహ్మదత్తుఁ గనియె. 655**

**ప్రతి :** నీప భూవిభుండు= నీపుడనే రాజు; శుకుని కూఁతురైన= శుకుని కొమరిత అయిన; సుందరి సత్కృతిన్= అందమైన సత్కృతి అనే ఆమెను; పొంది= గ్రహించి (పెండ్లాడి); విమలయోగవిత్తున్= స్వచ్ఛమైన యోగం తెలిసిన; విజ్ఞాన దీపిత+ఉదారచిత్తున్= విజ్ఞానంతో వెలుగొందే పెద్దమనసు గల; బ్రహ్మదత్తున్= బ్రహ్మదత్తుణ్ణి; కనియెన్= కన్నాడు.

**తా :** నీప మహారాజు శుకుని కూతురైన సత్కృతి అనే ఆమెను పెండ్లి చేసికొని, చక్కని యోగవిద్యనెరిగి విజ్ఞానంతో వెలుగొందే హృదయం గల బ్రహ్మదత్తుణ్ణి కన్నాడు.

**వ. బ్రహ్మదత్తుండు, జైగీషవ్యోపదేశంబున, యోగతంత్రంబునఁ జేసి గోదేవి యను భార్యవలన విష్వక్సేనుండను కుమారునిం గనియె. విష్వక్సేనునకు నుదక్సేనుండు, నుదక్సేనునకు భల్లాదుండు. వీరలు బార్హదిషవులను రాజులైరి. ద్విమీఢునకు యమీనరుండు, యమీనరునికిఁ గృతిమంతుడు, కృతిమంతునికి సత్యధృతి, సత్యధృతికి దృఢనేమి, దృఢనేమికి సుపార్శ్వకృత్తు, సుపార్శ్వకృత్తునకు సుపార్శ్వుండు, సుపార్శ్వునకు సుమతి, సుమతికి సన్నతిమంతుండు జనించిరి. సన్నతిమంతుకొడుకు కృతి యనువాఁడు, హిరణ్యనాభునివలన యోగమార్గం బెఱింగి, శోకమోహంబులు విడిచి, తూర్పు దేశంబున సామసంహిత పఠియించె. నతనికి నుగ్రాయుధుండు, నుగ్రాయుధునకు క్షేమ్యుండు, క్షేమ్యునకు సువీరుండు, సువీరునకుఁ బురంజయుండుఁ, బురంజయునకు బహురథుండు జన్మించిరి. హస్తికొడుకు పురుమీఢునకు సంతతి లేదయ్యె. అ య్యజమీఢునికి నళిని యను భార్యయందు నీలుండు, నీలునికి శాంతి, శాంతికి సుశాంతి, సుశాంతికిఁ బురుజుండు, పురుజునికి నర్కుండు, నర్కునికి భర్మ్యాశ్వుండు, భర్మ్యాశ్వునకు ముద్గల యవీనర బృహదిషు కాంపిల్య సృంజయు లను వా రేవురు పుట్టిరి. 656**

**ప్రతి :** బ్రహ్మదత్తుండు= బ్రహ్మదత్తుడు; జైగీషవ్య+ఉపదేశంబునన్= జైగీషవ్యుని ఉపదేశాన్ని అనుసరించి; యోగతంత్రంబునన్+చేసి= యోగతంత్రంవల్ల; గోదేవియను భార్యవలనన్= గోదేవి అనే పేరుగల సతివల్ల; విష్వక్సేనుండు+అను కుమారునిన్+కనియెన్= విష్వక్సేనుడు అనే పేరుగల పుత్రుణ్ణి కన్నాడు; విష్వక్సేనునకున్= ఆ విష్వక్సేనునికి; ఉదక్సేనుండును= ఉదక్సేనుడు; ఉదక్సేనునకున్= ఆ ఉదక్సేనునకు; భల్లాదుండు= భల్లాదుడు జన్మించాడు; వీరలు= వీళ్ళు; బార్హదిషవులు+అను రాజులు+ఐరి= బార్హదిషవులు అను పేరుగల రాజులు అయ్యారు; ద్విమీఢునకున్= ద్విమీఢుడు అనేవానికి; యమీనరుండు= యమీనరుడు; యమీనరునికిన్= ఆ యమీనరునికి; కృతిమంతుఁడు= కృతిమంతుడు; కృతిమంతునికిన్= ఆ కృతిమంతునికి; సత్యధృతి= సత్యధృతి అనేవాడు; సత్యధృతికిన్= సత్యధృతికి; దృఢనేమి= దృఢనేమి; దృఢనేమికిన్= ఆ దృఢనేమికి; సుపార్శ్వకృత్తు= సుపార్శ్వకృత్తు; సుపార్శ్వకృత్తునకున్= సుపార్శ్వకృత్తునకు; సుపార్శ్వుండు= సుపార్శ్వుడు; సుపార్శ్వునకున్= సుపార్శ్వునికి; సుమతి; సుమతికిన్= సుమతికి; సన్నతిమంతుండు జనించిరి= సన్నతిమంతుడు అనేవారు జన్మించారు; సన్నతిమంతు కొడుకు= ఆ సన్నతిమంతుని కుమారుడు; కృతి+అనువాఁడు= కృతి అనేవాడు; హిరణ్యనాభుని వలనన్= హిరణ్య నాభునివల్ల; యోగమార్గంబెఱింగి= యోగమార్గం తెలిసికొని; శోకమోహంబులు విడిచి= శోకాన్ని మోహాన్ని విడిచిపెట్టి; తూర్పుదేశంబునన్= తూర్పుదేశంలో; సామసంహిత= సామవేదాన్ని; పఠియించెన్= చదివాడు; అతనికిన్= కృతికి; ఉగ్రాయుధుండు= ఉగ్రాయుధుడు; ఉగ్రాయుధునకున్= ఉగ్రాయుధుడు అనేవానికి;

క్షేమ్యుండు= క్షేమ్యుడు; క్షేమ్యునకున్ సువీరుండు= క్షేమ్యునికి సువీరుడు; సువీరునకున్= ఆ సువీరునకు; పురంజయుండున్= పురంజయుడు; పురంజయునకున్= ఆ పురంజయునకు; బహురథుండు= బహురథుడు; జన్మించిరి= పుట్టారు; హస్తి కొడుకు= హస్తియొక్క కుమారుడు; పురుమీఢునకున్= పురుమీఢునికి; సంతతిలేదయ్యెన్= సంతానం లేదు; అయ్యజమీఢునికిన్= ఆ అజమీఢుడు అనేవానికి; నళినియను భార్యయందున్= నళిని అనే పేరుగల సతియందు; నీలుండు= నీలుడు; నీలునికిన్ శాంతి= నీలుడు అనేవానికి శాంతి; శాంతికిన్ సుశాంతి= ఆ శాంతికి సుశాంతి; సుశాంతికిన్= సుశాంతికి; పురుజుండు= పురుజుడు; పురుజునికిన్= ఆ పురుజునకు; అర్కుండు= అర్కుడు; అర్కునికిన్= ఆ అర్కునికి; భర్మ్యాశ్వుండు= భర్మ్యాశ్వుడు; భర్మ్యాశ్వునకున్= ఆ భర్మ్యాశ్వుడు అనేవానికి; ముద్గల యవీనర బృహదిషు కాంపిల్య సృంజయులనువారు= ముద్గల, యవీనర, బృహదిషు, కాంపిల్య, సృంజయులనే పేర్లుగలవారు; ఏవురు పుట్టిరి= ఐదుగురు జన్మించారు.

**తా :** బ్రహ్మదత్తుడు జైగీషవ్యుని ఉపదేశంవల్ల యోగవిద్యను పొంది గోదేవి అనే పేరుగల భార్యవల్ల విష్వక్సేనుడు అనే కుమారుని కన్నాడు. విష్వక్సేనునకు ఉదక్సేనుడు, వానికి భల్లాదుడు జన్మించారు. వీరు బార్హదిషవులనే రాజులైరి. ద్విమీఢునకు యమీనరుడు, వానికి కృతిమంతుడు, వానికి సత్యధృతి, వానికి దృఢనేమి, వానికి సుపార్శ్వకృత్తు, వానికి సుపార్శ్వుడు, వానికి సుమతి, ఆ సుమతికి సన్నతిమంతుడు జనించిరి. సన్నతిమంతుని కొడుకు కృతి అనేవాడు హిరణ్యనాభునివలన యోగమార్గం తెలిసికొని శోకమోహాలు విడిచి తూర్పుదేశంలో సామవేదాన్ని చదివాడు. ఆ కృతికి ఉగ్రాయుధుడు, ఉగ్రాయుధునికి క్షేమ్యుడు, క్షేమ్యునికి సువీరుడు, సువీరునకు పురంజయుడు, పురంజయునకు బహురథుడు జన్మించారు. హస్తి కొడుకైన పురుమీఢునికి సంతతి లేదు. ఆ అజమీఢునికి నళిని అనే భార్యయందు నీలుడు, నీలునికి శాంతి, శాంతికి సుశాంతి, సుశాంతికి పురుజుడు, పురుజునికి అర్కుడు, అర్కునికి భర్మ్యాశ్వుండు, భర్మ్యాశ్వునికి ముద్గల, యవీనర, బృహదిషు, కాంపిల్య, సృంజయులనే వారు ఐదుగురు పుట్టారు.

**క. మించిన భర్మ్యాశ్వుఁడు సుత, పంచకమును జూచి విషయపంచకమును వ**
**ర్జించితి మే మని పల్కినఁ, బాంచాలురు నాఁగ సుతులు పరఁగిరి ధరణిన్. 657**

**ప్రతి :** మించిన భర్మ్యాశ్వుఁడు= అతిశయించిన భర్మ్యాశ్వుడు అనేవాడు; సుతపంచకమును+చూచి= తన ఐదుగురు కుమారులనుజూచి; విషయపంచకమును= ఐదు రాజ్యభాగాలను; వర్జించితిమేమని పల్కినన్= వర్జించాము అని పలుకగా; పాంచాలురు నాఁగన్= పాంచాలురు అనే పేరుతో; ధరణిన్= భూమిపై; సుతులు= ఆ ఐదుగురు కుమారులు; పరఁగిరి= ఒప్పిరి.

**తా :** భర్మ్యాశ్వుడు తన ఐదుగురు కుమారులను చూచి ఐదు రాజ్యభాగాలు పాలింప సమర్థులు మీరు అనగా వారు పాంచాలురు అని పేరు పొందారు.

**వ. అంత ముద్గలుని నుండి, బ్రాహ్మణకులంబై ముద్గలగోత్రంబు నా నెగడె, భర్మ్యాశ్వపుత్త్రుండైన యా ముద్గలునికి దివోదాసుండు, నహల్య యను కన్యకయునుం బుట్టిరి. అహల్య యందు గౌతమునికి శతానందుండు పుట్టె; శతానందునికి ధనుర్వేదవిశారదుండైన సత్యధృతి పుట్టె, అతనికి శరద్వంతుండు పుట్టె. అతం డొక్కనాఁడు వనంబున నూర్వశిం గనిన, నతనికి, రేతఃపాతంబై తద్వీర్యంబు శరస్తంబంబునంబడి, మిథునంబైన సమయంబున. 658**

**ప్రతి :** అంతన్ ముద్గలునినుండి= అంతట ముద్గలుని నుండి; బ్రాహ్మణ కులంబు+ఐ= బ్రాహ్మణ కులంగా మారి; ముద్గల గోత్రంబునాన్= ఆ బ్రాహ్మణులకు ముద్గల గోత్రంగా; నెగడెన్= ఒప్పింది; భర్మ్యాశ్వపుత్త్రుండైన= భర్మ్యాశ్వుని సుతుడైన; ఆ ముద్గలునికిన్= ఆ ముద్గలుడు అనేవానికి; దివోదాసుండు= దివోదాసుడు; అహల్య; అను కన్యకయునున్= అనే కన్యయు; పుట్టిరి= జన్మించారు; అహల్యయందున్= ఆ ముద్గలుని కొమరిత అయిన అహల్యయందు; గౌతమునికిన్= గౌతమ మహర్షికి; శతానందుడు పుట్టెన్= శతానందుడు పుట్టాడు; శతానందునికిన్= ఆ శతానందునికి; ధనుర్వేద విశారదుండైన= ధనుర్వేదంలో గొప్పవాడైన; సత్యధృతిపుట్టెన్= సత్యధృతి పుట్టాడు; అతనికిన్= ఆ సత్యధృతికి; శరద్వంతుండు పుట్టెన్= శరద్వంతుడు పుట్టాడు; అతండు= ఆ శరద్వంతుడు; ఒక్కనాఁడు= ఒకరోజు; వనంబునన్= అడవిలో; ఊర్వశిన్ కనినన్= ఊర్వశిని చూడగా; అతనికిన్= ఆ శరద్వంతునకు; రేతఃపాతము+ఐ= వీర్యస్ఖలనం కాగా; తద్వీర్యంబు= ఆ రేతస్సు; శరస్తంబంబునన్= రెల్లుదుబ్బుపై; పడి; మిథునంబైన సమయంబునన్= రెండు భాగాలుగా (కవలుకాగా)...

**తా :** అటుపిమ్మట ముద్గలునుండి బ్రాహ్మణ వంశమై ముద్గల గోత్రంతో విరాజిల్లింది. భర్మ్యాశ్వ పుత్త్రుడైన ఆ ముద్గలునికి దివోదాసు, అహల్య అను ఇరువురు జన్మించారు. ఈ అహల్యయందు గౌతమునికి శతానందుడు జన్మించాడు. శతానందునికి ధనుర్వేదం బాగా తెలిసిన సత్యధృతి పుట్టాడు. ఆ శరద్వంతుడు ఒకరోజు అడవిలో ఊర్వశిని చూడగా మోహంతో అతనికి వీర్యస్ఖలనం జరిగింది. ఆ రేతస్సు ఒక రెల్లుస్తంభంపై పడి రెండుభాగాలై కవలలుగా జన్మించారు. ఆ సమయంలో

**క. చపలరతి శంతనుండను, నృపవరుఁ డడవికిని వేఁటనెపమునఁ జనుచుం**
**గృపతో శిశుయుగముం గని, కృపియుం గృపుఁ డనుచుఁ దెచ్చి గృహమునఁ బెంచెన్. 659**

**ప్రతి :** చపలరతిన్= చంచలమైన కోరికతో; శంతనుండు అను= శంతనుడనే పేరుగల; నృపవరుఁడు= గొప్పరాజు; వేఁటనెపమునన్= వేట అనే వంకతో; అడవికిన్ చనుచున్= అడవిలోకి వెళుతూ; శిశు యుగమున్= శిశువుల జంటను; కృపతోన్ కని= దయతోచూచి; కృపియున్ కృపుఁడనుచున్= కృపి, కృపుడు అనే పేర్లతో; తెచ్చి గృహమునన్ పెంచెన్= తీసుకవచ్చి ఇంటిలో పెంచాడు.

**తా :** చంచలమైన కోరికతో శంతనుడనే రాజు అడవికి వేటకువెళ్ళి అక్కడ ఉన్న కవల పిల్లలను కృపతో చూచి కృపి, కృపుడు అనే పేర్లు పెట్టి ఇంటికి తెచ్చి పెంచాడు.

**వ. ఆ కృపి ద్రోణునకు భార్య యయ్యె. దివోదాసునకు మిత్త్రాయువు, మిత్త్రాయువునకుఁ జ్యవనుండు, చ్యవనునకు సుదాసుండు, సుదాసునకు సహదేవుఁడు, సహదేవునకు సోమకుండు, సోమకునకు సుజన్మకృత్తు, సుజన్మకృత్తునకు నూర్వురు కొడుకులు గలిగిరి. వారిలో జంతు వనువాఁడు జ్యేష్ఠుండు కడచూలు పృషతుండు. పృషతునకు ద్రుపదుండు, ద్రుపదునకు ధృష్టద్యుమ్నాదు లయిన కొడుకులును, ద్రౌపది యను కూఁతురుం గల్గిరి. ధృష్టద్యుమ్నునకు ధృష్టకేతువు పుట్టె. వీరలు పాంచాలరాజు లని యెఱుంగుము. మఱియు న య్యజమీఢుని కొడుకు ఋక్షుండు, ఋక్షునకు సంవరణుం డుదయించె. ఆ సంవరణుఁడు తపతి యనెడి సూర్యకన్యక యందుఁ గురువుం గనియె. ఆ కురువుపేరం గురుక్షేత్రం బయ్యె. ఆ కురువునకుఁ బరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషధుండు ననువారలు నలువురు పుట్టిరి. అందుఁ బరీక్షిత్తు కొడుకులు లేక చనియె. సుధనువునకు సుహోత్రుండు, నతనికి చ్యవనుండు, చ్యవనునకుఁ గృతి, కృతికి నుపరిచరవసువు,**

**వసువునకు బృహద్రథ, కుసుంభ, మత్స్య, ప్రత్యగ్ర చేదిషాదులు పుట్టిరి. అందు, బృహద్రథునకుఁ గుశాగ్రుండు, గుశాగ్రునికి ఋషభుండు, ఋషభునికి సత్యహితుండు, సత్యహితునికిఁ బుష్పవంతుండు, బుష్పవంతునకు జహ్ను వనువాఁడు జనియించిరి. మఱియును. 660**

**ప్రతి :** జ్యేష్ఠుడు= పెద్దవాడు; కడచూలు= చివరిబిడ్డ; ఎఱుంగుము= తెలియుము; ఉదయించెన్= జన్మించాడు; కనియెన్= కన్నాడు; చనియెన్= వెళ్ళిపోయాడు; ఆదులు= మొదలైనవారు; జన్మించిరి= పుట్టిరి; (వచనంలోని నామవాచకాలను తాత్పర్యంలో చూడవచ్చు)...

**తా :** ఆ కృపి ద్రోణునకు భార్య అయింది. దివోదాసుకు మిత్రాయువు వానికి చ్యవనుడు అతనికి సుదాసుడు, వానికి సహదేవుడు, వానికి సోమకుడు, వానికి సుజన్మకృత్తు, అతనికి నూర్వురు కొడుకులు కలిగారు. ఈ సుజన్మకృత్తుకు జన్మించిన నూర్గురిలో జంతువనేవాడు పెద్దవాడు. చిట్టచివరివాడు పృషతుడు. పృషతునికి ద్రుపదుడు, ద్రుపదునికి ధృష్టద్యుమ్నుడు మొదలైన కొడుకులు, ద్రౌపది అనే కూతురు కలిగారు. ధృష్టద్యుమ్నునికి ధృష్టకేతువు జన్మించాడు. వీళ్ళు పాంచాల రాజులు. అజమీఢుని కొడుకు ఋక్షుడు. వానికి సంవరణుడు జన్మించాడు. ఆ సంవరణునికి తపతి అని పేరుగల సూర్యకన్యకయందు కురువు జన్మించాడు. అతని పేరుమీద కురుక్షేత్రం అనే పేరు గలిగింది. ఆ కురునికి పరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషధుడు అనేవాళ్ళు నలుగురు జన్మించారు. వారిలో పరీక్షిత్తుకు సంతానం కలగలేదు. సుధనువునికి సుహోత్రుడు, వానికి చ్యవనుడు, వానికి కృతి, కృతికి ఉపరిచరవసువు, ఆ వసువునకు బృహద్రథ, కుసుంభ, మత్స్య, ప్రత్యగ్ర, చేదిష మొదలైనవారు పుట్టారు. అందులో బృహద్రథునికి కుశాగ్రుడు, కుశాగ్రునికి ఋషభుడు, అతనికి సత్యహితుడు, సత్యహితునికి పుష్పదంతుడు, పుష్పదంతునికి జహ్నువు అనేవారు జన్మించారు. మరియు

**సీ. ఆ బృహద్రథునకు నన్యభార్యాగర్భమున రెండు తనుఖండములు జనించెఁ;**
**దునుకలు గని తల్లి దొలఁగంగ వైచిన సంధించె నొకటిగా జర యనంగ**
**నొక దైత్యకాంత; వాఁడొప్పె జరాసంధుఁ డన; గిరివ్రజపుర మాతఁ డేలె;**
**నతనికి సహదేవుఁ; డతనికి సోమాపి తనయుఁ; డాతనికి శ్రుతశ్రవుండు**

**తే. జహ్నుపుత్త్రుండు సురథుండు జనవరేణ్య!, యతనికొడుకు విదూరథుఁ; డతనిపట్టి**
**సార్వభౌముండు;వానికి సంభవుండు, విను జయత్సేనుఁ డనువాఁడు విమలకీర్తి. 661**

**ప్రతి :** ఆ బృహద్రథునకున్= ఆ బృహద్రథుడు అనేవానికి; అన్యభార్యాగర్భమునన్= మరొక భార్యాగర్భంలో; రెండు తనుఖండములు= రెండు శరీరపు ముక్కలు; జనించెన్= జన్మించాయి; తల్లి= జనని; తునుకలు+కని= ఆ శరీరపు ముక్కలను చూచి; తొలగంగన్ వైచినన్= దూరంగా పారవేయగా; జర అనంగన్= జర అనబడే; ఒక దైత్యకాంత= రాక్షసకాంత; ఒకటిగా సంధించెన్= (ఆ రెండు శరీరపు ముక్కలను) ఒకటిగా చేసింది; వాఁడు= ఆ రెండు శరీరపు ముక్కలు ఒకటైనవాడు; జరాసంధుఁడన నొప్పెన్= జరాసంధుడు అనబడ్డాడు; ఆతఁడు= ఆ జరాసంధుడు; గిరివ్రజపురము ఏలెన్= గిరివ్రజమనే పురాన్ని పాలించాడు; అతనికిన్= ఆ జరాసంధునికి; సహదేవుఁడు; అతనికిన్= ఆ సహదేవునికి; సోమాపి తనయుఁడు= సోమాపి అనేవాడు కుమారుడు; ఆతనికిన్= ఆ సోమాపికి; శ్రుతశ్రవుండు= శ్రుతశ్రవుడు (కుమారుడు); జనవరేణ్య= ఓ రాజా!; సురథుండు= సురథుడనేవాడు; జహ్నుపుత్త్రుండు= జహ్నువు అనేవానికి సుతుడు; అతని కొడుకు=

ఆ సురథుని కొడుకు; విదూరథుఁడు= విదూరథుడనేవాడు; అతని పట్టి= ఆ విదూరథుని సుతుడు; సార్వభౌముండు= సార్వభౌముడనేవాడు; వానికి సంభవుండు= ఆ సార్వభౌమునికి పుట్టినవాడు; విమలకీర్తి= స్వచ్ఛమైన కీర్తిగల; జయత్సేనుఁడనువాఁడు= జయత్సేనుడనేవాడు; విను= ఓ రాజా విను.

**తా :** ఆ బృహద్రథునికి మరొక భార్య గర్భంలో రెండు శరీర ఖండాలు జన్మించాయి. ఆ రెండు ఖండాలను తల్లి దూరంగా పారవైచింది. జర అనే రాక్షసకాంత ఆ రెండు ముక్కలను ఒకటిగా కలిపింది. వాడు జరాసంధుడని పిలువబడ్డాడు. అతడు గిరివ్రజపురాన్ని పాలించాడు. ఆ జరాసంధునికి సోమాపి, అతనికి శ్రుతశ్రవుడు జన్మించారు.

సురథుడనేవాడు జహ్నువు కుమారుడు. సురథుని కుమారుడు విదూరథుడు. వాని కొడుకు సార్వభౌముడు. ఓ రాజా! ఆ సార్వభౌమునికి స్వచ్ఛమైన ఖ్యాతిగల జయత్సేనుడు అనేవాడు జన్మించాడు. విను.

**వ. ఆ జయత్సేనునికి రథికుండు, రథికునకు నయుతాయువు, నయుతాయువునకుఁ గ్రోధనుండుఁ; గ్రోధనునకు దేవాతిథి, దేవాతిథికి ఋక్షుండు, ఋక్షునికి భీమసేనుండు, వానికిఁ బ్రతీపుండుఁ; బ్రతీపునకు దేవాపి శంతను బాహ్లికు లను ముప్వురు కొడుకులు పుట్టిరి. అందు. 662**

**ప్రతి :** ఆ జయత్సేనునికిన్= ఆ జయత్సేనుడు అనేవానికి; రథికుండు= రథికుడు; రథికునకున్= రథికునకు; అయుతాయువున్= అయుతాయువు; అయుతాయువునకున్= ఆ అయుతాయువునకు; క్రోధనుండున్= క్రోధనుడు; క్రోధనునకున్= ఆ క్రోధనునికి; దేవాతిథి; దేవాతిథికిన్= దేవాతిథికి; ఋక్షుండు= ఋక్షుడు; ఋక్షునికిన్ భీమసేనుండు= ఋక్షునికి భీమసేనుడు అనేవాడు; వానికిన్ ప్రతీపుండున్= ఆ భీమసేనునికి ప్రతీపుడు; ప్రతీపునికిన్ దేవాపి శంతను బాహ్లికులను ముప్వురు కొడుకులు పుట్టిరి= ఆ ప్రతీపునికి దేవాపి, శంతనుడు, బాహ్లికుడు అనే ముగ్గురు కుమారులు జన్మించారు; అందున్= వారిలో...

**తా :** జయత్సేనునికి రథికుడు, వానికి అయుతాయువు, వానికి క్రోధనుడు, వానికి దేవాతిథి, వానికి ఋక్షుడు, వానికి భీమసేనుడు, వానికి ప్రతీపుడు, ఆ ప్రతీపునికి దేవాపి, శంతనుడు, బాహ్లికుడు అను ముగ్గురు కొడుకులు పుట్టారు. వారిలో

**సీ. దేవాపి రాజ్యంబు దీర్పనొల్లక వనంబున కేగెఁ దమ్ముండు పూర్వజన్మ**
**మందు మహాభిషుఁ డనియెడు వాఁడు శంతనుఁ డయ్యె వాఁడె యీ ధాత్రినెల్ల**
**నేలుచుఁ గరముల నే వృద్ధు ముట్టిన వాఁడెల్ల నిండుజవ్వనము నొందు;**
**నతఁడు శాంతిప్రాప్తుఁడై యున్నఁ దానఁ బండ్రెండేండ్లు వజ్రి వర్షింపకున్న**

**ఆ. వృష్టిలేని చొప్పు విప్రుల నడిగిన, "నన్న యుండఁ దమ్ముఁ డగ్నిహోత్ర**
**దారసంగ్రహంబుఁ దాల్చినఁ" బరివేత్త, యండ్రు వాని నీవ యతఁడ వైతి. 663**

**ప్రతి :** దేవాపి= దేవాపి అనునాతడు; రాజ్యంబు తీర్పనొల్లక= రాజ్యం చేయక; వనంబున కేగెన్= అడవులకు పోయాడు; తమ్ముండు= తమ్ముడైన శంతనుడు; పూర్వజన్మమందున్= గత జన్మలో; మహాభిషుఁడు అనియెడువాఁడు= మహాభిషుడు అను పేరుగలవాడు; శంతనుఁడు అయ్యెన్= ఈ జన్మలో దేవాపికి తమ్ముడైన శంతను డయ్యాడు; వాఁడె= అతడే; ఈ ధాత్రిన్+ఎల్లన్+ఏలుచున్= ఈ భూమినంతా పాలిస్తూ; కరములన్= తన చేతులతో; ఏ వృద్ధుముట్టినన్=

ఏ ముసలివానిని ముట్టుకొన్నా; వాఁడు+ఎల్లన్= ఎవడైనా వాడు; నిండు జవ్వనమున్ ఒందున్= నిండు యౌవనాన్ని పొందుతాడు; అతఁడు= ఆ శంతనుడు, శాంతిప్రాప్తుఁడై యున్నన్= శాంతి పొందియుండగా; వజ్రి= వజ్రాయుధం ధరించే ఇంద్రుడు; పండ్రెండు+ఏండ్లు= పన్నెండు సంవత్సరాలు; తాన వర్షింపక+ఉన్నన్= తాను వర్షం కురియింపకుండ ఉండగా; వృష్టిలేని చొప్పున్= వర్షం కురువని; విప్రులన్+అడిగినన్= బ్రాహ్మణులను అడుగగా; అన్నయుండన్= అన్న ఉండగా; తమ్ముడు= తోడబుట్టినవాడు; అగ్నిహోత్ర దారసంగ్రహంబున్= అగ్నిహోత్రాన్ని భార్యను స్వీకరించుట; తాల్చినన్= చేసినట్లయితే; వానిన్ పరివేత్త అంద్రు= (అటువంటి వానిని) పరివేత్త అంటారు; నీవ= నీవే (శంతనుడవైన నీవు); అతఁడవు ఐతి= అటువంటి పరివేత్తవు అయ్యావు.

**తా :** దేవాపి రాజ్యం పరిపాలించడం ఇష్టంలేక విరక్తుడై అడవులకు పోయాడు. పూర్వజన్మలో మహాభిషుడు అనేవాడు ఈ జన్మలో దేవాపి సోదరుడైన శంతనుడై జన్మించాడు. ఈ శంతనుడు రాజ్యాన్ని పరిపాలించాడు. శంతనుడు తన చేతితో ఏ వృద్ధుణ్ణి ముట్టుకున్నా ఆ ముసలివాడు నవయౌవనం పొందేవాడు. ఆ శంతనుడు ప్రశాంతంగా రాజ్యాన్ని పాలించే వేళ వజ్రాయుధధారి ఇంద్రుడు పన్నెండేండ్లు ఆ రాజ్యంలో వానలు కురిపించలేదు. వాన పడకపోవడాన్ని గూర్చి శంతనుడు బ్రాహ్మణులను ప్రశ్నించాడు 'అన్న బ్రదికియుండగా తమ్ముడు అగ్నిహోత్రాన్ని భార్యను స్వీకరిస్తే అతణ్ణి పరివేత్త అంటారు. అటువంటి పరివేత్తవు నీవు' అన్నారు బ్రాహ్మణులు.

**వ. అట కారణంబుగా నన్న యుండఁ దమ్ముండు రాజ్యార్హుండు గాఁడు, నీవు పరివేత్తవు. మీయన్నకు రాజ్యం బిచ్చిన, ననావృష్టి దోషంబు చెడు నని బ్రాహ్మణులు వల్కిన, శంతనుండు వనంబునకుం జని, దేవాపికిఁ బ్రియంబు చెప్పి, రాజ్యంబు చేకొమ్మని పల్కె, అంతకు మున్న వాని మంత్రి దేవాపిని రాజ్యంబున కనర్హుం జేయఁ దలంచి విప్రులం బంచిన, నా విప్రులు పాషండమత వాక్యంబులు దేవాపికి నుపదేశించిరి. దేవాపి వేదంబుల నిందించినఁ బాషండుండును, దేవదూషకుండును గావున వానికి రాజ్యంబు లేదని బ్రాహ్మణులు సెప్పిన, శంతనుండును మగుడి వచ్చి, రాజ్యంబుఁ జేకొనియె. వర్షంబులు గురిసె. నివ్విధంబున. 664**

**ప్రతి :** అట కారణంబుగాన్= ఆ కారణంగా; అన్నయుండన్= అన్న ఉండగా; తమ్ముండు= తమ్ముడు; రాజ్య+అర్హుండు గాఁడు= రాజ్యం చేయడానికి అర్హత లేనివాడు; నీవు పరివేత్తవు= నీవు పరివేత్త లక్షణం గలవాడవు; మీ యన్నకు రాజ్యంబిచ్చినన్= మీ అన్నకు రాజ్యం ఇచ్చినట్లయితే; అనావృష్టి దోషంబు= వర్షం కురవనిదోషం; చెడునని= పోతుందని; బ్రాహ్మణులు పల్కినన్= బ్రాహ్మణులు చెప్పగా; శంతనుండు= శంతనుడు; వనంబునకున్ చని= అడవికివెళ్ళి; దేవాపికిన్= తన అన్న దేవాపికి; ప్రియంబుచెప్పి= హితవు పలికి; రాజ్యంబు చేకొమ్మని పల్కెన్= రాజ్యాన్ని స్వీకరించుమని కోరాడు; అంతకుమున్న= ఈ శంతనుడు దేవాపిని రాజ్యం స్వీకరించుమని కోరడానికి పూర్వమే; వాని మంత్రి= శంతనుని యొక్క మంత్రి; దేవాపిని రాజ్యంబునకున్ అనర్హున్ చేయన్ తలంచి= దేవాపిని రాజ్యం ఏలడానికి అర్హత లేనివానిగా చేయాలని భావించి; విప్రులన్ పంచినన్= బ్రాహ్మణులను పంపించగా; ఆ విప్రులు= ఆ పంపబడ్డ బ్రాహ్మణులు; పాషండ మత వాక్యంబులు= (వేదనింద చేసే) పాషండుల మతానికి సంబంధించిన మాటలు; దేవాపికిన్= దేవాపికి; ఉపదేశించిరి= బోధించారు; దేవాపి; వేదంబులన్ నిందించినన్= వేదాలను నిందించగా; పాషండుండును= పాషండుడూ; దేవదూషకుండును= దైవాన్ని నిందించేవాడూ; కావునన్= కాబట్టి; వానికిన్= దేవాపికి; రాజ్యంబులేదని= రాజ్యంపై అధికారం లేదని; బ్రాహ్మణులు

చెప్పినన్= బ్రాహ్మణులు చెప్పగా; శంతనుండును= శంతనుడు; మగుడివచ్చి= (రాజ్యానికి) తిరిగివచ్చి; రాజ్యంబున్ చేకొనియెన్= రాజ్యం స్వీకరించాడు; వర్షంబులు+కురిసెన్= వానలు కురిశాయి; ఆ+విధంబునన్= ఆ విధంగా...

**తా :** ఆ కారణంగా విప్రులు 'అన్న ఉండగా తమ్ముడు రాజ్యం స్వీకరించకూడదు. నీవు పరివేత్తవు. నీవు నీ అన్నకు రాజ్యాన్ని ఇస్తే అనావృష్టి దోషం పోతుంది అని చెప్పారు. శంతనుడు అడవికి వెళ్ళాడు. అన్నకు ప్రియమైన మాటలు చెప్పి రాజ్యం స్వీకరించుమన్నాడు. ఈ సంఘటన జరగడానికి ముందే శంతనుని మంత్రులు దేవాపిని రాజ్యార్హత లేనివానిగా చేయాలనే ఆలోచనతో దేవాపి వద్దకు బ్రాహ్మణులను పంపారు. వారు పాషండమత పద్ధతులు దేవాపికి ఉపదేశించారు. దేవాపి వేదాలను నిందించిన కారణంగా పాషండుడు, దైవాన్ని నిందించేవాడు కాబట్టి వానికి రాజ్యార్హత లేదని బ్రాహ్మణులు చెప్పారు. శంతనుడు అడవినుండి రాజ్యానికి తిరిగివచ్చాడు. రాజ్యం స్వీకరించాడు. వానలు కురిశాయి. ఈ విధంగా

**క. దేవాపి కలాపపురం, బావాసము గాఁగ యోగియై యున్నాఁ డు**
**ర్వీవర! కలినష్టంబగు, జైవాతృకకులము మీఁద సంస్థాపించున్. 665**

**ప్రతి :** ఉర్వీవర= ఓ రాజా!; దేవాపి= ఈ శంతనుని సోదరుడు దేవాపి; కలాపపురంబు= కలాపపురం; ఆవాసము గాఁగన్= నివాసంగా; యోగియై+ఉన్నాడు= ఒక మహాయోగిలా ఉన్నాడు; కలిన్+నష్టంబగు= కలికాలంలో నశించిపోయే; జైవాతృక కులము= చంద్రవంశం; మీఁదన్= తరువాతి యుగంలో; సంస్థాపించున్= చక్కగా నిలుపుతాడు.

**తా :** ఓ పరీక్షన్మహారాజా! ఆ దేవాపి కలాపపురం నిలయంగా యోగిగా ఉన్నాడు. కలిలో నశించిపోయే చంద్రవంశాన్ని తరువాతి యుగంలో అతడే చక్కగా స్థాపిస్తాడు.

**వ. బాహ్లికుం డనువానికి సోమదత్తుండు పుట్టె, సోమదత్తునికి భూరియు, భూరిశ్రవస్సు, శలుండను వారు ముప్పురు పుట్టిరి. 666**

**ప్రతి :** బాహ్లికుం డనువానికిన్= బాహ్లికుడు అనేవానికి; సోమదత్తుండు పుట్టెన్= సోమదత్తుడు పుట్టాడు; సోమదత్తునికిన్= సోమదత్తునికి; భూరియున్, భూరిశ్రవస్సు, శలుండనువారు= భూరి, భూరిశ్రవస్సు, శలుడు అనే; ముప్పురు పుట్టిరి= ముగ్గురు జన్మించారు.

**తా :** బాహ్లికునికి సోమదత్తుడు, సోమదత్తునికి భూరి, భూరిశ్రవస్సు, శలుడు అనే ముగ్గురు జన్మించారు.

**క. భాతిగ శంతనునకు గం, గా తటినికి వైష్ణవాగ్రగణ్యుఁడు ఘోరా**
**రాతి నయననీలోత్పల, భీతికర గ్రీష్ముఁడైన భీష్ముఁడు పుట్టెన్. 667**

**ప్రతి :** భాతిగన్= కాంతిమంతంగా; శంతనునకున్= ఈ శంతనుడికి; గంగాతటినికిన్= గంగానదికి; వైష్ణవ+అగ్రగణ్యుఁడు= విష్ణుభక్తులలో ముందు లెక్కింపవలసిన (వైష్ణవశ్రేష్ఠుడైన); ఘోర+అరాతి= భయంకర శత్రువుల; నయన నీల+ఉత్పల= నేత్రములనే నల్ల కలువలకు; భీతికర= భయాన్ని కలిగించే; గ్రీష్ముఁడు= మండు వేసవివంటి వాడైన; భీష్ముఁడు= భీష్ముడు అనేవాడు; పుట్టెన్= పుట్టాడు.

**తా :** శంతనునకు గంగానదికి వైష్ణవశ్రేష్ఠుడు, భయంకర శత్రునేత్రములనే నల్లకలువలకు భయాన్ని కలిగించే మండువేసవి వంటి భీష్ముడు జన్మించాడు.

**ఆ. పరశురాముతోడఁ బ్రతిఘటించి జయింప, నన్యునొకని నెఱుఁగ మతనిఁ దక్క**
**వీరయూధపతి వివేకధర్మజ్ఞుండు, వేల్పుటేటిపట్టి విమలయశుఁడు. 668**

**ప్రతి :** పరశురాము తోడన్= (పరాక్రమవంతుడని పేరు గాంచిన) పరశురామునితో; ప్రతిఘటించి= ఎదిరించి; జయింపన్= జయమును పొందుటలో; అతనిన్ తక్కన్= ఆ భీష్మునితప్ప; అన్యున్ ఒకనిన్ ఎరుఁగము= మరొక్కడిని మనము ఎరుగము; వేల్పు+ఏటి+పట్టి= దేవనదీసుతుడు భీష్ముడు; వీరయూధపతి= పరాక్రమంగల వీరుల సమూహానికి నాయకుడు (వీరులలో శ్రేష్ఠుడు); వివేక ధర్మజ్ఞుండు= వివేక ధర్మం బాగా తెలిసినవాడు; విమలయశుఁడు= స్వచ్ఛమైన కీర్తి గలవాడు.

**తా :** పరశురాముణ్ణి ఎదిరించి, జయించడంలో భీష్ముణ్ణి తప్ప మరొకతిని ఎరుగము. భీష్ముడు గంగానదీసుతుడు. పరాక్రమ సమూహ నాయకుడు. మంచి వివేకంగల ధర్మం ఎరిగినవాడు, స్వచ్ఛమైన కీర్తి కలవాడు.

**వ. ఆ శంతనునకు దాశకన్యకయైన సత్యవతి యందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులు పుట్టిరి. అందుఁ జిత్రాంగదుండు (చిత్రాంగదుండను) గంధర్వునిచేత నిహతుండయ్యె. మఱియును. 669**

**ప్రతి :** ఆ శంతనునకున్= శంతనుడికి; దాశకన్యకయైన= దాశరాజు కొమరిత అయిన; సత్యవతి యందున్= సత్యవతివల్ల; చిత్రాంగద; విచిత్రవీర్యులు= చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అనే ఇద్దరు; పుట్టిరి= జన్మించారు; అందున్= వారిలో; చిత్రాంగదుండు= చిత్రాంగదుడు (చిత్రాంగదుండను= చిత్రాంగదుడనే పేరుగల); గంధర్వునిచేతన్= గంధర్వుని చేతిలో; నిహతుండయ్యెన్= మరణించాడు; మఱియును= మరియు...

**తా :** శంతనునకు దాశరాజు సుతయైన సత్యవతికి చిత్రాంగద, విచిత్ర వీర్యులనే ఇద్దరు జన్మించారు. వారిలో చిత్రాంగదుడు చిత్రాంగదుడనే గంధర్వుని చేతిలో మరణించాడు. మరియు

**ఉ. సత్యవతీవధూటి ముు శంతను పెండ్లముగానినాఁడు సాం**
**గత్యమునం బరాశరుఁడు గర్భము చేసిన బాదరాయణుం**
**దత్యధికుండు శ్రీహరికళాంశజుఁడై ప్రభవించె నిత్యముల్**
**సత్యములైన వేదముల సాంగములన్ విభజింప దక్షుఁడై. 670**

**ప్రతి :** సత్యవతీ వధూటి= సత్యవతి అనే యౌవనవతి; శంతను పెండ్లముగానినాఁడు మును= శంతనుణ్ణి వివాహం చేసికోవడానికి పూర్వం; సాంగత్యమునన్= కలిసి; పరాశరుఁడు= పరాశరమహర్షి; గర్భముచేసినన్= గర్భవతిని చేయగా; అత్యధికుండు= మిక్కిలి గొప్పవాడు; నిత్యముల్ సత్యములైన= ఎప్పటికి సత్యాలుగా ఉండే; వేదములన్= వేదములను; స+అంగములన్= అంగములతోకూడిన వానినిగా; విభజింపన్= విడదీయుటకు; దక్షుఁడై= సమర్థుడై; శ్రీహరి కళా+ అంశజుఁడై= విష్ణుమూర్తి కళలో ఒక భాగాన్ని పొందినవాడై; బాదరాయణుండు= బాదరాయణుడు అను పేరుగలవాడు; ప్రభవించెన్= జన్మించాడు.

**తా :** సత్యవతి శంతనుణ్ణి వివాహము చేసికోవడానికి పూర్వము పరాశరుడు ఆమెను కలిసి గర్భవతిని చేశాడు. అప్పుడామెకు నిత్యసత్యాలైన వేదాలను విభజింప సమర్థుడు, విష్ణుమూర్తి అంశతో బాదరాయణుడు జన్మించాడు.

**ఆ. బాదరాయణుండు భగవంతుఁ డనఘుండు, పరమగుహ్యమైన భాగవతము**
**నందనుండ నైన నాకుఁ జెప్పెను శిష్య, జనుల మొఱఁగి యేనుఁ జదువుకొంటి. 671**

**ప్రతి :** బాదరాయణుండు= బాదరాయణుడు; భగవంతుఁడు= జ్ఞానబలైశ్వర్య వీర్యాదిషడ్గుణ సంపత్తిగల; అనఘుండు= పాపరహితుడు; పరమగుహ్యమైన= మిక్కిలి రహస్యమైన; భాగవతం; నందనుండనైన= కుమారుడనైన; నాకున్ చెప్పెను= నాకు చెప్పాడు; శిష్యజనుల మొఱఁగి= శిష్యజనులకెవ్వరికి తెలియకుండ (రహస్యంగా); ఏను చదువుకొంటిన్= నేను చదువుకొన్నాను.

**తా :** పాపరహితుడు, భగవంతుడైన బాదరాయణుడు మిక్కిలి రహస్యమైన భాగవతాన్ని కొడుకునైన నాకు చెప్పాడు. నేను మిగిలిన శిష్యులకు తెలియకుండా రహస్యముగా ఆ భాగవతాన్ని చదువుకొన్నాను.

**వ. ఆ విచిత్రవీర్యునికిఁ గాశిరాజుకూఁతుల, నంబికాంబాలికల భీష్ముండు బలాత్కారంబునం దెచ్చి వివాహంబు చేసిన, విచిత్ర వీర్యుండు వారలం దగిలి మనోజరాగ మత్తుండై, చిరకాలంబు నానావిధక్రీడలన్ విహరించుచు, రాజయక్ష్మ పీడితుండై, మృతుండయ్యె నంత. 672**

**ప్రతి :** ఆ విచిత్ర వీర్యునికిన్= ఆ విచిత్ర వీర్యుడనేవానికి; కాశిరాజు కూఁతులన్= కాశిరాజు సుతలైన; అంబికాం బాలికలన్= అంబికను, అంబాలికను; బలాత్కారంబునన్ తెచ్చి= బలవంతంగా తీసికొనివచ్చి; వివాహంబు చేసినన్= పెండ్లి చేయగా; విచిత్ర వీర్యుండు= ఆ విచిత్ర వీర్యుడు; వారలన్ తగిలి= తన భార్యలపట్ల ఆసక్తిగలవాడై; మనోజరాగమత్తుండై= మన్మథ క్రీడలలో మదించినవాడై; చిరకాలంబు= చాలకాలం; నానావిధ క్రీడలన్= అనేక విధములైన క్రీడలతో; విహరించుచున్= విహారం చేస్తూ; రాజయక్ష్మ పీడితుండై= క్షయరోగంచే బాధపడి; మృతుండయ్యెన్= చనిపోయాడు; అంతన్= అటు తరువాత...

**తా :** ఆ విచిత్రవీర్యునికి కాశిరాజు కుమార్తెలు అంబిక, అంబాలిక అనే వాళ్ళను భీష్ముడు బలవంతంగా తీసికొనివచ్చి వివాహం చేశాడు. వారిపట్ల ఆసక్తికల్గి కామాకులచిత్తుడై, మత్తుడై చాలాకాలం అనేకవిధాలైన క్రీడలతో విహరిస్తూ చివరకు విచిత్రవీర్యుడు అమితమైన క్షయరోగ పీడితుడై మరణించాడు. పిమ్మట

**క. అతనిసతుల వలన సుతుల, సుత! కను మని తల్లి పనుప సొరిదిం గనియెన్**
**ధృతరాష్ట్ర పాండు విదురుల, నుతచరితుఁడు బాదరాయణుండు నరేంద్రా! 673**

**ప్రతి :** నరేంద్రా= ఓ పరీక్షిన్మహారాజా!; అతని సతులవలనన్= ఆ విచిత్రవీర్యుని భార్యలైన అంబిక, అంబాలికలవల్ల; సుత= ఓ కుమారా!; సుతుల కనుమని= కుమారులను కనుమని; తల్లి పనుపన్= తల్లి సత్యవతి ఆజ్ఞాపింపగా; నుతచరితుఁడు= అందఱిచే కీర్తింపబడే నడవడి కలవాడు; బాదరాయణుండు= బాదరాయణుడు; ధృతరాష్ట్ర పాండు విదురులన్= ధృతరాష్ట్రుడు, పాండుడు, విదురుడు అను పేర్లుగలవారిని; సొరిదిన్ కనియెన్= క్రమంగా కన్నాడు.

**తా :** ఓ రాజా! 'విచిత్ర వీర్యుని భార్యలవల్ల కుమారా! నీవు సుతులను కనుమ'ని తల్లి సత్యవతి ఆజ్ఞాపించగా, బాదరాయణుడు ధృతరాష్ట్రుడు, పాండురాజు, విదురుడు అనేవాళ్ళను క్రమంగా కన్నాడు.

**వ. అందు, ధృతరాష్ట్రునికి గాంధారియందు దుర్యోధనాదులగు కొడుకులు నూర్వురును, దుశ్శలయను కన్యకయును జన్మించిరి. మృగశాపభయంబునం జేసి, భార్యం బొంద వెఱచిన పాండునకుఁ గుంతీదేవియందు ధర్మానిలేంద్ర ప్రసాదంబున యుధిష్ఠిర భీమార్జునులను ముువ్వురును, మాద్రిదేవి వలన**

**నాసత్య ప్రసాదంబున నకుల సహదేవులనువా రిద్దఱునుగా నేవురు పుట్టిరి. అయ్యేవురకును, ద్రుపదరాజపుత్రియైన ద్రౌపదియందుఁ గ్రమంబునం బ్రతివింధ్యుండును, శ్రుతసేనుండును, శ్రుతకీర్తియు, శతానీకుండును, శ్రుతకర్ముండు నన నేవురు పుట్టిరి. మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతియందు దేవకుండును, భీమసేనునికి హిడింబయందు ఘటోత్కచుండును, గాళియందు సర్వగతుండును, సహదేవునికి విజయయందు సుహోత్రుండును, నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును, నర్జునునకు నులూపియను నాగకన్యకయందు నిరావంతుండును, మణలూరుపతి పుత్రికయైన చిత్రాంగదయందు బభ్రువాహనుండును, సుభద్రయందు శౌర్యధైర్యతేజో విభవంబుల నఖిల రాజనికరంబునఁ బ్రఖ్యాతుండైన యభిమన్యుండును జన్మించిరి. అందుఁ బభ్రువాహనుం డర్జునుని నియోగంబున మాతామహుని గోత్రంబునకు వంశకర్త యయ్యె. 674**

**ప్రతి :** అందున్= వారిలో; ధృతరాష్ట్రునికిన్ గాంధారియందున్= ధృతరాష్ట్రునికి గాంధారి అనే అతని భార్యవల్ల; దుర్యోధనాదులగు= దుర్యోధనుడు మొదలగు; కొడుకులు నూర్వురును= నూర్గురు కొడుకులునూ; దుశ్శలయను= దుశ్శల అను పేరుగల; కన్యకయును= కన్యకయు; జన్మించిరి= పుట్టారు; మృగశాపభయంబునన్ చేసి= మృగరూపంలో ఉన్న ముని ఇచ్చిన శాపభయంవల్ల; భార్యన్= తన భార్యను; పొందన్ వెఱచిన= కలియడానికి భయపడిన; పాండునకున్= పాండురాజుకు; కుంతీదేవియందున్= కుంతీదేవియందు; ధర్మ+అనిల+ఇంద్ర ప్రసాదంబునన్= ధర్మదేవత, వాయువు, ఇంద్రుల ప్రసాదంవల్ల (దయవల్ల); యుధిష్ఠిర భీమార్జునులను మువ్వురును= ధర్మరాజు, భీముడు, అర్జునుడు అను ముగ్గురు; మాద్రిదేవివలనన్= మాద్రి అనే రెండవ భార్యవల్ల; నా సత్య ప్రసాదంబున్= అశ్వినీ దేవతల అనుగ్రహంతో; నకుల సహదేవులను వారిద్దఱునుగాన్= నకులుడు, సహదేవుడు అనే ఇద్దరుగా; ఏవురు పుట్టిరి= ఐదుగురు జన్మించారు; ఆ ఏవురకును= ఆ ఐదుగురికి; ద్రుపద రాజపుత్రియైన= ద్రుపద రాజుసుతయైన; ద్రౌపదియందున్= ద్రౌపదియందు; క్రమంబునన్= వరుసగా; ప్రతి వింధ్యుండును, శ్రుతసేనుండును, శ్రుతకీర్తియు, శతానీకుండును, శ్రుతకర్ముండు+అనన్= ప్రతివింధ్య, శ్రుతసేన, శ్రుతకీర్తి, శతానీక, శ్రుతకర్ములనబడే; ఏవురు పుట్టిరి= ఐదుగురు జన్మించారు; మఱియున్= అంతేకాక; యుధిష్ఠిరునకున్= ధర్మరాజుకు; పౌరవతియందున్= పౌరవతి అనే ఆమెవల్ల; దేవకుండును= దేవకుడు; భీమసేనునికిన్= భీముడికి; హిడింబయందున్= హిడింబ అనే ఆమెవల్ల; ఘటోత్కచుండును= ఘటోత్కచుడూ; కాళిందియందున్= కాళింది అనే ఆమెవల్ల; సర్వగతుండును= సర్వగతుడూ; సహదేవునికిన్= సహదేవుడికి; విజయయందున్= విజయ అనే ఆమెవల్ల; సుహోత్రుండును= సుహోత్రుడూ; నకులునకున్ రేణుమతియందున్= నకులుడికి రేణుమతి అనే భార్యయందు; నిరమిత్రుండునూ= నిరమిత్రుడూ; అర్జునునకున్= అర్జునుడికి; ఉలూపియను= ఉలూపి అనే; నాగకన్యయందున్= నాగలోకపు కన్యవల్ల; ఇరావంతుండును= ఇరావంతుడనబడేవాడు; మణలూరుపతి పుత్రికయైన= మణిపురం రాజ పుత్రికయైన; చిత్రాంగదయందున్= చిత్రాంగద అనే ఆమెవల్ల; బభ్రువాహనుండును= బభృవాహనుడు; సుభద్రయందున్= సుభద్ర అనే ఆమెయందు; శౌర్య ధైర్య తేజోవిభవంబులన్= శౌర్యం, ధైర్యం తేజస్సు అనే సంపదలతో; అఖిలరాజ నికరంబునన్= సమస్త రాజ సమూహంలో; ప్రఖ్యాతుండైన= ప్రఖ్యాతి వహించిన; అభిమన్యుండును= అభిమన్యుడు అను పేరుగలవాడు; జన్మించిరి= పుట్టారు; అందున్= వీరందరిలో; బభ్రువాహనుండు= బభ్రువాహనుడు; అర్జునుని నియోగంబునన్= అర్జునుడు నియమించిపంపడంవల్ల; మాతామహుని గోత్రంబునకున్= తల్లియొక్క తండ్రి గోత్రానికి; వంశకర్త అయ్యెన్= వంశకర్త అయ్యాడు.

**తా :** వాళ్ళలో ధృతరాష్ట్రునికి గాంధారియందు దుర్యోధనుడు మొదలగు, కొడుకులు నూర్గురు, దుశ్శల అనే కన్య జన్మించారు. మృగశాప భయంవల్ల పాండురాజు భార్యను కూడడానికి భీతుడై ఉన్నాడు. ఆ పాండురాజుకు కుంతీదేవియందు యముడు, వాయువు, ఇంద్రుడు అనువారి ప్రసాదంగా ధర్మరాజ భీమార్జునులు, మాద్రియందు అశ్వినీ దేవతల దయవల్ల నకుల సహదేవులు, మొత్తం ఐదుగురు కలిగారు. ఈ అయిదుగురికి ద్రుపదరాజ సుతయైన ద్రౌపదియందు క్రమంగా; ప్రతివింధ్యుడు, శ్రుతసేనుడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతకర్ముడనే ఐదుగురు జన్మించారు. ధర్మరాజుకు పౌరవతి అనే ఆమెయందు దేవకుడు, భీముడికి హిడింబయందు ఘటోత్కచుడు, కాళి అనే ఆమెయందు సర్వగతుడు, సహదేవుడికి విజయ అనే ఆమెయందు సుహోత్రుడు, నకులుడికి రేణుమతి అనే భార్యయందు నిరమిత్రుడు, అర్జునునికి ఉలూపి అనే నాగకన్యయందు ఇరావంతుడు, మణలూరుపతి సుత చిత్రాంగదయందు బభ్రువాహనుడు, సుభద్ర అనే భార్యయందు శౌర్యం, ధైర్యం, తేజస్సు అనే విభవాలతో రాజులందరిలో కీర్తిగన్న అభిమన్యుడు జన్మించారు. అందులో బభ్రువాహనుడు అర్జునుని ఆజ్ఞతో మాతామహుని గోత్రానికి వంశకర్త అయ్యాడు.

**ఉ. అన్యసుపూజ్య! నీ జనకుఁడై యభిమన్యుఁడు భూవరేంద్ర మూ**
**ర్ధన్యుఁడు ధన్యమార్గణ కదంబ విదారిత వైరివీర రా**
**జన్యుఁడు జన్యభీత కురుసైన్యుఁడు సైన్య సమూహనాథ దృ**
**జ్మాన్యుఁడు మాన్యకీర్తి మహిమం దనరెం గురువంశకర్తయై. 675**

**ప్రతి :** అన్యసుపూజ్య= అందరిచే చక్కని పూజలనందే రాజా!; నీ జనకుఁడై= నీ తండ్రియైన; అభిమన్యుడు; భూవరేణ్య మూర్ధన్యుఁడు= రాజులందరికి శిరోభూషణమైనవాడు; ధన్య= సార్థకమైన; మార్గణ= బాణములయొక్క; కదంబ= సమూహంచేత; విదారిత= చీల్చబడిన; వైరి వీరరాజన్యుఁడు= శత్రువీరరాజులు కలవాడు (తన బాణాల సమూహంతో శత్రురాజులను చీల్చినవాడు); జన్యభీత= తనతోడి యుద్ధమందు భయము చెందిన; కురుసైన్యుఁడు= కురుసైన్యం కలవాడు; సైన్యసమూహనాథ= సేనానాయకుల సమూహంయొక్క; దృజ్మాన్యుఁడు= చూపులచే ఆదరించబడేవాడు (సేనానాయకులందరిచే మెచ్చుకొనబడేవాడు); మాన్యకీర్తిమహిమన్= ఆదరణీయమైన కీర్తి వైభవంతో; కురువంశకర్తయై= కురువంశమునకు మూలపురుషుడై; తనరెన్= ఒప్పినాడు.

**తా :** సర్వజనపూజ్యా! నీ తండ్రి అభిమన్యుడు రాజులందరిలో శ్రేష్ఠుడు, తన బాణపరంపరతో శత్రు రాజులను చీల్చి చెండాడినవాడు, అతని తోడి యుద్ధంలో కురుసైన్యం భయంతో వణికింది. సేనా నాయకులందరి చూపులతో ఆదరించబడినవాడు. ఆదరణీయమైన గొప్ప కీర్తి కలవాడు. కురువంశకర్తయై ఒప్పాడు.

**వ. ఆ యభిమన్యునకు నుత్తర యందు నీవు జన్మించితివి. 676**

**ప్రతి :** ఆ అభిమన్యునకున్= ఆ అభిమన్యుడికి; ఉత్తరయందున్= ఉత్తరయందు; నీవు జన్మించితివి= పరీక్షిత్తు అనబడే నీవు పుట్టావు.

**తా :** ఉత్తరాభిమన్యులకు పరీక్షిత్తువైన నీవు జన్మించావు.

**క. ద్రోణసుతు తూపువేఁడిమిఁ, బ్రాణంబులఁ బాసి హరికృపాదర్శన సం**
**త్రాణంబున బ్రతికితె కా, క్షోణీశ్వర! మున్ను నీ శిశుత్వమువేళన్. 677**

**ప్రతి :** క్షోణి+ఈశ్వర!= ఓ భూపతీ!; ద్రోణసుతు= ద్రోణుని కుమారుడైన అశ్వత్థామయొక్క; తూపువేఁడిమిన్= బాణపు సెగకు; ప్రాణంబులన్‌పాసి= ప్రాణాలు విడిచి; హరికృపాదర్శన సంత్రాణంబునన్= హరియొక్క కృపతోగూడిన చూపులయొక్క రక్షణతో; మున్ను= ఇంతకుమునుపు; నీ శిశుత్వము వేళన్= నీ శైశవకాలంలో; బ్రతికితె కా= బ్రతికావు కదా!

**తా :** ఓ భూపతీ! ద్రోణపుత్రుడు అశ్వత్థామయొక్క బాణపువేడికి నీ ప్రాణాలు పోగా నీ శైశవవేళ విష్ణువు తన దయాదృష్టివీక్షణం అనే రక్షణ కవచం ఏర్పాటు చేయగా నీవు బతికావు కదా!

**వ. నీ కుమారులు జనమేజయ శ్రుతసేన భీమసేనోగ్రసేనులను నల్వురు. వీరలయందు. 678**

**ప్రతి :** జనమేజయ శ్రుతసేన భీమసేన ఉగ్రసేనులు అనునల్వురు= జనమేజయుడు, శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు అనే నల్గురు; నీ కుమారులు= నీ సుతులు; వీరలయందున్= ఈ నల్వురిలో...

**తా :** జనమేజయ, శ్రుతసేన, భీమసేన, ఉగ్రసేనులు అనే నల్గురు నీ కుమారులు. వీళ్ళలో

**ఆ. నీవు తక్షకాహి నిహతుఁడ వని విని, సకలసర్పలోక సంహృతముగ**
**సర్పయాగ మింక జనమేజయుఁడు సేయఁ, గలఁడు పూర్వరోషకలితుఁ డగుచు. 679**

**ప్రతి :** నీవు= పరీక్షిత్తువైన నీవు; తక్షక+అహి నిహతుఁడవు+అనివిని= తక్షక సర్పంచే చనిపోయావని తెలిసికొని; సకల సర్పలోక సంహృతముగన్= సమస్తమైన సర్పలోకమంతా నశించేలా; సర్పయాగమింకన్= ఇకపై సర్పయాగాన్ని; జనమేజయుఁడు= (నీ సుతుడు) జనమేజయుడు; పూర్వరోషకలితుఁడగుచున్= పూర్వపు కోపంతో కూడినవాడై చేయన్+కలడు= చేస్తాడు.

**తా :** పరీక్షిత్తువైన నీవు తక్షక సర్పంవల్ల చనిపోయావని తెలిసికొని, ఆ కోపాన్ని మనసులో పెట్టుకొని సమస్త సర్పలోకం భస్మం అయ్యేలా నీ సుతుడు జనమేజయుడు సర్పయాగాన్ని చేస్తాడు.

**వ. మఱియు నతఁడు సర్వధరణీమండలంబును జయించి, కావషేయుండు పురోహితుండుగా నశ్వమేధంబు సేయఁగలవాఁడు. వానికి శతానీకుండు జనియించి, యాజ్ఞవల్క్యునితోడ వేదంబులు పఠియించి, కృపాచార్యుని వలన విలువిద్య నేర్చి, శౌనకుని వలన నాత్మజ్ఞానంబునుం బడయం గలవాఁడు. ఆ శతానీకునికి సహస్రానీకుండు, వానికి నశ్వమేధజుండు, నశ్వమేధజునికి నాసీమకృష్ణుండు, నాసీమకృష్ణునకు నిచకుండు జనియింతురు. ఆ నిచకుఁడు గజాహ్వయంబు నదిచే హృతంబుగాఁ గౌశాంబియందు వసియించు, ఆతనికి నుప్తుం దుప్తునికిఁ జిత్రరథుండు, చిత్రరథునకు శుచిరథుండు, శుచిరథునికి వృష్టిమంతుండు, వృష్టిమంతునికి సుషేణుండు, సుషేణునికి సుపీతుండు, సుపీతునికి నృచక్షుస్సు, నృచక్షుస్సుకు సుఖానిలుండు, సుఖానిలునికిఁ బరిప్లవుండు, పరిప్లవునకు మేధావి, మేధావికి సునయుండు, సునయునికి నృపంజయుండు, నృపంజయునికి దూర్వుండు, దూర్వునికి నిమి, నిమికి బృహద్రథుండు, బృహద్రథునకు సుధాంశుండు, సుధాంశునికి శతానీకుండు, శతానీకునకు దుర్దమనుండు, దుర్దమనునికి విహీనరుండు, విహీనరునికి దండపాణి, దండపాణికి మితుండు, మితునకు క్షేమకుండు, క్షేమకునకు బ్రహ్మక్షత్రుండు పుట్టుదురు. వాఁడు నిర్వంశుండై, దేవర్షి సత్కృతుండై, కలియుగంబునందుఁ జనం గలవాఁడు. 680**

**ప్రతి :** మఱియున్= మరియు; అతఁడు= ఆ జనమేజయుడు; సర్వధరణీ మండలంబును జయించి= సమస్త భూమండలాన్ని జయించి; కావషేయుండు పురోహితుండుగాన్= కావషేయుడు అనేవానిని పురోహితునిగా చేసికొని; అశ్వమేధంబు+చేయన్ కలవాఁడు= అశ్వమేధ యాగాన్ని చేయగలడు; వానికిన్= ఆ జనమేజయునికి; శతానీకుండు జనియించి= శతానీకుడనేవాడు జన్మించి; యాజ్ఞవల్క్యునితోడన్= యాజ్ఞవల్క్యునితో (యాజ్ఞవల్క్యునివద్ద); వేదంబులు పఠియించి= వేదాలు చదివి; కృపాచార్యుని వలనన్= కృపాచార్యునివల్ల; విలువిద్యన్+నేర్చి= ధనుర్వేదాన్ని నేర్చుకొని; శౌనకుని వలనన్= శౌనకుడివల్ల; ఆత్మజ్ఞానంబునున్= ఆత్మజ్ఞానాన్ని కూడా; పడయన్ కలవాఁడు= పొందగలడు; ఆ శతానీకునికిన్= ఆ శతానీకుడనేవానికి; సహస్రానీకుండు= సహస్రానీకుడు; వానికిన్= ఆ సహస్రానీకుడు అనేవానికి; అశ్వమేధజుండు= అశ్వమేధజుడు; అశ్వమేధజునికిన్= ఆ అశ్వమేధజునికి; ఆసీమకృష్ణుండున్= ఆసీమకృష్ణుడు; ఆసీమకృష్ణునకున్= ఆ ఆసీమకృష్ణునికి; నిచకుండు= నిచకుడు; జనియింతురు= జన్మిస్తారు; ఆ నిచకుఁడు= ఆ నిచకుడనేవాడు; గజాహ్వయంబు= హస్తిన అనే పేరుగల పట్టణం; నదిచేన్+హృతంబుగాన్= నదిచే హరింపబడగా (నదీజలాల్లో మునిగిపోగా); కౌశాంబియందున్= కౌశాంబి నగరంలో; వసియించున్= నివసిస్తాడు; ఆతనికిన్= ఆ నిచకునకు; ఉప్తుండు= ఉప్తుడు; ఉప్తునికిన్= ఆ ఉప్తునకు; చిత్రరథుండు= చిత్రరథుడు; చిత్రరథునకున్= ఆ చిత్రరథునికి; శుచిరథుండు= శుచిరథుడు; శుచిరథునికిన్= ఆ శుచిరథునికి; వృష్టిమంతుండు= వృష్టిమంతుడు; వృష్టిమంతునికిన్= ఆ వృష్టిమంతుడనేవానికి; సుషేణుండు= సుషేణుడు; సుషేణునికిన్= ఆ సుషేణుడికి; సుపీతుండు= సుపీతుడు; సుపీతునికిన్= సుపీతుడికి; నృచక్షుస్సు= నృచక్షుస్సు; నృచక్షుస్సుకున్= ఆ నృచక్షుస్సు అనేవానికి; సుఖానిలుండు= సుఖానిలుడు; సుఖానిలునికిన్= ఆ సుఖానిలుడనేవానికి; పరిప్లవుండు= పరిప్లవుడనేవాడు; పరిప్లవునకున్= ఆ పరిప్లవునికి; మేధావి= మేధావి; మేధావికిన్= ఆ మేధావి అనేవానికి; సునయుండు= సునయుడు; సునయునికిన్= ఆ సునయునికి; నృపంజయుండు= నృపంజయుడు; నృపంజయునికిన్= ఆ నృపంజయుడనేవానికి; దూర్వుండు= దూర్వుడు; దూర్వునికిన్= ఆ దూర్వునికి; నిమి= నిమి; నిమికిన్ బృహద్రథుండు= బృహద్రథుడు; బృహద్రథునకున్= ఆ బృహద్రథునికి; సుధాంశుండు= సుధాంశుడు; సుధాంశునికిన్= ఆ సుధాంశునికి; శతానీకుండు= శతానీకుడు; శతానీకునకున్= ఆ శతానీకునికి; దుర్దమనుండు= దుర్దమనుడు; దుర్దమనునికిన్= దుర్దమనునికి; విహీనరుండు= విహీనరుడు; విహీనరునికిన్= ఆ విహీనరునికి; దండపాణి= దండపాణి; దండపాణికిన్= దండపాణికి; మితుండు= మితుడు; మితునకున్= ఆ మితునికి; క్షేమకుండు= క్షేమకుడు; క్షేమకునకున్= క్షేమకునికి; బ్రహ్మక్షత్రుండు= బ్రహ్మక్షత్రుడు; పుట్టుదురు= జన్మిస్తారు; వాఁడు= ఆ బ్రహ్మక్షత్రుడు; నిర్వంశుడై= వంశము (సంతతి) లేనివాడై; దేవర్షి సత్కృతుండై= దేవతలచే ఋషులచే సత్కరింపబడి; కలియుగంబునందున్= కలియుగంలో; చనంగలవాఁడు= చెల్లగలడు.

**తా :** జనమేజయుడు సర్వభూమండలాన్ని జయించి, కావషేయుడు పురోహితుడుగా ఉండగా, అశ్వమేధయాగం చేస్తాడు. ఆ జనమేజయునికి శతానీకుడు జన్మిస్తాడు అతడు యాజ్ఞవల్క్యుని వద్ద వేదాలు, కృపాచార్యునివద్ద ధనుర్వేదం, శౌనకుని వద్ద ఆత్మజ్ఞానం పొందుతాడు; ఆ శతానీకునికి సహస్రానీకుడు, వానికి అశ్వమేధజుడు, వానికి ఆసీమకృష్ణుడు, వానికి నిచకుడు జన్మిస్తారు. ఈ నిచకుడు హస్తినాపురం నదిలో మునిగిపోగా కౌశాంబినగరంలో నివసిస్తాడు. ఆ నిచకునికి ఉప్తుడు వానికి చిత్రరథుడు, వానికి శుచిరథుడు, వానికి సృష్టిమంతుడు, వానికి సుషేణుడు, వానికి సుపీతుడు, వానికి నృచక్షుస్సు, వానికి సుఖానిలుడు, వానికి పరిప్లవుడు, వానికి మేధావి, వానికి సునయుడు, వానికి నృపంజయుడు, వానికి దూర్వుడు వానికి నిమి, వానికి బృహద్రథుడు, వానికి సుధాంశుడు, వానికి శతానీకుడు, వానికి దుర్దమనుడు, వానికి విహీనరుడు, వానికి దండపాణి, వానికి మితుడు, వానికి క్షేమకుడు, వానికి బ్రహ్మక్షత్రుడు జన్మిస్తారు. ఈ బ్రహ్మక్షత్రుడు సంతతి లేనివాడౌతాడు. ఐనా ఇతడు దేవతలచే, ఋషులచే కలియుగంలో కీర్తింపబడతాడు.

**క. జగతి నిటమీఁదఁ బుట్టెడు, మగధాధీశ్వరుల నిఖిలమనుజేశ్వరులన్**
**నిగమాంతవిదులఁ జెప్పెద, సుగుణాలంకార! ధీర! సుభగవిచారా! 681**

**ప్రతి :** సుభగవిచారా= చక్కని భగవత్తత్త్వాన్ని విచారించేవాడా!; ధీర= ఓ ధీరుడా!; సుగుణ+అలంకార!= సుగుణాలచే అలంకరింపబడిన పరీక్షిన్నరేంద్రా!; జగతిన్= జగత్తులో; ఇటమీఁదన్= ఇకపై; పుట్టెడు= జన్మించే; మగధ+అధీశ్వరుల= మగధ రాజులను; నిఖిలమనుజ+ఈశ్వరులన్= సమస్త రాజులను; నిగమాంతవిదులన్= వేదాంతం తెలిసినవారిని గూర్చి; చెప్పెదన్= చెబుతాను.

**తా :** ఓ భగవద్విషయ విచారా! ధీరా! సుగుణాలంకారా! పరీక్షిన్నరేంద్రా! ప్రపంచంలో ఇకపై పుట్టే మగధాధీశ్వరులైన సకల రాజులు వేదాంత విదులు అయిన వారిని గూర్చి చెబుతాను.

**వ. జరాసంధపుత్త్రుండైన సహదేవునికి మార్జాలి, మార్జాలికి శ్రుతశ్రవస్సు, శ్రుతశ్రవస్సునకు నయుతాయువు, నయుతాయువునకు నిరమిత్రుండు, నిరమిత్రునకు సునక్షత్రుండును, సునక్షత్రునికి బృహత్సేనుండు, బృహత్సేనునికిఁ గర్మజిత్తు, కర్మజిత్తునకు శ్రుతంజయుండు, శ్రుతంజయునకు విప్రుండు, విప్రునకు శుచి, శుచికి క్షేముండు, క్షేమునికి సువ్రతుండు, సువ్రతునకు ధర్మనేత్రుండు, ధర్మనేత్రునకు శ్రుతుండు, శ్రుతునకు దృఢసేనుండు, దృఢసేనునికి సుమతి, సుమతికి సుబలుండు, సుబలునకు సునీతుండు, సునీతునకు సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు, విశ్వజిత్తునకుఁ బురంజయుండును జన్మించెద రని చెప్పి మఱియు నిట్లనియె. 682**

**ప్రతి :** జరాసంధ పుత్రుండైన= జరాసంధుని కొడుకైన; సహదేవునికిన్= సహదేవుడనేవానికి; మార్జాలి; మార్జాలికిన్= ఆ మార్జాలి అనేవానికి; శ్రుతశ్రవస్సు; శ్రుతశ్రవస్సునకున్= ఆ శ్రుతశ్రవస్సు అనేవానికి; అయుతాయువున్= అయుతాయువు అనునతడు; అయుతాయువునకున్= ఆ అయుతాయువుకు; నిరమిత్రుండు= నిరమిత్రుడు; నిరమిత్రునకున్= ఆ నిరమిత్రునికి; సునక్షత్రుండును= సునక్షత్రుడు; సునక్షత్రునికిన్= ఆ సునక్షత్రునికి; బృహత్సేనుండు= బృహత్సేనుడు; బృహత్సేనునికిన్= ఆ బృహత్సేనునికి; కర్మజిత్తు; కర్మజిత్తునకున్= ఆ కర్మజిత్తుకు; శ్రుతంజయుండు= శ్రుతంజయుడు; శ్రుతంజయునకున్= ఆ శ్రుతంజయునికి; విప్రుండు= విప్రుడు; విప్రునకున్ శుచి= ఆ విప్రునికి శుచి; శుచికిన్ క్షేముండు= ఆ శుచికి క్షేముడు; క్షేమునికిన్ సువ్రతుండు= క్షేమునికి సువ్రతుడు; సువ్రతునకు ధర్మనేత్రుండు= ఆ సువ్రతునికి ధర్మనేత్రుడు; ధర్మనేత్రునకున్ శ్రుతుండు= ఆ ధర్మనేత్రుడు అనేవానికి శ్రుతుడు; శ్రుతునకున్ దృఢసేనుండు; ఆ శ్రుతునకు దృఢసేనుడు; దృఢసేనునికిన్ సుమతి= ఆ దృఢసేనునికి సుమతి; సుమతికిన్ సుబలుండు= ఆ సుమతికి సుబలుడు; సుబలునకున్ సునీతుండు= ఆ సుబలునికి సునీతుడు; సునీతునకున్ సత్యజిత్తు= ఆ సునీతునికి సత్యజిత్తు; సత్యజిత్తునకున్ విశ్వజిత్తు= ఆ సత్యజిత్తునకు విశ్వజిత్తు; విశ్వజిత్తునకున్ పురంజయుండును= ఆ విశ్వజిత్తునకు పురంజయుడు; జన్మించెదరు+అని చెప్పి= జన్మిస్తారని చెప్పి; మఱియున్+ఇట్లనియెన్= మరలా ఇలా అన్నాడు.

**తా :** జరాసంధ పుత్త్రుడైన సహదేవునికి మార్జాలి, అతనికి శ్రుతశ్రవస్సు, వానికి అయుతాయువు, అతనికి నిరమిత్రుడు, వానికి సునక్షత్రుడు, వానికి బృహత్సేనుడు, అతనికి కర్మజిత్తు, వానికి శ్రుతంజయుడు, వానికి విప్రుడు, వానికి శుచి, అతనికి క్షేముడు, వానికి సువ్రతుడు, అతనికి ధర్మనేత్రుడు, వానికి శ్రుతుడు, అతనికి దృఢసేనుడు, వానికి సుమతి, అతనికి

సుబలుడు, వానికి సునీతుడు, అతనికి సత్యజిత్తు, వానికి విశ్వజిత్తు, విశ్వజిత్తునకు పురంజయుడు జన్మిస్తారు అని చెప్పి మళ్లీ ఇలా అన్నాడు.

**ఆ. వినుము మగధదేశవిభులు జరాసంధ, ప్రముఖధరణిపతులు ప్రబలయశులు**
**వీరు కలియుగమున వెయ్యేండ్ల లోపలఁ, బుట్టి గిట్టఁగలరు భూవరేంద్ర! 683**

**ప్రతి :** భూవర+ఇంద్ర= ఓ రాజశ్రేష్ఠా!; మగధదేశవిభులు= మగధ దేశపురాజులు; జరాసంధ ప్రముఖ ధరణిపతులు= జరాసంధుడు మొదలైన గొప్ప రాజులు; ప్రబలయశులు= గొప్ప కీర్తి గలవారు; వీరు= ఈ రాజులు; కలియుగమునన్= కలియుగంలో; వెయ్యేండ్ల లోపలన్= వేయి సంవత్సరాలు దాటకపూర్వమే; పుట్టిగిట్టన్ కలరు= జన్మించి మరణిస్తారు; వినుము= విను.

**తా :** ఓ రాజేంద్రా! మగధదేశపు రాజులు జరాసంధుడు మొదలైనవారు గొప్ప కీర్తిగల రాజులు. కానీ వీరు కలియుగంలో వేయేండ్లలోపు కాలంలోనే జనించి మరణిస్తారు (మగధ వంశం వేయియేండ్లకు మించి నిలువదు).

**వ. యయాతికొడు కనువునకు సభానరుండు, చక్షువు, పరోక్షుండు ననువారు ముగ్గరు పుట్టి రందు సభానరునకుఁ గాలనాథుండు, కాలనాథునకు సృంజయుండు, సృంజయునకుఁ బురంజయుండు, పురంజయునకు జనమేజయుండు, జనమేజయునకు మహాశాలుండు, మహాశాలునికి మహామనసుఁడు, మహామనసునకు నుశీనరుండు, తితిక్షు వన నిరువురు జన్మించిరి. అందుశీనరునకు శిబియు, వనుండును, గ్రిమియు, దర్పుండు నన నలువురు జన్మించిరి. అందు శిబికి వృషదర్ప సువీర మద్ర కేకయులు నలువురు పుట్టిరి. తితిక్షునకు రుశద్రథుండు, రుశద్రథునకు హేముండు, హేమునకు సుతపుండు, సుతపునకు బలి పుట్టిరి. ఆ బలిక్షేత్రమున దీర్ఘతముని వలన అంగ, వంగ, కళింగ, సింహ, పుండ్రాంధ్రులను పేళ్ళు గలవా రార్వురు కుమారులు పుట్టిరి. వారలు తూర్పు దేశంబునకు రాజులై, దేశంబులకుఁ దమతమ నామధేయంబు లిడి యేలిరి. సువీరునకు సత్యరథుఁడు, సత్యరథునికి దివిరథుండు, దివిరథునికి ధర్మరథుండు, ధర్మరథునకుఁ జిత్రరథుండుఁ బుట్టిరి. ఆ చిత్రరథుండు రోమపాదుండు నా బరఁగె, 684**

**ప్రతి :** యయాతికొడుకు= యయాతి సుతుడైన; అనువునకున్= అనువు అనేవానికి; సభానరుండు= సభానరుడు; చక్షువు; పరోక్షుండును= పరోక్షుడూ; అనువారు ముగ్గరు పుట్టిరి= అనేవారు ముగ్గరు జన్మించారు; అందున్= వారిలో; సభానరునకున్= సభానరునికి; కాలనాథుండు= కాలనాథుడు; కాలనాథునకున్= కాలనాథునికి; సృంజయుండు= సృంజయుడు; సృంజయునకున్= సృంజయునికి; పురంజయుండు= పురంజయుడు; పురంజయునకున్= పురంజయునికి; జనమేజయుండు= జనమేజయుడు; జనమేజయునకున్ మహాశాలుండు= జనమేజయునికి మహాశాలుడు; మహాశాలునికిన్= మహాశాలుడు అనే వానికి; మహామనసుడు; మహామనసునకున్ ఉశీనరుండు= మహామనసునికి ఉశీనరుడు; తితిక్షువు అనన్= తితిక్షువు అనే; ఇరువురు జన్మించిరి= ఇద్దరు పుట్టారు; అందున్ ఉశీనరునకున్= వారిలో ఉశీనరునికి; శిబియు, వనుండును, క్రిమియు, దర్పుండును+అనన్= శిబి, వనుడు, క్రిమి, దర్పుడు అనే; నలువురు జన్మించిరి= నలుగురు పుట్టారు; అందున్ శిబికిన్= వారిలో శిబి అనేవానికి; వృషదర్ప, సువీర, మద్ర, కేకయులు= వృషదర్పుడు, సువీరుడు, మద్రుడు, కేకయుడు అనేవారు; నలువురు పుట్టిరి= నలుగురు జన్మించారు; తితిక్షునకున్= తితిక్షువు అనేవానికి; రుశద్రథుండు= రుశద్రథుడు; రుశద్రథునకున్= రుశద్రథునికి; హేముండు= హేముడు; హేమునకున్= హేమునికి; సుతపుండు= సుతపుడు; సుతపునకున్

బలి= సుతపుడు అనేవానికి బలి; పుట్టిరి= జన్మించారు; ఆ బలిక్షేత్రమునన్= ఆ బలి పత్నియందు; దీర్ఘతమునివలనన్= దీర్ఘతముడు అనే వానివల్ల; అంగ, వంగ, కళింగ, సింహ, పుంద్ర+ఆంధ్రులను పేళ్ళు గలవారు= అంగ, వంగ, కళింగ, సింహ, పుంద్ర, ఆంధ్ర అనే పేర్లుగలవారు; ఆర్వురు కుమారులు పుట్టిరి= ఆరుగురు సుతులు జన్మించారు; వారలు= వాళ్ళు; తూర్పు దేశంబునకున్ రాజులై= తూర్పుదిక్కునకు పరిపాలకులై; దేశములకున్= వారు వారు పాలించే ప్రాంతాలకు; తమ తమ నామధేయంబులు ఇడి= తమ తమ పేర్లుపెట్టి; ఏలిరి= పరిపాలించారు; సువీరునకు సత్యరథుడు= సువీరునికి సత్యరథుడు; సత్యరథునికిన్ దివిరథుఁడు= సత్యరథునికి దివిరథుడు; దివిరథునికిన్ ధర్మరథుండు= దివి రథునికి ధర్మరథుడు; ధర్మరథునకున్= ధర్మరథుడు అనేవానికి; చిత్రరథుండున్= చిత్రరథుడు; పుట్టిరి= జన్మించారు; ఆ చిత్రరథుండు= ఆ చిత్రరథుడు; రోమపాదుండునాన్= రోమపాదుడు అనే పేరుతో; పరఁగెన్= ఒప్పాడు.

**తా :** యయాతి కొడుకు అనువు. ఆ అనువునకు సభానరుడు, చక్షువు, పరోక్షుడు అనేవారు ముగ్గురు జన్మించారు. అందులో సభానరునకు కాలనాథుడు, వానికి సృంజయుడు, వానికి పురంజయుడు, అతనికి జనమేజయుడు, వానికి మహాశాలుడు, వానికి మహామనసుడు, ఆ మహామనసునకు ఉశీనరుడు, తితిక్షువు అనే ఇద్దరు కుమారులు జన్మించారు. వారిలో మొదటివాడైన ఉశీనరునికి శిబి, వనుడు, క్రిమి, దర్పుడు అనే నలుగురు జన్మించారు. ఆ నలుగురిలో శిబికి వృషదర్ప, సువీర, మద్ర, కేకయులు అనేవారు నలుగురు కలిగారు. ఇక రెండవవాడైన తితిక్షునకు రుశద్రథుడు, వానికి హేముడు, వానికి సుతపుడు, ఆతనికి బలి అనేవాడు పుట్టారు. ఈ బలికి సంబంధించిన క్షేత్రంలో దీర్ఘతముడు అనేవానివల్ల అంగ, వంగ, కళింగ, సింహ, పుంద్ర, ఆంధ్రులనే పేళ్లుగల ఆరుగురు కుమారులు ఉదయించారు. వాళ్ళు తూర్పుదేశాలకు రాజులై, పాలించే రాజ్యాలకు తమ తమ పేర్లే పెట్టారు. సువీరునికి (శిబియొక్క రెండవకొడుకు) సత్యరథుడు, అతనికి దివిరథుడు, వానికి ధర్మరథుడు, ఆ ధర్మరథునికి చిత్రరథుడు జన్మించారు. ఆ చిత్రరథుడే రోమపాదుడు అని ప్రసిద్ధి పొందాడు.

**విశే :** బలిపత్నియందు దీర్ఘతమునికి ఆరుగురు పుత్రులు కలిగారు. అందులో 'ఆంధ్ర' ఒకడు. ఆంధ్రుడు పాలించిన దేశం ఆంధ్రదేశం అని పై వచనంలోని సమాచారం తెలియజేస్తుంది.

**క. సంతతి లేని కతంబునఁ, జింతింపుచు నుండ నతని చెలికాఁ డగు ధీ**
**మంతుఁడు దశరథుఁ డతనికిఁ, సంతతిగా నిచ్చె నాత్మజను శాంతాఖ్యన్. 685**

**ప్రతి :** సంతతిలేని కతంబునన్= ఆ రోమపాదునికి సంతానంలేని కారణంగా; చింతింపుచునుండన్= విచారిస్తూ ఉండగా; అతని చెలికాఁడగు= అతనికి స్నేహితుడగు; ధీమంతుఁడు= బుద్ధిమంతుడైన; దశరథుడు; అతనికిన్= ఆ చిత్రరథుడనే పేరుగల రోమపాదునికి; శాంతా+ఆఖ్యన్= శాంత అనే పేరుగల; ఆత్మజను= తన కూతురిని; సంతతిగాన్ ఇచ్చెన్= బిడ్డగా ఇచ్చాడు.

**తా :** రోమపాదుడు సంతతిలేదని విచారిస్తున్నవేళ అతని చెలికాడైన దశరథుడు తన సుతయైన శాంతను అతనికి (పెంపుడు) కూతురుగా ఇచ్చాడు.

**వ. అంత రోమపాదుండు, దన కూఁతురు శాంత యని కైకొని మెలఁగుచుండ, నా రాజు రాజ్యంబునం గొంతకాలంబు వర్షంబు లేమికిం జింతించి, విభాండక సుతుండైన ఋశ్యశృంగుండు వచ్చిన వర్షంబు గురియు నని పెద్దలవలన నెఱింగి, 686**

**ప్రతి :** అంతన్ రోమపాదుండు= అంతట రోమపాదుడు; తన కూఁతురుశాంత అని కైకొని= తన కూతురు శాంత అని స్వీకరించి; మెలఁగుచుండన్= ప్రవర్తిస్తూ ఉండగా; ఆ రాజు రాజ్యంబునన్= ఆ రాజ రాజ్యంలో; కొంతకాలంబు= కొంతకాలం; వర్షంబు లేమికిన్ చింతించి= వర్షాలు పడకపోవడానికి బాధపడి; విభాండక సుతుండైన= విభాండక మహర్షికి కుమారుడైన, ఋశ్యశృంగుండు వచ్చినన్= ఋశ్యశృంగుడు రాజ్యానికి వస్తే; వర్షంబు కురియున్ అని= వర్షం కురుస్తుందని, పెద్దల వలనన్+ఎఱింగి= విజ్ఞులవల్ల తెలిసికొని...

**తా :** రోమపాదుడు శాంతను తన కుమార్తెగా స్వీకరించి పెంచుతున్నాడు. ఆ రోమపాదుని రాజ్యంలో కొంతకాలం వర్షం కురవలేదు. దానికి రోమపాదుడు చాల చింతించాడు. ఋశ్యశృంగుడనే విభాండక మహర్షి కుమారుడున్నాడని అతడు తన రాజ్యానికి వస్తే వర్షాలు కురుస్తాయని పెద్దలు, చెప్పగా విన్నాడు రోమపాదుడు.

**క. ఆ రాజు ఋశ్యశృంగుని, ఘోరతపోనిరతుఁ దెచ్చుకొఱకై పనిచెన్**
**వారసతుల నేర్పరుల ను, దార స్తనభారభీరుతర మధ్యగలన్. 687**

**ప్రతి :** ఆ రాజు= ఆ రాజైన రోమపాదుడు; ఘోరతపోనిరతున్= తీవ్రమైన తపస్సులో మునిగి ఉండే; ఋశ్యశృంగునిన్= ఋశ్యశృంగుణ్ణి; తెచ్చుకొఱకై= తీసికొని రావడానికై; ఉదారస్తనభార= విస్తారమైన స్తనభారంవలన; భీరు తర మధ్యగలన్= భయకంపితమైన నడుము గలవారైన; నేర్పరులను= నేర్పు గల జాణలను; వారసతులన్= వేశ్యాస్త్రీలను; పనిచెన్= పంపించాడు.

**తా :** రాజు రోమపాదుడు తపశ్శక్తి సంపన్నుడైన ఋశ్యశృంగుణ్ణి తీసికొని రావడానికి విస్తార స్తనభారంతో కంపించే, సన్నని నడుముగల వేశ్యకాంతలను పంపాడు.

**వ. వారును జని. 688**

**ప్రతి :** వారును= ఆ వేశ్యకాంతలు; చని= వెళ్ళి...

**తా :** ఆ వేశ్యకాంతలు వెళ్ళి

**ఆ. కాంతలార! మెకము గన్నది మొదలుగా, నాఁడువారి నెఱుఁగఁ డడవిలోన,**
**గోఁచి బిగియఁ గట్టుకొనిన యా వడుగని, మత్తికాని రతికి మరపవలయు, 689**

**ప్రతి :** కాంతలార= ఓ స్త్రీలార!; అడవిలోనన్= అరణ్యంలో; మెకముకన్నది మొదలుగాన్= లేడి గర్భంలో పుట్టినది మొదలు; ఆఁడువారిన్ ఎఱుఁగడు= స్త్రీ జనాన్ని ఎరుగడు; గోఁచి బిగియన్ కట్టుకొనిన ఆ వడుగనిన్= గోచి బిగించుకొని ఉన్న ఆ బ్రహ్మచారిని; మత్తికాని రతికిన్= మన్మథక్రీడకు; మరపవలయు= మరిగేలా చేయాలి.

**తా :** ఓ కాంతలారా! విభాండకుని సుతుడు ఋశ్యశృంగుడు లేడిగర్భం నుండి బయటకు వచ్చినది మొదలు నేటివరకు ఆడువారిని చూచి ఎరుగడు. అడవిలో ఎవ్వరితో సంబంధం లేకుండా ఇంద్రియజ్ఞానాన్ని ఎరుగని ఈ బ్రహ్మచారిని మన్మథక్రీడలో మునిగి తేలేలా చేయాలి.

**వ. అని పలుకుచు. 690**

**ప్రతి :** అని= అంటూ; పలుకుచున్= మాట్లాడుతూ...

**తా :** అలా మాట్లాడుకుంటూ

**క. ఆడుచుఁ జెవులకు నింపుగఁ, బాడుచు నాలోకనిశితబాణౌఘములన్**
**వీడుచు డగ్గఱ నోడుచుఁ, జేడియ లాతపసి కడకుఁ జేరిరి కలఁపన్. 691**

**ప్రతి :** చేడియలు= ఆ వారకాంతలు; ఆడుచున్= నాట్యం సలుపుతూ; చెవులకున్ ఇంపుగన్+పాడుచున్= శ్రవణానందంగా పాటలు పాడుతూ; ఆ లోక నిశితబాణ+ఓఘములన్= చూపులనే వాడి బాణ సమూహాన్ని; వీడుచున్= వదలుతూ; డగ్గ అన్‌ఓడుచున్= సమీపించడానికి భయపడుతూ; తపసికడకున్= తాపసి అయిన ఋశ్యశృంగుని వద్దకు; కలఁపన్= కలత పెట్టుటకు; చేరిరి= (బెరుకుగా) చేరారు.

**తా :** ఆ వారకాంతలు నాట్యాలు చేస్తూ, వీనులవిందుగా పాడుతూ, చూపులనే వాడిబాణాలను వదులుతూ, దగ్గరకు వెళ్ళడానికి భయపడుతూ ఋశ్యశృంగుని కలతపెట్టుటకు బెరుకుగా చేరారు.

**వ. అ య్యవసరంబున వారలం జూచి. 692**

**ప్రతి :** ఆ అవసరమునన్= ఆ సమయంలో; వారలన్= ఆ వారకాంతలను; చూచి= కనుగొని...

**తా :** అప్పుడా వారకాంతలను చూచి

**సీ. మిళితాళినీలధమ్మిల్ల భారంబులు చారుజటావిశేషంబు లనియు**
**భర్మాంచ లోజ్జ్వల ప్రభదుకూలంబులు తతచర్మ వస్త్రభేదంబు లనియు**
**బహు రత్నకీలిత భాసురదామంబు లధికరుద్రాక్షమాలాదు లనియు**
**మలయజ మృగనాభి మహిత లేపంబులు బహువిధ భూతిలేపంబు లనియు**

**తే. మధుర గానంబు శ్రుతియుక్త మంత్రజాతు లనియు, వీణెలు దండంబు లనియు, సతుల**
**మూర్తు లెన్నఁడు నెఱుఁగని ముగుదతపసి, వారిఁ దాపసులని డాయ వచ్చి మ్రొక్కె. 693**

**ప్రతి :** మిళిత+అళినీల= గుమిగూడిన తుమ్మెదవలె నల్లనైన; ధమ్మిల్ల భారంబులు= కొప్పులయొక్క బరువులు; చారు= అందమైన; జటావిశేషంబులు అనియున్= జడల విశేషాలై ఉంటాయని; భర్మ+అంచల+ఉజ్జ్వల ప్రభ= బంగారు జరీతో గొప్పకాంతులు గల; దుకూలంబులు= వస్త్రాలు; తత= విస్తారమైన; చర్మ వస్త్రభేదంబులు అనియున్= జింక తోలుబట్టలై ఉంటాయని; బహురత్న కీలిత= అనేక మణులతో తాపించబడిన; భాసురదామంబులు= కాంతులు చిందే హారాలు (దండలు); అధిక రుద్రాక్ష మాలా+ఆదులు+అనియున్= గొప్ప రుద్రాక్షమాలలై ఉంటాయని; మలయజ= మంచి గంధంయొక్క; మృగనాభి= కస్తూరియొక్క; మహితలేపంబులు= గొప్ప పూతలు; బహువిధ= వివిధములైన; భూతిలేపంబులు+అనియున్= విభూతుల మైపూతలై ఉంటాయని; మధురగానంబు= మనోహరమైన పాటలు; శ్రుతియుక్త మంత్రజాతులు+అనియున్= స్వరయుక్తమైన వేదమంత్ర భేదాలు అయి ఉంటాయని; వీణెలు= వీణియలు; దండంబులు+అనియున్= దండాలు అయి ఉంటాయని; సతుల మూర్తులు= ఆడువారి ఆకారాలు; ఎన్నఁడున్ ఎఱుఁ

గని= ఎప్పుడూ తెలియని; ముగుదతపసి= ముగ్ధ తపస్వి; వారిన్= ఆ వారకాంతలను; తాపసులు అని= మునులు అయి ఉంటారని; డాయన్‌వచ్చి మ్రొక్కెన్= సమీపమునకు వచ్చి నమస్కరించాడు.

**తా :** ముగ్ధత్వం గల తపస్వి ఋశ్యశృంగుడు వారకాంతలకు తుమ్మెదల సమూహంలా ఉండే నల్లని కురుల సమూహాన్ని ఒక రకమైన జటలు అని, బంగారు జరీతో చక్కగా ప్రకాశించే వస్త్రాలు ఒక విధమైన జింక తోలుబట్టలు అని, రత్నహారాలు గొప్ప రుద్రాక్షమాలలని, గంధం, కస్తూరి మైపూతలు, ఒక తీరైన విభూతి పూతలని, వారు పాడే పాటలు స్వరయుక్త వేద మంత్రజాతులని, వారు వాయించే వీణలు మునులు ధరించే దండాలు అయి ఉంటాయని, ఆడువారి ఆకృతులు ఎన్నడూ చూడని ముని వారిని తాపసులని భావించి వారిని సమీపించి నమస్కరించాడు.

**వ. ఇట్లు వచ్చి మ్రొక్కిన ఋశ్యశృంగుం జూచుచు, నగుచు డగ్గఱి. 694**

**ప్రతి :** ఇట్లువచ్చి= ఈ విధంగా వచ్చి; మ్రొక్కిన= నమస్కరించిన; ఋశ్యశృంగున్ చూచుచున్= ఋశ్యశృంగుణ్ణి చూస్తూ; నగుచున్= నవ్వుతూ; డగ్గఱి= సమీపించి...

**తా :** ఈ విధంగా నమస్కరించిన ఋశ్యశృంగుణ్ణి చూస్తూ నవ్వుతూ దగ్గరకు వచ్చి

**సీ. సేమమే యని సతుల్ చేతుల గ్రుచ్చి కర్కశకుచంబులు మోవఁ గౌఁగిలించి**
**చిరతపోనియతి డస్సితి గదా యని మోముఁ గంఠంబు నాభియుఁ గలయఁ బుణికి**
**క్రొత్తదీవన లివి కొనుమని వీనుల పొంత నాలుకలఁ జప్పుళ్ళు చేసి**
**మా వనంబుల పండ్లు మంచివి తిను మని పెక్కు భక్ష్యంబులు ప్రీతి నొసఁగి**

**ఆ. నూతనాజినంబు నును పిది మేలని, గోఁచి విడిచి మృదుదుకూల మిచ్చి**
**మౌని మరగఁజేసి మా పర్ణశాలకుఁ, బోద మనుచుఁ గొంచుఁ బోయి రతని. 695**

**ప్రతి :** సేమమే= క్షేమమా!; అని= అనుచు; సతుల్= వారకాంతలు; చేతులన్‌గ్రుచ్చి= చేతులతో నొక్కుచూ; కర్కశకుచంబులు= కఠినస్తనములు; మోవన్= గట్టిగా తాకునట్లు; కౌఁగిలించి= కౌగలించుకొని; చిర తపోనియతిన్+డస్సితిగదా= చాలకాలం నుండి తపస్సుయొక్క నియమంతో అలసిపోయావు కదా!; అని= అంటూ; మోమున్= మొగమును; కంఠంబున్= కంఠమును; నాభియున్= నాభీ ప్రదేశాన్ని (బొడ్డును); కలయన్+పుణికి= చక్కగా సవరించి; క్రొత్త దీవెనలివి= ఇవి సరిక్రొత్త ఆశీస్సులు; కొనుము+అని= స్వీకరింపుమని; వీనులపొంతన్= చెవులవద్ద; నాలుకలన్= నాలుకలతో; చప్పుళ్ళు చేసి= శబ్దాలు చేసి; మా వనంబుల పండ్లు= మా తోటలోని పండ్లు; మంచివి తినుము+అని= చక్కగా ఉంటాయి తిను అంటూ; పెక్కు భక్ష్యంబులు= పలు తినుబండారాలు; ప్రీతిన్ ఒసఁగి= ప్రేమతో ఇచ్చి; నూతన+అజినంబు= క్రొత్త జింక చర్మం; నునుపు ఇది మేలు+అని= మృదువైనది, మేలైనది అంటూ; గోఁచి విడిచి= కౌపీనం తీసివేసి; మృదు దుకూలము+ఇచ్చి= మెత్తని వస్త్రాలను ఇచ్చి; మౌనిన్ మరఁగన్+చేసి= ఋషిని లోలునిగా చేసి (మునికి ఆసక్తి పెంచి); మా పర్ణశాలకున్= మా కుటీరానికి; పోదము+అనుచున్= వెళదాము అంటూ; అతనిన్= ఆ ఋశ్యశృంగుని; కొంచున్+పోయిరి= తీసికొని వెళ్ళారు.

**తా :** వారకాంతలు ఋశ్యశృంగుణ్ణి చూచి క్షేమమా! అంటూ చేతులతో తాకి తమ కఠిన స్తనాలు తగిలేట్లు గట్టిగా కౌగలించుకొన్నారు. చాలకాలం నుండి తపోనియతితో అలసిపోయావు కదా అంటూ మొగాన్ని, కంఠాన్ని, నాభిని

సవరించారు. ఇవి కొత్తరకం దీవెనలు అంటూ చెవులదగ్గర నాలుకలతో చప్పుళ్ళు చేశారు. మా తోటలోని మంచి పళ్ళు ఇవి తినుమంటూ ఎన్నో తినుబండారాలను ప్రేమతో ఇచ్చారు. ఈ జింక చర్మం కొత్తది, నునుపుగా ఉంటుంది, మంచిది అంటూ కౌపీనాన్ని తీసివైచి మంచి మృదువైన వస్త్రాన్ని ఇచ్చి ఆ ఋశ్యశృంగమునిని ఆసక్తికి లోనుజేసి మా కుటీరానికి వెళదాము రా అంటూ అతనిని తమవెంట తీసికొనిపోయారు.

**వ. ఇట్లు హరిణీసుతుండు కాంతాకటాక్ష పాశబద్ధుండై, వారల వెంటం జని రోమపాదుకడకుం బోయిన నతండు, దన ప్రియనందనయైన శాంత నిచ్చి పురంబున నునిచికొనియె. అ మ్మునీశ్వరుండు వచ్చిన వర్ష ప్రతిబంధదోషంబు చెడి వర్షంబు గురిసె నంత. 696**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; హరిణీసుతుండు= జింక గర్భంలో జన్మించిన ఋశ్యశృంగుడు; కాంతాకటాక్ష పాశబద్ధుండై= ఆ వారస్త్రీల క్రీగంటి చూపులనే త్రాళ్ళకు కట్టుబడి; వారలవెంటన్ చని= ఆ వారకాంతల వెనుకవెళ్ళి; రోమ పాదుకడకున్= రోమపాదుని వద్దకు; పోయినన్= వెళ్ళగా; అతండు= ఆ రోమపాదుడు; తన ప్రియనందన ఐన= తన గారాబుకుమార్తె అయిన; శాంతన్ ఇచ్చి= శాంతను ఇచ్చి వివాహంచేసి; పురంబునన్ ఉనిచికొనియెన్= తన నగరంలో ఉంచుకున్నాడు; ఆ మునీశ్వరుండు= ఆ మునివరుడు; వచ్చినన్= పురమునకు రాగా; వర్షప్రతిబంధ దోషంబు= వాన రాకడకు అడ్డుపడిన దోషం; చెడి= పోయి; వర్షంబు కురిసెన్= వర్షం కురిసింది; అంతన్= అంతట...

**తా :** ఈ విధంగా ఋశ్యశృంగుడు కాంతల క్రీగంటి చూపులనే త్రాళ్ళచే బంధించబడి, వాళ్ళ వెంబడి రోమపాదుని రాజ్యానికి వచ్చాడు. ఆ రోమపాదుడు తన ప్రియపుత్రి శాంతను ఇచ్చి పెండ్లి చేసి తన రాజ్యంలో ఉంచుకున్నాడు. ఆ మునీశ్వరుడు రాజ్యానికి రాగానే వర్షం పడని దోషం తొలగిపోయి వర్షం కురిసింది. అంతట

**ఆ. ఆ నృపాలచంద్రుఁ డనపత్యుఁడై యుండ, నెఱిఁగి మునికులేంద్రుఁ డింద్రుఁ గూర్చి**
**యిష్టిచేసి సుతుల నిచ్చె నాతని కృపఁ, బంక్తిరథుఁడు పిదపఁ బడసె సుతుల. 697**

**ప్రతి :** ఆ నృపాలచంద్రుఁడు= ఆ రాజచంద్రుడు; పంక్తిరథుఁడు= దశరథుడు; అనపత్యుఁడై= బిడ్డలు లేనివాడై; ఉండన్= ఉండుటను; ఎఱిఁగి= తెలిసికొని; ముని కుల+ఇంద్రుఁడు= మునికుల శ్రేష్ఠుడు; ఇంద్రున్+కూర్చి= ఇంద్రుని గుఱించి; ఇష్టిచేసి= యజ్ఞంచేసి; సుతులన్+ఇచ్చెన్= కొడుకులను ఇచ్చాడు; ఆతనికృపన్= ఆ ఋశ్యశృంగుని దయవల్లనే; పిదపన్= తదుపరి; సుతులన్+పడసెన్= కుమారులను పొందాడు.

**తా :** ఋశ్యశృంగుడు దశరథునకు బిడ్డలు లేని విషయం తెలిసికొని, ఇంద్రుని గూర్చి యజ్ఞంచేసి సుతులను ఇప్పించాడు. ఈ విధంగా ఋశ్యశృంగుని వల్లనే దశరథునకు సంతానం కలిగింది.

**వ. ఆ రోమపాదునకుఁ జతురంగుండును, జతురంగునకుఁ బృథులాక్షుండును, బృథులాక్షునికి బృహద్రథుండును, బృహత్కర్ముండు, బృహద్భానుండు ననువారు ముర్వురును బుట్టిరి. అందు బృహద్రథునకు బృహన్మనస్సును, బృహన్మనస్సునకు జయద్రథుండును, జయద్రథునకు విజయుండును, విజయునకు సంభూతి యను భార్యయందు ధృతియు, నా ధృతికి ధృతవ్రతుండును, ధృతవ్రతునకు సత్యకర్ముండును, సత్యకర్మునకు నతిరథుండును జనించిరి. 698**

**ప్రతి :** ఆ రోమపాదునకున్= ఆ రోమపాదుడికి; చతురంగుండును= చతురంగుడు; చతురంగునకున్= చతురంగుడికి; పృథులాక్షుండును= పృథులాక్షుడు; పృథులాక్షునికిన్= పృథులాక్షుడికి; బృహ(ద్రథుండును, బృహత్కర్ముండు, బృహద్భానుండును+అనువారు= బృహ(ద్రథుడు, బృహత్కర్ముడు, బృహద్భానుడు అనేవారు; ముప్వరును పుట్టిరి= ముగ్గురు కలిగారు; అందున్= వారిలో; బృహ(ద్రథునకున్= బృహ(ద్రథుడికి; బృహన్మనస్సును= బృహన్మనస్సు అనేవాడు; బృహన్మనస్సునకున్ జయ(ద్రథుండును= ఆ బృహన్మనస్సు అనేవానికి జయ(ద్రథుడు; జయ(ద్రథునకున్ విజయుండును= జయ(ద్రథుడికి విజయుడు; విజయునకున్ సంభూతియను భార్యయందున్= విజయునికి సంభూతి అనే భార్యవల్ల; ధృతియున్= ధృతియు; ఆ ధృతికి ధృత(వతుండును= ఆ ధృతి అనేవానికి ధృత(వతుడు; ధృత(వతునకున్ సత్యకర్ముండును= ధృత(వతుడికి సత్యకర్ముడు; సత్యకర్మునకున్ అతిరథుండును జనించిరి= సత్యకర్ముడికి అతిరథుడు పుట్టారు.

**తా :** ఆ రోమపాదుడికి చతురంగుడు ఆ చతురంగునికి పృథులాక్షుడు, ఆ పృథులాక్షునికి బృహ(ద్రథుడు, బృహత్కర్ముడు, బృహద్భానుడు అనేవారు ముగ్గురు జన్మించారు. అందులో బృహ(ద్రథునికి బృహన్మనస్సు, వానికి జయ(ద్రథుడు అతనికి విజయుడు, ఆ విజయునికి సంభూతి అనే భార్యవల్ల ధృతి, ఆ ధృతికి ధృత(వతుడు, ధృత(వతునికి సత్యకర్ముడు, సత్యకర్మునికి అతిరథుడు జన్మించారు.

**గీ. కుంతి పిన్ననాఁడు గోరి సూర్యునిఁ బొంద, బిడ్డఁ డుదితుఁడైనఁ బెట్టెఁ బెట్టి**
**గంగ నీట విడువఁ గని యతిరథుఁ డంతఁ, గర్ణుఁ డనుచుఁ గొడుకు గారవించె. 699**

**ప్రతి :** కుంతి= కుంతీదేవి; పిన్ననాఁడు= చిన్న వయస్సులో; సూర్యునిన్= సూర్యుణ్ణి; కోరి= తన మనసులో కోరుకొని; పొందన్= కలియగా; బిడ్డఁడు= కొడుకు; ఉదితుఁడైనన్= జన్మించగా; పెట్టెన్ పెట్టి= ఒక పెట్టెలో పెట్టి; గంగనీటన్ విడువన్= గంగ నీటిలో వదిలిపెట్టగా; అతిరథుడు కని= అతిరథుడు అనేవాడు చూచి; అంతన్= అంతట; కర్ణుఁడు అనుచున్= కర్ణుడు అని పిలుచుకుంటూ; కొడుకున్+గారవించెన్= కొడుకును లాలించాడు.

**తా :** చిన్నవయస్సులో కుంతి సూర్యుని కోరి అతనిని పొందింది. వారికి బిడ్డ జన్మించగా కుంతి ఆ బిడ్డను పెట్టెలో పెట్టి గంగనీటిలో విడిచిపెట్టింది, అతిరథుడు ఆ పెట్టెను చూచి ఆ బిడ్డకు కర్ణుడు అని పేరుపెట్టి కొడుకుగా (పేమ చూపాడు.

**వ. ఇ ట్లతిరథునకుఁ గానీనుండైన కర్ణుండు కొడుకయ్యె. కర్ణునకు వృషసేనుండు పుట్టె. అ య్యయాతి కొడుకైన (ద్రుహ్యునకు బ(భుసేతువు, బ(భుసేతువునకు నారబ్ధుండు, నారబ్ధునకు గాంధారుం, డాగాంధారునకు ఘర్ముండు, ఘర్మునకు ఘృతుండు, ఘృతునకు దుర్మదుండు, దుర్మదునకుఁ (బచేతస్సు జనించిరి. (ప్రచేతస్సుకు నూర్గురు పుట్టి, మ్లేచ్ఛాధిపతులై, యుదీచీదిశ నా(శయించిరి. తుర్వసునకు వహ్ని, వహ్నికి భర్గుండు, భర్గునకు భానుమంతుఁడు, భానుమంతునకుఁ (దిసానువు, (తిసానువునకుఁ గరంధముండు, కరంధమునకు నుదార చిత్తుండైన మరుత్తుండును బుట్టరి. అతనికి యయాతిశాపంబున సంతతి లేదయ్యె, వినుము. 700**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అతిరథునకున్= అతిరథునికి; కానీనుండైన= కన్యకు జన్మించిన; కర్ణుండు= కర్ణుడు; కొడుకు అయ్యెన్= కొడుకు అయ్యాడు; కర్ణునకున్= కర్ణుడికి; వృషసేనుండు పుట్టెన్= వృషసేనుడు జన్మించాడు; ఆ యయాతి కొడుకైన (ద్రుహ్యునకున్= ఆ యయాతి సుతుడైన (ద్రుహ్యుడు అనేవానికి; బ(భుసేతువు= బ(భుసేతువు; బ(భుసేతువునకున్+ఆరబ్ధుండున్= బ(భుసేతువుకి ఆరబ్ధుడు; ఆరబ్ధునకున్ గాంధారుండు= ఆరబ్ధుడు అనేవానికి గాంధారుడు;

గాంధారునకున్ ఘర్మ్ముండు= ఆ గాంధారునికి ఘర్ముడు; ఘర్మునకున్ ఘృతుండు= ఘర్మునికి ఘృతుడు; ఘృతునకున్ దుర్మదుండు= ఘృతుడు అనేవానికి దుర్మదుడు; దుర్మదునకున్= దుర్మతునికి; ప్రచేతస్సు జన్మించిరి= ప్రచేతస్సు పుట్టారు; ప్రచేతస్సుకున్= ఆ ప్రచేతస్సు అనేవానికి; నూర్గురు పుట్టి= వందమంది జన్మించి; మ్లేచ్ఛాధిపతులై= మ్లేచ్ఛ దేశాలకు అధిపతులై; ఉదీచీదిశన్ ఆశ్రయించిరి= ఉత్తర దిక్కుకు వెళ్ళిపోయారు; తుర్వసునకున్= యయాతి కొడుకైన తుర్వసుడు అనేవానికి; వహ్ని; వహ్నికిన్ భర్గుండు= వహ్నికి భర్గుడు; భర్గునకున్ భానుమంతుఁడు= భర్గునకు భానుమంతుడు; భానుమంతునకున్+త్రిసానువు= భానుమంతుడికి త్రిసానువు; త్రిసానువునకున్+కరంధముండు= త్రిసానువుకు కరంధముడు; కరంధమునకున్= ఆ కరంధమునికి; ఉదారచిత్తుండైన మరుత్తుండును బుట్టిరి= మంచి మనసుగల మరుత్తు జన్మించారు; అతనికిన్= ఆ మరుత్తునకు; యయాతి శాపంబునన్ సంతతిలేదయ్యెన్= యయాతి శాపంవల్ల సంతానం లేదు; వినుము= ఆలకించు.

**తా :** ఈ విధంగా అతిరథుడికి కన్యాపుత్రుడైన కర్ణుడు కొడుకయ్యాడు. ఆ యయాతి కొడుకైన ద్రుహ్యునకు బభ్రుసేతువు, అతనికి ఆరబ్ధుడు, వానికి గాంధారుడు, అతనికి ఘర్ముడు, వానికి ఘృతుడు, అతనికి దుర్మదుడు, వానికి ప్రచేతస్సు జన్మించారు. ఈ ప్రచేతస్సు అనేవానికి నూర్గురు సుతులు కలిగారు. వాళ్ళు మ్లేచ్ఛ దేశాలకు అధిపతులై ఉత్తర దిక్కుగా వెళ్ళిపోయారు. యయాతి కొడుకైన తుర్వసునికి వహ్ని, వానికి భర్గుడు, వానికి భానుమంతుడు, వానికి త్రిసానువు అతనికి కరంధముడు, ఆ కరంధమునకు మంచి హృదయం గల మరుత్తు జన్మించారు. ఈ మరుత్తుకు యయాతి శాపంవల్ల సంతతి కలుగలేదు. విను.

## ✤ యదువంశ చరిత్రము ✤

**చ. అనఘ! యయాతి పెద్దకొడుకైన యదుక్షితిపాలు వంశమున్**
**వినినఁ బఠించినన్ నరుఁడు వెండియుఁ బుట్టఁడు, ముక్తిఁ బొందు న**
**య్యనుపమమూర్తి విష్ణుఁడు నరాకృతిఁ బొంది జనించెఁ గావునన్**
**వినుము నరేంద్ర! నీకు నిది వీనుల పండువు గాఁగఁ జెప్పెదన్. 701**

**ప్రతి :** అనఘ= ఓ పాపరహితా! పరీక్షిన్మహారాజా!; యయాతి పెద్దకొడుకైన= యయాతికి మొదటి కొడుకైన; యదుక్షితి పాలు వంశమున్= యదుమహారాజు వంశాన్ని గూర్చి; వినినన్= విన్నా; పఠించినన్= చదివినా; నరుఁడు= మానవుడు; వెండియున్+పుట్టఁడు= మళ్లీ జన్మించడు (మోక్షాన్ని పొందుతాడు); ముక్తిన్+పొందున్= జననమరణరహిత స్థానాన్ని పొందుతాడు; ఆ+అనుపమమూర్తి= సాటిలేని ఆ ఆకారంగల; విష్ణుఁడు= విష్ణుమూర్తి; నర+ఆకృతిన్+పొంది= మానవాకారాన్ని ధరించి; జనించెన్ కావునన్= జన్మించాడు కాబట్టి; నీకున్= నీకు; ఇది= ఈ యందువంశ చరిత్రను; వీనుల పండువు+ కాఁగన్= చెవులకు విందు కలుగునట్లుగా; నరేంద్రా= ఓ రాజా!; చెప్పెదన్= చెబుతాను; వినుము= ఆలకించు.

**తా :** ఓ పుణ్యాత్మా! భగవంతుడు విష్ణుమూర్తి మానవాకారంతో ఆ యదువంశంలో జన్మించాడు కాబట్టి యదువంశ చరిత్ర వినిన చదివిన ఆ నరుడు జననమరణాలనుండి విడివడి ముక్తిని పొందుతాడు. ఓ నరేంద్రా! ఆ అసమాన మహిమగల విష్ణుమూర్తి నరాకృతిని పొందిన విషయాన్ని వీనులవిందుగా చెబుతాను విను.

**వ. యదువునకు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుండు, రిపుండు ననువారు నలువురు సంభవించిరి. అందుఁ బెద్దకొడుకైన సహస్రజిత్తునకు శతజిత్తు గలిగె. ఆ శతజిత్తునకు మహాహయ, వేణుహయ, హేహయులను**

**వారు మువ్వురు పుట్టిరి. అందు హేహయునకు ధర్ముండు, ధర్మునకు నేత్రుండు, నేత్రునకుఁ గుంతి, కుంతికి మహిష్మంతుఁడు, మహిష్మంతునకు భద్రసేనుండు, భద్రసేనునకు దుర్మదుండు, దుర్మదునికి ధనికుండు, ధనికునికిఁ గృతవీర్యుండు, కృతాగ్ని, కృతకర్మ, కృతౌజుఁడను నలువురు సంభవించిరి. అందుఁ గృతవీర్యునికి నర్జునుండు జనియించె. అతండు మహాబుద్ధిబలంబున. 702**

**ప్రతి :** యదువునకున్= యదువు అనేవానికి; సహస్రజిత్తు, క్రోష్టువు, నలుండు, రిపుండును+అనువారు= సహస్రజిత్తు, క్రోష్టుడు, నలుడు, రిపుడు అనేవారు; నలువురు సంభవించిరి= నలుగురు జన్మించారు; అందున్= వారిలో; పెద్దకొడుకైన= పెద్ద కుమారుడైన; సహస్రజిత్తునకున్= సహస్రజిత్తు అనేవానికి; శతజిత్తు కలిగెన్= శతజిత్తు జన్మించాడు; ఆ శతజిత్తునకున్= ఆ శతజిత్తు అనేవానికి; మహాహయ, వేణుహయ, హేహయులు+అనువారు= మహాహయ, వేణుహయ, హేహయులనేవారు; ముప్పురుపుట్టిరి= ముగ్గురు జన్మించారు; అందున్= వారిలో; హేహయునకున్= హేహయుడు అనేవానికి; ధర్ముండు= ధర్ముడు; ధర్మునకున్ నేత్రుండు= ధర్మునకు నేత్రుడు; నేత్రునకున్ కుంతి= నేత్రుడు అనేవానికి కుంతి; కుంతికిన్ మహిష్మంతుఁడు= కుంతికి మహిష్మంతుడు; మహిష్మంతునకున్ భద్రసేనుండు= ఆ మహిష్మంతునికి భద్రసేనుడు; భద్రసేనునకున్ దుర్మదుండు= భద్రసేనుడికి దుర్మదుడు; దుర్మదునికిన్ ధనికుండు= దుర్మదునికి ధనికుడు; ధనికునికిన్= ఆ ధనికునికి; కృతవీర్యుండు, కృతాగ్ని, కృతకర్మ, కృతౌజుఁడును= కృతవీర్యుడు, కృతాగ్ని, కృతవర్మ, కృతౌజుడనబడే; నలువురు సంభవించిరి= నలుగురు జన్మించారు; అందున్= వారిలో; కృతవీర్యునికిన్+అర్జునుండు= కృతవీర్యునికి అర్జునుడనేవాడు; జనియించెన్= జన్మించాడు; అతఁడు మహాబుద్ధి బలంబునన్= అతడు తనదైన గొప్ప తెలివితో...

**తా :** యదువునకు సహస్రజిత్తు క్రోష్టువు, నలుడు, రిపుడు అనేవారు నలుగురు జన్మించారు. అందులో పెద్దకొడుకైన సహస్రజిత్తునకు శతజిత్తు పుట్టాడు, ఆ శతజిత్తునకు మహాహయుడు, వేణుహయుడు, హేహయుడు అనేవారు ముగ్గురు జన్మించారు. అందులో హేహయుడు అనేవానికి ధర్ముడు, అతనికి నేత్రుడు, అతనికి కుంతి, వానికి మహిష్మంతుడు, అతనికి భద్రసేనుడు, వానికి దుర్మదుడు, వానికి ధనికుడు, ఆ ధనికునికి కృతవీర్యుడు, కృతాగ్ని, కృతకర్మ, కృతౌజుడు అనే నలుగురు కలిగారు. అందులో కృతవీర్యునికి అర్జునుడు పుట్టాడు. ఆ అర్జునుడు తనయొక్క గొప్ప బుద్ధివైభవంతో

**సీ. హరికళాసంజాతుఁడైన దత్తాత్రేయు సేవించి సద్యోగసిద్ధిఁ బొంది**
**బహుయజ్ఞ దాన తపంబులు గావించి సకల దిక్కులు గెల్చి జయముతోడ**
**సతతంబు హరినామ సంకీర్తనము సేసి ధనముల నొంది యుదారవృత్తి**
**యెనుబదియైదువే లేండ్లు భూచక్రంబు ఘనకీర్తిఁ దనపేరు గాఁగ నేలె;**

**ఆ. ముదిమి లేక తరుణమూర్తియై యురుకీర్తి, నమరెఁ గార్తవీర్యుఁ డనఁగ విభుఁడు;**
**నిజము వానిభంగి నేల యేలిన యట్టి, రాజు నెఱుఁగ మెందు రాజముఖ్య! 703**

**ప్రతి :** రాజముఖ్య= ఓ రాజశ్రేష్ఠా!; హరికళాసంజాతుఁడైన= శ్రీహరి అంశతో జన్మించిన; దత్తాత్రేయు సేవించి= దత్తాత్రేయుని అర్చనచేసి; సద్యోగసిద్ధిన్ పొంది= ప్రయత్నంలో ఫలితాన్ని పొంది; బహుయజ్ఞ దానతపంబులు కావించి= ఎన్నో యజ్ఞదాన తపస్సులు చేసి; సకల దిక్కులుగెల్చి= అన్ని దిక్కులను జయించి; జయముతోడన్= ఆ విజయాలతో; సంతతంబున్= అన్నివేళలా; హరినామ సంకీర్తనము= హరియొక్క నామకీర్తనాన్ని; చేసి= సల్పి; ధనములన్+ఒంది=

ధనాన్ని పొంది; ఉదారవృత్తి= దానధర్మాలు చేస్తూ; ఎనుబది యైదు వేలేండ్లు= ఎనబై ఐదు వేల సంవత్సరాలు; భూచక్రంబు= భూమండలాన్ని; ఘనకీర్తిన్= గొప్ప ఖ్యాతితో; తన పేరుగాఁగన్= తన పేరు ప్రతిధ్వనించేలా; ఏలెన్= పరిపాలించాడు; ముదిమిలేక= ముసలితనం లేకుండా; తరుణమూర్తియై= యౌవనాకారంతో; ఉరుకీర్తిన్= గొప్ప కీర్తితో; కార్తవీర్యుఁడనఁగన్= కార్తవీర్యుడు అని పిలువబడుతూ; విభుఁడు= రాజు; అమరెన్= ఒప్పాడు; వానిభంగిన్= ఆ కార్తవీర్యునివలె; నేల+ఏలినయట్టి రాజున్= భూమిని పరిపాలించిన రాజును; ఎఱుఁగము ఎందున్ నిజము= నిజంగా మరెక్కడా వినలేదు.

**ప్రతి :** ఓ రాజవరేణ్యా! కార్తవీర్యుడనే పేరుగల అర్జునుడు శ్రీహరి అంశతో జనించిన దత్తాత్రేయుని పూజించి, సిద్ధులుపొంది, ఎన్నో యజ్ఞదాన తపస్సులుచేసి, దిక్కులన్నీ జయించాడు. అన్నివేళలా హరికీర్తనం గావిస్తూ ధనాన్ని సంపాదిస్తూ దానధర్మాదులు చేస్తూ ఎనబై ఐదువేల సంవత్సరాలు భూమండలాన్ని తన పేరు మారుమ్రోగేలా పరిపాలించాడు. కార్తవీర్యునివలె భూమిని పరిపాలించిన రాజును మనం ఎక్కడా చూడబోము.

**వ. ఆ యర్జుననకుం గల పుత్త్రసహస్రంబునం బరశురాముని బారికిం దప్పి జయధ్వజుండు, శూరసేనుండు, వృషణుండు, మధువు, నూర్జితుం దనువా రేవురుం బ్రతికిరి. జయధ్వజునకుఁ దాళజంఘుండు, తాళజంఘునకు నౌర్వముని తేజంబున నూర్వురు కొడుకులుఁ గలిగిరి. అందుఁ బ్రథముండు వీతిహోత్రుండు. మధువునకు వృక్ణుండు, వృక్ణునకుఁ బుత్త్ర శతంబు వుట్టె, నందుఁ బ్రథముండు వృష్ణి; మఱియు మధు వృష్ణి యదువుల యా వంశంబుల వారు మాధవులు, వృష్ణులు, యాదవులు ననం బరఁగిరి. యదుపుత్రుండయిన క్రోష్టువునకు వృజినవంతుండు, వృజినవంతునకు శ్వాహితుండు, శ్వాహితునకు భేరుశేకుండు, భేరుశేకునకుఁ జిత్రరథుండు, చిత్రరథునకు శశిబిందుండుఁ బుట్టిరి. 704**

**ప్రతి :** ఆ+అర్జుననకున్ కలపుత్ర సహస్రంబునన్= ఆ కార్తవీర్యార్జునకు గల వేయిమంది పుత్రులలో; పరశురాముని బారికిన్ తప్పి= పరశురాముని బారినుండి తప్పించుకొని; జయధ్వజుండు, శూరసేనుండు, వృషణుండు, మధువు, నూర్జితుండనువారు= జయధ్వజుడు, శూరసేనుడు, వృషణుడు, మధువు, ఊర్జితుడు అనేవారు; ఏవురున్+బ్రతికిరి= ఐదుగురు బ్రతికారు; జయధ్వజునకున్ తాళజంఘుండు= జయధ్వజునికి తాళజంఘుడు, తాళజంఘునకున్+ఔర్వముని తేజంబునన్= తాళజంఘుడికి ఔర్వముని తేజస్సువలన; నూర్వురు కొడుకులున్+కలిగిరి= వందమంది కొడుకులు కలిగారు; అందున్= వారిలో; ప్రథముండు= మొదటివాడు; వీతిహోత్రుండు= వీతిహోత్రుడు; మధువునకున్, వృక్ణుండు= మధువునకు వృక్ణుడు; వృక్ణునకున్= వృక్ణునికి; పుత్త్ర శతంబుపుట్టెన్= వందమంది పుత్రులు జన్మించారు; అందున్=వారిలో; ప్రథముండు= మొదటివాడు; వృష్ణి= వృష్ణి అనేవాడు; మఱియు= అంతేకాక; మధువృష్ణి యదువుల= మధువు, వృష్ణి యదువులు అనే; ఆ వంశంబులవారు= ఆయా వంశాలవారు; మాధవులు, వృష్ణులు, యాదవులును+అనన్+పరఁగిరి= మాధవులు, వృష్ణులు, యాదవులు అనబడ్డారు; యదుపుత్త్రుండయిన= యదువు యొక్క కుమారుడైన; క్రోష్టువునకున్= క్రోష్టువు అనేవానికి; వృజినవంతుండు= వృజినవంతుడు; వృజినవంతునకున్= ఆ వృజినవంతునికి; శ్వాహితుండు= శ్వాహితుడు; శ్వాహితునకున్= శ్వాహితుడు అనేవానికి; భేరుశేకుండు= భేరుశేకుడు; భేరుశేకునకున్= ఆ భేరుశేకుడు అనేవానికి; చిత్రరథుండు= చిత్రరథుడు; చిత్రరథునకున్ శశిబిందుండున్= చిత్రరథునకు శశిబిందుడు; పుట్టిరి= జన్మించారు.

**తా :** ఆ కార్తవీర్యార్జునకుగల వేయిమంది సుతులలో పరశురాముని బారినుండి తప్పించుకొని జయధ్వజుడు, శూరసేనుడు, వృషణుండు, మధువు, ఊర్జితుడు అనేవారు ఐదుగురు బతికారు. జయధ్వజుడికి తాళజంఘుడు, తాళజంఘునికి ఔర్వముని తేజస్సువల్ల నూరుగురు కొడుకులు కలిగారు. అందులో మొదటివాడు వీతిహోత్రుడు. మధువునకు వృష్ణుడు, వృష్ణునికి నూరుగురు సంతానం కలిగారు. అందులో ప్రథముడు వృష్ణి. మధు, వృష్ణి, యదువుల వంశాలవారు మాధవులు, వృష్ణులు, యాదవులని పిలువబడ్డారు. యదుపుత్రుడు క్రోష్టువు, అతనికి వృజినవంతుడు, వానికి శ్వాహితుడు, అతనికి భేరుశేకుడు, వానికి చిత్రరథుడు, చిత్రరథునికి శశిబిందుడు జన్మించారు.

**మ.** **కృశమధ్యల్ పదివేవు రంగనలతోఁ గ్రీడం బ్రమోదింప స**
**త్కుశలుండై పదివేలలక్షలు సుపుత్రుల్ భక్తి సేయం జతు**
**ర్దశ రత్నుండును యోగినాఁ బరఁగి సప్తద్వీప రాజేంద్రుఁడై**
**శశిబిందుం దురునీతిమంతుఁ దమరెన్ సత్కాంతి పూర్ణేందుఁడై.** **705**

**ప్రతి :** శశిబిందుండు= శశిబిందుడు; కృశమధ్యల్, పదివేవురు+అంగనలతోన్= సన్నని నడుములు గల పదివేలమంది భార్యలతో; క్రీడన్+ప్రమోదింపన్= క్రీడించి ఆనందిస్తూ; సత్కుశలుండై= నేర్పుగలవాడై; పదివేల లక్షలు సుపుత్రుల్ భక్తిచేయన్= పదివేల లక్షలమంది కుమారులు భక్తితో అర్చిస్తూ ఉండగా; చతుర్దశరత్నుండును= పదునాలుగు రత్నాలు కలవాడున్నూ; యోగినాన్+పరఁగి= యోగి అని కీర్తింపబడి; సప్తద్వీపరాజేంద్రుఁడై= ఏడు ద్వీపాలకూ చక్రవర్తై; సత్కాంతి పూర్ణ+ఇందుఁడై= చక్కని కాంతిగల నిండుచంద్రుడై; ఉరునీతిమంతుఁడు= చక్కని నీతిగలవాడుగా; అమరెన్= ఒప్పాడు (ప్రకాశించాడు).

**తా :** అందమైన స్త్రీలు పదివేలమంది భార్యలతో క్రీడలలో తేలియాడుతూ, పదివేల లక్షలమంది కుమారులు భక్తితో గారవిస్తుండగా, పదునాలుగు రత్నాలతో సప్తద్వీపాధిపతియై, యోగివలె, గొప్ప నీతిగల శశిబిందుడు, నిండుచందమామవలె ప్రకాశించాడు.

**వ.** **అతని కొడుకుల మొత్తంబులకు ముఖరులైన యార్వురలోఁ బృథుశ్రవుండను వానికి ధర్ముండు వుట్టె. ధర్మునకు నుశనుండు వుట్టి నూఱశ్వమేధంబులు సేసె. అ య్యుశనునకు రుచకుండు వుట్టె. ఆ రుచకునకుఁ బురుజిత్తు, రుక్మండు, రుక్మేషువు, పృథువు, జ్యామఖుండు నను వా రేవురు పుట్టిరి. అందు జ్యామఖుండు.** **706**

**ప్రతి :** అతని కొడుకుల మొత్తంబులకున్= శశిబిందుని పదివేల లక్షల పుత్రులలో; ముఖరులైన= కీర్తితో ధ్వనించిన (గొప్పవారైన); ఆర్వురలోన్= ఆరుగురిలో; పృథుశ్రవుండున్= పృథుశ్రవుడు; అనేవానికిన్ ధర్ముండు+పుట్టెన్= పృథుశ్రవునకు ధర్ముడు జన్మించాడు; ధర్మునకున్= ధర్ముడికి; ఉశనుండు+పుట్టెన్= ఉశనుడు జన్మించి; నూఱు+అశ్వమేధంబులు+చేసెన్= నూరు అశ్వమేధ యాగాలు చేశాడు; ఆ+ఉశనునకున్= ఆ ఉశనుడు అనేవానికి; రుచకుండు= రుచకుడు; పుట్టెన్= జన్మించాడు; ఆ రుచకునకున్= ఆ రుచకునికి; పురుజిత్తు, రుక్మండు, రుక్మేషువు, పృథువు, జ్యామఖుండును+అనువారు= పురుజిత్తు, రుక్మడు, రుక్మేషువు, పృథువు, జ్యామఖుడు అనేవారు; ఏవురు, పుట్టిరి= ఐదుగురు జన్మించారు; అందున్= వారిలో; జ్యామఖుండు= జ్యామఖుడనేవాడు...

**తా :** శశిబిందుని కుమారుల మొత్తంలో ముఖ్యులైన ఆరుగురిలో, పృథుశ్రవుడు అనేవానికి ధర్ముడు జన్మించాడు. ధర్మునికి ఉశనుడు కలిగాడు. ఈ ఉశనుడు నూరు అశ్వమేధ యాగాలు చేశాడు. ఆ ఉశనునికి రుచకుడు, రుచకునికి పురుజిత్తు, రుక్ముడు, రుక్మేషువు, పృథువు, జ్యామఘుడు అనేవారు ఐదుగురు జన్మించారు. వారిలో జ్యామఘుడనేవాడు

**సీ. తొట్రుకొల్పెడు శైబ్యతోడి ప్రేమంబున ననపత్యుఁ డయ్యును నన్యభార్యఁ**
**గైకొన కొకకొంత కాలంబునకుఁ బోయి పగవారియింటను బలిమిఁ బట్టి**
**యొకకన్యఁ దేరిపై నునిచి తోడ్తేరంగ జననాథుఁ గన్యను శైబ్య చూచి**
**కోపించి మానవకుహక! యీ పడుచును దెచ్చియు నేనుండఁ దేరిమీఁదఁ**

**ఆ. బెట్టినాఁడ వనుచు బిఱుసులు వలుకంగ, నతఁడు పలికె నంత నతివతోడ**
**నాకుఁ గోడ లింత నమ్ము మీ లలితాంగి, సవతి గాదు వినుము సత్య మనుచు. 707**

**ప్రతి :** (జ్యామఘుడనేవాడు) తొట్రుకొల్పెడు= మనసు కదిలించే; శైబ్యతోడి ప్రేమంబునన్= శైబ్య అనే భార్యయందు ప్రేమతో; అనపత్యుఁడయ్యును= సంతతి లేకున్నా; అన్యభార్యన్+కైకొనక= మరొక భార్యను స్వీకరించక; ఒక కొంత కాలంబునకున్= ఒక కొంతకాలం తరువాత; పోయి= వెళ్ళి; ఒక కన్యను= ఒక కన్నెను; పగవారి ఇంటను= శత్రువుల ఇంటిలో; బలిమిన్+పట్టి= బలాత్కారంతో పట్టి; తేరిపైన్+ఉనిచి= రథంపై ఉంచి; తోడ్తేరంగన్= తీసికొనిరాగా; జననాథున్+కన్యను= రాజైన జ్యామఘుణ్ణి, రథంపైన కన్యను; శైబ్య; చూచి= ఆలోకించి; కోపించి= కినుక వహించి; మానవ కుహక= ఓ మోసగాడా; నేనుండన్= నేను ఉండగా; తేరిమీఁదన్= రథంపై; ఈ పడుచును+తెచ్చియున్= ఈ కన్నెను తీసికొనివచ్చి; పెట్టినాఁడవు= ఉంచావు; అనుచున్= అంటూ; బిఱుసులు+పలుకంగన్= పరుషంగా మాట్లాడగా; అతఁడు= భర్త జ్యామఘుడు; అంతన్= అటుపిమ్మట; అతివతోడన్ పలికెన్= శైబ్యతో ఇలా అన్నాడు; ఈ లలితాంగి= ఈ కన్నె; కోడలు= కోడలు మాత్రమే; ఇంతనమ్ము= ఈ మాట విశ్వసించు; వినుము= విను; సవతిగాదు= నీకు సవతి కాదు; సత్యము= నిజం; అనుచున్= అని పలుకుతూ...

**తా :** జ్యామఘుని భార్య శైబ్య. ఆమెపై గాఢమైన ప్రేమ కలిగి ఉన్నాడు జ్యామఘుడు. అతనికి శైబ్యయందు సంతానం లేకపోయినప్పటికి మఱొక భార్యను స్వీకరించలేదు. కొంతకాలం తరువాత శత్రువుల ఇంటినుండి ఒక కన్యను తన రథంమీద బలవంతంగా తీసికొని వచ్చాడు. కన్యను రాజును రథంమీద ఉండటం శైబ్య చూచింది. మోసగాడా! నేనుండగానే నీవు మరొక రమణిని రథంమీద తీసికొని వస్తావా అంటూ భర్తను పరుషాలు పలికింది. ఓ శైబ్యా! ఈమె నీకు సవతి కాదు. కోడలు. ఇది నిజం. నన్ను నమ్ము అన్నాడు జ్యామఘుడు.

**వ. అ య్యవసరంబున శైబ్య కొడుకుం గాంచు నని యెఱింగి, విశ్వేదేవతలును, బితృదేవతలును సంతసించిరి. వారల ప్రసాదంబున 708**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= అప్పుడు; శైబ్య= శైబ్య అనే ఆమె; కొడుకున్ కాంచునని ఎఱింగి= కొడుకును కంటుందన్న విషయాన్ని తెలిసికొని; విశ్వేదేవతలును= విశ్వే దేవతలు అనేవారు; పితృదేవతలును= జ్యామఘుని పితృదేవతలు; సంతసించిరి= సంతోషించారు; వారల ప్రసాదంబునన్= వారి దయతో...

**తా :** శైబ్య కొడుకును కంటుందనే విషయం ఆ సమయంలో తెలిసికొని విశ్వే దేవతలు, పితృదేవతలు ఆనందించారు. వారి దయతో

**క. తన సవతి మొఱఁగి పెనిమిటి, తనుఁ బొందిన శైబ్య మఱి విదర్భునిఁ గనియెన్
దనయుఁ గని జ్యామఘుండును, దనతెచ్చిన కన్యఁ దెచ్చి తనయున కిచ్చెన్. 709**

**ప్రతి :** తన సవతిన్ మొఱఁగి= తనకు సవతిని ఇష్టపడని; పెనిమిటి= భర్త (జ్యామఘుడు); తనున్= తనను; పొందినన్= కూడగా; శైబ్య; మఱి విదర్భునిన్= విదర్భుడు అనేవానిని; కనియెన్= కన్నది; తనయున్+కని= కొడుకును చూచి; జ్యామఘుండును= జ్యామఘుడు; తన తెచ్చిన కన్యన్‌తెచ్చి= తాను తీసికొనివచ్చిన కన్యను; తనయునకిచ్చెన్= కొడుకునకిచ్చి వివాహం చేశాడు.

**తా :** తనకు సవతిని కోరనిభర్త జ్యామఘుడు తనతో కలియగా శైబ్య విదుర్భుణ్ణి కన్నది. కొడుకును కని జ్యామఘుడు తాను పూర్వం రథంపై తెచ్చిన కన్యను అతనికిచ్చి వివాహం చేశాడు.

**వ. ఆ కన్యకయందు విదర్భునకుఁ గుశుండును, గ్రుథుండును, రోమపాదుండునుం బుట్టిరి. రోమపాదునకు బభ్రువు, బభ్రువునకు విభువు, విభువునకుఁ గృతి, కృతికి నుశికుండు, ఉశికునకు చేది, చేదికి చైద్యాదులు పుట్టిరి. క్రుథునకుఁ గుంతి, కుంతికి ధృష్టి, ధృష్టికి నిర్వృతి, నిర్వృతికి దశార్హుండు, దశార్హునకు వ్యోముండు, వ్యోమునకు జీమూతుండు, జీమూతునకు వికృతి, వికృతికి భీమరథుండు, భీమరథునకు నవరథుండు. నవరథునకు దశరథుండు, దశరథునకు శకుని, శకునికిఁ గుంతి, కుంతికి దేవరాతుండు, దేవరాతునకు దేవక్షత్రుండు, దేవక్షత్రునకు మధువు, మధువునకుఁ గురువశుండు, కురువశునకు ననువు, అనువునకుఁ బురుహోత్రుండు, నతనికి నంశువు, నతనికి సాత్త్వతుండు, సాత్త్వతునకు భజమానుండును, భజియు, దివ్యుండును, వృష్టియు, దేవావృధుండును, నందకుండును, మహాభోజుండు నను నేడ్గురును బుట్టిరి. అందు భజమానునకుఁ బ్రథమభార్య యందు నిమ్రోచి కంకణ వృష్ణులు ముఫ్వురును, రెండవభార్యయందు శతజిత్తు, సహస్రజిత్తు, అయుతజిత్తు నను ముప్వురును బుట్టిరి. అందు దేవావృధునికి బభ్రువు పుట్టె. వీర లిరువుర ప్రభావంబులఁ బెద్దలు శ్లోకరూపంబునఁ బఠియించుదురు. అట్టి శ్లోకార్థం బెట్టిదనిన. 710**

**ప్రతి :** ఆ కన్యకయందున్= ఆ కన్యయందు; విదర్భునకున్= విదర్భునకు; కుశుండును= కుశుడు; క్రుథుండును= క్రుథుడు; రోమపాదుండునున్ పుట్టిరి= రోమపాదుడు అనేవారు పుట్టారు; రోమపాదునకున్= రోమపాదుడికి; బభ్రువు; బభ్రువునకున్= బభ్రువు అనేవానికి; విభువు; విభువునకున్ కృతి= విభువు అనేవానికి కృతి; కృతికిన్+ఉశికుండు= కృతికి ఉశికుడు; ఉశికునకున్+చేది= ఉశికునికి చేది; చేదికిన్+చైద్యాదులు పుట్టిరి= చేదికి చైద్యుడు మొదలైనవారు పుట్టారు; క్రుథునకున్+కుంతి= క్రుథుడు అనేవానికి కుంతి; కుంతికి ధృష్టి= కుంతికి ధృష్టి; ధృష్టికి నిర్వృతి= ధృష్టికి నిర్వృతి; నిర్వృతికిన్, దశార్హుండు= నిర్వృతికి దశార్హుడు; దశార్హునకున్ వ్యోముండు= దశార్హునికి వ్యోముడు; వ్యోమునకున్, జీమూతుండు= వ్యోమునికి జీమూతుడు; జీమూతునకున్ వికృతి= జీమూతునికి వికృతి; వికృతికిన్, భీమరథుండు= వికృతికి భీమరథుడు; భీమరథునకున్ నవరథుండు= భీమరథునికి నవరథుడు; నవరథునకున్ దశరథుండు= నవరథునికి దశరథుడు; దశరథునకున్ శకుని= దశరథునికి శకుని; శకునికిన్ కుంతి= శకునికి కుంతి; కుంతికిన్ దేవరాతుండు= కుంతికి దేవరాతుడు; దేవరాతునకున్ దేవక్షత్రుండు= దేవరాతునికి దేవక్షత్రుడు; దేవక్షత్రునకున్ మధువు= దేవక్షత్రునికి మధువు; మధువునకున్ కురువశుండు= మధువుకు కురువశుడు; కురువశునకున్ అనువు= కురువశునికి అనువు; అనువునకున్ పురుహోత్రుండును= అనువునకు

పురుహోత్రుండు; అతనికిన్ అంశువు= అతనికి అంశువు; అతనికిన్ సాత్త్వతుండు= అతనికి సాత్త్వతుడు; సాత్త్వతునకున్ భజమానుండును, భజియు, దివ్యుండును, వృష్ణియు, దేవాపృథుండును, నందకుండును, మహాభోజుండునను= సాత్త్వతునికి భజమానుడు, భజి, దివ్యుడు, వృష్ణి, దేవాపృథుడు, నందకుడు, మహాభోజుడు అనబడే; ఏడ్గురును= ఏడుమంది (ఏడుగురు); పుట్టిరి= జన్మించారు; అందున్= వారిలో; భజమానునకున్= భజమానునికి; ప్రథమ భార్యయందున్= మొదటి భార్యయందు; నిమ్రోచి, కంకణ, వృష్ణులు ముప్వురును= నిమ్రోచి, కంకణుడు, వృష్ణువు అనే ముగ్గురునూ; రెండవ భార్యయందున్= రెండవ భార్యకు; శతజిత్తు, సహస్రజిత్తు, అయుతజిత్తునను ముప్వురును= శతజిత్తు, సహస్రజిత్తు, అయుతజిత్తు అనే ముగ్గురునూ; పుట్టిరి= పుట్టారు; అందున్= వారిలో; దేవాపృథునికిన్ బభ్రువుపుట్టెన్= దేవాపృథువు అనేవానికి బభ్రువు పుట్టాడు; వీరలిరువుర ప్రభావంబులన్= ఈ దేవాపృథువు బభ్రువు అనే వీరిద్దరియొక్క గొప్పతనాలను; పెద్దలు= ఆర్యులు; శ్లోకరూపంబునన్= శ్లోకరూపంగా; పఠియించుదురు= చదువుతూ ఉంటారు; అట్టి శ్లోకార్థంబు= ఆ శ్లోకానికి అర్థం; ఎట్టిది అనినన్= ఎలాంటిది అంటే...

**తా :** విదర్భునకు ఆ కన్యయందు కుశుడు, క్రుథుడు, రోమపాదుడు జన్మించారు. రోమపాదునకు బభ్రువు, బభ్రువుకు విభువు, విభువునకు కృతి, కృతికి ఉశికుడు, ఉశికునకు చేది, చేదికి చైద్యాదులు జన్మించారు.

క్రుథునకు కుంతి, కుంతికి ధృష్టి, ధృష్టికి నిర్వృతి, నిర్వృతికి దశార్హుడు, దశార్హునకు వ్యోముడు, వ్యోమునకు జీమూతుడు, జీమూతునికి వికృతి, వికృతికి భీమరథుడు, భీమరథునికి నవరథుడు, నవరథునికి దశరథుడు, దశరథునికి శకుని, శకునికి కుంతి, కుంతికి దేవరాతుడు, దేవరాతునికి దేవక్షత్రుడు, దేవక్షత్రునకు మధువు, మధువుకు కురువశుడు, కురువశునకు అనువు, అనువునకు పురుహోత్రుడు, అతనికి అంశువు, అతనికి సాత్త్వతుడు, సాత్త్వతునకు భజమానుడు, భజి, దివ్యుడు, వృష్ణి, దేవాపృథుడు, నందకుడు, మహాభోజుడు అనే ఏడుగురు జన్మించారు...

వారిలో భజమానునికి మొదటి భార్యయందు నిమ్రోచి, కంకణుడు, వృష్ణువు అనే ముగ్గురూ, రెండవ భార్యయందు శతజిత్తు, సహస్రజిత్తు, అయుతజిత్తు అనే ముగ్గురు పుట్టారు. అందులో దేవాపృథువునకు బభ్రువు పుట్టాడు. తండ్రీకొడుకులైన దేవాపృథువు, బభ్రుడు అనే వీరిరువురి గొప్పతనం పెద్దలు శ్లోకరూపంగా పఠిస్తూ ఉంటారు. ఆ శ్లోకార్థం ఏమంటే

**తే. వినుము దూరంబునం దేమి వినుచు నుందు, మదియు చూతుము దగ్గఱ నరుగుదేర**
**నరులలో బభ్రుకంటె నున్నతుఁడు లేఁడు, యోజ దేవాపృథున కెన యొరుఁడు గలఁడె? 711**

**ప్రతి :** వినుము= విను; దూరంబునందున్ ఏమి వినుచు నుందుము= దూరంగా ఏమి వింటామో; దగ్గఱన్ అరుగుదేరన్= దగ్గరకు రాగా; అదియున్ చూతుము= దానినే చూస్తాం; నరులలోన్= మానవులలో; బభ్రుకంటెన్= బభ్రువుకంటె; ఉన్నతుఁడు లేఁడు= గొప్పవాడు లేడు; ఓజన్= స్వభావంలో, దేవాపృథునకున్ ఎన= దేవాపృథునకు సాటి; ఒరుఁడు కలఁ డె!= మరి ఒకడు ఉన్నాడా? లేడు.

**తా :** దూరంగా ఉండి ఏది వింటామో దగ్గరకు రాగా దానినే చూస్తాం ఓ రాజా! విను. మానవులలో బభ్రువుకంటె గొప్పవాడు లేడు. స్వభావంలో దేవాపృథునికి సాటి మరొకడు రాడు.

**క. పదునాలుగు వేవురు నఱు, వదియేవురు నరులు ముక్తి పడసిరి బభ్రుం**
**డుదితుఁడు దేవాపృథుఁడును, బదపడి యోగంబుఁ దెలియఁ బలికిన కతనన్. 712**

ప్రతి : ఉదితుఁడు= ఉదయించిన; బభ్రుండు= బభ్రుడు; దేవాపృథుఁడును= దేవాపృథుడు; పదపడి= క్రమంగా; యోగంబున్ తెలియన్ పలికిన కతనన్= యోగవిద్యను తెలిసేలా బోధించడంవలన; పదునాలుగు వేవురున్+అఱువదియేవురు= పదునాల్గువేల అరవై ఐదుమంది; నరులు= మానవులు; ముక్తి పడసిరి= మోక్షాన్ని పొందారు.

**తా :** బభ్రుడు, దేవాపృథువు ఇరువురు యోగవిద్యను బోధించిన కారణంగా, పదునాల్గువేల అరవై ఐదుమంది మానవులు ముక్తి పొందారు.

**వ. మహాభోజుం డతిధార్మికుండు. వాని వంశంబువారు భోజులని పలుకం బడిరి. వృష్టికి సుమిత్రుండును, యుధాజిత్తును జన్మించిరి. అందు యుధాజిత్తునకు శినియు, అనమిత్రుండును జనించిరి. అనమిత్రునికి నిమ్నుండు, నిమ్ననికి సత్రాజితుండు, ప్రసేనుండు నన నిరువురు పుట్టిరి, మఱియు ననమిత్రునికి శినియను వాఁడు వేఱొకండుఁ గలఁడు, అతని పుత్త్రుండు సత్యకుండు, అతనికి యుయుధానుం డనం బరఁగిన సాత్యకియు, నా సాత్యకికి జయుండును, జయునకుం గుణియు, నాగుణికి యుగంధరుండును బుట్టిరి. మఱియు ననమిత్రునకుఁ బృశ్నియను వేఱొక కొడుకుం గలఁడు. వానికి శ్వఫల్కచిత్రకులు గలిగిరి. అందు శ్వఫల్కునకు గాందిని యం దక్రూరుండును, నసంగుండును, సారమేయుండును, మృదుకుండును, మృదుపచ్ఛివుండును, వర్మదృక్కును, ధృష్టవర్మ్మండును, క్షత్రోపేక్షుండును, అరిమర్దనుండును, శత్రుఘ్నుండును, గంధమాదనుండును, ప్రతిబాహువు ననువారు పన్నిద్దఱు కొడుకులును, సుచారువను కన్యకయుం జనించిరి. వారియం దక్రూరునికి దేవలుండును, అనుపదేవుండును బుట్టిరి. మఱియుఁ జిత్రునకుఁ బృథుండును, విదూరథుండును మొదలుగాఁ గలవారు పెక్కంద్రు వృష్ణి వంశ జాతు లయిరి. భజమానుండు, కుకురుఁడు, శుచి, కంబళబర్హిషుండు నన నలువు రంధకునికిఁ బుట్టిరి. కుకురునకు వృష్ణి, వృష్ణికి విలోమతనయుండు, విలోమతనయునికి కపోతలోముండు, కపోతలోమునికిం దుంబురు సఖుండైన యనువు, అనువునకు దుందుభి, దుందుభికి దవిద్యోతుండు, దవిద్యోతునకుఁ బునర్వసువు, ఆతనికి ఆహుకుం డను కుమారుండును, ఆహుకి యను కన్యకయుం గలిగిరి. ఆ యాహుకునికి దేవకుండు, ఉగ్రసేనుండు నన నిరువురు జన్మించిరి. అందు దేవకునికి దేవలుండు, అనుపదేవుండు, సుదేవుండు, దేవవర్ధనుండన నలుగురు గలిగిరి. వారలకు ధృతదేవయు, శాంతిదేవయు, ఉపదేవయు, శ్రీదేవయు, దేవరక్షితయు, సహదేవయు, దేవకియు ననఁ దోఁబుట్టువు లేడ్వురు గలిగిరి. 713**

ప్రతి : మహాభోజుండు+అతిధార్మికుండు= మహాభోజుడు అనేవాడు చాల ధర్మబుద్ధి కలవాడు; వారి వంశంబువారు= వాళ్ళ వంశంలో పుట్టినవారు; భోజులని పలుకంబడిరి= భోజులు అని చెప్పబడ్డారు; వృష్టికిన్ సుమిత్రుండును= వృష్టికి సుమిత్రుడనేవాడు; యుధాజిత్తును= యుధాజిత్తు అనేవాడు; జన్మించిరి= పుట్టారు; అందున్= వారిలో; యుధాజిత్తునకు శినియున్= యుధాజిత్తుకు శిని; అనమిత్రుండును= అనమిత్రుడు; జనించిరి= పుట్టారు; అనమిత్రునికిన్= అనమిత్రుడు అనేవానికి; నిమ్నుండున్= నిమ్నుడు; నిమ్ననికిన్ సత్రాజితుండును= నిమ్నుడు అనేవానికి సత్రాజితుడు; ప్రసేనుండును+అనన్= ప్రసేనుడు అనేవారు; ఇరువురు పుట్టిరి= ఇద్దరు జన్మించారు; మఱియున్= అంతేకాక; అనమిత్రునికిన్, శినియనువాఁడు= అనమిత్రునికి శిని అనేవాడు; వేఱొకండున్ కలఁడు= మరొకడున్నాడు; అతని పుత్త్రుండు= ఆ శిని పుత్రుడు; సత్యకుండు= సత్యకుడు; అతనికిన్= ఆ సత్యకునికి; యుయుధానుండనన్+పరఁగిన= యుయుధానుడని పిలువబడే; సాత్యకియున్=

సాత్యకి; ఆ సాత్యకికిన్= ఆ సాత్యకికి; జయుండును= జయుడు; జయునకుంగుణియున్= జయునికి గుణి; ఆ గుణికిన్ యుగంధరుండును= ఆ గుణికి యుగంధరుడు; పుట్టిరి= జన్మించారు; మఱియున్= మళ్లీ; అనమిత్రునకున్= అనమిత్రుడికి; పృశ్నియను= పృశ్ని అనబడే; వేఱొక కొడుకున్+కలఁడు= మరొక కొడుకు ఉన్నాడు; వానికిన్= ఆ పృశ్నికి; శ్వఫల్క చిత్రకులు= శ్వఫల్కుడు చిత్రకుడు అనేవారు; కలిగిరి= జన్మించారు; అందున్= వారిలో; శ్వఫల్కునకున్ గాందినియందున్= శ్వఫల్కుడు అనేవానికి గాందిని అనే ఆమెయందు; అక్రూరుండును, నసంగుడును, సారమేయుండును, మృదుకుండును, మృదుపచ్ఛివుండును, వర్మదృక్కును, ధృష్టవర్ముండును, క్షత్రోపేక్షుండును, అరిమర్దనుండును, శత్రుఘ్నుండును, గంధమాదనుండును, ప్రతిబాహువు నను వారు= అక్రూరుడు, అసంగుడు, సారమేయుడు, మృదుకుడు, మృదుపచ్ఛివుడు, వర్మదృక్కు, ధృష్టవర్ముడు, క్షత్రోపేక్షుడు, అరిమర్దనుడు, శత్రుఘ్నుడు, గంధమాదనుడు, ప్రతిబాహువు అనేవాళ్లు; పన్నిద్దఱు కొడుకులును= పండ్రెండుమంది కుమారులు; సుచారువు అను కన్యయున్= సుచారువు అనే కన్య; జనించిరి= జన్మించారు; వారియందున్= వాళ్ళలో; అక్రూరునికిన్= అక్రూరుడనే వానికి; దేవలుండును, అనుపదేవుండును= దేవలుడు, అనుపదేవుడు అనేవారు; పుట్టిరి= జన్మించారు; మఱియున్= మళ్లీ; చిత్రునకున్= చిత్రుడు అనేవానికి; పృథుండును, విదూరథుండును మొదలుగాన్ కలవారు= పృథుడు, విదూరథుడు మొదలైనవారు; పెక్కండ్రు= చాలమంది; వృష్ణివంశజాతులు ఐరి= వృష్ణివంశంలో పుట్టారు; భజమానుండు= భజమానుడు; కుకురుఁడు= కుకురుడు; శుచి; కంబళ బర్హిషుండుననన్= కంబళుడు బర్హిషుడు అనే పేర్లు గలవారు; నలువురు అంధకునికిన్= నలుగురు అంధకుడు అనేవానికి; పుట్టిరి= జన్మించారు; కుకురునకున్ వృష్ణి= కుకురుడికి వృష్ణి; వృష్ణికిన్, విలోమ తనయుండు= వృష్ణికి విలోమ తనయుడు; విలోమ తనయునికిన్= విలోమ తనయుడికి; కపోతలోముండు= కపోతలోముడు; కపోతలోమునికిన్= కపోతలోమునికి; తుంబురు సఖుండైన= తుంబురుని స్నేహితుడైన; అనువు; అనువునకున్, దుందుభి= అనువుకి దుందుభి; దుందుభికిన్, దవిద్యోతుండు= దుందుభికి దవిద్యోతుడు; దవిద్యోతునకున్, పునర్వసువు= దవిద్యోతనుడికి పునర్వసువు; ఆతనికిన్= అతనికి; ఆహుకుండను కుమారుండును= ఆహుకుడు అనే కుమారుడు; ఆహుకి అను కన్యకయున్= ఆహుకి అనే కన్నె; కలిగిరి= జన్మించారు; ఆ ఆహుకునికిన్= ఆ ఆహుకుడు అనేవానికి; దేవకుండు, ఉగ్రసేనుండుననన్= దేవకుడు, ఉగ్రసేనుడు అనే; ఇరువురు జన్మించిరి= ఇరువురు పుట్టారు; అందున్, దేవకునికిన్, దేవలుండు= వారిలో దేవకునికి దేవలుడు; అనుపదేవుండు= అనుపదేవుడు; సుదేవుండు= సుదేవుడు; దేవమర్దనుండనన్= దేవమర్దనుడనే; నలుగురు= నల్గురు; కలిగిరి= జన్మించారు; వారలకు= వారికి; ధృతదేవయు, శాంతిదేవయు, ఉపదేవయు, శ్రీదేవయు, దేవరక్షితయు, సహదేవయు, దేవకియుననన్= ధృతదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి అనే; తోఁబుట్టువులు= తోడపుట్టినవారు; ఏడ్వురు కలిగిరి= ఏడుగురు జన్మించారు.

**తా :** మహాభోజుడు మిక్కిలి ధర్మాత్ముడు, అతని వంశంవారంతా భోజులని పిలువబడ్డారు. వృష్టికి సుమిత్రుడు, యుధాజిత్తు జన్మించారు. యుధాజిత్తునకు శిని, అనమిత్రుడు జనించారు. అనమిత్రుడికి నిమ్నుడు, నిమ్నునికి సత్రాజితుడు, ప్రసేనుడు అనువారిరువురు పుట్టారు. అనమిత్రునకు శిని అనేవాడు మరొకడున్నాడు. అతని కొడుకు సత్యకుడు అతనికి యుయుధానుడనబడే సాత్యకి, సాత్యకికి జయుడు, జయునికి గుణి, గుణికి యుగంధరుడు జన్మించారు.

అనమిత్రునికి పృశ్ని అని వేరొక కొడుకున్నాడు. ఆ పృశ్నికి శ్వఫల్కుడు, చిత్రకుడు జన్మించారు. శ్వఫల్కునకు గాందిని అనే ఆమెయందు అక్రూరుడు, అసంగుడు, సారమేయుడు, మృదుకుడు, మృదుపచ్ఛివుడు, వర్మదృక్కు, ధృష్టవర్ముడు, క్షత్రోపేక్షుడు, అరిమర్దనుడు, శత్రుఘ్నుడు, గంధమాదనుడు, ప్రతిబాహువు అనే పండ్రెండు మంది కొడుకులు, సుచారువనే కూతురు జన్మించారు.

వాళ్ళలో అక్రూరునికి దేవలుడు, అనుపదేవుడు జన్మించారు. చిత్రునకు పృథుడు, విదూరథుడు మొదలైన చాలమంది వృష్ణివంశం వాళ్ళు అయ్యారు. భజమానుడు, కుకురుడు, శుచి, కంబళ, బర్హిషుడు అనే నలుగురు అంధకునికి పుట్టారు. కుకురుడికి వృష్ణి, వృష్ణికి విలోమ తనయుడు, విలోమ తనయునికి కపోతలోముడు, కపోతలోమునికి తుంబురుని మిత్రుడైన అనువు, అనువునకు దుందుభి, దుందుభికి దవిద్యోతుడు, దవిద్యోతునికి పునర్వసువు, వానికి ఆహుకుడు అనే కొడుకు ఆహుకి అనే కన్య జన్మించారు.

ఆహుకునికి దేవకుడు, ఉగ్రసేనుడు అనేవారు ఇద్దరు జన్మించారు. వీరిలో దేవకునికి దేవలుడు, అనుపదేవుడు, సుదేవుడు, దేవవర్ధనుడు అనే నలుగురు జన్మించారు. ఈ నలుగురికి ధృతదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి అనే ఏడుగురు తోబుట్టువులు కలిగారు.

**క. అసదృశ లలితాకారలఁ, గిసలయ కరతలల దేవకీముఖ్యల నా**
**బిసరుహనయనల నందఱ, వసుదేవుఁడు పెండ్లి యాడె వసుధాధీశా! 714**

**ప్రతి :** వసుధాధీశా= ఓ రాజా!; అసదృశ= సాటిలేని; లలిత+ఆకారలన్= సుందర ఆకారంగల; కిసలయ కరతలల= చిగురుటాకులవంటి చేతులు కలవారిని; దేవకీముఖ్యలునాన్= దేవకీదేవి మొదలయినవారిని; బిసరుహ నయనలను= తామరలవంటి కన్నులు గలవారిని; అందఱన్= ఆ ఏడుగురిని, వసుదేవుఁడు పెండ్లియాడెన్= వసుదేవుడు పెండ్లి చేసుకొన్నాడు.

**తా :** ఓ రాజా! సాటిలేని సుందరాకారలు, చిగురుటాకులవంటి చేతులు గలవారు, పద్మాక్షులు అయిన దేవకి మొదలయిన ఏడుగురిని వసుదేవుడు పెండ్లాడాడు.

**వ. ఉగ్రసేనునకుఁ గంసుండును, న్యగ్రోధుండును, సునామకుండును, కహ్వుండును, శంకుండును, సుభువును, రాష్ట్రపాలుండును, విసృష్టుండును, తుష్టిమంతుండు నను కొడుకులును; కంసయు, కంసవతియు, సురాభువు, రాష్ట్రపాలికయు నను కూఁతులుం బుట్టిరి. వారు వసుదేవానుజ భార్యలైరి. భజమానునికి విదూరథుండును, విదూరథునికి శినియు, నతనికి భోజుండు, భోజునికి హృదికుండు, హృదికునకు దేవమీఢుండు, శతధనువు, కృతవర్మయు నను కొడుకులు గలిగిరి. ఆ దేవమీఢుండు శూరుండు ననంబడు. శూరునికి మారిష యను భార్య యందు వసుదేవుండును, దేవభాగుండును, దేవశ్రవుండును, ఆనకుండును, సృంజయుండును, శ్యామకుండును, కంకుండును, అనీకుండును, వత్సకుండును, వృకుండు ననువారు పదుగురు కొడుకులును; పృథయు, శ్రుతదేవయు, శ్రుతకీర్తియు శ్రుతశ్రవసయు, రాజాధి దేవియు నను కూఁతు లేవురును బుట్టిరి. అందు 715**

**ప్రతి :** ఉగ్రసేనునకున్= ఉగ్రసేనుడికి; కంసుండును, న్యగ్రోధుండును, సునామకుండును, కహ్వుండును, శంకుండును, సుభువును, రాష్ట్రపాలుండును, విసృష్టుండును, తుష్టిమంతుండునను= కంసుడు, న్యగ్రోధుడు, సునామకుడు, కహ్వుడు, శంకుడు, సుభువు, రాష్ట్రపాలుడు, విసృష్టుడు, తుష్టిమంతుడు అనబడే; కొడుకులును= కుమారులున్నూ కంసయు, కంసవతియు, సురాభువు, రాష్ట్రపాలితయునను= కంస, కంసవతి, సురాభువు, రాష్ట్రపాలిక అని పిలవబడే; కూఁతులుం+బుట్టిరి= కూతుర్లు జన్మించారు; వారు= వారంతా; వసుదేవ+అనుజ= వసుదేవుని తమ్ముని; భార్యలైరి= సతులయ్యారు; భజమానునికిన్= భజమానుడికి; విదూరథుండును= విదూరథుడు; విదూరథునికిన్= విదూరథుడికి; శినియున్= శినియు; అతనికిన్=

ఆ ఆశినికి; భోజుండు= భోజుడు; భోజునికిన్= భోజుడు అనేవానికి; హృదికుండు= హృదికుడు; హృదికునకున్= హృదికునికి; దేవమీఢుండు, శతధనువు, కృతవర్మయనను= దేవమీఢుడు, శతధనువు, కృతవర్మ అనబడే; కొడుకులు+కలిగిరి= పుత్రులు జన్మించారు; ఆ దేవమీఢుండు= ఆ దేవమీఢుడు, శూరుండు ననంబడున్= శూరుడు అని కూడ పిలువబడతాడు, శూరునికి మారిషయను భార్యయందున్= ఈ శూరుడికి మారిష అనే భార్యవల్ల; వసుదేవుండును, దేవభాగుండును, దేవశ్రవుండును, ఆనకుండును, సృంజయుండును, శ్యామకుండును, కంకుండును, అనీకుండును, వత్సకుండును, వృకుండు ననువారు= వసుదేవుడు, దేవభాగుడు, దేవశ్రవుడు, ఆనకుడు, సృంజయుడు, శ్యామకుడు, కంకుడు, అనీకుడు వత్సకుడు, వృకుడు అనబడే; పదుగురు కొడుకులును= పదిమంది కుమారులున్నూ; పృథయున్, శ్రుతదేవయున్, శ్రుతకీర్తియున్ శ్రుతశ్రవసయున్, రాజాధిదేవియునను= పృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవస, రాజాధిదేవి అనబడే; కూఁతులు ఏవురును= కూతులు ఐదుగురును; పుట్టిరి= జన్మించారు; అందున్= అందులో...

**తా :** ఉగ్రసేనునికి కంసుడు, న్యగ్రోధుడు, సునామకుడు, కహ్వుడు, శంకుడు, సుభువు, రాష్ట్రపాలుడు, విసృష్టుడు, తుష్టిమంతు అనే కొడుకులు, కంస, కంసవతి, సురాభువు, రాష్ట్రపాలిక అనే కూతులు జన్మించారు. ఈ నలుగురు వసుదేవుని తమ్ముని భార్యలయ్యారు.

భజమానునికి విదూరథుడు, విదూరథునికి శిని, శినికి భోజుడు, భోజునికి హృదికుడు, హృదికునకు దేవమీఢుడు, శతధనువు, కృతవర్మ అనే కొడుకులు కలిగారు. ఆ దేవమీఢుడు శూరుడని పిలువబడతాడు. శూరునికి మారిష అనే భార్యవల్ల వసుదేవుడు, దేవభాగుడు, దేవశ్రవుడు, ఆనకుడు, సృంజయుడు, శ్యామకుడు, కంకుడు, అనీకుడు, వత్సకుడు, వృకుడు అనే పదిమంది కుమారులు; పృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవస, రాజాధిదేవి అనే ఐదుగురు కొమరితలు పుట్టారు. అందులో

## ✤ వసుదేవుని వంశానుక్రమవర్ణనము ✤

**ఉ.** **ధీనయశాలియైన వసుదేవుఁడు పుట్టిన వెంట మింటిపై**
**నానకదుందుభుల్ మొరసె, నచ్యుతుఁ డీతనికిం దనూజుఁడై**
**మానుగఁ బుట్టునంచు గరిమంబున దేవత లుబ్బ రాజపం**
**చానన! తన్నిమిత్తమున నానకదుందుభి యయ్యె వాఁడిలన్. 716**

**ప్రతి :** రాజపంచానన= ఓ రాజసింహమా!; ధీనయశాలియైన= బుద్ధిమంతుడు న్యాయశీలి అయిన; వసుదేవుఁడు పుట్టినవెంటన్= వసుదేవుడు జన్మించిన వెంటనే; అచ్యుతుఁడు= విష్ణువు; ఈతనికిన్ తనూజుఁడై= ఇతనికి కుమారుడై; మానుఁగన్ పుట్టునంచున్= (తప్పక) ఒప్పునట్లు జన్మిస్తాడని; గరిమంబునన్= ఎక్కువగా; దేవతలు+ఉబ్బన్= దేవతలు సంతోషించగా; మింటిపైన్ ఆనకదుందుభుల్ మొరసెన్= ఆకాశంలో దేవదుందుభులు మోగాయి; తత్+నిమిత్తమునన్= ఆ కారణంగా; ఇలన్= భూమిపై; వాఁడు= ఆ వసుదేవుడు; ఆనకదుందుభియయ్యెన్= ఆనకదుందుభి అనే పేరు పొందాడు.

**తా :** ఓ రాజసింహా! గొప్ప బుద్ధిమంతుడు, నీతిశాలి అయిన వసుదేవుడు పుట్టిన వెంటనే దేవతలు 'అచ్యుతుడైన హరి ఇతనికి పుత్రుడౌతాడు' అంటూ ఆనందించి దేవదుందుభులు మ్రోగించారు. ఆ కారణంగా వసుదేవునికి 'ఆనకదుందుభి' అనే పేరు వచ్చింది.

**క. తన చెలికాఁడగు కుంతికిఁ, దనయులు లేకున్నఁ జూచి తన తనయఁ బృథన్**
**దనయఁగ నిమ్మన శూరుఁడు, దనయందుల మైత్రి నిచ్చె ధరణీనాథా! 717**

**ప్రతి :** ధరణీనాథా= ఓ రాజా!; తన చెలికాఁడు+అగు= తన స్నేహితుడయిన; కుంతికిన్= కుంతి అనేవానికి; తనయులు లేకున్నన్ చూచి= సంతానం లేకపోవటం తెలిసికొని; తన తనయన్ పృథన్= తన సుత పృథ అనే ఆమెను; తనయఁగన్ ఇమ్మనన్= తనకు కుమార్తెగా ఇమ్ము అనగా; శూరుఁడు= శూరుడు; తనయందుల= తనయందు గల; మైత్రిన్= స్నేహంతో; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తా :** తన స్నేహితుడైన 'కుంతి' అనేవానికి సంతానం లేదు. ఆ విషయం వసుదేవుడు గ్రహించాడు. తన కుమార్తె పృథను మిత్రుడు కుంతి తనకు కుమార్తెగా ఇమ్మనగా మైత్రితో శూరుడు తన కుమార్తెను కుంతికి ఇచ్చాడు.

**వ. అయ్యింతి కుంతిభోజుని యింటం బెరుగుచుండ, నొకనాఁడు దుర్వాసుం డరుగుదెంచిన న మ్మహాత్మునకుఁ గొన్ని దినంబులు పరిచర్యలు చేసి వేల్పులం జేరంజీరు విద్య వడసి, యా విద్య లావెఱుంగ నొక్క నాఁ డేకాంతంబున వెలుంగుఱేని నాకర్షించిన, నా దేవుండు వచ్చినం జూచి, వెఱఁగుపడి యిట్లనియె. 718**

**ప్రతి :** ఆ+ఇంతి= ఆ పృథ; కుంతిభోజుని+ఇంటన్= ఆ కుంతిభోజుని గృహంలో; పెరుగుచుండన్= వృద్ధి పొందుతుండగా; ఒకనాఁడు= ఒకరోజు; దుర్వాసుండు= దుర్వాసుడనే మహర్షి; అరుగుదెంచినన్= రాగా; ఆ+మహాత్మునకున్= ఆ మహనీయునికి; కొన్ని దినంబులు= కొన్ని రోజులు; పరిచర్యలుచేసి= సేవలుచేసి; వేల్పులన్= దేవతలను; చేరన్+చీరు= దగ్గరకు పిలిచే; విద్యపడసి= విద్యని దుర్వాసునివల్ల పొంది; ఆ విద్య లావు ఎఱుంగన్= ఆ విద్యయొక్క సామర్థ్యం తెలిసికొనవలెనని; ఒక్కనాఁడు= ఒకరోజున; ఏకాంతంబునన్= ఒంటరిగా (రహస్యంగా); వెలుంగు ఱేనిన్ ఆకర్షించినన్= వెలుగుల రాజు సూర్యుణ్ణి పిలువగా; ఆ దేవుండు వచ్చినన్= ఆ సూర్యదేవుడురాగా; వెఱఁగు పడి= ఆశ్చర్యపడి; ఇట్లు అనియెన్= ఇలా అన్నది.

**తా :** వసుదేవుని కుమార్తె పృథ కుంతిభోజుని ఇంట పెరుగుతోంది. ఒకనాడు కుంతిభోజుని ఇంటికి దుర్వాస మహర్షి వచ్చాడు. ఈ కుంతి ఆ దుర్వాసునికి కొంతకాలం సేవలుచేసి దేవతలను ఆహ్వానించి రప్పించే విద్యపొంది, ఆ విద్యామాహాత్మ్యం తెలిసికొనే ఉద్దేశ్యంతో ఏకాంతంగా సూర్యుని ఆహ్వానించింది. అతడు రాగా ఆశ్చర్యపడి ఇలా అన్నది.

**క. మంత్ర పరీక్షార్థం బభి, మంత్రించితిఁ గాని దేవ! మదనక్రీడా**
**తంత్రంబుఁ గోరి చీరన్, మంత్రించిన తప్పు సైచి మరలు దినేశా! 719**

**ప్రతి :** దినేశా= ఓ సూర్యదేవా!; మంత్రపరీక్షార్థంబు= మంత్రాన్ని పరీక్షించే కోరికతో; అభిమంత్రించితిన్ కాని దేవ= పిలిచినాను దేవా!; మదనక్రీడా తంత్రంబున్ కోరి చీరన్= మన్మథ క్రీడను కోరి పిలువలేదు; మంత్రించిన= ఆహ్వానించిన; తప్పుసైచి= దోషాన్ని క్షమించి; మరలు= తిరిగి వెళ్లు!

**తా :** ఓ దేవా, సూర్యభగవానుడా! మహర్షి ఇచ్చిన మంత్రాన్ని పరీక్షించాలనే ఆలోచనతో నిన్ను ఆహ్వానించాను. అంతేకాని నీతో పొందు కోరాలని కాదు. కాబట్టి నేను ఆహ్వానించిన తప్పు క్షమించి మరలిపో.

**వ. అనిన న య్యువిదకుం బద్మినీవల్లభుం డిట్లనియె. 720**

**ప్రతి :** అనినన్= అనగా; ఆ ఉవిదకున్= ఆ స్త్రీకి; పద్మినీవల్లభుండు= పద్మ భర్త అయిన సూర్యుడు; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అలా అనగా కుంతికి సూర్యుడు ఇలా బదులిచ్చాడు.

**మ.** **తెఱవా! నీ పలుకట్ల యౌ; వినుములే దేవోత్తమాహ్వానముల్**
**మొఱగంబోలునె? వేల్పులం బడయుటల్ మోఘంబులే! నీకు నీ**
**తఱి గర్భం బగుఁ బుత్త్రుఁడుం గలుగు; నీ తారుణ్యముం బూజ్యమౌ**
**వెఱవం గార్యము లేదు; సిగ్గు దగునే? వ్రీడావినమ్రాననా! 721**

**ప్రతి :** వ్రీడా వినమ్ర+ఆననా= సిగ్గుతో తలవంచుకొన్న; తెఱవా= ఓ స్త్రీ; నీ పలుకు= నీ మాట; అట్లయౌ= అలాగే గాని (అలా ఉండనీ); వినుములే= వింటున్నావు కదా!; దేవ+ఉత్తమ+ఆహ్వానముల్= దేవతలను గౌరవంగా పిలుచుటలు; మొఱగంబోలునె?= దాచగలవా?; వేల్పులన్ పడయుటల్= దేవతలను రప్పించడాలు; మోఘంబులే= వ్యర్థం అవుతాయా!; నీకున్ ఈతఱిన్= నీకు ఈ సమయంలో; గర్భంబగున్= గర్భం కలుగుతుంది; పుత్త్రుడున్ కలుగున్= కుమారుడు కలుగుతాడు; నీ తారుణ్యమున్ పూజ్యమౌ= నీ తరుణీత్వం (నీకన్యాత్వం) పూజింపబడుతుంది; వెఱవన్ కార్యములేదు= భయపడవలసిన పనిలేదు; సిగ్గుదగునే= ఈ సమయంలో నీవు సిగ్గుపడటం తగునా?

**తా :** ఓ మానవతీ! నీ మాటలు అలా ఉండనిమ్ము. దేవతలను పిలువడాలు సామాన్యం కాదు. దాపరికం కూడనిది. వేల్పులను పొందటం వ్యర్థం కానిది. నీవు ఇప్పుడు గర్భాన్ని ధరిస్తావు. నీకు పుత్రుడు కలుగుతాడు. నీ కన్యాత్వం పూజింపబడుతుంది. భయపడవలసిన పని లేదు. సిగ్గుపడవద్దు.

**చ.** **అని తగ నీయకొల్పి లలితాంగికి గర్భము సేసి మింటికిన్**
**జనియె దినేశ్వరుం డపుడు చక్కని రెండవ సూర్యుఁడో యనన్**
**దనరెడు పుత్త్రుఁ గాంచి కృప దప్పి జగజ్జనవాదభీతయై**
**తనయుని నీటఁ బోవిడిచి తా నరిగెం బృథ దండ్రియింటికిన్. 722**

**ప్రతి :** అని= ఈ విధంగా; తగన్ ఈయకొల్పి= తగిన విధంగా ఒప్పించి; లలితాంగికిన్= సుకుమారి పృథకు; గర్భముచేసి; దినేశ్వరుండు= సూర్యుడు; అపుడు= అప్పుడు; మింటికిన్ చనియెన్= ఆకాశానికి వెళ్ళిపోయాడు; చక్కని రెండవ సూర్యుడో అనన్= చక్కగా ఉన్న మరొక సూర్యుడా అనేటట్లు; తనరెడు= ప్రకాశించు; పుత్రున్ కాంచి= కొడుకును కని; కృప దప్పి= దయమాలి (నిర్దయగా); జగత్+జన వాదభీతయై= లోకనిందకు భయపడి; తనయునిన్= కుమారుని; నీటన్+పోవిడిచి= నీటిపై వదిలి; పృథ; తండ్రి ఇంటికిన్= తండ్రి గృహానికి; తాన్ అరిగెన్= తాను వెళ్ళిపోయింది.

**తా :** సూర్యుడు ఈ విధంగా పృథను ఒప్పించి ఆమెకు గర్భంచేసి ఆకాశానికి వెళ్ళిపోయాడు. 'రెండవ సూర్యుడా' అనే విధంగా పుత్రుని గాంచి పృథ లోకాపవాద భీతితో పుత్రుని గంగలో విడిచి తన తండ్రి గృహానికి వెళ్ళిపోయింది.

**వ.** **అయ్యువిదను నీ ప్రపితామహుండైన పాండురాజు వివాహం బయ్యె. అయ్యంగనకుఁ బాండురాజు వలన ధర్మజ, భీమార్జునులు పుట్టిరి. అమ్మగువచెల్లెలగు శ్రుతదేవను, గారూషకుండైన వృద్ధశర్మ పెండ్లియాడె.**

**అయ్యిద్దఱకును ముని శాపంబున దంతవక్త్రుండను దానవుండు జన్మించె. దాని తోడంబుట్టువగు శ్రుతకీర్తినిఁ గేకయుండు పెండ్లియాడె. ఆ దంపతులకుఁ బ్రతర్దనాదు లేవురు పుట్టిరి. దాని భగిని యైన రాజాధిదేవిని జయత్సేనుండు పరిణయం బయ్యె. ఆ మిథునమునకు విందానువిందులు సంభవించిరి. చేది దేశాధిపతియైన దమఘోషుండు శ్రుతశ్రవసను పరిగ్రహించె; వారలకు శిశుపాలుం డుదయించె. వసుదేవుని తమ్ముండైన దేవభాగునికిఁ గంసయందుఁ జిత్రకేతు బృహద్బలు లిరువురు జనించిరి. వాని భ్రాతయగు దేవశ్రవస్సను వానికి గంసవతి యందు వీరుండును, నిషుమంతుండును నుప్పతిల్లిరి. వాని సోదరుండైన కంకునికిఁ గంక యను దానికి బకుండును, సత్యజిత్తు పురుజిత్తను వారు జనించిరి. వాని సహజుండైన సృంజయునికి రాష్ట్రపాలియందు వృష, దుర్మర్షణాదులు జనించిరి. వాని యనుజాతుండైన శ్యామకునకు సురభూమియందు హరికేశ హిరణ్యాక్షులు ప్రభవించిరి. వాని తమ్ముండైన వత్సుండు మిశ్రకేశి యను నప్సరసయందు వృకాదిసుతులం గనియె. వృకుండు దూర్వాక్షి యందుఁ దక్ష పుష్కర సాళ్వాదుల నుత్పాదించె. వాని జఘన్యజుండయిన యనీకుండు సుదామని యను దాని యందు సుమిత్రానీక బాణాదు లయిన కొడుకులం బడసె, వాని యనుజుండైన యానకుండు కర్ణిక యందు ఋతధామ జయులం గాంచె. వసుదేవుని వలన రోహిణియందు బలుండును, గదుండును, సారణుండును, దుర్మదుండును, విపులుండును, ధ్రువుండును, కృతాదులును; పౌరవియందు సుభద్రుండును, భద్రబాహుండును, దుర్మదుండును, భద్రుండును భూతాదులుం గూడఁ బన్నిద్దఱును; మదిరయందు నందోపనంద కృతక శ్రుత శూరాదులును; నిళయందు యదుముఖ్యులయిన యురువల్కలాదులును; ధృతదేవయందుఁ ద్రిపృష్ఠుండును; శాంతిదేవాత్మజయందుఁ బ్రశమ ప్రశ్రితాదులును; నుపదేవయందుఁ గల్పవృష్ట్యాదులు పదుండ్రును; శ్రీదేవయందు వసుహంస, సుధన్వాదు లార్గురును, దేవరక్షితయందు గదాదులు తొమ్మండ్రును; సహదేవయందుఁ గీర్తిమంతుండును, సుషేణుండును, భద్రసేనుండును, ఋజువును సమదనుండును, భద్రుండును, సంకర్షణుండును, ననువా రేడ్వురు పుట్టిరి. మఱియును. 723**

ప్రతి : ఆ+ఉవిదను= ఆ స్త్రీని (పృథను) నీ ప్రపితామహుండైన= నీ తాతతండ్రి (ముత్తాత) వివాహంబయ్యెన్= పెండ్లాడాడు; ఆ+అంగనకున్= ఆ స్త్రీకి (పృథకు); పాండురాజు వలనన్= పాండురాజువల్ల; ధర్మజ భీమ అర్జునులు పుట్టిరి= ధర్మరాజు, భీముడు, అర్జునుడు పుట్టారు; ఆ+మగువ= ఆ స్త్రీకి (పృథకు); చెల్లెలగు= సోదరి అయిన; శ్రుతదేవను= శ్రుతదేవ అనే ఆమెను; కారూషకుండైన= కరూషదేశపు రాజైన; వృద్ధశర్మ పెండ్లియాడెన్= వృద్ధశర్మ పెండ్లి చేసికొన్నాడు; ఆ ఇద్దఱకును= వారిద్దరకు; మునిశాపంబునన్= మునిశాపంవల్ల; దంతవక్త్రుండను దానవుండు జన్మించెన్= దంతవక్త్రుడనే రాక్షసుడు జన్మించాడు; దానితోడంబుట్టవగు శ్రుతకీర్తినిన్= శ్రుతదేవ చెల్లెలైన శ్రుతకీర్తిని; కేకయుండు పెండ్లియాడె= కేకయదేశాధిపతి పెండ్లి చేసికొన్నాడు; ఆ దంపతులకున్= వారిద్దరికి; ప్రతర్దనాదులు ఏవురు పుట్టిరి= ప్రతర్దనుడు మొదలైనవారు ఐదుగురు పుట్టారు; దాని భగినియైన రాజాధిదేవిని= శ్రుతకీర్తి చెల్లెలైన రాజాధిదేవిని; జయత్సేనుండు పరిణయంబయ్యెన్= జయత్సేనుడు పెండ్లి చేసికొన్నాడు; ఆ మిథునమునకున్= ఆ దంపతులకు; విందానువిందులు సంభవించిరి= విందుడు అనువిందుడు అనేవారు జన్మించారు; చేది దేశాధిపతియైన దమఘోషుండు= చేది దేశపాలకుడు దమఘోషుడు; శ్రుతశ్రవసను పరిగ్రహించెన్= శ్రుతశ్రవసను పెండ్లి చేసికొన్నాడు; వారలకున్ శిశుపాలుండుదయించెన్= వారికి శిశుపాలుడు పుట్టాడు; వసుదేవుని తమ్ముడైన దేవభాగునికిన్= వసుదేవునియొక్క తమ్ముడు దేవభాగుడు అనేవానికి; కంసయందున్= కంస

అనే – ఆమెయందు; చిత్రకేతు బృహద్బలులు ఇరువురు జనించిరి= చిత్రకేతువు, బృహద్బలుడు అనే ఇద్దరు జన్మించారు; వానిభ్రాతయగు దేవశ్రవస్సు అనువానికిన్= అతని సోదరుడైన దేవశ్రవసుడు అనేవానికి; కంసవతియందున్= కంసవతి అనే ఆమెయందు; వీరుండును, ఇషుమంతుండును ఉప్పతిల్లిరి= వీరుడు ఇషుమంతుడు అనేవారు జన్మించారు; వాని సోదరుండైన కంకునికిన్= వానికి తమ్ముడైన కంకునికి; కంకయనుదానియందున్= కంకయందు; బకుండును, సత్యజిత్తు, పురజిత్తనువారు జనించిరి= బకుడు, సత్యజిత్తు, పురజిత్తు అనేవారు జన్మించారు; వాని సహజుండైన సృంజయునికిన్= వానితోబుట్టువైన (సోదరుడైన) సృంజయుడికి; రాష్ట్రపాలియందున్= రాష్ట్ర పాలి అనే ఆమెయందు; వృషదుర్మర్షణాదులు= వృషుడు దుర్మర్షణుడు మొదలుగా గలవారు; జనించిరి= పుట్టారు; వాని యనుజాతుండైన శ్యామకునకున్= వాని తమ్ముడైన శ్యామకుడికి; సురభూమియందున్= సురభూమి అనే ఆమెయందు; హరికేశ హిరణ్యాక్షులు ప్రభవించిరి= హరికేశుడు, హిరణ్యాక్షుడు జన్మించారు; వానితమ్ముండైన వత్సుండు= వానికి తమ్ముడైన వత్సుడు; మిశ్రకేశియను అప్సరసయందున్= మిశ్రకేశి అనే పేరుగల అప్సరఃకాంతయందు; వృకాదిసుతులన్ కనియెన్= వృకుడు మొదలైన కుమారులను కన్నాడు; వృకుండు దూర్వాక్షియందున్= వృకుడు దూర్వాక్షి అనే స్త్రీయందు; తక్ష పుష్కర సాళ్వ+ఆదులన్ ఉత్పాదించెన్= తక్షుడు, పుష్కరుడు సాళ్వుడు మొదలైనవారిని కన్నాడు; వాని జఘన్యజుండైన అనీకుండు= వాని తమ్ముడైన అనీకుడు; సుదామని అనుదానియందున్= సుదామనియందు, సుమిత్రానీకబాణాదులయిన కొడుకులన్ పడసెన్= సుమిత్రానీకుడు, బాణుడు మొదలైన కొడుకులను పొందాడు; వాని అనుజుండైన యానకుండు= వాని తమ్ముడైన ఆనకుడు; కర్ణికయందున్ ఋతధామ జయులన్కాంచెన్= కర్ణిక అనే ఆమెయందు ఋతధాముడు జయుడు అనేవారిని కన్నాడు; వసుదేవునివలనన్ రోహిణియందున్= వసుదేవునివల్ల రోహిణికి; బలుండును, గదుండును, సారణుండును, దుర్మదుండును, విపులుండును, ధ్రువుండును; కృత+ఆదులును= కృతుడు మొదలైన కొడుకులును; పౌరవియందున్= పౌరవి అను స్త్రీయందు; సుభద్రుండును, భద్రబాహుండును, దుర్మదుండును, భద్రుండును, భూతాదులున్ కూడన్= బలుడు, గదుడు, సారణుడు, దుర్మదుడు, భద్రుడు, భూతాదులతోకూడి; పన్నిద్దఱును= పండ్రెండుమందిని; మదిరయందున్= మదిర అనే ఆమెయందు; నందోపనంద కృతక శ్రుత శూరాదులును= నందుడు, ఉపనందుడు, కృతకుడు, శ్రుతుడు, శూరుడు మొదలైనవారిని; ఇళయందున్= ఇళ అనే ఆమెయందు; యదుముఖ్యులయిన= యదువులలో ప్రముఖులైన; ఉరువల్కాదులును= ఉరువల్కలుడు మొదలైనవారును; ధృతదేవయందున్= ధృతదేవ అనే ఆమెయందు; త్రిపృష్ఠుండును= త్రిపృష్ఠుడు; శాంతిదేవాత్మజయందున్= శాంతి దేవాత్మజ అనే ఆమెయందు; ప్రశ్రమ ప్రశ్రిత+అదులును= ప్రశ్రమ, ప్రశ్రిత మొదలైనవారును; ఉపదేవయందున్= ఉపదేవయందు; కల్పవృష్ట్యాదులు పదుండ్రును= కల్పవృష్టి మొదలైనవారు పదిమందిని; శ్రీదేవయందున్= శ్రీదేవ అనే ఆమెయందు; వసుహంస, సుధన్వాదులు ఆర్గురును= వసుహంస, సుధన్వ మొదలైనవారు ఆరుగురును; దేవరక్షితయందున్= దేవరక్షిత అనే ఆమెయందు; గదాదులు తొమ్మండ్రును= గదుడు మొదలైనవారు తొమ్మిదిమందిని; సహదేవయందున్= సహదేవ అనే ఆమెయందు; కీర్తిమంతుండును, సుషేణుండును, భద్రసేనుండును, ఋజువును, సమదనుండును, భద్రుండును, సంకర్షణుండును ననువారేడ్వురు= కీర్తిమంతుడు, సుషేణుడు, భద్రసేనుడు, ఋజువు, సమదనుడు, భద్రుడు, సంకర్షణుడు అనేవారు ఏడుగురును; పుట్టిరి= జన్మించారు; మఱియును= ఇంకా...

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఆ కుంతిని నీ తాత తండ్రి అయిన పాండురాజు పెళ్ళి చేసికొన్నాడు. ఆమెకు పాండురాజువల్ల ధర్మరాజు, భీముడు, అర్జునుడు జన్మించారు. ఆమె చెల్లెలైన శ్రుతదేవను కరూశ దేశపురాజు వృద్ధశర్మ వివాహం చేసికొన్నాడు. ఆ ఇద్దరికి ముని శాపంవల్ల దంతవక్త్రుడనే రాక్షసుడు పుట్టాడు.

ఆమె తోబుట్టువైన శ్రుతకీర్తిని కేకయరాజు పెండ్లాడాడు. ఆ దంపతులకు ప్రతర్దనుడు మొదలైనవారు ఐదుగురు సుతులు జన్మించారు. వారి సోదరి రాజాధిదేవిని జయత్సేనుడు వివాహం చేసికొన్నాడు. వారిద్దరికి విందానువిందులు జన్మించారు. చేది దేశపురాజైన దమఘోషుడు శ్రుతశ్రవసను పెండ్లాడాడు. వారికి శిశుపాలుడు జన్మించాడు. వసుదేవుని తమ్ముడైన దేవభాగునికి కంస అనే భార్యయందు చిత్రకేతుడు, బృహద్బలుడు జనించారు. వాని సోదరుడైన కంకునకు కంకవల్ల బకుడు, సత్యజిత్తు, పురుజిత్తు అనేవాళ్ళు పుట్టారు.

వాని సోదరుడు సృంజయునికి రాష్ట్రపాలివల్ల వృషుడు, దుర్మర్షణుడు మొదలైనవాళ్ళు జన్మించారు. వాని తమ్ముడు శ్యామకునికి సురభూమియందు హరికేశుడు, హిరణ్యాక్షుడు పుట్టారు. వాని సోదరుడు వత్సుడు మిశ్రకేశి అనే అప్సరః కాంతవల్ల వృకుడు మొదలైన కొడుకులను పొందాడు.

వాని తమ్ముడు వృకుడు దూర్వాక్షివల్ల తక్షుడు, పుష్కరుడు, సాళ్వుడు మొదలైనవారిని పొందాడు. వాని సోదరుడు అనీకుడు కర్ణికవల్ల ఋతధాముడు జయుడు అనే సుతులను పొందాడు. వసుదేవునికి రోహిణి గర్భంలో బలుడు, గదుడు, సారణుడు, దుర్మదుడు, విపులుడు, ధ్రువుడు, కృతుడు మొదలైన సుతులు కలిగారు.

పౌరవియందు సుభద్రుడు, భద్రబాహుడు, దుర్మదుడు, భద్రుడు, భూతుడు మొదలైన పన్నెండుమంది పుత్రులు మదిర గర్భంలో నందుడు, ఉపనందుడు, కృతకుడు, శ్రుతుడు, శూరుడు మొదలైన కొడుకులు ఉద్భవించారు.

ఇళయందు యదుప్రముఖులైన ఉరువల్కాదులు, ధృతదేవయందు త్రిపృష్ఠుడు, శాంతిదేవాత్మజయందు ప్రశ్రముడు, ప్రశ్రితుడు అనేవారు, ఉపదేవయందు కల్పవృష్టి మొదలైన పదిమంది, శ్రీదేవయందు వసుహంస, సుధన్వ మొదలైనవారు ఆరుగురు, దేవరక్షితయందు గదాదులు తొమ్మిదిమంది, సహదేవయందు కీర్తిమంతుడు, సుషేణుడు, భద్రసేనుడు, ఋజువు, సమదనుడు, భద్రుడు, సంకర్షణుడు అనే ఏడ్గురు పుట్టారు ఇంకా

**క. దుష్టజననిగ్రహంబును, శిష్టజనానుగ్రహంబు సేయుట కొఱకై**
**యష్టమగర్భమున గుణో, త్కృష్టుఁడు దేవకికి విష్ణుదేవుఁడు పుట్టెన్. 724**

**ప్రతి :** దుష్టజననిగ్రహంబును= దుర్మార్గులను శిక్షించడం; శిష్టజన అనుగ్రహమ్ము= సన్మార్గులను దయతో చూడడం; చేయుటకొఱకై= చేసే నిమిత్తమై; దేవకికిన్= దేవకి అనే ఆమెకు; గుణ+ఉత్కృష్టుఁడు= గుణాలచే గొప్పవాడైన; విష్ణుదేవుఁడు= విష్ణుమూర్తి; అష్టమ గర్భమునన్ పుట్టెన్= ఎనిమిదవ గర్భంలో జన్మించాడు.

**తా :** దుష్టజనశిక్షణ, శిష్టజనరక్షణ చేయడంకొఱకు గుణోన్నతుడై విష్ణువు దేవకికి అష్టమగర్భంలో జన్మించాడు.

**ఆ. విష్ణుఁ డుదితుఁడైన వెనుక నా దేవకి, భద్రమూర్తియగు సుభద్రఁ గనియె;**
**నా గుణాఢ్య ముత్తవగు నీకు, నర్జున, దయిత యగుటఁ జేసి ధరణినాథ! 725**

**ప్రతి :** ధరణినాథ= ఓ రాజా!; విష్ణుఁడు= విష్ణుమూర్తి; ఉదితుఁడైన వెనుకన్= జన్మించిన తరువాత; ఆ దేవకి; భద్రమూర్తియగు= మంగళ స్వరూపయగు; సుభద్రన్ కనియెన్= సుభద్రను కన్నది; అర్జునదయిత అగుటన్చేసి= అర్జునుని భార్య కావడంవల్ల; ఆ గుణ+ఆఢ్య= సుగుణాలచే పేరొందిన (ఆ సుభద్ర); నీకున్= నీకు; ముత్తవయగున్= ముత్తవ్వ అగును.

**తా :** ఓ రాజా! దేవకి విష్ణుమూర్తిని కన్న తరువాత మంగళప్రదురాలైన సుభద్రను కన్నది. ఆమె అర్జునుని భార్య కావడంవల్ల ఆ సుభద్ర నీకు ముత్తవ్వ అవుతుంది.

**క. ఎప్పుడు ధర్మక్షయ మగు, నెప్పుడు పాపంబు పొడము నీ లోకములో**
**నప్పుడు విశ్వేశుఁడు హరి, దప్పక విభుఁడయ్యుఁ దన్నుఁ దా సృజియించున్. 726**

**ప్రతి :** విశ్వేశుఁడు హరి= లోకాధీశ్వరుడైన విష్ణువు; ఈ లోకములోన్= ఈ లోకంలో; ఎప్పుడు ధర్మక్షయము అగున్= ధర్మానికి లోపం ఎప్పుడు జరుగుతుందో; ఎప్పుడు పాపంబు పొడమున్= పాపం ఎప్పుడు కల్గుతుందో; అప్పుడు= ఆ సమయంలో; విభుఁడయ్యున్= ఈశ్వరుడయ్యీ; తప్పక= నిశ్చయంగా; తన్నున్+తాన్+సృజియించున్= తనను తాను సృష్టించుకుంటాడు.

**తా :** లోకాధీశుడైన హరి తాను ఈశ్వరుడైనప్పటికీ లోకంలో ధర్మలోపం జరిగినపుడు, పాపం పెరిగినపుడు తనను తాను సృష్టించుకొంటాడు. (యదాయదాకి ధర్మస్య...భగవద్గీత)

**క. తనమాయ లేక పరునకు, ఘనునకు నీశ్వరున కాత్మకర్తకు హరికిన్**
**జననములకుఁ గర్మములకు, మనుజేశ్వర! కారణంబు మఱియును గలదే? 727**

**ప్రతి :** మనుజేశ్వర= ఓ రాజా!; తన మాయలేక= తనయొక్క మాయ కారణం కాకుండా; పరునకున్= ప్రకృతికి అతీతమైనట్టి; ఘనునకున్= మహాత్మునకు; ఈశ్వరునకున్= ప్రభువైనవానికి; ఆత్మకర్తకున్= తనకు తానే కర్త ఐనవానికి; హరికిన్= విష్ణుమూర్తికి; జననములకున్= పుట్టుకలకు; కర్మములకున్= చేయు పనులకు; కారణంబు= కారణం(హేతువు); మఱియును గలదే= మరొకటి ఉన్నదా!

**తా :** ఓ రాజా! తన మాయావిలసనం తప్ప ప్రకృతికి అతీతుడై, మహాత్ముడై, ప్రభువై ఆత్మకర్త ఐన విష్ణుమూర్తికి జన్మములకుగాని, కర్మములకుగాని కారణం ఉంటుందా?

**క. తలపఁగ నెవ్వని మాయా, విలసనములు జనన వృద్ధి విలయంబులకుం**
**గలిమి కనుగ్రహ మోక్షం, బులు కను జీవులకు మూలములు నా నెగడున్. 728**

**ప్రతి :** తలపఁగన్= ఆలోచింపగా; ఎవ్వని మాయావిలసములు= ఎవనియొక్క మాయావిలాసాలు; జన్మవృద్ధి విలయంబులకున్= పుట్టుకకు, వృద్ధికి, లయానికి; కలిమికిన్= సంపదకు; అనుగ్రహ మోక్షంబులు= దయ మరియు ముక్తి; కనుజీవులకున్= పొందు జీవులకు; మూలములు నానెగడున్= మూలాలై (ప్రధాన కారణాలై) ఒప్పుచున్నవో (అటువంటి)...

**తా :** ఆలోచించగా ఎవని మాయావిలాసాలు ఈ జీవులకు పుట్టుక, వృద్ధి, లయం, కలిమి, దయ, మోక్షాలకు కారణభూతమై ఉన్నాయో అలాంటి

**సీ. అట్టి సర్వేశుని కరయంగ జన్మాది పరతంత్రభావ మెప్పాటఁ గలదు**
**రాజలాంఛనముల రాక్షసవల్లభు లక్షౌహిణీశులై యవనిఁ బుట్టి**
**జనులను బాధింప శాసించు కొఱకునై సంకర్షణునితోడ జనన మంది**
**యమరుల మనముల కైన లెక్కింపఁగ రాకుండు నట్టి కర్మములఁ జేసి**

**తే. కలియుగంబున జన్మింపఁ గలుగు నరుల దుఃఖ శోకతమంబులఁ దొలఁగఁ జేసి**
**నేల వ్రేఁగెల్ల వారించి నిఖిలదిశల, విమలకీర్తులు వెదచల్లి వెలసె శౌరి. 729**

**ప్రతి :** అట్టి సర్వేశునికిన్= అట్టి మహాప్రభువునకు; అరయంగన్= చూడగా; జన్మాది= జన్మం మొదలైన; పరతంత్ర భావము= స్వతంత్రంలేని విధానం; ఏ+పాటన్ కలదు= ఎలా ఉంటుంది?; రాక్షసవల్లభులు= రాక్షస రాజులు; రాజలాంఛనములన్= రాజ చిహ్నాలతో; అక్షౌహిణీశులై= అక్షౌహిణులకు అధిపతులై; అవనిన్ పుట్టి= భూమిపై జన్మించి; జనులను బాధింపన్= ప్రజలను బాధిస్తూ ఉండగా; శాసించు కొఱకునై= వారిని నియంత్రించడానికి (అదుపు చేయడానికి); సంకర్షణునితోడన్= బలరామునితో; జననమంది= ఉద్భవించి; అమరుల మనములకైనన్= దేవతల మనస్సులకైనా; లెక్కింపన్ రాకుండునట్టి= లెక్కపెట్టుటకు వీలుకాని; కర్మములన్+చేసి= పనులను చేసి; కలియుగంబునన్ జన్మింపఁగలుగు నరులన్= కలియుగంలో జన్మించే మానవుల; దుఃఖ శోకతమంబులన్= దుఃఖశోకాలనూ, తమోగుణాన్ని (దుఃఖశోకాలనే చీకట్లను); తొలఁగన్+చేసి= పోగొట్టి; నేలవ్రేఁగు+ఎల్లన్= భూభారమంతా; వారించి= నివారించి (పోగొట్టి); నిఖిల దిశలన్= అన్నిదిక్కుల; విమలకీర్తులు= స్వచ్ఛమైన కీర్తులు; వెదచల్లి= విస్తరింపజేసి; శౌరి= విష్ణువు; వెలసెన్= (ఉద్భవించి) ప్రకాశించాడు.

**తా :** అటువంటి సర్వేశ్వరునికి పుట్టుట మొదలైన అస్వతంత్రభావం ఎక్కడ ఉంటుంది? (ఉండదు). రాక్షసరాజులు రాజచిహ్నాలతో సేనాధిపతులై భూమిమీద జన్మించి, జనులను బాధిస్తున్న వేళ, వారిని అదుపు చేయడానికి, బలరామునితో ప్రభవించి, దేవతలు మనసుతో కూడా లెక్కించడానికి వీలులేనన్ని క్రియలుచేసి, కలియుగంలో జన్మించే మానవులకు కలిగే దుఃఖం, శోకం, తమస్సునూ (దుఃఖశోకాలనే చీకట్లను) పోగొట్టి, భూభారాన్ని తొలగించి, అన్నిదిక్కులా స్వచ్ఛమైన కీర్తులు వెదజల్లి విష్ణువు ప్రకాశించాడు.

**సీ. జనకుని గృహమున జన్మించి మందలోఁ బెరిఁగి శత్రులనెల్లఁ బీఁచ మణఁచి**
**పెక్కండ్రు భార్యలఁ బెండ్లియై సుతశతంబులఁ గాంచి తను నాదిపురుషుఁ గూర్చి**
**శరణన్న వారిని గరుణించి పాండవ కౌరవులకు నంతఁ గలహమైన**
**నందఱ సమయించి యర్జును గెలిపించి యుద్ధవునకుఁ దత్త్వ మొప్పఁ జెప్పి**

**తే. మగధ పాండవ సంజయ మధు దశార్హ, భోజ వృష్ణ్యంధకాది సంపూజ్యుఁ డగుచు**
**నుర్విభరము నివారించి, యుండ నొల్ల, కా మహామూర్తి నిజమూర్తి యందుఁ బొందె. 730**

**ప్రతి :** జనకుని గృహమునన్= తండ్రి ఇంటిలో; జన్మించి= పుట్టి; మందలోన్ పెరిఁగి= ఆలమందలో (గోకులంలో) వృద్ధి పొంది; శత్రులనెల్లన్= అందరు శత్రువులను; పీఁచమణఁచి= గర్వాన్ని పోగొట్టి (చంపి); పెక్కండ్రు భార్యలన్= చాలమంది భార్యలను (పదహారు వేల ఎనమండుగురు భార్యలను); పెండ్లియై= వివాహమాడి; సుతశతంబులన్= వందలమంది కుమారులను; కాంచి= కని; తనున్= తనను; ఆదిపురుషున్ కూర్చి= పురుషోత్తముడైన ఆదిపురుషునిగా భావించి; శరణు అన్నవారిని= శరణుకోరినవారిని; కరుణించి= దయతలచి; పాండవ కౌరవులకున్= పాండవులకు, కౌరవులకు; అంతన్= అంతట; కలహమైనన్= యుద్ధం జరుగగా; అందఱన్= అందరిని; సమయించి= చంపి; అర్జును గెలిపించి= అర్జునునకు విజయాన్ని చేకూర్చి; ఉద్ధవునకున్ తత్త్వము ఒప్పన్‌చెప్పి= ఉద్ధవునకు సత్యతత్త్వాన్ని బోధించి; మగధ, పాండవ, సంజయ,

మధు, దశార్హ, భోజ, వృష్ణి, అంధక+ఆది= మగధులు, పాండవులు, సంజయులు, మాధవులు, దశార్హులు, భోజులు, వార్ష్ణేయులు, అంధకులు మొదలైన వారిచే; సంపూజ్యుఁడగుచున్= చక్కగా పూజింపబడి; ఉర్వీభరము నివారించి= భూభారాన్ని పోగొట్టి; ఆ మహామూర్తి= ఆ గొప్ప తేజస్సుగల పరమాత్మ; ఉండన్ ఒల్లక= ఈ లోకంలో ఉండుటకు ఇష్టపడక; నిజమూర్తియందున్= స్వస్వరూపం అయిన ఆదిపురుషాకారమందు; పొందెన్= కలసిపోయాడు.

**తా :** ఆ మహావిష్ణువు వసుదేవుని ఇంట పుట్టాడు. వ్రేపల్లెలో పెరిగాడు. శత్రుసంహారం చేశాడు. పదహారువేల ఎనమండుగురు భార్యలను పెండ్లాడాడు. వందల పుత్రులను కన్నాడు. ఆదిపురుషునిగా తనను గుర్తించి శరణన్నవారిని కరుణించాడు. కురుపాండవుల యుద్ధంలో అందరిని చంపి అర్జునునకు విజయం చేకూర్చాడు. ఉద్ధవునకు తత్త్వబోధ చేశాడు. మగధ, పాండవ, సంజయ, మధు, దశార్హ, భోజ, వృష్ణి, అంధకులు మొదలుగా గలవారిచే పూజింపబడ్డాడు. భూభారం తొలగించాడు. ఈ భూలోకంలో ఉండుటకు ఇష్టపడక స్వస్వరూపమైన ఆదినారాయణ మూర్తిలో కలిసిపోయాడు.

**క. మంగళహరికీర్తి మహా, గంగామృత మించుకైనఁ గర్ణాంజలులన్**
**సంగతము సేసి ద్రావఁ దొ, లంగును గర్మంబు లావిలం బగుచు నృపా! 731**

**ప్రతి :** నృపా= ఓ రాజా! మంగళహరికీర్తి మహాగంగామృతము= శుభంకరమైన హరికీర్తి అనే గొప్ప గంగామృతాన్ని; ఇంచుకైనన్= కొంచెమైనా; కర్ణాంజలులన్= చెవులను దోసిళ్ళతో; సంగతముసేసి త్రావన్= కలిపి త్రాగినట్లయితే; కర్మంబులు= తన సమస్త కర్మములు; ఆవిలంబగుచున్= కలుషమవుతూ; తొలంగును= తొలగిపోతాయి.

**తా :** ఓ రాజా! విష్ణుమూర్తి కీర్తి అనే గంగామృతాన్ని తమ చెవులనే దోసిళ్ళతో ఎవరు త్రాగుతారో వారి కర్మలు మొత్తం నశిస్తాయి.

**క. వనజాక్షుని మందస్మిత, ఘనకుండల దీప్తి గండ కలితాననమున్**
**వనితలుఁ బురుషులుఁ జూచుచు, ననిమిషభావంబు లేమి కలయుదు రధిపా! 732**

**ప్రతి :** అధిపా= ఓ పరీక్షిన్మహారాజా!; వనజ+అక్షుని= తామరరేకులవంటి కన్నులుగల శ్రీహరియొక్క; మందస్మిత= చిరునవ్వుతోనూ; ఘనకుండల= గొప్ప చెవిపోగుల కాంతితో ప్రకాశించే; గండ కలిత+ఆననమున్= చెక్కిళ్లతో కూడిన వదనమును; వనితలున్= స్త్రీలు; పురుషులున్= మగవారు; చూచుచున్= కనుగొంటూ; అనిమిషభావంబు లేమికిన్= తమకు రెప్పపాట్లు ఉన్నందుకు; అలయుదురు= బాధ చెందుతారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! పద్మాక్షుడైన విష్ణుమూర్తియొక్క చిరునవ్వుతో గొప్ప కుండలాల కాంతితో ప్రకాశించే చెక్కిళ్లతోకూడిన ముఖాన్ని చూస్తూ స్త్రీలు, పురుషులు తమకు రెప్పపాట్లు ఉన్నందుకు బాధపడతారు.

**చ. నగు మొగమున్ సుమధ్యమును నల్లని దేహము లచ్చి కాట ప**
**ట్టగు నురమున్ మహాభుజము లంచితకుండల కర్ణముల్ మదే**
**భ గతియు నీలవేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁ డి**
**మ్ముగఁ బొడసూపుఁ గాతఁ గను మూసిన యప్పుడు విచ్చు నప్పుడున్. 733**

**ప్రతి :** నగుమొగమున్= చిరునవ్వుతో కూడిన మోము; సుమధ్యమును= చక్కని నడుము; నల్లని దేహము= నల్లని శరీరము; లచ్చికి ఆటపట్టు అగు ఉరమున్= లక్ష్మీదేవికి నిలయమైన వక్షఃస్థలం; మహాభుజములు= గొప్ప భుజములు;

అంచిత కుండల కర్ణముల్= ప్రకాశించే కుండలాలతో కూడిన చెవులు; మద ఇభగతియున్= మదించిన ఏనుగు నడకవంటి నడకయు; నీలవేణియున్= నల్లని కురులు; కృపారస దృష్టియున్= దయారసంతో కూడిన చూపులు; కల్గు= కలిగిఉన్న; వెన్నుఁడు= విష్ణుమూర్తి; కనుమూసిన యప్పుడు= కళ్ళు మూసినప్పుడు; విచ్చునప్పుడు= కళ్ళు తెరచినప్పుడు; ఇమ్మగన్= అనుకూలంతో; పొడసూపుగాతన్= కన్పిస్తాడు గాక,

**తా :** నగుమోము, చక్కని నడుము, నీలదేహం, లక్ష్మికి నిలయమైన వక్షఃస్థలం, దీర్ఘబాహువులు, ప్రకాశించే కుండలాలతో కూడిన చెవులు, మదించిన ఏనుగు నడక, నల్లని కురులు, దయారసంతో నిండిన చూపులు గల విష్ణుమూర్తి కనులు మూసినా, తెరిచినా కనుపించుగాక.

**వ. అని చెప్పి. 734**

**తా :** అని శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో వచించి

**క. జనకసుతాహృచ్చోరా!, జనకవచోలబ్ధ విపినశైల విహారా!**
**జనకామిత మందారా!, జనకాది మహేశ్వరాతిశయసంచారా! 735**

**ప్రతి :** జనక సుతాహృత్ చోరా!= జానకి హృదయాన్ని దోచిన రామా!; "జనక...విహారా!" జనకవచో లబ్ధ= తండ్రి మాటవల్ల పొందబడిన; విపిన శైలవిహారా!= అడవులలో, పర్వతాలలో విహారం గలవాడా! (తండ్రి మాటతో అడవులకు పర్వతాలకు పోయినవాడా); జనకామిత మందారా= ప్రజల కోర్కెలు తీర్చే కల్పవృక్షమా!; "జనకాది...సంచారా!" జనకాది మహేశ్వర= జనకుడు మొదలైన మహారాజులను; అతిశయసంచారా= అతిశయించిన ప్రవర్తన గలవాడా!

**తా :** జానకీ హృదయచోరా! తండ్రి ఆజ్ఞను శిరసావహించి అడవులు, పర్వతాలు తిరిగినవాడా! ప్రజలకు కల్పవృక్షమా! జనకుడు మొదలైన రాజులను మించిన చక్కని ప్రవర్తన గల ఓ రామచంద్రా!

**మాలిని.**

**జగదవనవిహారీ! శత్రులోక ప్రహారీ!, సుగుణఘనవిహారీ; సుందరీమానహారీ!**
**విగతకలుషపోషీ! వీరవిద్యాభిలాషీ!, స్వగురుహృదయతోషీ! సర్వదా సత్యభాషీ! 736**

**ప్రతి :** జగదవన విహారీ= జగత్తును రక్షించుటకై విహరించువాడా!; శత్రులోక ప్రహారీ!= శత్రుసమూహాలను దండించేవాడా!; సుగుణవన విహారీ= మంచి గుణములనే వనంలో సంచరించేవాడా!; సుందరీమానహారీ!= సుందరియైన సీతాదేవియొక్క అభిమానాన్ని హరించేవాడా!; విగత కలుషపోషీ!= దోషరహితులను పోషించేవాడా!; వీరవిద్యాభిలాషీ!= శౌర్యపరాక్రమాలనే విద్యలను కోరేవాడా!; స్వగురుహృదయతోషీ!= గురువుల హృదయాలకు ఆనందం కలిగించేవాడా!; సర్వదా సత్యభాషీ!= ఎల్లప్పుడూ సత్యాన్నే పలుకువాడా!

**తా :** జగద్రక్షకా! శత్రునిర్మూలకా! సుగుణవనములందు విహరించువాడా! సుందరీ హృదయచోరా! పుణ్యజనపరిపోషా! పరాక్రమ విద్యాప్రియా! గురుహృదయానందకారీ! నిరంతర సత్యభాషణ తత్పరా!

**గద్య. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్త్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు సూర్యవంశారంభంబును, వైవస్వతమను**

**జన్మంబును, హైమచంద్రకథనంబును, సుద్యుమ్నాది మనుసూనుల చరిత్రంబును; మరుత్తు, తృణబిందు, శర్యాతి, కకుద్మి, సగర, నాభాగ ప్రముఖుల చరిత్రంబులును, నంబరీషుని యందుఁ బ్రయోగింపఁ బడిన దుర్వాసుల కృత్య నిరర్థక యగుటయు; నిక్ష్వాకు, వికుక్షి, మాంధాతృ, పురుకుత్స, హరిశ్చంద్ర, సగర, భగీరథ ప్రముఖుల చరిత్రంబులును; భాగీరథీ ప్రవాహవర్ణనంబును; గల్మాషపాద, ఖట్వాంగ ప్రముఖుల వృత్తాంతంబును, శ్రీరామచంద్రకథనంబును, దదీయవంశ పరంపరా గణనంబును; నిమికథయును, జంద్రవంశారంభంబును, బుధపురూరవుల కథయును, జమదగ్ని పరశురాముల వృత్తాంతంబును; విశ్వామిత్ర, నహుష, యయాతి, పూరు, దుష్యంత, భరత, రంతిదేవ, పాంచాల, బృహద్రథ, శంతను, భీష్మ, పాండవ, కౌరవ, ప్రముఖుల వృత్తాంతంబులును, ఋశ్యశృంగ వ్రతభంగంబును, ద్రుహ్యానుతుర్వసుల వంశంబును, యదు కార్తవీర్య శశిబిందు జామదగ్న్యాదుల వృత్తాంతంబులును, శ్రీకృష్ణావతార కథాసూచనంబును నను కథలుం గల నవమస్కంధము సంపూర్ణము. 737**

ప్రతి : ఇది; శ్రీపరమేశ్వర కరుణాకలిత= పరమేశ్వరునియొక్క కరుణ పొందిన; కవితావిచిత్ర= కవితల వైచిత్ర్యంగల; కేసనమంత్రి పుత్ర= కేసనమంత్రి కుమారుడు; సహజపాండిత్య= సహజ పాండిత్యుడు అయిన; పోతనామాత్య ప్రణీతంబైన= పోతనామాత్య రచితమైన; మహాభాగవతంబను= మహాభాగవతం అనే; మహాపురాణంబునందున్= మహాపురాణంలో; సూర్యవంశ ఆరంభంబును= సూర్యవంశంయొక్క ప్రారంభం; వైవస్వతమను జన్మంబును= వైవస్వత మనువు పుట్టుక; హైమచంద్ర కథనంబును= హైమచంద్ర కథనం; సుద్యుమ్న ఆది మనుసూనుల చరిత్రంబును= సుద్యుమ్నుడు మొదలుగా గల మనుపుత్రుల చరిత్ర; మరుత్తు, తృణబిందు, శర్యాతి, కకుద్మి, సగర, నాభాగ, ప్రముఖుల చరిత్రంబులును= మరుత్తు, తృణబిందు, శర్యాతి, కకుద్మి, సగర, నాభాగ మొదలైన గొప్పవారి చరిత్రలు; అంబరీషుని యందున్= అంబరీషునియందు; ప్రయోగింపఁబడిన= ప్రయోగం చేయబడిన; దుర్వాసుల కృత్య= దుర్వాస మహర్షి కృత్య అను ఆయుధం; నిరర్థకయగుటయున్= వ్యర్థం అవ్వడం; ఇక్ష్వాకు, వికుక్షి, మాంధాతృ, పురుకుత్య, హరిశ్చంద్ర, సగర, భగీరథ ప్రముఖుల చరిత్రంబులును= ఇక్ష్వాకు, వికుక్షి, మాంధాతృ, పురుకుత్స, హరిశ్చంద్ర, సగర, భగీరథుడు మొదలైన గొప్పవారి చరిత్రలు; భాగీరథీ ప్రవాహవర్ణనంబును= భాగీరథీ నదియొక్క ప్రవాహాన్ని వర్ణించుట; కల్మాష పాదఖట్వాంగ ప్రముఖుల వృత్తాంతంబును= కల్మాషపాద, ఖట్వాంగుడు మొదలైన గొప్పవారి వృత్తాంతం; శ్రీరామచంద్ర కథనంబును= శ్రీరామచంద్రుని కథ; తదీయవంశ పరంపరాగణనంబును= వారి వంశాల వరుసలు లెక్కించుట; నిమికథయును= నిమి కథ; చంద్ర వంశారంభంబును= చంద్రవంశ ఆరంభం; బుధ పురూరవుల కథయును= బుధుడు పురూరవుడు వీరి కథ; జమదగ్ని పరశురాముల వృత్తాంతంబును= జమదగ్ని, పరశురాముడు వీరి వృత్తాంతం; విశ్వామిత్ర నహుష యయాతి పూరుదుష్యంత భరత రంతిదేవ పాంచాల బృహద్రథ శంతను భీష్మ పాండవ కౌరవ ప్రముఖుల వృత్తాంతంబును= విశ్వామిత్ర, నహుష, యయాతి, పూరు, దుష్యంత, భరత, రంతిదేవ, పాంచాల బృహద్రథ, శంతను, భీష్మ, పాండవ, కౌరవ ప్రముఖుల వృత్తాంతం, ఋశ్యశృంగ వ్రతభంగంబును= ఋశ్యశృంగునియొక్క వ్రతం భగ్నం అగుట; ద్రుహ్యు అను తుర్వసుల వంశంబును= ద్రుహ్యు అను తుర్వసు అనేవాళ్ళ వంశం; యదు, కార్తవీర్య, శశిబిందు, జామదగ్ని ఆదుల వృత్తాంతంబులును= యదు, కార్తవీర్య, శశిబిందు, జామదగ్ని మొదలైన వారల వృత్తాంతం; శ్రీకృష్ణావతార కథాసూచనంబును= శ్రీకృష్ణుని అవతార కథ సూచించుటయు అను కథలుంగల= అనే కథలున్న; నవమ స్కంధము= తొమ్మిదవ స్కంధం; సంపూర్ణము= సంపూర్ణం.

**తా :** ఇది శ్రీ పరమేశ్వర కరుణతో లభించిన కవితావైచిత్రిగల కేసనపుత్రుడు, సహజ పండితుడు, పోతనామాత్యుడు రచించిన శ్రీ మహాభాగవతం అనే మహాపురాణంలో సూర్యవంశారంభం, వైవస్వత మనువు జన్మం, హైమచంద్ర కథనం, సుద్యుమ్నుడు మొదలైన మనుపుత్రుల చరిత్ర, మరుత్తు, తృణబిందు, శర్యాతి, కకుద్మి, సగర, నాభాగ మొదలైన గొప్పవారల చరిత్రలు, అంబరీషునియందు దుర్వాసుడు ప్రయోగించిన కృత్య విఫలం అగుట, ఇక్ష్వాకు, వికుక్షి, మాంధాతృ, పురుకుత్స, హరిశ్చంద్ర, సగర, భగీరథ, ప్రముఖుల చరిత్ర, భాగీరథీ ప్రవాహ వర్ణనం, కల్మాషపాద, ఖట్వాంగ ప్రముఖుల వృత్తాంతం శ్రీరామచంద్ర కథనం, వారి వంశ పరంపరాగణనం, నిమి కథ, చంద్రవంశ ఆరంభం, బుధ పురూరవుల కథ, జమదగ్ని పరశురాముల వృత్తాంతం, విశ్వామిత్ర, నహుష, యయాతి, పూరు, దుష్యంత, భరత రంతిదేవ, పాంచాల, బృహద్రథ, శంతను, భీష్మ, పాండవ, కౌరవ ప్రముఖుల వృత్తాంతాలు, ఋశ్య శృంగవ్రత భంగం, దహ్యుడు, అనుడు, తుర్వసుడు, యదు, కార్తవీర్య, శశిబిందు జామదగ్న్యాదుల వృత్తాంతాలు శ్రీకృష్ణావతార కథాసూచనం అను కథలుగల నవమస్కంధం సంపూర్ణం.

*:: శ్రీకృష్ణార్పణమస్తు ::*

# పద్యగద్యసూచి

## అష్టమస్కంధము

## నవమస్కంధము

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

